శ్రీ

# సూర్యరాయాంధ్రనిఘంటువు

## ఆఱవ సంపుటము.

మ — లౌ

పండితసాహాయ్యమున

కాకినాడ

ఆంధ్ర సాహిత్య పరిషత్తు

వారిచేఁ బ్రకటింపఁబడినది.



శంకర్ ప్రింటర్స్ ముద్రాక్షరశాలలో ముద్రితము

మద్రాసు.

1958

—:—

# మనవి.

శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటు చతుర్థసంపుటము 1944 లోఁ బ్రకటితమయినది. మఱి పదునాల్గు సంవత్సరములకుఁ గాని మిగిలిన మూఁడు సంపుటములను బ్రకటితములు కాలేదు. ఈ యాలస్యమునకుఁ గారణము లనేకములు. 1947 సరికి అయిదవ సంపుటమును 1949 సరికి ఆఱవ సంపుటమును ముద్రణమునకు సిద్ధములయినను గడపటి సంపుటము కూడ సిద్ధమయినఁ గాని యచ్చుపని ప్రారంభించుటకు సమ్మతింపనని శ్రీ పిఠాపురము మహారాజావారు తెలియఁజేసిరి. తరువాత కొన్ని రాజకీయములచే 1949 గడవగానే నిఘంటు కార్యాలయము నెత్తివేసిరి పిమ్మట నా మూఁడు సంపుటముల గ్రంథమును మద్రాసునగరమునకుఁ దరలించి ముద్రణముపని డా॥ గిడుగు వేంకటసీతాపతిగారి కప్పగించిరి. శ్రీ సీతాపతిగారు ముద్రణముపని 1952 లోఁ బ్రారంభించి 'ప' యను నక్షరము మొదలుకొని 'మ' యను నక్షరమువఱకును గల గ్రంథ మయిదవ సంపుటముగాను 'మ' యను నక్షరము మొదలుకొని 'వ' యను నక్షరమువఱకును గల గ్రంథ మాఱవ సంపుటముగాను, విభజించి ముద్రణము వేగముగాఁ గావలయునను సంకల్పముతో వేర్వేఱు ముద్రణాలయములలో ముద్రణము సాగించిరి. అయిదవ సంపుటమును ముద్రించుచుండిన గార్డన్ ముద్రణాలయము కొంత గ్రంథము ముద్రించిన తర్వాత నెత్తివేయఁబడినది, మిగిలిన గ్రంథము మఱియొక ముద్రణాలయములో ముద్రింపవలసివచ్చినది. ఆఱవ సంపుటము సక్రమముగా ముద్రితమగుచుండుటవలన 1954 లోఁ గడపటి సంపుటముకూడ మఱియొక ముద్రణాలయములో ముద్రింపించుట కీయఁబడినది. కాని, తానొకటి దలఁచిన దైవ మింకొకటి దలఁచునన్నట్లయినది. ప్రభుత్వమువారు జమీందారీ విధానమును రద్దుపఱచి యెస్టేటులను దీసికొనుటవలన శ్రీ మహారాజావారి కార్థికలోపము కలిగి 1954 పూర్తియగు రికి ముద్రణముపని నిలిచిపోయినది. అయిదవ సంపుటములో 185 ఫారములును ఆఱవ సంపుటములో 112 ఫారములును ఏడవ సంపుటములో 42 ఫారములును ముద్రితములయినవి మిగిలిన ముద్రణముపని యితరుల సాహాయ్యమర్థింపక తామే పూర్తిచేయుటకు శ్రీ మహారాజావా రుద్దేశించిరి కాని, యావని సాగలేదు. అప్పుడు శ్రీ సీతాపతిగారు శ్రీమహారాజావారి యనుజ్ఞాపత్రముఁ బడసి ప్రభుత్వమువారి ధనసాహాయ్యమునకయి 1957 జూన్ మాసములోఁ బ్రయత్నము ప్రారంభించి యధికారుల తోడ్పాటుతోఁ గృతార్థులయినారు. ఆంధ్రప్రదేశప్రభుత్వమువారు రూ 5000 లును, ఇండియా

ప్రభుత్వమువారు రూ 8000 లను నొసంగిరి. ఈ యార్థికసాహాయ్యముతోను, ఆంధ్ర సాహిత్యపరిషత్తు తోడ్పాటుతోను శ్రీ సీతాపతిగారు ముద్రణముపని సాగించిరి.

భగవంతుని కృపవలన ఈ నాటికయిదవ సంపుటమును ఆఱవ సంపుటమును ప్రకటించి యాంధ్రుల కందఁజేయఁగలిగిరి. 1958 జూన్ 12వ తేదిని ఆంధ్రసాహిత్య పరిషద్వార్షికమహాసభా సమావేశసమయమున మన యుపరాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ పండితవరేణ్యులు పరిషత్తువారి యాహ్వానమును మన్నించి యీ రెండు సంపుటముల యావిష్కరణము గావించినందులకుఁ బరిషత్తు ధన్యతనందినది. దైవబలముచే ఏడవ సంపుటముకూడఁ గొలఁది కాలములోఁ బ్రకటితమగును.

## 6వ సంపుట నిర్మాణము కావించిన పండితవర్యులు

1 సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు (సంపాదకులు)
2 బ్రహ్మశ్రీ దర్భా సర్వేశ్వరశాస్త్రి
3 ప్రయాగ వేంకటరామశాస్త్రి
4 ఆకుండి వేంకటశాస్త్రి
5 బులుసు వెంకటేశ్వరులు
6 చిలుకూరి పాపయ్యశాస్త్రి
7 దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి
8 చిలుకూరి వీరభద్రశాస్త్రి
9 చెఱుకుపల్లి అప్పారాయశాస్త్రి
10 సామవేదం శ్రీరామమూర్తిశాస్త్రి
11 పన్నాల వెంకటాద్రిభట్టశర్మ
12 ఇంద్రకంటి సూర్యనారాయణశాస్త్రి

పీఠికాపురాధీశుల కోరిక ననుసరించి 1944-48 లో నిఘంటు నిర్మాణ పర్యవేక్షణము సాగించి గ్రంథముద్రణాదికము కావించినవారు డాక్టరు గిడుగు వేంకటసీతాపతిగారు.

దంటు భాస్కరరావు.
ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యదర్శి.

---



మహారాజా రావు వేంకట కుమార మహీపతి
సూర్యారావు బహద్దరు C B E గారు

45వ ఆంధ్రసాహిత్యపరిషద్వార్షికసమావేశము

శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు 5–6 సంపుటములఆవిష్కృతి.



శ్రీ దంటు భాస్కరరావు – శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణపండితులు.

| సంకేతములు. | వివరణము. |
|---|---|
| అ | అకారాంతము—ఇట్లే —అ,ఇ,ఈ,చ్, జ్. మొదలగునవి తత్తదంతములుగా గ్రహించునది |
| అ ఆ,ఈ అ | పులింగవిశేషణమయినపుడు అకారాంతము. స్త్రీలింగవిశేషణమయినపుడు ఆకారాంతము లేక ఈకారాంతము. నపుంసకలింగవిశేషణ మయినపుడు అకారాంతము స్త్రీలింగములలో విశేషము లున్నపుడు అవి సూచింపఁబడినవి. చివరయచ్చులనుబట్టి యవి తత్తదంతములుగా గ్రహించునది ఉదా – (1) అంకకుఁడు విణ (అ, కికా. అ.) ఇట స్త్రీలింగరూపము ఆకారాంతమగు 'అంకికా'. (2) అంతర్ధాత విణ (ఋ. త్రీ. ఋ) ఇట స్త్రీలింగరూపము ఈకారాంతమగు 'అంతర్ధాత్రీ' (3) అంకి విణ.(న్. నీ న్) ఇట స్త్రీలింగరూపము ఈకారాంతమగు 'అంకినీ' (4) అపటువు. విణ. (ఉ, ఉ,ట్వీ,ఉ) ఇట ఉకారాంతమగు 'అపటువు'ను, ఈకారాంతమగు 'అపట్వీ'యును స్త్రీలింగరూపములు (5) అనామము విణ (న్ న్, మ్నీ, అన్) ఇట నకారాంతమగు 'అనామ'యును, ఈకారాంతమగు 'అనామ్నీ'యును,ఆకారాంతమగు 'అనామా,యును స్త్రీలింగరూపములుగా నెఱుంగునది. |
| అ క్రి | అకర్మకక్రియ. |
| అనా | అనాపవిభక్తికము. |
| అప | అపదము (అగమము మొదలగునవి) |
| అలం | అలంకారశాస్త్రము. |
| అవ్య | అవ్యయము |
| ఆమ్రే | ఆమ్రేడితము |
| ఉదా | ఉదాహరణము |
| ఉప. | ఉపపదము (చూ అసి- తెలుఁగు) |
| ఉభ. | ఉభయము. (సంస్కృతమును, తెనుఁగును) |
| ఏ | ఏకవచనాంతము |
| ఔ. | ఔపవిభక్తికము |
| క | కన్నడము |
| కరాలపా. | కరాలపాటి రంగయ్యగారి భారతపాఠము. |
| కు. | కుయిభాష. |
| క్రి. | క్రియ |
| క్రి విణ. | క్రియావిశేషణము |
| క్షేత్రగ. | క్షేత్రగణితము |
| గణిత | గణితశాస్త్రము. |
| చూ | చూడుఁడు |
| ఛంద. | ఛందశ్శాస్త్రము. |
| జ. | జన్యము. |

| సంకేతములు. | వివరణము. |
|---|---|
| జ్యోతి. | జ్యోతిశ్శాస్త్రము. |
| త. | తమిళము |
| తంత్ర. | తంత్రశాస్త్రము. |
| తర్క | తర్కశాస్త్రము |
| తు. | తులుభాష. |
| ద్రు. | ద్రుతాంతము |
| ద్వి. | ద్వివచనాంతము (తెనుఁగున బహువచనాంతములో అంతర్భూతము.) |
| ధర్మ. | ధర్మశాస్త్రము. |
| న. | నపుంసకలింగము. |
| నాటక. | నాటకపరిభాష |
| నాట్య | నాట్యశాస్త్రము. |
| పా | పాళీభాష |
| పీఠి. | పీఠిక |
| పుం | పుంలింగము. |
| పుం. న | పుంనపుంసకలింగము. |
| పుం. స్త్రీ. | పుంస్త్రీలింగము. |
| ప్ర | ప్రత్యయము |
| ప్రా. | ప్రాకృతము. |
| బ. | బహువచనాంతము. |
| బీజగ | బీజగణితము |
| భా. ల వ్యా. | భారతము లక్ష్మీపతిశాస్త్రిగారి ఆంధ్రభారత వ్యాఖ్య. |
| మంత్ర | మంత్రశాస్త్రము |
| మ. | మలయాళము |
| మహా. | మహారాష్ట్రము |
| మి. | మిశ్రము–సంస్కృతపదము సంస్కృతేతర పదముతోఁగాని, తెలుఁగు కృత్ప్రత్యయముతోఁగాని, తెలుఁగు తద్ధితప్రత్యయముతోఁగాని కలిసిన పదము. |
| మొ. | మొదలైనవి |
| యోగ. | యోగశాస్త్రము. |
| రూ. | రూపాంతరము. |
| వా. | వాడుక. |
| వి. | విశేష్యము. |
| విశే. | విశేషణము. |
| వీరేశ. పా. | కందుకూరివీరేశలింగముగారి పాఠము |
| వేదము. పా. | వేదము వేంకటరాయశాస్త్రిగారి పాఠము. |
| వేదాంత. | వేదాంతశాస్త్రము. |

| సంకేతములు | వివరణము |
| --- | --- |
| వైద్య | వైద్యశాస్త్రము |
| వ్యతి | వ్యతిరేకార్థకపదము. |
| వ్యవ | వ్యవహారము |
| వ్యాక | వ్యాకరణశాస్త్రము. |
| శత్ర | శత్రంతము (దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు) |
| శ సం | శకసంవత్సరములు |
| శ్లో. | శ్లోకము |
| స | సర్వనామము |
| సం | సంస్కృతము |
| సంగీ | సంగీతశాస్త్రము |
| స క్రి. | సకర్మకక్రియ |
| సా. | సామెత |
| స్త్రీ | స్త్రీలింగము |
| హిం | హిందూస్థానీభాష |
| √ | (మూలచిహ్నము) ఇది జనకపదములకు ముం దుపయోగింపఁబడును. |
| = | (సామ్యచిహ్నము) ఇది రూపమందుఁ గాని,యర్థమందుఁ గాని సామ్యము గల పదములనడుమ నుపయోగింపఁబడును. |
| ⚘ | చెట్టు, లత మొదలగువానిగుర్తు |
| , | ఇది విభిన్నార్థమును దెలుపును. |
| , | సమానార్థమును దెలుపును |

(తక్కినవి స్పష్టము)

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| | | | | వేంకటాచార్యకవి. |
| 1 | అచలా | అచలాత్మజాపరిణయము | ఆ ౩ | శ్రీరామకవి |
| 2 | అచ్చు భా | అచ్చతెలుఁగుభారవి | ఆ ౫ | కూచిమంచితిమ్మకవి |
| 3 | అచ్చు రా. | అచ్చతెనుఁగురామాయణము | | |
| | | బాల బాలకాండము | | |
| | | అయో అయోధ్యాకాండము | | |
| | | అర అరణ్యకాండము | కాం ౬ | |
| | | కిష్కిం కిష్కింధాకాండము | | |
| | | సుం సుందరకాండము | | |
| | | యు. యుద్ధకాండము | | |
| 4 | అధ్యా | అధ్యాత్మరామాయణము (బాలకాండాదులు ఆఱును ఉత్తరకాండమును కలసి ఏడుకాండములు) | కాం ౭ | కోటమరాజు నాగయామాత్యుఁడు |
| | | ఉ. ఉత్తరకాండము | | |
| 5 | అని | అనిరుద్ధచరిత్రము. | ఆ ౫ | కనుపర్తిఅబ్బయామాత్యుఁడు |
| 6 | అప్ప. | అప్పకవీయము (లక్షణగ్రంథము) | ఆ ౫ | కాకుమానిఅప్పకవి. |
| 7 | అ మ క | అష్టమహిషీకల్యాణము. (ద్విపద) | | తిరువేంగళనాథుఁడు. |
| 8 | అహ | అహల్యాసంక్రందనము | ఆ ౩ | సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు. |
| 9 | ఆం. చం | ఆంధ్రచంద్రాలోకము | | అడిదముసూరకవి |
| 10 | ఆం భా. | ఆంధ్రభాషార్ణవము (నిఘంటువు) | కాం ౩ | నుదురుపాటివేంకనార్యుఁడు |
| 11 | ఆం. శే | ఆంధ్రనామశేషము (నిఘంటువు) | | అడిదము సూరకవి |
| 12 | ఆం సం. | ఆంధ్రనామసంగ్రహము (నిఘంటువు) | | పైడిపాటి లక్ష్మణకవి |
| | | దేవ దేవవర్గ | | |
| | | మాన మానవవర్గ. | | |
| | | స్థా. స్థావరవర్గ | | |
| | | తి తిర్యగ్వర్గ. | వర్గులు. ౫ | |
| | | నా. నానార్థవర్గ | | |
| 13 | ఆం. పద. | ఆంధ్రపదాకరము. | | |
| 14 | ఆము | ఆముక్తమాల్యద | ఆ ౬ | శ్రీకృష్ణదేవరాయలు. |
| 15 | ఇందు. | ఇందుమతీపరిణయము. | ఆ. ౬ | కుమారధూర్జటి |
| 16 | ఇందు. రా. | ఇందుమతీపరిణయము. | ఆ. ౪. | తెనాలిరామభద్రకవి. |

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథములయందలి ఆశ్వాసముల సంఖ్య | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|---|---|
| 17 | ఉ. రా. | ఉత్తరరామాయణము | ఆ ౬ | కంకంటిపాపరాజు. |
| 18 | ఉ. హరి | ఉత్తరహరివంశము | ఆ. ౫. | నాచన సోమనాథుఁడు. |
| 19 | ఉ. హరిశ్చ | ఉత్తరహరిశ్చంద్రోపాఖ్యానము. | ఆ ౪ | తెక్కుళ్లపాటి లింగన. |
| 20 | కకు | కకుత్థ్సవిజయము. | ఆ ౫. | మట్ల అనంతభూపాలుఁడు. |
| 21 | కలు శ | కలువాయిశతకము | | డబ్బీరు నరసు. |
| 22 | కవిక. | కవికర్ణరసాయనము | ఆ. ౮. | సంకుసాల నృసింహకవి. |
| 23 | కవిచౌ శ | కవిచౌడప్పశతకము. | | కవిచౌడప్ప |
| 24 | కవిజ | కవిజనరంజనము | ఆ ౩ | అడిదము సూరకవి. |
| 25 | కవిజనా | కవిజనాశ్రయము (లక్షణగ్రంథము.) | అధికారములు ౪. | వేములవాడ భీమకవి. |
| | | సంజ్ఞా. సంజ్ఞాధికారము | | |
| | | వృత్తా వృత్తాధికారము | | |
| | | జాతి, జాత్యధికారము | | |
| | | దోషా దోషాధికారము | | |
| 26 | కవిరా. | కవిరాజమనోరంజనము. | ఆ. ౫. | కనుపర్తిఅబ్బయామాత్యుఁ[డు]. |
| 27 | కవిస | కవిసర్ప గారుడము (లక్షణ గ్రంథము. | ఆ. ౨. | కాచన బసవన్న. పింగళి సూరన్న. |
| 28 | కళా. | కళాపూర్ణోదయము. | ఆ. ౬. | |
| 29 | కా ర్తిక | కార్తికమాహాత్మ్యము | | కుందుర్తి వేంకటాచలపతి. |
| 30 | కావ్యా. | కావ్యాలంకారచూడామణి (లక్షణగ్రంథము ) | ఉల్లాసములు. ౯ | విన్నకోట పెద్దన్న. |
| 31 | కాశీ. | కాశీఖండము. | ఆ ౭ | శ్రీనాథుఁడు. |
| 32 | కాళ | కాళహస్తిమాహాత్మ్యము | ఆ ౬ | ధూర్జటి |
| 33 | కాళ శ | కాళహస్తీశ్వరశతకము | | ధూర్జటి |
| 34 | కిరా. | కిరాతార్జునీయము. | ఆ. ౫ | గోపాలుని సింగయ. |
| 35 | కుచేల. | కుచేలోపాఖ్యానము. | ఆ ౩ | గట్టుప్రభువు [కవి |
| 36 | కువల. | కువలయాశ్వచరిత్రము | ఆ ౫ | సురభము చిననారాయణ |
| 37 | కు సం | కుమారసంభవము | ఆ. ౧౨ | నన్నె చోడుఁడు |
| 38 | కృ క | కృష్ణకర్ణామృతము | ఆ. ౩. | వెలఁగపూఁడి వెంగన |
| 39 | కృ శకుం | శకుంతలాపరిణయము | ఆ. ౩. | కృష్ణకవి |
| 40 | కృష్ణ | కృష్ణరాయవిజయము. | ఆ ౪. | కుమార ధూర్జటి. |
| 41 | కృష్ణ శ | కృష్ణశతకము | | నృసింహకవి. |
| 42 | కృష్ణా | కృష్ణాభ్యుదయము. | ఆ. ౫ | గొంతేటి సూరన్న. |
| 43 | కేయూర. | కేయూరబాహుచరిత్రము | ఆ. ౪. | మంచన |
| 44 | క్రీడా | క్రీడాభిరామము | ఆ. ౧. | వల్లభరాయకవి |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథముల యందలి అశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|---|---|
| 45 | గంధ. | గంధవహము | ఆ. ౧ | మంచర్ల వాసుదేవకవి. |
| 46 | గాధే. | గాధేయోపాఖ్యానము | | చక్రకవిఅవంతామాత్యుఁ |
| 47 | గోపీ రా | గోపీనాథరామాయణము | | గోపీనాథ వెంకటకవి [డు |
| 48 | ఘటికా. | ఘటికాచలమాహాత్మ్యము | ఆ ౩. | తెనాలి రామకృష్ణుఁడు |
| 49 | చంద్ర | చంద్రభానుచరిత్రము | ఆ ౫. | తరిగొప్పుల మల్లన్న |
| 50 | చంద్ర వి | చంద్రరేఖావిలాసము | ఆ ౩ | కూచిమంచి బగ్గకవి |
| 51 | చంద్రా | చంద్రాంగదచరిత్రము | ఆ ౬. | పైఁడిమఱ్ఱి వేంకటపతి |
| 52 | చంద్రి. | చంద్రికాపరిణయము | ఆ ౬ | శ్రీసురభిమాధవరాయ ప్రభువు పతి. |
| 53 | చం. రా. | చంపూరామాయణము. | ఆ. ౮. | ఋగ్వేదికవి వేంకటాచల |
| 54 | చమ | చమత్కారమంజరి | ఆ ౩. | సింహాద్రి వేంకటాచార్యుఁ |
| 55 | చిత్రభా | చిత్రభారతము | ఆ ౮ | చరికొండ ధర్మన్న [డు |
| 56 | చి ని | చిన్నయసూరినిఘంటువు (వ్రాతది) | | పరవస్తు చిన్నయసూరి. |
| 57 | చెన్న | చెన్నబసవపురాణము. | ఆ. ౫ | అత్తనూరి పాపకవి |
| 58 | జావ్నా వీ | జావ్నవీమాహాత్మ్యము | ఆ. ౪. | ఏనుఁగు లక్ష్మణకవి |
| 59 | జై. భా. | జైమినిభారతము (అశ్వమేధపర్వము.) | ఆ. ౮ | పిల్లలమఱ్ఱిపినవీరభద్రుఁడు. |
| 60 | తపతీ | తపతీసంవరణోపాఖ్యానము | ఆ. ౫ | అద్దంకి గంగాధరకవి. |
| 61 | దశకు. | దశకుమారచరిత్రము | ఆ ౧౨ | కేతన |
| 62 | ద శా | దక్షిణహిందూస్థానశాసనము | సంపుటములు౬. | |
| 63 | దశ | దశావతారచరిత్రము. | ఆ. ౧౦ | ధరణిదేవుల రామయామాత్యుఁడు |
| 64 | దా శ | దాశరథిశతకము | | కంచెర్ల గోపన్న [కవి |
| 65 | దిలీప | దిలీపచరిత్రము | ఆ ౪. | కొటికలపూడి వేంకటకృష్ణ |
| 66 | ద్వా | (సింహాసన)ద్వాత్రింశిక | ఆ ౧౨ | కొఱవి గోపరాజు |
| 67 | ద్వి కో భాగ | ద్విపదభాగవతము | స్కం ౧౨ | కోనేటినాథుఁడు |
| 68 | ద్వి తి సా. | ద్విపదసారంగధరచరిత్రము | ఆ ౨ | కూచిమంచి తిమ్మకవి |
| 69 | ద్వి నల. | ద్విపదనలచరిత్రము, | భా ౫ | చక్రపురిరాఘవాచార్యులు. |
| 70 | ద్వి పరమ | ద్విపదపరమయోగివిలాసము | ఆ. ౮ | తాళ్లపాక తిరువేంగళనాథుఁడు |
| 71 | ద్వి భార | ద్విపదభారతము. (విరాటపర్వము-వ్రాఁతప్రతి.) | ఆ ౫. | తిమ్మన |
| 72 | ద్వి శ సా | ద్విపదసారంగధరచరిత్రము | ఆ ౩ | శాణాలశంభుదాసుఁడు. |
| 73 | ద్వి. భాగ | ద్విపదభాగవతము (దశమస్కంధము ) | స్కం. ౧. | మడికిసింగన్న. |

| సంఖ్య | గ్రంథసంకేతములు. | గ్రంథ నామములు. | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|---|---|
| 74 | ద్వి హరిశ్చ. | ద్విపదహరిశ్చంద్రచరిత్రము. | భా ౨ | గౌరన |
| 75 | ధనా | ధనాభిరామము. (వ్రాఁతప్రతి) | ఆ. ౩ | నూరన. (డు. |
| 76 | ధర్మ | ధర్మఖండము | ఆ ౬ | ఈఁదులపల్లి భవానీశంకరుఁ |
| 77 | ఆం ధా | ఆంధ్రధాతుమాల | | పరవస్తు చిన్నయసూరి. |
| 78 | నరస | నరసభూపాలీయము. (లక్షణగ్రంథము) | ఆ ౫ | మూర్తికవి |
| 79 | నవ. (నాథ) | నవనాథచరిత్రము (ద్విపద-వ్రాఁతప్రతి) | భా. ౫. | గౌరన. |
| 80 | నా పంచ | పంచతంత్రము | ఆ ౫. | నారాయణకవి. |
| 81 | నార | నారసింహపురాణము (ఉత్తర భాగము | ఆ ౫ | హరిభట్టు |
| 82 | నిరం. | నిరంకుశోపాఖ్యానము. | ఆ ౪ | కందుకూరి రుద్రయ. |
| 83 | నిర్వ | నిర్వచనోత్తరరామాయణము. | ఆ ౧౦ | తిక్కన సోమయాజి |
| 84 | నీతి | నీతిసీసపద్యశతకము | | తాళ్లపాక తిమ్మయ. |
| 85 | నీలా. | నీలాసుందరీపరిణయము. | ఆ ౩ | కూచిమంచి తిమ్మకవి. |
| 86 | నృసిం. | నృసింహపురాణము | ఆ. ౫. | ఎఱ్ఱాప్రెగ్గడ. |
| 87 | నైష | శృంగారనైషధము | ఆ ౭. | శ్రీనాథుఁడు. |
| 88 | పండితా. | పండితారాధ్యచరిత్రము (ద్విపద) | | పాలకురికి సోమనాథుఁడు. |
| | | దీక్షా దీక్షాప్రకరణము | | |
| | | పురా. పురాతనప్రకరణము | ప్రకరణము | |
| | | వాద వాదప్రకరణము | లు ౫. | |
| | | మహిమ. మహిమప్రకరణము | | |
| | | పర్వ పర్వతప్రకరణము | | |
| 89 | పద్మ | పద్మపురాణము (ఉత్తరఖండము ) | ఆ. ౧౦. | మడికి సింగన్న. |
| 90 | పరమ | పరమయోగివిలాసము | ఆ ౫ | తిమ్మనృపాలుఁడు. |
| 91 | పాంచా. | పాంచాలీపరిణయము | ఆ. ౫ | కాకమాని మూర్తికవి. |
| 92 | పాండు | పాండురంగమాహాత్మ్యము. | ఆ. ౫. | తెనాలి రామకృష్ణుఁడు. |
| 93 | పారి | పారిజాతాపహరణము | ఆ. ౫. | నంది తిమ్మన. |
| 94 | పార్వ | పార్వతీపరిణయము. | ఆ. ౮. | కోటి శ్రీరాయరఘునాథ తొండమాన్మహీపాలుఁడు. |
| 95 | పి. శకుం. | శకుంతలాపరిణయము | ఆ. ౪. | పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు |
| 96 | పె శకుం. | శకుంతలాపరిణయము | ఆ. ౩ | పెద్దాడ నాగరాజా |
| 97 | ప్రబంధ. | ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసము. | ఆ. ౧. | గణపవరపు వేంకటకవి. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 98 | ప్రబోధ | ప్రబంధచంద్రోదయము | ఆ ౫ | నందిమల్లయ,ఘంటసింగయ |
| 99 | ప్రభా | ప్రభావతీప్రద్యుమ్నము | ఆ ౫ | పింగళి సూరన |
| 100 | ప్రభు (లిం) | ప్రభులింగలీల (ద్విపద) | ఆ ౫ (ఒక్కొక్క ఆశ్వాసమునకుఅయిదై దుగతులు గలవు) | పిడుపర్తి సోమయ |
| 101 | ప్ర మణి | ప్రబంధమణిభూషణము | | |
| 102 | బస పు | బసవపురాణము (ద్విపద) | ఆ ౭ | పాలకురికిసోమన. (కుఁడు. |
| 103 | బహు | బహుళాశ్వచరిత్రము | ఆ ౫ | దామరల వేంగళనాయ |
| 104 | బిల్హ | బిల్హణీయము | ఆ ౩ | పండిపెద్ది కృష్ణస్వామి |
| 105 | బ్రహ్మో | బ్రహ్మోత్తరఖండము | ఆ ౫ | శ్రీధర మల్లె వేంకటరామ |
| 106 | బ్రా | బ్రాహ్మ్యానిఘంటువు | | బ్రౌనుదొర [కవి |
| 107 | భర్తృ | భర్తృహరిసుభాషితము<br>నీతి, నీతిశతకము.<br>శృం, శృంగారశతకము<br>వై వైరాగ్యశతకము. | శతకములు ౩ | ఏనుఁగు లక్ష్మణకవి |
| 108 | భల్లా | భల్లాణచరిత్రము | ఆ ౫ | వాశేశ్వరుఁడు |
| 109 | భాగ | భాగవతము | స్కం ౧౨ | బమ్మెర పోతరాజు |
| 110 | భాను | భానుమతీపరిణయము | ఆ ౪ | కెంటూరి రంగరాజు |
| 111 | భార | భారతము<br>ఆది ఆదిపర్వము ఆ ౮<br>సభా సభాపర్వము ఆ౨<br>అర అరణ్యపర్వము ఆ ౭<br>విరా విరాటపర్వము ఆ ౩<br>ఉద్యో ఉద్యోగపర్వము ఆ ౪<br>భీష్మ భీష్మపర్వము ఆ ౫<br>ద్రో ద్రోణపర్వము ఆ ౫<br>కర్ణ కర్ణపర్వము ఆ ౩<br>శల్య శల్యపర్వము ఆ ౨<br>సౌ సౌప్తికపర్వము ఆ ౨<br>స్త్రీ స్త్రీపర్వము ఆ ౨<br>శాం శాంతిపర్వము ఆ. ౬ | పర్వములు౧౮ | కవిత్రయము, (నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగ్గడ) |

| సంఖ్య | గ్రంథసంకేతములు | గ్రంథనామములు | గ్రంథముల యందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|---|---|
| | | అను అనుశాసనికపర్వము. ఆ ౫ | | |
| | | అశ్వ అశ్వమేధికపర్వము ఆ ౪ | | |
| | | ఆశ్ర ఆశ్రమవాసపర్వము ఆ, ౨ | | |
| | | మౌ. మౌసలపర్వము. ఆ ౧ | | |
| | | మహా మహాప్రస్థానికపర్వము. ఆ ౧ | | |
| | | స్వ స్వర్గారోహణపర్వము.ఆ ౧ | | |
| 111 | భా రా. | భాస్కరరామాయణము (అచ్చ తెనుఁగు రామాయణముకడనున్నట్లు దీనికి కాండము లెక్కింపఁబడినది ) | కాం. ౬. | భాస్కరుఁడులోనగువారు. |
| 112 | భా శ | భాస్కరశతకము, | | మారద వెంకయ్య |
| 113 | భీమ | భీమేశ్వరపురాణము | ఆ ౬ | శ్రీనాథుఁడు [డు |
| 114 | భేష. | భేషజకల్పము | ఆ ౪. | బహుపాద వేంకటాచార్యు |
| 115 | భోజరా. | భోజరాజీయము | ఆ ౭ | అనంతామాత్యుఁడు. |
| 116 | భోజసుతా | భోజసుతాపరిణయము | ఆ ౫ | కోటీశ్వరకవి |
| 117 | మనుచ | మనుచరిత్రము | ఆ ౬. | అల్లసాని పెద్దన |
| 118 | మల్హ. | మల్హణభూపాలీయము (భర్తృహరికడనున్నట్లే దీనికి శతకము లెక్కింపఁబడినది ) | శతకములు 3 | ఎలకూచి బాలసరస్వతి. |
| 119 | మల్లుపు | మల్లుపురాణము (దేవమల్ల చరిత్రము-వ్రాఁతప్రతి) | ఆ ౪ | సుదురుపాటి వేంకనార్యుఁ [డు |
| 120 | మల్హణ | మల్హణచరిత్ర | ఆ ౩ | ఎడపాటి ఎఱ్ఱన్న |
| 121 | మార్క | మార్కండేయపురాణము | ఆ ౮ | మారన |
| 122 | ముకుంద | ముకుందవిలాసము | ఆ ౩ | కాణాది పెద్దన. |
| 123 | మృ వి | మృత్యుంజయవిలాసము | ఆ ౩ | గోఁగులపాటి కూర్మ |
| 124 | మై | మైరావణచరిత్రము | ఆ ౩ | మాడయకవి [దాసుఁడు |
| 125 | మొ. రా. | మొల్లరామాయణము (అచ్చ తెనుఁగురామాయణము కడనున్నట్లు దీనికి కాండము లెక్కింపఁబడినది ) | కాం ౬. | మొల్ల [డు |
| 126 | యయా | యయాతిచరిత్రము | ఆ. ౫ | పొన్నిగంటి తెలగనార్యుఁ |
| 127 | రంగా | రంగారాయచరిత్రము. | ఆ ౩ | దిట్టకవి నారాయణకవి. |
| 128 | రం. రా. | రంగనాథరామాయణము (ద్విపద) (అచ్చ తెనుఁగురామాయణము కడనున్నట్లు దీనికి కాండము లెక్కింపఁబడినది ) | కాం ౬ | రంగనాథుఁడు. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి అశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 129 | రం రా. ఉ | రంగనాథరామాయణము ఉత్తరకాండము (ద్విపద) | కాం ౧. | రాచభూపతి, విట్ఠలరాజు |
| 130 | రఘు | రఘువంశము | ఆ ౧౦. | అవుదూరి కిచ్చయ్య |
| 131 | రఘునా | రఘునాథాభ్యుదయము. (నాంతి | | విజయరాఘవకవి |
| 132 | రత్న. | రత్నపరీక్ష. (ప్రతి ) | | భైరవకవి |
| 133 | రస. | రసమంజరి (లక్షణగ్రంథము) | గుచ్ఛములు ౩. | సురతాని కోదండపతి |
| 134 | రసా | రసాభరణము (లక్షణగ్రంథము. | ఆ ౪ | అనంతామాత్యుఁడు |
| 135 | రసిక. | రసికజనమనోభిరామము. | ఆ. ౬. | కూచిమంచితిమ్మకవి |
| 136 | రాఘవ | రాఘవపాండవీయము | ఆ. ౪ | పింగళి సూరన్న. |
| 137 | రాజగో. | రాజగోపాలవిలాసము | ఆ ౫ | కాళయ |
| 138 | రాజ. చ | రాజశేఖరచరిత్రము | ఆ ౩ | మాదయగారి మల్లన్న |
| 139 | రాజ వి | రాజశేఖరవిలాసము | ఆ. ౩. | కూచిమంచి తిమ్మకవి |
| 140 | రాధా | రాధామాధవము. | | చింతలపూడి ఎల్లనార్యుడు |
| 141 | రాధి కా. | రాధికాసాంత్వనము | ఆ ౪. | ముద్దుపళని |
| 142 | రామ. | రామశాకీయము | ఆ. ౧. | వెంకయ్య |
| 143 | రామలిం. | రామలింగేశ్వరశతకము. | | అడిదము సూరన్న. |
| 144 | రామా. | రామాభ్యుదయము | ఆ. ౮. | అయ్యలరాజు రామభద్రుడు |
| 145 | రామే. | రామేశ్వరమాహాత్మ్యము. | ఆ ౫ | ఏనుఁగు లక్ష్మణకవి |
| 146 | రా వి. | రాజహంసవిజయము. | ఆ ౫ | శాకమూని మూర్తికవి |
| 147 | రుక్మాం. | రుక్మాంగదచరిత్రము | ఆ ౫ | ప్రౌఢకవి మల్లన్న |
| 148 | రుక్మి | రుక్మిణీపరిణయము | ఆ. ౫. | కూచిమంచి తిమ్మకవి |
| 149 | లక్షణ | లక్షణసారసంగ్రహము | | చిత్రకవి పెద్దన్న |
| 150 | ల వి | లక్ష్మీవిలాసము | ఆ ౫ | రాయసము వేంకటపతి |
| 151 | వన వి. | వనమాలివిలాసము | | నారన సూరన [సింగన్న |
| 152 | వరాహ. | వరాహపురాణము | ఆ ౧౨. | నందిమల్లయ్య ఘంట |
| 153 | వసు. | వసుచరిత్రము | ఆ ౬. | రామరాజభూషణుఁడు |
| 154 | వా రా | వాసిష్ఠరామాయణము. | ఆ. ౫. | మడికి సింగన. |
| 155 | వాల్మీ. | వాల్మీకిచరిత్రము. | ఆ. ౩. | రఘునాథభూపాలుఁడు |
| 156 | విక్ర. | విక్రమార్కచరిత్రము. | ఆ. ౮. | జక్కన. |
| 157 | విజ, వి. | విజయవిలాసము. | ఆ. ౩. | చేమకూర వేంకటకవి. |
| 158 | విష్ణు. | విష్ణుచిత్తీయము | కాం. ౩. | కేతన. |
| 159 | వి న. | విజయనందనవిలాసము. | ఆ. ౩. | ముంగళగిరి ఆనందకవి. |
| 160 | వి. పు. | విష్ణుపురాణము | ఆ. ౮. | వెన్నెలకంటి సూరన. |
| 161 | విష్ణుమా. | విష్ణుమాయా నాటకము | | చింతలపూడి ఎల్లనార్యుడు. |
| 162 | విప్ర. | విప్రనారాయణచరిత్రము. | ఆ. ౫. | చెదలవాడ మల్లయ్య. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 163 | వీథి | వీథినాటకము | | శ్రీనాథుఁడు ? |
| 164 | వీర | వీరభద్రవిజయము | ఆ ౪ | బమ్మెరపోతన్న |
| 165 | వేంక | వేంకటేశాంధ్రము (నిఘంటువు) | వర్గలు ౫. | గణపవరపు వేంకటకవి |
| 166 | వేం పంచ | పంచతంత్రము | ఆ ౫ | వేంకటనాథుఁడు |
| 167 | వేం మా | వేంకటాచలమాహాత్మ్యము | ఆ. ౭. | తరిగొండ వెంకమ్మ |
| 168 | వేణు | వేణుగోపాలశతకము | | |
| 169 | వేమన | వేమనశతకము | భాగ. 3 | వేమనయోగి |
| 170 | వైజ | వైజయంతీవిలాసము | ఆ ౪ | సారంగు తమ్మయ్య |
| 171 | శర | శబ్దరత్నాకరము (నిఘంటువు) | | బహుజనపల్లి సీతారామాచార్యులు |
| 172 | శశాం | శశాంకవిజయము | ఆ ౫ | శేషము వేంకటపతి |
| 173 | శా ప మ | శాసనపద్యమంజరి | | |
| 174 | శివర | శివధర్మోత్తరము | ఆ ౯. | మల్లా రెడ్డికవి |
| 175 | శివర. | శివరహస్యఖండము | ఆ ౧౦. | కోడూరి వేంకటాచలపతి |
| 176 | శివరా | శివరాత్రిమాహాత్మ్యము | ఆ ౪ | శ్రీనాథుఁడు [ధ్యుఁడు. |
| 177 | శివ సా | శివతత్త్వసారము | | మల్లికార్జునపండితారా |
| 178 | శుక | శుకసప్తతి | ఆ ౪. | కదిరీపతినాయకుఁడు |
| 179 | శుక చ | శుకచరిత్రము | ఆ ౫ | పరశురామపంతుల రామమూర్తికవి |
| 180 | శృంగా | శృంగారరసమంజరి. | | సురతాని కోదండపతి. |
| 181 | శేష | శేషధర్మము | ఆ ౫ | తామరపల్లి తిమ్మయ్య. |
| 182 | శ్రీరం | శ్రీరంగమహత్త్వము | ఆ ౫ | భైరవకవి |
| 183 | శ్రీరం మా | శ్రీరంగమాహాత్మ్యము. | ఆ ౧౦ | కట్టా వరదరాజేంద్రుఁడు |
| 184 | ష చ | షట్చక్రవర్తిచరిత్రము | ఆ ౯ | మల్లా రెడ్డికవి |
| 185 | షోడ | షోడశకుమారచరిత్రము | ఆ ౯ | వెన్నెలకంటి అన్నయ్య |
| 186 | సకల స | సకలనీతిసమ్మతము | | మడికి సింగన్న |
| 187 | సత్య సాం | సత్యభామాసాంత్వనము. | | లింగనమఖి, కామేశ్వరకవి. |
| 188 | సమీర | సమీరకుమారవిజయము | ఆ. ౬ | పుష్పగిరి తిమ్మన్న |
| 189 | సర్వ. సా. | సర్వలక్షణసారసంగ్రహము | | కూచిమంచి తిమ్మకవి |
| 190 | సస్యా. | సస్యానందము | | |
| 191 | సాం ని. | సాంబనిఘంటువు | వర్గలు ౫. | కస్తూరి రంగకవి. |
| 192 | సాంబో | సాంబోపాఖ్యానము | ఆ ౫ | రంగప్పరాజు. |
| 193 | సానందో | సానందోపాఖ్యానము | ఆ ౫ | శివరామకవి |
| 194 | సారంగ | రంగధరచరిత్రము | ఆ 3. | చేమకూర వేంకటకవి, [డు. |
| 195 | సిం నార | సింహాద్రినారసింహశతకము. | | గోఁగులపాటికూర్మదాసుఁ |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు | గ్రంథములయందలి ఆశ్వాసాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు. |
|---|---|---|---|---|
| 196 | సీతారా | సీతారామాంజనేయసంవాదము | ఆ ౩ | పరశురామపంతుల గురులింగమూర్తి |
| 197 | సీతావి | సీతావిజయము. (శతకంఠరామాయణము ) | ఆ ౪ | మర్దనకవి |
| 198 | సీమం | సీమంతినీకల్యాణము | ఆ ౫ | పెనుమళ్ల సోమమంత్రి. |
| 199 | సుద | సుదక్షిణాపరిణయము | ఆ ౫ | తెనాలి అన్నయ్య |
| 200 | సుదంతా | సుదంతాపరిణయము(వ్రాతప్రతి) | ఆ ౪ | అకుఘురికవి |
| 201 | సురా | సురాభాండేశ్వరము. | ఆ ౧ | గట్టు ప్రభువు |
| 202 | సు శ. | సుమతిశతకము. | | బద్దెనకవి |
| 203 | సేతు | సేతుఖండము | ఆ ౬ | వక్కలంక వీరభద్రకవి. |
| 204 | హంస. | హంసవింశతి | ఆ ౫ | అయ్యలరాజు నారాయణామాత్యుడు |
| 205 | హ. న. | హరిశ్చంద్రనలోపాఖ్యానము | ఆ ౫ | రామరాజభూషణుడు |
| 206 | హర. | హరవిలాసము | ఆ ౭ | శ్రీనాథుడు |
| 207 | హర వి. | హరభక్తవిలాసము | | |
| 208 | హరి | హరివంశము | | ఎఱ్ఱాప్రగడ. |
| | | పూ = పూర్వభాగము. | ఆ ౯ | |
| | | ఉ = ఉత్తరభాగము | ఆ ౧౦. | |
| 209 | హరిశ్చ. | హరిశ్చంద్రోపాఖ్యానము | ఆ ౫ | శంకరకవి |
| 210 | హ వరాహ | వరాహపురాణము. | ఆ ౫ | హరిభట్టు |

(కడపటి పృష్ఠము )

| సంఖ్య | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు | గ్రంథములయందలి సర్గాదుల సంఖ్య | గ్రంథకర్తలనామములు |
|---|---|---|---|---|
| 1 | అమర | అమరసుధ. | | భానుజి దీక్షితులు. |
| 2 | ఆ ని | ఆప్తునిసంస్కృతాంగ్ల నిఘంటువు. | | వామనశివరామాప్తుఁడు. |
| 3 | ఉ. చ. | ఉత్తరరామచరితము | అంకములు ౭ | భవభూతి |
| 4 | కల్ప | శబ్దకల్పద్రుమము. (నిఘంటువు.) | | సర్ రాజా రాధాకాంత దేవ బహదరు |
| 5 | కాదం | కాదంబరీకావ్యము | భాగములు ౨ | బాణకవియు, తత్సుతుఁడు |
| 6 | కావ్యాద. | కావ్యాదర్శము | పరిచ్ఛేదములు ౩ | దండికవి |
| 7 | కే ని | నానార్థార్ణవసంక్షేపనిఘంటువు | కాండములు ౬ | కేశవమిశ్రుఁడు. |
| 8 | గీత. | భగవద్గీత | అధ్యాయములు ౧౮ | వ్యాసమహర్షి. |
| 9 | గీతగో | గీతగోవిందము | సర్గములు ౧౨ | జయదేవుఁడు. |
| 10 | త్రిని | త్రికాండశేషము (నిఘంటువు) | కాండములు ౩ | పురుషోత్తముఁడు. |
| 11 | పరా | పరాశరస్మృతి | కాండములు ౨ | పరాశరమహర్షి. |
| 12 | భట్టి | భట్టికావ్యము | సర్గములు ౨౨. | భట్టి. |
| 13 | భామినీ. | భామినీవిలాసము. | ఉల్లాసములు ౪. | జగన్నాథపండితరాయలు. |
| 14 | మను. | మనుస్మృతి. | అధ్యాయములు. ౧౨ | మనువు |
| 15 | మహా | మహావీరచరిత్రము | అంకములు ౭. | భవభూతి. |
| 16 | మాలతీ. | మాలతీమాధవము | అంకములు ౧౦ | భవభూతి. |
| 17 | మాళవి. | మాళవికాగ్నిమిత్రము. | అంకములు ౫ | కాళిదాసుఁడు. |
| 18 | ముద్రా. | ముద్రారాక్షసము | అంకములు ౭. | విశాఖదత్తుఁడు. |
| 19 | మురా. | అనర్ఘరాఘవము. | అంకములు ౭ | మురారి. |
| 20 | మృచ్ఛ. | మృచ్ఛకటికము. | అంకములు ౧౦ | శూద్రకుఁడు. |
| 21 | మే ని. | మేదినినిఘంటువు | | మేదినికరుఁడు. |
| 22 | మేఘ. | మేఘదూతము | భాగములు ౨ | కాళిదాసుఁడు |
| 23 | యాజ్ఞ | యాజ్ఞవల్క్యస్మృతి.<br>ఆచా ఆచారకాండము<br>ప్రా ప్రాయశ్చిత్తకాండము<br>వ్యవ. వ్యవహారకాండము. | కాండములు ౩ | యాజ్ఞవల్క్యమహర్షి. |
| 24 | రత్నా | రత్నావళి. | అంకములు ౪. | శ్రీహర్షదేవుఁడు. |
| 25 | రస | రసగంగాధరము. | | జగన్నాథపండితరాయలు. |

| సంఖ్య. | గ్రంథసంకేతములు. | గ్రంథనామములు. | గ్రంథముల యందలి సర్గాదుల సంఖ్య. | గ్రంథకర్తల నామములు. |
|---|---|---|---|---|
| 26 | రా ని | రాజనిఘంటువు | వర్గములు ౨౧ | నరహరిపండితుఁడు |
| 27 | వాచ | వాచస్పత్యనిఘంటువు | | తారానాథ తర్కవాచ [స్పతి |
| 28 | విక్రమో | విక్రమోర్వశీయము | అంకములు ౫ | కాళిదాసుఁడు |
| 29 | వి ని. | విశ్వనిఘంటువు | | మహేశ్వరసూరి |
| 30 | విల్యమ్సు | విల్యమ్సు సంస్కృతాంగ్ల నిఘంటువు | | సర్ మోనియర్ విల్యమ్సు |
| 31 | వేణీ | వేణీసంహారము. | అంకములు ౬ | భట్టనారాయణుఁడు. |
| 32 | వై ని | వైజయంతీనిఘంటువు | కాండములు ౮. | యాదవప్రకాశుఁడు |
| 33 | శాకుం | అభిజ్ఞానశాకుంతలము | అంకములు ౭ | కాళిదాసుఁడు |
| 34 | శా ని | శాశ్వతనిఘంటువు | | శాశ్వతుఁడు |
| 35 | శిశు | శిశుపాలవధము | సర్గములు ౨౦ | మాఘకవి |
| 36 | సం కిరా | కిరాతార్జునీయము | సర్గములు ౧౮ | భారవి |
| 37 | సం.కు సం | కుమారసంభవము | సర్గములు ౧౭. | కాళిదాసుఁడు |
| 38 | సం చం.రా. | చంపూరామాయణము. | కాండములు ౬ | భోజరాజు, లక్ష్మణసూరి. |
| 39 | సం. దశకు. | దశకుమారచరితము | | దండికవి |
| 40 | సం. నైష. | నైషధీయచరితము. | సర్గములు ౨౨ | శ్రీహర్ష కవి |
| 41 | సం పంచ | పంచతంత్రము | తంత్రములు ౬ | విష్ణుశర్మ |
| 42 | సం ప్రబోధ | ప్రబోధచంద్రోదయము. | అంకములు ౬ | కృష్ణమిశ్రకవి |
| 43 | సం భర్తృ | భర్తృహరిసుభాషితము | శతకములు ౩ | భర్తృహరి |
| 44 | సం భాగ. | భాగవతము | స్కంధములు ౧౨ | వ్యాసమహర్షి. |
| 45 | సం. భార. | భారతము | పర్వములు ౧౮ | వ్యాసమహర్షి. |
| 46 | సం. రఘు. | రఘువంశము | సర్గములు ౧౯ | కాళిదాసుఁడు. |
| 47 | సం రామా | రామాయణము. | కాండములు ౬ | వాల్మీకిమహర్షి. |
| 48 | సా ద. | సాహిత్యదర్పణము | పరిచ్ఛేదములు ౧౦ | విశ్వనాథకవిరాజు. |
| 49 | హలా ని. | అభిధానరత్నమాలానిఘంటువు. | కాండములు ౫ | హలాయుధుఁడు. |
| 50 | హితో | హితోపదేశము | భాగములు ౪ | నారాయణపండితుఁడు. |
| 51 | హేమ ని. | అనేకార్థసంగ్రహము. (నిఘంటువు.) | కాండములు ౭ | హేమచంద్రుడు. |

(కడమవి స్పష్టము.)



# సూర్యరాయాంధ్ర నిఘంటువు

## మ

మ. ఊభ. ఒకానొక వత్సరము.

మ. ప్ర. ఆశీశ్శ్యార్థకము లగు ఎడు, తవర్ణకములకు అచ్చు పరంబగునపు డాదేశముగాను చిట్టు, బుస్సు, మినుకు మున్నగు అనుకరణ శబ్దములకు ‘అను’ పరమగునపుడు ఆగమముగాను వచ్చు వర్ణము.

ఉదా రక్షించెడు మెపుడు. (రక్షించెడు + ఎపుడు) చెప్పితి మనెను. (చెప్పితిన్ + అనెను.) చిట్టుమంటివి, బుస్సుమన్నది, మినుకు మినుకు మనుచున్నది మొ.

మ. సం. వి. అ. పుం. ౧. శివుఁడు. ౨. చంద్రుఁడు. ౩. బ్రహ్మ ౪. యముఁడు. ౫. విష్ణువు. ౬. సమయము. ౭. విషము

మంకిలము. సం. వి. అ పుం. దావానలము, కార్చిచ్చు.

మంకు. విణ. (క. మంకు. త. వంగన్.)

౧. అవివేకి, మూర్ఖుఁడు, మూర్ఖము.

ఆ. ఇంటిలోనిధనము నిధి నాది యనుచున, మంటిలోన దాఁచు మంకుజీవి, కొంచుఁ బోడు వెంట గుల్లకాసును రాదు, విశ్వ వేమ, వేమ. ౧. ౧౫౦.

ఉ. ఒప్పని మోముతో నను దురుక్తులఁ బల్కుచు మంకుబుద్ధి యే, తప్పను లేమి నిల్వెడలి తల్లిగ్రహింపవ కేఁగ
హేం. పం. ౪ ౪౭౯

మంకుబుద్ధి = మంకుబుద్ధిగలది, మూర్ఖురాలు.

౨. మొండి, కూడనిపట్టుదల కలది, చెప్పిన మాట విననిది.

క. మంకులు మాయోపాయులు, బొంకులపుట్టలతిపాపపుంజగజంతల్, జంకెనలు సేయు యువతులు, శంకరుఁడెం దగఁడు వారిచర్యలు దెలియన్. హంస ౧ ౩౭

ద్వి. మంకు ద్రిమ్మరి మటుమాయలబండి.
ద్వి. పరమ. ౪. ౨౯౭. పా. ౧౧ పం.

సీ. . పరులబుద్ధులకుఁ జొప్పడని మంకు
శుక. ౩. ౧౭.

౩. మొడ్డది, దుష్టము.

ఉ. మంకుగుణంబు మానక సమంజసకీర్తి వహింప లేక మీ, నాంకధనుర్విముక్త కుసుమాశుగ పత్త్రికిఁ దాళ లేక ,
సానంద ౨ ౨౬.

సీ. కలపుట నేర్పట కలతలు పోకిళ్లు కలదలు బుద్ధులు కలటి మంకు.
అప్ప ౨. ౧౯౭.

జ. మంకుఁబోతు, మంకుతనము.

**మంకుఁబోతు.** విశే. (మంకు + పోతు) మిక్కిలి మూర్ఖుఁడు; మిక్కిలి మూర్ఖురాలు.

ద్వి. కొంకక తమనోరి కోలఁగలఁ బలుకు, మంకుఁబోతులకు గ్రామ్యంబు సామ్యంబు.
అ. సు. క. ౧. ౯. పా. ౩. పం

**మంకుతనము.** వి (√మంకు క. మంకుతన) మొండితనము, మూర్ఖత్వము.

చ. మగని రాజ్యముఁ బిడిచి మంకుతనం బునఁ బెంచి రావి మేల్, పదవులు గోరఁగ నెల్లరి ... ౪ ౧౫౩
(విశ్వామిత్రుఁడు త్రిశంకునిగో నన్న మాటలు)

సీ. మాయామృగము వెంట పగఁడు పోవఁగ దంట మఱఁది వంచన నాఁటి మంకు తనము

గీ. పావనీ దీర్ఘఁగఁ గ్రమ్మఁ జవతరించి, వైదికులగోత్రమిద్ధాత్రి సాత్రసు గను వెలుఁగు రామకమాపాలుఁ జెట్టపట్టె ధీర ధోరణి జానకీదేవి శివ
కృ శతకం. పీఠి. ౧. ౨౦.

**మంకురము.** సం. వి. అ. పుం. అద్దము.

**మంకువు.** సం. వి. ఉ. పుం. మచ్చ, చెమట కాయ. (వై. వి.)

**మంకుశుఁడు.** సం. వి. అ. పుం. సంగీతమును నాట్యమును ఎఱుగునట్టి మహిమాన్యజాతి వాఁడ. (వై వి.)

**మంకెన¹.** వి. వృక్షవిశేషము. బంధూకము. కీ. (టీవిపుష్ప వెట్టాగా నుండును)

ఉ. ... అరుణాధరపల్లవ నిర్గతంబులై, పంకరుహాయతాక్షియను పల్కులు ... మంకెనపూవుఁ జాపమున మున్నదుఁ జేసినకూపుల్ యవన్. సైప. ౪. ౧౩.

ఉ. ..మంకెనపూవుకేడె మన మండల మొప్పె మరీచిమాలికిన్.
పి. శకుం. ౩. ౨౦౪.

క పగడము మంకెనవిరియును, జిగురాకును దొండపండుఁ జెందిరమును సొం, పగు తళ్కుకెంపుగుంపును, ముగుదనిగారంపుఁ దొగరుమోవికి దొరయే.
నీలా. ౨ ౨౨. ౭౦. భా. ౨. ౫౨.

వి. ౨. ధాన్యవిశేషము, ఒకజాతివడ్లు.

సీ. మణిసరు ల్పసరులు మంకెన ల్పగ డంపుఁలేఁగలు మధ్రపాలు దేవసరులు ..
హంస ౪. ౧౨౮.

**మంకెనకి.** వి. ఎద్దులు మున్నగువానిమీఁదఁ గొనిపోవు జలతైలాది పాత్రములు కదలకుండునట్లు మంకటకై క్రింద నమర్పఁబడు బెత్తపుబుట్ట.

సీ. గేదె లడ్డిగ మొత్త మూని గొల్లలకు నెత్తిన పగడంపు మంకెనలగుములు

గీ. అన్నపాలు, ముఖమునఁ బెట్టి చెంచులు పాఁగి మ్రొక్క. చంద్రా. ౨. ౪౧.

క. పరికరముల మంకెనలును, బరిచారకు లరిదిపనుల పట్టుగుడారుల్, సరిబేరులైన గారలు, దొరయం జన విప్రుఁ డతనితో ని ట్లనియెన్. కుశ. ౧. ౧౦౦.

జ. మంకెనగిత్త.

**మంకెనగిత్త.** వి. (మంకెనకి + గిత్త.) మంకెన మోసెడి యెద్దు.

ఉ. వెన్నడఁ జూపె వెండి రహి నిండిన సందిటి బొంది భూతితో, వెన్నొస లానఁ బొ ల్పెరుఁగు వెయ్యని వాడమకోడె కొండపై, వెన్నెలపోగ లీను వెలి వెన్నను

గద్దరిఁ గన్నుఁబొఱపుం, గన్నడకొన్న
లెక్కినచొక్కారపు మంకెనగిత్తలత్తరిన్.
రా. వి. ౨. ౬౧.

ఉ. పైనము లైరి పాం. నరపాలతనూజులు
యజ్ఞసేనభూ, జానియనుజ్ఞ నశ్వములు
పూన్గ రథప్రకరంబు వెల్లి మత్తేనుఁగు
తండముల్ గదలె నేఁగ భటచ్ఛటలోన
ఘట్టికల్, మైనపుఁ జీర పెట్టియలు
మంకెనగిత్తలు గాంచెనన్నడల్.
పాంచా. ౫. ౪౭.

**మంఖణము.** సం. వి. అ. న. కాలిపిక్కలకుఁ
దొడుగుకొను కవచము, జంఘాత్రాణము

**మంక్షు.** సం. అవ్య. ౧. వెంటనే, వెంబడి,
వేగముగా. (మంక్షూదపాతి = వెంబడిని
బడెను.) ౨. అత్యధికముగా, ౩. యథార్థ
ముగా, నిజముగా. (విలియమ్స్)

**మంఖ.** సం. వి. ఆ. స్త్రీ. మాంగల్యము,
శుభము. (శే. ని.)

**మంఖుఁడు.** సం. వి. అ. పుం. ౧. బట్టు,
స్తోత్రపాఠకుఁడు.

**మంఖణము.** సం. వి. అ. పుం. జంఘా
త్రాణము, పిక్కలకుఁ దొడుగు కవచము.

**మంగ = మ్రంగ.** వి. ౧. వృక్షవిశేషము,
పిండీతకము †.

ద్వి. పొంగారి మొలచిట్టి చెలఁగులవాఁడు,
మంగ వృక్షములారం మాసుకుఁగనరె.
సారంగ. ౩. ౧౧౧. పా. ౬. పం.

౨. మదనము †.

గీ. మంగ యనఁగను మదన నామంబు చెలఁగు,
ఆం. భా. ౨. ౪౭.

**మంగము.** సం. వి. అ. పుం. ౧. పడవయొక్క
శిరోభాగము. (వై. ని.)

**మంగల.** వి. (క. మంగల, త. మంగలి.)
క్షౌరముచేసి జీవించెడిజాతి.
(ఈడా మంగలవాఁడు, మంగలది కు.)
జ. మంగలకత్తి, మంగలకత్తిరూపు, మంగల
వాఁడు, మంగలి, మంగలికోలు, మంగలి
పని, మంగళ్లతిప్ప, మంగల పిట్ట.

**మంగల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పతివ్రత.
౨. సితదూర్వాతృణము †. ౩. దుర్గాదేవి.
౪. పసుపు

**మంగలకత్తి.** వి. (√మంగల) మంగలవాని
కత్తి, క్షురకము
క. మంగలకత్తిపై నంగ మొంచినయట్లు
కోడిత్రాఁచును ముద్దులాడినట్లు.
వేణు. ౪. ౫౦.
సీ. మంగలకత్తి యనంగ క్షురము తగుఁ ..
ఆం. భా. ౨. ౩౦౧.

**మంగలకత్తిరూపు.** (√మంగలకత్తి) కృత్తికా
నక్షత్రము. (శ. ర.)

**మంగలగ్రహము.** సం. వి. అ. పుం.
కుజుఁడు. (వై. ని.)

**మంగలచ్ఛాయము.** సం. వి. అ. పుం. ప్లక్ష
వృక్షము, జువ్వి †. (రాజని.)

**మంగలదేవత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. శుభ
దేవత, కులదేవత, ఇలువేల్పు. ౨. లక్ష్మి.

**మంగలధ్వని.** సం. వి. ఇ. పుం. వివాహ
కాలమునందు వాయించు శుభధ్వని.

**మంగలపక్కి.** వి. మత్స్యవిశేషము (శ. ర.)
ఒకజాతిచేప.

**మంగలపత్త్రిము.** సం. వి. అ న తాయెతు. (రక్షరేఖ)గా నుపయోగించ్చెడియాకు. (విలియమ్స్)

**మంగలపాఠకుఁడు.** సం. వి. అ. పుం. స్తోత్ర పాఠకుఁడు, మాగధుఁడు.

**మంగలపిట్ట.** వి. (మంగల + పిట్ట) ఏట్రింత, భరద్వాజపక్షి. (శ. ర.)

**మంగలప్రదము.** సం. విణ. అ. ఆ. అ. శుభము నిచ్చునది
సం. వి. ఆ. స్త్రీ. పసుపు హరిద్ర. (కల్ప)

**మంగలప్రస్థము.** సం. వి. అ పుం. ఒకానొక పర్వతము. (విలియమ్స్.)

**మంగలమాలిక.** సం. వి. ఆ. స్త్రీ. వివాహమందలి శుభ సంగీతము. (వై. ని.)

**మంగలము.** వి. వేఁపుకు చట్టి, భ్రాష్ట్రిము, అంబరీషము.

గీ. ఉరునిదాఘ వాతాహతిఁ గరులతలలు,
ప్రస్సి లోపలి ముత్యముల్ వరుస విరిసి,
మంగలములోని ప్రేలలభంగిఁ దూలి
కు. సం. ౬. ౭౯౫.

సీ. మంగల మన భ్రాష్ట్రాభిధానంబు
పరఁగుచునుండును.
ఆం భా. ౨. ౨౮౩.

ఉ. ఎండెఁ గొలంకు లెల్లను మహీధరముల్
దవవహ్ని కీలలన్, మండె ధరాతలం
బినుప మంగలముంబలె నుండె ...
కాశ. ౧. ౧౨౩.

శా. మండ జఠరాగ్నిఁ దనయులు, చండత
మంగలమువంటి సంసారము నిం, కొంచు
గతి లేదు దినదిన, గండం చేరీతి వడ
పఁగాఁ దగు ననఘా.
రాజ. చ. ౩. ౧౯

**మంగలము.** సం. వి. అ. పుం. న. ౧. శుభము. ౨. క్షేమము. లబ్ధార్థరక్షణము. ౩. శుభసమయము, మంచివేళ. ౪. మల్లిపువ్వు వాసన. ౫ శుభద్రవ్యము. ౬. (వివాహాది) శుభకార్యము ౭. కరంజము, కానుగు. శ్రీ. విణ. అ ఆ. ఆ. శుభకరము, క్షేమంకరము.

**మంగలవాఁడు.** వి (మంగల + వాఁడు) క్షౌరకుఁడు అంబష్ఠుఁడు. (వా)

**మంగలవారము.** సం. వి. అ. పుం. జయవారము అంగారక వారము.

**మంగలసూత్రము.** సం వి అ. న ౧. శుభప్రదమగు తోరము, బొట్టుదారము. ౨. రక్షరేకు (తాయెతు) వలెఁ గట్టెడిదారము (వివాహితలగు స్త్రీలు భర్త బ్రదికియున్నంత కాలము మెడచుట్టు కట్టుకొనెడి (ధరించెడి) మాంగల్య తంతువు)

**మంగలస్నానము.** సం వి అ. న. శుభస్నానము, వివాహాది కాలమున స్నానము.

**మంగలాష్టకము.** సం. వి. అ. న. వివాహకాలమున వధూవరుల యభివృద్ధికై పురోహితులు చదివెడి యాశీర్వచన శ్లోకములు, ఎనిమిది మంగల శ్లోకములు. (విలియమ్స్.)

**మంగలాహ్నికము.** సం. వి. అ. న. ౧. శుభమునకై ప్రతిదినము నాచరించెడి వైదిక కర్మము. ౨. పూర్ణకుంభము, శుభమునకై నీటితో నింపి ఉంచిన ఘటము.

**మంగలి.** వి. (మంగల + ఇకి. త. మంగలి. బ. మంగలులు, మంగళులు, మంగళ్లు.) మంగల

జాతికి సంబంధించినవాఁడు. క్షౌరికుఁడు, మంగి.

ఉ. విన్నప మాదరింపు పృథివీవర మంగలి
 మాయ లేమియుం, బన్నఁడు
 కాశీ. ౧. ౫౫.

16 పుట్టి ౧ ట్టికిచి ౩ శ్రీమంగ్గలి
 పేరు ౧ ట్టికిచి ౬ పోడు ౧ ట్టికిచి
 ౬. పెసలు మిన్ను అన్నులోపైన ఎణ్ణుగి
 నరు

19. పుట్టి ౧ ట్టికిచి ౧౦ కొండ
 మంగ్గలిపేరు ౧ ట్టికిప్రయిచి ౬ ఏరు
 ౧ ట్టికిచి ౧౦ చాకిపేరు ౧ ట్టికిచి
 ర గోదావరిపడ్మటి
 దా. శా. ౧౩౮౪ అం భా ౨ ౨౮౩

**మంగలి.** సం. వి. ఈ. స్త్రీ. = మంగల.

**మంగలిగోలు.** వి. (మంగలి + గోలు. వృత్తిని వర్ణలోపము) బ. మంగలిగోళ్లు. మంగలి ఊరుగొట్టము. సన్నాయి.

క. మంగళసూత్రముఁ గట్టఁ గ, రంగామికి
 నంత సంగరాజేంద్రుఁడు పుణ్యాంగనల
 పెండ్లిపాటలు, మంగలిగోళ్ల మృదుగీతి
 మధురిమ నెనయన్.
 కళా. ౭. ౭౫. (గో. ప్ర. పా.)

**మంగలిపని.** వి. (√మంగలి.) క్షౌరము.

గీ. వలయుఁ గ్రామ్యశోదమ్మునత్వముల
 నొకటి, తారకంబులుఁ దిథులును వార
 ములును, జోస్యు లెఱింగించినవి మేలు
 సుప్రతైక, లోల! మంగలిపనికిని జైల
 మునకు. భ ర. అను. ౪. ౧౭౧.

**మంగలీయము.** సం. విణ. (అ. ఆ. అ.) శుభ ప్రదము.

**మంగలుఁడు.** సం. వి. అ. పుం. ౧. అంగారకుఁడు. ౨. అగ్ని.

**మంగల్యా.** సం. వి. ఆ. స్త్రీ. ౧. శమి, జమ్మి. ౨. సదాప. ౩. మిసి, జటామాంసి ౪. వచ, వస. (వై. ని.) ౫ మల్లిగంధము గల కాలాగురువు (శే. ని.)

**మంగల్యకము.** సం. వి. అ. పుం. మసూరము, చిఱుసెనగలు

**మంగల్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. శివకరము, శుభముచేయునది. ౨. సాధువు ౩. పవిత్రమైనది. ౪. సుందరము

వి. అ న. దధి, పెరుఁగు. ౨ చందనభేదము. ౩. స్వర్ణము, బంగారువు. ౪. సిందూరము. ౫. సర్వౌషధిస్నానము (శే. ని.)

అ. పుం ౧. త్రాయమాణము, కలుగానుగు. ౨. అశ్వత్థము, రావి. ౩. బిల్వము. ౪. మసూరకము, చిఱుసెనగలు. ౫ జీలకఱ్ఱ. ౬. నారికేళము ౭. కపిత్థము, వెలఁగ.

**మంగళకాళికి[1].** సం. వి ఈ. స్త్రీ. వి. ఇరువదినాలుగు శ్రీరాగములలో నొకటి. రాగిణీ విశేషము.

సీ. సారంగ మంగళకాళికులును, కన్న
 డయుఁ జాయయును గౌళ కడునపూర్వ,
 మైన భల్లాతకియును నారాయణియును,
 గ్రమత నిరువదినాల్గు శ్రీరాగములును.
 ప్రబంధ ౯౫.

గీ. కన్నడ యసంగ మంగళకాళి యన,
 వెలయు నారాయణియుఁ జతుర్వింశతి
 విధ, ములను దనరారు శ్రీరాగములను
 మఱియు ... సంగ. ౫. ౧౭౩.

వ. .. నాదనామక్రియా, వరాళి, మంగళ కౌశికి, గుండక్రియ, ఘూర్జరి ...
మత్స్యపురాణము. ౫. ౨౪.

**మంగళము.** సం. వి అ న. శుభకరము.

**మంగళసూత్రము.** సం వి అ. న. వివాహసమయమందు వధువు మెడను గట్టెడు పుస్తె లనో నుండు పసుపుత్రాడు, తాళి.

చ. పనివడి సాధుపంపునం బ్రభావతి భామిను లర్థిం గొల్వంగం, దనవు మెఱుంగుం బల్లెరమునన్ ఘనసారజదీక్షి కొవబిల్, గొని మను భీయుం గాంచి యనిలోం దినమంగళసూత్రి మూడంగా, ననువున నిల్పె నేందయుం దాతోంకన్ ౨యామంగళిం బాగ
శై. ౫. ౨౯

**మంగళహారతి.** = మంగళారతి. వి. (సం మంగళారాత్రికము) మంగళకరమైన హారతి, నీరాజనము. (శ. ర)

**మంగళాగరువు.** సం వి ఉ న చందన విశేషము, అగురుభేదము (రా ని.)

**మంగళారతి.** = మంగళ హారతి (సం మంగళారాత్రికము) వి వి శుభకరమైన హారతి, నీరాజనము

గీ. రతిం వహింపంగ జానకీరాఘవులకు, మంగళారతు లిచ్చిరి మువిత నంత.
జేశా. ౭. ౨౭౪

ద్వి. మంగళారతు లిచ్చి మహిం బ్రమొక్క చదంగ, నంగళ్లవీధుల నంతంత నిలిచి
పండితా. వాద. ౧౭౫

**మంగళ్లతిప్ప.** వి. (√మంగలి) క్షౌరికులు గాచిగి పడవైచిన వెంట్రుకల కుప్ప.

సీ. దూళ్లమక్కొక్క మంగళ్లతిప్పలు రేంగు వడువున గాలి నాడెడుకొంకలు.
ఆము ౬ ౧౭.

**మంగి.** వి మంగలవాండ, క్షౌరికుండు.

గీ. మంగి యనంగను మంగ లెసంగు మంగ
ఆం. భ ౨ ౨౮౩.

**మంగిని.** సం వి ఈ. స్త్రీ. పడవ, ఓడ, (వై ని)

**మంగు** = **మంగుడు.** వి. ముఖసిధ్మము, ముఖమువందలిపొడ, (ముదిమిచే మొగమునం జేర్పడు మడుత అని బ్రా. 'మూంగు' యొక్క రూపాంతరము, ముఖమునందలి నల్లపొడ అని శ ర.)

సీ. మంగుం డనంగను మంగ నంగ, ముఖసిధ్మనామ మొప్పను
ఆం. భా. ౨. ౧౭౯.

**మంగుడు** = **మంగు.** వి ముఖసిధ్మము.

**మంచకము.** సం. వి అ. న ౧. పర్యంకము, మంచము ౨. ఎత్తైనయాసనము ౩. ఎత్తైన కుంపటి. (విలియమ్స్)

**మంచకాశ్రయము.** సం. వి. అ. పుం. మత్కుణము, నల్లి

**మంచము.** వి (సం. మంచః, క. మంచ.) పర్యంకము, ఖట్వ.

ఉ వీనుల చూపు మెండెముం దవిల్చినమంచము పోడిమైదువుం, బూనినప్రాంత వేల్పుం గని పోకులం బోయిన వెన్నుండి ట్లనన్.
ఉ. హరి. ౨. ౧౭౨.

క. ఒకచోటం బవ్వఁబందిరి, యొకచోం జప్పరము దూగుటుయ్యెల యొకచో, నకి

నెలఁగిలిగిలిమంచము, బొకచోఁ గప్పురపుఁ
బలుఁగు టోవరి యొకచోట.

వైజ. ౩. ౧౪౮.

మ. కేఁ కొరవుంగుంపటిమంచ మెక్కిరి
ప్రభుత్వైకాప్తి ర ద్గజడిన్.

ఆము ౪. ౧౩౪.

గీ. కంకటియు మంచమును జెల్లు ఖట్వమనఁగ.

సాం. ని. స్థా. ౭౪.

**మంచముపట్టు = వ్యాధిగ్రస్తుఁడగు.**
(వ్యవ.) మగఁడు మంచము పట్టినప్పటి నుండియు ఆయిల్లాలికి నిద్రాహారములు లేవు

**మంచము.** సం. వి. అ. పుం. ౧. పర్యంకము, మంచము. ౨. ఉన్నతాసనము, సింహాసనము. ౩. అరప, పొలములోఁ గాచువాఁడు కూర్చుండుటకై యెత్తుగాఁ గట్టిన చప్పరమువంటిది. ౪ ఆసనము, పీఠము. ౫ (సంగీ) ఒకానొక కొలత. ౬. మేడమీఁది గది. (వై. ని.)

**మంచి.** వి. ౧ మేలు, లగ్గు, శుభము.

ఉ. మంచిగ మేనమత్తలు సమాదరణంబడ
రంగఁ జెట్టిపుత్తెంచిన మంచిభక్ష్యములు.

హర. ౨. ౧౦౨.

౨. పాపము, కలుపుఁగోలుతనము (చతురుపాయములలో నొకటి.)

సీ. చతురుపాయంబుల సంజ్ఞనై వం చీగి
వేలుకొట్టిన నాల్గు వేలువేలు తవరు
చుండు         అం. భా. ౨. ౧౯౦.

౩. సజ్జనుఁడు.

సీ. . మంచివాఁడు సరువు మంచి సాదు,
వన సజ్జనుం డొప్పు .

అం. భా. ౨. ౧౭౦.

విశే. ౧. యోగ్యము.

(క.) మేలైనది, లెస్స.

గీ. గండెయును వల్లభాఁరగాఁడు కీరియును,
హాటియునై పోవుటయు మంచి దను
యుఁగంబుఁ.         ఆము. ౫. ౪౧.

(చ) మనోజ్ఞము, ఇంపైనది

సీ. కందాగ ల్పితల్పదికాగ మొందింపఁగా
మంచి పున్నమచందమామ రావ.

దశా. ౩. ౩౫.

(ట) అనుకూలము, ఫలకారి.

సీ. హల జీవి సందోహములకు బలాకకావిడ
రం..లకు మంచివెదలు దొరకె

ఆము. ౪. ౧౨౩.

క. దేవాధిప మంచియుక్తి దెలిపితి విచట౯.

దశా ౨ ౧౪౩.

(త) ఇష్టము, ప్రియమైనది.

గీ. ఆత్మ నూహింపఁగా నుపాయములలోన,
సెప్పటికి సామ ముచితంబు నృపవరేణ్యా,
దాని చిత్తంబు రంజిల్ల మంచిమాట, లాడి
వడిఁ దెత్తు నను బంపు మవధరింపు.

వరాహ. ౫ ౯.

క అన విని నీవా యెవరో, యని యుంటివి
మంచికార్య మాయెను

దశా. ౧. ౨౯౫.

(ప.) ప్రశస్తము, శ్రేష్ఠమైనది.

క. నాకంబునయందును భూ, లోకంబున
యందు ధనములు మణులు నైకాగ్ర్యనీకంబు
దేర మంచివి, నైకొని యాచంద్రముఖికిఁ
గానుక యిచ్చెన్         ఉ. హరి. ౧. ౯౩.

గీ. .. మంచి పనసపండుల మెసంగు, జాణ
లకు మావిపండులు చవియు కాదె.

నీలా ౨ ౩౧.

(గ ) ఇతర పదార్థములు కలియనిది, స్వచ్ఛమైనది.

ఉదా. మంచిపాలు, మంచినెయ్యి మొ.

(ఆ) ఘనము, గొప్పది, అధికము, అత్యంతము, మిక్కిలి.

ఆ. ఘనబలంబునందు మంచిమగల్ పాలఁగలిగి యీ బలంబు గెలువ లేమి సైకత్యము గాదె తలపఁ జోద్యము మన్న, రోయుఁగఁ జెప్పె కదురుఁ డిట్టు లగుట.
భార. భీష్మ. ౨. ౩౫౨.

(ఈ) సందర్భానుసారముగ నిది పెక్కితరార్థముల నిచ్చును.

(చూ. మంచిగంధము, మంచినీళ్లు, మంచిముత్తెము మొ.)

౨. ఇది 'కని', 'కాని' పదములతోఁ గూడి విశే. మైతెస్సగా, బాగుగా, యథావిధిగా, స్నేహముగా, జనప్రియముగా, మున్నగు నర్థముఁ నిచ్చును.

ఉదా. వాఁడు బ్రతికియున్నకాల మంతయు మంచిగా వెళ్లఁబుచ్చుకొన్నాఁడు.

ఉ. మంచిగ భూరిభూసురసమాజము నెల్లను భక్తితోడఁ బూ, జించి యభీష్టదానములు చేసి
భార. సభా. ౧. ౧౬.

చ. నీ, వనమున ధర్మమునం హితము మంచిగఁ జూచి విధించినట్లు చే, సి నెగడువారు గాక నిముఁ జేరిన నాపద లొందఁ జేర్చునే.
భార. ఉద్యో. ౩. ౨౦౪.

ఉ. మానసకృత్యములే సురసమాజ మెఱుంగఁగఁ జాలఁ గావునన్, మానస మెక్కుడైనఁ జన మంచిగఁ జేసిర యోని యజ్ఞమున్
భార. అను. ౫. ౨౦౦.

ఉ. మంచిగ వేనయుత్తలు సమాదరణం బడరంగఁ బెట్టి పు, త్రెంచిన మంచిభక్ష్యములు
...ర. ౨. ౧౮౫.

సీ. తగువాఙ్మనూయాణముగ నొనరించె మంచిగ నేల వాలుఁగు చెఱఁగులకును.
భార. విరా. ౫. ౩౨౦.

మంచికుక్క = వెఱ్ఱియెత్తని కుక్క.

(వ్యవ.) వెఱ్ఱికుక్కలను జంపుదురుగాని మంచికుక్కలను జంపరు. ఇట్లే మంచిగక్క మొ. (బ్రౌ.)

మంచినిద్ర = గాఢసుషుప్తి. (బ్రౌ.)

మంచినీళ్లు = పానయోగ్యము లగు తియ్యనిజలము. (శ. ర.)

మంచినూనె = నువ్వులతైలము. (బ్రౌ.) తలంటుకొను తైలము అని (శ. ర.)

మంచిపాము = నాగుఁబాము, త్రాఁచు. (శ. ర. బ్రౌ.)

మంచిబంగారము = (చేతబంగారము, పూఁత బంగారము, కాకిబంగారము కాని) బంగారము, స్వర్ణము. (బ్రౌ.)

మంచిబెల్లము = చెఱకురసముతోఁ జేసిన బెల్లము.

మంచిమూట్టు = (మంచి + మట్టు) శుభప్రదమైన పెద్దలస్పర్శము; శుభప్రదమైన మూలిసోఁకు

సీ. గవలధూపంబు సంఘటియించువారును మంచిముట్టెడఁద యోజించువార.
శివరా. ౨. ౪౦.

మంచిముత్తెము = శుక్తి మున్నగువానిలో సహజముగాఁ బుట్టు ముత్యము. (అకృత్రిమమైన మౌక్తికము.)

(స. ర.) (ఇట్లే మంచిపగడము మొ.)

మంచివాన = అధికవర్షము. (బ్రౌ.)

జ మంచిగంధము, మంచితనము, మంచిది, మంచిదె, మంచినీళ్లు, మంచిమాట, మంచిముత్తెము, మంచివాఁడు, మంచికరలు.

**మంచిక.** సం. వి. అ. స్త్రీ. ౧. ఉన్నతాసనము, కుర్చి. ౨. ద్రోణి.

**మంచికుందెన.** వి. (మంచి + కుందెన) వృక్ష విశేషము. ఒకజాతి చిన్న చెట్టు.

సీ. పొలఁగ విమలదారి పెత్తికుందెన మంచి కుందెన కలబంద గువ్వగుత్తి.
హంస. ౪. ౧౦.

**మంచిగంధము.** వి. (మంచి + గంధము) శ్రీచందనము. కై. సానమీఁద తీసిన చందనము.

సీ. మంచితావులు గ్రమ్మ మంచిగంధమ్మున నటకలి యిడితొఁ దొయ్యలి యొకర్తు.
యయా. ౪. ౮౮.

మంచిగంధపొడి = శ్రీచందనచూర్ణము, మంచి గంధపుగుండ.

వ. తట్టుపునుంగు నగురుకస్తురి మంచిగంధ పొడి చాదుదయభాస్కరంబు లోనుగాఁ గల పరిమళద్రవ్య సంభారపరంపరలును... కూఁతునకు వరణంబుగానిచ్చి .
మనుచ. ౫. ౧౦౧.

**మంచితనము.** వి. (మంచి + తనము) ౧. యోగ్యత, సౌజన్యము.

ఉదా. అతని మంచితనమే యతనిని గాచుచున్నది.

౨. కలుపుగోలుతనము, సాము.

గీ. మంచితనమున నీతి బోధించువాఁడ, పోలెఁ దన యాగ్రహమును కూలితోడి, చెలిమి యును గల్గి బలిమియుఁ దెలుపఁ బంచినాఁడె మీదార నాచెంత నానలేక.
ఉ. రా. ౨. ౩౨౦.

౩. గొప్పతనము.

ఉ. ... పేఁడు కా, మంచితనంబునం బిలుకు మాలిననాథుని నుగ్రకర్ములకా, మంచుని నుండుపోలెఁ బరిమార్చు మహాబలుఁజూచి.
భార. అశ్వ. ౪. ౬౩.

(ఇట. పరాక్రమాతిశయమని భా.)

**మంచిది = మంచిదె.** వి. (మంచి + అది). మేలు, క్షేమము, కుశలము, శుభము.

సీ. శౌనకా సుఖమె విశ్వామిత్ర లెస్సలా కణ్వ మంచిదియె భార్గవ శుభంబె .
వాల్మీ. ౧. ౪౩.

విశే. యోగ్యము, ప్రశస్తము మొ.

ఉదా. ఆమె మిక్కిలి మంచిది, ఈ పండు మంచిది. నీవు చేకొనిన సంకల్పము మంచిది

అవ్య. వల్లె, సరియె. (క.) అంగీకారమును దెల్పును.

క. మంచిది యటువలెఁ జేసెద, వం చానతి యిచ్చె దేని యది వినికింతున్.
దశా. ౩. ౩౨.

(చూ. ౩. ౩౧.)

క. అని ప్రార్థించిన మంచిది, యని రాజకుమారకునకు సాంగంబుగ న, య్యని శేఖరుఁ డుపదేశం, బానరించె సమస్త విద్య లుద్యత్ప్రీతిన్. కవిరా. ౨. ౨౯.

(వ్య.) ఓఘిషికను (భయపెట్టుటను) దెల్పును.

సీ. ఎందాఁకఁ గొంచుఁ బోయెదవు మంచిది పొమ్ము నిను బ్రాణనిత్తుమే యనిడివారు.
దశా. ౨. ౯౨.

**మంచిదె(దే) = మంచిది.** అవ్య. (మంచిది + ఎ) వల్లె, సరియె, అంగీకారార్థకము.

ఆ. మంచిదె యన వల్లె యంచనంగను నిన్, రెండు నమము లగుచునుండు ...
ఆం. భా. ౩. ౭౫.

సీ. మంత్రుల కాతిఁగింప మంచిదే యనుటగా కవ్వరుఁ దెల్ప రదేమొ కాని.
దశా. ౨. ౯౪.

**మంచినీళ్లు.** వి. బ. (మంచి + నీళ్లు) పానయోగ్యములగు జలము. (శ. ర.)

**మంచిమాట.** వి. (మంచి + మాట) ౧. సుభాషితము, ప్రియభాషణము.

ఉదా. పెద్దలతో సంభాషించునప్పుడు నోటినుండి మంచిమాటలను రానియ్యవలెను. గాని చెడ్డమాటలు రానీయఁ గూడదు.

అతనితో నాలుగుమంచిమాట లాడి వాఁడు తనకార్యము నెఱవేర్చుకొన్నాఁడు.

౨. స్నేహము, పొత్తు, సంధి

ఆ. మోము చందమామతో మంచిమాటకుఁ, దమ్మి లనుప పేకతమున కున్నరాయబారి తామర లనఁగఁ జెవిచెంత, నల్లఁ జేరి కన్ను లమరెఁ జెలికి. కకు. ౩. ౬౨.

వ్యవ. ఏలాగునను నీవు వానితో మంచిమాట చేసికొనుము.

**మంచిమాటచేసికొను** = భోజనముచేయు.

వ్యవ. మంచిమాటచేసికొని మఱియూరికి వెళ్లు.

**మంచిముత్తెము.** వి. (√మంచి) అకృత్రిమమౌక్తికము. (శ. ర.)

**మంచి(చె)యు.** వి. (సం. మంచః. క. మంచికె) జొన్నచేలు మున్నగునవి కాచుటకొఱకుఁ గూర్చుండుటకై యెత్తుగా వేయుచేప్పరము. అరప.

సీ. రథముపైఁ గనుపించురతిదేవి యన జొన్నచేను గాచుటకు మంచియు వసించు
శుక. ౨. ౪౧౦.

సీ. అతను సారథ్య కృద్రతిరేఖ మంచెపై నదిలించురోదఁ జిల్కపదువు పర్వ .
అము. ౪. ౧౬౩.

**మంచివాఁడు.** విశే. (√మంచి) సజ్జనుఁడు.

సీ. ... మంచివాఁడు పసువు మంచిపాదు, వన, సజ్జనుండొప్ప ..
అం. భా. ౨. ౧౬౦.

**మంచివిరులు.** వి. బ. (√మంచి) ధాన్యవిశేషము, ఒకజాతివడ్లు.

వ. సుఖభోగులు సన్నసూదులు గొరవంకరాజనాలు కొటుకరేకులు ముంగురుమొటికలు పసుపుముద్దలు మంచివిరులు రంభచెక్కుళ్లు.
ప్రబంధ. ౧౧౨.

**మంచు**[1]. వి. (క మంజు. త. మంజు.) ౧. హిమము, తుహినము. (దీని భేదములు. గడ్డమంచు, నీటిమంచు, పొగమంచు )

సీ. తోయజదళములతుది మంచు దొరఁగెడుగతిఁ గన్నుఁగవ నశ్రుకణము లురుల . .
భా౦ విరా. ౨. ౧౩౮.

సీ. మంచులప్పల మించు మండెంగమడుపులు పొరలి తెట్టువ గట్టునురువు లయ్యె ..
నైష. ౬. ౧౨౪.

౨. ఊష్మము, ఆవిరి ; లలాటప్రవద్ఘర్మతోయము.

దండకము దంష్ట్రావిస్ఫులింగంబులం జొయ్యెచుయ్యెంచు మంచుంబొగ లుప్పతిల్లఁగా ...
దశా. ౪. ౨౩౨.

౩. శీతకాలము, శిశిరఋతువు.

చ. చెట్లు వట్టి మనుప్రాఁతదళమ్ములతోడఁ దోలె నా, మనిదొర మంచురాజు మడి మంచ గఁ గోయిలగంట ప్రోయఁగన్.
మను. ౬. ౨౬.

గీ. తద్రతికిఁ గాఁగఁ జలికాలఁ దన్ని మంచు, పాండురాంగుండు విడిచి పో బ్రదికి మరుఁడు   అము. ౫. ౧౪౧.

జ మంచుఁగొండ, మంచుక, మంచుకారు, మంచుగుబ్బలి, మంచుగొను, మంచుతోదు, మంచుతెర, మంచువేల్పు, మంచైపోవు.

**మంచు³ = మనుచు.** మన్చు, స.క్రి. (√మను) మనఁజేయు. ౧. అన్నవస్త్రాదు లిచ్చి పోషించు.

ఉ. మంచి తనేకయాగముల మానుగ దక్షిణ లిచ్చి విప్రులన్
భార. ఆది. ౨. ౨౦౨.

౨. రక్షించు, కాపాడు.

గీ. అంచు నను మంచు వేడక నాన తిచ్చి .
దశా. ౧. ౧౬౫.

౩. ప్రోదిచేయు, పెంచు.

చ. అలఘుమరందవర్ష మహిమాతిశయమ్ముఖ సప్తలాద్యమం, దలతల మంచుపొన్నగమి దార్కొను పందిరిక్రింద వేదికం, దలతల మంచు మించు సువనవ్యరజంబులఁ దాల్చి తారలం, దలతలమంగు నొప్పెడుకన తృలికాతతి ముగ్గుపెట్టుచున్.
చంద్రి. ౪. ౭౦.

౪. మన్నించు, గారవించు.

చ. ఇతనికిఁ గూర్తు దేని ధన మిత్తు రభీష్టము లైనకార్యముల్, మతి నొనరింతు రిష్టుఁ డని మంతురు గాక మహాత్ము లైన భూ, పతులయు విప్రముఖ్యులసభన్
భార. సభా. ౨. ౧౦.

**మంచుఁగొండ.** వి. (మంచు¹ + కొండ) హిమగిరి, హిమవత్పర్వతము.

శా. మంచుంగొండ యనుంగుఁ బెండ్లికొడుకున్ మృధ్యాత్కన్నకొలంబు సే, వించున్
హర. ౪. ౩౩.

క. ... మంచుం, గొండకుతెం బూజసేసఁ గోర్కులు నిండున్ . భీమ. ౬. ౪౩.

మ. ... ఇమ్మంచుఁగొం, డకు రాఁ జెల్లునె బుద్ధిజాడ్యజనితోన్మాదు ల్గదా శ్రోత్రియుల్. మనుచ. ౨. ౧౬.

ఇట్లే మంచుగట్టు, మంచుగుబ్బలి, మంచుమల మొ.

గీ. కనకకశిపుండు ధీరుండు గనుకఁ గడఁగి, తపము సేయంగఁ దొడఁగె నాతపము కేతు, మంచు సెంచక గదలని మంచుగట్టు, దారి దారితకుధర మదారిభిదుర.
దశా. ౪. ౨౪.

గీ. మంచు గుబ్బలిరాజుకుమారిఁ గూడి, వేలుపులపెద్ద జముదెస వెండికొండఁ, దన్నుఁ దెలిసినవారికి నన్నిదెసలఁ, దాన యగురీతి బహువేషధారి యగుచు.
కాశి. ౧. ౧౦౧.

మంచుఁగొండచూలి = పార్వతీదేవి.

ఆ. గొడుగు వట్టికటువు కుజ్జుఁ డై చనియెను, శూలి మంచుకొండ చూలికడకు .
వీర. ౨. ౨౪౯.

మంచుమలపట్టి = పార్వతి.

సీ. చెలికత్తె యగుమంచు మలపట్టి పోరామి గీలుకొల్పిన రాయగేస్తురాలు ...
ప్రబంధ. ౨.

**మంచుక.** వి. (మంచు¹ + ఉక - స్వార్థమున)

ఉ. మాలి శరంబు లొక్కుమొగి మంచుక గప్పినమాడ్కిఁ గప్పడున్, గూలఁగఁజేసె వానిరథఘోటములన్ హరి ..
నిర్వ. ౩. ౨౬.

**మంచుకారు.** వి. (మంచు¹ + కారు¹) హేమంతఋతువు.

సీ. మంచుకా రనఁగ హేమంతర్తు వగు ...
ఆం. భా. ౧. ౭౬.

**మంచుకొను.** అ. క్రి. (మంచు¹ + కొను) మంచు కప్పినది యగు.

చ. వనజము లెల్ల మంచుగొని వాడినచో నొక పువ్వు నిల్చినం ... కు. సం. ౬. ౪౭౫.

**మంచుచెం(చుం) జోదు.** వి. (మంచు[1] + జోదు) చంద్రుఁడు.

మ. శుకమా పల్కు కళంకు గన్పడని మంచుం
జోదునందంబె సె, మ్యోకమా ...
శ. హరిశ్చ. ౨. ౪౪.

**మంచుచేతతి.** వి. (మంచు[1] + తతి) హేమంత ఋతువు. (శ. ర.)

**మంచువేల్పు.** వి. (మంచు[1] + వేల్పు) హిమకరుఁడు, చంద్రుఁడు.

గీ. మంచె మంచుల మించుల మంచువేల్పు,
కలిసె వికృతాకృతులను రాత్రిచయంబు.
శ్రీరం. మా. ౪. ౯౭.

**మంచై (చేయి) పోవు.** అ. క్రి. (మంచు[1] + ఐ + పోవు) మంచువలె విరిసిపోవు, తొలఁగి పోవు.

శా. గాయత్రీజప మాచరింప శుభసాకల్యంబు
సిద్ధించు వా, క్యాయాది ప్రభవోగ్రపాప
మడఁగుం గైవల్యమున్ వచ్చు దీ, ర్ఘాయు
ష్యంబు లభించు రోగములు మంచైపోవు
సేమంత్రముల్, గాయత్రీపర నాయుతాంశ
సమముల్ గా లేవు ధీరోత్తమా.
జాహ్నవి. ౩. ౫౯.

ద్వి. పండితారాధ్యులఁ బ్రస్తుతించి వను,
మండెడిదావాగ్ని మంచయిపోవు.
పండితా. దీక్షా. ౨. పా. ౨. పం.

**మంజరము.** సం. వి. అ. న. ౧ పుష్పగుచ్ఛము, పూలగుత్తి. ౨. మౌక్తికము, ముత్తెము. ౩. తిలకవృక్షము.

**మంజరి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. పల్లవాంకురము, లేఁతచిగురు, వేపరెమ్మ. ౨. పూలగుత్తి. ౩. మౌక్తికము, ముత్తెము. ౪. లత, తీఁగె. ౫. తులసి కి. ౬. తిలకలత. ౭. (ఛంద) ఒకానొక వృత్తము. ౮. తెల్లగన్గర. కి. (వై. ని.)

**మంజరీక.** సం. వి. ఆ. స్త్రీ. ఒకజాతి పరిమళించు తులసి. కి.

**మంజరీనమ్రము.** సం. వి. అ. పుం. వేతసము, నీటిప్రబ్బలి. కి.

**మంజెలి.** వి. (క. మంజళ్. త. మంజళ్.) ౧. పసుపు, హరిద్ర.

వ. అపరంజినక్కులవలె రంజిల్లు మంజెలికావు
రూపుచెక్కులు . . ప్రభం. ౭౮.

౨. ఎఱ్ఱవిమన్ను, తిరుచూర్ణము.

ద్వి. అరచందురునికి వింతైన సెన్నొసల, సన్నపు
రేఖ మంజలికావుతోడఁ, దిన్నని తెలిగీరు
తిరునామ మమరఁ
ద్వి. పరమ. ౩. ౧౯౨. పా. ౧౩. పం.

**మంజెస = మందస.** (సం. మంజూషా, ప్రా. మంజూసా.) మందసము, పెట్టె.

ఆ. మూతఁ దెరుగుదెంచి చూచి రత్న, పుంజ
భరిత మైన మంజసలో నున్న, కొడుకు
దానితోన కొనుచు వచ్చి.
భార. ఆది. ౫. ౩౧, ౩౦.

**మంజాడి.** (లి.) వి. (క. మంజాడి. త. మంజాళి.) బంగారము రత్నములు మున్నగు వానిని తూఁచుట కుపయోగించు సెట్టిగింజెలు గల గురువెందచెట్టు వజ్రప్రమాణవిశేషము, వజ్రములయెత్తు. (బ్రౌ.) వజ్రముల తూనిక. (శ. ర.)

సీ. పొలుచును వజ్రంబు మూలరా లవి ...
మంజాడి నాఁ దత్ప్రమాణ మొప్పు ...
ఆం. భా. ౨. ౨౭౫.

**మంజి.** సం. వి. ఇ ఈ. స్త్రీ. ౧. పూలగుత్తి. (త్రి. ని.) ౨. ఆఁడుపేఁక. (వై. ని.)

మంజిక. సం. వి. ఆ. స్త్రీ. వేశ్య, లంజె.

మంజిటి. వి. మంజిష్ఠ. కే. (శ. ర.)

మంజిడి. వి. (సం. మాంజిష్ఠమ్. బ. మంజిడులు, మంజిళులు, మంజిళ్లు.)

౧. మాంజిష్ఠవర్ణము, ఎఱుపువిూచిన పసుపువన్నె.

గీ. మడతపనిమిడిగింటెకుల్ మంజిడి జిగి, దోమతెరమంచేములు హసంతులుజవాది, యగలుసిరులు చిన్నెలు గాఁగ నలఁదు గడపెఁ, జెలిసెలలు తద్వధూకుచశరణుఁ డగుచు. కళా. ౭. ౧౫౧.

గీ. . అంబరంబు, తనకు దిక్పద్మనయన లెత్తినమెఱుంగు, లడరు మంజిడివన్నె యుల్లడ యనంగఁ, దనర నొయ్యనఁ గుండినమునకుఁ జనియె. చంద్ర. ౫. ౨౦.

సీ. నడిముక్కుమీఁద సన్న పునాభిసామంబు నడుమ మంజిడికాలి నిడుదరేక,

గీ. పూని నిక్కంపుదాసరిసానిపోలె, విప్రనారాయణారామవీధిఁ జొచ్చె. వైజ. ౨ ౫౪.

౨. చిత్రవర్ణవస్త్రము, వివిధవర్ణములు గల బట్ట. (ఈశ్వరుని వర్ణనము.)

సీ. బలుమంమఁగంబాల బలిసి రాఁ జుట్టిన క్రొత్తమంజిడిబాగుఁ గొఱఁక సేసి . .

గీ. తొడలఁ బాడలతోలు

ఉ. హరి. ౨. ౧౭౧.

సీ. మక్కళించినరావు మంజిళ్లపెంజెర లంగరంబులు బట్టి రొత్తువారు.

నైష. ౬. ౧౦౫.

(మంజిష్లి = చిత్రవస్త్రములు - అని వ్యాఖ్య.)

గీ. జిలుగువన్నెలు మంజిళ్ళు చిలుకచాలు, మొదలు గాఁగను జదివించి రవను వేచి, యనుఁగు లగు నేలజేండ్లు యయాతి కపుడు. యయా. ౪. ౧౨౦.

౩. ఎఱుపు మించినపసుపువన్నె గలవస్త్రము, మాంజిష్ఠము.

సీ. . మాంజిష్ఠము మెసఁగును మంజిడి యన . ఆం. భా. ౨. ౧౫౪.

౪. నీలవర్ణవస్త్రము.

సీ. వృష్టిగా కుద్దాంబువేణి మజ్జన మార్చి శిఖరి మేఘముగ మంజిడి ఘటించి ...

పాండు. ౨. ౧౦౯.

విశే. ౧. చిత్రవర్ణము గలది.

క. అచ్చట నచ్చట నిడుపుగ, విచ్చినఁ గుసుమాత్రకాత్ర వేదుల మనముల్, మెచ్చించుఁ దెరలమంజిడి, పచ్చడములు చతురగీతి బంధంబులతోన్.

నైష. ౭. ౧౫౫.

౨. ఎఱుపు మించినపసుపువన్నె గలది.

సీ. మంజిడి మొకమాలు మాదావళంబులు మలుక పూవన్నెలు ముత్తెసరులు.

ధనా. ౩. ౩౮.

మంజి (జీ) ఫల. సం. వి. ఆ. స్త్రీ. కదళి అరఁటిచెట్టు, (త్రి. ని.)

మంజిమ. సం. వి. న్. పుం. మనోజ్ఞత, అందము.

మంజిష్ఠ. సం. వి. ఆ. స్త్రీ. మంజిడి, వికస. కే.

మంజిష్ఠామేహము. సం. వి. అ. పుం. మూత్రరోగభేదము.

మంజిష్ఠారాగము. సం. వి. అ. పుం. ౧. మంజిష్ఠాలతనుండి తీయుచెల్లునిరంగు. (ఇది మిక్కిలి కాంతిమంతముగ నుండును. ఈ రంగు వేసిన బట్టలు వెలిసిపోవు.)

౨. మంజిష్ఠావర్ణమువలె స్థిరముగాను స్ఫుటముగాను నుండు పూర్వానురాగభేదము. శ్రవణదర్శనములవలన నాయికానాయకుల హృదయములలో జనించి కలయికకుఁ బూర్వమందు వారి కనుభూత మగుదశా

సీ. వంటమారితనంబు మానికిఁ దగ పౌస
యూర్వులో నీవంటియోగి కలఁడె.
ప్రభు. ౩. ౪౦. పా. ౨౭. పం.

**మంటిగుఱ్ఱాండ్లు.** వి. బ. (మన్ను1 + గుఱ్ఱు) బాల క్రీడావిశేషము.

సీ. గచ్చకాయలు కిట్టుగానుఁగ త్రిప్పుళ్లు గుజ్జి
పెళ్ళుడు మంటిగుఱ్ఱాండ్లు ..
హంస. ౩. ౧౪౬.

**మంటితిండి.** వి. (మన్ను1 + తిండి) తేలు, వృశ్చికము.

గీ. .. ములుపుర్వు మంటితిండి, తే లనఁగ
వృశ్చికంబు వర్తిల్లు ..
పాం. ని. నానా. ౮౩.

**మంటినూనె.** వి. (మన్ను1 + నూనె) మృత్తిక నుండి తీసెడు ఒక విధమైనచేమురు. (శ. ర. మట్టినూనె అని వాడుక.)

**మంఠము.** సం. వి. అ. పుం. వండిన తీయని భక్ష్యవిశేషము, పక్వముచేసిన భక్ష్యవిశేషము. (రా. ని)

**మండ.** వి. ౧. చిరివిగానుండు కమ్మ, వితత శాఖ.

గీ. ... మండ యనంగను వితతశాఖ, పర
గును .. ఆం. భా. ౨. ౩౯.

... తనకు వసము పెరుగ వెణ్డిమణ్డలో నఖ
ణ్డతరద్యుతిదీప మమర నిచ్చె విమలకమల
నేత్రి. దా. శా. ౧౦౦౭.

(వెండిమండ = వెండితోఁ జేసిన పెద్దకొమ్మ.)
శాఖ అని (శ. ర)

౨. శాఖనుండి బయలుదేఱుశాఖ, ఉపశాఖ.

వ. .. తమతమకట్టిన మోటుకత్తుల నొండొండ
ఖండితంబు లగు మండగల కంపమండలం
ద్రోచి . మనుచ. ౪. ౩౭.

**మండ**[1]. వి. (√మండు) ౧. తప్తలోహము.

క. మమఁద ప్తలోహాఖ్యమండనంగ ...
ఆం. భా. ౨. ౨౭౫.

౨. వేఁపుడుచెట్టి. (బ్రా.) ౩. వేఁపుడుకుచ్చు. (శ. ర.)

**మండ**[2]. వి. ౧. చీలమండ, గుల్ఫము. (శ. ర)

౨. మణిబంధము, వనికట్టు.

(వ్యవ.) ౧. వాఁడు మండ మునుగ మజ్జిగ
పోసికొనును. ౨. నా వస్తువులు తాఁకిన
మండలు విఱుగఁగొట్టెదను.

౫ మండవాయి, మండాటము, మండాను.

**మండ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సారాయి, సుర.

౨. ఆమలకి, ఉసిరికచెట్టు (మే. ని.)

**మండకంచెము.** వి. (మండ2 + కంచము.)

అంచుకట్టిన కంచము. (శ. ర. బ్రా.)
అంచులేనికంచము, ఆకుకంచము. (వా.)

**మండకము.** సం. వి. అ. పుం. ౧. పిష్టభేదము, ఒకరకపు వేఁచినపిండి, మండిగె.

౨. పలుచనికొట్టె లేక భక్ష్యము. ౩. (సంగీ) గీతాంగవిశేషము. ౪. మాధవీలత. (కల్ప.)

**మండనము.** సం. విణ. (అ. ఆ. అ) అలంకరించునది.

వి. అ. న. ౧. అలంకరించుట. ౨. అలంకారము.

**మండపకము.** సం. వి. అ. పుం ౧. చిన్న మండపము; చిన్నశాల. ౨. చిన్నగుడారము, చిన్నతేరా.

**మండపప్పు.** వి. (మండ1 + పప్పు.) వేఁపుడు పప్పు.

సీ. లడ్డువంబులు చక్కిలాలు మోరుండలు
ఖండంబు చలిమిడి మండపప్పు. గీ. లు ..
హర. ౬. ౫౫.

**మండపము.** సం. వి. అ. పుం. న. ౧. వివాహాదికార్యములయందుఁ దాత్కాలికోపయోగమునకై చేయఁబడిన గోడలులేని చావడి, చవికె. (వివాహమండపము మొ.)

౨. గుడారము, డేరా. ౩. పొదరిల్లు. (లతామండపము.) ౪ దేవతావిగ్రహము లుంచుటకై చుట్టును దెఱపిగ నుండునట్లు స్తంభములమీఁదఁ గట్టినకట్టడము.

**మండపి.** సం. వి. ఈ. స్త్రీ. చిన్నమండపము.

గీ. గర్భమండపికిఁ గడిగిన కలఁకజలము
ఆము. ౬. ౧.

**మండపీఠిక.** సం. వి. ఆ. స్త్రీ. దిగ్వ్యగ్రము, రెండుదిక్కుల సముదాయము. (వై. ని.)

**మండ (డా) ము.** వి. (త. మండా.) చేఁపలకు బొడుచు చిల్లకోల. (శ. ర.)

**మండము.** సం. వి. అ. పుం. న. ౧. ద్రవపదార్థములపైఁ దేలినమసఁటు, నేయి మొదలగుదానిపైఁ దేలిన తెట్టె, ౨. గంజి. ౩. పెరుగుమీఁది మీఁగడ. ౪. పంచమాషపరిమితోర్ధ్వమానము.

పుం. ౧. అలంకారము. భూష. ౨. కప్ప, (కల్ప.) ౩. ఆముదపుఁజెట్టు. ౪. ఆమలకి, ఉసిరిక ౘె. (మే. ని.) ౫. రశ్మి. కిరణము. (కే. ని.)

**మండయుంతము.** సం. వి. (అ. పుం.) అలంకారము, నగ.

౨. ఆహారము, భోజనము, (కల్ప.) ౩. (స్త్రీ.) సమాజము (కల్ప.)

**మండయుంతి.** సం. వి. ఈ. స్త్రీ. అఁడుది. స్త్రీ.

**మండయుంతుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.)

౧. నాటక మాడువాఁడు, నటుఁడు. ౨. విత్తపాలుఁడు ధనమును రక్షించువాఁడు.

అ. పుం. ౧. అద్దము. ౨. అన్నము.

**మండలకము.** సం. వి. అ. న. ౧. వలయము.

౨. బింబము. ౩. జిల్లా, దేశభాగము. ౪. సమూహము, గుంపు. ౫. వలయాకారవ్యూహము, గుండ్రముగా సైనికుల నేర్పఱచుట. ౬. గుండ్రనిమచ్చలుగల తెల్లకుష్ఠము. ౭. అద్దము. పుం. కుక్క.

**మండలపత్త్రిక.** సం. వి. అ. స్త్రీ. రక్తపునర్నవ, ఎఱ్ఱగలిజేరు ౘె. (రా. ని.)

**మండల పుచ్ఛకము.** సం. వి. అ. పుం. కీటవిశేషము.

**మండలము.** సం. వి. అ. న. ౧. పరివేషము.

౨. దేశము. ౩. కుష్ఠము. ౪. విలుకాఁడు రెండుకాళ్లతో మండలాకారముగా నిల్చుట. ౫. పన్నిద్దఱురాజులు. పుం. ౧. సమూహము. ౨. వలయాకారముగా దీర్చిన యొకవ్యూహము. ౩. కుక్క.

పుం. స్త్రీ. న. సూర్యచంద్రాదుల బింబము. (శ. ర.)

**మండలాగ్రము.** సం. విణ. (అ. ఆ. అ.) గుండ్రని కొనగలది.

వి. అ. పుం. ఖడ్గము, కత్తి.

**మండలి.** సం. విణ. (న. నీ. న.) ౧. వలయాకారముగా నేర్పడినది; చుట్టగాఁ జుట్టఁబడినది. ౨. ఒకదేశమును నేలునది.

వి. న. పుం. ౧. సర్పవిశేషము, గోనసము. ౨. సర్పము. ౩. పిల్లి. ౪. కుంచము. ౫. కుక్క. ౬. సూర్యుఁడు. ౭. మఱ్ఱిచెట్టు, వటవృక్షము. ౮. జిల్లాయొక్క లేక దేశభాగముయొక్క పాలకుఁడు. ఏలిక.

ఈ. స్త్రీ. ౧. దూర్వ, గఱిక కీ. ౨. కమాహము. ౩. బింబము. ౪. సర్పభేదము. ౫. ఆవలి, వరుస. (శే. ని.)

**మండలికుఁడు.** సం. వి. అ. పుం. మండలము (దేశములోని కొంతభాగము)నకు అధిపతి. (చూ. కౌముదీ. ౫. ౨. ౧౧౫. సూత్రము మత్వర్థీయములో.)

సీ. ద్రవిడమండలికు లందఱు దక్కఁ గెలిచి . దశ. కు. ౧. ౧౬.

(దక్కఁ జేసె. ఆని. తాళపత్రప్రతి. ఆ. ని, బిబి యన్నులు "మాండలిక" అనురూపమే గ్రహించినారు. ఇట "మాండలికు లందఱు" అన్నను ఛందోభంగము కాదు. ఐనను రెండు ముద్రితప్రతులందును పదము హ్రస్వాదిగానే యున్నది.)

**మండలితము.** సం. విణ. (అ. ఆ. అ.) వలయాకారముగాఁ జేయఁబడినది. గుండ్రముగాఁ జేయఁబడినది.

**మండలేశ్వరుఁడు.** సం. వి. అ. పుం. అధీశ్వర సార్వభౌములకంటె విశిష్టుఁడైన రాజు. (శ. ర.)

**మండవాయి.** వి. (మండక + వాయి.) గుల్ఫవాయువను రోగవిశేషము, చీలమండల యందు గలుగు వాతరోగము.

గీ. మండవాయి యన స్వల్పమారుత మగు .. ఆం. భా. ౨. ౧౨౫.

**మండహారకుఁడు.** సం. వి. అ. పుం. కల్లు అమ్మువాఁడు, శౌండికుఁడు.

**మండాటము.** వి. (√మండాడ. త. మణ్ణాట్టం.) బతిమాలుట, దైన్యముతో యాచించుట.

వ. అమృతంబుపై వాశి పురలం ద్రిప్పుచు బొబ్బలులరీతి రొప్పుచు నొండొరులం దిప్పుచు నింక మండాటంబులు బండాటంబులు వృథాకొండాటంబులు మాని కార్యంబులు పూని ఉ. వి. ౨. ౩౬.

**మండాడు.** క. క్రి. (మండక + అడు. త. మణ్ణాడ.) అర్థించు, కోరు.

(క) దైన్యముతో యాచించు, బతిమాలు.

క మగనియెడ కోపి తమి న, య్యగుపరౌ నము వలచి వచ్చి మండాడినచోఁ, దగులు వడితి. శకాం. ౪. ౧౭౩. (బ్రౌ. పా.)

(గ.) అతి ప్రార్థనలచేఁ బీడించు.

క. దండక మనుకొవకుఁ జని, యుండఁగ రావణ నిచెలియ లొగిఁ గలయిక క్కై, దండకు రా లక్ష్మణుఁ డది, మండాడఁగ ముక్కుఁ జెవుల మనుకొస మాన్పెన్. యయా. ౩. ౧౬.

**మండి(డీ)** వి. (క. మండికే. త. మండి) ౧. యుద్ధసమయములయందు యోధులు నిలుచుండువిధములలో నొకటి.

("ఒకకాలు నేల మోఁకరించుట" (శ. ర. 'ఆలీఢపాదము'. బ్రౌ.)

౨. మల్లబంధవిశేషము.

వ. మండి దాఁటించియు ఉ. హరి. ౩. ౩౦.

౩. వల్లవిద్యావిశేషము, ఒకవిధమైనసాము.

సీ. కన్నాతలు పుటము లగ్గాలు మండీలు దాశాలు డీలు దంతెములును, లాఁగు లనంగను గాజిల్లుఁ దట్టేద, నామధేయంబు లెన్నంగఁ గొన్ని .. ఆం. భా. ౨. ౨౦౩.

జ మండిగాలు, మండిపెట్టు.

**మండి.** సం. వి. ఈ. స్త్రీ. = మండిక.

**మండించు.** క. క్రి. (√మండు.) ౧. మండునట్లు చేయు, ప్రజ్వలింపఁజేయు.

(వ్యవ.) విసనకఱ్ఱతో విసరి నిప్పు చేక్కు_ఁగా మండింపుము.

౨. కాల్చు.

సీ. కడుపు మండించు నాఁకటిచిచ్చు పెగ దాఁకి గడర సైయున్న కన్గవలవారు
సైమ. ౭. ౫౩.

౩. మాఁడుచు, తపింపఁజేయు, మిక్కి_లి బాధించు.

వ. .. అతిఘోర జఠరశుధాగ్ని తాపంబు నకుఁ దోడుగఁ దపన ప్రచండ కిరణకాండ ప్రకాండంబులు నెత్తి మండింప .
భీమ. ౨. ౧౦౧.

**మండిక.** సం. వి. ఆ. స్త్రీ. అన్నము నండి తీసిన కల్లు. (వై. ని.)

**మండిగంద్రలు.** వి. బ. ధాన్యవిశేషము, ఒక విధ మగు వడ్లు. (శ. ర.)

**మండిగము.** వి. (తె. మండాంగి.) వాకిటిక్రింద నడ్డుగా నమర్చినకొయ్య, గడపక్రింది త్రొక్కుడుకమ్మి, అట్టిక. (శ. ర.)

**మండిగాలు.** వి. (√మండి) మండి యేర్పడు నట్లుగా నుంచిన కాలు.

వ. . గెలుపుగాయంగలఁ బడియుండియు మండిగా లిడుకొని ... డువులు జేడిపించు కొనుచు కార్దాకారంబున నున్నవాఁడును.
కువల. ౨. ౧౪౭.

సీ. మండిగా లిడి దంతశంకాగ్రవాతిఁ జించి జలధరాంభముఁ గరుల్ చేల్లులాడ .
మనుచ. ౫. ౪౪.

**మండితము.** సం. విణ. (అ. ఆ. అ.) అలంక రింపఁబడినది.

**మండిపడు.** అ. క్రి. (మండి + పడు, స్వార్థ మున) ౧. కాలిపోవు, ప్రజ్వలించు.

క. శ్రీ తెరియు నొడలు దడిచినఁ, గోలంబక మూర్ఛుశేఖుల మండిపడుచున్, చాకుక్య విభునిఁ జూచిన, బాలికపరితాప మెన్నఁ బని లే దింకన్. కాశ్యా. ౧. ౧౧౩.

('కోలంబము లూగ్రశేఖుల మండిపడుచున్' అని ముద్రి. పా.)

౨. కనలు, మిక్కి_లి కోపించు.

మ. మహిషుం డప్పుడు జన్యభూమిఁ దనకుం బ్రొ పైనబల్విరు యు, జ్ఞవారుం జంపినఁ జూచి మండిపడి దోస్తంభంబునం ద్రిప్పి దు, స్సహభంగిన్ గద లైవ .
వరాహ. ౧౧. ౧౦౪.

క. కొసరువగమాట లలుకలుఁ, గుసిగుంపులు తిట్లు మారకొట్టులు జారం, డసమసుఖం బుగఁ గైకొను, బసవెద్దగుమగఁడు వండి పడుఁ గుసుహాంగీ. శుక. ౧. ౪౪౧.

వ. . మండిపడి చండి సకలవిద్యావిచక్షణు లైన భూసురాధ్యక్షుల నిశాసమయంబు నందక్షణియించి ... శై. భా. ౪. ౯౪.

**మండియ[1].** వి. = మండె.

**మండియ[2].** వి. (శ. మండి) దుకాణమునకై వేసినపాక.

సీ. గళ్లు మండియలును గూడారములును బందిళ్లును గలయ నెత్తించువారు
కు. సం. ౧౧. ౬౦౦.

(మండియ = చౌవడి. అని వ్యాఖ్య.)

**మండిలూటి.** వి. పైకి పొటమరింపక లోపల నణఁగి యుండుక్రణము.

కీ. మండిలూటి యనంగ మర్మవ్రణం బొప్పు ...
అం. భా. ౨. ౧౩౦.

**మండిపెట్టు.** అ. క్రి. (√మండి) ౧. ఒక కాలు మోఁకళించియుండు, అలీఢపాదమున నుండు.

(వ్యాకరణశాస్త్రమునందు ఒక పద మొక సూత్రమునుండి మధ్యసూత్రములలోని కను వర్తింపక దూరముగా నున్న సూత్రము లోని కను వర్తించినపుడు మండూకప్లుతి యందురు.)

**మండూకము.** సం. వి. అ. పుం. ౧. కప్ప. ౨. పీఠభేదము ౩. రాజరథులచే పురబహిర్భాగమున నుంపఁబడిన యంత్రభేదము.

౪. అ. న. (రతియందలి) బంధవిశేషము.

విణ. (అ. ఆ. అ.) గాఢశేజస్కము. (వాచ.)

**మండూకానువృత్తి.** సం. వి. ఇ. స్త్రీ. (వ్యాక.) కప్ప దాఁటువంటి అనువృత్తి, ఒక పదము ఒకసూత్రమునుండి మధ్యసూత్రముల విడిచి దూరముగా నున్న సూత్రములలోని కను వర్తించుట.

**మండూకి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడుకప్ప. ౨. ఏనుఁగు వెనుకకాలిమీఁది భాగము. (శే. ని.) ౩. మండూకపర్ణి. ౪. లాంగలావయవభేదము. (శే. ని.)

**మండూరము.** సం. వి. అ. న. లోహమలము, ఇనుముయొక్క కిట్టము.

**మండె = మండియ.** దే. అగిము పొడుపుగా పేర్చి పెట్టిన జొన్నకంకులు, పొగాకు మున్నగు వానియొక్క ప్రోగు.

గీ. . . మండె వసఁగను రాశిబద, ఎలమి
చెండు ఆం. భా. ౨. ౧౦౧.

**మండెఁగ.** దే. (సం. మండకః, క. మండగె, మండిగె. త. మండై.) మెత్తని గోధుమ పిండి, నేయి మున్నగువానితోఁ జేసినయొక విధ మగుపిండివంట, భక్ష్యవిశేషము.

(దీని భేదములు : కండమండెఁగ, కట్టుమండెఁగ, పప్పుమండెఁగ, బెల్లమండెఁగ, 'పంచదార వేయనిగోదుమపూరీ,' అని. శ. ర.)

సీ. వరుస మండెంగలు వడ్డింప నపతిత్తిమడ
తలో యని విప్పఁ గడఁగువారు
చమ. ౩. ౮౭.

సీ. చింపివల్కము లేమి చేసెడివనఁ గావు నెఱ
వైనకండ మండెఁగలు గాని .
హై. భా. ౭. ౨౦౪.

చ. పొసఁగిన పప్పుమండెఁగలుఁ బుక్కిటి
బంటిగ పెక్కు . ద్వా. ౨. ౧౭౨.

ద్వి. దవ్వులనైన శ్రాద్ధం బని విన్న, నవ్వడి
మున్న నే నచ్చేటఁ బోయి, పప్పుమండెఁ
గలును బాయసాన్నంబు, లప్పాలుఁ గొసరి
తృప్తిగాఁ దిందు.
నవ. ౩. ౧౫౪పా. ౨౩పం.

వ. ఇడె రమ్యాని కుపాయనంబులు మనోభీష్టం
బుగా ... బెల్లమండెఁగలు ..
రా. మా. ౨. ౧౧౫.

**మండెము = మాఁడెము.** దే. (సం. మండలమ్.) ౧. మన్నెపుప్రదేశము, దుర్గమస్థలము.

గీ. మన్నె మన మండె మనఁగను మాఁడె
మనఁగ, దుర్గమస్థలనామమై తోఁచు
చుండు. ఆం. భా. ౨. ౭.

౨. మండలాధిపతుల భూమండలము (శ. ర.)

**మండోదకము.** సం. వి. అ. న. ౧. సారాయి మీఁదిపొంగు, సురామండము. ౨. ఉత్సవసమయములయందు నేల గోడలు అలంకరించుట. ౩. చిత్రవర్ణము.

**మంద్ర.** వి. ఒకానొక ముండ్లచెట్టు.

గీ. మాద్పుచిటికొక్క సీకాయ మంద్రతోట్ల,
పిలఁగ వాఁకుడు . . మొదలుగా జగతిఁ
గల్గు, కంప లన్నియు .. హంస. ౪. ౯.

**మంద్రగబ్బ.** వి. నల్లని పెద్దతేలు.

సీ. .. మంద్ర, గబ్బనాఁ బృశ్చికాఖ్య
యొప్పు ... ఆం. భా. ౨. ౭౭.

**మంద్రాటకాఁడు.** విశే. (మంద్రాటము + కాఁడు.) పెనఁగులాడువాఁడు, ప్రతిస్పర్ధి.

గీ. అమ్మహాత్ముండు సకలలోకైక వినుతుఁ,
డౌర్వశేయునితోడి మంద్రాటకాఁడు,
నిష్ఠతోడుత నాశ్చర్యనియమవృత్తిఁ, దప
మనఘ నుండె నంబికారాధననిరూఢి.
ప. శకుం. ౨. ౧౧౦.

**మంద్రాటము.** వి. (√మంద్రాడు.) ౧. పెనఁగులాట, మల్లాట.

ద్వి. మంద్రాటముగ నిర్జితాంగంబు మోసవి,
గాంధ్ర పెట్టెడు పెద్దగండు మెకాలు.
ద్వి. శ. పా. ౨. ౬౮౯. పం.

౨. శ్రమము, బాధ.

శా. పంద్రెండేఁడులు నీగతిం జేనఁగ జంభ
ద్వేషి ముఖ్యామరుల్, మంద్రాటం బిది
యేల చెప్పెదము కామధ్వంసికి న్నేమముల్.
ఉ. హరి. ౨. ౧౬౪.

(సంతాపము అని శ. ర.)

**మంద్రాడు.** అ. క్రి. ౧. పెనఁగులాడు, మల్లాడు.

(చూ. మంద్రాటము, మంద్రాటకాఁడు.)

౨. శ్రమపడు, బాధనొందు, ('సంతాపించు' అని శ. ర.)

జ. మంద్రాటకాఁడు, మంద్రాటము.

**మంత్ర.** సం. వి. ఋ. పుం. ౧. ప్రజాపతి.

విశే. (ఋ. త్రి. ఋ.) ౧. ఏష్ట, కోరువాఁడు. ౨. జ్ఞాత. ౩. విద్వాంసుఁడు.
(శే. ని.)

**మంతనము.** వి. (సం. మంత్రణమ్. క. మన్తణ.)

౧. ఆలోచన; రహస్యాలోచన. (రాజులు)

సీ. మంతనంబుండి యమాత్యులతోడి పొత్తిం
తియ చాలు నింకేల యనుచు ..
భార. ఆది. ౨. ౨౧.

(మంతనమాండు = మంతనపడుండు.)

సీ. తగవు గా దనిరొ మంతనముండి వృత్రా
యనుచితం బనిరొ పాకశాసనుండు ...
కాశీ. ౪. ౨౧౫.

గీ. చేని మునులతోడఁ గూడి మంతన మొనర్చి,
వారుఁ దమరును జేని హిమవన్నగేంద్రుఁ,
గాంచి . జాహ్నవీ. ౧. ౭౩.

గీ. ఒకనితో మంతనముఁ గోరి నొకనిఁ జేరు,
మోపి నీకాంత యుసురసమ్మోహనముగ.
దశా. ౨. ౩౦౩.

౨. ఏకాంతము.

(౪) రహస్యప్రదేశము.

గీ. ఏమి చెప్పుదు మేకిమీఁద యుప్పు డొక్క,
కోఁతి యొందుండిరో రాపేగోతిఁ జేరి,
మంతనంబున నేమేమొ మాటలాడి.
అప్పా. రా. సుం. ౯౬.

క. అంతట నది యప్పుడె చేని, మంతనమున
గోడఁ జేరి మందోదరితో, నంతయును
దెలిపి క్రమ్మఱ, కాంతునికడ నుండె
గుట్టు కలయదివోలెన్. కుశ. ౩. ౨౪౬.

వ. కంఠగతప్రాణంబు లగుజంతువులకుం గాల
కంఠుండు గరుణావశంవదుం డై కర్ణోప
కంఠంబు జేరి యుపదేశించు తారకబ్రహ్మ
మంత్రరాజంబు మంతనంబున విని యొఱుం
గుటం జేసి మధుమదోల్లాసంబున నది వెల్లి
విరి సేయుచున్నవియో యన నిందిందిరం
బులు మంద్రస్వనమ్ముం గారంబు సేయు
కాశీ. ౨. ౪౪.

(౫) రహస్యవిషయము.

క. దంతిపురనాథ వినుమీ, మంతన మెల్లం
గింతు తనదివ్యంబులు మంచారో, పంతు
శభవంతుఁ జేయవు, కింతునిగురుభక్తి
నుక్తిఁ గలిగించుగతిన్. భాగ. ౬. ౫౪౮.

గీ. లీలఁ జేసిన్న గణితాగాలు గులికి, యుద్ధ
ఆకుఁ బెట్టి చుట్టి యూ కచ్చి యిచ్చి,
మగనికిన్ముమొగంబుగా మంతనంబు,
మాటగా నిట్టి లనిచె నమ్మాయజోటి
శ్రీక. ౮. ౯౮.

(ట) రహస్యసంభాషణము.

ఉ. కొందఱు మంతనంబులను గొందఱు జంకెన
వాఁడిచూపులన్, గొందఱుఁ జేతిసన్నలఁ
దగుల్పడఁ జేయుదు పారి. ౧. ౧౧౮.

చ. వల్లభుఁడు నోసతి యాయితపాటు
లెస్స యం, చు పయిశలోఁ గపోలములు
సోకఁగ మంతన మాడె నవ్వుచున్.
కళా. ౭. ౧౫౫. కాశీ. ౭. ౧౫౫.

**మంతరము = మంత్రము.** వి. (సం. మంత్రః)

౧. ప్రసవపోషణము.

(చూ. మంతరసాని.)

౨. ఇంద్రజాలము, కనికట్టువిద్య. (శ. ర.)

జ మంతరసాని.

**మంతరసాని = మంత్రసాని.** (క. మంతరసాని. మంతరము + సాని. వృత్తిని వర్ణలోపము.) సుఖముగా ప్రసవింప సహాయము చేసెడు చికిత్సకురాలు, సాధిక.

సీ. ఈయుము మంతరసానియొనుబలెఁ గను
ఓంకారఁ దోరంపుప్రసవాల విదూరభూమి.
పాండు. ౪. ౨౧.

ఉ. మైలపంతిలో, గంతులు సాగ వంత
యూను గానఁగ నగొ వ్యథ లెస్సఁ గోకఁగా,
మంతరసాని బుద్ధి క్షణమాత్రములో
మిను గల్గియుండినన్. ప్రబంధ. ౭౭౬.

గీ. ప్రసవమంత్రజ్ఞ దాఁ బరఁగు మంతర
సాని నా. జం. భా. ౨. ౧౧౦.

**మంతవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. తలఁపఁ దగినది, ఆలోచింపఁదగినది. ౨. ఊహ్యము. ౩. పోషింపఁదగినది, పోష్యము. ౪. అంగీకరింపఁదగినది, సన్మానింపఁదగినది.

**మంతి.** వి. ప్రసంగము, ప్రస్తావము.

ఉ. సంతతి లేనిదుఃఖమున సామజరాజ్య
ఘటాంతవైభవం, బెంతయుఁ గల్గియున్
సరసికేతుఁడు చిన్నఁగఁ బోయియుండెనే,
మంతిని బోఁటికత్తెలకు మానసవృత్తి
యొఱుంగఁ జెప్ప కే, కొంతమ కేశయ్య
పయిఁ గాంత గుణించు మనోరథాగ్రముల్.
శివరా. ౨. ౧౯.

(వ్యవ.) వారికి వీరికి నాలుగుకాలలనుండి మాట మంతి లేదు.

మాట మంతిలేకుండ ఆలాగున కూర్చుంటి వేమి?

**మంతిరి.** వి. (సం. మంత్రీ) ప్రధానుఁడు, సచివుఁడు.

సీ. తరుణి మహాప్రసాదం బని నీమాట మంతు
రుల్ శిరసా వహింతు రెపుడు ..
సారంగ. ౨. ౨.

(రావణుఁడు.)

మ. .. మహేశ్వరపూజానిధ్యవంబు మా
నక కరధ్యానంబునన్ జెంతమం, తురు
లన్ ఓల్చి ప్రవాహకారణము దోస్తో
నారయున్ బంచినన్.
ఉ. రా. ౩. ౨౨౦.

క. . సా, ల్యనిమంతిరి ధ్యమనాథుఁడు,
సునిశితగద చేనవర్చి సుమహితశక్తిన్.
భాగ. ౧౦, ఉ. ౮౭౧.

**మంతిరించు.** అ. క్రి. (సం. మంత్ర్. ధా.) మంత్రించు, మంత్రము వేయు, మంత్రోచ్చారణము చేయు.

(వ్యవ.) అతఁడు మంతిరించి తేలువిషమును దింపినాఁడు.

(స. క్రి.) ౧. మంత్రముచే శక్తి కలదానినిగాఁ జేయు.

(వ్యవ.) విభూతి మంతిరించి చల్లఁగానే ఆమెను పట్టినదయ్యము పాఱిపోయినది.

౨. మంత్రమువలె రహస్యముగా బోధించు.

'ఎన్నిమందు లిడితివో యేమి మంతిరించితివో. క్షేత్రయ. (శ. ర.)

**మంతు.** వి. (సం. మంత్రీ. క. మంతు.) ౧. అమాత్యుఁడు, ప్రెగ్గడ, మంత్రి.

క. మంతుల బాంధవభటసా, మంతుల నాశ్రితుల నిలిపి .. మనుచ. ౫. ౫౪.

క. చింతించి తనదుకోరికి, మంతుల కెఱిఁగించి గురుసమానవచశ్శ్రీ, మంతులగు నాగరకధీ, మంతులఁ బిలిపించి పలికె మధురతరోక్తిన్
చం. రా. ౪. ౪. అచ్చ. రా. కిష్కిం. ౬.

౨. ద్యూతమంత్రి, రాజునకు జూదమున వినోదము చేయువాఁడు.

సీ. ... మంతు నాఁగను ద్యూతమంత్రి యొకఁడు ప్రెగడ ప్రెగ్గడ యనఁదగుఁ బ్రధానుండు ఆం. భా. ౨. ౧౭౩.

౩. చదరంగమందలికాయలలో మంత్రి యను కాయ. (శ. ర.)

౪. మంత్రము.

చ. మలగొను చిన్ని కెంజడలు మంతులపాత్రము నాగబెత్తమున్, . చెలు వలరంగ నొప్పు నొకసిద్ధుఁడు ... శశా. ౨. ౪౭.

(శ. ర. పా. మండలపాత్రము ము(ద్రి. పా.)

౫. ఇది యీ క్రింది యర్థములతోం బాటు 'రాధికాసాంత్వనము' నందక్కడ మిగిలిన తావులం దెల్ల 'ఎక్కు' అను క్రియతోఁ గలసియే కానవచ్చుచున్నది.

ఉదా. మంతుకెక్కు, మంతున కెక్కు.

(క.) ప్రసిద్ధి; ఘనత, గొప్పతనము.

సీ. గబ్బిసిబ్బెపు టుబ్బు గుబ్బగుబ్బల తెంతో మంతుగ న్వింతకుంభములు గాఁగ ...
రాధికా. ౧. ౬౭.

ద్వి. సంతత జవసత్వ సంపద ల్మెఱసి, మంతు కెక్కిన హనుమంతుండుఁ దాను, నాదరక గవిజాండు జెప్పిన యట్ల, మొదల కింధ్య చెఁంబున కేఁగుచెంచి .
రం. రా. కిష్కిం. ౨౨౭౭. ౧౦౪౦.

గీ. దండధర చండతర శౌర్యచండశత్రు, కాండచతురంగ ఖండనోద్దండవిక్ర, మక్రమాఖండలుం డన మంతు కెక్కె, సార సింహప్పరాయ భూనాథమణికి.
ఇందు. ౧. ౧౨౫.

వ. భవతేజంబునఁ బుట్టి రామభజనాపారీణుఁడై పద్మసం, భవసామ్రాజ్య రమాధురంధరతకై భాసిల్లియు న్నిత్యసు, త్య వివేక స్థితి సద్విరోధి విమయధ్వాంతార్క బింబాకృతిన్, భువిలో మంతున కెక్కినట్టి హను మంతుం గొల్తు నిష్టార్థికిన్. దశా. ౧. ౭.

(చ.) ప్రశస్తి, పొగడ్త.

వ. ఆ లోకనాయకుని కిచ్చుటకన్న నెన్న భాగ్య మున్నదే యని యా ధీమంతు లగు మంత్రులు మంతు కెక్కఁ బలికిన నానందతరంగి తాంతరంగుండై ...
ప్రబంధ. ౫౬౧.

క. [illegible]
తెచ్చి [illegible] మంతు

4

తెక్కు_న, దంతపుపని చేవికెలోన దయ దని
వారెన్. రాధికా. ౧ ౩౬.

**మంతువు.** సం. వి. ఉ. పుం ౧ అపరాధము, తప్పు. ౨. శోకము. ౩ ప్రజాపతి. వి. (ఉ) ౧. విష్ణుఁడు. ౨. ప్రియవంతుఁడు. (శే ని.)

**మంత్రకాఁడు.** విశే. (√మంత్రము) ఇంద్రజాల విద్య నెఱిఁగినవాఁడు.

క. తెగుతలలు మొలచుతలలుం, దిగువం బడు
తలు మొగులు తెరువునకు వడి, స్వర్గయు
తల లప్పు డబ్బుర, వగుచు న జగమంత్రి
గాని యాటయుపోలెన్.

అచ్చ. రా. యు. ౫౪౯.

**మంత్రకృత్తు.** సం. విశే. (త్) = మంత్రదర్శి.

**మంత్రజిహ్వుఁడు.** సం. వి. అ. పుం. అగ్నిహోత్రుఁడు.

**మంత్రజ్ఞుఁడు.** సం. వి. అ. పుం. గూఢచారుఁడు, వేగులవాఁడు. (వై. ని.)

**మంత్రణ.** సం. వి. ఆ. స్త్రీ. సలహాచెప్పుట, ఆలోచనచెప్పుట.

**మంత్రణము.** సం. వి. అ. న. ఆలోచన.

**మంత్రదర్శి.** సం. విశే. (న్. నీ. న్.) మంత్రములఁ గనిపెట్టినవాఁడు లేక చూచినవాఁడు.

**మంత్రదాత.** సం. వి. ఋ. పుం. మంత్రమిచ్చిన గురువు, మంత్రోపదేశము చేసిన గురువు.

**మంత్రదృక్కు.** సం. విశే. (శ్.) ఇట్లే మంత్రద్రష్టుఁడు, = మంత్రదర్శి.

**మంత్రము = మంతరము.** వి. (సం. మంత్రః = 'మంతరము'లోని తకారోత్తరవర్తియైన అకారము లోపింపఁగా 'ఉంగరము' 'ఉంగ్రము' వలె 'మంత్రము' అనురూపము సిద్ధించును.)
౧. ప్రసవోపాయము.
(చూ. మంత్రసాని.)
౨. ఇంద్రజాలము, కనుకట్టు విద్య.
(చూ. మంత్రకాఁడు.)
జ. మంత్రకాఁడు, మంత్రసాని.

**మంత్రము.** సం. వి. అ. పుం. ౧. వేదము. (ఇది ఋక్కు, యజుస్సు, సామము, అథర్వము, అను నాలుగువిధములు గలది.) ౨. వేదభాగము, (బ్రాహ్మణేతర వేదభాగము.)
౩. (తంత్ర) కొందఱుదేవతల అనుగ్రహమును సంపాదించుటకై జపింపఁదగిన మంత్రము.
౪. గూఢభాషణము. (కే. ని.)
౫. ఆలోచన.

**మంత్రవిదుఁడు.** సం. విశే. (దే.) = మంత్రదర్శి.

**మంత్రసాని = మంతరసాని.** వి. (√మంత్రము) సావిక.

గీ. అవని నపుడు నవోదితుం డైనయట్టి, మరు
నకుం గుసుమర్తు వన్మంత్రసాని, బొడ్డుఁ
గోసిన కొడవలివోలె విరహి, దారకం
బయ్యెఁ గింశుక కోరకంబు.

ఆ. ము. ౫. ౧౧౭.

గీ. అమరు నవ్వీట నన్నపూర్ణాభిధాన, మదన
మాయామహాస్థాని మంత్రసాని, దానితో
మాటలాడి చూతము విచార, మేల యని
వేశ గని దానియింటికడకు.

శుక. ౧. ౪౨౫.

**మంత్రాంగము.** సం. వి. అ. న. మంత్రిత్వము, తంత్రము. (శ. ర.)

**మంత్రి.** సం. విణ. (న్. ఈ. న్.) ౧. బుద్ధిమంతుఁడు, తెలివిగలవాఁడు. ౨. వేదములు బాగుగాఁ దెలిసినవాఁడు.

వి. న్. పుం. ౧. సచివుఁడు, ప్రెగడ, ౨. మాంత్రికుఁడు, గారడివాఁడు.

**మంత్రించు.** సం. అ. క్రి. మంత్రించు, మంత్రోచ్చారణముసేయు.

సీ. మూలమం[illegible]క్షరంబుల భూతి మంత్రించి పుండ్రకములు ఫాలమున ధరించె ..

కాశీ. ౧. ౩౯.

క. మంత్రపరీక్షార్థం బభి, మంత్రించితిఁ గాని దేవ మదనక్రీడా, తంత్రంబుఁ గోరి చీరను మంత్రించిన తప్పు సైఁచి మరలు దినేశా.

భాగ. ౯. ౭౧౭.

**మంత్రితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఆలోచింపఁ బడినది. ౨ సలహాచెప్పఁబడినది. ౩. చెప్పఁబడినది. పలుకఁబడినది. ౪. మంత్రింపఁబడినది. మంత్రములచేఁ బవిత్రము చేయఁబడినది. ౫. నిశ్చయింపఁబడినది.

వి. అ. న. సలహా.

**మంథగిరి.** సం. వి. ఇ. పుం. మందరపర్వతము, కవ్వపుఁగొండ.

**మంథగుణము.** సం. వి. అ. పుం. మంథరజ్జువు, కవ్వపుఁద్రాడు.

**మంథజము.** సం. వి. అ. న. నవనీతము, వెన్న.

**మంథదండ(క)ము.** సం. వి. అ. పుం. కవ్వము.

**మంథనఘట్టి.** సం. వి. ఈ. స్త్రీ. మజ్జిగ చిలికెడి కుండ.

**మంథనపర్వతము.** సం. వి. అ. పుం. కవ్వముగా నుపయోగింపఁబడిన మందరపర్వతము.

**మంథనము.** సం. వి. అ. పుం. కవ్వము. న. ౧. మథించుట, తరుచుట, చిలుకుట, ౨. రాపిడిచేత నగ్నిని రాఁజవేయుట.

**మంథని.** సం. వి. ఈ. స్త్రీ. మజ్జిగ చిలికెడి కుండ.

**మంథము.** సం. వి. అ. పుం. ౧. మథించుట, తరుచుట, క్షోభపఱుచుట. ౨. చంపుట, నశింపఁజేయుట. ౩. పానకద్రవ్య విశేషము. ౪. కవ్వము, మంథదండము. ౫. ఆతపము, ఎండ. ౬. కిరణము. ౭. నేత్రమలము, కంటిపుసి. ౮. రాపిడివలన నగ్నిఁ బుట్టించెడు సాధనము. ౯. ఒకదినుసు జింక.

**మంథర.** సం. వి ఆ. స్త్రీ. కైకేయియొక్క దాసి.

**మంథరము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మందమైనది. ౨. బుద్ధిలేనిది, జ్ఞానశూన్యము, జడము. ౩. పెద్దది, విశాలమైనది. ౪. వంగినది, వక్రమైనది.

వి. అ. పుం. ౧. ధననిధి, ధనాగారము. ౨ బలము. ౩. క్రోధము, కోపము. ౪. అప్పుడు చిలికిన వెన్న. ౫. కవ్వము. ౬. బాధము. ౭. ఫలము. ౮. కుసుంభము, కుంకుమపువ్వు.

**మంథరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) సూచకుఁడు.

**మంథరువు.** సం. వి. ఉ. పుం. చామరము వీచుటవలనఁ గలిగినగాలి.

**మంథవిష్కంభము.** సం. వి. అ. పుం. తరికంబము, చల్లరాడు. (వై. ని.)

**మంథానకము.** సం. వి. అ. పుం. తృణవిశేషము.

**మంథానము.** సం. వి. అ. పుం. ౧. కవ్వము. ౨. ఆరగ్వధము, రేల చెట్టు. ౩. మందర పర్వతము. (శబ్ద.)

**మంథి.** సం. వి. న్ పుం. ౧. సూర్యుఁడు. ౨. చంద్రుఁడు. ౩. రాహువు. ౪. ఒకానొక సోమపాత్రము. (శ. ని.)

**మంథిని.** సం. వి. ఈ. స్త్రీ. మజ్జిగ చిలికెడి కుండ.

**మంథోదధి.** సం. వి. ఇ. పుం. క్షీరసముద్రము, పాలవెల్లి.

**మంద.** వి. (క. మందె. త. మంౖ.) ౧. ఆవులు మున్నగు పశువుల సమూహము, కిలారము.

ద్వి. నీవు నీచేముష్టి నిజగ్రై మెఱసి, యొం డాఁక చేసితి వీలోనిపసుల, మంద నీకె యటన్న మది సంతసిల్లి.

రం. రా. అయో. ౧౦౭. పా. ౨. పం.

గీ. మందగతి నుస్కి వృషభముల్ మంద విడుఁద. ఆము. ౪. ౧౬౯.

చ. గొఱియలమంద సూఁబసులగుంపు కృషిక్రియ దుక్కిటెడ్లదో, డ్డ

వేం. పంచ ౧. ౫౭౬.

ఉ. గొల్లలనాయఁడై పరగు కుంభకుమంద న దేమివింతయో ... నీలా. ౨. ౫౪.

౨. ఆవులు మున్నగు పశువులసమూహ ముండు గోష్ఠము.

ఆ. తనియ మేసి నీరు ద్రావి వందకు వచ్చి, సౌఖ్య మెసఁగఁ బసులు శయన మొంది, యుండ ... భార. అను. ౩. ౫. ౩. ౯.

ఆ. ఆలమందనుండి యది వచ్చునాఁడు ప్ర, త్యూషవేళఁ దాఁ గరీప పూర్ణ, వేణుపాత్రి మీఁద వెలయఁ దిడుకొని, యాత్మ గేహమునకు నరుగునపుడు .

విక్ర. ౩. ౧౯.

౩. గొల్లపల్లె, క్రేపల్లె, ఘోషము.

సీ. కంసుపంపున బాలఘాతిని పూతన పల్లెఁ మందలఁ బట్టణముల ...

భాగ. ౧౦. పూ. ౨౧౨; ౧౪౫.

జ మందకట్టు, మందకాఁడు, మందగుడి, మందగొను, మందపట్టు, మందపిచ్చుక, మందప్రోయాలు, మందవాఁడు.

**మందకట్టు.** అ. క్రి. (మంద + కట్టు) పేడ మున్నగువానిచే సత్తువ కలిగించుటకై ఆవులు, మేఁకలు మొద లగు వాని మందలను రాత్రులందు పొలములలో నిలుపు.

(వ్యవ.) మందకట్టినందున ఆ పొల మీయేఁడు బాగుగా పండినది.

వి. (తి. మంౖకట్టు.) గొల్లపల్లెలవారు చేసికొను కట్టడ, నియమము, ఏర్పాటు (శ.ర.)

**మందకాఁడు.** విశే. (√మంద) పశువుల మందను గాచువాఁడు.

ద్వి. . సిద్ధ, రాముని బంటొ చేరమమంద కాఁడో. పండితా. పురా. ౧౫౭. పా.

**మందగరడ.** వి. వన్యమృగవిశేషము. (ఇది పిల్లింబోలి పిల్లికంటె కొంత రొమ్మయి యుండు. శునకశతంబులకు అపుల మిసిమింతము గాక మలఁగి మలఁగి వానిం గఱచుచుఁ బాఱుఁ గాని నేలం బడదు. వేఁటకాండ్రు కడు ప్రయాసమున ఒడియల వడిచి కొల్తురు.) చి.ని.

**మందగామి.** సం. విశే. (న్. నీ. న్.) మెల్లగా నడచువాఁడు, నడకలో మందత్వము గల వాఁడు.

**మందగించు = మందగిల్లు.** అ. క్రి. (సం. మంద+. ఇది 'కోపగించు' వంటిది.) మంద మగు, తగ్గు.

ఉ. . . యానములౌ, వేములు మందగించెఁ
గడువృద్ధి భజించెను గాను
హంస. ౨. ౯౩.

(వ్యవ.) ఆఁకలి మందగించినది. ఈ సంవత్సరము ధాన్యపుధర మందగించినది.

**మందగిల్లు(లు)=మందగించు.** అ. క్రి. (సం. మందః.) మంద మగు, తగ్గు.

(వ్యవ.) ఆయాసముచే ఎద్దు నడక మందగిల్లినది. సరకులధర లన్నియు నిప్పుడు మందగిల్లుచున్నవి.

**మందగుఁడు.** సం. వి. అ. పుం శని

**మందగుది.** వి. (√మంద) పశువులు కాలీడ్చుకొనుచు నడచు నొకవిధ మైన కుంటి నడక.

(ఇది పశువుల దుర్లక్షణములలో నొకటి.)

గీ. మందగుది రెప్పగొరిసెలు మక్కిరొండ్లు,
బరతుమురుకొమ్ములును పోటుబగ్గు తడక,
వాటు తెరడొక్క మిడితోఁక వేటు
గాల్లు, సేరుబానినయొక ఓదయొద్దుఁ జేరి.
హంస. ౫. ౩౧. ముద్రి. పా.

(పుప్పిగొరిసెలు. శ. ర. పా.)

**మంద(లు)గొను.** అ. క్రి. (√మంద) మందగాఁగూడు, గుంపుగూడు.

క. ఇచ్చోఁ బచ్చిక మేసిన, విచ్చోఁ ద్రావి
నవి తోయ మేఁగిన విచ్చో, నిచ్చోట
మందగొన్నవి, యిచ్చోఁ బానినవి జాడ
యిదె యిదె యనుచున్.
భాగ. ౧౦. పూ. ౫౦౪.

క. అందలములు గుఱ్ఱంబులు, స్యందనములు
భటులు భద్రసామజములు బల్, మంద
గొని తోలఁగఁ ద్రోయున, సందెందును
లేక దొడ్డసందడి యాస్యోన్.
కుచేల. ౨. ౪.

చ. నలిఁ గమలాననల్ మృదుని నాథములన్
పెడదొక్కఁ బల్కులన్, పొలపక చిల్క
లన్ వెడలఁ జోఁపు రెలుంగులుఁ దన్ము
డాయ రాఁ, బిలుచుట గాఁగ నాచిలుక
పిం డనికంబును జేలలోన మం, దలుగొని
పాయకుండు మదిఁ దద్వచన శ్రవణాభి
లాషులై
కు. సం. ౭. ౯౨౭. శుక. ౨. ౩౪౭.

**మందట.** వి. ౧. వ్యవహారము.

సీ. మందట యనఁగను మందిలిం పనఁగను,
వ్యవహారసంజ్ఞ లై పరఁగుచుండుఁ.
ఆం. భా. ౧. ౧౧౩.

(క.) తగవు, వివాదము.

ఉ. ... మా, మందట మాన్పి యి ట్లనిరి
మానుగఁ దా రనుకూలశత్రు లై.
దశకు. ౫. ౪౫.

చ. మనముల సమ్మతించి తమమందట నాసభ
వారు తీర్చి చె, ప్పినగతిఁ జేసిరి ..
నా. పంచ. ౧. ౫౫౧.

(సమీపము అని శ. ర. మఱుమాటన నాసభ
వారు. ముద్రి. పా.)
భార. అను. ౨. ౪౭౩.

(చ.) కలహము, జగడము.

సీ. మనకు వేల్పులకును మందట లేకుండఁ
బంచిపెట్టెద నని పడఁతి బూని ...
భాగ. ౮. ౩౭౦.

౨. ఉడుకువ, ఊఱట, నిర్వ్యాపారత్వము.
(అడఁకువ అని శ. ర.)

మ. విను కుంభాండ యనేక కాలము మహో
దీరాహవప్రౌఢి పెం, పునఁ గ్రీడింపఁగ
లేక నాదగు భుజంబుల్ మందటం బొంది
నన్.  హరి. ఉ. ౭. ౩౭.

(శ. ర. పా. భుజంబులో ముచ్చటం బొంది నట్. ప్రాఁత మ్ముగి. పా. భుజంబులో మూదటం బొందినటో నూతన ముద్రి. పా.)

జ. మందటిల్లు.

**మందటము.** సం. వి. అ. పుం. పారిభద్రము కేీ. (వాచ, కల్ప.)

**మందటిల్లు(లు)** అ. క్రి. (√మందట) ౧. ఉడుగు, నిలిచిపోవు, క్షీణించు, తగ్గు.

(కల్లుత్రాగిన స్త్రీలవర్ణనను)

సీ. అసితోత్పలములపై కలవాంఛ పదు పులు గాల్లందుఁ దొడరెనా మట్టంపు నడపులు మందటిల్లె. కు సం ౯. ౩౩అ.

చ. చెలియలియిల్లు మందటలఁ జేసినదోషను సద్వసూత్కారం, బలు గిలుబాడ నైన యఘుమటో బహుచక్ర విమర్దనంబునం, గలిగిన దుష్కృతంబుఁ దొలఁగట్ ఫృగు పాత మొనర్చెనో యనట్ గలువలతోఁకు వ్రాలెఁ దుదిగట్టునను౦డి కలాః హీనతట్. చంద్ర. ౪. ౧౪౮.

క. కందపుమ్రాఁకుల కురఁజాల, సందులనం బూల చేలువ పిప్పరములుగాఁ, బొందింపఁ గ్రమ్మకీఁకటి, మందటిలెట్ నేలుకట్టు మానికములచేట్. యయా. ౪. ౫౧.

౨. మిన్నకుండు, ఊరకుండు.

క. చేనుతో వాఁటిపెద్దలు, గని దిగ్గన లేచి రాజాగా రిట వేరే, యని కొడుకుచు నన లేకుం, డిన నే మాయె నని మందటిలఁ బల్కి తగన్. సారంగ. ౨. ౩౪.

౩. మెండుకొను, అతిశయించు.

క. కేఁ లుప్పతంబ గ మ్మెదమందర వ మంద టిలుపొదలో దూఁటుచోఁ గలువకంటి . . చంద్ర. ౩. ౧౪౫.

**మందడి.** వి. (సం. మందురా. బ. మందడులు, మందళులు, మందళ్లు, చూ. మందడీఁడు.)

౧. అశ్వశాల, లాయము.

ద్వి. ఈ రేయి మందడి యెల్ల మై మఱచి, తారు నిద్రించు న త్తఱిఁ జిచ్చు వెట్టు, నీ వాజిశాలల నిటు చేసితేని, భావములోన నా పలుకులు మెచ్చి, తగ నృపుం డిచ్చు నర్థంబులో నీకు, సగ మిత్తు.

నవ. ౩. ౧౪౭-౧౫౦.

(ఇట 'మందడి' లక్షణావృత్తిచే అశ్వశాల యం దున్నవారు. అనునర్థ మిచ్చును.)

౨. అశ్వము, గుఱ్ఱము

ద్వి. అందలా లందలా లందందఁ బెనఁగ. మందళ్లు, మందళ్లు, మలయుచు నడువ, పండితా. పర్వ. ౩౫౫. పా.

జ. మందఁడీడు.

**మందడి.**² వి. బల్లలు మున్నగువాని నొండొం టితోఁ గూర్చుభాగము, సంధిస్థానము; రెండు పాలములకు గాని రెండునిలేకనస్థలములకు గాని నడుమ నుండు సరిహద్దు.

(వ్యవ.) ౧. పెట్టెకు మందళ్లు వద్దంగి సరిగా అదుకలేదు. ౨ వారిపొలమునకు మాపొల మునకు మందడిగట్టు ఏర్పాటుగాలేదు. ౩. అధికవర్షములచే అరెండుపెరళ్లమందడి గోడ కూలిపోయినది.

**మందడీఁడు.** వి. (మందడి¹ + ఈఁడు బ. మంద టీలు, మందటీంద్రు.) గుఱ్ఱపువాఁడు, మందుర కుఁడు.

గీ. ... లాయమున నున్న, యపుడు దొడ కంచుకయు లేని యట్లు గాఁగ, మాటి మాటికిఁ బరికించి మందడీల, కెల్ల నూఱట యగుచు వర్తిల్ల నేర్చు.

భారం. విరా. ౧. ౯౫.

సీ. అపాలంతియు దాఁచి యాపండు తనకోడ,
నూని కూడెడుమందడీని కిచ్చె ...
ద్వా. ౧. ౭౭.

**మండనము.** సం. వి. అ. న. ౧. స్తుతి. ౨. మోదము. ౩. గతి. ౪. మదము. ౫. స్వప్నము. (శే. ని.)

**మందపట్టు.** వి. (మంద + పట్టు) గోష్ఠము, పశువు లుండెడుచోటు.

ద్వి. మడి లోఁటకళ్లంబు మందపట్టనెడి, యడి
యూసఁ బోకార్చి యంతటఁ బోక.
ద్వి. హరిశ్చ. పూ. ౫౧౯.

**మందపఱుచు.** వి. స. క్రి. మందపడఁజేయు, క్షీణింపఁజేయు.

గీ. మానుషాకారరుచిశోటి మందపఱిచి, యు
నఘ రమ మన నేర్తుఁ గృష్ణాభిధాన,
లోకబాంధవుఁ డుత్తమ శ్లోకమూర్తి,
మించుతేజంబులో నస్తమించె నయ్య.
భాగ. ౩. ౭౩.

**మందపిచ్చుక.** వి. (మంద+పిచ్చుక) మందతోఁ గలిసి యుండుపిచ్చుక, చటకవిశేషము.

(ఖంజరీటము. శ. ర. నల్లని తలయును తెల్లని
రొమ్మును గల యొకవిధమైన చిన్న
పక్షి. బ్రౌ.)

**మందప్రోయాలు.** వి. (మంద + ప్రోయాలు) గొల్లపల్లెలో నుండుస్త్రీ, గోపిక.

గీ. మందప్రోయాండ్ర హరిని ప్రమానిపండు...
పాండు. ౨. ౧౪.

**మందభాగి.** సం. విణ (స్త్రీ. నీ. న్.) మందమైనయదృష్టము గలవాఁడు, అదృష్టహీనుఁడు, దురదృష్టవంతుఁడు.

**మందభాగ్యుఁడు.** సం విణ. (అ. ఆ. అ.) అదృష్టహీనుఁడు, దురదృష్టవంతుఁడు.

**మందము.** వి. పరిపుష్టి, ఒలుపు.

చ. .. గొరిసెలయందమును గుబుచేకొమ్ముల
చందము వెన్నుమందముఁ, ... హరు
వగుకామధేనువు .. దశా. ౨. ౨౨౪.

విణ. ౧. స్థూలము, లావైనది.

ద్వి. నడుము మందంబాయె వాఖి గన్పడిరెు.
ద్వి. నల. ౩. ౨౨.

౨. దళసరి గైనది.

(వ్యవ.) ఆబల్ల మంద మైనది. ఈబల్ల పలుచనైనది.

**మందము.** సం. వి. అ. పుం. ౧. ఒకానొక హస్తిజాతి. (మే. ని.) ౨. ప్రలయము. ౩. తోడుపెట్టఁగాఁ గలుగు నొకవిధమగు వికారము గలదధివిశేషము. (వై. ని.)

**మందరమణి.** సం. వి. ఇ. పుం. ఈశ్వరుఁడు. (వై. ని.)

**మందరము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మందమైనది, మెల్లగాఁ బోవునది. ౨. పెద్దది, స్థూలమైనది

వి. అ. పుం. ౧. మందరపర్వతము, కవ్వపుఁ
గొండ, అమృతమునకై క్షీరసముద్రము
మథింప దేవదానవులచేఁ గవ్వముగాఁ బ్రయోగింపబడిన కొండ.

౨. ఎనిమిదిపేటలు గల ముత్యాలహారభేదము.
(వై. ని.)

౩. స్వర్గము. ౪. అద్దము. ౫. ఇంద్రుని
యుద్యానమందలి మందార వృక్షము.

**మందల**[1]. వి. (మను1 + తల3. దీని మూలరూపము 'మనుదల') మనుగడ, జీవనము; జీవము, ప్రాణము.

(ఇది విడుచు ధాతువుతోఁ గూడియే ప్రయో
గములలోఁ గానవచ్చుచున్నది. చూ.
మందలవిడుచు.)

**మండలశి.** వి. (మను + అలశి.) ౧. పేర, పాగ్గ.

క. అందలమండల లేకిపు, డండల మంద
లయి యున్న వయ్యు మెకంబుల్, చెండా
మర కొలనివలెన్, దండేప ల చేమి సెప్ప
దేవుఁ డెఱుంగున్ పారం౯. ౧. ౬౭.

౨. సమీపము

చ. చలిమిరి గాడ్పుచే నిగని సన్నపు సుళ్లగు
చాకసంభ్రమం, దల విశసిల్లెఁ బుప్పొడులు
దట్టముగా యయా ౪. ౧౦.

౩. తెరువు, మార్గము; తెఱఁగు, విధము.

వ. పెద్దప్రొద్దు దద్దయుం దలపోసి కర్జంబు
మండల తెఱుంగక కొండలం పడుచు ..
భాగ. ౧౦. పూ. ౫౩౨.

వ. వసుదేవుండును బ్రదుకు మండలఁ గంటి
నసుచు సుందరియుం దానును మందిరంబు
నకుం బోయి డెందంబున నానందంబు
నొంది యుండె. భాగ. ౧౦. పూ. ౪౩.

**మండలవిడుచు.** స. క్రి. (మండల + విడుచు)
జీవముతో వదలు, (ప్రాణములతో విడిచి
పెట్టు.)

సీ. ... నాగాయుతప్రాణు ననిలనందనుని
బాడు, దలఁ బట్టి సహదేవుఁ జులుకన
మర్దించి మండలవిడువఁ జే మాయలాని ..
భార. కర్ణ. ౧. ౪౨.

చ. పలుకులు వేయు నేఁటికిఁ గృపాపరతాస్తుతి
దక్క కీని వం, దలవిడు నాకుఁ గా
నృపతిధర్మ విచక్షణ పుణ్యచిత్తుఁడా . .
నిరు. ౭. ౬౮.

గీ. .. అమరవిభుని, కరుణ మండలవిడిచి
విక్రమము మెఱసి. నృసిం ౨. ౧౧౬.

క. అని శ్రీపతి యానతి యి, చ్చిన మండల
విడిచె నతని సిద్ధవిభుఁడు వాఁ, డును

గులగులలై లా వగ, లినమై విదిలించు
కొనుచు లేచెఁ గిదుకుచున్.
పాండు. ౪. ౫౭.

**మండలించు.** స. క్రి. (√మండలశి) ౧. చెప్పు,
నిర్ధారణ చేసి చెప్పు.

గీ. ఇంతి యలుకకుఁ గారణం బిది యటంచు,
మండలింపుము నాయాన మందయాన ...
రాధికా. ౪. ౪౮.

(శ. ర. పా. 'మదిఁ దలంపుము' ముద్రి. పా.)

క. ఏ మంద మేమి సేయుద, వేమం దని
మండలింత మే మందమెయిం, రేమంద
యాన నడుగుద, మే మందట మనుచుఁ
దరళహృదయాంబుజలై. వసు. ౩. ౧౮౧.

౨. ఆజ్ఞాపించు.

గీ. మంద గొందల మంద నమందవృష్టిఁ,
గ్రందుకొనఁ డంచు నింద్రుండు మండ
లింపఁ ... జలధరములు. భాగ. ౨. ౧౭౪.

ద్వి. మనసులోఁ దరయంగ మండలించినను,
చేను నెట్టు పట్టేమంచేమువిూఁద నుండ.
పండితా పురా. ౧౧౦పా.

౩ చీవాట్లుపెట్టు, తర్జించి బోధించు.

(వ్యవ.) నీ కొడుకును నీవు మండలించినఁ గాని
వాఁడు పెంకిచేష్టలు మానఁడు.

౪. హెచ్చరించు.

ద్వి. నీవును దేవమునిశ్రేణిఁ గలసి, వే వచ్చి
ననుఁ జేరి వేఁడు చున్నపుడు, మండలించితివఁ
గాక ... విష్ణు. పూ. ౩. (శ. ర.)

౫. మనవిచేయు, విన్నవించు.

గీ. ఎన్ని యుపచారములు చేసి రిందువదన.
లన్ని యును జూడ మానుపటికన్న మిగుల,
బాధకము లయ్యె దయలేనిప్రభువుతోడ,
మండలించిన మనవుల పెందమునను.
అని. ౩. ౨౫.

౬. పృచ్ఛించు, అడుగు.

వ. నేఁడు పండువకు వియ్యక్కుల బావలఁ బోఁడికొచ్చితివే యని మందలింత మని యందఱు గుమిగూడి వారి యింటి కరుగు దెంచి. చెన్నబ. ౩. ౧౮౩.

౭. తలఁచు, పాటించు.

సీ. ముక్తకంచుకమస్తముక్తా ఫలంబుల మంద లింతురు గురివెంద లల్లు. కాశీ. ౩. ౪.

**మందలింపు.** వి. (√మందలించు.) మందలిం చుట. (వా.)

౨. వ్యవహారము.

సీ. మందట యనఁగను మందలిం పనఁగను వ్యవహారసంజ్ఞలై పరగుచుండు ..
ఆం. భా. ౧. ౧౧౩.

**మందవాఁడు.** వి. (√మంద.) గొల్లవాఁడు, గోపాలకుఁడు.

సీ. వడిఁ గూడి పాలకావళ్లు దేరఁగ మంద వాండ్రను బారిగొని వచ్చె నేఁడు ...
హరి. పూ. ౬. ౯.

**మందవిసర్పి.** సం. వి. న్. పుం మెల్లఁగా ప్రాఁకునది - యూఁక, పేను, (శే. ని.)

**మందస(ము) = మంజూస.** వి. (సం.మంజూషా. ప్రా. మంజూసా.) పెద్దపెట్టె; పెట్టె.

మ. ... మదీయపుత్త్రిఁ బ్రమదం బేపార నే నిచ్చెద, న్మృడుబాణాసన మున్నమందస దగ న్వేలెందు విూ రేఁగి యి,క్కడకు...
భా. రా. బాల. ౬౭౫.

ద్వి. తటుకున నరిగి మందసఁ బట్టుఁ డనుచు.
నవ. ౩. ౧౪౭. పా. ౯. పం.

ద్వి. శ్రుతుశాల దున్న నాఁగటి చాలులోన, నతులితంబుగఁ జాలునం దొప్పు మిగిలి, మందసంబును రాఁగ మది నుబ్బి చూచి, మందసంబును నేను మునతఁ దీయంగ .
రం. రా. బాల. ఉత్త పా. ౭. పం. ౬౫.
పా. ౧౯. పం.

గీ. పదిలముగ మందసమునందు బరణిలోన, నునిచి దాఁచినదాన విూ యుంగరంబు ...
కాశీ. ౪. ౧౦౫.

క. వ్రాయించి మందసమ్ముల, రాయల్ ధరి యించు నాభరణ వస్త్రతతుల్ దీయుత్త మంచి పంపె న్, భాగా త్తత భటులఁ గూర్చి యప్పాత్రులకున్ ...
కృష్ణ. ౩. ౧౦౫.

చ. ... కన్యకామణిన్, వనధిపరీత నైు పొదలు వాహినిలో నొక మందసంబునం, దునిచి రయంబునన్ వెడలనొత్తుట నీతి యటంచుఁ దల్చినన్ ...
శుక. ౧. ౩౭౧.

సీ. ... మంజూష తనరారు మందసు మన ...
ఆం. భా. ౨. ౮౭. నీలా. ౩. ౪౬.

**మందసతి.** మి. వి. మందప్రోయాలు, గోపిక.

గీ. మురలుగాలిపి తె గోవింద మందసతుల ...
ఆము. ౫. ౬౭.

**మందసానము.** సం. వి. అ. పుం. ౧. అగ్ని. ౨. ప్రాణము. ౩. నిద్ర. ౪. సూర్యుఁడు. ౫. చంద్రుఁడు. ౬. హంస. ౭. జీవము. (శే. ని.)

**మందసానువు.** సం. వి. ఉ. పుం. ౧. స్వప్నము. ౨. జీవుఁడు.

**మందహాసము.** సం. వి. అ. పుం. చిఱునవ్వు. (శ. ర)

**మందాకము.** సం. వి. అ. పుం. ౧. ప్రవాహము. ౨. స్తోత్రము.

**మందాకిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. గంగానది. ౨. ఒకానొక నది. ౩. (ఛంద) ఒకానొక వృత్తము.

శ్లో. ననరరఘటితా తు మందాకినీ. (కల్ప.)

౪. అఱువదేండ్ల యాఁడుది.

(శ. ర. మాత్రము.)

**మందాకు.** వి. (మందు + ఆకు) మందునకై యుపయోగించు ఆకు; ఓషధి.

గీ. బ్రహ్మ పిడిచిన మందాకు పస రనంగ ...

ఆము. ౨. ౮.

**మందాక్రాంత.** సం. వి. ఆ. స్త్రీ. (ఛంద) వృత్తభేదము.

**మందాక్రాంత.** మందాక్రాంత స్గిరిశవిరతుల్ మభ్నతాగాగణంబుల్.

అప్ప. ౪. ౨౭౬. పొ.

**మందాక్షము.** సం. వి. అ. న. లజ్జ, సిగ్గు.

**మందాగ.** సం. వి. ఆ. స్త్రీ. శ్రవిష్ఠ, ధనిష్ఠ ర్క్షము, ధనిష్ఠా నక్షత్రము. (వై. ని.)

**మందాగ్ని.** సం. వి. ఇ. పుం. జఠరాగ్ని మంద మగుట, అజీర్తి.

విశే. (ఇ.) అజీర్తి గలవాఁడు.

**మందారము.** వి. పొడము, మేఘావరణము.

గీ. ... పొడ, మనఁగ మందార మనఁగ మేఘావృతి దగు . . ఆం. భా. ౧. ౪౧.

**మందారము.** సం. వి. అ. పుం. ౧. ఇంద్రుని నందనోద్యానమందలి యైదు వృక్షములలో నొకటి; భూలోకమందలి యొకానొక వృక్షము. ౨. అర్కవృక్షము, జిల్లేడు. ౩. దత్తూర వృక్షము, ఉమ్మెత్త. ౪. అరవిందము. (కే. ని.)

**మందారువు.** సం. వి. ఉ. పుం. కల్పవృక్షవి శేషము. (విశ్వామ్సా.)

ఉ. మేరువు గాంచె ... నిత్యసేవనరసవ్యాప భ్రమద్భృంగబంధుమం, దారువు దివ్యభూ రుహతదారువు సౌరభవర్ణమేదురున్.

హరి. పూ. ౫. ౧౧.

**మంది.** వి. (క. మంది.) ౧. జనము; జనసమూ హము.

ఉదా వేయిమంది, కొంతమంది, అంత మంది మొ.

ఉ. అంతటఁ బొంతఁ బెంచెరువునం దరు దెంచు పిఱిందిమంది ... ఆము. ౬. ౭౪.

సీ. తెలిగంటిచెలిమంది సెలిచిత్తరులఁ జెంది రహిఁజెందు మణిమందిరములయందు ...

ఉ. రా. ౬. ౧౪౩.

ద్వి. సందడింపుచున్న జనుల వీక్షించి, మంద స్మిత ముఖారవిందుఁడై యంత, నందంద తా హస్తసంయునసంజ్ఞలను, మందియు ల్వాఁచి సమాధానపఱిచి.

పండితా. మహిమ. ౨౫౨. పొ.

గీ. ఇరులు గవియుచు నేరాళ మెట్టఁదొదుర, నల్లనల్లన నేతెంచె నల్లమంది, గరిమ నానాకపతుల కాకోళవీథి, గదలి యెదు రగ వచ్చెనో కాక యనఁగ.

హైమ. ౪. ౩౯.

సీ. ... మంది యంచన నగు మనుజవితతి ...

ఆం. భా. ౨. ౧౦౩.

సా. మంది యొక్కటైన మజ్జిగ పలచేన.

౨. పరివారము, బలగము.

ఉ. తప్పు గణించి కౌరవులు దండనసేయుదు రొద్దివారి బా, తప్పున కల్గి మంది గల దాన నటంచును మారుతాపులం, గుప్పితి పిల్ల నీచెలులఁ గూడి. ఉ. రా. ౬. ౧౦౫.

సీ. అంత కంతకు మంది నధికంబు గాఁ గూర్చు
కొని తెరువులుఁగొట్టుచును ...
పరమ. ౪. ౧౯౬.

ఉ. ... నీరిఁ గన్నతండ్రి దా, మన్ననఁ జేసి
పంపి తనమందిఁ గనుంగొని రాముఁ డి
ట్లనుఁ. సయా. ౩. ౩౨.

౩. కాలుబలము, పదాతిసేన, సేన.
(శ. ర. ప్రా.)

ఉ. మంది గుఱ్ఱాలు నేనుఁగులు మావతులుఁ
దొర లెన్నఁ బెక్కు రై, క్రందుగఁ
గూర్మితో నెదురుగాఁ జేని పౌజులు దీర్ప
సుయా. ౪. ౧౨౫.

గీ. ఎచేటఁ జూచిన బల్లెంబు లీఁటెగములు,
గలుగు రాయలదళ మెల్లఁ గలయ నించి,
యుదయగిరిచెంత నుదయించె నొక్క
వింత, యనుచు దుర్గములో మంది యలుకఁ
జెందె. కృష్ణ. ౩. ౨౫.

**మందిగండ్రలు.** వి. బ. ధాన్యవిశేషము.

సీ. మందిగండ్రలు నాగమల్లెలు తీఁగెమల్లెలు
కృష్ణనీలాలు వెలువడాలు,

గీ. ఆది యగుపేర్లు గలుగు వడ్లకని యింట,
నుండు శతకోటిబారువు లొక్కదినుసు ...
హంస. ౪. ౧౨౭.

**మంద్రిమ.** సం. వి. స్త్రీ. పుం. ౧. మాంద్యము,
మెల్లఁదనము. ౨. అవివేకము, తెలివితక్కువ.

**మందిరపశువు.** సం. వి. ఉ. పుం. మార్జాలము,
పిల్లి. (కల్ప, విల్యమ్సు.)

**మందిరము.** సం. వి. అ. న. ౧. గృహము,
ఇల్లు. ౨. దేహము, శరీరము. ౩. పట్టణము.
పుం. ౧. సముద్రము. ౨. లోడ. ౩. జాను
పశ్చాద్భాగము.

**మందీభవించు.** సం. అ. క్రి. మందగించు,
తగ్గు.

వ. అని యదృశ్యరూపం బైన భూతంబు రతీ
దేవి మరణవ్యవసాయబుద్ధి మందీభవింపం
జేసె ... హర. ౩. ౯౮.

**మందు.** వి. (క. మద్దు. త. మరుందు.) ౧. ఔష
ధము, వ్యాధినివారణసాధనము. సూర్యోదయ
వర్ణనము.

సీ. చక్రవాకములకుఁ జల్లఁగా మందుఁ ద్రాగిం
చిన చేంద్రంపు గిన్నె యనఁగ ...
ఉ. హరి. ౩. ౭౬.

గీ. వేల్పులకు మ్రొక్కి వెజ్జులవెంటఁ దిరిగి,
మంత్రవాదుల రప్పించి మందు లరసి,
కొడుకు లేదు తేమిటఁ దీర్పఁ గూడ
కున్నఁ, బుడుకు లేదుటు గొన్నాఁడు
పుడమిఱేఁడు.
విక్ర. ౩. ౧౦౮. ౧. ౧౩౭.

౨. వశ్యౌషధము, వలపు మందు, వశీకరణ
సాధనము.

చ. మన కనురక్తి హెచ్చె నిదె మం దని
కంఠముఁ గౌఁగిలించి ని, క్కినఫణిరాజ
వల్లి రొమ్ముతీఁగింపఁగనో యన ...
ఆము. ౧. ౮౦.

మ. ... నేఁడు చిత్రాంగిమందు, దులు నీకుం
దల కెక్కె నేఁ బరవశాత్మల్ గా రె
కామాతురుల్ ..
సారంగ. ౩. ౭౩. శుక. ౪. ౪౦.

౩. విషము; విషపదార్థము.

(వ్యవ.) మందులవాండ్రు మందు పెట్టి కాకు
లను జంపుదురు.

(వ్యవ.) ఆమె మందు పెట్టి సవతిబిడ్డను జంపి
నది.

౪. దీనిషష్ఠ్యేకవచన మైన 'మందునకుఁ'
అనునది కొన్నిపట్ల 'లేశ మైనను' 'ఎంత

మాత్రమును' అను నర్థ మిచ్చును. ఈ యర్థమున దీనికి వ్యతిరేకార్థక క్రియలోడనే ప్రయోగములు కానవచ్చుచున్నవి.

చే. ... ఉ, మ్మలికయు నబ్బు సాదుమది మందున కైనను లేదు వాసవా.
భార. శాం. ౪. ౩౯౫.

గీ. అతఁడు దిరుగని యూరును నతనిచేత, నడుగఁబడని మానవుడును నతఁడు చూరని, తోఁటయును జూడ లేదు ప్రంగువకు నైన, నగవు గా దిది నిక్క మానట్టు నందు. భోజరా. ౨. ౫.

మ. ... పంకేరుహా, ననఁ గీర్తింపని లేమ మందునకు నైనం గాన మూహింపఁగన్.
కాశ. ౧. ౩౨. కేయూ. ౫. ౧౬౧.

౫. ఉపాయము. తెరవు.

చ. ... అనిమొన దేవదానవుల కైనను గెల్వ నశక్య మిమ్మహా, త్ముని నొకమందు సెప్పెద సుతున్ హతుఁ డయ్యె నటంగ విన్నయం, తన యితఁ డాయుధంబు దిగఁ ద్రావి యచేష్టతఁ బొందు నప్పుడీ, తనిఁ బరిమార్పవచ్చు. భార. ద్రో. ౫. ౩౦౫.

దండకము. నీకూర్మిమీఁదన్ సంధాబిందువుల్ ఒందునానందకందంబు నీక్షించి సాక్షాత్పరిజ్ఞానమును గా విచారింపలేమిం జూపి కొంద అప్రాజ్ఞతం జందురుం డందు రామంగులం దెల్ప నేమందులున్ లేవు . వరాహ ౬. ౯౧. భార. కర్ణ. ౩. ౧౪౦.

౬. ప్రతిక్రియ, ప్రతీకారము.

ఉ. మాయలు గల్గుదుష్టులకు మాయపుదంగులె వంగు గాక ని, ర్మాయత నుల్లసిల్లెడు పరాక్రమలీలలు గెల్వ నెట్లు ...
భార. శల్య. ౨. ౫౨.

క. వినుము పురాతనజన్మం, బున జేసినయట్టి కర్మములఫలములు ప్రా, జ్ఞుని కైనఁ బొందు వానికి, మనుజేశ్వర మందు ధైర్యమహిమయు చుమ్మీ . . భార. శాం. ౪. ౧౪.

౭. నిదర్శనము, తార్కాణము.

క. ఇది నిక్కం బగు నేనియుఁ, దుది నీవుం బాండవులును దురితరహితులై, ముద మందఁ జూడఁ గనియెద, నది దీనికి మందు సువ్వె యంబుజనాభా ...
భార. ఉద్యో. ౩. ౧౯౪.

శ్లో. తేన సత్యేన కృష్ణ త్వాం, హతామిత్రం శ్రియా వృతం, అస్మా ద్విముక్తం సంగ్రామాత్, పశ్యేయం పాండవై స్సహ.
సం. భార. ఉద్యో. ౯౦. ౭౧.

౮. సురేకారము గంధకము మున్నగువానితోఁ జేసి తుపాకులు బాణసంచు మొదలగువాని కుపయోగించు నొకవిధమైన చూర్ణము, ఆగ్నేయచూర్ణము.

వ్యవ. మందు సరిగాఁ జేయక పోవుటచేత మతాబు బాగుగా కాలలేదు.

విశే. దుర్లభము, అరిది.

సీ. .. కూడు దానఁ గలిగె, నేని కూరగుట మందు ఆము. ౪. ౧౨౭.

నల్లమందు = నల్లగానుండు ఒక విధమైన మాదక ద్రవ్యము, అహిఫేనము.

వ్యవ. చీనా దేశస్థులు నల్లమం దెక్కువ వాడుదు రఁట.

నీలిమందు = నీలిమొక్కలనుండి తీయు నీలి రంగు గల యొకానొక ద్రవ్యము.

వ్యవ. చాకలి బట్టలకు నీలిమందు వాడును.

మందుతోఁగూడిన కొన్ని లోకోక్తులు:

సా. పెరటిచెట్టు మందునకు రాదు. (అతి పరిచితములగు వస్తువులయెడ ఆదర ముండ దనుట.)

సా. మందు దన్న మాయ మగును (ఎట్టి సులభ పదార్థ మైనను గావలసినప్పుడు దొరక దనుట.)

సా. మనోవ్యాధికి మందు లేదు.

సా. మానినది మందు. బ్రతికినది యూరు.

సా. మందు దన్న బ్రమ్మ కొల్లఁ దెచ్చుట. (మందునకై వేరో, ఆకో, పువ్వో కొంచెము లేక చెట్టంతయుఁ జెఱికి తెచ్చుట; కొంచెము గావలసియుండఁగా నంతయుఁ గొనివచ్చుట.)

మ. ... ఎది నీస్త్రాశ్రీ క్రోధముల్ సందడిం, పవిరిం బోక ద్రుమంబు పైకొని పతి న్మందన్న మా కొల్లఁ డే, నవధిం బెట్టిన సత్యవీ వహహ! కావా? భామినీ నావుడున్.

ఆము. ౫. ౭౪.

సా. మంచివానికి మాటాడమియే మందు (యోగ్యునకు మాటలాడకుండుటయే పెద్ద శిక్ష.)

మందులగట్టు = మందుచెట్లుండు పర్వతము, ద్రోణపర్వతము.

గీ. అప్పు డెలుఁగులరాయని యానతి గొని, గాడ్పుకొమరుఁడు మందులగట్టు దెచ్చి, కోఁతిమూఁకల మనిచె

అచ్చ. రా. యు. ౨౭౨.

ఇట్లే మందులకొండ, మందులమల మొ.

సీ. లంకఁ గాల్చినవానికింక మెంతు రదేమొ హెచ్చుమందుల కొండఁ దెచ్చు టరుద.

శుక. ౩. ౨౩.

ఆ. ఆకసమున వచ్చునప్పు డమ్మందుల, మల వెలుంగు ప్రొద్దువెలుఁ గటంచు, నదరి చూచి రామఁ డొలుచు నింగికిఁ, దూపు గూర్చె యొయ్యఁ దొడరుటయున.

అచ్చ. రా. యు. ౪౩౦.

జ. మందాకు, మందుపట్టెడ, మందుమల, మందులమారి, మందులవాండ్రు, మందులాఁడి.

మందుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) ౧. మూఢుఁడు. ౨. అల్పుఁడు. ౩. అపటువు, అసమర్థుఁడు. ౪. నిర్భాగ్యుఁడు. ౫. స్వైరుఁడు. ౬. రోగి. ౭. మృదువు, అతీక్ష్ణుఁడు. ౮. ఆలసుఁడు. (వి. ని.) ౯. కనిష్ఠుఁడు.

వి. అ. పుం. ౧. శని. ౨. యముఁడు. (త్రి. ని.)

మందుపట్టెడ. వి. (√మందు) బాణశాల, బాణసంచు చేసెడిసాల.

గీ. మందుపట్టెడపేరు చెన్నొందు బాణ, శాల యనఁగను.

ఆం. భా. ౨. ౨౫.

మందుపిచ్చిక. వి. మిథుని యనుపక్షి. (చి. ని.)

మందుమల. వి. (మందు + మల) మందుచెట్లుండు పర్వతము, ద్రోణపర్వతము.

గీ. ద్రోణపర్వత మొప్పు మందుమల యనఁగ.

ఆం. భా. ౨. ౨౮.

మందుర. సం. వి. ఆ. స్త్రీ. ౧. గుఱ్ఱపుసాల. ౨. పఱుపుమంచము మొదలగు పండుకొనఁ దగినవస్తువు. (వే. ని.)

మందురకుఁడు. సం. వి. అ. పుం. గుఱ్ఱపువాఁడు, మందడీఁడు. (శ. ర.)

మందులమారి. విణ. (మందులు + మారి.) ౧. మరులుమందు పెట్టువాఁడు, పెట్టునది. వశ్యక్రియావేది; వశ్యక్రియావేదిని.

ద్వి. పాపజాతులు విసపరులు వెడ్డరులు, మాటలమంచులు మందులమార్లు.

పండితా. పురా. ౧౧౬.

సీ. వశ్యక్రియాశేది వఱలు మందులమారి యన.
అం. భా ౩. ౧౪.

**మందులవాండ్రు.** వి. బ. (మందులు+వాండ్రు) మందులమ్ముకొని జీవించు నొక యాటవిక జాతివారు.

వ్యవ. ఊరివెలుపల మందులవాండ్రు గుడిసెలు వేసికొన్నారు.

**మందులాఁడి.** విశే. (మందులు + ఆఁడి) మర్దు మందులు పెట్టునది.

ఆ. మందులాఁడి చెడుగుమానిసి బూతంబు, పిసిడి బిచ్చెగాండ్ల కెల్లగుదియ .
చెన్న. ౨. ౨౪.

**మందెమేలము.** వి (సం మంది (దె) వాళ.)

౧. చనవు, అతిపరిచయము, జంకుకొంకులు లేకుండుట.

క. తనయింటిదీప మనుచును, విను ముద్దిడుకొనఁగఁ దలఁచుచీఁడి గలఁడే, నను మార్కొనఁగఁ దలంచెదు, మును పెంచిన మందెమేలమున నాలమునన్.
విక్ర. ౬. ౧౫.

ద్వి. చిన్నప్రాయమునుండి చెలిమితోఁ గూడి, మన్నించ టం జేసి మందెమేలమున, బుద్ధి చెప్పెద నంచు భూవిలో లేని బుద్ధులు చెప్పెదు చోద్యంబు గాను
ద్వి. శ. పా. ౧. ౧౫. పా. ౭. పం.

క. అని చెనకుచు నది తను డా, సిన ముని గోపించి యోసి కెదగ వెఱపు మా, లి నను గదియంగ వచ్చెద, మునుకొని యీ మందెమేలమున కోర్వఁ జాలి.
భోజ. ౪. ౧౫౭.

గీ. ఇందు రమ్మన్న వేగ అో మ్మెక్కు మందె, మేలమున లోకమాతవు మే లటంచు, బాగడులోకుల కిచ్చు మెప్పుగ ధనంబు, సెల్లఁ జపలత విహరించు నింట నిలదు.
ఉ. హరిశ్చ. ౨. ౬౯.
ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౪. పం.

౨. స్నేహము, చెలిమి.

గీ. పావకుండును గపటంపు భూవరుండుఁ, దమ్ముఁ గడుఁ జేరి మందెమేలమ్ములోడ, నున్న వారికిఁ గీడు చేయుదురు వారి, కంచిత స్నేహమున మంట లధిక మగును.
విపు. ౭. ౧౦౫.

మ. తనకుం గూర్చువధూమణుల్ చనవుచేత న్మందెమేలంబునం, కను, వేసారియు నవ్వులాటలకుఁ బల్కం బల్కువాక్యంబు లె, ల్లను నిక్కంబులుగాఁ దలంచి తగ దగ్గ న్నిర్నిమిత్తంబు ము, క్కున సే యుండుఁ గదా మనీశ్వరులకుం గోపంబు పాటోపమై.
విప్ర. ౪. ౭౧.

౩. ఉపేక్ష, ఒప్పరికము.

సీ. మేనత్త యని మందెమేళంబు సేయక దేవకి మాటలోఁ దిరుగవమ్మ
ముకుంద. ౩. ౩౧౯.

వ. సితచ్ఛత్ర చామరశంఖ కిరీటచిత్ర శయ్యా సౌధ సింహాసనంబులు గైకొనుట మనమందె మేలంబునం గాదె ..
భాగ. ౧౦. ఉ. ౫౭౮.

శ్లో. కృష్ణరామస్తుల్యతాం సీతా అస్మద్దత్తనృపాసనాః, చామరవ్యజనే శంఖమాతపత్రం చ పాండరం, కిరీటమాసనం శయ్యాం భుంజం త్యస్మదుపేక్షయా.
సం. భాగ. ౧౦. ౬౮. అధ్యా. ౨౬. శ్లో.

౪. గర్వము, అహంకారము.

ద్వి. మఱుమాట లిచ్చితో మందెమేలమున, వెఱపుసెడితో మాట వినవో మార్పడితో
పండితా. పురా. ౧౫౪. పా.

ద్వి. మనమార విను పిల్చి మగఁడు సెయ్యి
మున, ననయంబుఁ జేరరమ్మని చేన
వొఁగి, మేల మిచ్చిన మందమేలంబు
మాని, తాలిమితోడ నాతనిచిత్త మెఱిఁగి,
నవతుగా నీకోడిసవతులు చూచి, యవు
నౌను యని కొనియాడ నెల్లపుడుఁ, గన
లక భూదేవిగతి నుండు మమ్మ.

ద్వి. పరమ. ౫. ౪౩౯. పా. పండితా.
వాద. ౨౩౩ పా.

౫. గేలి, పరిహాసము

గీ. క్రేణి యనఁ దచ్చన యనంగఁ గేరడ
మన, గేలి యన మేల మన మందమేల
మనఁగ, నాట యనఁ దస్తరి యనఁగ
హేళి యనఁగఁ, బొలుచుఁ బరిహాసములు
మాతృ భూతలింగ. ఆం. భా. ౧. ౧౩౯.

**మందోదరి.** సం. వి. ఈ. స్త్రీ. రావణాసురుని
పత్ని. (అహల్యాది పంచకన్యలలోఁ జేరినది.
అహల్య, ద్రౌపది, తార, తార, మందోదరి.
వీరైదుగురు పంచకన్యలు.)

**మందోష్ణము.** సం. విశే. (అ. ఆ. అ.) నులి
వెచ్చనిది, కొంచెమువేడి యైనది.
వి. అ. న. కొంచెమువేఁడి, నులివెచ్చన.

**మంద్రభద్రము.** సం. వి. అ. పుం. మంద్ర
జాతి యేనుఁగుయొక్కయు భద్రజాతియేనుఁగు
యొక్కయు లక్షణములు గలయేనుఁగు.
(వై. ని.)

**మంద్రము.** సం. విశే. (అ. ఆ. అ.) గంభీర
మైనది (ధ్వని.)
వి. అ. పుం. ౧. వాద్యభేదము. ౨. గజ
భేదము. (వై. ని.)

**మంపిల్లు(లు).** అ. క్రి. (√మంపు.) ౧. మత్తిల్లు,
మదించు, క్రొవ్వు.

సీ. క్రొల్చులుల్ మంపిల్లి గొటగొట మని రొప్పి
ఒలువింగముల నైనఁ బట్టఁజూచు.
సారంగ. ౧. ౭౮.

౨. చొక్కు, పరవశత్వము నొందు.

ఉ. మొక్కవ ముక్కుఁ గూర్చి రవముల్
నిగుడింపుచుఁ దోన పాయుచున్, మక్కు
వడాయుచుఙ్ గలసి మంపిలు నౌర చకోర
దంపతుల్. ప్రబంధ. ౧౧౪.

3. నిద్రమబ్బుతో నుండు, తూగిపడుచుండు.
(బ్రౌ.)

**మంపు.** వి. (త. మప్పు.) ౧. మత్తు.

(క) నిద్రచేఁగలుగు మైమఱపు, పారవశ్యము.

గీ. కమ్మ కస్తురిగుళికలు తమ్మిరేమ, నిదుర
మంపునఁ బుక్కిట నించి పేలు, కొంచి
వేసిన నుమిసినాఁ గమలముకుళ, తోట
రంబుల నెలఁదేఁటికొదమ లెగసె.
పారి. ౨. ౭౩.

సీ. తెలిగన్నుదమ్ములఁ దేఱునిద్దురమంపు వడసు
నెమ్మది భయం బావరింప
ఘటికా. ౨. ౨౧౪.

సీ. వాడినతీఁగైవడి నున్నవేనితోఁ గెంపు
కన్నులనిద్రమంపుతోడ
వ్యా. వి. 3. ౯౧. యయా. ౫. ౨౬.

(చ) కల్లు మున్నగుమాదకద్రవ్యములు సేవిం
చుటచేతను, సౌందర్యవిలోకనాదులచేతను
గల్గు, మైకము.

గీ. వాలుఁగన్నులకెంపు హైప్రాలుమంపు ...
దశా. ౯. ౩౩.

ఉ. పేశలబంధకైశికయు భీతిమదశ్రునిపాత
ముఖ్యచే, ప్టాశబలత్వ సక్తతను శంపయు
నై కనుమంపు దాల్చుచున్
పాండు. ౫. ౧౫౪.

ఉ. మం పెసఁగ నుటాకు లవమాత్రముచేతను ముజ్జగంబు మో, హింపఁగఁ జేయుభారం మీఁక నీవు వసి ంచితి గాన .

విజ. వి. ౧. ౨౧.

(ట) రూపయౌవన విత్తాదులచేఁ గల్గు మదము, మత్తు.

సీ. ఎలజవ్వనపు మంపు గలిగి పెంపున నించు చిలుకలఁ బాన్పుపైఁ జేర్చిచేర్చి .

యాయా. ౪. ౨౫.

౨. ఉద్ధతి, విడిసిపాటు

గీ. జలధు లంతంతకును మంపు జాలి నింక, ధరణి చక్రంబునైవడిఁ దిరుగఁ జొచ్చెఁ, గారవేంద్రు ప్రయాణ భేరీరవమున ...

చిత్ర. భా. ౭. ౩.

౩. ప్రకాశము.

గీ. మంపు దులకించు ముత్తిగ మానికముల, మొలకనిద్దాక దానిసొమ్ముల మెఱుంగు, లుమ్మడిగఁ గ్రమ్మి నివ్వెన నొఱపు చూప, రాజవరుఁ గాంచె లేచి యా రాజ వదన.

రసిక. ౩. ౪౭.

విశే. మత్తు గలిగించునది.

గీ. మంపు సాంబ్రాణి ధూపంబు పెంపు పెంపు, వంపు మరువంపు టిండీవరంపు ఱంపు, గుప్పు మృగమదవాసనల్ గుప్పు రనఁగ, సాటి లేకొప్పు నీయింటి జాఱు కొప్పు.

శశాం. ౩. ౪౯.

జ మంపిల్లు, మంపుగొను, మంపుగొలుపు.

మంపుగొను. అ. క్రి. (మంపు+కొను) మత్తిల్లు, మదించు, క్రొవ్వు.

గీ. నల్లసేనగుండులు నడచినట్లు, మంపుగొని మే రొయుంగక మలసి మలసి సెనరువారికి సుఱుకంగ సాగని మన్నుఁ, బోతు లెడ చొచ్చె దాఁకెడు పొదలు వోలె.

ఉ. హరి. ౪. ౨౭.

మంపుగొలుపు. స. క్రి. (√మంపుగొను) మైకము కలిగించు, మత్తిల్లఁజేయు. (శ. ర.)

మంబరము. వి. దహనము, కాల్చుట. (చూ. మంబరముచేయు.)

జ. మంబరముచేయు.

మంబరముచే(సే)యు. స. క్రి. (మంబరము + చేయు) దహించు, కాల్చు.

ఉ ఆపురుషోత్తమాయుధము నంతకు ము న్గనుగొన్న భీతిఁ గా, శిపతిఁ జేరి యుప్ప తిలఁ జేసినసిద్ధుఁడు వంచుఁ గాఁగిటం, జేపడఁ బట్టి మంబరముచేసె దిగంబర వేష కృత్య

ఉ. హరి. ౩. ౧౫౩.

(శ. ర., వీరేశ., చిని. పా. మంబరముచేయు. వావిళ్ల పా.)

మకమక. వి. (క. మంకు) ౧. తేజోహీనత, కాంతిహీనత.

క. ఆనఁ జిఱునవ్వు మొగంబునఁ, దనరఁ జకచ్చకితకర్ణతాటంకరుచుల్, దమకన్ మకమక చినుకన్, గనకాంగి పరాయు ల్చెలంగఁగా నిట్లనియెన్. శశాం. ౩. ౫౯.

౨. తేజోహీనతను దెలుపు అనుకరణము.

(వ్యవ.) దీపము మకమకలాడుచున్నది, కొంత మెగసన ప్రోయును.

మకరందము. సం. వి. అ. పుం. ౧. పూఁదేనె, పుష్పరసము. ౨. కుందము, మొల్ల. ౹. వి. అ. న. కింజల్కము, కేసరము.

మకరందవతి. సం. వి. ఈ. స్త్రీ. పాటలలత.

మకరకంఠి. సం. వి. ఈ. స్త్రీ. నడుమ మొసలి ముఖ మేర్పఱచిన కంఠ భూషా విశేషము. (శ. ర.)

**మకరకుండలము.** సం. వి. అ. న. మకరము వలె నుండు చెవులపోగులు, మకరమువలె నుండు కర్ణభూషణము.

**మకరకేతనుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

**మకరకేతువు.** సం. వి. ఉ. పుం. మొసలి టెక్కెమువాఁడు, మన్మథుఁడు.

**మకరతము.** సం. వి. అ. న. గారుత్మతమణి.

(ఈ రూపమునకు ప్రమాణము లేదు. కాని ఈ క్రింది పద్యమున ప్రాసస్థానమం దున్నది.)

చ. సకి యకలంక తోయకణ సంగత పద్మప లాశ మధ్యమా, ల్లకరుచు లొప్పెడిన్ గొలఁకులచ్చి నినున్‌గని చెల్మి హెచ్చఁగా, మకరతపాత్రలో విమలమౌక్తికముల్ జత గూర్చి రత్నదీ, పకలన నిచ్చునారాతుల భావమునన్ గనుఁగొంటె యిచ్చటన్.

ఉ. రా. ౬. ౪౬.

**మకరతోరణము.** సం. వి. అ. పు. న. మొసలి రూప మేర్పడఁ జేసిన తోరణము. (శ. ర.)

**మకరధ్వజుఁడు.** సం. వి. అ. పుం. (మొసలి టెక్కెమువాఁడు.) మన్మథుఁడు.

**మకరబిబ్బి - మకరబ్బి.** మి. వి. మకరతోరణము, దేవతలను గురువులను రాజులను ఊరేగించునప్పుడును జయోత్సవములందును ముందు గొనిపోవు గౌరవచిహ్నము.

మ. జతనన్ దక్ష్వరి జంభభిన్నగరమున్ సాధిం పఁగాఁ గోరి యీ ప్సితముల్ చేకుఱ నెత్తు ఒక మకరబిబ్బిలో యనక్ మించునం, చిత కక్రోకల సాధజాలములు ...

చంద్రా. ౨. ౧౬.

**మకరబ్బి - మకరబిబ్బి.** మి. వి. మకరతోరణము.

మ. ... గొజ్జంగియున్, మకరబ్బి గురుజాప రుంజా వెలయన్ మారుండు భే యం చనన్, కుకఘోటిం గుదెఁ దట్టి మీఁటె వడిగా కుత్రాము మోసాలకున్.

పార్వ. ౨. ౧౧౪.

**మకరము.** సం. వి. అ. పుం. ౧. మొసలి. ౨. (జ్యోతి) మకరలగ్నము. ౩. మకరాకారముగా సేనలను పన్నుట, మకర వ్యూహము. ౪. మొసలివలె నుండు చెవులపోఁగు, కర్ణభూషా విశేషము. ౫. మకరముద్ర (మొసలివలె ముడిచిన చేతులు.) ౬. కుబేరని నవనిధులలో నొకటి.

**మకరవాహనుఁడు.** సం. వి. అ. పుం. వరుణుఁడు.

**మకరాంకుఁడు.** సం. వి. అ. పుం. ౧. మన్మథుఁడు. ౨. సముద్రుఁడు.

**మకరాకరము.** సం = మకరాలయము.

**మకరాలయము.** సం. వి. అ. పుం. ౧. సముద్రము. ౨. నాలుగు సంఖ్య.

**మకరిక.** సం. వి. అ. స్త్రీ. మకరికాపత్రము. (శ. ర.)

**మకరికాపత్రము.** సం. వి. అ. న. స్త్రీలకు చెక్కిళ్లు లోనగుతావులయందు అత్తుకతో వ్రాయు మకరరూప మగు రేఖ. (శ. ర.)

**మకరివల.** వి. మృగములను బట్టెడు ఒకవిధమైన వల.

వ. ... తెరచీరకట్టలు ప్రోఁగుచుట్టలు దొడ్డివల లేటివల కుందేటివల పందివల సక

దండలను మకరికల మొలికల మొదలుగా
వలయు వలలును ... కాశీ. ౩. ౭౮.

గీ. ... ద్రొడ్డి, వలలుఁ బంగిటీకలలును బలువు
మకరి, వలలు మొదలుగఁ గలిగినవలలు
మజియు. య యా. ౧ ౩౮.

**మకిల.** వి. (సం. మలినమ్.) ౧. మలిన, మాలి
న్యము.

(న్యవ.) అద్దము మకిలపట్టినది.

౨. నలుపు. (శ. ర.)

విశే. మలినము, మలిక యైనది. (బ్రౌ.)

ఇ. మకిలక్రోవి.

**మకిలక్రోవి.** (మకిల + క్రోవి.) నల్లనిక్రోవి.
ఒకవిధ మైన సుషిరవాద్యము, ఊఁదెడు నాగ
నాగ వాద్యము.

సీ. ... బూరగొమ్ములు కంచుమీరణములు,
మకిలక్రోవులు వీరమద్దలల్ .
మొ. రా. యు. ౩. ౨౬.

**మకుఁడు.** సం. వి. అ. పుం. మాలాకియందు
వైశ్యునివలన పుట్టిన సంకరజాతివాఁడు.
(వై. ని.)

**మకుటము.** సం. వి. అ. న. కిరీటము.

**మకుతి.** సం. వి. ఇ. స్త్రీ. శూద్రశాసనము.
(త్రి. ని.)

**మకుర(ల)ము.** సం. వి. అ. పుం. ౧. అద్దము
౨. పొగడవృక్షము, పొగడచెట్టు. ౩. మొగ్గ,
కళిక. ౪. కులాలదండము, కుమ్మరిసారెఁ
ద్రిప్పెడి కఱ్ఱ.

**మకురు.** విశే. (తె. మక్కళి.) మూర్ఖుఁడు,
మొండివాఁడు. (చూ. మకురుతనము.)

ఇ. మకురుతనము.

**మకురుతనము.** వి. (√మకురు.) మూర్ఖ
త్వము, మొండితనము. (శ. ర.)

**మకుష్ట(క)ము.** సం. వి. అ. పుం. వనముద్గము,
అడవిపెసలు. శ్రీ.

**మకుష్ఠము.** సం. విశే. (అ. ఆ. అ.) మంథ
రము, మంద మైనది. వి. అ. పుం. అడవి
పెసలు. శ్రీ. (త్రి. ని.)

**మకూలకము.** సం. వి. అ. పుం. ౧. ముకు
ళము, మొగ్గ. ౨. దంతివృక్షము, నాగదంతి
చెట్టు.

**మక్కు = మక్కునగాయ.** (సం. మక్కలః.
క. మక్క.) బిడ్డలను గన్నస్త్రీకిఁ బొత్తి
కడుపునఁ బుట్టెడి యపాయకర మైన నెత్తురు
గడ్డ. (శ. ర.)

ఇ. మక్కునగాయ.

**మక్కునగాయ = మక్కు.** వి. (మక్కు +
కాయ. వ్యుత్పత్తివిపర్ణాగమము). (శ. ర.)

**మక్కరాయి.** వి. (సం. మకరతమ్.) మరకత
శిల.

వ. ... ఎక్కువవెల పెక్కువ గల మక్క
రాల మిక్కుటంపుఁ దిన్నియల వన్నియలు.
ఇందు. ౧. ౧౪.

**మక్కల్లము.** సం. వి. అ. పుం. మక్కున
గాయ, ప్రసవించినస్త్రీకి ప్రసవరక్తావరోధ
మున గర్భమునఁ బుట్టెడి యపాయకర మగు
నెత్తురుగడ్డ; ప్రసవ రక్తావరోధమున కలుగు
శూల.

**మక్కళించు.** స. క్రి. ౧. సరిచేయు, సమా
నము చేయు.

గీ. తొడలు వనఁటికంబంబుల మొడలుఁ బోఁక,
బోదెలు తెలుంగులను బరపుష్టరుతులు,

మాటలును గీరభామలు మక్కళించి,
చిగురుఁబోఁడులు వనకేళి చేయఁజేయ . .
ఉ. హరి. ౫. ౫౦.

౨. ఉబికించు, ఉబ్బునట్లు చేయు.

సీ. వినేయ మైన యుద్యానంబులవణిచే నక్క-
ళించినపొట్ట మక్కళించి ...
మనుచ. ౧. ౫౯.

౩. కూర్చు, అమర్చు.

సీ. సేసకొప్పునఁ జుట్టు శిఖి పింఛరింఛోళి
మక్కళించిన జిల్గు ముడుఁగుపాగ
కాశీ. ౩. ౧౧౭.

సీ. మారేడుబుజ్జలో మక్కళించుక సందిఁ
గట్టిన చంద్రశేఖరుఁడు వెలయ ...
హంస. ౧. ౧౭౨.

(సరిపఱచు అని శ. ర.)

౪. పెంపొందించు, వృద్ధిపొందించు.

సీ. కరికరశీకరకణములు విక్రాంతమకుటముక్తా
రుచి మక్కళింప . .

గీ. వరుణుఁ డరుదెంచె నిక్రమోద్ధురత మెఱయ.
ఉ. హరి. ౬. ౨౫౨.

(ఇట అ. క్రి. సరిపోలు. అని. శ. ర.)

అ. క్రి. ౧. జ్వరాదిరోగము తిరుగఁ బెట్టు,
మాని మరల వచ్చు.

(వానికి జ్వరము మక్కళించుకొన్నది. శ. ర.)

౨. మిళిత మగు, కలియు.

సీ. శరభనినాద విస్రస్తంబులై గమనించు
కంఠీరవ నిక్వణంబుఁ, గంఠీరవారవ స్ఖలి
తంబు లై చను భీత వన్యకరీంద్ర బృంహి
తంబు, గీ. మక్కళింప ...

(మక్కడింప. ముద్రి. పా.)
పి. శకుం. ౨. ౫.

౩. వ్యాపించు, ప్రసారిత మగు.

సీ. మక్కళించిన శావుమంజిళ్ల పెంజెర లుఱుగ
రంబులఁ బట్టి యొత్తువారు ...
హైమ. ౬. ౧౦౮.

(సరిపడు అని శ. ర.)

**మక్కా.** వి. (సం. మఖః మ్లేచ్ఛ, దేశభేదే
అని వాచ. హి. మక్కా.)

ఆరేబియాదేశములోని యొక పెద్దపట్టణము,
యవనకాశి, మహమ్మదు జన్మస్థానము.
చూ. మక్కాచెంబు.

జ. మక్కాచెంబు.

**మక్కాచెంబు.** వి. (మక్కా + చెంబు.)
మక్కాపట్టణమున చేయు నొకవిధ మైన
పాత్రము, కూజా.

శా. మక్కాచెంబులఁ జల్లఁ జేయ వడగండ్లం
బోలు సౌరభ్యస, మ్యక్కద్వీపవతీజలంబు
జన మాహా యంచుఁ ద్రావెం దమిన్ ..
పాంచా. ౪. ౫౧.

**మక్కి¹.** విణ. (√మక్కు¹) నిర్మాంసము,
సుషిక్కించినది.

ద్వి. మిట్టనుదురు మక్కిమెడయును బ్రాఁకు
పట్టిన యురమిడిపండ్లు . అమర ...
శివుఁడు ... అంత్యజభావంబు దాల్చి.
పండితా. దీక్షా. ౪౦. పా.

గీ. మందగొడి రెప్పగొరిపెలు మక్కిరొండ్లు,
బరకుమురుకొమ్మలును పోటుబర్లు.. యొక
కీడ యొద్దఁజేరి. హంస. ౫. ౩౧.

**మక్కి².** వి. (సం. మక్షికా. హిం. మఖ్ఖి. క.
మక్కి = ప్రతి.) ఈఁగ.

(ఇది (మక్కికి మక్కిగాన్' అను వ్యవహారము
నందే కనఁబడు చున్నది.) మక్కికి
మక్కిగా = యథాస్వరూపమున, ఉన్నది
యున్నట్లుగా, సరిగా.

(వ్యవ.) వాఁడు దానిని ఎక్కికి మక్కిగా వ్రాసి తెచ్చినాఁడు. (ఇది లేఖకుని బుద్ధి మాంద్యమును సూచించును.)

**మక్కించు** = ప్రమక్కించు. స. క్రి. (√మక్కు.) ౧. చంపు, వధించు.

క. అక్కాంతఁ బుష్పకముపై, నెక్కించు కొని చేని చూచి యిది రాఘవులన్, మక్కించె మేఘనాదుం, డొక్కఁడ యని యతని యాస యుడుపుఁడటంచున్.
రా. మా. ౭. ౨౭.

క. నిక్క మగుపాపములచేఁ, జిక్కితివి నిశాతశూల శిఖరాగ్రమునన్, మక్కించి నీదుమాంసము, నక్కలఁ గుక్కలును జేరి నముల నొనర్తున్. (శ. ర. పా. మ్రక్కించి ముద్రి. పా.) భాగ. ౭. ౩౯౪.

౨. వశింపఁ జేయు, వెఱచు.

ద్వి. కిక్కిక్కజనుఁ దుర్వినోదవుపాపముల మక్కించు వేణుగుల్మము నగ్నివోలె.
ద్వి. భాగ. ౭. స్కం. (శ. ర.)

౩. నిర్జించు, జయించు, గెలుచు.

క. దిక్కుల రాజుల నెల్లను, మక్కించి ధనంబు గొనుట మయకృతసభ ము, న్నెక్కుట జన్నము సేయుట, నిక్కము వారి మనకు దండ నిలిచినఁ గాదె. (శ. ర. పా. మ్రక్కించి. ముద్రి. పా.) భాగ. ౧. ౩౭౧.

**మక్కిలు(ల్లు)** = మక్కు¹. అ. క్రి. (√మక్కు¹) నశించు.

క. అక్క కపాయము్మను బా, ల్యక్కర యను నశ్వగంధి సతతము నియ్యన్, మెక్కల పుటప్పిగతములు, మిక్కిలి పెను త్రోవఁ జనును మండలమునకున్. (చి. కి., చి. వి.)

**మక్కు¹** = మ్రక్కు. అ. క్రి. (త. మక్కు.) ౧. కాంతి విహీన మగు.

సీ. వెలవెల నై నభోవీథిఁ దారలు మక్క...
కన్యకా. ౭. ౩౧౫. (శ. ర. ప్రా.)

౨. నవయు, కృశించు, చిక్కు.

ఉ. .. విధాత నిర్దయుం, డక్కట నీరసం బ్రణము నాని మహోగ్రవనాంతరంబు లన్, మక్కెడునీవు నిట్టి యవమానము మానము దప్పఁ జేసెనే. (శ. ర. పా. మ్రక్కెడు ముద్రి.) నా. పంచ. ౨. ౧౪౯.

౩. (రోగముచే) విరూప మగు, రూపుచెడు.

క. స్రుక్కిన యంగుళములు దల, మెక్కిన దేహమును గాంతి రొదలిన మొగమున్, మక్కిన చెవులును ముడిఁగిన, ముక్కును నై వచ్చి మహుఁడు ముద్దియఁ గనియెన్.
భోజరా. ౧. ౧౦౧.

౪. మగ్గు, ఉక్కచే నుడుకు.

వ. ... మఱియు నొక్కరొడ నెడ మీని మానినియుక్కలఁ జిక్కి యుబ్బపాఁతర లను మక్కినక్రియ నూర్పుగాడ్పుల కవకా శంబు లేకునికి తమలోఁ దా రొకరి కొకరు పదిరిగొని ప్రబంధ. ౪౭.

౫. చచ్చు, మృతినొందు.

చ. అక్కలంగవప్రక్కం జిక్కి మక్కిన మర్కటులు రక్కసులు పెక్కండ్రు గలరు. రామా. ౭. ౧౫౪.

వ. ఇట్లు పెక్కువరుసలు రక్కసుల యుక్కి పంబున మక్కినం బ్రతికింప నుండి వెండియు నొక్కనాఁడు ..
యయా. ౩. ౧౨౧.

౬. (త. మక్కు = మాంద్యము.) ౧. మాలిన్యము, మురికి.

సీ. దూళ్లమ కెక్కు మంగళ్లతిప్పలు రేఁగు
పడువున గాలి నాడెడు సెలకలు ...
ఆము. ౭. ౧౪.

విణ. మాసినది, మలిన మైనది.

సీ. మక్కు మాసినది నా మలినంబు విలసిల్లు.
ఆం. భా. ౩. ౧౫.

జ. మక్కి1, మక్కించు, మక్కిలు మక్కుడు.

**మక్కు²**. వి. నితంబైకదేశము, కుంటి.

సీ. మల్లు, మక్కు నాఁ జెను నితంబైక
దేశము .. ఆం. భా. ౨. ౧౩౭.

గీ. కదిసి కురువీరు లభిమన్యుఁ గక్కసింప,
నిక్కుజగి నొక్కవెంగిఁ జెక్కుకుక్కు
లెక్కు, పిక్క ప్రక్కయు డొక్క
పేరక్కు చెక్కు, మక్కు చిక్కించు
కొన స్రుక్కు నక్కటియును.
రా. వి. ౩. ౭౪.

**మక్కు³**. వి. (క. మక్కు) బల్లలు మొదలగు
వాని యతుకులును సందులును కనఁబడకుండ
రాచుట కుపయోగించు నొకవిధ మైనజిగురు
పదార్థము, లప్పము.

(వ్యవ.) వడ్రంగి పెట్టెలకు మక్కు పెట్టి
నాఁడు.

**మక్కుడు¹**. వి. (√మక్కు1) ముఱికి, మాలి
న్యము.

గీ. త్రెంచి గురివింద పేరు త్రిప్పించు వడిన,
మేఘ మనఁ దోఁచునొక కత్తిమేని
యొఱుకు, ప్రాఁతగొత్తుట మక్కుడువట్టి
యున్న, యంపగమి ముందటం బెట్టి
యర్ఘుపడిరి. కళా. ౮. ౮౯.

**మక్కుడు²**. విణ. గుప్తము, దాఁచఁబడినది.

(చూ. మక్కుడుచేయు.)

జ మక్కుడుచేయు.

**మక్కుడుచేయు**. స. క్రి. (√మక్కుడు²)
(సొమ్ము) ఇతరులకుఁ దెలియకుండ దాఁచు.

(వ్యవ.) వాఁడు తన యన్నదమ్ములకుఁ దెలియ
కుండఁ జాలసొమ్ము మక్కుడు చేసి
నాఁడు.

**మక్కులము**. సం. వి. అ. పుం. శిలాజతువు.

**మక్కువ**. వి. ౧. ప్రేమ, కూరిమి.

సీ. నెయ్యము నెయ్యమి నెమ్మి నేస్తము నెన
రెలమి మే ల్కూరిమి చెలిమి యరితి.

గీ. బాలి ప్రేమండి మచ్చిక మక్కువ యనఁ,
బ్రేమ దోఁచును. .
ఆం. భా. ౧. ౧౩౭.

(క) వాత్సల్యము, పుత్రాదులయం దుండు
ప్రేమ.

క. అనిన నతఁ డేను మూర్ఖుఁడ, మనమున
నీయందు గలుగు మక్కువఁ గర్జం, బౌన
రఁగ నుపదేశింపం, జనుదెంచితి ...
భార. అర. ౪. ౨౭౪.

ఉ. మక్కువ రేఁగి నెయ్యపుఁగుమారునిఁ
జంపుట కంతరాయ మై, యక్కటికంబు
పుట్టుటకు నల్లన వచ్చి భవాని ...
హర. ౨. ౯౮.

చ. . నన్, మమతను జేరఁగాఁ బిలిచి
మక్కువచే నను నొక్కకేల మే, నిము
రుచు నీకు నొక్కమగనిఁ ఘటియించితి
నంచుఁ బల్కుచుఁ. ప్రభా. ౧. ౧౨౫.

(చ) స్త్రీ పురుషుల పరస్పరానురాగము,
వలపు.

ఉ. ఒక్కొకవేళఁ బద్మముఖు లొల్లమి సేయుదు
రొక్కవేళఁ దె, న్మక్కువ నాదరింతురు.
మనుచ. ౩. ౭౯.

గీ. ఆ నితంబిని మక్కువ ననఁగి పెనఁగి, యింత
పొంపిరివోవ న స్నేహితాభ్యవనఁగఁ, దలఁచి
పొందిన నది జన్మఫలము గాఁడె.

భార. విరా. ౨. ౭౭.

ఉ. ... ఉరస్థలంబుఁ జ, న్నుల సెదురొత్తి
మక్కువ ననుం బిగికౌఁగిట జేర్ప నేఁటికే.

పారి. ౧. ౧౧౪.

(ట) స్నేహము, మైత్రి.

ఉ. రక్కసులార మీరలు సుర ల్సమయత్న
బలప్రయాసులై, యుక్కడఁలిన్ మథింప
జనియించిన యీసుధ నీరు వారఁ బె,
మ్మక్కువతో భుజింప నయమార్గము ...

దశా. ౨. ౩౪౩.

ఉ. ఓ నృపపుత్ర మద్గురునియోగమునం జని
యేను నిత్యముక్, గానమధూములన్
వలయుకాయలు పండ్లును దర్భ లిధ్మ
ముల్, మానుగఁ గోసి తెత్తుము క్రమం
బున నీవును మమ్ముఁగూడి ర, మ్మా నిధి
లంబు చూపెదము మక్కువతోడుత వాఁ
యిక్కువల్.    హరివం. ౫. ౩౦.

౨. కుతూహలము, వేడుక.

క. రాచవీరి యుండియును వాది, యాచవిశిం
జారదు వాటు వారికి నిచటిబా, లాక్షీ
రణముపై మక్కువ, రోచందంబులన
మఱవ నెన్నఁడు రామిన్.

హరి. ఉ. ౨. ౪౯.

ఉ. అక్కట తండ్రి యేల మఱనయ్యెదుఁ
బెండ్లి యొనర్తు నంచుఁ బె, న్మక్కువ
నుండుచోఁ దెఱఁగు మాలినటక్కరి యాల
పోతు లి, క్లక్కడనుండి కర్గె ..

నీలా. ౨. ౪౨.

జ. మక్కువకాఁడు.

మక్కువకాఁడు. విణ. (మక్కువ + కాఁడు)
ప్రేమగలవాఁడు, ప్రియుఁడు.

వ. పెక్కువిధంబులం జొక్కించి చిక్కక
చక్కం బోవు మక్కువకానికై పొక్కి
తమిం జిక్కి. ప్రద్యుమ్నచరిత్ర. ౩. ౪౫.

మక్కె. వి. అస్థి, ఎముక.

(వ్యవ.) ఇంకొకమాఱు తిట్టినచో మక్కె
విఱుగును జాగ్రత్త. (నిత్యబహువచన మని
శ. ర. బ్రా.)

మక్కోలము. సం. వి. అ. పుం. ఖటిక, సుద్ద.

మత్వాణము. సం. వి. అ. పుం. యుక్తకాలము
నందు దంతములు రాని పొట్టియేనుఁగు.

(వై. ని.)

మఖము. సం. వి. అ. పుం. ౧. కేపము.
౨. సమూహము, గుంపు.

మఖవీర్యము. సం. వి. అ. పుం. ప్రియా
లము, మోరటి. శ.

మక్షిక. సం. వి. ఆ. స్త్రీ. ఈఁగ.

మక్షికామలము. సం. వి. అ. న. పుం. మయి
నము.

మక్షీక. సం. వి. = మక్షిక.

మక్షీకామలము. సం. వి. = మక్షికామలము.

మఖుణము. సం. వి. అ. పుం. ఏడుమాసముల
కోలఁడి. (వై. ని.)

మఖద్వేషుఁడు. సం. వి. ష. పుం. రాక్షసుఁడు;
పిశాచము.

మఖము. సం. వి. అ. పుం. యజ్ఞము.

మగ. ప్రాతిపదికము. దీనికి మహద్వివక్షయందు
మగఁడు మగలు అనియు నమహద్వివక్షయందు
మగది మగవి అనియు రూపము లగును.
విణ. (క. మగ. త. మగల్.) పురుషజాతిది.

సీ. మగమీల నగఁ జాలుతెగఁ గీలుకొనువాలు
కనుఁగవ కోకవింతకాంతి యొదవె ...
పారి. ౧. ౫౬.

క. తొల్లి ప్రాయపు మగపాదముల, తలఁపుల
తమకములు మిగులఁ దను నెదురుకొనన్,
జలజాక్షి జవ్వనము గదు, వలకెఁ బ్రతిక్ష
ణము వింతవింతగ నంతన్.
కళా. ౧. ౭౯.

చ. కలువలయమ్ములుం బ్రసవకార్ముకమున్.
విక్ర. ౧. ౧౪.

క. ఏనుఁగు గుజ్జును బచ్చని, ప్రామును పేడ
యూను మెట్టు మగపసరంబున్, బూవి
కలలోన నెక్కిన, మానవునకు సుఖము
రాజ్యమహిమయుఁ గలుగున్.
స్వా. ౯. ౬౯.

(మగపసరము = వృషభము.)

౨. శూరుఁడు.

క. నీ పౌరుష మేల యిలఁ బడి, వేవుర నే
వలచి పట్టె వెదకిన నడ్డం బై వచ్చి వలదు
నా నిం, దేవాఁడు మగండు దీని నెఱుఁగవ
కంటే. భార. విరా. ౨. ౨౫౬.

గీ. మెఱసి మూఁడులోకంబుల మేటిమగలు,
౧ యా నేర్తురె యాదవరాముతోడ ..
ఉ. హరి. ౧. ౭.

సీ. అతిదుర్జయుం డైన ప్రతివీరు నిట్లు రూప
ణఁచి యబ్బలుమగం డన్న కడకుఁ జని .
రాఘవ. ౪. ౨౨౭.

వి. ౧. పురుషుఁడు.

క. మగ లడఁకువ నందక తమ, తగులము
పాటింపు రెట్టితగులం బైనన్, మగువల
యొడలన యడఁగుం, దగవు విడిచి యడిచి
పదరు ధైర్యము పెర్మిన్.
భార. విరా. ౨. ౨౩౧. అం. భా. ౨. ౧౦౩.

సీ. మగ లాఁడువారికి మరిగి బ్రముచ్చిలి పంది
పట్టి కన్నంబులు పెట్టి తెరువు, ద్రొక్కొని
చని ... కష్టముల్ వడి రాక గలదు
గాక, అ, మగలఁ గోరి తొల్లి మగువలు
తపములు సేసి సవతి రనిన చెట్ట లెందుఁ
గలవె ... ప. స్కం. ౪. ౭౬౪.

క. మున్ను వివాహము సేయని, కన్నియ
యొరుఁ గలిసె నేని తుత యగు మగపోం,
దన్నఁడు లేక విధవ యగు, కన్నియ
యతుతసమాఖ్య గలిగి చరించున్.
విజ్ఞా. ౧. ౧౧౭.

గీ. మంజువాణిమనోవ్యథ మగకు అవుడఁ ఁడిన
గతి నుండఁ దత్పుర ప్రాంతసీమ ..
శక. ౩. ౫౪౭. చంద్రా. ౬. ౧౨౩.

౨. భర్త, పెనిమిటి.

ఆ. మగఁడు లేనివగుదమాడ్కి గాకున్న నా,
సేన భీష్ముఁ లేమిఁ జేసి సేఁడు.
భార. భీష్మ. ౧. ౬౨.

క. ఈ పచ్చరథంబులవా, రేవురు నీమగలె
యంబుజేక్షణ భార. ఆర. ౬. ౨౦౩.

సీ. ... పద్మనాభుఁ గానంగఁ జనుదెంచి
కదుఁ బ్రీతి నిట్లను వనఘ యే మీకు
మేనత్తమగఁడ.

గీ. వినుము దమఘోషుఁ డను నాఁడ ...
హరి. ఉ. ౧. ౧౩౯. అం. భా. ౨. ౧౧౫.

౩. రాజు, ప్రభువు.

ద్వి. మన్నె రాజుల కెల్ల మగఁడ నై యుండు.
న నైన్నఁ దలఁపక నామద్దుఁగూన, తిప్ప
కొయవు వలెఁ దిరిగి యల్లరుసఁ దప్పంగ
నడుతవా.
ప్రభులిం. ౭. ౫౬. పా. ౪. పం.

౪. ఇది కర్మధారయ సమాసమునం దుత్తర
పదముగ నుండునపుడు శ్రేష్ఠవాచకము.

మ. ఆవు డాపక్కి మగండు రక్కసులఁజెయ్యం
దాఁకి యభ్భంగి న, గ్రపుఁగయ్యం బొన
రించి మూర్ఛిల బలాత్కారంబునన్
వాఁడు లో, కపవిత్రన్ జనకక్షితీశతన
యన్ గాఢుష్ట్న వీరాంఘ్రిప, ద్మపటు
ధ్యానపరాయణన్ రథమునీఁద న్నిల్పి
కొంచుం జనెన్. రామా. ౫. ౨౦౪.

మగపంద = పిరికిమానిసి.

మ. అద నాబిడ్డలఁ బట్టి దొంగలు మహా
హంకారులై కొంచు న, న్నదు లై
పోరెడు రక్షపాటునకు సామర్థ్యంబా
నన్ హీనఁ నై, కదలం జేమగపంద
కూరుకుగలిన్ గ న్మాని
భాగ. ౯. ౪౦౫.

మగలంజె (జియ) = విటుఁడు

ఉ. మలయూచు మురియూచు మగలంజవోలె,
మానాతి వలపించిరే నేఁడు నీవు, గానక
తలక్రిందుగా నడచెదవు.
పండితా. పురా. ౧౨౨.

ఉ. అలవలఁ దేర్పఁ జూచు మగలంజియలం
గని వారిపొంతఁ బోవలవదు రొక్క మీఁ
గలుగువాఁడె మనోజుఁడు గూలియాలికిసే.
కు. సం. ౭. ౧౪౩.

మగపీచము = పగపురుగు, పురుషవేషము.

క. వినుము ధృతరాష్ట్రవంశం, బున మగపీ
చంబు పెల్లఁ బొలియించితిఁ గ్రి, ష్ణుని
కారుణ్యము జిష్ణుని, పెన్బ్రాపును గలఁగ
నేను విగతభయుఁడనై
భార. సా. ౨. ౯౧.

మగ్రతాడు = మగతాటిచెట్టు.

క. మగ్రతాడునందు మద్యవ, మగుమో సాక
టొకటి గాల్చి యజుర్గమలన్, దగఁ
ద్రిదినంబులు ద్రావఁగ, మగువకు బుట్టు
వుదయమగును మాన్యులు మెచ్చన్.
(చి. కి., చి. ని.)

మగపాలు. పురుషునిభాగము. భర్తృభాగము.

సీ. ఈసిరజాతాక్షి మేనిలో సగపాలు గణు
తింప మగపాలు గాఁగ నున్నది ..
హర. ౩. ౨౫.

మగలమగఁడు = శూరాగ్రేసరుఁడు.

క. మగువ మగవారిముందఱ, మగతనములు
నూప రణము మానుట నీకు నే, మగతనము
గాదు దమజులు, మగువలెదెసఁ జనరు
మగలమగ లగుట హరీ.
భాగ. ౧౦. ఉ. ౧౯౦.

చ. గగనము ప్రాసి వీచె సుడిగాలి సము
ద్రము లింకె మేరువున్ దిగఁ బడె భూమి
చక్రముగతిం దిరిగెన్ రవి త్రోవఁ దప్పె
న, మ్మగల మగండు వీఁక దళమం బగు
మస్తక ముత్తరించి వే, ల్వఁ గడఁగి హోమ
వహ్ని చటలంబుగఁ బ్రజ్వరిలంగఁ జేసి
నన్. ఉ. రా. ౨. ౧౭౩.

లయవిభాతి. ... నయన, యుగళి కెలిదావిరల
మగలమగ లైడా, రెగయ .. గగన
చరుఁ డయ్యెన్. మనుచ. ౪. ౧౧౭.

(ఇట ఔపమ్య ద్యోతకము.)

ఇట్లే మగలరాజు.

గీ. పరశురామునిశాపంబు బాణశక్తి, గ్రాఁప
బ్రాహ్మణశాపంబు రథము నిక్క, వఱుప
గాండీవధరుచేతి మెఱుఁగుటమ్ము, మన్ని
గొనియెనె యీశర్ణ మగలరాజు.
భార. స్త్రీ. ౨. ౯౦.

గీ. మాట లేఁటికి తేయు నోమగలరాజ, విశ్వ
మున నీవు లేకున్న కలిబడియె ...
హర. ౩. ౭౯.

సా. మగఁ డొల్లని సతిని మారి రొల్లదు.

క. ఇల్లిలు నుండ నింటం, బల్లియ నను కోక
పేయఁబలుకులు విశరే రొల్లడ లోక
ములో మగఁ డొల్లని యా సతిని మారి
రొల్ల దనంగా. శుక. ౨. ౧౧౬.

జ. మగఁటిమి, మగచెయ్వు, మగతనము, మగ
నాలు, మగనిల్వు, మగపంతము, మగ
పాడి, మగపోడిమి, మగపోల్కిఁగూటమి,
మగమాట, మగమానికము, మగరా, మగ
లాగు, మగవాఁడు.

**మగఁటిమి.** వి. (త. మగస్త్వ √మగ.)

౧. శౌర్యము, పౌరుషము, పరాక్రమము.

ఉ. ... చూచి ర, వ్వాఁడిమగంటిమిన్ వెల
యువాని వృకోదరు నెల్లవారలున్.
భార. ఆది ౬. ౩౦౬.

ఉ. పాండవసైన్యముల్ గలఁగి పాఱెడు పిగ్గతి
వీరిలోన నొ, క్కండును భీష్ము మార్కొని
మగంటిమి చూపఁగలేఁడ ...
భార. భీష్మ. ౨. ౧౪౮.

౨. మగతనము, పుంస్త్వము.

చ. ... అరాతిభయంకరు హేమవర్మ నా,
గడమున గాసిచేసితి మగంటిమి నీ దను
సైనఁ జూపుమా.
భార. ఉద్యో. ౪. ౩౮౬.

గీ. ... పౌరుషంబు మగతనము, మగఁటిమి
యనంగఁ దిర్యక్స్వమర్థమందు, నౌపచారిక
మైన గండనెడిపలుక్కు, భావకర్మంబులను
గూడఁ బరఁగు నభవ.
ఆం. భా. ౨. ౧౦౩.

౩. పురుషాయితము, ఉపరతి.

గీ. హెచ్చు మగఁటిమిఁ జూపుచో నొచ్చె
నేమొ, రొత్తుదునె యంచు నంక్రిఁ
గేలుంచునెనరు ... ఉ. రా. ౬. ౧౬౭.

**మగచెయ్వు.** వి. (√మగ) సంభోగము, రతి.

సీ. మగలతో నిదురించు మగువల మఱపించి
మగచెయ్వు లాచరింప మదిఁదలంచు ...
నీలా. ౧. ౪౬.

(నిత్యబహువచన మని శ. ర.)

**మగతనము.** వి. (√మగ.) ౧. పరాక్రమము,
మగఁటిమి, పౌరుషము.

క. ప్రేలకు చెలుగు వెరిఁగిన, మారెకుఁ
గంగంబు గాదు మాటలు మిగులఁగా,
నాలుగు గఱచినయంతనె, చాలుకొ మగ
తనము జూప సాత్యకిరొందురన్.
ఉ. హరి. ౩. ౫౦.

గీ. ... పౌరుషంబు మగతనము, మగఁటిమి
యనంగ ... భావకర్మంబులను గూడఁ బరగు
నభవ. ఆం. భా. ౨. ౧౦౩.

గీ. అరయఁ దీవంచవార్యంపుటగ్గిపట్ల, నడుము
నడరొందుసాడెంపుఁ బడమిపేఁడు, రెల్లఁ
గదలింపలేనియువిల్లు దునిమె, నిప్పు డీతని
మగతనం బెన్నఁ దరమె.
అచ్చ. రా. బాల. ౧౭౪.

౨. పురుషత్వము, పుంస్త్వము.

చ. ... ఒదవుఁ గాక ధవళ్కృతదుష్టచేష్టితం,
బులకు ఫలంబునేఁ డొకటి పూర్ణముగా
నుపభోగ్యమై కదుఁగా, జలమున నెందు
నీమగతనంబు కడంకలు రూపుమాలుటల్.
(భారతార్థమున.) రాఘవ. ౩. ౪౫.

౩. రతి, సంభోగము.

గీ. కువల, మధులహరి నబ్ధిశైఁ జెంది మగతన
ముల నొక్కెడలఁ గూడుచు బ్రసంతు
లుబ్బు నెనఁచె. ఆము. ౪. ౧౭౩.

(ఉపరతి అని వ్యాఖ్య.)

**మగధ.** సం. వి. ఆ. స్త్రీ. పిప్పలి.

**మగధపురి.** సం. వి. ఈ. స్త్రీ. మగధదేశస్థుల పట్టణము.

**మగధము.** సం. వి. అ. పుం. ౧. మగధ దేశము. (శోణానదికి దక్షిణభాగమున నుండు దేశము.) ౨. మద్దుకయను వాద్యభేదము. ౩. ఫలకము మొ. వాని పిడి. (శే. ని.)

**మగధుఁడు.** సం. వి. అ. పుం. ౧. మగధదేశ రాజు. ౨. బట్టు, వంశావళి చెప్పువాఁడు స్తోత్రపాఠకుఁడు. (శబ్ద.)

**మగధోద్భవ.** సం. వి. ఆ. స్త్రీ. పిప్పలి శే.

**మగనా(నియా)లు.** వి. దే. (మగని + ఆలు) మగఁడుగల యాఁడుది, భర్తృమతి, కులస్త్రీ.

సీ. ఓర్పుమై నప్పిండి నుపవాసముండదేని మగ నాలి పరివ్రాల్పఁ దగదు విధవ ..
కాశీ. ౨. ౭౩.

గీ. తగవుఁ జెప్పంగ నిన్నుఁ బ్రార్థన మొనర్చి, యొక్క రిచటికిఁ దెచ్చిరో చిక్కులాఁడి, నీవు చెప్పక యుండిన నే మెఱుఁగమె, పుడమి వర్తించు మగనాలి నడత లెల్ల.
హరిశ్చ. ౪. ౧౪౪.

క. పతివత్ని యనిపల్కఁబడు మగనాలు సా హైదువరాలన హైదువ యన ..
ఆం. భా. ౨. ౧౦౪.

గీ. హాస్యకథ లందు గీతవాద్యములయందుఁ, బ్రీతిగొనుపుట మగనాలి రీతి గాదు ..
హి. శకుం. ౪. ౪౫.

క. కాఁగాని మాట లాడదు, రాఁ గూడ దుసేఁ దపళ్చరణమై నుండం, గాఁ గోమలి యిటు నిల్వక, యేఁగుదు మగనాలి కెల యీ దుర్గుణముల్. భోజరా. ౪. ౧౪౭.

క. అభిమానవతులు ముగ్ధలు, నభిజాతలు నైనమగనియాండ్రుర కౌరే, వ్యభిచారము

నన తక్షయులు, బాహునిధులం గనిరి ము న్న నేకుల నలినా. హరి. పూ. ౯. ౪౩.

**మగనిల్వు.** వి. (√మగ) చేయిపై కత్తి నిలుచున్న పురుషుని యెత్తు.

ద్వి. ఇరు నూఱుమగనిల్వు లీయున్న బిలము.
పండితా. పర్వ. ౩౭౩. పా.

**మగపంతము.** వి. (√మగ.) ౧. మగఁటిమి, పౌరుషము, శౌర్యము.

మ. మగపంతంబున మానసారుఁ డనిలో మా కల్గిపై గాత్తివస్ .. దశకు. ౨. ౩౧.

ఉ. నిందకు నోర్చి యాజిమొన నిల్వఁగ నోపక కీఁగి పాఱు నీ, పందలవెంటఁ బడ్డ మగ పంతమె ..

భాగ. ౩. ఉ౨౩. భా. రా. యు. ౨౦౭౯.

౨. కూటమి, సురతము.

మ. మగువల్ పిక్కటి తోల్లి వల్లభులకున్ మన్నించి తద్వల్లభుల్, మగపంతంబు దలం పరే తగులముల్ మాపాలనే పుట్టెనే.
భాగ. ౧౦. పూ. ౯౯౩.

**మగపాడి = మగలాగు.** వి. (√మగ.) ౧. పురుషధర్మము, మగవాని మర్యాద.

ద్వి. .. రఘువీరుఁ డంతయును, ఇంతివోయిన జాడ నెఱిఁగిన పిదప, నంతరంగంబున నడ లుచునునికి, మగపాడి గా దని మది నిశ్చ యించి . .

రం. రా. కిష్కిం. ౨౦౩. పా. ౧౦. పం.

చ. పురుషులు లేరె లోకమునఁ బుట్టరు గాక భవత్సమాను లో, చిరతరపుణ్య నిన్ దగిలెఁ జిత్తము మిన్నక పోవఁ డింక శం, బరరిపుఁ జేమి సేతు మగపాడి దలంపవు భామ లేద ని, ష్ఠురవచనంబు లేల దయఁ జూడగదే యిద నీకు మ్రొక్కెదన్.
భోజరా. ౪. ౧౫౯.

౨. క్రూరధర్మము, మగఁటిమి, కాఠిన్యము.

క. అయ్యెడ మానము వదలక, దయ్యక,
మగపొడితో దృఢంబుగఁ బోరన్
భాగ. ౧౦. ఉ. ౭౩౦.

సీ. మానస్థులఁ జెంపుట మగపొడి గాదు భిక్షా
శనం బైన నత్యంత సుఖము ...
భార. భీష్మ. ౧. ౧౯౩. పురా. ౧. ౧౫౪.

౩. ఉపరతి, పురుషాయితము.

గీ. వలపుఁ దెలుపుచు వరుసఁ బలికి పలికి,
యలవుసొలపున నిలుకక నిలిచి నిలిచి,
చెలువని ప్రియుఁ గూడె మగపొడి ముద్ద
లాఁడి. శశాం. ౩. ౧౧౧.

**మగపోఁడిమి.** వి. (√మగ) పురుషుని విధము, పురుషరూపము.

చ. కటకట కాశికాపురి నొకానొకనిగ్రహఁ
గన్నుఁ బెరాడ్చి యు, ప్పటఁ గను విచ్చునప్డు
కుడిభాగముఁ గన్గొని చోద్యమందు దా,
పటిదెసఁ జూచి యచ్చెరువుపాటు వహించు
మనస్సరోజము, పుటమున నాఁడులాగు
మగపోఁడిమియుం గల జంతుసంతతుల్.
కాశీ. ౩. ౯౯.

మ. ఘనశక్తి నీ మగపోఁడుముల్ పలుమఱుం
గన్నారఁ గన్నారము. చూచి మెన్నఁ
డును నీయోఁడుచేందంబు ...
నాగ. ౭. ౩౭౭.

శ్లో. అవతారా మయా దృష్టా రమమాణస్య తే
గుణైః, పుంస్త్వం తద్దిదృక్షు మిచ్ఛామి
య త్తే దూషిద్వపు ద్ధితమ్.
సం. భాగ. ౭. ౨౨. ౨౨.

౨. మగతనము, పుంస్త్వము.

సీ. పొలిరెడ్డికి మగపోఁడిమి లేదుగా గాది
కేలాగునఁ గడుపుని క్కా. శుక. ౨. ౪౨౨.

౩. సురతము, సంభోగము. (ఇ. అని శ. ర.)

ద్వి. ధనధాన్యవస్తువుల్ దగ నిత్తు ననుచు,
మునుకొని మగపోఁడుములఁ జేయఁబూను.
అ. మ. క. ౧. ౩౪. పా. ౨౧. పం.

**మగపోల్కికూటమి.** వి. (√మగ) ఉపరతి, పురుషాయితము.

సీ. ఉపరిసురతసంజ్ఞ యొప్పును మగపోల్కి
కూటమి యనఁగ .. ఆం. భా. ౨. ౧౭౦.

**మగమ (మా).** వి. (అ. మఖమై) వణిజాలు గాని సేద్యగాండ్రు గాని దేవాలయాదుల కిచ్చువిరాళము, రుసుము.

వ. అంగరంగభోగాల కిచ్చినమగమక్రమం
బెట్లన్నను. మగమమీంద మరిన్ని రాగి
భోగాలకు దశా. ౪ ౯౩౫.

వ. రుద్రయ పెద్దింగారు .. సిద్ధేశ్వరమహా
దేవరదీపంబునకు ఆతేటాలం గలమగమాను
సుంకమాను తలారికమును మరిని ఒంటెమి
ఆయ ... నేరను అడుగలేదు. సర్వమా
న్యము ధారాపూర్వము నేసి ఆచంద్రా
ర్కముగా నిచ్చె. దశా. ౪. ౨౨౧౩.

వ. నెయిపూరిలోని మగమాను వెళ్లిం
బోయీ మగమాను వంకేశ్వర దేవర కా
చంద్రార్కస్థాయిగా మారము రాజు
ఇచ్చె ఈస్థలము మగను ఎవ్వరు గుత్తి
గొన్నాం జెల్లించి ఈపుణ్యానం బొందు
వారు. దశా. ౪. ౧౧౭౦. ను. జి.

**మగమాట.** వి. (√మగ) పౌరుషవాక్యము, క్రూరవచనము.

మ. మగమాటల్ మన కేల నాఁడల హనూ
మంతుండు లంకాపురం, బెగవం గాల్పఁగ
నెందుఁ బోయితివి ...
భా. రా. యు. ౨౨౩.

**మగమానికము.** వి. (√మగ) వజ్రము.

సీ. తనుతేల్పు దొరరాణి మగమానికపుసామ్మ
   సొగసేనిచాన గొజ్జఁగులబంతి .
యయా. ౧. ౫౨.

సీ. మగమానికముల క్రొన్నిగనిగల్ దులకింప.
నీలా. ౨. ౪౭.

విశే. పురుషరత్నము, పురుషశ్రేష్ఠుఁడు, పురుషోత్తముఁడు.

ఉ. అమ్మగమానికంబు దిట మారఁగ నొక్కల కోరిఁ జెడ్డకే, ద్రిమ్మరికొమ్మ నుక్కడఁచి లేటగ జన్మము గాచి చట్టుచుం, దమ్మున నున్న పెందపసితామరకంటిని బ్రోచి ...
అచ్చ. రా. బాల. ౧౭౩.

మగమానికపువాలు = వజ్రాయుధము
నీలా. ౩. ౭.

మగమానికపువాలు దాల్పు = వజ్రాయుధము ధరించినవాఁడు, ఇంద్రుఁడు.

గీ. తవర మగమానికపువాలు దాల్పుజోడు, కేడుకలుమీఁఱ వాడు మేర్కొడమీఁద, గొనలు మీటెడు వపరంజితుండ యనఁగఁ, దూర్పుగుబ్బలిపైఁ దోఁచెఁ దొగలఱేఁడు.
నీలా. ౩. ౭.

మగరా (జా) (యి) = మగమానికము.
   వి. ఔ. (√మగ) వజ్రము, నవరత్నములలో నొకటి.

ఉ. నాయక మైనకెంపుగమి నాఁటినచోటులు సాంధ్యరాగముల్, డేయఁగ నింద్రనీలముల చెక్కడపుంబనిచక్కి యంధకా, రాయితమై కెలంక మగరాలమరించినపట్లు కొన్నెలల్, గాయఁగ ముత్యాలుంగులకుఁ గందు వరో యనమించె నందులన్.
పారం. ౨. ౭౨.

చ. తెలిమగజాతికంబముల దీఁన గంగరు కీలుబొమ్మగుం, పులకు ..
ఉ. రా. ౧. ౩౧౯.

పీ. మగరాలబిళ్లల నిగనిగఁ దగిషట్టి వాలు కీల్జడ కొలనూలఁ జొనిపి.
పార్వ. ౫. ౧౮౭.

మ. కొలఁదా చొక్కపుపేడలోన మగఱా నిద్దంపుఁ గీల్తాఁగుటు, రొయ్యలలో ... నల రుంబోఁడులు జోలఁ బాడుదు రమందా నందసంధానమై . చంద్రా. ౨. ౯.

సీ. పాలుచును వజ్రంబు మూఅరా లన మగరా లనంగను గురుజా లనంగ ...
ఆం. భా. ౨. ౨౯౭.

మగజా(రా)తివాలు = వజ్రాయుధము.

సీ. ... మగజాతివాలు సత్తి గుదియ బల్లెము త్రాడు చెక్కము కత్తి దండివిల్లు ...
అచ్చ. రా. యు. ౫౭౧.

మగలాగు = మగపాడి. వి. (√మగ) ఉపరతి. (శ. ర.)

మగవాఁడు. వి. (√మగ.) ౧. పురుషుఁడు, పుంవ్యక్తి.

క. తగనే కులకన్యలకును, మగవారలతోడ రూపమువానీయులతో, మిగులంగఁ దడవు లోపలి, వగళులతో మాట లాడ
నైష. ౪. ౬౧.

క. అనవుడు శారిక కీరముఁ గనుఁగొని మగవారు పాపకర్ములు నమ్మం, జన దనినఁ బాపజాతులు, వనితలు గా కనుచుఁ జిలుక వాదము చేసెన్.
విక్ర. ౯. ౭౬. మనుచ. ౩. ౭౨.

౨. మగఁడు, భర్త; ప్రియుఁడు.

మ. పరగన్ మా మగవార లందఱును ముక్ బాణప్రయోగోపసం, హరణాద్యాయుధ విద్య లన్నియును ద్రోణాచార్యుచే నభ్యసించిరి ... భాగ. ౯. ౧౬౦.

ఉ. క్రేపు గనుంబడం బలుకరించినవాఁడవు
పోదువా యదయా, నామగవాఁడ వెన్న
నిను నమ్మితి ర మ్మని పిల్చి ...
శుక. ౩. ౫౬౭.

౭. పౌరుషవంతుఁడు.

(వి. శూరుఁడు అని శ. ర.)

ఉ. ... లీలమై, వచ్చిన రుద్రుచేందమున
ద్రాలుదు వీ వనిలోన నోర్వఁగా, వచ్చునె
నిన్ను నెట్టిమగవారికి నీకృప నాశ్రయిం
పఁగా, వచ్చితిమి. భార. భీష్మ. ౩. ౩౦౦.

మ. అలరుందూపుల మన్నెవాని మగవాఁ
డన్పించుఁ దశాంత ..
శుక. ౪. ౧౫. భార. ఉద్యో. ౧. ౨౪౪.

**మగిడి.** వి. (త. మగిడి) పాములవాఁ డూఁదెడి వాద్యవిశేషము, నాగసరము. (శ. ర.)

**మగి(గు)డించు.** స. క్రి. (√ మగుడు.)

౧. మరలించు, త్రిప్పు.

గీ. అడుగఁ బూనినమాటయే యుడివు నెక్కె,
నంతనుండియు మగిడింపు మమరరాజ ..
నైష. ౩. ౨౧.

ఉ. వామనదిగ్గజంబు మదవాసనవెం జవ కోహ
టించు చు, ద్దామగతిన్ నభోమణిరథంబు
హాయంబు లమోరుఁ దుద్ధతుం, డై మగు
డింపఁగా మగుడ కడ్డము దాఁకె ననంగ
నుత్తరా, శాముఖవీధి నేఁగ దివసంబులు
దీర్ఘత పల్లవింపఁగన్.
పి. శకుం. ౨. ౧౨౨.

సీ. పొంగము పార్శ్వములకు మగుడింపకుండ
వాకట్టుమూలికలాగఁ బట్టి బట్టి .
కళా. ౩. ౪౯.

౨. నివారించు, ఆఁపు.

క. వగవఁగ నేఁటికిఁ బార్థుఁడు, దగువరుఁ
జొరకున్న భీష్ముఁ డగఁ జూచి వసం, బగ
యడఁగించెద నన్నుఁ డ, మగిడింపక చూచు
చుండు మనుజాధీశా.
భార. భీష్మ. ౩. ౨౮౩.

వ. ... కుంతి, తత్ప్రబోధం బగునాకుంతునిం
గరలి పలికియు నలుకమగడించి యాదం
చిత ప్రయోజన ఘటనాపారవశ్యంబున
సామరస్యంబు మీఱ ని ట్లనిరి ...
పాండు. ౩. ౩౪.

**మగుచు = మగుడుచు.** స. క్రి. (√మగడు. క. మగుచు) మరలించు, త్రిప్పు.

ద్వి. జోడనఁ గొని పించె సాగదుగాఁ జుట్టి,
చేడెంబు వడి నడ్డచేడెంబుఁ ద్రోలి, నిగు
డంగఁ గుఱుచల నిడుదల నూకి, మగిచి
వైచుచుఁ గేల మ స్తరించుచును ..
అ. మ. క. ౫. ౨౪౨. పా. ౧౪. పం.

**మగుడఁబడు.** అ. క్రి. (మగడన్ + పడు. స్వార్థము.) ౧. మరలు, నివృత్త మగు.

క. అసురులదాసు నీతేజము, ప్రసారితముఁ జేసి
మగుడఁబడు టొప్పునె యిం, క సమాన
కార్యక్రమ్మజ, మగఁగుము రక్షింపు మమర
మండలిఁ గరుణన్.
హరి. ఉ. ౧౦. ౧౭౧.

౨. తిరుగఁబడు.

వ. .. పగవాఁడు బలవంతుం డంతన తెగిపో
రుడివాఁడు గాఁ డీలోనన మగుడంబడి
యుద్ధియోనియుం గిల్చిన మాపాదించు నిది
నాకుఁ దోఁచిన తెఱంగు ..
హరి. ఉ. ౧. ౧౪౦.

౩. తిరుగు, తారుమా రగు.

క. అనిన నలర్కుం డి ట్లను, జనవర మును
నామనంబుచందము నీచె, ప్పినయట్లు
యిపుడు శాంతిం, దనరెడు మగుడఁబడి
వినుము తత్కారణమున్.
మార్క. ౩. ౩౭౯.

**మగుడు,** అ. క్రి. (క. మగుచు, మగచు.)

౧. మరలు.

(క.) వెనుకకు మరలు.

గీ. అనఘ యింద్రియముల విషయములమీఁద, నిగుడనీక మనంబుతో మగుడఁ దిగిచి, యాత్మఁ గూర్చుట సాంఖ్యుల యనువు .
భాగ. శాం. ౫. ౯౭.

ద్వి. మగిడి భూవిభుఁ డొక్కమరము పొంత కేను, దగఁ జేరి యున్నయత్తఱి నిప్పు లురుల. ద్వి. హరిశ్చ. ఉ. ౧౪౮. పం.
దశ. ౧. ౧౭౮.

(చ.) తిరిగివచ్చు.

క. కనకకనిఁ బఱచిన నాతని, వెనుకొనుటయు వాఁడు శరణు వేఁడినమాత్రం, గినుక యుడిగి తొయ్యలి మదిఁ, గనికరము జనింప మగిడెఁ గాంతుని కడకున్. విక్ర. ౬. ౯౩.

ద్వి. మనల నయోధ్యకు మగుడఁ బ్రార్థింపఁ, జనుదెంచుచున్నాఁడు సందేహ ముడుగు. రం. రా. అయో. ౧౬౬. పొ. ౨౮. పం.
ఆము. ౧. ౭౬.

(ట.) అభిముఖ మగు.

క. నీ చే మంటివి రమ్యం, చాపలివానికని మగిడి యట్లనె వానిం, గావించి
ఆము. ౩. ౭.

వ. ... దక్షారంబునకు మగిడి పోదము లె మ్మని భీమ. ౩. ౩౮.

౨. (త. మక్కుడు) క్రమ్మఱు, తిరుగు.

(మరలు ధాతువునకువలె దీనికిని క్త్వార్థక మగు 'మగిడి' అను రూపమును, తుమున్నంత మగు 'మగుడన్' అను రూపమును పునరర్థకావ్యయము లై వెండి, మరలన్, అను నర్థము నిచ్చును. కొన్నిపట్ల ప్రత్యుత్తర ముగా, మాఱుగా, అను నర్థమును నిచ్చును.)

గీ. చెలువ యింక నొక్కించుకసేపు నీవ, నాదరంబున సెప్పుటయట్ల యున్న, మన్మథుఁడు సమయించిన మగుడ నన్నుఁ, బడయ వచ్చునె యెన్ని యుపాయములను.
భార. విరా. ౨. ౪౭.

గీ. అప్పు డాశ్చర్య మంది వైశ్యప్రభుండు, మగిడి లోనికిఁ జనుదెంచి మంత్రఫణితి.
హర. ౨. ౩౯.

క. ధరియించినమొదల లోకవ, త్సరమాత్రము గావకీన ధమ్మిల్లములో, నిరవుకొని మగుడ నివ్విరి, తరుణీ యాలపారిజాత తరువున కరుగున్. పారి. ౧. ౬౭.

గీ. మగుడఁ గ్రమ్మఱఁ గ్రమ్మఱ మరల సారె, వెండి మాటికిఁ దిరుగ నా వెలయును బున, రర్థముగ ఆం. భా. ౩. ౬౯.

౩. పోవు, తొలఁగు.

ద్వి. బడలినమేనును బగిలినమోము, మగిడిన చనుఁగప్పు మాసినచీర.
ద్వి. హరిశ్చ. ఉ. ౨౦౮౫. పం.

క. తగుమాట లాడి కోడలి, వగ పుడుపుము నీవు ధైర్యవతి వి ట్లడరం, దగునె నిను జూచి కాదే, మగుడుం జిత్తముల వగలు మఱికందఱకున్. భార. ద్రో. ౨. ౩౨౮.

౪. బాగుపడు, చక్కనగు.

క. వగచినఁ బోయినకార్యము, మగుడునె వగవంగ శోకమాన్యం బగునే ...
భార. స్త్రీ. ౧. ౨౦.

౫. తిరుగుట, నివృత్తి.

క. గతికై ఫణి వసుధాయుని, మతిఁ దలఁచిన సగణ మయ్యె మారుత మధిపై, వత నుంద్రు సగణముఖమగు, కృతి పగఱకు మగుడు లేని కీడొనరించున్.
కావ్యా. ౭. ౧౪.

జ. మగిడించు, మగుచు, మగుడఁబడు, మగుడుచు.

**మగుడుచే(డ్చు)** = మగుచే. స. క్రి. (√మగుడు. త. మక్కుడఁ సెయ్) మగలించు, త్రిప్పు.

చ. పద్మగర్భకడకుం జని నమ్రహితుండు మన్మథుణ్, కొడుకుగఁ గాంచి వేతను మగుడ్పగ వచ్చె. భాగ. అను. ౪. ౪౦౫.

ఆ. కడుఁ బ్రయాణవిఘ్నకరు లగుభరతము, ఖుల్యలఁ బ్రయత్నమున మగుడ్చి వెసను.
రాఘవ. ౩. ౨౭.

మ. గునియుణ్ గొప్పు సరుల్ నటింపఁ గుపే మల్ గుప్పింప ఘుగ్మాంబువుల్, మొన పణ్ గాను చలింప రత్నవలయంబుల్ సందడింప న్మగు, డ్చిన సెమ్మో మఱుఁగంటఁ జూడ్కుఁ గవ ... ఓర్తు తలయంటెన్.
చంద్రా. ౭. ౫౫. కళా. ౩. ౧౯.

**మగులు** = మదురు. వి. ౧. కుడ్యపాలిక, గోడమీఁదికప్పు.

సీ. మడుగు గలవఁ గుడ్య, పాలిక యై యొప్పు ఆం. భా. ౨ ౧౩.

౨. చుట్టుగోడ, ప్రాకారము

సీ. ఆలగుంపులు గొలిచియలదొల . ఉలగ రంబులు వాలుపోలము వాకటఁ గది కట్టు బండ్లింటికిఁ జుట్టుమగులు .. గ కలిగి, కొంపురము సేయు నవ్వీటఁ గాఁపురొడుట.
వేం. పంచ. ౪. ౪౧౬.

సీ. బలుకంచు గుబ్బబోర్తలుపులు తీనెలవాకిలి వడవ చావడియు, మగులు.
హంస. ౨. ౧౩౭.

జ. మగులుగోడ.

**మగులుగోడ.** వి. (మగులు + గోడ) చుట్టుగోడ, ప్రాకారము.

ఆ. మగులుగోడమీఁద ప్రాఁతలు చిగురుజొం, పములు కానిమీఁదఁ బ్రచురదోహ, దములధూపములను దనరు మాటుగ గూఢ, గతిని గాంతఁ గొనుచు వతఁడు చనియె.
కళా. ౩. ౭౭.

(ముద్రి. పా. మదురుగోడ. శ. ర. పా.)

సీ. గొడియ సగము గాన్పగొలుసు లోపలియడ్డ ప్రాను బోర్తలుపులు మగులుగోడ ..
హంస. ౨. ౨౨౭.

**మగువ.** వి. (క. మగువు. త. మగవు = బిడ్డ. మగువు + అ. ?) ౧. స్త్రీ. ఆఁడుది.

సీ. నవలా మగువ నాతి నాతుక యాఁడుది కోమ గోల యువిద చామ చాన.

గీ. ముద్దుగుమ్మ యన స్త్రీస, మాఖ్య లంచనఁ గాను జె న్నలరుచుండు ..
ఆం. భా. ౨. ౧౦౪.

క. మగ లడఁతువ నండక తమ, తగులమ పాటింతు రెట్టి తగులం బైనన్, మగువల మొదలన యడఁగుం. దగవు విడిచి యడిచి పడగు ధైర్యము పేర్మిన్.
భార. విరా. ౨. ౨౭౧.

గీ. మదనరేఖకు సరియైన మగువ గలదె ...
విక్ర. ౧. ౧౧౯.

౨. ప్రియురాలు, భార్య.

గీ. మగని మగువను ప్రాయించి మదిఁ దలంచు, నిషధరాజును దమ్మఁ గా నీరజాక్షి.
నైష. ౧. ౭౪.

'ప్రియంప్రియాంచ.' సం. నైష. ౧. ౩౫.

సీ. మగలతో నిదురించు మగువల మఱపించి...
నీలా. ౧. ౭౭. పారి. ౧. ౫౦.

జ. మగువతనము.

**మగువతనము.** వి. (√మగువ) స్త్రీత్వము, ఆఁడుతనము.

క. జగదాత్ముఁడగు శంభుఁడు, మగిడెను
హరి సెజ్జఁగి తనదు మాహాత్మ్యమునన్, వగ
తంత్రపుఁ గైఁ నిలిచెను, మగువతనం బుడిగి
హరియు మగవాఁ డయ్యెన్.
భాగ. ౮. ౪౦౪.

**మగ్గ = మొగ్గ.** వి. (క. మగ్గ) ముకుళము.

ఉ. వెగ్గల మైనవాసనలు విశ్వజగంబును
గమ్మ వల్వఁ గా, గుగ్గులు ధూపధూమము
లగోచరగీల నజాండగోళముం, దగ్గఱఁ
జాతె వాని మిళనంబునఁ గాదె వర్ణంబు
గల్వపూ, మగ్గయుఁ బోలె నిప్పడు సమం
చిత నీలిమ మయ్యెఁ జూడ్కికిన్.
కాశీ. ౭. ౨౨౧.

**మగ్గపుగుంత.** వి. (√మగ్గము) సాలెవాఁడు నేయుటకుఁ గూర్చుండునపుడు కాలు చాఁచుకొనెడి పల్లము.

సీ. కుంచె మగ్గపుగుంత గూటంబు కగ్గంబు
పరఁ బె ద్రొక్కుడుపట్టె పలక దోనె ...
గీ. వటల నాకుభభద్రునివాసభూమి, యప్ప
గంబున సంతతం బొప్పచుండు ...
హంస. ౨. ౧౧.

**మగ్గము.** వి. (క. మగ్గ, మక్కు.) ౧. వయున యంత్రము, సాలెవాఁడు గుడ్డలు నేయు యంత్రము.

సీ. ... నేత యంత్రము మగ్గ మనఁగను దనరు
చుండు ... ఆం. భా. ౨. ౭౯౭.

౨. పాలెపురు గల్లు వల.

సీ. కలయు గంగమున మర్కట కీటకృత మైన
మగ్గంబు నేత్రసంపద వహింప ...
ఉమ. ౧. ౯౩.

సీ. మై నిండుపాలీని మగ్గంపుఁజకచకల్ బూది
పూఁతను రెట్టి పుట్టనేయ ...
చంద్రా. ౩. ౭౯.

జ. మగ్గపుగుంత, మగ్గరి.

**మగ్గరి.** వి. (మగ్గము + అరి) తంతువాయుఁడు, సాలెవాఁడు.

సీ. తంతువాయాభిధ దనరు మగ్గరి యన
నేతకాఁ డనఁగను నేతరి యన ...
ఆం. భా. ౨. ౨౭౩.

**మగ్గించు = మ్రగ్గించు.** స. క్రి. (√మగ్గు) చంపు.

సీ. బెగ్గురుకదుపుల బెగ్గిల మగ్గించి కొంగల
గొంగల్లఁ గ్రుంగఁ ద్రొక్కి ...
ద్వా. ౧. ౨౯౯.

**మగ్గు = మాఁగు.** అ. క్రి. ౧. మిగులమగ్గు, కమియఁబండు.

(వ్యవ.) పనసపండ్లు మగ్గవలె తిందినచో
రుచ్యముగా నుండవు.

౨. ఉక్కచేఁ జెమ్మగిల్లి చెడు. (శ. ర.)

౩. అవిరివాఁడ చక్కఁగ నుడుకు.

(వ్యవ.) కూర బాగుగ మగ్గనిమ్ము.

౪. మ్రగ్గు. (క. మగ్గు) చచ్చు. (చూ. మగ్గించు.)

జ. మగ్గించు, మగ్గుడు, మగ్గుడుపాఱు.

**మగ్గుడు.** వి. (√మగ్గు) మిగుల మగ్గుట, కమియఁబండుట. (మగ్గుట. శ. ర.)

**మగ్గుడుపాఱు.** అ. క్రి. (√మగ్గుడు) మాఁగిపోవు. (మగ్గు. శ. ర.)

(వ్యవ.) అరఁటిపండ్లు మగ్గుడుపాఱినవి.

**మగ్నము.** సం. విణ. (అ. ఆ. అ.) మునిఁగినది.

**మఘ.** సం. వి. ఆ. స్త్రీ. అశ్విన్యాదులయందు పదియవ నక్షత్రము. (నిత్యబహువచనాంతమని వై. ని.)

శ్లో. ఆషాఢాకృత్తికాశ్లేషా మఘా భూమిన్న స్త్రియశ్చ తాః. (వై. ని.)

**మఘము.** సం. వి. అ. పుం. ౧. ఒకానొక ద్వీపము. ౨. ఒకానొక దేశము. ౩. యజ్ఞము. న. ౧. పుష్పభేదము. ఒకజాతిపువ్వు. ౨. ధనము. (శే. ని.)

**మఘవంతుఁడు.** సం. వి. త్. పుం. ఇంద్రుఁడు.

**మఘవానుఁడు.** సం. వి. న్. పుం. (రూ. మఘవ) ౧. ఇంద్రుఁడు. ౨. వ్యాసుఁడు. విణ. (న్. నీ. న్.) దాత.

**మఘవుఁడు.** సం. వి. న్. పుం. ఇంద్రుఁడు. (శ. ర.)

**మఘాత్రయోదశి.** సం. వి. ఈ. స్త్రీ. మఘా నక్షత్రముతోఁ గూడిన త్రయోదశి, భాద్రపద కృష్ణత్రయోదశి.

**మఘాభవుఁడు.** సం. వి. అ. పుం. శుక్రుఁడు.

**మఘాభువు.** సం. వి. ఊ. పుం. శుక్రుఁడు.

**మఘి.** సం. వి. ఈ. స్త్రీ. ధాన్యవిశేషము. (కౌ. ని. కల్ప. వాచ. భేషజ ఏ.ని. వి. ని.)

**మఘోని.** సం. వి. ఈ. స్త్రీ. ఇంద్రుని భార్య, శచీదేవి.

**మచర్చిక.** సం. విణ. అ. స్త్రీ. ప్రశస్తము, శ్రేష్ఠము. (ఇది ఉద్ఘమువంటిది.)

**మచ్చె = మచ్చెము.** వి. (క. మచ్చ. త. మచ్చై.) ౧. పుట్టుమచ్చ, పుట్టినప్పటి దేహమునం దుండెడి నల్లనిగుర్తు.

చ. అని కొనియాడి దేవి రుచిరాకృతియం దొక మచ్చ పెంపొడం, గనుఁగొన నొప్పు నీలమణికాంతి బెడం గయి. విక్ర. ౩. ౫౭.

సీ. ... సిరి పొల్చుమచ్చ పేరురమువాని ...
ఆము. ౩. ౭౫. ఆం. భా. ౨. ౧౨౪.

౨. చిహ్నము, గుఱుతు, కళంకము, మాలిన్యము, మఱక.

సీ. ... గుఱి మచ్చ మచ్చము గుఱుతు చిహ్నె, లక్ష్మనం బాది కళం కౌనవా లడియాలము బచ్చెన యనఁగఁ జిహ్న, (గీ.) మలము.
ఆం. భా. ౧. ౭౦.

గీ. ఉడుగణాధీశ బింబంబునడిమిమచ్చ ...
భీమ. ౨. ౪౫.

ద్వి. మచ్చలమచ్చల మట్టికాసెయును, బలువైనకేలి కంబటికుండ తనకు, నలువడ నడ కొండ కువ నొప్పుచున్న.
ద్వి. పరమ. ౭. ౫౩౧. పా.

౩. కుట్టుపు గాయము మొ. మానినపిదప దేహమున నిలిచి యుండెడి యానవాలు.

(వ్యవ.) అతని మొగమునిండ స్ఫోటకపుమచ్చలింకను గన్పించుచున్నవి.

మచ్చనాలుకవాఁడు = రహస్యము దాఁపలేని వాఁడు.

గీ. ప్రాణసఖుఁడవు నీకుఁ జెప్పక మదీయ, వృత్తగోపన మెట్లు గావింప నేర్తు, మచ్చ నాలుకవాఁడవు మంతనంబుఁ, బొడమనీకని రసనకు బుద్ధిచెప్పు.
పి. శకుం. ౨. ౧౩౨.

జ. మచ్చెమాపు, మచ్చెమాయు.

**మచ్చెమాపు.** స. క్రి. (√మచ్చెమాయు) నశింపఁజేయు, సంహరించు.

(వ్యవ.) వాఁడు త న్నెదిరించినవానిని మచ్చెమాపక మానఁడు.

**మచ్చెమాయు.** అ. క్రి. (మచ్చ + మాయు) జాడ లేకుండపోవు, నశించు.

(వ్యవ.) పాప మాకుటుంబ మంతయు మచ్చ మాసి పోయినది.

నీమచ్చమాయ = ఇది యొకతిట్టుగా వాడఁ బడును.

**మచ్చెము = మచ్చె.** వి. (తె. మచ్చమ్.) ౧. చిహ్నము, గుఱుతు, జాడ, ఆచూకి.

సీ. గుఱి వచ్చమచ్చము గుఱుతు చిహ్నె, లక్కనం బాదికళం కానవా లడియాలము బన్నెన యనఁగఁ జిహ్నె. గీ. వలరు ..

ఆం. భా ౧. ౮౦.

సీ. అంగీకృతాంగ చైత్రాధిదేవత లాత్మసును చోరుమచ్చంబు చూపుకరణి

వసు. ౬. ౪౩.

౨. నిదర్శనము, దృష్టాంతము.

ద్వి. మొదలితలారిసమ్ముఖమునఁ బెట్టి, తోడ మచ్చంబుగాఁ దొడవులమూట, నూడిద పెట్టి తా సురిగ నాచోరుఁ, డు ...

ద్వి. హరిశ్చ. ఉ. ౨౩౯. పం.

ద్వి. ... నాకల్ల నీమీఁద, విపరీతముగఁ జెప్పి విరస మెక్కించి, తోడ మచ్చంబు నా దుప్పటిఁ జూపి, వీడెల్లఁ గనుగొన విఱిచి కట్టించి. సవ. ౧. ౪౦. పా. ౧౬. పం.

హరిశ్చ. ౫. ౧౩౮.

౩. నిదర్శన మైన దొంగిలించిన సొత్తు.

వ. .. అయ్యారెకులు చని పురంబు సర్వం బును శోధించి విపణివీథిం దదీయాభర ణమ్ము లమ్మ నమ్మహీసురు మచ్చెంబు తోడం బట్టి తెచ్చి . విక్ర. ౫. ౧౪౫.

**మచ్చెరము.** వి. (సం. మత్సరః, ప్రా. మచ్ఛర, క. మచ్చర.) ౧. ఈర్ష్య, ఓర్వలేమి.

గీ. బోధ మల్పంబు గర్వ మత్యున్నతంబు, శాంతి నిప్పచ్చరంబు మచ్చరము ఘనము.

భీమ. ౧. ౧౩.

ఉ. ఆకుసుమంబుఁ దాల్చిన మహామహిమంబునఁ దోడికొమినీ, లోకము మచ్చరంబు మది లోనఁ దొరంగి భజించుచుండె ...

పారి. ౧. ౪౯., ౧. ౫౦. కళా. పీఠి. ౫౦.

౨. స్పర్ధ, పోటీ.

సీ. పచ్చరానిగ్గుతో మచ్చరానకు వచ్చుమచ్చ యొయ్యెదచక్కఁ బెచ్చుమీఱ ...

కుమ. ౫. ౬౦.

౩. ద్వేషము, వైరము, పగ.

క. హరిదిక్కున మనుగలము, చ్చర మించుక యాత్మ వదలి సంప్రీతిపుర, స్సరముగ నీ నొడఁ బడియెను, హరిహాత్రుని కాత్మ శాత్రి నన్నరపతియున్.

హరి. ఉ. ౩. ౨౨౩.

క. పిచ్చుకపయి బ్రహ్మాస్త్రము, విచ్చలవిడి నిగుడఁ జేయువిధ మింతెకదా మచ్చరము మనుజతతిపయిఁ, దెచ్చుక పాలియింప నీవు దిరుగుట లెల్లన్. ఉ. రా. ౩. ౩౦౨.

౪. పట్టుదల, చలము.

గీ. మచ్చరంబున నిద్దఱు మానవతులు, పెడ మరలి చల్లులాడంగ

వరాహ. ౩. ౧౦౧.

జ. మచ్చరి, మచ్చరించు, మచ్చరికము; మచ్చరి కించు, మచ్చరీఁడు.

**మచ్చెరి.** విశే. (మచ్చరము + ఇక.) ౧. పట్టిన పట్టు విడువనివాఁడు, చలపాది.

చ. మదమున దేవదానవులు మచ్చరు లై గడుఁ బిచ్చలించి సం, పదలను గోరి పోరు చొడ ... భాగ. ౬. ౨౪౩.

(శ. ర. పా. 'మచ్చరముల్ గడుఁ బిచ్చ లింప' ముద్రి. పా.)

౨. ద్వేషి, విరోధి.

సీ. చటులార లేటి మచ్చరులార కానరే
మా కుమారునిఁ బోలు మా కుమారు ...
పారంగ. ౩. ౨౩౭.

(లేటి మచ్చరులు = మృగద్వేషులు, సింహ ములు.)

**మచ్చరించు.** అ. క్రి. (√మచ్చరము.) ౧. పోటీచేయు, స్పర్ధగొను.

వ. ... మఱియు సూతపుత్త్రుం డైన రాధే యుండును ధనుర్విద్యా కౌశలంబున నరుని తోడ మచ్చరించుచు దుర్యోధన పక్షపాతి యై యుండె .. భార. ఆది. ౫. ౨౨౫.

౨. ద్వేషించు, పగగొను.

క. అంతం గుంతీనందన, కాంతా చింతా
మహాంధకారములో న, త్యంతంబు మచ్చ
రించెనొ, సంతమసం బనఁ బ్రభాత సమ
యం బయ్యెన్. భార. విరా. ౩. ౩౪.

గీ. సహజ మాత్సర్యమున దేవ సమితితోడ,
మనము దొడరినవారి యేల మచ్చరించు ..
ఉ. రా. ౨. ౨౧.

సీ. లంకాపురంబున శాంకరీదేవతా మకుటేందు
రేఖతో మచ్చరించి ... కాశీ. ౧. ౧౩౦.

(ఇట ఔపమ్యద్యోతకము.)

౩. చలపట్టు, పట్టినపట్టు విడువకుండు.

చ. ఇటువలె మచ్చరించు హృదయేశయుఁ
డైన లతాంతధన్వి కా, క్కటఁ గడు
పెక్కుసం బడర ... చంద్రా. ౫. ౧౨.

**మచ్చరికము.** వి. (√మచ్చరము. ఇక, స్వార్థ మున.) ౧. చలము, పట్టుదల.

ఉ. కెచ్చెర మెల్లి నేఁడు మముఁ దెం డని
పంచినయుష్మ దాకినుల్, మచ్చరికంబునం
జవు లమర్చుటకై డిభకుండు నీవునుం,
జొచ్చినచోటు సొచ్చి రణశూరుఁడు శౌరి
కరాసిధారచేఁ, బచ్చడిచేయఁగా జముని
బానసముం బురుడించు చోటికిన్.
ఉ. హరి. ౪. ౧౯౬.

ఉ. ఏఁటికి నోవసిష్ఠ తగ దీక్రియ సారెకు
పట్టివాదముల్, మాటికిమాటికిం బెనఁచి
మచ్చరికంబున నాడ నీకు ...
హరిశ్చ. ౧. ౧౫౧. పి. శకుం. ౨. ౧౨౫.

౨. స్పర్ధ, పోటీ.

క. చీనాంబర మణిభూషణ, నానాగంధాను
లేప నవమాల్యములన్, మానినులును కైవ
ర్భియు, మానుగఁ గైకొనిరి మచ్చరిక
ములన్. విక్ర. ౫. ౬౨.

౩. ద్వేషము. (శ. ర.)

**మచ్చరికించు.** అ. క్రి. (√మచ్చరికము.) ౧. చలపట్టు, పట్టుపట్టు.

ఉ. ... వసుధామర ముఖ్యులు ళీతివాక్త్రు
నా, మంత్రణసేయలే రయిరి మచ్చరి
కించియుఁ గాశికాపురిన్ . .
కాశీ. ౫. ౩౦౪.

౨. స్పర్ధవహించు, పోటీచేయు.

చ. .. ఇద్దఱు ముద్దియ లొత్తి రవ్విభు,
న్మదగజరాజ కుంభముల మచ్చరికించు
కుచద్వయంబులన్. నైష. ౩. ౮౬.

(ఇట ఔపమ్య ద్యోతకము.)

సీ. అలకాధిపతితోడ నైన మచ్చరికించి కాన
నమ్మఁ గల మేటికోమటులును ...
భోజరా. ౨. ౪౭.

ఉ. ఇచ్చిన ప్రొక్కి పుచ్చుకొని యింపును
సొంపును బల్లవింపఁగా, నచ్చపలాయ
తేక్షణ శివార్పణ మంచు సుధారసంబులో,
మచ్చరికింపఁ జాలురుచిమత్ఫల మాదట
నారగించి ...
రాజ. చ. ౧. ౮౩. భీమ. ౧. ౯౧.

౩. ద్వేషించు, కలహించు, పోరాడు.

చ. పదములఁ దొట్రుపా టొదవఁ బ్రాణసఖీ
జనభాషణంబులన్, మదిఁ దమకంబు లజ్జ
యును మచ్చరికింప వణంకువేనితో, పాద
వతి మందమందగతి మార్దవ మొప్పఁగ
వచ్చె ... విక్ర. ౪. ౨౧౬

**మచ్చేరీఁడు.** విశే. (మచ్చరము + ఈఁడు. మచ్చరి + ఈఁడు. స్వార్థమున అని శ. ర.)
౧. మచ్చరము కలవాఁడు, ఈసు ఊనువాఁడు.

ఆ. చిచ్చు లేక చిముడు మచ్చేరీఁ డీసుద్ది,
వజ్రనాభుఁ డోర్చువాఁడె యకట.
ప్రభా. ౧. ౧౩౪

౨. వైరి, పగతుఁడు.

వ. .. పచ్చవిల్కాని మచ్చేరీఁ డానతిచ్చినఁ
దదీయ సన్నిధాన విశేష సుజ్ఞానోదయం
బున .. సానందో. ౫. ౧౬౩.

**మచ్చిక = మచ్చిగ.** వి. (క. మచ్చికె.) ౧. వలపు, మోహము.

చ. విడువని కౌఁగిలింత పురివిచ్చని మచ్చిక
తన్వ లేనిసం, దడి నొకవింత చూపు ..
శివల. ౫. ౩౧.

గీ. మైత్త్రియును సానుకూల్యంబు మచ్చిక
యును, గలిగి యుక్కాంత నిస్నెష్ఠ గలసి
యుండ . . మార్క. ౫. ౨౦౦.

ద్వి. అచ్చర తనదృష్టు లామిత్త్రి మీఁద,
మచ్చిక నాటించి మనసుపాం జెళఁగి,
రం. రా. ఉ. ౧౨౭. పా. ౧౭. పం.

౨. ప్రేమ.

క. అని వారికి వారందఱు, మనమునఁ దోఁచి
నటు లాడు మచ్చికమాటల్, విని సిగ్గున
నవ్వేల జ, వ్వని ... రాజ శే. ౩. ౩౩.

ఉ. క్రచ్చుఱఁ బారిజాతలతికావనదేవత జంభ
వైరిపై, మచ్చికఁ గూర్పఁగా నవకుసుమ
ప్రకరంబుల వేల్పుటేటిలో, విచ్చిన పైఁడి
తామరల వెంబడి వచ్చిన కమ్మగాడ్పు
లున్, మెచ్చులరీతిఁ గోకిల సమీరణ దీవన
లిచ్చె నొప్పఁగన్. హర. ౬. ౧౦.

దండకము. వేలుపుం బెద్దవై తద్దయు న్నె
ర్పుతో నిజ్జగంబెల్లఁ బుట్టించి పెన్నుండ
వై నిచ్చలు న్మచ్చికం బ్రోచి ...
నీలా. ౨. ౪౧.

సీ. . . నెయ్యము . నేస్తము ...

గీ. బాళి ప్రేమ.డి మచ్చిక మక్కువ యనఁ,
బ్రేమ దోఁచును ... అం. భా. ౧. ౧౩౬.

౩. ఆసక్తి.

ఉ. మైత్త్రియుఁ బ్రేమయు న్మనసు మచ్చి
కయు న్మొఱయ న్వరాటరా, ట్పుత్రిక
వల్కినన్ శైవ. ౪. ౭౪.

వ. ... మచ్చికతో నెదుట వచ్చి నిలుచున్న
పుడమికన్నె చిన్నారి నగుముద్దు మొగంపు
టద్దంబుం గనుంగొనుచు ...
ఉ. రా. ౧. ౧౩౭.

౪. భ్రమ, భ్రాంతి.

వ. . పెచ్చుపెరుఁగు నచ్చపుఁ బచ్చల
చాయలు మెచ్చులుసేయఁ బచ్చికల మచ్చి
కల విచ్చలవిడిఁ గ్రచ్చుకొని మెసవ నుం
కించు వంకంపురాజింక జంకించి ...
వసు. ౨. ౧౧.

౫. చేనవు.

క. ఎచ్చట శ్రోత్రియుఁడును ధన, మిచ్చు
నతఁడు నీరుగలుగు నేఱును వెజ్జున్మచ్చిక
యును లేకుండును, నచ్చట వసియింప
వలవ దభినుతచరితా. మార్క. ౩. ౨౪౭,

జ. మచ్చికపడు.

**మచ్చికపడు.** అ. క్రి. (√మచ్చిక) మరులు కొను.

స. క్రి. మరగు. (శ. ర.)

**మచ్చిగ** = మచ్చిక. వి. ప్రీతి, ఆసక్తి.

మ. తగునే మాధవ యిట్టివాఁడిపలుకుల్
ధర్మంబులే మారొడన్, మగలుం బిడ్డలు
సోదరుల్ జనకులున్ మమ్ము న్నివారిం
మ. చ్చిగ నీయం(స్రు)లు సేరినారము .
భాగ. ౧౦. పూ. ౮౬౨.

వ. తగివనరేంద్రనూనుఁ డని తన్నుఁ బ్రియం
బునఁ బిల్చి తెచ్చి మ, చ్చిగ సుత నిచ్చి
మత్ప్రీతిముఁ జేసిన సింహళరాజనూనుఁ
డా, తగవు మదిం దలంపక ...
విక్ర. ౬. ౪౬.

(దసా.)

క. ముచ్చిరి యున్నది లోకము, నిచ్చలు
గంపాదిఖలులు నిర్దయ లేఁచన్, వచ్చిగఁ
గావఁగ వలయును, విచ్చేయము తల్లికడుఘ
వెడలి ముకుందా. భాగ. ౧౦. పూ. ౧౦౧.

**మచ్చె¹.** వి. (క. త. మచ్చు.) ౧. మీఁదికట్టడము, మిద్దె.

క. మ చ్చెక్కెంపుగు వానిని, నిచ్చెన
ఋడి తొలఁగఁబుచ్చి నెమ్మదిలో నే,
మ్రుచ్చిలి కేయూర. ౨. ౬౦.

క. అపు డిచ్ఛావతి యచ్చో, నుపవల్లభు
నిలువఁ బనిచి యోడక యిలు సొ, చ్చి
పొడవు గలమచ్చుపయిం, గపటవ్యాపార
మమరఁగాఁ గూర్చుండెన్.
వేం. పంచ. ౮. ౫౦౫.

౨. మీఁదికట్టడము లేని మిద్దెటిల్లు, డాబా.

ఉ. .. అగేంద్రకన్య రాఁ, జూడఁ దలంచి
నిల్చిరి వసుక్షితిపాలపురీ పురంధ్రికల్,
మాడువులన్ హజారముల మచ్చుల సజ్జల
గోపురంబులన్, మేడల నాట్యశాలికల
మేరువులన్ భువనేశ్వరంబులన్.
వసు. ౬. ౬౪.

౩. అల్పకార్కశ్యము.

సీ. ... అట్టిక యన మచ్చు నా నల్పకా
ర్కశ్యంబు వెలయు. అం. భా. ౨. ౧౪.

ఉ. మేరులతీరులా కురుఁజామీఁదులఁ జెక్కిన
టెక్కియంబులా, గారుడరత్నతోరణ ధగ
ద్ధగలా తెలిగచ్చుమచ్చులా ...
పాంచా. ౪. ౫.

గీ. మేలిగొజ్జంగిపూనీట మెకపుటాము గలిపి
ఒలురాచతెరువులఁ గ్రంతలందుఁ, జలికి
మచ్చుల మేడల నెలవు లెల్లఁ, గ్రొత్త
సింగారములఁ దళుకొత్తఁ జేసి ..
అచ్చ. రా. అయో. ౧౦.

**మచ్చె².** అ. క్రి. ఆశ్లించు.

ద్వి. నచ్చినవాఁడవో నావారిలోన, మచ్చిన
వాఁడవో మనసుకీ లెఱఁగి.
పండితా. పురా. ౧౧౫. పా.

వి. ౧. చొక్కమందు, మీఁదఁ జల్లినచోఁ
బరవశముచేయు భస్మవిశేషము.

సీ. కనుచూపులనుమన్మథుని మోహనాస్త్రంబు
లందుఁ గాటుకమచ్చు సందడింప ...
వి. పు. ౨. ౯౬.

ద్వి. వచ్చెఁబో యే నేల వనజాక్షి చూపు,
మచ్చు వేసిన నిట్లు మరు లేలకొంటి.
ద్వి. పరమ. ౨. ౬౩. పా.

వ. ... గచ్చుకీడెంబులును మచ్చుబిడెంబు
లును నిలుపుమందుల కరాటంబులును ...
ప్రబంధ. ౪౮.

౨. మృగాదులు వలలోఁ దగులుకొనుటకై
వలకు సమీపమున నుంచెడు నాహారము,
ప్రలోభనము.

మ. గగనారణ్యచరాంధకార గజముం గాలా
హ్వయవ్యాధుఁ డ, చ్చుగఁ బట్టన్ సమ
కించి మ చ్చిడుటకై చూకాంతుగ్రేణిచే,

నొగిఁ గల్పించినకందుకం బనఁగ సూర్యుం
డంత వీక్షింపఁగా.

భాగ. ౧౦. పూ. ౧౨౭౪.

క. మచ్చు లిడి యురులు బోనులు, నచ్చట
వెసనొగ్గి చనిన నది యెఱుఁగక యా,
మచ్చుచ్చురులను బడి వగ, నిచ్చను దుర
పిల్లుచున్నయెడ నచ్చటికన్.

విక్ర. ౫. ౨౧౨.

మచ్చు³. వి. ౧. నికషోపలము, ఒరగల్లు, బంగారువన్నె పరీక్షించుట కుపయోగించు గీటురాయి.

సీ. సంచితాద్యఘ సమిత్సమితికిఁ గార్చిచ్చు
హారివైభవస్వర్ణ మొరయ మచ్చు .

ఘటికా. ౧. ౧౪౮.

౨. మచ్చుముక్క, బంగారు లోనగువానివన్నె పరీక్షించుటకై అగసాలి మున్నగువారి యొద్ద నుంచుకొన్నకమ్మి.

ఉ. మైనపుటంటు పల్వగలమచ్చులచా లొర
గల్లు కళ్లెలున్ .. శుక. ౧. ౪౨౦.

౩. వన్నె సరిగా నున్న దని చూచుకొనుటకై యగసాలివాఁ డిచ్చెడు వెండిబంగారముల కమ్మి.

ద్వి. మగుడ నిన్ గాంచఁగ మదిఁ దలఁపోసి,
వచ్చితి నే ననిన వసుధాధిపతికి, నచ్చుగా
నతి వియోగాగ్నికీలలకు, మ చ్చిది యన
నొప్పుమాణిక్య మిచ్చె.

రం. రా. సుం. ౨౩౬. పా. ౧౪. పం.

౪. బంగారము. (చూ. మచ్చుగుబ్బలి.)

౫. విధము, రీతి.

౬. ఇచ్చెలువునన్ దనయిచ్చకు వచ్చిన
మచ్చున నచ్చటచ్చట నచ్చపలుండు నిచ్చ
లు మెలంగుచు నొక్కనాఁడు ...

ఉ. రా. ౩. ౧౦౨.

జ. మచ్చుగుబ్బలి.

మచ్చు⁴. వి. (క. త. మచ్చు.) పొదలు మొ. వానిని నఱకెడు ఒకవిధ మగు మోటుకత్తి.

సీ. సాధుసమాగమజ్ఞానవిద్యకు నచ్చు వివిధ
జన్మార్థముల్ వెరఁజూమచ్చు .

ఘటికా. ౧. ౧౪౦.

మచ్చు⁵. వి. మాలిన్యము, మురికి.

గీ. సిగ్గుకతమున సకియలచేర్పు వాసి, చనుచు
బరికించుఁ తొడవులయునికిమట్టు, మచ్చు
మర లేక యుండ నేమఱక యోము,
మిగుల మేగరకరిక నామెఱుఁగుఁబోఁడి.

కళా. ౩. ౧౦౦.

మచ్చుగుబ్బలి. వి. (మచ్చు³ + గుబ్బలి) బంగారుకొండ, మేరుపర్వతము.

సీ. సిరిగట్టు నాకును పిరి గట్టు నెల వప్ప
మచ్చుగుబ్బలి నాకు మచ్చు జియ్య

చంద్రా. ౨. ౪౫.

మచ్చెకంటి. వి. (మచ్చెము + కన్ను.) మీన నేత్ర, చేఁపలవంటి గన్నులు గలస్త్రీ.

గీ. మెచ్చు గావించె మామది మచ్చెకంటి .

హరి. పూ. ౨. ౫.

గీ. అత్తెఱంగునఁ గొనిపోవునపుడు గన్ను, విచ్చి
కడలెల్లఁ జూచి యమ్మచ్చెకంటి, యురక
పలవింపఁ దొడఁగె.

అచ్చ. రా. అర. ౬౩.

ఉ. ... అ, య్యచ్చరమచ్చెకంటులయొయార
మయారె నుతింప శక్యమే.

దశా. ౨. ౨౪౦. ఉ. రా. ౪. ౨౧౪.

మచ్చెము. వి. (సం. మత్స్యః, త. మచ్చము.) ౧. మత్స్యము, చేఁప.

క. మచ్చె మయి సోమకుఁడు మును, ద్రిమ్మచ్చిలి
వేదములు గొనుచు. భా. రా. యు. ౬౧౫.

సీ. ... మీను మచ్ఛము చేఁప యనఁగ
మత్స్యము తనర్చు. ఆం. భా. ౧. ౧౫౯.

౨. మత్స్యాకార మగు బరణి.

ద్వి. కాటుకమచ్ఛం బగరుకరాటంబు ...
ద్వి. తి. పా. ౧. ౧౧. పా. ౧౪. పం.

సీ. కాటుకమచ్ఛము లక్కస్తూరిపీఁకెలు గపు
రంపుఁగ్రోవులు గందవొళ్లు ..
కవిజ. ౩. ౫౧.

జ: మచ్ఛెకంటి.

**మచ్ఛము.** సం. వి. అ. పుం. చేఁప.

**మజే** = మజా, మాజా, మజ్జే, మజ్జా.
అవ్య. ప్రశంసార్థకము. (దీనికి 'బాపు' 'బాపురే' 'బళి' మొదలగునవి తఱచుగా ననుప్రయుక్తము లయియే కన్పడుచున్నవి.)

ద్వి. ఆడిగెడువారు లే కయ్యె నీ వింత, బడఁగ
వైతివి మజ బాపురే యనుచు.
బ. స. పు. ౪. ౨౩౫. పం.

ద్వి. నల్లవో పండిత నతపండితౌఘ, నల్లవో
పండిత సందితకీర్తి, మజ బాపు పండిత
మతుకులాచార్య, మజ బాపు పండిత మల్లి
కార్జునుఁడ. పండితా. దీక్షా. ౭౦. పా.

క. ... మజ బాపురె వీనిఁ బోల వాగలుం
గలరే. ఉ. హరి. ౫. ౨౭౦.

క. ఆపశుపాల నృపాలభు, జాపాటవమును
సమీకజయము మజ బళి, బా పని తిక్కన
పురుషుం, డాపోవక పొగడె సవినయాలా
పములన్. వరాహ. ౯. ౧౫.

**మజా** = మజే. అవ్య, ప్రశంసార్థకము.

మ. అరరే బాపురె బాగురే బళిరె మేలౌ
మజా యంచు నం, బరమార్గంబునఁ జేరు
వన్ నిలిచి సప్తర్షుల్ ..
వరాహ. ౧౦. ౬౩.

చ. చెలఁగి కటారిచిత్రరము చిమ్ము వికారపు
నవ్వె నవ్వు మీ, సలు వడిపెట్టు నూరక
మజాయను ... విక్ర. ౮. ౧౯.

**మజాలీసు.** వి. (హిం. మజాలిస్) సభ, దర్బారు.

ద్వి. వీర, తరులచేఁ గవులచేఁ దనరి పూవింటి,
దారమజాలీసుతో దార గ్రైనతోఁట ...
మృ. వి. ౨. ౫.

**మజ్జే** = మజ్జా. (శ. ర.)

**మజ్జ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఎముకలయొక్కయు
మాంసముయొక్కయు సారము. ౨. వృక్ష
సారము, చెట్టుచేవ.

**మజ్జెనము.** వి. (సం. మజ్జనమ్) స్నానము.

సీ. స్నానంబు తనరును దానంబు మునుక
బుడుక మజ్జన మన
ఆం. భా. ౨. ౧౬౦.

**మజ్జనము.** సం. వి. అ. న. ౧. మునుఁగుట, అవ
గాహనము. ౨. మజ్జ, అస్థిసారము.

**మజ్జకృత్తు.** సం. వి. త్. పుం. అస్థి, ఎముక.

**మజ్జము.** సం. వి. న్. పుం. = మజ్జ.

**మజ్జరి.** వి. సైచికి, ఉత్తమ మైన యావు.

గీ. చెలఁగు మజ్జరి యనఁగ సైచికిసమాఖ్య ...
ఆం. భా. ౨. ౨౬౩.

**మజ్జసముద్భవము.** సం. వి. అ. న. పురుషుల
వీర్యము, శుక్రము.

**మజ్జా** = మజ్జారే. అవ్య. ప్రశంసాద్యర్థకము.

సీ. మజ్జా కృపీటసంభవ మహాదిక్పాల హేలా
విహార వాహ్యాళివాహ. క్రీడా. ౨౩౨.

క. అతఁడె వెన్నెల దగ మజ్జా తా జాబిల్లి
వెజ్జు జగమున కల్లన్, రాతిరి సోఁకిన

చీకటిబూతము విమురంగఁ జల్లుబూతియుఁ
బోలెన్. యయా. ౨. ౭౧.

**మజ్జాకరము**, సం. వి. అ. న. ఎముక, అస్థి.

**మజ్జాజము.** సం. వి. అ. న. ౧. రేతస్సు, శుక్రము. ౨. భూమిజగుగ్గులువు, గుగ్గులు భేదము. శ్రీ.

**మజ్జారసము.** సం. వి. అ. పుం. పురుషుల వీర్యము, శుక్రము.

**మజ్జారె = మజ్జా.** అవ్య.

(ఆశ్చర్యార్థకము.)

మ. చనుదేరం గని మింటిమానిశము నిచ్చల్
పోవు మజ్జారె యా, విను ద్రోణన్ నడ
యాడ కేల యిటకున్ విచ్చేసెనో యబ్బురం
బన ... యయా. ౪. ౬౫.

(ప్రశంసార్థకము.)

ఉ. ... అగ్రజానితావునఁ దమ్ముని దెచ్చి
పూన్చవాఁ, డై రహిఁ వాలి ముమ్న కాని
యంతటఁ బోఁ కిటు వచ్చె నేమొ మ,
జ్జారె కపిత్వవంశగద్భుతం బాకా యీ
దృశధర్మ మక్కటా.
చం. రా. ౭. ౧౪౧.

మ. బళిరే మైసిరితీరు నిల్కడలు సేబా పయ్యరే
పేరణీ, కలనం బార పదాళికాభినయ
వైఖర్యంబు మజ్జారె కో, పులనైచిత్రి
యవహో వినిర్మలకరాం భోజాతవిన్యాస
మం, చలివేణిల్ వినుతింప సర్వె నటనం
బాకొమ్మ తత్సన్నిధిన్. చంద్రి. ౨. ౯౭.

**మజ్జాసారము.** సం. వి. అ. పుం. జాతీ ఫలము, జాజికాయ.

**మజ్జిగ.** వి. (సం. మార్జికా, ప్రా. మజ్జిఆ. క. మజ్జిగె. త. మజ్జిగై.) దండాహతము, చల్ల.

గీ. మితి రొయిలంగఁ దుంపరల్ మీఁదఁ
బడఁగ, జొన్నకూడును మజ్జిగ జాత్తి
లేచి ... శుక. ౨. ౪౧౧.

గీ. అత్తయాసతి మజ్జిగ లమ్మువేళ, దాని
దారన నీళ్లుంచె సేని యింక ..
శుక. ౨. ౫౫౬.

గీ. వెలయ వేగురుచుక్కను వెన్నముద్ద, చెంతఁ
జాపట్టుకానుమజ్జిగ యనంగ . తూర్పునఁ
దెలుపు దోఁచె. శశాం. ౪. ౧౨౫.

గీ. అడరు దండాహతము చల్ల యనఁగ మజ్జి,
గ, యన ఆం. భా. ౨. ౨౫౯.

**మజ్ఝా = మజ్ఝారె.** అవ్య. ప్రశంసార్థకము.

శా. గాఢాగ్రప్రతి పాదనక్రమ కళాకౌశల్యము
ల్లేక వా, చాథకార్కటితోడఁ దాము
తమ మజ్ఝా యంచుఁ దైవారముల్, ప్రౌఢిం
జేయుచు ... రాజ. చ. ౧. ౯.

గీ. సంభ్రమోద్ధితనృపజూటచటుల ఘర్ష,
పాదు తా రార బళిర మజ్ఝా యనంగ ...
సుద. 3. ౧౬౪.

సీ. .. అగ్గిర యయ్యారె యార మేల్ శ్రీ
బాపు మజ్ఝా బలారె సెబాసు నాఁగఁ
నలరుచుండుఁ ప్రశంసార్థములుగ ...
ఆం. భా. 3. ౬౬.

**మజ్ఝారె = మజ్ఝా.** అవ్య. ప్రశంసార్థకము.

మ. అవురా వాతెఱతేట ఖూబు పిఱు,
దొయ్యారంబు మజ్ఝారె చ, న్గవతళుక్కుల్
భళి దంతకాంతు లగరే కస్బెరుక
లప్పప్ప కో, ష్షా విలాసంబు ..
ప్రబంధ. ౪౭౪.

**మటచి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. రాళ్లవాన.

**మటపల్లి.** వి. (త. మటప్పళ్లి.) దేవాలయము నందలి వంటిల్లు.

సీ. మటపల్లిచక్కఁ దా నటు పరామరిసించి
యందు లందుల సందుగొందు లరసి ...
విప్ర. ౫. ౬.

**మటమట = మలమల.** వి. మాడుట, మఱుఁగుటలయం దగుధ్వని, ఆధ్వని కనుకరణము.

క. అఁకట మటమట మాఁడుచు
భాగ. ౯. ౨౪౧.

(శ. ర. పా. మలమల మాడుచు. ముద్రి. పా.)
జ మటమటలాడు.

**మటమటలాడు.** అ. క్రి. (మటమటలు + ఆడు.) మండు, జ్వలించు. (శ. గ.)

**మటస్ఫటి.** సం. వి. ఇ. స్త్రీ. గర్వారంగము. మటిక = మట్టిక కీ. (శ. ర.)

**మటుమాయ(ము.)** విణ. (మాయము + మాయము.) ౧. మాయావి, మిక్కిలిటక్కరి.

ద్వి. ఇటువలెఁ జెలరేఁగి యెవ్వరి నిట్లు, మటు
మాయవిధి పట్టి మలకలఁ బెట్టు.
ద్వి. హరిశ్చ పూ. ౧౭౦౯. పం.

చ. మఱఁది యటంచు బావ యని మామ
యటంచును నల్లుఁ డంచు నం, దఱకును
నన్నివావు లిడి తచ్చనల న్మటుమాయ
బుద్ధులన్, మురిపెముల న్విలాసముల
మోహము లెంచి నిశాటచిత్తము, ల్గరఁచె
లతాంగి యంగనలు గారె మనోధనపశ్యలో
హరుల్. దశా. ౨. ౩౬౬.

ఉ. ఎన్నఁడు నేర్చినాఁడవుర యీమటు
మాయపుమాట లీవు నా, కిన్ని దలంప
నేమిటికి నిప్పుడు దోసము పెద్ద చేసి యా,
దున్నవయాళి కానిఁ గడుదొడ్డఁగఁ జెప్పి
భయంబు నూపి చ, క్కన్నను దద్దపెట్టి
యయెలుకంగఁ దలంచెదు మాను మీవగల్.
సారంగ. ౨. ౧౧౪.

౨. నికృష్టము, అధమము.

క. మటుమాయయాఁడుతన మొ, క్కటియు
నడఁచుపని యదెంత గల దతని కతం,
డిటువలె వలపిన నటువలె, ఘటియింపఁ
గలఁ డటంచుఁ గర్దముఁ డనినన్.
ఉ. రా. ౭. ౪౯౭.

౩. అదృశ్యము, కానరానిది.

సీ. హరునిచే మటుమాయమై పోయె నెఱుంగని
చిత్తజాతునకు సంజీవకరణి ...
చిత్రభా. ౨. ౯౫.

౪. మిక్కిలిమాయ, మోసము.

ఉ. మక్కువఁ జెల్పి యొక్క మటుమాయల
రాకొవరుండు వచ్చి తా, నెక్కువమట్టు
మంచు వచియించి సఖీమణిఁ బెండ్లియాడి
నన్. ఉ. హరిశ్చ. ౨. ౯౭.

క. నటలు దటవటలు నటనలు, మటుమాయలు
జాటువగలమాటల వింతల్, గుటిలతయుఁ
దెలిసి పాఱుఁడు విటవిద్యకు బిరుదు వేసి
వికవిక నగుచున్. ప్రబంధ. ౬౧౪.

క. వినవే తొల్లిటితపసుల, వనితలకున్ లోను
గానివారలు గలరే, మన మనఁగ నెంత
గరఁగక, మన మనఁగా నెంత కలికి మటు
మాయలకున్.
సారంగ. ౨. ౧౩. చంద్ర. వి. ౧. ౫౨.

**మటుమాయతనము.** వి. (మటుమాయ + తనము) మిక్కిలిమాయ.

ద్వి. కుటిలకుత్సితములు కూచిమారములు, మటు
మాయతనములు మందు ప్రాఁకులును, నటి
మటంబులును ము న్నైనచెద్దగుములు.
ప్రభు. ౨. ౫౦. పా. ౯. పం.

**మటుమాయలబండి.** విణ. = మటుమాయలాఁడి.

కాల్చుటయు నిగ్గలను దల పుణుకుట,
భర్త గలభావి నుల కళుభ్రపదిములు
పా. శకుం. ౪. ౭౯

సీ. చెలి యేల తనకేల జెవుగ దీవియ నంచె
వానిపోయగ మేల గాచుకించె, నది యేల
ధృతిద్రీల మది గాలి పుట్టించె మగ డేల
తాలిమి మట్టగించె చంద్రా. ౪. ౧౪౫.

**మట్టగింపు.** వి. (√వట్టగించు.) మట్టగించుట,
పెకలించుట.

ఉ. . జలజంబులకుం దలసంపు కోకసం,
సారము మట్టగింపు నెలబాలునిన కకు
మోముసొంపుగ్ర్యం, గాగరసంబు ముంపు
కనఁగాఁదగఁ జీకటిగుంపు పెంపుగాన్.
ల వి. ౪. ౪౧

(ఇందు రెండవపాఏమున య ధంగము.)

**మట్టగిడుసు.** వి. మత్స్యవిశేషము, ఒకజాతి
చేప. (శ. ర. వట్టగుడిసె బ్రా. మట్టగిడస
అని వా.)

**మట్టపలక.** వి. (మట్టము + పలక) మట్టము
చూచెడిపలక. (శ. ర.)

**మట్టమధ్యాహ్నము.** వి. వి. (మధ్యా
హ్నము + మధ్యాహ్నము) కొంచె మైనను
హెచ్చుతగ్గులు లేని పగటి నడిమిభాగము

గీ. మట్టమధ్యాహ్న మిది సుధామధురవాణి.
యర్హ్య మిచ్చోఁ బథ శ్రమం ఒపనయింప.
పాండు. ౧. ౧౩౬.

**మట్టము.** విశ. సం. మరమ్, క. మట్ట, త. మ.
మట్టమ్.) ౧. సమానము.

గీ. మిఱ్ఱుఁ బల్లంబు గట్టును మెట్టు నొక్క
మట్ట మై యాది నునుపారు
భార. అను. ౧. ౨౨౦.

సీ. కలహంసపదువులు గాఢ్లందుఁ దొడరె నా
వట్టంపునడపులు మందటిల్లె .
కు. సం. ౯. ౩౩౨.

౨. వామనము, పొట్టిది.

సీ. కులుచ కొట్ట కురుఁజా కొటిక కుసుని
మట్టు మట్టిసి ఐట్టము మట్టసము గొ, నను
గొనప గొనిసె గునిసె గిఱిక ఠింగణా
యనఁగను వామనాఖ్య దనర.
ఆం. భా. ౨. ౧౨౩.

ద్వి. మట్టంపుఁ జిగురుగొమ్మలు తొంగలించి,
దట్టంపునన లొత్తి తళతళ మించు.
నవ. ౧. ౯. పౌ. ౭. పం.

ఉ. చూ, పట్టునిల్వకంకణవిభల నయ
గోత్సవ మాచరింపఁగా, మట్టపుటూర్పుల
స్మైఱయు మంజాసరోరుహరాగపూగముల్,
పట్టపురాణిరీతిఁ గనుపట్టుసరోరమఁ జూచి
యుబ్బచున్. వేం. పంచ. ౪. ౧౩౪.

(రాణిపక్షమున సమానము.)

౩. అల్పము, తక్కువైనది.

క. ఇవ్విధమున రుక్మిణిమదిఁ, బువ్వం బరి
మళసుఁబోలెఁ బొలుపుగ నెత్తం, బవ్వా
యి గలిగి కొరికి, మవ్వము దిగఁ దొడఁగె
గెలుపు మట్టం బయ్యెన్.
ఉ. హరి. ౩. ౧౨౫.

ద్వి. వట్టంపుఁ బొడవున హైనమ్ర, చెట్టు
క్రిందటిపుట్ట చేకొనియుండె.
ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౭౫. పం.

వి. ౧. శిల్పసాధనము.

(నీటిమట్టము, నూలమట్టము మొ.)

౨. కొలఁది, మితి.

ఉదా సముద్రపుమట్టము, భూమిమట్టము మొ.

జ మట్టపలక, మట్టముసేయు.

**మట్టముసేయు.** స. క్రి. (మట్టము + చేయు)
సరింపఁజేయు.

క. ... స, ద్వ్రితుఁడైనవాఁడు నిర్మల,
మతిచే నఘరాశులెల్ల మట్టము సేయున్ ..
భాగ. ౬. ౪౯.

**మట్టసము.** విణ. ౧. వామనము, పొట్టిది.

సీ. కుఱుచ కొట్ర కురుఁజు కొటిక కుఱుచ
మట్టు మట్టసి మట్టుము మట్టసము గొ, నను
గొనప గొనిసె గునిసె గిఱిక తింగణా యనఁ
గను వామనాఖ్య దనరు
ఆం. భా. ౨. ౧౨౩.

౨. పరిమితము.

చ. పెనిమిటి దండుదాడి చని పెంపునఁ
గ్రమ్మఱురాఁక పేడియాం, బును నీరగంద
మున్ విరులు ముట్టక యుండఁ దగున్
బాలంతి తే, జుసఁ గడు నొప్ప మట్టసపు
సొమ్ములతోఁ గఱుమాపుఁ గట్టతోఁ, దన
కలి కొప్పుతో మిగులఁ దార్కొను
ముత్తైపుసేస బొట్టుతోన్.
యయా. ౪. ౧౩౪.

**మట్టసి.** విణ. వామనము, పొట్టిది; వామనుఁడు,
పొట్టివాఁడు.

సీ. పొట్టి మొట్టి గిటక పొదిగి పొదడు గున్న
. కుఱుచ కొట్ర కురుఁజు కొటిక
కుఱుని మట్టు మట్టసి పొట్టము మట్టసము
తింగణా య నఁగను వామనాఖ్య దనరు.
ఆం. భా. ౨. ౧౨౩.

**మట్టాడు = మట్టు.** స. క్రి. (మట్టు + ఆఁడు,
స్వార్థమున.) ౧. త్రొక్కు.

ద్వి. మొగిఁ బులుల్ భల్లూకములు గజంబు
లును, గట్టెండకాఁకకుఁ గడుపు లై
సొచ్చి, మట్టాడి కలఁచిన మడువులు గలిగి.
రం. రా. ఉ. ౪౨. పా. ౧౩. పం.

ద్వి. మలయానిలము వెంట నలి వచ్చి వచ్చి,
యళిపిండు మసలి మట్టాడునో యనుచు.
పండితా. పురా. ౯. పా.

సీ. ఒలిమి గెంతటియనిఁ బరసైన్యతతుల మట్టా
డుట తుంగలో నాడునట్లు ...
కవిక. ౧. ౧౩.

సీ. ఖురముల పుస్తసాగరముల రొంపిగా నుం
కించి మట్టాడు నొక్క మాటు ...
భాగ. ౩. ౪౧౫.

౨. మథించు, పీడించు.

మ. మలయాద్రిన్ నెల వై పెలంగెడు మరు
న్మత్తేభ ముత్తుంగతన్, వలరామావుతుఁ
డెచ్చరింపఁ బథికవ్రాతంబు లేదేఁటికృం,
ఖల మట్టాడచు చైత్యమాంద్య భరసౌగం
ధ్యంబుల ద్దాన ధా, రలతోఁ జేరెడు
మస్మగో జలజవ్రప్రక్రీడకున్ లక్ష్మణా.
చం. రా. ౬. ౧౧.

శ్లో. . మథిత పథికవర్గః.
సం. చం. రా. కిష్కిం. ౫.

౩. క్రి. వ్యాపించు.

ద్వి. మహనీయతర మైన మణికుండలముల,
మహిమ దిక్కులకెల్ల మట్టాడుచుండ .
రం. రా. యు. ౩౭౭. పా. ౫. పం.

**మట్టి.** వి. (సం. మృత్, ప్రా. మట్టీ, క. మట్టి)
మన్ను, మృత్తిక

సీ. అర్ధచంద్రుని తేట నవఘుటించు లలాటపట్టిఁ
దీర్చిన గంగమట్టితోడ ...
మనుచ. ౩. ౭౧.

సీ. మృత్తికాహ్వయము లౌ మిత్తిక యంచన
మట్టి యం చనఁగను మన్ననంగ ...
ఆం. భా. ౨. ౫.

చ. .. మట్టికొసలన్, ఓడియము లంట
దోఁపి పృథుభీషణ బాహుల సాళువంబు
లన్, దడవి కెరల్చుచున్ జనిరి నాథుని
ప్రోల నృపాలనందనుల్.
మనుచ. ౪. ౩౦.

(మట్టికాసె = మట్టిరంగు గలదట్టి.)

సీ. చిప్పకూఁకటి తోఁడికరకునం దిడినట్టి జిగి
మట్టికుళ్ళాయ సొగసు మీఱ
చం. రా. ౨. ౬౧.

సీ. గడిదంబు మట్టిచల్లడముపై బంగారు సాటి
చెంగు లొకింత జాఱఁగట్టి ..
ఉ. హరిశ్చ. ౨. ౫౨.

సీ. తనుమేరు గిరిమీఁది తరుణాతపంబునాఁ
బలుచని మట్టికుప్పటి యొసంగ
కు. ౨. ౨౫౮.

౫ మట్టితైలము.

**మట్టించు.** స. క్రి. (√మట్టు) త్రొక్కించు

సీ. .. పృథులహస్త, తలములఁ జఱచియు
దంతావళంబులఁ గాళ్ళ మట్టించియు
ఘోటకములఁ, మేను ద్రొక్కించియు
భా. రా. యు. ౮౧.

సీ. మట్టించెఁ గలన సాగ్రాణి తేజీలచే
మత్తారి రాజన్య మస్తకముల ...
చిత్రభా. ౧. ౩౪.

క. ఇట్టికుమారులఁ గని చే, పట్టె జమేందిర
నృసింహ పార్థివుఁ డాజి, న్మట్టించె వైరి
శిరములు, ఘోట్టాణ కఠోర ఘోరఖుర
పుటపటలిన్. రామా. ౧. ౧౦౫.

౨. నడపించు.

వ. . ఘోణారంధ్ర నిశ్వాస గంధవాహ
ప్రవాహం . వెడలు వాహంబు దగ మట్టు
వడ నిట్టట్టు మట్టించుచు ...
మనుచ. ౪. ౧౧౫.

**మట్టిక[1]** = మట్టెక. వి. గొరుచిక్కుడు తీ.
(శ. ర.)

**మట్టికల,** వి. (√మట్టు) పాదఘాతము.

ఉ. కట్టికవారు సారె సముఖా యన వామ
పదంబు కెంపురా, మట్టిక నిల్పి గద్దెపయి
మార్పడ కేల్దోయి కానుకగా పూఁది
చంద్ర. ౨. ౪౯.

**మట్టితైలము.** మి. వి. (మట్టి + తైలము) మట్టి
నుండి తీసెడు ధృతి.

(వ్యవ.) మట్టితైలము వంటగా నుపయో
గించుదు.

**మట్టిమల్లాడు.** . క్రి. (మట్టు + మల్లాడు)
పాడుచేయు, ధ్వంసముచేయు.

గ్యా. మదపుటేనుఁగుభంగి మట్టిమల్లాడి, నదులు
గొరాడుచు సవి కేఁకి మిఱియు.
సం. గా. ఉ ౭౯. పా. ౭౯. పం.

వ. మహోన్నతంబు సముద్ర క్రోడంబునం
బోలె విక్రమాభిక్రమంబున నుక్కు మిగిలి
యాశ్రకారి సేనాన క్రాకరంబుఁ జొచ్చి
కోధించి కలంచి కలగుండుసేసి మట్టి
మల్లాడి వెరఁజి కెంపరలు వెట్టి వచ్చి
పోయిన తెరు వెఱుంగక .
పి. శకుం. ౩. ౧౨౬.

సీ. మట్టిమల్లాడిరి మదసామజంబులఁ బురజన
పదములు తురకాలము . సిం. నార. ౫.

**మట్టియ[1]** = మట్టె. వి ౧. స్త్రీలు కాలి
రెండవ వ్రేలికి ధరించు ఆభరణ విశేషము.

సీ. లలితంబు లగు మట్టియలచప్పు డింపార
సంచారకడి నడ నల్లవచ్చి ...
భార. విరా. ౨. ౬౪.

సీ. నతుకలవ్రేళ్ల మట్టియలుఁ దిల్లాం ఘ్రిడి
పాదపట్టముఁ బెట్టెఁ గై నొక్కర్త
ఆము. ౬. ౧౨౮.

౨. మగవాఁడు కాలిరెండవ వ్రేలిక ధరించు
భూషణవిశేషము.

సీ. మట్టిగా లాండొంటి కట్టు దాకఁగ సెల
సందంద మునిగాళ్ల సప్పఁంచు .
భార. విరా. ౨ ౨౫౦.

**మట్టియు.** వి. (సం. మృత్తికా. ప్రా. మట్టి
అ.) మృత్తు, మట్టి.
సీ. కల్పింప నేర్చిరి గంగమట్టి యమీఁదఁ గస్తూ
రికాపుండ్రకములు వొసల
కాశీ. ౧. ౩౭. భీమ. ౧. ౪౦.

**మట్టు.** స. క్రి. ౧. త్రొక్కు.
చ. కొడుకులపాటు సూచి కడఁగోప మెల
ర్పఁగఁ దల్లు లొక్కొ యుమ్మడి వస
జాయతేక్షణ ని మట్టఁ దలంచి మహా
గ్రహంకృతుల్, వడిగొనఁ గొమ్ము లొడ్డ
కొని వాతులు విచ్చి ఘూ గ్రపాతనం,
బడమిఁ జగుల్చు మన్
హరి. పూ. ౬. ౮౭.

చ. ... తనకెంటసె ద్వాగిపాలురన్, సెల్
సెడ మట్టికొంచఁ జోర నిర్భర గర్వము
నుబ్బ ఓంకమన్, వెఁడయఁగవచ్చి యా
యసుర మించె మదగ్ర మహాసనసిలిన్.
ప్రభా. ౧. ౮౧.

గీ. వెట్టదినముల మడుగుల మట్టి కలఁప, బడ
బుడధ్వని వెడలు బుగ్గ్బదములందఁ, జిలుప
చిలుపని నేతులు జిడ్డుడేలు .
మనుచ ౪ ౧౭

౨. అణఁగఁద్రొక్కు
మ నను నాకశ్యప కామినీమణులలోనన్
ధన్యగాఁ జేయ మ్మ, త్తనయవ్యాజము దాల్చి
వామమునిచందాన న్బలి న్మట్టవే ..
పారి. ౩ ౩౩

౩ అధఃకరించు.
శ. సెల మట్టుసెమ్ముగము సె, స్నైలమట్టు
పడల్చునగవు సెత్తమ్ములకున్, దలకట్టు
లైనయడగులు, దలచుట్టుఁ గనుంగవయు
నితంబిని కొప్పున్. రా వి ౩ ౮౭

౪ బాధించు
చ కనుకనిఁ చలి దానినాసఁ గన్నులఁ
జాచినవాని సేయు నా, మనసిజుఁ
డంచుఁ గోయిలలు మట్టును
కు. సం ౮ ౧౫౩

౫. చుట్టుముట్టు, ఆవరించు
చ త్రిదశవల్లభ సేవిత నాశ్రయింతు నా,
మనమున ఘోరదుర్దశలు మట్టిన సంపద
మిన్నుముట్టినన్ ఉ హరి ౨. ౬౨.

౬ పడవేయు.
ఉ మట్టియ నింద్రనీలతట మాలమహీ ప్రభ
వం౨ లైన కె, న్బట్టలు గ్రుచ్చివైచు
చుబ ధూరుపాపండముఁ జాఁపకట్ట గా,
మట్టచు హరి ౭. ౪౪

౭ ప్రవేశించు.
వ. ఇవ్విధంబున వసుదేవనందనుండును సేమును
.. మచల్లకంబు మట్టి, గ్రిచ్ఛంబు మెట్టి.
ఉ హరి. ౨. ౩౭.

౮ క్రి. ప్రసరించు
ఉ. ఇచ్చకు వచ్చినట్లు చరియించుచు నైన్యము
లేనితిండియున్, నిచ్చలు సాధుసంగమును
నిర్మలశాంతియు శాస్త్రబోధముల్, మచ్చిక
లోనఁ బూని సెలి మట్టనిచిత్తము నాఁగ
నింతయు, న్వచ్చుట యేమ వహాన్నత తపం
బు ఫలంబా యెబుంగ సేర్తమే.
ధర్మ. ౩. ౮౨

వి ౧ ప్రదేశము, చోట.
ఉ .. వెలుగం జనించి యొకచట్టున నిల్వక
యాక్రమించెఁ గాఁ, కంజరితాప మాన
నసఁ గాక మెుగిల్వెరిగొండ లత్తతిన్.
ఆము. ౪ ౧౬౦.

చ. ఒఱపరిఁ గన్నుఁ గూడఁ జను నూరక సన్నలువాఱ నాడు పల్కులుఁ బొరుగింట్ల కేఁగు నొకమట్టున నిల్వదు చంటిపిల్ల ద ముం, జెలుఁ గొడలించు జార ధారుణిన్
భా. ౩. ౭౮

గీ. పిగ్గుకతమున పకితులచేప్ప వాసి, చనును బరికించుఁ దొడవుల యునికిమట్టు, మచ్చు మర లేక యుండ నేమఱక యోము, మిగుల మొగరగరిక నామెఱుఁగుఁబోఁడి.
కళా. ౭. ౧౦౦.

(ఉనికిమట్టు = నివాసస్థానము)

౨. అందము

సీ. .. వాల్గంటి కీల్గంటు వైచి వచ్చిన చెల్వ జడ చల్లకొనునాఁటి సవురు కొఱ, నొయ్యారి ఎఱుఁగుసొమ్ముని వచ్చిన నీటు, మణిభూష ఓడునాఁటిమట్టు దిట్ట.
విజ. ౨. ౩. ౧౩.

౩. విధము.

వ. కొండ్రముచ్చులబాగుగ గాడ్పుచేఁ బోవు చొక్కుకులరేక బట్టివ యీ కడలు పులుఁ గులమట్టున చట్టంబుల సగయు నాకాళ బాణంబులగురుసువ . ప్రబంధ. ౭౮౮.

౪. అమరిక, కుదిరిక.

సీ. మగువ నీ వ్రేలికి మట్టాయెనా యని కడ వ్రేలు పట్టి యుంగరముఁ బెట్టు
దశా ౯. ౨౨౩.

౫. కుదురు, మూలము.

చ. అనిశము గోసహస్రవిధ వందులకొసఁటు లిచ్చు ధేనువుల్, గొని చను భూసురోత్త ముల గోవులపాదహతి న్మహీతలం, బన యము గ్రుంగి మట్టవిసి
కు. సం. ౭. ౯౫౫.

౬. (క. త. మట్టు) మితి, మేర.

ఉ. పట్టఁగరానిమోహమునఁ జైకొని తోఁచిన కెల్లఁ బల్కితే, మట్టునఁ గట్టిపెట్టు మిది మానసమంచు ధరిత్రిలోపలం, బట్టని యట్టి బిడ్డలకుఁ బాగలు గట్టుదురు .
ఆహ. ౩. ౫౫.

క. తనయుం డయ్యును గనుఁగొన, మనమున శంకించి కొంతమట్టుకు ధైర్యం, బును దెచ్చుక, తను విచ్చుక చూచి ప్రేమ కలిగుం డగుచున్.
మల్లుపు. ౨. ౭౮.

క. మట్టొకటి కలదె నీకుం, దొట్టినమదమునఁ దపోధనుఁ బరాశరునిన్, నట్టేటఁ బట్టి ముంపవె, కట్టా కందర్ప కుసుమకాండ ములవడిన్.
కవు. ౩. ౧౧౪.

౭. పరిమాణము, కొలఁది.

క. పట్టపుదేవి స్వామిగిరి, పట్టి న్మాయమ్మఁ జూచి పదరినకతనన్, నెట్టవికానొ నే మందుల, మట్టెఱుఁగనొ కంటికిం బ్రమాదం బొదవెన్ .
కాశీ. ౩. ౧౧౨.

సీ. మట్టెఱుంగక యాకు మడుపు లొంగుట యొద్దఁ బవళింపఁ బక్కకు దివిసుకుంట.
దశా. ౭. ౭౦.

౮. మర్యాద, కట్టుబాటు.

సీ. గుట్టులో సంసారిమట్టునఁ జాట్టాలఁ దని యుంతు వని హాగదత్తుతోడ ..
శుక. ౧. ౩౯.

స్ర. ఆసక్తి యావరాజ్యాభిషిక్తునిగఁ, జేసెద నని తండ్రి చెలఁగి యయోధ్యఁ, బట్టంబు గట్ట భూపతి సమకట్ట, మట్టు మీఱిన యట్టి మంథరయాపుడు.
రం. రా. బాల. ౫. పా. ౨౬. పం.

౯. ఆధారము.

సీ. చరమాంగపీఠికా స్థాపితశేషుండు కితవ కచ్ఛపర జాక్రిందిమట్టు. హర. ౬. ౪౦.

౧౦. పాఁదు.

క. కెల మట్టుసెమ్మెగము వె, స్నెలపట్టు
గడల్చువగవు నెత్తమ్ములకుం దలకట్టు లైన
యడుగులంc, దలచుట్టుc గనుంగవయా నితం
బిని కొప్పున్. రా. వి ౩. ౭౨.

౧౧. త్రొక్కుట.

గీ. బలనికాయము కాలిమట్టుల నడంచుc, గట
కమును నింక వనుచు నుక్కలముహీc,
డనుదినమ్మును వెలుచు. పారి. పీఠ. ౨౩.

సీ. తనకాలిమట్లచే జనులకుc జొరరానికాం
తారములు చాcపకట్టు వడcగ .
రా. వి. ౩. ౪౯

విశే. ౧ వామనము, పొట్టిది, తక్కువది,
అల్పము.

సీ. పొట్టి మెట్టి గిటక . కుసుని మట్టు
మట్టసి మట్టము మట్టసము . . ఠంగణా
యనcగను వామనాఖ్య దనరు
ఆం. భా. ౨. ౧౨౩.

ద్వి. మట్టుపాదంబులు మనలింపుమేను ...
పండితా. దీక్షా. ౪౦. పా.

సీ కళకెంపు మట్టు గాcగల దింక వనిరొ
ముఖాబ్జంబు వెల వెల్లనై రొసంగె
కవిరా. ౨. ౧౭౩.

౨. సుందరము.

కం. మట్టయిcయట్టిదత్తుని, పట్టమున దక్షి
ణంబు పార్శ్వపుగవనిన్. భీమ. ౧. ౧౦౧.

సీ. .. జట్టి విూటినపట్టుc బుట్టము లట్టుగాc
గట్ట కేమి. సీలా. ౨. ౭౭.

౩. స్థిరము.

కం. కట్టుబడి బికధయోనులc, బుట్టుచు, గిట్టు
చును వెతలc బొందితి ఏహహో, పుట్టువు
చావును మాన్పము, ఏట్టుగ రామేశలింగ
మథితావంగా. రామే. ౪. ౧౧౨.

**మట్టుకారకర.** వి. (మట్టు + కారకర) ఒక
దినుసుకారకర, కర్కోటము. ఙ్. (శ. ర.)

**మట్టుకొను.** అ. క్రి. (√మట్టు) కుదురుకొను సెల
కొను.

గీ. చిత్తజాతుండు కనుమాయ చేసివాcడొ.
మనవసంబుల విభ్రాంతి మట్టుకొనెను ...
విక్ర. ౧. ౧౩౯.

వ. ప్రదక్షిణ భ్రమణంబులc బరిభ్రమించి
మగుడ నెట్టకేలకు మట్టుకొను నవియును.
మనుచ. ౪. ౨౭.

**మట్టుకొలువు(ల్పు).** స. క్రి. (√మట్టు కొన)
మట్టుకొనcజేయు.

సీ. సలలితసత్కీర్తిచంద్రికc బగతు మనముల
తాపంబు మట్టుకొల్పి. విక్ర. ౨. ౭౩.

**మట్టుచేయు.** స. క్రి (మట్టు + చేయు) చక్కc
జేయు, సమాప్తముచేయు.

ద్వి. అంచితంబుగ దట్టి యపుడు చేcజిక్క,
మంచిది నీపని మట్టుచేయుంతు, వని కడ
లేనికామాంధకారంమున, మునిcగి, సొమ్ములు
దీసి ముల్లెగాc గట్టి.
ద్వి. శ. సా. ౧. ౭౧౯. పం.

(పని = జీవితము.)

**మట్టుపడు.** అ. క్రి. (√మట్టు శ. మట్టుప్పడు.)
౧. అడcగు, నశించు.

వ. . అమ్మువ్వురును మూcడగ్నుల లెలం
గున మహాతేజంబు కూపి మహాసేను తేజంబు
మట్టుపడం జేర్చినం గోపించి కుమారుండు.
హరి. ఉ. ౯. ౧౫౭.

ఆ. చదువు చట్టుపడియె శాస్త్రంబు మన్నయ్యె,
బుద్ధి ఫురువుమేసెc బుణ్య మడcగె, నీతి
మట్టుపడియె నిర్మలజ్ఞానంబు, మట్టుముడిcగె
బోధ మారిcబోయె. భాగ. ౬. ౧౩౫.

౨. చచ్చు.

గీ. మఱియు దనుజుండు శాంబరీ మంత్ర
మహిమఁ, బర్వతారణ్య జీమూత పటల
భయద, మృగసరీసృపవితతి నిర్మింపన
రఁడు, మట్టుపడఁ జేసె నాయాయి మార్గ
ణములు. జై. భా. ౫. ౧౪౫.

గీ. వాతవిధ్వంస ఖగనాఖ్య వఱలు నొప్ప,
ధంబు నాగేంద్ర మనుమంత్రితంబుఁ జేసి,
వలయు నీపైఁ బ్రయోగింప మలయపవన,
మందు మంత్రంబులను గాని మట్టుపడవు.
కవిరా. ౩. ౧౩౯.

౩. కుదురుపడు, స్థిరపడు
సీ. తల్లి వేదాంతశాస్త్ర సరస్వతీదేవి మనసు
నా కేమిట మట్టుపడక. ప్రబోధ. ౫. ౩౭.

వ. ఘోణారంధ్ర నిశ్శ్వాస గంధవాహ
ప్రవాహంబు వెడలు వాహంబు దగ మట్టు
పడ నిట్టట్టు మట్టించుచు ...
మనుచ. ౪. ౧౧౫.

మట్టుపఱుచు. స. క్రి. (√మట్టుపడు) కుదురు
పఱుచు, బాగుచేయు.

గీ. గుండె నీఱుగ నలిపి కాకుత్స్థనర్యుఁ,
డెట్టకేలకు ధైర్యంబు మట్టుపఱిచి
జై. భా. ౬. ౩౦.

సీ. తమతండ్రి చేసిన తరుతటాకాది ధర్మము
దృఢంబుగఁ జేసి మట్టుపఱిచె ...
జాహ్నవి. ౧. ౧౧౬.

సీ. చిట్టాడుసిగ్గులోఁ జేపట్టఁ బెనఁగుడెందము
మట్టుపఱిచె నాననము వంచి ...
సారంగ. ౩. ౧౪౯.

౨. తగ్గించు; చాలించు, విరమించు.
ద్వి. అవిరళగతి నాకు లల్లాడకుండఁ, బవన
సంచార మేర్పడ మట్టుపఱిచి ..
ద్వి. హరిశ్చ పూ. ౧౬౨౫. పం.

గీ. తెలియఁ గమలోద్భవనినారికేఁడి నీల,
కంఠ సతివేఁడియు ననూనగానలాస్య,
మాధురీవిభ్రమంబులు మట్టుపఱుప, నొనరి
రతిరలితాత్మజాతుర్యచ్ఛ్రియమున.
హ. న. ౨. ౬౨.

(నలపఱుచున.)
క. .. బోరులు వేఁటల్, మట్టుపఱిచి యా
చెంతల, పొట్టేరు లగుపొదలఁ జేరి పొద
లెడు పెద్దన్. చంద్ర ౨. ౪౯.

౩. అలంకరించు, ధరింపఁజేయు.
సీ. ... వణులసొమ్ములు మేన మట్టుపఱిచి.
పానుచ. ౬. ౫.

సీ. అంగుళీయకముల నటఁగొన్ని ఘటియించి
హార్తికహారముల్ మట్టుపఱిచి ..
దశా. ౨. ౧౭౩.

మట్టుపె(వె)ట్టు. స. క్రి. (మట్టు + పెట్టు)
౧. అణఁచు.
చ. . నిన్నువంటికులభామలఁ గానవో శారి
కాత్మనాధులపయి బాళి చేవో తమి
దొట్టినపట్టున మట్టుపెట్టరో.
కుశల. ౩. ౪౩.

ఉ. గట్టుల మట్టుపెట్టుగలుకైదువుఁ బట్టిన
యట్టిదిట్టఁడున్, దిట్టతనంబు వాని పొల
దిండికి లోఁబడి గాని చెందఁగా, నెట్టు
సహింపవచ్చు ... ఉ. రా. ౫. ౧౧.

౨ చంపు, వధించు.
వ. ...మాతండ్రివలనిపూర్వవైరంబుఁ దలంచి,
మట్టుపెట్టున్ గాని వ చ్చెల పట్టంబు
గట్టను ... భా. రా. కిష్కిం. ౬౭౪.

వ. ... తోఁబుట్టువుల మమ్ము మొదట మట్టు
పెట్టి మఱి మీఁదట మాతృశిరంబు గొట్టి.
దశా ౬. ౭౫.

సీ. ప్రళయాబ్ధి పోఁకాలిఁ బెటిగాఁ జరియించు
మధుకైటభులఁ బట్టి మట్టువెట్టి ...
ఉ. రా. ౨. ౧౩.

౩. తెగఁగొట్టు.

క. ... వడంకువెట్టకడఁ దోఁక పెట్టుకొని గట్టుచట్టుపల మట్టుపెట్టుదిట్టదను పొంగంబు గాఁ జాఁగి ... చం. రా. ౩. ౨౫.

౪. సమాధానపఱచు.

గీ. జగతి నాలిప్రజరుఁ డయాచకుఁడు గాన, నింటిలోపల ధాన్యంబు లెపుడులేవు, కోమ లికిఁ బూటపూఁటకుఁ గుడువఁ గూటి, బిడ్డలను నేగతిని మట్టుపెట్టవచ్చు కుచేల. ౧. ౩౫.

౫. కుదురుపఱచు.

ఆ. ఇదియు పర మటంచు నితరచింతలు వీడి, మనసుఁ జెదరనీక మట్టుబెట్టి, కొదువ లేక నిలువఁ గోర్కెలు ఫలియించు, మనసులోన నుండుమహిమ వేమ. వేమ. ౩. ౨౪౯.

**మట్టుబచ్చెలి.** వి. (√మట్టు) దుంపబచ్చలి, ఉపోదక కీ. (శ. ర.)

**మట్టుబీఱ.** వి. (√మట్టు) ఒకదినుసుబీఱ కీ. (శ. ర.)

**మట్టుమిగులు.** అ. క్రి. (మట్టు + మిగులు) అతిక్రమించు. (శ. ర.)

**మట్టుమీఱు.** అ. క్రి. (మట్టు + మీఱు) మితి మీఱు, అతిశయించు.

సీ. చెలువంబు సెగడఁ దీర్చినక్రొత్తకస్తూరి పట్టెలకోల్తావి మట్టుమీఱ .. చంద్రి. ౧. ౧౦౪.

గీ. మారుతమ్ములవాఁడికి మలయకూట, మారు తమ్ములకేఁడికి మట్టుమీఱు, చంద్రకిరణ మ్ములకు శుకశారికాళి, చంద్రకిరణమ్ము లకుఁ జాల జలదరించు. విజ. వి. ౩. ౮.

క. గొట్టన నాగట్టుదొరపట్టి యొట్టకేలకు మట్టు మీఱి గుట్టునం బట్టరానితమకంబునం దట్టు వడి ... వసు. ౨. ౧౪౦.

**మట్టె**[1] = **మట్టియ**[1]. వి. స్త్రీలు కాలి రెండవ వ్రేలికి ధరించు ఆభరణవిశేషము.

శా. మట్టె లొత్తిలియఁగ గబ్బిచన్నుగవ కంపం బంద . మనుచ. ౪. ౭౮.

సీ. మట్టెలు పిల్లాండ్లు మట్టె వీరమద్దియ చెల మిని దొడిగెఁ దొయ్యలి యొకర్తు ... యయా. ౪. ౮౯. ఆం. భా. ౨. ౧౫౧.

**మట్టె**[2] = **మట్టియ**[2]. వి. (సం. మృత్తికా. ప్రా. మట్టి. ఆ.) మట్టి. చూ. (మట్టెవన్నె.)

జ మట్టెవన్నె.

ఉ. .. ఆసెగకంటివేల్పురా, పట్టపుదేవి తద ధరణిపాలకు ముంగలఁ గోప వేడుక ల్మట్టె గయ న్మహీశ్వరులు మంచతలంబుల నిల్చి భక్తిఁ జే, పట్టి లలాటవీధిఁ గరపంకరు హాంజలు లుంచి రందఱున్.

చంద్రి. ౫. ౩౩.

మట్టుదొరంగు = అతిశయించు.

ఉ. చిట్టుము లంకురించె జిగిచెక్కులఁ దెల్పు నటించెఁ గోరికల్, మట్టుదొరంగ నెన్న డల మాంద్యవిధంబు చెలంగ .. ఇందు. ౨. ౧౩౫.

జ. మట్టాడు, మట్టించు, మట్టిక, మట్టిమల్లాడు, మట్టుకొఁకర, మట్టుకొను, మట్టుకొలుపు, మట్టుచేయు, మట్టుపడు, మట్టుపఱచు, మట్టుపెట్టు, మట్టుబచ్చలి, మట్టుబీర, మట్టు మిగులు, మట్టుమీఱు.

**మట్టెవన్నె.** వి. (√మట్టె) మట్టిరంగు.

చ. తెలుపకు వల్లభుండు పరదేశము వోయిన వన్నె మాని తో, వటిలికి నల్లబూసలును నచ్చతబొట్టును మట్టెవన్నె గాఁ, గుఱుమఁబుఁ గైవఋట్టమును .. పి. శకుం. ౪. ౮౧.

**మఠము.** సం. వి. అ. పుం. న. ౧. ఎడ్లబండి.

౨. విద్యార్థులు మొ. వారి నివాసము.

**మరరము.** సం. వి. అ. పుం. ౧. కార్కశ్యము, కఠినత్వము. (శ. ని.) ౨. ద్రవీభూతదధి. ౩. ఒకానొక పురుగుజాతి. (శ. ని.)

**మరరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మత్తుఁడు, మత్తెక్కినవాఁడు. ౨. కర్కశుఁడు. (శ. ని.) ౩. కంగత్‌ప్రాణుఁడు. (శ. ని.)

**మర్యము.** సం. వి. అ. పుం. తాళభేదము, పదియత్తురములకాలము (శ. ర.)

**మడ.** వి. (క. త. మడ.) ప్రవాహమార్గము.

ద్వి. మునుమునా మేపుచు ముందట మెకము, చనినజా డెఱిఁగి క్రచ్చర నడ్డపెట్టి, మరలఁ గొల్చుచు వాఁగుమడలఁ బల్లములఁ.

నవ. ౧. ౯. పా. ౧౪. పం.

ద్వి. కొలఁకులకొలఁకులఁ గొమరార నాను, తలముల (చలముల) చలువలఁ దలకొల్పు మడల, యొడలను మెఱుగారు నిండు కొంతంపు, టరుఁగులచెఱుఁగుల నలరారు గునాల, తెరువుల నొఱపుగాఁ దిరిగి క్రీడించి. నవ. ౧. ౧౨. పా. ౪. పం.

క. నడకట్ట లిసుకతిప్పలు, మడలు దరులు వాఁకలును గ్రమంబున నొకఁడుస్, గడవఁ బడకుండఁ గృష్ణుఁడు, పడతులకును యమున యాటపట్టుగఁ జేసెన్.

హరి పూ. ౭. ౩౭.

జ. మడవ, మడవచేప.

**మడ[2].** వి. ఒకజాతిచెట్టు.

(వ్యవ.) మడకఱ్ఱలు వంటచెఱకుగా నుపయోగింతురు.

**మడఁక[1].** వి. (√మడఁగు. క. మడక.) మడుపు. చలువబట్ట.

గీ. కుబ్జకంకలు దీరిచి కోర్కె లొసఁగి, యబ్జనాభుండు కంకునియంబరములు, మడఁకలుగఁ జేసి కానిచ్చు చెడుగురజకు, నడిగి మా కిమ్ము చేలంబు లనుచుఁ బ్రీతి ..

ధర్మ. ఉ. ౧౫౦.

ద్వి. రమణకట్నంబు గిట్నము మాడ మడఁక, గమియంగ నిచ్చితో కళవాళించెదవు ...

పండితా. పురా. ౧౧౪. పా.

**మడఁక[2].** వి. (క. మడక.) దున్నుటకై యొడ్లను గట్టి సిద్ధము చేసిననాగలి, అరక. (శ. ర.)

**మడఁగు = మణఁగు.** అ. క్రి. (క. త. మడంగు.)

౧. క్షీణించు, తగ్గు.

వ. .. కండలు వ్రాలియు గుండెలు గూలియు, రూపు లడంగియు నేపులు మడంగియు ..

మార్క. ఉ. ౨౦౭.

౨. అడఁగు, లొంగు. (మరలు అని. శ. ర.)

సీ. మ్రాను పేరటిచే మడఁగునో మడఁగదో మడఁగు పేరటి నీమ్రాను మడఁచె ...

ఉ. హరి. ౨. ౧౩౭.

౩. చెడు, నశించు.

గీ. చూడు మటు నరవరజయమ్ఫూర్తి నార్చె, వైరిసేన భూరిశ్రవోదారుణరణ, మహిమ దనుజబలశ్రీలు మడఁగ నింత, టను రిపుఁగ రంబు దగ్రజేయకునికి గీడు.

రాఘవ. ౪. ౧౭౨.

సీ. భూరిదోషాగమస్ఫూర్తి వాటిల్లంగ సుదిత ధర్మక్రియ లుడిగి మడఁగ. భాగ. ౩. ౭౩.

౪. వంగు.

(వ్యవ.) కంచరి ఇనుపరేకు మడఁగఁగొట్టెను.

జ. మడఁచు, మడఁత, మడఁపు, మడఁపెట్టు, మడత్రొక్కు.

**మడఁచు = మడఁపు.** స. క్రి. (√మడఁగు క. మడుగు.) ౧. మడఁగఁజేయు, మడఁతపెట్టు.

సీ. ... మడఁచి ... ...

... ౨. ౯౩.

చ. పొలుపుగ నీరుకొలిపటముం గటిఁ బింజె మడంచికట్టి . విప్ర. ౨. ౨౭.

సీ. ఆడపంబు తొయ్యలి మడఁచి యిచ్చిన తెలనాకుఁ జిలిక చేతియంద యుండ . కళా. ౧. ౧౮.

౨. అడఁచు, నశింపఁజేయు.

సీ. అజవంజవమున కనుచారి నై పర్వనంతః కరణతతి జులపు మడఁచి కు. సం. ౧౨. ౯౯౯.

౩. మడఁగునట్లుచేయు, వంచు.

గీ. ... వేలు, మడఁచి యొతిఁగింపుఁ డకొఁగిన మానివర్య. దశా. ౧. ౨౫౩.

౪. అణఁచు, ఇముడ్చుకొను.

ఆ మనసు మనసునంచె మడఁచి యాత్మని నాత్మ, యంద కొంచునట్టి యతఁడు సర్వ విదుఁడు ... భార. అశ్వ. ౨. ౧౫౩.

సీ. మ్రాను పేరేటిచే మడఁగునో మడఁగదో మడగు పేరేటిచే మ్రాను మడఁచె ... ఉ. హరి. ౨. ౧౮౬.

మడఁతి = మడఁది. వి (క. మడది. త. మడంన్తై. మ. మడంద.) ౧. స్త్రీ, ఆఁడుది.

ద్వి. మడఁతి యీతండె నమ్మనుజేశుచేత, గడచన్నమన్ననఁ బడసిన యతఁడు బసవు. ౨. ౯౧. పం. ఆం భా. ౨. ౧౦౪.

రగడ. పడఁతి వెనుకకొవ్వ చింగొఁగట్టి పట్టి నన్నచేల, మడఁతి పొగడ పొన్నతో సమా నమా నగంగ నేల వరాహ. ౩. ౯౨.

క. శాలా కేలాగుల ఒతి, మాలిన విన కిగ్గ యాళి మడఁతుల వెంటన్, ఁేల వయి చనెదు .. రసిక. ౩. ౯౧.

జ. మడఁతితనము, మడఁతుక.

మడఁతితనము. వి. (మడఁతి + తనము) స్త్రీత్వము, ఆఁడుఁదనము.

క. కడు నరుదుగ నీరొండ నీ, యడుగుంగొన యంత సోఁకినంతనె చెడుగుం, గొడిమెలు విడి చని క్రమ్మఱ, మడఁతితనం బొదలె నాకు మానిసిమిన్నా. అచ్చ. రా. బాల. ౧౪౯.

మడఁతుక. వి. (మడఁతి + ఉక. స్వార్థమున) స్త్రీ, ఆఁడుది.

క. మానుగ జగములయావడి, మానుపఁగాఁగోరి పుడమి మడఁతుకకై వి, న్నానికపు వంగడంబున, రానెల నై పొడమి నట్టి రాముని బంటన్. అచ్చ. రా. సుం. ౧౩౭.

ద్వి. ఆడలి యా రత్నాంగి హాపుత్ర యనుచు, మడఁతుక మూర్ఛిల్లి మహిమీఁద వ్రాలె. ద్వి. శ. పా. ౨. ౨౪౬. పం.

మడఁది = మడఁతి. వి. ౧. స్త్రీ. ఆఁడుది. (ఈ రూపము శైవవాఙ్మయమునందే అనిర్ధారక స్థలమందే గన్పట్టుచున్నది.)

క. కొడు కని చేకొని నిన్నున్, మడఁది యతిప్రీతి బెజ్జమహాదేవి మహిన్, గడుఁగొనియాడిన భక్తికి, నొడఁబడి యాయ వశమున్న యొగఁగవె రుద్రా. శివ. పా. ౪౩౬.

తరువోజ. కడుఁ దోర మై ... వేగ, నడపంగ నేరక నయమున నంచనడలకు నంద మై నడ తెంచుచున్న, మడఁదిఁ జూచిన విటమండలి కు. సం. ౭. ౬౮.

ద్వి. మడఁదియు దాను సమ్మదలీల నుండ ... బస. పు. ౬. ౧౪౦. పం.

౨. భార్య.

క. మడఁది గొడు కర్థ మిది యని, యొడసి యరు భక్తి నిత్తు కేలిన పతికిన్, బడయు దురు మగడ వానిన, మృడుభక్తులు వలచి రేని వచ్చించి శివున్. శివ. పా. ౧౭౫.

**మడకము.** సం. వి. అ. పుం. సస్యవిశేషము. (కల్ప.)

**మడత.** వి. (√మడఁగు. క. మడతె.) ౧ (వస్త్రము మొ.) మడుపు.

గీ. మడత పసిమిడిగింటెముల్ మంజిడిజిగి, దోమతెరమంచములు హాసంతులు జవాది, యగలుసిరులు చిన్నెలు గాఁగ నతఁడు గడపెఁ, జలికాలము తద్వధూకుచశరణుఁ డగుచు. కళా. ౨. ౧౮౮.

ద్వి. మడత విప్పక నడుమను గట్టుచూఁ, జడి సినపోఁపు పచ్చడ మింతజాఱ ద్వి. పరమ. ౩ ౭౫.

౨. కడుపుగాది పడుపు. (శ. ర)

వ్యవ. వానికి కడుపు మడతలు పడినది

౩. ధౌతవస్త్రము.

గీ. .. ధౌతవస్త్రంబు బరగు మడుఁగు, మడత మడి చలువ ఆం. భా. ౨ ౧౫౩

౪. భక్ష్యవిశేషము.

వ. .. నీరువత్తిగెలు మడతలు పప్పుబూరెలు పూరీలు గూళ్ళుసిడ లాదిగాఁ గలభక్ష్యంబులు గూడల నించి జాతిసాతానులు గావళ్లం బూని వెంట నంటిరా నప్పుడు. హంస. ౧ ౧౦౫

**మడత్రోక్కు.** స. క్రి. (మడఁగన్ + త్రొక్కు. వృత్తిని వర్ణలోపము) తాటాకులు మొ. విడదీసి దొంతిగా అణఁగఁద్రొక్కు. (శ ర) (వ్యవ.) ఇల్లు నేయించుటకై తాటాకులు కొట్టించి మడత్రొక్కుతిని.

**మడపు = మడఁచు.** స. క్రి (√మడఁగు) పోఁగొట్టు

సీ. ?లింధకాశి సంధ్యలునసంతో చంద్రకమణ భూరిశాంతి మడపుకరణి చంద్ర. ౧. ౨.

(రెట్టించు, ద్విగుణీకరించు.)

గీ. ఛందమున నొక్కటను వృత్తసంఖ్య మడపి, రెండు దివియ నుక్తాది జవృత్త సంఖ్య, యటుల నుత్కృతి వృత్తసంఖ్య యును జేయ, సర్వసమ వృత్తసంఖ్య భుజంగశయన. అప్ప. ౪. ౧౩౯.

విశ. మడతపెట్టఁబడినది.

ద్వి. ఘనుఁడు సోమేశుఁ డాదినము తొల్నాడు, మడపులేఖయు వందిపడగయుఁ గొనుచు. ౨స. పు. ౬. ౬౪౬. పం.

**మడపెట్టు.** స. క్రి. (మడత + పెట్టు వృత్తిని వర్ణలోపము) మడతపెట్టు, చుట్టపెట్టు.

ద్వి ..డ గూట లన్నియుఁ జెదపోవు గాఁగ, మడపెట్టి యాచంద్రమతి నెత్తికొత్తి ద్వి. హరిశ్చ. ఉ. ౯౦౩. పం.

**మడమ(డ్మ).** వి. (క. మడ. మ. మడంబు.) ౧. పార్ష్ణి, చీలమండ క్రిందిభాగము.

గీ. మడమ లంటఁగ నిడుపాటి జడలు గట్టె. హర ౪. ౧౦.

క. సిందూరపిండములో నరు, కందుకములో నత్ప్రివాళకఫలంబులో నా, నందము లై రాగలతా, కందము లన మడమ లచల కన్యక కొప్పెన్. కు. సం. ౩. ౭౯.

సీ. మడమ యెం చనఁగను మనుఁ బార్ష్ణి ... ఆం. భా. ౨. ౧౩౬.

సీ. కదలిరి కొందఱు ఘనతరస్కంధ భార మూల .

గీ. చల్లంబులు నొడదోస్లఁ జలిదికొళ్ళ, చిక్కములు మడ్డఁగిళ్లిల చెప్పుబోళ్లు, కల సువిండ్లను మొదలుగాఁ గలవి దాల్చి, నల్లచాటల మేనలక్కీల్లకరులు. వరాహ. ౪. ౭౨.

౨. వెదురుసోల మొ. వాని యడుగుభాగము.

(వ్యవ.) ౧. సోలమడమతో వారు కూలిని పంచుకొనుచున్నారు. ౨. వాఁడు గున పమునడమతో పాము నెత్తిపైని కొట్టినాఁడు.

జ. మడమలుద్రొక్కు.

**మడమలుద్రొక్కు.** స. క్రి. (మడములు + త్రొక్కు) అడుగులో నడుగు పెట్టి తలుము.

చ. ... వడిఁ దనరారె నంగజననాథుగుణ శ్రవణనంబు దానిఁ దా, మడమలు ద్రొక్కుచు న్వికిఖమండలి నెన్కొనిరొయన్.
కళా. ౮. ౧౧౯.

**మడవ.** వి. (మడ1 + వా) మళ్లకు పాదులకు నీళ్లు పాఱెడు కాలువముఖము.

సీ. బడలినవార లిందమునఁ బాదులు ద్రవ్వియుఁ గారె మెత్తియున్, మడవలు దీర్చియున్ బిదప మార్చియుఁ గాలువ లేర్పఱిం చియున్ .. విప్ర. ౩. ౭౪.

ద్వి. తడయక వచ్చి గుద్దలిఁ గొని తొంటి, మడవ మార్చుచు మాఱుమడవఁ దీర్చుచును.
ద్వి. పరమ. ౪. ౨౭౧. కళా. ౪. ౯౬.

**మడవచేఁప.** వి. (√మడవ?) మత్స్యవిశేషము. (శ. ర, బ్రౌ.)

**మడవు = మడఁగు.** అ. క్రి. ౧. నిష్ఫలమగు.

క. చెడఁగఱపువార చెలులుం, గడుకొని నీయట్టివారికర్ణంబులు సె, ప్పెడువారుఁ గాక నీకున్, మడవక మాయట్టివారి మాటలు కొఱయే.
భార. సభా. ౨. ౧౯౦.

౨. విముఖమగు.

క. కడవకసమలఁ గోలలఁ గ, ప్పడములు వీరలధనంబు పరికింపఁగ నె, క్కుడిదేశకు

అని వగవక, మడవక తనుమధ్య నిందు మనమున నుండెన్.
భార. ఆది. ౭. ౨౨౫.

౩. మరలు; వెనుదీయు, జంకు, కొంకు.

చ. మడవక భీమసేనుఁడును మాగధముఖ్యుఁ గడంగి బెబ్బులుల్, విడివడులీల .
భాగ. ౧౦. ఉ. ౭౩౬.

క. కడగాలు వట్టి వానిని, మడవక పవనజుఁడు నూఱుమాఱులు వీచెన్ ...
భార. ఆది. ౬. ౨౪.

చ. ... ఏమి పంచినన్, మడవక చేయు మీ వనిసమర్పణసేసెఁ బ్రభుత్వ మేర్పడన్.
భార. ఆది. ౨. ౪౨.

**మడి1.** వి. (క. మడి.) వరి మొ. సస్యములకు నీరు నిలచుటకు నలుదిక్కుల గట్లు వేసి ఏర్పఱచిన పొలము, కేదారము, నదీప్రాన్తము. (బ. మడులు, మళ్లు.)

సీ. మడి యనఁ గయ్య నా వడరుఁ గేదారంబు ఆం. భా. ౨. ౨౩౦.

గీ. అడఁగుదుక్కికై యామడి కరుగుదెంచె, హాలికుఁ డొకండు దన్నగరాశ్రయుండు, చేత నుగ్గంపుఁగుండతోఁ జేగ్లకోల, తోడ నాగంటికోలెరు దోలుకొనుచు.
పరమ. ౫. ౨౭.

ఉ. ఝుమ్మన ద్రిమ్మరుతుమ్మెదల జొంపము మళ్లకు నీళ్లుగట్టుచోఁ, బమ్మిన వేడ్కఁ బాడువనపాలక బాలకదంబకంబు చం, దమ్మున నొప్పు నప్పురము నాలుగువంకలఁ బుష్పతోఁటలన్. వరాహ. ౯. ౧౪౭.

గీ. ... మడి యనఁగా నదీప్రాంత మభిధ ...
ఆం. భా. ౨. ౬.

జ. మడికట్టు, మడిపెసలు.

**మడి².** వి. (క. మడి.) మడుఁగు, ధౌతవస్త్రము, పవిత్రవస్త్రము.

గీ. ... ధౌతవస్త్రంబు బరగు మడుఁగు, మడత మడి చలువ యనఁగ ...

ఆం. భా. ౨. ౧౫౩.

(వ్యవ.) నేను మడి గట్టుకొంటిని. నన్ను ముట్టకుము.

విశ. పరిశుద్ధము.

క. పాచ్చెంబు లేని కులమున, వచ్చుపుమడిసీర మైలయంటినరీతిన్, జొచ్చె వపకీర్తి ..

ఉ. హరిశ్చ. ౨. ౯౭.

సీ. మద్యపానము చేయ మడివస్త్రి మేఁటికి మొదలుఁ బోవఁగ వడ్డి ముట్టు పెట్టు ...

రామలిం. ౭౦.

మడికూడు = ప్రసాదము, భగవన్నివేదితాన్నము.

ద్వి. .. మాప్రాణంబు లైన, విడుకుముగాక మామడిగూటివృత్తి, విడుకుమే యిది యేమి విపరీతవృత్తి. బస. పు. ౩. ౫౯౭.

పెద్దమడి = దిగంబరత్వము.

(వ్యవ.) నీవు పెద్దమడి గట్టకుము.

జ మడివాలు, మడిగంచి, మడిగంది.

మడి౩. వి. (తె. త. మడి. వృత్తియం దుత్తరపదమైనమడుఁగు శబ్దమున కాదేశముగా వచ్చిన రూపము.) గుణము, రెట్టి.

ఉదా. ఇనుమడి, ముమ్మడి, నలుమడి మొ.

మడికట్టు. వి. (√మడి1 ?) మాగిలిపొలము ? పల్లపుచేను (చి. వి.)

మడికాసు. వి. (√మడి౩ ?) వెండి, రజతము.

(ఈశ్వరుఁడు.) సీ. ఓంటిగా మడికాసు గుంటిపైఁ గూర్చుండి సంజకెంజాయపెన్ జడలు దాల్చి. నరస. ౨. ౧౭౭.

ఉ. దట్టపువన్నెగుడ్డ కటిదటిపొరన్ సవరించి పట్టెపైఁ గట్టి కటారిజల్లి మడికాసుల కట్టుల రొక్కవిండ్లు పె, క్కెట్టెపుఁగట్టె పెట్టుకొను నిద్దపుఁబుఁబుదొనల్ నటింప మైపుట్టున వల్లెబెబ్బులుల లె పో యనఁ బోయిరి బోయబల్లిదుల్.

రా. వి. ౨. ౫౫.

సీ. ... రజతాఖ్య రుప్య వెండి, మడికాసనంగను ... ఆం. భా. ౨. ౨౪౯.

జ: మడికాసుగట్టు, మడికాసుమల.

మడికాసుగట్టు = మడికాసుమల. వి. (√మడికాసు.) వెండికొండ.

గీ. కనరు మడికాసుగట్టనంగను శివాద్రి ...

ఆం. భా. ౨. ౨౭.

మడికాసుమల = మడికాసుగట్టు. వి. (మడికాసు + మల.) వెండికొండ, కైలాసము.

సీ. మడికామల నొంటియడుగునిక్కిన నిల్చి బెడిద పూకెంజాయజడలు దాల్చి ...

ప్రబంధ. ౩౭౭.

మడికాసులతేఁడు = కైలాసాధీశుఁడు, శివుఁడు.

గీ. . మడికాసులతేనిపాలె మిదిగో, మన చతికి వచ్చి దిగ నని ముందలింప . .

పార్వ. ౨. ౪౦.

సీ. సాంధ్యన ర్తనకేళి సవరించు మడికాసు మలతేని కుత్తుకకలుకు లనఁగ ...

వి. వం. ౨. ౧౧౧.

మడిచేరు(లు). వి. (త. మడిచాలు. మడిచిన + చేరు. శ. ర.) మడికచ్చ, ముందునుండి వెనుకకు దోఁపుకొనుకొంగు.

క. కాడు మెత్తుకొలుకు గుడికిన్, నడుమున వెలపడుచు నాభిసామమునుం గ్రొ, మ్ముడి కొరున్ మడిచేలున్, వడి జాలున్ రైఁట వింతవగ గనుపింపన్. శుక. ౩. ౧౪,

సీ. కామంబు బంధించుగతిఁ దోఁప వడిచే
రతో శిక్షచేలంబు సేన మెఱయ.
భాగవ. ప్ర. ౫. ౫౫

ద్వి. మడిచేసి చెరివి దాఁపై శేష్వతోడ,
బిగిచన్నఁగవమీఁదఁ బెరయఁ బయ్య
దయు, దిగిచి సెన్నడుమున దిండుగాఁ
జుట్టి. ద్వి. పరవ. ౪. ౨౭౪.

**మడిపెసలు.** వి. బ. (√మడి1) వడియందు
పెరుఁగు నల్లపెసలు. (శ. ర.)

**మడిప్రాలు.** వి. బ. ధాన్యవిశేషము.

సీ. మణిసరల్ మసరలు మంకెనల్ పగడంపు
తీఁగెలు మడిప్రాలు దేవసరులు
హంస. ౪. ౧౨౯.

**మడిమంచే(ము).** విశే. బలహీనుఁడు, పార
హీనుఁడు.

చ. ... చెల్లపట్టి మనుప్రాంతదళమ్ములతోడఁ
దోఁగా నా, మనిదార మంచురాజా మడి
మంచగఁ గోయిలగంట ప్రోయఁగన్.
మనుచ. ౬. ౨౬.

ద్వి. బలదేవుఁ డుద్ధతిఁ బరిఘంబుఁ బూని,
మలయురుక్మిని మడిమంచంబుఁ జేసి.
ద్వి. భాగ. ౧౦. (శ. ర.)

**మడియ(ఁడు).** విశే. ౧. మోటువాఁడు,
మోటుది.

ఉ. .. రెడ్డిమడియల్ ములుగోలలఁ బూని
యెడ్లకో, పేటలు వైచి దున్నుటకు
నేఁగి కొండ్రకుఁ జాలు వచ్చినన్.
వేం. పంచ. ౧. ౬౭౪.

క. కడియం బీనో పుత్తడి, కడియం బడిగి
నను దేనో కంటెయుఁ గొవనో, మడియువ
గతొత్తు వాకిట, గడియ బిగించెన్
ఫలించెఁ గదయనువేళన్.
బహు. ౫. ౨౧౩.

౨. మూఢుఁడు; జడుఁడు.

గీ. బడియ దుర్బీజమును భ్రష్టు మడియ చేట,
పెయ్య కల్మచ్చు చెడుగు పాపెనలమారి.
హంస. ౫. ౧౧౩.

సీ. పుక్కిటివిడె మీయఁ బోయి తిలోత్తమా
ననజలోచన ముచ్చె వాట్లు పడియెఁ,
బాలయల్కఁ జూచుకఁ జూపులఁ జూచి
యూర్వశీనిబ్బోకవతి సాకుపెట్లు పడియెఁ.

గీ. నిమ్మవరపాలుచికిలివోదుమ్మిదారి, గలిమిఁ
గెగటారి సురపురప్రాంగణమున, వరలెదు
కటారిరాహుత్తవరులచేతఁ, గీడు సేయదె
మడియలతోడి చెలిమి. కువల. ౧. ౩౯.

గీ. త్రిమ్మరి గదా సదాగతి తెలిసిచూడ,
మెఱుఁగుఁడు గదా యనంగుఁ డెలిమత్త
వడి, యుఁడు గదా యిల్లరివాత్రుకుఁడు
దలంప, నిట్టిచెడుగులచే బాధ కట్ట లోర్తు.
సారంగ. ౨. ౧౨౪.

**మడియఁబెట్టు.** స. క్రి. (మడియన్ + పెట్టు)
బాధించు.

ఉ. ... కిచిపి తన్నుచు వెన్ను చట్టులు
మంచు గీ, పెట్టఁగ ద్రచ్చుచున్ మడియఁ
బెట్టుచు సెట్టుచు మాటకిట్టుగాఁ, గట్టుచుఁ
జేము లెత్తుకొని గట్టిగ మోదుదు రొక్క
తట్టువన్. పానం౩. ౨. ౧౬.

**మడియించు.** స. క్రి. (√మడియు) చంపు,
కడతేర్చు; తునుఁగఁజేయు.

క. పామజము వడిన నశ్వ, త్థామ వడియె
ననఁడె ధర్మతనయుఁడు గురునిం, దా మడి
యించుటకై. భార. కర్ణ. ౧. ౪౦.

సీ. మడియించె వక్రాఖ్యు మాహిష్మతీనాథు
నరకాసురుని జంపె. ఉ. హరి. ౨. ౬౪.

ఆ. తోడరి పీని నిపుడు తునుముదునో కాక,
మన్ను కొన్నఁ జూచి మాటలాడి, మరలి

పోవునపుడు మడియింతునో యంచుఁ,
దత్తరమున మదిని దలఁచుచుండె.
అచ్చ. రా. సుం. ౬౪.

క. ... తోమరము శక్తియు బె, ట్టిదముగ
నతఁ డదరించిన, మదమున నయ్యోధ
వరుఁడు మడియించె నెడన్.
భార. ద్రో. ౪. ౧౧౫.

**మడియిల్లు.** అ. క్రి. (మడియు) మడియు, నశించు.

క. మడియిల్లుతత్త్వములవెను, బడక నిజాజ్ఞా
ప్రశస్తి భావింపఁగఁ జొప్పడుసాత్త్విక
గుణసంగతి, మృత్యుఁ డను నామంబు నీకు
మేలిల్లు శివా శివ. పా. ౫౨.

**మడియు.** అ. క్రి. (క. త. మడి) చచ్చు; నశించు, చెడు.

వ. ఇట్లభిమన్యుండు మడిసినఁ గాఁ దలంచి
దుర్యోధనుండు సంతోషింప ..
భార. ద్రో. ౨. ౫౪.

వ. .. కోలాహలమయంబు లగుచోట్లును జెడి
తూలి యడఁగి మడఁగి ద్రగ్గి మడిసి
యులివు లడఁగి పొడువాఱుప్రదేశంబు
లును .. హరి. ఉ. ౧౦. ౯౦.

చ. తడయక కుంభకర్ణుఁడు మొదల్గల నాదెవు
జోదు లందఱున్, మడియుటఁ జేసి రావ
ణుఁడు మార్కొని యింక దురం బొన
ర్పఁగా వెడలఁడు .
అచ్చ. రా. యు. ౨౩౪.

గీ. విషముచేతన విషమును విఱిగినట్లు, శత్రు
చేతన శత్రుండు సమయుపోల్కి, మనసు
చేతన మనసను మడియుచుండు
వా. రా. ౩. ౬౧.

క. సహజఖలుం డుదయింపుచు, మహిఁ గుల
మును జెఱిచి తాను మడియుఁ జామీ ...
ప్రబోధ. ౧. ౬౨.

౨. కునుఁగు, ఖండితమగు.

చ. వర్మబంధముల్, మురియఁగఁ జాప
ముల్ దునియ ముద్గర తోమరశక్తు లాదిగా,
వరుస ననేకముల్ మడియ వాజిరిఁ బోరి
చలంబు సెంపునన్.
హరి. ఉ. ౨. ౫౪.

క. మడియుతల లొంటిగుతనువులు, పొడి యగు
వొడవులును వధూరిఖునిదాఁ గలిగన్ ...
భాగ. ౧౦. పూ. ౧౫౫౬.

సీ. కలిగొట్టు చిన్నరెమ్మలఁ . బెట్టి
మడిసి యేకొమ్మలు - డలుచదెనో ...
విప్ర. ౩. ౬౪.

జ. మడియఁబెట్టు, మడియించు, మడియిల్లు.

**మడివాలు.** వి. (√మడి2) క. మడివాళ, త. మణ్ణాన్. చాకలి.

ద్వి. మడివాలు మడివాలు మాచిదేవయ్య, కడ
మలనంబి చొప్పడ దివ్వటీఁడు ...
బస. పు. ౨. ౪౯౬. పం.

క. మడివా లొడయనివస్త్రము, తడఁబడించిన
నమ్మికొనినఁ దా రోయిడివన్, బడిదియ
వెట్టివఁ గట్టిన, నదరఁ బాత్రయము
దండు వరుసఁగ నలయున్.
విజ్ఞా. ౨. ౬౧.

ద్వి. వరజంగమము మడివాలుమాచయ్య, నార
గణంబుల కెల్ల నడిచుఁడె నన్ను ...
ప్రభులిం. ౧౧౫. పొ.

క. ఏమి మడివాల రే మీ, భూమీశ్వరు
నర్థిఁ గానఁబోయెదము సఖా, భూవిశఁ
జనిరెయుదువారికి, శ్రీ మేటిల్లంగ నంచి
చీరలు వలయున్. హరి. పూ. ౯. ౧౩.

(మెడవాలు అపముద్రి.)

**మడిస.** వి. మత్స్యవిశేషము.

సీ. కాలువ ముకుదొమ్మ వల్లె గండెయు వల్లె
గుజ్జు చేడిస కాతికొంటు మడిస ..
వేం. పంచ. ౧. ౯౪.

**మడిసంచి.** వి. (√మడిశి) మడుఁగువస్త్రము
నుంచుకొను సంచి.

సీ. మడిసంచి దోవతి మడతబ్రేల్ఛండెంబు
ధమని కుండంబు బృందావనంబు.

గీ. కుశసమిత్పత్రిములు పెట్టుకొప్పయ
టుక, యమరఁ గాఁపుర ముండు నయ్యు
గ్రజాండు హంస. ౨. ౧౩౭.

**మడిసంది.** వి. (√మడిశి?) చంక, కక్షము.

సీ. ... మడిసంది నునిచినతలుగులఁ బ్రాఢ్లను
దొలఁగ వైచి .. హరి. పూ. ౬. ౧౩.

వ. . ఆపురాణదంపతులకుఁ బ్రణామంబు
లాచరించి మడిసందులం జేతులిడి
భీమ. ౨. ౧౫౧.

ఉ. రావణ యిప్పుడైన రఘురామునిముందఱ
నన్నుఁ బెట్టి వా, చావినయంబె చాలు
మడిసందులఁ గేలిడి నిల్వఁ గాచు ని,
న్నావసుధేశమౌళికి దయారస శీతలముల్
కటాక్షముల్. రామా. ౬. ౧౬౪.

(చి. ని. శ. ర. పా. మణిసంధులు. ముద్రి. పా.)

**మడుఁగు**¹ = మణుఁగు¹, మడువు¹. అ. క్రి.

౧. అడఁగు.

చ. కని కమలాక్షుఁ గాఁ దలఁచి కైకొన
కేపునఁ గాలఁ దన్ని చా, పునకుఁ దొలంగ
నిట్టివారవుం దలపోసి మడింగి యున్నఁ
బో, పుడె వెస లెమ్ము యాదవ యపుడ్
భవదీయబలంబుఁ గంటి నే, నని ప్రక
టాట్టహాస కఠినాకృతితోడ నదల్చి నిల్చి
నన్. హరి. ఉ. ౨. ౧౩౮.

(అడఁగు. ముద్రి. పా.)

సీ. . తేజోమయం బైనరూపంబు మత్ప్ర
కృతి యందుఁ జరాచరంబు దోఁచు,
మడుఁగు ... ఉ. హరి. ౨. ౫౭.

చ. ఉడిగి మడింగి పై మఱచి యున్నకతిన్.
ఉ. హరి. ౫. ౧౦౩.

౨. వినమ్రతనొందు.

సీ. అడుగు లొత్తుచు నివ్వ మడుఁగుచు నీచక
ననుసరించుచు ధర్మమున ..
భార. అను. ౩. ౯౧.

౩. వంగు.

క. మిడికిడిఁ బెదవులు ప్రేగులు, మడిఁగెడుఁ
గనుదోయి పొంగెడి మాయొదురఁ గడున్,
వడవీఁకయొడలు చేసెదు, కడపల జపము
నకు నేఁడు గలదో లేదో.
ఉ. హరి. ౪. ౪౪.

వి. అణుమడుపు.

చ. సురటి యొకర్తు వీవ నొకసుందరి యాకు
మడుంగు లియ్య బం, భరనిభవేణి యొర్తు
నునుఁబయ్యెదఁ జక్కఁగ దిద్ద ...
రుక్మి. ౫. ౫౬.

(శ. ర. పా. ముద్రి. మణుంగు.)

జ : మడుఁచు, మడుపు.

**మడుఁగు**² = మణుఁగు². విశే. (క. మడు)
పరిశుద్ధము, ధౌతము ; తెల్లనిది.

గీ. పలుచఱింగుల మడుఁగుఁజీరలు పొలుపుగ,
మడిఁచి మూటగఁ గట్టి ...
హరి. పూ. ౯. ౧౭.

సీ. గడితంపునీర్కావి మడుఁగుదోవతి కటీర
స్ఫురత్పీతాంబరంబు గాఁగ ...
వరాహ. ౯. ౪౭.

సీ. నిద్దమైనమడుంగు నీర్కావిదోవతి కనక
మేఖలతోడఁ గటి ఘటించి ...
కాశీ. ౧. ౩౯.

సీ. కద్రూతనూజాదేవిగారాపుసంతతి మధుకైట
భారాతి మడుఁగుఁబాన్పు ...
క్రీడా. ౧. ౨౨౧.

ఉ. ఒత్తుగ మాంగమున్ మడుఁగుటోగిరమున్ ఘృతశర్కరాదులున్, కుత్తుక బంటిగా మెసఁగి క్రొవ్వి వధూరతితంత్రలీలలన్, మత్తిలి దేహముల్ మఱచి మాటికి బొంకు నృపాలకోటికిన్, సత్తు దలంప నెక్కడిది సంయమి నీ కిటుఁ బల్కఁ బాడియే.
హరిశ్చ. ౧. ౧౮౦.

వి. ౧. పరిశుద్ధవస్త్రము.

గీ. మజ్జనం బార్చి చెంగావిమడుఁగు లిచ్చి.
హైజ. ౪. ౬౦.

ద్వి. మహితభక్తాళికి మడుఁగులు సేఁత, మహి నిప్డు మడివాలుమాచయ్య యనఁగ
బస. పు. ౪. ౭౮. పం.

క. ... మడుఁగులు గట్టుచుఁ గడంగి మగువలు ప్రీతిన్. దశకు. ౧౦. ౪.

౨. తెల్లనివస్త్రము; వస్త్రము.

సీ. వెన్నెలనిగ్గులు వెదచల్లెడుమడుంగు లందిచ్చె నొక్కపూర్ణేందువదన పారి. ౨. ౧౨.

గీ. .. ధౌతవస్త్రంబు పరగు మడుఁగు, మడత మడి చలువ యనఁగ
ఆం. భా. ౨. ౧౫౩.

సీ. మడుఁగు మాసినదైన మగువపెఱుందుపోయగము జూపఱచిత్త మాఁక గొలుపు.
ఉ. హరి. ౧. ౫౪.

సీ. యామినిప్రాణనాయకు రాక విని వాని యడుగుల కిడినట్టి మడుఁ గనంగ
ఉ. రా. ౪. ౧౬౦.

౩. పరిశుభ్రత.

చ. ... కదళీవ్రజంబు మడుఁగుల్ మడుఁగుల్ హిమవాలుకాస్థితవ, ర్తి లె ...
అచలా. ౨. ౧౦.

మడుఁగు[3] = మడువు[2]. వి. (క. త. మడు.)
౧. కొలను, సరస్సు.

గీ. వెట్టదినముల మడుఁగుల మట్టి గలఁప, బుడబుడధ్వని వెడలు బుస్బుదములందుఁ, జలుప చిలుపని నేతులు జిడ్డుదేఱు, నేమి చెప్పదుఁ గ్రొవ్విన యేకలములు.
మనుచ. ౪. ౧౪.

౨. నదీమధ్యము నందలి యగాధతలము, హ్రదము.

చ. .. రఘు ప్రవీరు చెవులారఁగ నింతయుఁ దెల్పు సాదువే, నున్నది చెంత గంగ మడుఁ గున్నది దైవటం బయోధ్యయున్ దుదిన్.
ఉ. రా. ౬. ౨౭౨.

గీ. అడరును హ్రదసంజ్ఞ మడుఁ గనంగ ...
ఆం. భా. ౧. ౧౬౨.

జ. మడుఁగులువాఱు.

మడుఁగు[4] = మణుఁగు[3]. వి. ౧. గుణము, రెట్టి.

క. వలిరేఁగి కలఁగి తద్బల, ములు విశ్వామిత్రుసైన్యముల కేనుమడుం, గులు పెరిఁగి .
భార. ఆది. ౪. ౧౦౪.

చ. కొడుకులకంటె నయ్యనుఁగుఁ గోడలి కక్కడు గూర్తుఁ గోడలుం, గొడుకులు నేయుభక్తి కట కోటిమడుంగులు భక్తి నాకు నా, ప్పడుఁ దగఁ జేయుచుండు...
భార. ఉద్యో. ౩. ౧౭౪.

క. . అ, దరణ నొనర్చిన జనులకు, వరయఁగ నది కోటిమడుఁగు లై ఫల మొసఁగున్. బ్రహ్మో. ౪. ౫.

౨. మణుఁగు, ఎనిమిదివీసెలకొలఁది.

క. పెరుమాళ్లకు నాగిన్నియ, యిరుమడుఁగుల పసిఁడి గాన్కయిడి తన కిదియే, తిరువారాధనగాఁ గొని, సిరివరు రంగేశ్వరుని భుజించుచు నుండెన్. హైజ. ౪. ౧౩౪.

**మడుఁగులువాఱు.** అ.క్రి. (మడుఁగులు³ + వాఱు.) మడుఁగుగట్టు, మడుఁగులుగా నేర్పడు.

చ. అడరు నబాంబుధారలు ముత్తురంగ
లన్. మడుఁగులువాఱె నాభికడ మానక
చొచ్చె నసృక్ప్రవాహంబునన్ ..
కు. సం. ౬. ౪౭౪.

**మడుఁచే(ద్చు.)** స.క్రి. (√మడుఁగు¹) ౧. (తమలపాకులు మొ.) మడఁతఁబెట్టు; చుట్ట చుట్టు.

గీ. తరుణి రొయ్యుఁగా వీటికాదానవేళ, గురు
జన ప్రాంతమునయుంగు గూఢవృత్తి, నాగ
వల్లీదళంబు సెన్నడుమఁ జీఱి, మడఁచి
యందిచ్చినపుడు గోరిడుడుఁ గేల.
నైష. ౮. ౮౪.

క. సోగ లగుకెందిరెకుల, లాగునఁ దలనాకు
మడిఁచి లలన రొసంగన్, బాగాలుచేసి
కొని .. సారంగ. ౨. ౯౪.

గీ. పలుదెఱంగుల మడుఁగుఁజీరలు పొలుపుగ,
మడఁచి మూటఁగఁ గట్టి యిం పడరఁ
గొనుచు, వరిగి . హరి. పూ. ౯. ౧౨.

ద్వి. జడలు వీడఁగఁ గళాసములు విదిల్చి,
మడిఁచి చంకల నిడి మరలి చూచుచును.
- ద్వి. హరిశ్చ. పూ. ౪౨౦. పం.

సీ. ఒకట కేవలి మడ్చి యుక్కుకేల ఘృతాచి
గాజుతెక్కులతల్పు గడియ పుచ్చె
హర. ౭. ౧౩౭.

గీ. వ స్త్రిములు మడ్చి కూర్యమాహావాయామి,
యనుచుఁ గలశంబు ధూపగంధాక్షతోప,
హారములఁ గొల్చి ...
శ్రీరం. మా. ౮. ౧౧౨.

౨. అణఁచు, నొక్కు.

క. అజాదరి, నోరు వడిఁచి తద్జ్ఞజనవి
నుతి ఘెలఁగంగన్. దశకు. ౫. ౯౯.

౩. మణఁచు, వంచు.

చ. మడవక ముష్టిరోగ్య మగుమధ్యముతో
నెలవంక యైనయ, ప్పడతుక భ్రూలతా
ధనువు పట్టి మనోభవుఁడు ...
నైష. ౫. ౧౨.

**మడు(ఱు)వు.** స.క్రి. (√మడుఁగు¹) ౧. మడఁగఁజేయు, చంపు.

గీ. . ప్రమాస్మక పుటిరుడు, లొక్కమొగి
వాండ్రఁ బోనీక చిక్కఁబట్టి, పొడిచి
యడిచియు .. మడిపి రపుడు ...
అచ్చ. రా. యు. ౧౭౦.

సీ. మడిపెఁ దునిమె ..

గీ. అడఁచెఁ జెండె నవంగఁ బొం దగు
వధించె, ననుటకు సమాఖ్యలై .
ఆం. భా. ౩. ౧౨౩.

విణ. ౧. చలువచేసి మడఁతఁ బెట్టినది.

సీ. మితి లేనికూలి చాకిత కిచ్చి కైకొను గడియ
కొక్కటి గాఁగ మడుపుఁ ...
జీర. శుక. ౨. ౪౩౪.

౨. చుట్ట, చుట్టినది.

సీ. కొఱకిన మడపుటాకులు మోవి కందిచ్చి
మధురాధరము పంట నంటనొక్కి ..
శుక. ౧. ౨౧౪.

వి. మడఁచిన తమలపాకు చుట్ట.

సీ. కడుశేగ మడుపులు కైకొని యొడిగంపు
రాజీవముఖి హజారమున నిల్పి ...
కువల. ౩. ౭౦.

సీ. మొనపంట మడుపు వేఁడిన నీళ్ళ రొయుఁగ
నందుచుఁ జాటుక్కన మోవి నొక్కు
వాని. ఉ. రా. ౧. ౩౯.

వ. . కెమ్మోవుల పచ్చిగంటు మాటుటకు
గావణించిన రవికసరవి మడుఁచుమడు
పులు సగము మనిపంటఁ గొఱికి నొక్కు
టెక్కులును .. ప్రబంధ. ౭౮.

౨. మడత.

సీ. మంచులప్పల మించు మండెంగ మడుపులు
బొరలి తెట్టువ గట్టుచున్నవు అయ్యో .
శైవ. ౭. ౧౨౪.

౩. ధాతువస్త్రము, మడత.

క. .. వలిపెపు, మడుఁగులు గట్టంగ నిచ్చె
మఱియొక్క తె . అని. ౫. ౩౧.

ఆ. చాకివాఁడు కోక చీకాకు పడఁజేసి,
మయిలఁ బుచ్చి మంచిమడుపుఁ జేయు,
బుద్ధి చెప్పువాఁడు గుద్దిన నే మయా,
విశ్వ . వేమన. ౨. ౮౨.

**మడువ.** వి. పుట్ట.

సీ. . మడువ నాఁ బుట్టిన వల్మీక మెప్పు
చుండు . ఆం. భా. ౨. ౭.

**మడువు[1] = మడుఁగు[1].** అ. క్రి. అడఁగు.

ద్వి. పడియున్న పునుకలు పానపాత్రములు,
మడువని రుధిరంబు మధురాసవంబు, శర
వహ్ని మఱుఁగు మాంసంబు కూరలున .
ద్వి. భార. విరా. ౪. ౮౩ పా.

వి. ఉపశాంతి.

ఆ. ఆవులించు, తలయు నడరెడు నట్టయుఁ,
జూచి ప్రీతుఁ డగుచు సురవిరోగ, యుచటి
డింభతతికి నాఁకలి మడువుగా, నిచ్చి
యాగ్రహమున నిట్టు లనియె.
నిర్వ. ౪. ౪౦.

**మడువు[2] = మడుఁగు[2].** హ్రదము, ఏటినడుమ లోఁతు గలచోటు; కొలను.

క. ఆపవనజు నతిఘనలతి, కోపాకావలుల
నంటఁగట్టించి మహా, కోపమున గంగ
మడువునఁ, ద్రోపించె సుయోధనుండు
దురితకరం ర్రు. భార. ఆది. ౫. ౧౪౧.

వ. నేను గంగకుఁ జని యొక్క మడువున
నీరాడుచున్నంత
మార్క. ౭. ౧౪౯.

చ. కొడుకులుఁ దమ్ములుం గలవ ఘోరపుఁ
జావులు పావఁ జూచి యు, ట్లొడఁబడె
నీచబుద్ధి యొడ లోముటకై నిను రాజ
రాజ యి, మ్మడువున కేడ్చి తెచ్చె విధి...
భార శల్య. ౨. ౫౪.

క. అని చెప్పి యుల్లరాయఁడు, మనుపటిరూ
పూని యుండె మరియుచు దొరయున్,
దనములికి దృశ్యగుల్మం, బనుమడువుపయి
న్నిగుడ్చి యాట నింకించెన్.
అచ్చ. రా. యు. ౭౦.

సీ. . మండువేసవి నిండుమడువుబోలె ...
కాశీ. ౫. ౪౯.

జ మడువుకొను, మడువులుగట్టు.

**మడువుకొను.** అ. క్రి. (మడువు[2] + కొను) మడుఁగుగా నేర్పడు, మడుఁగగు.

సీ. ఆసారవర్షంబు లై స్వేదములు గ్రమ్మ
మణికుట్టిమస్థలి మడువుకొనియె ..
కవిక. ౨. ౧౨౬.

**మడువులుగట్టు.** అ. క్రి. (√మడువు[2]) మడువులుగా నేర్పడు, కొలఁకులుగా నేర్పడు.

వ. తొట్టి తొట్టి యెడనెడ మడువులు
గట్టిన సజ్జకపు గొజ్జంగ నీరునందుఁ బ్రతి
బింబించు నప్సరః కాంతల వదనారవిందం
బులలోపలం బడి . భీమ. ౫. ౧౨౦.

చ. నెత్తురుల్, మడువులుగట్టఁ జేసి బలు
మచ్చర మెచ్చఁగ నుచ్చరింపఁగన్.
ఉ. రా. ౪. ౩౪౯.

**మడ్డి.** వి. (క. మడ్డు, త. మట్టి.) ౧. ఏదేని పదార్థము మఱఁగింపఁగా నిలుచు చిక్కని సారము.

క. .. మోలుగు మడ్డిం దోంచి సూర
కొక్కెండును కేన కొక్కెండును గాఁ
గుట్టిన దొల్లుటుల్లారు లుల్లసిల్లం బల్లించిన
పల్లంబులపైఁ జిల్లతైలంబును వాసనకొడు
పులం బూసిన మణుంగుఁ జంద్రికచేలరె
రతణాంఃలు గా నెదురుగా వేడుకం జూడ
వచ్చిన . ఆము. ౪. ౩౫.

౨. నూనె మొదలగువానిలోఁ దేరఁగా నడు
గున నిలుచు పదార్థము.

ఉదా నూనెవడ్డి, ఆముదపుమడ్డి మొ

౯౯. ౧. మూఢుఁడు. (శ. ర.)

ఉదా వాఁడు వట్టి మడ్డి మనుష్యుఁడు.

౪. మొద్దు. (బ్రౌ.)

జ మడ్డితనము.

**మడ్డితనము.** వి. (√మడ్డి) ఎూర్ఖత, మొఱకు
తనము. (బ్రౌ.)

**మడ్డు.** వి. ౧. ఒకవిధ మగు ఇనుపగుండు.

క. ఇనుమున నేఁబది పలముల, నెనిమిద్రే
ళ్లాయతముగ నేగ్పడ గుండై, నునుపై
యుండఁగఁ జేసిన, ఎనమున నిది మడ్డు
నకుఁ బ్రమాణం బయ్యెన్.

విజ్ఞా. ౩. ౧౧౭.

౨. ఇనుపగుండు; ఎఱ్ఱగా కాఁగిన యినుప
గుండు.

ఉ. ఏఁ గలలోన నొం డెఱుఁగ నీవె విభుం
డవు సందియంబు నా, పైఁ గలదేని
మూఁడు మని ప్రాగ్దిశ గౌతమదార జారు
నిన్, దాఁ గడునమ్మఁ జేయుటకుఁ
దక్కెక యొత్తెడునట్టి యొఱ్ఱగాఁ, గాఁగిన
మడ్డుచంద మెసఁగం గనుపట్టె నినుండు
నుష్ణతన్. ప్రభా. ౫. ౬౦.

(శ. ర. పా. 'త్రాగఁగ నొత్తెడు'
ముద్రి. పా.)

వ. అగ్ని స్తంభనంబు వట్టుకొని మడ్డు దివిచిన
ట్లయ్యె భోజరా. ౬. ౧౮౧.

ద్వి. తమ్ము రే యెడసిన తమకంబుతోడ,
నమ్మునిపతులకు నమ్మికల్ పుట్ట, వనదేవ
తలు మెచ్చ వనములఁ గ్రుంకి, కనలి
మడ్డలు నాలికల నెత్తె ననఁగఁ, దుండాం
తరములఁ జెందొవల బిట్ట గల ఖండించు
వరచక్ర కాంతులదాని.

ఆ. మ. క. ౨. ౪౩. పా.

క. తనయుదయమె మదిఁ గోరెదు, నను
విడిచె నినుండు కల్ల నాయెడ లేకుం, డ
నెఱుఁగఁ డని పూర్వాశాం, గన జగమున
మడ్డువట్టుగతి నళి పెఱసెన్.

ద్వా. ౪. ౧౦౩.

౩. కొఁక, అత్యుష్ణము. (చి. ని. బ్రౌ.)

జ॰ మడ్డకత్తి.

**మడ్డుకత్తి.** వి. (√మడ్డు) మోటకత్తి, మచ్చు
కత్తి. (శ. ర. బ్రౌ.)

**మడ్డువు.** సం. వి. ఉ. పుం. వాద్యభేదము.

**మణఁగు = మడఁగు.** అ. క్రి. వంగు, నమ్ర
మగు.

సీ. అడుగువ కొకగుణం బన హెచ్చుతగ్గు
లై వలి నొప్పు పృథ్వి యోనాఁటి సాధ్వి.

గీ. యనుచు ననిచిన కూరమి నణఁగిమణఁగి,
కలిమి లేమిని భర్తతోఁ గలసిమెలసి,
హెచ్చుతగ్గుల నొకరీతి నెసకమెసఁగ,
వెలసె విలసితకీర్తుల వెంగమాంబ.

కృ. శతం. ౧. ౪౭.

(వ్యవ.) నాచేయి మణఁగినది. లేకు మణఁగ
గొట్టినాఁడు.

జ మణాత.

**మణాత.** వి. (√మణఁగు) భత్యవిశేషము.

వ. ... చంద్రకాంతంబులు మణులు పారె
పత్తులు చలువమజ్జిగ వెళవీరు కొంతికపా
యంబు మొదలుగాఁ గల నిఖిలభక్ష్య
భోజ్యలేహ్యచూష్య పానీయాదులు .
ప్రబంధ. ౧౧౨.

**మణి.** సం. వి. ఇ. పుం. ఇ. ఈ. స్త్రీ.
౧. రత్నము. ౨. సామాన్యభూషణము, నగ.
3. రత్నము, తత్తజ్జాతియందు శ్రేష్ఠమగు
వస్తువు. ४. ప్రకోష్ఠము, ముంజేయి. ५. నీటి
కుండ, జలకుంభము. ౬. మృణ్మయపాత్రము.
౭. లింగాగ్రము. ८. యోన్యగ్రము. ౯. అజా
గళస్తనము, మేఁకలకంఠమున వ్రేలాడెడి
చన్ను. ౧౦. మాణిక్యము మొదలగునది.
౧౧. కొమ్ములోహాది నిష్పాద్యగులిక. ౧౨.
ఘంట (శే. ని.)

**మణికంఠము.** సం. వి. అ. పుం. చిత్రవాజము,
పాలపిట్ట. (వై. ని.)

**మణికట్టు = మణికట్టు.** వి. వి. (మణి + కట్టు
క. త. మణికట్టు) మణిబంధము
ద్వి. పట్టఁ జాచిన మణికట్టు ఖండించి
బస. పు. ४. ५४४. పం.

**మణికము.** సం. వి. అ. పుం. అలింజరము,
మృణ్మయపాత్ర. కుండ కాు. (అమర
సింహుఁడు.)

**మణికర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. కాశిలో నున్న
తీర్థవిశేషము.

**మణికాననము.** సం. వి. అ. న. కంఠము.

**మణికారుఁడు.** సం. విశ. (అ. ఈ అ.) మణుల
పని చేయువాఁడు.
వి. అ. పుం. ౧. తత్త్వచింతామణికర్త యగు
గంగేశోపాధ్యాయుఁడు. (వాచ. కల్ప.)

౨. వైశ్యకుండుఁడు, భర్త జీవించియుండఁగా
వైశ్యస్త్రీయందు జారునివలనఁ బుట్టిన
సంకరజాతివాఁడు. (వై. ని.)

**మణిగము = మణివము.** (శ. ర.)

**మణిగాసనము.** వి. (త. మణియాసనమ్.)
సన్నసన్న పువ్వుల.
సీ. మణిగాసనములం బ్రేమ నొనర్చి
గోడలఁ జెలువారఁ గృష్ణలీలలు లిఖించి,
గీ. పురము రాజ్యంబు శృంగారముగ నొనర్చి,
యవనినాథుండు నదిఁ దీర్థమాడి వచ్చి.
రుక్మాం. ౧. ౧౧౯.

**మణితము.** సం వి. అ. న. రతికాలమందు స్త్రీ
చేయునవ్యక్త ధ్వనిభేదము, రతికూజితము.

**మణితారకము.** సం. వి. అ. పుం. సారస
పక్షి, బెగ్గురుపక్షి.

**మణిదర్పణము.** సం. వి. అ. పుం. మణులతోఁ
గట్టఁ? డిన యద్దము, మణులు తాపడము
చేసినయద్దము.

**మణిదీపము.** సం. వి. అ. పుం. దీపముగ నుప
యోగపడు మణి.

**మణిద్వీపము.** సం. వి. అ. పుం. అమృత సము
ద్రమువందలి ద్వీపవిశేషము.

**మణిపతి.** సం. వి. ఇ. పుం. బభ్రువాహనుఁడు.

**మణిపుష్పకము.** సం. వి. అ. పుం. సహా
దేవుని శంఖము.

**మణిపూరము.** సం. వి. అ. పుం. (యోగ.)
నాభిస్థానమం దుండు నొకానొక చక్రము.

**మణిప్రవాళము.** సం. వి. అ. పుం. న. రెండు
భాషలు కలిసిన కవిత్వము. (శ. ర.)

**మణిబంధము.** సం. వి. అ. పుం. ౧. ప్రకోష్ఠము, ముంజేయి. ౨. మణులు కూర్చుట, కాపటము చేయుట. ౩. సైంధవ లవణము పుట్టు నొకానొక పర్వతము (వాచ.)

**మణిబీజము.** సం. వి. అ. పుం. దాడిమచెట్టు.

**మణిభూమి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. రత్నములగని ౨. రత్నములతోఁ గట్టిన నేల.

**మణిమంథము.** సం. వి. అ. పుం సైంధవలవణము పుట్టు ఒకానొక పర్వతము, మణిబంధము.

(ఈ రూపము కొందఱ మతమునఁ గలదు.)

**మణిమాల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. రత్నహారము, మణులసరము. ౨. ప్రకాశము, వెలుఁగు, ౩. (రతియందలి) దంతక్షతభేదము. ౪. లక్ష్మీదేవి. ౫. జగతీ ఛందస్సునందలి వృత్తవిశేషము.

మణిమాల .. స్వామి తయకారద్వయద్వమ్ము పొసంగున్, కేమాలు మహీధృద్విక్రాంతులతోడన్, భూమండలిఁ గూర్పన్ బొల్చు న్మణిమాలల్ .

అప్ప. ౪. ౨౧౯. పా.

౬. ప్రకృతి ఛందస్సు నందలి వృత్తవిశేషము.

**మణిమాల.** అజహ్నార యోదధిఘృతంబులమ్ముచు మురారిఁ బాడి గెలమిన్.

వ. .. మణిమాలయందుఁ బొసఁగ, స్రజము త్రివారము సముంచి నాకివిరసంబు పొందు దనరన్. అప్ప. ౪. ౨౩౨. పా.

**మణియకాఁడు.** (మణియము + కాఁడు, క. మణియగార, త. మణియకారన్.) గ్రామాధికారి.

గీ. మరిగి తిరుగుసభాదికి మణియకాండ్ర, కవని బడికొపు నా వింత వలరుసంతి

హంస. ౨. ౪౭.

**మణియము = మణీవము.** వి. (త. మణియం. క. మణియ.) గ్రామాధికారము; అధికారము.

సీ. త్యాగ విరచుక యున్నఁ దను దాఁ బొగడఁ జూచు మణియ మచ్చిన నూరు మాపఁ జూచు. రామలిం. ౭౫.

సీ. కొలుచువారలనోరు గొట్టి లెక్కలు వ్రాసి హరువు మీఱఁగ మణియములు చేసి

శుక. ౩. ౩౬౨.

క. పాపాత్ము లైనపురుషుల, కేపున మణియంబు లిచ్చునీకష్టుఁడు దు, ర్వ్యాపారంబున మది సం, తాపింపఁ దొడంగు సంతతము ఫీఁ డనఘా ...

సావందో. ౪. ౪౩౨.

జ. మణియకాఁడు.

**మణియారవెల్లలు.** వి. బ. వస్త్రవిశేషములు.

వ. జప్పడింపట్లు పచ్చపట్లు ౨ చంద్వాలు ౨ పట్టుగొడుగులు ౨ మణియారవెల్లలు ౬ వెన్నచీరలు ౧౨ బ్రింగాళ. ద. శా. ౪. ౯౪౫.

**మణిరంజనము.** సం. వి. అ. న. వర్ణపుకోట. (శ. ర.)

**మణిరాగము.** సం. వి. అ. పుం. రత్నముల కాంతి. న. ఇంగిలీకము. (రా. ని.)

**మణిరాజము.** సం. వి. అ. పుం. వజ్రము.

**మణివకాఁడు.** వి. (√మణివము.) అధికారి. (శ. ర.)

**మణివము = మణియము.** వి. ఉద్యోగము, అధికారము; పూనిక, ఉద్యమము.

సీ. మణి ధనాఢ్యులకును మణివంబు లీడగు
హితులవాకిలి గాక నిడఁగఁ దగును ...
నీతి. ౫౮.

సీ. మాగాని రాజ్యంబు మణివమద్యోగంబు
చిట్టలు చిత్రముల్ చిలుకు శరము ...
ఆం. శే. ౫౬.

క. ఏఁగ మణివంబు మాని మ, హోగహనంబు
నకు ధర్ముఁ డవమానముతో, శేగమ
ధర్మస్వత్వరి, తాగతి యనుపచన మిన్విధం
బయ్యె ననన్. దరాహ. ౩. ౭౯.

(మణిహాము. ముద్రి.)

జ. మణివకాఁడు.

మణిశిల. సం. వి. ఆ. స్త్రీ. రత్నఫలకము. రత్నశిల.

మణిసరులు. వి. బ. ధాన్యవిశేషము.

సీ. మణిసరుల్ మసరులు మంకెన ల్పగడంపుఁ
డిఁగాలు మడిప్రాలు దేవసరులు ...
హంస. ౪. ౧౭౯.

మణిసానువు. సం. వి. అ. పుం. మేరుపర్వతము. (వై. ని.)

మణిసిల. మి. వి. (మణి + సిల) పర్వతధాతు విశేషము. (శ. ర.)

మణిసోపానము. సం. వి. అ. న. బంగారు పూసలు గ్రుచ్చినహారము, చాటుకారము. (వై. ని.)

మణిహాము. వి. వాణిజ్యస్థానము, అపణము, బజారు.

వ. ... వెలిచవిఁ గోరుచుండగవు వేడుక కత్తెల నోముసోఁత గూ, బల మణిహంబు జాఱులకుఁ బండువు చీకఁటి పర్వ సుర్వ రన్.
కవిక. ౪. ౨౬.

మణీంద్రము. సం. వి. అ. పుం. వజ్రము.

మణీచకము. సం. వి. అ. పుం. మత్స్యరంగపక్షి. న. చంద్రకాంతమణి. (త్రి. ని.)

మణీచము. సం. వి. అ. న. ౧. ముంజేయి, ౨. పూవు. ౩. మౌక్తికము. (శే. ని.)

మణీవకము. సం. వి. అ. న. పుష్పము, పూవు.

మణుఁగు¹ = మడుఁగు¹. అ. క్రి. అడఁగు.

జ. మణుఁగుఁబువ్వులు.

మణుఁగు² = మడుఁగు². వి. ౧. పరిశుద్ధవస్త్రము.

క. తను దగుతడి యొత్తుమణుం, గున సొయ్యన
మేనితడి యిగుర్పఁగ నొత్తున్ . .
నైష. ౭. ౪౨.

సీ. కొరని రాయిత్తివమణుం, గొండక మేన
నిగ్గులు దేఁ బసుపాడి జలక మాడ ...
ఆము. ౧. ౭౦.

ద్వి. మరమున శీతించి మణుఁగు లన్నియును,
గతివము లాకుండ గట్టించి వడుక ..
బస. పు. ౪. ౧౯. పం.

సీ. మణుఁ గడఁగాను బ్రమాణభేదంబును
ధాతవస్త్రంబును దనరుచుండు . .
ఆం. ఖా. ౩. ౫౮.

౨. పరిశుద్ధి.

క. మమకారమారునవి మి, త్రములఁ గళ
త్రములు నన్నదమ్ములు నమబం, ధముల
పరిమ్వంగము ధ, ర్మమె మైకొన మణుఁగు
గగను నైలయు గగమే
పాండు. ౫. ౨౭౦.

విశ. పరిశుద్ధము.

చ. ... మట్టెపన్నెగాఁ, గురుమణుఁ నైన
పుట్టమును గూడఁగ దుక్వని వైల

కొప్పునై, మణుఁగిడి యింటిలోఁ బతి
సమాగమమున్ మతియింపు టొప్పగున్.
పి. కళా. ౪. ౧౧.

వ. .. పల్లవంబులపైఁ జిల్ల కొలంబును వాసన
కొడుపులం బూసిన మణుంగుఁ జంద్రికచే
లలి రవణంబుగా ... ఆము. ౪. ౩౫.

సీ. చెలువ మెచ్చఁగ నిందుచలువమణుంగు
మేల్ వలువ యూచెలి కొక్కచెలువ
యొసఁగె. ఇందు. ౬. ౨౩

మణుఁగు³ = మడుఁగు⁴. వి. రెట్టి.

ఉ. . రాజూరుం, గొంచక దీని కేడుమణుఁ
గుల్ గొని వచ్చితి మంచు నిచ్చునన్ .
శై. భా. ౧. ౬౪

గీ. నీవు జగదేకదాన దీక్షావిధాన, గరుడ
వటు గాళ వేదోక్తసరణి కంటెఁ, బది
మణుంగులు దక్షిణ లొదవ నిచ్చి, మేదినీ
నాథ దాశాశ్వమేధి వగుము.
విక్ర. ౫. ౧౨౦.

సీ. పాతకంబులఁ బంచ బంగాళముగఁ జేయుఁ
గనుఁగొన్నమాత్ర మోక్షంబు నొసఁగుము
మ్ముణ్ణు పుక్కరంబునకు నల్కుణ్ణు పంపకు
నిది యనఁ దగు (బకట మహిమ ..
పాండు. ౩. ౧౩౪. (మడ్గు. క. ర. పా.)

౨. (క. మణుంగు) ఎనిమిది వీసెల కొలది.

సీ. మణుఁ గనఁగాను (బమాణ భేదంబును
ధాతవ స్తు(పింబను దనరుచుండు .
ఆం. భా. ౩. ౫౧.

మణుఁగుఁబువ్వ(బూ)లు. వి. (√మణుఁగు
క. మణుగుప్ప.) ధత్తురి శేషము.

వ. ... కొరుండలు మనోహరంబులు గారెలు
బూరెలు మండెంగ లంగరొల్లెలు మణుఁ
గుఁబువ్వులు ఫేణీ లొబ్బట్లు కడియపు
టట్లు .. ప్రబంధ. ౧౧౨.

గీ. గారె లతిరసలు బొబ్బట్లు గరిజెకాయ,
లట్లు బూరెలు జంతికచుట్లు మణుఁగుఁ,
బూలు వెన్నప్పములు ...
చెన్న. ౪. ౩౫౧.

సీ. మణుఁగుఁ, బూవు నాఁ జిరేర
మూలము తవరును ...
ఆం. భా. ౨. ౨౫౬.

మణ్ణాస. వి. (మణ్ణు + ఆస. త. మణ్ణాసై.)
భూరూపమైన ఆస్తిపై ఆశ.

క. ఉణ్ణాముల జగదంబిక, నణ్ణామల కొక్క
నాధు నారాధించెన్, మణ్ణాసయుఁ
బొన్నా సయుఁ, పెణ్ణాసయు లేనివారి
కెన్నిధు లగుటన్ .. కాళ. ౩. ౧౫౫.

మణ్ణు. వి. (క మణ్, త. మ. మణ్, మణ్ణు)
మన్ను, భూమి. (చూ. మణ్ణాస.)
జ మణ్ణాస.

మతంగజము. సం. వి. అ. పుం. ఏనుఁగు.

మతంగ్గము. సం. వి. అ. పుం. మేఘము.
(కల్ప.)

మతంగుఁడు. సం. వి. అ. పుం. ౧. ఒకానొక
ముని. ౨. ఒకానొక రాక్షసుఁడు.

మతకము¹. విశే. ౧. కపటము, కుత్సితము.

సీ. సంతతాజ్ఞానప్రచార మాచారంబు
మతకంపు మాయలమనువు తనువు ...
వైజ. ౨. ౪౫.

౨. మాయకలది.

చ. కుతుకలు కోయ దొంగలకు ఘోరవికార
కురువ్వు జాతికిన్, మతకపులంజ లొత్తు
లకు ... ఇత్తురు చత్తు గంటె పో, కొంక
కుడొరల్ . (చాటు. (గా.

౧. వి. కపటము.

ద్వి. మునిముచ్చ్వరలె నోరు మూసుకయున్నఁ
దనవారలకుఁ బ్రమాదము వచ్చు ననుచు,
మనసులోపల నొక్కమతకంబుఁ దలఁచి,
వనితలతోడ నవ్వనిత యి ట్లనియె.
ప్రభు లిం. ౨. ౬౪. పా. ౩. పం.

క. అరణభోజుని మతకము, లారుక్మిణినటన
లామురాంతకు చెయ్యుల్, చేరి కనుం
గొనుచో నౌ, వ్వారికిఁ గోపంబు రాదు
వారిజనేత్రా. పారి. ౧. ౯౧.

౨. మాయ.

సీ. మంథర గల వేది వతకంబు లూహించి
కైకకుఁ జెడుబుద్ధి గఱపె నకట ...
భా. రా. అయో. ౧౧౪.

చ. మతకము లేల చాలు నిఁక మాటికొనంగ
నలుండ నే మహా, న్నతి నిను వేఁడె
దన్.

హ. వ. ౨. ౧౦౦. భార. అను. ౨. ౧౪౯.

(మతకము = తమకము. అని. భా. ల. వ్యా.

౩. మర్మము, గుట్టు.

ద్వి. అరవి వినా కే నాకు నావఁశం డనిన, మన
మున నామాయమతిక మంతయును, కనుఁ
గొన్న ధన్యుండు గాన ని ట్లనియె.
ప్రభు లిం. ౨. ౨౪. ౬. పం.

జ మతకరి¹.

**మతకము²**. వి. సద్బుద్ధి. (చూ. మతకరి².)

జ: మతకరి².

**మతకరి¹**. విశే. (మతకము + అరి²) మాయకలవాఁడు; మాయకలది, మాయలాఁడి.

చ. .. అ, మతకరి కేలంపుంపవని మమ్ముఁ
దెలంపఁగ నేల యచ్చటన్
పారి. ౧. ౪౯.

ద్వి. మతకరి చిత్రాంగి మచ్చరంబునను సుతు
నిపైఁ గపటంపుబుద్ధి గల్పింప.
ద్వి. క. పా. ౨. ౬౩. పా. ౩. పం.

చ. సతతము బ్రహ్మశర్వ సురపుంయమ
ముఖ్యుల నాత్మమాయ మో, హితులు
గఁ జేయుసామి చెలియింతిని మోహితఁ
జేయ లేక ప్రా, కృతజనునట్లు తాను
దనగిన్నె నొసంగను బంటుగోసమై మత
కరి వేశ్యమాత వెడమాయ లజయ్యలు
విష్ణుమాయకున్.
వైజ. ౪. ౫. ఆం. భా. ౨. ౨౯౬.

**మతకరి²**. విశే. (మతకము + అరి².) మంచిబుద్ధి కలవాఁడు.

క. మదిమున నామాట నమ్మి మతకరి వగు
చున్.

శా. జనకకన్య స్వేగ రొప్పించి లోకైక
త్రాణుని రాముని గనుము . .
భా. రా. సుం. ౪౪౬. ౪౪౯.

**మతము**. సం. విశే. (అ. ఆ. అ.)

౧. తలఁపఁబడినది, విశ్వసింపఁబడినది. ౨. అభి
ప్రేతము వి. అ. న. ౧. అభిమతము, ఆశ
యము. ౨. ఇచ్ఛ. ౩. జ్ఞానము. (శ. ని)
౪. (తెనుఁగున నీక్రింది యర్థములఁ బ్రయో
గములు గానవచ్చుచున్నవి. వృత్తాంతము,
సమాచారము.

క. కృతవర్మా క్రూరులయును, మతమునఁ దమ
తండ్రిఁ జంపి మణిరత్నం బా, శతధన్వుఁ
డపహరించినమత మంతయు సత్యభామ
మది నెఱిఁగి వేగన్. వి. పు. ౬. ౨౯౦.

౫. విధము, లాగు.

సీ. ..పురూరవ, పునిలీల సగరులాగునఁ గార్త
వీర్య మర్యాదను గయుక్రియ నంబరీషు,
మతమున శశిబిందుమహిమ నంగునిరేఖఁ

బృథునిమాడ్కి మరుత్తవృత్తి ధాత్రిఁ
బాలించు కవిభుండు దద్విభుండు.
హంస. ౧. ౪౨.

౨. ఉపాయము.

ద్వి. అనుఁచు సారథిఁ జూచి యాహైఁడి
మృగము, మనకు లోఁబడునట్టి మతముఁ
జింతించి. ద్వి. హరిశ్చ. పూ. ౭౯౪.

ఆ. లోభి వానిఁ జంప లోకంబులోపల మందు
గలదు వేఱె మతము గలదు, పైక మడుగఁ
జాల భగ్గునఁ గూడి చచ్చు
వేమ. ౧. ౩౮.

**మతల్లిక.** సం. విం. ఆ. స్త్రీ. ప్రశస్తము, శ్రేష్ఠము జాతివాచక పదములోఁ గూడి సమాసోత్తర పదముగానే ప్రయుక్తము.

ఉదా. లతామతల్లిక.

**మతాబు = మత్తాబు.** చి. ని. (శ. ర.)

**మతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. బుద్ధి, జ్ఞానము. ౨. ఇచ్ఛ, కోరిక. ౩. స్మృతి. (వి. ని. పే. ని.) ౪. శాకభేదము. ౫. విధము, రీతి. తెనుఁగననే యర్థము కానవచ్చుచున్నది.

ద్వి. గోపిఁణిపరణి నరుంధతికరణి, స్వాహాం
గనా గతి సావిత్రిమతిని, రతిచందమునఁ
బతివ్రతనిష్ఠఁ బొదలి, పతి యైన రఘురాము
భజియించుదాన.
రం. రా. కిం. ౨౫౩. పా. ౧౭. పం.

**మతించు.** సం. స. క్రి. తలఁచు, ఊహించు.

చ. దిరిసెపుఁబువ్వుకంటెను మతింపఁగ మెత్తన
బాలఁజిత్తముల్. కా. ౭కుం. ౨. ౩౮.

సీ. చెప్పంగఁ జూచెఁ గూఁచిమఖాంబుజము
దాఁదప్పకచూచును చెప్పనోడుఁ, బోక
నిల్చు నుపాయములు మతించు మతించి
చేర్పఁదేలేక నిట్టూర్పువుచ్చు ...
పి. శకుం. ౩. ౨౩౭.

**మతిభ్రమము.** సం. వి. అ. పుం. ౧. మానసికభ్రాంతి, మనస్సు తడఁబడుట. ౨. పారపాటు.

**మతిమంతుఁడు.** సం. విణ. (త్. తీ. త్.) తెలివిగలవాఁడు, బుద్ధిమంతుఁడు.

**మతియించు.** సం. స. క్రి. తలఁచు, ఊహించు.

క. వ్రతములు నుపవాసంబులు, మతియింప
నిరర్థకములు మానవతులకున్ ...
పి. శకుం. ౪. ౯౦.

చ. తెలివకు వల్లభుండు పరదేశము వోయిన
... ఇంటిలోఁ బతిసమాగమముల్ మతి
యింపు టొప్పగుల్. పి. శకుం. ౪. ౯౧.

**మత్కము.** సం. విణ. (అ. ఆ. అ.) మదీయము. నాసంబంధమైనది వి. అ. పుం. నల్లి.

**మత్కుణ.** సం. వి. ఆ. స్త్రీ. అజాతరోమయోని. (కల్ప.) (అజాతరోమభగము గలస్త్రీ.) (వాచ.)

**మత్కుణము.** సం. వి. అ. పుం. ౧. నల్లి. ౨. దంతములు లేనియేనుఁగు. ౩. మహిషము, దున్నపోతు. ౪. నారికేళవృక్షము, కొబ్బరిచెట్టు. ౫. జంఘాకవచము. పిక్కముఱువు. (వై. ని.)

**మత్కుణారి.** సం. వి. ఇ. పుం. భంగ. గంజాయి. కి.

**మత్కుణుఁడు.** సం. వి. అ. పుం. గడ్డము మీసములేని పురుషుఁడు.

**మత్త.** సం. వి. ఆ. స్త్రీ. సుర. కల్లు.

**మత్తకాశిని.** సం. వి. ఈ. స్త్రీ. ఉత్తమస్త్రీ; ఆఁడుది. స్త్రీ.

**మత్తకాసిని.** సం = మత్తకాశిని.

**మత్తకీశము.** సం. వి. అ. పుం. గజము, ఏనుఁగు.

**మత్తగిల్లు.** అ. క్రి. (√మత్తు.) మదించు.

అ. మత్తగిల్లు సత్తుగిత్తత త్తడి నెక్కి, మిత్తి
మొత్తి సత్తి నత్తి బత్తిఁ, బత్తి రిడిన
ముత్తిబుత్తులు రెండును, నొత్తి గుత్తగట్టు
చుండుతేఁడ. నీలా. ౧. ౧౧౯.

**మత్తమయూరము.** సం. వి. అ. పుం. ౧. మదించిన నెమలి. ౨. మేఘము. అ. న. (ఛంద.) వృత్తభేదము, ఓకానొకవృత్తము.

మత్తమయూరము. .. మత్తమయూరంబున
కొప్పన్. నాగక్రాంతుల్ మత్స్యగణం
బుల్ సగమొందన్.
అప్ప. ౪. ౨౧౯. పొ.

**మత్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మత్తెక్కినది, మదించినది.

ఉదా. ఐశ్వర్యమత్తము, ధనమత్తము, బలమత్తము ఇత్యాది.) ౨. పిచ్చిపట్టినది, వెఱ్ఱిది. ౩. మదమెక్కినది. (ఏనుఁగు.) ౪. గర్వించినది. ౫. సంతోషపూరితము, అధిక సంతోషముగలది.

వి. అ. పుం. ౧. పికము, కోకిల. ౨. మహిషము, దున్నపోతు. ౩. దుత్తూరము, ఉమ్మెత్తచెట్టు.

**మత్తవారణము.** సం. వి. అ. న. ౧. మంచము, ఖట్వా. (వై. ని.) ౨. నిర్యూహము, గోడనుండి వెలికి ఏనుఁగుదంతమువలె నుండుప్రానిచీల. ౩. మేడమీఁది కటకటాలవసారా పుం. మదించిన యేనుఁగు. (కే. ని.) ౪. ఇంటి ముంగిటి యావరణము, ప్రాంగణావరణము. ౫. వక్కపొడి.

**మత్తా = మత్తు.** వి. సం. (మత్తతా.) మదము, కైపు.

గీ. నవమధూక ప్రసూన సంభవపు మధువు,
దలము దప్పంగఁ ద్రావి మత్తా వహించి.
శివరా. ౩. ౧౫.

ద్వి. త్రిగినరోఁజామత్తా గొని యున్ని, లాగుల
నల్లనల్లన నృపుఁ గదిసి ...
ద్వి. హరిశ్చ. ఉ. ౧౩౯౯. పం.

సీ. మదము రాజిలు మస్తు మత్తు మత్తా యన.
ఆం. భా. ౨. ౧౯౫.

జ మత్తాగొను.

**మత్తాగొను.** అ. క్రి. (మత్తా + కొను.) మదించు.

మ. కహ్లారనీరేరుహా, త్పలధారాశిమ
రందపానమున మత్తా గొన్నరోలంబపం,
క్తులసౌభాగ్యముతో ..
వరాహ. ౪. ౧౧౫.

మ. అతిమధ్యాతలిమీఁద నంత విరసం బౌ
చాపముల్ సీధుపా, రణ మత్తాఁగొని
సోలునారి శిఖిమిత్రం బైనతేరుల్ వసాం,
గణాలుధ్బానుకోటిఁ బూని వెడలంగా నిట్టి
దేధర్మమే, గుణమేయెక్కుడిదే బలంబు
సుమనఃకోదండ నీ కెంతయున్.
వసు. ౪. ౪౧.

**మత్తాబు.** వి. (హిం. మహతాబ్. మిశ్ర. ప్రా.) ఒకశోభనమగు బాణసంచు. (శ. ర. మతాబు. వ్యవ.)

**మత్తాలంబము.** సం. వి. అ. పుం. ప్రాంగణావరణము. (కల్ప. ప్రాసాదావరణము అని వాక.)

**మత్తి.** వి. ౧. కావరము, మరులు.

సీ. మత్తికాటుకపొత్తు మరగినవనుముఁ జెంపుఁ
జూపులఁ గలికిమించులు నటింప .
విక్ర. ౭. ౧౮.

౨. అవివేకము. (చూ. మత్తికాఁడు.)

జ: మత్తికాఁడు

**మత్తికా(గా)ఁడు.** విశే. (మత్తి + కాఁడు.)
అజ్ఞాని, అవివేకి.

ద్వి. చిక్కఁబో నేఁడు నాచే మత్తికాఁడ,
చిక్కులఁ బెట్టి కాశికుని నొప్పింతు.
ద్వి. హరిశ్చ. ౬. ౫౩౫. పం.

గీ. శక్తులో నీవు నీలోన శక్తి యొప్పుసు,
బాయకుందురు భాస్కర ప్రభలు పోలె,
నీరహస్యంబు మదిలోన నెఱుఁగ లేక
మొత్తులాడుదు రూరక మత్తిగాండ్రు.
వరాహ. ౧౧. ౧౬.

౩. కాముకుఁడు.

గీ. మనసు ప్రుచ్చిలి చొచ్చిన మత్తికాఁడ,
వీఁడు గొమ్మని చేసాఁచె వెలఁది
యపుడు ... ౫. ౧౪౯

ద్వి. మలహరుకృప లేని మత్తిగాండ్రకును,
కలుగునే లంజెతోకం బట్లు గేరు.
బస. పు. ౩ ౨౧౯. పం.

ద్వి. ధరణీశ వింటె గదా మత్తిగాఁడు, శం
కింప కెంతయుఁ జప్పుడు గాఁగఁ, గొంకక
యింటిలోఁ గుడుచుచున్నాఁడు.
పండితా. దీక్షా. ౪౨. పొ.

**మత్తిల్లు(లు.)** అ. క్రి. (√మత్తు.) ౧. మదించు.

ఉ. ... కటవా తరువాత వసుంధరాధిపో,
త్తంస విజృంభమాణ భుజదర్ప నిరంకుశ
సాహసక్రియా, మాంసల చిత్తవృత్తు లయి
మత్తిలి యుందు వరాతి భూపతుల్.
నైష. ౧. ౧౦౪.

గీ. గ్రీష్మకాలంబు మత్తిలి చేసు లాడె,
నింద్రగోపంబు లిలమీఁద నెల్లఁ బొడమెఁ
జాఁగెఁ గ్రాథమాంబువులకునై చాతకంబు,
లనఁగఁ గాల విరుద్ధ సమాఖ్య మయ్యె.
కావ్యా. ౬. ౧౩౧.

మ. మధు దైత్యాంతకుమీఁది మత్సరమునన్
మత్తిల్లి జన్మత్రయా, వధి యేప్రొద్దుఁ
దదీయరూపగుణ దివ్యధ్యాన పారీణధీ, నిధి
యౌటన్ శిశుపాల భూవిభుఁడు దా
నిర్ధూత సర్వాఘుఁడై, విధిరుద్రాదుల
కందరాని పదవిన్ వే పొందె నుర్వీశ్వరా.
భాగ. ౧౦. ఉ. ౩౯౯.

సీ. దరహాసమైన లేఁబోఁకఁ దఱిపి కాన్నెలఁ గ్రోలి
దివిఁజకోరములు మత్తిల్లి యాడ ...
హర. ౭. ౩౦.

౨. పరవశుఁడగు.

చ. తన కొకకీడు వచ్చుతఱిఁ దద్దయు
శోఖ్యము నొందు వేళలన్, మనుజుఁడు
ఖేదమోదముల మత్తిలుచే యవివేకము.
ఉ. హరిశ్చ. ౧. ౬౨.

**మత్తు – మత్తా.** వి. (సం. మదః.) ౧. మదము.

సీ. మదము రాజిలు మస్తు మత్తు మత్తా
యన . ఆం. భా. ౨. ౧౯౫.

౨. మంపు, మైకము.

ఉదా. నిద్దురమత్తు.

జ. మత్తెగిల్లు, మత్తిల్లు, మత్తైన.

**మత్తుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మదించిన వాఁడు. (శ. ర.)

**మత్తైన = మత్తిగాఁడు.** విశే. (√మత్తు.) కాముకుఁడు.

ద్వి. ఓరోరి బలభద్ర యోరిమైలార, మత్తైన లోఁబడె మన విప్రసహిత, మత్తలారులఁ బిల్వఁ డనునంతలోన.

పండితా. దీక్షా. ౪౧.

**మత్యము.** సం. వి. అ. న. ౧. పాపటము; దున్నివిత్తులు చల్లిన భూమిని చదునుచేయు సాధనము. ౨. దాత్రముష్టి, కొడవలి పిడి. (శే. ని.)

**మత్సర.** సం. వి. ఆ. స్త్రీ. మక్షిక, ఈఁగ.

**మత్సరము.** సం. వి. అ. పుం. ౧. అసూయ, ఓర్వలేమి. ౨. విరోధము, ద్వేషము. ౩. గర్వము. ౪. లోభము, పిసినారి తనము. ౫. క్రోధము, రోషము. ౬. ఆత్మ ధిక్కారము.

శ్లో. నిందంతి మాంసదా లోకాధిగస్తుమ మజీవనం, ఇత్యాత్మ నిభవేద్యస్తు ధిక్కారస్స చ మత్సరః. ౭. నిష్క్రియము. (శే. ని.)

**మత్సరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. అసూయ గలవాఁడు, పరుల సంపత్తిచూచి యోర్వనివాఁడు. ౨. పిసినారి యైనవాఁడు, లోభి.

**మత్స్యండి(ది).** సం. వి. ఈ. స్త్రీ. పారభూతమై ఘుటికయగు నట్లుకాఁచిన చక్కెర, కండచక్కెర.

**మత్స్యకరండిక.** సం. వి. అ. స్త్రీ. చేఁపల బుట్ట.

**మత్స్యగంధ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సత్యవతి; వ్యాసునితల్లి. ౨. పిటిపిప్పలి. ౩. మత్స్యాక్షి, పొన్నగంటికూర. వై. (వాచ. కల్ప.) ౪ జోడశరము. వై. (కల్ప.)

**మత్స్యగుఁడు.** సం. వి. ఉ. పుం. చ్యవన మహర్షి. (వై. ని.)

**మత్స్యఘంటము.** సం. వి. అ. పుం. ఒక దినుసు చేఁపలకూర.

**మత్స్యఘాతి.** సం. వి. న్. పుం. జాలరి, చేఁపలను చంపువాఁడు.

**మత్స్యహాతుఁడు.** సం. వి. అ. పుం. చేఁపలను జంపువాఁడు, జాలరి.

**మత్స్యజీవి.** సం. వి. న్. పుం. జాలరి. చేఁపలను బట్టి బ్రతుకువాఁడు.

**మత్స్యదేశము.** సం. వి. అ. పుం. మత్స్య నామక దేశము. ఒకానొకదేశము.

**మత్స్యధాని.** సం. వి. ఈ. స్త్రీ. చేఁపల బుట్ట.

**మత్స్యనాశకము.** సం. వి. అ. పుం. కురరము. ఒక విధమగు పక్షి.

**మత్స్యపిత్త.** సం. వి. ఆ. స్త్రీ. కటుకరోహిణి. వై.

**మత్స్యపురాణము.** సం వి. అ. న. పదునెనిమిది పురాణములలో నొకటి. మత్స్యావతారకథను ముఖ్యముగాఁ బ్రతిపాదించు పురాణము.

**మత్స్యబంధనము.** సం. వి. అ. న. చేఁపలను బట్టుకొనెడి గాలము.

**మత్స్యబంధని.** సం. వి. ఈ. స్త్రీ. చేఁపల బుట్ట.

**మత్స్యబంధి.** సం. వి. న్. పుం. చేఁపలను బట్టువాఁడు, జాలరి.

**మత్స్యబంధిని.** సం. వి. ఈ. స్త్రీ. చేఁపల బుట్ట.

**మత్స్యబంధుఁడు.** సం. వి. అ. పుం. చేఁపలను ఒట్టువాఁడు, జాలరి.

**మత్స్యము.** సం. వి. అ. పుం. ౧. చేఁప. ౨. మీనరాశి. ౩. ఒకానొక పురాణము.

**మత్స్యరంక(గ)ము.** సం. వి. అ. పుం జలమార్గవు ఒకజాతి నీటిపిట్ట, మీనవల్లంకి పిట్ట.

**మత్స్యరాజము.** సం. వి. అ. పుం. ౧. రోహితమత్స్యము, ఎఱ్ఱచేఁప.

**మత్స్యవేధనము.** సం. వి. అ. న. బడిశము, చేఁపలగాలము.

**మత్స్యవేధని.** సం. వి. ఈ. స్త్రీ. బడిశము, చేఁపలగాలము. ౨. జలమద్గువు.

**మత్స్యాక్షి.** సం. వి ఈ. స్త్రీ. ౧. గండదూర్వ. శ్రీ. ౨. పొన్నగంటికూర. శ్రీ. ౩. సోమదకూర. శ్రీ. (శ. ర.)

**మత్స్యాధాని.** సం. వి. ఈ. స్త్రీ. చేఁపలను ఒట్టువాఁడు చేఁపలను వేయుట కుపయోగించు కొనెడిబుట్ట, చేఁపలబుట్ట.

**మత్స్యావతారము.** సం. వి. అ. పుం. శ్రీ విష్ణుని దశావతారములలోను మొదటియవతారము.

**మత్స్యాశనము.** సం. వి. అ. పుం. చేఁపలను తినునది, మీనవల్లంకి పిట్ట.

**మత్స్యోదరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. సత్యవతి. ౨. కాశియందుఁగల తీర్థవిశేషము.

**మత్స్యోదరీయుఁడు.** సం. వి. అ. పుం. వ్యాసుఁడు. సత్యవతీపుత్త్రుఁడు.

**మథనము.** సం. విశే. (అ. ఈ. అ.) ౧. త్రచ్చునది. ౨. నశింపఁజేయునది. (సాధనము) వి. అ. న. ౧. త్రచ్చుట, చిలుకుట. ౨. ధ్వంసముచేయుట. చంపుట. పుం. గణికారికా వృక్షము, నెల్లిచెట్టు.

**మథి.** సం. వి. న్. పుం. కవ్వము.

**మథించు.** సం. స. క్రి. మథనముచేయు, త్రచ్చు.

(విష్ణువు) శా. . గృహీతాహీంద్రవృద్ధా నమం, దై చేసేత వథింపఁగాఁ దొడఁగొ గుద్గాంభోనిధిన్ భూవరా
వరాహ. ౩. ౬౦

**మథితము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. మథింపఁబడినది. ౨. పీడింపఁబడినది, బాధింపఁబడినది. ౩. చంపఁబడినది, నశింపఁజేయఁబడినది. వి. అ. న. నిర్జలతక్రము. నీరు కలియని మజ్జిగ.

**మథియించు.** సం. స. క్రి. మథించు, త్రచ్చు.

వ. ... సౌమ్యంబు నూత్నంబునైన తేజంబు గానం గడియైనదియు మథియింపఁ దత నంతరంబ
వరాహ. ౯. ౨౨.

**మథుర.** సం. వి. అ. స్త్రీ. యమునానదీతీరమునందు శ్రీకృష్ణుని జన్మస్థానమగు పట్టనము. (ఇది మోక్షదాయకము లగు నేడు పట్టనములలో నొకటి. ఇది శత్రుఘ్నునిచేఁ గట్టింపఁబడినది.

**మథురానాథుఁడు.** సం. వి. అ. పుం. శ్రీకృష్ణుఁడు.

**మథురేశుఁడు.** సం. వి. అ. పుం. శ్రీకృష్ణుఁడు.

**మదకట్టుఁడు.** సం. వి. అ. పుం. షండుఁడు, నపుంసకుఁడు.

**మదకరము.** సం. విశే. (అ. ఆ. అ.) మత్తు (కై పు.) కలిగించునది.

**మదకలము.** సం. విణ. (అ. ఆ. అ.) మదము చేత అవ్యక్తమధురమైనది. (వాక్కు.) వి. అ. పుం. మదపుటేనుఁగు.

**మదకోహలము.** సం. వి. అ. పుం. మదము పట్టినయెద్దు. (వై. ని.)

**మదగంధ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. మదిర, కల్లు. ౨. అతసి, అగిసె. శ.

**మదగంధము.** సం. వి అ. పుం. సప్తచ్ఛదము, ఏడాకులయరఁటి. శ.

**మదజలము.** సం. వి. అ. న. మదపుటేనుఁగు యొక్క గండస్థలము లు మొ. నుండి స్రవించెడి స్రావము, మదోదకము.

శ్లో. కరాత్కటాభ్యాం మేఢ్రాచ్చ నేత్రాభ్యాంచమదస్రుతిః.

**మదట.** విణ. (సం. మదః.) (క. మదర.)

౧. మఱిగించినది; మత్తుఁడు.

సీ. మదటగాలివయాళిమాన మాయనికుమారి కలు పుష్పాడు లావరించుకొనిరి .
వేం. పంచ. ౪. ౧౫౯.

౨. మూర్ఖుఁడు మూర్ఖము.

గీ. ధర్మమున కొండుకడ కేగుదము దురాత్మ మగుడు మదటయుఁ గనలి యమ్మదట కశము. వేం. పంచ. ౩. ౧౨౨.

౩ సోమరి, అలసుఁడు.

సీ. మదటతొండురు తొండు మదల మాలుగుఁ బోతు చండి సోమరి నలితిండికాఁడు, దుండుబలి యనంగఁదోఁచుఁ బ్రాల్మానిన వానిపే రై . ఆం. భా. ౩. ౭.

వి. మత్తత. (చూ. మదటగోను.)

జ మదటగోను, మదటతనము.

**మదటగోను.** అ. క్రి. (మదట + కొను.) మత్తతగోను.

సీ. ... కదురుచన్గుబ్బల మదటఁగోనుచు.
సాంబో. ౧. ౧౭౪.

**మదటతనము.** వి. (√మదట) మూర్ఖత్వము.

సీ. అత్యుదారుని రాజు నాత్మీయుకళ లిచ్చి మదిఁ గృశింపఁగఁజేయు మదటతనము.
మ. చ. ౨. ౩౭.

క. ఇది నాయది నాకొ, సదనము నీ కిందు నిల్వఁ జనునె దురాత్మా, మదటతన ముడిగి యెంతేఁ గదలుము లెమ్మనిన దీర్ఘకర్ణుం డనికోమన్. వేం. పంచ. ౩. ౧౧౦.

**మదన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సుర, కల్లు.

**మదనకంటకము.** సం. వి. అ. పుం. ౧. మన్మథవికారముచేఁ బుట్టిన గగుర్పాటు.

**మదనకము.** సం. వి. అ. పుం. ౧ దమనక వృక్షము. ౨. మదనము న. సిక్థకము, మైనము.

**మదనకాపరవము.** సం. వి. అ. పుం. కపోతము, పావురము.

**మదనకామధేనువు.** వి. మన్మథసుఖములనొసఁగు కామధేనువు.

క. . అ, వ్వనితబిగియారు కౌఁగిలి దినదిన మాను మదనకామధేనువు గాదే.
ఉ. హరి. ౨. ౯౦.

**మదనగంధులు.** సం. వి. ఇ. న. బ. ధాన్యవిశేషము, ఒకజాతివడ్లు.

సీ. ఇప్పపూరాజనా లేనుంగుకొమ్ములు మల్లె శ్రీగంధులు మదనగంధు, లు ...
హంస. ౪. ౧౭౮.

**మదనగృహము.** సం. వి. అ. న. ౧. యోని, ఉపస్థ. ౨. (జ్యోతి) లగ్నమునుండి యేడవ స్థానము.

**మదనచతుర్దశి.** సం. వి. ఈ. స్త్రీ. చైత్రశుక్ల చతుర్దశి.
(ఈ దినమున మన్మథోత్సవము చేయుదురు.)

**మదనచేయి.** వి. వి. ౧. మిఠాకడ్డీ.
సీ. పగడంపుముక్కులఁ బచ్చతెక్కల నిక్కు చిలుకల మదనచేతుల ఘటిల్ల.
రా. ఓ. ౪. ౭౫.
సీ. తను వెల్లఁ జల్లఁ గాఁ దనయు నక్కునఁ బొదువనిచేతులు మదనచేతులు
చంద్రా. ౧. ౫౩
౨. కురుజులమీఁద నంచెడుపక్షి.
చ. రవియనుదివ్వెఁ గేతువుచెఱంగున మానిధుమోద్ధ్వయంత్రవా, రవిరళఘుశ్రీ కలరవాల్పరవోక్తుల వాంఛధూపరా, జివరనిశ వ్యగ న్మదనచేతులఁ జాతురి నెయ్యపుం గురుం, జెలిదలు దార్పవిష్ణుపద కొత్తుఁ బురిగృహలక్ష్మి నూత్న వాన్.
ఆము. ౨. ౧౭.

**మదనత్రయోదశి.** సం. వి. ఈ. స్త్రీ. చైత్రశుక్ల త్రయోదశి.

**మదనపక్షి.** సం. వి. న్. పుం. ఖంజనపక్షి, కాటుకపిట్ట.

**మదనపాఠకము.** సం. వి. అ. పుం. కోకిలము, కోయిల. (రా. ని.)

**మదనము.** సం. వి. అ. పుం. ౧. కస్తూరీమృగవృషణము, (శే. ని.) ౨. ఆమని, వసంతకాలము, ౩. తేనెటీఁగ, ౪. మయినము, ౫. ఆశ్లేషవిశేషము, కౌఁగిలింతలలో నొకభేదము. ౬. మంగచెట్టు, ౭. దత్తూరవృక్షము, ఉమ్మెత్తచెట్టు ౮. ఖదిరవృక్షము, చంద్రచెట్టు, ౯. వకుళవృక్షము, పొగడచెట్టు. ౧౦. పక్షి. (వై. ని.) న. మత్తు కలుగఁజేయుట, సంతోషపఱుచుట.
విణ. (అ. ఆ. అ.) ౧. మత్తెక్కించునది. ౨. సంతోషపఱుచునది, ఉల్లాసపఱుచునది.

**మదనరిపువు.** సం. వి. ఉ. పుం. శివుఁడు.

**మదనలేఖ(ము).** సం. వి. అ. పుం. శృంగార నాయికానాయకులు పరస్పరము వ్రాసికొను జాబు.

**మదనశలాక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. శారిక, గోరువంక. ౨. కామోద్దీపకౌషధము.
(వై. ని.)

**మదనసరులు.** వి. వి. బ. ధాన్యభేదము.
వ. .. గంధసరులు మద్దిగంధ్రలు రేఖామూలు కాంభోదులు మదనసరులు జిలమబుడుతలు. ప్రబంధ. ౧౧౭.

**మదనాంకుశము.** సం. వి. అ. పుం. ౧. లింగము, శిశ్నము. మగగుఱి (త్రి. ని.) ౨. వ్రేలిగోరు.

**మదనాంతకుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**మదనాగ్రకము.** సం. వి. అ. పుం. వ్రీహిభేదము, కోద్రవము. అర్లు.

**మదనాయుధము.** సం. వి. అ. న. ౧. యోని, ఉపస్థ. ౨. మన్మథుని యాయుధము. (అందకత్తెను వర్ణించునపుడు ఇట్లు చెప్పఁబడును.)

**మదని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. సుర, మద్యము. (శే. ని.) ౨. కస్తూరి. ౩. అతిముక్తలత, బండిగురివెంద. ౪. (రా. ని.) ౪. జవ్వాది పిల్లి. (శ. ర.)

**మదను.** వి. గర్వము, పొగరు.

క. మదనా నీదాడికి మే, మదనా మదనాగ
యాన వలయింతు రె మ, ర్మదనారీకాంబ
కముల మదనారకభ క్తిశ క్తి మద నాబ
దనా. రా. వి. ౪. ౫౮.

**మదనుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు.

**మదనేచ్ఛాఫలము.** సం. వి. అ. న. చూత విశేషము, ఒకజాతి మామిడి. శ.

**మదనోత్సవ.** సం. వి. ఆ. స్త్రీ. అప్సరస.

**మదబృందము.** సం. వి. అ. పుం. ఏనుఁగు, కరి. (వై. ని.)

**మదమడఁగించు = మదమడఁచు.** మి. స. క్రి. (√ మదమడఁగు.) చంపు.

క. . పాండుకుమారా, ళ్కురమున్ దత్సే
నలన్ మదం బడఁగింతున్.
భార. భీష్మ. ౩. ౧౩౪.

**మదమడఁగు.** మి. అ. క్రి. (మదము + అడఁగు.) బలహీనుఁడగు.

౩. మదిమడఁగి యొక్కరుండున, గద చేకొని
రాజరాజు కొల్నడ నెటవో, మదిఁ
దలఁచి . .
భార. శల్య. ౨. ౩.

**మదమడఁచు = మదమడగించు.** మి. స. క్రి. (√. మదమడఁగు.) చంపు.

క. విను తత్సైన్యముల నీరితిన్, మదమడఁచి
కృష్ణపార్థుల, నెదురం బొడగాంచి సుగ్రీఁ
డి ట్లని పలికెన్. జై. భా. ౫. ౫౮.

**మదమత్తకము.** సం. వి. అ. పుం. ఉమ్మెత్త. శ. (వై. ని.)

**మదము.** సం. వి. అ. పుం. ౧. ఉన్మాదము యొక్క ప్రథమావస్థ, మత్తు, మత్తత. ౨. ఏనుఁగు గండస్థలమునుండి స్రవించెడిక్రొవ్వు. ౩. గర్వము, దురహంకారము ౪. పరమానందము, అమితసంతోషము. ౫. మద్యము, సుర. ౬. కస్తూరి. ౭. శుక్రము, పురుష వీర్యము. ౮. అందమగువస్తువు, సుందరపదార్థము ౯. గంధము.

**మదముమీఱు.** మి. అ. క్రి. మదించు, క్రొవ్వు.

క పెకలించి యిచ్చినఁ జాలుం, బ్రకటిత
దోశ్శక్తి జెండుదలెఁ దచ్చెద వే, మొక
రాకర మె యని గ్రైత్య, ప్రకరమ్ములు
మదము మీఱి పలుకఁగ వించున్ ..
దశా. ౨. ౧౩౭.

**మదమెత్తు.** మి. అ. క్రి (√. మదము) మదించు, గర్వించు.

క. . తన్ను నెదిరిని, మది నెఱుఁగక నిగ్ర
హించి మదమెత్తుట యొ, ప్ప దహంకారం
బానరిం, పక కొరవులేని దొల్లి పత్మిం
ద్రునకున్. భార. ఉద్యో. ౩. ౨౮౮.

**మదయంతి.** సం. వి. ఈ. స్త్రీ. ఒకజాతి మల్లె. శ.

**మదయిత్నువు.** సం. విశ. (ఉ.) ౧. మత్తు గలిగించునది. ౨. సంతోషపఱుచునది, ఉల్లాసకరము. ౩. కాండికుఁడు, సారాయి మొదలగునవి కాచువాఁడు. ౪. త్రాగుబోతు, మద్యపుఁడు. వి. ఉ. పుం. ౧. కామదేవుఁడు, మన్మథుఁడు. ౨. మేఘము. న. మద్యము.

**మదరాగము.** సం. వి. అ. పుం. కోడి. (విల్సన్సు.)

**మదరాగుఁడు.** సం. వి. అ. పుం. ౧. మన్మథుఁడు. (విల్సన్సు)

**మదల = మదట.** విశ. సోమరి.

సీ. మదట తొండొరు తొండు మదల మాలు
గుబోటు ... ఆం. భా. ౩. ౬.

**మదలేఖ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఏనుఁగు గండ స్థలములనుండి మదము కారుటవలన నేర్పడిన చాఱ. ౨. (ఛంద) ఒకానొక వృత్తము.

శ్లో. ... తక్సౌ గ స్స్యా న్మదలేఖా.

**మదళి.** వి. (త. పదళై.) క. మదళిగ.) బాలుఁడు, బాలిక.

ద్వి. మనికులు మనికులు మ్రాన్పడి తగుల,
మదళీలు మదళీలు మత్సరింపఁగ.
పండితా. పర్వ. ౩౫. పా.

**మదవారి.** సం. వి. ఇ. న. మదజలము. మదపుటేనుఁగు గండస్థలములనుండి స్రవించెడి స్రావ్వ.

**మదశాకము.** సం. వి. అ. పుం. ఉపోదకి, పెద్దబచ్చలి. కై.

**మదశౌండికము.** సం. వి. అన. జాజికాయ.

**మదసారము.** సం. వి. అ. పుం. తూల వృక్షము. ప్రత్తిచెట్టు.

**మదస్థానము.** సం. వి. అ. న. కల్లుపాక.

**మదహత్తి.** మి. వి. (సం. మదహస్తీ.) (ప్రా. మదహత్థి.) మదపుటేనుఁగు.

గీ. అచటిరొుక పాటిదొర మదహత్తులకును,
నెత్తుగున్నలు దిక్కులమత్తకరలు .
పాంచా. ౧. ౩౯.

(శ. ర. పా. మదహస్తులకును. ముద్రి పా.)

విణ. శ్రేష్ఠుఁడు; శ్రేష్ఠము. (ఈ యర్థమున తఱచు సమాసోత్తర పదముగా నుండును.)

గీ. ... మదహత్తి యనఁగఁ, దైకడను నిల్చి
శ్రేష్ఠ మై పరగుచుండు.
ఆం. భా. ౩. ౧౫.

**మదహస్తిని.** సం. వి. ఈ. స్త్రీ. మహాకరంజము, పెద్దక్రానుగు. కై.

**మదహేతువు.** సం. వి. ఉ. పుం. ధాతకి, ఆరె. కై.

**మదాంబరము.** సం. వి. అ. పుం. ఐరావతము, ఇంద్రునియేనుఁగు. (త్రి. ని.)

**మదాఢ్య.** సం. వి. ఆ. స్త్రీ. రక్తఝింటి, ఎఱ్ఱ గోరఁట. కై.

**మదాఢ్యము.** సం. వి. అ. పుం. తాఁటిచెట్టు.

**మదాత్యయము.** సం. వి. అ. పుం. ఎక్కుడుగాఁ ద్రాఁగుడువలనఁ గలుగురోగము

**మదామ్నాతము.** సం. వి. అ. పుం. ఏనుఁగు వీఁపుపైనుండెడి డిండిమమను వాద్యవిశేషము.

**మదారము.** సం. వి. అ. పుం. ౧. మదపుటేనుఁగు. ౨. వరాహము, అడవిపంది ౩. సుగంధద్రవ్యవిశేషము.

**మదారుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కాముకుఁడు, జారుఁడు. ౨. మోసగాఁడు, వంచకుఁడు. ౩. అలసుఁడు, సోమరి. (కే. ని.)

**మదాలాపి.** సం. వి. న్. పుం. కోయిల, కోకిలము.

**మదాళించు.** అ. క్రి. (త. మదాళి.) పుష్పించు.

సీ. సంపెఁగల్ వికసించె జాదుల్ మదాళించె
గోరంట తిలకంబు గుత్తులెత్తె.
వాల్మీ. ౩. ౧౧౦.

**మదావళము.** సం. వి అ. పుం. ఏనుఁగు, గజము. (శ. ర.)

**మదాహ్వము.** సం. వి. అ. పుం. కస్తూరి. (త్రి. ని.)

**మది.** వి. (సం. మతిః = శ. వ.ది.) ౧. బుద్ధి.

క. .. అనిమ మని దానిం, గొనఁగా మది సమకట్టి ... భార. ఆది. 3. ౭౯.

చ. మది మదిఁ దప్పి లోయి మునిముఖ్య .. ఆము. ౬. ౧౧3.

౨. మనస్సు.

శా. జేజే యంచు భజింతు నిష్టఫలసంసిద్ధుల్ మదింగోరి నైష. ౧. ౪.

క. గారవమున సకలకళా, పారీణుఁడ నైతిఁ గవిఁడిపల్లెర మైనరా, జేరపగఁ బోటు వలె నని, చేరితి నిను నాదుకోర్కి-చింతింపు మదిన్.

విక్ర. ౧. ౧౧౧. హంసవి. ౧. ౫.

ఆ. ఒప్పు హృదయసంజ్ఞ యుల్లంబు మది డెంద, మెడఁద ... మన సన . ఆం. భా. ౧. ౧౦౦.

3. ఇచ్ఛ, కోరిక.

గీ. అమ్మ విను మింక నొకయించు కంతకడవు, నీ చెలువుఁ జూడ నీ పేరు నీ సెఱంగు, వడిఁ పరికింప మది నన్నునైన వాఁడు రాకమును నీవు తొలఁగుట నాకుఁ బ్రియము కళా. 3. ౭౪.

క. కూరిమితనూజునకు శా, స్త్రోరూఢికా నామకరణ మమరించుమదిన్. ఇందు. ౨. ౧౨.

జ ∙ మదికొలంకుపులుగు, వ దిమది.

**మది.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. చషకము. (త్రాగడీగిన్నె, పానపాత్రము.) ౨. కృషిసాధనము. కృషికుపయోగించు పనిముట్టు. (నాఁగలి మొ.) మత్యానస్థ. (శే. ని.)

**మదించే.** అ. క్రి. తలఁచు.

క. వేఁటాడ నొరలసన్నిధి, మాటాడ మదించు చెంచు మన్నీలకరం, బూటాడఁ జేయు వన్నెట, జూటాడగా యుండు నతఁడు చూచెదరె కదా. రా. వి. 3. ౫3.

౨. క్రి. మదింపువేయు (ఈ యర్థమునందు కొన్నిచోట్ల మతించు అని వాడెదరు. శ. ర.)

**మదించే.** సం. స. క్రి. క్రొవ్వు; గర్వించు.

ఉ. ఈ నొకపోటుబంటువలె సెన్ని దుడు కులు క్రేళి దోరిగు, ర్భావ మదించి మున్నటినృపాలుర యట్లనె న ద్దలంచితో. ఉ. రా. ౩. ౧౭౬.

మానిని. అంత మదింపకుమే యని పల్కిన నంత మదింపకుమే యనుచుకా కళా. 3. ౧౯౫.

**మదింపు.** వి. (√. వ దించు శ. మదిపు. త, ఎ. మదిప్పు.) ఇంత యని వెల మొదలగువాని నూహించుట. (శ. ర.)

**మదికొలంకుపులుగు.** వి. (√. మది.) మానస సరోవరపక్షి, హంస. పాం ని. తిర్య. ౬౬.

**మదిమది.** వి. (మది + మది.) ౧. నెమ్మది, శాంతి, నిశ్చింత.

చ. ఎద మడఁగించి భూపతిసమాజము నెల్లను నిన్నుఁ గొల్వఁ జే, యుదు వని పూని దిగ్విజయ మున్నటిఁ జేసి మహావిభూతితో, ఎ దిమది నుండ నీసుతుఁడు మంత్రులు సౌబలుజాదమాచ్చి సం, పద గొని యంతఁ బోవక సభఁ ద్రుపదాత్మజా భంగపెట్టరే. భార. ఉద్యో. 3. ౨౭౦.

చ. త్రిదశలు పెట్టిగేరు నిటు దివ్యపదంబు గ లంక నేలుచుకా, మదిమది నుండ లేక యొక మానుషసత్త్వము గాఁ దలంచి దు, ర్మదమున రాముపై నలిగి మాయల నమ్మ హితాత్ముఁడేవిఁడ, చ్చెద నని చూచెదే ... భా. రా. అర. ౨. ౧3.

చ. త్రిదశపతిం జయించి జగతీతల మంతయు నేలుచుండఁగా, మదిమది నుండి దానవసమాజము చేటునకై త్రిలోచనున్ గదనము వేఁడె. ఉ. హరి. ౫. ౪౩.

౨. అనాలోచనము, దూరదృష్టి లేకుండుట.

క. ఎదిరికి వచ్చినరాజ్యము, మదిమది నటు గోలుపోయి మానము దూలం, జదు లేది కావనమునకు, మదమునఁ జనుచెంచుకంటె మోసము గలదే.

భా. రా. యు. ౧౭౨.

**మదియించు.** సం. అ. క్రి. మదించు, క్రొవ్వు.

గీ. అద్రిరాముదియించిరాడంగు లందఱుఁ జదియఁగొట్టైదవంచుగద ధరించి.

వరాహ. ౧౧. ౧౦౩

**మదిర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. మద్యము, మత్తు గలిగించుసుర. ౨. ఒకదినుసు కాటుకపిట్ట. ౩. దుర్గ.

**మదిరనయన.** సం. వి. ఆ. స్త్రీ. మోహింపఁజేయు కన్నులుగల స్త్రీ, స్త్రీ.

**మదిరము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మత్తుగలిగించునది. ౨. సంతోషపఱుచునది, ఉల్లాసపఱుచునది. వి. అ. పుం. రక్తఖదిరవృక్షభేదము, ఎఱ్ఱపువ్వులుగలచండ్ర. శ.

**మదిరాక్షి.** సం వి. ఈ. స్త్రీ. మదముకప్పిన కన్నులు గలయాడుది, ఆఁడుది. (శ. ర.)

**మదిరాసఖము.** సం. వి. అ. పుం. మాతము, మామిడిచెట్టు.

**మదిరిణి.** వి. మణివిశేషము, పుష్యరాగము.

సీ. నిగరంపుఁ బగడంపు జిగి దొట్టు కొంగమట్టుం గారువ దిరిణి పింగిణీలు ..

ఉ. రా. ౭. ౩౯౭.

**మదిష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. మద్యము.

**మదీయము.** సం. విణ. (అ. ఆ. అ.) నాసంబంధమైనది.

**మదుగు(వు).** వి. (క. త మదగు.) చెఱువు మొ. వానినుండి నీరుపోవుమార్గము, జలస్రుతి.

(వ్యవ.) చెఱువులోని నీరుమదుగునుండి పాఱుచున్నది.

వ. .. శీకరపరంపరల చోదుగులు మదుగులు గొనినఁ జిదపనగుచుఁ జిదుకుచిదుకుమనురొంపులును

భాగ. ౧౦. పూ. ౭. ౫౬.

**మదువు[1].** వి. ఆకుపచ్చరంగు.

రగడ. కంటికగుజ్జరిమదువులు కొందలుగఁ, గలిగిన పలువన్నెల పుట్టజమ్ములు ..

కలిక. ౭. ౧౯౫.

**మదువు[2].** వి. పెట్టుబడి.

(వ్యవ.) వ్యాపారము మదువులేకున్న సాగదు.

**మదుము = మదుగు.** వి. చెఱువు మొ. వానినుండి నీరుపాఱెడి మార్గము.

(వ్యవ.) మదుము లెక్కువగుటచే మాయూరి చెఱువులో నిలువ నీరులేకున్నది.

**మదురు[1].** అ. క్రి. కమియు, మాఁగు, విగులఁబండు.

సీ. మదురంగఁ బండిన మాయూరఫలములు చెంచుకన్యలకుచశ్రీలఁ జెనయు ..

కాశి. ౧. ౯౧.

క. ఇది చిత్రమచటిపనసల, మదిరినమద్రసఫలాళి మధురససేవన్, ముదిమియుఁ జావులు ను నెఱుఁగక పదివేల్ సంవత్సరములు బ్రతుకుదురు ప్రజల్.

వరాహ. ౧౦. ౧౫౨.

గీ. మదురఁ బండిన దానిమ్మ ప్రానిపండ్లు,
శుక్తికై వడి విరిసినఁ జూచి విభుఁడు ...
తపతీ. ౧. ౨౫.

**మదురు²** = **మదుఱు.** వి. గోడమీఁదికప్పు.

సీ. పటికంపుఁ గంబముల్ పవడంపు బట్టెలు
వరకతరచితముల్ మదురు లమర .
భాగ. ౧౦. ఉ. ౭౦౨.

ద్వి. మందసంబుల చెంత మదురులపొంత
పండితా. దీక్షా. ౪౪. పా.

సీ. ... మదురు మగు లనఁ గుడ్యపాలిక నై
రొప్ప ఆం. భా. ౨. ౧౩.

**మదురుగోడ** = పైకప్పుగలగోడ.

గీ మదురుగోడల మెఱపు వాల్మగలరొఱపుఁ,
దనర వెలుఁగొంగు నాప్రోలు ధరణి
యందు రసిక. ౧. ౩౭.

ద్వి. జాలి నాతోడ నొజ్జలు సెప్పియున్న,
మాట నీ కెఱింగించి మదురుగో డైన,
దాఁటి పోరొద నింక దాపుర మేల
ద్వి. హరిశ్చ. ౧౦౪౦. పం.

**మదురువు.** వి. (సం. మదిరా.) ౧. మద్యము.

క. మదురువు గొని రొుడ్ లెఱుఁగక, మదా
కుల మనస్కులైన, మానవులకు, నిం
పొదవియుఁ ఓడికిల్లం గొని, చదివాఁ
బొడుచునేని యదియు సౌఖ్యం బగునే
నృసిం. ౪. ౭౭.

౨. మత్తు, మదము.

సీ. మదురువు గొని మాఱుమూలయుఁ కారనుఁ
బోతు నొడిసి కొమ్ములు పట్టి మడఁగఁ
ద్రోచి
హరి. పూ. ౪. ౧౫౫. నృసిం. ౨. ౧౧౯.

**మదులు** = **మదురు.** వి. (క. త. మదిర్.)
గోడమీఁదికప్పు.

ఆ. పాలి మున్నవారిపై నొల్కఁబూడిద,
మందు చల్లి పెద్దమదులు కొంత, కూలఁ
ద్రవ్వి రాచకూఁతు రుండెడి మేడ, కత్తి
రించినట్లు గంటు పెట్టి
ద్వా. ౧౦. ౧౭౨. ఆం. భా. ౨. ౧౩.

**మదోత్కట.** సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.

**మదోత్కటము.** సం. వి. అ. పుం. ౧. మత్తగజము, మదపుటేనుఁగు. ౨. పారావతము, పావురము. ౩. మధుమద్యము. (వై. ని.)
విణ. (అ. ఆ. అ.) ౧. మత్తెక్కినది, అవశ్యమైనది.

**మద్గురము.** సం. వి. అ. పుం. ౧. మత్స్యవిశేషము, బొమ్మడాయ ౨. ఖగము, పిట్ట. (వై. ని.) ౩. వైతాలిక స్త్రీయందు బ్రాహ్మణునకుఁ బుట్టిన సంకీర్ణజాతి.

**మద్గువు.** సం వి. ఉ. పుం. ౧. మద్గురము, బొమ్మడాయ. ౨. జలపక్షివిశేషము, నీటికాకి. ౩. వృక్షములందు చరించు జంతువిశేషము.

**మద్దతు.** వి. (క. మద్దత్తు. హిం. మదద్.) సాహాయ్యము, తోడ్పాటు.

క. అని యతఁడు వల్కఁగా నింద్రుని మొగ
ము జూచి నారదుఁడు మే లికన్,
మొనగాండ్రకు మద్దతుగ నని చేయఁగ
వేల్పుటొజ్జ నంపఁగ వలయున్.
మల్లపు. ౨. ౧౦.

సీ. . మద్దతు వెన్నాస తోడు.

గీ. పాటు . అన రాజులు సహాయమునకు.
పాం. ని. మాన. ౩౧.

**మద్ది.** వి. (క. మద్ది. త. మరుదు.) వృక్షవిశేషము, సాలము, అర్జునము. దే. (దీనిభేదము తెలమద్ది, ఇనుమద్ది, ఏఱుమద్ది. మొ.)

సీ. ... నిజోదరంబున దామయుతనిబద్ధ. మగు
నులూఖలము గయుం బెసఁగంగ సాకర్షించి
దని మందగమనికలని, జమిలి మద్దులతోడ
సంరంభమునఁ దగిలించి తాఁ దగులక లీల
రెంటినడుము గడచి నీల్గుటయును బడమి
దగులఁ గూల్గిలి కూలెఁ దివిజులు . .
పారి. పూ. ౫. ౨౪౩.

క. మద్దుల తక్కురి ఒడ్డఁడు, మద్దులఁ
గూల్పంగఁ దలఁచి మసలక తా నా, మద్ది
కవ యున్నచోటికి, గ్రద్దన త్రో లీడ్చు
కొనచుఁ గడఁకం జనియెన్.

భాగ. ౧౦. పూ. ౪౦౦. పి. శకుం. ౨. ౧౪.

(సా.) మద్దులు మునిఁగి పాలవెంపల్లు తమ
కెంత బాటియనుట. (గొప్పవారి కసాధ్య
మైనపని కొద్దివారికెట్లు సాధ్యమగు
ననుట.)

గీ. వీరరస సారసాకార విహరణంబు, విష్ణు
నకు నొప్పు నతనితో విగ్రహింప, దొర
కొనిన వచ్చు మనకు మద్దులు మునింగి,
పాలవెంపల్లు తమ కెంతబంటి యనుట.
ఉ. హరి. ౪. ౧౨౪.

జ మద్దికాయలు, మద్దిగంద్రలు.

**మద్దికాయలు.** వి. ఇ. మద్ది + కాయలు.
(వృత్తియందు బహువచన లోపము కూడనగు.)
బాలుర చెవితమ్మియందు ధరించు నొకనగ.
(ఇది మద్దిచెట్టు కాయనుబోలి యుండు.)

సీ. వెలిదామరలఁ బోలువెసఁద్ర కొల్గిన్నెలు
మద్దికాయలతోడ నుద్దివడయ
కాశీ. ౩. ౨౪౦.

చ. లోకలోక మాటలు న్నొసల దుంపెస
లాడెడు నుంగరంపు వెండ్రుకలును మద్ది
కాయలు కదం గదులాడఁగ ఇం
పొదవుఁ గా సుతుబాల్యము తండ్రి కెంత
యుణ్ కవిరా. ౨. ౪౭.

చ. విడి గలమద్దికాయకద కనుల సొంపు
ఘటింపఁ దప్పుత, ప్పడుగులు వెట్టురా
కొమరుఁ దాదట దాదులు కేలుపట్టఁగన్.
చంద్రా. ౨. ౮.

**మద్దిగంద్రలు.** వి. బ. (√మద్ది) ధాన్య విశే
షము.

వ. .. కటకసరులు రత్నసరులు జీగిసరులు
రాయసరులు పచ్చదినసరులు గంధసరులు
మద్దిగంద్రలు ప్రబంధ. ౧౧౨.

**మద్దిలియ** = మద్దెలవాఁడు.

వ. పౌరాణికులకు అధ్యక్షు లుందనకు
(?) అవజేందు దాడపోజు బామెకు ౬
వీరి మద్దిలియ వంశెకు ౪ వీరి మద్దిలియ
కేసెకు .. ద. శా. ౪. ౬౭౭.

**మద్దిలియకారుఁడు.** వి. మద్దెల వాయించు
వాఁడు.

వ. ఈ దేవర పూజారికి ౩. పౌరాణి
కులకు ౪. నట్టవోజుకు ౬ మద్దిలియకారు
౨ కుకు ౬ వంశకారు ..
ద. శా. ౪. ౬౬౩.

**మద్దెల.** వి. (సం. మర్దలః ప్రా. మద్దలో. క.
మద్దలె.) వాద్యవిశేషము, మృదంగము.

ద్వి. దిమిదిమి యనుచు మద్దెల మ్రోయుపాట,
లమర నారీమణు లాడుచందమున
రం గా. కిష్కిం. ౨౧౯. పొ. ౧౭. పం.

మ. అలపర్జన్యుఁడు కేకిపాత్రములగుం పాడిం
చుచో మేఘమండలపున్ మద్దెల గ్రుంగ
లేవను మరున్మార్దంగికుం డక్షి న్నొ, త్త
లలిన్ నేలకు వ్రాలుచు న్నెగయుచుం
దారాడు నత్తెల్లజ, ల్లులుఁ గంగుచ్చులు
నర్యో ధారలునై దల్లోలేంద్ర గోపం
బులున్. ఆము. ౪. ౯౨.

సీ. ... మద్దెల యనఁ దగు మర్దళంబు ...
ఆం. భా. ౧. ౧౭౮.

జ: మద్దెలకాఁడు, మద్దెలకొక్కు, మద్దెలరూపు రిక్క, మద్దెలీఁడు.

**మద్దెలకాఁడు.** వి. (√మద్దెల) మద్దెలవాయించు వాఁడు, మార్దంగికుఁడు.

వ. ... మద్దెలకానికిఁ ౨. (వృత్తి)చే .
శా. ౧౧౩౫.

ద్వి. మరుఁడు గాఁబోలు నీమద్దెలకాఁడు .
ప్రభు. ౨. ౨౭. పా. ౧౬. పం.

**మద్దెలకొక్కు.** విశే. (√మద్దెల) మద్దెల వాద్యము ననుసరించి చిందులుద్రొక్కు సామాన్య నటుఁడు.

ఉ. మారజిక ప్రయత్నమున మద్దెలకొక్కులు ద్రొక్క నాట్యముల్ ... గంధ. ౯.

**మద్దెలరూపురిక్క.** వి. (√మద్దెల) ధనిష్ఠా నక్షత్రము. (శ. ర.)

**మద్దెలీఁడు.** వి. (మద్దెల) మృదంగము వాయించు వాఁడు, మార్దంగికుఁడు, మద్దెలవాఁడు
సా. శా. ౩. ౧౭౬౪.

**మద్దెళసంచు.** వి. మల్లయుద్ధ విశేషము, పది రెండు దండలలో నొకటి.

వ. పాదలికదండ కుక్కుటపుదండ మద్దెళసంచు మొదలగు దండలును .
మల్లుపు. ౩. ౭౭.

గీ. దండ యనఁగను ముష్టి యుద్ధాదిమగతి,
మించు నందున మద్దెళసంచు మొదట,
కొన్ని భేదంబులు చెలంగు నన్ని డెలుప,
గ్రంథవిస్తర భయముచేఁ గాలకంర
ఆం. భా. ౨. ౨౦౯ ప్రా.ంధ. ౭౭.

**మద్యకీటము.** సం. వి. అ. పుం. కల్లునందు పుట్టు ఒక జాతి పురుగు.

**మద్యద్రుమము.** సం. గి. అ. పుం. వృక్షవిశే షము, జీలుగ. శ్రీ.

**మద్యపుష్ప.** సం. వి. ఆ. స్త్రీ. ధాతకి, ఆరె చెట్టు. శ్రీ.

**మద్యమండము.** సం. వి. అ. పుం. సారాయి మీఁది పొంగు.

**మద్యము.** సం. వి. అ. న. సుర, కల్లు.

**మద్యలాలసము.** సం. వి. అ. పుం. వకులము, పొగడ. శ్రీ.

**మద్యవాసిని.** సం. వి. ఈ. స్త్రీ. ధాతకి, ఆరె చెట్టు. శ్రీ.

**మద్యామోదము.** సం. వి. అ. పుం. వకుల వృక్షము, పొగడచెట్టు.

**మద్రంకరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) సంతోషము గలిగించువాఁడు; శుభమును కలి గించువాఁడు.

**మద్రకారుఁడు.** సం. వి. (అ. ఈ. అ.) సంతోషము గలిగించువాఁడు; శుభమును కలి గించువాఁడు.

**మద్రకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) మద్ర దేశనివాసి.

**మద్రము.** సం. వి. అ. పుం. ౧. ఒకానొక దేశము. ౨. సుఖము, ఆనందము. ౩. మంగ ళము, శుభము.

విశే. (అ. ఆ. అ.) ౧. సుఖముగలది. ౨. శుభముగలది. (కే. వి.)

**మద్రసుత.** సం. వి. ఆ. స్త్రీ. మాద్రి, పాండు రాజు రెండవ భార్య.

**మద్రాకరణము.** సం. వి. అ. న. గొఱుగుట, భద్రాకరణము.

**మద్రుఁడు.** సం. వి. అ. పుం. మద్రదేశాధిపతి. బ. మద్రదేశపుఁ బ్రజలు.

**మధుక.** సం. వి. అ. స్త్రీ. తిప్పతీఁగ. (శ. ర.)

**మధుకంఠము.** సం. వి. అ. పుం. కోకిలము, కోయిల.

**మధుకము.** సం. వి. అ. పుం. ౧. ఇప్ప. చె. ౨. పక్షివిశేషము, కామిలి. ౩. యష్టిమధుకము. చె. న. ౧. తగరము. ౨. అతిమధురము, యష్టిమధుకము. చె.

**మధుకరము.** సం. వి. అ. పుం. ౧. తుమ్మెద. ౨. తియ్యనిమ్మ. చె. ౩. గుంటగలిజేరు. చె.

**మధుకరుఁడు.** సం. వి. అ. పుం. కాముకుఁడు, జారుఁడు.

**మధుకరటి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. తియ్యనిమ్మ. చె. ౨. ఒకజాతి ఖర్జూరవృక్షము.

**మధుకుఁడు.** సం. వి. అ. పుం. వంశావళి చదువు నొకజాతివాఁడు. (వై. వి.)

**మధుకుక్కుటి.** సం. వి. ఈ. స్త్రీ. ఉమ్మెత్త. చె.

**మధుకృత్తు.** సం. వి. త్. పు. తుమ్మెద.

**మధుకేశటము.** సం. వి. అ. పుం. మధుకరము, తుమ్మెద. (త్రి. వి.)

**మధుకోశము.** సం. వి. అ. పుం. తేనెపట్టు.

**మధుక్రమము.** సం. వి. అ. పుం. పలుమాఱులు కల్లుత్రాగుట.

**మధుక్షీర(క)ము.** సం. వి. అ. పుం. ఖర్జూరవృక్షము.

**మధుగాయనము.** సం. వి. అ. పుం. పికము, కోకిలము.

**మధుగ్రహము.** సం. వి. అ. పుం. దేవతయెదుట బలియిచ్చిన దానిమీఁదగాని క్రిందఁగాని తేనెపోయుట.

**మధుఘోషము.** సం. వి. అ. పుం. పికము, కోకిలము.

**మధుచ్ఛందము.** సం. వి. అ. పుం. వ్యాఘ్రపాత్తు, పుల్లవెలఁగ. చె. (వై. వి.)

**మధుజ.** సం. వి. అ. స్త్రీ. ౧. కలకండము, శర్కరాభేదము. ౨. భూమి.

**మధుజంబీరము.** సం. వి. అ. పుం. ఒకదినుసు నిమ్మచెట్టు, తియ్య నిమ్మ. చె. బత్తాయి నారింజ. చె.

**మధుజము.** సం. వి. అ. న. మయినము.

**మధుజిత్తు.** సం. వి. త్. పుం. మధు వను రాక్షసుని జయించినవాఁడు, విష్ణువు.

**మధుతృణము.** సం. వి. అ. పుం. న. చెఱకు, ఇక్షువు. చె. (త్రి. వి. వై. వి.)

**మధుత్రయము.** సం. వి. అ. న. నేయి, తేనె, పంచదార అను మూఁడు పదార్థములు.

**మధుదూతము.** సం. వి. అ. పుం. మామిడిచెట్టు.

**మధుద్రుమము.** సం. వి. అ. పుం. ౧. మామిడిచెట్టు. ౨. ఇప్ప. చె.

**మధుద్విట్టు.** సం. వి. ష్. పుం. విష్ణువు.

**మధుద్వేషుఁడు.** సం. = మధుద్విట్టు.

**మధునిషూదనుఁడు.** సం. వి. అ. పుం. మధు వను రాక్షసుని జంపినవాఁడు, విష్ణువు.

**మధుపటలము.** సం. వి. అ. న. తేనెపట్టు.

**మధుపము.** సం. వి. అ. పుం. ౧. భ్రమరము, తుమ్మెద. ౨. తేనెటీఁగ.

**మధుపర్కము.** సం. వి. అ. పుం. పెరుగు, నేయి, నీరు, తేనె, పంచదార యనునైదు వస్తువుల సముదాయము. (కన్యాదాత యింటికిఁ బెండ్లికుమారుఁడు వచ్చినపుడు ఆ వరునకున్ను, గృహస్థులు అతిథికి నిచ్చెడి గౌరవ పూర్వకమగు నుపహారము.)

**మధుపర్ణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. నీలిచెట్టు. ౨. తిప్పతీఁగ.

౩. గంభారి, గుమ్ముడు. †.

**మధుపుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) త్రాగు బోతు, మద్యపుఁడు

**మధుపుష్పము.** సం. వి. అ. పుం. ౧. అశో కము. ౨. వకులవృక్షము, పొగడచెట్టు. ౩. దంతివృక్షము. ౪. శిరీషవృక్షము, దిరిసెన చెట్టు. †.

**మధుప్రియుఁడు.** సం. వి. అ. పుం. బల రాముఁడు. (శ్రీ. ని.)

**మధుఫలము.** సం. వి అ పుం. ఒక విధమగు కొబ్బరిచెట్టు. †.

**మధుఫలిక.** సం. వి. అ. స్త్రీ. ఒక దినుసు ఖర్జూ రపుఁజెట్టు. †.

**మధుబహుల.** సం. వి అ. స్త్రీ. మాధవీలత, పూవుగురివెంద. †.

**మధుబోలము.** సం. వి. అ. పుం. మాధుర్యము, పులుపు, ఉప్పు అను రసత్రయము కలియఁగా నేర్పడిన రసము. (వై. ని.)

**మధుమక్షిక.** సం. వి. అ. స్త్రీ. తేనెటీఁగ. (ఇది కంధరాదులలోనిది.) పాండు. ౪. ౨౫౪.

**మధుమజ్జనము.** సం. వి. అ. పుం. అఖో టము, కొండగోఁగు.

**మధుమల్లి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. మాలతీ లత, జాజి. †.

**మధుమస్తకము.** సం. వి. అ. న. తేనె, గోధుమపిండి, నూనె, నెయ్యి యనుపదార్థ ములు కలిపి చేయఁబడిన మిఠాయివస్తువు.

**మధుమాలకము.** సం = మధుబోలము. (వై. ని.)

**మధుమేహము.** సం. వి. అ. పుం. మూత్ర రోగవిశేషము. (శ. ర.)

**మధుయష్టి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧ ఇక్షువు, చెఱకు. †. ౨. యష్టిమధుకము. †.

**మధుయష్టిక.** సం. వి. అ. స్త్రీ. అతిమధు రము, యష్టిమధుకము.

**మధుర.** సం. వి. అ. స్త్రీ ౧ అతిమధురము, యష్టిమధుకము. ౨. పులికడుగు. ౩. పాండ్య దేశపు రాజధాని మధురా నగరము. ౪. సదాప. †. ౫. అడవి సదాప. †. ౬. ఒకజాతి మాదీఫలము ౭. మేద. †. (వై. ని.)

**మధురకంటకము.** సం. వి. అ. పుం. మత్స్య భేదము, ఒకజాతిచేప.

**మధురజంబీరము.** సం. వి. అ. పుం. ఒక దినుసు నిమ్మచెట్టు. †.

**మధురత్రయము.** సం. వి. అ. న. మధు త్రయము తేనె, పంచదార, నేయి, యను మూఁడు మధురపదార్థములు.

**మధురఫలము.** సం. వి. అ. పుం. ఒకదినుసు రేఁగు, రాజబదరము. †.

**మధురము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. తియ్యనిది. ౨. ఇంపైనది, మనోహరమైనది ౩. శోభనము.

వి. అ. పుం. ౧. ఎఱ్ఱచెఱకు. శ్రీ. ౨. శాలి, వరి శ్రీ. ౩. శర్కరలో నొకవిధము. ౪. జీలకఱ్ఱ, జీరకము. ౫. ౧. విషము. ౨. తగరము. ౩ కాంజికము, పులికడుగు. (శే. ని.) ౪. యష్టిమధుకము. (వై. ని.)

**మధురములు.** సం. వి అ. పుం. బ. ధాన్య విశేషము.

క. . పసుపుముద్దలు, మంచివిరలు రంభ చెక్కుళ్లు చిలకముక్కులు మధురములు చామరాలు . ప్రబంధ. ౧౧౨.

**మధురస.** సం. వి. ఆ. స్త్రీ. ౧ ద్రాక్షలత. ౨. చాగ. శ్రీ. ౩. పిన్నపాల. శ్రీ. (శ ర) ౪. మృగశృణ్ణ, ఎండమావులు (శే. ని.)

**మధురసము.** సం. విశే. అ. ఆ. అ తియ్యనిది. వి. అ. పుం. ౧. ద్రాక్షలత. ౨. ఇక్షువు. చెఱకు. శ్రీ. ౩ మాధుర్యము.

**మధురస్రవ.** సం. వి. ఆ. స్త్రీ. పిండఖర్జూరి, ముద్దఖర్జూరము. శ్రీ.

**మధురస్వనము.** సం. వి. అ. పుం. శంఖము.

**మధురామ్లకము.** సం వి. అ. పుం. ౧. ఆమ్రాతకము, అంబాళము. శ్రీ. ఒక జాతి లేశె. (వై. ని.)

**మధురించే.** సం. అ క్రి. మధురమగు.

సీ. మదసారభంబులు మధురింప నెడఁజేయు గంధవాసనలకు గర్వమొసఁగ .
భా. రా. యు. ౯౭౨.

(ఇట ఘ్రాణతర్పణమగు అని భావము.)

**మధురిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. మంజిటి. శ్రీ. అడవిసదాప. శ్రీ. (శ. ర.)

**మధురికము.** సం. వి. అ. పుం. ౧. పిలసాలము, వేగిస. శ్రీ.

**మధురిపువు(డు).** సం. వి. ఉ. పుం. మధువను రాక్షసునకు శత్రువు, విష్ణువు.

**మధురిమ(ము).** సం. వి. న. పుం. మాధుర్యము.

**మధులగ్నము.** సం. వి. అ. పుం. మధుశిగ్రువు, ఎఱ్ఱ మునగ. శ్రీ.

**మధులిక.** సం. వి. ఆ. స్త్రీ. నల్లఆవాలు చెట్టు. శ్రీ

**మధులిహము.** సం వి. హ. పుం. మధుపము, తుమ్మెద. (రూ. మధులిట్టు.)

**మధువనము.** సం. వి అ న ౧ మధువను రాక్షసుఁడు నివసించినవనము. (ఇచ్చట నే శత్రుఘ్నుఁడు మధురానగరము స్థాపించిన వాఁడు) ౨ తేనెపట్లు హెచ్చుగా నుండెడు, సుగ్రీవుని వనము. పుం. కోకిలము, కోయిల.

**మధువల్లి.** సం. వి. ఈ. స్త్రీ. అతిమధురము, యష్టి మధుకము. శ్రీ.

**మధువాక్కు.** సం. వి. చ్. పుం. స్త్రీ. మధురవాక్కులుగలది. కోయిల, పికము. (శే. ని. వై. ని.)

**మధువారము.** సం వి. అ. పుం. తఱచు త్రాగుట, అతిపానము.

**మధువీ(బీ)జము.** సం. వి. అ. పుం. దాడిమ వృక్షము, దానిమ్మచెట్టు.

**మధువు.** సం. విశే. ఉ. ౧ మధురము, మనోహరము, ఇంపైనది. వి. అ. న. ౧. తేనె. ౨. పువ్వురసము, మకరందము, పూఁదేనె. ౩. ఒకవిధమగు మద్యము. ౪. జలము, ౫ పంచదార. ౬. మాధుర్యము, తీపి. ౭. పాలు. పుం. ౧. వసంతకాలము, వసంతఋతువు. ౨. చైత్రమాసము. ౩ విష్ణునిచేఁ జంపఁబడిన యొకానొక రాక్షసుఁడు. ౪. ఇప్ప. ౼. (వై. ని.) ౫ జీవంతి. ౼.

**మధువ్రత.** సం. వి. ఆ. స్త్రీ. శ్వేతగుంజ, తెల్లగురివెంద. ౼.

**మధువ్రతము.** సం. వి. అ. పుం. ౧. మధుపము, తుమ్మెద. ౨. ఫలాధ్యవృక్షము, పాలచెట్టు.

**మధుశిగ్రువు.** సం. వి. ఉ. పుం. ఎఱ్ఱమునగ. ౼.

**మధుశిష్టము.** సం. వి. అ. న. మయినము.

**మధుశేషము.** సం. వి. అ. న. మయినము.

**మధుశ్రవ.** సం. వి. ఆ. స్త్రీ. తెల్లగురిజ. ౼. (శ. ర.)

**మధుశ్రేణి.** సం. వి. ఈ. స్త్రీ. మూర్వ, చాఁగ. ౼.

**మధుష్ఠీలము.** సం. వి. అ. పుం. ఇప్ప. ౼.

**మధుసఖుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు. (వై. ని.)

**మధుసారథి** సం. వి. ఇ. పుం. మన్మథుఁడ. (వై. ని.)

**మధుసూదనము.** సం. వి. అ. పుం. మధుపము, తుమ్మెద.

**మధుసూదనుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

**మధుస్రవ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. యష్టిమధుకము, అతిమధురము. ౼. ౨. జీవంతి. ౼. పాలకూర. ౩. చాఁగ. ౼.

**మధుస్వరము.** సం. వి. అ. పుం. కోకిలము. కోయిల.

**మధుహానుఁడు.** సం. వి. ౼౼ పుం. విష్ణువు.

**మధూకము.** సం. వి. అ. పుం. ఇప్ప. ౼. న. అతిమధురము, యష్టిమధుకము. ౼.

**మధూచ్ఛిష్టము.** సం. వి. అ. న. మైనము.

**మధూత్థము.** సం వి. అ. న. మైనము.

**మధూత్థితము.** సం. వి. అ. న. మయినము.

**మధూపఘ్నము.** సం. వి. అ. న. మధువను రాక్షసుని నివాసము. మధురానగరము.

**మధూలకము.** సం. వి. అ. పుం. ౧. నీటియిప్ప. ౼. ౨. మాధుర్యము. తియ్యఁదనము ౩ మద్యము, కల్లు. (వై. ని.)

**మధూలము.** సం. వి. అ. పుం. ౧. మధూకము. ఇప్ప ౼. ౨. తేనె ౩. మాధుర్యము. మధురరసము. విశే. (అ. ఆ. అ.) మధురము. తియ్యనిది (శే. ని.)

**మధూలి.** సం. వి ఈ. స్త్రీ. మామిడిచెట్టు, ఆమ్రవృక్షము. ౼ ౨. యష్టిమధుకము. ౩. ఒకదినుసు దబ్బచెట్టు ౼.

**మధూలిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧ మూర్వ, చాఁగ. ౨. యష్టిమధుకము. ౼. (శే. ని.)

**మధూలికము.** సం. వి. అ. పుం. తీపి, కారము కలసిన రుచి (వై. ని.)

**మధూళి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. కల్లు. ౨. పూఁదేనె. (శ. ర.)

**మధ్య.** సం. వి. అ. స్త్రీ. ౧ నడిమిప్రేలు. ౨. లజ్జామన్మథ మధ్యస్థయు, ఉదితయావ నయౌనగు స్వీయనాయిక. ౩ ఒకానొక ఛందస్సు.

**మధ్యందినము.** సం. వి. అ. న ౧. మధ్యాహ్నము, పట్టపగలు.

ఋ. విను మా మధ్యమునందుఁ బ్రొద్దున శిరో
విన్యస్త పీఠాంక మై కనక స్తంభము పుట్టఁ
బుట్టి యినుఁ డాకాశంబుఁ బ్రాఁకంగఁ
దానును నాచొప్పునఁ జక్కఁగాఁ బెరిగి
ఘానుం జేరి మధ్యందినంబునఁ దద్బింబము
ముట్టి క్రమ్మఱి నటుం బ్రొద్దన్ దిగన్
జాఱఁగన్ ద్వా. ౭. ౧౧౫.

వ. మీకు మధ్యం దినకృత్యంబు లాచరింప
వలయు విజయంబేయుం డనిన.
భార. అర. ౨. ఆ. ౭౫.

పుం. బంధూకము, మంకెన. కీ.

**మధ్యందినీయము.** సం. విణ. (అ. ఆ. అ.) మధ్యాహ్న సంబంధి, పట్టపగటిది

**మధ్యగంధము.** సం. వి. అ పుం మామిడి చెట్టు.

**మధ్య దేశము.** సం. వి. అ. పుం. నడిమి ప్రదేశము, నడిమిచోటు. ౨. నడిమిదేశము. హిమవత్పర్వతమునకును వింధ్యపర్వతమునకును నడిమి నున్న దేశము.

**మధ్యమ.** సం. వి. అ. స్త్రీ. ౧. నడిమివ్రేలు, మధ్యాంగుళి. ౨. ఎమ్మర్త యాడిపిల్ల. ౩. తామరదుద్ద. కర్ణిక. ౪. మధ్యమనాయిక. (కావ్యములయందు వర్ణింపఁబడు నాయికలలో నొకనాయిక, నడిప్రాయమున నున్న స్త్రీ. ౫. ఒకజాతి సేరేదు కీ. ౬. వాగ్భేదము. (పరశ్యంతి, మధ్యమ, వైఖరి అనునవి వాగ్భేదములు.)

**మధ్యమపదము.** సం. వి. అ. వ. సమాసమున రెండు పదములకు నడుమనుండు పదము.

**మధ్యమపదలోపి.** సం. వి. న్. పుం. తత్పురుష సమాసభేదము. (ఇందు మధ్యమ పదము లోపించును శాకప్రియపార్థివుఁ డనుచోట మధ్యమపదమగు ప్రియ పదములోపించి శాకపార్థివుఁడు అను రూపమగును. ఛాయాప్రధాన తరువు ఛాయా తరువగును.

**మధ్యమపాండవుఁడు.** సం. వి. అ. పుం. పాండవులలో నడిమివాఁడు. అర్జునుఁడు.

**మధ్యమపురుషము.** సం. వి. అ. పుం. (వ్యాక) ప్రథమ మధ్యమోత్తమ పురుషములలో నడిమిది. (నీవు, మీరు కర్తలుగాఁ గలది.)

**మధ్యమభృతకుఁడు.** సం. వి. అ. పుం. వ్యవసాయము చేయువాఁడు, కృషీవలుఁడు.

శ్లో. ఉత్తమ శ్చాయుధీయో త్ర మధ్యమస్తు
కృషీవలః, అధమో భారవాహీ స్యా ది
త్యేష త్రివిధో భృతః.

**మధ్యమము.** సం. విణ (అ. ఆ. అ.) ౧. నడుము నున్నది.

ఉదా మధ్యమ లోకపాలుఁడు, మధ్యమరేఖ
మొ. ౨. పక్షపాతము లేనిది. వి. అ. పుం. ౧. (సంగీ) సప్తస్వరములలో నైదవ స్వరము. ౨. (సంగీ) ఒకానొక రాగము. ౩. మృగవిశేషము. ౪. మధ్యదేశము. ౫. (వ్యాక) మధ్యమ పురుషము. ౬. నడుము, కౌను.

**మధ్యమరాత్రము.** సం. వి. అ. పుం. నిశీథము, అర్ధరాత్రము, నడిరేయి.

**మధ్యమలోకపాలుఁడు.** సం. వి. అ. పుం. భూపాలుఁడు, రాజు.

**మధ్యమలోకము.** సం. వి. అ. పుం. భూలోకము.

**మధ్యమసంగ్రహము.** సం. వి. అ. పుం. పరస్త్రీకిఁ బువ్వులు మొదలగు కానుకలు పంపుటయను స్త్రీ సంగ్రహరూపని వాద భేదము. లేక, కూటయుక్తి.

శ్లో. ప్రేషణం గంధ మాల్యానాం ధూప భూషణ వాససాం, ప్రలోభనం చాన్న పానై ర్మధ్యమ స్సంగ్రహ స్స్మృతః.

**మధ్యమాంగులి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. నడిమి వ్రేలు.

**మధ్యమాహరణము.** సం. వి. అ. న. (గణిత) సమీకరణ భేదము.

**మధ్యమిక.** సం. వి. ఆ. స్త్రీ. సమర్తాడిన పిల్ల.

**మధ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. మధ్యస్థమైనది. నడుమనున్నది. నడిమిది. ౨. ఏపక్షమును జెందనిది, పక్షపాతము లేనిది. వి. అ. పుం. న. ౧. నడుము, మధ్యభాగము. ౨. (సంగీ.) లయ విశేషము. ౩. ఒకవస్తువు యొక్క లోపలి భాగము. ౪. విరామము, వ్యవధానము, అవకాశము. న. ౧. ఖర్వము. పదివేల లక్షల కోట్లు. ౨. మంచుకురియు సూర్యుని మూఁడువందల కిరణములయందు హ్లాదిని యను కిరణశతకము. (కే. ని.) ౩. మానమున అరత్ని ప్రమాణము తగ్గిన యేనుఁగు.

**మధ్యముఁడు.** సం. విణ. (అ. ఆ అ.) ౧. సామాన్యుఁడు, ఉత్తముఁడును అధముఁడును గానివాఁడు. (ఉత్తమాధమ మధ్యములు.) ౨. నడుమఁ బుట్టినవాఁడును, పెద్దవాఁడును చిన్నవాఁడును గానివాఁడు. ౩. పక్షపాతము లేనివాఁడు, నిష్పక్షపాతి. ౪. పుం. నాయిక కోపించునపుడు కోపానురాగముల వెల్లడింపని నాయకుఁడు.

**మధ్యయవము.** సం. వి. అ. పుం. ఉన్మాన విశేషము, ఆఱు తెల్లయావాల యొత్తు. (కల్ప.)

**మధ్యరాత్రము.** సం. వి. అ. పుం. నిశీథము, అర్ధరాత్రము, నడిరేయి.

**మధ్యవర్తి** సం. విణ. (న్. నీ. న్.) ౧. మధ్యస్థము, నడుమ నున్నది. ౨. రెండు పక్షములవారు చెప్పెడి వాదము విని తీర్పుచెప్పి కార్యము నెఱవేర్చువాఁడు

**మధ్యాహ్నము.** సం. వి. అ. పుం. మధ్యందినము, దివా భాగముయొక్క మధ్యకాలము, పట్టపగలు.

**మధ్వ.** సం. వి. న్. పుం. ౧. ఒకానొక ఋషి. ౨. క్రీడ. ౩. కాంతి. ౪. శిరస్సు. ౫. తృప్తి. (కే. ని.)

**మధ్వాధారము.** సం. వి. అ. పుం. మైనము.

**మధ్వామ్రము.** సం. వి. అ. పుం. ఒకదినుసు మామిడి, తియ్యమామిడి చె.

**మధ్వాలువు.** సం. వి. ఉ. న. ఒకజాతి దుంప. (చూ. ఆలుకము.)

**మధ్వాసవము.** సం. వి. అ. పుం. తేనెతోఁ జేయఁబడిన తియ్యని మద్యము.

**మధ్విజ.** సం. వి. ఆ. స్త్రీ. మద్యము, మత్తుగలిగించు త్రాగుడు పదార్థము.

**మధ్వుఁడు.** సం. వి. అ. పుం. మధ్వాచార్యుఁడు. బ్రహ్మ సూత్రములకు ద్వైతపర

ము౯ భాష్యము చేసినవాఁడు. ద్వైత మత స్థాపకుఁడు.

**మన.** స. బ (దీనికి ప్రథమా విభక్తిలో మనము, ద్వితీయా విభక్తిలో మనల౯, తృతీయాది విభక్తులలో మనచేత౯, మనలచేత౯, మొదలగు రూపములు నగును.) యుష్మదస్మదుభయార్థకము. నీవును, నేనును, మీరును, మేమును నర్థమిచ్చును.

ఉ. ఎన్నడు లావు గూడు మన కెన్నఁ డగున్ దశ  ఆము. 3. ౫౭.

గీ. అచట హితుఁ జూచి హరిహితుం డనియె మనల కిచట ప్రొక్కంగఁ జన దేవుఁ డెదురువచ్చె మునివచనభంగి రెండోకపని య గాఁగఁ దలిచెఁ గుండినమునకుఁ బోవ లయు మనము.

ద్వి. తనమదిలోన నెంతయు సంతసించి, తన నిన్నుఁ దప్పక తరవాత మనల, ధనము కాల్గింగ నెంతటిఘనుం డనుచు ..  ద్వి. పరమ. ౬. ౪౮౧. పా.

ఒకప్పుడు 'నేను' నకు మాఱుగా వాడఁబడి యహంభావమును సూచించును.

వ్యవ. మనకంటె ధనవంతుఁ డెవ్వడు.

**మనఃప్రభువుఁడు.** సం. వి. అ. పుం. తలఁపు చూలి, మన్మథుఁడు.

**మనఃపము.** సం. విశ. (అ. ఆ. అ.) మనస్సున కింపైనది.

**మననము.** సం. వి. అ. న. ౧. ఆలోచన, తలపోయుట. ౨. ధ్యానము. యోచన. ౩. తెలివి, జ్ఞానము. ౪. యుక్తులచేఁ బొందఁబడిన సిద్ధాంతము.

**మనమాఁడు.** అ. క్రి. (√మనము) ఒప్పారు.

సీ. కాలభైరవ యోగికంఠ కీలితము లై మనమారు నవశంఖమణుల నంగ ...  శివవిలాసము. ౧.

**మనము.** వి. (సం. మనః.) హృదయము.

రగడ. అనుచు నెమ్మది దాల్చి యలంకరించుకొని చేరి, వనవిల్తు దూఱ నందఱు మనంబునఁ గోరి  యయా. ౫. ౭౭.

ద్వి. ఒడ లెల్ల మన సె కా నొగిఁ జేయవయ్య, మృడుఁడ యంచుఁ దలంచు వడి మనంబారఁ.  పండితా. దీక్షా. ౬౩. పా.

క. మనమున నున్నది మొగమున, గనపట్టంగాన గట్టిగా మదిలోన, జ్ఞానభావ మునికి నపుడ, జ్ఞానభావము, మొగుమునందు సుదతికి నిల్చెన్.  విజ. వి. ౩. ౨౭.

జ మనమారు.

**మనము.** సం. వి. అ. పుం. జటామాంసి. ?.

**మనము.** చూ. మన.

**మనవి.** వి. విన్నపము, విజ్ఞప్తి.

ద్వి. అనుచు భయంబున నాతనితోడ, మనవి గాఁ జెప్పిన మతి వినకున్న  రం. రా. చాల. ౫౧. పా. ౧౬. పం.

సీ. నిరికిఁ బుట్టించి నెచ్చెలు కౌట మనవికి డాసె నా మకరకుండలము .  లమగ. ఆము. ౪. ౧౧.

గీ. మనవి యుక్తాలంగు విూ కనిన దడవి నవయ నేఁటికి.  రాఘవ. ౧. ౩౮.

(రామాయణార్థమున.)

**మనశ్శిల.** సం. వి. అ. స్త్రీ. ౧. మణిశల. ౨. పసుపు. (వై. ని.)

**మనశ్శిలము.** సం. వి. అ. పుం. మణిసిల.

**మనస.** సం. వి. అ. స్త్రీ. మనసాదేవి. కశ్యపుని పుత్రికయు సర్పరాజైనవాసుకి యొక్కతోఁ

బుట్టువును జరత్కారు వను మహర్షి యొక్క భార్యయు నగు మనసాదేవి.

**మనసగు.** అ. క్రి. (√మనసు) కోరిక గలుగు, అపేక్ష జనించు.

సీ. విను మేను ప్రాలుమాలిన దీపెనుడి గాక
కినిసిన రెండు గుగ్గిళ్లు గాక, తక్కిన నింత
గంధ ప్రసాదము గాక మనసైన నోకవడ
తునుక గాక   వి. ప్ర. ౫. ౧౯.

చ. కులమణికైన యన్నెలతకుఁ ... మించె
నూర్పులుఁ మనసయ్యె పెల్మిడికిఁ బుట్టెను
జాల వరోచకంబు.   రామా. ౩. ౯౪.

**మనసరి.** వి. (మనసు + అరి) మనస్వి, అభిమానవంతుఁడు.

క. అనయము నిజప్రచారం, ? నయము గాకుం
డ నచట నతిశౌర్యమునఁ, మనసరి యే
కేసరి యని, మనసరి రాకొమరుమాఁక
మను మనురీతిఁ.   రామా. ౧. ౧౩౪.

**మనసించు.** అ. క్రి. (√మనసు) మనస్కరించు, ఇష్టమగు.

ద్వి. మనసింప నాస్థానమండపంబునకుఁ, జను
దెంచి యున్నకు సద్భక్తి మ్రొక్కి, యొలమి
నాతఁడు చూప నర్హాసనమున, నెలమితోఁ
గూర్చుండి యేకాంత మెఱిఁగి .
రం. రా. యు. ౭౯౦. పా. ౧౪. ప.

క. వంచినతల యెత్తుట మన, సించక కర్పూర
తిలకయింటికిఁ బోయెన్ ...
కళా. ౧. ౨౦౬.

**మనసిచ్చు.** అ. క్రి. (√మనసు) గుట్టు చెప్పు, రహస్యమెఱిఁగించు.

క. మనసిచ్చిన దన కోడరు, చన విచ్చినఁ
బ్రజలు వెక్కసము చేయుదు రా, ట నృపతి
మనసీయక కడుఁ జన వీయక మెలఁపవలయు
సమ్ముఖచరులఁ.   కవిక. ౨. ౧౧౭.

**మనసిజుఁడు.** సం. వి. అ. పుం. ౧. మనోభవుఁడు, మన్మథుఁడు.

**మనసిడు.** అ. క్రి. (√మనసు) తలపుగొను, ప్రేమించు.

క. .. రుచిగొని సతి దన, వైపడనిచోట
మనసిడు, పాపపువిటుకంటె లంజ
బందయుఁ గలఁడే.   కవిక. ౪. ౧౧౫.

**మనసిశయుఁడు.** సం. వి. అ. పుం. ౧. మన్మథుఁడు.

**మనసు.** వి. (సం. మనః) ౧. చిత్తము, ఉల్లము

క. పాయవడి విభుని విడిచి ప, లాయనపరు
లైరి మనసులందుఁ దలఁకుచుఁ .
హరి. ఉ. ౪. ౩౧.

సీ. ఇంత నేరము సేయ నేకీతి మన సొగ్గ
మేటివస్తువుల నేమిట గొలంత ...
వి. ప్ర. ౫. ౪౬.

ఆ. ఒప్పు హృదయసంజ్ఞ యుల్లంబు మది
డెంద, మెడఁద యొడ్డ యాద యెద మన
సన   ఆం. భా. ౧. ౧౦౦.

౨. అనురాగము, వలపు.

సీ. అమ్మక చెల్ల చోద్యము గాక నామీఁద
మనసు పుట్టఁగ వాని కనుమ్రాగాక.
కువల. ౫. ౧౦.

క. కట్టుకొని వరునిఁ గనుచోఁ, బట్టవమునఁ
గలసమస్తభామల కహహా, యొట్టి విచి
త్రమొ మనసుఁ, బుట్టినవాఁ డపుడు
మనసుఁ బుట్టించెఁజుమీ ..
విజ. వి. ౧. ౧౫౬.

క. ప్రీతిని హేమావతిపయి, నాతిరుచ మనసు
నిలిపి యతివిరహార్తిం, జేతోజాతధనుర్భవ,
శాతశరవ్రాతపార చకితాత్ముఁడై.
హంస. ౧. ౩౦.

ద్వి. దినమణి దనపూర్వదిక్సతిమీఁద, మన
సెత్తి పదపాళి మఱవక మున్న ...
పండితా. పురా. ౭౮. పా.

౩. కోర్కి, అభిలాషము.

క. నాకుఁ గదన్నంబులపై, నేకాలము మనసు
పుట్ట దిపుడు పదార్థా, నీకము లెట్టెట్టివి
పరి, పాకము సేయించి తినినఁ జాల
స్తుత్యుండున్ . వి. పు. ౩. ౩౪౩.

౪. తలంపు, అభిప్రాయము, ఉద్దేశము.

క. మన సెఱిఁగి హృషీకేశుఁడు దన మనమున
నిద్దురాత్ముకలఁ బొప్ప దినీ, యనుచుం
బవనజా నద్దసఁ, జనకుండఁగఁ బట్టి లీల
సంభ్రమ లీలన్
భార. స్త్రీ. ౧. ౧౭౭.

విణ. ఇష్టము.

చ. జనవర నందను ల్గనఁగ సంతస మందిన
వారుఁ జూడ నీ, ధనువును వీరిమచ్చట
వితావితసేయుకు మన్న మాని వీ, మన
సనుచు న్విదేహ నృపమౌళి యనేకులఁ
బంప వారలున్ ...
దశా. ౭. ౧౯౯. ౧.

గీ. చదువుకొంటివి నీతిశాస్త్రంబు లెల్ల, నీ
వెఱుంగని పేరలు లేవు జగతి, నైనఁ
దెలిపితి నీమనసయ్యె యింక, ధాత వ్రాసిన
వ్రాఁతకుఁ దప్పఁ గలదె.
సారంగ. ౨. ౭౯.

మనసుపట్టు = మిన్నకుండు, ఊఱక యుండు.

గీ. మనసు పట్ట లేక యని మిషకోటితో, నరిగి
యుతనిఁ దాఁకి యని యొనర్చి .
హరి. ఉ. ౪. ౨౦౪.

మనసువచ్చు = నచ్చు, సమ్మతమగు.

ఆ. ... మీకు, మనసువచ్చి నన్ని దినములం
సలుపుఁ డి, చ్చోట నదియె మాకు శోభ
నంబు ... భార. విరా. ౧. ౨౦౩.

ఆ. ఎల్లభువనములను నేలుటకైనను, నిట్టిక్రూర
కర్మ మెట్లు సేయ, వచ్చుఁ గడఁగి యొదిరి
వా రేమి సేసిన, మాఱుసేయ నాకు
మనసుకాదు ...
భార. భీష్మ. ౧. ౧౭౫.

గీ. తనదు చిన్నెలకై యూసఁ దడవుసేయ,
నడుగ వచ్చిన మనసు రానట్టివారి, రట్టు
గావించి .. శుక. ౨. ౧౦౫.

మనసుగాఱుగు = విముఖత నొందు, విరక్తిఁ
జెందు.

వ. అని, నివారించిన నతండు మనసువిఱిగి యా
శాపజలంబులు భూనభంబులఁ జల్లిన
లోకంబుల కుపద్రవం బగు నని ...
వి. పు. ౫. ౨౯౯.

మనసుసొచ్చు = ప్రేమాస్పదుఁడగు.

ఉ. చుట్టరికంబునన్ మనసుసొచ్చి నను౦ గరఁ
గించి వేఁడినన్, దిట్టతనంబు వో విడిచి
తీవ్రశరంబు కడంక దక్కి సేఁ, బట్టిన
యాయుధంబు పెడఁబాసినఁ గాని వధింపఁ
బోలదు భార. భీష్మ. ౧. ౧౫౯.

జ. మనసగు, మనసరి, మనసించు, మనసిచ్చు,
మనసీడు, మనసుపెట్టు, మనసుపేద.

మనసుపె(వె)ట్టు. అ. క్రి. ($\sqrt{}$మనసు.)
వాంఛించు, కోరు, ఇష్టపడు.

క. కనుగొని చిత్రగ్రీవుం డనఁ బరగు కపోత
భర్త యాధాన్యములం, దిన మనసుపెట్టి
తనబల, ము నదానును వ్రాలి జాలమునఁ
దగులుటయున్. నా. పంచ. ౨. ౭.

గీ. ఊరుసంవాహనమునకు నుత్సహించు, ఘన
నితంబముపై నుండ మనసువెట్టు, నిమ్న
నాభికి డిగ్గంగ నిమ్మసేయుఁ బద్మలోచన
మరగి భూపాలుకరము. నైష. ౭. ౧౩౭.

ద్వి. మలయానిలములకు మనసువెట్టుచును ...
బస. పు. ౪. ౫౦౦.

ఆ. పిడికెఁడడుకు లపుడు ప్రియమున భక్షించి, యాకుచేలునకును మహామహునకు, సకల లోకవిభవ సామ్రాజ్యము లొసంగ, మనసు వెట్టినఁట రమాధవుండు. కుచేల. ౨. ౯౫.

**మనసుపేద.** విణ. (√మనసు) ధైర్యము లేనిది; ధైర్యములేనివాఁడు, పిఱికి.
క. వల పెక్కుడ లేదా యీ, గాలికుంతల తలచె వేగనా యోఁచ కిఁకం, జలికోలఁ ద్రోచి విడువుము, చెలి మిక్కిలి మనసు పేద శీతలపాదా. విజ. వి. ౨. ౫౦.

**మనస్కరించు.** సం. స. క్రి. మనస్సువందుంచు.
గీ. విస్తరింతు నైమిత్తికవిధులు మఱియు, నాదువాక్యము లెల్ల మనస్కరింపు. మార్క. ౪. ౧౪౦.
వ. ... దివిజాలపల్కులు మనస్కరించి మధుమదనుండు ... నృసిం. ౨. ౫౧.
వ. ... అవ్విరించి పల్కులు మనస్కరించి మహాదేవుండు నిజప్రభావంబుఁ దండంబుఁ గాఁ గల్పించి దండనీతిశాస్త్రయుం దై పరగుచుండె. భార. శాం. ౨. ౧౧౫.
అ. క్రి. ౧. ఇష్టమగు.
(వ్యవ.) పెద్దవారిమాటలు చిన్నవారికి మనస్కరించవు.
౨. సమ్మతించు, ఇష్టపడు.
(వ్యవ.) వాఁడు మనస్కరించి ఆ పని చేసినాఁడు. (శ. ర.)

**మనస్కారము.** సం. వి. అ. పుం. చిత్తాభోగము. చిత్తపరిపూర్ణత, సుఖదుఃఖాదులందు మనస్సునకుండు నిబ్బరము.

**మనస్తాపము.** సం. వి. అ. పుం. ౧. మానసికబాధ. ౨. అనుతాపము, పశ్చాత్తాపము.

**మనస్తాలము.** సం. వి. అ. పుం. దుర్గాదేవి వాహనమగు సింహము. (త్రి. ని.)

**మనస్తోక.** సం. వి. ఆ. స్త్రీ. దుర్గాదేవి.

**మనస్వి.** సం. విణ. (న్. నీ. న్.) ౧. ప్రశస్తమైన మనస్సుగలవాఁడు.
౨. విద్వాంసుఁడు. వి. న్. పుం. శరభమృగము.

**మనస్విని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. దుర్గాదేవి.
౨. సోముఁడను వసువు తల్లి.

**మనస్సంగము.** సం. వి. అ. పుం. మనస్సాంగత్యము. మనస్సుయొక్క యనుబంధము. (ఇది మన్మథావస్థలలో నొకటి.)

**మనస్సు.** సం. వి. స్. న. ౧. హృదయము, ఉల్లము. ౨. (వేదాంత) లింగశరీరావయవవిశేషము. ౩. జీవాత్మకంటె భిన్నమగు జ్ఞానజనకద్రవ్యము.
(ఇది పరమాణువు.)
౪. మణిశిల. (రూ. మనసు, మనము.)

**మనాక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. కరిణి. ఆఁడేనుఁగు. ౨. కాముకురాలు, కామిని. (వై. ని.)
౩. అర్ధశ్లోకము. (కే. ని.)

**మనాక్కరము.** సం. వి. అ. న. మల్లికాగంధముగల అగరువు.

**మనాయి.** సం. వి. ఈ. స్త్రీ. మనువుయొక్క భార్య.

**మనాయించు.** సం. క్రి. (గా) హిం. (మనా) లక్ష్యపెట్టు. ౨. విను. ౩. లోఁబడు. (శ. ర.)

**మనావి.** సం. వి. ఈ. స్త్రీ. మనువుయొక్క భార్య.

**మనికట్టు** = మణికట్టు. వి. మణిబంధము.

ద్వి. మనశూర మోఁకించి మఱి వ్రేయఁ దడత,
మనికట్టులకుఁ దగి మఱి మిట్టిపడిరి.
పండితా. పురా. ౯౭.

వ. మనికట్ల విఱిచియుఁ బఱిచియు
ఉ. హరి. ౬. ౧౦౮.

**మనికి(న్కి).** వి. (త. మన్ను హై.) బ్రతుకు, జీవనము; సుఖజీవనము.

సీ. ఏ పతిదీవన నేకాకి నై మను, మనికియుఁ
దా నొక మనికి యగుచు ...
మార్క. ౩. ౧౭౯.

చ. అది విని దాని కిట్టు లను నమ్మహితా
త్మకుఁ డెంత లెస్సనీ, మనికి దలంప
భార. అను. ౪. ౩౨౧.

క. విను గర్భిణి ప్రజ బ్రతుకున, కనురూపము
లైనయట్టి యాహారంబుల్, గొనుగతిఁ బతి
ధరణీప్రజ, మనికికిఁ దగ నడచునది తమకి
గాఁ కెపుడున్. భార. శాం. ౨. ౧౭౯.

గీ. తోఁచు జీవనమ్మగను వన్ని మనికి
బ్రతుకు బ్రదిమి యన మాత్రభూత ..
అం. భా. ౨. ౨౨౬.

సీ. పెద్దకాలము మన్కి ప్రేతాత్మకత ఘుత్తిఁ
గలుగఁగా జముఁడు కాకమున నొసఁగ ..
ఉ. రా. ౩. ౧౫౨.

చ. ... ఓసి తమయూఖ నినుం జెలియంగఁ
గోరి యూ, రక యటు చేవంతఁ దల
ప్రాణము దోఁకకువచ్చె లెక్కసే, యక
దిగ్భ్రమింగనేని యకటా యలరాహువు
మన్కి గాంచునే. పారంగ. ౨. ౧౭౪.

౨. ఉనికి, వర్తించుట.

క. క్షీరోదకగతిఁ బాండవ, కౌరవు లొడఁ
గూడి మనికి కార్యం బది నీ, వారసి నడ
పుము .. భార. ఉద్యో. ౩. ౨౫౭.

(వసించుట అని శ. ర.)

౩. స్థలము, చోటు.

చ. ... అ, మ్మనికి మహీజముల్ చదలు
ప్రాఁకు లటంచు భ్రమించి పల్కెడు ...
వసు. ౨. ౪.

సీ. ఒప్పార గౌతమి యుత్తరతటమున మహ
నీయ మగు పెద్ద మనికియందు.

గీ. స్థిరతరా రామతతులు సుక్షేత్రములును,
బెక్కు లార్జించి పితకీర్తిఁ బెంపుమిగిలి
యఖిలజగ దన్నదాత నా నవనిఁ బరగె.
వా. రా. ౧. ౩౩.

౪. (క. మనె.) వాసస్థానము, నెలవు.

చ. ఎవరయఁగ నీ నివాసమున కే నరుదెంచెద
నంచు నాపయిం, గనుగొన నిక్కపుం
బ్రియము గల్గిన వాఁడును బోలెఁ బల్కి
యీ, మనికికి రాకతక్కనను మానెదుఁ
గాక .. సరస. ౨. ౪౫.

జ మనికిపట్టు.

**మనికితపడు.** అ. క్రి. (మనికితము + పడు.) దుఃఖపడు.

ద్వి. మనికితపడక నిర్మలుఁడ వై యుంక, వని
మిద రాజ్యసౌఖ్యము బొందు మీవు ...
రం. రా. కిష్కిం. ౨౧౪. పా. ౧. పం.

క. తనపతిఁ గానక యెంతయు మనికితపడి
వచ్చి కాముమంజరి చోరఁగాఁ గనికరమున
నక్కాంతుం, దనలశిఖలలోనఁ జొచ్చె
నవ్విధమునకున్. విక్ర. ౬. ౧౪౨.

**మనికితపాటు.** వి. (√మనికితపడు.) దుఃఖపడుట చింతిల్లుట.

ద్వి. మనికిత పాటుగో మఱి కుందికుంది ...
విష్ణు. పూ. ౨. ఆ. (శ. ర.)

**మనికి(న్కి)తము.** వి. ౧. దుఃఖము, మనోవ్యథ.

క. ... మిాగో, ధనమును మిమ్మును గాచెద, మనికితముఖ మానుఁ డనుచు మదిఁ గృప మెఱయన్. వి. పు. ౨. ౨౫౦.

వ. వనజముఖీ కుచోపరినివాస సుఖోన్నతి నన్కి మాని నామనికిత మార్చ వచ్చితివి మౌక్తికహారమ .. వసు. ౪. ౧౦౨.

సీ. సెంజలి యనఁగ మనికితంబనఁగ దుందుడు కనం దగు మనోవ్యథకు సమాఖ్య. ఆం. భా. ౧. ౧౩౪.

చ. అతఁడును బుత్త్రిపౌత్త్రి విలయంబునఁ బుట్టిన శోకవహ్నిచే, వెతవడి ప్రాణముల్ విడువ వేడుచు నుండె నటన్న వానికిన్ మతి నిజమయ్యెనేని మనమన్కిత మంతయు డీఱ వాత్మకున్, గుతిలము మాను బాఖులునకున్ స్మృతి గల్గను గాన నేమిటన్. ప్రబోధ. ౫. ౫.

౨. సందేహము.

చ. చదువులకు నొజ్జ యయి కడుఁ, బాదలిన నాయయ్య పౌత్త్రపుం గూర్పుచే, నిది తగ వనిపించెద నె, మ్మదిలోపల నీకు నింత మనికిత మున్నన్. మగా. ౪. ౬౧.

చ. ... అడు పెల్లమ, త్వనికిత బాహువిక్రమము చూచుతలంపునఁ గాదె తీర్తు నీ, మనికిత మిప్పు డందుకొనుమా నిజకార్ముక మంచుఁ బల్కినన్, జై. భా. ౫. ౧౪౯.

౩. జాలి, కరుణ.

గీ. వింటికొప్పునఁ జే యూఁది విన్నబోయి, యుఱురుము రటంచుఁ గలఁగుచు నున్న వాని, చంద మీక్షించి యిప్పు డాకాంత మతులు, మునులు వలికిరి చే సాఁచి మనికితమున. వాల్మీకి. ౨. ౯౬.

జ: మనికితపడు, మనికితపాటు.

**మనికి(న్కి)పట్టు.** వి. (√మనికి) నివాస స్థానము, నెలవు ఉండుచోటు.

గీ. (గోవు.) ... అత్యంతదురిత, జలనిధికి నోడ నిర్జర సద్మమునకు, నవఘు నిచ్చెన సురలకు మనికిపట్టు. భార. అను. ౩. ౨౯.

గీ. మఱియు మేరువు పడమట నున్న నిష ధాద్రి మధ్యకూటము హరిమనికి పట్టు ... వరాహ. ౧౦. ౧౪౬.

ఉ. దో, స్సత్వ విజృంభితుండు రణ శౌర్యధురీణుఁ డకల్మషుండు ధీ, రత్వము మన్కిపట్టు. కళా. ౧. ౩౬.

గీ. అట్టి తెలిగట్టు మన్కిప ట్టైనదిట్ట నీలా. ౧. ౧౨.

**మనికీఁడు.** విణ. వరవరుఁడు. (ఇది యొక్క పండితారాధ్య చరిత్రమునందే గానవచ్చు చున్నది.)

ద్వి. మనికులఁ బిల్చుచు మతులఁ గల్పుచును, వినులు సేయుచు విరతి వొాయుచును .. పండితా. పర్వ. ౩౨౪. పా.

ద్వి. అనుచు వెండియు మల్లికార్జునగురుఁడు మనికుఁ జై పర్వతమహిమ నుతింప . పండితా. పర్వ. ౩౨౪.

ద్వి పొనగ నిజాంతర పూజానురక్తి మనికుఁ డై తనఁ దాన మఱచియున్నాఁడొ .. పండితా. దీక్షా. ౨౬. పా.

ద్వి. మనికులు మనికులు ప్రాన్పడి తగుల మద శీలు మదశీలు మత్సరింపంగ .. పండితా. పర్వ. ౩౫౮. పా.

**మనితము.** సం. విణ. (అ. ఆ. అ.) బుద్ధము, తెలియఁబడినది

**మనిసి = మానిసి.** వి. (సం. మానుషః) మను ష్యుఁడు, మనుష్యస్త్రీ.

సీ. వలపు రూ పెఱుఁగదు వసుధ మర్త్యులకు నాకర మైన మనిసిగాఁ గానుపించు ... వేణు, ౬౦,

సీ. మానిని మనిసి నా మనుజు సామాన్యంబు.
ఆం. భా. ౨. ౧౦౩.

**మనిసిల.** వి. ఔషధములలో నుపయోగించునట్టి శిలాభేదము. మణిశిల.

చ. మనిసిలయుం గటుత్రయము మా నగు
నింగుళయుక్ విళంగముల్, పనవడి నూతి
పొట్లముగఁ బట్టను గట్టిఁ గట్టి సంతతం
బును నవి మూతిఁ జూడఁగను బోవు నిరం
తర మైన పీనసల్ ... (చి. కి. చి. ని.)

**మనీకము.** సం. వి. అ. న. అంజనము. కాటుక.

**మనీష.** సం. వి. ఆ. స్త్రీ. తెలివి, బుద్ధి.

**మనీషి.** సం. విణ. (న్. ఈ. న్.) ౧. తెలివిగలవాఁడు. ౨. విద్యావంతుఁడు, పండితుఁడు.

**మనీషితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఇష్టమైనది. ౨. మనోహరమైనది, ఇంపైనది. ౩. ఇచ్ఛ, కోరిక.

**మను¹.** అ. క్రి. (దీనికి మనితివి, మంటివి, మనుదురు, మందురు, మంద్రు, మండ్రు, మనిన, మన్న మొదలగు విశేష రూపములను వాల్లు పరంబగునపుడు వికల్పముగ నుత్వలోపమును జూపట్టెడి.)

౧. (క) జీవించు, బ్రతుకు.

ఉ. ఆహవ భూమి లోనఁ బరమార్థము పొగ్గుఁ
డు వైరివాహినీ, వ్యూహము ద్రచ్చుచోట
మఘవుండును వానికి మార్కొనంగ ను,
త్సాహము సేయఁ డన్న లఘుసార లధీర
లశాహసుల్ నిరు, త్సాహులు ద్రోహు
లై యెదిరిచత్తురొ మందురొ మాన
వేశ్వరా. భార. ద. ౪౬. ఆది.

ఉ. తండ్రికి నూడుపట్టక వృధాస్థితి నుండితి
నింట నిందఱో, మంద్రె ...
భా. రా. యు. ౧౨౩౮.

గీ. ఇట్లుగా క్షాత్రధర్మంబు వెడలఁ బిడిచి,
వర్ణములు నాలుగింట నెవ్వార లైనఁ,
దొలఁగఁ ద్రొక్కినఁ జాటిల్లు దుష్టగతులు
నున్న కాలంబు పదపడి చన్నయపుడు ..
భార. అను. ౩. ౨౩౪.

(చ) జీవనముచేయు; సుఖ జీవనముచేయు, హాయిగా బ్రతుకు.

చ. నరసురసిద్ధకింపురుష నాగఖేచర ముఖ్యు
లెల్ల నీ, కరుణయ చేసి మంద్రు.
భార. ఆది. ౨. ౪౬.

గీ. నిలిచి యాతని మననీక యలఁచువాఁడ.
వైష. ౩. ౧౧౫.

చ. తగినపుత్త్రులం బడసి ధర్మువు దప్పక
తమ్ము నుత్తముల్, పొగడఁగ మన్నవా
రతులు పొందుగతుల్ గడుఘోరనిష్ఠతోఁ,
దగిలి తపంబు సేసియును దక్షిణ లిమ్ముగ
నిచ్చి యజ్ఞముల్ సెగఁడఁగఁ జేసియుం
బడయ నేర రపుత్త్రకు లైన దుర్మతుల్.
భార. ఆది. ౨. ౧౪౯.

గీ. ... అమరులింద్రు నశముసు నుపజీవించు
నట్లు బంధుజనులు నిన్ను నుపజీవింప మనుము
నేర్మి. భార. సభా. ౨. ౩౯.

శా. మాపెద్దల్ వారి సంశ్రయంబున న మున్
మన్నారు. హరి. ఉ. ౫. ౪౬.

శా. .. నీ, రాజత్వంబునఁ జక్రముల్ మని
యొనో రంజిల్లి సత్సంతతుల్, తేజం
బందెనో డిందెనో యహిబయోద్రేకంబు
తాఁ జెల్లరె వసు. ౪. ౨౩.

ఉ. కాలువిదున్న నంది నయి గంటలు
దున్నక మంటి నా మహా, కాలునినంది
దున్న నయి కర్దమమగ్నత లేక మంటి
నా, హాలికు లెన్నఁడుం దెగని యారుల
చేలను జొరుమళ్లు నుం, గా లలి నేరు

సాఁగి రిలఁ గల్గుపసిం గాని పేద మున్న
గన్ ... ఆము. ౪. ౧౨౪.

౨. వృద్ధిఁబొందు, పెరుఁగు.

చ. ... హాలాం, కపదోత్థితంబు లై మనునడి
వోని గర్భకలమంబులు గావె లతాంగి
జంఘికల్ వసు. ౨. ౬౪.

సీ. హిత బహుశ్రుత ధర్మరత కూరతాస్వపూ
ర్వతల మన్ద్విజుల దుర్గముల నిలిపి
ఆము. ౪. ౨౮౧.

౩. వర్తిల్లు, నడుచుకొను.

క. విను తొల్లి కృతయుగమున, మనుజులరొడ
దండనీతిమంతుం డై రా, జన నొకఁడు
గలిగి యరయుట, మనుజేశ్వర లేదు ధర్మ
మతి మంద్రుతగన్
భార. శాం. ౨. ౧౯౯.

చ. ముని మనుజా సురాహిసుర ముఖ్యులు
మున్నుగ సర్వజీవులం, దనవశ మర్థిఁ
జేసి మనుదర్పకు నోర్చిన వీతరాగి
కు. సం. ౧. ౧౦.

క. జనకుఁడు తాతయు భ్రాత యుఁ, దన
కులజుఁడు తల్లియును యథాక్రమమున
నీఁజనవరు లగుదురు కన్యకు, మనమున
దోషంబు లేక మనువా రైనన్
విజ్ఞా. ౧. ౧౦౨.

౪. వర్తించు, ఉండు.

క. తనధన మిది యని యెూఱడి మనఁ బరి
ణయ మాదిరైన మహోత్సవముల్ గొని
యాడ నెవ్వరికి వ, చ్చునె జనపాలుండు
లేనిచో నిర్భయతన్ ...
భార. శాం. ౨. ౨౮౬.

సీ. కలిమితొయ్యలి దాల్పుఒలుసామి పొక్కిట
మనుతమ్మి యేపేల్పుఁ గనిన తల్లి
చంద్రి. ౨. ౩౪.

సీ. పన్నగతల్ప నీభక్తులతోఁ జొత్తుమనికాని
దుఃఖంబు మఱవ రాదు. వరాహ. ౬. ౭౭.

(పొత్తుమని = పొత్తుననుండి అని భావము.)

౫. పుట్టు, జనించు.

గీ. మనుమలును మనుమరాండ్రును మనఁగ
వారి, సొబగు కొన్నేండ్లు కొన్నేండ్లు
సుతులసుతుల, తరతరంబును దామరతంప
రైనఁ, జూచి సంసారసుఖములఁ జొక్క-
నతఁడు వి. పు. ౫. ౧౭౬.

౬. ఒప్పు, శోభిల్లు.

సీ. ధీనుబాణాసనస్థేమ వార్తాప్రవర్తన మను
భవ్యసుధన్వి రాఘవ. ౨. ౨౯.

(భారతార్థమున.)

సీ. కాండోకసవతియు గురుతర ధర్మరక్షణ
శీలత న్మనుగుణవిధేయ. రాఘవ. ౧. ౬౪.

(రామాయణార్థమున )

౭. కృతకృత్యుఁడగు, ధన్యుఁడగు.

గీ. మీరు వినుచుండఁ జెప్పెదుమేటిపదము,
గంటి మంటి మీ దయపెంపుకతన ...
భార. స్వర్గా. ౯౩.

గీ. అలరువిల్కానితల్లికిఁ బ్రార్థితార్థ, కల్ప
వల్లికి మ్రొక్కంగఁ గంటి మంటి ...
కాశీ. ౩. ౪౧.

ద్వి. కంటిని శ్రీపాదకమలంబు లేను, మంటి
నింకేఁటికి మగుడుదు ననిన ...
ద్వి. భాగ. ౧౦. ౩. ౨౨౨౦.

జ మందల, మందలిడుచు, మనుకువ, మను
గడ, మనుగడుపు, మనువు, మనువును,
మన్కి, మన్కిగొనిపించు, మన్కిగొను

**మను[2]** – మన్ను[1]. వి. (తె. మణి.) ౧.
మృత్తిక, మట్టి.
(హల్లు పరమగునపుడు వైకల్పికముగా నుత్వ
లోపము.)

క. తనమనసములోన నెంతట, ననుమానము
తీఱి శుద్ధి యగు సందాఁక౯, మను కొఁచము
చేయుట దగు, కనికయుఁ గొలఁది యును
వదక రెన్నఁడుఁ బెద్దల్.

విజ్ఞా. ౧. ౪౦.

శా. ఆకర్ణింపుము మత్స్యమాగమన కార్యం బష్ట
దిక్పాలకీ, లోకంబుల్ విదళించి వచ్చితివి
గల్గుం బాల్గు చిక్కఁగ నా, లోకంబుల్
మనుపోలె నుండనుది నాలోకించి ..

వరాహ. ౩. ౬౭.

మ. అసిధారావధకాత్మ బంధుభుజమధ్యాసైర
నిర్యద్వ్యస౯, మన కై పుట్టినయమ్మహా
దురితము౯ మ న్నొట్టి యు౯ వాని మే,
ధసువిద్ధానలభూతిచే నుసిమి యు౯ దప్పిం
పలే నైతి పాండు. ౫. ౪౧.

(మన్నొట్టి భూదానముచేసి యని యర్థము.)

౨. భూమి, నేల.

సీ. అదనుతోఁ జేఁపి చ న్నవిసి యోషధుల
మన్మోదవు కొండల కల్లఁ బిదుక నెఱఁగ.

మనుచ. ౨. ౧౧.

(సముద్రవర్ణనము.)

సీ. మనుముద్దరాలికి పుగతాల మొలనాలు కల
వాలి చెలికాని కలరుఁదోఁట

నం. రా. ౩ ౨.

జ. మందల, మందలించు, మందలింపు, మనుఁ
బెల్ల మనుదిండి.

**మను³** = మన్ను². వి. (వృత్తియందు హల్లు
పరంబగునపుడు ఉత్వలోపము వైకల్పికము.)
ఋష్యమృగము, ఒక జాతి జింక.

ఉదా: మనుఁబోతు, మనుఁబెంటి, మనుఁ
బిడి మొ.

జ: మనుఁబిడి, మనుఁబెంటి, మనుఁబోతు,
మనుగొట్టె.

**మనుఁగు** = మనువు. అ. క్రి. చచ్చు,
మడియు.

చ. .. నేఁడు నై, కొనిరొ రఘూత్తముం
డతని ఘోరశరాళి ననేక రాక్షసుల్,
మనిఁగిరి వాని మార్కొను సమర్థులు లేరు
జగత్త్రయంబున౯ .

అధ్యా. యు. ౧౭౧ పా. (శ. ర. పా.)

**మనుఁబి(న్బి)డి.** వి. (మను³ + బిడి²) స్త్రీ.
ఋశ్యమృగము. ఒక జాతి ఆఁడు జింక (బ.
మనుఁబిడులు, మనుఁబిళ్లు.)

ద్వి. ఒఱగు జింకలును బిట్టాలు మన్బిళ్లు.

ద్వి. హరిశ్చ. పూ. ౬౦౫.

మ సింగముల్, కడగొట్టె౯ మనుఁబిళ్లు
గంతుగొను జింకల్ బిద్ద ..

సారంగ. ౧. ౧౦౭.

సీ. కనుముఱుం గొనగూర్చి మనుఁబిళ్లకై దిద్దు
నెడ బండిపులికూన యిది నృపాల ...

చంద్రా. ౨. ౪౨.

సీ. . మనుఁబోతు మనుఁఓళ్లు మ న్ననంగ
ఋశ్యము దగు ఆం. భా. ౨. ౯౫.

(మనుఁఓళ్లు అనునది నిత్యబహువచనాంతమని
ఆం. భా. మతము. స్త్రీ పురుషవాచకము
లగు. మనుఁఓళ్లు, మనుఁబోతు అనువానిని
ఋశ్యత్వ సామాన్య మనుగతముగా నుం
డుటంబట్టియు, పిడిపోతు శబ్దము స్త్రీపుం
వాచకములగుట ప్రసిద్ధం బగుటంబట్టియు,
ఆం. భా. కారుఁడు అట్టి భేదమును
తెలుపక పర్యాయములుగఁ జెప్పెనని
తోఁచుచున్నది.)

**మనుఁబెంటి.** వి. (మను³ + పెంటి) స్త్రీ.
ఋశ్యమృగము, ఒక జాతి ఆఁడు జింక.
(శ. ర. ప్రౌ.)

**మనుఁజెల్ల.** వి. (మను + పెల్ల.) మంటిపై త్రిక కదళీ గర్భవర్ణనము.

సీ. దళ శూని త్రాలిన దొలుఁదేటి వాచవి కందిన మనుఁజెల్లయంద మొంద ...
కళా. 3. ౬౨.

**మనుఁబో(న్నో)తు.** వి. (మను + పోతు) పురుష ఋశ్యమ్యగము, ఒకజాతి మగ జింక.

సీ. ... మనుఁబోతు మనుఁబిల్ల వన్నెసంగ ఋశ్యమునగు ... ఆం. భా. ౨. ౧౫.

మ. పులులంజ సింగములంజ ... శశం, బులు మనోబ్తులు భల్లుకంబులును దుప్పుల్ ...
ఇందు. ౨. ౫౭.

సీ. కారుపుల్ దిని యూము గదిసి మనోబ్తులు, కారుపోతులనైనఁ గదుముఁ జూచు ...
సారంగ. ౧. ౭౨.

**మనుకండ.** వి. (√మను. ఈ. మన్నుహై.)
౧. జీవము, ప్రాణము.

చ. సింగరా, యనికడ తెగి మాటలకు దాయనఁ జేజేచి తెచ్చి మల్కబన్, మనుకువనంటు చేసి యొరిమం గడు మెచ్చులం గొన్నపేటి నే, మని పొగడంగ వచ్చు .. యయా. ౧. ౫౧.

వ.నుకువనంటు = ప్రాణస్నేహితుఁడు.

(వాసస్థానము అని. శ. ర.)

౨. ఉనికి, సత్త, ఉండుట.

క. దండక మనుకొనకుఁ జని, యుండఁగ రాఖణునిచెలియ లొగిఁ గలయక్తై, దండకు రా ఖఖ్యముఁ దది మండాడఁగ మక్కు పెవుల మనకువ మాన్చెన్ ...
యయా. 3. ౧౬.

**మనుగ(న్గ)డ.** వి. (√మను) ౧. బ్రదుకు. జీవనము.

చ. మనుగడ దప్పు గొల్కొ మునిమాటలు గానైన నైతి ... భార. శాం. 3. ౩౯౪.

క. అరుగుఁడు పాడువుఁడు పట్టుఁడు, పొరి గొనుఁ డాదుర్విసితుఁ బోనీకుఁడు మ, త్పరి భవకారికి నజరా, మఁదేహునకైనఁ గలదె మనుగడ యెట్లున్ ...
హరి. ఉ. ౭. ౧౯౭.

గీ. ... పొలఁతుఁ బడినఁ డ స్నేగయకుండఁ, గప్పి రని మానవుఁడు గలఁ గనియెసేని, యది యు తుద వాని మనుగడ కగు నరేంద్ర. మార్క. 3. ౩౫౪.

౨. సుఖజీవనము.

క. వినుము వివేకించి జనక, జనితోన్నతి విప్రుఁ డతని జనపతి వినయం, బున నడప వలయు దానను మనుగడ యిరువురకుఁ బ్రజకు మహనీయ మగున్ ...
భార. శాం. ౨. ౩౧౭.

చ. ... ఇచ్చినఁటి నక్కఁ దటాలునఁ డక్కఁ బెట్టి యే, మఱక ననశ్వరం బయిన మన్గడఁ గాంచెద నీవు సాక్షివన్ . .
పం. పంచ. ౪. ౫౪౨.

క. అడవులకై యద్రులకై యడుగడుగున నలఁత వొడమ నడలుచుఁ జని కీ, పడఁ దుకలు పతులు మనుగడ, నడరఁగఁ గర వాలధారవార్చలు సేయన్ ...
కావ్యా. ౧. ౭౪.

3. జీవనోపాయము, జీవిక, జీతము మొ.

క. పనులయెడ మేలు గాంచిన, మనుగడ యగ్గలము సేసి మన్నింపుము రా, జనయజ్ఞ భృత్యకోటికా. భార. ఆశ్ర. ౧. ౭౪.

క. మనుగడ దొరకును గ్రమక్రమంబున మన కడ ... దశకు. ౯౧. ౬.

**మనుగుడుపు.** వి. (మనువు1 + కుడుపు (ధృ త్తిని వర్ణలోపము) పెండ్లియైనపిమ్మట అల్లునకు తొలిసారి అత్తవారింటఁ జేసెడి విందు.

అల్లెము. (శ. ర.)

వ్యవ. వారు మనుగుడుపునకు అల్లుని తీసికొని రాలేదు.

సా. లంఘనాలలో మనుగుడుపు – ఆ సమయములో కార్యమునకై కడంగుటను దెల్పును.

సా. మనుగుడుపులలో లంఘనాలు – కానొకటి తలఁచిన దైవమొకటి తలఁచె ననుటను దెల్పును.

**మనుగో(న్గో)త్తి.** వి. (మను3 + గొత్తి) ఒక జాతిగొత్తి, కొండగొత్తి, రాపీపము.

మ. పెసరంగాయకు మెత్తగన్పులకు నై పే టాడుమన్గొత్తెలకా, నుసలం జూచుచు ...

రా. వి. ౨. ౬౫.

**మనుచు(న్చు)=మంచు²**, స. క్రి. (√మను1.)

౧. బ్రతికించు, జీవింపఁజేయు.

ఆ. మేలియాశ్రితు లిట్లు, మనుతు రధిపుఁ గుఱు కుమారవర్య. భార. అను. ౧. ౧౫౯.

సీ. మనుప లేఁడాయెనే మనుజాశనుని జీరి, యనఘు నిష్టాయుక్తు నాత్మభక్తు

వను. ४. ४3.

గీ. లక్ష్మణుని మన్చి యసము దెల్లము గఁ గనుము . అచ్చ. రా. యు. ४०3.

౨. అన్నవస్త్రాదు లిచ్చి కాపాడు, పోషించు.

క. మను పదివేవురఁ బంపుదు, వని యిచ్చిన బాస వచ్చె వరనీశ్వర నీ, మనిచినబుణంబు తీర్చితి, విను లా విటమీఁదఁ దఱుగువిధ మై తోఁచెనా. భార. భీష్మ. 3. 33౦.

సీ. అనిఁ బ్రాణ మిచ్చిన యట్టివారలవారి కెల్లతేజంబులు నిచ్చి మనుతె. విక్ర. ४. ౭.

3. రక్షించు, ప్రోచు.

గీ. అనుచుఁ బలికిన జనపతి మనుచుకొఱ్కు.

దశా. ౧. ౧3౭.

చ. . అచ్యుతుం, డనఘుఁడ పేరదోషుఁ డనపాస్తగుణుం డతి వాఙ్మనఃప్రవర్తనుఁడు నితాంతభక్తికలితస్థితిఁ దన్భజియి చుపుణ్యులకా మనుచు నపుస్తసంపద సమానులఁ గాఁ బరికించు సత్కృపన్.

హరి. ఉ. ४. ౨४౯.

గీ. శరణువొందిన రక్షింపఁ జాలి యుండి, మనుప కుండినకంటెఁ గల్మషము గలదె.

విక్ర. 3. ౯3.

४. పెంచు, అభివృద్ధిఁ బొందించు.

మ. ... ఆమేనక డించి పోయె నడవిలా గణ్వుండు న న్నంత గా, మనిచెకా సర్వము నామునీంద్రుఁ డెఱుగకా మద్భాగధేయం బనకా నినుఁ గంటికా. భాగ. ౯. ౬౧४.

గీ. బ్రహ్మ పుట్టించు మనుచు నారాయణుండు, హరుఁడు హరియించు భువనంబు లవకర మన కాశి. 3. ४४.

మ. వంశంబు మ, న్చునుపాయం బొక చే గణింతు విను మంచుకా గూర్మితో ని ట్లనున్ ... ఉ. రా. ౨. ౧౧४.

౫. వర్తిల్లఁజేయు, ఉంచు, నిలుపు.

మ. చెలులం జుట్టలఁ బ్రోచి యర్థిజనులకా శ్రీమంతులకా జేసి వి, ప్రుల భవ్యస్థితి మన్చి యాగములు పేరం బెంపు శోభిల్ల ని, ట్టలపుండ్యాగము దానముకా నడపి నిష్ఠం బెక్కు సెల్లించి ...

భార. శల్య. ౨. 3౯౦.

మ. ప్ర ... ఈ ద్య, గ్వలవత్స్యాల్యంగరా గాభరణవసన సౌభాగ్యలక్ష్మీక లై కాం,

తలగత్సంశేఖలంసుం దలఁపు మనుచు
నుత్కంఠ, బ్రాపించి రందుఁ ...

రాఘవ. ౨. ౬౩.

**మనుజ.** సం. వి. అ. స్త్రీ. మనుష్య స్త్రీ.

**మనుజాతుఁడు.** సం. వి. అ. పుం. మనుష్యుఁడు.

**మనుజాశనుఁడు.** సం. వి. అ. పుం. రాక్షసుఁడు, మానిసిదిండి.

**మనుజుఁడు.** సం. వి. అ. పుం. మనుష్యుఁడు. మానిసి.

**మనుజ్యేష్ఠము.** సం. వి. అ. పుం. ఖడ్గము. పట్టాకత్తి. (వై. ని.)

**మనుది(న్ది)ండి.** వి. (మనుశి + తిండి) ఒకజాతి పాము, మాలుధానము. (ఉమ్మెత్తలోనుండు ముణ్ణుఁబాము.) (శ. ర.) డుండుభము, ఇరుదల పాము; అని ఆం. భా.

సీ. .. మను, దిండి యం చనఁగను డుండుభం బగు .. ఆం. భా. ౧. ౧౪౩.

సీ. ఎఱ్ఱతోఁకటిబండ జెఱ్ఱి మన్దిండి మున్నగు సరీసృపములం దంతకం బె ...

ఆము. ౩. ౯౦.

**మనుపరి.** (విణ.) (మనుపు + అరిశి) (త. మన్ని ప్పోన్.) కాపరి, రక్షకుఁడు. (శ. ర.)

**మనుపాల.** వి. (త. మణ్చారై) జీవంతిక, పాల కూర. ?.

సీ. ... పరగు మనుపాల యనఁ బిన్నపాల యం చ, టన్న జీవంతిక .

ఆం. భా. ౨. ౬౮.

**మనుపీనుఁగు.** వి. (√మను) జీవచ్ఛవము, బ్రతికియుండియుఁ బ్రయోజనములేని మనుజుఁడు.

క. తనరొమ్ముడలం గలసెత్తురు, ధనహీనుని విడిచి పోవు దారాదిసుహృ, జ్జనములు విడుచుట యరుదే, మనుపీనుఁగు నిర్ధనుండు మదిఁ బరికింపన్.

విక్ర. ౨. ౧౩౨.

**మనువు(న్పు)=మనుచు.** స. క్రి. (√మను[1]) (త. మన్నిప్పు.) ౧. బ్రతికించు, జీవింపఁజేయు.

గీ. అప్పు డెలుఁగులరాయనియానతిఁ గొని, గాడ్పుకొమరుఁడు మందులగట్టు దెచ్చి, కోఁతిమూఁకల మనిపె రాకొదమనింగ, ములును లేజాము గా సొమ్మ దలిచి రంత.

అచ్చ. రా. యు. ౨౩౨.

ద్వి. నీవు న న్నిప్పుడు దీవించుమాత్ర, మా వంత యును నాయు వది యొక్క వగునె, మననివారల నీవు మని పెదవయ్య ...

పండితా. పురా. ౧౪౩. పా.

౨. పోషించు, అన్నవస్త్రాదు లిచ్చి కాపాడు.

గీ. ప్రకృతిభిన్నగుణంబులఁ బ్రభువుఁ బోలి, మమ్ము దావారికులఁ జేసి మనుపుచోట.

దశా. ౩. ౧౩౩.

౩. జరుపు, సాఁగించు; ప్రవర్తిలఁజేయు.

గీ. నిండువేడుకఁ గాంచు నీనీలవేణి, కొమ్ము చేనుంగు వెంగ మైనకొడుకుఁగుట్టి, వత్తయును మామయును లేనిరిత్తయింట, మనువు మనిపెడు నీయింతి మగనితోఁడ ...

శుక. ౩. ౨౫.

మ. అనినం గృష్ణునిమోముఁ జూచి దరహాసాంచన్ముఖాంభోజుఁడై, మునినాథాగ్రణి పక్కె సర్వమునకు న్మూలంబ వై సాక్షివై, పెనుపన్ మన్పఁగ గర్తవై పరుఁడవై పెంపొందియున్.

అని. ౪. ౧౩.

వి. రక్షణము; పోషణము. (శ. ర.)

**మనుభువు.** సం. వి. ఈ. పుం. మనుష్యుఁడు, మనుష్యజాతి.

**మనుమ(న్మ)** = మనుమఁడు.

ద్వి. ... పరమారాధ్యదేవు, మనుమశిష్యుండ
శ్రీమద్గురులింగ, ఘనకరుణాహస్తగర్భ
సంభవుఁడ; పండితా. దీక్షా. ౧౪. పా.
(శ్రోత్రప్రతి. పా.)

సీ. దంతిదానవుమన్మసంతాన ముక్తానవం
బున మెలఁగు దంతావళములు ...
ఉదయనోదయము. ౩. ౫౭.

జ. మనుమరాలు.

**మనుమ(న్మ)ఁడు** = మనుమ, వి. ౧. పౌత్త్రుఁడు, కొడుకుకొడుకు.

చ. మనుమల సెల్లఁ జూపి మతిమంతుఁడు
శాంతనవుండు. భార. ఆది. ౫. ౨౨౨.

ఆ. సుభద్ర గా, రాజుపట్టి మగలరాజు మాన,
ధనుఁడు దివిజరాజు మనుమఁడు నాచెలి,
కాఁడు ముద్దులాఁడు లేఁడు నేఁడు.
భార. ద్రో. ౨. ౨౩౯.

గీ. ... మనుమఁ డనఁగ నప్ప చెలంగును ...
ఆం. భా. ౨. ౧౧౧.

మ. మతి లోకోత్తరుఁ డైన యంగిరసు మన్మం
డాశ్రితుండు ... భార. ఆది. ౩. ౧౧౭.

ద. విరథత్వము నొందియు నీదుమన్మఁ డు,
ద్ధురగతి శక్తి నైన ..
భార. భీష్మ. ౨. ౩౨౧.

మ. ... నీ, తనయుల్ మన్మలు లోను గా
వరుస సంతానం బభివృద్ధి న్నై, ధనవం
తం బగు ... హరి. పూ. ౯. ౨౪.

౨. దౌహిత్రుఁడు, కూఁతుకొడుకు.

గీ. ఆ సుహేంద్రకుమారు మాతామహుండు,
మనుమఁ డలయుటఁ గని తనమాయవలన,
నెత్తికొనిపోయె జలరాశి కర్వ రతనిపోక
తెలియక యదుభూతాంబుధి మునుంగ ...
ఉ. రా. ౪. ౩౧౮.

౩. పుత్త్రిసంతతిలోనివాఁడు, ముని మను
మఁడు, ఇను మనుమఁడు కొందలగువాఁడు.

క. అని తనుఁ బొగడిన మనుమని, వినయము
నకు మెచ్చి నలువ వేఁడుము వత్సా, నిను
మెచ్చితి వరమిచ్చెద, నని వచ్చితి ననఁ
బులస్త్యజాత్మజుఁ డనియోజా ...
ఉ. రా. ౧. ౨౨౪.

గీ. సుకవిసంస్తుత్య శంభుదాసుని సుతింప,
నేర్తురే యైన నేను వర్ణింతు నతని, చిన్ని
మనుమఁడఁ గావునఁ జెలుకవాండ్ర,
కొదలు పలుకులు ముద్దుసేయుదురు గాదె.
విప్ర. ౧. ౧౨. బస. పు. ౪. ౩౮౨. పం.

**మనుమ(న్మ)రాలు.** వి. (మనుమ + ఆలు.) (బ. మనుమరాండ్రు.) ౧. దౌహిత్రి, కూఁతు కూఁతురు.

క. అని చని యూయమ జననీ, జనకులకుం
దెలుప సంతసంబున వారల్, విని మనుమ
రాలు గావున, ననువారము దాని జార
యని పిలుచుటయుఁ గా ...
శుక. ౨. ౧౫౧.

౨. పుత్త్రుని పుత్త్రిక, పౌత్త్రి.

ద్వి. బలిమన్మరా లైన పద్మాయతాక్షి, యలరు
వహ్నిజ్వాల యనుదానిఁ దెచ్చి, వర్ణింపఁ
దగిన వివాహంబు నొంథ, కర్ణున కొనరించెఁ
గడు సమ్మదమున ...
రం. రా. ఉ. ౨౭. పా. ౩. పం.

గీ. మనుమరాలు, నాఁగఁ దనరారు నత్రి ...
అం. భా. ౨. ౧౧౧.

**మనువు¹.** వి. (√మను¹.) ౧. బ్రతుకు, జీవనము, మనుగడ.

గీ. ఇం కొసంగు నీయర్కిలి యెల్ల నమ్మఁ,
గాఁగఁ దుదివోయి ని న్నిట్లు గానవాలు,
సేసి యూఁడిఁ బుచ్చితిఁ జెప్పఁ జెట్ట,
లయ్యె నామను చే మన నంబుజాక్షి ..
నిర్వ. ౯. ౭౭.

వ. ... అప్పార వో త్తముండు నవ్వుచు మన మనువులు-పాలు నని పలికి సర్వాభరణం బులు నూడ్చి ... భార. మహా. ౧౮.

గీ. అలు కోరిన మన వచ్చునయ్య దుఃఖమునకొ సుఖమునకొ నరులమనువు చెపుమ ...
మార్క. ౫. ౧౯౯.

౨. జీవనోపాయము, వృత్తి.

ద్వి. తిరిపంబె మనువు గాఁ దిరియు చోడ లను . పండితా. దీక్షా. ౪౦. పొ.

౩. ప్రవర్తన, నడత.

శా. ... సం, పారానుక్రమ మూర్ఖసాథి పగి దిజ్ఞ పాఁగించె దౌర్కప్పుడుం, భారం బెన్నఁడు లేదు నీమనువు దుష్ప్రాపింబు వాణీశ్వరా ... భాగ. ౨. ౩౪.

సీ. .. సంతతాన్వాయ ప్రచార మాచారంబు మతకంపు మాయలమనువు తనువు .

గీ. వేశ్యజన్మంబు జన్మమే విప్రవర్య
వైజ. ౨. ౩౫.

౪. కాపురము.

సీ. . అనురక్తి నినుఁ గూడి మనఁ గంటి మంటి నె ననురతిమనువు మాయుంబు గాఁగ .. కు. సం. ౫. ౫౫౩.

గీ. అత్తయును మామయును లేని రిత్తయింట,
మనువు మనిపెడు నీయింతి మగనితోడ.
హర. ౩. ౨౫.

క. ఓ మధుర వాణి నీమను, వేమిటనుం గడమ గాక యెంతయు నొప్పెం, దామసుఁ డగు వాగ్వనితా, కామం డొక కొంతకొదవ గల్పించెఁ గదా ... శుక. ౧. ౪౧.

సా. మంటలోఁ బడిపోయిన మనువు దక్కించు కొనవలెను.

౫. వివాహసంబంధము; పెండ్లి.

చ. .. ఈ, మను విది యేల లక్ష్మణ కుమారు వినిశ్చితమారుఁ బొందు జేచను సుఖ మందు.
భా. రా. అర. ౧. ౧౪౩.

ఉ. వచ్చెదఁ జూడ సారెకును వంత వహిం పకు మమ్మఁ జెంది తా, నొచ్చెము లేని మేల్మనువు నుర్వి నిడే ..
ఉ. హరిశ్చ. ౩. ౧౫౭.

(మగని వరించుటయని. శ. ర.)

(వ్యవ.) అతని కూఁతునకుఁ దగినమనువు దొరకినది.

౬. పెండ్లియైనపిమ్మటఁ దొలిసారి అల్లునికి అత్తవారింటఁ జేసెడివిందు.

గీ. మంచిగుబ్బలియింట సమ్మదమువిూఱ,
మనువుఁ గుడుచంగ నున్నప్డు మదనవైరి ...
హర. ౫. ౫.

౭. మగఁడు. (శ. ర.)

**మనువు౨** = మనుఁగు. అ. క్రి. మడియు, చచ్చు. (శ. ర.)

**మనువు.** సం. వి. ఉ. పుం. ౧. ఒకానొక ప్రజాపతి. ౨. స్వాయంభువాదు లగుపదు నలుగురలో నొకఁడు.

శ్లో. స్వాయంభువో మను స్తాత మను స్స్వారో చిష స్తథా, ఉత్తమ స్తామస శ్చైవ రైవత శ్చాక్షుష స్తథా, వైవస్వతశ్చ కౌరవ్య సాంప్రతో మను రుచ్యతే, సా వర్ణిశ్చ మను స్తాత భౌత్యో రౌచ్య స్తథైవ చ, తథైవ మేరుసావర్ణా శ్చత్వారో మనవ స్మృతాః, హరివంశము. ౧. ౭. ౪.

(మేరుసావర్ణాశ్చత్వారో మనవః = బ్రహ్మ సావర్ణిః, రుద్రసావర్ణిః, మేరుసావర్ణిః

దక్షసావర్ణిశ్చ, ఏతేమేరుశాపః కృత్వా సిద్ధింప్రాప్తాః ఇతి సర్వేపి మేరుసావర్ణా ఇత్యుంచతే. అనిటీక.)
౩. మంత్రము. ౪. మనుష్యుఁడు. ౫. ఒకానొక జినుఁడు. ౬. (గణిత) పదునాలుగనుసంఖ్య. స్త్రీ.
౧. పృక్క. †. ౨. మనుభార్య.

**మనువుమను.** అ. క్రి. (√మనువు.) కాపురముచేయు.

ఆ. పరమతపోవృత్తిఁ బైనభార్గవుఁ బాతిఁ జేరి,
మిగులఁ బనులయెడల మెచ్చుఁ దిరిగి యతని
పర్ణశాల నాసుకన్యక యను, మగువ
గొన్నియేండ్లు మనువుమనిచెను ...
భాగ. ౯. ౫౬.

**మనుష్యధర్మ.** సం. వి. న్. పుం. కుబేరుఁడు. (రూ. మనుష్యధర్ముఁడు.)

**మనుష్యయజ్ఞము.** సం. వి. అ. పుం. అతిథ్యము, అతిథిసత్కారము. (గృహస్థులకు నిత్యకృత్యములగు పంచయజ్ఞములలో నొకటి.)

**మనుష్యుఁడు.** సం. వి. అ. పుం. ౧. మానిసి, మనుజుఁడు.

**మనుసంహిత.** సం. వి. ఆ. స్త్రీ. మొదటి మనువు రచించినస్మృతి. మనుధర్మశాస్త్రము.

**మనేదారు.** వి. (హిం. మనేదార్) సామంతరాజు.

సీ. హెచ్చుమాటల లేమి యింక నొక్కటి
మనేదారులు దారిఁ దారపిలిన, బంపు
చేసి పాఱఁ బట్టించినపుడుగదా స్వామి
కారిచిత్తంబు వచ్చు ...
రా. వి. ౫. ౪౨.

**మనోగుప్త.** సం. వి. ఆ. స్త్రీ. మనశ్శిల, మణిసిల.

**మనోజన్మ.** సం. వి. న్. పుం. మన్మథుఁడు.

**మనోజవ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. అగ్నిదేవుని సప్తజిహ్వలలో నొకటి (వై. ని.) ౨. దుర్గాశక్తిభేదము.

శ్లో. మనోజవాకంటకినీ ప్రభుసాపూతనా తథా. సం. భార. భీష్మ. ౪౬. ౧౬. కల్ప.

**మనోజవసుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) తండ్రినిబోలినవాఁడు.

**మనోజవుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. మనస్సువలె మిక్కిలి వేగముగలవాఁడు. ౨. తండ్రినిబోలినవాఁడు.

**మనోజుఁడు.** సం. వి. అ. పుం. మనమునఁ బుట్టినవాఁడు, మన్మథుఁడు, మనోభవుఁడు.

**మనోజ్ఞ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. మణిసిల. మనశ్శిల. ౨. మద్యము, మత్తుగలిగించు త్రాగుడు పదార్థము. ౩. రాచకొమార్తె, రాజపుత్రిక. ౪. వంధ్యాకర్కోటకి, గొడ్డు అఁగాకర †. ౫. జ్యోతిష్మతి, మెఱుఁగుడు †. ౬. పెద్ద జీలకఱ్ఱ. ౭. జాతి, జాజి †.

**మనోజ్ఞము.** సం. విణ. (అ. ఆ. అ.) మనోహరమైనది, ఇంపైనది, అందమైనది.

**మనోజ్జ్వల.** సం. వి. ఆ. స్త్రీ. మల్లె †. (వై. ని.)

**మనోభవము.** సం. విణ. (అ. ఆ. అ.) మనమునఁ బుట్టినది. తలంపులచే సృజింపఁబడినది. వి. అ. పుం. కామము, వలపు.

**మనోభవుఁడు.** సం. వి. అ. పుం. ౧. మనోజుఁడు, మన్మథుఁడు. తలఁపుచూలి.

**మనోభిద.** సం. వి. ఆ. స్త్రీ. మణిసిల. (వై. ని.)/

**మనోభవు.** సం. వి. ఊ. పుం. ౧. మనోజుఁడు, మన్మథుఁడు. ౨. కామము. వలపు.

**మనోమయకోశము.** సం. వి. అ. పు. అన్నమయాది పంచకోశములలో మూఁడవది. (౧. అన్నమయము. ౨. ప్రాణమయము, ౩. మనోమయము, ౪. విజ్ఞానమయము, ౫. ఆనందమయము అని కోశములైదు. ఇవి జీవాత్మకు వస్త్రప్రాయములుగా నూహింపఁబడినవి.)

**మనోయోని.** సం. వి. ఇ. పుం. మన్మథుఁడు, తలఁపుచూలి.

**మనోరథదాయకము.** సం. విణ. (అ. ఆ. అ.) కోరికల నిచ్చునది. వి. అ. పుం. కల్పవృక్షము.

**మనోరథము.** సం. వి. అ. పుం. ౧. కోరిక, ఇచ్ఛ.

**మనోరమ.** సం. వి. ఆ. స్త్రీ. గోరోచనము.

**మనోరమము.** సం. విణ. (అ. ఆ. అ.) మనోహరమైనది. ఇంపైనది. అందమైనది.

**మనోరాజ్యము.** సం. వి. అ. న. మనస్సంకల్పములను పెంచుకొనుట, వ్యర్థసంకల్పములను గల్పించుట.

**మనోలయము.** సం. వి. అ. పుం. మనోనాశము. చైతన్యము తప్పుట.

**మనో(ను)వర్తి.** మి. వి. ౧. ఇంటివారి భోజనాదులకై యగువెచ్చము.

గీ. ఊడిగంబులకును వినియోగములకు వర్త
నలకు నగరిమనోవర్తులకును, జిల్లగల
ముద్రకర్తలజీతములకు, వివిధమైనట్టి
వ్యయము లివి యటంచు. ...

ఊ. హరిశ్చ. ౧. ౬౭.

౨. భర్త చనిపోయినస్త్రీలకు జీవనార్థమిచ్చు ధనాదికము, భరణము. జీవనమునకై యిచ్చుసొమ్ము అని శ. ర.)

(వ్యవ.) ఆమె మనోవర్తికై మఱఁదిపై వ్యాజ్యము చేసినది.

**మనోహతము.** సం. విణ. (అ. ఆ. అ.) ఆశాభంగము నొందినది.

**మనోహతుఁడు.** సం విణ. (అ. ఆ. అ.) మనస్సు చెడినవాఁడు. (శ. ర.)

**మనోహర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. జాతి, జాజి †. ౨. స్వర్ణయూథిక, నంద్యావర్తము †.

**మనోహరము.** సం. విణ. (అ. ఆ. అ.) ఇంపైనది, అందమైనది. వి. అ. పుం. ఒక జాతి మల్లె †. న. బంగారము.

**మనోహరములు.** సం. వి. అ. న. బ. భక్ష్యవిశేషము ఒకవిధ మగుపిండివంట.

గీ. గారె లరిసెలు బొబ్బట్లు గరిజెకాయ,
లట్టుబూరెలు జంతికచుట్లు వడలు,
బూలు వెన్నప్పములు చిటిబూరె లిడ్డె,
నలు మనోహరములు వంటచలిమిడియును.

చెన్నబ. ౪. ౩౫౪.

వ. ...తిమ్మనంబులు పాలకాయలు చక్కి
లంబులు మోరుండలు మనోహరంబులు
గారెలు బూరెలు మండెంగలు ...

ప్రబంధ. ౧౧౨.

**మనోహాతి.** సం. వి. ఈ. స్త్రీ. పిప్పలి †. (వై. ని.)

**మనోహారి.** సం. విణ. (న. ణీ. న.) మనస్సునాకర్షించునది. ఇంపైనది.

**మనోహ్వా.** సం. వి. ఆ. స్త్రీ. మణిశిల.

**మన్న(న్నా).** వి. (క. మన్నా. హిం. మనా.) అడ్డగింపు, నిరోధము. (శ. ర.)
(వ్యవ.) పాపము ! అతనికి దేవిడీమన్నా అయినది.

**మన్నంగొఱఁడు.** వి. (మన్నన + కొఱఁడు) గౌరవములేనివాఁడు.

క. తఱుసంటి తన్ను గాదిరని, కొఱుఁగఁడు తనకొఱఁదిపుడుక లేరఁడు మెుం డీఁ, డఱ జాతి ప్రముక్క మన్నం, గొఱఁ డెక్కడ నిట్టి వేలుంగొండులు గలరే.
కు. సం. ౨. ౭౭౦.

**మన్నన.** వి. (సం. మాననమ్. క. మన్నణి.)
౧. గౌరవము, సమ్మానము.
కం. మన్నన కుబ్బక యావమతి, ద న్నొందిన స్రుక్కఁబడక ధరణీశుకడన్, ము న్నున్న యట్ల మెలఁగిన, యన్నరునకు శుభము లొదవు నాపద లడఁగున్ ...
భార. విరా. ౧. ౧౩౩.
శ్లో. మానం ప్రాప్తోనహృష్యేత నవ్యథేచ్చ విమానతః
సం. భార. ౫. ౩౭.
చ. నను భవదీయదాసుని మనంబున నెయ్యఁపుఁగిన్కఁ బూని తాఁ, చివయుది నాకు మన్ననయు
పారి. ౧. ౧౨౩.
గీ. తా వశంబుగ దొరఁ జేయువాని మంత్రి, మునకు వేగమె లోఁజేయఁ జనదు వాఁడు, శ్రోత్రమన్ననరహి నసఁగులకుఁ జెప్ప, నయినకా చెడు మఱి వాఁడు నడఁగుఁ గాన
ఆము. ౪. ౨౭౦.
క. నగుమొుంగమున ననుఁ గనఁగొని, జగతీసురవంశమణివి సత్కృవి వగుటన్, దగుదువు మామన్ననకుఁ బొ, నఁగంగ నందుఁగులనూరనచివుని కెంగా. .. రామా. ౧౯.
౨. ఆదరము,
క. భూకాంతుమన్ననలం గడుఁ, జేకొఱునా ముదిత బుధరచితనుతి, భరతుం గైకమహాపిగత్యా, స్తోకుని నర్జునసమాఖ్యు సుతుఁ గని యలరెన్ ... రాఘవ. ౧. ౪౩.
ఉ. చెన్నగునన్నదీపులినపేశల గాఁగిలి నూఁతి లాడుచున్, వెన్నెలరేలఁ గప్పురపు విప్పుటనంటులనీడ నీఁగురా, కన్నెల గోయు నన్నలకుఁ గన్నులయూయుఁ దదీయవాసనల్, మన్ననఁ గాంచి కప్రపుదుమారము గేఁచుసగారడింభముల్ .
వసు. ౧. ౧౧౧.
క. రమణుని మన్ననవలనన్ రమణీమణి రమణ మెుందు . దశా. ౩. ౫౦.
౩. దయ, అనుగ్రహము.
మ. సంతోషముఁ జేయు పూర్వచరితం బల్ సృష్టిలో మీరు చూ, చిన వైనన్ మఱి విన్న వైన జలరాశిప్రాశనా చెప్పుము, న్నన నన్నన్ మునిరాజశేఖరుఁడు నానావైఖరీ భూఖరిన్ ...
వరాహ. ౯. ౯౪.
చ. కొల్వున కేఁగుదెంచి మ, న్ననఁ బ్రజ విన్నపంబులు వినంగదవయ్య నృపాల లేఁడెదన్ ... విక్ర. ౩. ౪౪.
మ. ఇనవంశోత్తమ వింటె పంక్తివదనుం డీలాగు కైలాసవా, సునిచే మన్ననఁ గాంచి పొంగుచు .. ఉ. రా. ౩. ౯౭.
మన్ననమానిసి = గౌరవముఁగల మనుష్యుఁడు, గౌరవింపఁదగిన జనుఁడు.
క. మున్న గలగోపవర్గము, నిన్నుం గని కొలిచి భక్తి నీపని సేయన్, మన్ననమానివి వై నీ, వున్నం గడుమేల కొక యొప్పమి గలదే ...
భార. విరా. ౧. ౧౨౭.
జః మన్నంగొఱఁడు మన్ననచేయు.

**మన్ననచే(సే)యు.** స. క్రి. (√ మన్నన) ఆదరించు.

మత్తకోకిలము. హా, యన్న యీతఁడు నేఁడు చేసె మహాపరాధము నీయెడన్, నన్ను మన్ననచేసి కావు మనాథనాథ దయానిధీ.
భాగ. ౧౦. పూ. ౧౪౬౬.

క. విన లే నిట్టివి హానుఁడు, నను మన్ననచేసి యనుచు నాతుఁక ప్రొక్కెన్ ...
కళా. ౧. ౬౧.

ఉ. .. వీరిఁ గన్నతండ్రిఁ దా, మన్ననచేసి పంపి తనమందిఁ గనుంగొని రామuఁ డి ట్లనున్
య. యా. ౩. ౩౨.

ఉ. . నాథుఁడు నిచ్చలు నింగితజ్ఞుఁడై మన్నన సేయునే .. దశా. ౬. ౩౪.

**మన్ననారు.** వి. పాండ్యమండలమున విల్లుపుత్తూరిలో వెంచేసియుండు దేవుఁడు మన్నారు.

గీ. విల్లిపుత్తూరులూ నల్లవిష్ణుచిత్తుఁ డతులతుల సీసుగంధమాల్యమును మూల, మంత్రము వక్క సేర్చుచో మన్ననా రు, దార మధురో క్తి ని ట్లని యానతిచ్చె .
ఆము. ౨. ౮౪.

**మన్నాస.** వి. (మన్ను + ఆస) భూమిపైనాస. భూమిపై నుండవలయునసెడి యాశ.

గీ. ... దివిజాలచేఱలు వేగ, విడువు మింతేని మన్నాస విడువు మిండె ..
శు. సం. ౧౦. ౫౦౪.

(జీవితాశయని తాత్పర్యము.)

**మన్ని[1].** వి. (మను[1]. త. మన్నుదల్.) జీవము, ప్రాణము.

సీ. కడిదిమ్మ తుమ్మవు పుష్పగంధి వై చనుదెంచి నీమన్నిగొనియె నే నృపతనూజ ...
భోజరా. ౬. ౧౦౯.

ద్వి. రాముని నని గల్వ రా దని యంటి, నామాట వినవైతి నామన్ని గొంటి ...
రం. రా. కిష్కిం. ౨౧౫. పా. ౧౧. పం.

గీ. మనఁగ నాబుద్ధి వినక నామన్ని గొంటి, వింక నీశోకవారాశి నెట్లు గడతు ...
భా. రా. కిష్కి. ౩౩౯.

**మన్ని[2].** (సం. మన్యా. ప్రా. మన్నా.) పెడతలయందుండునరము. గ్రీవాపశ్చాద్భాగమందలి సిర.

గీ. మన్ని యనఁగను విలవిల్లు మద్య ...
ఆం. భా. ౨. ౧౩౨.

**మన్నించు.** స. క్రి. (√మన్నన.) (సం. మాన్. క. మన్నిస్తు.) సన్మానించు, బహూకరించు.

మ. ... తన్ మన్నించినన్ గీడునే, నీన హార్షంబు నమర్షముల్ హృదయమున్ గెం దింప కష్టోభ్యుఁ డై ...
భార. శాం. ౫. ౧౨౧.

గీ. ద్రోణుల నుదాత్తరథధురీణుఁ డగుచుఁ బ్రాభి మన్నించె మేదినీపతి ...
రాఘవ. ౨. ౭౯.

ఉ. కాంచినఁ బొంగి వా రొసఁగుకామిత లక్ష్మిఁ బరిగ్రహించి మ, న్నించి పురప్రయాణరతి నిక్కె నరేంద్రుఁడు. మనుచ. ౫. ౪౨.

౨. గౌరవించు.

క. అన్న ! యిది ధర్మ వని మీ, యన్నను నన్నును నతిప్రియంబున నెదలో, మన్నించి యేమి పనిచినఁ, గ్రన్నన మాపనుపు సేయఁ గడఁగుము బుద్ధిన్ ..
భార. ఆది. ౬. ౨౨౨.

గీ. మించుమందస్మితమున మన్నించె శక్రు, హారుఁడు ... భీమ. ౫. ౩౭.

ద్వి. సమ్మదంబునఁ గరజలజముల్ మొగిచి,
యున్న తారాశేంద్రు నుచితసత్కృతుల,
మన్నించి మునిశిఖామణి యిట్టు లనియె.
ద్వి. హరిశ్చ. పూ. ౬. ౫౦.

౩. ఆదరించు.

గీ. ప్రణయకోప ప్రశాంతికై పాదపతితు,
నిన్ను నేఁపువఁ బోఁడి మన్నింప దయ్యె.
హర. ౩. ౪౬.

సీ. పరమేశుఁ డీలంబఫలపాటలాధర నను
మీఱి మన్నించినాఁడు మేలె
కాశీ. ౪. ౧౪౭. శివరా. ౪. ౭౦.

౪. (నేరము) క్షమించు, ఓర్చు, సహించు.

క. వినుము బృహస్పతి యిఁకనై, నను భక్తిని
నన్నుఁ గొలిచినను మన్నింతున్, దన
నేరము ... దశా. ౨. ౧౧౦.

౫. ఇచ్చు, ఒసఁగు.

మ. నినుఁ బోల్పం దగు సత్కుమారకుల
మన్నింపంగదే నావుడున్
ఉ. రా. ౨. ౧౩౩.

క. ఆనలినాక్షికి నేనలి, చే నలియుచి గొలువఁ
జాలు చెలువలు వలువల్, చే నిచ్చి వెనుక
వచ్చిన, మానిని కుడుగగలు కొన్ని
మన్నించి తగఁ . రా. వి. ౨. ౧౫.

౬. రక్షించు, కాపాడు.

సీ. బ్రహ్మదులార నాపల్కులు మఱికొన్ని
యాలకింపుఁడు వేంకటాద్రిగంధు, ధరణీ
సురుల కన్నదానంబు చేసిన నేఁ దృప్తిఁ
బొంది మన్నింతువారి
వేం. మా. ౨. ౧౭౭.

౭. కరుణించు, అనుగ్రహించు.

గీ. ఆనతిమ్ము మహాదేవ యాభవ నీదు, కంగ
మాలింబు నలు పైనకారణంబు, నన్ను
మన్నించి యీకారణంబు నాకు, నానతీఁ
దగు నీవు లోకాభివంద్య. హర. ౬. ౬.

జ. మన్నింపు, మన్నిక.

**మన్నింపు.** వి. ౧. (√మన్నించు) మన్నించుట.

సీ. మన్నన మన్నిక మన్నింపనంగను బహు
మానసంజ్ఞ నై పరగుచుండు ...
ఆం. భా. ౧. ౧౩౪.

౨. అపరాధక్షమ. (శ. ర.)

**మన్నిక**[1]. వి. (√మన్నించు) మన్నన, సమ్మానము.

సీ మన్నన మన్నిక మన్నింపనంగను బహు
మానసంజ్ఞ నై పరగుచుండు ..
ఆం. భా. ౧. ౧౩౪.

**మన్నిక**[2]. వి. (√మన్ను1.) ఎక్కువకాలముండుట.

(వ్యవ.) బొమ్మ నేఁతబట్టకు మన్నిక తక్కువ.

**మన్నిగొనిపించు.** స. క్రి. (√మన్నిగొను) చంపించు.

(విశ్వామిత్రుఁడు.)

సీ. ఆలుక శక్త్యాదిపుత్త్రుల మన్నిగొనిపించెఁ
బకు వగుద్విజపుత్త్రు బ్రతుకఁ జేసె ...
దశా. ౭. ౨౫.

**మన్నిగొను.** స. క్రి. (మన్ని + కొను.)

౧. చంపు, వధించు.

గీ. ... గాండీవధరుచేతి మెఱుఁగుటమ్ము, మన్ని
గొనియెని యాకర్ణ మగలరాజ ...
భార. స్త్రీ. ౨. ౯౦.

(ఇట నిన్ను౯ అనుకర్మపద మధ్యాహార్యము.)

క. క న్నుండఁ గంటిపాపం, గొన్నట్లు
మొఱంగి కాలుఁ గొనిపోవుటకై, యన్నిచ
బంధుయుతము గ మన్నిగొనకయున్న నేఁటి
మాటలు మనకున్, ఉ. హరి. ౫. ౨౭౭

చ. మఱి యొకయుక్తి రక్కసుల మన్నిగొనం
గను వారిలోన నొండొరులకుఁ గచ్చ పుట్టు
టకు నొక్కనిచేఁదియ నొక్కఁ డొందన,
క్కటి జనియింపఁజేయవలె . .
పార్వ. ౨. ౧౨౫.

౨. (ప్రాణములు తీయు) మిక్కిలి బాధపెట్టు.

ఉ. ... నా, యావులఁ గ్రేపులం గలపి
యార్చి వెలార్చినఁ బోయి ఘోరదు, గ్గావళి
సొచ్చి నింట మఱఁ దాత్మజు లెవ్వరు లేరు
ప్రల్లదుం, డీవిధి మమ్ము మన్నిగొనియెన్
భవదీయసుతుండు గోపికా
హరి. పూ. ౫. ౨౨౫.

మ. పుణ్యాత్మ మ విప్రాయెడన్, వరణో
పాయభయంబు మన్నిగొనియెన్ మాతప్వ
సైరింపవే .. మార్క. ౧. ౮౪.

క. ... స్వభావమున దుర్జనుఁడై, యెనయఁ
బ్రజాపాలనమున, తను బాల్పడి ప్రజల
మన్నిగొనఁ జొచ్చెఁగడే ...
భాగ. ౪. ౪౧౮.

**మన్నియ(ఁడు) = మన్నె.** వి. (సం. మాన
నీయః, కి. మన్నియ) ప్రభువు.

ఉ సొన్నపు సన్నచేలఁ గటిఁ జుట్టి కిరీటము
మాలిఁ దాల్చి రే, మన్నియతోడఁబుట్టు
కెనుమానికి వక్కనఁ జేర్చి వచ్చి
విష. వి. ౨. ౮౪.

సీ. రక్కసుల్ గెంటింపరాకుండ మన్నియ
పౌజు కాపఁటెల్చుబలిమి యచ్చె ..
అచ్చ. భా. ౧. ౪. పా.

ఉ. తన్నిన నాతఁ డల్లి బెడిదమ్ము గమొమ్ము
నవాలు వానిపైఁ గ్రన్నన చేయ నప్పు
లుఁగురాయఁడు మక్కనఁ జక్కఁ జేసి
యా, మన్నియ తేరి యక్కజపు మావులఁ
గూల్చి కడంగుచున్నతోఁ గ న్నెఱఁజేసి
చాలుపు మొగంబులరక్కసుఁ డుక్క
విగాఁగన్ ... అచ్చ. రా. అర. ౬౩.

విణ. శ్రేష్ఠుఁడు.

క. బవరమున నీవు ర మ్మని, తవిలిన మీవంటి
పుడమిదయ్యంబులతోఁ, దివిరి యెదు
రొక్కనఁగా దగ, వవునే సెఱరాచమన్ని
యల కెందైనన్ .
అచ్చ. రా. బాల. ౨౦౪.

**మన్నియ(మ్రుచ్చు.** వి. (మన్నియము +
మ్రుచ్చు.) కొండలయందుండు దొంగ, పర్వత
ప్రాంతమున వసించుచోరుఁడు.

వ. ... పసులకొమ్ములతాఁకుల నడవిఁ గ్రంప
యొట్ల మన్నియమ్రుచ్చులపోట్ల వెగసిన
గంట్లం గలకెక్కినయవయవంబులును.
హరి. పూ. ౫. ౧౪౨.

**మన్నిల్లు.** వి. దే. (మన్ను + ఇల్లు) భూమి
లోపల నిర్మింపఁబడినయిల్లు, నేలమాళె,
భూగృహము.

క. పన్నగకాంతల కెనయగు, నిన్నారులు
గొలువ నున్నయది యెవ్వతె యీ,
మన్నింట నేమికతమున, నున్నది యొకఁ
గింపు మింతయును దెలియంగన్ ...
దశకు. ౮. ౮౩. (చూ. ౮. ౩౯.)

**మన్నీఁడు.** వి. (మన్ను + ఈఁడు) భూస్వామి;
సామంతరాజు, మండలాధిపతి; ప్రభువు, దొర.

మ. కృప్రభల, ధ్రమనాగ్నివర్తిమదానిలార్తి
భామ లుక్కడంచు మన్నీలఁ గొ, ల్వ
ముదం తేమి జనాళికిన్ ...
మల్లభూ. ౩. ౨౫.

సీ. .. వల్ దిక్కుల మన్నీలుఁ దక్కఁ
గలుగు, వరనాయకులును వచ్చిరి ...
భార. శల్య. ౧. ౯.

క. మన్నిలబలిమి గల దని, యున్న మహీ
పాలకడిమి యుండదు రాజ్యా, భ్యున్న
తికి మూలంబ మా, సన్నం బై యుండ
వలయు సమధిక మగుచుక ...
రుక్మాం. ౩. ౪౭.

గీ. నగరు వెలువడి పేటసన్నాహమునకు,
హితులు మన్నీలు దుర్గాధిపతులు దొరలు,
వేత్రహస్తులు రాతులు వీరభటులు, ఒలసి
యిరుకంకలను జేరి కొలిచి రాఁగ .
సారంగ. ౧. ౭౦.

శా. లోలత్వంబున మత్తకాశినుల కిల్లం
బొల్లునం జెల్లఁగా, నేలా పెచ్చముసేయ
నెవ్వలన మన్నీ లాధ్యులుం జాలరే ..
పాండు. ౩. ౪౨.

గీ. నింగి నొరయురాకొసిపన్నీని పేని, నీడఁ
జెకటిఁ గొనె నవనీతలంబు
మనుచ. ౪. ౯౪.

క. కేటాడ దొరలసన్నిధి, మాటాడ మదిం
చుచెంచుమన్నీలఁ గరం బూటాడఁ
జేయు నన్నిట, జూటాడనె యుండు
నతఁడు చూచెదరెకదా ..
రా. వి. ౩. ౫౨.

విణ. శ్రేష్ఠము, శ్రేష్ఠుఁడు.
ద్వి. వాటంపుమీసేరు వానిపై రొకటి,
తేఁటి మన్నీలార తేరె మాకుతుని .
ద్వి. క. సా. ౩. ౧౧౧. పా. ౨౦. పం.

మన్ను¹ = మను². వి. ఔ. అనా. (సం. మృత్స్న, క. మణ్ణు. త. మణ్.)
౧. మృత్తిక, మట్టి.
గీ. వినయమున ద్రోణురూపు మన్నన నమర్చి.
భార. ఆది. ౫. ౨౩౨.
గీ. ధూళి యడఁగిన మతి మింటఁ దోఁచె
కంప, జలధరద్రోణి మన్ను పర్జన్యుఁ
డెత్తి, భువిఁ దప్పౌవిభూషిచ్చఁ గడుగ
మెఱయు మృదుమహీగతవసురజోరేఖ
యనఁగ ... ఆము. ౪. ౧౧౦.

౨. భూమి, నేల.
సీ. అరసి మింటికి మంటి కైక్యసందేహంబుఁ
బరిహరింపంగఁ బొల్పడ్డయవధి ..
గీ. ... అరుణుఁ డుదయించెఁ బ్రాగ్దిశాభ్యం
తరమున . కాశీ. ౧. ౧౨౧.
చ. మంటికై, పొరల రథీశుఁ డీ కమలబుద్ధి
ఖురారికిఁ దక్కు. ఆము. ౨. ౩౪.
గీ. పంకము గొరిజ దిగఁబడఁ బఱవ లేవు,
మన్ను లిచ్చ్వేళ రేగటిమన్నులందు ..
మనుచ. ౪. ౨౦.

మంటిపాలుసేయు = నేలఁగలుపు, నాశము
చేయు.
సీ. బహుకాలసాధ్యతపస్స్వ మేఁటికి మంటి
పాలుసేసెద వని పలికె నత్రి ...
చంద్ర. ౩. ౧౯.

మన్నుమిన్ను గానకుండుట = క్రిందుమీఁదు
తెలియఁగకుండుట, మిక్కిలి గర్వితుఁడై
యుండుట.
శా. చేతోవీధి భవన్మహామహిమముల్ చింతిం
పఁగా లేక యీ, రీతి న్మన్నును మిన్నుఁ
గానక మదోద్రేకంబునం ద్రుళ్లితిన్.
చంద్ర. ౩. ౭౩.

జ మంటిగూండ్లు, మంటితిండి, మంటినూనె.
మన్నాస, మన్నికశి, మన్నిల్లు, మన్నీఁడు,
మన్నుచూలి, మన్నుకాల్పు, మన్నుతేఁడు.

మన్ను² = మను³. ఒకజాతిజింక, ఋశ్య
మృగము.
సీ. కాఱుప్రాణములఁ జేసి కూర్చి దుప్పులఁ
గొన్ని చెండె మన్నులఁ గొన్ని గుండె
లవియ ... పి. శకుం. ౨. ౧౫.

ద్వి. కన్నుల మసరులు గప్పి యాఁబోతు,
లన్న చండంబున నున్నమన్నులును ...
నవనాథ. ౧. ౩౪. పా. ౩౧. పం.

సీ. ... మ న్నకంగ బుఖ్యము తగు .
అం. భా. ౨. ౭౫.

జ మన్నుఁబిడి, మన్నుఁబెంటి, మన్నుఁబోతు

మన్ను[3], వి. యుద్ధసాధనవిశేషము.

వ. కొంకి మన్ను దగరు మొదలుగాఁ
గలసాధనంబులచేఁ జిక్కాకుపడిచియు.
ఉ. హరి. ౩. ౩౭.

(శ. ర. పా. కొంకి[క్రు]మున్కుడు దగరు వాటిల్ల.
వీరేశ. పా.)

మన్ను[4] = మను[1], అ. క్రి. ఉండు, ఎక్కువ
కాలముండు.

వృషభగతి రగడ. మదిర మది రహిఁ బూని
చకుళము మన్న మున్నన మధుపకోటికి.
వసు. ౩. ౧౪౭.

(వ్యవ.) చేనేఁతబట్ట మన్నినట్లు బొమ్మనేఁత
బట్ట మన్నదు.

మన్నుఁబిడి = మనుఁబిడి. వి. (మన్ను+పిడి)
ఆఁడుఋశ్యమృగము, ఒకజాతియాఁడుజింక.

వ. పులితూనల్ గవరాలు కస్తురిమెకంబుల్
లేళ్లు కుందేళ్లు పం, దులు కార్పోతు
లెలుంగు లేదులును మన్నుంటిళ్లు నివ్వంగి
ను, ల్లలమొత్తంబు. యయా. ౧. ౧౦౪.

మన్నుఁబెంటి. వి. (మన్ను[2] + పెంటి) ఆఁడు
ఋశ్యమృగము.

సీ. ఒకచేతఁ బో తొంట నొకమన్నుఁబెంటి
గా నొక్కఁ డార్చినయాట లొప్పి చెల్లె.
కళా. ౪. ౯౩.

మన్నుఁబోతు. వి. (మన్ను[2] + పోతు) పురు
ఁడుఋశ్యమృగము, ఒకజాతి మగజింక.

గీ. నల్లసేవపుగుండులు నడచినట్లు, మంపు గొని
మేరయుఱుంగక మలసిమలసి, తనడు వాతికి
నులుకంగ నెగసి మన్నుఁబోతు వెడ
చొచ్చి దాఁటెడు పొదలువోరె ...
ఉ. హరి. ౪. ౨౭.

ద్వి. మఱచి మల్లడిగొనుమన్నుఁబోతులును.
నవనాథ ౨. ౧౦౨. పా. ౭. పం.

మన్నుచూలి. వి. (√మన్ను[1]) భూపుత్త్రి,
సీతాదేవి.

ఆ. ఏఁగుడెంచి సొగసు తేర్పడ నమన్ను,
చూలి[ప్ర]మోల నిలిచి సారిదిఁ బలికె ...
అచ్చ. రా. సుం. ౩౭.

(ఇక్లే మన్నుకానుపు మొ.)

గీ. అని తలంచుచునున్నచో నంతలోన, మన్ను
కానుపుసొగ సెల్ల మదిని నిలిపి
అచ్చ. రా. సుం. ౩౩.

మన్నుతాలు(ల్పు)వు. వి. (√మన్ను[1]) భూ
ధరము. పర్వతము.

గీ. తెరువుబడలిక లన్నియుఁ దీర్చి వారిఁ,
దనిపె నెద నెన్న నమ్మన్నుతాల్పు
మిన్న . అచ్చ. రా. అయో. ౧౦౪.

మన్నుఱేఁడు. వి. (√మన్ను[1]) భూపతి,
రాజు.

ఉ. పైటభక్తైత్యవైరి యధికం బగుసేర్పున
మన్నుఱేని కు, చ్చాటన మాచరించి తన
ఒంటు ఖగేంద్రునిఁ బంచెఁ గ్రమ్మఱన్.
కాశీ. ౨. ౧౪౧.

గీ. మన్నగకతోడఁ గొండఱు మన్నుఱేండ్లు,
గోరి సింగాణి గొనయంబుఁ గూర్పఁ
బూని, పొదివి చేతులఁ బొరలించి పుడమి
పైని, సెగయ నెత్తఁగ నింతయు నేరరైరి.
అచ్చ. రా. బాల. ౧౪౫.

**మన్నె(ఁడు) = మన్నీఁడు.** వి. రాజు, సామంత రాజు.

గీ. సకలప్రబాంధవసంబంధు లోకవంక
నుదుటు మన్నెకొమారు లొక్కవంక ..
వి. పు. పీఠి. ౧౮.

సీ. జన్న పన్నము గాఁగ మన్నమన్నెలవాఁక
కొన్నంటి రాఁ జన్న విభుతపంబు .
అహలా. ౩. ౪౧.

సీ. వేరుమందరముల మించఁ గల్గిన మన్నె
యుద్దండనాథు లొక్కొక్క వంక .
తపతీ. ౧. ౧౪.

జ. మన్నెతీకము.

**మన్నెకాఁడు.** వి. (మన్నెము + కాఁడు) ప్రభువు.

గీ. శిరసుపై జాటిల్లి చెండు దండలరీతి మణి
జాలముల నించుమన్నెకాఁడు ..
తపతీ. ౧. ౪.

**మన్నెదొర.** వి. (మన్నెము + దొర) అధిపతి, ప్రభువు.

చ. ముదిపోలదిండి చేటు తమమూఁకల కొండల
పాటు వేల్పుమ, న్నెదొరల గెల్చినిటుఁ
గని . ఉ. రా. ౪. ౩౦౬.

ఉ. మావుల నేలుమన్నెదొర మందసమీరుని
సంగడంబు నై, త్తావులతావు తామరలతం
పర జాజితోలంగుఁబావ లేఁ, దీవమిటారి
జవ్వనపుదీము పికాళుల మెట్టపంట క్రొం,
బూవిలుకాని సాహిణపుఁ బ్రోపరి యామని
వచ్చె నత్తతిన్ .
కృ. శకుం. ౧. ౪౦. శుక. ౧. ౨౪౧.

**మన్నె(న్నియ)ము.** వి. (సం. మాన్యమ్ - కొన్నియెడల వృత్తిని ముతర్ణలోపము. ఉదా. మన్నెదొర, మన్నెముల్లు మొ.)

౧. సన్మానించి యిచ్చిన భూభాగము.

ద్వి. అనయంబు రజతాద్రి యట్టిదుర్గంబు,
మనకుఁ గల్గఁగ జేతె మన్నెముల్ చేసి,
కొనియుండి నేల యీ వనదుర్గమందు ...
బస. పు. ౩. ౫౪౭. పం.

౨. పర్వతప్రాంతప్రదేశము.

చ. తమఁ గురుమన్నె భుంగవానచారిజనం బెడ
దోవదృష్టి కు, ద్యాను గడుగంగఁ
బూన్కి .. ఆము. ౪. ౨౫౪.

(చూ. మన్నియ ప్రుచ్చు.)

౩. దుర్గమప్రదేశము.

గీ. మన్నె మన మండె మనఁగను మాడె
వనఁగ దుర్గమస్థలవాము పై తోఁచు
చుండు .. ఆ. భా. ౨. ౪.

౪. నివాసస్థానము.

క. మున్నింటికటికిచీకటి, మన్నెమునకు వీడు
కొలువుం దిది యనఁగా, నున్నని
చెక్కుల ధవళిమ, చెన్నొందం గప్పురంబు
చిలికిన జాడన్ . సుద. ౨. ౯౨.

మన్నెముదన్ను = నివాస మేర్పఱచుకొన.

ఉ. ఈసునఁ బుష్పసాయకుని డేటుసకుం
గడు దూరమైనదు, ర్వ్యాసుని సమ్మనంబునఁ
దిరంబుగ మన్నెముదన్ని రాజ్యసింహాసన
మెక్కకుండఁ దను సాఁగిన క్రోధముఁ
జూచి భీతిమై, వాసవుఁ డొయ్యనొయ్య
నఖ్రవాలిచె జెప్పలు వేయఁ గన్నులన్.
నైష. ౪. ౪౭.

జ: మన్నియ ప్రుచ్చు, మన్నెకాఁడు, మన్నె
దొర, మన్నెముల్లు, మన్నెరాజు, మన్నె
వాఁడు.

**మన్నెముల్లు.** వి. (√మన్నెము.) మేఁకల కాలిగిట్టలలోనిముల్లు తీసెడుపెద్దసూది.

గీ. తాలబుడిగెలు నొడిసెల ప్రాంతమెట్లు,
మలపమందుల పొడి బుజ్జి మన్నెముల్లు,
తోలుకుళ్లాయి తొడుపును దొడ్డికంప,
చుట్టు చవిరెయుఁ గొమరొప్ప సాలయు
నతఁడు . హంస. ౨. ౭౫.

**మన్నెరాజే.** వి. (√మన్నెము.) మండలాధిపతి, సామంతరాజు.

వ. ‘ సమీపంబునం గూర్చున్న మన్నెరాజుల భూషణరత్నకిరణరాజులచే విరాజితం బగుకొలువుకూటంబు చొచ్చి
ప్రబోధ. ౧. ౨౫.

**మన్నెరి.** వి. ఒకానొక జాతిమనుష్యుఁడు.

వ. మైలారి మన్నెరి తలారి తురుక పింజారి విప్రవినోదులును హంస. ౩ ౭౯.

**మన్నెతికము.** వి. (మన్నె + తికము) ప్రభుత్వము, అధికారము.

ఉ. కన్నులవింటివాఁడ తెగకన్నులదేవరతోడఁ
బోరి ము, న్నెన్నడు నొంది మే
దోఁచుఁగుపట్టున నెక్కుడ డాఁగిపోయె నీ,
మన్నెతికంబు ... నీలా. ౩. ౧౯.

క. క్రొన్ననవిల్తుఁడు నాకను, సన్నల వత్తిల్లు
సురతసామ్రాజ్యగతిన్, గన్నెతికంబుల
వలపుల, మన్నెతికం బెఱఁగి విటుల మహి
నేఁ గొందున్ .. వైజ. ౨. ౬౦.
కువల. ౫ ౯౪. ఆం. భా. ౨. ౧౭౩.

**మన్నెవాఁడు.** వి. (మన్నెము + వాఁడు.) రాజు, సామంతరాజు.

సీ. తెలగాణభూములఁ గలమన్నెవారిచే బల
వంతమునను గప్పములు గొనిరొ
వి. పు. ౧. ౪౧.

ఆ. పదరి కృష్ణ దాఁటి పదపద మని వచ్చి,
యొక్కమన్నెవాని శౌర్య లేక, తిరిగి
నట్టు లరయ్యఁ దలియంగ రాయల, యొకట్టఁ
?డివరిపులు బ్రదుకఁ గంరె .
కృష్ణ. ౩. ౪౪.

గీ. మనవిసనవుల కేతెంచి మన్నెవారు, వేళ
యొవు దొనొకో యని వేఁడుచుండ .
సారంగ. ౧. ౭౨.

**మన్మథ.** సం. వి. అ. పుం. అఱువదిసంవత్సరములలో నొకటి.

**మన్మథబాణాలు.** సం. వి. అ. పుం. బ. ధాన్యవిశేషము, ఒకదినుసు వడ్లు.

సీ. మన్మథబాణాలు మనువంపుమొలకలు సన్న
మణిం?లు జున్నుఁబ్రాలు ...
హంస. ౪. ౧౭౯.

**మన్మథము.** సం. వి. అ. పుం. ౧. కామచింత. (శే. ని.) ౨. కపిత్థము, వెలఁగ. †.

**మన్మథయుద్ధము.** సం. వి. అ. న. రతి, సురతము.

**మన్మథలేఖము.** సం. వి. అ. పుం. వలపుకమ్మ, నాయికానాయకులు పరస్పరము వ్రాసికొనెడి యుత్తరము.

**మన్మథానందము.** సం. వి. అ. పుం. ౧. ఒకదినుసు మామిడి. †. ౨. సురతసౌఖ్యము.

**మన్మథాలయము.** సం. వి. అ. పుం. ౧. మామిడిచెట్టు. ౨. యోని. భగము.

**మన్మథుఁడు.** సం. వి. అ. పుం. కామదేవుఁడు. మారుఁడు.

**మన్మనము.** ౧. రహస్యమైన గుసగుసలు, రహస్యముగా గుసగుస లాడుట. ౨. గద్గదధ్వని. (త్రి. ని.)

**మన్యా.** సం. వి. ఆ. స్త్రీ. ౧. మెడయెముక, కంఠమునకు వెనుకయెముక. ౨. తెలివి, జ్ఞానము.

**మన్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) (ఇది సమాసాంతమునందే యుండును.) ౧. తన్ను గుఱించి యనుకొనువాఁడు.) పండితం మన్యుఁడు తన్ను పండితునిగాఁ దలఁచి కొనువాఁడు. ఇక్లె ధన్యం మన్యుఁడు. వె. ౨. అట్లు కని పించెడివాఁడు.

**మన్యుమంతుఁడు.** సం. విణ. (త్. మతీ. త్.) ౧. కోపి, కోపము గలవాఁడు. ౨. విచార వంతుఁడు; దుఃఖి. ౩. ప్రచండమైనవాఁడు, ఉగ్రుఁడు.

**మన్యువు.** సం. వి. ఉ. పుం. ౧. కృప, దయ. ౨. కోపము, క్రోధము. ౩. దైన్యము. ౪. దుఃఖము. ౫. యజ్ఞము. విణ. (ఉ) మేధావి. (శే. వి.)

**మన్వంతరము.** సం. వి. అ. న. డెబ్బదియొక్క దివ్యయుగములకాలము.

**మపుష్టకము.** సం. = మకుష్టకము, వనముద్గ. అడవిపెసరు †.

**మప్పితము.** విణ. (√మప్పు) మితము, పరిమితము. (శ. ర.)

(వ్యవ.) అతఁ డెల్లప్పుడును మప్పితముఁ గా సొమ్ము వెచ్చించును.

**మప్పు = మరపు.** స. క్రి. నేర్పు, అభ్యసింపఁ జేయు. (శ. ర.)

(వ్యవ.) తండ్రి కొడుకునకు మంచిబుద్ధులు మప్పినాఁడు.

జ. మప్పితము.

**మబ్బు.** వి. (క. మబ్బు, త. మప్పు.) ౧. మేఘము, మొయిలు.

చ. పెళపెళ మబ్బు బిట్టుఱుము భీతి విదూర కిలాంకురచ్ఛటో, త్పులకిని యై ...
ఆము. ౪. ౧౦౧.

సీ. ములకొల్పు మెయి ఛాయమబ్బులు గ్రమ్మక యొదకొఁక పెన్నెండ వతిలఁ గలచ ...
నీలా. ౧. ౧౦౩.

౨. చీఁకటి, అంధకారము.

క. అల్లది కంటే పొనపొవ, జెల్లనిగట్టుఱత మబ్బు దేజెర్ధుపాలమం, జెల్లెడఁ జూచిన ధరణీవల్లభ శ్రీరాముసేన వాలుమెకంబుల్.
మనుచ. ౪. ౧౬.

క. కట్టి తనమూఱు గా న, ద్దిట్ట గృహ స్తంభ మునఁ బ్రతిష్ఠించి నరుల్, మిట్టాడనియా జెడిదపు నట్టకనడురేయి మబ్బునం జెలి చనియెఁ.
వేం. పంచ. ౧. ౨౫౯.

చ. దినమునిదాఘు వేఁగ జగతిన్ నిశ నాఁగ ఘనాగమంబు దార్కొన సాంధ్య రాగపు మెఱుంగు మెఱుంగు గ మబ్బు మబ్బుగాఁ, దనరఁ దదంబుదాంతరగత స్ఫుటమూర్తికముల్ గ్రహించి యు, య్యని మిషరాశి రాశి నిడిరా దివిసాఁ దనరారెఁ దారకల్ ...
ముకుంద. ౩. ౪౩.

౩. మత్తు, మాంద్యము, మగత.

ద్వి. అకుంఠకర్ణుండు నమ్మందిరమునఁ, జె ల్కు వేలెండ్లును జెనుమబ్బు గవిసి, నిదుర వోవఁగ లంక నిచ్చలు పంక్తి, వదనుండు వెలఁవడి వసుధఁ గ్రుమ్మరుచు ...
రం. రా. యు. ౨౯. పొ. ౨౪. పంక్తి.

సీ. మదిరారసముగబ్బు మాటలతబ్బిబ్బు కొద ముగుబ్బలయుబ్బు నిదురమబ్బు ...
దశా. ౯. ౩౩.

గీ. ... మదసంజ్ఞ యొల్లపిల్లు, మబ్బు లాహిరి
యనఁగను మాతృభూత ...
ఆం. భా. ౨. ౩౦౩.

౪. అజ్ఞానము.

మ. అని ప్రార్థించి మనంబులోఁ దలిసి యాహా
తెల్వి లేదయ్యె మ్మబ్బునకున్ లోనయి
నాఁడ ... చంద్రా. ౪. ౨౬.

మబ్బుత్రోపరి = వాయువు.

సీ. మబ్బుత్రోపరిహూన గొబ్బున వానిసింగాణి
మత్తునియలు గా నడంప ...
అచ్చ. రా. సుం. ౧౧౯.

(మబ్బుతేపరి. శ. ర. పా)

మబ్బురవు (రా)తు = మేఘవాహనుఁడు,
ఇంద్రుఁడు.

క. .. తూరుపుదొర మ, బ్బురవుతు వేగంటి
యనన్, సురనాథుని పేళ్లు చెల్లు ...
ఆం. భా. ౧. ౪౭.

మబ్బు తత్తడిరాతు = మేఘవాహనుఁడు,
ఇంద్రుఁడు.

సీ. తఱిపేరిమబ్బు తత్తడిరాతు తామసావళి
నొంప నెత్తినవజ్ర మనఁగ ..
చంద్రా. ౫. ౫౪.

మబ్బునీరానుపిట్ట = వానకోయిల.

గీ. వానకోయిల మబ్బునీరానుపిట్ట, యనఁగ.
సాం. ని. తిర్య. ౭౨.

మబ్బులపగదాయ = గాలి. సాంని. దేవ. ౧౩.

జ. మబ్బుకొను, మబ్బుచేయు, మబ్బుత్రోవ,
మబ్బుపూ, మబ్బుపూనిసువు, మబ్బుపూపు
ట్టువు, మబ్బుపూవిడుపు, మబ్బురాయుంట,
మబ్బుటా, మబ్బువోడుచు.

మబ్బుకొను. అ. క్రి. (√మబ్బు) మత్తిల్లు.

ఉ. గబ్బిపిసాళివాలుఁదలికన్నుల కేటమిటారి
చూపులన్, మబ్బుకొనంగఁ జేసి విటమాన
సమూల్ దమిపెల్లి ముంపుచున్ ...
రాజ. చ. ౧. ౪౭.

వ. ... మబ్బుకొనుచయనుగుబ్బల బిబ్బరంబు
గనిపుడులివుటలన్ .. పారి. ౨. ౫౨.

మబ్బుచేయు. స. క్రి. (√మబ్బు) తగ్గించు,
ఆఱు (దీపము మొ.)

(వ్యవ.) చాకలి కాగడా మబ్బుచేసినాఁడు.

మబ్బుత్రోవ. వి. (√మబ్బు) ఆకాశము.

ఆ. చదలు నింగి యాకసము మబ్బుత్రోవ,
యు, ప్వరము ... అవ నభం బై తళు.
ఆం. భా. ౧. ౬౯.

మబ్బుపూ(వు). వి. (√మబ్బు) నీరు, జలము.

(చూ. మబ్బుపూపుట్టువు.)

మబ్బుపూవులవెల్లి = సముద్రము.
సాం. ని. దేవ. ౧౪.

మబ్బుపూనిసువు. (మబ్బుపూవు + నిసువు)
అగ్ని.

క. ... మబ్బుపూనిసు వనఁగాఁ, దగు వహ్ని
దేవతాఖ్యలు . ఆం. భా. ౧. ౪౪.

మబ్బుపూపుట్టువు. వి. (√మబ్బుపూ) తామర
పూవు.

సీ. మబ్బుపూపుట్టువుమాళిగలో సుందుగుబ్బెత
నెదఁ జేర్చి యబ్బురజేజ. ప్రబంధ. ౧౫౩.

మబ్బుపూవిడుపు. (√మబ్బు) జలముచయు,
మేఘము.

వ. ... మబ్బుపూవిడుపు నిద్దాకప్పు కప్పు
నెమ్మేనివాఁడ . . ప్రబంధ. ౨౧౬.

మబ్బురాయుంట. వి. (మబ్బు + రాయి +
ఉంట) మత్తువస్తువులుకలిసి చేసినమందు.

క. ... మచ్చువగలుచేయు మబ్బురాయుంటల
  మేపులను ... ప్రబంధ. ౭౮.

సీ. లాహిరీవస్తువు లక్కలయఁ జేర్చినమందు
  మబ్బురాయుం టన మనుచునుండు ...
  ఆం. భా. ౨. ౩౦౪.

**మబ్బుతా.** వి. (√మబ్బు) వడగల్లు, వర్షోపలము.

సీ. గుడుగువాల్ మబ్బుతాపిడుగు వానకుఁగట్టు
  గొడుగు వాటము దాల్చువడుగువాఁడు.
  ప్రబంధ. ౨౧౭. (౩).

**మబ్బువోడుచు.** క. క్రి. (√మబ్బు) మఁగతఁ గొలుపు, చేష్టారహితముగఁజేయు, చంపు.

సీ. మదమబ్బుబలుఁగబ్బు మయిబెబ్బులిని సుబ్బ
  వడి గొబ్బునను మబ్బువోడిచె నొకఁడు.
  రా. వి. ౩. ౬౪.

**మభ్యపెట్టు.** స. క్రి. మోసముచేయు, ఉపాయముగా దాఁటువేయు. (శ. ర)

**మమకారము.** సం వి. అ. పుం. నాది యను నభిమానము.

**మమత.** సం. వి. ఆ. స్త్రీ. ౧. తనదియను కొనుట; నాది యనుకొనుట. ౨. గర్వము, స్వాభిమానము. ౩. అహంకారము.

**మమత్వము.** సం. వి. అ. న. = మమత.

**మమాపతాలము.** సం. వి. అ. పుం. విషయము, ఇంద్రియార్థము.

**మమ్మ.** (మ్మా) అవ్య. ప్రశంసార్థకము.

మ. . వా, పురె యాలాపము స్థాయి యారగమకంబుల్ మమ్మ గీతంబుల, ద్దిర ...
  సమీర, ౬. ౨౦౧.

ద్వి. మమ్మ నీ కితవమైనమాట లే దెందు, మమ్మరసేయక మతిక్కఁ జూడు ...
  ద్వి. తి. సా. ౨౨. పా. ౬. పం.

శా. ... ఓవలోచన, శార్కరం బద్దిర జాతి వార్తలు పురే ధారాసమారూఢి మ, మ్మారారాజదలంక్రియల్ కవులలో మాన్యుండవై వన్నిటన్ .. ప్రబంధ. ౩౯.

సీ. భళిర నితంబబింబంబు సౌందర్యంబు మమ్మా కృశావలగ్నమ్మ చెలువు ...
  శ్రీరంగ ౪. ౯౬౨.

**మమ్మటుఁడు.** సం. వి. అ. పుం. కావ్యప్రకాశిక యను గ్రంథమును రచించిన యొకయాలంకారికుఁడు.

**మమ్మరే = మమ్మారె.** అవ్య. ప్రశంసార్థకము.

గీ. అలయశోదాకిశోరకం బా సుభద్ర, కలికి పైనోడు నాపాలఁ గలిగ నేఁడు, మమ్మరే యని పులకించి మందయాన, తుందిలానంద కందళికంద మయ్యె. రా. వి. ౧. ౯౨.

**మమ్మాయి.** వి. ఒకవిధమగు లేహము. (శ. ర.)

**మమ్మారె (రే) = మమ్మరే.** అవ్య. ప్రశంసార్థకము.

శా. మాయాసింహము కైతవిం గడువడి న్మమ్మారె చించెన్ నిజ, చ్ఛాయాగ్రాహిణిసైనసింహికఁ జక్కాసమ్మార్తి వత్సుగ్రుఁడై
  చం. రా. ౭. ౧౪.

ద్వి. ఉల్లాఘము గఁ బట్టి యూరుల నొక్క, మల్లుండు మెచ్చి మమ్మారె యటంచు.
  అ. మ. క. ౩. ౧౫౧. పా. ౧౯. పం.

**మమ్ము.** వి. సముద్రమునీఁద ఓడలకు విఘాతముగా వీచెడు సుడిగాలి విశేషము. (శ. ర.)

**మయటము.** సం. వి. అ. పుం. తృణకుటీరము, గడ్డియిల్లు. (విల్యమ్సు)

**మయము.** ప్ర. వికార ప్రాచుర్యాద్యర్థముల యందు సంస్కృతపదములపై వచ్చు తద్ధిత ప్రత్యయము.

౧. వికారార్థకము.

(ఉదా. కనకమయము.)

౨. రూపము, తదాత్మకము అను నర్థమును దెలుపును.

(ఉదా: కాష్ఠమయము.)

౩. బాహుళ్యార్థకము.

(ఉదా. తేజోమయము, జలమయము మొ.)

(కొందఱు మహాకవులు తెలుఁగుశబ్దములపై సయితము ప్రాచుర్యార్థమున ఈ ప్రత్యయమును వాడిరి.)

ఆ. ... తెలిసలిపెంజెఱొరచ, చుంబు నదలు దమమయంబు గాఁగ. నిర్వ. ౬. ౪౭.

గీ. పడినదివిజకాయంబులఁ బ్రథనభూమి, మెదడుప్రోవులమయ మయ్యె మిక్కుటముగ. హరి. ఉ ౧౦. ౫౫.

ఉ. ... పై నిఖిలంబును దనమయంబుగ సంతమసంబు వచ్చినన్ ...
దశకు. ౫. ౩౧. హరి. ఉ. ౬. ౧౬౫.

వి. అ. పుం. ౧. ఉష్ట్రము, ఒంటె. ౨. వేసడము, కంచరగాడిద ౩. హింసనము. ౪. ప్రక్షేపణము. (శ. ని.)

**మయము.** వి. మధ్యము, నడిమిభాగము.
(వ్యవ.) ఆ చెఱువుమయమున స్తంభము కలదు.

**మయష్టకము.** సం. వి. అ. పుం. వనముద్గము, అడవిపెసర. శ. (వై. ని.)

**మయష్టము.** సం. వి. = మయష్టకము. (రా. ని.)

**మయి**[1] = **మెయి**[1].

౧. శరీరము.

గీ. మేను మెయ్యను మై మయి మే మెయి యొడ, లన శరీరంబు దగు .. ఆం. భా. ౨. ౧౩౪.

క. ఏపుణ్యంబులు చేసితి, మాపదముల కరఁగి నంత మయితో నేఁగన్, బ్రాపించు నొక్క స్వర్గము, పాపాత్మ నృపాల వర్తిపోక వి వేలా .. ఉ. హరిశ్చ. ౪. ౧౫౨.

మ. వడగాలి న్మయి గంద స్రుక్కఁబడు తేవన్ సాలమూలంబులన్, నుడుఁగంబాటి ననీడలన్ ధరణి సంభూతోష్మచేతన్ బడిన్, ?డిఁ గన్పట్టిన యగ్గిబొబ్బలగతిన్ భాసిల్లి .. పాడరొండ ల్పొలుపార చంద్రా. ౨. ౩౦.

౨. మార్గము.

క. నీతిమయిఁ దనకు భూమిజ, నాతతపరివారభరనిరాతంకొత్తుం, దై తిరుగ విడువ కొజికిఁ, గాతూహలియగు విపత్తుగర్వము ఏనివొమన్ రఘువ. ౪. ౭౨.

జ. మయికొను, మయికోలు, మయిచాయ, మయిజాలు, మయిజాలుచీర, మయితాలుపు, మయితెంచు, మయిపూఁత, మయిమఱచు, మయిమఱపు, మయిమఱువు, మయివడి.

**మయి**[2] = **మై**[2].

**మయికము** = **మైకము.** వి. మదము, మత్తు. (చి. ని.)

**మయికొను** = **మైకొను.** స. క్రి. సమ్మతించు. (చూ. మయికోలు)

**మయికోలు** = **మైకోలు.** వి. సమ్మతి. (శ.గ.)

మయిచాయ = మైచాయ. వి. (మయి¹ + చాయ) దేహకాంతి.

మయిజాఱు = మైజాఱు. వి. (√మయి¹) కాంతరొడ మెడమునగా నడ్డకమ్ములు వాలిం చిన స్త్రీల చీరకొంగు. (శ. ర.)

మయిజాఱుచీర = మైజాఱుచీర. వి. (మయి జాఱు + చీర) మయిజాఱుగలచీర.

మయితాలువు = మైతాలువు. వి. (√మయి¹) (ప్రాణి, శరీరి, జంతువు. (శ. ర.)

మయితెంచు = మైతెంచు. స. క్రి. సమ్మ తించు.

మయిద¹ = మైద¹. వి. (సం. మాంద్యమ్) మత్తత, మైకము. (శ. ర.)

మయిద² = మైద². వి. గోరంట కై. (శ. ర.)

మయిదు = మైదు.

వి. మాయ.

సీ. మయిదులతిప్ప సేమములు నిల్వఁగ నీడ యిరువాల్గు మేనుల పెరువరొుడలు ...

శివలీలా. ౧.

జ: మయిదుపడు.

మయిదుపడు = మైదుపడు. అ. క్రి. (భ్రమ పడు.)

మయినము = మైనము. వి. సిక్థకము, తేనె పట్టులోనితేనె తీసివేయఁగా మిగులు మెత్తని పదార్థము.

ఉ. శ్రీపతివిరాఁదిగీతముల ప్రేమ విపంచిక నంటుఁ బాణిసం, తాపము సోఁకి మెట్లు మయినంబు గరంగిన, ఆము. ౫ ౧౫౩.

మయిపూఁత = మైపూఁత. వి. (మయి¹ + పూఁత) అంగరాగము, మేనికిఁ బూసికొను చందనాదిద్రవ్యము, కలపము.

చ. కరమునురక్తి భూవిభుఁడు కంజదళాయత చారునేత్రపైఁ, బోరఁబోరఁ జల్లునీటు మయి పూఁత గరంగిన . వి.క్ర. ౫. ౫౫.

మయిమయి = మైమై.

మయిమఱచు = మైమఱచు. అ. క్రి. (మయి¹ + మఱచు) పారవశ్యము నందు, ఒడలెఱుఁగకుండు.

మయిమఱపు = మైమఱపు. వి. (మయి¹ + మఱపు) ఒడలెఱుఁగమి, పారవశ్యము.

మయిమఱువు = మైమఱువు. వి. (మయి¹+ మఱువు) కవచము.

మయిల = మైల. వి. (సం. మలినమ్.)

ధూళి.

ద్వి. మయిల వడ్డదియు దుర్మాంసదోషంబొ, ఆయిరయు వెండియు నశీదోషంబొ ...

బస. పు. 3. ౩౯౦. పం.

జ: మయిలపడు.

మయిలక్రోలు = మైలక్రోలు. వి. మురళి (బ. మయిల క్రోళ్లు.)

గీ. మధురగానవినాదముల్ మయిలక్రోళ్లు, వెలయఁ బూరించు నాదముల్ గలయఁ బడఁగ, వందిమాగధజనకూత బృంద వివిధ, ఘోషణంబులు నిరుగేలంతలఁ కెలంగ భా. రా. బాల. ౬౭౩.

మయిలపడు = మైలపడు. అ. క్రి. మలినమగు, ధూళి కలదియగు.

మయిలారి = మైలారి. వి. ఒకానొకక్షుద్ర దేవతను పూజించువాఁడు.

మయిలారు = మైలారు. వి. ఒకానొక క్షుద్ర దేవత.

మయిలుతుత్తము = మైలుతుత్తము.

మయివడి = మైవడి.

మయిసరి = మైసరి. వి. నాట్యభేదము.

మయుఁడు. సం. వి. అ. పుం. అసురులశిల్పి. (ఇతఁడు ధర్మరాజునకు సభ నిర్మించి యిచ్చెను.)

మయువు. సం. వి. ఉ. పుం. ౧. కిన్నరుఁడు, దేవతాగాయకుఁడు. ౨. దుప్పి, జింక. ౩. ప్రక్షేపము. (శే. ని.)

మయూకము. సం. వి. అ. పుం. నెమిలి మయూరము. (వై. ని.)

మయూఖము. సం. వి. అ. పుం. ౧. కిరణము. ౨. అందము. ౩. మంట, జ్వాలము. ౪. కీల, చీల. ౫. కాంతి, వెలుఁగు.

మయూరకము. సం. వి. అ. పుం. ౧. నెమిలి. ౨. నెమిలిజుట్టు కూ. ౩. ఉత్తరేను కూ. ౪. మయిలుతుత్తము.

మయూరకేతువు. సం. వి ఉ. పుం. కార్తికేయుఁడు, కుమారస్వామి.

మయూరగ్రీవకము. సం. వి. అ. పుం. మయిలుతుత్తము. (రా. ని.)

మయూరచూడ, సం. వి. ఆ. స్త్రీ. మయూరశిఖ, క్షుపభేదము కూ.

మయూరతుత్థము. సం. వి. అ. న. మయిలుతుత్తము. (రా. ని.)

మయూరము. సం. వి. అ. పుం. ౧. నెమిలి. ౨. నెమిలి జుట్టు కూ. ౩. కాలపరిమితిని తెలిసికొనుట కుపయోగించుసాధన విశేషము. (విల్యమ్సు.) ౪. ఉత్తరేను కూ. ౫. ఓమము. ౬. మైలుతుత్తము. ౭. కోడి. (వై. ని.) ౮. ఒకజాతిచర్మాసనము. ౯. తులసీభేదము కూ.

మయూరవిదళ. సం. వి. ఆ. స్త్రీ. నల్లతెగడ కూ. (శ. ర.)

మయూరవ్యంసకము. సం. వి. అ. పుం. ధూర్త మయూరము, పెంకి నెమిలి. (కౌముది)

మయూరారి. సం. వి. ఇ. పుం. ఊసరవెల్లి.

మయూరి. సం. వి. ఈ. స్త్రీ. ఆఁడునెమిలి

మయ్యెర. వి. (సం. శ్మశ్రు.) ముఖరోమము, మీసపువెండ్రుక; రోమము, వెండ్రుక.

ఉ. తియ్యనివింటిజోదు రతిదేవిచనుంగవ
నొత్తిగిల్లి యా, య్యెయ్యన వంక చక్కఁ
బడ నొత్తెడుఁ జూచితె పువ్వుబాణముల్,
మయ్యెర వ్రాసెఁ జిత్తరువు మాఁగిలి
మాఁగిలి చిత్రకారుఁ డా, దయ్యము గాక
నిలిపసదానము టిట్టిభ పీని కీఁ దగునే ...
క్రీడా. ౯౭.

(చిత్తరువు కడుకున్నితముగా నున్న దనుట.)

మర. వి. ౧ తిరుగుడుగీల.

౨. కీలు.

(చూ. మరగాలు మొ.)

౩. తిరుగుడు నొక్కు. (శ. ర.)

జ మరకాఁడు, మరకాలు, మరగొమ్మ, మరచుట్టు, మరమేకు, మరసాన.

మరందకము. సం. వి. అ. పుం. మరందము.

మరందము. సం. వి. అ. పుం. పువ్వురసము, పూఁదేనె.

మరకటము. వి. (సం. మర్కటః) మర్కటము, కోఁతి.

గీ. కలికి నినువంటి తెలిగంటిఁ గరుణ లేక,
మరకటపు, గూట మేలీల దొరయఁ జేసెఁ,

దగినమునివరుఁ డగ నైనముగని, గూర్చి,
కజాఁడు దన చేర్పు నడి సేల నదరఁ జేసె.
సమీర. ౨. ౬.

**మరకతప త్రి.** సం. వి. ఈ. స్త్రీ. పాఁచి, ఒకానొక ఓషధి ¶.

**మరకతము.** సం. వి. అ. న. పచ్చ, నవరత్నములలో నొకటి.

**మరకము.** సం. వి. అ. పుం. మారి, అంటు రోగము.

**మరకాఁడు.** వి. (√మర) కర్ణధారుఁడు, ఓడ చుక్కాని పట్టువాఁడు.

సీ. మైరావణుం డను మరకాఁడు చనుదెంచి
రొయ్యి పైనమాయలయోడ నెక్కి ..
మై. ౨. ౫౧.

౨. పంజరము.

సీ. సురరాజునకుఁ బాండుకరిఁ జేర్చుమర
కాఁడు .. మనుచ. ౫. ౪౭.

**మరకా(గా)లు.** వి. (√మర) కృత్రిమ పాదము.

సీ. కారిగేహమునకుఁ జనఁగఁ జాలవికాలు
కాలు గా దది మరకాలు గాని ..
ఘటికా. ౧. ౧౪౪.

ద్వి. మరగాల నడచుచు మట్టుగా లగుచు,
నొరుగాల నడచుచు ధర గంతుగొనుచు.
పండితా. పర్వ. ౩౭౨. పా.

ఆ. ఆలు మగనిమాట కడ్డంబు వచ్చెనా,
యాలు గా దది మరగాలు గాని, యట్టి
యాలు విడిచి తుడవి నుండుట మేలు ..
వేమన. ౨. ౧౫.

**మర(రి)గించు.** స. క్రి. (√మరగు.) ౧. మరగఁజేయు, మప్పు, అలవఱచు, పరిచితము గావించు.

క. సురలు గొనిరి కొంచనవి, స్ఫురదజపాత్ర
మున బలరిపుని వత్సముగా, మరగించి
సవిత దోగ్ధగ, నరు దగు తేజంబు దుగ్ధ మై
సిద్ధింపన్ .. హరి. పూ. ౧. ౧౩౪.

గీ. పిటఁ గలకోడకాం డ్రెల్ల వింతరతులఁ,
జపుల మరగించి భ ర్తము లజ్జయును దీర్చ.
శుక. ౨. ౧౦౧.

రగడ. మునమునకును మీఁదిమ్మతురూపము, మర
గింపక యణిమాదులు డాయవు ...
కాశ. ౨. ౧౫౨.

గీ. యోగి యొయ్యెయ్య మరిగించియుంప
వలయుఁ గుతిగోళంబులో గాలి కుంభక
మున, బలిమి నిలిపిన రోమకూపముల
వెడలి, యది ప్రకల్పించుఁ గుప్తాదు లయిన
రుజల . కాశీ. ౫. ౨౩౫.

౨. ఆసఁగొలుపు, అభిలషింపఁజేయు.

ద్వి. మదగంధములఁ బెక్కు మరగించుకరులు,
వదలక చరియించువనవీథు లొప్ప ..
రం. రా. ఉ. ౪౨. పా. ౪. పం.

వ. అంత మాతల్లి జాణ లగు విప్రపుత్రుల
వైశ్యకుమారులం దోడ్కొని తెచ్చి నన్ను
మరగించి వలపుఁ బొరయ కుండ నల్లనఁ
బడయుం బురికొలిపె. జాహ్నవీ. ౪. ౩౫

గీ. పలలమును జూపి కేగను బట్టురీతి, నవ్యత
సమనాదబిందుకళానుభూతి, సుఖము
నొందించి మరగించి చొక్కఁజేసి, యింద్రి
యములంబు లవి నిగ్రహింప వచ్చు ...
సీతారా. ౧. ౧౧౭.

౩. అనువర్తింపఁజేయు.

ద్వి. చెనఁటి రైయి నిన్నింత చేసినగాధి, తన
యుని మతోత్కపదావాగ్ని శిఖల, సురసుర
కొరియించి క్రుక్కించి నిమ్ము, మరగించి
నీపంపుమానిపిఁజేసి ...
ద్వి. హరిశ్చ. పూ. ౧౬౭౪. పం.

**మర(ఱ)గు.** అ. క్రి. ౧. పరిచితమగు, మచ్చిక పడు.

క. మరగినసింహము మృగములఁ, బొరిగొను చున నరులఁ గాచుపోలిక నంతః, పరిచిత పవనుఁడు నఘములఁ, బొరిగొనుచును నరుల దేహములు రక్షించున్ ...
మార్క. ౩. ౩౯౯.

చ. మరగిన కామధేనువులమందలు పిద్ధరస ప్రవాహముల్, దొరకిన కల్పవృక్షముల తోఁటలుం . ప్రబోధ. ౧. ౧౫.

౨. ఆసఁగొను, ఆసక్తమగు.

గీ. మరగి నీమూర్తిపైఁ గన్ను మనముఁ దగిలి.
భార. విరా. ౨. ౨౦౨.

సీ. మగ లాఁడువారికి మరిగి ప్రొచ్చిలి గంది వట్టి కన్నంబులు వెట్టి కొరవు, ద్రొక్కాని.
కు. సం. ౪. ౭౭౪.

గీ. ఏను భక్తితో మనమున నెంతయేని, మరగి వెదకంగఁ దోఁచినమాడ్కి రూపు, వెల పలను దోఁచె నీతనివెనుక నింకఁ, దగిలి విడువక బంట నై నెగడువాఁడ ..
హ. ఉ. ౫. ౨౨౦.

చ. అంతకు నెక్కుడైనచో, మరిగి వసించుఁ గాని మఱి మానుషభావముఁ బొందఁ డెన్నఁడున్ ... వి. పు. ౩. ౧౩౪.

౩. **అలవాటుపడు.**

క. నెచ్చెలులతోడ నెంతయు, మచ్చికఁ దన యిచ్చ నాడ మరగినయది యై, విచ్చలవిడి నింతకు ము, న్నిచ్చేడియ మెలఁగు కొత్త రొంటుఁగదు సుమిత్రా ..
భార. విరా. ౧. ౨౫౦.

క. మానిని కరపాశంబుల, చే సీగతిఁ గట్టి తెచ్చి జగిదొలఁకెడు పూఁ, బానుపునఁ బెట్ట వలదా, మానధనం బపహరింప మరగినదొంగన్ ... విక్ర. ౮. ౧౦౮.

గీ. ప్రజనిపాపుల నెల్లను వరుసతోడ, పిడుకొని తన్ను నందఱు వేడ్క నసుప, మధుర కేతెంచె ప్రజములో మరిగి తాల్చి, యున్న వేషంబ యొంతయు నొప్ప నొసఁగ.
హరి. ఉ. ౨. ౯౩.

౪. వశపడు, స్వాధీనమగు.

క. దేవర గౌరవమహిమన, మావలసినకవిత మరిగి మాటి నధీశా
కళా. ౭. ౧౪౧.

ద్వి. మరగిపగతిఁ జేరి మలయుచు నంతంత . .
ద్వి. హరిశ్చ. పూ. ౪౦౮. పం.

స. క్రి. ౧. మోహించు, వలచు.

వ. ... అన్యునిన్, మరగినకాంత కాంతులకు మానసగఁ బచ్చిమ గణ్యరోకదా ..
భా. రా. యు. ౨౭౩౫.

క. గురుపత్నిఁ జంద్రుఁ డేమ్మని, వరపత్నిఁ ద్రిదివప్రైకవల్లభుఁడు పరా, శరుఁ డోడ కేవుపడఁతిని, మరుగుటఁ గనుఁడేదు ఇతర మర్త్యుల వశమే .
భోజరా. ౪. ౨౩౦.

౨. అలవాటుచేసికొను, నేర్చుకొను, అభ్యసించు.

క. అనఘా నీవాక్యంబుల, మనంబు నాలి వొంచ శాంతి మరగాద నింకన్
భార. శాం. ౫. ౨౫౪.

గీ. కోరి రాజన్యలోకంబు గొల్చురాజ, మౌళి మణి గేఁడు మునిసేవ మరగివాఁడు
భా. రా. అయో. ౨౫౭.

సీ. .. క్రౌర్యంబునఁ బుడమిజనులఁ, బీడించి ధర్మంబుఁ బెడవాయఁగాఁ ద్రోచి వేద విరుద్ధదుర్వృత్తి మరగి ...
హరి. పూ. ౧. ౯౭.

గీ. కన్యలావణ్యరససుధాగాహనమున, విధుని నయనము లస్పష్టవృత్తిఁ జెంద, మనసు

తదురోజకోహాద్రి మనికి మరగి, మహిత
మరతానుభూతికై మలయుచుండు
వసు. ౩. ౯౬.

౩. గ్రహించు.

(క.) చవిగొను, రుచిచూచు.

సీ. వారణాసీ పురావాస సౌఖ్యంబుల మరగి
వాశ్వతి మమ్ము మరచెనొక్కొ ..
కాశీ. ౭. ౫౫.

గీ. తిరుగు హరిపురి సురతరుసురల మరఁగి ...
యవన పృతన ... ఆము. ౧. ౪౧.

(చ.) అనుభవించు.

సీ. అతనికి నతఁ డిట్టు లను మాంసములచవి
మరగినవానికి మౌన వశమె .
భార. అను. ౪. ౩౦౪.

ద్వి. పరమసౌఖ్యం బైనభామలపొందు, మరు
గనివానిజన్మంబు జన్మంబె ...
ద్వి. పరమ. ౨. ౭౨. పా.

క. మధురరసగుంభనములు గల, మధురపదార్థ
ములచవుల మరగి రసన త, న్మధురిమ
పారెఱుఁ బొగడఁగ, నధిపతి సుఖలీల
నలరె నశనముచేతన్. ఉ. రా. ౭. ౧౭౩.

౪. ఆశించు, అపేక్షించు.

క. కేవలతాయకరంబును, భావలతావాటి
మలయపవనాగము మా, కేవలతాలీలావతి,
కేవల తాకాశ వరగు కృతమతి మనసా.
భీమ. ౪. ౮.

రగడ. మెరమెరనిగోలనిదరి మీా లంచు లకు
ముకులు, మరగా నీకనుదోయి మాయింపు
చకచకలు ..
మనుచ. ౩. ౭౪. సైమ. ౭. ౧౭౨.

౫. ఆశ్రయించు.

గీ. ద్వారకాపురి మరగి కౌంతేయుఁడు గాల,
మిట్టు లుండఁగ నొకతఱి సెసఁగఁజేర్చి,
నచ్యుతుఁడు దీక్షితుం డయ్యె నధ్వరార్థ,
మనుపమద్విజముఖ్యసాహాయ్య మమర.
హరి. ఉ. ౫. ౫౧.

గీ. జీవతతి రచియించు నీచిత్త మిపుడు, మత్ప
దాంబుజయుగళంబు మరగి యున్న, కతన
రజసగుణమునఁ గలుగ దఘము .
భాగ. ౩. ౩౭౦.

జ: మరగించు, మరవు.

**మరగొమ్ము.** వి. (√మర) గుఱ్ఱమువీఁదిజీను
నకు ముందువెనుకలయందు ఆనుకొనుటకై
యెత్తుగా నేర్పఱిచినభాగము.

గీ. వఱలు నేనిక దిండి వార్యమ్ముఁ దొలుతఁ.
గాఁగఁ దా నెక్కి నన్ను దాఁకకయ
దీని, కటివిభాగంబు నెక్కి రాఁగలవె
యబల, వెనుకమరగొమ్ము నూఁతగాఁ
గొనుచు ననిరెు. కళా. ౩. ౭౨. ౩. ౭౧.

**మరచుట్టు.** వి. (√మర) తిరుగుడుచీల, మర
చీల.

చ. కురిసినక్రిందిపుప్పొడులఁ గొంచు నగం
బులమీఁదికై పికం, గరుచులఁ గొన్ని పై
ల్లగసె గాడ్పులసుల్ పతి మాధవుండు
రా, సెరవుగఁ బూవుసా మ్మిడి వసేందిర
భూమికి వెండి మెట్టదా, మరరవణంబు
తాఁ గొన భ్రమద్గతు తామరచుట్టులో
యువన్ .. ఆము. ౫. ౧౭౪.

(శ. ర. పా. 'మలంచుట్టు' ముద్రి. వ్రాఁత
ప్రతిపా.)

**మరణము.** సం. వి. అ. న. ౧. చావు, ప్రాణో
త్క్రమణము. ౨. వత్సనాభము, ఒకజాతి
విషము.

**మరణాలసము.** సం. వి. అ. న. (యౌగ)
ఒకానొక ఆసనము.

శ్లో. పక్షిత్రకర్ణ స్సందయుఙ్క్వా జంఘాయుగ్మ
ప్రసారగాత్, ఏకపాదప్రసారీ చపి
స్యా దథో మరణాలసః. (వై. ని.)

**మరణించు.** సం. అ. క్రి. చచ్చు, మృతినొందు. (శ. ర.)

**మరతకము.** సం = మరకతము. (శ. ర.)

**మరతము.** సం. వి. అ. పుం. ౧. చావు, మృత్యువు. (వాచ.) ౨. అగ్ని. ౩. జంతువు. (శే. ని.)

**మర(రు)వు.** స. క్రి. (√మరచు.) ౧. మరఁగఁజేయు, మప్పు; అలవఱుచు.

క. విమలాత్మ యుపేంద్రయు దా, నము
సత్యముఁ గ్రోధవర్జనంబును విను ము,
త్తమధర్మరాశి యిది ధ, ర్మమునపరమసీమ
దీని మరువుము మదికిన్ ...
భార. అను. ౫. ౪౨౧.

క. ... కోఁతుఁ బడపు మరపఁగ వలయున్.
దశకు. ౫. ౧౭.

గీ. దండి లోభాదిగుణములఁ దరపినాఁడు,
మంచిగుణములు తనయందు మరపినాఁడు.
భాగ. ౭. ౯౯.

ద్వి. తెరలఁ దివ్యనిషండ్లతీపులు మరపి, చరణ
సేవలు సేసి చనవులు మెఱసి ...
ద్వి. పారిశ్చా. ౬. ౭౧౫. పం.

౨. అనఁగొలుపు, అభిలషింపఁజేయు.

క. సిరిఁ జూసి నన్ను లోఁబడ, మరపెద నని
చూచె దేల మనుజేశుని పైఁ, దిర మగు
నామది వాయదు. భా. రా. సుం. ౧౯౪.

ద్వి. హృదయంబు గరుగంగ నిరుచన్నుఁగ
వలు, గదియించి బిగియారఁ గౌఁగిళ్ల
మరపి ...
రం. రా. బాల. ౧౩. పా. ౧౫. పం.

౩. తగపఱుచు.

గీ. కాళి యొక్క కరాళసింగంబు నైన, మర
పుకోఁ గల మొుకయింత మందు పెట్టి,
మాట లిఁక వేయు నేఁటికి మున్నుఁ
జూడు, మనుచుఁ బంతంబు లాడి కొర
దవిఁ జొచ్చి ... వరాహ. ౪. ౯౫.

గీ. తన కసాధ్య మైనతరుణి సాధించుట,
దొరకకేనిఁ దన్ను మరపికొనుట ...
కళాపూర్ణము. ౧. ౩.

**మరమేకు,** వి. (√మర) తిరుగుడుచీల. (శ. ర. (గ్రా.)

**మరల.** అవ్య. ద్రు. (√మరలు) పునరర్థకము.

క. నరపతుల నెల్ల భీష్మున, కరగా నొప్పింపఁ
జాల నే నడవులకున్, మరలం బోయెద
నచటం, దిరిగెదఁ గూరాకు గోసి తిని
యెద ననఘా. భార. భీష్మ. ౨. ౭.

ఆ. మరల నొక్కసారి మిరుగేలఁ బెటికియు,
దీనఁ బగిలె వంచుఁ దిగిచి నైన, వలిగి
యేడుభల్లములఁ ద్రుంచి వేసెగ, ఘుంగ
కముల వేయు నంట సేసె ...
భా. రా. అర. ౧. ౨౪౦.

సీ. మరలఁ బుట్టెడుచందమామయో యది
గాదు మొులకనవ్వులముద్దుమోము గాని.
దశా. ౨. ౨౪౪.

మ. ... కేళితతుల్ గప్పూర వృద్ధాలికిన్,
మరలం బ్రాయము వచ్చెఁ దత్తరుచల
న్మందానిలా సంగతిన్ ... పారి. ౫. ౪౭.

గీ. మగుడ క్రమ్మఱ క్రమ్మటి మరల మారె,...
తిరుగ నా వెలయును బున, రర్థముగ ...
ఆం. భా. ౩. ౭౯.

**మరలఁబడు.** అ. క్రి. (మరలన్ + పడు ప్యార్థ
మున.) ౧. వివర్తిల్లు, వెనుకకుఁ దిరుగు;
విముఖుఁడగు.

క. పవనవిధి పురంబు సుంపఁగ, మనుజేశ్వర
రొల్లజనులు మరలఁబడి కనుం, గొనిరి ..
భార. మా. ౧౪౭.

ఆ. జిహ్వ మరలఁ బడఁగఁ జిలుకల నగ్ని క,
పించె ... భార. అను. ౩. ౧౮౪.

సీ. తనయ నొక్కని కిచ్చి మనకు మరలఁబడి
యన్యున కిచ్చిన యట్టివాఁడు, కృమి
యగు ... భార. అను. ౪. ౨౬౩.

సీ. దండపారుష్యంబు గొండెంబున వతర్క
మరిసంధి కడ యాక మరలఁబడుట ..
అను. ౪. ౨౫౨.

౨. మాఱుపడు.

సీ. రాయంచవడపుఱరాయఁడిఁ దాల్మితామర
తూఁడు దుముదుగా మరలఁబడునొ
కాశ. ౨. ౧౦.

**మరలఁబాటు.** వి. (√మరలఁబడు) మరలఁ
బడుట, తిరుగఁబాటు (చూ. మరలఁబాటు
తనము.)

**మరలఁబాటుతనము.** వి. (√మరలఁబాటు)
ప్రతిఘటన.

సీ. పరకొరుపట్టున దురహంకృతి వహించి
మరలఁబాటుతనాన మసవినాకొ ...
రంగా. ౨. ౧౪౧.

**మరలించు.** స. క్రి. (√మరలు) మరలునట్లు
చేయు, వెనుకకు రాబించు.

గీ. ధనువుఁ దగ చేసి యొక్కపాతకుఁడు
మతునిఁ, బట్టుకొని పోయెనట చేటు
పాటు దలియ, రాక పోగిలెద నీవు
శాత్రవు జయించి, యనుజు మరలించి నా
దుఃఖ మార్పు మనిన ...
జై. భా. ౬. ౧౩౨.

**మరలు.** అ. క్రి. ౧. నివర్తిల్లు.

(క.) వెనుకకుఁబోవు; పోవు.

చ. పసు లటు పోవఁగా మరలఁ బాడిరొ
నీకు నరేంద్రనందనా ...
భార. విరా. ౪. ౫౪.

చ. విని మిము నాజిలోఁ, బొడరి విక్రమ
కాండత మాపు టొక్కఁడుగా, బవియుగ
నేను వచ్చితిని బద్ధసముద్యము లై కడంగుఁ
డిం, క నిహతశత్రుఁ డై మరలుఁ గాక
జరాసుతుఁ డూర కేఁగునే . .
హరి. ఉ. ౧. ౨౯.

(చ.) తిరిగివచ్చు; తిరుగు.

క. సురపురి మధురకు నెక్కడ, సురకాం
తలు మాకు దొరరొ సురభంజన నీ, వరు
గుట యుప్పనిపని కే, మరలుము మామాట
వినుము మముఁ గావఁదగుగా ...
హరి. పూ. ౯. ౧౫౯.

గీ. ప్రాణబాంధవుఁ డైనయప్పతిరాజు,
వర్థమార్గమునం దొయ్య ననుచరింప,
నశ్రుధారాప్రవాహంబు లవధి గాఁగ,
దైన్య మందుచు మరలె శైవర్భిచూడ్కి.
శైవ. ౨. ౧౦౦.

గీ. డెంద మంతయుఁ గఱిపెల్పునందుఁ దగిలి,
మరలఁగా నేర దిఁక ... నీలా. ౨. ౯౬.

వ. శేల్పులు పలాయనపరాయణు లై వెనుక
మరలియుం జూడక పోవం దొడంగిన ...
హర. ౬. ౬౫.

(ట.) వెనుకకుఁ దిరుగు.

గీ. గిలుకుటందెలు ఘల్లనఁ గిరవాణి, మరలి
మరపంక్తి కరుగుచోఁ బిరుదు చక్కఁ,
దనము వెలివేణి చెలువుఁ గర్గొని బలిం
ద్రుఁ, డాదికన్నను మిగుల హాహాంబుఁ
గాంచె ... దశా. ౨. ౩౫౫.

సీ. బాణాదిహేతిసంపాతజాతము లగుమంట
లర్కాంకు మరలఁ ద్రోఁచ ...
భార. ద్రో. ౧. ౧౩౯. ఆం. భా. ౩. ౧౧౪.

(తే.) చల్లారు, శాంతించు.

చ. కెరపులం దక్కు మీయబల వేగమ
కొండిలికేయు మంతలో, మరలు మదీయ
కోపశిఖి మానదు వేఱొకచేయఁ జేసినన్.
భార. ఉద్యో. ౪. ౩౦౭.

(ప.) విముఖమగు.

వ. ... "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత"
యనుమాటలఁ దెలుపంబడు నుత్తమధర్మం
బునకు మగలి తమతమజన్మాంతరకృత
కర్మంబు లాధారంబులుగాఁ బర్ణకీటంబులం
బోలెఁ దనువు లెత్తుదురు ...
కుచేల. ౧. ౫౯.

౨. తిరుగు, ముడివడు.

గీ. అరసి పెదవులం దడుపుచు నరిగి యరిగి,
దొరఁగు నశ్రులు కన్నుఁ దామరల మరలఁ,
గుసుమబాణుని నగఁ జాలుకొమరు కావరు,
విభుఁడు మదిలోనఁ బాయనివెతలు వెతలు.
సారంగ. ౩. ౨౩౨.

జ: మరల, మరలఁబడు, మరలఁబాటు, మరలఁ
బాటుతనము, మరలించు, మరలుచు.

**మరలుచే(ల్చు).** స. క్రి. (√మరలు.) ౧. మరలఁజేయు, నివర్తింపఁజేయు.

క. గురుఁ డన్నిశరము లేసిన, కెరపున
నన్నింటి నన్ని విశిఖంబులఁ దా, మరలిచి
బ్రహ్మాస్త్రపరి, స్ఫురణము చూపినఁ దద
స్త్రము నన యడంచెన్ ...
భార. ద్రో. ౪. ౧౧౩.

౨. విముఖము గావించు.

క. అనవుడు నయ్యంగన యుతఁ, దనంగశర
దళితహృదయుఁ డయ్యె నకట యీ,
తనచిత్తవృత్తి మరలుప, ననుమానం బగు
నుపాయ మది యెయ్యదియో ...
భార. విరా. ౨. ౪౧.

క. శాపభయంబున నెఱయఁగ, నీపైకోరిక
మరల్చి నిధిపతిసుతు నే, పాపవు వేళను
జూచితి, నో పరుసాబ గేను మఱి కనుం
గోన గుణిగాన్ ... కళా. ౪. ౨౧.

చ. అలుకఁ బ్రలంబదానవునిప్రాణముఁ గొంటి
కళిందనందనా, సలిల భరప్రవాహ రథ
సంబు మరల్చితి.
పారి. ౩. ౩౭. నీలా. ౧. ౪౩.

**మరవ.** వి. ఒకజాతి మనుష్యుఁడు.

సీ. ఆంధ్రులు నాభీరు లాభీరకులుఁ గిరాతులుఁ
బుల్కసులుఁ బుళిందులు నరవలు, మర
వలు పొంద లైనమనుజాలు కర్మశేషముల
జనించి దుష్కర్మములను. శేష. ౩. ౭౪.

**మరవలి.** వి. మనుఁగుడుపు. (శ. ర.)

**మరసాన.** వి. కాల్లపనివాని సాధనవిశేషము. (శ. ర.)

**మరాకాలి.** సం. వి. ఈ. స్త్రీ. తెలుమణిచెట్టు.

**మరాటము.** వి. వృక్షవిశేషము, లాంగలి, ఒకానొకచెట్టు. (శ ర.)

**మరాటి.** వి. (సం. మహారాష్ట్రీ.) మహారాష్ట్ర దేశస్థుఁడు. (శ. ర. బ్రౌ.)

**మరాటిమొగ్గ.** వి. ఒకానొక యంగడిదినుసు. (శ. ర.) వీర్యవృద్ధికర మగునొకయౌషధి. (బ్రౌ.)

**మరాయము.** సం. వి. అ. పుం. ౧. ఏకాహ క్రతుభేదము. ౨. మాత్రము. ౩. కుమాలము. (వే. వి.)

**మరారకము.** సం. వి. అ. పుం. ధాన్యపుకొట్టు. (విశ్వము.)

**మరాలకము.** సం. వి. అ. పుం. హంసవిశేషము, మగపెద్దబాతు.

**మరాలము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. సున్నగానున్నది. ౨. అల్పపీతరక్తము. (శే. ని.) వి. అ. పుం. ౧. హంస. ౨. ఎఱ్ఱగన్నేరు చె. ౩. గుఱ్ఱము. ౪. మేఘము. ౫. కాటుక, అంజనము. ౬. దాడింబవనము, దానిమ్మతోట. ౭. కొంచెము పసుపు ఎఱుపును కలిసిన రంగు. (శే. ని.)

**మరి.** వి. ౧. తడవ, పర్యాయము. (ఇది యీ యర్థమున ఒక, ఒక్కొక్క. ఈ శబ్దములు పూర్వమందు కలిగియే ప్రయోగములు గనంబడుచున్నది.)

(ఉదా: ఒకమరి, ఒక్కొకమరి, ఈమరి, మొ.)

క. ... జగద్హితవా, క్రూరులై రొక్కెడ వా
రొక, మరి గోష్ఠీనిరతినుండి మనుజాధీశా.
భార. అను. ౨. ౩౪.

చ. ఒకమరి బుద్ధగింప విలయోదకముల్ పయి
కుబ్బి చిప్పఁగ, చ్చుకొని మహోగ్రవీథిఁ
జన ... ఆము. ౪. ౨౧.

సీ. ఒక్కొక్కమరి నొప్పి నొందకున్న ...
శైవ. ౩. ౧౮౨.

(ఒక్కొక్క పరి భేదం. పా.)

సీ. ఒకమరి గల్పొందు సురలీలఁ దనరుచుఁ
గోమలతో నోమనగుంట లాడు ...
ఇందు. ౨. ౧౪౩.

క. ఆతనితో నొక్కొకమరి, కౌతూహల
వృత్తిఁ దగందొడఁగి మృదు, ద్యూతం
బునఁ గ్రీడింతుం, జేతోముద మొదవ వత్స
శిల్పప్రౌఢిమ ... భార. విరా. ౧. ౭౧.

ద్వి. మతిఁ జేర్చి యొక్కొక్కమరి బసవనికి,
నుతభక్తిరసము కన్నుల కొక్క నొక్క.
పండితా. దీక్షా. ౯౩. పొ.

క. ఇమ్మెయి నలంగి యొకవ్వ, తిమ్మన
క్రీడనిలిచి చనుదెంచుట సా, కిమ్మరి
దడయ వలసె నని ...
భార. అను. ౩. ౨౫౮.

ఉ. ఈమరి యింక నొక్కమరి యింకొక
మా యిఁక నొక్కమాఱు సా, నోముల
పంటగా యనుచు ... క్రీడా. ౮౯.

౨. వాక్యాలంకారము.

క. కప్పటి నౌరగా రైనను, సప్పమునటి
రోగ మైన సతి తులు వైనన్, ముష్టున
దరిద్రుఁ డైనను, దప్పదు మరి దుఃఖ
మగుట తథ్యము సుమతీ ... సు. శ. ౨౭.

అవ్య. యుగపదర్థకము, ఏకకాలమున.

క. తమబంధులుఁ దారును నొ, క్కమరియ
తెగటాఱువారు కరుణారహిత, త్వమునఁ
దొలుమేన ... భార. అను. ౫. ౧౦౯.

చ. ఒకటి పరోపఘాతకర మొక్కటి పంకజ
కాంతితస్కరం, బొకమరి యేల కట్టువడ
కుండు మహీపతియాజ్ఞ గల్గినన్ ...
శైవ. ౬. ౮౯.

**మరించె.** సం. మరణించు. (శ. ర.)

**మరిగొమ్ము.** వి. చెఱువు లోపలివానిలోని నీరు వెలికిఁ బోవుటకై రాలతోఁ గట్టిన మార్గము. (శ. ర. బ్రా.)

**మరిచపత్త్రము.** సం. వి. అ. పుం. సరళ వృక్షము. (రా. ని.)

**మరిచము.** సం. వి. అ. పుం. మిరియపు పొద చె. న మిరియము.

**మరిడి.** వి. ఒకానొక దేవత.

**మరిడిమహాలక్ష్మి.** వి. ఒకదేవత. (శ. ర.)

**మరిడివ్యాధి.** వి. కలరాజాడ్యము, వాంతిభేది రోగము. (శ. ర.)

**మరిమ.** సం. వి. న్. పుం. చావు, మృత్యువు. (విల్యమ్సు.)

**మరియాద.** వి (సం. మర్యాదా.) మేర, హద్దు; మర్యాద; కట్టుబాటు; న్యాయబుద్ధి.

క. నరనాథుఁ గొలిచి యలవడఁ, దిరిగితి నా కేమి యనుచుఁ దేఁకువ లేమిన్, మరియాద దప్ప మెలఁగినఁ, బురుషార్థంబునకు హాని పుట్టక యున్నే.

భార. విరా. ౧. ౧౨౨.

ద్వి. రావణుండైన గర్వము దక్కి వచ్చి, శరణన్నఁ గాకు నేచందంబునైన, మరి యాద లిట్టివి మాకులంబునకు ..

రం. రా. యు. ౩౦౧. పా. ౧౨. పం.

క. జడుఁడైన రోగి యైనను, విడుచుట మరియాద గాదు విభు సంగనకుఁ ..

భాగ. ౧౦. పూ. ౯౪౯.

క సీతరుణి నేను నె త్తము, నీతో నాడుకాడ రుక్మిణి గనుంగొను ని, న్నాతిమరియాద నీవుం, జూతు ... ఉ. హరి. ౩. ౧౧౦.

**మరిష్టకము.** సం. వి. అ. పుం. రాజము ద్గము. కీ. (వై. ని.)

**మరిష్ణువు.** సం. విశే. (ఉ.) చచ్చెడుస్వభావము కలవాఁడు, మర్త్యుఁడైనవాఁడు.

**మరీచము.** సం. వి. అ. పుం. ౧. మిరియపు పొద. కీ. ౨. కక్కోలకము, చలువమిరి యము. (రా. ని.) న. మిరియము.

మరీచి. సం. వి. ఇ. పుం, స్త్రీ. ౧. కిరణము. ౨. వెలుఁగు, కాంతి. ౩. మృగతృష్ణిక, ఎండ మావులు. (శే. ని.) ఇ. పుం. ౧. ప్రజాపతి (ఇతఁడు మొదటిమనువుచేత సృజింపఁబడిన పదిమంది మూలపురుషులలో నొకఁడు.) ౨. ఒకధర్మశాస్త్ర కర్త పేరు. ౩. లోభి, కృప ణుఁడు. ౪. సప్తర్షులలో నొకఁడు, బ్రహ్మ మానస పుత్రులలో నొకఁడు. న్. పుం. సూర్యుఁడు.

**మరీచిక.** సం. వి. అ. స్త్రీ. ౧. మృగతృష్ణ, ఎండమావులు. ౨. ఎనిమిది త్రసరేణువులు. (వై. ని.)

**మరీచిమాలి.** సం. విశే. (న్. నీ. న్.) కిరణ ముల మాలగలవాఁడు

వి. న్. పుం. సూర్యుఁడు.

**మరుండ.** సం. వి. అ. స్త్రీ. ఎత్తైనలలాటము గల స్త్రీ. (విల్యమ్సు.)

**మరుంధనము.** సం. వి. అ. పుం. తెల్లచంద్ర. కీ.

**మరుఁడు.** వి. (సం. స్మరః) మన్మథుఁడు.

మ. మరువాలారుశరంబులం దొరఁగు కమ్మం దేనెతోఁ గూడి .. వైష. ౨. ౯౯.

గీ. కవఱు లంకించి ప్రేయఁ గొ ప్పవిచు వవలి, కరమున నమర్పఁ బైఁటలో మరునిబటువు, బిల్లక్రియఁ బట్టు, గంపెల బిగువుఁ జన్ను, నిక్కఁ దిక్కులఁ బాత్రాళి నెత్త మాడు ... ఆము. ౧. ౫౯.

చ. తొగచెలి తున్కలో మరునితూపులో ...

నీలా. ౧. ౪౦.

మరుమేపుకన్దొర = మన్మథు నాకారముగాఁ గొన్నకన్ను గలప్రభువు.

మ త్తకోకిల. నీటిపుట్టుగుపట్టి యొన్నఁడు నెమ్మిఁ గానఁగలేనియు, మ్మేటివేలుపు రాయఁ డామరుమేపుకన్దొరమామ గా, నేటినీటుకపంబు చేసెనొ యూవడంకువ

లంమఁ దా, మాటికిన్ గొనియాడుచుం
జని మన్ను తేఁ డట ముందటన్
యయా. ౨. ౪౧.

జ మరుగొంగ, మరుతల్లి, మరుతేజీ, మరు
దేశేరి, మరునయ్య, మరువిల్లు, మరుపని,
మరుపిచ్చి, మరుపోరు, మరుమామ, మరు
మావు.

**మరుకము.** సం. వి. అ. పుం. ౧. సెమిలి.
౨. లేడి, జింక. (విల్యమ్సు.)

**మరుగొంగ.** వి. (√మరుఁడు) శివుఁడు.

సీ. ... పెనునీటఁ దేలాడు పిన్నపాప, మరు
గొంగతలపుఁ దామరమీఁది యొలఁదేఁటి
కలిమి యొయ్యారి నోములఫలంబు ..
ఉ. రా. ౧. ౪౦.

**మరుజ.** సం. వి. ఆ స్త్రీ. ౧. మృగకర్కోటి,
వెఱ్ఱిపుచ్చ కీ. (వాచ.) ౨. ఒకానొక
మృగము.

శ్లో. యథోక్తం మరుజా తూచ్ఛమృదుపాండ
రరోమికా, రోమరాజిమతీ మధ్యే ద్వా
దశాంగులసమ్మితా. (శే. ని.)

**మరుజము.** సం. వి. అ. పుం. పరిమళద్రవ్య
విశేషము.

**మరుతల్లి.** వి. (మరుఁడు + తల్లి) మన్మథునితల్లి,
లక్ష్మి.

సీ. పెనిమిటి యెదనుండు వనబోఁడి మరుతల్లి
సెలచెలియలు

గీ. యనఁగ లక్ష్మిసమాఖ్య తా ..
పాం. ని. దేవ. ౬.

**మరుతేజీ.** వి. (√మరుఁడు) చిలుక, మన్మథ
వాహనము. (శ. ర.)

**మరుత్కారము.** సం. వి. అ. పుం. రాజ
మాషము, అలసందలు.

**మరుత్కర్మ.** సం. వి. న్. న. వాయురోగము,
కడుపుబ్బు. (విల్యమ్సు.)

**మరుత్కోణము.** సం. వి. అ. పుం. వాయవ్య
దిక్కు, పశ్చిమోత్తర దిక్కులమధ్య దిక్కు.

**మరుత్తకము.** సం. వి. అ. పుం. మరువక
వృక్షము

**మరుత్తనయుఁడు.** సం. వి. అ. పుం. ౧. హను
మంతుఁడు. ౨. భీముఁడు

ఇట్లే మరుత్సుతుఁడు, మరుత్సూనుఁడు, మొ.

**మరుత్తు.** సం. వి. త్. పుం. ౧. వాయువు,
గాలి. ౨. పర్వత శిఖరము. ౩. రూపము.
(శే. ని.) ౪. దేవత, వేలుపు, దేవవిశేషము.
౫. మరువకము, మరువము, వృక్షవిశేషము.
౬. గ్రంథిపర్ణ మనువృక్షవిశేషము.
౭. పృక్కా, శాకభేదము కీ. ౮. బంగారు.

**మరుత్పటము.** సం. వి. అ. పుం. తెరచాఁప.
(విల్యమ్సు.)

**మరుత్పతి.** సం. వి. ఇ. పుం. ఇంద్రుఁడు,
వేల్పుఱేఁడు.

**మరుత్పథము.** సం. వి. అ. పుం. వాయు
మార్గము, ఆకాశము.

**మరుత్పాలుఁడు.** సం. వి. అ. పుం. = మరు
త్పతి.

**మరుత్ప్లవము.** సం. వి. అ. పుం. సింహము
(త్రి. ని.)

**మరుత్ఫలము.** సం. వి. అ. న. శిలావృష్టి, వడ
గండ్లవాన. (విల్యమ్సు.)

**మరుత్వంతుఁడు.** సం. వి. త్. పుం. ౧. ఇ
ద్రుఁడు. ౨. హనుమంతుఁడు. ౩. మేఘుఁడు.

**మరుదాందోలము.** సం. వి. అ. పుం. వ్యజన విశేషము, ఒకమాదిరి విసనకఱ్ఱ.

**మరుదిష్టము.** సం. వి. అ. న. గుగ్గులువు, గుగ్గిలము. (వాచ.)

**మరుదేవేరి.** వి. (√మరుఁడు) రతీదేవి.

క. కారుకొమిఱుం గన మరుదే, వేరియుఁ దా నసఁగఁ బైఁడివిరిదం డన బం, గారపు బొమ్మవఁగా సిం, గారంబున దేవయాన కడుఁ జెలువొందెన్ ...

యయా. ౪. ౯౨.

**మరుద్భవ.** సం. వి. అ. స్త్రీ. తామ్రమూలీ క్షుపము శ.

**మరుద్రథము.** సం. వి. అ. పుం. గుఱ్ఱము. (త్రి. ని)

**మరుద్రుమము.** సం. వి. అ. పుం. విటఖదిరము. ఒకానొక చంద్ర శ.

**మరుద్వాహము.** సం. వి అ. పుం. ౧. ధూమము, పొగ. (త్రి. ని.) ౨. అగ్ని. ౩. చిత్రకము, చిత్రమూలము శ.

**మరుద్వీపము.** సం. వి. అ. పుం. ఉష్ట్రము, ఒంటె. (త్రి. ని.)

**మరునయ్య.** వి. (మరుఁడు + అయ్య) విష్ణువు.

ఉ. అక్కట తండ్రి యేల మరునయ్యకుఁ బెండ్లి యొనర్తు నంచుఁ దె, న్మక్కువ నుండుచో నీలా. ౨. ౪౨.

చ. అరుదుగ వేల్పుఱేఁడు మరునయ్యయు నల్వయుఁ గొల్వఁ జల్వడాల్, దొరరత నంపుటుప్పరిగలో వలికుబ్బలి రాచకూఁతుఁ దా, నిరువుగఁ గూడి ముజ్జగము లేలెడు లేసలదాల్పుఁ గొల్చెదన్ ...

అచ్చ. రా. బాల. ౧.

**మరునిల్లు.** వి. దే. (√మరుఁడు.) ఆఁడుగుఱి, మదనగృహము.

ఉ. మంచెలమీఁద నెక్కి కటిమండలిఁ జుట్టినపాఱుటాకు లించించుక చంచలించి మరునిల్లు బయల్పడఁ జేయఁ బిట్టలన్, జెంచెతలార్చి ప్రేయుదురు చిత్రముగా నొడిసెల్ల ... కాళ. ౩. ౧౦.

గీ. కూటి కియ్యని విటకానిపోటు మెండు, మాచకమ్మకు మరునింట నాచు మెండు.

వేను. ౧౪. రసిక. ౧. ౯౦.

**మరున్మాల.** సం. వి. అ స్త్రీ. పృక్క, శాకభేదము. శ.

**మరుపని.** వి. (మరుఁడు + పని) సురతము.

గీ. మంటిమిద్దలవారికి మరుపనులకు, నెలఁతఁ బాసినవారికి నిదుర చెడిరొ ...

అము. ౪. ౧౩౩.

రగడ. పనసలపైఁ బూఁబనసల్ గనుగొను, పనుపడ్డవి మరుపనులకు నవి మును ...

యయా. ౪. ౨౬.

**మరుపిచ్చి.** వి. (√మరుఁడు) మన్మథావేశము, కామోద్రేకము.

ఉ. నిక్కము రడ్డిబిడ్డ వని నిన్ మది నమ్మి గృహంబుఁ జేరి యీ, దిక్కున నున్న శూద్రసుదతిన్ మరుపిచ్చి రమించినాఁడవి, త్రైక్కలిఱంకు నాకుఁ గలదే యని ముందలఁ బట్టి యీడ్చి యీ, రక్కసి దన్ని .. శేం. పంచ. ౪. ౫౧౦.

**మరుపృష్ఠము.** సం. వి. అ. న. ఎడారి, నిర్జల ప్రదేశము.

**మరుపోరు.** వి. దే. (మరుఁడు + పోరు) సురతము.

గీ. చెలువ మరుపోరు వెనుక సొమ్ముల నలర్చి,
చెలువమరురక్తి వెన్నుఁడో కలిసి యుండు,
టనుచుఁ దలపోయుచుండుఁ దా నార్త
చంద్రి, శాఖిలాపాను గుంభితప్వాంతుఁ
డగుచు ... చంద్రి. ౪. ౩.

**మరుప్రియము.** సం. వి. అ. పుం. ఉష్ట్రము,
ఒంటె. (విల్సమ్సు.)

**మరుభూరుహము.** సం. వి. అ. పుం. కర
వీరము కీ.

**మరుమామ.** వి. (మరుఁడు + మామ) చం
ద్రుఁడు.

పీ. ... జాబిల్లి మరుమామ చందమామ.

గీ. ... అమరుచుండుఁ, గుముదమిత్రుని నామ
ధేయములు పొంబ. సాం. ని. దేవ. ౧౦.

**మరుమావు.** వి. (√మరుఁడు) చిలుక.
రగడ. మావులు దగు మరుమావుల కిరవులు.
యయా. ౪. ౨౫

**మరులము.** సం. వి. అ. పుం. ౧. హంసవిశే
షము. ౨. ఉదకము. (విల్సమ్సు.) ౩. వ్యా
ఘ్రాదిఘాతుకజంతువు. (వై. ని.)

**మరులు** = మర్లుకి. వి. ౧. మోహము, వలపు;
ప్రేమ; అత్యధికప్రేమ.

క. పరమపతివ్రత లై సుర, పురములు సాధిం
ప నున్న పుణ్యస్త్రీ లె, వ్వరు గలరు
చూపు చూతాం, తరశరహతిఁ దిరులు
మరులు గొలిపెద వారిన్ ...
కు. సం. ౪. ౩౯౭.

చ. ... భువనత్రయ భీకరరాక్షసత్రయిన్,
మరులంత ముంప నంపెనో యనన్ దగు
వజ్జవరాంద్ర ముప్వరన్, బరిణయ మై
ఘనమర్త్యకులక్రమంబున వారు సుఖించి
రంతయున్ ... ఉ. రా. ౧. ౨౭౫.

మ. మరు లెచ్చం గడు నొచ్చు నెచ్చెలియ
నీమాపెల్లఁ బ్రోవన్. చంద్రా. ౫. ౧౧౧.
(చంద్రమతి లోహితాస్యునిఁగూర్చి విల
పించుట.)

ద్వి. మది నీకు నామీఁద మరు లెందుఁ బోదు.
ద్వి. హరిశ్చ. ఉ. ౨౦౦౭. పం.

గీ. తీరని ప్రేమ రైన, మరు లవఁగఁ జెల్లు.
ఆం. భా. ౧. ౧౩౭.

౨. అజ్ఞానము.

సీ. మఘవుండు నీకంటె మరు లయ్యె క్రతుశతి
నర్చించి దేవేంద్రుఁ డై వెలింగె ..
కు. సం. ౨. ౧౭౪.

క. మారియందు రెవ్వనిబిడ్డలు, మరు లింతియె
కాక సుతులు మతి యతిహితులే, పెరి
మెను బుట్టినపుత్రులు, పెరుగఁగ శత్రు
లను ప్రుతులు పెక్కులు వినవే ...
కుచేల. ౧. ౫౯.

౩. (త. మరుళ్) పిశాచము, దయ్యము.

గీ. నీవు నీపోవుదనుఁ బొమ్ము నీవు మాట,
మాట లేటికి ననుచు నమ్మరులు లేఁడు,
నచటఁ బ్రేవులు దర్భలు నాసనంబు, చేసి
తనమానసంబునఁ జేర్చెఁ గృష్ణు ...
ఉ. హరి. ౨. ౧౪౧.

గీ. అదియుఁ గా కిరుకుంజల వాఁడుమరులు,
గొరగఁ గలువుఁ గా శాతనిఁ గోరి తపము
సేసె దఁట గౌరి నీ కింత చెట్లపురులా.
కు. సం. ౪. ౭౬౯.

౪. పిచ్చి, ఉన్మాదము.

ఉ. మరు లెత్తి తనూజుఁడు పొఱుచున్నవాఁ,
డక్కట వానిఁ బట్టుకొనుఁ డన్న కృపా
పరులార ప్రొక్కెదన్ ...
దశకు. ౭. ౧౫౯.

ఉ. ఎక్కడినుండి వచ్చెనొకో యీ మది
జంగము వానిమాయలోఁ, జిక్కి తరాల

నుండి రాలుకచ్చుకుఁ బోఁగనీక దాచు
నా, చక్కనిపిండి న స్గదిమి సర్వము
బెట్టఁగఁ బంచె నింక నే, నక్కరణిన్
వసింతు మరు లెత్తి వ్యయం బొనరించు
పినితోన్ ... చెన్న. ౨. ౫౧.

జ: మరులుఁ దీఁగ, మరులుకొను, మరులు
కొలుపు, మరులుజడ, మరులుమాతంగి,
మరులుమ్మెత్త, మరులువేఁడు, మరుల్కొను,
మరుల్కొలుపు.

**మరులుఁదీఁగ.** వి. (మరులు + తీఁగ) త్రొక్కిన
తోడనె అజ్ఞానము పుట్టించు నొకానొక
యోషధి, భూతకేశము.

ఆ. మరులుఁదీఁగ మెట్టి యిరు లన్న గో యని,
యొడుతమిఁ గాడుపడి పొలంబు, తెల్లఁ
దిరిగి తూర్పు తెల్ల నౌతఱి నొక్క, తూర్య
గమనకాటిఁ జొచ్చి చనుచు ...
ఆము. ౬. ౧౨.

**మరులుకొ(గొ)ను = మరుల్కొను.** అ. క్రి. (√మరులు.) ౧. వలపుచెందు, మోహము నొందు.

గీ. సొలపు వలపును దిలకించుచూడ్కిఁ
జూచు, నాటుఁజూపున మరులుకొనంగఁ
జూచుఁ, దార తారామనోహరు దశ
విధాన, లోకనంబుల మోహవిలోల
యగుచు ... కవిరా. ౨. ౧౩.

క. అది యొఱఁగి లాలికల ని, ల్పుద తని పఱ
తెంచి సెచ్చెలులు రత్నవతీ, కదలికలు
విన్నవించిరి, మృదులోక్తుల మరులుగొన్న
మెలఁతలతోడన్ .. వరాహ. ౩. ౧౨౮.

గీ. ఆసతోఁజూచి లీలావిలాసములకు, మరులు
కొని దానవేంద్రుండు మనసిజాత, మత్త
వేదండదోర్దండయమానమాన, పొజ్జుఁ దై.
వశా. ౨. ౩౧౮.

౨. ఆసపడు, ఆసక్తుఁడగు.

సీ. బహులదూర్వాళంకఁ గ్రొత్తదేవ కిరీటమరక
తద్యుతులకై మరులుకొన్న. కాశీ. ౩. ౧౨.

రగడ. మరులుకొని చేయుఁ దళిమానమును
మానమును, మఱచియును మానుఁ దలి
మానమును జ్ఞానమును ...
సీతారా. ౩. ౧౧౧.

౩. ఉన్మత్తుఁడగు, పిచ్చివాఁడగు.

గీ. అద్భుతం బార కేళీవనాంతరమున, మదన
తాపాగ్ని వేదన మరులుకొనుచు, జలవరకు
మారమాళి యూతనివిరాళి, యే మని వచింప
రతిపతిరే యొఱుంగు ...
ఇందు. ౨. ౨౧౯.

**మరులుకొ(గొ)లుపు(ల్పు).** స. క్రి. (√మరులుకొను) మోహింపఁజేయు, మోహపెట్టు, వలపింపఁజేయు.

గీ. మరులుకొలిపితె గోవింద మందసతుల ...
ఆము. ౫. ౬౪.

గీ. ఇరులుగాలిచిన యంతఃపురేందుముఖుల,
కురులు వరుఁ డనునేఁటికోఁ దురులు సేసి,
మరులుగొలుపంగ లేఁ డయ్యె మనుజ
విభుని, సురులు లేనిద్వ్యక్షుఁజనకాబక
ములు ... వైజ. ౩. ౯౦.

క. తారు గనుఁగొన్నరాచకు, మారుని
సౌందర్యరేఖ మరులుగొలుపఁగా, మార
శరపీడితాత్మక, లై రాయిడిఁ బడుచు
నాలతాంగులు మదిలోన్ ...
వరాహ. ౪. ౧౫.

గీ. విరుల్ నాన్పుకరణిఁ జల్లు, సరసపుజలంబె
జాణల మరులుకొల్పు ... ఆము ౨. ౨౧.

క. గోలపయి న్వాలారుం, గోలలఁ బరగించి
మరులుగొల్పుచు మిగులన్. హేలా. ౩. ౪౧.

**మరులు(ల్ల)జడ.** వి. (మరులు = జడ) ౧. మరులుదీఁగ, భూతకేశము శ్రీ. (శ. ర.)

౨. ఉన్మాదమును పుట్టించు (తోగలు మన్న గుడారి) జడ.

సీ. కొవిగోణంబు లాకోశసద్యాని కంబరక పొదిపినట్టి మర్లుజడలం.

గీ. ఆసెడు సందేహచింతనం బావహిల్ల .. అక్షమునఁ బ్రాఁకెఁ దూర్వన నరుణ రుచులు ... పి. శకుం. ౩. ౨౦౧.

**మరులు(ర్లు)మాతంగి.** వి. (√మరులు) మర్లుఁ దీఁగ, మదనము కీ.

సీ. జాజికాయయుఁ గురాసానిఓమము వస చెంగల్వ మర్లు మాతంగి పచ్చ, రౌన్నలం.
(ప్రబంధ. ఒ౪౦. ఆం. భా. ౨. ౫౩.

**మరులుమ్మెత.** వి. మదనము కీ.

గీ. మర్లుమాతంగి నాఁగను మరు, లుమ్మెత యనంగ మదనాఖ్య యొనరు ...
ఆం. భా. ౨. ౫౩.

**మరులుతేఁడు.** వి. (√మరులు) పిశాచవల్ల భుఁడు.

గీ. నీవు నీపోవుదానఁ బొమ్ము నీవు మారు, మాట లేఁటికి ననుచు నమ్మరులుతేఁడు.
ఉ. హరి. ౨. ౧౪౧.

**మరల్కొను = మరులుకొను.** అ. క్రి. (√మరులు) మోహపడు, వలపుకొను.

సీ. ... అద్విజరాజు గురువధూటికి మరుల్కొ నినయ ననఁగ ... వి.ప్ర. ౨. ౩౨.

చ. కలకల నవ్వుమోవి పలుగంటులు దీఁటుఁ గుచంబు లోరగా, మెలుపడఁ బైఁట వేయ మెలివింతగఁ గేరు మరుల్కొనంగ బై, కుల్కులుగొనఁ జూచు లేనిపగలుం గొని మాటికిఁ గుల్కు గోటిచి, మ్ముల నొనరించు నవ్వెలది మోహపుఁబ్రౌఢము వానిఁ జూచినన్, హంస. ౧. ౨౧౩.

**మరల్కొ (గొ) లుపు (ల్పు) = మరులుకొలుపు.**

(వలపించు, ఆసక్తి నొందించు.)

చ. కరువలి వారిమేనులను గానలుఁ గేళ్ల డలం దొడల్, వడల్, తలలుఁ గురుల్ మరుల్కొలుపఁ దా నిపు డెక్కడ సంత రించెనో, కరకర మైదుకై దువలజంత యటంచు విరాళి క్రాగ్గి, చం. రా. ౨. ౯౯.

సీ. పొగడను దగువిధంబులను బెక్కులు గల్గ నలరించి నిను మరుల్కొలుపఁ గలను.
వి.ప్ర. ౩. ౧౯.

సీ. ఇంద్రనీలపుఁబాలు నేలువర్ణమువాని సిరి మరుల్గొలుపు మై చెలువువాని ...
కళా. ౨. ౧౪౨.

మ. ... అ, యమరుల్ నీ కెదురే జయింపఁ గదవయ్యా యన్న లేవవ్వు డా, యమరు ల్కొల్పుచు వారి పీడ్కొలిపి ...
ఉ. రా. ౧. ౪౯.

**మరువంపుమొలకలు.** వి. బ. ధాన్యవిశే షము.

సీ. మన్మథబాణాలు మరువంపుమొలకలు సన్న మణుఁగులు జున్నుబ్రాలు.
హంస. ౪. ౧౩౯.

**మరువకము.** సం. విశే. (అ. ఆ. అ.) భయం కరమైనది.

వి. అ. పుం. ౧. మదనము, వృత్తవిశేషము. ౨. మరువము కీ. (అమరకోశము.) ౩. పెద్ద పులి. ౪. ఒకవిశేషము, ఓజకొంగ.

**మరువకుఁడు.** సం. వి. అ. పుం. రాహువు.

**మరువము.** వి. (సం. మరుపకః) సువాసన గల యొకజాతిమొక్క.

క. మరువము మొలవఁగఁ దోడనె, పరిమళ
మడయించినట్లు. ... విక్ర. ౧. ౧౯౧.

రగడ. మరువము చెలి సా మరువము లో
యను ... యయా. ౪. ౨౫.

ద్వి. కలయంగ మరువంబుకల పేర్వరించి,
యలవి మీఱినమల్లియల కంటు లొత్తి.
ద్వి. పరమ. ౩. ౧౩౦. పా.

**మరువము.** సం. వి. అ. పుం. వృక్షవిశేషము, వాసన గలచిన్నచెట్టు.

**మరువలు.** వి. పశురోగవిశేషము.

ద్వి. మరువలు దిగకుండ మందుల వాడి,
సెరయుచరణములు నిండినతిత్తి ...
నవ. ౧. ౨౩. పా. ౧౭. పం.

**మరువు.** సం. వి. ఉ. పుం. ౧. ఎడారి, నిర్జల ప్రదేశము, నీరులేనిచోటు. ౨. పర్వతము. ౩. కురవకము, ఎఱ్ఱగోరంట శ్రీ. ౪. ఒకానొక దేశము. (శై. ని.)

**మరుసంభవ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. మహేంద్రవారుణి, పెద్దచేదుపుచ్చ శ్రీ. (విశ్వము.) ౨. ఒకవిధ మగుతీఁటకసింద శ్రీ. (వాచ.)

**మరుసంభవము.** సం. వి. అ. పుం. ఒకవిధమగుమనగచెట్టు. (విశ్వము.)

**మరూకము.** సం. వి. అ. పుం. ౧. నెమిలి. ౨. లేడి. ౩. కప్పు. (శై. ని.)

**మరూద్భవ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రత్తిచెట్టు. ౨. ఒకవిధమగుచంద్ర శ్రీ. ౩. తీఁటకసింద శ్రీ. ౪. దోస శ్రీ. (అ. ని.)

**మరూద్భవము.** సం. వి. అ. పుం. చంద్ర శ్రీ. (శై. ని.)

**మరోలి.** సం. వి. ఇ. పుం. మకరము, మొసలి. (త్రి. ని.)

**మర్కటకము.** సం. వి. అ. పుం. ౧. వానరము, కోఁతి. ౨. సాలెపురుగు. ౩. మత్స్యభేదము, ఒకవిధమగుచేఁప. ౪. ధాన్యభేదము. (విశ్వము.)

**మర్కటతిందుకము.** సం. వి. అ. పుం. కాకెందువు, కాకిదుమికి శ్రీ.

**మర్కటపిప్పలి.** సం. వి. ఈ. స్త్రీ. అపామార్గము, ఉత్తరేను శ్రీ.

**మర్కటము.** సం. వి. అ. పుం. ౧. కోఁతి, వానరము. (ఈయర్థమునఁ గొన్నిపట్ల మహాద్విపత్వయును గలదు.)

సీ. ఫలమూలములు దిని బ్రదుకుదు మర్కటములకు
మేలౌగిరంబులు మెక్కఁ గలిగె ...
ఉ. రా. ౫. ౨౩౩.

౨. సాలెపురుగు. ౩. ఓదకాంగ, బకవిశేషము. ౪. రతియందలి బంధవిశేషము. ౫. విషవిశేషము. ౬. ముద్గభేదము శ్రీ. ౭. కురువ్క మనుగంధద్రవ్యము. ౮. కవాటబంధనార్థ సూచీవిష్కంభ యంత్రకము. (శే. ని.)

**మర్కటవాసస్సు.** సం. వి. స్. న. లూతాసూత్రము, సాలెపురుగుపట్టు. (వాచ.)

**మర్కటశీర్షము.** సం. వి. అ. న. హింగుళము, ఇంగిలీకము.

**మర్కటాస్యము.** సం. విశే. (అ. ఆ. అ.) కోఁతిముఖమువంటి ముఖముగలది. వి. అ. న. తామ్రము, రాగి.

**మర్కటి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. అపామార్గము, ఉత్తరేను శ్రీ. ౨. అజమోద, ఓమము శ్రీ. ౩. కరంజము, కానుగ శ్రీ.

**మర్కటీజాలము.** సం. వి. అ. న. (ఛంద) లఘు గురువులప్రస్తారమును తెలిసికొనుట కుప యోగించు చక్రము. (వాచ.)

**మర్కటేందువు.** సం. వి. ఉ. పుం. పెద్ద తుమికి చె. (విల్యమ్సు.)

**మర్కము.** సం. వి అ. పుం. ౧. గాలి. ౨. మనస్సు. ౩. గుదము. (వై. ని.) ౪. దేవ దారువు చె. ౫. అభ్రము. ౬. గర్వము, పాము.

**మర్కర.** సం. వి. ఆ. స్త్రీ. ౧. భాండము, కుండ. ౨. సురంగ, పొరంగము, గుహ. ౩. వంధ్యయగుస్త్రీ, గొడ్రాలు. ౪. భృంగ రాజము, గుంటకలగర చె.

**మర్కసము.** సం. వి. అ. పుం. జగలమునుండి మద్యము తీయగా మిగిలిన నిస్సారపు ముద్ద. (వై. ని.)

**మర్కుడు.** సం. వి. అ. పుం. ౧. బ్రహ్మ. ౨. చంద్రుడు. ౩. సూర్యుడు.

విశే. (అ. ఆ. అ.) విఘ్నకర్త. (శే. ని.)

**మర్కోటపిపీలిక.** సం. వి. ఆ. స్త్రీ. నల్లని చిన్నచీమ. (వై. ని.)

**మర్గడము.** వి. మలవిసర్జనము.

ద్వి. మననిజహారుడు లేడని పల్కు నధము, తనుజాలనోళ్లు మా మర్గడంబులకు ...
బస. పు. ౬. ౩౯౪. పం.

(కావులు అధ్యాహారము.)

**మర్గించు = మ్రగ్గించు.** స. క్రి. నశింపఁ జేయు.

(ఇట వర్ణవ్యత్యయము.)

శా. భర్గుం డంతకవాహినుల్ శరతతిన్ ఖండించు న ట్లెమ్మెయిన్, దర్గంగా రథ పత్త్రిముల్ విఱుగ తేదండాంతరానీక ముల్, సర్గాదన్ భటకోరకంబు లదరన్ నూతాన్యశ్వపుష్పౌఘముల్, మర్గింపుచున్ బర సైన్య పద్మవనమున్ మద్బాణవర్షంబునన్.
కు. సం. ౧౧. ౬౦౪.

**మర్గు = మరుగు.** అ. క్రి. అసక్తమగు, అగు గాను.

ఉ. మక్కువతోఁ గుమారులకు మర్గుచుఁ దల్లులు ప్రేముడింపఁగాఁ, జిక్కఁగఁ జేసి కోపులకుఁ జేరినయావులు దట్టు ముట్టఁగన్ ... పద్మ. ౯. ౧౫౪.

**మర్చు = మఱచు.** స. క్రి. విస్మరించు, మఱచి పోవు.

ఉ. నాపయిఁ బ్రేమ యుంచు సురనాయక మర్చకు నన్నొకప్పుడున్ ...
కళా. ౪. ౧౫౮.

**మర్జువు.** సం. వి. ఉ. పుం. ౧. చాకలివాఁడు, రజకుఁడు. ౨. పీఠమర్దుఁడు.

ఊ. స్త్రీ. ౧. కడుచుట, శుద్ధిచేయుట. ౨. పవిత్రముచేయుట. ౩. చీపురు, సం మార్జని. ౪. నదీతీరము. ౫. కల, కాయి. (శే. ని.)

**మర్తము.** సం. వి. అ. పుం. మర్త్యలోకము, భూమి. (శే. ని.)

**మర్తుఁడు.** సం. వి. అ. పుం. మర్త్యుఁడు, నరుఁడు.

**మర్త్యము.** సం. విశే. (అ. ఆ. అ.) మర ణించు స్వభావముగలది, మరణశీలము.

వి. అ. పుం. మనుష్యలోక, భూలోకము.

న. శరీరము, ఒడలు. (విల్యమ్సు.)

**మర్త్యముఖుఁడు.** సం. వి. అ. పుం. కిన్న రుఁడు.

**మర్త్యలోకము.** సం. వి. అ. పుం. భూలోకము, మనుష్యలోకము. (శై. ని.)

**మర్త్యుఁడు.** సం. వి. అ. పుం. మనుష్యుఁడు.

**మర్దనము.** సం. విణ. (అ. ఈ. అ.) ౧. నలఁగఁగొట్టునది. ౨. పీడించునది, రాచునది.

వి. అ. న. ౧. నలఁగఁగొట్టుట, పిండిగాఁ జేయుట. ౨. రాచుట, ఒడలుపట్టుట, అంగమర్దనము చేయుట.

**మర్దని.** సం. వి. ఈ. స్త్రీ. పాదములను రక్షించు కవచము. (శై. ని.)

**మర్దము.** సం. విణ. (అ. ఆ. అ.) నలఁగఁగొట్టునది, గుండచేయునది; వి. అ. పుం. ౧. పిండిగాఁజేయుట, గుండచేయుట. ౨. కఠినమైనదెబ్బ, గట్టిదెబ్బ.

౩. వైరాగ్యము. (శై. ని.)

**మర్దలము.** సం. వి. అ. పుం. వాద్యవిశేషము, మద్దెల.

**మర్దించు.** సం. స. క్రి. మర్దనముచేయు, నూఱు.

మ. మతికాలుష్య మడంచి యింద్రియములన్
మర్దించి కౌమారికన్ క్రతతిం ద్రుంచి ...
మార్క. ౩. ౧౪౬.

(ఇట జయించు అని భావము.)

**మర్దితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. నలఁగఁగొట్టఁబడినది, గుండగాఁ జేయఁబడినది. ౨. రాచఁబడినది, రుద్దఁబడినది. ౩. చెక్కఁబడినది, గ్రుచ్చఁబడినది.

**మర్మాణుఁడు = మఱుమాఁడు.** వి. (√మఱుము) పరదినము, మఱునటిదినము.

ద్వి. అమ్మని పూజింప నారాత్రి యెంతు
నెమ్మి దీపింపఁగ నిల్చి మర్మాఁడు, ఘన
నిష్ఠ సంధ్యాది కర్మముల్ దీర్చి ...
రం. రా. అయో. ౧౨౦. పా. ౨౦. పం

**మర్మకీలుఁడు.** సం. వి. అ. పుం. భర్త.
(విల్యమ్సు.)

**మర్మత్రము.** సం. వి. అ. న. కవచము.

**మర్మభేదనము.** సం. వి. అ. పుం. బాణము, అమ్ము. (శై. ని.)

**మర్మభేది.** సం. వి. న్. పుం. బాణము, అమ్ము.

**మర్మము.** సం. వి. న్. న. ౧. జీవస్థానము అయువుపట్టు, మెత్తనిచోటు. ౨. అవయవములసంధి. ౩. గూఢార్థము, తాత్పర్యము. ౪. రహస్యము.

**మర్మర.** సం. వి. అ. స్త్రీ. ధమ్యభేదము.
(శై. ని.)

**మర్మరము.** సం. విణ. (అ. ఆ. అ.) ధ్వని చేయునది.

వి. అ. పుం. ఆకులు బట్టలు మొ. వానిధ్వని.

**మర్మరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. ఒక జాతి దేవదారు వృక్షము. ౨. పసుపు.

**మర్మరీకము.** సం. వి. అ. పుం. ౧. అగ్ని. ౨. శిగ. (శే. ని.)

**మర్మరీకుఁడు.** సం. వి. అ. పుం. ౧. నిస్స్వుఁడు, దరిద్రుఁడు. ౨. దుర్మార్గుఁడు, దుష్టజనుఁడు. (విల్యమ్సు). ౩. కూరుఁడు. (శే. ని.)

**మర్మస్పృక్కు.** సం. = మర్మస్పృకము.

**మర్మస్పృకము.** సం. విణ. (శ) మర్మము తాఁకునది, హింసించునది. (మాట మొ.)

**మర్మావరణము.** సం. వి. అ. న. శరీరమును రక్షించునది. కవచము. (విల్యమ్సు).

**మర్మావిధము.** సం. విణ. (ధ్) హృదయ మర్మములఁ బొడుచునది (బాణము మొ.)

**మర్యా.** సం. వి. ఆ. స్త్రీ. మర్యాద, హద్దు. (కల్పా.)

**మర్యాద.** సం. వి. ఆ. స్త్రీ. ౧. పొలిమేర, సీమ. ౨. సముద్రతీరము; ఒడ్డు. ౩. హద్దు గుర్తురాయి, సరిహద్దురాయి. ౪. నీతియొక్క కట్టుపాటు, నీతిపద్ధతి. ౫. పద్ధతి, న్యాయ మార్గమం దుండుట. ౬. ఒప్పుదల, ఒడం బడిక. ౭. ఆత్మయందు మనస్సును స్థిరముగా నుంచుట. ౮. సన్మానము, గౌరవము.

శా. ఆదిన్ శ్రీసతికొప్పుపైఁ దనువుపై నంసో త్తరీయంబుపైఁ, బాదాబ్జంబులపైఁ గపోల తటిపైఁ బాలిండ్లపై నూత్నమ, ర్యాదన్ జెందుకరంబు గ్రిం దగుట మీఁదై నాకరం బుంట మేల్, గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే.

భాగ. ౮. ౫౯౨.

౯. విధము, పోలిక.

మ. ఘను లాత్మీయతమోనివృత్తికొఱకై గౌరీశు మర్యాద నె, వ్వనిపాదాంబుజతోయమందు మునుఁగన్ వాంఛింతురు ...

భాగ. ౧౦. పూ. ౧౪౦౮.

సీ. పచ్చకప్పురపుఁగుప్పలు నింగియంగడి నించు మర్యాద రాయంచ లెల్ల, గుంపు గూడిన గతి గొప్పగందంపుటప్పలు లిప్పగా నుంచు పగిది ... ఘటికా. ౨. ౧౪౫.

సీ. తెలియ హరిశ్చంద్రువిధమున నలువిరిఁకను బురుటుత్సు చూడ్పునఁ బురూర, వుని లీల సగరులాగునఁ గార్తవీర్యుమర్యాదను గయా క్రియ నంబరీషు, మతమున ...

హంస. ౧. ౪౨.

**మర్యాదాగిరి.** సం. వి. ఇ. పుం. సరిహద్దు కొండ, కులపర్వతములలో నొకటి.

**మర్యాదాచలము.** సం. వి. అ. పుం. = మర్యాదాగిరి.

**మర్లు[1] = మరలు.** అ. క్రి. మళ్లు, వెనుకఁ దిరుగు.

సీ. అవల మాటాడువా రదిరిపాటున మర్లి రొయుఅపు వీక్షించి నివ్వెఱపడంగ ..

కువల. ౨. ౨౯.

మ. కొలు వౌ డిగ్గిన గద్ద డిగ్గు వని కేఁగు న్మర్లు గేహంబులోఁ, దలిరుంబొన్పున మర్లువం బొరలు ... దశా. ౪. ౪౧.

జ: మర్లుఁబాము.

**మర్లు[2] = మరులు.** వి. వలపు, మోహము.

మ. .. గేహంబులోఁ, దలిరుం బొన్పున మర్లునం బొరలు ... దశా. ౪. ౪౧.

జ: మర్లుకొను.

**మర్లు[3].** వి. వైపు, ప్రక్క.

చ. చిలుకలు గోయిలల్ చెవులు చిందర వందరసేయ కూరెలన్, మలయసమీరమున్ వెనుకమర్లున నుల్కిపడం బయింబడన్, గళవళ మంది చుట్టుకొనఁ గంతునిమంతి యటంచు నాత్మలోన్ .

సారంగ. ౨. ౧౫౫.

**మర్లుఁబాము.** వి. (మర్లు[1] + పాము) మనుదిండి, ఒక విధమగు పాము. (శ. ర.)

**మర్లుకొను = మరులుకొను.** స. క్రి. (√మర్లు[2]) వలచు, మోహించు.

సీ. కోఁడెకాండ్రను మగ్గలాని విభుఁ గికు
రించి తిరిగాడుబోంట్ల సేమరక కూడు ...
ఉ. హరిశ్చ. ౪. ౧౫.

**మర్వ = మఱువు.** వి. చాటు, ఓలము.

ఉ. కీకులు భీతిఁబొంది తమకించుచు రాఘవు
మర్వ సొచ్చినన్ ...
భా. రా. యు. ౧౪౪౦.

చ. వినుకతనంపు బంగదపు వెన్నెలరాయని
మర్వ సేరినన్ ...
అచ్చ. రా. యు. ౨౩౩.

మ. ... దివిజాల్ భంగించినన్ దైత్యు లా,
తురు లై మున్ భృగుపత్నిమర్వ సోర
నెంతో కూర్మి నక్కాంతయున్.
ఉ. రా. ఉ. ౩౩౪.

**మర్శనము.** సం. వి. అ. న. ౧. రాచుట,
రుద్దుట. ౨. పరీక్షించుట, పరిశీలించుట.
౩. ఆలోచన. ౪. సలహా, ఉపదేశము. ౫.
తొలఁగించుట, తుడిచివేయుట. ౬. వివరిం
చుట, విప్పిచెప్పుట.

**మర్శము.** సం. వి. అ. పుం. ౧. ఆలోచన,
యోచన. ౨. సలహా, ఉపదేశము, ఆలోచన
చెప్పుట. ౩. తుమ్ములు గలిగించు మందు.
(విల్యమ్సు.)

**మర్షణము.** సం. వి. అ. న. సహనము, ఓర్పు.

**మర్షము.** సం. వి. అ. పుం. సహనము, ఓర్పు.

**మర్షి.** సం. విణ. (ఎ. ఓ. ఏ.) సహనము గల
వాఁడు, ఓర్పు గలవాఁడు, సహించువాఁడు.

**మర్షితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఓర్పు
కొనఁబడినది, సహింపఁబడినది. ౨. క్షమింపఁ
బడినది, మన్నింపఁబడినది.
వి. అ. న. సహనము, ఓర్పు.

**మఱ.** వి. ౧. మర్మము, గుట్టు.

క. ఏనుగుల పట్టుకొనెనో, యేమిటికిం బచ్చెనో
యి దక్కడిపాటో, యేమా యెఱుఁగఁడు
మది మఱ తామసీ యనువిద్య తొలంతఁ
దనుఁ బొందుటయున్ ...
ఉ. హరి. ౫. ౧౯౫.

(బ్రాఁత ప్రతిపా. వావిళ్ల పా. 'మఱిమఱి'
పీఠిక పా.)

౨. అఱము, భేదము.

మ. మఱ లే కర్థుల దానులన్ సుజనులన్
మన్నింపుదే పైదలీ ... భాగ. ౭. ౪౨౪.

౩. దైన్యము, దుఃఖము. (చూ. మఱగొను.)

జ: మఱగొను.

**మఱఁదలు.** వి. స్త్రీ. (మఱఁది + అలు. బ. వ. మఱఁ
దండ్రు.) ౧. తమ్ముని భార్య.

గీ. మఱఁదలికి నాసపడి లోలమతిఁ జరించి ...
దశకు. ౧౧. ౧౩౪.

వ. మఱియు వత్యంతశోకార్ణవంబున మునిం
గిన తల్లిని మఱఁదండ్రను సాత్వసించి ...
భార. ఆది. ౪. ౨౧౪.

ఉ. రెమ్ము సురేంద్ర నీవలన లే దొకతప్పును
నీమఱఁద నీ, కొమ్మ వదాన్యభూరుహము
గోరినఁ దెచ్చితిఁ గాని ...
పారి. ౫. ౩౯.

౨. భార్యచెలియలు.

౩. మగనిచెలియలు.

సీ. ... జాయాపతులకు ... మఱఁద లం
చనఁగను మండ్రుత దనుజాలు ...
ఆం. భా. ౨. ౧౧౪.

(రెండు, మూఁడర్థములకు నిదియే యుదాహర
ణము.)

౪. తనకంటె చిన్న దగు మేనత్త కూఁతురు;
తనకంటె చిన్నదగు మేనమామ కూఁతురు.
(శ. ర.)

**మఱఁది.** వి. చెల్లెలి మగఁడు.

క. చెలియలు మఱఁదియును నీ, మ్మల నింద్ర
ప్రస్థనగరమున నభిమతిం, ధుల రొద్ద
నున్నవా రని ... భార. ఆది. ౮. ౨౧౪.

గీ. తనదు సామ్రాజ్యమహిమకుఁ దగినయట్లు,
మఱి మఱి సకలవస్తు సంపదలు వెలయ,
మఱఁదికి విశేషగతిని సమ్మానగరిమఁ, జాల
నొనరించె నప్పు డా జనవరుండు ..
ఇందు. ౭. ౬౭.

౨. భార్య తమ్ముఁడు, శ్యాలకుఁడు.

క. అని పలికి వాలుటమ్ములు, తనువున నినుచు
టయుఁ గలఁగి ధైర్యము మానం, బును
పిటింబోవఁ బాఱెను, జననాయకి నీమఱంది
సరివారు నగన్. భార. ద్రో. ౧. ౬౭౩.

క. వాలికఁ జెఱంగుదూపులు, నాలికోద
రుని మఱఁది నవి దైత్యులపైఁ, గీలించె ...
భార. ౬. ౧౭౦. అను. ౧. ౧౯.

౩. మగని తమ్ముఁడు.

సీ. మధుకైటభారాతి మఱఁది ర మ్మని పిల్చి
పనిగొంట నీకుఁ బ్రాభవము గాదె ...
శైవ. ౩. ౧౨౭.

ఉ. అంబుజగంధి యుయ్యెడ మహాస్థల పత్నుల
కంచు కొన్ని చే, మాంబర రత్నభూషణ
చయంబులు నైకాని యమ్మఱందియున్,
వెంబడి సొక్కఁగా రథము వేడుక నెక్కి
చిరత్న రత్నకీ, తంబుల నుండె ...
ఉ. రా. ౭. ౨౩౨.

౪. మేనత్త కొడుకు.

చ. శరతాడన పీడితు లైరి భీమునిం, దులు
నమరాపగా తనయుతోడి రణంబునకున్
దిశాధిపా, ధులు నటుమంగఁ జాలదు ...
భార. భీష్మ. ౨. ౭. భార. ద్రో. ౪. ౧౪౧.

౫. మేనమామ కొడుకు.

సీ. శ్రీమన్మహా గుణస్తోమాభిరాముఁ డై తేజ
రిల్లెడు ధర్మరాజానుజుండు, రణ మఱంది
గిరీంద్రధరుఁడు దండంబు గావించి చేయం
గల విన్నపములు ... భాను. ౪. ౧౦.

౭. పరిహాసకప్రవాది, సరసోక్తు లాడుటకై
కల్పిత మైన వరుస.

చ. మరఁది యటంచు బావ యని మామ
యటంచును నల్లుఁ డంచు నం, దఱిని
నన్నివావు విడి ... దశా. ౨. ౩౭౭.

బ: మఱఁదలు.

**మఱక**[1], వి. పాలు విడిచిన యీఁడు మేఁకపిల్ల.

చ. కఱ వరుదెంచినన్ ఘటము గర్భమునం
గలసక్తు వంతయున్, దఱుఁగక యుమ్మి
మేఁకఁ గొన దానికిఁ బిల్లలు రెండు గల్గె
న, మ్మఱకలు రెంటికిం గలుగు మాసుగ
దూడలు నాల్గు వాని కీ, ట్లలిమితి నెన్న
నెన్మిదిఁ బడాఱును ముప్పదిరెండుఁ బుట్టఁ
గన్ ... నా. పంచ. ౫. ౧౧.

**మఱక**[2], వి. డాగు, కఱ.

సీ. దొడ్డపుట్టంబుఁ దొత్తుకుఁ గట్టఁబెట్టిన నది
పేఁడ మఱకల కగ్గపఱచు ...
రామలిం. ౩౪.

**మఱపు.** వి. (√మఱచు) అజ్ఞానము, తెలివి
లేమి.

క. ఎఱు కని యొఱుఁగక నిన్నున్, మఱపున
నాదరితిని దీని మఱవుము నన్నుం, గఱ
కంతా క్షమియింపుము ...
భార. ఆర. ౧. ౩౨౪.

చ. మఱపునఁ గత్తిరించి మదమానములం
జాఱవుచ్చి మెచ్చఁ జాఁ, గఱగొని ...
ఉ. హరి. ౪. ౯౪.

౨. విస్మృతి, పరాకు.

సీ. ... మఱవు, మఱపున యనంగ విస్మృతి
పరగుచుండు ... ఆం. భా. ౧. ౧౩౪.

**మఱఁగొను.** అ. క్రి. (మఱ + కొను) వైస్మృత్యము నొందు.

చ. ఇది దగ దంచు నడ్డుపడు నింతకు సేరక
సఖ్య లందఱున్, మది మఱఁగొన్న యట్టి
యెడ మానినికిన్ దనుఁ దాన కొంచెపో
లాదవిన ... భార. ఉద్యో. ౧. ౩౪౮.

శ్లో. కార్పణ్యాదేవ సహితా స్తత్ర భూపా
నాశక్నువన్ప్రతివక్తుమ్ సభాయామ్ ..
సం. భార. ఉద్యో. ౨౯. ౪౦.

**మఱచు.** స. క్రి. ౧. విస్మరించు, తలంపకుండు.

క. ఎఱుఁగమి చీకటి నీపై, దృష్టికంబు దలంప
నేమితప్పు గలిగినన్, మఱచి దయఁ
జూడు మి ట్లం, దఱు నీకుం బనులు సేయఁ
దగుదురు వీరల్ ...
భార. విరా. ౫. ౩౫౪.

క. రాచసిరి యుండియును మది, యాచవికిం
జొరదు నాకు మారికి నిచటికా, ల్యాచర
ణముపై మక్కువ, రే చందంబులను
మఱవ నెన్నఁడు రామిన్ ...
హరి. ఉ. ౨. ౪౭.

గీ. తపసిరూపులఁ బ్రోల్లకుఁ దవిలి రాఁగ
మాకుఁ బొసఁగదు పొమ్ము మఱాక
రమ్ము ... అచ్చ. రా. కిష్కిం. ౫౪.
(మఱాక = మఱవక.)

ఉ. ... నీ, బాంధవ మెల్ల బ్రొద్దఁ దలఁపం
దగు నాత్మ మఱాకు మింకఁ గి, ష్కిం
ధకుఁ బొమ్ము భానుసుత ...
భా. రా. యు. ౧౪౪౦.
(మఱాకుము = మఱవకుము.)

౨. మాను, విడుచు.

గీ. మధుమదోన్మత్త మై యల్కఁ మఱచి
సఖులు, మారెలకుఁ దాఁ బకులపై
పోలునట్టి, చేడియల మన్మథుఁడు కత్తి
చెఱకువింట, నేసె మమ్మె త్తవిరులచే
సేసరేఁగి ... కవిక. ౪. ౧౭౭.

గీ. మగువకనుదమ్ము లరవాడ్పు మఱవ వచ్చె.
వసు. ౩. ౧౧౦.

అ. క్రి. ప్రమాదము నొందు, పొరపడు.

క. గుఱుతొని కార్యాకార్యము, లెఱుఁగక
దుశ్చరితుఁ డై యహితుఁ డగు నేనిన్,
మఱవక గురు నైనను జను, లెఱుఁగఁగ
శాసించునది మహీశుఁడు బుద్ధిన్ ...
భార. ఆది. ౬. ౧౦౨.

క. మానుషశక్తి జయింపఁగ, రానిమహావీరు
లైనరణశూరులపై, దీనిఁ బ్రయోగింపుము
బల, హీనులపై మఱచియైన చేయకు
మధిపా ... విక్ర. ౨. ౩౭.

చూ: మఱపున, మఱపించు, మఱపు.

**మఱపించు.** స. క్రి. (√మఱచు.) ౧. మఱచు
నట్లుచేయు, విస్మరింపఁజేయు.

ఉ. అంతట నద్భుతంబు గరుడాగమనంబు
నిరాకృతాహితా, త్యంతసమగ్రితోర్జిత
జయాభ్యుదయం బయి ధీమ్మపాతసం,
క్రాంతఘనవ్యథన్ సొలయఁగా మఱ
పింపఁ బువర్ణ్మహాజిని, క్రాంతి కుపక్ర
మించు విభుఁ గాంచి దివౌక సుతాదు
లుబ్బుచున్ ... రాఘవ. ౪. ౧౩౪.

సీ. పట్టి చెప్పుదు రతిప్రాణేశమంత్రముల్
మఱపింతు మఱి యన్యమంత్రకలన ..
చంద్రా. ౩. ౭౨.

సీ. కందర్పు మఱపించి యిందుని నిందించి
నలకూబరు హసించి నలుని మించి ...
కళా. ౧. ౬౬.

(ఇట అతిశయించి అని భావము.)

౨. భ్రాంతి నొందించు, భ్రమింపఁజేయు.

సీ. మగలతో నిద్రించు మగువల మఱపించి
మగచెయ్వు లొనరింప మదిఁ దలంచు ...
హేలా. ౧. ౪౬.

**మఱవు.** వి. (√మఱచు.) ౧. విస్మృతి.

క. పతిఁ జూచి రతి నిజాంత, ర్గతఖేదం బెలమి
మఱవుగా నిజకౌలా, చితవచనాంతర
ముల నుర, పతి గడుఁ గను నిన్ను నేమిపని
రాఁ బనిచెన్ .. కు. సం. ౪. ౪౧౩.

గీ. తమకమును సిగ్గుఁ దమలోనఁ దడఁబడంగ,
మఱపుఁ జెయ్వులుఁ దమలోన మాఱు
మలయ ... విక్ర. ౧ ౧౭౭.

సీ. పిఱికితనంబును గుఱి దప్పి చనుటయు
వెఱపును మఱపును గొఱగొఱయును ...

గీ. ... ఎయ్యెడ నెఱుఁగఁ దలఁడు ...
అచ్చ. రా. బాల. ౪౫. ఆం. భా. ౧. ౧౩౪.

౨. పారవశ్యము, ఒడలెఱుంగమి; మత్తత.

సీ. మఱపు మున్నీటిలో మానంబు లూటాడ
బిగియారు కౌఁగిట బెరయువారు ...
ఉ. హరి. ౫. ౪౩.

సీ. తనపదంబునఁ జేర దనుడు వెళ్ళెలఁ
బోవుఁ జెలఁగు ముట్ట దనుచుఁ జెందు
మఱపు .. చంద్రి. ౧. ౬౫.

శా. భిక్షుం డై తమతండ్రి మాజననిన్
భిక్షించినన్ దన్ను సం, రక్షింపం, దుది
నింతయై మఱపుతో రాజప్రసూనాకృతి,
భ్రష్టోరాజతనూజతో సుగుణతో నాతో
సుమం బాడెడిన్ భాగ. ౯. ౫౭౧.

౩. మూర్ఛ.

ద్వి. మనుజేంద్రతనయుఁ డామఱ పటు దలిసి,
మునివరుల్ దీవింప మెఱిగి దవ్వ్వ అలర,
తనరంగ విలుగుణధ్వని చేసి నిలిచి ...
రం. రా. ఉ. ౧౪౬. పా. ౧౯. పం.

ద్వి. అమ్మేఘనాదుండు నతనిమర్మములు,
నమ్మఁ గీలించి యతనికూతుండు, మాత
లినాగలపై మఱపుతో నొరఁగ, నాతేరు
విఱుగంగ నలుకతో నేసె ...
రం. రా. ఉ. ౪౯. పా. ౫. పం.

౪. ప్రమాదము, పొరపాటు.

సీ. ... తేరు విఱిగనో కూలుండు వడియునో
యేమఱి యలసత నెదిరి నరకు, నేయమి
మఱ పార్థుఁ జెందనో హీనాత్ముఁ డైన
ధృష్టద్యుమ్నుఁ డతనిఁ జంపె ...
భార. ద్రో. ౧. ౮౦.

శ్లో. రథః పర్యపత ద్వ్యాస్య ధను ర్వా శీర్య
తాస్యతం, ప్రమత్తో వా భవద్ద్రోణో
యథా మృత్యుముపేయివాన్ ..
సం. భార. ద్రో. ౯. ౨.

౫. అజ్ఞానము.

ఉ. .. నీ, క్షేమకు వచ్చు దానుఱుకఁ గ్రించు
తనంబున నెగ్గు సేసితిన్, నామఱపున్
సహింపు మట నారకుఁ డైన మనంబులో
భవ, స్మామము చింత సేసిన వనంతసుఖ
స్థితి నొందకుండునే. భాగ. ౯. ౧౧౬.

గీ. నగము గొఱికినయాకను సఖులు పిలువ,
నగ నొసఁగు నుత్తరముఁ దెల్పి నగము
మఱపు, నగము నయి చింతచేసగ మునుచు
నరిగె ... మనుచ. ౩. ౭౭.

౬. క్రి. ప్రమాదపఱుచు, పొరపెట్టు.

క. నను మఱపి రొందుఁ బోయితి, గనుఁ
గొంటిని బట్టువడితి కైతవ మిటు సే, వినఁ
బోనిత్తునె యనుచును, దనమదిఁ బలుకు
గలిఁ గొంతతడ వీక్షించెన్ ...
హరి. ఉ. ౪. ౧౭౯.

**మఱలు.** అ. క్రి. ౧. వెనుకకుఁ దిరుగు; వెనుక
మొగమగు,

ద్వి. ములుల కెంజడలును మఱికెండలములుఁ,
జెఱుఁగజ్జె మొలనూలు సింగినాదంబు ...
ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౯. పం.

గీ. మొలలు పెట్టుచు శరనిధి మఱలి మఱలి,
కొంచుఁబో ... దశా. ౧. ౧౭౦.

౨. నివర్తిలు, వెనుకకువచ్చు.

శా. ... విక్రమకళాసంలబ్ధతత్స్ఫ్రీయసీ, సంధా
సిద్ధిఁ గృతార్థుఁడై మఱలె నిచ్చన్
పేర్కఁ బిల్పింగఁగన్ పారి. ౫. ౪౧.

**మఱి¹**, అవ్య. ౧. పిమ్మట, అనంతరము.

గీ. ఇప్పురంబున బ్రాహ్మణుం డింధనార్థ,
మేఁగి మున్న యావృక్షంబు నెక్కి దాని,
తోన దగ్ధుఁడై మఱి దానితోన లబ్ధ,
జీవుఁడై వచ్చి జనులకుఁ జెప్పె దీని ..
భార. ఆది. ౨. ౧౯౩.

సీ. ఎవ్వరో యొఱుఁగ నిశ్చితిఁగించి మఱి
వర మిమ్మంటి దానికి నెలమి నగుచు.
భార. అను. ౧. ౩౫౧.

సీ. మఱి కొండపై నెక్కి మార్కొని వలి
దైనయలకకవాపాత్రు నంటి రాఁకె ...
మనుచ. ౧. ౩౪.

౨. పునరర్థకము, వెండియు; ఇంకను.

(కొన్నిరొడల సముచ్చయార్థకముతోఁ గూడి
యుండును. దీనిద్విరుక్తరూపములు మఱి
మఱి, మఱిన్మఱి.)

వ. ... ఓదివిజకంభళి యింకిటఁ బట్టి నీవు
మీ, యనిమిషరాజాపాదముఅయానకుమీ
మఱి యెమికల్కినన్. శైవ. ౩. ౧౪౪.

క. విడువక మీగానము సాగ, వీడుటయు
మఱి పాడుఁ డనుట యొగ్గె ...
ఆము. ౫. ౫౭.

శా. ధేనుగ్రాసము మాళ్ప దోస మని సంకే
హించినన్ సత్య మెం, తే నష్టం బగు నైన
సేమి మఱియున్ విత్తంగ యామంబులో,
నా నన్నన్ మను లెల్ల మిక్కిలియు నేఁ
డాఁకొందురు ... వరాహ. ౧౦. ౩౯.

మ. ధన మార్జింపుదు నార్జితం బయినతద్ద్రి
వ్యంబు చేరంబుచేఁ, గొనసాగింపుదు వడ్డి
వాసివలనన్ గూర్తున్ మఱిం గొంత ...
ప్రబోధ. ౪. ౩౩.

వ. ఈ దేవరకు మఱియు నొక్క దీపంబున
కిచ్చిన గొఱియలు ౫౫ వీనిం జేకొని ...
ద. శా. ౪. ౭౪౪.

(ఈ క్రింది ప్రయోగమున లఘురేఫయుక్తమై
కన్పడుచున్నది.)

ఆ. మరియు నొక్కసాల మిరుగేలఁ బెఱి
కియు, దీనఁ జగిలి వంచుఁ దిగిచి వైవ,
నలిగి యెడుభల్లములఁ ద్రుంచి ..
భారా. అర. ౧. ౨౪౦.

(శ. ర. పా. మరల ముద్రిపా.)

౩. నిశ్చయముగా.

క. నాకు మఱి నీవు పతివి గు, ణాకర యిజ్జ
న్మమున మహాస్నేహమునన్ ...
భార. ఆది. ౭. ౧౯౩.

సీ. అతివయానముఁ గాంచి యుద్రియస్థితి నున్న
యది గాద మఱి రాజహంసకులము ...
కవిరా. ౩. ౯౩.

౪. ఇదిగాక,

చ. జనసుత సర్వధర్మువులు సర్వజగత్పరివర్తన
క్రమం, బును మఱి సర్వవంశములుఁ
బుట్టినమార్గము నీవ నిక్కువం, బనఘు
రయుంగు దున్నతగుణాఢ్యుఁడవున్ భర
తాన్వయాళలంబనుఁడవు నీవ ...
భార. ఆది. ౪. ౨౧౯.

గీ. తాను గర్భభరాలసత్వంబుకతనఁ, జేయఁ
జాలదు మఱి వేఱ చెప్ప నేల ...
కాశీ. ౪. ౨౧౨. కళా. ౩. ౫౩.

౫. తడవ, పర్యాయము.

(ఈ యర్థమున నేకార్థకశబ్దపూర్వకముగా నె ప్రయోగములు గనఁబడుచున్నది.)

క. అంగన యొక్కొకమఱి యా, త్తుంగమణి స్తంభతతిలో నొత్తగిలున్ ...
కాశీ. ౪. ౨౦౯.

ఉ. సర్గ మొనర్తు బ్రహ్మ యన సత్కృపఁ బెంతు జనార్దనుండ నా, భర్గుఁ డనంగఁ గ్రమ్మఱఁగఁ బారణ సేయుదు విజ్జగంబు నై, సర్గికలీల నొక్కమఱి సౌఖ్యాను నొందుదు కేవలంబు దో, ర్దర్గళభూమణీ కృతరథాంగ నినుం గొనియాడ నేర్తునే.
పారి. ౩. ౭౭. అ. మ. క. ౫. ౭౭౨.
భా. ౪. పం.

౬. అట్లుకానిచో, పక్షాంతరమున.

ఉ. దానవు లైన నేమి మఱి దైత్యసమూహము లైన నేమి ...
భాగ. ౧౦. ఉ. ౧౫౫.

౭. పూర్వోత్తరవాక్యార్థములకుఁ గల భేదమును దెల్పును.

క. మఱచినఁ దలఁపింపఁగ నగు, నెఱుఁగని నాఁ డెల్లపాటు నెఱిఁగింప నగున్, మఱి యెఱిఁగి యెఱుఁగ నొల్లని, కఱటిం దెలుపంగఁ గమలగర్భుని వశమే ...
భార. ఆది. ౪ ౭౧.

క. వర్గత్రయపరత మహా, స్వర్గత్వామధ్య మాధ్వజంఘాలకతా, దుర్గతియు నొల్ల మఱి యప, వర్గదుఁ జేకొ ల్పెఱింగి వాని భజింతున్ ... ఆము. ౨. ౯౨.

౮. మఱలమఱల, పలుమాఱు.

క. స్నేహార్ద్రీహృదయు లై యతి, పాపాసక్తత్వములు మాన్ప సమకొల్పుటకై,

యూహాపోహవిచారస, మాహితగతిఁ దల్లి సుతుని మఱి బోధించున్ ...
కాశీ. ౪. ౯౯.

౯. అన్యము, వేఱు.

ఉ. మామిడిమంత్రిఁ బోల మఱి మంత్రులు లేరు వసుంధరాస్థలిన్ ...
హైమ. ౧. ౭౪.

వ. ... ద్రోణుం డొక్క బాణం బభిమంత్రించి దృష్టిముష్టిసౌష్ఠవంబు లొప్ప నక్కందుకంబు నాఁట నేసి దానిపుంఖంబు మఱియొకబాణంబున నేసి ...
భార. ఆది. ౫. ౨౧౧.

క. మీవంటి భాగవతులం, బావనులంగఁ జేయ లేని మఱి గతి యేది, మావంటివారి కిఁక . ఆము. ౬. ౫౫.

౧౦. అట్లు, అవిధమున.

క. అతనువుల నేరు గదా, నాతులు మఱి నాక కలిగినన్ వగఁ దిగ్యు, జ్ఞాతిక నీ జాతిఁ గల, యాత్రపత గలద యెఱుఁగ కెట్లే లంటిన్ ... ఆము. ౫. ౪౨.

౧౧. కొన్నిచోడల నర్థవిశేషము లేక యే వాక్యాలంకారముగాఁ బ్రయోగింపఁబడును.

చ. సుతజలపూరితంబు లగుబావులు నూఱిటి కంటె నొక్క సు, త్క్రతు వది మేలు ...
భార. ఆది. ౪. ౯౩.

సీ. మఱి జరాసుతినిక్కై మధుర డించుటఁజేసి పరవర్గదుర్గముల్ బలిమిఁ గొనఁగ ...
పారి. ౧. ౧౭. భార. ఆది. ౫. ౧౫౯.

మఱి³ = మఱ్ఱి. వి. వటవృక్షము, మఱ్ఱిచెట్టు.

క. తాతయుఁ దండ్రియు నగ్ర, భ్రాతయు నుం దాను భువనభాసురకృతిని, ర్మాతలు పిల్లలమఱ్ఱివి, భ్రాతకుని వీరభద్రుఁ బోలఁ గలరె సుకవుల్ ... జై. భా. ౧. ౨౧.

**మఱిగ.** వి. (క. మరిగె.) ఱాచిప్ప, పులుసు మున్నగునవి వండుట కుపయోగించుఱాతితోఁ జేసినపాత్రము.

(కొద్దిపెలుచని బలపపుఱాతితోఁ జేసిన పాత్రము. శ. ర.)

**మఱిన్మఱి** = మఱిమఱి. అవ్య. అత్యంతము, మిక్కిలి.

ఉ. రాజకుమారశేఖరుఁడు ... ప్రత్యహము న్జరియింపుచుండె నీ, రేఁజడశాఖ నెంతయు మఱిన్మఱి నెమ్మదిలోన నెన్నుచున్ ... ఇందు. ౨. ౨౧౩.

క. సరియె కద పిఱుఁదుబరువునఁ, దరుణి నడక మంద మగుట తరువాత మఱిన్, మఱి బిఱ్ఱిఁగుకుచకచ, భరమునఁ జెలి దాళి యుంట ప్రౌఢిమమె కదా ... ముకుంద. ౨. ౪౭.

**మఱిమఱి** = మఱిన్మఱి. అవ్య. ౧. మఱియు మఱియు, పౌనఃపున్యముగ. (శ. ర.)

౨. అత్యంతము.

క. ... ప్రాణముకన్నను, మానం బధికం బటంచు మఱిమఱి సభ్యు ల్పానాథ పల్కు వినవే ... భల్లా. ౫. ఆ. (శ. ర.)

**మఱు**[1]. విశే. (వృత్తి నందుఁ బూర్వపద మగు మాఱుశబ్దమునకు వికల్పముగా ఆదేశమై వచ్చు రూపము.) ౧. అన్యము, వేఱొకటి.

గీ. . గంధవస్తువులు గొన్నట్టివాఁడు, వినుము మఱుపుట్టువునఁ జాంచుతనము నొందు ... భార. అను. ౪. ౨౬౪.

గీ. అతని మఱుమేన నైన నీప్రతిన దప్ప, కుండ వరియింపవచ్చు నీ కుచితవిధిని ... కళా. ౭. ౫౬.

౨. ప్రతి, బదులు.

క. అని పలుకుచున్న నృపునం, దనునకు మఱుమాట యీక. భార. ఆది. ౭. ౪౬.

సీ. ... రమ్మనుచును గడఁకఁ బిల్వ, మఱుమాట లాడదో మఱి చూడకుండునో చనుఁగవఁ గప్పునో చాలు ననుచు ... భాగ. ౭. ౩౨౦.

వి. (వృత్తియం దుత్తరపద మగుమాఱుశబ్దమునకు వికల్పముగా ఆదేశమై వచ్చు రూపము.) తడవ, పర్యాయము.

(చూ. పలుమఱు, వేమఱు.)

జ. మఱుగుజ్జు, మఱుమాట, మఱుప్రోఁత.

**మఱు**[2]. విశే. (వృత్తియందు పూర్వపద మైన మునుసశబ్దమునకు వికల్పముగా ఆదేశమై వచ్చు రూపము.)

అనంతరము, పిమ్మటిది. (చూ. మఱునాఁడు.)

జ. మఱునాఁడు, మఱుమేను.

**మఱు**[3]. వి. వృత్తియందు పూర్వపద మైనమఱుఁగు శబ్దమునకు వికల్పముగా ఆదేశ మగురూపము. (చూ. మఱుపడు.)

**మఱుఁగిడు.** స. క్రి. (మఱుఁగు + ఇడు) దాఁచు, గోపనముచేయు.

క. కొంత మఱుఁగిడక కలిగిన, యంతయు నిక్కముగఁ జెప్పఁ డనుటయు వారల్. కళా. ౭. ౧౭౦.

**మఱుఁగు** = మఱువు. అ. క్రి. (త. మఱై) చాటగు, తిరోహితమగు, దాఁగు. (శ. ర.)

ద్వి. పిఱుఁగుజంకలును బి ట్టొఱలుమన్నెల్ల, మఱుఁగుగవయములు మడియ నేదులును. ద్వి. హరిశ్చ. పూ. ౮౦౭. పం.

మధురగతిరగడ. పరువపునవకా పరు వని దిరుగుచుఁ గురికొందలపొద గొరు వని మఱుఁగుచు .. ప్రబంధ. ౨౫౩.

౨. (క. ప.జుగు) నీళ్లు, మొ. సలసల కాఁగు.
(వ్యవ.) నూనె మఱిగినది.

౩. సంతాపించు, మిక్కిలి దుఃఖించు.

సీ. ఇవ్విధంబున కక్కట యిట్టిది శోకంబే మాయ
దైవం బని మఱుఁగువారు.
భార. విరా. ౨. ౧౪౬.

ద్వి. అతిమఱిఁ గోపించి యాధర్మశీల, మఱుఁ
గుచు శపియించె మఱచితే తొల్లి ...
రం. రా. యు. ౩౨౨. పా. ౨౩. పం.

క. అఱువదివే లబ్దంబులు, నెఱయఁగ మని
సుతులఁ గనని సెవ్వగ చేతన్, మఱుఁగుచు
జర మేనం గ్రి, క్కిఱియఁగఁ దఱి దప్పి
సుతుల నిల్లేఁ గంటిన్ ...
శా. రా. బాల. ౧౨౫. కు. సం. ౫. ౫౭౦.

వి. ౧. బాటు, వ్యవధానము.

చ. అవికయుఁ ఒట్టుపుట్టుము చెలంగు మఱుం
గయి యున్కిఁ జేసి, సైమ. ౬. ౧౩౧.

క. జడనిధి యను తెరమఱుఁ గటు, వడలి
నిలిచినట్టియాట వెలఁదియపోలెన్ ...
ప్రభా. ౧. ౫౪.

ద్వి. ఇరికిల్ల గుమ్మలయొడలను దలుపు, మఱుఁ
గున బన్నార్లమాటున ...
పండితా. దీక్షా. ౪౪. పా. ఆం. భా. ౧. ౩౬.

౨. దాఁపణికము.

ఉ. కట్టిమఱుంగు పెట్టి నుడుకం బని లేదు ...
ప్రభా. ౩. ౩౨.

ఉ. ... ఓ, హేమలతాంగి యింక మఱుఁ
గేటికి న ప్పుట్టకమాట పల్కెదన్,
గాముఁడు సాక్షి గాఁగఁ గలకాలము
కూడి సుఖింత వింపుగన్ ..
కవిరా. ౫. ౧౫౦.

౩. చాటుకవులు తఱచుగాఁ బ్రయోగింపని
మాఱుమూలమాట, అప్రతీతము.
(కవిత్వదోషములలో నొకటి.)

సీ. .. తఱచ, లను ప్రాలుమాలికలును సంది
గుము వేమఱపులు మఱుఁగులు వ్యర్థపద
ములును . ప్రబంధ. ౧౩.

౪. మిష; నెపము, సాకు.

మ. కమలాన నృధురాపురాంగనలు చోద్యం
బంది శ్రీకాకశమ, స్త్రీమహాదేవుఁడు జంగ
మాకృతివిభూతిన్ భ్వక్త్యులం గూడి
వ, చ్చి మడియవ్యర్థఁ దీర్చి యాత్మనగరీపీ
పోపకంఠంబు, జే, ర్చి మఱుం గొక్కటి
పెట్టి పోయె నిఁక నేరీతిం గనుం
గొందుమో .. కాశీ. ౪. ౧౦౯.

జ మఱుఁగిడు, మఱుఁగుఁజొచ్చు, మఱుఁగుడు,
మఱుఁగుదొడ్డి, మఱుఁగుపడు, మఱుఁగు
పెట్టు, మఱుఁగు పెరడు, మఱుఁగుపెట్టు,
మఱుకువ, మఱుపడు, మఱుపెట్టు, మఱువ.

మఱుఁగుడు. వి. (√మఱుఁగు) తాపము,

గీ. కాఁక మఱుఁగు, డుడుకు సెగ కెర్ల
నాఁగఁ జెన్నొందుఁ దాప, మునకు
నామములు లై ఆం. భా. ౧. ౪౬.

మఱుఁగుఁజొచ్చు. స. క్రి. (మఱుఁగు+చొచ్చు)
శరణముపొందు.

సీ. సెగ కుల్కి మఱుఁగుఁజొచ్చినజపచ్చుర
విజలసరణి మల్లెలతో డిజడలు మెఱయ.
ఆము. ౨. ౫౭.

ద్వి. మఱుఁగుఁజొచ్చినవాని మదిలోనఁ గరుణ,
నెఱయఁ బ్రోచుట నాకు నియమవ్రతంబు.
ద్వి. హరిశ్చ. ఉ. ౨౪౬౧.

మఱుఁగుదొడ్డి. వి. (మఱుఁగు+దొడ్డి) మలవి
సర్జనస్థానము. (శ. ర.)

మఱుఁగుపడు. అ. క్రి. (√మఱుఁగు) దాఁగు,
చాటగు, తిరోహితమగు.

వ. ... అయాటవికుండు పెట్టఁ దాఁచి యస్థి
శకలంబులు చూచి తనవృథావస్థకుఁ జిన్నఁ

బోయి యవి యచ్చోటన పొరంజల్లి తన
పల్లెకుం బోయి మఱుఁగుపడి యుండె ...
కాశీ. ౫. ౮౦.

సీ. ఒరుదలగా వచ్చి యొగి మఱుంగుపడంగఁ
జెవి నిల్లు గట్టుక చెప్పిరేని ...
విప్ర. ౫. ౪౦.

ఉ. ... ఒండొంటికిని భేరంబులు వాతి
నుప్పించి తప్పించుకొనుదుప్పులు ఖురజ
రజశ్ఛటల నెసక మెసంగు మసమసకల
మఱుంగువడియుండు గండోపలంబులును.
మనుచ ౪. ౩౭.

**మఱుఁగు (వె) పెట్టు** = మఱువెట్టు. స. క్రి. (√మఱుఁగు) దాఁచు, గోపనము చేయు, కప్పిపుచ్చు.

ఉ. ... ఏరికి నెట్లు దోఁచిన సహించుట
గాని నిజంబు చెప్పకే, నేర మఱుంగు
పెట్టి ధరణీవర .. కళా. ౮. ౧౯౭.

ద్వి. మఱుఁగు పెట్టక చెప్పుమా నీవు నిట్టి,
నెగు లింతయును నేమి నెపమున వచ్చె.
ద్వి. హరిశ్చ. ఉ. ౨౧౦౩ పం.

సీ. మఱుఁగువెట్టక డెంద మెఱిఁగించుకై వడి
గొబ్బునఁ బయ్యెదకొంగు పడల .
విక్ర. ౧. ౧౨౨.

**మఱుఁగుపెరడు.** వి. (√మఱుఁగు) మఱుఁగు దొడ్డి. (శ. ర.)

**మఱుకువ.** వి. (√మఱుఁగు) సంతాపము.

తరువోజ. మానితబలుఁ డభిమన్యుండు పోర,
మడిసినప్పుడు నిట్టి మఱుకువ నాత్మ,
యూనదు ... భార. ద్రో. ౨. ౧౯౨.

గీ. అనిన ధర్మజుఁ డి ట్లను నద్దురాత్ముఁ,
బొలియఁ జేయుట దగదు దుస్సలఁ
దలంచి, వాని నొకతప్పునకు సైఁపవలయు
యుంబి, కేయుమహీపతికి మఱుకువ సేయఁ
జనునె ... భార. అర. ౬. ౨౪౨.

క. మండఁగ మండఁగ నార్చిన, ఖండితవిత
ములఁ ద్రుటితకాపీనములన్, దండముల
తుండములును గ, మండలకీలములఁ
జూచి మఱుకువ దోఁపన్ ...
ఉ. హరి. ౪. ౮౫.

**మఱుగుజ్జు.** విశే. (మాఱు = ప్రతి + గుజ్జు) గూనివాఁడు గూనిది.

సీ. వాన్నవిస్నానఫలము లీఁజాలుపరమపా
వనుం డొకమఱుగుజ్జుబ్రాహ్మణుండు ...
వరాహ. ౬. ౪౩.

చ. ... మఱుగుజ్జు ప్రేష్యకై, ధ్యతి సెడి
యుగ్రసేనునకుఁ బ్రేష్యత నొందియు దిద్ది
యేలఁజే ... ఆము. ౫. ౫౩.

సీ. మఱుగుజ్జు నాఁగ నమరుఁ గుబ్జనామంబు.
ఆం. భా. ౨. ౧౨౩.

**మఱుతు(ర్తు)రు** వి. భూపరిమాణవిశేషము, ఒకవిధ మగుభూమికొలత.

వ. .. రుద్రేశ్వర శ్రీమహాదేవరం బ్రతిష్ఠ సేసి
నివేద్యానకు పెట్టినది నీరునేల మఱుతురు
౧ వెలిసీను ... ద. శా. ౪. ౬౩౩.

వ. శ్రీ(ంజ) కల్యాణకేశవదేవర అర్చ(వట)
ముదుపడలకు ౫౩ ఎఱుంకెఱువువెనక నీరు
నేల మఱుతురులు ౪ ...
ద. శా. ౪. ౮౦౪.

వ. ... శ్రీమన్మహా మండలేశ్వరమండెరాజు
శ్రీకేశవదేవరకు (నై) వేద్యార్థముగా
నా (౦) దిండ్లవాయవ్యమునం దన కట్టిం
చిన మల్లసముద్రము వెనక నిచ్చిననీరు నేల
మర్తురు ఒక్కటి ...
ద. శా. ౪. ౭౭౫.

వ. . . తొంపిచెర్ల శ్రీ అనంతగోపీనాథ
దేవరకు అమావాస్యకొలువులకు తొంపి

చెన్న అంబగదచెఱువు వెనకను నీర్నేల మఱ్తురు. ౧. గు. జి. ఔంపిచెర్ల శాసనము. ౧౭౪౨.

**మఱునాఁడు.** వి. ఔ. (మఱుస + నాఁడు)
మఱుసటిదినము, పరదినము.

మ. మఱునాఁ డంథకవృష్ణిభోజయదుసామం
తాగ్రణిసేన గం, దెఱగా సాత్యకి
రాముఁ డుద్ధవుఁడు హార్దిక్యుండు లో నైన
తాం, ద అమాత్యుల్ దను జుట్టిరా ..
ఉ. హరి. ౨. ౯౪.

గీ. అనిన విని యెల్లవారును నధికహర్ష,
మెసఁగ నున్నంత మఱునాఁడ యేఁగు
దెంచె, భార్గవుం డమ్మునీంద్రులు పరమ
భక్తి, నర్చ లిచ్చిరి హరిశ్రవాహనుఁడు
గనితె ... భార. ఉద్యో. ౪. ౭౩.
రం. రా. అర. ౯౨. పొ. ౧౨. పం.

**మఱుప(వ)డు.** అ. క్రి. (మఱుఁగు + పడు)
చాటగు, తిరోహితమగు. దాఁగు.

క. తతిమి హలి హలము విసరుచు, నెతిఁ
గదిసిన బెగడి విమతనికరము వెడ నై,
తెఱఁగుపడు నొదుఁగు నడఁగును, మఱు
పడుఁ జెడు మఱియుఁ బొరలు మగలుం
డరలున్.
భాగ. ౧౦. పూ. ౧౫౬౪.

క. విడిగడువుప్రవేశమున నొక, యడుగే
నిడ లేకయున్నయర్థాధిపతిం, బుడమిఁ
బడఁద్రోచి పై మఱు, పడ శవములతిట్ట
పేర్చి పరిజన మరిగెన్. కవిక. ౨. ౧౭౧.

క. సోమాన్వయప్రదీపకుఁ, డీమెయిఁ దేజో
విశేష మెసకం బెసఁగం, గా మెఱయుట
గనుఁగొని పి, ౖ మఱుపడుమాడ్కిఁ
గ్రుంక నర్కుం డంతన్.
భార. భీష్మ. ౧. ౭౯.

ద్వి. ఇల మఱుపడ్డ నిర్మలశిరభక్తి, తల
యెత్తువడువునఁ దాఁ దల యెత్తు.
బస. పు. ౧. ౪౧౭ పం. భార. ఉద్యో.
౪. ౩౬౨.

**మఱుపె(వె)ట్టు.** స. క్రి. (మఱుఁగు + పెట్టు)
౧. దాఁచు, మఱుఁగుపఱుచు.

వ. .. మరుం డొనర్పఁ గలకొత్తలలతిం
దిపురుతమతపు ముంగలిపొఁజులు నిగిడించు
క్రొవ్వాఁడితూపుల రూపున నొండొరువుల
మఱుపెట్టి చూచుసెలగోలుచూపుల ...
పారి. ౨. ౫౧.

సీ. వాదింప నొల్లరు వశమైనపనికైన మఱు
పెట్టి నొల్లరు మర్మమైన.
కవిక. ౬. ౧౦౩.

వ ... గోపాలాదిక్షుద్రజనంబులకు మఱు
వెట్టం దలంచి వారల కభిముఖు లై
పాండునందను లిట్లనిరి.
భార. విరా. ౧. ౧౬౬.

చ. అనయము రాగ మొప్ప సహజానన
చంద్రకటాక్షపంక్తి ప, ర్వినవఘుళంకఁ
గగ్గ మనశ్రీ మఱువెట్టు. ఆము. ౫. ౧౫.

౨. వంచించు, మోసపుచ్చు, మిదపెట్టు.

సీ. అరగంటిచూపువ నలసరీతిని జూచు మఱు
పెట్టు చూపున మరలి చూచు.
కవిరా. ౨. ౧౩.

సీ. మఱువెట్టి చనుదోయి మదనాంకములు
నూచుఁ దనః నవ్వివిభుఁ జూపులనయ
దల్చు. నైష. ౬. ౯౧.

చ. తలఁపున నాథునిం గలసి తా నది నిక్క
ముగాఁ దలంచి మిం, చులఁ దులకించు
మోవిపయి సోఁకిన కెంపులు గప్పిపుచ్చె
నె, చ్చెలి మఱువెట్టగాఁ దలఁచి ...
రాజ. చ. ౩, ౧౦౦.

క. కుమ్మెదవలె నున్నది యిటు, రమ్మని
సెజికొప్ప నివిరి ప్రమసితిఁ దరుణీ, కమ్మ
విరి వల్లగలు వని, క్రమ్మఱ మఱుపెట్టు
గుట్టు కన రాకుండన్. విజ. ౨. ౧౪౩.

**మఱుమాట.** వి. (మాఱు + మాట) ప్రతి
వచనము.

సీ. మాఱుమా టనఁగను మఱుమాట ననఁ
గను బదులు మాటనఁ బ్రతివాక్య మొప్పు.
ఆం. భా. ౧ ౧౧౪.

**మఱుమేను.** వి. (మఱుస + మేను) పర
జన్మము, ఉత్తర జన్మము.

చ. పనివడి సేవ సేసి పరిపాకము వొందక
యొవ్వఁడేనిఁ జచ్చిన మఱుమేన నైన
నది సిద్ధి వహించు. భాగ. ౧. ౧౦౦.

**మఱుమ్రోఁత.** వి. (మాఱు + మ్రోఁత) ప్రతి
ధ్వని.

గీ. ... ప్రతిధ్వని మఱుమ్రోఁత యనఁ దగు
భవ. ఆం. భా. ౧. ౧౨౨

**మఱువ.** వి. (మఱుఁగు + వా) కుండ. (చూ.
మఱువకందు.)

విణ. మూఁగ.

గీ. కరలి సకిలించె షణ్ముఖు మఱువమావు,
పరిమళము చూచెఁ గరి శుష్కపల్వలంబు.
పాండు, ౪. ౨౧.

జ : మఱువకందు.

**మఱువకందు.** వి. (మఱువ + కందు)
అగస్త్యుఁడు.

ఆ. మఱువకందుఁజోగి తెఱవాయి మెకమున్న,
చెంత కరిగి యతనిచేత విండ్లఁ, గత్తలములు
దూపుగములును దద్దయుఁ, గొంచు నంతఁ
జనిరి పంచవటికి. అచ్చ రా. అర. ౭.

22

**మఱువు** = మఱుఁగుఁ. అ. క్రి. చాటగు, తిరో
హితమగు.

చ. వెఱపు లంతికంపమును బిడని ప్రిడయు
మాఱు సేయఁగా, నెఱుఁగమి రేపులేమి
పరియుత్తైదు చొక్కులకోలు ముందుగా,
మఱువుకొంగంబు నోరయును మాటుగ
తెప్పలఁ గప్పుమాడ్కియుం, దెఱవ
నవాగ్రసంగతి బ్రతిక్రియలై యలరించె
భూవిభున్. కవిక. ౩. ౨౨౧.

వి. ౧. చాటు, ఓలము ; అడ్డు.

గీ. అంధకారంబునందును నణఁగిపోదు, దీప
తేజంబునందును దిరిగిరాదు, ఎట్టివఱు
వైనఁ గన్పించు నెదురు లేక, చారుతర
మైనయట్టి విచారదృష్టి. ...
వాసిష్ఠ. ౧. ౧౬౦.

క. వెఱచి వెఱచి యడిగెద నే, మెఱఁ
గింపఁగ వలయు నొకటి యీ వెవ్వఁడ
వీ, కొఱమాలినగొల్లతనము, మఱువున
విహరించె దిట్లు మహి నాత్మేచ్ఛన్. ...
హరి. పూ. ౭. ౨౩౪.

క. చిఱిగి నిశాటులు రావణు, మఱువున
కేతేరఁ జూచి మనమునఁ గోపం, బెఱుక
పడ సుహర్య్వుఁడు వడిఁ, జఱపెన్ వాన
రులవిూఁదఁ బటువిశిఖంబుల్ ...
భా. రా. యు. ౧౫౦౯.

వ. ... మొదలం గదనంబునకుం దెచ్చుకొన్న
మహాచలశృంగాదులు బలుకడిం బడుబాణ
జాలంబులకు మఱువుగా నొడ్డవాఁడను ...
భా. రా. యు. ౨౫౪.

౨. కవచము.

గీ. మానుసులువోలె నున్నార లేను లేని, తత
మహాగుణశాలి నాతనయుఁ గాచి, కొనఁ

కడఁగర సింగారముకతఁ గాక, మఱువు
లను గ్రైదువులు మీకు మానమునక.

భార. ద్రో. ౨. ౨౬౭.

ఆ. ఆతనివారలఁ గొంద ఱడఁచుఁ గొందఱుఁ
మఱువుఁగొంద తేఁచి నఱకి రపుడు ...

మార్క. ౭. ౧౦౪.

చ. మఱువులు సించుచుం దెలుచ మర్మము
లూడ్చుచు నోలిఁ గ్రైదువు, ల్విఱుచుచుఁ
గేలుదోయి విదళించుచు ...

భా. రా. అర. ౨. ౧౯౪.

జ : మఱువుకొను, మఱువుసొచ్చు, మఱువెట్టు.

**మఱువుకొను.** (అ. క్రి. (మఱువు+కొను స్వార్థమున.) దాఁగుకొను, మఱుఁగుపడు.

క. త్రినయన పుత్రుఁడతోఁ డట వెను, కొన
సురపతి వఱచె మఱువుకొన నజాని హరిం,
గని ద్యాంధు శరణు గావక, చనిరా
మహాదేవ నీవ శర ణనుభాతిన్ ..

కు. సం. ౧౦. ౪౩౭.

**మఱువుసొచ్చు = మఱుఁగుఁజొచ్చు.** స. క్రి. శరణుపొందు.

ఆ. అనుజఁ జూచి కష్టమనుజాలిఁ గూడి నా,
పనుపు సేయకుండఁ జనునె నీకు, ననుచు
సుదరి పలుక విని హిడింబయుఁ గడు,
వెఱచి భీమసేనుమఱువు సొచ్చె ...

భార. ఆది. ౬. ౨౦౧.

క. ఆరథనివహంబులు న, వ్వారణములుఁ
దరలి మరలి వడిఁ బఱచుటయుం, గౌరవ
బల మెల్లను రణ, శూరుడు గాంగేయు
మఱువు సొచ్చె వికలమై ...

భార. భీష్మ. ౨. ౨౯౪.

**మఱువెట్టు = మఱుఁగుపెట్టు.**

గీ. ... మఱువెట్టె ననఁ దగు, మఱుఁగుపెట్టె
ననుట ... ఆం. భా. ౩. ౧౩౫.

**మఱుస.** విణ. దే. అవ్య. అనంతరము, తరువాతిది.

క. విను ప్రద్యుమ్నుని దక్కన్, మనమున
నే నొరు వరించుమాట విడువు మా,
ఘనుఁ డొల్లకున్నఁ జెందుదు, మనసిజుకేళిఁ
దనువు వేల్చి మఱుసటిమేనన్ ...

ప్రభా. ౩. ౧౦౨.

క. ఆ చెంకిఁ గరటవిభుఁ డొక, కోటర గర్భ
మున నణఁగికొని యుండుట వా, చే
టాదవ దయ్యె వానికి, నాఁటికి నది పోయె
మఱుసనాఁ డుదయమునన్ ...

వేం. పంచ. ౩. ౯.

క. ఈరీతిఁ ఒడకయింటికిఁ, జేరంజని మఱు
సనాఁడు చీకటి వేళే, రారాకళ రారాఁ
గల, యారజనీవేళ విరహ మగ్గల
మయ్యెన్ ... హంస. ౫. ౧౯౭.

జ · మఱుసనాఁడు, మఱుసంజ.

**మఱుసంజె.** వి. (మఱుస+సంజ) సాయంసంధ్య.

సీ. ఒకదివిఁ దొలుసంజ యాస్యమునఁ
బొందు నుదయించు మఱుసంజ యొండుదిశ.

కాశీ. ౧. ౧౭౯.

(మలుసంజ. శ. ర. పా)

**మఱ్ఱి = మఱి.** వి. వటవృక్షము.

సీ. అభ్రంకషాభోగ మగుమఱ్ఱికొమ్మను గట్టిన
ప్రేలెడినుట్టి యెక్కి ... విక్ర. ౨. ౪౪.

వ. మఱ్ఱిపండులవడువు గలమడమల వెడంగు
పడి ..

ఆము. ౬. ౯౭. ఆం. భా. ౨. ౪౪.

**మఱ్ఱెత.** వి. (క. మఱ్ఱు = పిచ్చి, బుద్ధిహీనత) మూర్ఖురాలు, అవివేకిని.

ఉ. మఱ్ఱెతవోలె మాపడుచు మార్కసులన్ జలి
కింపఁ బూని నీ, వెఱ్ఱెతనాలు మాన వని
వేడ్క ని టాడఁగ నింటనుండి రాఁ,

కట్టునఁ గోపగించుకొని చెప్పఁడు చేయఁడు లేచిపోయె మీ, కట్టియగారు మంచిగురువే దొరికెన్ బదు కెట్లు చెప్పనో ... సై జ. ౪. ౧౨.

**మల.** వి. (క. మలె. త. మలై.) పర్వతము, కొండ.

సీ. తూఁగాడుపయ్యెద దోధూయమాన మై మలశైజ యుత్తి కామహిమఁ బడయ .. హరి. పూ. ౩. ౧౨౭.

ప్రాఁతప్రతిపా. దోధూయమాన మన్మథ వై జయంతికా. అని (క్రొత్తప్రతిపా.)

క. పులి మల డిగి యుూల్లస న, తులరుజ రా జనము మాన్పఁగోఁ బనిచి గవిన్, సెల కొన సురియలు గొని చని, పొలియునొ యూరఁ గుయిరేఁగి పొడుచునొ చెపుమా. ఆము. ౩. ౪౩. నీలా. ౧. ౧౧౯.

జ: మలగొంగ, మలజువ్వి, మలదాయ, మల ద్రిమ్మరి, మలమన్కి, మలయమ్మ, మల అమ్మ, మలహజారపుజోదు.

**మలఁక¹.** విణ. (√మలఁగు.) వంకరయైనది.

క. ఆచీకటి వెనుదగిలినఁ, బ్రాచీదిశనుండి గంతుఁ బరువున రవి భ, ర్మాచలము మలఁకత్రోవను, వేచనియెం గాక నిలిచి విఱుగక యున్నే ... భాగ. ౧౦. పూ. ౧౨౯౩.

చ. మలఁకలు మాప్రచారములు మాముఖముల్ విమవహ్ని ఘోరముల్, ఖలులము దోవ జాతులము గర్వుల మే కొంకమంచివా రమే, నళినదళాక్ష .. భాగ. ౧౦. పూ. ౬౯౧.

వి. ౧. చుట్టు, వలయము.

సీ. తనమేను మలఁక లై తనరారి నిగిడిన యు మున యంతయుఁ దన్మయత్వ మొంద ... హరి. పూ. ౮. ౨౧.

సీ. పేయిమానికపు దివ్వెలతోడఁ బడగలు ప్రోల్చు నేదేవుని మలఁకపాన్పు ... ఉ. హరి. ౨. ౧౪౪.

చ. ... పాఁపతతి క్రొటిమలంకల నిర్ఝ రాం బువుల్, గిరికొని మీఁదనుండి దిగఁ గిమ్మర కంఠి పయోధిఁ ద్రచ్చున, త్తటి ఫణిరాజు చుట్టినవిధంబున నున్నది చూడు మిగ్గిరిన్. కాశీ. ౫. ౨౭౪. వరాహ. ౧౧. ౧౧.

౨. మెలిక.

క. పాయవడఁ జొచ్చు గుంపులు, పేయును మలఁకలఁ జరించి చించును గోణా, వ్యాయామగతుల వలయము, లై యుండన్ దిరిగి కలఁచు వరిసైన్యంబున్. భార. భీష్మ. ౧. ౨౬౯.

గీ. ప్రకటఫణివేష్టి ఘృష్టిమార్గములు డిగ్గి, మలఁక లై పాఱు నిర్ఝరామలజలంబు, పాఁపతిరిత్రాడు పెనఁగొన్నభావ మొంద, మగువ నీ కింపుఁ బుట్టించు మందరాద్రి. శైవ. ౫. ౬౩.

క. తామరసనేత్ర వీనుల, తో మొనవి జయింప లేక త్రొక్కటమున నెం, తో మలఁకలఁ బడి క్రుక్కుచు వేమఱు శష్కులులు గ్రాఁగి వేఁగుచునుండెన్ ... రసిక. ౨. ౭౯.

౩. చిక్కు.

ద్వి. ఇటువలెఁ జెలరేఁగి యొవ్వరి నిట్టు, మటు మాయవిధి పట్టి మలఁకలఁ బెట్టు ... ద్వి. హరిశ్చ. పూ. ౧౮౦౯. పం. ద్వి. హరిశ్చ. ఉ. ౮౮౨. పం.

౪. ఏఱులు కొండలగునవి ప్రక్కఁకుఁ దిరిగిన మలపు.

సీ. బలువాహినుల మించుమలఁకల ఘనసామ కంబులు దూఱ మూలంబు లెత్తు ... వసు. ౧. ౬౭.

౨. కపటపునడత, కుటిలప్రవర్తనము.

ద్వి. మగలకపోరెు నమ్మలఁకలతపని ...
ద్వి. పారిశ్చ. పూ. ౪౭౦. పం.

ద్వి. ఉపకాపక్షింబు లుబిదలదృష్టు, మఱియు
వైశికసులు మలఁకలమాట్లు ...
పండితా. పురా ౧౧౭. పొ

జ: మలఁకమెఱుపు, మలగోను.

**మలఁక²**, వి. పరిమాణవిశేషము.

(చూ. మలఁకపుట్టి. మలఁకతూము.)

జ మలఁకతూము. మలఁకపుట్టి.

**మలఁకతూము.** వి. (మలఁక² + తూము) పది కుంచముల పరిమాణము గలమానవిశేషము, (శ. ర.)

**మలఁకపుట్టి.** వి. (మలఁక² + పుట్టి) ఇన్నూఱు కుంచములకొలఁది గలమానవిశేషము.

(వ్యవ.) అతని కోఁటేఁట ముప్పదిమలఁకపుట్ల ధాన్యము పండును.

**మలఁకమెఱుపు.** వి. (మలఁక¹ + మెఱుపు) ధనురాకార మగు మెఱపు. (శ. ర.)

**మలఁగ.** వి. (√మలఁగు) ఎద్దుపై గంతతోడి సరకుగోనె. (శ. ర.) సరకు నింపనిగోనెల తోడి యెద్దుల గాడిదలగుంపు (బ్రౌ.)

**మలఁగించు.** స. క్రి. (√మలఁగు.) ౧. వెనుకకుఁద్రిప్పు.

ద్వి. పార్థివేశ్వర పేరిపైఁ గోప మింక, వల
దని చెప్పి మాపంతుఁ జేసుఁగుసు, మలఁ
గించుగతి మంత్రి మరలించె విభుని ..
ద్వి. పారిశ్చ. పూ. ౧౧౧౨. పం.

౨. ప్రసరింపఁజేయు, వ్యాపింపఁజేయు.

ఉ. ... సాం, ద్రామలకీర్తి గౌతమమహాముని
సల్లనిచిత్తవృత్తి నీ, పై మలఁగించెఁ గావ
లయుఁ బార్థివసత్తము పొందుమున్నదిస్.
భార. అశ్వ. ౩. ౧౦౨.

**మలఁగు.** అ. క్రి. (క. మలంగు. త. మలఙ్కు.)
౧. నివర్తిల్లు, వెనుకకు మరలు; వెనుకకొంగ మగు.

వ. ఇట్లు భానుమంతు నంతపురకరికిం బనిచి.

గీ. మలఁగి గజకంధరము ద్రుంచి తొలఁగ
నుఱికి, కంపుదకు గౌస్తుభాలంతోఁ గ్రేళ్లు
వాఱు, నావృకోదరుపైఁ గవియంగఁ
జేయు, పిచె ... భార. భీష్మ. ౨. ౪౦.

క. తలఁగవు కొండల కైనను, మలఁగవు సింగ
ముల కైన మార్కొనుకడిమిం, గలఁగవు
పిడుగుల కైనను, నిల బలసంపన్నవృత్తి
నేనుఁగుగున్నల్ .. భాగ. ౮. ౨౮.

క. మెలఁగున్ దలఁగున్ భయమునఁ, గలఁ
గున్ మలఁగున్ లతాంగి కపటారభటిన్,
జెలఁగున్ ... కృ. శతం. ౨. ౧౩౭.

చ. అలుకఁ దుషారశైలసుత యుక్కలిమో
ముయి నాలుగేన్పదం, బులు సని భ్రూకు
టీకుటిల ముగ్ధలలాటము జెందుబింబ రై,
మలఁగి కనుంగొనె న్భుజగమండను నక్క
పటద్విజోత్తమున్ .. హర. ౪. ౩౪.

చ. ... ఘుటఘుటధ్వని సారె మలంగి చూచు
చున్ ... అను. ౩. ౨౨.

౨. ప్రక్కకుఁ దిరుగు.

సీ. మలఁగినదాసఁ బడమరమొగం బై కొంతద
వ్వేఁగి పున్నాగతరువు గాంచి ...
దశకు. ౪. ౧౦౩.

వ. .. నందికంబాననుండి కొంతమేర వచ్చి
మలంగి పశ్చిమముఖ మై కొంతమేర వచ్చి.
కొంకుదురుశాసనము. (1852) Ep. Ind V.

వ. శేకశాటంబు వదుమ నొయ్యన నడచి యట మలంగి ... నైష. ౮. ౧౪౧.

౩. వంకరగు; వంకర గాతిరుగు.

క. వలపలిదిక్కున కించుక, మలఁగంగాఁ దుఱుం విడి తుఱుమా పుడుఁబుట్టం, బల వడఁ గట్టి ... భార. విరా. ౧. ౫౧.

చ. తలఁ బ్రతిబింబభానుమణిఁ దాల్చి విహార వనాంతరంబున, న్మలఁగి మలంగి పెంజె లుము నాగువుభంగి. నైష. ౭. ౧౫౪.

౪. తొలఁగు, అపసరిల్లు.

మ. మలఁగు స్మల్లనిగాలికి న్నటురటన్మత్తద్వి రేఫాళికిం, దలఁగుస్ ..
భాగ. ౧౦. పూ. ౧౮౩౨.

ఆ. కురుల తెలుపు చూచి కొఱగాఁడు వీఁ డని, ముసలివాని విడిచి ముదిత పెల్ల, దూర ముగఁ దొలంగుదురు సాధ్వీకకల షా, మాఁ నూతి విడిచి మలఁగుభంగి. భర్తృ. ౩. ౮౪.

౫. చుట్టుకొనియుండు, పరివేష్టించియుండు.

సీ. పొలకచ్చకట్టుపై మలఁగిన పచ్చనినును గొంగు దిండుగా నులిచి చుట్టి ..
హరి. పూ. ౮. ౧౩.

౬. సంచరించు, తిరుగు.

ఆ. చెలఁగి చెలఁగి మలఁగి మలఁగి యల్లల్లిన, ౙ్రాలి ౙ్రాలి బట్టుతూలి తూలి ...
నిర్వ. ౬. ౪౭.

ద్వి. హారమణి శోభితాభరణములఁ గళవళం బందక కైకొని పోయి, మలఁగుచు నా చంద్రమతి సనుదెంచు, తెరువున కడ్డంబు దిగ్గిన వచ్చి ...
ద్వి. హరిశ్చ. ఉ. ౨౫౩.

౭. వర్తిల్లు, ఉండు.

చ. మలఁగఁగదే త్రిశోణమణి మండపవీపిక పై మహేశ్వరా ... ఉ. హరి. ౫. ౧౦.

గీ. మృగవిభుం డిట్లు విన్నని మొగముతోడ, మలఁగుచుండంగ మఱియు నమ్మంత్రి సుతుఁడు ... వేం. పంచ. ౧. ౩౮౦.

౮. క్షీణించు, తగ్గు; నశించు, చెడు.

ద్వి. మలఁగనివగల సుమంత్రుండు చాల, నల యుచుఁ జని యయోధ్యాపురిఁ జొచ్చి.
రం. రా. అయో. ౧౨౧. పా. ౨౪. పం.

సీ. పౌండరీకసమృద్ధిఁ బాపఁగా శశికీర్తి మలఁగె నా వెన్నెల ల్కలఁకఁ బాతె.
ఉ. రా. ౪. ౨౪౨.

క. విను మజ్ఞానమ్మునఁ గ, ర్మనిరూఢత గలుగు దాన మలఁగవు జననం, బును మరణము...
భార. శాం. ౬. ౧౬౬.

౯. కలఁగు, క్షోభపడు.

ద్వి. ఓ గురులార యో నుత్తమలోక, భోగ భాగ్యుఁడ నైతి, పుణ్యుండ కరమర్థి మిము నైతి, గొల్చుఁ గతమున నాదు, మరణం బునకు మీరు మలఁగకుఁ డింక.
రం. రా. అయో. ౧౫౯ పా. ౩౧. పం.

సీ. అతిశోకశోషాకులాత్యంతదోదూయమాన మై హృదయంబు మలఁగుచుండ ..
భాగ. ౪. ౮౭.

౧౦. ప్రజ్వలించు, మండు.

ఆ. మాన కగ్నిలోన మలఁగ నే వోవిన, మాడ్కిఁ గోపవహ్నిమండి రొగసె.
కు. సం. ౨. ౧౮౮.

వ. ... అవసానంబున మలఁగుదీపం బధికం బుగ వెలుఁగుఁ జూపిన చందంబున ...
వేం. మా. ౪. ౨౭.

౧౧. కనబడియు, సంకోచించు.

ద్వి. మలఁగక వాపమ్ము మాయ లన్నియును, గొలుపవు వీనిపై ...
ద్వి. హరిశ్చ. పూ. ౨౧౭౭. పం.

౨. మదము, పొగరు. (ఆవేశము అని శ. ర., ఉండగా నిది కవియు ధాతువుతోఁ గూడియే ప్రయోగములఁ గనఁబడుచున్నది)

ఆ. ఇట్లు భుజగదానవేంద్రుల నిర్జించి, యమర మసరు కవిసి యంతఁ బోక, కంధివిభుని పురముకడుచు యారసి యుద్ధవిడిని బురము నొద్ద కేఁగి. నిర్వ. ౫. ౮౦.

క. అసితఫణిభీషణం బగు, నసి చేకొని యాయత మగునంసమున నమ, ర్చి సముద్ధతి నరదము డిగి, మసరు కవిసి కదిసె మారి మసఁగిన భంగిన్ హరి. ఉ. ౧౦. ౯౪.

గీ బలోదారుఁడైన, మహిషుఁ డెప్పుడు మదమున మసరు కవిసి కలఁచుచున్నాఁడు త్రిభువనకమలవనము. మార్క. ౭. ౭౪ భాగ ౧౦. పూ. ౪౭౫

జ మసరిడు ; మసరుకొను.

మసరిడు. అ. క్రి. (√మసరు) పొగరెక్కు, క్రొవ్వు.

చ. అసమమగంధబంధురములై చెలువొందెడు పద్రసాన్నముల్, బసవనియింట నిత్యము నపారముగా భుజియించుచుండు నీ, కుసుమ శరారిభక్తులను గూరిచి పెట్టఁదలంచి నాఁ డవో, మసరిడి మత్స్యమాంస మనుమానము లేక భవద్గృహంబునన్. చెన్న ౪. ౩౪౩.

మసరుకొను. అ. క్రి. (మసరు + కొనుస్వార్థమున) మదించు, పొగరెక్కు.

వ. చటులవాల ఘాతంబుల మద్ధూతంబులై మసరుకొని విసవిస విసరుగాడ్పులఁ దూలి . (మసరుకొని = తీవ్రమయి అని భావము.) శ్రీరం. ౧ ౧౩౭

మసరులు. వి. బ. ధాన్యవిశేషము, ఒక జాతి వడ్లు.

సీ. మతిసరుల్ మసరులు మంకెనల్ పగడంపు తీఁగెలు వడిప్రాలు దేవసరులు. హంస. ౪. ౧౭౮.

మసలు. అ. క్రి. (క. మసలు) ౧. ఆలస్యము చేయు, జాగుచేయు.

సీ. ఉత్సవ సందర్శనోత్సుకులై పోయి కడుఁ జెద్దప్రొద్దయ్యె, గొడుకు లేల, మసలిరో కౌరవుల్ వినువార వైరంబు గావించు పాప స్వభావు లెఱిఁగి భార ఆది. ౭. ౨౦౭.

ఆ ఎలమిఁ దేరిమీఁద నిలుచుండి పడమర, దిద్రి చూచుచున్న యిద్దురాత్ము, మస్త కంబు దునుము మసలక యని యర్జు, నునకుఁ జూపె సైంధవుని మురారి భార ద్రో ౪ ౨౧౮.

క. పతి పరదేశాంతరపరి, గతుఁడై క్రమ్మఱక యచటఁ గడు మసలుటయున్, మతి దుందుడుకం బొందెడు సతిఁ బ్రోషిత భర్తృక యనఁ జను నంద్రు బుధుల్. కావ్యా. ౩. ౭౨. అం. భా. ౩. ౯౭.

౨. తప్పు; (చూ. వెలమసలు.)

౩. వర్తించు, ఉండు.

క. విసవిస నెప్పుడు మసఁగక, విసరెడి వలిచేత వడఁకు విడువక మనముం, బస చెడి మార్గము గానక, మసలితి మంతటను నంకుమంతుఁడు వొడిచెన్. భాగ. ౧౦. ఉ. ౧౦౦౧.

ఆ. మదనుఁ గన్నతల్లి మాధవు నిల్లాలు, బ్రదుకు లెల్లఁ దానె పట్టిచూడ, ముఖ్యమైన లక్ష్మి మమ్మయ్య కాంతాత్మ, మందిరంబునందు మసలుఁగాఁక. శివరా. ౧. ౫.

౪. కలుగు.

ద్వి. మగుదయొరాలికి మసలె గర్భంబు పండితా. మహిమ. ౭౮౪. పా.

౫. విహరించు.

క. క్రేళ్లుతికి మసలె లేఁగలు మల్లడిగొని ఱంకె
లిడిరొ మద వృషభంబుల్ ...
భాగ. ౧౦. పూ. ౧౪౭.

రగడ తగ మసలు భసల సంతానముల గాన
ముల . రాఘవ. ౨. ౬.

క. తనుఁ దాఁ గానని మనుజాని, మనము నిరో
ధింపఁ బడక మసలుచుఁ దిరుగున్ .
సీతారా ౩. ౫౬.

౬. మరలు, వెనుదిరుగు.

సీ. వసులాభ సంపత్తి మసలెనే జాహ్నవిఁ
జేకొన్న శంతను క్షితిపమణికి
వసు. ౨. ౧౩౪.

గీ. పెఱిగ జముకీలు గేల్కొన్న పృథివి మారు,
కొని మసలి పోక యొకభంగిఁ జనిరొఁ
గరులు గా. వి ౨. ౫౦.

సీ అమ్మ యెవ్వరిఁ బెండ్లియాడెదవే యన్న
ముసిముసి నగవుతో మసలుటయును
దశా ౭. ౭౨

౭. పరాజితమగు, ఓడు

గీ అదితి యింటఁ బయోవ్రత మాచరించి, భర్తృ
సంగతి సౌఖ్యసంపదలఁ బొదల, నెలమసలె
వెల్లఁ జొగి గల్లముల నెదుర్ప, నెల మసలె
నెల్ల తొమ్మిది నిండె నంత.
దశా. ౫. ౫౭.

౮. కదఁగు, యత్నించు.

ద్వి. అందును మధ్యదేశానీక మర్త్య, సందోహ
మట్టుల సహజభాషలను మసలి యొండొరు
లతో మాటలాడుచును, పసరించి వీరిరిఁ
బ్రణుతి సేయుచును
పండితా. పర్వ. ౩౫౬. పొ.

౯. మలుముల గ్రాఁగు, మఱఁగు.

వ్యావ. నీళ్లు మసలుచున్నవి.

౧౦. నీళ్లు కెం. గ్రాఁగునప్పుడు కళకళమగు.

చ. కసుపులు గుట్టలు స్మసలఁ గ్రాఁగిన నైకత
ముక్కు గుఱ్ఱముల్, గనగనలాడు కుంచ
టులు . సానందో. ౨. ౬.

జ. మసలిక, మసలుకొను.

మసలాఁడి. వి. (మసలు + ఆఁడి) విలాసవతి,
శృంగారచేష్టలుకల యాఁడుది.

ద్వి. మసలాఁడి యిది చెప్పుమాటలు విన్న, వసు
ధేశ్వరుం డెంతవాఁ డనువారు
ద్వి శ సా. ౩. ౧౭౩. పం.

మసలిక. వి. (√మసలు) మాంద్యము, మెల్లన
చ. బిసబిసఁ బోక యొయ్యన నడపింపుఁ దరుంగు
మెఱుంగు మెట్టికల్, మసలిక నిక్కఁ
డెచ్చరిక మచ్చిక నిల్పుఁడు భద్రపీఠికన్
పాంచా ౪. ౨౧.

మసలుకొను. అ క్రి. (మసలు + కొను) వెను
దీయు.

సీ సిగనిఁడి విరవాది చేర్చుక్కపసఁ గాంచి
మఱి వసంతుఁడు కొంత మసలుకొనఁగ .
పాంచా. ౪. ౧౫.

మసారము. సం వి. అ పుం ఇంద్రనీలమణి

మసాలా. వి (హిం మసాలా) మిరియము, జీల
కఱ్ఱ, మెంతులు మున్నగు తాలింపు సామాను,
సంబారము.

వ్యావ. మసాలా గారెలు చాల రుచిగా
నుండును.

మసి. వి. (సం. మషీ. ప్రా. మసీ.) ౧. నల్లని
చూర్ణము, నల్లనిగుండ.

సీ రమణి కెందంబు వేఁడిమి మాఁడి మసియైన
పుప్పొడి మెయినిండఁ బూసికొనుచు
పి. శకుం. ౩. ౨౦౯.

సీ. తలఁ బడ్డగుదింత దెబ్బలఁ గాఁతమసి యిడి
యుంబలి గం జండ్ల నడుగువారు ...
ఆము. ౭. ౧౭౫.

సీ. భస్మవిశేషంబు పరగును గఱు కన మసి
యన .. ఆం. భా. ౨. ౨౪౩.

౨. భస్మము, బూడిద.

గీ. వూదుగులం బేర్చి నొడ్డాది మసి యొనర్చి ..
ఆము. ౧. ౩౭.

వ పెనుమంట మండి మసులై పడిన
యట్టాలక చిత్రయంత్ర ప్రాకారంబులును .
భా. రా యుం ౪౧౧. మనుచ. ౧ ౩౪.

౩. నలుపు, మాలిన్యము.

ఆ. మడుఁగుఁ జీరయందు మసి దాఁకినట్లు మీ,
నత్కులమునఁ గల్మషంబు గార, పేంద్రు
కతనఁ బొంద
భార. ఉద్యో. ౧. ౨౯౫

౪. సిరా, వ్రాయుట కుపయోగించు నల్లని
ద్రవము. (బ్రౌ )

విశే. నల్లనైనది; మురికియైనది.

సీ. మసిబూడి దర్యొ నిర్మలకేలిదీర్ఘి, కాకమలి
నీకహారకైరవములు .
శీమ. ౪. ౧౪౩.

సీ. మసిమంగలముచాయ మైమెంగంబు భేదంగు
వినుప కడెంబులు
ఉ హరిశ్చ ౪. ౧౫౪.

క. త త్తనుసాం, గత్యము మసిపాఁత మాని
కంటై రొయిదుఁగన్ ఆము ౭. ౫.

ద్వి. పలుచని మెంగిలులోపలఁ దోఁచుచంద్ర,
కళఠంగి మూఁగుడు గవిసి మానికపు,
బొమ్మను మసిపాఁతఁ బొదిగిన మాడ్కి,
నెమ్మెని క్రొమ్మించు నిగుడక మాసి.
ద్వి. హరిశ్చ. ఉ. ౨౦౧౯.

పా: మసిపూసి మారేడుకాయ చేయుట = వం
చించుట, మోసగించుట.

వ్యవ. వాఁడు నన్ను మసిపూసి మారేడుకాయ
చేసినాఁడు.

జ. మసికట్టు, మసికోఁతి, మసిబుడ్డి, మసిముట్టు,
మసిమోచు.

మసి. సం. వి. ఇ. పుం. స్త్రీ. ౧. సిరా. ౨. దీపపు
మసి, కాటుక. ౩. నీలశేఫాలిక కి. ౪ శ స్త్రి.
౫. కృష్ణతృష్ణ. (శే. వి.)

మసిక. సం. వి ఆ. స్త్రీ. నీలశేఫాలిక. కి.

మసికట్టు. వి (మసి + కట్టు; బ. మసికట్లు )
కమసాలి దుకాణమందలి కుంపటి బూడిదకుప్ప.
(బంగారు లోనగువాని చిలుము అని శ. ర., బ్రౌ.)

గీ కాన భవదీయవిరహరోగమున వాఁడఁ, గల
హరిత్తులు మసికట్లుగాఁ దనర్చుఁ, గాంచి
నవ్వుఁదు మైనసత్కృతిని నన్ను, రాగ మిట
నూని బ్రోవవే రాజపుత్రి .
బిల్హ. ౨. ౧౪౧.

మసికము. సం. వి. అ. పుం. పాముకన్నము,
సర్పబిలము. (విల్యమ్సు.)

మసికోఁతి. వి. (మసి + కోఁతి) నల్లని
మొగము గలకోఁతి, కొండముచ్చు. (శ. ర )

మసి(సీ)జలము. సం వి అ. న. సిరా. (త్రి. ని.)

మసిదానము. సం వి. అ. న. మసిబుడ్డి, సిరా
బుడ్డి.

మసిధాని. సం వి. ఈ. స్త్రీ. = మసిధానము.

మసిపణ్యుఁడు. సం. వి. అ. పుం. లేఖకుఁడు,
వ్రాయసకాఁడు. (త్రి ని.)

మసిప్రసువు. సం. వి. ఉ. స్త్రీ. ౧. లేఖిని,
కలము. ౨. మసిబుడ్డి, సిరాబుడ్డి.

మసిబుడ్డి. వి (మసి + బుడ్డి) సిరా పోసికొను బుడ్డి (శ. ర.)

మసిమణి. సం వి ఇ. పుం మసిభాజనము (త్రి ని)

మసిముట్టు. అ క్రి (మసి + ముట్టు) వ్యర్థపడు.

క. ఇంతింత పౌరుషము లా, క్కొంతయు మసి
ముట్టకుండ నిటు సేయఁగ దై, త్యాంతక !
త్రిపురాంతకుఁ డోకఁ, దంతియ నీయంత
వార లన్యులు గలరే

హరి పూ ౭ ౧౧౪

మసిమోచు. అ. క్రి (మసి + మోచు) మాయు,
ధూళి లోనగునవి పడి వివర్ణత కలుగు.

చ ముగురును నాకుఁ జూడఁగఁ ద్రిమూర్తులు
తప్పదు లేక వాహముస్, బాగరున నొక్కఁ
డెత్తుక నభోగతి నేఁగుట యెట్లు లెక్కకున్,
మిగిలినసేన నొక్క దహియించి వధించుట
యెట్లు వారిలో, మొగఁ దగువాని కింత మసి
మోపక క్రుంగుట యెట్లు సైన్యముల్.

జై భా ౨ ౪౩

మసివర్ధనము. సం. వి అ. న. రసగంధకము, గంధకము.

మసీదు. వి. (హిం. మసీద్) తురుష్కులదేవాలయము.

సీ. ఆడ పాండవులగుడి యట దక్షిణంబునఁ
గర్తారుఁ డుండుతుర్కుల మసీదు

క్రీడా ౧౪౯

మసీన. సం వి ఆ స్త్రీ. తెల్లయవిసె. ★

మసుర. సం. వి. అ స్త్రీ. ౧ కాయధాన్యము,
కలాయము (బటాని)

౨ వేశ్య (శ ర, ఆ. ని)

మసురము. సం. వి అ పుం. ౧. ఒకజాతికాయ
ధాన్యము. ౨. చర్మముతోఁ జేసినయాసనము.

26

మసురి. సం. వి. ఈ. స్త్రీ. వేశ్య, లంజె (కే. ని.)

మసూర. సం. వి. అ. స్త్రీ. ౧. వేశ్య. (శ. ర.)
పుం స్త్రీ. చిఱుసెనగలు (శ ర)

మసూరము. సం వి అ పుం ౧. ఒకజాతి
కాయధాన్యము ౨. తలగడ, దిండు (కే ని)

మసూరకము. సం. వి అ పుం ౧. తలగడ,
దిండు ౨. కాయధాన్యము, చిఱుసెనగ

మసూరవిదళ. సం. వి ఆ స్త్రీ ౧ నల్ల
తెగడ ★ ౨ శ్యామలత

మసూరి. సం వి ఈ స్త్రీ ౧ స్ఫోటకము,
అమ్మవారిజబ్బు ౨ ఎఱ్ఱతెగడ ★ ౩ వేశ్య,
భోగముది (కే ని)

మసూరిక. సం వి ఆ స్త్రీ ౧ వసంతరోగము,
స్ఫోటకము ౨. దోమతెర ౩. కుంటెనకత్తె,
కుట్టిని ౪. కాయధాన్యము, చిఱుసెనగలు.

మసృణము. సం విశే. (అ. ఆ అ) ౧. స్నిగ్ధము, చిక్కనిది. ౨ మృదువైనది, మెత్తనిది.
౩ మనోహరమైనది, ఇంపైనది, శ్రావ్యమైనది.
వి అ. పుం. మసృణత్వము. (వై. ని.)

మసృణి. సం. వి ఈ. స్త్రీ అతసి, నల్లగిసె. ★.
(వై. ని)

మసృణితము. సం. విశే. (అ ఆ. అ) మృదువుగాఁ జేయఁబడినది, మెత్తనదిగాఁ జేయఁబడినది.

మసెల. వి ఆటుక. (శ ర)

మస్కరము. సం. వి. అ. పుం ౧ వెదురు. ★.
౨ గతి, గమనము, నడచుట ౩. జ్ఞానము.

మస్కరి. సం వి. న్. పుం ౧ పరివ్రాజకుఁడు,
సన్యాసి. ౨. చంద్రుఁడు. (వాచ.)

**మస్టు = మసటు.** వి. (క. మసటు, త. మష్టు) మాలిన్యము, మురికి. (మష్టు. శ. ర.)

సీ. మలవాచకం బగు మసటు నింటికి మస్టు .
ఆం. భా. ౨ ౧౩౪.

ఉ. కాలసమాఖ్యచే నలరుతించరవాఁ డొక తామ్రపాత్రము, ద్వేలసుధారుచిం దనరు వెన్నెలపీసము చేతు నంచుఁ బ్రా, ల్మాలతి లోమఁగా నెడలుమ స్టన సర్వదిశాంతరంబు లన్, మాలతమస్సమూహముల ముంచుకొనె న్మతియు న్సమగ్రతన్. సానందో ౫. ౧౩౩.

ద్వి. కలకఁ దొలంగినకమలినివోలె, బలుమష్టు గడిగిన బంగారువోలె
రం. రా. బాల ౫౧. పా ౫ పం.

**మస్తకము.** సం. వి. అ. పుం న. శిరస్సు.

**మస్తకస్నేహము.** సం. వి. అ. పుం. మెదడు, మేదస్సు.

**మస్తదారువు.** సం వి. అ. పుం. దేవదారు వృక్షము.

**మస్తము.** సం. వి. అ. న. శిరస్సు, తల. విణ. (అ. ఆ. అ) ఎత్తైనది.

**మస్త(క)మూలకము.** సం. వి. అ. న. కంధరము, మెడ.

**మస్తరించు.** స. క్రి. (√మస్తరు.) ౧. వశపఱచుకొను.

ఉ. ఎంతయు ఘోరమైన విషిసేథము మెల్లన మస్తరించి మా, వంతుఁడు గంతకేతి గుడ వైచి ముఖంబున నెక్కనట్టులం .
కాశి. ౫. ౨౩౬.

గీ. మనమ గరఁగించి బ్రమయించి మస్తరించి, మిగులఁ జొక్కించి యొంతయుఁ దగులు పఱిచి, పాని యొడఁబాని తమబంటు చేసి కొనరె, వామలోచన లెంతటివారి నైన.
ప్రబోధ. ౧. ౪౫. రా. వి. ౨. ౫౦.

౨. ఆస్ఫాలనముచేయు, తట్టు; చేతు లప్పళించు.

చ. కనఁదగు తెల్లమావికపుఁ గప్పుల నొప్పెడు చప్పరాలలోఁ, దనపొడవైన నీడఁ గని తాళిక యేమఁ గటంచుఁ గొమ్మలన్, జెనకఁగ వచ్చి కోటపయిఁ జేసిన ముత్తెపు సింగపుంగమిన్, గనుగొని పాఱుచేల్పుదొర గారతఁ డొదల మస్తరింపఁగన్.
యయా. ౧ ౫.

గీ హస్తమున హస్తి మస్తంబు మస్తరించి, వెలయు శ్రీహరి శుభము గావించు మాకు
వాల్మీకి. ౧ ౧౦౬.
అ. మ. క. ౫ ౨౪౨. పా. ౧౪౫.

గీ. మస్తరించె ననంగను మనును జేతు, లప్పళించె నటంచు ఆం. భా ౩. ౧౦౬.

౩. ప్రవేశింపఁజేయు.

సీ. మునుమిన్కు గవిదైన తన ప్రజ్ఞయంతయు మతివిశేషమునందు మస్తరించి
పాండు. ౧. ౯.

౪. మెచ్చరించు, ప్రోత్సాహపఱచు.

గీ. ఫణిహార తురంగమూకుఁడు సాహెణులం పారె, ధీర యని మస్తరింపఁగఁ దేజి నెక్క చంద్ర. ౨. ౧౪.

**మస్తరు.** వి. లోఁబడుట, ఆధీనమగుట. (చూ. మస్తరించు.)

జ మస్తరించు.

**మస్తికము.** సం. వి. అ. పుం. తల, శిరస్సు. (వై. వి.)

మస్తిష్కము. సం. వి. అ. న. తలలో నుండు మజ్జ, మేదస్సు, మెదడు.

మస్తీ. వి మదించిన యేనుఁగు

మ తెలివూఁగద్దియ గాడుపుం గొదమ మస్తీ సెక్కి, తేఁటేఁటి గం, టల సంధిల్లురొ దాశము ల్పరవ మింట స్వాంటఁ జంద్రాదు ల, గ్గలికస్ ముంగల బారుదీరి నడుమం గాలార్పుచు న్నాకి కెం, దలియంబెద్ద హజా గఘ న్నడిమిచెంతన్ డిగ్గి తా నచ్చటన్.

చంద్రా ౩ ౫౧

మస్తు. వి (క మస్తు. త మస్తు) ౧. మదము, మత్తు

గీ మస్తు మీఱిన సురహ స్తి మస్తకంబు, కుస్త రించిన మామక హస్తములకు, హాయిగా నీశితంబంబు లంట నీకు, కంట నామీఁద నేల వాల్గంటి నీవు అహల్యా ౩. ౯౪.

సీ మదము రాజాలు మస్తు మత్తు మత్తా యన

ఆం భా ౨ ౧౯౫.

సీ కొమ్ము కత్తుల మెఱుంగుల వెల్లపావటల్ గొను నది మ స్తేనుఁగులచయంబు

కువల ౨. ౧౭౪.

౨ సమృద్ధి. (శ ర)

విశే సమృద్ధము, అధికము (బ్రౌ)

౩ మస్తునాఁడు.

మస్తువాఁడు. విశే (√మస్తు) మత్తుఁడు, మదిం చినవాఁడు )

సీ మస్తువాఁ డన మత్తుఁడు పరగుచుండు

ఆం భా. ౩ ౭.

మస్తులుంగ(క)ము. సం వి. అ. పుం న ౧. మేదస్సు, మెదడు. (వై. ని) న మస్తువు రధి మండము (శే. ని.)

మస్తువు. సం. వి. ఉ. న. తోడు పెట్టఁబడిన పాలలోఁ బెరుఁగు కాఁగా నిలిచిన నీరు. పుం. స్త్రీ. ముష్టి, పిడికిలి. (శే. ని)

మహా. సం. వి. ఆ. స్త్రీ. గోవు, ఆవు.

మహాకక్కము. సం. వి. అ. పుం. అంతటను వ్యాపించు పరిమళము, సుగంధము. (కల్ప)

మహతి. సం. వి ఈ. స్త్రీ. ౧. వీణాభేదము, ఒక రకము వీణ. ౨. నారదునివీణ. ౩. వార్తాకి, వంగచెట్టు. ౪. బృహతి, వాఁకుడు. ౫. శ్యామ, నల్లతెగడ. ౬. (ఆంధ్రవ్యాక.) తిర్యగ్జడేతర స్త్రీవాచకశబ్దము

మహత్తరుఁడు. సం. వి అ పుం. ౧ ప్రధాన పురుషుఁడు, ముఖ్యమనుష్యుఁడు ౨ రాజపురు షుఁడు, ఆస్థానోద్యోగి, రాజసేవకుఁడు ౩ ఊరిపెద్ద, పల్లెపెద్ద ౪ శూద్రుఁడు విశే. (అ. ఆ అ) గొప్పవాఁడు మొ

(దీనికి వృత్తిని సమాసాధికరణము పరముకాఁగా ఆకారమంతాదేశముగావచ్చును.)

మహత్తు. సం. విశే (త్. తీ త్.) ౧ గొప్పది, పెద్దది ౨ సమృద్ధమైనది, అధికమైనది. ౩. పొడవైనది, వ్యాపించినది. ౪. పవిత్రమైనది, పూజ్యమైనది.

వి త్. పుం ౧ ఒంటె, లొట్టియ. ౨ మహ త్తత్త్వము (సాంఖ్యవేదాంతమున సాంఖ్యు లచే నంగీకరింపఁబడిన పంచవింశతి తత్త్వము లలో రెండవది యగు తత్త్వము.) ౩. మహ త్లోకము ౪ బుద్ధి. (శే ని)

త్. న. ౧ రాజ్యము. ౨. సమూహము. (శే ని.) ౩. ఉదకము (వై ని) ౪. (ఆంధ్ర వ్యాక) స్త్రీ తిర్యగ్జడభిన్నంబులు, వాని విశే షణంబులు.

ఉదా. రాముఁడు గుణవంతుఁడు, రాముఁడు మొ

మహత్త్వము. సం. వి. అ. న. ౧ గొప్పతనము, పెద్దతనము (తిర్ప.) ౨. పెద్దపరిమాణము. ౩ సామర్థ్యము, బలము. ౪. ఉన్నతస్థితి, ఔన్నత్యము. ౫. తీవ్రత, మిక్కుటమగుట.
(విల్యమ్సు)

మహనీయుఁడు. సం. విశే. (అ. అ. అ.) ఘనుఁడు, గొప్పవాఁడు.

మహము. సం. వి. అ పుం. ఉత్సవము (అమర కోశము)

మహముదులు. వి బ వస్త్రవిశేషములు
రగడ బుడుతకాసేలు మహముదులు విరాసీలు
హంస. ౫ ౩౫౭.

మహర్. సం. అవ్య ౕ. భూలోకాదు లగునేడు లోకములలోను నాల్గవది యగులోకము (భువర్లోక జనోలోకముల మధ్యమున నుండు లోకము దీనికి తెనుఁగున వ్యస్తప్రయోగము లేదు ఉదా. మహర్లోకము)

మహలు. వి (హిం మహల్) మేడ, హర్మ్యము
గీ. మహలు మేడ యనంగ హర్మ్యమగు
సాం. ని స్థా. ౭౪

మహల్లకము. సం. వి అ. పుం. మహాభవనము, రాజమందిరము. (అ. ని.)

మహల్లి(ల్ల)కుఁడు. సం విశే (అ. ఆ అ) ౧. బలము లేనివాఁడు, దుర్బలుఁడు; ముసలివాఁడు. వి. అ పుం కంచుకి, రాణివాసపుఁ గావలివాఁడు.

మహల్లుఁడు. సం. వి అ పుం కంచుకి, రాణివాసపుఁ గావలివాఁడు (అ. ని.)

మహస్వంతము. సం విశే. (త్. స్వతీ త్) ప్రకాశమానమైనది, జ్యోతిస్సు గలది.

మహస్వి. సం. విశే (న్. ఈ. న్.) ప్రకాశమానమైనది, జ్యోతిస్సు గలది.

మహస్సు. సం. వి. స్. న. ౧. ఉత్సవము, ఉత్సవకార్యము. ౨. యజ్ఞము. ౩. జ్యోతిస్సు, కాంతి. ౪ మహిమము ౫. సంతోషము ఆనందము ౬. శక్తి, మహత్త్వము. ౭. సమృద్ధి, విస్తారము. ౮ జలము, నీరు. (కే ని)

మహాంగము. సం విశే (అ ఆ ఈ అ) స్థూలమైనది, లావైనది
వి అ పుం ౧ ఉష్ట్రము, ఒంటె. ౨. మూషికా విశేషము, ఒక జాతి యెలుక, పందికొక్కు ౩ అవుగోరిజ ౪. రక్తచిత్రకము, ఎఱ్ఱ చిత్రమూలము †.

మహాంబుజము సం. వి అ న ఒకానొక పెద్ద సంఖ్య, లక్షపద్మములు (వై. ని.)

మహాకంటకిని. సం వి ఈ స్త్రీ. విశ్వసారకము, విదర వృక్షము

మహాకందము. సం వి. అ పుం ౧. వెల్లుల్లి †. ౨ మూలకము, ముల్లంగి † ౩ విశ్వభేషజము, సొంటి. (వై. ని.)

మహాకచ్ఛము. సం వి. అ. పుం ౧. సముద్రము. (మే ని) ౨. పర్వతము. (కల్ప)

మహాకచ్ఛుఁడు. సం. వి. అ పుం. వరుణుఁడు. (మే. ని.)

మహాకపర్దము. సం వి. అ పుం. శంఖము. (విల్యమ్సు)

మహాకపిత్థము. సం వి. అ. పుం ౧ బిల్వవృక్షము, మారేడు చెట్టు. ౨ నీరుల్లి, రక్తలశునము †. ౩ చాణాఖ్య మూలకము, చిన్న ముల్లంగి †

**మహాకరంజము.** సం. వి. అ. పుం. ఒకానొక వృక్షము, కరంజభేదము. శ.

**మహాకర్ణికారము.** సం వి. అ. పుం. ఆరగ్వధము, రేల శ.

**మహాకాయము.** సం. వి. అ. పుం. ౧. ఏనుగు. (వై. వి.)

**మహాకాయుఁడు.** సం విశ (అ. అ అ) పెద్ద శరీరము గలవాఁడు, స్థూలకాయుఁడు. వి అ పుం శివపరిచారకుఁ డగు నంది

**మహాకాలము.** సం వి అ పుం ౧. కాకి దొండ, కింపాకము శ (హలాని) ౨ ఉజ్జయినీపురమం దున్న మహాకాలేశ్వరుని దేవాలయము

**మహాకాలి.** సం వి ఈ స్త్రీ దుర్గాదేవి

**మహాకాలుఁడు.** సం వి అ పుం ౧ శివుఁడు (వై ని) ప్రమథులలో నొకఁడు ఉజ్జయినీపురమందలి దేవుఁడు. (మే ని) విశ (అ. అ అ.) మూఢుఁడు

**మహాకావ్యము.** సం వి అ న గొప్పకావ్యము, (అష్టాదశవర్ణనలు కలిగినది.)

**మహాకీర్తనము.** సం. వి. అ. న. గృహము. (వై. ని.)

**మహాకుంభి.** సం. వి. ఈ. స్త్రీ కట్ఫలము, ఓఁకు శ

**మహాకోశఫల.** సం వి. అ స్త్రీ. దేవదాలి, డావరడంగి శ

**మహాకోశాతకి.** సం వి. ఈ. స్త్రీ. హస్తిఘోష, ఏనుఁగుబీర శ

**మహాక్షీరము.** సం వి అ. న చెఱకు శ. (విల్యమ్సు)

**మహాఖర్వము.** సం. వి. అ పుం. న. గొప్ప సంఖ్య, పదిలక్షలకోట్లు.

**మహాగంధ.** సం. వి. అ. స్త్రీ. ౧. చాముండ, దుర్గ. ౨. నాగబల, బీర శ. ౩. కవికె మొగలి శ

**మహాగంధము.** సం. విశ. (అ. అ. అ.) మిగుల సువాసనగలది. వి. అ. న ౧ హరిచందనము. ౨ బోలము, బాలెంతబోళము
పుం ౧ జలవేతసము, నీటిప్రబ్బలి శ ౨. కుటజము, కొండమల్లె శ

**మహాగణము.** సం. వి అ పుం ఒకానొక పెద్ద సంఖ్య (100,00,00,00,00,00,00)

**మహాగణులు.** సం వి అ పుం బ. జంగాల గురువుల బిరుదు.

**మహాగవము.** సం వి అ పుం గవయమృగము (కల్ప)

**మహాగురువు.** సం వి ఉ పుం ౧ చాలగౌరవింపఁదగిన పురుషుఁడు (పిత్రాది.)
శ్లో మాతా పితా తథాచార్యో మహాగురురితి స్మృతః ౨. భర్త. (వాచ)

**మహాగుల్మ.** సం. వి. అ. స్త్రీ. సోమవల్లి శ (రా ని)

**మహాగుహా.** సం. వి. అ స్త్రీ. పృశ్నిపర్ణి. కోల పొన్న శ.

**మహాగ్రీవము.** సం. వి అ పుం. ఉష్ట్రము, ఒంటె

**మహాగ్రీవి.** సం. వి. న్. పుం = మహాగ్రీవము.

**మహాగ్రీవుఁడు.** సం. వి అ పుం. ప్రమథగణములలో నొకఁడు. (విల్యమ్సు)

మహాఘూర్ణ. సం. వి. ఆ. స్త్రీ. మద్యము, సారాయి. (కల్ప.)

మహాఘోంట. సం. వి. ఆ స్త్రీ. హస్తిఘోల, పెద్దకేగు †

మహాఘోష సం వి ఆ స్త్రీ ౧ కర్కటశృంగి †. ౨ కుంభతిక, అంపగు

మహాఘోషము. సం విణ (అ ఆ అ) పెద్ద ధ్వనిచేయునది వి అ న అంగడివీధి, బజారు (మే ని.)

మహాచండి సం వి ఆ స్త్రీ దుర్గాపరిచారిక (వై ని)

మహాచారి సం వి న్ పుం నాంగి నడపువాఁడు (వై ని)

మహాచ్ఛదము సం వి అ పుం దేవతాళిము †

మహాచ్ఛాయము. సం వి అ పుం వటము, మఱ్ఱిచెట్టు (గా. ని.)

మహాచ్ఛిద్ర. సం. వి. ఆ స్త్రీ. మహామేద †

మహాజంబువు. సం. వి ఉ. ఊ. స్త్రీ రాజజంబువు పెద్దనేరెడు †

మహాజట. సం. వి ఆ స్త్రీ. ౧ పెద్దజడ, మహావేణి ౨ రుద్రజట, రుద్రజడ †

మహాజనుఁడు. సం. వి. అ పుం గొప్పవాఁడు, ప్రఖ్యాతిగల మనుష్యుఁడు

మహాజాలి. సం వి న్. పుం ౧. పచ్చపూవుల యాపద † ౨ రాజకోశాతకి, నేనుఁగుబీర †.

మహాజ్యోతిష్మతి. సం. వి ఈ. స్త్రీ. పెద్ద మాసేరు, ఒకానొక తీఁగ

మహాఢ్యము. సం. విణ. (అ. ఆ. అ.) మిగుల భాగ్యవంతమైనది.

వి అ. పుం. కదంబవృక్షము, కడిమిచెట్టు †.

మహాతరువు. సం. వి. ఉ. పుం. స్నుహి, జెముడు †.

మహాతలము. సం వి అ. న సప్తపాతాళము లలో నైదవ లోకము.

మహాతిక్త. సం. వి ఆ. స్త్రీ. ౧ యవతిక్త, నాగదొండ †. ౨ పాఠ, చిఱుబొద్దు. †

మహాతిక్తము. సం వి అ పుం నింబవృక్షము, వేపచెట్టు.

మహాతీక్ష్ణ. సం వి ఆ స్త్రీ నల్ల జీడిచెట్టు

మహాతేజస్సు. సం. వి స్. పుం ౧ పాదరసము ౨ అగ్ని ౩ ఛత్రకము, చిత్రమూలము †. ౪ సుబ్రహ్మణ్యేశ్వరుఁడు. (వై. ని)

మహాత్ముఁడు. సం విణ (న్ ఆ న్. న్) మహాత్మురాలు స్త్రీ రూ

౧. ఘనుఁడైన జీవాత్మ గలవాఁడు, ఉదార స్వభావము గలవాఁడు ౨ కీర్తిగలవాఁడు, ఘనతచెందినవాఁడు. ౩. సుకృతి, పుణ్యాము కలవాఁడు

మహాదంష్ట్రము. సం వి అ. పుం. ఒకజాతిపులి. (శే ని.)

మహాదానము. సం. వి. అ పుం కామ్యదానము, ప్రవారణము. (హలాని)

మహాదారువు. సం వి ఉ పుం దేవదారు వృక్షము †

మహాదేవి. సం. వి. ఈ స్త్రీ. ౧. పార్వతి. ౨. పట్టపురాణి, మహిషి. (వై. ని)

**మహాదేవుఁడు.** సం. వి. అ. పుం. శివుఁడు.

**మహాద్రుమము.** సం. వి. అ. పుం. అశ్వత్థ వృక్షము, రావి.

**మహాధనము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. చాల ధనముగలది ధనవంతము. ౨. ఎక్కువ వెలగలది, పెద్ద ఖరీదుగలది.

వి. అ. న. ౧. బంగారము. ౨. ధూపద్రవ్యము. ౩. విలువగల వస్త్రాదికము. (వై. ని.) ౪. కృషి వ్యవసాయము. ౫. గొప్ప మూల్యము. ౬. యుద్ధము. (కే. ని)

**మహాధనుష్మంతుఁడు.** సం. విశే. (న్ పుం.) గొప్ప విలుకాఁడు.

**మహాధాతువు.** సం. వి. ఉ. పుం. ౧ బంగారము. ౨. శివుఁడు. ౩ మేదస్సు వస. (విల్యమ్సు.)

**మహానంద.** సం. వి. ఆ. స్త్రీ. ౧ సుర, మద్యము. ౨. ఒకానొక నది. ౩. మాఘ శుక్ల నవమి.

**మహానందము.** సం. వి. అ. పుం. ౧. మహా సంతోషము, గొప్ప సంతసము. ౨. మోక్షము. (హాలా. ని.)

**మహానటుఁడు.** సం వి. అ. పుం. శివుఁడు.

**మహానదము.** సం. వి. అ. పుం. గొప్పనదము.

**మహానది.** సం. వి. ఈ. స్త్రీ. ౧. గొప్పనది. (గంగ, గోదావరి మొ) ౨. నదీ విశేషము, ఒకానొకనది (ఇది యోఢ్రదేశమునఁ గలదు.) (వాచ)

**మహానరుస్మఁడు.** సం. వి క్. పుం. వైద్యము నెఱిఁగిన అంబష్ఠుఁడు. (వై. ని.)

**మహానలము.** సం. వి. అ. పుం. ౧. దేవనలము, ఒకజాతి రెళ్ళుస ౘె. ౨ పెద్ద యగ్ని. (కల్ప.)

**మహానవమి.** సం. వి. ఈ. స్త్రీ. అశ్వీన శుక్ల నవమి

**మహానసము.** సం. వి. అ. న. వంటయిల్లు.

**మహానాటకము.** సం. వి. అ. న ౧. దృశ్య కావ్యభేదము

శ్లో. ఏత దేవయదా సర్వైః పతాకాస్థానకై ర్యుతమ్, అంకైశ్చ దశభిర్ధీరా మహానాటక మూచిరే (సా ద)

౨ హనుమన్నాటకము.

**మహానాదము.** సం వి. అ పుం. ౧. పెద్ద ధ్వని, కోలాహలధ్వని. ౨. పెద్ద వాద్యము (గొప్ప ధ్వని గలది.) ౩. ఉఱుముచున్న మేఘము. ౪ శంఖము. (విల్యమ్సు) ౫. ఏనుఁగు. ౬. సింహము (కే. ని.) ౭. శ్రవణము, చెవి.

**మహానింబము.** సం వి అ. పుం పెద్దమ్రాను, పెదవేము ౘె. (వాచ.)

**మహానిద్ర.** సం. వి. ఆ. స్త్రీ పెద్దనిద్ర, మరణము, చావు.

**మహానిరయము.** సం. వి. అ. పుం. ఇరువది యొక నరకములలో నొక నరకము. (విల్యమ్సు.)

**మహానిశ.** సం. వి. ఆ. స్త్రీ. అర్ధరాత్రము.

**మహానీచుఁడు.** సం. వి. అ. పుం. చాఁకలి వాఁడు. (కల్ప.)

**మహానీలము.** సం. వి. అ. పుం. ౧ ఒక దినుసు ఇంద్రనీలమణి. ౨. భృంగరాజము, గుంటకల గర ౘె. ౩. ఒకానొక సర్పము. ౪. మహా జంబువు, పెద్ద నేరేడు ౘె. ౫. నీలాపరాజిత, నల్లదింటెన ౘె.

**మహానుభావుఁడు.** సం. విణ. (అ. ఆ. అ) ౧. గొప్పబుద్ధి గలవాఁడు, ఔదార్యము గలవాఁడు ౨. గొప్పసామర్థ్యము కలవాఁడు

**మహానేమి.** సం వి ఇ పుం వాయసము, కాకి (వై ని)

**మహాపంచమూలము.** సం వి అ. న. అయిదు గొప్పమూలికలు కలది

(౧ బిల్వము. ౨ అగ్ని మంథము 3 శ్యోనాకము ౪ కాశ్మరి ౫ పాటల)

శ్లో బిల్వోఽగ్ని మంథశ్శ్యోనాకః కాశ్మర్యః పాటలా తథా, సర్వైస్తు మిళితైరేతైః స్యాన్మహా పంచమూలకమ్ (వాచ)

**మహాపంచవిషము.** సం వి అ న అయిదు గొప్పవిషములు కలది

శ్లో. శృంగీచకాలకూటశ్చ ముస్తకో వత్సనాభకః, శంఖకర్ణీ తుయోగోఽయం మహాపంచ విషాభిధః (వాచ)

**మహాపక్షము.** సం. వి అ. పుం. ౧. కారండవము కన్నెలేడిపిట్ట (కే. ని.) ౨ గరుడపక్షి 3. ఉలూకము, గుడ్లగూబ. (విల్యమ్సు)

**మహాపక్షి.** సం. వి. ఈ. స్త్రీ. ఉలూకము, గుడ్లగూబ (వై. ని)

**మహాఫత్రి.** సం. వి. ఆ స్త్రీ. మహాజంబువు, పెద్దనేరేడు క్రీ.

**మహాపత్త్రిము.** సం. వి అ పుం తాడిచెట్టు.

**మహాపథము.** సం. వి అ పుం ౧. రాజమార్గము, పెద్దబాట. ౨ మరణము, చావు 3 స్వర్గిమార్గము ౪ సుషుమ్నానాడి. (కల్ప)

**మహాపద్మము.** సం. వి. అ పుం. ౧ ఒకానొక పెద్దసంఖ్య. ౨. కుబేరుని నవనిధులలో నొకటి 3. ప్రపంచభారమును వహించెడి మహాసర్పములలో నొకటి. ౪. నాగకంద (వై. ని.) ౫ న ఎఱ్ఱతామరపూవు. (కే ని.)

**మహాపాతకము.** సం. వి అ పుం. ౧ గొప్పపాపము (ఇది అయిదు భేదములు కలది బ్రహ్మహత్య, స్వర్ణస్తేయము, సురాపానము, గురుపత్నీ గమనము, ఇవి చేయువారితోడి సహవాసము)

గీ కల్లు ద్రావుట గురుపత్నిఁ గవయుటయును, విప్రుఁ జంపుట బ్రహ్మస్వవిషయమైన, ముచ్చిలుటయును నివి గల క్రూరజనులఁ, బ్రీతిఁ బొందుటయును మహాపాతకములు

భార శాం ౧ ౧౭౭.

(మతాంతరమున తొమ్మిది విధములు స్త్రీగోవ్పపలవైశ్యతుక్షత్రియఘాతము, సోమవిక్రయము, శూద్రునితోడసహభోజనము, కన్యాదూషణము గృహదాహిత్వము, వృషలీపతిత్వము, అగ్నుత్యాగిత్వము)

౨. మహాపరాధము, పెద్దతప్పు

**మహాపిండీతకము.** సం వి అ పుం ఒకానొక జాతిమంగ క్రీ.

**మహాపీలువు.** సం వి ఉ. పుం బృహత్పలవు, పెద్దగోలుగు క్రీ

**మహాపురాణము.** సం వి అ న పురాణ భేదము

శ్లో సృష్టిశ్చాపి విసృష్టిశ్చ స్థితిస్తేషాం చ పాలనం, కర్మణాం వాసనా వార్తా మనూనాం చ క్రమేణ చ, వర్ణనం ప్రలయానాం చ మోక్షస్య చ నిరూపణం, ఉత్కీర్తనం హరేరేవ దేవానాం చ పృథక్పృథక్, మహాపురాణం విజ్ఞేయమేకాదశ లక్షణమ్.

(వాచ.)

**మహాపురుషుఁడు.** సం. వి. అ. పుం. ౧. గొప్ప పురుషుఁడు, ప్రసిద్ధుఁడైన మనుజుఁడు. ౨. విష్ణుఁడు.

**మహాపుష్ప.** సం. వి. అ. స్త్రీ. అపరాజిత చె.

**మహాపుష్పము.** సం. వి. అ. పుం. క్రిమివిశేషము. (విల్యమ్సు.)

**మహాపృష్ఠము.** సం. వి. అ. పుం. ఉష్ట్రము, ఒంటె. (రా. ని.)

**మహాప్రళయము.** సం. వి. అ. పుం. బ్రహ్మప్రళయము, కల్పాంతము. (బ్రహ్మకుఁ దన మానముచేత నూఱుసంవత్సరములు గడచినతర్వాత బ్రహ్మయు సమస్తదేవతలు ఋషులు లోకములు నశించును అట్టి సర్వనాశకాలము.)

**మహాప్రసాదము.** సం. వి. అ. పుం. ౧. మహాప్రసన్నత, గొప్పదయ. ౨. దేవ నైవేద్యాదికము, దేవతలకు నివేదింపఁబడిన యన్నము మొదలగునవి.

శ్లో॥ పాదోదకం చ నిర్మాల్యం నైవేద్యం చ విశేషతః, మహాప్రసాద ఇత్యుక్త్వా గ్రాహ్యం విష్ణోః ప్రయత్నతః (వాచ.)

**మహాప్రస్థానము.** సం. వి. అ. న. మరణము, చావు, లోకాంతర యాత్ర. (విల్యమ్సు.)

**మహాప్రాణము.** సం. వి. అ. పుం. ౧. పెద్ద శ్వాసము. ౨. వర్ణోచ్చారణయందు మహాప్రాణ ప్రయత్నము గలవర్ణము. (ఖ, ఘ, ఛ, ఝ, ఠ, ఢ, థ, ధ, ఫ, భ, శ, ష, స, హ,) ౩. ద్రోణకాకము, మాలకాకి. (రా. ని.)

**మహాఫల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఇంద్రవారుణి, పెద్దపాఁపర చె. ౨. రాజజంబువు, పెద్దనేరేడు చె. ౩. మహాకోశాతకి, ఏనుగుబీర చె. (కల్ప.) ౪. పెద్దరేగు చె. (వై. ని.) ౫. కూశ్మాండము చె. (శే. ని.)

**మహాఫలము.** సం. వి. అ. న. ౧. గొప్పఫలము. ౨. బిల్వము, మారేడు చె.

విశే. (అ. ఆ. అ.) అధికఫలము గలది.

**మహాబల.** సం. వి. ఆ. స్త్రీ. ముత్తవపులగము చె.

**మహాబలము.** సం. వి. అ. పుం. టంకణము, వెలిగారము. (వై. ని.)

**మహాబలుఁడు.** సం. వి. అ. పుం. ౧. బుద్ధుఁడు. ౨. వాయువు. విశే. (అ. ఆ. అ.) చాలబలము గలవాఁడు.

**మహాబిలము.** సం. వి. అ. న. ౧. ఆకాశము. ౨. గుహ.

**మహాబుసము.** సం. వి. అ. పుం. ౧. ఒకసంవత్సరమునకుఁ బండు ధాన్యము. ౨. యవలు. (వై. ని.)

**మహాబోధి.** సం. వి. ఇ. పుం. బుద్ధుఁడు. (త్రి. ని.)

**మహాబ్రహ్మము.** సం. వి. న. న. పరబ్రహ్మము.

**మహాభాగవతము.** సం. వి. అ. న. ఒకానొక పురాణ గ్రంథము.

**మహాభాగ్యశీ.** సం. విశే. (న. సీ. న.) మిక్కిలి యదృష్టము గలవాఁడు, మిగుల శుభాతిశయము గలవాఁడు.

**మహాభాగుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. మిక్కిలి యదృష్టము గలవాఁడు, చాలభాగ్యము గలవాఁడు. ౨. మిక్కిలి ప్రసిద్ధుఁడు, కీర్తి

మంతుఁడు. 3. అత్యంత పవిత్రుఁడు, మిక్కిలి పవిత్ర మైనవాఁడు.

**మహాభాగ్యము.** సం. వి. అ. న. ౧. గొప్ప యదృష్టము, గొప్ప భాగ్యము. ౨. మిక్కిలి ప్రాశస్త్యము, అత్యంత శ్రేష్ఠత.

**మహాభారతము.** సం. వి అ. న. ప్రసిద్ధమగు శ్లోకానేక యితిహాసము, భారతము.

(వ్యాసప్రోక్త మైనట్టియు పదునెనిమిది పర్వములు కలిగి కౌరవపాండవుల యుద్ధాదికము వర్ణింపఁబడినట్టి సంస్కృత భాషయందలి గొప్ప గ్రంథము)

**మహాభాష్యము.** సం. వి. అ న పతంజలి మహర్షి రచించిన వ్యాకరణభాష్యము.

(ఈ భాష్యము మూలము లగు సూత్రవార్తికములకంటె ప్రమాణతమము గావున మహాభాష్య మని చెప్పఁబడును. శంకరభాష్యాదులు మూలాధీన ప్రామాణ్యకములు గాన భాష్యములే గాని మహాభాష్యములు కావు.)

**మహాభీత.** సం వి. అ స్త్రీ. సోఁకుడుముఁగుఁగు చెట్టు, అత్తపత్తిచెట్టు ౹.

**మహాభీముఁడు.** సం వి అ. పుం. శంతనువు.

**మహాభీరువు.** సం. వి. ఉ. పుం. ఒకజాతి పురుగు.

**మహామణి.** సం. వి. ఇ. పుం. ౧ విలువ గల (అమూల్య మైన) రత్నము. ౨. శివుఁడు. (విల్సను.)

**మహామతి.** సం. విశే. (ఇ) ౧ ఉదారమనస్సు కలవాఁడు. ౨. బుద్ధిమంతుఁడు, వి ఇ. పుం, బృహస్పతి. (విల్సను.)

**మహామత్స్యము.** సం. వి అ పుం. ౧. పెద్ద చేప. ౨. మొసలి. (అ వి.)

**మహామదము.** సం. విశే. (అ. అ. అ.) మిక్కిలి మత్తెక్కినది. వి. అ. పుం. మదపుటేనుఁగు. (విల్సను.)

**మహామనస్కము.** సం. వి. అ. పుం. శరభమృగము. (విల్సను)

**మహామనస్సు.** సం. వి. స. పుం. శరభమృగము.

**మహామాత్రుఁడు.** సం వి అ పుం. ౧ ప్రధాన మంత్రి, ముఖ్యమంత్రి ౨ మావటివారిలో ప్రధానుఁడు. 3 సంపన్నుఁడు (వై ని).

**మహామారి.** సం వి. ఈ. స్త్రీ ౧ విశూచి, వమనవిరేచనములను గలిగించు అంటురోగము. ౨ దుర్గ.

**మహాముఖము.** సం వి అ పుం మకరము, మొసలి (శే ని)

**మహాముని.** సం. వి. ఇ పుం ౧ మహర్షి, గొప్పముని ౨. కుస్తుంబరి, కొత్తిమిరి ౹

**మహామూలము.** సం వి అ పుం ఒకజాతి పెద్దనీరుల్లి. ౹.

**మహామృగము.** సం వి అ పుం (పెద్ద జంతువు) ౧. గజము, ఏనుఁగు ౨ శరభమృగము

**మహామ్లము.** సం వి అ న. చింతపండు

**మహాయవము.** సం వి అ పుం ఒకజాతి పెద్ద యవము ౹ (వై ని)

**మహాయుగము.** సం. వి. అ న. మనుష్యమానమున కృతత్రేతాద్వాపరకలు లను నాలుగు యుగములు గలకాలము. దీని ప్రమాణము 4,320,000 సంవత్సరములు.

**మహారోగి.** సం వి స. పుం. కోడిపుంజు. (విల్సను.)

మహారంభ. సం. వి. అ. స్త్రీ. పచ్చయరఁటి చెట్టు. (శ. ర.)

మహారంభము. సం. వి. అ. న. గడలవణము, లవణభేదము.

మహారజతము. సం. వి. అ. న. ౧. బంగారము. ౨. ఉమ్మెత్తచెట్టు.

మహారజనము. సం. వి. అ. న. ౧. కుసుంభపువ్వును, కుసుంబపువ్వు. ౨. బంగారము.

మహారథుఁడు. సం. వి. అ. పుం. పదివేలమంది విలుకాండ్రతో నసహాయుఁడై పోరెడు మహాయోధుఁడు.

శ్లో. ఏకో దశసహస్రాణి యోధయేద్యస్తు ధన్వినాం, శస్త్రశాస్త్ర ప్రవీణశ్చ విజ్ఞేయస్స మహారథః (వాచ.)

మహారస. సం. వి. అ. స్త్రీ. విష్ణుక్రాంత చెట్టు. ౨. నీలి చెట్టు. (వై. ని.) ౩. ద్రోణపుష్పి, ఏనుఁగు తుమ్మి చెట్టు. (శే. ని.)

మహారసము. సం. వి. అ. పుం. ౧. ఒకజాతి చెఱకు. ౨. పాదరసము. ౩. ఖర్జూరపు చెట్టు. ౪. పులిగంజి, కాంజికము.

మహారాజము. సం. వి. అ. పుం. క్రేలిగోరు. (వై. ని.)

మహారాజకుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు. ౨. దేవయోనులలో నొకజాతివారు.

(వీరిసంఖ్య ౨౨౦ లేక ౨౩౬ అని చెప్పఁబడినది.)

మహారాత్రి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. మహాప్రలయము. ౨. నిశీథము, అర్ధరాత్రి.

శ్లో. అర్ధరాత్రా త్పరం యచ్చ ముహూర్త ద్వయముచ్యతే, సా మహారాత్రి రుదితా తద్దత్తం హ్యాక్షయం భవేత్. (కల్ప.)

౩. పార్వతి. (వై. ని.)

మహారాష్ట్రి. సం. వి. ఇ. పుం. జలపిప్పలి, నీరుపిప్పలి చెట్టు.

మహారాష్ట్రము. సం. వి. అ. పుం. (హిందూదేశమున) భరతఖండమున పశ్చిమ దేశభాగము, మహారాష్ట్రదేశము.

మహారాష్ట్రి. సం. వి. ఈ. స్త్రీ. మహారాష్ట్ర భాష. (ప్రాకృతభాషలలో ప్రధానమైనది.)

మహారిష్టము. సం. వి. అ. పుం. కొండలపై బయలుదేఱు వేపచెట్టు చెట్టు.

మహారోగము. సం. వి. అ. పుం. అపాయకరమగు తెగులు, మహావ్యాధి.

(ఉన్మాదము, రాజయక్ష్మము, శ్వాసము, చర్మదోషము, మధుమేహము, అశ్మరి, ఉదరరోగము, భగందర రోగము ఇవి మహారోగములు.)

మహారౌరవము. సం. వి. అ. పుం. ఇరువదియొక్క నరకములలో నొకటి.

మహార్ఘము. సం. విశే. (అ. ఆ. అ.) చాల వెలగలది. హెచ్చుమూల్యము కలది.

వి. అ. పుం. లావకము, లావుకపిట్ట.

మహార్బుదము. సం. వి. అ. న. శతకోటి. (కల్ప.)

మహార్హము. సం. వి. అ. న. తెల్లచందనము, మంచి గంధపుచెట్టు చెట్టు.

మహాలక్ష్మి. సం. వి. ఈ. స్త్రీ. విష్ణుపత్ని, పరదేవత, నారాయణశక్తి.

**మహాలయము.** సం. వి. అ. పుం. ౧. గొప్ప నివాసస్థానము, పెద్దయిల్లు. ౨. తీర్థము పుణ్యక్షేత్రము. ౩. పరబ్రహ్మము, పరమాత్మ.

**మహాలోధ్రము.** సం. వి. అ పుం. తెల్లలొద్దుగు. చె. (వై. ని.)

**మహాలోలము.** సం. వి అ పుం. వాయసము, కాకి

**మహాలోహము.** సం. వి. అ. న. అయస్కాంతము, సూదంటురాయి

**మహావర.** సం. వి ఆ. స్త్రీ దూర్వము చె

**మహావరోహము.** సం. వి అ. పుం. ప్లక్షము, జువ్వి చె (గా. ని)

**మహావల్లి.** సం. వి. ఈ. స్త్రీ. మాధవీలత

**మహావసము.** సం వి. అ పుం. శిశుకము, ఊలాచి యనుచేప.

**మహావాక్యము.** సం. వి. అ న. ౧ పెద్ద వాక్యము. ౨. కృతి, గ్రంథము. ౩. తత్త్వమసి మొదలగు నుపనిషద్వాక్యము.

**మహావిదేహ.** సం. వి. ఆ. స్త్రీ. (యోగ.) ఒకానొక మానసికవృత్తి, మనోవ్యాపారము

**మహావిషము.** సం. వి. అ. పుం. రెండుముఖములు గలపాము, రెండుతలలు గలపాము.

**మహావిషువ సంక్రాంతి.** సం. వి. ఇ. స్త్రీ. సూర్యుడు మేషరాశియందు ప్రవేశించుట, మేషసంక్రమణము.

**మహావీచి.** సం. వి. ఇ. పుం. నరక విశేషము

**మహావీరచరితము.** సం. వి. అ. న. భవభూతి రచించిన ప్రసిద్ధ నాటకము.

**మహావీరము.** సం. వి. అ. పుం. ౧ సింహము. ౨. ఇంద్రుని వజ్రాయుధము ౩ గరుత్మంతుడు ౪. పికము, కోకిల. ౫ తెల్లగుఱ్ఱము, శ్వేతాశ్వము. ౬. అగ్ని. ౭ యజ్ఞపాత్ర. ౮ ఒకజాతి డేగ ౯ క్షీరకాకోలి చె. ౧౦ ఏకవీరము, గన్నేరు చె.

**మహావీరుడు.** సం. వి అ. పుం ౧ గొప్ప శూరుడు ౨ కొడుకు, తనయుడు ౩ విష్ణువు. (వై ని) ౪ మహాదేవుడు, శివుడు. (కే ని)

**మహావీర్య.** సం వి ఆ స్త్రీ ౧ అడవి ప్రత్తిచెట్టు చె ౨ సూర్యునిభార్య, సంజ్ఞ ౩ మహాశతవరి చె

**మహావేగము.** సం వి అ పుం క్రోతి, వానరము (వై. ని)

**మహావృషము.** సం వి. అ పుం పెద్దయెద్దు, ఆబోతు.

**మహావ్యాధి.** సం. వి అ పుం. ౧. పెద్దరోగము, మహారోగము. ౨. మిక్కిలి పాడుజాతికుష్ఠము (నల్లకుష్ఠము.)

**మహావ్యాహృతి.** సం వి ఇ స్త్రీ "భూర్భువస్సువః" అను వైదిక మంత్రము.

**మహావ్రతము.** సం. విశే. (అ. ఆ. అ.) పెద్ద నియమముగలది, కఠినమైన నియమములతో నాచరింపవలసినది

వి. అ. న ౧. దీక్ష, నియమము. ౨. గొప్ప పని, ప్రధానమైన కృత్యము

**మహావ్రతుడు.** సం. వి అ. పుం. ఈశ్వరుడు. (వై. ని.)

**మహాశంఖము.** సం వి అ. న. ౧ సంఖ్యావిశేషము. ౨. నొసలు ౩. మనుష్యుని యెముక. (శ. ర.)

మహాకేశము. సం. వి. అ. పుం. రాజపుత్తూరము, ఒకజాతి యుమ్మెత్త చెట్టు
విణ. (అ. ఆ. అ) అవధూర్తము.

మహాకేనుఁడు. సం. విణ (అ. ఆ. అ) తిండి పోతు, తిండికాఁడు.

మహాశయుఁడు. సం. వి అ పుం. సముద్రుఁడు
విణ (అ. ఆ. అ) గొప్ప అభిప్రాయము కల వాఁడు. (శ ర)

మహాశల్క. సం వి. ఆ. స్త్రీ దేవిక, ఒకజాతి మాఁదీఫలము (తే ని)

మహాశల్కము. సం. వి అ పుం ఒకజాతి రొయ్యచేప.

మహాశాలి. సం. వి ఇ. పుం పెద్ద వరిబియ్యము, స్థూలశాలి

మహాశిరస్సు. సం వి స్. పుం సర్పవిశేషము

మహాశిల. సం వి ఆ. స్త్రీ. ఇనుపకంటకములతోఁ గూడిన శతఘ్ని (వై. ని)

మహాశుక్తి. సం వి. ఇ స్త్రీ. ముత్యపుచిప్ప

మహాశుక్ల. సం. వి. ఆ. స్త్రీ. సరస్వతి.

మహాశుభ్రము. సం వి. అ. న వెండి, రజతము.

మహాశూద్ర. సం వి. ఆ. స్త్రీ. గొప్పస్థితిలో నున్నశూద్ర స్త్రీ.

మహాశూద్రి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆభీర జాతి స్త్రీ. ౨. ఆభీరుని భార్య.

మహాశూద్రుఁడు. సం. వి. అ. పుం ఆభీరుఁడు.

మహాశ్మము. సం. వి. అ. పుం. మాణిక్యము, కెంపు.

మహాశ్మశానము. సం. వి అ. న. వారణాసీపురము, కాశి.

మహాశ్రమణుఁడు. సం. వి. అ. పుం బుద్ధుఁడు.

మహాశ్రావణిక. సం. వి. అ స్త్రీ. వృద్ధియను గంధద్రవ్యము. †

మహాశ్వాసము. సం వి అ పుం ఒకజాతి యుబ్బసపు రోగము.

మహాశ్వేత. సం వి ఆ. స్త్రీ ౧ సరస్వతి (త్రి ని) ౨ దుర్గాదేవి ౩ శ్వేతశర్కర, తెల్లపంచదార ౪ కృష్ణభూమకూశ్మాండము, నల్లనేలగుమ్మడు †.

మహాసంధ. సం. వి ఆ. స్త్రీ వాఁకుడు

మహాసన్నుఁడు. సం వి అ పుం కుబేరుఁడు

మహాసర్జము. సం వి అ పుం ౧ పనస చెట్టు. ౨ అసనము, వేఁగిస †.

మహాసహ. సం. వి. ఆ. స్త్రీ ౧ కాఁచు మినుము. ౨ పెద్దగోరంట †

మహాసాంతపనము. సం. వి. అ పుం కఠినమైన వ్రతవిశేషము.

శ్లో. పృథక్సాంతపనైర్ద్రవ్యైష్షడహం సోపవాసకః, సప్తాహేనైవ కృచ్ఛ్రోయం మహాసాంతపనస్మృతః.

మహాసారథి. సం. వి. ఇ పుం. అరుణుఁడు.

మహాసారము. సం వి. అ పుం. ఖదిరవృక్షము, చంద్రచెట్టు.

మహాసాహసికుఁడు. సం. వి. అ. పుం. బందిపోటు దొంగ, దోఁపుడు దొంగ, సాహసముగల దొంగ.

మహాసింహము. సం. వి. అ పుం. శరభ మృగము.

మహాసిద్ధి. సం. వి. ఇ. స్త్రీ మంత్రశాస్త్ర సంబంధమైన సిద్ధివిశేషము

మహాసుఖము. సం వి అ న ౧ పెద్ద సంతోషము, మహానందము. ౨ సురతము, రతి (త్రి ని)

మహాసుఖుఁడు. సం వి అ పుం బుద్ధుఁడు

మహాసుగంధి. సం వి ఇ పుం విషము పోఁగొట్టెడి ఓషధి విశేషము

మహాసుప్తి. సం వి ఇ స్త్రీ బ్రహ్మదేవుని నిద్ర

మహాసూక్ష్మ. సం వి ఆ స్త్రీ. సికత, ఇసుక

మహాసేనుఁడు సం వి అ పుం కార్తికేయుఁడు, కుమారస్వామి

మహాస్కంధ. సం వి ఆ. స్త్రీ జంబూవృక్షము, నేరేడు †

మహాస్థలి. సం వి ఈ స్త్రీ భూమి

మహాస్నాయువు. సం. వి ఉ స్త్రీ కంధర, కంఠము (వై. ని)

మహాస్వనము. సం వి అ పుం. వాద్యభేదము (త్రి ని.)

మహాహవిస్సు. సం. వి స్ న. గోఘృతము, ఆవునెయ్యి

మహి. సం విశే (ఇ.) గొప్పది వి ఇ ఈ స్త్రీ భూమి ఈ స్త్రీ

౧. మాలవదేశమందలి యొకానొక నది. ౨ వాక్కు ౩ గోవు. (కే ని) ద్వి ద్యావాపృథివులు, భూమ్యాకాశములు (కే. ని)

మహిక. సం వి. ఆ. స్త్రీ. హిమము, మంచు.

మహితము. సం. విశే. (అ. ఆ. అ.) గౌరవింపఁబడినది, పూజింపఁబడినది

వి. అ. పుం. కైలాస పర్వతము.

మహినము. సం. వి అ న ౧ రాజ్యము. ౨. శయ్య, సెజ్జ.

మహిపతి = మహీపతి.

మహిమ(ము). సం వి న్ పుం ౧. గొప్పతనము ౨ అష్టసిద్ధులలో నొకటి ౩ విధము. ఉపమావాచకము

వ మాసంబులందు మార్గశీర్షంబు మహిమ
యుగంబులందుఁ గృతయుగంబు నోజ

భాగ ౧౨. ౪౭.

మహిమత్తు. సం వి త్. పుం వివాహాగ్ని. (వై. ని)

మహిల. సం వి. ఆ స్త్రీ ౧. స్త్రీ. ౨ మత్తురాలగు స్త్రీ. ౩. ప్రియంగు వృక్షము, ప్రేంకణము † ౪. రేణుక యను సుగంధ ద్రవ్యము †

మహిలాహ్వయ. సం వి ఆ స్త్రీ స్త్రీపర్యాయములు గలది ప్రేంకణపు చెట్టు, ప్రియంగువు †

మహిషఘ్ని. సం. వి ఈ స్త్రీ మహిషాసురునిఁ జంపినది, దుర్గాదేవి

మహిషధ్వజుఁడు. సం. వి అ పుం. యముఁడు.

మహిషము. సం వి అ. పుం. ౧ ఎనుఁబోతు, దున్న.

మహిషవాహనుఁడు. సం. వి. అ పుం. యముఁడు, పోతురాజు.

**మహిషాక్షకము.** సం. వి. అ. పుం. ఒకజాతి గుగ్గిలము, మైసాక్షి యను మందుదినుసు తీసెడి చెట్టు కీ.

**మహిషాక్షము.** సం = మహిషాక్షకము.

**మహిషాసురమర్దని.** సం వి. ఈ. స్త్రీ. మహిషాసురునిఁ జంపినది, దుర్గాదేవి

**మహిషి.** సం. వి. ఈ స్త్రీ. ౧. పట్టపుదేవి. ౨ ఎనుము, బఱ్ఱె. 3. ఆఁడుపక్షి. ౪. సైరంధ్రి ౫. నీతిబాహ్యగాలు, నీతిలేని యాఁడుది. ౬. పౌషపూర్ణిమ

**మహిషుఁడు.** సం. వి. అ. పుం ౧ దుర్గచేఁ జంపఁబడిన ఒకానొక రాక్షసుఁడు. ౨. తీవరి యందు క్షత్రియునివలనఁ బుట్టిన సంకరజాతి వాఁడు

**మహిష్ఠము.** సం. విశే. (అ ఆ. అ) మిక్కిలి గొప్పది, చాలఁ బెద్దది

**మహిసాక్షి.** వి. ధూపద్రవ్యవిశేషము, ధూపము వేయు నొకవిధ మగుసువాసనద్రవ్యము.

ద్వి. మహిప్రాశక రైయున్న మహిసాక్షి గూడ,
దహనాంబకునకు నెంతయు ధూపమిచ్చి
పండితా. పురా. ౧౩౩. పా

**మహీక్షితుఁడు.** సం వి. త్. పుం. రాజు చక్రవర్తి

**మహీజ.** సం వి ఆ. స్త్రీ. భూపుత్త్రి, సీత.

**మహీజము.** సం. శ. అ పుం: వృక్షము, చెట్టు ఆ. న అల్లము.

**మహీజుఁడు.** సం వి. అ పుం. ౧ అంగారకుఁడు. ౨. నరకాసురుఁడు.

**మహీతలము.** సం. వి. అ. న. భూప్రదేశము

**మహీధరము.** సం. వి. అ. పుం. పర్వతము, కొండ.

**మహీధ్రము.** సం. వి. అ. పుం. ౧. పుడమి తాలుపు, కొండ. ౨ ఏడవసంఖ్యకు సంకేత పదము.

**మహీధ్రుఁడు.** సం వి అ పుం రాజు.

**మహీపతి.** సం వి. ఇ పుం. ౧. నేలయేలికుఁడు, రాజు ౨. ఒకజాతి నిమ్మ కీ

**మహీప్రాచీరము.** సం వి అ న. సముద్రము. (త్రి ని.)

**మహీభృత్తము.** సం వి. త్ పుం. పర్వతము, కొండ

**మహీభృత్తుఁడు.** సం వి త్ పుం రాజు భూపాలుఁడు.

**మహీమహేంద్రుఁడు.** సం వి అ పుం భూదేవేంద్రుఁడు, రాజు.

**మహీయసము.** సం విశే (స్ యసీ. స్.) ఒకదానికంటె గొప్పది, అధికతరము.

**మహీరుట్టు.** సం. వి. హ్ పుం. వృక్షము, చెట్టు.

**మహీరుహము.** సం. వి అ. పుం. చెట్టు.

**మహీలత.** సం వి. ఆ. స్త్రీ. ఎఱ్ఱ, వానపాము.

**మహీశ్వరుఁడు.** సం. వి అ. పుం. రాజు.

**మహీసుత.** సం. వి. ఆ. స్త్రీ. పుడమికూఁతురు. సీత.

**మహీసుతుఁడు.** సం. వి. అ. పుం ౧. అంగారకుఁడు, కుజుఁడు. ౨. నరకాసురుఁడు.

**మహీసురుఁడు.** సం వి. అ. పుం. పుడమివేలుపు. బ్రాహ్మణుఁడు.

**మహేంద్రజిత్తు.** సం. వి. త్. పుం గరుడుఁడు (వై ని.)

**మహేంద్రము.** సం వి అ. పుం ఒకానొక పర్వతము

**మహేంద్రి.** సం వి ఈ. స్త్రీ బొంతిరఁటి ‡. (శ. ర)

**మహేంద్రుఁడు.** సం వి. అ పుం ౧ ఇంద్రుఁడు. ౨ నాయకుఁడు, నేత

**మహేచ్ఛుఁడు.** సం విశే (అ ఆ అ) ఉదారబుద్ధి గలవాఁడు, ఘనమైన యాలోచన గలవాఁడు

**మహేరణ.** సం వి ఆ స్త్రీ అందుగు, సల్లకి ‡ (శ ర)

**మహేల.** సం వి ఆ స్త్రీ ఆఁడుది, స్త్రీ

**మహేశబంధువు.** సం వి ఉ పుం బిల్వవృక్షము, మారేడుచెట్టు.

**మహేశానుఁడు.** సం. వి అ. పుం. శివుఁడు

**మహేశుఁడు.** సం వి అ. పుం. శివుఁడు

**మహేశ్వరి.** సం వి ఈ. స్త్రీ ౧ దుర్గాదేవి ౨ ఒకదినుసు ఇత్తడి, బ్రహ్మరీతి (శే ని)

**మహేశ్వరుఁడు.** సం. వి. అ. పుం ౧. గొప్పప్రభువు, చక్రవర్తి ౨ శివుఁడు. ౩ గుగ్గులువు ‡

**మహేష్వాసుఁడు.** సం వి అ. పుం. గొప్పవిలుకాఁడు, మహాధన్వి.

**మహోక్షము.** సం. వి. అ పుం బలసిన యెద్దు, పెద్ద యెద్దు.

**మహోగ్ర.** సం. వి ఆ స్త్రీ. త్రయోదశి తిథి. (శే. ని)

**మహోత్పలము.** సం. వి. అ. న. పద్మము. పుం. సారస పక్షి.

**మహోత్సాహుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) అభినివేశము కలవాఁడు, పట్టుదల గలవాఁడు

**మహోదధి.** సం. వి. ఇ పుం ౧ మహాసముద్రము, గొప్పసాగరము. ౨. దక్షిణ సముద్రము. ౩. ఇంద్రుఁడు

**మహోదయ.** సం వి ఆ. స్త్రీ కించిత్ప్రౌఢయగు కన్య. (వై ని)

**మహోదయము.** సం వి అ పుం ౧. గొప్ప యభివృద్ధి, చాల శ్రేయస్సు ౨. మోక్షము ౩ కాన్యకుబ్జ మను దేశము ౪. కాన్యకుబ్జదేశమున నొకపట్టణము ౫ (ధర్మశాస్త్ర) యోగభేదము

(కించిన్న్యూనమైన అర్ధోదయము మహోదయ మనఁబడును)

**మహోదయుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) గొప్పయభివృద్ధి గలవాఁడు

**మహోదరము.** సం. విశే. (అ. ఆ. అ) పెద్ద కడుపు గలది. వి అ న ౧ పెద్దకడుపు ౨ రోగవిశేషము

**మహోదరి.** సం వి. ఈ. స్త్రీ. శతమూలి, పిల్లిపీచర ‡.

**మహోద్యముఁడు.** సం. విశే (అ. ఆ అ.) మహోత్సాహుఁడు, పెద్దయుద్యమము గలవాఁడు

**మహోద్రేకము.** సం. వి. అ పుం. నాలుగు ప్రస్థములు. (వై. ని)

**మహోన్నతము.** సం. విశే. (అ. ఆ. అ.) మిక్కిలి యున్నతమైనది, చాల ఎత్తైనది. వి. అ పుం. తాడు ‡.

మహోరగము. సం. వి. అ. పుం. ౧. గొప్ప పాము, పెద్ద పాము. ౨. తగరువృక్షముయొక్క వేరు.

మహౌజస్సు. సం. వి. స. పుం. సుబ్రహ్మణ్య స్వామి.

మహౌషధము. సం. వి. అ. న. ౧. గొప్ప మందు. ౨. అల్లము. ౩. వెల్లుల్లి. ౪. వత్స నాభ మను విషము. ౫. వారాహీకందము. ౬. శుంఠి, సొంటి. ౭ అతివస †
పుం ౧. పిప్పలి †. ౨ యూధిక, తెల్ల †

మహౌషధి. సం వి. ఇ. ఈ. స్త్రీ. మంచి (గుణముచేసెడి) ఓషధి, శ్రేష్ఠ మైనమందుచెట్టు ౨. దూర్వాతృణము, గరిక † ౩. అత్త పత్తి † ౪ స్నానీయద్రవ్యభేదము, సంజీవినీ లత. ౫ శ్వేతకంటకారి †. ౬. కటుకరోహిణి † ౭. అతివస †. ౮. హిలమోచిక †

మహౌషధిగణము. సం. వి. అ. పుం గొప్ప మందుచెట్ల సమూహము.
శ్లో. పృశ్నిపర్ణీ శ్యామలతా భృంగరాజ శ్శతావరీ, గుడూచీ సహదేవీ చ మహౌషధిగణ స్స్మృతః. (వాచ.)

## మా

మా¹ = అమ్మక. అవ్య (త క. మా) ప్రశంసా ద్యర్థములను దెల్పును.
గీ. వీరమాహేశ్వరాచారపారగునకుఁ, దనకు శశిమౌళి యిచ్చిన కనకరథము, కామగమ నంబు నైరధస్త్రవరునకు, మాచు యిచ్చెను మా యని మహి నతిందు. శైవ. ౬. ౯౫.
చ. మమతలరా జనిం గదపె మాపడి వెన్నవి రూపులూపునన్ . కళా. ౫. ౧౬౪

మా², అవ్య. (సం. మహా) మిక్కిలి.
మాబాగారెు. క్షేత్రయ. (శ. ర.)

మా. సం. వి. ఆ. స్త్రీ. లక్ష్మి, శ్రీదేవి.
క. శుకమా ముఖరుచి జితశిం, శుకమా మతు మారదేహ శోభిత దూర్వాం, శుక మారక మేల రతీ, శు(క?)కు మా యిచ్చిన హాయము పమూయ గనకుమా. ల. వి. ౪. ౬౬.
(టీ. దూర్వాంకుశ = దూర్వల కాంతివంటి కాంతిగలదానా, మారకము = మారకత్వము భావప్రధాన నిర్దేశము. యద్వా మారః డిజంతాద్భావేఘఞ్. తతస్స్వార్థే కః రతి కుశ + అ = రతికుశ. నగాగ మాభావము చింత్యము అకారము పాదపూరకము. సూ. ని మా = లక్ష్మి హాయమవు = గుఱ్ఱ మవు ఈ పద్యము లక్ష్మీవిరహావర్ణనము లోనిది )
౨. జనని, తల్లి. ౩. పరిమాణము, కొలత
అవ్య నిషేధార్థకము, వలదు అను నర్థము నిచ్చును.
(దీని యామ్రేడితరూపము మామా.)
క. మామా వలువలు ముట్టకు, మామా కొని పోకు పోకు మన్నింపు తగన్, మామాన మేల కొనియెదు, మామానపహారణ మేల మానుము కృష్ణా. భాగ. ౧౦. పూ. ౮౨౦.
క. మామా నాపైఁ గోపము, మామా నీపుత్రి యందు మానవు నాకుం, గామోపభోగ వాంఛలు, ప్రేమ ప్రమియించి ముదిమి పిదపం దాల్తున్. భాగ. ౯. ౫౪౬.

మాంగలికము. సం. విశే. (అ. ఆ. అ.) శుభ ప్రదము, శుభసూచకము.

మాంగల్యము. సం. విశే. (అ. ఆ. అ.) శుభ ప్రదము, శుభసూచకము.

వి. అ. న. ౧. శుభము, అభివృద్ధి. ౨. శ్వేతకర మగువస్తువు, కావుత్తు. ౩. కాళిబొట్టు. (శ. ర.)

మాంజిష్ఠము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. మంజిష్ఠము. (చిరుమేనువంటి చాయమేను)తో రంగు చేయఁబడినది.

వి. అ. న. ఎఱుపురంగు.

మాండలికుఁడు. సం. వి. అ. పుం. మండలము నేలువాఁడు, మండలాధికారి.

విణ. మండలసంబంధమైనవాఁడు.

మాంత్రికుఁడు. సం. వి. అ పుం ౧. మంత్రములు తెలిసినవాఁడు ౨. గారడివాఁడు.

మాందాళి. వి. ౧. పచ్చ పట్టుచీర.

సీ. జిలుఁగుఁ బావడమీఁదఁ జికురధిక్కృత మిళిం
దాళి యొక్కటిప మాందాళి గట్టి .
చేం పంచ. ౪. ౩౪౨

౨. కృత్రిమ మరకతభేదము, కృత్రిమ మగుపేరోజము.

సీ. పచ్చ యనంగను బరగు మరకతంబు గారు
త్మతం బొప్పు గరుడపచ్చ, యనఁ దద్విశే
షాఖ్య యగును శేణోదనం బన నది కృత్రి
మం బయిన వెలయు, మాందాళి యం
చన    అం. భా. ౨. ౨౩౩.

మాంద్యము. సం. వి. అ. న. ౧. మెల్లన, పోమరితనము. ౨. తెలివి తక్కువ, బుద్ధిహీనత. ౩. దౌర్బల్యము. ౪. ఔదాసీన్యము, ఉదాసీనుఁడుగా నుండుట. ౫. అనారోగ్యము, తెగులు, జబ్బు.

మాంధాత (తృఁడు). సం. వి. ఋ. పుం. సూర్యవంశపురాజు. (ఇతఁడు యువనాశ్వుని కొడుకు, షోడశమహారాజులలో నొకఁడు.)

గీ. విప్రతినిరతుండు యువనాశ్వ విభునుతుండు,
ఘనుఁడు మాంధాత నృపుఁ డైనకాలము
నను ...    కవిక. ౨. ౫౮.

గీ. తరమె నసఁ గల్వ నీ కని దశముఖాను,
రాగ్రగణ్యుని మాంధాత యప్రుడు పొదివి
ఉ. రా. ౪. ౨౨; ౪. ౨౪.

క. అని వసువహోముఁడు చెప్పిన, విని మాంధా
తృండు దండవిభవజ్ఞుండై
భార. శాం. ౩. ౧౨౧.

ఆ.    శయన మొంది, యుండ నచట నియతి
నుండి మాంధాతృండు, పరమభక్తి నమర
గురునిఁ దలఁచి .    భార. అను. ౩. ౫.

క. ఇది యమున యను మహానది త్రిదశనదీనిభము
దీని తీరమున జగ, ద్విదితుఁడు మాంధా
తృఁడు నం, పదఁ గ్రతువులఁ జేసెఁ దొల్లి
బహువత్సరముల్. భార. అర ౩. ౧౯౭.

విణ. (మాంధాత వంటివాఁడు) గొప్పవాఁడు.

శా. మాహాత్మ్యంబులు తేజముల్ విభవసం
పత్తుల్ విమర్శింపఁగా, నోహో భేదము
లేదు నిండుసభలో నొక్కింతమాత్రంబు
చే, మా హేమీలు ఘటాఘటీ లతిరథుల్
మాంధాత లీసాము లేలా హీనాధిక
భావముం దడవ రా దంచుస్ వితాకుండ
వై.    వరాహ. ౧౦ ౭.

మాందీర్ణము. సం. వి. అ. పుం. ఒకజాతి గబ్బిలము. (వై. ని.)

మాంధీలవము. సం. వి. అ. పుం పెద్దజాతి గబ్బిలము. (వై. ని.)

మాంసకరము. సం. వి. అ. న. రక్తము. (వై. ని.)

మాంసకారి. సం. వి. ఇ. పుం. రక్తము. (మాంసముచేయునది.)

మాంసకీల. సం. వి. అ. పుం. అర్బుదము, రోగ భేదము. (వై. ని.)

మాంసగంధి. సం. వి. ఇ. పుం. కెంపులలో నొకభేదము.

పీ. మండితశశిమాంసఖండంబుగతి నున్న మంద తేజం బగు మాంసగంధి రత్న. ౧౧.

మాంసజము. సం. వి. అ. న. క్రొవ్వు, మదము.

మాంసతానము. సం వి. అ. పుం. కొండ నాలుక. (విల్సియమ్సు)

మాంసద్రావి. సం. వి. న్. పుం. పుల్లప్రబ్బలి కూ. (రా ని)

మాంసనిష్కాథము. సం వి. అ పుం. మాంసము వేసి కాఁచిన చేరు. (వై ని)

మాంసపిత్తము. సం. వి. అ న ఎముక. (విలియమ్సు)

మాంసపేశి. సం. వి. ఈ. స్త్రీ. గర్భము కలిగిన తరువాత ఎనిమిదవదినముమొదలు పదునాల్గవ దినమువఱకు గర్భమునందలి పిండమునకు పేరు. (కల్ప.)

మాంసఫల. సం. వి. అ. స్త్రీ. ఒకజాతివార్తాకము, ఒకజాతివంగ కూ.

మాంసమాస. సం. వి. అ. స్త్రీ. మాంసపర్ణి, కారుమినుము కూ.

మాంసము. సం. వి. అ. న. నంజుడు, పలలము. పుం. ౧. పురుగు, క్రిమి. ౨. మాంస మమ్మెడి జాతి. 3. కాలము. (కల్ప.)

మాంసరోహిణి. సం. వి. ఈ. స్త్రీ. చర్మకస, సంబరేను కూ.

మాంసలము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. బలము గలది. ౨. లావైనది.

మాంసస్నేహము. సం. వి. అ. పుం. మదము, క్రొవ్వు, ఒడలిచమురు.

మాంసహాస. సం. వి. అ. స్త్రీ. చర్మము.

మాంసాది. సం. విశే. (న్. నీ. న్.) మాంసము తినునది.

మాంసాష్టక. సం. వి. అ. స్త్రీ. మాఘబహుళాష్టమీతిథి (ఈ దినమున అష్టకాశ్రాద్ధము చేయుదురు.)

మాంసి. సం. వి ఈ. స్త్రీ ౧ జటామాంసి. ౨ కకోళలము. 3 మాంసచ్ఛద, సంబరేను కూ. ఇ. పుం. శుక్రగంధము, ఒకవిధమగు దుర్వాసన. విశే (ఇ) శుక్రగంధము కలది (వై. ని)

మాంసికుఁడు. సం. విశే (అ. ఆ. అ.) కటిక వాఁడు, కసాయివాఁడు ; మాంస మమ్ము వాఁడు.

మాంసిని. సం. వి. ఈ స్త్రీ. జటామాంసి కూ. (రా. ని.)

మాంస్పృష్ట. సం. వి. అ. స్త్రీ. పక్షివిశేషము, వల్గులి యనెడుపక్షి. (రా. ని.)

మాఁకు=మ్రాఁకు, మాను. వి. ౧. వృక్షము, చెట్టు.

రగడ. తలఁప బలుమాఁకు గేదఁగికి రాగిల్లకుము. ఉ. రా. ౬. ౬౧.

రగడ మాకు లేదు సమాకులత ర మ్మా కుజంబ విరిమాఁకు డాయఁగ .. చంద్రా. ౪. ౨౩౩. వేంక. శ. ౩౧.

౨. దిమ్మిస.

ద్వి. ఘనము జల్లియ వైచి రొమినయఁ గట్టించి, వనిశారి మాఁకున వడిఁ గూరకొనుచు, జస్తుటు గావించి ద్వి పరమ. ౪. ౫౧౬. పొ.

**మాఁగఁబాఱు.** అ. క్రి. (√మాఁగు) మాఁగు టకు ప్రారంభమగు. (చూ. పాఱు.)

వ. .. గొంకుక్రొగ్నొ త్తురుకొ క్రొలి విడిచి చన మార్మొదలువడి మళకవనదంశమ్ములు మాఁగ మాఁగంబాఱిన కొండగొఱియ ముఱుఁగుడు బొందులకు . మనుచ. ౪. ౩౭.

**మాఁగాయ.** వి. (మావి + కాయ) ఇది మామిడి కాయలతో నొకవిధముగా తయారుచేసిన ఊరు గాయ.

(వ్యవ.) మాఁగాయ ఆవకాయంత ఆపథ్యము కాదు.

౨. మామిడికాయ. (శ. ర.)

**మాఁగిలి.** వి. పాలము (నిరనుస్వార మనియు మాగాణి అర్థ మనియును. శ. ర.)

క. మాఁగిలిమాఁగిలివృత్తము, పూఁగొమ్మనమండి పటలము ప్రకాశింపన్, లేఁగొదమ సెమిలి పక్కాడు క్రీడా. ౫౧.

**మాఁగిలు.** అ. క్రి. అఁచు.

ఉ. తియ్యనివింటికోదు రతిదేవిచనుంగవ నొత్తి గిల్లి యొ, య్యొయ్యన వంక చిక్కఁబడ్డ నొత్తెడుఁ జాచితె పుష్పబాణముల్, మయ్యొర ప్రాసెఁ జిత్తరువు మాఁగిలి మాఁగిలి చిత్రకారుఁడా, దయ్యము గాక నీవిపస దానము టిట్టిభ నీని కేఁ దగున్ క్రీడా. ౧౯౨.

(మాఁగిలిమాఁగిలి = సావధానముగా.)

**మాఁగు.** అ. క్రి. (క. మాగిను, త. మంగు) మిగులఁబండు, కమియు.

(వ్యవ.) ఈ మామిడిపండ్లు మాఁగినవి.

చ. తీవనలక్ష్మి కేడియూ, ర్పులు కదలించెఁ బంపఁ పూఁబువ్వుల మాఁగినగాడ్పుచాలునన్. శంక్రి. ౨. ౧౫.

(ఇట కదలుండు అని భావము.)

ద్వి. వాఁగుపంటల కోర్చి వఱలనీరంబు, కేఁగు సేఁదులఁ బట్ట సెదసెద సెదకి, మాఁగు దుప్పులఁ బట్ట మార్కొన్న లేక, తూఁగు కాకుల మెదఁ దుముమ నొండొంద, మాఁగు మలూకసమూహభారమున.

వస. ౨. ౪౪. పా. ౧౨. పం.

(క్రమసెందు అని భావము.)

వి. ౧. మాలిన్యము, నలుపు.

అ తోడవుల విలపిల్లు,. మణులభృంగుల దెసల మాఁగు విలీయ ..

భా. రా. యు. ౬౫౦.

౨. శరీరమందలి నల్లపొడ.

మ. కలుయు న్మాఁగును లేక పుట్టిన శుభాంగం బద్భుతాపాది యై, సెలయన్

హరి. పూ. ౫. ౧౧౯.

జ. మాఁగఁబాఱు, మాఁగుడు, మాఁగుడువడు, మాఁగుడువాఱు మాఁగుపాఱు, మాఁగువడు.

**మాఁగుడు.** వి. (√మాఁగు) మాలిన్యము.

క. మెందుకొన భయము ధరణి, మండల మది తల్లడిల్లె మాఁగుడు దిశలన్, నిందుకొని నిర్జ రేంద్రుఁడు, గుండియ జల్లనఁగఁ జేతి కులి శము వైచెన్. సీతావి. ౧. ౯౪.

ద్వి. పలుచని మెంగిలులోపలఁ దోఁచుచంద్ర, కళిభంగి మాఁగుడు గవిసి

ద్వి. హరిశ్చ. ఉ. ౨౦౩౭. పం.

౨. కమియుట, మిగుల నలఁగుట.

మత్తకోకిల. రథదంతి వాజిభటావళిన్, బందు మాఁగుడు గాఁగ నేపిరి భూరి వీర ధనుర్ధరుల్ ... కు. సం. ౧౧. ౪౦౬.

**మాఁగుడువడు = మాఁగువడు.** అ. క్రి. (మాఁగుడు + పడు) మాఁగుపాఱు, మలినమగు.

సీ. తన కౌర్యాదిశక్తిచే నివళించి మనముంబుఁ బగ తెల్ల మాఁగుడు పడఁగఁ జేసి . .

మొ. రా. బాల. ౧౯.

సీ. చిఱుతమాఁకటి మన్న చిగురు కెంద్రుకలతో మెఱసి మాఁగుడుపడి మిళ్ళు క్రేల, ముచ్చట్టు ముడిచిన ముంజితోఁ గట్టిన చెలువంపు గోఁచి ముంజెఱఁగు దూఁగ

హరి. ఉ. ౧౦. ౨౩౩.

ద్వి. మగ్నత నదలక మాఁగుడుపడక, భగ్నంబు గాక కెప్పలు మాలుపడక

పండితా. దీక్షా. ౭౧. పా.

(శ్రమఁ జెందు అని భావము)

**మాఁగుడుపాటు.** అ. క్రి. (మాఁగుడు + పాటు) మాయు, మలినమగు.

వ. . విక్రమవిహారంబు ముగియించి గవు సెనఁ బొదివిన కుసుమకోదండు వెండిజల పోఁత దళుకుటుగ తెలుంగున మెఱుం గడంగి యుడురాజమండలంబు మాఁగుడుపాటే కాని పించె. ప్రభా. ౫ ౫౪

**మాఁగుపా(వా)టు.** అ. క్రి. (మాఁగు + పాటు) మాఁగుపడు, మాయు, మలినమగు.

సీ. మాఁగుపాటిన చంద్రమండలంబునుబోలె వద నారవిందంబు వన్నె దఱుఁగ

ఉ. హరి. ౧. ౧౪౯

సీ. దనుజతేజము గని దైన్య మొందినమాడ్కి మార్తాండుఁ డెంతయు మాఁగువాఱె

నృసిం. ౨. ౧౦౪.

**మాఁగువడు = మాఁగుడువడు.** అ. క్రి. (మాఁగు + పడు త. మంగప్పడు), మాఁగుడు వాటు, మలినమగు.

సీ. సురుచిర కిరణ విస్ఫురణంబు డింది యెంతయు మాఁగుపడిన మార్తాండు పగిది . . .

మార్క. ౧. ౧౭౭.

**మాఁటినంగ.** వి. (మాఁటిన + నంగ. త. మోదు నంగై.) ౧. కాముకి.

గీ. భోగదాన వ్రతంబులు పూని యెపుడు, మకరకేతను వర్ధించు మాఁటినంగ .

కాశీ. ౩. ౧౪౧.

౨. ముగ్ధ, అవిదగ్ధ.

సీ. మాటాడ నేరని మాఁటినంగవు నీవు సకల కాలంబు నో సరసిజాక్షి .

కాశీ. ౩. ౭౨.

**మాఁటు.** అ. క్రి. (త. మాదు.) తగులముగొను

ఉ. మాఁతుర నీవు పట్టి చెడుఁగూఁతలు గీఁతలు నేర్చి కష్టులన్, మాఁతులు నాకఁ గాని ధన మూల విటాళినిఁ జేరవైతి వీ, కోఁతకు నిన్ను నెల్లరును రోయఁగ నీసరివారు నవ్వ నీ, కోఁతి విటుండు నల్పువెదకోడిగముల్ గని మాఁటి వత్తురే. భల్లా. ౫. (శ. ర)

వి. ౧. తగులము. (శ. ర.)

౨. మాఁతు, చదరంగపు ఆటయందు బంటుతోఁ గాక తక్కినవానితో రాజును గట్టుట. (శ. ర.)

**మాడించు = మాడ్చు.** స. క్రి. (√మాఁడు) మాఁడఁజేయు, దగ్ధముచేయు.

క. మాఁడుదినంబులు తద్దయు, వాఁడి యుగు రణంబు సేసి వరబాణాగ్నిన్, మాఁడించితి నయ్యధమునిఁ, బోఁడిమి చెడి తద్భుశాఖ ములు వెస విచ్చెన్.

హరి. పూ. ౨. ౧౭౦.

ద్వి. అరవిరయు వీక్షించి, బాలుండు గావునఁ బఱికెంచెఁ గాని, పోల నీతఁడు దుష్టబుద్ధి రాఁ దమచు, నార విచారించి యంకుజాల ముల మారుతనుతుమేను మాఁడింపఁ దరొయ్యె.

రం. రా. ఉ. ౯౩. పా. ౨. పం.

ద్వి. ఎఱిఁగెదవు గా కేమి యిందుఁ బోయెదవు, మాఁడుంలోకంబులు ముట్టిగర్వమున, మాఁడించు నిన్ను నమ్ముభుజవల్లభుఁడు, కని పెండిన్

రం. రా. యు. ౩౮౮. పా. ౨. పం.

మాఁడు¹. అ. క్రి. (క. మాట్టు.) ౧. దగ్ధమగు.

అ. కాననంబు శెల్లఁ గాలిన నవిమిషేం, ద్రాక్ష వహ్ని సెఱఁకు లంటవట్టు, మాఁడి మ్రోడు వడినమడ్కి రూపఱును గో, మంత పర్వతంబు మనుజనాథ. హరి. ఉ. ౧౯౧.

ఉ. నేఁడు బలంబు శెల్లఁ గొని నీవు మహోద్బలఁ దేర్చు చిచ్చుచే, మాఁడిన కాననంబుగతి మర్కట సైన్యము సొంపు దూల

భా. రా. యు ౩౩౩. భా. రా సుం ౫౦౯.

౨. (ఆఁకలి మొదలగువానిచే) బాధపడు

సీ. మలమల మాఁడుచు మానసం బెరియంగఁ బట్టె డోరము మాకుఁ బెట్టు మనుచు

భాగ. ౧౦ ఉ. ౯౬౬.

౩. శుష్కించు, ఎండు.

సీ. పొలనుతే కాతే ప్రేగులు మాఁడి యున్న ప్రేతవ్రాతముల బీకతనము వాసె

ఉ. రా. ౭. ౧౩౭.

సీ. సస్యములో మాఁడె శీర్షములఁ గాకము లాడెఁ గండలు గుఱిసెఁ జీకటులు బెరసె.

చెన్న ౫. ౨౩.

౪. పాడగు, చెడు.

ఉ. నేఁడు ప్రహూతికాలమున నీవు గదాధర మద్గ్రహాంబునన్, వాఁడిమితోడ నుండి జము వాకిలి గట్టి మదీయసంతతిం, బోఁడిమితోడ గాచి నను బుబ్బునిఁ జేసినఁ గాక యింతలో, మాఁడిన నేమి చేసెదవు మంత్ర పునీతులు చల్లవచ్చునే, ఉ. హరి. ౨౧౯.

క. జలనిధిచండంబున ని, మ్ముడు వొప్పుఁగ నిప్పు డేమి మాఁడెను. భార. శాం. ౩. ౧౭౯.

వి. అడుగంటిన యన్నము, దగ్ధిక.

గీ. నేఁడి యగుదాఁక కోరువ మాఁడు గలిగెఁ, బులిసినది గర్ణె నన్నంబు పోఁకయంత, యొసఁగి తు త్తార్పు కెనఁ జల్ది మెసవ సైన, పాప మడిసించుకొందుఁ దపంబుకలిమి.

పాండు. ౪ ౧౫౩.

గీ. అలరు మాఁ దనఁగ దగ్ధి, కాష్ట్యాయను.

ఆం భా. ౨. ౨౫౪.

జ. మాఁడించు, మాఁడుచు

మాఁడు². వి ఇంటిరొకభాగపుకప్పు (శ. ర)

మాఁడుచే(డ్చు). స క్రి (√మాఁడు1) మాడించు, దగ్ధముచేయు.

క మీఁదా వెలివక యుండెడు, వాఁ డిక్కడ రాముఁ డున్నవాఁ డని వినియున్, నేఁ డీ గక్కనుపోఁడిమి, మాఁడుకు నని యాడు గఱచి మచ్చర మెచ్చన్

రామా. ౪ ౨౪౬. (౪ ర. పా.)

సీ. లోనగ ల్లల బెల్లుగ నగ్గి కెర చేసి సెతి మించునరకు లన్నియును మాడ్చి

అచ్చ. రా. సుం. ౧౩౭.

గీ వారివెనువెంట శౌర్యదుర్వారుఁ డగుచు, నపుడు నృపబాణవితతి బ్రహ్మస్తమాతులఁ, గూల్చి మాఁడ్చుచు వచ్చెఁబో గూర్మశిరుఁడు, పలికి లోనికి నెదఁ బాపతలయుఁ దాను.

కళ. ౨౧౧౪.

మాఁతు. వి. చదరంగపు ఆటయందు బంటుతోఁ గాక తక్కినవానితో రాజును గట్టుట. (శ. ర.)

మాకందము. సం. వి. అ. పుం. ఆమ్రవృక్షము, మామిడిచెట్టు.

మాకంది. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఉసిరిక, ఆమ
లకీ చె. ౨. పీతగంధము, పచ్చగంధము. ౩.
గంగాతీరమం దుండెడి పట్టణభేదము.

మాక్షికజము. సం. వి. అ. న. మయినము.
(రా. ని.)

మాక్షికఫలము. సం. వి. అ. పుం. నారికేళవిశే
షము, ఒకజాతి కొబ్బరిచెట్టు. (రా. ని.)

మాక్షికము. సం. విణ. (అ. ఈ. అ) తేనెటీఁగ
నుండి వచ్చినది, తేనె పుట్టినది.
వి. అ. న. ౧. తేనె. ౨ ధాతువిశేషము, తేనె
వలె మండెడి యొకానొక జాతిగనిలోఁ
బుట్టెడిధాతువు.
(ఇది స్వర్ణమాక్షికము అని ద్వివిధము రా. ని)

మాక్షికశర్కర. సం. వి ఆ స్త్రీ. పాకము
పట్టినపంచదార (రా. ని)

మాక్షికాశ్రయము. సం. వి. అ పుం. ౧
మయినము. (రా. ని)

మాగధ. సం. వి. ఆ. స్త్రీ. పిప్పలి చె.

మాగధము. సం వి. (అ. ఈ. అ.) మగధదేశ
సంబంధ మైనది; మగధదేశమున నివసించునది;
మగధదేశపుఁ బ్రజలసంబంధ మైనది.
వి. అ పుం. ౧. సంకీర్ణజాతిభేదము, వైశ్యపురు
షునకు క్షత్రియ స్త్రీయందు జన్మించినవారి
జాతి.
(ఈ జాతివారికి స్తోత్రపాఠము చేయుట వృత్తిగా
నేర్పడినది.) ౨. జీలకఱ్ఱ. (వై. ని)

మాగధి. సం. వి. ఈ. స్త్రీ. ౧. మగధదేశపు
రాజకూఁతురు. ౨. మగధదేశపువారిభాష. (ఇది
ప్రధానప్రాకృతభాషలు నాలుగింటిలో నొకటి.)
౩. పిప్పలి చె. ౪. తెల్లజీలకఱ్ఱ. ౫. శర్కర,
పంచదార. ౬. మల్లివిశేషము చె. ౭. ఏలా
భేదము, ఒకజాతియేలకులచెట్టు.

మాగధిక. సం. వి. ఆ. స్త్రీ. పిప్పలి చె.

మాగధుఁడు. సం. వి. అ. పుం. ౧. మగధదేశపు
రాజు. ౨. స్తోత్రపాఠకుఁడు. ౩. మగధదేశపుఁ
బ్రజలు.

మాగవి. సం. వి. ఈ. స్త్రీ. పీతకంగువు, పచ్చ
కొఱ్ఱ చె. (వై. ని)

మాగాణి. వి. వరిపంట పెట్టెడుభూమి, పల్లపు
భూమి (శ ర.)

మాగాని. వి. దేశము, విలాతి. (శ. ర.)

మాఘము. సం వి అ పుం. ౧. (చాంద్రమాన
మున) ఒక నెల. ౨. మాఘకవి రచించిన శిశు
పాలవధకావ్యము.

మాఘవనము. సం. విణ. (అ. ఈ. అ) ఇంద్ర
సంబంధ మైనది.

మాఘి. సం. వి. ఈ స్త్రీ. మాఘశుక్లపౌర్ణమాసి

మాఘుఁడు. సం. వి. అ. పుం. శిశుపాలవధ
కావ్యము రచించిన మహాకవి.

మాఘ్యము. సం. వి. అ. న. కుందము, మొల్ల చె.

మాచేకమ్మ. వి. (సం. అమానకర్మ. మాచ +
ఆక + అమ్మ. శ. ర., (గ్రా.) స్త్రీసాజాత్యము
గల నపుంసకప్రకృతి, పోటు. (మగరొమ్ములు
మీసములు గలిగిన ఆఁడుది. శ. ర.)
సీ. యతి మాచకమ్మ గోత్రాలు దీక్షాపత్ని
మగనిఁ బాసినయింతి మరునిపాలు, తీర్థవాసు
లును మాంత్రికులు దాయాదులుఁ దర్శ
నాపులును గ్రోధంబుపాలు
సైమ. ౪. ౧౩౮.

సీ. మాచకమ్మకు నేల మాత్రికహారంబు క్రూర
చిత్తునకు సద్గోష్ఠిరేల. రామలిం. 33.

సీ. మాచకమ్మ యనంగ మనుఁ బోట . .
ఆం. భా. ౨. ౧౦౯.

మాచము. సం వి. అ. పుం. మార్గము, రాజ
మార్గము, బాట.

మాచలము. సం. వి. అ. పుం ౧. మకరము,
మొసలి. ౨. రోగము. (మే. ని.)

మాచలుఁడు. సం. వి. అ పుం. ౧ దొంగ,
చోరుఁడు, దోపుడుచేయువాఁడు. ౨. వంది.

మాచి = మాచిపత్రి.

గీ దళములందును మారేడు తొలిపి జమ్మి, మాచి
నేరేడు వావిలి మంచివెలఁగ, దవనమును
కేలపత్రి చూతంబు నారె, శస్త్రములు
నమ్మ పత్రికి జనవరేణ్యా. భల్లా. 3. (శ. ర)

మాచిక. సం వి. ఆ. స్త్రీ. మక్షిక (త్రి. ని.)

మాచిప(త్తిరి)త్రి. వి. (సం. మాచీపత్త్రికు.
క. మాచిపత్రి. త మాసిప్పత్తిరి.) ఒకానొకచెట్టు,
దానియాకు.

గీ. మాచిపత్రియుఁ గురువేరు మరువకంబు, దవ
నమును దగ్గరయు బిల్వదళము లాది, దైన
పూజార్హవస్తువు లపుడు దెచ్చి, వంతులకుఁ
గొండపాదవుగా వైచుటయును
ఉ. ఉ. రా. 3. ౨౦౧.

మాచీపత్త్రిము. సం వి. అ. న. మాచిపత్తిరి ?.
(సాహేబునిఘంటులోను విఘ్నేశ్వరవ్రతకల్పము
లోను ఈ పదము కలదు. పూర్వ నిఘంటువు
లందు ఈ పదము కన్పడదు. ఇంకను విచా
ర్యము. శ. ర. లో మాచిపత్తిరి = స్థౌణే
యము ? అని కలదు. స్థౌణేయశబ్దమున
కే యర్థము కన్పడదు. కాని వెంకటాద్రీయము
నందు కలదు.)

మాచెనపక్కి. వి. మత్స్యభిశేషము. (శ. ర.,
బ్రౌ.)

మాజలము. సం. వి. అ. పుం. వి. పక్షివిశేషము.

మాజేము. వి. (హిం. మాజూన్) బెల్లము మొద
లగువానితోఁ జేసిన మత్తుపదార్థము.

క మును నల్లమందు మాజాము, తిని యున్నది
గాన మేను తిమ్మిరి గొని
చంద్ర. వి 3 ౧3౭.

మాటంకము. సం. వి అ పుం. లవణాపణము,
ఉప్పదుకాణము (వై. ని.)

మాట. వి. (త మాట్టమ్. క. మాతు. తు మాత్తం.)
౧. వాక్యము.

క పదమటియది సాగర మదిరొమదుతద్జ్ఞులమాటఁ
దక్కఁ నేతత్పురి న, ల్గదలందుఁ బరిఖ
లెవ్వియొ, జడనిధి యెయ్యదియొ తెలియ
శక్యమె ప్రజకున్. ప్రభా. ౧. ౭౫.

క. ధరఁ దమరు సత్కవుల మరి, పరులు కుకవు
లనుచుఁ గృతులఁ బరిహాస మొనర్తురు
గర్వమతు లయోగ్యః పురుషో నాస్తి యను
మాట బుద్ధిఁ దెలిపియున్. అప్ప ౧. ౧౫౪.

సీ. మా టన వాక్య మై యొసఁగు
ఆం. భా. ౧. ౧౧౧.

౨. పలుకు, పదము ; గర్వోక్తి.

చ. పలుకులపొందు లేక రసభంగము సేయుచుఁ
బ్రాఁతవద్దవూ, టలఁ దమ నేర్పు చూపి
యొకటన్ హృదయం బలరింప లేక యే,
పాలమును గానియట్టిక్రమముం దమ మెచ్చుగ
లోక మెల్ల న, వ్వులఁ బొరయం జరించు
కుకవు ల్ధర దుర్విటులట్ల చూడఁగాన్ .
నిర్వ. ౧.

నేటిమాపటికిఁ గో, ర్పద వాలాయముగ
నేను బ్రియులను మిమ్మునన్.
ప్రభా. ౫. ౪౫.

౨. రేయి, రాత్రి.

ఉ. . భూమిభృన్మౌళికిఁ గేలు మోడ్చి
చని మాపటికో ల్వొన నాదిలానీమల్ ...
వైజ. ౧. ౧౨౧.

క ఈమా పేయింతిని నా, కామాతురతెల్లఁ
దీఱ చంద్ర. వి ౧. ౭౨.

గీ ఎసఁగుకట్టానిక్రియ నావి రొగయఁ బగటి,
రొయిందయుడు కాఱుకుండుభూమండలమునఁ,
బొలిచె మాపటఁ బండువెన్నెల చకోర,
పోతవితతికిఁ జూఁపట్టు వోసినట్టు.
ఆము. ౨. ౬౦

3. మాలిన్యము, మురికి.

(వ్యవ.) రంగుబట్ట మాపున కాఁగును.

(ఈ యర్థమున అనా.గా వ్యవహారమందుఁ
గన్పట్టుచున్నది.)

౪. లేకుండఁ జేయు. (చూ. మాపుచేయు)

విశే. మలినము, మురికియైనది

సీ. కురుమాపుదడిమంపుఁగోకలోఁ దోలఁకెడు
కంపమాననితంబకాంతిసొంపు ..
కళా ౪ ౧౦౯

సీ కట్టిననెఱమాపుగడితెంపు పుట్టంబు నెమ్మ
మొ గెడువారచీర గాఁగ .
అచ్చ రా. సుం. ౭౮.

మాపుచేయు. స. క్రి (√మాపు) పోఁగొట్టు,
నశింపఁజేయు.

ఆ. తెలుపు మాపుచేసి దిట్టతనంబునఁ, దెలుపు
భస్మమగను దేటపఱచు, విధముకన్నఁ బరుస
జేదియు లేదురా . . వేమ. 3. ౧౪౯.

మాపుడు. విశే. (√మాయు) మాసినది. మలిన
మైనది.

గీ. ... ఒరులు, గట్టి విడిచినవస్త్రంబు గట్టఁ
గాదు, మడత మార్పు టొప్పదు కడుమాపు
డైన .. భార. అను. ౪. ౧౦౪.

మాభీదము. సం వి. అ. పుం. ఏకముఖరుద్రా
క్షము. (వై. ని)

మామ. వి (సం. మామకః, త. మామన్, క.
మావ.) ౧. తల్లికిఁ దోడఁబుట్టినవాఁడు, మేన
మామ, మాతులుఁడు

గీ అనఘ మా మామ శకుని నాకై కడంగి, జూద
మాడెడి నాతోడఁ గాను నాక, యీతఁ
డొడ్డినధనరాసు లెవ్వియైనఁ, బోఁడిగా నీకు
నీ గలవాఁడ నేను
భాగ. సభా ౨ ౧౪౪.

ఉ. శ్రీరుచిరత్వ భూతిమతిజిత్వరతాకృతి శక్తి
కాంతులన్, ధీరత సాగభోగముల ధీనిధి
యీశ్వరనారసింహుఁ డా, వారిజనాభశంక
రుల వారిసుమారుల వారితమ్ములన్, వారి
యనుంగుమామలను వారివిరోధులఁ బోలు
నిమ్మహిన్. మనుచ ౧. ౭౯.

౨. శ్వశురుఁడు.

(క.) భర్తతండ్రి.

క. ఆమెలఁత నేయుసవినయ, సామకథల
మృదుగభీరసంభావనలన్, మామయు నత్తయు
సంతోషామృతమునఁ దేలి రంతరంగములఁ
దగన్. భాగ ఆర. ౪. ౧౯౪.

ఉ. . నీదుపట్టి న న్నెంతయుఁ బ్రేమఁ బట్టి
రమియించినయప్పుడె మామ వైతి నీ,
వింతటినుండి కోడలఁ జూమీ నను మట్టకు
రాజశేఖరా. సారంగ. ౨. ౨౩౨.

(చ.) భార్యతండ్రి.

ఉ. పారణ చేసి రాజు మధుపర్కపురోదనియ
మామ భీమధాత్రీరమణుండు మంత్రసను
దీరణపూర్వము గాఁగ నీయఁడే ..
నైష. ఉ. రారా.

సీ. వినుసామి నీతండ్రివనుపున నీమామ యగు
కుంభకుని యింటి కరుగుచెంచి ..
నీలా. ౨. ౧౨.

చ. .. మామగా, రనుటయొ కాని మమ్ముఁ
గనినయ్యకు మాకును భేద మున్నదే
ఉ. రా ౫ ౫౧౨.

వ శ్రీమన్మహామండలేశ్వర కులోత్తుంగ
చోడగొంక్కరాజులమామ దణ్ణనా (య)
కపణ్ణినాయకుని గొడ్కు చోడపనాయకు
ద శా ౪ ౧౦౬౬.

౩. మామక సంజ్ఞకుఁడు, మామవానివాఁడు

చ. మఱది యటంచు బావ యని మామ యటం
చును నల్లుఁ డంచు నంబదులకును నన్నివావు
లిడి దశా ౨ ౩౬౬.

జ మామతనము, మామమామ

మామకము. సం విశే. (అ మికా అ)
నాసంబంధ మైనది.

మామకీనము. సం. విశే (అ. అ అ) నాసం
బంధ మైనది, మదీయము.

మామకుఁడు. సం విశే (అ. మికా అ)
౧. నాసంబంధ మైనవాఁడు
౨ స్వార్థపరుఁడు, లోభి, ఆత్మాశ గలవాఁడు.
వి. అ. పుం. మాతులుఁడు, మేనమామ.
(మే. వి.)

మామతనము. వి. (మామ + తనము) శ్వశుర
త్వము, మామయగుట
ఉ. భూమితలేంద్ర నీ కిపుడు పుత్త్రిక యై తన
రారు కన్య నీకామహిళాంశజాత యఖిల
స్వప్రహాణీయ గుణప్రతానంబులన్, మామక
పాణిపీడనసమాదరణంబున కర్త గాన
నీమామతనంబు మిక్కిలిగ మానుది కింపగు
చున్న ది క్షితిన్. పరమ. ౩. ౫౩.

మామమామ. వి. (మామ+మామ. త. మామ
మామ) విష్ణువు. (సరస్వతి)
సీ. పోరోగిరపురిరాజారి కూరిమిపట్టి మామమామ
యనుంగు మామగారు, అచ్చ. రా బాల. ౬.
గీ. మామమా మన హరి యొప్పు శ్రీమహేశ.
ఆం సం. దేవ. ౩

మామము. సం విశే. (అ ఈ అ) నాసంబంధ
మైనది, మామకము

మామిడి = మావిడి. వి (త మామరం)
చూతము, మావి
చ అల్లయది కెంపులమేడలతోడి విస్ఫురి,
స్మరకళకట్టిమస్థలియొ మవ్వపు లేఁజిగురాకు
కెంపుము, మ్మరముసఁ దేజరిల్లు నెఱమామిడి
మ్రాఁకులతోడి తోఁటయో
ప్రభా ౧ ౬౨.
సీ చాన మామిడి నంటి సంపెంగకును మోము
చక్కఁ జూపవదేమి తక్కు వయ్యె
ఉ రా ౬. ౩౮.
సీ మామిడి మామి యనంగ నామ్రమగు.
ఆం. భా. ౧౮౫.

మామిడిక్రింది సోమరి. మామిడిచెట్టుక్రింద
అపండు రాలి తననోట పడు నని ఆశించి శేమ
కొని యుండునట్టి సోమరి.
ద్వి ఒక విచారము మాకు నొదవె నీరాజా, సుక
వాసి, పనిపంద చూపుగుజ్జంబు, మామిడి
క్రింద సోమరి కేవటుంధు
ద్వి. పారిశ్చ. ఉ. ౧౪౫౩. పం.

ఆ. ఆహిరణ్యాక్షశిపునందు నీమామిడి, క్రిందిసోమ
రెట్లు వొంది యుత్తేఁ, బలికి మేఁకమలక
పుట్టినయ ట్లయ్యె . నార ౨. ౫౯.

త్రొక్కుడు మామిడికాయ = మామిడికాయలు
త్రొక్కి చేసినయొకవిధ మగుపచ్చడి.

క. త్రొక్కుడు మ్రామిడికాయయు నూరుఁ
బిండ్లు మెచ్చి రలంతుల్
పాంచా. ౪. ౫౫

జ. మామిడిగుత్తులు

**మామిడిగుత్తులు.** వి బ (√మామిడి) ధాన్య
విశేషము

మ సారిదిం జేర్చినతేఁగమల్లియలు ఖర్జూరగం
బులుం బుష్పమం,జరులు న్మామిడిగుత్తు
లున్ గుసుమల్ సంపెంగలున్ బచ్చ
గ,న్నెరువూఁబాళలు గల్గి రాజనపుఁగాంతిం
దారు ము ల్చూపి చే, లరుదార న్నగుఁ
బూవుఁదోటల బలాకానీకదంభంబునన్
ఆము ౧. ౬౬

**మామెన.** వి. ౧ ఉత్పలశారిబ, నల్లసుగంధి
పాల దీ

సీ. మామెనయును సేలవామెన యటకమామిడి
దూలగోవెల హంస ౪ ౧౦

గీ మామ్మెన యన నుత్పల శారిబాహ్వయ
మగు భవ అం భా. ౫౭.

౨ మామెనకాయలతో పెట్టిన యూరుఁగాయ.

క. వడపిందెయు మామెన మ్రా,రెడుగాయయు
నల్లమున్ మిరియపూర్గాయల్, కడ
నుండఁగఁ ద్రొక్కుడు మ్రా,మిడికాయయు
నూరుఁబిండ్లు మెచ్చి రలంతుల్
పాంచా ౪ ౫౫

ఉ. ఆరికూడు పుచ్చవరు గావులవెన్నయు
దోషగింజసం, శారపుటాంబురంబు తనిమజ్జిగ

మామెనగుంపుతోడఁ దం,డాలఁగఁ బట్టి
రెడ్డిమడియ ల్మెలుంగోలలఁ బూని యెడ్లకో,
టేరులు వైచి దున్నుటకు సేగిరి కొంద్రకు
సాలు వచ్చినన్.
కేం. పంచ. ౧. ౬౦౩.

(వ్రాఁత ప్రతిపా. మాకొనకంపు ము॥ద్రి. పా )

**మాయ.** సం. వి ఆ. స్త్రీ. ౧. దంభము.

౨ వంచన, మోసము

౩ గారడివిద్య, మంత్రవిద్య, ఇంద్రజాలము
మొ వలనఁ గలిగిన భ్రాంతి.

౪ యథార్థము కానిరూపము, అసత్యము
(సమాసముయొక్క మొదటిపదముగా నుండు
నపుడు అసత్యము; కల్పితరూపము గలది.
యథార్థము గానిది అనునర్థముల నుపయో
గింపఁబడును

(ఉదా —మాయావచనము = అసత్యవచనము.
మాయామృగము మొ )

౫. కపటోపాయము, రాజకీయతంత్రము.

౬. (వేదాంత) అవిద్య.

(అవిద్యవలనఁ గలిగిన భ్రాంతిచేత నసత్య మగు
జగత్తును సత్యముగాను బ్రహ్మముకంటె
భిన్న మైనదిగాను జనులు గ్రహింతురు.)

౭ (సాంఖ్య) ప్రధానము, ప్రకృతి.

౮. బుద్ధునితల్లి యగు మాయాదేవి

౯. (శైవమతమున) జీవుని బంధించెడి నాలుగు
పాశములలో నొకటి.

౧౦ ఒకానొక పట్టణము, గయ.

౧౧. లక్ష్మి.

౧౨ కృప

౧౩ ఒకానొక విష్ణుశక్తి

౧౪. తెగడ దీ. (వై. వి.)

**మాయరవి** = దయలేని సూర్యుఁడు.

క. మాయరవి యేల క్రుంకెఁడొ,కో యను ని
ట్టూల తదాసెన్ ..

భార. విరా. ౨. ౩౧౨.

**మాయఁజేయు.** స క్రి. (మాయు) నశింపఁజేయు.

సీ. చంద్రసూర్యుల ప్రకాశము మాయఁజేయని
కటికి చీకటిమీఁద మెటికె విఱుచు .

శుక ౨. ౫౦౪.

ఉ. తా నొకమాయఁ జేసి యమృతంబు సురా
ళికిఁ బంచిపెట్టఁగా, నే నిఁక మాయఁ జేసి
త్రిదివేశుల నందఱ మాయఁ జేసెదన్

దశా ౨ ౩౮౩

**మాయఁబాఱు.** అ క్రి (√మాయు) కాంతి
హీనమగుట కున్ముఖమగు, మాయుట కున్ముఖ
మగు.

క తెలతెల నరయ్యెను దిక్కులు, పఱపల నుడు
గణము మాయఁబాఱెను బత్తుల్, కలకలనఁ
గూయఁదొడఁగెను, దులదులఁ దమ్మిదలు
దమ్మితుటుముల నెడలెన్.

హంస ౧ ౧౩౮

**మాయకాఁడు.** మి. విశే (మాయ + కాఁడు)
మాయావి

పీ నీవు

గీ మానుషంబుల నడపంగి మాయకానిఁ,
గాఁగఁ జెలులు గాంచుట వగ కలిమిపేర్మి,
దాని వెలిపుచ్చ నోపమి లీన నొకటఁ, గార్ష్ణి
పాండురత్వంబులు గలుగు నమఘ.

భార అను. ౪. ౩౭౫.

**మాయదారి.** మి. విశే. (మాయ + దారి) సం.
మాయాధారీ. మాయావి, మాయకాఁడు;
మాయావిని, మాయలాఁడి.

ఉ. వచ్చుటయున్ ఫలందమఁడు వారిజనాభుఁడె
మాయదారి యై, యిచ్చటి కేగుదెంచె నని
యిచ్చఁ దలంచి నమస్కరింప ...

వరాహ ౯. ౪౪.

గీ. నిలిచె జిలిబిలిజడదారి చెలులఁ జేరి, మచ్చు
కొప్పెకుదారి సమ్మాయదారి

కువల. ౨. ౨౯.

చ పొరిపొయ కంటకాన్వయుల యాపహవైఖరి
కెల్ల రయినకల్లరి మదిరీతి మేను కుటిల
మ్ముగఁ ద్రిమ్మరు మాయదారి మం,దర యను
జంత చం గా ౪ ౧౭.

ఆం భా ౨ ౨౭౯

**మాయపోతు.** మి విశే. (మాయ + పోతు -
మాయము + పోతు. శ ౭) మాయలమారి.
(శ ౭)

**మాయము.** విశే (సం మాయా, క. మాయవు)

౧. అదృశ్యము, కానరానిది

ఆ నడుగు సాచ్చి మునిఁగి మాయమై పోయిన,
నప్పుతాత్మఁ దగుచు నవనివిభుఁడు

భార ఆగ. ౪. ౩౩౦.

శా. ఇతఁ డెవ్వాఁడొక్కొ కేత్రోత్సవం,
బై డాయం జనుదెంచె నంతటను మాయం
బయ్యె సైష. ౩. ౭౨.

క ఊటికిన నడుమున తల దెగి, నటికినఁ బలి
మాయమైన నభమున సుర లు, త్రిటి మెచ్చి
పుష్పవర్షము, లేఁచుగఁ గురియించి రభయ
దాయకు మీఁదన్. ద్వా. ౧౦ ౫౪.

౨. మోసపుచ్చునది, వంచకము.

క. మాయపుఁజీకటి విరియఁడుఁ, దోయజ
మిత్రుఁ డింతు మగుదఁ దోఁచెఁ బ్రజకుఁ గో,
పాయత్తు లై బలంబులఁ, జేయుం గలవాఁడు
గదఁగి శితబాణములన్.

భార. ద్రో. ౪. ౩౨౪.

క. మాయఁ బ్రకటించుచును వెద, మాయపు
మంత్రములం రిత్త మంత్రించుచు ధూ,
ర్తాయకనందన గనుఁగొను, మా యామది
రాక్షి నీమదాలస యగునే.

మార్క. 3. ౯౧.

3. కృత్రిమము, తెచ్చి పెట్టుకొన్నది.

చ. మదవతి చెంబుతో, నుదకముఁ గొంచు
ధూర్తమణి యొండెడిచోటికి నేఁగి మాయపు,
న్నిదుర వహించి యున్నయతనిం గరసంజ్ఞల
లేపి యి ట్లనున్. శుక ౨ ౧౭౫.

౪ చెడిపోవునది; నశించునది

క. కానియటు లుండి నెఱిఁబడు, నైన తెలుఁగు
దోఁచి మాయ మగు నిబ్భంగిన్, మానస
మున కబ్బు వగయుఁ, దే హోపం బనులు
బుధుఁడు దేలఁడు కొంటన్

భార శాం 3 ౨౭

సీ. అనురక్తి నిన్నుఁ గూడి మనఁ గంటి మంటి నే
ననురతిమనువు మాయంబుగాఁగ .

శు సం ౧ ౧౧౯

గీ. అస్త్రశిక్షయు నేభంగి నణఁగిపోయె, మాయ
లన్నియు నెచ్చోట మాయ మయ్యె
భా. గా. యు ౧౩౯౦

చ. అడవెడుంచిచ్చుఁ జొచ్చుతతి నాదట నూరక
చూచునాఁటిని,ల్కడయును గానఁ ద్రోచి
చిరకాలము దాళిన బెట్టిదంబు నా,రయెడఁ
గని వంతలన్ విపివి యీతని కెక్కడి
మోహ మంచు నిష్పదమి నడంగి మాయ
మయి పోయితి వేమె పతివ్రతామణీ

ఉ రా ౧. ౯౯.

౫. వంచనాసాధనము, మాయోపాయము.

క. తాపదమాయము లేఁటికి, దేవి రాయనరించె
దిట్టు దీనికి నెడగా, నీ వొకటి రొండ్ల
చూపినఁ, బోవఁగని త్తుగా విరోధిఁ బొరిగొన
కట్లున్. మా3. ఉ. ౧. ౨౦౧.

గీ. మాయములం పన్ని యాలీల మహాప్రమోల,
బాల నిడి పేల నరిగిరి ప్రాణసఖులు .
కృ శకుం 3. 33.

మాయపుఁబుర్వు = ఘాతుకక్రిమి, నశింపఁ
జేయుక్రిమి.

క. నాయిష్టవనిత ద్రింగిన, మాయపుఁబుర్వు
లివి వీని మడియింతు మునీం,ద్రా యరుగుము
నీ వనుటయు, నాయన యత్యంతదుఃఖి
తాత్ముం డగుచున్ భార ఆర ౪ ౩౩౪.

సా కుంచెన్న కూడఁబెట్టిన మంచెన్న మాయంబు
చేయును (పెద్దల కష్టార్జిత మగుసొమ్మును వమ్ము
చేయునప్పు డీ లోకోక్తిని వాడుదురు)

క ఇంచుకయు నే వ్యయింపక, సంచితముగ
ధనము విభుఁడు సానుల కొసఁగన్, "గుం
చెన్న కూడఁ బెట్టఁగ, మంచెన మాయంబు
చేసె మర్యా దలరన్ రుక్మాం. ౪. ౧౦౪.

జ : మటుమాయ, మటుమాయతనము, మటు
మాయలబండి, మటుమాయలాఁడి, మటు
మాయలాఁడు

మాయల చెంచురాయఁడు. వి వి.
(√మాయ) ఈశ్వరుఁడు, శివుఁడు.

క. ఒకతలమానిసి లేఁ డిం, టికి మాయలచెంచు
రాయనికి నని వెనక,య్యకు నాతవివెన
కయ్యకుఁ, దుకతుకఁ బుట్టించి నవ్వుదురు
మనచెంచుల్ చంద్రా. ౨ ౧౬.

మాయలబెల్లి. వి విశే. (√మాయ) మాయలు
గలది.

సీ. తచ్చనగొండి పోతరకత్తె కల్లరి వల్లింత
మాయలబెల్లి కటికి . చెన్న. ౨. ౨౪.

**మాయలమారి.** మి. విశే. (√మాయ త. మాయమారి) మాయలు గలవాఁడు మాయావి; మాయావిని, మాయలాఁడి.

ఉ. మఖోఁ, పాయక నున్నవాఁడు శ్రుతిపాఠము సేయుచుఁ దోఁటలోనఁ జే, మాయయగా రటంచు వలమాయల మారి చవెం దటాలునన్. వైజ. ౪. ౧౬.

**మాయలమెకము.** మి వి. (మాయలు + మెకము) మాయామృగము.

క. మాయల మెకంబు సేవిన, మాయన న న్నెఱుఁగ వలయు నటకాద నరుం, డేయక మును గిటిఁ బొరిగొను నాయకుఁ డావెన్క విూరె న న్నెఱుఁగుటకున్. రా. వి. ౩. ౪౪.

**మాయలాఁడి.** మి విశే (మాయలు + ఆఁడి, త మాయ్యెయాడి క మాయలాడి) మాయలు గల ఆఁడుది.

దండకము. గుణం బేఁటికే మాయలాఁడీ విభుం డైనఁ బోఁడే నిమగ్నుండు గాఁడే భోగినీదండకము. ౯. పొ.

**మాయలాఁడు.** మి. విశే. (√మాయ. త మాయ్యె యాడి) మాయావంతుఁడు, మాయలమారి.

సీ. .. సహదేవుఁ బాలుకన మర్దించి మందల విడువఁడే మాయలాని .

గీ. మేటిమగనిఘటోత్కచుఁ గీ టడపఁడె . భార. కర్ణ. ౧. ౪౨.

సీ మాయలాఁ డిరి తిట్టె మంజుభాషలు. మనుచ. ౧. ౪౨.

క. అనుడు దరహాసరసమునఁ. దనవదనజరద్వి ధుండు తారుణ్యాము గై, కొన మందాందోళిన మేళనమున శిర మమర మాయలాఁ డిట్లని యెన్ . పాండు. ౫. ౨౦౯.

భా. రా. యు. ౧౪౧౩. ఆం భా. ౨. ౨౮౬.

**మాయసాగు.** మి. స. క్రి. (మాయ + సాగు) మాయచేయు.

గీ. వీనిఁజూగులు సీమలో శేనిమద్దులం గదిసి మాయసాగి రసంగ వలదు, మా టొకటి పేఁ రొకటి గా ద దేఁటి కింత, నాఁటినాఁటికిఁ దెలియఁగా నరతలోన రా. వి. ౫. ౪౧.

**మాయాకారుఁడు.** సం. వి. అ. పుం. గారడి వాఁడు.

**మాయాచణుఁడు.** సం విశే (అ. ఆ. అ.) ౧. గారడి చేయుటకుఁ బ్రసిద్ధుఁడు ౨. మోస పుచ్చువాఁడు, దగాచేయువాఁడు

**మాయాజీవి.** సం. వి న్. పుం గారడివాఁడు.

**మాయాదము** సం వి అ పుం మొసలి, మకరము. (త్రి. ని.)

**మాయాదేవి** సం వి ఈ. స్త్రీ. బుద్ధునితల్లి.

**మాయాధరుఁడు.** సం. విశే (అ. ఆ. అ.) మోసగాఁడు, మోసము చేయువాఁడు.

**మాయాఫలము.** సం వి. అ. న. మాచికాయ.

**మాయాయంత్రము.** సం. వి. అ. న. మంత్ర శాస్త్రప్రకారము చేసిన యంత్రము.

**మాయావంతుఁడు.** సం. విశే. (త్. వతీ. త్.) ౧. మోసము చేయువాఁడు, వంచకుఁడు. ౨. ఇంద్రజాలవిద్యయందు నేర్పరి, ఇంద్రజాలవిద్య నుపయోగించువాఁడు.

వి. త్. పుం. కంసుఁడు.

**మాయావతి.** సం. వి. ఈ. స్త్రీ. ప్రద్యుమ్నుని భార్య.

**మాయావి.** సం విశే. (న్. నీ న్.) మోసము చేయువాఁడు, మోసపుచ్చువాఁడు, యుక్తి పన్ను వాఁడు.

వి. న్. పుం. ౧. ఇంద్రజాలికుఁడు, గారడి వాఁడు. ౨. పిల్లి. (రా. ని.) స. మూఢి కాయు.

**మాయావిదుఁడు.** సం. విశే. (ద్) - మాయ నెఱిఁగినవాఁడు.

౧. దూసము చేయుటయందు నేర్పరి. ౨. ఇంద్ర జాలవిద్యయందు నేర్పరి.

**మాయి.** సం. వి. న్ పుం. ౧. గారడివాఁడు. ౨ బ్రహ్మ ౩. కాముఁడు, మన్మథుఁడు. ౪. అగ్ని ౫. శివుఁడు.

విశే. (న్ నీ. న్) మాయావి.

**మాయించు.** స క్రి (√ మాయు) ౧ చంపు, సంహరించు

క ఆయుధము విడిచి యుండఁగ, సాయకగురు మీరు నాఁడు జంపినకష్టో, పాయని ధృష్ట ద్యుమ్నుని మాయించియ కాని తోడిన మఱు వే నూద్వన్. భార కర్ణ. ౨. ౧౩౦.

సీ ఈతేరఁ గాద మాయించె సుత్రాముఁడు పాకదైతేయు నిర్భరసహాయు

హర. ౭. ౧౫౪.

క మాయావి వీఁడు దుర్మతి, మాయఁడు సంగ రములం దమర్త్యుల గెలుచున్, మాయికర ణముున వీనిన్, మాయింపుము మోహనాది మాయలచేతన్. భాగ ౧౦ ఉ. ౧౪

౨. నశింపఁజేయు, అడఁచు.

ఉ. మార్చి బ్రమో, యించుట గర్జచందముగ నేచి విరోధదనానలంబు మాయించు శిశాస్త్రవర్ష మున నిట్టిది భీష్మమహోద్యమము .

భార భీష్మ. ౧. ౫౨.

శా. ఆరాజన్యుఁ డుదగ్రుఁడై పాదివి సింహ వ్యాఘ్రభల్లూక భూ, దారణాదికదుష్టసత్వ సతతోత్థానంబు చాపస్ఫురన్నారాచ ప్రము ఖాంబకంబులజడిన్ మాయించుచున్ గ్రక్కు నన్, ఘోరారణ్య పదాశ్రమంబులఁ బరి శోభంబు మాన్పెన్ గృపన్.

కృ. శకుం. ౧. ౬౨.

క వంచనయును మాయయు మా, యించి పరా క్రాంతి నయ్యుశేసాస్త్రమునం, గ్రంచఱ నంతకుపురి కేఁ, గించితిఁ బాలోమకాల కేయాసురులన్ భార అర ౪ ౧౬.

క. చేయించుఁ జెవులపండువు, మాయించు నఘాళి నిట్టిమతి మతి గలఁడే

భాగ ౧ ౧౩౪.

౩. మాపు, కాంతిహీనము చేయు.

శా అరి, హ్మదారస్థిర క్త్రితారకములన్ మాయించు చేతప్రితా, పాదిత్యుండు వెలుంగు నైష ౫ ౧౩౩.

సీ. చిఱునవ్వు వెలయించి చెలు వయినవెన్నెలల్ మాయింపు మిప్పుడు మచ్చకంటి

బిల్హ. ౨ ౧౩౭.

సీ నీలధారాధర నిర్మలకాంతుల గడియలో మాయించుఁ గలికివేణి హంస ౫ ౨౧౦.

**మాయికుఁడు** సం వి. అ. పుం ఇంద్రజాలి కుఁడు. (వై ని.)

**మాయు.** అ క్రి. (త మాయ్) ౧ కాంతిహీ, మగు; తిరోహిత మగు

క మాసె నభోమణి నక్కలు, గూసెం గల యంగ దెసలకుం బలుసాయల్, నేసెం బఱ మెయిలు లదరి

భార. విరా. ౪. ౧౬.

గీ కరము భానుబింబము మాయఁ గప్పె నభము, వంటకములరాగమునఁ బెం, పారుచూడ్కిఁ దన బ్రతిభటుఁడు నూఢి నరుఁ డింక బ్రగ్గ

కెట్టుc, బూన్కి విడc దని సంరంభమును వహింప. రాఘవ. ౪. ౧౩౬.

౨. మలిన మగు, మాcగుడువాఱు.

క. మాసినచందమునc దమc గని తోచినడెందంబుc గలతరుణి పెఱుcగcడ బి,ట్టేసినమదనునిచే ధృతి వాసినబెగ డొందు సింహబలుc డట్టి యెడన్. భార. విరా. ౨ ౩౨.

ఉ. మాసినదీర్ఘకేశి కుఱుమాసినచేలచెఱం గలం క్రియా, వాసముగాని మేను వసివాcడినముద్దు మొగంబు గాంచి శుక. ౧. ౧౨౫.

క. తల మాసిన నొలు మాసిన, నలువలు మాసి నను బ్రాణవల్లభుసైనన్, గులకాంతలైన నోయరె, తిలకింపcగ భూమిలోన దిరముగ సుమతీ. సుమతీ ౧౬.

సీ. మా నటి పగ తెల్ల మాయు దీ వని పండు వెన్నెల నగునట్లు వెలcది నవ్వు కు. సం ౨ ౬.

గీ భ్రమరగీతిక మాయ విపంచి మీటు, దాన శ్రుతిc గూడి మిగులc దద్ద క్తి పెచ్చు, టే నివారించి లేచి దైవికము నెడుట, యుక్తులు ఫలింప వనుచు బి ట్టూర్చి నవ్వె ఆము. ౫ ౧౪౩.

చ. చీకటులు గొల్చున మాసె మరుండు తుంటవిల్, బలువడి నెక్కుc దీసె నీలా. ౩. ౪౪.

౩. చచ్చు.

క మాయావి వీcడు దుర్మతి, మాయcడు సంగ రములం దమర్త్యుల గెలుచున్ భాగ. ౧౦ ఉ. ౧౪

క మాయారణమున దివిజాల, మాయcగc జేయు టకు నైకమత్యము మెరయన్ శశాం. ౫. ౪౧.

౪ క్షీణించు, తగ్గు

సీ. జపముల గాయత్రిసహితంబుగా మాసె వేదంబు లేరును విసcగలేద . . హరి. పూ ౧. ౧౦౦.

సీ. మనముc గామక్రోధమదలోభముల కిచ్చి సదలించు రవ్వయాచారసరణి, నవ్వయాచా రంబు లట్లు మాసి చనంగ వర్తించు రవ్వాయ వర్తనమున. భీమ. ౫ ౧౪౩.

(మాసిచను = చెడిపోవు)

ఉ అశ్వమే, ధీయహయంబు మారు తగతిన్ బహుదేశములం దవించుచున్, మాయనివేడుకన్ యువతిమండలమున్ గది చెన్ సముస్నతిన్ జై భా ౫. ౧౦౫

౫ మఱువcబడు, విస్మృతమగు

సీ రాజాలయమునకు రాకపోకలు నేయు, మాసినచదువులు మఱలc జదువు పాండు. ౩ ౪౬.

౬. నశించు.

సీ మాసె నఘుస్ఫూర్తి మకుభూములందును సెలమూcడువానలు నిండc గురిసె మనుచ. ౧. ౩౪.

సీ. కను మాయcజని పీతc జెనకుకాకానుగకను మాయcగాc బాటు కొనిసచోటు పారంగ. ౧. ౧౦౯.

౭ దరిద్రుcడగు, ధనహీనుcడగు.

(వ్యవ) పాపను అతcడు వ్యాపారము చేసి మాసి పోయెను

జ మాపు, మాపుచేయు, మాపుడు, మాయc జేయు, మాయcబాఱు, మాయించు, మాసి, మాసిక.

మాయుకము. సం. వి. అ. పుం గజదోషము. (నల్లనిశరీరము నల్లనివాలుకయు కుఱుచదేహ మును అల్పము లైన గర్జవాలమేహనములును

దీర్ఘ మగుతొండమును కృశ మగుగ్రీవయును దుర్గంధమును గలది. ఇది సేనాపతికిని రాష్ట్రము నకును నాశము గలుగఁ జేయును.) (శ. ర.)

**మాయురె = మాయురే.** అవ్య. ౧. ప్రశంసార్థకము.

క. మాయురె హరిహరివరద యు, మేయగుణా యనుచు నాత్మ మెచ్చి
భాగ. ౧౦. ఉ. ౬౩౦.

౨. సంతాపార్థకము

ఉ. మాయలు మాయ మైనఁ గని మాయురె యంచును శోకతాప్య మా, వాయువు నంపఁగా
దశా ౪ ౨౧౪

**మాయురే = మాయురె** మాయొరె, అవ్య.

౧ ఆశ్చర్యార్థకము

చ. పురుషమహీజ మయ్యుగురుఁబోఁడి పయంట చెఱంగు పట్టి తా, ద్గురుకుచముల్ బయల్ పడఁగఁ ద్రోఁచె నచేతన మయ్యు మాయురే
కవిరా ౪ ౩౬

గీ మాయురే భూరిమహా నీయమణినికాయ, పాటకవిశంకటకవాటపాటవంబు, లని మనంబున వెఱఁ గంది హర్ష మంది, రఘునృప కుమారవరుహజారమునఁ జేరి.
ఇందు ౨. ౧౧౭

౨. ప్రశంసార్థకము.

ద్వి పేయుభంగుల రసావేశంబు దాల్చి, మాయురే యని పలుమాఱును మెచ్చి
ద్వి. హరిశ్చ. పూ. ౯౩౬. పం.

గీ మాయురే స్వామి చాగ భళా యటంచు, మాగధులు చేరి సముఖంబు వేగ విప్ప, నలువు మీఱంగ నిజవాహనంబు డిగ్గి
ప్రబంధ ౭౯.

౩. సంతాపార్థకము.

ద్వి. మాయురే కాశిపమాయఁ గాఁటోలు, పనిగొని బహుమహాపాత్రంబు లాదవె
ద్వి. హరిశ్చ. పూ. ౧౧౭౬. పం.

ద్వి. హా యని రొలుఁ గత్తి యఱచి హానాథ, మాయజాదం బింతమట్టుకుఁ దెచ్చి, మాయ ద్రోవలఁ జాపె మాయురే నాథ
ద్వి. నల. ౪. ౧౫౩. పం.

**మాయువు.** సం. వి ఉ పుం. పిత్తము.

**మాయూరము.** సం విణ (అ. ఈ అ) మయూరసంబంధ మైనది, నెమిలిసంబంధ మైనది.

వి. అ న. మయూరముల సమూహము.

**మాయూరి.** సం. వి. ఈ. స్త్రీ. ౧ అజమోద, ఒకజాతి రోమము ౯. ౨ మృదంగాది వాద నమునందు వ్రేళ్లయొక్క ఒకవిధ మగు వ్యాపారము. (వై. ని)

**మాయొరె = మాయురే.** అవ్య ప్రశంసార్థకము

మ అరెరే దాంతి బళోరె శాంతి గుణ మయ్యారే ప్రసాదంబు మా,యొరె దాక్షిణ్యము బాపురే తెల్లి మే లెంతేతపం బౌర యా, దర మాహా మహిమం బహో కలితమేధాశక్తి మజ్ఝారె స,త్కరుణాలోకన మంచు నాత్మ ముని రాట్కౌశికుఁ బన్ మెచ్చుచున్.
చంద్రా. ౩. ౧౨౫.

**మాయ్యము.** సం. వి. అ. న. ద్రాను, మూర, తూము లోనగు మానము. (శ. ర.)

**మారకము.** సం. వి. అ. పుం. ౧. అంటుకొనెడి చెడ్డవ్యాధి. ౨. డేగ, శ్యేనము.

**మారకమ్మ.** వి. ఒకానొక దేవత.

ఆ. వారకాంత లెల్ల వలచి యేతెంచురా,
పొందుఁ జేసి ధనము పుచ్చుకొనుచు, మార
కమ్మ చూచ్చి మఱి యిల్లు వెళ్లరా . .
వేమ. ౨. ౧౩౭.

గీ. మారకమ్మ పులి యచట మలయుచున్న, పెద్ద
మెకములు పెంచినపిల్ల యొక్కొ, యనఁగ
వాలు మృగంబుల కదియ యొప్పుడు, నాటప
ట్టగుజాడలు లేటపడఁగ. ద్వా. ౮. ౧౫.

మారకుఁడు. సం. విణ. (అ ఠికా. అ) చంపెడి వాఁడు, నశింపఁజేయువాఁడు
వి. అ. పుం. మన్మథుఁడు, మరుఁడు

మారజిత్తు. సం. వి. త్. పుం. (మన్మథుని జయించినవాఁడు)
౧ శివుఁడు ౨ బుద్ధుఁడు

మారణము. సం. వి. అ న ౧ చంపుట, నశింపఁజేయుట ౨. శత్రువును నశింపఁజేయుటకై చేయఁబడిన మంత్రకామ్యకర్మ, అభిచారిక కర్మ
3 ఒకవిసము విషము.

మారము. సం. వి. అ. పుం. ౧. చంపుట, నశింపఁజేయుట. ౨ విఘాతము, విఘ్నము
3. కామ వికారము, మన్మథ వికారము.
౪ ఉమ్మెత్త చెట్టు. ౫ మృత్యువు, చావు.

మారరిపువు. సం వి. ఉ. పుం. శివుఁడు

మారవము. సం. విణ. (అ. ఈ. అ.) మరుదేశ సంబంధ మైనది; ఎడారి సంబంధ మైనది.

మారాటము = మాఱాటము. (శ ర.)

మారాము. వి. పెంకెపట్టు.
(వ్యవ.) ఆ పిల్లవాఁడు చాల మారాము చేయుచున్నాఁడు.

మారాముల్లు. వి బ. మర్మములు; తంటాలు, చిక్కులు.

క. ఓ రామచిలుక మా కీ, మారాము ల్లెట్లు
తెలియ మగవారమె నీ, దారిఁ బలుపోకలం
గడి, జేలన్ . శుక. ౨. 30.
(ముద్రి. పా. "మారాములు తెలియుటకును" శ. ర. పా.) మారాముష్లు (బ్రా. పా.)

మారి1. వి. (సం. మారీ) మృత్యుదేవత.
వ మారి మసంగిన తెఱంగునం బారిపమరి
యొక్కడం దాన రై యొక్కొక్క పెఱుం
గుటమ్మునఁ బెక్కండ్ర నుక్కడించి .
అచ్చ రా. యు. 3౬౪.

సీ మనకీచకుల కెల్ల మారి యై పుట్టినమదతి
వోయెకు నని చూచువారు
భార. విరా. 3. 3౬.

గీ ఊరు పాడైనఁ గోళివుల యూళ్లి పుటికి,
మెసవ దొరకకొంటిఁ బ్రజ మారి మసఁగినట్లు,
తీకొఁ గతిపయ దినముల దేశమెల్ల, మల్లె
వట్టినచే విక్రమంబు గాఁగ
మనుచ. ౫ ౭౬. భారి ద్రో ౧ ౧౪౧.

జ మారి మసఁగు

మారి2. అప శాబ్దిలాన్నర్థమున వచ్చు నొకానొక ప్రత్యయము.
ఉ నీ కొడుకు మూఢత మానప లేల
వాఁడు గో, తొత్తులమారి యై గృహము
డొక్కక యొక్కొకదాని పూరికన్, గుత్తక
నంచు నుంచుకొని కోకలు రూకలు కోక
నీయఁగన్. నిరం. ౨. ౪౭.

గీ. అతఁడు దాని సొగాదిగ నరసి చూచి, దుర్జ
గట్టిది పని లేక తొల్లఁ దాని, పిలిచె నిది
పొట్లమారి గావలె నటంచుఁ, జేరి తనపేరు
పురిపేరు చెప్పి నిలిచె హంస. ౫ ౬౯

మారి. సం. వి. ఈ. స్త్రీ. ౧. అంటుకొనెడి ఒకానొక పెద్దవ్యాధి, మసూరికా రోగము.
౨. చంపుట. 3. దుర్గాశక్తి భేదము.

**మారిచము.** సం. విణ. (అ. ఈ. అ.) మిరియములతోఁ జేయఁబడినది.

**మారితము.** సం విణ. (అ ఆ అ.) నశింపఁ జేయఁబడినది.

**మారిమసఁగు.** అ క్రి. (మారి + మసఁగు) మిక్కిలి విజృంభించు, మిగులఁ జెలరేఁగు

గీ. కాలపక్వంబు లైన లోకముల జముఁడు, బారి సమరెడు చాడ్పున మారిమసఁగి, యుగ్రరూపుఁ డై శౌర్య సముగ్రబాహు సంపదుద్దాముఁ డగుక్రీడి సంపె రిపుల
భా॥ విరా. ౫ ౫౯.

క ఈరీతి నెదుకు లేక కుమారికి లుగ్రాహవమున మారిమసఁగుచో, శింబు విడిచి పాఱె సురారాతిబలంబు లెల్ల హాహా యనుచున్
వరాహ ౧౧ ౧౧౭.

గీ దుర్ముఖు నిశితాస్త్రంబునఁ ద్రుంచె నిట్లు, మారిమసఁగి దై తేయుల బారిసమరె
మార్క ౬. ౧౦౩

స క్రి. సంహరించు, చంపు

క వల్లియలు ద్రెంచుకొని బల, మెల్లను బెల్లగిలఁ ద్రోచ్చి యెంతయు నలుకన్, గెల్లువడి నుగళి హుంకృతి, మల్లడిగొనఁ బ్రజల మారిమసఁగం దొడఁగెన్. పద్మ. ౩. ౨౩౮.

గీ. ఈ త్తమోజ యుధామన్యు నుర్విఁ గూల్చి, మఱియుఁ దక్కినశూరుల మారిమసఁగి
చిత్రభా ౮ ౮౧.

**మారిమము.** సం వి. అ. పుం లోఁటకూర శే.

**మారిషుఁడు.** సం. వి అ పుం. గౌరవము గల మనుష్యుఁడు.
(నాటోక్తియందు సూత్రధారుఁడు ప్రధాన నటుని బిలుచునపుడు గౌరవపద్ధతిని సంబోధింప నుపయుక్త మగుపదము)

**మారీచము.** సం. విణ. (అ. ఈ. అ.) మిరియముల సంబంధ మైనది.
వి. అ పుం. ౧. పెద్ద యేనుఁగు, గజరాజము.
౨. కకోలకము శే. (వే. ని)

**మారీచి.** సం వి. ఈ స్త్రీ. శాక్యమునియొక్క తల్లి. (త్రి. ని)

**మారీచుఁడు.** సం వి అ పుం. ౧. బంగరు లేడిరూపమున రాముని మోసపుచ్చిన రావణభృత్యుఁ డైన రాక్షసుఁడు, తాటకాసుందుల తనయుఁడు
౨. కశ్యపుఁడను ఋషి 3 ఋత్విక్కు, యజ్ఞపురోహితుఁడు

**మారు**[1]. స క్రి (హిం మార్.) కొట్టు, ప్రహరించు.

చ. విరహుల మారుమారు ఘనవీరబలం బని పాంథకందర, ల్దలుగు రమాక మారునడిదాలని రాగవియోగజాతకా, తరిగుణదాత్ర మన్మథపతా కని తేంట్ల నదల్చి కమ్మదా, మరలఁ గదల్చి వారిచరమండలిసొంపు వదల్చి రంగనల్. హం పం. చ. ౪. ౧౫౦.

గీ మార నిను శంకరుఁడు పలుమారు మార, వలసి, క్రమ్మర బ్రతికించఁ దలఁచె పకట, యట్టి యవివేకమునఁ జావి గట్టు, బట్టి, చెట్టుజట గట్టి కైతలంబు బట్టఁ గడఁగె.
కృష్ణ ౪ ౯౦.

పి. కొని మారెఁ జదివె నాఁగను గొట్టె నని తోఁచు ..
ఆం. భా. 3. ౧3౨. వైజ. ౪. ౬౫.

**మారు**[2]. వి (క. త. మోర్) మజ్జిగ, తక్రము. (గ్రా.)
సా మజ్జిపోయి మజ్జిగలో మారుబోట్టు కేసినారు.

మారుంగము. సం. వి. అ. పుం. మన్మథశ్వాము. (వై. ని.)

మారుండము. సం. వి. అ. పుం. ౧. పాంప గ్రుడ్డు. ౨. ఆవుపేడ, గోమయము. ౩. బాట, మార్గము. ౪. గోమయముతో నిండినచోటు.

మారుఁడు. సం. వి. అ. పుం. కామదేవుఁడు, మన్మథుఁడు.

మారు(ఱు)గాళ్లు. వి. కృత్రిమపాదములు
చెన్న. ౨ ౨౦

మారుతము. సం. విశే (అ ఈ అ)
౧ మరుత్తుల సంబంధమైనది. ౨ గాలిసంబంధమైనది, వాయుసంబంధమైనది.
వి అ పుం ౧ గాలి, వాయువు ౨. శరీరము యొక్క ప్రధానరసము లగు వాతపైత్య శ్లేష్మములలో నొకటి యగువాత ౩ స్వాతి నక్షత్రము.

మారుతవ్రతము. సం వి. అ న వాయువు వలె సంతటను జొచ్చుట, వాయు వంతటను ప్రవేశించునటుల రాజు చారులమూలమున నంతటను జొచ్చుట యనెడి రాజధర్మము.

మారుతసుతుఁడు సం వి అ పుం. ౧. హనుమంతుఁడు. ౨. భీముఁడు

మారుతాశనము. సం. వి. అ పుం గాలిమేపరి, పాము.

మారుతి. సం వి ఇ పుం ౧. హనుమంతుఁడు ౨ భీముఁడు

మారుపు. వి మత్స్యవిశేషము, ఒకజాతి చేఁప.
సీ. కొఱ్ఱమీలను దండ్రికొలువుసెంకల కిచ్చె వాలుగలను సంగిడీల కిచ్చెఁ, జాపరలను బిన్నపడవాళ్లకును నిచ్చె మారుపులను జమ్ము వారి కిచ్చె. ద్వా. ౧. ౨౪౦.

మారువము. వి. మత్స్యవిశేషము, ఒకజాతిచేఁప.
ఉ. వల్లికలట్ల మారువము వాలుగ బేడిస కొఱ్ఱమీను పెన్, జెల్లయు పక్కె పారయును నీచును ముచ్చుఁగి బొమ్మిడాయముల్, రొయ్యి పరకారిగఁ జేఁపలఁ బట్టి పెట్టుగన్.
ప్రబంధ ౧౯౯

మారువా. వి రాగవిశేషము, ఒకానొకరాగము
ఉ. భైరవి నాట తోడి సిరిపాళి దిశాదిశి దేశి మారువా గౌరి బిళాహరి లలితకన్నడ గౌళ ముఖారి దేవగాం, ధారి వరాళి కన్నడ ధన్యాసరి ఘూర్జరి పూరి బేగడా, యారభి రామఖల్లి మొదలై తగురాగము లింపు మీరఁగన్ చెన్న. ౨ ౨౩౬.

మారువాడి వి ఒకానొకజాతి, మార్వాడ్, దేశీయుఁడు
సీ ఆఁడుబిడ్డనుకారి యుల్లుఁడు పింజారి మఱఁదలు కోడలు మారువాడి వేణు. ౯౯

మారువెల్లి. వి తృణవిశేషము, ఒకజాతిగడ్డిమొక్క
గీ వేమ తొణ్ణంగి తొండును మారువెల్లి, తొప్ప రంత్రింత యొద్దుకొ మ్ముప్పుగడ్డి
హంస ౫ ౪౭

చ పాని కడ పేరి తోఁటగియుఁ పాత్తర మల్లవ మారువెల్లియున్ ప్రబంధ ౨౦౦.

మారె(రే)డు. వి దే, అనా. బిల్వవృక్షము
క. మారెడు మోదుగు విప్రుఁడు, భూరమణుఁడు వటము ఖదిరమును వైశ్యుఁడు పెం, పారఁగ రావియు మేడియు గౌరవమున దండము లుగఁ గైకొనవలయున్. విజ్ఞా. ౧ ౨౧
సీ. ఇన్నూఱు కోజనములనిడుపు యోజన శతంబు, వెడలుపు గలుగుమారెడుతోఁట విలసిల్లు శ్రవణం బనఁగఁ బ్రసిద్ధ మగుచు
వరాహ. ౧౦. ౧౨౫.

రగడ. మారేటికిఁ బిలంపా కోఁటికిఁ జన,
గోరంటలకోన గోరంటపె నన . .
యయా. ౪. ౬౬.

రగడ. మారేడుపంటికై మగువ కడుగోరేల,
చేర రాఁగదె యిప్పచెంత నదిగోరేల .
ఉ రా. ౬. ౬౧.

సీ. బిల్వసంజ్ఞ. గీ. పరగు మారే డనంగను.
ఆం భా ౨. ౪౪.

మారెడుగాయ. బిల్వశలాటువు, దీనితోఁ జేయఁబడు ఒకవిధమైన ఊరఁగాయ.

క వడపిందెయు మామెన మా,రెడుగాయయు నల్లమున్ మిరియపూర్గాయల్, కడ నుండఁగఁ దొక్కుడు మా,మిడికాయయు నూరఁబిండ్లు మెచ్చి రలంతుల్ పాంచా ౪. ౫౫

మార్కండేయపురాణము. సం. వి. అ. న ఒకానొక పురాణము.

(ఇది పదునెనిమిది పురాణములలో నొకటి)

మార్కండేయుఁడు. సం వి అ పుం ఒకానొకఋషి

(శివునివరమున మృత్యువు లేనివాఁడు)

మార్కవము. సం వి. అ. పుం. భృంగరాజము, గుంటగలగర కు.

మా(ఱుకొ)ర్కొను. స క్రి అ. క్రి. (మాఱు+కొను) ప్రతిఘటించు, ఎదుర్కొను

ఉ. విశర్ణుఁడున్ యథా, మన్యుఁడు నేచి యొండొరుల మార్కొని రౌద్రరసం బెలోకసా, మాన్యము గాఁగ నస్ఖలితమత్సరవుల్ మెఱయంగఁ బోరి .
భార. భీష్మ. ౧. ౨౬౧.

క. కడిమి దలిర్ప నతని మార్కొని కినుక, న్నిడుదపెంనవాఁడికొమ్ములఁ, బుడమిం బడ వైచి పొడిచి పొరిపొరి మట్టెన్ . .
నీలా. ౩. ౬౫.

క. . కొం, చక రేమియా మనము సమరసముదారక్రీ, దను నొండొరు మార్కొనుట దొ, రకు నని వచ్చితి రాఘు. ౭. ౭౧.

క. సకలక్షత్రభయంకరు, నకు భార్గవ్రదధికి నని నెంనన్ మార్కొను లో,పల వలియంబాఱిఁడె యీ, ముకుండుఁడు భార సభా. ౨ ౪౬.

క వీనికి మార్కొనఁ జాలెదు, వానికిఁ దగువారి ధర్మతనయునిపురిలో, నానానియుద్ధలంపటు, నే నొక్కనిఁ గంటి. భార. విరా ౨ ౯.

చ ఇల వెలదోఁటలంమఁ జరియింపఁగ సొధము లెక్కఁ జిత్రపం, క్తుల మృగరాజిఁ జూడ సమకొల్పుదు రాఁ దమకూర్చు నెయ్యపుం, జెలులకు సాళ్వమాకనృపశేఖరు తిమ్మనృపాల చంద్రతోఁ, గలనను మార్కొనం గదఁగు గబ్బువిరోధు ల దేమి చిత్రమో.
విప్ర. ౧. ౫౧ కు. సం. ౧౧. ౬౦.

మా(ఱుకో)ర్కొలు. (√ మార్కొను) మార్కొనుట, ఎదిరించుట.

మ. మును నే యాతఁడు కృష్ణుపే ర్నుడివినన్ మోసంబునుం జెంద కే, మనదుం దద్విభుతో రణాంగణమున న్మార్కొలుఁ గల్పించె నే, మనుదున్ దైవము మాకు నెల్లఁదనువున్ బ్రాణంబులున్ రక్షకుం, డును నెయ్యుం డును జేకుండు నలకృష్ణుండే కదా చూచినన్ . చిత్రభా. ౫. ౧౯౭.

మార్గ సం వి అ. స్త్రీ. సంస్కృతభాష.

క. మార్గకు మార్గము దేశియు, మార్గము వదలంగఁ దమకు మది వదలక దు,ర్మార్గపదవర్తులనఁ

దగు, మార్గపులం దలఁప నలంతి మహి మనోజ్ఞ
పులకుస్ కు. సం. ౧. ౨౮.

**మార్గకవిత.** సం. వి. ఆ. స్త్రీ. సంస్కృతకవిత్వము.
క. మును మార్గకవిత లోకం, బున వెలయఁగ
దేశికవితఁ బుట్టించి తెలుం,గున నిలిపిరి
కు. సం. ౧ ౨౩.

**మార్గణ.** సం వి ఆ. స్త్రీ ౧ యాచన యాచించుట, ప్రార్థించుట ౨ వెదకుట, కను పట్టుట

**మార్గణము.** సం వి అ. న ౧ యాచించుట, ప్రార్థించుట ౨ వెదకుట ౩ బాణము, అమ్ము. ౪. అయిదుసంఖ్యకు సంకేతము ౫ ఒకవిధ మగుధనుస్సు. (వై ని)

**మార్గణుఁడు** సం విణ. (అ ఈ అ) ౧ వెదకు వాఁడు ౨. అడుగువాఁడు, యాచించువాఁడు.
వి అ పుం యాచకుఁడు, వేఁడెడివాఁడు

**మార్గతి.** మి వి. (మాఱు + గతి) వేఱుమార్గము
సీ. తతి పేద చనఁబోయి తడఁబడి మార్గతి వడి
చూపు లాదట బయలుపఱుప
భార. విరా. ౫. ౪౦౭.

**మార్గతోరణము.** సం. వి అ న. రాజమార్గ మునఁ గట్టిన విజయసూచక మగుతోరణము.

**మార్గద్రంగము.** సం. వి అ పుం రాజమార్గ ములో నున్నపట్టణము

**మార్గధేనుకము.** సం. వి. అ న నాలుగు కోసులదూరము. (త్రి ని.)

**మార్గధేనువు.** సం. వి. [illegible] పుం. నాలుగుకోసుల దూరము.

**మార్గబంధనము.** సం. వి. అ. న. కాట్రగడ్డ, కంచుకోట.

**మార్గము.** సం. వి అ. పుం. ౧. త్రోవ, పద్ధతి. ౨. పరిశోధనము, పరిశీలన. ౩. సాధనము, ఉపా యము. ౪. కార్యము నడుపురీతి. ౫. పద్ధతి, విధము. ౬. (కవిత్వ)శైలి. ౭. వెదకుట. ౮. నృత్త గీత నాట్యములయొక్క యున్నతశైలి. ౯. (నాట్య) తటస్థింపఁబోవుదానిని సూచించుట. ౧౦. గుదస్థానము. (త్రి. ని) ౧౧ కస్తూరి. ౧౨ మృగశీర్ష నక్షత్రము. ౧౩. మార్గశీర్ష మాసము ౧౪ సంగీతమునందు ఒకానొక భేదముఁ బ్రహ్మాదులచే మహేశ్వరునుండి కేఁబడి భరతాదులచేఁ బ్రయోగింపఁబడు సంగీతవిశే షము వ్యతి (దేశి)
ద్వి లాలితశుద్ధసాళిగములుఁ బెరయఁ, గ్రాలుచు
దేశిమార్గంబుల వెలయ
బస పు. ౪౧. పొ. ౬. పం.
౧౫ మృగసంబంధ మైనది.
ద్వి. మంగళధ్వను లొప్ప మార్గరావముల, సంగత
శ్రుతిగూడి సరివీణ లొప్ప, వీనుల కింపుగా
వినుపింప నపుడు
రం. రా. [illegible] ౧౪౯ పొ. ౬. పం.

**మార్గరుఁడు.** సం. వి అ పుం. నావికుఁడు, పడవ నడిపి జీవించువాఁడు.

**మార్గవటి.** సం వి ఈ స్త్రీ. మార్గముల రక్షించెడి దేవత. (విల్యమ్సు)

**మార్గశిరము.** సం. వి అ పుం. మార్గశీర్ష మాసము.

**మార్గశిరి.** సం. వి. ఈ. స్త్రీ మార్గశీర్ష శుక్ల పూర్ణిమ.

**మార్గశీర్షము.** సం. వి అ. పుం. మార్గశీర్ష మాసము.

**మార్గశీర్షి.** సం. వి. ఈ. స్త్రీ. మార్గశీర్షశుక్ల పూర్ణిమ.

**మార్గస్థుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) దారి ప్రయాణము చేయువాఁడు, బాటసారి.

**మార్గాయణి.** సం. వి. ఈ. స్త్రీ. మార్గశీర్ష మాసము. (వై. ని.)

**మార్గికుఁడు.** సం. విణ. (అ. ఈ అ ౧. వేట గాఁడు. ౨. బాటసారి

**మార్గితము.** సం. విణ (అ ఆ. అ.) ౧ వెదకఁ బడినది, పరిశోధింపఁబడినది. ౨. ప్రార్థింపఁబడి నది, వేఁడికొనఁబడినది.

**మార్గ్యము.** సం. విణ (అ ఆ అ) ౧ వెదకఁ దగినది ౨. కుడువఁదగినది (శ. ర.)

**మార్చు**[1]. స. క్రి. (√మారు[1]) నశింపఁజేయు

ఉ. తూ ర్పరుణంబు గాఁదొడఁగ దుష్టనిశాచర పేశ యఱ్ఱ్యెడుస్, మార్చుము కాలయాపన మమర్చక యస్త్రశిఖాశిఁ బట్టి పా, లార్పఁగ నేల భార. ఆది. ౬. ౨౧౩.

**మార్చు**[2] **= మాఱుచు.** స. క్రి (√మాఱు.)

౧. వినిమయము చేయు, ఒకవస్తువు నిచ్చి మఱి యొకవస్తువును పుచ్చుకొను.

చ. ఇతరులదానమేనిఁ దమయింగియయేనిని నన్ను మార్త్త రే, మఱి నరకాధివాసగతి మాన్పఁ దలంచుట గల్గినస్ సమం, చితముగ భక్తి నిచ్చుట కశీలత మార్చుట కాక పార్థ భా, షితయుఁ బదార్థవస్యథయుఁ జేఁతనుఁడీ యిరు చాటి చెప్పెదన్. భార. అను. ౨. ౩౫౯.

మ. ... వెలుంతల్ పతిగాళ్ళతిన్ పరక మార్చున్ అను. ౨. ౧౨.

౨. పరివర్తనము నొందించు.

సీ. .. వగచినఁ దాపంబు వొందుట దక్క నొందు, గలుగునే సుఖముదుఃఖంబును దోడిన యవి మార్చి వచ్చును నరుగుచుండు . భార. అను. ౫. ౨౩౦.

గీ. పాలములతొంటిదళములు జర వహింప, మధుఁడు క్రొత్తదళంబుల మార్పనేమొ, పైశ మలరడితనకల్మి ప్రబల నాఁటి, కొమ్మలఁ బ్రవాళితతులు గీల్కొల్పె నపుడు. ఇందు. ౨. ౩౪.

గీ. వేణువుపై వ్రేళ్లు మార్చి మార్చి, మరలుగొలి పితె గోవింద మందసతుల ఆము ౫. ౬౪.

౩. మాఱుపఱుచు, రూపాంతరము నొందించు.

సీ. కమలవందము నున్నగాఁ జేవి యిరునుగాఁ గావించి కెందమ్మి కండ్లు మార్చి వీర ౨. ౯౪.

మ. ఇనుఁ డస్తాద్రికిఁ బోవఁ గొల్లగొని నేఁ డేతేరఁ తద్దీప్తి నం,జనసంబంధజబాంధవం బున రతిశ్రాంతాంగనానేత్రకో,ణనికాయం బుల డాఁచి తద్ధవళిమస్ దాఁ బూనెనో చొప్పుమార్పననస్ వెల్గెలఁబొల్చె దీపకళికా వ్రాతంబు శాతోదరీ. మనుచ. ౩. ౫౬.

౪. వడ్డించు.

ద్వి. అడ్డివేయక యిట్టు లమరులబంతి, వడ్డించు చును వచ్చి వచ్చి యచ్చెలువ, తనమహాకీర్తి ప్రతాపసంపదల, యనువున వెలుఁగుచు నక్కడ బంతిఁ, గూర్చున్నశశధరార్కుల కమృతంబు, మార్చి విష్ణు. ఉ. ౪. (శ. ర.)

**మార్జ.** సం. వి. ఆ. స్త్రీ. త్రిస్నేహము, మూఁడు చమురుల కలయిక.

**మార్జకము.** సం. విణ. (అ. ర్జికా. అ. శుభ్రము చేయునది; పవిత్రము చేయునది.

మార్జన. సం. వి. ఆ. స్త్రీ. ౧. శుభ్రము చేయుట, పవిత్రము చేయుట. ౨. వాద్యవిశే షముదొంత్క ధ్వని, మురజధ్వని.

మార్జనము. సం. విణ. (అ. ఈ. ఆ.) పరి శుభ్రము చేయునది, బాగు చేయునది; పవిత్రము చేయునది (సాధనము.)

వి. అ. న. ౧. శుభ్రము చేయుట, పవిత్రము చేయుట. ౨. చేతితోఁ గాని కుశతోఁ గాని మనుష్యునిపై నీరు చల్లుట.

పుం. ౧. లోధ్రము, లొద్దుగు చెట్టు. ౨. స్నేహము, చమురు (వై. వి)

మార్జని. సం. వి. ఈ స్త్రీ. సమ్మార్జని, చీఁపురు కట్ట.

మార్జారకంఠము. సం. వి. అ. పుం. మయూ రము, నెమలి.

మార్జారకము. సం. వి. అ. పుం. ౧. పిల్లి. ౨. మయూరము, నెమలి (వాచ.)

మార్జారకర్ణిక. సం. వి. ఆ. స్త్రీ. పార్వతీపరి చారిక.

మార్జార(ల)ము. సం. వి. అ. పుం. ౧. పిల్లి. ౨. ఇంగుదవృక్షముగారచెట్టు. ౩. అగస్త్య వృక్షము, అగిసిచెట్టు.

మార్జారి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడుపిల్లి. ౨. పునుఁగుపిల్లి, ఖట్టాసము. ౩. కస్తూరి. ౪. చమరమృగమును బోలిన ఒకానొకమృగము. (వై. వి.)

మార్జారిక. సం. వి. ఆ. స్త్రీ. పునుఁగుపిల్లి. (వై. వి.)

మార్జారీయము. సం. వి. అ. పుం. పిల్లి. వాచ (విల్యమ్స)

మార్జారీయుఁడు. సం. వి. అ. పుం. ౧. శూద్రుఁడు. ౨. కాయశోధన చేయువాఁడు, శరీరశుద్ధి చేయువాఁడు.

మార్జాలకంఠము. సం. వి. అ పుం. మయూ రము, మగనెమలి.

మార్జాలకరణము. సం. వి. అ. న. రతియందలి బంధవిశేషము.

శ్లో. ప్రసారితే పాణిపాదే శయ్యాస్సృశి ముఖో రసి, ఉన్నతాయాః స్త్రియాః కట్యాం మార్జారకరణం విదుః.

మార్జాలకర్ణి. సం వి. ఈ. స్త్రీ చాముండ, దేవతలలో నొకతె.

మార్జాలీయము. సం. వి. అ. పుం. ౧ పిల్లి. ౨ యజ్ఞపాత్రలను పరిశుద్ధి చేసెడికేదిసమీప స్థలము ౩ అంగశోధనము, అవయవములను శుద్ధిపఱచుట. (వై. వి.)

మార్జిత. సం. వి. ఆ. స్త్రీ. పంచదారయుఁ గొన్ని సంబారువస్తువులును చేసినపెరుఁగు, రసాల.

మార్జితము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. శుభ్రము చేయఁబడినది, తుడువఁబడినది. ౨. రాపుడు చేయఁబడినది.

మార్జుఁడు. సం. వి. అ. పుం. చాకలివాఁడు, రజకుఁడు.

మార్తండము. సం. వి. అ. పుం. ౧. జిల్లేడు చెట్టు. ౨. సూకరము, పంది. (మే. ని.) ౩. పన్రెండు సంఖ్యకు సంకేతపదము.

మార్తండుఁడు. సం. వి. అ. పుం. సూర్యుఁడు.

మార్తికము. సం. విణ. (అ. ఈ. ఆ.) మృణ్మ యము, మట్టితోఁ జేయఁబడినది. వి. అ. పుం. కుండమూఁత, మూకుడు, శరావము.

మా(ఱుతి)ర్తుఁడు. వి. (√మాఱు. బి. మా ర్తురు) వైరి, శత్రువు, పగతుఁడు.

గీ. మెఱసి బ్రహ్మాండ మెల్లను బ్రింగ నట్టి, హాస మొనరించి వ క్త్రగహ్వరముఁ దెఱచెఁ, దెఱవ నుఱువడి నర్కుఁడు తెరువు దప్పి, మా ర్తు దనఁ బోక మేఘునిమఱువుఁ జొచ్చె

సీతావి. ౧. ౨౦

చ. పఱచి దవాగ్నిఁ బడ్డశలభంబులకై వడిఁ బార్థుఁ దాఁకి రూపతి మతులుంక్ సహోదరులు నాలమునం దెగటారఁ జూచి నీ, మఱది భయంబునన్ గలఁగి మా ర్తునకున్ శరణంబు చొచ్చె నే, తెఱఁగున నైన నా సి గులు తీర్పఁగ నెవ్వరు నీవు దక్కఁగన్

జై. భా. ౪ ౬౪

మ. కర్ణాది దుర్జనసంఘంబుల మా ర్తురం డనుముదున్ సంగ్రామరంగంబునన్

భార. సభా. ౨. ౨౯౬.

క. తనుఁ దానఁ దొలుత గెలువన్, మనుజపతికి వలయుఁ బిదప మా ర్తుర గెలువన్, మన మునఁ దలంచునది మును దను గెలువనిపతికి గెలువఁ దఱమే పగఱన్.

భార. శాం ౨. ౨౩౬

క కీర్తిధనుఁ డైనయాతని, మా ర్తుర కని కరగ నరిది మగువ

నైష. ౫. ౧౭౫.

గీ అపుడు సరమమగం దెద నలుక నిగుడ, గట్ల మాఱుతుపగతుని గాంచి పలికె

అచ్చ రా. యు ౪౦.

మార్దంగము. సం. వి. అ. న. పట్టణము.

మార్దంగికుఁడు. సం. విశే. (అ. ఈ. అ.) మద్దెల వాయించువాఁడు.

మార్దవము. సం. వి. అ. న. ౧. మృదుత్వము, మెత్తదనము, బలహీనత ౨. సాధుత్వము, మెత్మది.

మార్ద్వీకము. సం. విశే. (అ. ఈ. అ) ద్రాక్ష పండ్లతోఁ జేయఁబడినది. వి. అ న. ద్రాక్ష సారాయి.

మార్పడు. అ. క్రి (మాఱు + పడు) ౧ ప్రతి ఘటించు.

శా నన్నుం గార్యము లేక మేలుకనుపన్ న క్కంచరేంద్రుండు ము, న్నెన్నడుం బను పండు మార్పడఁగ నయ్యింద్రాదు లుద్వృ త్తిమై, నున్నారలో

భా రా యు. ౨౬౫.

సీ బలహీనుమాడ్కి మార్పడ లేద యసమర్థుఁ డని తలంచెద వేని భాగ. ౩. ౭౧

ద్వి ప్రవిమలరత్నదర్పణ తోరణముల, రవిపీ ఠ లకును మార్పడ నమరించి

ద్వి పారిజ. ౯ ౨౧౫. పం.

౨ భేదపడు, వ్యతిరేకముగా వ ర్తించు.

క చచ్చిన సాందీపునిసుతుఁ, దెచ్చె జముని నొడిచి యంచు గిరిజధ్వంసున్, మెచ్చుట యా టది యీతని, యిచ్చను మార్పడఁగ పశమె యే వేల్పులకున్ పారి ౯ ౨౪౪

ద్వి మఱుమాట లిచ్చితో మంచిమేలమున, వెఱపు సెడితో మాట వినవొ మార్పడితో

పండితా. పూరా ౧౫౪

పా కాశి ౩ ౨౨.

౩ వ్యత్యస్త మగు, తాఱుమాఱగు

పీ. త్రిజగంబు మార్పడ, ద్రిప్పి ముందటియట్ల యలవడఁ జేయంగ నతఁడె చాలు

. భా రా. అర ౯. ౨౪౯.

గీ వానిఁ గలలోనఁ గానని వనజముఖియు, వాని మార్పడఁ జేర్కొని మానవతియు.

నైష. ౧. ౬౭.

శ్లో. న తా నిశి స్వప్నగతం దదర్శ తం, జగాద గోత్రస్ఖలితే చ కా న తమ్ . .

సం. నైష. ౧. ౩౦.

వ. మదనకోదనంబున పదమదంబు లగునం గంబు లనంగదట్టంబులు మాఱ్పడ నైచు కొని వసు. ౪. ౨౩

౪. పర్యాయము నొందు, వంతుదీఱు, మాఱుపు నొందు.

చం. మదనుఁడు తంపుచేతులను మాఱ్పడ నేయఁగఁ దూపు లైదునుం, ఒది యయి. నైష. ౨. ౯౦.

**మాఱ్పలుకు.** అ. క్రి (మాఱు+పలుకు)

౧. ప్రతిఘటించి మాటాడు, ఎదిరించి పలుకు

చ పలికిన నేమి యన్నియును బల్కు నగున్ మనరాజునొద్ద మాఱ్పలికెడువారు లేరు భా౦ ఉద్యో. ౪ ౪౧౭

౨. మాఱాడు, బదులుచెప్పు.

క. అని దగ్గఱ మాటాడిన, విని మాఱ్పలుకంగ లేక విఘటితకార్యం, డును విగతో పాయుఁడు నై చనియె నతఁడు సతులఁ గెలువ శక్యమె యెందున్.

భోజరా. ౫. ౩౫౩

వి ప్రతివచనము, జవాబు

మ. తెలివిన్ విశ్రవమం దలంచుకొని యాతి థ్యంబుఁ గావించి మాఱ్పలుకుల్ పల్కిన నింతయున్ గలిగె సౌర్వన్ గూడునే యిం కిటన్ ఉ. రా. ౩. ౧౨౪

**మాఱ్పు.** వి. (√మాఱు) అ. వికృతి, రూపాంత రమును గాని అవస్థాంతరమును గాని పొందుట

చ. వాతెరమార్పులా ప్రక్కమార్పులో రసికత లేనిగేస్తురలి రామకు నేమి సుఖంబు దెల్పుమా అహ. ౩. ౧౬.

౨. వినిమయము, ఒకవస్తువు నిచ్చి మతియొకటి పుచ్చుకొనుట. (శ. ర.)

**మాఱొడ్డు=మాఱుపెట్టు.** స. క్రి. (మాఱు+పెట్టు) ఎదుర్కొను, తిరుగఁబాటు సేయు.

క. ఆ ట్టన వేల మహాబలు, పట్టికి సురభుచరదను జపన్నగులను మాఱొడ్డ రనివఁ గర్ణాదుల, కెట్టు నిలువ వచ్చు వాని యెదురం దిరనై. భార ద్రో. ౪. ౨౦౫.

మ. మదనాగంబులు చేతు లెత్తి పఱవన్ మాఱొడ్డ కాపన్నులై, యెదురం గాల్కొని నిల్వ కు క్కడఁగి

కు సం ౧౧. ౬౦౫. కు సం ౧౦ ౫౨౬.

**మాఱ్బలము.** వి వి. (మాఱు+బలము) ఎదిరి సైన్యము, శత్రుబలము.

సీ. మాఱ్బలంబులు సొచ్చి మాతంగములఁ గూల్చి, గజరాజి, గలఁచి తురంగమములఁ, ద్రుంచి. భార. ద్రో. ౨ ౧౩౬.

క నిర్బంధము దుర్మానము, మఱ్బుద్ధికిఁ గాక తగునె దుర్యోధన నీమార్బలమె పొందే వేయులు, దౌర్బల్యము వాయు శుభము దలకొను సంధన్. భార. ఉద్యో. ౩ ౩౨౩. (భా. ల. వ్యా పా.)

**మాఱ్బలయు.** అ. క్రి (మాఱు+బలయు) ప్రతి ఘటించు, ఎదుర్కొను.

శా. నాకేశబృందారకస్తోమం బెన్నఁడుఁ దొల్లి మార్బలవి రెచ్చేఁ దొల్లి పో టొగ్గి సంగ్రామోద్యోగము సేసిరి

కు సం. ౧౦. ౫౦౩.

**మాఱ్మగఁడు.** వి. (మాఱు+మగఁడు) ఉపపతి, ఱంకుమగఁడు.

ఆ. పడుగుఁ జేయువేళఁ బటము లల్లెడువేళఁ, గూడు దినెడువేళఁ గూర్కువేళ, మగనిఁ

గనొ్మఱంగి మార్మగలను గూడు, నింటి
పొరుగు సఖులయిండ్లలోన. హంస. ౨. ౨౪.

చ. .. అసమాస్త్రకేళిలోఁ, బలువైన లాని
మార్మగల పగ్గెలు తగ్గలు చేసి ప్రోలునన్,
గలసి చరింతు రవ్విలువకత్తెలు మారుని
కత్తులో యనన్ ప్రబంధ. ౧౩.

**మార్మలఁగు.** అ. క్రి. (మాఱు+మలఁగు)
వెనుకకు మరలు.

సీ. మగుడ ర మ్మని డాయ మగఁడు చీరినయప్డు
కడియక మార్మలంగెదవు సుమ్ము
నీలా. 3 ౯౪

**మార్మలయు.** అ క్రి మార్కొను (మాఱు + మలయు) ప్రతిఘటించు.

క. వారు పొలిచిరి వృషభం,బులక్రియ
నొండొరులకు మా,ర్మలయుచుఁ దాఁకుచు
నుదాత్తరథసాజ్యులై
భార. ద్రో. ౪. ౧౯౧.

సీ. పులికైనఁ జెలఁగి మార్మలయఁ జాలెడుమేటి
యాఁబోతుఁ గిట్టి యు క్కడఁచె నేఁడు.
హరి. పూ. ౭. ౯. కుక. ౧. ౭౧౩.

**మార్మసలు.** అ. క్రి. (మాఱు+మసలు) అపమార్గమున వర్తించు, తప్పుఁ దిరుగు.

ఉ. మత్తిలవారి మాపడుచు మార్మసలన్
జలికింపఁ బూని నీపెట్టితనాలు మాన వని
చేడ్క నిటాడఁగ నింటనుండి దాఁ, జెట్టునఁ
గోపగించుకొని చెప్పఁడు చేయఁడు లేచి
పోరెు మీ,వెట్టియగారు మంచిగుఱచే
దొరకెం జడు పెట్లు చెప్పుతో. వైజ. ౪. ౧౭.

**మా(ఱుమా)ర్మాట.** వి. (మాఱు + మాట) ప్రతివచనము. జవాబు.

క. తమనిగమంబులు గ్రమ్మరఁ, దమకుం దయ
సేయుటకును దగ వేఁడుకొనం, గమలాక్షు
పదధ్యానము, శమన న్మార్మాట లాడ నైగమిక
యమికిన్. పరమ. ౭ ౧౧౮.

**మా(ఱుమె)ర్మెడ.** వి. (మాఱు+మెడ) మెడఁ
బడిన మెడ, ప్రక్కకు తిరిగిన మెడ.

ఉ. బెబ్బులి గొంతుక్రొ ల్లుచి పెల్లున మార్మెడ
ద్రెళ్ల దాఁటుచున్ ఆము. 3. ౭౦.

వ. అవి గొంతు క్రొన్నెత్తురుకై క్రోలి
విడిచి చన మార్మెడలు వడి మళకవన
దంశమ్ములు మూఁగ మనుచ. ౪ 3౩.

**మార్మొగమిడు.** అ క్రి (మార్మొగము + ఇడు)
విముఖత్వము నొందు

చ గిరివర ఘోరకందరలఁ గేవల నన్యగ కైక
వృత్తిచేఁ, దరలక యున్న సత్కృతము
తప్పనె యప్పురిఁ గేసరుల్ నృకే,సరు లయి
పూర్ణ పౌరుషవిశాలత మించె మహా నృకే
సరిం, బరునకు మార్మొగంబిడమి ధ్రువస్థని
క్రోవ నటల్ ఘటింపమిన్.
వసు. ౫. ౪౫.

**మార్మొగము.** వి (మాఱు + మొగము) పరాఙ్ముఖము, పెడమొగము.

గీ ఆ ప్రభావతి కొంతసే పవ్విధమున, మాన
దుఃఖనిశ్చేష్టిత యైనవెనుక, నున్న రసుచుసు
వేడి విట్టూర్పు నిగుడ, పగలఁ బొగులుచుఁ
బొరలె మార్మొగము గాఁగ.
ప్రభా. ౫. ౧౧౭.

చ అనుటయు రామరామ యని యాయన కర్ణ
యుగంబు మూసికొం,చు వకట యెంతపాత
కపు నుద్దులు వింటి మటంచుఁ జాలుఁ
జాలును మిము నాత్మ లంచు మదిలోఁ
గడు నమ్మిట వింత వాటిలెం, జను మని
మార్మొగం బిడిన సాధ్వస మందుచు వార
లందఱున్. పరమ. 3. ౭౭.

సీ. అరిది మార్గ్గము గానట్టి పూరుషసింహు
లనయంబు మూల నుండని మహేశులు .
బిల్హ. ౧. ౩౦.

మార్గ్గముపెట్టు. అ. క్రి. (మార్గ్గము + పెట్టు) పెడమొగము పెట్టు.

చ. పుడమి హిరణ్యకూన్యదశఁ బొందఁగఁ
జేయక విక్రమంబుఁ జూ, పెడు సమయాన
మార్గ్గముపెట్టక పట్టక దేవతార్థ మె,
ద్యెడ దయ మాలి పుణ్యజనహింసకుఁ
బోవక సంచరించినం, గడిమి నృసింహ
మూర్తి వలిగాఁ దగు నీశ్వర నారసింహు
తోన్ వరాహ. ౧ ౪౨.

మార్గ్గెన. వి (మాఱు + మెన) ప్రాతికూల్యము, వ్యతిరేక భావము.

చ. అలుగఁగ నేల మీరు వసుధాధిపు లెన్న
స్వతంత్రు లై మమున్, వల దనవచ్చు మీ
మనసు వచ్చిన చోటికి నేగుఁ డేఁగినన్,
తెలిసోని నీ ప్రియాంగనకు నీకును మార్గ్గెన
లేక యుండ న, ర్మిలి నుసరంబు గాఁగ నొన
రించెద. నరస. ౫ ౧౪౦.

మా(ఱు మొ)ర్గ్గెరయు. అ. క్రి. (మాఱు + మొరయు) దూఱు మ్రోఁగు, ప్రతి ధ్వనిచేయు.

క. చనుదెంచి రహితవీరులు, నను నాగుహ
లాక్రమించి నడచిరి మొఱయో, యని యని
మిసులకు మొఱచే, వినగతి మార్గ్గెరసె
నద్రి సేనాధ్వనికిన్. కవిక. ౭. ౯౧.

ద్వి. ఘను మ్మని ఘనగిరిగుహాలు మార్గ్గెరయు,
హా మ్మని మ్రోయుచు సుగ్రీవుఁ జూచి ..
ద్వి. హరిశ్చ. పూ. ౭౦౯౪. పం.
ఉ. రా. ౩. ౪౮.

మా(ఱుమ్రో)ర్గ్గ్రియు. అ. క్రి. (మాఱు + మ్రోయు) ప్రతి ధ్వనిచేయు, దూఱుమ్రోగు.

మ. అవనీభాగము కంప మొందఁగ నవేకా
క్షౌహిణుల్ గొల్వఁగా, జవనాశ్వ ద్విర
దాది ఘోషములు దిక్చక్రంబు మార్గ్రెయఁ
భూధపుళిల్లస్ జని రాక్షసులకు .
ఉ. రా. ౫. ౨౬౫.

మా(ఱువె)ర్వెట్టు. స. క్రి. (మాఱు + పెట్టు) ప్రతిఘటించు, ఎదుర్కొను.

మ. అతు లోత్సాహముతోడ దానవబలం
బార్వంగ దోర్వీర్యదృప్తుఁడై భోరన వచ్చి
తాఁకె నమరుల్ ఛేదిల్లి భీతిన్ హతా, హతి
దూర్వెట్టక పాఱఁ దారకుఁడు గోపానక్తి
వీరానురా, వ్యితుఁడై యొక్కఁడి దంచు
తోయుచు మహావీరుం గుమారు న్మడిన్.
కు సం ౧౨. ౯౧౦.

మార్ష్టి. సం. వి ఇ. స్త్రీ శుభ్రము చేయుటః పవిత్రము చేయుట (రూ మార్ష్ణి. శ. ర)

మాఱకము. వి (√మాఱు.) ౧. వినిమయము, ఒకవస్తువు నిచ్చి వేఱొక వస్తువును పుచ్చుకొనుట.

సీ. మాఱక మనఁగను మాఱుంగడ యనంగ విని
మయనాభిధ వెలయుచుండు
ఆం. భా. ౭. ౨౬౭.

౨. వినిమయము చేయఁ గోరువాడు వినిమయము నంగీకరించుట కిచ్చులాభము.

(వ్యవ.) ఇప్పుడు రూపాయకు అణా మాఱక మిచ్చినను చిల్లర దొరకుట లేదు.

మాఱట. విశే. (√మాఱు) ప్రతిరూపము, ప్రతి.

గీ. ధర్మదేవతమాఱటతనువు నూఁక, యీయధిక్షితి
రమకై వ్యలకాయ మింక, యొఱఁగి రాడ

యమ్మహితయోగీశ్వరుఁడు స్వమిాద్యయోగ
బలంబున నితని, గలసె.

భార. ఆశ్ర. ౨ 88.

ఉ. సవ్యక నవ్వుసెమ్మెగమున న్నిగుడారదు
వింతకాంతియున్, మవ్వపుఁగ్రొమ్మెఱుంగు
ఱుంగులకు మాఱటవైనకటాక్ష రోచులుం,
జివ్వలు చేసిచేసి ఉ హరి ౫. ౧౩౯,

ఆ అపుడు కోఁతిమిన్న యసదురూపునఁ జని,
ప్రోలిచాగి కానిమూలగవను, మాఱి
యచటఁ గాంచె మాఱటమిత్తియో, యనఁగ
బరగులంకిణిని జెలంగి

అచ్చ రా సుం ౪

మాఱటనోరిది. విశే (మాఱట+నోరు+అది)
ఆడినమాటలనే ఆడునది, చెప్పినదానినే మగల
చెప్పునది

ఉ ఆఱడిఁ బోకయున్ ఫలము నందుటయుం
గని పల్కనేరమిన్, మాఱటనోరిదాన నయి
మాటలు చిత్తమునందు నిల్పకేఁ, గాఱులు
ప్రేలెదన్ భార ఉద్యో ౩ ౧౦౪

మాఱుమ్మ(ము). వి (మాఱు+అమ్మ) వేఁట
కుపయోగించుసాధన విశేషము

సీ. పంకులు గుదియలు వలత్రాళ్లు ప్రోకులు
బిసలు మాఱుమ్మలు పెద్దదిండ్లు

శుక. ౧. ౧౬౫

సీ తెరలు నుగ్గంబులు దీమముల్ మాఱుమ
ల్మొకదారికత్తులు మెకముబోను, లొఱపైన
గోడ్డంన్లు మెఱుఁగుబల్లెంబులు

రుక్మాం ౩ ౭౦.

మాఱాకెత్తు. అ క్రి (మాఱాకు+ఎత్తు)
మాఱాకు వేయు

క అని నగుచు మగువ లందఱు, పనిసెపమున
నొక్క రొకరు పఱచిన లజ్జానవతాస్య
యగుచు నంగన, మనమున నునుసిగ్గు జేతి
మాఱాకెత్తెన్. కేం. పంచ ౪. ౩౯౯.

(ఇట అతిశయించు అని భావము.)

మాఱాకు. వి. (మాఱు + ఆకు) రెండవయాకు-
(ఉపఘ్నము అని శ. ర.)

శా పాదద్వంద్వము నేల మోపి పవనున్
బంధించి పంచేంద్రియో, న్మాదంబుం బరి
మార్చి బుద్ధిలతకు న్మాఱాకు హత్తించి
ని, ష్ఖేదబ్రహ్మపదావలంబనరతిం గ్రీడించు
యోగీంద్రుమ, ర్యాదన్ నక్రము విక్రమించెఁ
గరిపాదాక్రాంతినిర్వక్రమై

భాగ ౮ ౬౫

(బుద్ధిలతకున్ మాఱాకుహత్తించి = బుద్ధిలతను
పల్లవింపఁ జేసి అనిభావము)

గీ రతులఁ బోలయించె నాశ(రా)జవదన, నతి
శయప్రీతిలతిక మాఱాకు విడఁగ

(మాఱాకులిడు = చిగురొత్తు, పల్లవించు)

శా వి త్తజ్ఞానము పాదు చిత్తము భవావేశంబు
రక్షాంబువుల్, మ త్తత్వంబు తదంకురం
బన్యతముల్ మాఱాకు లత్యంతదు ర్వృత్తుల్
పండ్లు కాశీ. శ. ౧౫.

మాఱాట. వి (√మాఱు) ఎదురాడుట, ప్రతి
కూలముగా మాటలాడుట

గీ. కర్ణునకుఁ జేయవలసిన గారవమున, గొంతి
యింకను శ్రాద్ధ మత్యంతవిభవ, ముల్ల
సిల్లంగఁ జేయఁగా కుచితనిరతి, యావిధము
నకు మాఱాటనూవె యొగ్గు.

భార ఆశ్ర ౧. ౧౧౬.

మాఱా(రా)టము. వి (√మాఱు) కలహము.

సీ మనకు వేల్పులకును మాఱాటములు రాక
పంచిపెట్టెద నని పడఁతి వూనె .

భాగ ౮. ౩౭౦.

(శ. ర. పా. 'మందటలేకుండ' ముద్రిపా.)

**మాఱాడు.** అ. క్రి. (మాఱు + ఆడు.) ౧. బదులు చెప్పు, మాఱుపలుకు.

క. వేఱొ రయోత్తరణి నామది, మీఱినతాపంబు
చెదరదు మానేత్రుణ నన్, దేవి కృపం గనఁ
గాను మీఁక, మాఱాడకు మనినఁ గుపిత
మానస యగుచున్. చెన్న. ౫. ౧౩౧.

౨. ఎదురు చెప్పు, ప్రతికూలముగ మాటలాడు.

క. కేతొక తెలుఁగున నొరులకు, మాఱాడక
యునికి లెస్స మనుజేంద్రుకడన్ .
భార. విరా ౧. ౧౨౭.

క. సాగర సుబుద్ధితోడను, మా గురుపుత్రకునిఁ
దెమ్మ మాఱాడిన నీ, వాగడ మవుదువు
భాగ ౧౦. పూ. ౧౪౧౬.

క. మునుపటివలెఁ, జదివిన మాఱాడ నీకుఁ
జనునే మాతో, నిది యేమి యనిన
దశ. ౪. ౧౪౯.

**మాఱు.** స. క్రి. (క. మాఱు. త. మాఱ్ఱు) ౧. ఎదుర్కొను, ప్రతిఘటించు.

సీ. . బలరూఢి నెందు, మా ఱుద్ది లే కొప్పు
మాఱుఁభీమోద్ధతి ప్రబలంగఁ దా రాసరణి
మెలంగ . రాఘవ ౨. ౧౯.

(భారతార్థమున.)

ఆ. ఔర! వీనిమోహనాకారరేఖలే, మారు
మాఱు హరికుమారు మాఱు, వెల్లదమ్మి
తొగల వీనికన్నోయితీ, రేపుమాపు రాపు
రేపు మాపు. సారంగ. ౨. ౪౧.

౨. చంపు.

సీ. . బలరూఢి నెందు, మాఱుద్ది లే కొప్పు
మాఱుఁభీమోద్ధతి ప్రబలంగఁ దారాసరణి
మెలంగ రాఘవ. ౨. ౧౯

(రామాయణార్థమున)

అ. క్రి. పోటురూపముకొందు.

గీ. ప్రబలబలగర్వదుర్వారబహుసుపర్వ, పూర్వ
గీర్వాణభుజదండభూరిసార, వితతమందర
మంథాన వివలనముల, సలిలనిధి మాఱొ
సంరంభసంభ్రమమున హర. ౬. ౬౦.

క్రి. విశే. ప్రతికూలముగా, ఎదురుగా.

క. బిడ్డలు పెంటరు నీ కట, గొడ్డంబులు సేయ
కెల్లకోదండ్రుము మా, తోడ్డారింపక నడ
తురె, రొద్దము గా కున్నదే మృగేక్షణ
యింటన్. భాగ. ౮. ౪౬౩.

వి. (దీనికి హల్లు పర మగునపు డుత్వలోపము
వైకల్పికముగా నగును) ౧. ఎదురుమాట,
ప్రతికూలవాక్యము.

ఆ అనిన మాఱుపలుక నలికి యయ్యాకువా,
రియ్యకొనిరోఁ బోవ నింతలోనఁ, బద్మన
యనుఁ దతనిపయనంబుఁ దూఁగింపు, మనుచు
నంబితోడ నానతిచ్చె. ఆము. ౨. ౯౪.

౨. ప్రతిక్రియ

చ. అక్కురబిభుండును మాఱు దలంప
లేనికొం, దలమునఁ బొందుపొందమునఁ
దానును రూపతి యుండె వెల్లనై . .
భార. భీష్మ. ౨. ౧౫౭.

మ. అనివార్యస్థితిఁ బంప్రవట్టినిరుపాయం బైన
కాలంబు వచ్చె నుపాంతంబున మాఱు దీనికి
మదిం జింతింపు ధాత్రీశ్వరా ...
భాగ. ౧. ౩౧౦.

సీ. .. దేవనదీసూనుఁ, డియ్యస్త్రిమునకు మా
ఱెఱుఁగఁగాన ...
భారా. విరా. ౫. ౨౧౦.

౩. ఎదిరి, ప్రతిపక్షుఁడు.

క. తనమాఱే యని గంగా, తనయు శిఖండియు
వధించె .. భార. ద్రో. ౫. ౩౬౬.

ఉ. ఒక్కటెట్టినాఁ, డుక్కఁ దీరినట్లు కౌ
శాగ్రశరీరముతోడ మీఱు నే, దిక్కున

మాఱు లేక బలదేవుఁ డనం బలు పేరు
దాల్చెను. శుక. ౨. ౩౫౪.

గీ. అవనియందును యుద్ధవిహారమునకు, మాఱు
లేకయ విహరించె మనుజవిభుఁడు ..
రాఘవ. ౧. ౮.

(హిరణ్యాక్షుఁడు) మ. సమరాకాంక్షఁ గ్రహాను
ముఖ్యపదము ల్పర్బించి మా ర్లేమికిన్ .
దశా. ౩. ౧౯౦.

౪. పర్యాయము, తడవ.

క. కడగాలు పట్టి వానిని, మడవక పవనజుఁడు
మాఱుమాఱులు వీఁచెన్
భార. ఆది. ౬. ౨౧౪.

చ. జగ మెఱుఁగంగ ద్రోణు నని జంపుటకై
సృజియించె ధాత న, న్మగఁటిమి గాఁగ
దీనిఁ బలుమాఱు నసం బని లేదు .
భార. భీష్మ. ౨. ౧౪.

చ. ఇరువదియొక్కమాఱు ధరణీశ్వరులం బరి
మార్చి ఉ. హరి ౪. ౧౨౨.

మ. . కంజాతాక్షుచేఁ బెక్కుమా, ర్లనిలో
నొచ్చి రసాతలస్థు లయి రయ్యా దానవుల్
రాఘవా ఉ. రా. ౨. ౧౦౬.

౫. రెండవతూరి పెట్టఁ దగినభోజ్యపదార్థము,
రెండవసారి వడ్డించునాహారము.

ఉ. మీఱినయున్నశైలములమీఁద సమగ్రఘృత
ప్రవాహముల్, పాఱఁగ యానపాత్రముల
భంగి నపూపము లొప్పె నెవ్వరున్ మా ఱిడ
నీక కన్దనియుమాత్రఁగఁ బాత్రలయందు
నిండి రై, వాకెఁ బదార్థసంఘములు
భోజరా. ౪. ౧౦౨.

ఉ. వంచన వేల్పుటెంకి కిటు వచ్చి యపాం
తమునందు ముందటం, గంచముఁ బెట్టు
కొన్నయది కర్బురయుగ్మము మాఱు పెట్ట
నే, తెంచుచున్నవాఁడు మన దేవర
విష్ణుఁడు. హర. ౬. ౧౨౫.

సీ. అడుగకమున్న మా ఱిడఁ దెచ్చి యాతఁ
డే,మాత్రంబు వల దన మగుడు సిగ్గు .
దశా. ౬. ౩౩.

ఉ. ఏణవిలోచన బంతి పట్టి మా, ర్వట్టఁగ
దానివ క్త్రి శశిబింబముఁ బోదఁగ నోడి ..
శైవ. ౬. ౧౩౨.

విశే ౧ ప్రతి, బదులు.

సీ మదిఁ దల్లితండ్రులమాఱుగాఁ గాని జను,
లనిశంబు భక్తి సేయంగ నెగడి
• భారా. విరా. ౨. ౨౧౬.

ఆ పుట్టినింటి కేను బోయి యొక్కించుక,
యూఁడిల్లి వత్తు నుచిద నీవు, వింతననము
లేక విభునకుఁ బ్రియము నా, మాఱుగా
నొనర్చి మనుము నెమ్మి
హరి. పూ. ౧. ౧౪౦.

ద్వి. వేలుదేవతలఁ గావింప నింద్రునకు,
మాఱింద్రుఁ గల్పింప మదిఁ దలంచుటయు.
రం రా. బాల. ౫౮. పొ. ౧౯ పం

క తనకుం గార్యము గలిగినఁ, దనమాఱుగ
ధర్మశాస్త్రత త్త్వార్థవిధి, జ్ఞానిఁ బ్రాడ్వి
వాకు న త్తము, జననాథుఁడు పనుపవలయు
సభ్యులకడకున్ విజ్ఞా. ౩. ౪.

౨. మఱియొకటి, అన్యము.

గీ. మాఱుమావిని లేకుండ మడిసి రల్ల, వారు
భార. శల్య. ౨. ౧౧.

క. కేటోకవిలఁ గాని విమతుఁడు, దూఱఁగ
హరిమేన నాఁటెఁ దొమ్మిది యమ్ముల్,
మాటొను బదింటఁ బొదిచెం, గాఱియగా
మఱియుఁ బఱచె గమిగొనఁ దూపుల్.
హరి. ఉ. ౧. ౧౫౪.

చ. కలికిపిపాళినవ్వు లెసఁగ న్వటుధూర్తులు
గొండ తొండొరుం, దలకొన గొచ్చరించి
తమదండపుఁగోలల సన్న మాఱుగోఁ,చులు
వెసఁ బుచ్చివైచి.   ప్రభా. ౧. ౧౦౨.

గీ. మాడ యిచ్చెద నన్నచోఁ గూడు పెట్టు,
రింతపచనస్థలంబైన నీయ రిట్టి, మాలకొంపకు
వచ్చితిమాఱు లేక, గంజి వోయుదురే
యిందుఁ గలుగువారు.

శుక. ౩ ౧౮౨ భార. శల్య. ౨. ౨౫౯.

౩ సమానము, పాటి.

ఉ. పాటినఁ జూచి కౌరవనృపాలుఁడు మాత
తనూజాతోడ నీ, కాటియ మద్భలంబునకుఁ
గాఁ దగునే వివిధాస్త్ర సంపదన్, మిాటిన
నీవె సూడఁగ నమేయపరాక్రమ నీకుఁ బాండ
వుల్, మాటె తలంప నీదగుబలంబును
జేవయుఁ జూపు మిత్తతిన్.

భార. కర్ణ. ౩ ౧౦.

మ. భూరిస్వమ్మదలీల న్వ్యాలసిల్లి సత్కృతి
జగన్మాన్య ప్రభావంబునన్, మదవాగంబును
బోలెఁ గ్రాలవలదా మాఱొందు లే కున్న
తిన్   క. సం. ౧. ౪౦.

గీ. ఒప్పులే రేఖల మాఱు లేకుండ బ్రహ్మ, యంగ
కంబులు చేసి ...   విక్ర. ౭. ౪౮.

జ. మార్రాటము, మారు(ఱు)గాల్లు, మార్కొను, మార్కొలు, మార్చు2, మార్తుఁడు, మార్పడు, మార్పలుకు, మార్పు, మార్పెట్టు, మార్పలము, మార్పులయు, మార్మగఁడు, మార్మలఁగు, మార్మలయు, మార్మసలు, మార్మాట, మార్మెడ, మార్మొగమిడు, మార్మొగము, మార్మొగముపెట్టు, మార్మొన, మార్మొరయు, మార్మ్రోయు, మార్వెట్టు, మాఱాకము, మాఱట, మాఱటకోరిది, మాఱమ్మ, మాఱాకు, మాఱాకత్తు, మాఱాట, మాఱాటము, మాఱాడు, మాఱుఁగాలు, మాఱుఁదల్లి, మాఱుకోను, మాఱుగడ, మాఱుచు, మాఱుదల, మాఱునీళ్లు, మాఱుపడు, మాఱుపలుచు, మాఱుపలుకు, మాఱుపాట, మాఱుపు, మాఱుపెట్టు, మాఱుబేరగాఁడు, మాఱుబేరము, మాఱుమగఁడు, మాఱుమనువు, మాఱుమనువుది, మాఱుమలయు, మాఱుమసలు, మాఱుమాట, మాఱుమాల, మాఱుమొగమిడు, మాఱుమొగముపెట్టు, మాఱుమొగముపడు, మాఱుమొగము సేయు, మాఱుమ్రోఁత, మాఱుమ్రోయు, మాఱురూపు, మాఱురూపుపడు, మాఱుబీడు, మాఱుసేఁత, మాఱుసేయు, మాఱొడ్డనము, మాఱొడ్డాడు, మాఱొడ్డు

మాఱుఁగాలు. వి (మాఱు+కాలు) కృత్రిమ పాదము, కాలికి ప్రతియగు సువర్ణాది నిర్మిత పాదము.

గీ. కాంత యొక్కర్తు మాఁపునఁ గండ లిచ్చె,
మాఱుఁగా లిచ్చె నొకసుధామధురవాణి,
అలన యొక్కర్తు నోరితాళంబు లిచ్చె.
శక్తిజాతర సద్భక్తి శక్తి లెసఁగ.

పాండు. ౩. ౪౪.

మాఱుఁదల్లి. వి. (మాఱు+తల్లి) సవతితల్లి.

సీ. చుట్టలుండొరపట్టి పట్టంపురాణి యౌ, మాని
నీమణులకు మాఱుతల్లి .

చంద్రా. ౩. ౧౦౧.

గీ. ముప్పురను లగడము సేయ సవ్యథంబు, సైఁప
లేక యొకప్పుడు శమనుఁ దలిగి, చరణ
మమ్మాఱుఁదల్లిపైఁ జాచెఁ దన్ను ...

హరి. పూ. ౧. ౧౪౪.

గీ. మాలకొరి దాసి సైరంధ్రి మాఱుఁదల్లి, మగఁడు
విడిచిన సతి దూతి మంత్రసాని, కోగురా

లాఁడు లమ్మిడికోటి విధవఁ, గలసి వర్తించు
నదిజారగా నెఱుంగు.
శై. భా. ౩. ౩౦. హ. వి. పూ. ౨. ౧౪౦.

మాఱుకొను = మార్కొను. అ. క్రి. స. క్రి. ఎదుర్కొను.

ఆ. సాదు బాహుబలమునకు మాఱుకొనఁ జాలు,
భుజబలంబు గలిగి పోక చిక్కఁ, జెనఁగి
భార. విరా. ౨. ౨౮౩.

ఉ. ఊటుటచెయ్వులం దివుట లూరఁగ దర్పము
లొండొకంటికిన్, మాఱుకొనంగ మున్గనిన
మంజులసౌఖ్యరసంబు నిక్కలం, దాఱుచు.
హరి. ఉ. ౪. ౧౮౨.

క. దురమున నీ కా రాముఁ గుఱతోడ న్మాఱు
కొని గెలువరాదు సుమీ ...
అచ్చ. రా. యు. ౪౬౩.

క. అరదంబురవము సెలఁగగ, శరములు వాయు
జనివిూఁద సాంద్రముగ వెసం, గురియుచు
నడరెడు భీష్ముని, సరభసముగ మాఱుకొనిరొ
సాత్యకి గడిమిన్. భార. భీష్మ. ౨. ౨౨౪.

గీ. పాండవుల సైన్యమును సముద్దండలీల, మాఱు
కొనె . భార. శల్య. ౧. ౩౭౫.

గీ. మలసి బింకెలు సైచుచు మాఱుకొనిన,
వృషభములభంగి నక్కురువృషభు లిట్లు,
సమదగతిఁ జేరు నెడఁ జూచి రమరులు .
భార. విరా. ౫. ౧౬౫.

గీ. మాఱుకొన్న విదర్భుకుఁ బాఱఁదోలి .
విక్ర. ౪. ౧౧౨. సైమ. ౭. ౧౩.

మాఱుగడ. వి. (√మాఱు) మాఱుతము, వినిమయము.

సీ. మాఱుక మనఁగను మాఱుగడ యనంగ, విని
మయసాభిధ వెలయుచుండు ...
ఆం. భా. ౨. ౨౬౪.

మాఱుచే = మార్చు². స. క్రి. (√మాఱు) వినిమయము చేయు.

మాఱుదల. వి. (√మాఱు) మాఱుట, మాఱుపాటు. (శ. ర.)

మాఱునీళ్లు. వి. బ. (మాఱు+నీళ్లు) స్త్రీలు ఋతుస్నాన మైనమఱునాఁడు చేయుస్నానము. (శ. ర. వా.)

మాఱుపడు. అ. క్రి. (మాఱు+పడు స్వార్థమున.) ౧. ఎదిరించు, మాఱుకొను.

ఉ. మాఱుపడంగలేనియసమర్థుల నుత్తుల నస్త్ర
విద్యలం, దేఱనిపిన్నపాపల వధించె నిశీ
ధమునందుఁ గ్రూరుఁడై
భాగ. ౧. ౧౫౪.

ద్వి. మగఁడు నాలుమ నభిమానంబు విడిచి,
వెంగములు వగులంగ మొత్తులాడుదురె, పతి
తోడ సతి మాఱుపడెనేని పుణ్య, గతి కేఁగ
కది నరకంబునఁ గూలు.
ద్వి. హరిశ్చ. ఉ. ౧౧౪౦ పం.

౨. తాఱుమాఱగు, వ్యత్యస్తమగు

గీ. ఆఁడుబిడ్డ సహోదరుఁ డఖిలగుణాస, మగ్రుఁ
డుగఁ గోరుఁ గావున మదిఁ దలంచి, మనము
చరువులు రెండును మాఱుపడఁగ, నార
గింతము మంచిది యట్టులైన ..
వి. పు. ౬. ౧౨౯.

౩. భేదపడు, వ్యతిరేకభావము కలిగియుండు.

క. ఓ కోఁడ నీకు మది నే, మాఱును గుందంగ
నేల మానినిమణికిన్, దేటి కనుంగొనుచో
మఱి, మాఱుపడం గలరెరమొట్టిమున్నె లైనన్.
అచ్చ. రా. అర. ౧౦౪.

౪. ప్రమాదపడు, పొరపడు.

గీ. అతఁడవు నీవ కావె మహాత్మ కేఁడు, మాఱు
పడి యొగ్గ చేసితి మఱవ వలయు ...

భాగ. ౧౦. ఉ. ౯౮.

**మాఱుపఱుచు.** స. క్రి. (√ మాఱుపడు) తాఱుమాఱుచేయు.

ద్వి. పసిఁడికుండల మాఱుపఱచుపాలిండ్లు .

అ. మ. క. ౫. ౨౪౩. పా. ౩. పం.

(ఇట తిరస్కరించు అని భావము.)

**మాఱుప(వ)లుకు.** అ. క్రి. (మాఱు + పలుకు) ఎదురుచెప్పు, ప్రతికూలముగా మాటలాడు.

సీ. పతికి సెప్పడు మాఱుపలుక వీవు.

కాశీ ౨. ౪౨.

**మాఱుపాటు.** వి. (మాఱు + పాటు) మాఱు పడుట, వ్యత్యాసము. (శ. ర.)

**మాఱుపు = మార్పు.** వి (√ మాఱు) ౧ వర్తనము, మాఱుట.

చ. విలాసముల్, మననునకున్ సుఖాస్ప
దము మాఱుపు లందినమేను లందు రంజనులకుఁ
గాఢభోగముల జన్మఫలంబునఁ బొల్తు రంగ
నల్  కు. సం. ౩. ౯౫.

౨. వినిమయము, ఒకవస్తువు నిచ్చి మఱియొకటి పుచ్చుకొనుట. (శ. ర)

**మాఱుపెట్టు = మార్పెట్టు.** అ. క్రి. (మాఱు + పెట్టు) ప్రతిఘటించు, ఎదిరించు. (శ. ర.)

**మాఱుబేరగాఁడు.** వి. (మాఱుబేరము + కాఁడు) మాఱుబేరము చేయువాఁడు.

(వ్యవ.) నే నీయావును మాఱుబేరగానియొద్ద
నాలుగురూపాయలు లాభ మిచ్చి కొంటిని.

**మాఱుబేరము.** వి. (మాఱు + బేరము) ఒకవస్తువును గొని దానిని దిరిగి లాభమునకై విక్రయించుట.

సీ. గుట్టెఱుంగు డి దేల గురులతో గుటగుటల్,
బిగియక చనఁగదే బిసరుహాక్షి, కుపిగింపు
లిడ కేఁగు కొన్నయంగడిలోన, మాఱుబేరము
సేత మంజువాణి.  చంద్రా. ౬. ౧౩౫.

**మాఱుమగఁడు.** వి. (మాఱు + మగఁడు) ఉప పతి, లంకుమగఁడు.

గీ. వదలంక్రొమ్ముడి యలరులవానఁ గురియు, హీర
మణిదీప్తి యుయ్యాల లాడించుండ, మగువయుఁ
బ్రభావలీలల మాఱుమగని, గంతుసామ్రాజ్య
లక్ష్మికిఁ గర్తఁ జేసె.  విక్ర ౭. ౩౯.

గీ. అప్పు డాకాఁపువలిగుబ్బలాండ్రు పధిక,
లంపురు మనమునురొక్కొన్నయమ్మ పురులోన,
కాఁడు పతి యుంచు నిర్భరరతులఁ దేల,
మందిరమునకుఁ దెచ్చిరి మాఱుమగల.

శుక. ౨. ౩౪౩

**మాఱుమనువు.** వి. (మాఱు + మనువు) ఆఁడుది రెండవసారి చేసికొనువివాహము (శ. ర)

మాఱుమనువుపోవు = భర్తను విడిచి పరుని వరించిపోవు.

చ. అమరగురుండు దేవపతియాగము సాంగ
ముగా నొనర్చి సంభ్రమమున నెల్లవారు
బహుమానము చేయఁగ చేక్కతో నిజా,
శ్రమమున కేఁగుదెంచి వ్యభిచారితనంబునఁ
జంద్రువెంట మా, ఱుమనువు తార వోవు
టయు కోసి నిరంతరదుఃఖితాత్ముఁ డై.

వి. పు. ౬. ౩౪.

**మాఱుమనువుది.** వి. (మాఱుమనువు + అది) రెండవసారి వివాహము చేసికొనినస్త్రీ.

గీ. మనును దిధిషువుగా మాఱుమనువుది యన.

ఆం. భా. ౨. ౧౧౦.

**మాఱుమలయు.** అ. క్రి. (మాఱు + మలయు) ఎదిరించు, ఢీకొను, ప్రతిఘటించు.

సీ. మదురవు గాని మాఱుమలయుశాకారుఁబోలు,
నొడివి కొమ్ములఁ బట్టి మడఁగఁ ద్రోచి .
హరి. పూ. ౮. ౧౫౫.

సీ. నిండుపున్నమనాఁడు గండరించినచంద్రమండల
శ్రీలతో మాఱుమలయు, భద్రవిద్యోతశాత
పత్రంబు గ్రాలుచు భాగ. ౬. ౨౬౦.

గీ. సరసిజాయతలోచన జఘనయుగము, మరుని
రథచక్రములతోడ మాఱుమలయు
వి. పు. ౨. ౨౯౬.

(ఇట సాదృశ్యవాచకము)

౨. ఎదురాడు, ప్రతికూలముగా మాటాడు, సాకూతముగా మాటాడు.

ఆ. పరులఁ గన్న చంకపాపని ముద్దాడు, గోద
నిక్కి చూచుఁ గొప్పు దీర్చు, మాఱుమలయు
నత్తమామలతో లేని, కిటుకు పెట్టి బంధకీవ
ధూటి హై. భా. ౩ ౨౯.

వ వెలయడుగువిటులతో విటీతతి మాఱు
మలయు ల. వి. ౮. ౫౪.

మాఱుమసలు. అ. క్రి. (మాఱు + మసలు)

౧. తప్పఁదిరుగు, అపమార్గమున వర్తించు.

గీ. మఱఁది యనుచుట్టరికమున మాఱుమసల,
వలదు దుర్మార్గులైన సెవ్వారి నైన
దశా. ౩ ౫౩.

౨. ఎదిరించు.

గీ. సరిగ నెదిరించె నసుమాట చనును మాఱు,
మసలె ననఁగను . ఆం. భా ౩. ౧౧౨.

౩. ప్రతికూలించు.

గీ. వారి కే లాఘవము వచ్చె వనిత యెంత,
మాఱుమసలెదు వట్టిసేమములు చాలు
వసు. ౨. ౧౩౪.

మాఱుమాట. వి. (మాఱు+మాట) ప్రతివచనము, జవాబు.

సీ. అదలించి యే మించనాడిన నెంత లే, దను
గాని మాఱుమాటాడ వెఱచు . .
విప్ర. ౮. ౬౪.

గీ. హర్ష మెసఁగుచు మాఱుమాటాడ వెఱచి.
దశా. ౧. ౫౮.

సీ మాఱు మాటనఁగను మఱుమాటనంగను, బదు
లుమాటనఁ బ్రతివాక్య మొప్పు .
ఆం. భా. ౧. ౧౧౮.

మాఱుమూల. వి (మాఱు+మూల.) ౧. విదిక్కు, రెండుదిక్కులనడిమి భాగము. (చి. ని ఎదురుమూల శ. ర)

౨ ఎక్కువవాడుక లేనిత్రావు, అప్రతిహతమైన ప్రదేశము

(వ్యవ) ౧. ఆతనియిల్లు సందులో ఒకమాఱుమూల నున్నది. ౨. ఆకవి మాఱుమూల పదములు ప్రయోగించును.

మాఱు మొగమిడు. అ. క్రి. (మాఱుమొగము+ఇడు) పరాఙ్ముఖుఁడగు; పెడమొగము పెట్టు.

క. అవగుణగణసేవధులగు, ధవళాక్షుల కీడు
దలఁచి దారాదరణ, వ్యవహృతికి మాఱు
మొగమిడి, యవుగా దని కొన్నిమాటలాడిన
నతనిన్. పాండు. ౫. ౨౦౩.

మాఱు మొగముపెట్టు. అ. క్రి. (మాఱు మొగము+పెట్టు) పరాఙ్ముఖుఁడగు; పెడమొగముపెట్టు, అనాదరముచేయు.

(వ్యవ) అతఁడు నాయెడ మాఱుమొగముపెట్టినాఁడు

మాఱు మొగముపడు. అ. క్రి. (మాఱు మొగము+పడు) పరాఙ్ముఖమగు; పెడమొగము పెట్టు.

గీ. బీఱువోయి రథ్యంబులు మాఱుమొగము, వడిన దా నొచ్చియుండియుఁ దడవి కౌరి, సూఱుకొనఁజేవి తఱిమిన

భార. భీష్మ. ౩. ౫౯౪.

ఆ. ఒక్కతలకు మొగములు రెండైన, పగిదిఁ దలలు మాఱుమొగమువడఁగ, గేలి మేను మేను మాఱు గాఢాలింగ, నంబు సేవి రంగనయుఁ బ్రియుండు. కు సం. ౯. ౩౪౭.

మాఱుమొగముసేయు. అ. క్రి. (మాఱు మొగము + చేయు) వెనుకమొగమగు, పరాఙ్ముఖుడగు

ఉ. రాకనుధాంశు మండలమురాకిను మాఱు మొగంబుసేయుచో సైమ. ౨ ౧౩౪.

మాఱుమ్రోఁత. వి (మాఱు + మ్రోఁత) ప్రతిధ్వని. (శ. ర. ప్రా.)

మాఱుమ్రోయు. అ క్రి (మాఱు+మ్రోయు) ప్రతిధ్వనిచేయు.

సీ మముఁ జొచ్చినా రెఱుంగుము నుమ్ము రిపు లని, మొఱయుంచుగతి మాఱుమ్రోసె గిరులు

కవిక. ౨. ౭౩

మాఱురూపు. వి (మాఱు + రూపు) రూపాంతరము, వేఱొక రూపము.

(చూ. మాఱురూపువడు )

మాఱురూపువడు. అ క్రి. (మాఱురూపు + పడు) రూపాంతరము నొందు, వేఱొక రూపము దాల్చు.)

చ. అది యటు లుండె నీతను వసంతబిలాఢ్యము బిక్కచిక్కియు, న్నది యిది మాఱురూపు వడి యద్దిర యిద్దురవస్థ యేక్రియం, గది సెరా . శుక. ౩. ౪౦౦.

మాఱువీడు. వి. పొ. (మాఱు + వీడు) శత్రు సైన్యము.

సీ. .. మాఱువీటు వింగిలి వచ్చు, మగలతెల్ల కేను మగిడింతు ... కు. సం. ౧౧. ౬౧౦.

మాఱుసేఁత. వి. (√మాఱుసేయు) ప్రతిక్రియ.

క. మనరాజు విదూమతుఁ గాని, మనమేఖల మోసపుచ్చె మన మిత్రు డాబాఁ, పని మాఱు సేఁత యిది రొంత, పనియే వెల్పెట్ట వలదె పార్థివతిలకున్. కేయూర. ౪. ౧౭౫.

మాఱుసేయు. అ. క్రి (మాఱు + చేయు) ప్రతిచేయు, ఒకరు చేసినపనికి బదులుగా దానికి తగినపని చేయు.

గీ. మన్మథావేశ విలసనమహిమ నెఱపు, తపవిఁగని సాదుకేఁగినఁ దలపాలాన, నిలువ దనుమాట నిజమయ్యె నేఁడటంచు, మగుడ నవ్వుచుఁ జేఁతకు మాఱుసేసె కళా. ౩. ౩౭.

మాఱొడ్డనము. వి (మాఱు + ఒడ్డనము) ప్రతి వ్యూహము, శత్రువులు పన్నిన మొగ్గరమునకు ప్రతిగా పన్నినమొగ్గరము.

క. అనురూపము లగుమాఱొడ్డనముల్ ప్రస్ఫురిత ములు దృఢంబులుగాఁ దీర్చిరఁ గాక కౌలం గగునే, యని మెఱన కేర్పతిచేఁ గౌరవాన్వయ ముఖ్యా . భార. భీష్మ. ౨. ౨౯.

మాఱొడ్డాడు. అ. క్రి. (మాఱొడ్డు + ఆడు ప్వార్థమున) ప్రతిఘటించు, ఎదిరించు.

క. కసవు దినుఁ గూడు దిన్నని, కినరదు బిరు విడిన మోయుఁ గర్సనమునకున్, వినువదు మాఱొడ్డాడదు, పసరమునకు సరిరెు మనుజ పశు వెప్పుటికిన్. వేం. పంచ. ౧. ౧౩౯.

మాఱొడ్డు. అ. క్రి. (మాఱు + ఒడ్డు) ప్రతిఘటించు; ఎదురుచెప్పు.

క. బిడ్డలు మగలును భ్రాతలు, వడ్డము చని వల దనంగ నటుదలఁ దని మా, ఱొడ్డుచు జగ దీశ్వరునకు, జడ్డన వన్నంబు గొనుచుఁ జని రానుదకుల్. భాగ. ౧౦. పూ. ౭౫౯.

సీ. ఉద్దండరీతి మాఱొడ్డి నిలిచె హర. ౩ ౪౪.

క. బిడ్డలపేదరికంబున, కడ్డంబై పెంచుకొనుచు నధిపునకును మా, ఱొడ్డక సద్గుణ గావున, నొడ్డారము సేయ కెలమి నుండె నృపాలా కుచేల ౧. ౩౭.

వి. ప్రతిఘటనము, అడ్డుపాటు.

మ. పరిహాసంబునఁ దేలి భృత్యులరయిదం బ్రహ్లాదముం బొందుభూ, వరు నాజ్ఞం జన కీగి మెచ్చరు పని వ్యంచింతు రగ్గాడఁజో, త్తరు కాతూహలపేమభామణములం దుల్యత్వముం బొంది యే, తురు వా రెల్లపదంబు వేడు దురు పింతుర్ భూమి మాఱొడ్డులన్. భార. శాం. ౨ ౧౭౦.

మాల. వి. (సం. మాలః. క. త. మాల) ౧. చండాలుఁడు; చండాలి.

క. మాలలఁ గులజాలఁ జేయును, బోలఁగ శివ భక్తులైన భువి నెఱుఁగర. శివ. సా. ౪౭౧.

చ. క్రతువు లొనర్చునో యిపు దశారిణ మెట్లు విమాన మెక్క సమ్మతముగ నగ్న తయ్యో కనుమాలపుమాలకు దుష్టశీలకున్. బ్రహ్మో. ౨. ౭౦.

సీ. పరగుఁ జండాలుండు మరియాళు వనఁగను, మాలఁ దనంగను మాల యనఁగ ఆం. భా. ౨. ౨౭౯. వేమన. ౨. ౨౫.

౨. (సమాసపూర్వపదముగా ప్రయుక్తమై, నిందాద్యోతకము.)

ఉ. మారుతికిన్ జయం బొసఁగె మాలవిధాతృఁడు వానిగెల్చునో, శరికి సమ్మతం బగునె యిట్టిది దీనను బెంపు గల్గునే భార. శా. ౧. ౨౧౭.

ద్వి. వదనాంబుజము వంచి వసుధఁ జెక్కెండ్లు, బ్రదికెడియామాలబ్రతుకు కేటిబ్రతుకు. ద్వి హరిశ్చ. ఉ. ౨౨౪ పం.

గీ. మాడ యిచ్చెద నన్నచోఁ గూడు వెట్టి, రింతపచనస్థలం బైన నీయ రిట్టి, మాలకొంపకు వచ్చితి మాఱు లేక శుక. ౩ ౧౭౨. దశకు ౭ ౧౦.

సా. మాలలకు మంచములు బాఁపలకు పీఁటలు = అనర్హుల కాదరము, అర్హుల కనాదారము చేయుట

క. లలిఁ గొ ప్పెక్కించితి మధు, పుల కుకల వడుగుపఱచితి పుష్పస్త్రీ మా, లలకును మంచంబులు బాఁ, పలకును పీఁట లనుమాట బళి నిజ మయ్యెన్. చంద్రా ౫. ౯౧.

జ: మాలఁడు, మాలకాకి, మాలతనము, మాలర్కము, మాలతీకము.

మాల. సం వి ఆ. స్త్రీ. ౧. దండ, మాలిక. ౨. పంక్తి, శ్రేణి; వరుస. పరంపర. ౩. కంఠాభరణము, (రత్నమాల.)

మాలఁడు. వి. (మాల + వాఁడు) చండాలుఁడు.

క. అని యమ్మాలఁడు దొలంగా, మున నే శౌక విప్రుకొడంక మునులు మతింపన్. భార. అను. ౪. ౪౭.

ఉ. మాలఁడు సోమయాజియగు మాలకు రాజగు యాజకుండు చం, డాలముఖంబునం గుడుచ నల్వనఁ బాఱలు వత్తురట్టె భా. రా. బాల. ౬౦౧.

ఉ. మాలఁడు నొంగి యమ్మునికి మాటుగఁ దర్థవ
మిచ్చి పట్టి భూ, పాలుని నంటు, గట్టి ..
మార్కం. ౧. ౨౩౦. వాసిష్ఠ. ౪. ౧౦౪.
ఆం. భా. ౨. ౨౯౯.

మాలకము. సం. వి. అ. పుం. ౧. నింబవృక్షము, వేపచెట్టు. ౨. కొబ్బరికాయతో చేసినపాత్ర. న. మాల, పూలదండ.

మాలకరి. వి (సం. మాలాకారః) ౧ దండలు గ్రుచ్చువాఁడు, పువ్వుదండ లమ్మువాఁడు.

గీ మాలకరి పుష్పములు గోయుమాడ్కిఁ దేఁటి, పువ్వుఁ దేనియ గొనిరొడిపోల్కి నెదురు, గందకుండఁగఁ గొనునది కార్యఫలము
భార ఉద్యో. ౨. ౫౪.

సీ. మఱియు నొక్కఁడు బ్రాహ్మణుఁడిటుండు నురిపొన్న లమరఁ గట్టి, మూఁడెత్తులుగఁ
' జేసి మను మాలకరివోలె, నేతెంచి వాచేతి కిచ్చినంత . ద్వా ౧౧. ౪౫.

౨. వనపాలకుఁడు, తోఁటమాలి.

ఉ. పోవఁగఁ జూచి మాలకరి భూపతనూభవుఁ జేరి పుత్ర నీ, కావలి నెప్పుడున్ వెలితి గావు ప్రసూనములు . భోజరా. ౫. ౧౯౨.

మాలకాకి. వి. (మాల + కాకి) ద్రోణకాకము, బొంతకాకి.

ఆ. గగనమండలమునఁ గాలాయసపుఁదేర, మాల కాకిపదగ దూలియాడ. సైమ. ౫, ౯౨.

మ త్తకోకిల మాలకాకులమూఁక లు, యొయ్యండఁ జేరి యదల్చె . మను ౪. ౬౧.

సీ. మాలకాకి నాఁగను ద్రోణకాకంబు విలసిల్లు , ఆం భా. ౨. ౯౩.

మాలతనము. వి (మాల + తనము) చండాలత్వము.

గీ. మఱి త్రిశంకునకా పచ్చిమాలతనము ...
వేం. పంచ. ౩. ౩౯౩.

మాలతి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. జాజి, జాజిపుష్పం. ౨. ముకుళము, మొగ్గ. ౩. కన్యక, కన్నె. ౪. రాత్రి. ౫. వెన్నెల, చంద్రిక.

మాలతీమాధవము. సం. వి. అ. న. భవభూతి రచించిన యొక నాటకము.

మాలతీరజము. సం. వి. స్. న వెలిగారము.

మాలము. సం వి. అ. పుం. ౧. వంగదేశమునకుఁ బచ్చిమదిక్కున నున్న ఒకదేశభాగము. ౨. పార్వతులజాతి, అరణ్యకులజాతి.

అ. న. ౧. పొలము. ౨ ఎత్తైననేల, ఉన్నత స్థలము ౩ అడవి. ౪ వంచన, మోసము.

మాలయము. సం. విణ. (అ. ఈ. అ) మలయ పర్వతసంబంధమైనది.

వి. అ. పుం. చందనవృక్షము, మంచిగంధపు చెట్టు.

మాలర్కము=మాలటీకము. వి. (√మాల) చండాలత్వము, మాలతనము.

శా, ఆ లంచున్ మెడఁ గట్టి దానికి వపత్య్ర శ్రేణిఁ గల్పించి త, ద్వాలవ్రాతము నిచ్చి పుచ్చుకొనుసంబంధంబు గావించి యా, మాల ర్కంబున బాంధవం బెసెఁడిప్రేమం గొందలం బ్రిప్పు. కాశీ. ౪. ౩౭.

మాలటీకము = మాలర్కము. వి. (మాల + టీకము) చండాలత్వము.

ఉ. మాలటీకంబు మాదిక సమస్తము బూల్ తనుఁ గూర్చి వచ్చునన, న్వేళ వసిష్ఠమూను లాద వెంగద రాజక యాజకుండు చండాలపు , సోమయాజి కని నవ్వెన.
చం. రా. ౩. ౩౫.

క. మండిపడి చూచి రాకొ, చండాలుఁడ వగు మటంచు శపియించెను మ, ద్దండత మాలతి కంబును, దండిగ ననుఁ జెంద నిట్లు తక్షణ మాత్రన్. ఉ. హరిశ్చ. ౪. ౧౬౦.

**మాలవకుఁడు.** సం వి. అ. పుం. మాలదేశ నివాసి.

**మాలవము.** సం. వి. అ. పుం. ౧. ఒకానొక దేశము. ౨. (సంగీ) రాగవిశేషము.

**మాలసి.** సం వి ఈ స్త్రీ. ౧. లతావిశేషము. ౨. (సంగీ) ఒకానొక స్త్రీరాగము.

**మాలాకంటము.** సం. వి అ పుం. అపామార్గము, ఉత్తరేణు. (రా. ని.)

**మాలాకారుఁడు.** సం. విశే. (అ. ఈ అ) పూలదండలు గూర్చువాఁడు; పూలవర్తకుఁడు.

**మాలాతృణము.** సం. వి. అ. న. సువాసన గల గడ్డి, చిప్పకసవు.

**మాలి.** సం. విశే. (న్. నీ న్.) ౧ తోఁట కాచువాఁడు. ౨. పూలదండలు కూర్చువాఁడు; పూలవర్తకుఁడు. ౩. పూలదండలు చుట్టుకొనినవాఁడు.

**మాలిక.** సం. వి. అ. స్త్రీ. ౧. పూలదండ. ౨. పంక్తి, వరుస, పరంపర. ౩. హారము. సరి. ౪. నల్లయవిసి, అతసి. ౫. పుత్రిక, కూఁతురు. ౬. పక్షివిశేషము. ౭. మద్యము. ౮. విరజాజి, సప్తల. ౯. గ్రీవాలంకారము. ౧౦. ఒకానొకనది. ౧౧. మురళ్ళి.

**మాలికము.** సం. వి. అ. పుం. ౧. పక్షివిశేషము.

**మాలికుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. పూలతోఁటపని చేయువాఁడు. ౨. రంగులు వేయువాఁడు, మచ్చి, చిత్రకారుఁడు. ౩. పూలదండలు చేయువాఁడు.

**మాలిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. పూలవర్తకురాలు; పూలవర్తకునిభార్య; మాలాకారుని భార్య. ౨. చంపారపురము. ౩. దుర్గాదేవి మహోత్సవములయందు దుర్గాప్రతినిధిగా నుండెడి యేడేండ్ల కన్యక. ౪. దుర్గ. ౫. మందాకిని, స్వర్గంగ ౬. (ఛంద) వృత్తభేదము. ౭. విభీషణునితల్లి. ౮. విరాటునిసభలో నున్నప్పుడు ద్రౌపది పెట్టుకొనినపేరు.

**మాలిన్యము.** సం వి అ న ౧. మలినత, మురికి. ౨. మైల ౩. పాపము. ౪. నలుపు. ౫. బాధ, నొప్పి.

**మాలిమి¹.** వి. ౧. చనవు, ఎక్కువఁ౛రిచయము.

ఉ మాలిమి లేదు గాన ననుమానము నామదిఁ దోఁచె నప్పుడే, బాలిక సేవ సేయఁ బనుపన్వల దంటిని గాద దాని కే, నాలుంపు గిల్గు మేనమఁ౛ దింతియ యాతఁడు నైసదైన దే, లోలత నింక నాగవలిలోపల నిష్ఠుర మేల పల్కఁగన్. విజ. వి. ౩. ౧౪౦.

క. సైన రైనదాని కిటువలె, గన రైనను వీడఁ జూచెఁ గడుమాలిమిచేఁ, దనరంగ స్మృతులు సెప్పెడిఁ, బనవలె యతిపరిచయాదవజ్ఞా యనఁగన్ శివల ౪. ౧౯౬.

గీ. తనకు ననుకూల యగు నొక్కదానితోడ, మాలిమి యొనర్చుకొని యించిమంచి కెట్టి, దానితో నొక్కనాఁడు మంతనమునందు, నింటివారలకెవినికోకెల్ల నుడివి. శుక. ౩. ౨౯౪. శివల ౧. ౯౬.

౨. వాత్సల్యము, (పుత్రాదులయం దుండు) ప్రేమ.

గీ. ప్రాలి కెప్పితి నరపాలనూళి దా నృపత్య భయశీలి గావున బాలిగొలుపు, వానినిలిత

వాన కానఁగఁ జాలి, సోలి మతుమాలిమికి
నాగయాలిఁ జూచి. చం. రా. ౪. ౨౨.

క. కాలిమి మీఱఁగఁ జెప్పటి, మాలిమితో దేవ
గురుఁడు మంత్రముఁ దెలుపన్. దశా. ౫. ౬౫.

జ. మాలిమికాఁడు.

మాలిమి2. వి. (త. మాలిమి) ఓడనడపు శాస్త్రము, ఓడనడపు శాస్త్రము నెఱిఁగినవాఁడు.

సీ. కెలంబు నడిపించుమాలిమి సంచలిం,పనిమానసం
బది బరువు గాఁగఁ

గీ. జేసిన మురారి చరణరాజీవభక్తి,గౌరవం బను
పేరోడ గలిగకేని వరాహ. ౫. ౬౬.

జ. మాలిమికాఁడు2.

మాలిమికాఁడు1. విశ. (మాలిమి1+కాఁడు.) వాత్సల్యపాత్రుఁడు, ప్రేమపాత్రుఁడు

క. ఫలకుసుమబిసాదులు గం,పలకొలఁదులుదెచ్చి
కతన మాలిమికాఁడై, నిలుకడఁగ మాత
పోవని, మెలఁగుచు వాఁ డుండి యుండి
మెల్లనఁ బిదపన్. కువల. ౨. ౨౧.

గీ. ఓడ కిటువలె నీ వింతవాఁడ వేని, మించి
తగినట్టిబుద్ధి చెప్పించ వచ్చు, గ్రామమున కెల్ల
మాలిమికాఁడ వగుట, బ్రతికిపోతివి పోర
బాఁపనగరాప. శుక. ౨. ౪౬౪.

మాలిమికాఁడు2. వి. (మాలిమి2+కాఁడు) ఓడ నడపువాఁడు, నావికుఁడు.

సీ. మాలిమికాఁ డనఁ జీలికాఁ డన నోడ,వాఁ
డన నావికాహ్వయము వెలఁగు . .

అం భా. ౧. ౧౫౭.

మాలు. అ. క్రి. ౧. నశించు.

సీ. ఇరువదేనమ్ములఁ దురగచతుష్కంబు మిడుకు
మాలఁగ నేసిమిన్ను ముట్టి ..

ఉ. హరి. ౩. ౫౩.

సీ. ప్రాభవంబులు మాలి భావుకశ్రీలు దూలి
పాఱువారయ విధి దూఱువారు . .

వరాహ. ౩. ౪౬.

చ. విలయసత్వశాను కీలములకేఁడిమిఁ బోడిమి
మాలి నెల్మిడిన్, గలిపినభూతధాత్రి ..

మనుచ. ౨. ౧౦.

౨. లేకుండు, శూన్యమగు.

చ. వనగజ మంబుజాకర మవారణఁ జొచ్చి
కలంచి యాడఁగా, మనమునఁ గొంకు లేక
కృప మాలినబోయలు ముట్టి చంపుచా,
డ్పున. భార. ద్రో. ౨. ౧౨౪.

గీ. వాలి మాలినపశుమార్గవర్తనంబు, నాను
టరిదిరయె యిది యేల యుగ్గడింప

హరి. ఉ ౩. ౧౦౭.

సీ. కటకటా యేఁట నొక్కొటి సహస్రంబులై
ఫలియించుజీవులఁ బ్రతిదినంబు, సంఖ్య
మాలినవానిఁ జంపి పొట్టలు నింద సాలు
బిడ్డలు నీవు నారగింతు.

వరాహ. ౨. ౧౪౬. ఉ. రా. ౧. ౩౦౯.

౩. తప్పు, తొలఁగు.

గీ. మగుడ నడవికి నడిచినఁ దగిలి యతని,తోడఁ
దమ్ములుఁ బో నంతతోన యుల్ల,డోసలగు
మాలు నప్రతిహత దోర్వీర్యభూతిఁ, బెద్దకాల
మే నేలుదుఁ బృథివి యుల్ల.

భార. ద్రోణ. ౧. ౧౧౧.

క. అంతటఁ బౌరాణువహాను,మంతుం డనుపేరఁ
బరఁగుమాష్టిని మదా,క్రాంతుని గెలిచెద నని
నిజ,కాంతుఁడు చనఁ దొడఁగను మాలెఁగద
యిపు డంచున్. శుక. ౩. ౧౬౪.

స. క్రి విడుచు, త్యజించు.

సీ ధర్మపథంబున ధరణి నేలుటీవఁ బాలింపక
నత్త్వంబు పెంపు మాలి, విడుచుట యొప్పునే.

భార. శాం. ౧. ౪౭.

క. బాలుఁడువోలెం దాలిమి, మాలితి విది యేమి యకట మతిఁగాద వింకన్ ...

భా. రా. కిష్కిం. ౩౫౬.

ద్వి. మదవారికిని ధృతి మాలంగఁదగునె .

బస. పు. ౪. ౬౫౦. వరాహ. ౯. ౧౧.

సా. తన్ను మాలిన ధర్మము=తనకు లేకుండఁ జేసి కొని యితరుల కిచ్చుట.

ద్వి. అమ్మెదఁ గడమకై యాలిఁ గొం దనెడుఁ, దమ్ము మాలినయట్టి ధర్మంబు గలదె

ద్వి. పారిశ్ర. ఉ. ౪౧౪. పం.

జ మాలుకొను, మాలుచు

**మాలు(లి)కొను.** స. క్రి. (మాలు+కొనుస్వార్థ మున) విడుచు, త్యజించు.

గీ. చెలుల కార్తి యవిరహంబు తెలియనీక, మాటి మాటికి నిలిచినచోట నిలువ, కాలకాతన్వి మది జాలి మాలికొనుచు, నతనికడ కేఁగుతమి నున్నయవసరమున. కువల. ౫. ౩౯.

**మాలుగు(ల్గు.)** అ. క్రి. సోమరితనమును బొందు.

శా. . ఈమహిమ మాహా మాల్గి చండించెనా, ప్రావృట్కాల పయోదకాంతికరమై భాసిల్లు నీకేమ ... శేష. ౪. ఆ. (శ. ర.)

వి. ౧. సోమరితనము. (శ. ర.)

౨. పల్లకీ మోయుబెస్తలభుజము మోఁదికడి మదతపాత్తి.

గీ. బెస్తల భుజంబులందున బెట్టుకొనెడి, యూర్ధ్విపటములు మాలుగు లనఁగ వెలయు. అం. భా. ౩. ౪౦.

జ : మాలుగుఁబోతు.

**మాలుగుఁబోతు.** విశే. (మాలుగు + పోతు) సోమరి, అలసుఁడు.

ఉ. కూలికి వచ్చి యూడ వరి గోయుచుఁ గూయుట చెంద వచ్చెనే, మాలుగుఁబోతు వీని కనుమానము లే దిఁక చేనికెద్దచేఁ, దోలుఁడి యూదివంబు మనతో సరిగాఁ బడి ముట్టఁ బోడు. చెన్న. ౩. ౪౧౭.

సీ. . మదల మాలుగుఁబోతు చండి సోమరి నలి ..అనంగఁ దోఁచుఁ బ్రాల్మాలినవాని పేరు అం భా ౩. ౬.

**మాలుచే(ల్చు.)** స. క్రి (√మాలు) మాలఁ జేయు, పోఁగొట్టు, నశింపఁజేయు.

గీ తగనియది యుద్ధిరైన వ్రతంబు వూని, మాన సోపిన నాయువు మాల్పకుండు

భార. అను ౪. ౯౬.

ద్వి. దీనుల మనియు మాధృతి మాలిచెదవు

పండితా. మహిమ ౭౯౨ పా.

చ. అతిశితచక్రధార నరకాసురు ప్రక్కలు చేపి డావి దై, వతపతి కింతరక్కసులవాఁడిమి పోఁడిమి మాల్చి ఉ. హరి. ౧ ౧౭౭.

బస. పు. ౪ ౩౧౩ పం.

**మాలుధానము.** సం. వి. అ. పుం ఒకజాతి పాము, ఉమ్మెత్తలో నుండెడిపాము.

**మాలువు.** సం. వి. ఉ. స్త్రీ. ౧ లతావిశే షము. ౨. ఆఁడుది, స్త్రీ.

**మాలూరము.** సం వి అ. పుం. ౧. మారేడు చెట్టు. ౨. వెలఁగచెట్టు.

**మా౽లె(లియు.)** వి. (ప్రా. మాలి. అ) ౧. పార్శ్వము, మాడుగు

క. ప్రేలకు జీలుగు పెరిగిన, మాలెకుఁ గంబంబు గాదు మాటలు మిగులన్, నాలుక గఱచిన యంతనె, చాలునో మగతనముఁ జూప సాత్యకియుదురన్. ఉ. హరి. ౫ ౫౦.

వ. చెంగటఁ జెలంగు చెంగలువమాలెపై నంకించి పాడుచెక్కులతేఁటిజక్కులవారి

యాలాపంబులకు ... ఈ శ్వా హా ం బుఁ బొందుచు ... కువల. 3. ౧3౧.

సీ. మాడుగు మాడువు మాలె యం చనఁగను బ్రాసాదభేదమై పరగుచుండు . . ఆం. భా. ౭. ౧౪.

౨. (క. మాలె) పుష్పమాలిక, పూలదండ. (శ. ర.)

3. వరుస, పంక్తి.

(చూ. మలెగట్టు)

జ: మాలెగిట్టు, మాలెగొలుపు

మాలెగట్టు. అ క్రి (మాలె + కట్టు) వరుసగా నిలుచు, పంక్తిగా సేర్పడు.

చ కిటిగణ మేఁగుదేరఁ గని క్రేవలఁ బట్టిన వేఁటకుక్కలా, క్కటు గొలుసుల్ వడిన్ విడువఁగాఁ బఱచెన్ బవమానవేగులై

చ. పఱచుచుఁ గొంపులన్ దొడలు బట్టి విదుర్చుచు మాలెగిట్టినన్, మెఱుఁగుచుఁ గ్రమ్మరన్ దొడఁగి మోరలు ద్రిప్పినఁ బోటు దప్పఁ గ్రేళ్లుఱుకుచు పింగిముల్ గరులనొక్కటఁ బట్టెడుభంగి దాఁటుచోఁ, గఱచుచుఁ జాగిలీక యరికట్టుచు బెట్టుగ సేఁచెఁ బందులన్. ద్వా. ౮. ౨౩.

మాలెగొలుపు(లుప్పు) అ. క్రి. (మాలె + కొలుపు) మాలెకట్టు, పంక్తిగాఁ సేర్పడు.

ఈ. కుక్కలు గొన్ని చుట్టుకొని క్రోడములన్ ధరఁ గూల్చి కొన్నిటిం, ద్రొక్కి లులాయపోతముల దుండగిలంబడ నీడ్చి కొన్ని చే, రుక్కున మాలెగొల్పి రొఱపు దుండి రొఱుంగులఁ గొన్ని మన్నులం, జిక్కులు చీరుగాఁ గఱచి చిందఱవందఱచేసె మాంసముల్. ఈదయకోదయము.

మాలెత. వి. (మాల + త. వృత్తిని వర్ణనికారము) చండాలస్త్రీ, మాలది.

క. త్రోయక విప్రుఁడు మాలెతఁ, గాయజసుఖకేళిఁ గవిసి కష్టాత్ముఁడగున్, బ్రాయశ్చిత్తముఁ జేయక, పోయినఁ జండాలజాతిఁ బొందు నిజముగన్. విజ్ఞా. ౨. ౧౨౫.

క. అనుటయు నామాలెతలం, గనుఁగొని యుత్సాహ ముడిగి ఘనకోపముతో, మనుజాధీశ్వరుఁ డి ట్లనుఁ, గనుఁగ్రేవలయందుఁ గెంపు గడలుకొనంగన్ హరిశ్చ ౨. ౧౧౨.

సీ. చండాలికాభిధ చను మాలెత యనంగ ఆం. భా. ౨. ౧౦౮

మాలేయము. సం. వి అ. స్త్రీ. పెద్దయేలకులు

మాల్యపుష్పము. సం వి. అ పుం. జనుము

మాల్యము. సం. విణ. (అ అ అ) మాలకుఁ దగినది, మాలాసంబంధమైనది

వి అ న. ౧. పూలదండ. ౨. పుష్ప 3 శిరసుపై ధరించినమాల.

మాల్యవంతము. సం. వి. త్. పుం. ఒకానొక పర్వతము, సప్తకులగిరులలో నొకటి.

మాల్యవంతుఁడు. సం. విణ. (త్. వతీ త్) పుష్పమాల ధరించువాఁడు.

వి. త్. పుం. సుకేశునిపుత్రుఁ డగు ఒకానొక రాక్షసుఁడు.

మాల్లము. సం. వి. అ. పుం. ఒకానొక సంకరజాతి.

మాల్లవి. సం. వి. ఈ. స్త్రీ. మల్లయుద్ధము, ముష్టియుద్ధము.

**మాళవశ్రీ.** సం. వి. ఈ. స్త్రీ. ఒకానొక రాగము.

గీ. మాళవశ్రీయు . మిశ్రంబు లన్ని మదికి,
నరిదిఁ గన్నట్ట వినికిసేయంగఁ జెలికి
ప్రబంధ ౯౭.

**మాళవి.** వి ఒకానొక రాగము.

సీ భైరవ శ్రీరాగ బంగాళిహిందోళి మాళవు
లను రాగమంజరియును ప్రబంధ ౯౫.

సీ భైరవి మాళవి బంగాళి హిందోళి రాగమం
జరియు శ్రీరాగ గౌళ, భూపాల లెన్మిది
పురుషరాగంబులు హంస ౫ ౧౨౩.

వ వసంతంబు మాళవి బంగాళి నాట దేవ
క్రియ మేఘరంజ మత్స్యపు ౫ ౫౩.

**మాళిగ.** వి. (సం. మాలికా క మాలిగ త మాళిగై.) ౧ మాడుగు, మేడ.

ద్వి. ఈడు జోడును లేని యింద్రనీలముల,
జోడు బల్లలచేత నొప్పుమాళిగల
అ. మ. క. ౩. ౧౪౭. పా. ౧౩. పం.

సీ. మబ్బు పూపుట్టువుమాళిగలో నుండుగుబ్బెత
సెదఁ జేర్చి యుబ్బుజేజె . .
ప్రబంధ. ౧౫౩.

ద్వి. చలువవెన్నెలవులు సారెకు మలయు, మలయ
మారుతముల మలయుమాళిగల
ద్వి. పరమ. ౧. ౩౮. పా.

౨. ఇల్లు; మిద్దెటిల్లు

ద్వి. సరవిపై వైష్ణవ సాహస్రమునకుఁ గర
మొప్పు వెమమాళిగలు ఘటింపించి
ద్వి. పరమ. ౬. ౮౭౬. పా

ఉ. మేలిమాళిగల్, మేడలు
ప్రభు. ౧. (శ. ర.)

**మావఁతుఁడు.** వి. (క మావంత, త. మావుత్తన్, మహా. మాహుత.) మావటివాఁడు.

సీ. మేదినీపతి యతిమృదు వైన మావంతుఁ
డేమంగ నె ట్లట్ల యొక్కి యాడఁ, జూచుఁ
డేఁకువ కెడి నీచపుఁ బ్రజ . .
భార. శాం. ౨. ౧౪౭.

ఉ. ఎంతయు ఘోర మైన విపినేభము మెల్లన
మ స్తరించి మావంతుఁడు గంతపీఠి గుద
వైచి ముఖంబున నెక్కినట్లు
కాశీ. ౫. ౨౩౬.

సీ. గారవించుచుఁ బిల్చికమలలోచన లెల్ల మా
వఁతు బలగంబు మాడ్కిఁ దనర
కళి ౮. ౧౦.

సీ. మావటీఁ డనఁగను మావంతుఁ డనఁగను
నాధోరణుని సంజ్ఞ యలరుచుండు
ఆం. భా. ౨. ౨౦౩.

**మావటము.** వి (తములపాకుల) కట్ట, మోద

సీ బంగారు చాఁపులపస మించు తములపాకుల
మావటాలు కొండలుగ వైచి
కళా. ౪. ౬౦.

**మావ(టి)టీ = మావటీఁడు.** వి. (క. త. మావటిగ) అధోరణుఁడు, మా వఁతుఁడు.

గీ ఎగవి ప్రాలెడు జలజంతు లెక్క నెక్కఁ,
గూల విసరినఁ బడుమావటీలు గాఁగ, మూర్మి
రేఖాకరంబు బి ట్టూచికొనుచు, గంధగజలీలఁ
గ్రాలుసాగరముఁ గాంచి
రామా. ౪. ౩౭.

ఉ. మావటు లొలి డీకొలుప మత్తగజంబులు
పోవుత్రోవలన్, బ్రోవులు గట్టుచున్
గవులు భా. రాయ. ౬౮౦.

(శ. ర. పా. మావఁతులొలిడీకొలుప. ముద్రిపా.)

చ తనువున నంధకారపుమదం బలమి న్నను
భద్రదంతికిన్, మొనసినఁ జిందరేఁగి తమమం
దనుమావటిఁ గ్రుంకుమెట్టులో, యు నరుల

వైచినన్ గౌగిలి యచ్చట నెత్తురు గ్రక్కుచు నీ
యనన్, గనుఁగవ జేరఁగింపఁ బొదకట్టె
సముజ్జ్వల సాంధ్యరాగముల్.

పారి. ౨. ౩౧.

(శ. ర. పా. మావఁటుఁ గ్రుంకుమెట్టులో
ముద్రిపా.)

**మావటీఁడు = మావటీ.** వి (మావటి + ఈఁడు. స్వార్థమున) మావటివాఁడు, అధోర ణుఁడు.

గీ. మావటీఁ డల్లనల్లన మదగజంబు, నిచ్చతోఁ
గూడ జోజుఁ డెచ్చు ట్లు

మార్క. ౩ ౩౧౮

క పన్నగ నందలియేనుఁగు, గున్నలపై మావ
టీంద్రు జోరెక లదరన్

నీలా ౧. ౩౩

సీ ఓదంబు లేనిచో నాగ మావటీనిచే గజరాజ
ములు వరికట్టు పడునె.

సీతారా. ౧. ౧౧౪

సీ. మావటీఁ దనఁగను మావంతుఁ దనఁగను
నాధోరణునిసంజ్ఞ యలరుచుండు

ఆం. భా. ౨ ౨౦౩

**మావలి.** వి. సుగంధిమాల. ?. (శ. ర.)

**మావి[1].** వి (క. మావు. త. మా2) మావిడి, చూతవృక్షము.

శా. తావుల్ గ్రేవలఁ జల్లుచెంగలువ కేదారంబు
తీరంబునన్, మావుల్ క్రోవులు వల్లిబిల్లి
గొను కాంతారంబునందు .

మనుచ. ౨. ౨౨.

చ. అలరుఁ బురంబునన్ - మావితోఁ, ఫుల
విరులన్ బయిన్ నడువఁబోలు పురాతన
తీర్థకుండముల్ ఆము. ౧. ౪౧.

సీ. మరుమావులరవం బమరుమావు లరు దైన
తావిక్రొన్ననపట్టు గ్రేవ దనర .

సారంగి. ౧. ౧౧౧. బహు. ౨. ౧౩.

సీ. మామిడి మావి యనంగ నాత్ర మగు.

ఆం. భా. ౨౪౫.

**మావి[2].** (వి. మావి. త. మా ) మనుష్యాదుల గర్భస్థపిండము నావరించి యుండుమాంసపు పొర, జరాయువు.

గీ. జరాయు వలరు మావి, నాఁగ

ఆం. భా ౨. ౧౦౯.

**మావిడి = మామిడి.** వి ఆమ్రము, చూత వృక్షము.

ఉ. మావిడి మోఁక లేఁదలిరుమంటపుఁ గోర్కులు
గోపి తింటకున్, భావగతుల్ కరం బలరఁ
బల్వగిలన్ మరపిల్లు చుండితిన్

దశకు. ౬. ౩౩.

క. మావిడిచె ట్టొక్కటి పెన్,లా వదరఁగఁ
బెతికి యాచెనఁటి యరదమ్మున్, మావులు
విల్లును దుము రై, పోవఁగ వైచినకతండు
పాలివోనిబిగిన్.

అచ్చ. రా. యు. ౧౯౩

ఉ. మావిడిమోఁకక్రింద నిగమత్రితయార్థ సమృద్ధి
పార్వతీ, దేవికుచంబులం బదను దీర్పని
కస్తురిముద్ర గా జగజ్జీవనకారణం బయిన
శ్రీనిధి కంచిపురీశ్వరుండు మా,దేవయపెట్టి
నందనుని దిప్పఁ గృతార్థునిఁ జేయుగావుతన్.

హార. ౧. ౨.

**మావు[1].** వి. (త. మా.) ౧. పురుషాశ్వము, మగ గుఱ్ఱము; అశ్వము, గుఱ్ఱము.

సీ. గోడిగజాతిలోఁ గొదమపెంటుల చేర్చి
మావుల హత్తించు మార్గమంబు

భార. విరా. ౧. ౯౫.

క. అర్జునుండు భానుర మగున్నమ్మా వగ్రే
సరముగ యజ్ఞాశ్వాసమ్మునకు వచ్చె నంచిత
లీలన్ భార. అశ్వ. ౧. ౧౬౭.

దండకము మావవై శావవైతే జగం బుద్ధ
తమ్లేచ్ఛులం జంపి వరాహ. ౯. ౧౧౦.

చ. భూమురు లన్నదిలోన వాచ్చి గ్రమాఁ,
కులకుద తెక్కి చప్పటలు గొట్టి యదల్పఁగ
సాహిణీలుమావులఁ బఱపంగ వైచి సెలవు
ల్వెస నాకుచుఁ బోరెడి
ఆము. ౩. ౭౭

సీ. పరగు నశ్వంబు బాబా వావురము వామ్మవము
జక్కి తత్తడి మావు గుఱ్ఱ, మన
ఆం. భా. ౭. ౧౯౬.

౭. అశ్వసంగమము, స్త్రీపురుషసంగముల కల
యిక. (శ. ర.)

౮. మావు మోమువాఁడు.

**మావు2.** వి. మత్స్యగ్రహణసాధనవిశేషము, క్రింది
భాగము సన్నగా మీఁదిభాగము వాటము
విరివిగా అడుగు మీఁదిచివరలు చేరునట్లు లోన
చొప్పించి ఊఁతవలె చువ్వలతో నేయఁబడిన
చేఁపలనుపట్టుసాధనము (శ. ర.)

**మావుతుఁడు.** వి. (క. మావుత, త. మావుత్తన్.
మహా. మావుత) మావటీఁడు, గజపాది.

లయగ్రాహి. రావుతులకుండములు మావుతల
నుగ్గుఁ దురగావలికవంబులు గజావయవరాశీ,
భావ భయదస్థలులు
భార స్త్రీ. ౭ ౫. (మావతులు శ. ర. పా.)

ఉ. మంది గుటాలు సేమఁగులు మావుతులున్
దొర లెన్నఁ జెక్కులై, క్రిందుగఁ
గూర్మితో నెదురుగాఁ జని పోఁటాలు దీర్పఁ
జూచుచున్, గొందఱు ముందరన్ బయిఁడి
కోలల సొగ్గలు లెచ్చరింపఁగా, నిందని

యాయుచేఁ బొదలు సేసుఁగు సెక్కి మదిం
జెలంగుచున్. యయా. ౪. ౧౫౪.

ద్వి. కూలెదుమావుతుల్ గ్రుంకు రావుతులు,
తూలెదుగొడుగులు గ్రుంగుపడగలు
రం. రా. సుం. ౭౬౫. పా. ౩. పం

**మావుమోమువాఁడు.** వి (√ మావు1)
కింపురుషుఁడు, తురంగవదనుఁడు. (శ. ర.)

**మావురము.** వి మత్స్యవిశేషము

సీ. ఊాలి, కోలుకు మావురమును గుంట
ముక్కు
గీ. పరిగ రొయ్యాదియగుమీలఁ బట్టు
నతఁడు హంస. ౪ ౧౮౪

(బ్రౌ. క్రొత్తప్రతిపా. మావురము. ప్రాఁత
ప్రతిపా.)

**మావెలఁగ.** వి. ఊలిమిరి, వరుణము. ఓ. (శ. ర.)

**మాషము.** సం వి. అ. పుం. ౧. చిక్కుడు ఓ.
౨. ఒకానొక బంగారుతూనిక (పణములో నిరు
వదనవంతు, ఎనిమిది గురివెందగింజలయెత్తు.) ౩.
కాయధాన్యవిశేషము, మినుములు. ౪. చిక్కుడు
గింజలవలె బొబ్బలు గలచర్మరోగము.

**మాషవర్ధకుఁడు.** సం. వి. అ. పుం. స్వర్ణ
కారుఁడు. బంగారుపనివాఁడు.

**మాషాదము.** సం. వి. అ. పుం. కూర్మము,
తాఁబేలు.

**మషాశము.** సం. వి అ. పుం. గుఱ్ఱము.

**మాషికము.** సం. విణ. (అ. ఈ. అ.) మాషము
విలువ గలది

**మాషీణము.** సం. విణ. (అ. ఆ. అ.) మాష
ములు పండుచేను.

మాషుఁడు. సం. వి. అ. పుం. మూర్ఖుఁడు, అవి వేకి.

మాసమానము. సం విశ. (అ. ఆ. అ.) మాస ప్రమాణము కలిగినది.

మాసజాతుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) నెల వయసు గలవాఁడు, నెలక్రిందట బుట్టినవాఁడు.

మాసజ్ఞము. సం. వి అ. పుం. కూకురుగుండఁగి పిట్ట.

మాసటి = మాసటీఁడు. (చి. ౨ శ. ర.)
జ: మాసటీఁడు.

మాసటీఁడు = మాసటి, మాస్టీఁడు వి. (మాసటి + ఈఁడుస్వార్థమున) కూరుఁడు

సీ. మాసటీనికిని మైమఱవరా దెప్పుడు నల యంగఁ గూడదు యాచకునకు
నీతి 3౭.

గీ. కలయఁ బన్నిరు చిలికి శ్రీగంధ మలఁది, విరులు పైఁ దార్చ నపు డొప్పెఁ దరుణి మేటి, మగని వరు గెల్వ వలరాచమాస టీఁడు, పూజచేసినయగ్గజరాజ మనఁగ.
విజ. వి. 3. ౪౦.

౨. మల్లుఁడు.

ద్వి. కేసరిబోలె లంఘించి పట్టుచును, మాసటీ డువలెబోలె మండిపెట్టుచును
పండితా. పర్వ. 3౭౨ పా

సీ. మైనాకు నొరసిన మాసటీఁడు
మనుచ. ౫. ౪౪

విశ. ౧ ప్రతిమల్లుఁడు, ప్రతిభటుఁడు

ఈ. ఆ రౌలవాఁగవేఱే మెఱుఁగారు పిటారికి మాసటీఁ డగుచ్, బో యనవచ్చు నమ్మి అంగు బోఁడిపిఅుండు పను స్తభూమికిన్,

రాయ లనంగవచ్చు నలరాజునిశ్శాఙ్క రౌలంగు గట్టిపా, కోయిలకంచుకు త్రికల కున్ బయకాఁ డనవచ్చు నెచ్చెలీ ...
విజ. వి ౧. ౧౧౯.

౨. శ్రేష్ఠుఁడు (శ. ర.)

3. శస్త్రిదఁశుఁడు.

సీ. మాసటీఁ డనఁగను మాస్టీఁ డనంగను సాదకాఁ డనఁగను శస్త్రిదఁశుఁ, డలరు
ఆం భా. ౨ ౨౦౫.

మాసమాలనము. సం వి అ పుం. సంవత్స రము, ఏఁడు (త్రి. ని.)

మాసము. వి (సం మాషః ప్రా మాస.) రెండున్నర చిన్నమెత్తు (శ ర)

మాసము. సం వి అ పుం ౧. నెల. ౨. చంద్రగ్రహము. (వైదికోపయోగము. తెనుఁగున నెలశబ్దమునకుఁ జంద్రుఁ డర్థ మున్నటుల మాస శబ్దమునకుఁగూడఁ జంద్రుఁ డనునర్థము గలదు.)
3. పన్రెండు సంఖ్యకు సంకేతపదము.

మాసరము. విశ. ౧. వ్యాపించునది.

సీ. . అరణ్యసంచరమునఁ, దరువుల రాలు కేసరముల నత్యంతధూసరం బై కడుమాసర ముగ, గోఖురోద్ధత రేణుకుంఠిత మగు మోము
హరి. పూ. ౫. ౧౪౭.

గీ. ప్రేమ సంక్రీతినయమిశ్రితవిలోక, సంబు కృష్ణునిముఖ కమలంబునందు, మాసరం బగు వికసనమధువునకు మ, ధువ్రతం బంబు నిగుడ నానుప్రకుండు.
భార. శాం. ౧. 3౪౯.

౨. మనోజ్ఞము, అందమైనది.

క. తరుణప్రదేశముల మా, సరముగ పారలు యయాతికర్మిష్ఠులఁ జూ, చిరి తంద్రియుఁ దల్లియు నని . భార. ఆది. 3. ౧౨౪.

సీ. లలితాంబరములు మేఖలలు లేకయు హారి
ఘనంబు లింక మాసరము లగుచె
కు. సం. ౬. ౪౦౯.

౩. దీర్ఘము, పొడవైనది.

సీ. మాసరంపుటరంటి మోసుల నొకకొన్ని గొమ
రారు కర్ణికారములు నించి
కు. సం ౫. ౫౦౨.

గీ. అధ్యలీమలగుండియ లనియ వాఁడి, చూపె
మల్లీలతావల్లరీపరాగ, ధూసరంబులు దప్త
ముక్తాసరములు, మాసరంబులు నైదాఘ
వాసరములు. వరాహ. ౨. ౬౪.
నైష. ౧. ౮౩

౪. విస్తరము, అతిశయము.

క. ఈమూచితవృత్తాంతము, మాసరముగఁ జెప్పఁ
బడిరయె మహేశ్వర నీ, కు
వాసిష్ఠ. ౨. ౧౪౮.

౫. ఒప్పిదము, చక్కఁదనము.

క. భానుఁడై పతి నగరికి మాసరమున వచ్చు
టెటేఁగి మణిమండలవి, న్యాసాలకృత యగు
సతి, వాసకసజ్జికయనంగ వలసై రొప్పెన్.
కావ్యా. ౩. ౮౨.

మాసరము. సం. వి. అ. పుం. ౧. వార్పుగంజి
౨. వేయించిన యవలబియ్యములో పుల్లని పెరుగు
కలిపి చేసినయాహారము.

మాసలము. సం. వి అ. పుం. సంవత్సరము.

మాసి[1] = మానిసి. వి. (సం. మానుష.) ౧.
మనుష్యుఁడు. (శ. ర. గ్రా.)
౨. శపథాయుధనిష్ఠుని, వెనుకకుఁ దిరుగ నని
యొట్టు పెట్టుకొని యుద్ధము చేయువాఁడు.
సంశప్తకుఁడు.
సీ. శపథాయుధనిష్ఠు లనుమానైకత మం చనఁ
గను మాసి యం చనఁగ ...
అం. భా. ౨. ౧౭౫.

మాసి[2]. వి. (√మాయు. క్త్వ. మాసు) మాలి,
న్యము. (శ. ర.)
గీ. మాని కమపట్టుటకు నాత్మ రోసిరోసి
కవిక. ౫. ౧౯.
(ఇది మాయుధాతుక్త్వార్థకరూపముగా గ్రహించి
నను సరిపోవును.)

మాసిక. వి (√మాయు) అతుకు.
ఉ. మాసిక వైచి కుట్టినరుమాలును జాలనిదట్టి
బట్టయుఁన్, మాసినరొడ్డు దుప్పటి
శుక ౨ ౩౬౨.
సీ చినిగి మాసికలు వేసినకోక బంగారు
పెంకులు చెంగావిచీర యరయ్యో
దశా. ౭. ౪౨౪.

మాసికము. సం. విశే. (అ. ఈ. అ) ౧. మాస
సంబంధమైనది ౨ ప్రతిమాసమునను దటస్థించు
చునది, నెలనెలకుఁ దటస్థించునది
౩ నెలకు సరిపడునది, నెలకు వచ్చునది ౪.
నెలలో నీయఁదగినది. ౫ ఒకఁడు చని
పోయిన సంవత్సరమున నెలనెలకు పెట్టఁ
బడు (జరుపఁబడు) శ్రాద్ధము.

మాసురి. సం. వి. ఈ. స్త్రీ. శ్మశ్రువు.

మాస్టీఁడు = మాసటీఁడు. బ. మాస్టీండ్రు,
మాస్టీలు. ౧ కూటుఁడు.
ఉ. పైఁడిరథంబుతోఁ బ్రబలయపావకపట్టము సేఁడు
కట్టుకొ,న్నాఁడో యితం డనం గనలునం గను
గ్రుడ్లు గదల్చి కాయుక్రొ,వ్వేఁడిమిచే దిగంత
ములు వెచ్చపడన్ బలభేదినిఁది మాస్టీఁ
డతఁ డొక్కఁడుం గదుపడిన్ గదియం
గపిరా జదగ్రుఁడై. రామా. ౭. ౯౧.
మ. బలియుం డొక్కపటానిరాకుతవబాశా నూకు
చున్ రెండుమ్, ధులమాస్టీలకలన్ కరాసిల

తిరం దుండించుచుం జట్టి రా, నల రెం
ద త్తమవుల్ ధరం బడుట ధూర్తాజ్ఞ ప్తిచే
పెట్టిహో,పులు కేలం బడకైచి కూలఁబడు
కాఁపులోవ్వరె నప్పట్టునన్.

కవల. ౨ ౧౪౧.

౨. మల్లుఁడు, శెట్టి

ఉ ఈడన సన్నసన్నను భ్రమింప ధరన్
శకటాలిఁ దోలి పో,రాడఁగనీ కిలం దునుకలై
పడఁద్రోయుచు మారుసాముసం, దోడక
రూఢి గాంచి బిరు దొందినవాన్మొల నూలి
ఘంటమా,స్టిఁ డన మేటియై పటుకటీతటి
నీ టగు నవ్వధూటికిన్

ఉ హరిశ్చ 3 ౬౦

సీ లగినట్టిమాస్టి ని దంపపోల్కి మెఱుంగు
మెఱయు కై పడి బిసమాటినగతి

గీ ఆడగలజాత్రప త్తమునకు

ప్రబంధ ౧౫౧

3. శస్త్రదత్తుఁడు

సీ మాసటిఁ డనఁగను మాస్టిఁ డనంగను
సాదకాఁ డనఁగను శస్త్రదత్తుఁ డలరు

ఆం. భా ౨ ౨౦౪.

మాహాకులీనుఁడు. సం. విణ. (అ. అ అ.) గొప్పవంశమునఁ బుట్టినవాఁడు.

మాహాకులుఁడు. సం. విణ (అ. ఈ. అ) గొప్పవంశమునఁ బుట్టినవాఁడు, ప్రఖ్యాతవంశ జాతుఁడు

మాహాత్మ్యము. సం. వి అ న గొప్పతనము, ఘనత.

మాహానసము. సం. విణ. (అ ఈ అ) వంట యింటిసంబంధమైనది.

మాహినము. సం. వి. అ. న. రాజ్యము

మాహిషము. సం. విణ. (అ. ఈ. అ.) మహిష సంబంధమైనది, దున్నపోతు సంబంధమైనది.

మాహిషికుఁడు. సం. వి. అ. పుం. ౧. దున్నలను గాచువాఁడు, పశువులఁ గాచువాఁడు. ౨. వ్యభిచారిణిని గామించు విటకాఁడు.

మాహిష్మతి. సం. వి ఈ స్త్రీ. హైహయరాజు లకు వంశపరంపరగా నుండెడిరాజధాని, పుర విశేషము.

మాహిష్యము. సం వి అ పుం క్షత్రియునకు వైశ్య స్త్రీయందు జన్మించిన సంకరజాతి

మాహేయి. సం వి ఈ స్త్రీ గోవు. ఆవు

మాహేయుఁడు. సం. వి. అ పుం. ౧ అంగా రకుఁడు ౨ నరకాసురుఁడు

మాహేశ్వరి. సం వి ఈ స్త్రీ పార్వతి

మాహేశ్వరుఁడు. సం. విణ (అ ఈ అ.) ౧ గొప్పరాజునకు సంబంధించినవాఁడు. ౨. శివుని సంబంధమైనవాఁడు. 3. శివుని పూజించువాఁడు

## మి

మి. ప్ర. వ్యతిరేకభావార్థమున ధాతువునకు వచ్చు ప్రత్యయము

ఉదా . అనమ్మి, కనమి, చూడమి, రామి మొ.

శా తీ, పార స్నేఁ జన నీమియున్ మగిడి
నీవా రామియు నైల్లము

ఆము ౬. ౪౧

మింగడ. వి. = మీఁగడ. (శ ర.)

మించేడుగు. వి. (√మించు1) బోయీలు పల్లకీ మోయునపుడు పలుకు హెచ్చరికపదము.

వ. బె స్తలు పదిలము మించడుగు దువాళి,
అన విని . ప్రబంధ. ౬౦౪.

**మించేనాడు.** స. క్రి. (మించు1 + ఆడు) దూషించు, తూలనాడు.

ఉ. అన్యను దాతనుం గఱకు లాడఁగ నేఁటికి
దాదు లైనమి, పెమ్మనిద్ధి మించనాడ నగు
హేయవివర్జితుఁ దాతకన్యఫున్, బ్రువ్వఁగ
దూరఁగాఁ దగదు ...
కృ. శకుం. ౨. ౨౨౭

సీ. అదలించి యే మించనాడిన నెంత లే దను
గాని మాఱు మాటాడ రాదు .
విప్ర. ౪. ౬౩.

**మించారు.** అ. క్రి (√మించు1) మెఱయు, ప్రకాశించు.

సీ. బాలపల్లవములలీలలం బొలివోవ మించారు
కెంగేలికేలిమియును

గీ. మనము సొక్కింపఁ జాల నింపెనయు బోఁటి.
హరి. ఉ. ౩ ౪౩.

**మించిలి.** వి. నిశాంకుశ, ఒకజాతిలీల ? (శ. ర)

**మించు1.** అ. క్రి (క మించు.) ౧. ప్రకాశించు, తళతళ మెఱయు.

సీ. అంబుజాంబకు పూన్కి నతినిర్మలస్థానువున
మించువామార్గతను వనంగ
వసు. ౬. ౩౭.

గీ. నరసవిభుకృష్ణరాయ భూనాథచంద్రు, చేత
నవిలోన మించు కాత్మేయకాంబు
పారి. ౧. ౨౪.

౨. ఒప్పు, శోభిల్లు

సీ. మించు నెవ్వనిమూర్తి మానవిహ్నజయంత
నలనలకూబరాదుల జయించి
కాశీ. ౧. ౫౧.

క. శ్రీ మించువతనిపదములు, భా మా మ ణి
రూర్తు పయిఁడిపావలు దొడిగన్ ...
పారి. ౨. ౩.

ఉ. ... అవి రూలివి గ్రోలినతేటకన్నులల్,
చిప్పిలినట్లు మించునతిలేనగవున్ దలిర్గుఁ
జాఫులన్ ప్రభా. ౨. ౩౩.

౩. అతిశయించు.

(క.) అధికనగు, హెచ్చగు.

గీ. విష్ణురాజమదోల్లాస విభ్రమములు, మించి
విఘ్నోపశాంతిఁ గావించుఁగాఁత
హర. పీఠి. ౫

చ. తనమృదుగీతికా పరిణతధ్వనివైఖరిఁ బల్కు
మంచు మిం, చినరహిఁ జేతివీణియకుఁ జెక్కులు
గీటుచు మోఁటు చున్నదో, యన నఖరాంకు
రంబుల నయమ్మునఁ దంత్రులు మీఁటి గాన
మిం, పొనరఁగఁ జేయువాణి. పారి ౧ ౫.

గీ. మృగమదము మించుతములంపుటిరులు మోవి,
దళముగా సాగరుమాసంతి కెలఁగ
ఆము. ౪ ౧౩౫.

(చ) పృథులమగు, పెద్దదగు.

ఉ. వ్రాసె నొక్కల, జ్జావతి మించుగుబ్బ
వలిచన్నులపై మకరీతిలాపమున్
నైష. ౩ ౧౦౨

వ. మిన్నేటిపెన్నిటివఱ్ఱున మునుంగి కుండ
నవరించినమించుకుంభస్థలం బన
మనుచ. ౩. ౬ హర ౫. ౯౪.

(ట.) సర్వోత్కృష్టుఁడగు

శా. ఆ, శ్రీరంగేంద్రుఁ డశేషరాజ్యపదవీ సింహా
సనాత్మీయుల,త్మీరాజన్నిజ సంతతి ప్రఖ్యాతుఁడై
మించెన్ ధరామండలిన్ వసు. ౧. ౩౨.

సీ. కులములోఁ దరితీపు గలిగి మించినమేటి . .
మనుచ. ౫. ౪౩.

౪. పెరుఁగు, వృద్ధిపొందు,

గీ. సారమున మించుమాయామిసారమూర్తి ,
దశా. ౧. ౨౦౪.

మ. వలరాచటక్కుపుమినవజా సురలఁ బ్రోవ
న్మించుమినంబవో . . దశా. ౧. ౧౫౬.

గీ నీకొల హెచ్చురితెపు మించె రెక్క కొ
హెచ్చు, పెచ్చుఁ బెరిగ ననఁగ వృద్ధిఁజెంద,
ననుట కాఖ్య లగుచు వలరారుచుండు
ఆం. భా. ౩. ౭౯.

౫. విజృంభించు, చెలరేగు.

ద్వి. దండనీతిక్రియల్ దానధర్మములు, మెండ డోడి
చెడిపోవు మింతురు రిపులు, జారులు చోరులు
సందడింపుదురు
రం. రా అనో. ౧౭౯ పా. ౨౩. పం.

చ కనుఁగవఁ జీకటుల్ గవియఁ గర్ణపుటంబుల
దిమ్ము గ్రమ్మ మించుచును జరఠాగ్ని దుర్బలత
చొప్పడు నంగములన్ శిరంబు నొచ్చు
నితరభోగ్యవస్తువులు నూడ సహింపడు
మాటమాత్ర మాడను మది పుట్ట దాఁకిటఁ
బడ న్వశమే తృణ మైన నేరికిన్.
దశా ౨ ౧౩౫ దశా ౩ ౯౪.

౬. వ్యాపించు.

ద్వి నీకేఁటి తప్పులు నిఖిలలోకముల, నీకితం
బున మించ నేఁడు నాకీర్తి
ద్వి హరిశ్చ. ఉ. ౨౩౩. పం.

మ. శశి రేవతీరమణుఁ డున్మాదంబు
నాటం దమో, యమునన్ భంగము నొంది
పాఱఁ గరసీరాలోడితం జేయ వచ్చె మరు
ద్వాహిని దానిఁ దేర్ప నన మించెం జంద్రికా
పూరముల్. పారి. ౨. ౭౬.

మ. ఉద్యద్ధర్మ శాస్త్రక్రియన్, మనుకాత్యా
యనదత్తగౌతములసామగ్ర్యంబునన్ మించె.
విక్ర. ౧. ౩౧.

౭. సాంతమగు, ముగియు, సమాప్తమగు.

గీ. మంచి దని నాగవల్లట మించినపుడె,
యాలిఁ దోడ్కొని తనయగ్రహారమునకుఁ,
బోయి . కుశ. ౨. ౧౬౯.

స. క్రి. = మంచు౩. (క. త. మింజా.) ౧. అతి
క్రమించు, దాఁటిపోవు.

సీ. నలుగ రేఁతెంచి యున్నాఁడు లేనియింత
కోపపుఁబలుకిది యేమి పదఁతి యనుచుఁ,
దనభార్యఁ బలికె నవ్వనితయుఁ గోపంబు
మించి శోభిలు మృదుస్మితముతోడ
కళా. ౫. ౫౨.

శా ఘంటాకర్ణుని మించుకర్మ మెంకో నాకర్మంబు.
ఆము. ౬. ౫౭.

సీ. గోకముల్ పచ్చాకు కచ్చూరములు చాల
నించిన కొట్టడిల్ మించి యేఁగి

గీ మాఁదె నోక దివ్యరత్ననిస్తుల గృహంబు
హంస. ౧ ౭౧.

గీ. నీకొల ననఁ గడచె ననఁగ మించె ననుట,
పొలిచియుండును
ఆం. భా. ౩. ౧౭౭.

౨. జయించు

క వారలు గనుఁగొని రతివి, స్వారాడ్నత
మత్స్యరాజధానిని లవణాం, భోరాశిఁ గాళి
మగుణో, దారతచే మించు వనచరుము గల
దానిన్ రాఘవ. ౩. ౧౩౬.

(భారతార్థమున.)

క. భీమార్జున బాహుబలో, ద్దామత నీ వెలఁగి
నదియు రజ్జయు శాలిన్, దా మిక్కలి
కాగ్న్యస్నతి, చే మించినమేటి యతనిఁ జెనకి
బ్రతికెడి. రాఘవ. ౪ ౭౭.

(రామాయణార్థమున.)

సీ. కందర్పు మఱపించి యిందుని నిందించి నల
కూబరు హసించి నలుని మించి
కళా. ౧. ౨౬.

౩. తీర్చుకొను, సఫలము చేయు.

సీ. నాని కౌఁగిటఁ జిక్కి వలపు మించినఁ గాని
కొంత సొమ్మది గాదు కొమ్మలార
ఇందు. ౩. ౧౫.

చేమించు = చేయిదాఁటు, కడచిపోవు

క. చనునే యిటువలెఁ జింతిల్ల నృపాలక
నింద రావలసి నా పలుకుల్, వినవైతివి
చేమించిన, పనులకు నీ వింకఁ గస్తి పడవచ్చు
నాకో. సారంగ ౩. ౨౨౫

వి. ౧ తళతళ కాంతి, కాంతి, ప్రకాశము

గీ. మేటిజమ్మేటి యసటఁ గ్రొమ్మించుమించుఁ,
బొదివి మదనప్రతాపాగ్నిఁ బుటము వెట్టి,
తమ్మి గద్దియదాకటఁ గ్రమ్మి యట్టి, కొమ్మఁ
గావింపఁబోలు నెత్తమ్మిచూలి
వసు ౭ ౩౨

ద్వి. మెఱుఁగు లేవడి యైన మించు సడలిన,
సెజ్జఁ జందనమునకుఁ గొఱఁత దోఁచినను
బ స పు ర ౯౬౮ పం

సీ. మెఱుఁగారుకోలల మించులు గదురంగ నతి
భీషణంబుగా నవుడు గఱచి
భా. రా యు ౧౩౭౫

సీ. అచ్చవెన్నెలమించు నపహసించు విభూతి
యంగరాగంబు గా నలవరించి
విక్ర. ౨ ౯౩.

౨ మెఱపు, విద్యుత్తు

గీ. అలుక వహియించి కార్తవీర్యార్జునుండు,
బాహుగదఁ బూన్చి గర్జించు పంక్తిముఖుని,
యురవెంరయ సేయ వది యొప్పె నుఱు
ముకాల, మేఘమున మించుఁ గనుపించు
మించుఁబోలె ఉ. రా. ౩ ౨౪౩

మ. తనతోయం బిసరశ్మి లెత్త నిల వాత్యా
రేణుమూర్తి స్మహేం, ద్రువకుం జెప్పఁగ
ద్రుచ్చుఁ బట్ట దివమందున్ విల్లుటింపం
భయం, బునఁ దద్రశ్మిసహస్రము స్వైస
డిగెం బో డాఁగి వే గ్రుమ్మరింప నసం
ధారలు దోఁచె మించు వెలిగింప న్మబ్బు
లస్వెల్లిపై.
ఆము. ౪ ౭౩. ౯౪ ౨. ౧౯౯.

౩. కిరణము.

సీ. మినుకు తళుకు నిగ్గు మించు తళు కనంగఁ
గిరణనామంబులై కిరలుచుండు
ఆం భా ౧ ౭౨.

౪ ఆధిక్యము

క ఆశోభయ రంజనగుణ పేశలమై మించు
గలిగి బెరపిన విద్యా, కౌశలులు కాంతి
యంద్రు కావ్యా ౭ ౨౭.

సీ దానగుణంబునఁ ద గ్గొనర్పఁబు కాదు ధన
వృద్ధి నిరపించు ధనదుమించు
చెన్న పీఠి ౯౫

చ అమలినతేజ మెన్నఁ దరుణారుణకోటికి
మించుఁ జూపెడున్ పరమ ౧ ౧౯౦.

౫ మట్టియ, స్త్రీలు కాలిరెండవ్రేలికి పెట్టు
కొను ఆభరణవిశేషము; పురుషులు కుడికాలి
రెండవ్రేలికి పెట్టుకొను ఆభరణవిశేషము.

రగడ. సరిపణలు మించులును సాటిలేనితురాలు,
రంగుగల ముంగామురాలు నాభరణములు
హంస. ౫. ౩౫౬.

వ. అవ్విరించి జనకునకు నరణంబుగా మించులు
గండపెండేరంబులు రాకట్టు మొలకట్టు లుంగ
రంబులు ముంగైమురారు లంగదంబులు.
ప్రబంధ ౯౦౫.

విశే. ౧ తళతళకాంతిగలది.

ఉ. వాలికమించుఁగన్గొనలవాకిట నల్లన సంచ
రింపనుం, జాలక .. శైవ. ౨. ౧౧౨.

సీ. తనకూనముసోగనుఁ గన్గొను సెప్పు దంధుండు
మించుటద్దంబు చే నంచుకొన్న .
సీతా. ౩. ౪౩.

౨. అధికము, గొప్పది.

ఉ. కాంచి కటీతటీఘటితకాంచనచేలములన్ దృఢస్థితిన్, గాంచికలన్ బిగించి మణికల్పిత భూషణపంక్తి చక్కఁగా, నంచి కరార విందముల నొప్పుగుచిమ్మనగోవి మించు లౌ, మించులసంచు నొంచ నెలమిన్ బలిమిన్ కెలిమిం జెలంగుచున్. ఇందు. 3 ౫౮.

(మించు లౌ = అధికము లగు,మించులసంచు= కాంతుల విధము )

సీ. పైమీఁద దిమప్పటి బరువనువారిచే మించైన మాట మోయించినావు
సిం. నార. ౭౪

ద్వి. ముల్లోకముల సమమును మించు లేని,మల్లా పురం బనుమహనీయపురిని
ద్వి. పరమ. ౧. ౪౦

జ. మించేదుగు, మించేనాడు, మించారు, మించుఁగంటి, మించుఁగన్ను, మించుఁ గాలు, మించుఁబోఁడి, మించుదల

మించు². వి. ఒకజాతిడేగ.

గీ. వారణంబును జలకట్టె డైరి గిద్ద, చంచడమను సాళువము శనిశరము మించు, వేట్రిమును తెలు కాదిగ వేర వేర, నొప్పడేగల జత గూర్చు కుండుటయును. ప్రబంధ. ౧౯౧.

మించుఁగంటి. వి. (√మించు) చంచలాక్షి, మెఱుపువలె చలించుకన్నులు గలఆఁడుది ; స్త్రీ.

ద్వి. తొంటిచందమున నాలోలిమించుఁగంటి, చంటిడాపలఁ జేర్చ జలజనేత్రుండు
అ. మ. క. ౧. 38. పౌ. ౧౬. పం.

మించుఁగన్ను. వి. (√మించు¹) పిల్లి.

సీ. పొసఁగు రాజావర్తపుం బారువములకుఁ బొంచునై దూర్యంబు మించుఁగన్ను
రా. వి. ౫. ౭౫.

మించుఁగాలు. వి. (మించు¹ + కాలు) దక్షిణ పాదము.

ఉ. క్రొన్నెలకాల్పు నింగిసిగకుం గనుగందని పూలదండయున్, వెన్నునిమించుఁగాలిబోటు క్రేలికఁ గూఁతురు రామా. ౫. ౧౯.

మించుఁబోఁడి(ణి). వి. (√మించు¹) మెఱుపు వలె మనోజ్ఞమైన ఆఁడుది ; స్త్రీ.

గీ అడుగులు చెంగలువలు, బొమలు సింగిణు లమ్మించుఁబోఁడి కరయ నీలా ౧ ౫౬.

వ గండోపలంబులపై వసియించు చెంచు మించుఁబోఁడుల దశా. ౫ ౧౧౫

గీ మేటిరితులకు సురకాణి మించుబోణి, దాని కెనయైనదాన జగాన గాన
కళా. ౪. ౫౦.

మించుదల. వి. (√మించు ) ౧. ఆధిక్యము ౨ అతిక్రమణము (శ. ర )

మింటిముక్కిడివల. వి. (√మిన్ను) జాల విశే షము, ఒక విధమైన వల.

క. మెడవల సన్నపువల త్రోఁపుడువల డొంక వల మింట ముక్కిడివల దాఁటుడువల .. ఆదు లెసఁగెడి వలలున్
హంస. ౪. ౧౭౫.

మింటికాఁపరులు. వి. బ. (√మిన్ను) దివిష దులు

(సముద్ర వర్ణనము.) సీ. మింటి కాఁపరులకు మృష్టాన్నసత్రంబు సకల దివ్యపదార్థ జన్మ భూమి చం. రా. ౨. 3.

మింటికాఁపురంబులవారు. వి. బ. (√మిన్ను) దివిషదులు, దేవతలు.

ద్వి. బంగారు బోఁడుల పాలిండ్లఁబోలు, బిలగారు కుండలపస మించి మింటి, కాఁపు

రంబుల వారు కని సన్నుతించు, గోపురం
బులం. ద్వి. పరమ. ౧. ౩౩. పా.

**మింటితెరువరి.** వి. (√మిన్ను) ౧. ఖేచరుఁడు, సూర్యుఁడు, (శ. ర.)

౨. బ దేవతలు.

క. ఆడిరి వేలుపుచానలు, పాడిరి గంధర్వసతులు
ప్రమదం బెసఁగన్, బ్రోడ లగుమింటి తెరు
వరి,చేడియ లటు చల్లి రలరువేసలు పేర్మిన్.
జాహ్నవి ౧. ౧౩౮.

గీ మదము దైవాఱ ముప్పది మూఁడుకోట్ల,
మింటి తెరువరిమూఁకలు నంటి కొలువ
చంద్రా. ౧ (శ. ర.)

**మింటిమానికము.** వి (√మిన్ను) అంబర
మణి, సూర్యుఁడు

వ. వేఱొండు దివసంబున జనకతనయ పట్ట
పగలింటి మింటిమానికంపుఁగాఁక తలకు
పోఁకలకు నులుకుచు రామా ౫ ౩౩.

**మింటిమ్రాను.** వి. (√మిన్ను) కల్పవృక్షము

సీ. మింటిమ్రాఁకులవంటి యంటిమ్రాఁకులు ప్రాఁకి
జంటితేనెలు గ్రాలుసొంపు మాని
వాల్మీ ౭ ౧౭౯.

**మింటిసికవేల్పు.** వి. (మిన్ను + సిక + వేల్పు)
వ్యోమకేశుఁడు, శివుఁడు

శి మింటిసికవేల్పు మిక్కిలి, కంటిసెకన్ వొచ్చి
పుట్టు గానక పోఁకున్, వెంటఁబడి మరుఁడు
వాఱం,గంటీ రాఁదగుసె యెంతగండము గడ
చెన్ యయా ౫ ౧౩౮.

**మింఠుఁడు.** సం వి. అ పుం విటుఁడు.

క. మింఠజనదత్తమేషీ, కంఠసముద్భూతరవము
కడుసెమ్మది మృత్కంఠ సలిపె పౌర్యకల,
కంఠుల కి త్తతి గృహోపకంఠము లంమన్
హైజ ౩. ౭౩.

**మిండ.** వి. రక్తపుచ్ఛిక, నలికండ్లపాము.

సీ. ... నల్లి కం చన నలికిరి యన, మిండ యం
చనఁగను పిూఱు రక్త, పుచ్ఛి
ఆం. భా. ౭ ౭౪.

**మిండఁడు.** వి. (సం. మింఠః, క. మిణ్డ.)
విటుఁడు.

క. తిండికతంబునఁ గండలు, మెండుగఁ దాఁ
బెంచి మగఁడు మెదలఁ దనుచు ను, ద్దండత
నది మిండనికిన్, వండినకుడు మనఁగ దుడ్డు
వైఖరి నుండున్ శుక. ౭. ౧౦౭.

క పుడమి నిఁకిలంజెతల్లిన్, గడుమిూఱిన యట్టి
కీడు గలదే యది రొ, య్యొడఁ జూచినఁ
గూఁతునతున్, మెదకోఁణము త్రోపుగుదియు
మిండల కెల్లన్ ద్వా. ౪ ౭౭౮.

గీ కోఁఱపిగ పేయుచోటనే కొమ్ము పుట్టి, చెఱ
చినది గాని యెంతైనఁ జేయవచ్చు, కిడపట
భుజంగకేపంబు వదపినప్వ, దుండుఁబో
గండుమిూఱి యిమ్మిండతపవి.
గాసూ. ౭. ౧౧౦.

గీ. అంగజారాతి యొక మిండజంగ మగుచు ..
కాశి. ౧. ౩౦.

గీ. జారుపేరు మేలు, వాఁ డనఁగ మిండఁ డన
మిండగీఁ డనఁ దగు. ఆం భా. ౭. ౧౧౫.

౨. పురుషుఁడు.

సీ ధరలోన గలుగు నొప్పర మిండలకు సెల్ల
మెుదలు వాఁ జాలినయాత్రివాని
దశ. కు. ౫. ౪౦.

గీ పుండరీకుని మానసాంభోజమీతి, మిండతుమ్మెద
రై యుండు నిండుకొలువు
పాండు ౭. ౧౧. హైమ. ౪. ౧౪.

**విశ.** (క మిణ్డ. త. మిణ్ణన్.) ౧. అధికుఁడు,
శ్రేష్ఠుఁడు; అధికము, పెద్ద.

ఆ. పేర్మి నదురుగుండె నీక్క_చెదురు లేక, యుండ
వచ్చుఁ బేద యొలుకు దక్కి_, రమణ గోఁచి
పాఁతరాయఁడు దొంగల, మిండఁ దొకెడి
మాటమేలు దెలిసి. కుచేల 3. ౪౩.

సీ. సరశిపాదామనీ సల్లాపముల మేను గఱుపాఱు
మిండ మేఘుంబులో లె

గీ. నంతకంతకుఁ జిట్టంటు లంటి యుంటి, చెలువ
లకు యౌవనము విందు చేయు నన్న, మాన
గుణబద్ధు మన్మథమంత్రసిద్ధు, రుచిరరసవృద్ధు
నాయనిరుద్ధుఁ జూచి.

ఉ. హరి ౫ ౧౧౭. (వీరేశ పా)

క కిమ్మారాంతకబలునకు, ధమ్మిల్లనవప్రసూన
ధరునకుఁ దరుణీ, సమ్మోహపంచశరునకు,
దమ్మయుజసవనికి సుభయదళిమిండనికిన్

నా. పంచ ౧ ౪౬.

౨. తరుణము, లేఁతది

(చూ. మిండప్రాయము)

జ. మిండగము, మిండ గాఁడు, మిండగీఁడు,
మింతక, మిండప్రాయము, మిండతీకము,
మిండలకోరి, మిండాటము.

మిండగము. వి. (√మిండఁడు) జారత్వము.

(చూ. మిండగీఁడు.)

మిండగాఁడు = మిండగీఁడు. వి. (మిండఁడు +
కాఁడు స్వార్థమున) విటుఁడు.

ఉ. ఓమునిపార్శ్వభోమ పరసోక్తుల బాఁడని
మిండగానితో, సేమి నిందసేసి

విరం. ౪. ౩౬.

మిండగీఁడు = మిండగాఁడు. వి. (మిండగము +
ఈఁడు. ఐ. మిండగిండ్రు) విటుఁడు

సీ. కామిని యూతఁడే ఘనజటావళిలోన
మిన్నేఱు దాఁచినమిండగీఁడు . .

వీర. 3. ౧౫౩.

ఆ. కడిమికత్తు లమ్మి నిడువాలుఁగన్నులు, గండ
మాల నడఁచుమిండగీఁడు .

క్రీడా. ౨౪౩. ఆం ళా. ౨ ౧౧౫.

మిండత. వి. (మిండఁడు + త.) జారిణి, లంకు
టాలు.

ద్వి. బిడ్డల కొసఁగక పెండ్లాన కిడక, వడ్డి
కిచ్చుచుఁ దీమవలెఁ గూడఁబెట్టి, ధనమంత
యును మిండతల కిచ్చె

ద్వి. హరిశ్చ. ఉ. ౧౦౨౩. పం.

వ. ఆ ట్లది త్త్రప్రతివచనం బైయుండ నమ్మిండత
వెండియుఁ దొరువరి నీక్షించి

వేం పంచ. ౪ ౪౨౪.

మిండప్రాయము మి వి. (మిండఁడు +
ప్రాయము) యౌవనము

ద్వి. దండిగిండము ముంపఁ దర్ప్పణమాత్ర, మిండ
ప్రాయంబున మీఁదికి సెగయు

ద్వి. భాగ ౪. ౨౦౦౯. (బ్రౌ.)

మిండతీకము. వి. (మిండఁడు + తీకము) లంకు,
జారత్వము.

ఉ. ఏను మీ, దేవత లున్నచోటి కరుదెం
తురా మిండతీకంబుచేఁతకై, లావున రాక
పోకొకలంబున వచ్చినఁ గీడు పుట్టదే .

ఉ. హరి. ౧. ౬౩.

గీ. మనుపఁ బుట్టింపఁ ద్రుంప సమర్థుఁ డీవి,
భండు పదియాఱు వేలాఁడుమిండునిండు,
మిండతీకమునఁ గిడముట్టకుండు మనసు,
వాఁడు నీఁ దమ్మ యదుపంశవల్లభుండు.

పాంచా. ౨. ౧౬.

మిండలకోరి. వి. (√మిండఁడు) మిండత,
జారిణి. (శ. ర., బ్రౌ.)

మిండాటము. వి. (√మిండఁడు) జారత్వము,
లంకుతనము.

క. మిండాట మాడి పొలిసిన, మిండలకును కైన
వృత్తి మే లని
దశకు. ౫. ౫౮ ఉ. ౯౫.

మిక్కటము = మిక్కుటము. విశే. (త. మిక్కటు, క. మెక్కటి.) మిక్కిలి, అధికము.
(శ. ర., (శా.)

మిక్కిలి. విశే. (√మిక్కిలు. త. మిక్కు.) ౧ అధికము, ఎక్కువ

క. అక్కొడుకు నబ్జనాభుం, డక్కజముగ నెత్తి
కొమడం నందఱుఁ జూడన్, (గక్కన
నొక్కట నడఁగెను, మిక్కిలిచేతులును వాని
మిక్కిలి కన్నున్. భార. సభా. ౨. ౫౪.

చ. . నమనోవిభుతుల్యుఁడ వైననిన్ను మి,
క్కిలియగు భక్తిఁ గొల్చి కృతకృత్యతఁ
బొందుదు మట్ల చేయవే
భార విరా ౧. ౨౦౩.

ఉ. నిక్కము బంట వై యపుడు నీరజనాభుని
ముందటన్ గడున్, మిక్కిలిమాట లాడి
యిటు మేకొని వచ్చితి కార్యభార మి,
వక్కట నీవశంబె భువనైకధనుర్ధరుఁడు దాన
వాంతకుం, డక్కటి చేయునేఁత.
హరి. ఉ. ౫ ౬౯.

సీ. ఎచ్చు పెల్లదనము హెచ్చు మిగత, మిక్కిలి
. యొక్కువ మెం డగ్గలము ప్రెచ్చెడుగు
నాఁగ నధికంబు తోఁచుచుండు .
ఆం. భా. 3. ౨౪. పరమ. 3. ౨౩.౨. పా.

౨. (శ్రేష్ఠము, సర్వోత్కృష్టము.

క. కావున సత్యము మిక్కిలి, గా విమల
(ప్రతిభఁ దలఁచి . భార. ఆది. ౪ ౯౭.

సీ. సత్యంబు వలనకట సర్వధర్మములకు మిక్కిలి
యనృతంబు మేటిపాప, కను ...
భార. శాం. 3. ౪౫.

(క్రి. విశే. అధికముగా, ఎక్కువగా.

ఉ. విదర్భజా స్తవనశీలుర మిక్కిలి గార
వించుచున్ సైమ. ౬. ౩౧.

క. రక్కసులు వేదబంబుల, మిక్కిలి నాము
కొని కొట్టుమిట్టాడంగా, నక్కట రొక్క
మెకమునకై, యిక్కానల నొంటి దిరుగు
టిది తగ వగునే యయా. ౨. ౫౪.

సీ. మోమోట మంత్రంబుచో మిక్కి లిడు
కొంట మంత్రభేత్తను నాజ్ఞ మఱచి
యుంట ఆను ౪. ౨౫.౨.

మిక్కిలికంటివేల్పు. వి. (మిక్కిలి + కన్ను + వేల్పు) శివుఁడు, ముక్కంటి.

గీ కన్ను దలమానికము బంజికల్లు జగిలె,
కాఁడు నై యొప్పు మిక్కిలికంటివేల్పు,
నలరఁజేయువలంతి యగ్గలపుజల్ల, దనము
మెఱపుచు నంతకంతకు వెలింగె.
అచ్చ రా అయో. ౧౯.

మిక్కిలికంటిసామి. వి (మిక్కిలి + కన్ను + సామి) మిక్కిలి కంటివేల్పు, శివుఁడు.

ద్వి (మొక్కి యి ట్లనెఁ జిత్తమునఁ దలపోసి,
మిక్కిలి కంటిసామికిని నామీఁద, నెన్నఁడు
దయ వచ్చు నెపుడు పెండ్లాడు
మ్మ వి. ౨ ౪౩.

మిక్కిలిక(న్ను)ను. వి. (మిక్కిలి + కన్ను)
మూఁడవకన్ను, ఫాలనేత్రము.

క. విను మలుక నొడమి మిక్కిలి, కను దెఱచిన
త్రిపురవైరికై వడి యీయుద్ధమునందు దోఁచు
చున్నది భార. భీష్మ. 3. ౯౩.

క. .. తంతటినిం, గనుగొనుచుఁబున్యుఁడు మిక్కిలి,
కనుఁ గొను సెన్నుదుట నెన్నఁగాఁ దర
మగునే . దశా. ౧. ౧౨౩.

సీ. గుజ్జాకేలుపు ముద్దుంగుజ్జ మిక్కిలికన్ను పుసుక
కంచంబున భూతిపూఁత రామలిం. ౧.

ద్వి. కర మర్థి మిక్కిలి క న్నిచ్చుటయును
ద్వి. భాగ. ౮. ౬౧౪. (బ్రా.)

మిక్కిలిచూపు. వి. (మిక్కిలి + చూపు) మూఁడవకన్ను, ఫాలనేత్రము.

సీ. పుసుక తమ్మంటులఁ బొలుచువీనులవారు
నొసల మిక్కిలిచూపు లెసఁగువారు
పాండు ౧ ౯౫.

మిక్కిలివాఁడు. విణ (√మిక్కిలి) అధికుఁడు.

ఉ. పాండవుల్, మిక్కిలివారు నీతలఁపుమే
గెలువన్ వశమే మహేశ్వరా
భార. ద్రో ౫ ౧౭౪.

మిక్కిలు. అ క్రి (క మిగు. త మిసు.) ౧. అతిశయించు

క. తల దలతోఁ దాఁకించిన, దల మీఱుం
గాలు గాలఁ దాఁకించిన మిక్కిలుఁ గాలు
గేలు సేతుల, గులికినఁ దనచేయి మీఁ
దగున్ ద్రోటునకున్. ఉ. హరి. ౬ ౧౦౬.

౨. విజృంభించు, చెలరేఁగు.

సీ. ఆదిత్యుఁ డుదయింప నభిముఖం బై నక్క
వాపోయె మంటలు వాఁతఁ గలుగ, మిక్కిలు
చున్నవి మెఱపి గృధ్రాదులు గర్దభాదులు
దీర్ఘ క్రందుకొనియె భాగ. ౧. ౩౩౬.

వి. మిగులు, విశేషము. (బ. మిక్కిలులు, మిక్కి
ళులు, మిక్కిళ్లు)

ద్వి. బలుడొక్క చిఱుడొక్క పాళ్లమిక్కిళ్లు,
పరదేశి విద్యార్థిపా లంచు
బస. పు. ౩. ౩౯. పం. (చి. వి. పా.)

జ : మిక్కిలి, మిక్కిలి కంటికెలువు, మిక్కిలి కంటిసామి, మిక్కిలికను, మిక్కిలిచూపు, మిక్కిలివాఁడు.

మిక్కుటము = మిక్కటము. విణ. అధికము.

మ. అం, కటిలో నీపని సక్కనయ్యెడు
నపేతప్రాణుఁగావింతు మిక్కుటపుం ద్రో
వ్వడఁగంగఁ గుండు పెద మాగోపుండునుం
బాలికా హరి ఉ. ౬. ౧౪౩.

ద్వి. కోపించి యపుడు మిక్కుట మైనకడిమి,
దీపించి దూషణత్రిశిరులు మొదలు
రం. రా ఆర. ౧౬౦ పా. ౨౮ పం.

క. కోపదహనుం డత్యు, ద్భటమూర్తిఁ
దాల్చె నన మిక్కుట మై కడకంటికెంపు
గొమరారంగన్ భార. అశ్వ. ౪. ౧౬.

మ. పొల్పొందుకాలంబు మిక్కుటపుం
డెంపునఁ బూని కేశవుని పత్యోదేశమున్
గ్రుమ్మి
ఉ రా ౨. ౨౦౨ నీలా ౧. ౧౪.

మిగత. విణ ౧ మిగిలినది, శేషించినది.

(వ్యవ) రైతునిన్నసే మిగతసొమ్ము యిచ్చి
నాఁడు. (వి అని శ. ర.)

౨. అధికము.

సీ. ఎచ్చు పెల్లదనము హెచ్చు మిగత,
మిక్కిలి రొక్కవ మెం దగ్గలము పె
చ్చెదుగు నాఁగ నధికంబు నోఁచుచుండు
ఆం. భా. ౩. ౨౪.

వి. లాభము.

గీ. మిగత మిగు లన లాభంబు మీఱుచుండు
ఆం. భా. ౨. ౨౬౩.

(ప్రాఁతప్రతి పా మిగితి క్రొత్తప్రతి పా. మిగిలి
తాళప్రతిపా.)

మిగులు = మిపులు. అ క్రి. (క. మిగు. త. మిసు.) ౧. సంఖ్యయందు అధికమగు, ఎక్కుడగు; అధికమాగా కలుగు, ఎక్కువగా పుట్టు.

ఆ. వీని శౌరులం పంపగా నోప రెవ్వరు, సెవ్వ
రేని వీని నెత్తిపోనుడు, మిగిలి యున్నబాహు
యుగళంబుఁ గన్నను, నడఁగు వీని కతఁడ
యంతకుండు . . భార. సభా. ౨. ౪౩.

క. మాయందు లేనిగుణములు, మీయనురాగమునఁ
జేసి మిగిలి కలిఁగెన్ భార. అర. ౧ ౮.

౨. అతిశయించు, ఎక్కుడగు.

సీ. భోగ దంత కంతకు మిగిలిన నింతికిఁ బదముల
నటఁ దొట్రుపాటు చేరెను
భార విరా ౨. ౧౦౬.

చ. సురాంగనాళికిన్, మిగిలినపేర్మి మైఁ
దనరుమేనక దల్లి కు. సం. ౪ ౮౫౨.

క. నారాయణు భూప్రభృతిక, గౌరవవద్వస్తు
వితతికంటె మిగిలి పెంపారుగరిష్ఠత గలపర,
పూరుషు శరణంబు వేడి పొగడెద నిన్నున్.
ఆము ౬. ౧౦౧.

౩. మీఱు, తలకడచు; నడచిపోవు, దాఁటు.

క. కురుసేనఁ జూచి యప్పుడు, నరనారాయణులు
దమపెంపునకు మిగిలి సము, ద్ధరలీల సూర్య
చంద్ర, స్ఫురణము లొక్కెడన మెఱయు
పోలిక నమరన్. భార. భీష్మ. ౨. ౧౪౦.

క. నిజభుటకు మిగిలి యుత్తరు, గజ మమ్మద్రేశు
రథము గదిసి తురంగ, వ్రజముపయిఁ గదిరి
భార. భీష్మ. ౧. ౧౮౨.

గీ. ధరణి కంద లైన పంచభూతములకంటె,
మనముకంటెను బుద్ధికంటెను మహత్తరంబు
గాలంబు గాలతత్వంబు మిగిలి,యుండు విభుఁ
డిజ్జగంబుల కొడయఁ డతఁడు.
భార శాం. ౪. ౧౮౪.

౪. మట్టుమీఱు.

గీ. పరుషవాక్కులఁ గ్రూరంపుఁ జరితములను,
మిగిలి వర్తించువారల నామెచ్చ గారు .
భార. శాం. ౫. ౧౧.

తరలము. .. అన్యులసంపదల్, మిగిలి చేసిన
నిట్లు చేసిన మెత్తురే మది నుత్తముల్
భార. సభా. ౨. ౩౧౪.

౫. విజృంభించు, చెలరేఁగు.

ఉ. ఏపున దానవుల్ మిగిలి రెందును పేలువు
మూఁకఁ గ్రూరమూ, యాపరికీర్ణపాశనిచయం
బులఁ గట్టిన హరి. పూ. ౪. ౧౦౦.

౬. అతిశయించు, ఉత్కృష్టమగు.

ద్వి. మిగిలినబాసకు మెచ్చి ప్రాయంబు,
మగుడఁగ నీఁడె కుమ్మరకుండయకును .
బస పు ౬. ౯౫౪. పం.

౭. అతిరిక్తమగు, పేఁగు.

గీ. అర్జునుఁడు ప్రాణతుల్యుండు హరికి నట్లు,
గాన జలపూర్ణమంగళకలశమునకుఁ, బాద్యము
నకును గుశల సంప్రశ్నమునకు, మిగుల
నొందు జనార్దను మెచ్చు గాదు
భార ఉద్యో. ౩. ౧౬౦.
భార. శాం. ౬. ౬౦౦.

౮. శేషించు.

(వ్యవ.) పెండ్లికి తెచ్చిన సంభారములలో చాల
భాగము మిగిలినది.

౯. నిగుడు, మీఁది కుబుకు.

చ. కపటము డించి యే గుసుకఁగా సురెఁ
గొంకులఁ దార్చి కూలుడు, న్నవిడిచబొజ్జపై
మిగులునిద్దపుదోవతిదట్టి డొల్లి రాఁ, దివిచి
పెనంగ పల్లవముఁ ద్రెంచి. ఆము. ౬. ౮౧.

స. క్రి. అతిశయింపఁజేయు, పెంపొందించు.

సీ. నిడువాలుకనుదోయినిసుపారుకాంతికిఁ గలికి
క్రీఁగన్నులనలువు మిగుల ... నిర్వ. ౧. ౫౫.

ఆ. క్రి. స. క్రి. ౧. అతిక్రమించు, మీఱు.

క. నగుచు బ్రహ్మన్నల యిట్లను, జగదీశ్వర
పుత్రి నాకు సారథ్యము సేర్చు గలదు

నీమాటకు నే, మిగులంగా వెంతుఁ బొదము
మీఁద ట్లుండెన్. భార. విరా. ౪. ౩౦.

క. రావించి తగవు పై సంభావింపవ కాక
నాఁడ పాండవు లలుకం, బో విడువర
మిగులందురే, నీవచనంబులకుఁ బిలిచి విలు
వుము వారిన్. భాగ. ఉద్యో ౨. ౨౦౩.

మ. భుజబలాటోపంబు పై నొండొరున్, మిగులం
జాలక కొంతసేపు వడి మేమే బోరి రుద్రా
కృతిన్ భార విరా. ౨. ౩౪౩.

క. ఇనశశితేజంబుల జగి, మనికము విధి నడపు
కొంత యని వాని మహిం, జననీకతారక
ప్రభ, జన నడపెడి మిమ్ము మిగిలి సామర్థ్య
మునన్ . కు. సం. ౪ ౩౭౦.

క నను మిగిలి జగతి కల్పించినవాఁ డెవ్వఁడు
నిశాంతచిత్తామిక్, నను మిగిలి యజ్ఞ
ఫలముం, గొనియెడువాఁ డెవ్వఁ డనుచుఁ
గోపించుటయున్. వరాహ ౫ ౧౦౯.

ఉ. పురసంహారుఁ డైనఁ బుగాకృతంబులన్,
దా మిగులంగ నేర్పు నె వృథారుదితంబులు
తక్క మిక్కదన్ దశకు. ౫. ౧౦౦.

(దీని తుమున్నాద్యర్థకరూపము క్రి. విశే. గా
ప్రయోగింపఁబడి మిక్కిలి, యెక్కువగా,
అధికముగా, అత్యంతము, అనునర్థముల
నిచ్చుచున్నది.)

చ. జగదేఁపుఁగోటి స త్తరువు సారెకుఁ గోరుచు
నీరి వారిని్, దగిలెడుతండనాలుజడదారి
పారింబోరిఁ గుంచె వీచుచున్, మిగులఁగ
నీలె మోఁటుచు. శశా. ౩. ౧౯౮.

సీ. పవలెల్ల దీర్ఘికాంబువుచల్లపోరాట నలని
మృణాలికాజడము లైనబాహువు త్తమదు
కూర్పరముల కెదురుగా మలఁచి బాపులఁ
గరతలము లనిచి, ప్రాల్మాలి మిగుల
నార్పనికమ్మ క్రొమ్ముడిఁ దని వెంగ్గవిరవాది
దంత విరియ, ధాతగంధా హాది శీతల స్తన
ముల వొందఁ గాగిళ్లతో బోరగిల్లి.

గీ. ప్రియల వేఁకువఁ దొడ పెచ్చరించికలవి,
కలమి ధన్యులు దఱిపె న్నెలబయల్లి
ఆము. ౨. ౬౧.

క. భోజజనపాలసుతం, దరుణీమణిసాత్రా
జతి, నిరువుర మన్నించి మిగుల నిచ్చం
జనవుల్ పారి. ౧. ౪౧.

మ. ఇది మానం బగు నైన నేమి నిశిత
చూకుంతంబునం గ్రుచ్చి యొ,త్తుదుకో
నాఁడికి నిప్పు డంచు మిగులం దుర్వార
గర్వాంధుఁ డై, కదియం జాచి.
దశా. ౧. ౨౯౩.

వి. ౧. శేషము.

సీ. ఏసీట సతులపాలిండ్ల పై గంబూర నవహారము
లచిప్పకపుచు మాన్ప, మలయజం బేటిఁ
గొలుఁ జెక్క దులిచి మేడల కిడ్డమిగులు
భూములకు డిగ్గు.

గీ. తనరు దక్షిణమధుర సాంద్రదుమధుర
ఆము. ౨. ౩.

౨. లాభము.

సీ. మిగతమిగులన లాభంబుమీఱుచుండు.
ఆం. భా. ౨. ౨౬౩. (ప్రాఁతప్రతిపా.)

౩. మిగుల్చు

మిగుల్చు(లుచే.) స క్రి. (√మిగులు) మిగులఁ
జేయు, శేషింపఁ జేయు.

ఉ. . నెయ్యి చాలునం, బ్రావుచు నొక్క
నాఁడు శిఖరత్నము గొన్ని మిగిల్చి యిచ్చి
నన్ పరమ. ౧. ౧౪౯.

మిటమిట. వి. ౧. ఎండ వెన్నెల కాయుటయం
దగునమకరణము.

క. తాసాధ్వి యెట్లు నడచెనో, మోసంగడిఁ
గటికెయెండ మిటమిటఁ గాయన్ .
హంద. ౨. ౨౫.

క. వెన్నెల, మిటమిటఁ గాయంగ మేను
 మిగుల కంటియదే కళా. ౬. ౨౭౪.

వ. పండువెన్నెల వెట్టుకొని పట్టపగటి
 పగిదిఁ గనుపట్టి మిటమిటఁ గాయునప్పుడు
 భాను ౩ ౨౦.

౨. మండుటయం దగునమకరణము

చ మిటమిట మండువేసవిని మించుదివాకరుఁ
 బోలి యుగ్రతన్
 భాగ ౧౦ ఉ ౯౧౫

౩ చూచుటయం దగుననుకరణము

క పులి వట్టినవృషభము గతి, మెలఁగఁగ మిడు
 కంగ వెలిచి మిటమిటఁ జూడన్, బలు
 దైత్యుఁ దిగిచి యూరుస్థలమున నిడి
 మోము జూచి దగ ని ట్లనియెన్.
 పద్మ. ౪ ౧౧౪

(కర్మధారయంబున నిగాగము వచ్చి మిటమిట
 కలది యను. విశే. యర్థ మిచ్చుచున్నది)

క మిటమిటని కటికిరియిండన్, బటపటపటఁ
 బగిలి పాయవడిన పెదురులన్
 చంద్ర ౧ ౧౫౭

క. మిటమిటనిరయెండ గాయఁగఁ, దటతటమని
 గుండె లదరఁ దల్లడపడి
 పద్మ. ౮. ౫౩.

జ. మిటమిటన

మిటమిటన. వి (√మిటమిట) మిటమిట
 యనుట (క. ర)

మిఠా(శా)యి. వి. (క. మిటాయి, త. మిట్టాయి,
 హిం. మిఠాయ్) మధుర మైన భక్ష్యవిశేషము.
 (వ్యవ.) ఈకలవు దినములలో మిఠాయితో
 సమారాధనము చేయుట చాల కష్టము.

మిటారకత్తె(త్తియ.) విశే. (√మిటారము)
 యౌవనగర్వము గల స్త్రీ; అఁడుది

చ. కలికి మిటారికత్తె యనఁ గారుకొనాకారపు
 మేలుబంతి దశా. ౭. ౩౪౪.

మిటారము. వి ౧. విలాసము; శోభ.

సీ నిక్కు మిటారంపు నీటు మిటారము తెక్కు
 తెక్కర పాయ లనఁగ విలాస
 మొప్పుచుండు ఆం భా. ౧ ౧౩౯.

చ. అలజడ యందమున్ మెఱుఁగుటారు మిటా
 రము నాకు ముందుగాఁ, జిలువకోలం
 బటంచుఁ జెలి చెప్పక తొల్తనె చెప్ప
 విజ వి ౧ ౧౭౧.

క కా కుండిన నీగోమును, నీకులుకున్ మైమి
 టార మీ తేటకికిల్, లోకమునఁ గలవె
 చెలువల, కాకమలజునేర్పు బొగడఁగాఁ దర
 మగునే ఉ. హరిశ్చ ౩. ౮౬.

౨. యౌవనగర్వము

సీ. సొగసు మిటారంబు సొంపు నొయ్యారంబు
 నీటు జగ్గుతనంబు సెలితనంబు
 హంస ౫. ౭౬.

వ కెందలిరుటాకుల మిటారంబులు గల
 మహీరుహంబు లన్నియు
 ఇందు. ౮. ౩౪.

విశే. ౧ విలాసము గలది.

ఉ. ఎక్కడనుండి వచ్చెనో, పక్కన వచ్చె
 నమ్మ చలపాది మిటారపునవ్వు లొక్క
 టన్ కువల. ౫. ౩౩.

చ మిటారపుఁ గల్కిచూపులం, దొరసిన
 సిగ్గుతో నళుకుతో నతలంబును గ్రొత్తపెండ్లి
 కూఁతురు పరిచర్య సేయ
 దశా. ౬. ౩౨.

౨. నిక్కు కలది, ఉన్నతము.

ఉ. మేలి పసిండిగిండ్లు నిం, కట్టుగ నీ
 దనం బొసగు నింతి మిటారపు గుబ్బదోయి
 కిన్ నీలా. ౨. ౨౩.

౩. ఒప్పిదమైనది, మనోజ్ఞమైనది.

సీ. ఈ మిటారపుజందమామరాతిన్నైపైఁ గొమ్మ
యుంచుకొనేవు గూరుచుండ
రసిక. ౪. ౪౩.

౪. అధికమైనది, అతిశయించునది

ఉ. పెరగొమ్మల కిమ్మిటారపుం, జా నొక
యింతయేన్ గలుగఁ జాలంగె
అచ్చ. రా బాల ౧౪౪.

జ. మిటారకత్తె, మిటారి, మిటారించు, మిటారింపు, మిటారికత్తియ, మిటారికాఁడు.

మిటారి. వి. (మిటారము + ఇ౩) యౌవనగర్వము గలయాఁడుది

ఉ. జవ్వని యెవ్వనిం దలఁచి చయ్యనఁ బోయెదవే మిటారి నీ, జవ్వనమున్ విలాసమును
జక్కఁదనంబును నీటుఁ జూచినన్, బువ్విలు
కానికైన భ్రమ పుట్టుఁ గదే భువనైక
మోహినీ ఉ రా ౪ ౧౯౬.
ఆం. భా. ౨ ౧౦౫

౨. విలాసవతి; ఆఁడుది.

క. పగడంబుల జగడంబుల, జగడంబు లిడు
న్మిటారి చవిమోవి రుచుల్
ప్రబంధ. ౪౦౩.

గీ. పెక్కువగ జక్కిణీకొప్ప ద్రొక్కి నొక్కి,
చక్కనిమిటారి నరపతుల్ సొక్కి చూడ
దశా. ౮. ౨౧౮.

సీ. వనవింటిదంటఁ గన్నమిటారి మూఁగారు
తీరులా యీ నాచుతీవ చాలు
దశా. ౧. ౧౬౪.

క. మునొక్క పట్టణంబున, సొన్నారిమిటారి
సేన్పు శారత్వము గైకొన్నది యై నడచిన
కథ, చెప్పుగ విని పొమ్ము కడుచిత్రము
కొమ్మా. హంస. ౨. ౧౮౮.

విశే. మనోజ్ఞము, ఒప్పిదమైనది.

ఉ. కమ్మనివింటి జోదు సెలకైదువు లైన మిటారి
తమ్ములీ, తమ్ముల సెట్లు వోలం
వసు. ౫. ౧౦౧.

౨. విలాసము గలది.

ఉ జాకెడు పైటతోఁ గులుకుఁ జక్కవ
గుబ్బలతో మిటారిన, వ్వారెడు మోముతో
గిలుకు టందెలతో దశా. ౨. ౩౫౦.

ఉ. గొల్లమిటారి గుబ్బెతల కోర్కులపంట కదీయ
మానముల్, గొల్లలు బెట్టుదంట మరుగూరిమి
గాంచినమేటి
ముకుంద. ౧. ౩౧. పొ ౩. పం.

చ అనంగుని మామవెలుంగుసొనఁ దీటిన
కలవాఁడితూపుఁ గిషురించినయాఁటిమిటారి
మాపునన్ సారంగ. ౨. ౧౧౩.

౩. శ్రేష్ఠురాలు, శ్రేష్ఠము

ద్వి వెలులలోన మిటారి చికిలికటారి
ద్వి నల. ౧. ౫౮౩

గీ ఒరపులకు నెల్ల నొజ్జయై యుండె నపుడు,
భుజగగజగామిని మిటారి పొలుపు మీఱి
విజ. వి. ౧. ౮౬.

౪. వాఁడి గలది

గీ. వారిలో వారిలోలకహారకమల, వనరిట
ద్భృంగగంగఁ జేకొనిరి సురలు, మారుని
మిటారిచికటారి గౌరి యసాధ్యపొంతకారి
వరించె నయ్యంతకారి. చం. రా. ౩. ౪.

ఉ. మరుఁడు గడిదేతీనదారి మిటారి
కల్వపూ,సేజను పై చె నద్దమజనేతలచిత్తము
లుచ్చి పారఁగన్ . . దశా. ౨. ౩౦౦.

౫. ఉన్నతి గలది, నిక్కు గలది.

చ. కులుకుమిటారి గుబ్బలును గ్రొమ్ముదులున్
బిగిగొనులుం బిఱుందులు గదలంగ .
నీల. ౧. ౩౯.

ఉ. కోడెమిటారిగుబ్బగవ గుచ్ఛిత గ్రుమ్మిన ముస్నచల్లపో, రాడినత్రాంతి దీఁటు బుల కాంకురముల్ చెలువారఁ గుంజరీ, క్రీడల నబ్బుచా స్త్రీపతికిన్ బ్రతిరై జలకేళిఁ దేలి యున్ ఉ. రా. ౬. ౧౦౬.

మిటారించే. అ క్రి (√మిటారము) ౧ నిక్కు, పైకొను

ఉ. మించునొయారమున్ గులుకు సెన్నడ యున్ విడఁబాఱుకొప్పు నొ, క్కించుక జాఱు పయ్యెదయు నిట్టటు దూలెడుహారముల్ మిటా, రించు కుచంబులున్ జలదరించువ లగ్నముఁ బోల్పు మీఱఁగన్ కళా. ౩ ౧౭

మ జిగ్గుపయ్యెంటలోన్, గులుకున్నిప్పుగబ్బి నిబ్బరపుఁ జన్నుల్ ఐల్ మిటారింపగా దశా ౨ ౩౫౧.

౨. వ్యాపించు, ప్రసరించు.

మ. పొడుపుందిప్పు తటాలునం డిగినయంభో జా ప్రతిబింబంబు పం, గడ పై రత్నమరీచి వీచికలం దిగ్వాటిన్ మిటారింపగా పంద. ౫. ౨౭.

౩. అతిశయించు.

మ. కనుగొన్నంతనె కన్యకామణికి లేఁగా వింత గాన్పించెఁ జ, క్కొ నలన్ నీలిమ యావరించె ముఖపాండుశ్రీ మిటారించె ఉ. రా. ౧. ౧౮౧.

మ. చొక్కటద్దముల వర్ణస్వర్ణతాటంకదీ, ప్తి మిటారింపగ నవ్వువెన్నెలలు గల్పింపన్ బురి స్నాట్యాస, ద్మములం జేరు పానందో. ౩. ౭౦

శా. కోలుకోలన్నకో, లాలాపంబుల దండ లాస్యముల నాట్యంబుల్ మిటారింపగన్. త్రి. రం. మా. ౬. ౧౦౮.

౪. విజృంభించు, చెలరేఁగు.

క. బలు వైనవేసడంబులు, జలకట్టెలు తోరణ ములు పాళ్యంబులు గి, డ్డులు మొదలుగఁ గలబడిపేఁ, టలపులుంగులు పదనుతో మిటా రింపంగన్ యయా. ౧. ౧౧౨.

౫. ప్రకాశించు, ఒప్పు.

మ. స్తనశృంగారరసంబు చూచుకిసముద్య న్నీలి మన్ గానిపిం, చి నవీనం బగుపూఁతకస్తురిరు చిన్ జెల్వొంది పై నిండి జా, తినతద్ధా గిరియు నాఁగఁ దార్కొని మిటారించెన్ భవద్రోమరా, జి ఉ రా ౬ ౧౮౭

స క్రి అతిక్రమించు, మించు

క సోగమెఱుంగు కనుంగవ, రాగలవంబులకుఁ బెంపు రాగలసొంపున్, బాగుగల మోవి బంగరు, తీఁగ మిటారించుమేను తెలివకుఁ బోల్చన్ ముకుంద. ౨. ౯౦.

మిటారింపు. వి (√మిటారించే) మిటారము, విలాసము

సీ. నిక్కుమిటారింపు నీటు మిటారము హొయ లనఁగ విలాస మొప్పుచుండు ఆం. భా. ౧. ౧౩౯.

మిటారికత్తియ(త్తె.) వి. (మిటారి + కత్తియ - స్వార్థమున) యౌవనగర్వము గలయాఁడుది; విలాసము గలయాఁడుది.

గీ. మించు క్రొన్మించుగమికి వర్షించుఘనము, కులుకు బిబ్బెంపు గబ్బిగుబ్బల మిటారి, కత్తియల చూపుతేంట్లకుఁ గమలవనము, జవ్వనము పెండె వసుమతీజాని సుతుని. చంద్రా ౨. ౧౦.

ఉ. మేరులతీయలా కురుఁజామీఁదులఁ జెక్కిన చెక్కడంబులా, గారుడరత్నతోరణ భగ

ధ్ధగలా తెలిగచ్చుమచ్చులా, చేరిమిటారిక త్తి
యలం పెట్టిన ముత్తెపుమ్రుగ్గునిగ్గులా, యారతి
నాతి ప్రాఁతపమ లంగడిముంగిళు లాపురం
బునన్. పాంచా. ౪. ౫.

ఉ. పెక్కైడుసొమ్ము చే సొగసు పెట్టెడు నిట్టి
మిటారికత్తెతో, నట్టడవిం జరించెదరు నాయ
పదానము లాలకింపనో

చం. రా ౫. ౫

చ. పిలిచిన నేమి పల్కఁడఁట పేర్చి తటాన
మిటారికత్తియల్, నిలిచినఁ గూర్మిఁ
జిల్కఁడు ముకుంద. ౨. ౧౭౭

మిటారికాఁడు. వి (మిటారి + కాఁడు-స్వార్థ
మున) విలాసవంతుఁడు

చ మినుకులు పుట్టినిల్లు మిడిమేలపుఁదాపనుఁ
గన్నతండ్రి చక్కనినవవిల్తుతోడు నుడికారపు
జోటిమిటారికాఁడు తపతీ. ౧ ౩.

మిటిమిటిపడు = మిట్టిమిట్టిపడు. అ. క్రి.
(√మిట్టిపడు) ఎగిరిపడు

ద్వి. పలుమఱు మునిపేళ్లఁ బనస లెన్నుచును,
మెలిగొన్నశిఖ లింత మిటిమిటిపడఁగ నిడు
పొఁగిలఁగ మెడల్ నిక్కించి బిగువు,
సదలి . వల నొప్ప సారకు వల్లించు
కొనుచు. ద్వి. పరమ. ౨. ౧౭౭. పొ.

మిటుకు. వి. యౌవనగర్వముచేఁ గలుగుభ్రుకుట్లు.
(చూ. మిటుకులాఁడి.)

మిటుకులాఁడి. వి (మిటుకులు + ఆఁడి)
యౌవనగర్వముచే నైనభ్రుకుట్లు గలయాఁడుది.

వ. జోడులకోలాటంబులు వేయుకైలాటపు
మిటుకులాంధ్ర బాహుజడల నల్లినముల్లెపూస
రుల పఱుంగఱుగమువలపుల మిటులకుఁ దల
దిమ్ము పుట్టించునట్టి వెట్టదినంబులయ్యెను.
ప్రబంధ. ౫. ౨.

మిట్ట. వి ౧. ఉన్నతభూమి.

గీ. గట్టిపుష్పొడి మిట్టలం మెట్టిమెట్టి, యలసి
చెమటలు వాయ నోలాడఁదలఁచి, యంద
ఱును గూడి కొంతద వ్వరిగి యచట .
యయా. ౩. ౫౩.

ఉ. నాఁటిన విచ్చుగుబ్బచనుమిట్టల నక్షులం
చిందువందగన్ మనుచ. ౨. ౪౦.

క కట్టుము రతిసౌఖ్యములకుఁ, బట్టము గాకున్న
పనిచిచేయుము నన్నునన్, మిట్టకు చెట్టుకుఁ
గాదను, నట్టివిధము సేయవలవ దవనీనాథా.
రుక్మాం ౫. ౧౦౭. ద్యా ౧౦ ౪౫.

౨ రచ్చసావడి

ఉ. వాఁడు రేఁగి మఱి పెట్టుదుఁ బెట్ట
నసంగ మిట్టఁ గూ, పెట్టుచు నిట్టు పోరఁ
గనిపెట్టుచు నొక్కరుఁ డుండి పెండియున్.
ఆము. ౭. ౩౦.

౩. తీక్ష్ణమగుబాణము

ద్వి. వెడవెడ తూణంబువెదలినయట్టి, వెడవిల్తు
మిట్టలవింత లై యొప్పు
ద్వి. పరమ. ౪. ౨౭౭. పొ.

విశే. ౧. ఎత్తైనది, ఉన్నత మైనది.

గీ. మిట్టయుదమున నిడుపోగపట్టె మెఱయ
మనుచ. ౧. ౫౯.

సు. నిడుమోముం గుఱుగేలుఁ గుండగడుపు
న్నీలత్వము న్మిట్టలు, న్గడుదీర్ఘంబులు నైన
దంతములు . మార్క. ౧. ౨౨౪.

ద్వి. మట్టుపాదంబులు మలినంపుమేను, మిట్ట
మదురు మక్కుమెడయును
పండితా. దీక్ష. ౪౦. పొ.
చిత్రభా. ౩. ౧౭౭.

౨ తీక్ష్ణమైనది, వాఁడియైనది

ద్వి. పరశుఁ డై గురుకృపాచార్యభీష్ములకుఁ,
బరగ నమస్కారబాణంబు లేసి, యొకమిట్ట

కోల నయ్యూరగ కేతసుని, మహితరత్నాం
శువు మహి డొల్ల సేసె

ద్వి. భార విరా. ౮. ౭౧.

ఉ. నందియు మింత లేదు పెలుచ న్మనుమొగ్గల
మిట్టకోలలన్, గందనకాయ సేసె మను
కార్ముకుఁ డే మని చెప్పవాఁడ

రాజ. చ. 3. ౧౮౪.

౫ మిట్టపండ్లవాఁడు, మిట్టపండ్లు.

మిట్టపండ్లవాఁడు = మిడిపండ్లవాఁడు. విశే. (మిట్ట + పండ్లు + వాఁడు) ఎత్తైనపండ్లు గల వాఁడు, దంతురుఁడు

గీ. దంతురాఖ్య మిట్ట, పండ్లవాఁ డనఁ దగు ఆం. భా ౨. ౧౨౧.

మిట్టపండ్లు = మిడిపండ్లు. వి. బ (మిట్ట + పండ్లు) ఎత్తైనపండ్లు, పై కుబికినపండ్లు (చూ. మిట్టపండ్లవాఁడు.)

మిట్టమిఱ్ఱు. వి (మిఱ్ఱు + మిఱ్ఱు) మిక్కిలి మెఱకతావు, అత్యున్నత ప్రదేశము

ద్వి. మేటికాల్వల మిట్టమిఱ్ఱుగాఁ ద్రవ్వి

ద్వి. మారిశ్చ. పూ. ౪౯౫ పం

విశే. అత్యున్నతము, మిక్కిలి యెత్తైనది.

(శ. ర.)

మిట్టాడు. అ. క్రి (√మిట్టు) సంచరించు, తిరుగు.

సీ అంగళ్లయందు మిట్టాడ మానిపి లేక గుడియుఁ బాడుమ జిక్కఁ జెడిరొ

కాశీ. ౫. ౨౬౪.

శా. మిట్టాడంగ నరుండు లేనియడవిన్ మీనాక్షీ దీనాకృతిన్ . మను. ౪. ౬౭.

క. కట్టి తనమాఱుగా న, ద్దిట్ట గృహస్తంభ మునఁ బ్రతిష్ఠించి నరుల్, మిట్టాడనియా

బెడిదపు, నట్టకనడురేయి మబ్బునం జెలి చనియెన్. కేం. పంచ. ౧ ౨౫౯.

మిట్టించు. అ. క్రి. (మిట్టు + ఇంచు, స్వార్థము) మీఁది కెగయు, పై కెగయు.

సీ. ఎదనెద మిట్టించి పడుమీలబెళుకుల కులికపా టాదవంగ నోసరిలుచు

కళా ౬. ౨౨౭.

వ ఒక్కచక్కి కు క్షికబకోదరంబులు నరుణో పలపాంబులం బొట్ట వెంచుచు నిట్టలంబుగ మిట్టించు కీలానిలసముద్ధూత నూతనశీకర నికరంబువలన నలినభాండంబునకుఁ గర్పూర కరండభావంబు నుత్పాదించుచు

పాండు. 3. ౧౫౦

౨. ఉబుకు, నిగుడు.

క దట్టపుఁదుఱుమును మీఁదికి, మిట్టించిన చన్నుఁగవయు మిఱుమిఱుచూడ్కుల్

భాగ ౯. ౬౦౭

3 అతిశయించు, అధికమగు.

ద్వి. మిట్టించి పేడిమి మిటమిటఁ గాయఁ, గక్కొండ తాఁకునఁ గమరె దేహంబు

ద్వి. మారిశ్చ. పూ ౯౯3. పం.

మిట్టిపడు. అ క్రి (మిట్టు + పడు ఇది కొన్ని యెడల పదాంతరవ్యవధానముతోఁ గానవచ్చు చున్నది )

౧ ఎగిరిపడు

క కడగొంతంబులఁ గొని వడిఁ, బొడిచిరి కుంతధరు లుగ్రభూరిబలంబేర్పడ హయగ జభటతతి సాల్వాడి వడి ద్రొగ్గఁ బడి మిట్టి పడ రభసమునన్. కు. పం. ౧౧. ౪౧౭.

చ. నిజాంతకోదకముల వేఁడిమిం దరలి తద్దయు మిట్టిపడంగ మీనముల్ .

చంద్రా. ౨. ౨౪.

సీ. పనిలేనిపని మిట్టిపడుమహోజపతాక వ్రల్ల
దంబునఁ దన్ను వెల్లిఁ బోవ
 వరాహ. ౮. ౨౧.

సీ. అర్జునుండను నేనె యని తెల్పినంతనే మిట్టి
మీఁ నై పడె మెలఁకచూపు
 విజ వి ౩ ౧౨

౨. అదరిపడు, ఉలికిపడు, — భయాదులచే చలించు.

క. ఉట్టిపడునట్టివర విగ్రహ కట్టెఁడి న న్నెట్టువేఁడెఁ గటకట యనుచున్, మిట్టిపడి యతఁడు మదిలోఁ, బుట్టినతల్లడముతోడఁ బొక్కుచు నుండెన్
 భాగ ౬. ౫౧౬.

గీ. అనుచు నక్కునఁ జేర్చు బట్టలఁత మార్చుఁ, గన్నుగవ నద్దుకొని కుందు గావిపొందుఁ, గలవరించును దల వంచుఁ బలవరించు, మిట్టి పడు న త్తరీయంబు ముట్టి పలుకు
 రామా. ౫ ౨౮౧

ఉ. వెట్టగ మందమారుతము వీవఁగఁ దోడనె రాలెఁ బై విరుల్, మిట్టిపడంగ వేఁడె దవిలెం బధికుం దడకొత్తులోనిపోఁకట్టుల నంచు
 సార్గంగ. ౨. ౧౬౯.

౩. గర్వముచే త్రుళ్లు, ఎగసిపడు.

ఆ. జయము లపజయములు సంపద లాపద, లనిలచలిత వీచికాంచలములు, చంద్రరేఖలు మేఘచయములు దరఁగలు, మెఱుఁగు లదురవర్య మిట్టిపడను. భాగ. ౮. ౧౬౮.

సీ. తన కులంపా చాల ఏవి మిట్టిపడఁగ నవాను ధేయపున్వెత్యునకు నడంగి
 ప్రభా. ౧. ౪౯.

క. మిట్టిపడి లేచి వన మెగి, బిట్టబయలుగాఁగఁ బెఱకుపవతనూజున్, గట్టులుకఁ జూచి రొక్కనం, బిట్టట్టుగఁ బాణి వీత కిట్లనిరి
 భా. రా. సుం. ౩౩౬.

గీ. అనుచు నాకేలు పట్టినయప్పు డధిప, యేమి చెప్పుదు నాపెను లీశ్వరుండ, యొఱఁగు నావిగ్గుఁ గాఁచువా రెవరు లేక, మిట్టి మీఁ నై పడుచెనంటి నిట్టులంటి.
 సారంగ ౨. ౬౨౪.

గీ. మెల్లనె కళావతీపతి మేలుకాంచి, ప్రక్క వేతొక్కమగఁడున్న బాగుఁ దెలసి, యక్క యిది యేమిచోద్యమో యనుచు మిట్టిపడి కాలికె యై యొంకుకొడుకుఁ జేరి
 శుక. ౧ ౨౨౩.

సీ మిట్టి పడుకొ కాని మీనము ల్పమములా కువలయుంబుమణుంగుఁ గోరియున్న
 బహు ౫ ౫౩.

(ఇది మొదటి యర్థమునకుఁ గూడ నుదాహరణము)

మిట్టిపాటు. వి (√మిట్టిపడు) మిట్టిపడుట.

ద్వి. నీమిట్టిపాటును నీరాజసంబు, నీమదంబును నుబ్బు నేలతోఁ గలయు
 ద్వి హరిశ్చ పూ. ౧౨౩౦. పం.

సీ మత్స్యవల్లభుఁ బట్టి మార్పించె మిట్టిపాటంగేశుఁ దనుబలాధ్యక్షుఁ జేసి .
 రా. వి. ౨౪౫.

వ. తద్విలాసదివ్యకాగరిమంబు పరీక్షించి యశుద్రస్యదంబున నెగసి తద్విభవంబునకు మెచ్చి మరలం దాఁటుతీరున నుద్వర్తనాపవర్తనంబులం బరఁగు చేడిసనిరాలమిట్టిపాటు లతిశాతుకంబు పుట్టింప చంద్రి. ౪. ౬౮.

మిట్టిమిట్టిపడు = మిటిమిటిపడు. అ క్రి. (√మిట్టిపడు) ఎగిరిఎగిరిపడు.

వ. తెగిపడియు నంకుశంబులు విడుపక మిట్టిమిట్టిపడుబాహువులు
 భార. ద్రో. ౧. ౩౪౪.

చ. జాలరిచేతఁ జాసి ధాత్రిపై, నటు నిటు మిట్టిమిట్టిపడు నంబుచరంబులవో శి వ త్తతిన్. మనుచ. ౫. ౭౧.

**మిట్టు.** అ. క్రి ఎగురు, ఉత్పతితమగు.

చ. ఇరవుగ నీలనీరజదళేక్షణ లించినమేట్కెతోఁ ఖరనృర మెదిరించి కాంచనపుబంతులఁ దచ్చనవాటు లాడఁగా, ధరణిపుఁ దద్ద మై చనుడుఁ దమ్ముజదండముఁ దాఁకి మిట్టి బిట్టురవడిఁ జెండు క్రమ్మతిన నుబ్బర పోయిరి కామినీజనుల్. నైష. ౩ ౯౫

క వే తొక్కఁడు మిటికితటాలున, నొక్కనికనుదోయి మూయు నొక్కఁడు నగఁగన్ భాగ ౧౦ ౪౫౭

వి (బ. మిట్టుబు,మిట్లు) ౧ ఉత్పతనము, ఎగిరిపడుట (చూ. మిడిమిట్లు)

౨. చలనము. (చూ. మిఱుమిట్లు)

జ మిటిమిట్టిపడు, మిట్టాడు, మిట్టించు, మిట్టిపడు, మిట్టిపాటు, మిట్టిలుట్టిపడు, మిడిమిట్లు, మిఱుమిట్లు, మిఱుమిట్లుగొను, మిఱుమిట్లుగొలుపు, మిఱుమిట్లుపోవు

**మిఠాయి.** వి. (సంగీత) ఒకస్వరిస్థాయి.

ద్వి. భజవణి శవణియు భరణి మిఠాయి ఆదిగాసొగయు తాయములు, దళుకొత్త బస. పు ౩. ౯౩౭ పం

**మిడమిడ.** వి కోపముతో చూచుటయందలి యనుకరణము.

ద్వి. మిడమిడ మిడికెదు మేలువో కిడవఁ, గుడిచి నారమె పండుసులఁబ్రబ్బములను పండితా. పురా. ౧౧౫ పా.

ద్వి. మిడమిడ మిడుకుచు మిఱుమిండఁ దనియు బస. పు. ౪. ౭౨౯. పం.

**మిడి[1].** వి. (క. మిడి) ౧. గర్వము, మిడిసిపాటు.

సీ. పరివారకోన్నతి వాటిల్లుటను బంధుమిత్ర సహాయులు మిడి యడఁగఁ, జచ్చుట భార. శల్య. ౨. ౬౪.

గీ మఱియుఁ గొందఱు నీచేత మడిసి రంపు, మిడి యడఁగఁ జొచ్చి తమనూడు దడవ రేరు ఉ. హరి ౫ ౨౯౫.

౨. కాంతి, జిగి.

చ మిడిగలవజ్రపున్ రవలమిన్కులకిమ్మలు జాతి కెంపులా, కడియములన్ సొగ సొనసఁ దాల్చి నృపాలు కేళికన్,నడవెనధూళులాను హంస. ౩ ౪ హంస. ౪. ౭౯

విణ గర్వితుఁడు, మిడిసిపాటుగలవాఁడు

క ఒప్పగ మిడి సతికిం గాఁచయొ వ్వెఱుఁ గఁడు దశకు ౭ ౭౧

౩ ఉన్నతము, ఎత్తైనది, గొప్పది, పెద్దది.

ఉ. గండపుఁగొండగాడ్పుచే, నల్లికిబిల్లికిన్ వినువనామిడి మామిడిక్రింద భూమి భృ, త్తల్లజుఁ డిల్లజాలకనిధంబునఁ బొంచి హరించె జెండిమున్ కృ కుసుం ౨. ౭౨౦.

చ. పోగులు మిడివింగ్లు ఒంపెఁగులుఁ గొమ్ములఁ బాదులు నల్లైత్రాళ్లు చంద్ర ౨. ౭౧.

సీ భావజామిడివింటఁ బాఱునిఃపుసుద్దధింగిఁ జలించు పుష్పంధయములు ప్రభా. ౩. ౩౫.

సీ. , నల్ల మెఱుఁగు, వన్నెలు పింగాణి కన్నులు తిరిబోమల్ మిడిదేగచాలు మిద్దె బాట్లు ప్రబంధ. ౧౩౭.

౩. పై కవిసినది.

క. ఈ మెఱుఁగుగుంతరక త్తెర,చే మిడిదల యిచ్చు
సాహసికుఁడు శిరం బన్లో మగుడఁ గ నదుకు
కొనం, గా మని చంపుఁ దనుఁ జంపఁ గడఁ
గినవానిన్ కళా. ౬. ౪౩.

క గుడి సొచ్చి నాకు సాఁగిలఁ, బడి
మ్రొక్కుచుఁ బలికె నెన్నిభంగుల నైనన్,
బడఁతక యిది నా కబ్బిన, మిడిదల
యొప్పించి నిన్ను మెప్పింతుఁ జామీ
జామీ. ద్వా ౪ ౫౧

మిడినాగు = మిణ్ణాగు. వి (మిడి1 + నాగు)
ఎగిరియెగిరి పడుసర్పవిశేషము

మ అకటా తమ్ములఁ గాలివేగమున డాయన్లేని పక్షీంద్రుకార్యలికి లోనా మిడినాగుకూనలకు జాలి నొంపెందుగాలి న్గకార్యపికలై విచ్చుమశోజ భల్లములకు ద్భ్రతిల్లుచి త్తంబు సాంటికి గాఁ గేరవె పేపపేరఁ బురఘోట్ఘోటకప్రాత ముల్. చంద్రా ౧ ౯౯

మిడిపండ్లవాఁడు = మిట్ట పండ్లవాఁడు. మిడి1 + వాఁడు) (శ ర.)

మిడిపండ్లు = మిట్టపండ్లు. వి బ. (మిడి1 + పండ్లు) ఎత్తైనపండ్లు.

సీ బొక్కిరొమ్మును నూఁదబొడ్డును మిడిపండ్లుఁ దిబ్బిసోరును బొఁచి దేఱువెంగము
భల్లా. ౪. (శ. ర.)

మిడిబద్ద. వి. (మిడి2) వేఁట కుపయోగించుసాధన విశేషము.

తరికము. వలలు బోనులు చిక్కముల్ పెను వాతికత్తులు బల్లెముల్, బలుకుపాకులు వాగురుల్ మిడిబద్ద లీఁటెలు దీమలఁబుల పాహుల్
రామేశ్వరమహాత్మ్యము ౫. ౪౯.

మిడిబోను. వి. (మిడి1 + బోను) మృగములు లోనగువానిం బట్టెడు కపటయంత్రము

క. మిడిబోనులఁ గాలుచ్చులఁ, బడఁదోలియుఁ బోగు లోనుపఱచియు జేల్లిన్ వడిగలజంకల నెల్లన్ బొడిచిరి కడుఁజెంచు లాఱుపులఁ జద లదరన్ యయా ౨ ౧౯.

మిడిమిట్లు. వి బ (మిట్లు + మిట్లు) మిక్కిలి మిట్టుటలు

గీ పసుపుజేగురుక్రొంతకచ్చుమిసిమి దేఱు, మిట్ట కనుగ్రుడ్లు మిడిమిట్లు మిడిసిపడఁగ
వేం పంచ ౩ ౧౩౪.

మిడిమిడి. వి (మిడి1) పరితపించుటయం దనుకర ణము

కె కడుపునకుఁ గూడు గానక, పడి మిడిమిడి మిడుకునట్టిబరుగున కీ యా,ఆడి యమరత్వం బేఁటికిఁ, గడు పిటు గాలంగఁ గంటఁ గాటుక యేలా ద్వా ౧. ౮౬.

విశ ౧. మిక్కిలితీక్ష్ణము.

చ. మిడిమిడియెండకొట్టునను మేనులు పెట్టుచు నుండ వాల్మీ. ౨. ౯౦.

౨. మిక్కిలి అల్పము.

(స్వగ) వానికి సాహిత్యమున మిడిమిడిజ్ఞానమే గాని పాండిత్యము లేదు.

మిడిమేలము. వి (మిడి1+మేలము) ౧. గర్వము మిడిసిపాటు

సీ. మిడిమేల మేమి మామిడి కొక్కఁ గల వటే ఉ. హరిశ్చ. ౩. ౩౧.

౨ ఉపద్రవము, కీడు

క ఈలీల నుండి మన మిటు, మేలము లాడంగ నేమిమిడిమేలమె యం, చాలో సత్య ముఖ ద్రహీ,తాళుల కినుమంత యూరమూస్యముఁ దల్పెన్. విజ. వి. ౩. ౩౩.

విశే. ౧. మిడిసిపాటుగలది, గర్వితము.

క. మిడిమేలపుదొరను గొల్చి మిడుకుటకంటెన్, వడి గలయెద్దులఁ గట్టుక, మడి దున్నుక బ్రతుక వచ్చు సుమతీ ౪.

గీ. వీటిలో మిడిమేలపువిటునివిధము, సాఁగఁ గొన్నాళ్లు నిజపితృసంచితంబు, బొల్లఁగాఁ జల్లి యది రొల్ల సల్లుటయును, దల్లడిల్లుచు దుర్మార్గతల్లజుండు ప్రబంధ ౬౮౪

౨. ఉపద్రవకరము, బాధకము

ఉ. గామిడిదైవ మావితముగా మిడిమేలపునేఁత నిర్దయున్, సీమలు గానిసీమలకుఁ జెల్వఁద యేఁగఁగఁ దెచ్చె నక్కటా

శశాం ౨ ౧౩౩

గీ మితి లేనియీమిడిమేలంపుమెకములు సకి యలబలగమే జనని నీకు

ఉ గా ౬ ౨౮౩

వి మిడిసిపాటు (శ. ర.)

మిడియ. వి వేదవాక్యము

క తలఁచి యపు డందొ కింతయుఁ, దొలుతటి తరవాతిమిడియం దోఁచక మతి యెవ్వల నరపిన శ్రుతిశబ్దము, పలుకునన్ రాక వెగడు పఱచినఁ గలఁకన్ పరమ. ౨. ౧౧౨.

(శ ర. పా తరువాయి మఱియు ముద్రిపా)

మిడియు. అ క్రి ౧. తీక్ష్ణమగు.

గీ. మిడియయెండ గాయ జడివాన గురియఁగ, సీతు గదుర వృక్ష జాతు లలర, నగ్నిలోన బయల నప్పుల నప్పరో, గణముగ్రామోలఁ జేసెఁ గడిఁదితపము. కహ ౧. ౧౬౪.

౨. పైకుబుకు.

సీ. పఱచుంచుఁదలలును బరకులు దబ్బర మిడి విన్నగుడ్లులుఁ బడఁకుచెవులు

కు. సం. ౬. ౬౯౪.

క. వడి సొగసి హస్తతలమునఁ, బిడుగుగతిన్ జరుప సొత్రు పెల్లై గ్రుడ్లున్, మిడిసి తల పగిలి తురగము, నడునాలుక గఱచికొని రణ స్థలిఁ బడిరెసెన్. భా. రా యు. ౯౮౯

3 భయాదులచే సొగసిపడు, అదరిపడు.

చ. భూతముల్ మిడిసె భైరవుఁ డుర్కి విధాత బెగ్గిలెన్, బనివడిఁ దేర్పఁ దేర్పి నల భర్గునికౌఁగిట దుర్గ మూర్ఛిలెన్

కహ ౨ ౧౩౩.

౪ మిట్టు, పై కెగయు

క. ఆపివిసినక్కా చాపము, కోఁ పంగిట నికికి నరముఁ గొరికిన రభసం, బేపార మిడిపి మర్మవి, రూపణ మొనరింప నక్క రోఁజూచుఁ గూలెన్ వేం పంచ. ౨. ౧౦౯

సీ చూపి వేసినడేగ చోపి లేపిన పుల్గు నీఁదుగా నాఁదనే మిడిసి పడఁగ కహ ౪. ౯౭

వ కేలిశుకారంబున వేణుకశిగంబుఁ గటు క్కునం దెగనడిచినఁ దల మిడిసి యల్లంతటం బడిరెు దశా ౬ ౭౫

౫ తూలు

క ఆవి యాతని పైతోలును, నవియింపగ లేక మిడిసి యల్లటు వడఁ జొచ్చి వసేచను లేచినవెఱ, దవిలినమతి నద్ది రయ్యు దయ్యం బనుచున్. మనుచ ౪ ౧౦౨

జ. మిడిపోవు, మిడిసిపడు, మిడిసిపాటు.

మిడిపోవు. అ క్రి. (√మిడియు) తక్కు, తప్పి పోవు, శేషించు.

సీ. ఆదుష్టవర్తనుఁ దప్పటికుడదు నిజానుజపుత్రి మిత్రాదు లొకఁడు, మిడిపోక కలనిలో మడియుట యూహించి వగచుచు ..

రాఘవ. ౪. ౨౩౭.

గీ. వనము గాచెడిరాక్షసవర్గములను, దండి నొకనిని మిడిపోవకుండఁ బట్టి, మేటిభుజ

శక్తి నందఱుగీ టడంచి, వాలి యున్నాఁడు
సాహసవంతుఁ డగుచు
మొ రా సుం. ౧౭౭.

౨. క్షీణించు, తగ్గు.

ద్వి. మిగుల మెచ్చియు వాఁడు మిడి వోని
కడిమి, బెగడొందఁ బెడచేతఁ బెనుతాల
దన్వె ద్వి పారిజా పూ ౨౧.౭౨ పం

మిడిసిపడు. అ క్రి (√మిడియు) ౧ మీఁది
కెగయు, ఉత్పతితమగు

క. బెడిదపు మదనజ్వరమున, మిడిసిపడుచు వాఁర
లతలు మృగిలోచనకున్ నరస ౩ ౬౦

వ. మిడిసిపడుచుయానుకరణి నీట మంచి విడి
చిన సొఱకాయ రెుగిపిన నిక్కున
ప్రబంధ 8౭౭.

౨ (కోపము గర్వము మొ. చే) త్రుళ్లు, మిట్టి
పడు

సీ. పదమ లొత్తెద నంచుఁ బతిజంఘికలు దన
తొడలపై త్రోసికో మిడిసిపడును
హంస. ౩ ౭౦౧.

క. సేరుపు గలదనుచు నహం, కారంబున మిడిసి
పడితి గ్రమ్మనఁ జని బం, గారముఁ బోలెడు
కొండుకున, కేరూపున నైనఁ బాపు మీసంకె
టమున్. హరి. పూ. ౫. ౨౬౫.

మిడిసిపాటు. వి. (√మిడిసిపడు) మిట్టిపాటు,
గర్వాదులచేఁ గలుగుత్రుళ్లు.

(వ్యవ) ఈచిగిరింత రైశ్వర్యమునకే యింత
మిడిసి పాటా.

మిడుఁగు = మిణుఁగు. వి. మిడుఁగుఱు.

మ. . కృష్ణుఁడు . ఉద్ధతశక్తి న్వడిఁ
దిప్పి మింట మిడుఁగు ల్దట్టంబుగాఁ బర్వ
న, న్నశఁచుచద్దఁ బైచి త్రుంచె
భాగ. ౧౦. ఉ. ౯౦౯. (చి. సి. పా.)

జ మిడుఁగుఱు, మిడుఁగుఱుఁ గుఱుఁబురువు

మిడుఁగుఱు = మిణుఁగుఱు. వి.
(√మిడుఁగు) ౧ విస్ఫులింగము, అగ్నికణము.

క. మిడుఁగు అని తలఁచు బాలుఁడు, మిడుఁ
గుఱుఁబుర్వుఁ గని నృసిం. ౪ ౧౫౯.

చ. మెఱయుచు సున్నవజ్రహతి మేరుతటంబున
రాలునమ్మిడుం, గుఱు లన విస్ఫులింగములు
గంభిరునుప్పి విఘట్టనంబులన్, వఱలుచు
వానరోత్తముని వక్షమునన్ వెడలె స్సముద్ధ
తిన్, మెఱయు ప్రతాపపావకవిని ర్గత
హేతికి... లో యనన్
భా. రా యు ౧౭౧౬.

చ అం, దెఱుకు గడంగి పట్టుకొనఁ
దద్దయు డాసిన జాడ్యులన్ మిడుం, గుఱు
లెసఁగంగ వక్త్రమునఁ గోపము చండిక
దాల్చె మార్క. ౬. ౧౩౭.

౨. (కి. మిణుకు త మిన్మిని) ఖద్యోతము,
మిణుఁగుఱుఁబురుగు

గీ మిన్నమిడుఁగుఱు లై రెండు మెఱచుచున్న,
మెఱుఁగు లూకపుట్టలో నున్న సెఱఁగి
కేను, బుట్టఁ గ్రొవ్విందిచి యూరెంటిపాదవు
గాన, కడిగి వచ్చితి విస్మయపడి మనమున.
భార. అర. ౩. ౧౩౯.

మిడుఁగుఱుఁబురువు మిణుఁగుఱుఁబురువు.
వి. (మిడుఁగుఱు + పురువు) చీకటివేళ తళతళ
మెఱయుచు నెగుఱు ఒకజాతిపురుగు, ఖద్యో
తము.

ఉ. వజ్రపంక్తిఁ బోల్పారు మిడుంగుఱుంబు
రువు లంచు కాసం గొనిపోయి పొంతకప్పం,
గారవనద్రుమాళి గిజిగాఁడులు గూడులఁ
జేర్చు దీపికల్ గా మనుచ. ౧. ౩౬.

మిడుకు. అ. క్రి. (క మిడుకు. త. ముడుక్కు.)
త్రుళ్లు, ఎగిరిపడు; గర్వముచే మిడిసిపడు.

గీ. అదియుఁ గాక వితర్కించి యరయ బుద్ధి,
గలుగునట్టి సాధనములు గారె మీరు,
మృత్యువట్టున కట్లు గావున మెలఁగ మిడుకఁ,
నీక పోరిగాన వలయు మీ కెల్లఁ గలిగి.

భార. అను. ౧. ౧౯.

చ. మిడికెడు వాసుదేవుఁ దన మ్రోఁడ్చు దలం
పక యాదవుం డొకం, డుంఁడుగఁడు .

ఉ. హరి. ౩. ౪౪.

౨. కదలు, చలించు.

క. మిడికెడిఁ బెదవులు ప్రేలుం, మడిఁగెడుఁ
గనుదోయి మొగిడె మాఱెదురఁ గడున్,
వెదవిఁక రొండలు చేసెదు, కదపల జపము
నకు నేఁడు గలదో లేదో.

ఉ. హరి. ౪ ౪౪.

ఆ. అమ్మహీరుహంబు నదరంటఁ దాఁకిన,
నొచ్చి పం క్తిరథ తనూభవుండు, మూర్ఛ
వచ్చి యంగములు శిధిలంబు లై మిడుకలేక
పుడమిమీఁదఁ బడిరి నిర్వ. ౧౦. ౨౭.

౩. సంచరించు.

సీ. పొలుచుసౌవర్ణపురి గని భూపసుతుఁడు,
మెచ్చి వర్ణించుచును దానిఁ జొచ్చి యందు,
మిడుక మానిసిఁ గాన కప్పుడు మనంబు,
గరము విస్మయ మందంగఁ దిరిగి తిరిగి.

మార్కం. ౨. ౨౩౧.

స. ఏ సేదిక్కునఁ జూతునో యనుచు నెంతే
భీతి వారాసిలో, మీనం బై మిడుకంగఁ
జొచ్చితి వసో మేలే హరీ ...

దశా. ౧. ౨౯౪.

౪. పైకుబుకు.

క. విడు సారథ మని హరిఁ గ్రవ్వడినిన్ వడి
బంక నిటికి వాయుతనూజాం, బిడికిటఁ బొడి
చిన గ్రుద్దులు, మిడుకఁ గడవి కాలు
చెయ్యి కొదలుప కన్నన్.

జై. భా. ౭. ౨౬.

౫. పరితపించు.

క. కడు బెట్టిదుండు కాలుఁడు, మిడుక మిడుక
నపహరించు మీ కీరూసల్, విడువుఁడు
బాలునికి సుగతిఁ, బడయుఁడు దానాదు
లైన బహుధర్మములన్.

భార. శాం. ౩. ౩౪౦.

క. తడ వారె సేమి సేయుదు, నెడవాయని
సఖులతోడ నెందున్నాఁడో, కోడు కాఁకలి
గొనె నంచున్, మిడుకు దయాపేత మాత
మృదువాగ్జాతన్. నిరం. ౨. ౭౦.

క. విదనాదఁ జూచి మును పిడు, గడిచినతనిఁ
గొలువిఁ జూఁడి నట్లగుటయు నక్కడ
నుండ కేఁగ నదిలో, మిడుకుచు భాగీరథీ
సమీపంబునకున్ జై. భా. ౪. ౪౦.

౬. మందు.

ఆ. అచట భూమిపాలుఁ డాశ్రయ నిచ్చట్లు,
మిడుకునగ్నిలోనఁ బడకమున్న, యతని
యిండు శెప్పు దర్శంబులను నిండి, యుండు
నట్లు వరము లిందు చాలు. ద్వా. ౪. ౧౦౫.

౭. ఎండు, శుష్కించు.

ద్వి. మునినాథ సేఁ బోయి మడ కొంప్పు
జలము, గొని వచ్చునిలోనఁ గుత్తుక మిడికె,
మునికుమారుఁడు దాహమునఁ జచ్చె నేని,
యనఘాత్మ మఱి బ్రహ్మహత్య సిద్ధించు.

ద్వి. హరిశ్చ. పూ. ౧౭౧౦. పం.

౮. కోపముతోఁ జూచు.

ద్వి. మిడమిడ మిడికెదు కేలుతో కదవఁ, సుడిచి
నారమె పండుగులఁ బ్రబ్బములను

పండితా. పురా. ౧౧౫. పా.

ద్వి. మిడమిడ మిడుకుచు మిరుమిండఁ
దనిరెడు . బస. పు. ౪. ౪౨౯. పం.

౯. బ్రదుకు, జీవించు.

ఆ. మదము మిగిలి తిరుగుచుండు గాంగేయు,
హైకఁ గవిసి యతనిశాణశిఖల, గ్రుంది
పోయెఁ గడఁగి మంటలో నుడిసినమిడుత
కోఁత మెలఁగ మిడుక లేక.

భార. భీష్మ. ౨. ౭౨.

వ. ఇట్లు హాలాహలదహనంబు జగంబులం
గోలాహలంబు సేయుచున్న సమయంబున
మెలకు పెగల మిడుకం జాలక నీ కైన
దేవతలును. భాగ ౮ ౨౧౬.

౧౦ తూలు.

ద్వి కాలానిలావర్తగతి కానఁబడఁగఁ, గాల
చక్రాకృతి గలచక్ర మెత్తి, పెడచేతివాటునఁ
బృథులమస్తకము, మిడుకుచుఁ బడ వాని
మెడ ద్రుంచివైచె

రం రా. ఉ. ౧౬ పా. ౨ పం

వి ౧. జీవము. (చూ మిడుకమూలు)

౨. మిడిసిపాటు, మిట్టిపడుట.

వ. కిదలిరాముద్దుకొడుకు మేనల్లునిదుడుకు
వడకిల మిడుకులకు సెగులంపడి

ఇందు. ర. ౩౪.

జ. మిడికించు, మిడికిపడు, మిడుకుమూలు,
మిడుమిడుకను, మిడుమిడుకు.

**మిడుకుమూలు.** అ. క్రి (మిడుకు + మాలు)
చచ్చు.

సీ. నూతు, నిరుపదేనమ్ములఁ దురగచకు
మ్మ_ంబు మిడుకుమూలఁగ నేసి మిన్ను ముట్ట,
నార్చిన ఉ. హరి. ౩ ౫౩.

**మిడుగు.** వి. చీలమండ, గుల్భము.

ద్వి. క్రిరంగి విలయార్భకుండు, మిడుగుల
జొరయుచు మించుపింజియల, బెడఁగుల
పేణులు గావ్పించుచుదోవతియు, నుత్తరీయం
బుగా జొకకొంత ధైచి.

ద్వి. పరమ. ర. ౩౧౪. పా.

ద్వి. గస్నైదుఘ్రాణాధు గలసీయకాలి, బన్నియ
పుట్టంబు వధులంగాఁ గట్టి, మిడుగుల
నొరయ నామీఁద జంజియల, మడిచేయ
చెతివి. ద్వి. పరమ. ర. ౨౭ర. పా.

ఖ. మిడుగుటాయి.

**మిడుగుటాయి.** వి. (మిడుగు+టాయి) కతినశిల.

సీ. మిడుగుటా యన నూదిటాయి యనఁగను
గతినశిలాఖ్యయా ఆం. భా. ౨. ౨౯

**మిడుచే.** సః క్రి ౧ (వ్రేళ్లు) విఱుచు, (సెటిక)
విఱుచు

ఉ. చూచుచుఁ జేరి వ్రేల్మిడుచుచుం దల
యూచి విలక్షచిత్తరై, యాచపలాక్షి
ముక్కుపయి నంగుళిము న్గదియించి

భార విరా. ౨ ౩౫౬.

క. కడుభక్తి నంబి పిలిచిన, నొడఁబడి రా
యనినభంగి నొండొకవిధులన్, నొడువులు
సెప్పిన వ్రేళులు,మిడిచినకిపుఁ దట్టివాని
మెచ్చుసె వెపుఁడా శివ సా. రరర.

క చట్టలు చరుచుచుఁ బలుమఱు, జెట్టలు మిడు
చుచు దివంబు చేకుల విరియం,దట్టుచుఁ
గాటుకకన్నులఁ, జొట్టినప్రజ సెల్ల నతఁడు
నూచెన్ గలయన్ దశకు ర. రర

౨ ద్రవద్రవ్యముచు . బొట్టుబొట్టుగా ిచ్చు,
కొంచెముకొంచెముగాఁ బెట్టు.

గీ పెకుపుపా లింట నేడ్చినబిడ్డ కైన,మిడుచ
లే దల్ల దానను కెడిరిమి .

హరి. పూ. ౫ ౨౧౯.

**మిడుత.** వి. (క. మిడత, మిడిత) శలభము, ఒకవిధ
మగుఎగిరెడు పురుగు.

గీ. .. మిడు తవ శలభంబు చను ...

ఆం. భా. ౨. ౯౫.

ఆ. . . మంటలో సతికి, మిడుకటోలె మెలఁగ
కుడుక లేక .. భార. భీష్మ. ౨. ౬౨.

చ. మిడుకలమిండుటోలెఁ గడు మిక్కిలిగాఁ
బలుమాఁకఁ గూర్చి తొు, ట్లదరిరి నీవు
దావదహనాకృతి. హరి. ఉ ౨. ౧౨౪.

చ ... శార్జితోఁ, బెనఁగుట మంటలో మిడుక
బీసము సూపుటగాదె దుర్మతీ .
ఉ హరి 3 ౧౪

మిడు(కు)మిడుక(కుమ)ను. అ క్రి. (మిడుకు+
మిడుకు+అను) తేజోహీన మగు ; (దీపము
చిన్నదగుటచే) కొంచెముకొంచెముగా కన్పడు.

క పాలేటిరాచకన్నియ, మేలారడు చూపు
లేక మిడుమిడుకంచున్, జాలిం బురపురఁ
బొక్కుచుఁ, దూలిరి రక్కసులు నీడు
గోఁచిన నధిపా. భాగ. ౮ ౨౯౦.
(పరితపించు అని శ. ర)

(వ్యవ) దీపము మిడుకుమిడుకు మనుచున్నది.

మిడు(కు)మిడుకు. వి (మిడుకు + మిడుకు)
కాంతి సన్నగిలుటయం దగునను కరణము.
(చూ. మిడుమిడుకను.)

మిణకరము. వి. నిమియఁ దోఁచక భ్రమించుట
(శ. ర)
జ మిణకరించు

మిణకరించు. అ. క్రి ($\surd$ మిణకరము) నిమియఁ
దోఁచక భ్రమించు. (శ ర.)

మిణుఁగు = మిడుఁగు. (శ. ర)
జ. మిణుఁగుఱు, మిణుఁగుఱుఁ బురువు

మిణుఁగు(ఙు)ఱు = మిడుఁగుఱు. వి.
($\surd$ మిణుఁగు) స్ఫులింగము, అగ్నికణము.

గీ. శతముఖుం డను రాక్షసచక్రవర్తి, సెట్లు
సాధింతు నని విచారింప నేల, తూలికాపర్వ
తంబును ధూళిచేయు, మిణుఁగు ఱుం త్రైవఁ
జాలదే మేదినీశ. సీతావి. ౧. ౯౬.

వ. .. గిరికటకపాషాణ సంఘట్టనంబున నెగయు
మిణుంగుఱులంబోలె నంతర్మణి కలాకాశ
కలంబులు మీఁదికెగయ సంభోవిధానంబు
మధ్యమానం బయ్యె ఘటియును.
హర. ౬. ౫౯.

చ. మిణ్గుఱుల్, చదలునఁ బర్వ నాతని
భుజద్వయమధ్యము గాఁడి దుష్టి
భోజసుతా. ౪ ౧౧౦.

చ. ఎద్రిచిన కాలపాశమున నీగతి నీమదిఁ గ్రోధ
వల్లికం, బద్రిచినవారు మన్నిశిత బాణపరం
పర లై మిణుంగుఱుల్, విద్రుపఁగఁ దళ్ఫలం
బులచవిం జవిశార్థులు గా శరీరపుం, జెద్రు
పలు చేరఁ దత్పతులచేతులఁ గాక ఫలంబు
వాతులన్. ఉ. హరి. ౪. ౧౦౯.

మిణుఁగుఱుఁబురువు = మిడుఁగుఱుఁబురువు.
వి ($\surd$ మిణుగుఱు) చీకటిలోఁ దళతళ మెఱ
యుచు నెగురు నొకజాతి కీటకము, ఖద్యోతము.

చ. పసుపడగింజ్లపెల్లి గనుపట్టు మిణుంగుఱుఁ
బుర్వు లంచు సంపదడిగొను నింద్రగోప
ములు విప్ర. 3. ౬౨.

గీ. మిణుఁగుఱుపు ర్వనంగను ఖద్యోత
మొనరు . ఆం. భా. ౨. ౯౫.

మితంగమము. సం. విణ. (అ. ఆ. అ.) మెల్లఁగా
నడచునది, మందగామి.

మితంపచము. సం. విణ. (అ. ఆ అ.) కొంచెము
వండునది

మితద్రువు. సం. వి. ఉ. పుం. సముద్రము

మితము. సం. విణ. (అ. ఆ అ.) ౧. పరిమితి
గలది. ౨. శబ్దితము. 3. క్రోసివేయఁబడినది.

**మితాక్షర.** సం. వి. అ. స్త్రీ. యాజ్ఞవల్క్య స్మృతిపై విజ్ఞానేశ్వరుఁడు రచించిన ప్రసిద్ధ వ్యాఖ్యానము.

**మితి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. గడువు, కాలపరిమితి.

చ. జనకుఁడు చేసినట్టిమితిఁ జక్కఁగఁ దీర్చి కడంక నేను వచ్చినగుణిదానఁ భూతలముఁ జేకొని రాజ్యము చేయు . .
మొ. రా. అయో. ౪౧.

ద్వి. బొంకు గాకుండ నావ్రానిన మితికి, నింకఁ గాలకుబుణ మేమిటఁ దీర్తు
ద్వి. హరిశ్చ ఉ. ౧౩౦౯. పం.

౨. పరిమాణము, కొలత, తూనిక. ౩. సరియైన తెలివి, తత్వజ్ఞానము. ౪ నిశ్చయము ౫ విశ్లేషము.

**మిత్తి**[2]. వి. (సం. మృత్యుః, ప్రా మిచ్చూ, క మిత్తు) ౧. మృత్యుదేవత, మరణాధిదేవత

ఉ. ఇత్తఱిఁ బన్ని పోయి పయి నెత్తి రణం బొనరించి వారలన్, మిత్తికి నంపి ధాత్రి నిరమిత్త్రముఁ జేయుదము . .
భార. అర. ౧. ౪౪.

ఆ. మత్తగిల్లు సత్తుగిత్తత త్తడి నెక్కు, మిత్తి నొత్తి సత్తి నత్తి బత్తిఁ, బత్తి విడిన
నీలా. ౧. ౧౧౭.

సీ. జమదాడి గెల్చువాజమదాడి యల్పమే సింగపుమిత్తి నాచేతికత్తి
రామా. ౨. ౨౪.

౨. మరణము.

క. రిత్తయుపచారముల నే మత్తముఁ దగుధర్మ తనయు మదిలించితి దుర్వృత్తు లగుమత్పు త్రులకును, మిత్తి యగుం బోర పగలు మిగులక యున్నన్. భార. ఉద్యో. ౨. ౭౨.

సీ. మిత్తి పెన్నిదుర నా మేలయిన మరణంబు . .
ఆం. భా. ౨. ౨౪౫.

ఉ. నిన్నిటు పొంచి తగ నిద్దురపోయెడుఁ చాపఁ దంచు నే, మిన్నక నీళ్లనాటు యను మిత్తికి నేటికిఁ బోయితిన్ .
హరి. పూ. ౫. ౧౪౫.

జ. మిత్తికూడు, మిత్తికూళ్లదొంగ, మిత్తిగొంగ, మిత్తిచూలు.

**మిత్తి**[2]. వి. లతావిశేషము, ఒకజాతితీఁగ.

సీ. శంఖపుష్పికపేరు చను మిత్తి యంచన .
ఆం. భా ౨. ౬౪.

**మిత్తిక.** వి. (సం. మృత్తికా) మన్ను.

సీ. మృత్తికాహ్వయము తా మిత్తిక యంచన మట్టియంచనఁగను మన్ననంగ
ఆం. భా. ౨. ౫.

**మిత్తికూడు.** వి. (√మిత్తి[2]) ప్రేతల నుద్దేశించి యిచ్చునాహారము; చచ్చినవారి నుద్దేశించి పెట్టెడి యన్నము (చూ. మిత్తికూళ్లదొంగ.)

**మిత్తికూళ్లదొంగ.** వి. (మిత్తి[1] + కూళ్లు + దొంగ) ప్రేతల నుద్దేశించి యిచ్చినయన్నమును అపహరించువాఁడు.

ఆ తొత్తు తొత్తె గాని దొరసాని గాఁబోదు, పత్తె దెపుడు దాని కైనగుణము, మిత్తి కూళ్లదొంగ మే లెఱ్గ నేర్చునా
వేమ ౩. ౨౪౯.

**మిత్తిగొంగ.** వి. (మిత్తి[1] + గొంగ) మృత్యుంజయుఁడు, శివుఁడు.

సీ. మక్కంటి యరపదితోములపేలుపు మిమసిగ దయ్యంబు మిత్తిగొంగ .
ఆం. సం. దేవ. ౬.

ఇట్లే మిత్తిపోటుకాఁడు = శివుఁడు.

ఆ. దండంతోడఁ గూడి తరలి గొబ్బునఁ దమ,
చేల కరిగె కెంపరిప్రోలు సొరక, మిత్తికేట
కానిత త్తడియూర నిం, పెనఁగ నిలిచి
పజల చేలు చుండె ...

అచ్చ. రా. అయో. ౧౧౫.

**మిత్తిచోలు.** వి. (మిత్తి1 + చూలు) కేతు గ్రహము. (శ. ర.)

**మిత్తు.** విశే. మిక్కుటము, అధికము.

ఉ. కుత్తుక కత్తి బిట్టులికి క్రుంకురవిం గని
దీనవృత్తితో నొత్తినబావిమర్భరవిరాగ
ధరంబున వొం గొకింటివో, మత్తమిలం
గనుంగొనురథాంగయుగంబుల దృష్టిఁ గప్పఁ
బో,మిత్తుగఁ గన్నునీ రొదవి మించిన చీకటి
కంటె మున్నుగన్. కవిక. ౪ ౭౨.

**మిత్తురుఁడు.** వి. (సం. మిత్రం. ప్రా. మిత్త) స్నేహితుఁడు, చెలికాఁడు

క. అత్తెఱఁగున సైదోడవి, నత్తమిలినఁ జూచి
రాముఁ దలఁక నిగుడఁగా, నత్తొలి పేలుపుఁ
గలువల, మిత్తురుఁ డాకొని కదంక
మీఱఁగఁ బలికెన్

అచ్చ. రా. యు. ౨౧౯.

(మిత్తండాకొని శ. ర హా.)

**మిత్రఘ్నుఁడు.** సం. విశే (అ. ఆ అ.) మిత్రద్రోహి.

**మిత్రత.** సం వి ఆ. స్త్రీ. మైత్రి, స్నేహము

**మిత్రత్వము.** సం. వి. అ. న స్నేహము, మైత్రి.

**మిత్రభేదము.** సం. వి అ. పుం. స్నేహము చెడగొట్టుట.

**మిత్రము.** సం. వి. అ. న. ౧. స్నేహితుఁడు.

**మిత్రయువు.** సం. విశే. (ఉ.) ౧. స్నేహము గల మనస్సుగలవాఁడు. ౨. స్నేహితువశము చేసికొనువాఁడు.

వి. ఉ. పుం. ౧. మిత్త్రుఁడు, స్నేహితుఁడు. ౨. లోకయాత్రికుఁడు.

**మిత్రలాభము.** సం. వి. అ. పుం. స్నేహితులను సంపాదించుట, మైత్రికూర్చుట.

**మిత్రవిందుఁడు.** సం. వి. అ పుం అగ్ని.

**మిత్రసప్తమి.** సం. వి. ఈ. స్త్రీ. రథసప్తమి, మాఘశుద్ధ సప్తమి.

**మిత్త్రావరుణులు.** సం. వి. అ. పుం. ద్వి మిత్త్రుఁడును వరుణుఁడును.

**మిత్త్రుఁడు.** సం. వి. అ పుం. సూర్యుఁడు న. స్నేహితుఁడు.

ఉ నీరజమిత్త్రుఁడేల ధరణీగతుఁ డయ్యెడు
నొక్కొ భార సభా ౧. ౨౨.

చ ఏ జనుఁడు విపత్తిసౌఖ్య సదృశక్రియఁ
దాతఁడు మిత్రుఁడు

వేం. పం. నీ. ఆ. ౬౦.

**మిథము.** సం. అవ్య. స. (ఇది సమాసపూర్వపదముగా మపయుక్తమగును.)

ఉదా : మిథస్సమము. మిథోనురాగము.

౧. పరస్పరము. అన్యోన్యము. ౨. రహస్యముగా.

**మిథిల.** సం. వి. ఆ. స్త్రీ. విదేహదేశపు రాజధానియగు మిథిలానగరము.

**మిథిలుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఒకానొకరాజు. విదేహాధిపతి. ౨. విదేహదేశప్రజలు.

**మిథునము.** సం. వి. అ. న. ఆఁడుమగలజత, దాంపత్యము. ౨. కవలు, యమళులు. ౩. మిథునరాశి.

**మిథ్య.** సం అవ్య ౧. అసత్యమైనది; మోస మైనది; తప్పైనది.

వ. లోకంబులఁ గృత్యాకృత్యంబులు గల వనుట మిథ్య
ప్రబోధ.. ౨ ౩౪ ౫. ౬౫

గీ . వాని మాఁటిని బద, మధ్యయా లని చెప్పె నమ్మాట మిథ్య
అప్ప ౨. ౧౭౫.

శా. అంతా మిథ్య తలంచి చూచిన నహం బ ట్లౌ టెఱింగిన్ సదా, కాంత లుప్త్రులు నర్థ మున్ దనువు నిక్కం బంచు మోహార్ణవ, భ్రాంతిం జెంది చరించు కాళ శ ౩.

**మిథ్యాచారము.** సం వి. అ పుం. ౧. (వైద్య మున) తప్పుగా మం దిచ్చుట, తప్పువైద్యము చేయుట. ౨ చెడునడవడి, అయోగ్య మైన నడత.

**మిథ్యాచారుఁడు.** సం విశ (అ ఆ. అ) ౧. తప్పుగా నడచువాఁడు. ౨ మోసగాఁడు, వంచనచేయువాఁడు.

**మిథ్యాదృష్టి.** సం. వి ఇ స్త్రీ. నాస్తికత్వము.

**మిథ్యానిరసనము.** సం వి అ. న శపథము.

**మిథ్యాభియోగము.** సం వి అ పుం అస త్యాభియోగము.

**మిథ్యాభిశంసనము.** సం వి అ. న. లేనినింద, అసత్యాపవాదము

**మిథ్యామతి.** సం. వి. ఇ. స్త్రీ. భ్రాంతి, పొర పాటు.

**మిథ్యావచనము.** సం. వి. అ. న. అసత్య వాక్యము, కల్లమాట.

**మిథ్యాసాక్షి.** సం. వి. న్ పుం. అసత్యపు సాక్ష్యమిచ్చువాఁడు

**మిథ్యోత్తరము.** సం వి అ. న అసత్యపుసమా ధానము, నిజము చెప్పక తప్పించుకొనుటకు యేదియో తోఁచినది చెప్పుట

**మిథ్యోపచారము.** సం వి అ. పుం అసత్య దయ, మనమున లేకుండగఁ బైకిఁ దెచ్చిపెట్టి కొనినదయ.

**మిదిల.** వి (సం మిథిలా ప్రా. మిదిలా) జనకుని రాజధాని, విదేహనగరి
జ. చూ. మిదిలదొర

**మిదిలదొర.** వి. (మిదిల + దొర) జనకమహా రాజు.

క. పదివేలములరక్కసు నిఁక, పదమద మెుఁన రించి కొలుసంతసమున వ, వ్మిదిలదొర బోఁడఁ జేకొని,యెద వెడలో దిటము విడకు మింతయుఁ దండ్రీ.
అచ్చ రా కిష్కి౦. ౫౧.

**మిద్దియ(ద్దె)వి.** (త. మెత్తై) ౧. సౌధము, మేడ; హర్మ్యము

చ. దళిములచాలు మిద్దియలతండము మేలువిచిత్ర పత్త్రిముల్, చెలఁగెడితీఁగ నీరములు చెంగినసౌరును గాక రాజు ర్యాకల నిల పిల్లు నంచుఁ బురకంజము చేర రదూతభూతి తజ్జలజగృహంబులం దళిమిషంబున లక్కను మూద్ర వెట్టుచున్ కువల ౧. ౪౧.

సీ. హర్మ్యశిఖర మిద్దె నా నలరు నట్టిక యన
ఆం. భా. ౨. ౧౪.

మీ. డాబా, దద్దళము.

(మూదుపుమీఁద చదునుగాపలకలుగచ్చిన గచ్చు పూచిన కప్పు, అని శ. ర.)

గీ. మట్టిమిద్దెలవారికి మరుపములకు, నెలఁతఁ భావిన వారికి నిదుర చెడిరి

ఆము ౪. ౧౨౪.

సీ. గద్దియ లుద్యోగుల మిద్దియల్ మేడలు చప్పరంబులు పెంగసాల లిండ్లు .

అచ్చ రా యు ౭౧౦. సం. ౯.

3. తామరపువ్వు లోనగువానిలోనిదుద్దు, దిమ్మె.

గీ తమ్మి పూమిద్దెగద్దెపైఁ గిమ్మవిల్తు, నిమ్ముగా నిల్పి యొమ్మెను గొమ్మ తెల్లఁ, గ్రమ్మికొని పెక్కులాగుల దొమ్మిగూడి, పూజలొనరించి యిట్లని పొగడి రపుడు

నీలా 3. 3౪.

౪. ఉంగరము

(ఉంగరముమీఁది దిమ్మవలె చేర్చిఅచెడి తదవ యవవిశేషము అని శ ర)

శి. పూని వడి దిగిచి యప్పమ,హోనాగమ్మ లను మిద్దియలంగా ద్రెళ్లన్, మానుగఁ గొందఱు దాల్తురు, వానిఫణామణులరుచులు వట్టిగఁ భ్రమధుల్ శివ సా. 33౬.

జ మిద్దెజాట్టు.

మిద్దెజోట్టు. వి (మీఁది + జొట్టు) తామరపువ్వు లోని దుద్దువలె నుండుజొట్టు.

సీ పన్నెలు పింగాణికన్నులు అలిబొమల్ మిడిడేగచారలు మిద్దెజొట్లు ప్రబంధ. ౧3౭.

మినమిన. వి. ౧ తళతళకాంతి.

సీ మృదుభుజాయుగళింపు మినమినల్ రాయంచ తెగలకు కిత్తపండుగ రచింప .

చంద్రా. 3. ౫3.

చ. మినమిన లీనుమేను నెఱమించుల కొంచెపు టంచుఁగమ్మలున్ ... శుక. 3. ౧౦౫.

౨. మిక్కిలి మెఱయుటయం దగు నసుకరణము

ద్వి. మినమిన మెఱయుచు మను పెండియూన, యను బోల నుండె నయ్యుని చినచోన .

పండితా. పురా. ౧౬౭ పా.

3. చూచుటయం దగునసుకరణము.

చ. అనపుడు నల్ల నవ్వి విభుఁ డానకదుందుభిఁ జూచి దివ్యమై, తనరినరూపు మాన్చి విదితంబుగ నప్పుడు చిన్నిబాలుఁడై, మినమినఁ జూచుకన్నులును మెల్లనియేడ్పును ముద్దుమోముసొంపును మఱి దీర్ఘబాహుయుగమున్ గొమరారఁగఁ దండ్రిముందటన్

పద్మ. ౯ ౭౭

జ మినమినలివాఁడు, మినమినమను, మినమినలాఁడు.

మినమినలివాఁడు. విణ (మినమిన + వాఁడు) చక్కనై నున్ననైనవాఁడు, మేమరుఁడు

గీ. మేదురసమాఖ్య యా మినమినలివాఁడు

అం భా. 3. ౧౦

మినమినమను. అ క్రి (మినమిన + అను) తళతళప్రకాశించు

ద్వి. అని యెత్తుకొని చంక నలమి ముద్దాడి, మినమినమనుచెక్కు మీఁటి 'యా' బోటి

అ. మ క. ౧ ౪౦ పా. ౧౯. పం

క. మినమినమనుపావలు గని, కనలున నిట వింత పాదుకలు రా సేలా

సారంగ. 3. ౧౫౪.

శ. అని యాపేరును గడుపున, మినమినమన మించి గాచ మెచ్చులపేరు, గనఁ దగు వావులఁ జేర్కొని మునివనసౌభాగ్యమహిమమును గని మఱియున్. శకు. 3. ౭౦.

మినమినలాడు. అ. క్రి. (మినమినలు + ఆడు) మినమినమని మెఱయు. (శ. ర.)

౪. పుస్తె, తాళిబొట్టు.

క. గురుజను లెఱుఁగక యుండను, పెరవిఁడి రై
మినుకు గట్టి వెల్లి చనవునస్, వరియింపఁ
దగినపురుషుఁడు, పరిణయ మగు కేని వదియ
పైశాచ మగుక్ — విజ్ఞా. ఆచా. ౧౦౧.

ద్వి. కాటిపావని కేల కరుణ నీమీఁద, లేకున్న
నా కిచ్చునెక్కఁడు కెల్లు. గైకొంపు నిమ్మ
నీకట్టినమినుకు
ద్వి. హరిశ్చ. ఉ. ౨౧౭౬. పం

గీ. మెలత మంగళసూత్రంబు మినుకు దక్క
భాగ. ౯. ౪౨

౫. ఒకవిధమగు బంగారు నాణెము.

సీ. మిను కొక్క టిచ్చి పా మ్మనినఁ బోవునో
పోవఁ దర్థప్రయాస విప్రులుఁ డితండు
పాండు. ౪. ౧౬౬.

శా. ... ఏ, నాఁటన్ మిన్కులు గల్గువారి
కగు జన్మస్థాన సౌఖ్యోన్నతుల్

గీ. వచ్చు తెరవరు లందఱు వంటపనికి, నన్ను
మెత్తు రటంచు నందములు సూపి, బాళి
పుట్టించుదాని కిష్టధికు లెల్ల, నొదబడిక
మీఁద నే మిన్కు లొసఁగి రపుడు.
శుక. ౪. ౪

విశే. ౧. మినమినకాంతి గలది.

మ. అని వర్ణింపఁగ నంత జానకి వయస్యల్
రత్నపుక్ సొమ్ములున్, మినుకుంబంగరుజిల్గు
వ్రాఁతపనులన్ మేలైనవల్వల్ పదల్చి.
ఉ. రా. ౬. ౫౫.

చ. మినుకు టొయారిపాదుకలు మెట్టి నివాళి
మిటారు లెత్త కో, ధనపువితర్ధిఁ జెంది మధు
పర్కము నంది వసించు నయ్యెడన్
చం. రా. ౩. ౧౨౩.

సీ. కంటి కిం పగురేఖ గల్గియుండుటఁ జేసి
మినుకుఁగాటుక కొంత దినుచువచ్చు.
విజ. వి. ౧. ౩౫.

మినుకుఁగొమ్మ = సరస్వతి.

సీ. తారసారులఁ గేరుఁ దరుణిపాదనఖాళి
మినుకుకొమ్మను మీఱు మెలతభుజము
అచలా. ౨. ౪౧.

(మినుకుకొమ్మ = తళతళకాంతి గలవృక్షశాఖ
యని యర్థాంతరము.)

మినుకుఁజేడియ = సరస్వతి.

సీ. శశిరేఖఁ గైకొన్న సౌవర్ణగిరిపోలె మినుకుఁ
జేడియఁ గూడి మెఱయువాని.

గీ. సచ్చిదానంద కందమై హెచ్చువాని, నలువఁ
జాలుకితపాథోధి తెలచె మతుల
పాండు. ౫. ౧౪౪.

మినుకుటూర్పులవాఁడు = వేదము నిశ్వాసముగా గలవాఁడు, విష్ణువు.

సీ. మినుకుటూర్పులవాని మిసిమిమేఁతలవాని
మెఱుఁగుఁజామనిచాయమేనివాని
పాండు. ౧. ౨౧౩.

జ. మినుకుమినుకను, మినుకుమినుకుమను, మినుకు
మినుక్కు, మినుకురను, మినుకురు, మినుకుల
బరణి, మినుకులయిక్కు, మినుమినుకను,
మినుమినుకుమను, మినుమినుకు మినుకుమను,
మినుమినుక్కు.

మినుకుమినుకను = మినుకుమినుకుమను.

అ. క్రి. (మినుకు + మినుకు + అను) మినుక్కు
మినుక్కుని మెఱయు.

క. మినుకుమినుక నెడిమింటన్, బొనపొన నల లెల్ల
మబ్బుపొంతన దెసవాటున నడ కిలకో
లేదో, యనుమాత్రము గాఁగఁ గంటివా
నృపతనయా.
సారంగ. ౧. ౧౨౪.

**మినుకుమినుకుమను** = మినుకుమినుకను.
అ. క్రి. (మినుకు + మినుకు + అను) మినుక్కు మినుక్కుమని మెఱయు.

వ. • దినాంతంబున మినుకుమినుకుమని మెఱయు ఖద్యోతంబులును •
భాగ. ౧౦. పూ. ౭౫౬.

**మినుకుమినుక్కు.** వి (√మినుకు) మినమినమను కాంతి

వ • అఖండవిరహచండి మపాండుతరగండంబుల గం దమరి నిండుకొనిన కన్నీటిచినుకులు మినుకుమినుక్కున బెళుకు బేడిసలు సుధాకరకాంత ఫలకంబులఁ గ్రక్కన చొక్కంపు ముక్తాఫలంబులపైఁ జలంబులు నూప
రా. వి ౪ ౨౬

**మినుకు(క్కు)రను.** అ క్రి. (మినుక్కురు + అను) తళతళ ప్రకాశించు

మ. అమృతాంశుండు నిశాపతిం గదిసి శీర్యచ్ఛంద్రికాగంధశిల్పముతోఁ బుష్కరశయ్యఁ బాసి చన పశ్చాదూతి తత్కాలసంభ్రమసంకీర్ణతరోడువారమణివారం బేరి తా నొక్కచో, సుమిగాఁ బోసినా నా మినుక్కురను పేరుంజుక్కఁ గంటి చెలీ.
వసు ౪. ౧౨౭.

**మినుకు(క్కు)రు.** వి. (√మినుకు) మెఱయుటయం దగునమకరణము. (చూ. మినుక్కురను)

**మినుకులబరణి.** వి. (మినుకులు + బరణి) సూర్యుఁడు.

క. మినుమినుకు మినుకుమనిరయొన్, బెనుమినుకుల బరణి ధరణి బిట్టూటాడెన్, వనవిధులు విరిపెఁ గురిసెన్ గనగనగనమనుచు నిప్పుకలు గుప్పలుగన్.
పాండు. ౫. ౧౭౭.

**మినుకులయిక్క.** వి. (మినుకులు + ఇక్క) సూర్యుఁడు.

చ అమ్మినుకులయిక్కకట్టఁ జేతిమానిఁగి నుంగొని పక్కి పెండియున్
అచ్చ. రా. కిష్కి. ౩౧.

**మినుచూలు.** వి. (మిను + చూలు) నభస్వంతుఁడు, వాయువు. (శ. ర.)

**మినునిసు(ఁగు)వు.** వి. (మిను + నిసువు) నభస్వంతుఁడు వాయువు.

చ మినునిసువుల్ వడిం దెగడి మీఁకెడిమావులు లాజు గానిబల్గానలును దొడ్డపింగిణులు దూకొని వెన్కకు రానివీరమున్, బొనరఁగ పేల్పుగొంగ తోలుబొట్టియ యింద్రజితుండు అంపిలున్.
అచ్చ రా యు. ౭౦.

**మినుపపోఁక.** వి (మినుము + పోఁక) భక్ష్యవిశేషము, ఒకవిధముగుపిండివంట.

వ మినుపపోఁకలు మనోహరంబులు గారెలు బూరెలు ఆదిగాఁ గలభక్ష్యంబులు
హంస ౧. ౧౦౫

**మినుబావి.** (మిను + బావి) ఆకాశగంగ, సుర దీర్ఘిక.

ద్వి. కటిశైల కందరగరిమఁ జెన్నొందెఁ, గుటిల కుంతలనాభి కుచసురాలయము, నందుండి పొక్కిలి యనుమినుబావి, యందుఁ గ్రీడకు వచ్చునలనాకభామ, ఖచరమార్గం బనఁ గొను రాజిల్లె
మృ. వి ౧. ౧౧.

**మినుమినుక(క్క)ను.** అ. క్రి (మినుమినుకు + అను) మినుకుమినుకుమను.

క. పెల్లి యగుపగలఁ దొక్కన, నిల్లిగులు గాన వచ్చుహృదయములోనన్, మల్లాపడి యగుమదనుఁడు, మెల్లనఁ గొర్పుంజెఁ దాల్మి మినుమినుకనఁగన్.
ఉ. హరి. ౫. ౧౬౭.

క. చమరగవబంగరుపసటుల, మినుకులకలెఁ గత్తు
రుచులు మినుమినుకనఁగన్
సుద. ౫. ౭౯.

సీ. కను దృష్టి సెయ్యాది మినుమినుక్కనుచుండు
ఘనతర ప్రేమ్మిడినది గానఁబడఁగ
పి. శకుం ౧. ౧౧౭.

చ. తిలకల నవ్వువట్రువకెంగంబు దరా లను
చేరఁడేసికన్నులు పిడికింటిలో మినుమిను
క్కను కొనను ముద్దుగారు పుల్కులఁ జెలి
కమ్మ చేఁ దళంతళుక్కనుచెక్కులు పట్టెఁడేసి
గుబ్బలఁ గమచూపుమేరకు గుభాలను
తావులు దీనికే తగున్ కువల ౩ ౩౯

మినుమినుకుమను = మినుకుమినుకుమను.
అ క్రి (మినుకుమినుకు + అను) నక్షత్రములు
మున్నగునవి స్వల్పకాంతితో మెఱయు.
క. చక్కని ప్రకోష్ఠపీడన, మిక్కిలికసువేకి సుఱిచె
మినుమినుకుమనన్ . హార. ౩. ౭౪.

మినుమినుకుమినుకుమను. అ. క్రి. (√మినుకు
ఇట ననుకరణము (ద్విరుక్తము) నక్షత్రములు
లోనగునవి స్వల్పకాంతితోఁ బ్రకాశించు.
క. మినుమినుకుమినుకుమనిరెయిన్, బెనుమినుకుల
బరణి ధరణి బిట్టూటాడెన్, వననిధులు
విరిసెఁ గురిసెన్, గనగనగనమనుచు నిప్పుకలు
గుప్పలుగాన్. పాండు ౫. ౧౭౭.

మినుమినుక్కు. వి. (√మినుకు) మెఱయుట
యందగు ననుకరణము
సీ. మినుమినుక్కను నీలమేనికాంతిఁ గడాని
వలువతళ్కులయు వల్కులమువాని ...
చం రా ౪. ౧౦౪.

మినుము(న్ము.) వి. మాషసస్యము, ఒకవిధమగు
పైరు కీ.

(సమాసమున దీనియంతిమాక్షరమునకు పవర్ణా
దేశము. ఉదా : మినుపచేను, మినుప
పిండి. మొ.)
వ. కందియుందంబును పెసరసెరియును
మినుమునలంపును భీమ. ౩. ౫౪.
సీ. మిను మనఁగ మాషము దవర్పు ..
ఆం. భా. ౭. ౭౩౫.
బ. ధాన్యవిశేషము, మాషములు, ఉద్దులు.
క. అనుములు గోధూమంబులు, మినుములు సెన
గలును బందుమేదిని భూదేవున కిచ్చు
నెవ్వఁ డతనికి, ననపాయస్వర్గసౌఖ్య మబ్బు
మహేంద్రా భీమ. ౫. ౬౩.
వ. పెసలు మిన్ము అన్ము లోపైన ఎంద్రు
నవ బుట్టి ౧. జ్జీకి చి ౬
ద శా ౪. ౧౩౭౪.
సీ. చమురు పట్టించి యంగములు మర్దనచేయు
మేదించు మేనిపై మినపపిండి
వైజ. ౩. ౫౧.
జ. మినుపపొక.

మినురతనము. వి. (మిను+రతనము) నభోమణి,
సూర్యుఁడు.
గీ. తమ్మిచుట్టము మినురతనమ్ము ప్రొద్దు, వేవెలుం
గన సూర్యుఁ డా .. ఆం. భా. ౧. ౭౧.

మినువాఁక. వి. (మిను+వాఁక) ఆకాశగంగ.
సీ. మినువాఁక వలగొన్నగొనబుబిళ్లొప్పుపైఁ గలికి
క్రొన్నెలవంక వెలయువాఁడు
పె. శకుం. ౧. ౧౩.

మినుసికదయ్యము. వి. (మిను + సిక +
దయ్యము) వ్యోమకేశుఁడు, ఈశ్వరుఁడు.
గీ. తడయఁ బని లేదు మినుసికదయ్య మింక,
నెట్టు గావింప నున్నాఁడొ యెవ్వఁ
డెఱుఁగు . నీలా. ౭. ౬౯.

సీ. . మినుసికదయ్యంబు మి త్తిగొంగ, .
మువెన్ముసవాలుదాల్పు నాఁగ భవదాఖ్య
లొప్పు నందకవిపతు. ఆం. సం. దేవ. ౬.

ఇట్లే: మినుసికదేవర. వెం.

వ. . అయ్యా యెన్నఁడు లేని దిట్లు చిన్న
బోయినయున్కి కేమి హేతువు నాతో
పెలవీయవలయు ననిన మినుసికదేవర యి
ట్లనిరు మృ. వి. ౨. 3౨.

మినుసికగలాఁడు = శివుఁడు.

గీ. మినుసికగలాఁడు ముక్కంటి యనఁగ నిట్లు,
యౌగికంబులు భవదాఖ్య లలరుచుండు
ఆం భా ౧ 3౪

మినుసికవాఁడు = శివుఁడు.

క. నీతెఱఁ గరయఁగ దమ్మెర, మేతరివండడపు
కోఁడు మినుసికవాఁడున్, దాతయు నాతని
నాతియు, నేకురె యెక్కించుకైన నిక్కవ
మెందవన్. అచ్చ రా. యు. ౫.౨౪

మినుసికవలంతి = శివుఁడు.

సీ జక్కులకొలములోఁ జిక్కి సొక్కపుదొర
చికిరముల్ గొను మినుసికవలంతి
అచ్చ రా. బాల ౬౭.

మినుసిగదేవర. వి (మిను + సిగ + దేవర)
వ్యోమకేశుఁడు, శివుఁడు.

సీ మెలఁగితి మెకిమీఁద మినుసిగదేవర మాను
గుబ్బలిసల్లసీమ లెల్ల ఇందు. ౬. ౫౦.

ఇట్లే మినుసిగవేల్పు. (శ. ర)

మిన్కుఁగొన. వి. (మిన్కు + కొన) వేదాం
తము, ఉపనిషత్తు.

సీ. పెనుమిన్కుఁ గొనత్రోవలను మెలంగెడు
కోఁడు నీలా. ౧. ౪౪.

మిన్న = మిన్నా. ౧. మణి, రత్నము.

ఇది సమాసోత్తరపద మగునపుడు చంద్రబింబాది
శబ్దములవలె శ్రేష్ఠవాచక మగును.

ఉదా॰ అన్ను మిన్న వెం.

సీ కదలిరాయఁడు మిన్న గల మిన్నగమి డాఁప
ఘటియించు బంగారుకణఁజ మనఁగ
ఉ రా. ౧ 3౧౬.

సీ. తళుకు బంగరు చెఱఁగుల యొరతలపాగ
తలఁకుచూ వంచమిన్నల తురాయి
దశా. ౧౦ ౧౧౨

౨ (త మిణ్ణాల్) కాంతి

క. పొన్నలకుం డెలిజాబిలి, మిన్నలకుం దలఁకుఁ
జిలుక మేలిమిపలుకుల్, విన్న నగున్ విన్న
నగున్, గ్రొన్నన గుంపులకు దిగులుకొని
మదిఁ బొగులున్ కువల 3. ౭3

మ. నరిలం గూర్చిన కొప్పుతోఁ బసపుమిన్నల్
డేలునెమ్మోముతో, గరిమన్ నాగమసాని
ప్రోలు దిరుగింగా ఱంతు లై తూర్యముల్,
మొరయంగా గడు నొప్పె నాకబలి
శేం పంచ ర 3౪౦

గీ వలిపె చెంగావిపావడ కలపి మెఱయఁ,
గొమరు చివురాకు టంగదట్టములు పర్వ,
చిఱువొడల మిన్న లంతేని చికిలిసేయఁ,
దొరవ లెనసిరి విరులయోవరుల వరుల
భోజనుతా 3 3౪

3 (త మిణ్ణాల్) ధనము; నాణెము

ఉ. అట్టి మహావిహీనభవ మయ్యును నీలంవు
మాటవాపియుం, జొట్టరికంబుఁ బుణ్యమును
నున్నగ మిన్నలఁ గూడఁబెట్టుచో, గుట్టు
దొఱంగుచుం బడుపుఁగూటికి నోచినవారి
జాతినిం, బుట్టి క్రమక్రమంబునఁ దపోధన
యోవన మావహిల్లఁగన్. విప్ర. 3. ౧3.

ద్వి. ఎన్ను సేఁటికి లంజ కిలలోనఁ గ్రొత్త, మిన్ను తెచ్చినవాఁడె నూనకేతనుఁడు
ద్వి పరిమ. ౪. ౭౯౩ పం.

౪. పాంచాలిక, (దంతములు మున్నగువానితో నిర్మించిన) బొమ్మ

క. కన్నె రతసంభ్రమిన్నా, మిన్నా నడు మనఁటి యాకు మేకొను వెన్నా, వెన్నా పలుకులు
శశా ౭. ౧. ౨౧౪.

౫. భూషణము, నగ.

సీ. అవయ భూషణజ్జ తొడుగు తొడవు మిన్న
ఆం భా ౨ ౧౪౭.

గీ నిన్ను వక్షింప మండు మె యన్నుమిన్న
హర ౬ ౧౧౩.

సీ నవసహాగి మమునఁ జవులు వక్కాణించి మించఁ జాలువెలంగిమిన్నగి ములు
వసు. ౬. ౭౨

విణ ౧ శ్రేష్ఠము, ప్రశస్తము

గీ. మిన్నమిరుఁగులు రై రెండు మెఱుపుగన్న, మెఱుఁగు లాకపుట్టలో నున్న సెలుఁగి కేను, పుట్ట గ్రొప్పించి యా రెంటిపొడవుఁ గాన, వడిగి వచ్చితి విస్మయపడి మనమున
భార అర. ౩ ౧౭౯

సీ నును పెడందయురంబునను జీనిసరి కెంపు మిన్న జన్నిదముతో మేలగొనఁగి
దశా. ౧. ౨౭.

క మి న్ననడు మలకలువల,మి న్నా సెజేచూపు మేలిమి స్నలు వెన్నన్, వె న్నా పలుకులు చక్కని,వె న్నాయనటాకుకలిమి వెలఁదికిఁ గనఁగన్.
ప్రబంధ ౩౦౦.

౨. అధికము

సీ. చిఱునవ్వు నవ్వినా సొంపవమాను పెన్నెల కన్న మిన్నపన్నెలు వెలంగు
అహల్యా. ౧. ౩౪.

ఉ. వింధ్యకు మే లెత్తంబు ఘనకేతకమంటొను దొయి బంగరుంగిండ్లకు మేటిసాటి కుల కించుచునుంగవ శేఁతతమ్మిపూవ్మొండ్లకు మిన్న యన్న జిగి దొక్కొడుచేతులు లోక మందుఁ బూఁబోండ్లకుఁ గానవిూ వినమెు పోలరు తత్సతికాలిగోరునన్
హంస. ౧ ౬౧.

మిన్నందు. అ క్రి. (మిన్ను + అందు) ౧ ఆకస మునంటు, అతిశయించు.

గీ సేను నీలంట సై యుండ సెలుఁగసేర, కకట యెవ్వాఁడు నీకు నె గ్గాచరించె, మిగిలి మిన్నంది పెనఁగొను మేఁటి కైన, నాయువును శ్రీయు నెవ్వాని కవశమయ్యె
హరి ఉ. ౫. ౪౧.

క న న్నిం తలయించినఖలు, నిన్నున్ ఋఱవిధ వధింతు నే యని యార్పుల్, మిన్నందఁగ ఒనకొట్టుచు, నన్నీచుఁడు వొగడి కెదలు నవ్వులతో కిన్
ఆము ౬. ౨౬

౨ సంతోషముచే నుప్పొంగు

క మిన్నంది కేఁగఁ గైకొని కిన్నుల నొత్తుకొని క్రొమొక్కి గారవ మెసఁగన్, వెన్నుఁడు రుక్మిణికొసఁగెను
పారి ౧. ౩౭.

ఉ నందనుఁ డుద్భవించె ననిన న్విని యెంతయు సంతసించి మి,న్నందుచు సూతికాగృహ మునందుల కేఁగి తనూజువక్త్రి మానంద మెలర్పఁ జూచి
రుక్మా ౧ ౧౪౪.

మిన్నందికొండఁదాఁకు = మిక్కిలి యానం దించు.

గీ. కలదు లే దన నవిరాడుకానుతీరుఁ, దళుకు మొగమున కెగయుగుబ్బలబెడంగుఁ, జూచి యారతని నిడువాలుచూపు లపుడు, నిండు పేడుక మిన్నందికొండఁదాకెఁ.
విజ. వి. ౨. ౨౦.

**మిన్నక.** అవ్య (యత్నము, కారణము, ప్రయోజనము, ప్రతిక్రియ మున్నగువాని యభావమును దెలుపును.)

౧ అప్రయత్నముగ, ప్రయత్నము లేక.

క శత్రుజనులు చెఱుచుటయును, మిత్త్రులు ప్రతికించుటయును మిన్నక యాపత్ప్రాప్తతయును సంపదయు వి, ధాత్ర్యుడు సంధించుచుండు తనితోఁ బురుషున్ భార. శాం. ౪. ౩౭౪

౨. కారణములేక, నిష్కారణముగ

ఉ పిన్నటనాఁటనుండి నను బెద్దగఁ జూచిన వంశవృద్ధులన్, మిన్నక చంపి చేకొనిన మేదిని నాకిదియేల జై. భా. ౧ ౯౯

౩ నిష్ప్రయోజనముగా, వ్యర్థముగా

క మన్నెన్నఁడు నిర్విఘ్న మేఁ, గన్నది గాదమ్మ పెదలి గాండీవములా,వున్నభుజముల కీర్తియు, మిన్నక పోఁ జిత్రమిది యమిత్త్రిధ్వంసీ భార. ద్రో. ౩. ౧౯౩.

ఉ దీనికిన్, మిత్త్రనిధీ యొడంబడుము మిన్నక సంపయ మంది నేటికిన్ భార. సభా. ౨. ౧౩౩

ఉ వారును సేవిచారములు మిన్నక చేయక పెంపువాఱ నా, చేరువ రండు హంస. ఉ. ౧౦ ౧౨౩. కాశీ. ౪. ౫౦.

౪ ఏమియు చేయక, ప్రతిక్రియ లేక.

శా సురేంద్ర బాధపడి మీ రిబ్బంగి దుఃఖింపఁగాఁ, గట్టాపో యిటు మిన్న కుండుదురె భీమ ౬. ౬౧.

క. ఇంతకు మిన్నక యుండుట, పంతము గా దనుచు వీరవర్మనితోడన్, గాంతామణి సంతాపముఁ, గంతుప్రతాపంబు లుదియఁగాఁ జెప్పుటయున్ విక్ర. ౧ ౧౪౦

౫ అనాయాసముగా, సులభముగా.

గీ అలు మగఁడును నొకకుత్తుకైనఁ గాక, యిట్టిధర్మంబు మిన్నక యేల కలుగు హర ౨. ౬౦.

గీ పూర్వసఖుఁ డైనయాదవ పుంగవుండు, మిమ్ముఁ బొడఁగన్న సిరు లెల్ల మిన్న కొసఁగు కుచేల. ౧. ౪౬.

౬ మాటాడక, ప్రతివచనమీయక.

ఉ. మిన్నక చేర వచ్చి యొక మేలపు మైపడి పువ్వుఁబోఁడిక్రొ, ల్గన్నులు మూసెఁ బాణికమలంబుల భూపతి నైష. ౭ ౩౯.

క అన్నదలామిన్నయు నతిఁ, దున్న తెఱఁగు దశ్కకునము లడుగక కన నా,చున్న తెఱంగును గనియును, మిన్నక చను దైవగతిఁ గ్రమింపఁగఁ దగమే ఉ. రా ౬. ౨౪౨.

ఉ విన్నన నేఁగుతామరల విందుకిలాతపునీడ లెప్పుడున్, వెన్నెలరాచతాలఁ గని వల్లిక నీళ్ల మునింగి యున్న వీ, మన్న లటంచుఁ జెంచెతలు మాటికి నమ్ముల నేసి నాటమిన్, మిన్నక సిగ్గునం గదలి మెల్లనఁ బోవుదు రిండ్ల పట్లకున్. యయా. ౨. ౩౯.

వ అనిన నిని యక్కన్నియ మిన్న కుండె . నైష. ౩. ౧౭౭.

క. నీయిచ్చగెడు మిన్నక పోవోయి మునిప్రవర. ఆము. ౭ ౯౩.

**మిన్నతి.** వి ( గౌరవము

చ తేని గూడి యౌ, మెలఁకుక మార్తుచేఁ దగిన వన్నతి గొంటి గదమ్మ సేయుపుల్ . యయా ౫ ౧౪౩.

౨ బ. ప్రగల్భవచనములు, డంబములు.

ఆ. పండువంటివయసు బలుకాఁపురము సేయ, జపతపంబులకును జాల వేఁడు, మీఁదిదినము

లనుచు మిన్నకుండ్ వలికెడి, భ్రాంతజనులఁ
దగదు పాటిసేయ. కుచేల. 3. ౯౩.

మిన్నము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. క్రొవ్వి
నది. ౨. జిడ్డైనది, స్నిగ్ధము. 3. ఇష్టముగలది,
స్నేహముగలది, స్నిగ్ధము.

మిన్నా = మిన్న. వి రత్నము.

సీ. మేలైన హురుమంజి మిన్నాల కళ్లాయి
చాకచక్యంబుల సందడింప
భాను ౪ 3౭

విణ. శ్రేష్ఠము

శా. ఈద్యోగసంప్రీతిం జేయుచునుండు
నాశ్రమమునన్ మిన్నాతపం బేర్పడన్
అచలా 3 3౧.

శా. కెంపు పున్నాగెంపుఁదు రాయి క్రేవఁ
బవడంపున్ వాగయిన్ బన్నుచున్, మిన్నా
తేజిని దెచ్చినన్ విభుఁడు నెమ్మిన్ గాంచి
యొక్కన్ వెసన్
ఈ. హరిశ్చ ౪ ౭౨

మిన్నీరు. వి (మిన్ను + నీరు) ఆకాశగంగ
గీ. శిరమ మిన్నీటఁ దడియంగ శింశుమార, చక్ర
గతుఁ డైన ధ్రువు పెంపు సన్నుతింపు
కళా 3 ౫

మిన్ను = మిను. వి. ఔ ఆనా ఆకాశము
(ఇది ఉవర్ణకాంత మయ్యును నికిపచనార్థ
మునఁ జెక్కు ప్రయోగమూలంబుఁ గానవచ్చు
చున్నది)

గీ. అమర లన్ముతాంబునిధిలోని యమృతిగసము,
వెండిచేరలఁ బటికంపుఁగుండ కట్టి, చేఁదు
కానియెందరో నాఁగ శీతరోచి, మెఱుఁగు
మెయిలోన యల్లన మిన్ను ప్రాఁకె
పారి. ౨ 3౯.

క. కే మింటిదాఁకఁ బెరిఁగిన, దీమసమున వకల
మునకు దిగఁబడి చూచినన్, భూమి గలయంత
దిరిగినఁ, దా మును పెట్టినది రిత్త దన కే
లబ్బున్. వి్క్ర. ౨. ౧౭౭.

శా. దానత్యాగపత్త్రమై తోలంపత్త్రిం బంబు
ధార న్సదా, నానన్, దత్సితకీర్తిహంస చను
మింటన్ ఆము ౨. ౪౭

క గిన్నున కూరక యెగయడు, రన్న సమ
ర్థుండు గాఁడు తల్పగతుం డీ, చిన్నికుమా
రుఁడు దే లేవిన్నసుపుగ నెగసె దివిబిధ
మెట్టిదియో. భాగ ౧౦ పూ ౨౯3.

ఈ మేద్పడి రాజ్యగర్వమున నీఁడు తలంపవు
గాక చిచ్చులం, గాడ్పులం, గూడినట్టు
మురపస్మరు చేతుల శంఖశార్ఙ్గముల్, మీడ్పడి
మోయ డాయఁ బదివేవురతోడుల సింహ
నాదముల్, దోడ్పడవే రసాతలము
దూఱియు మిన్నులంటఁ బాఱియున్
ఈ. హరి ౪ ౧౯౭

సీ మిన్నులప్పై బాఱుచున్నయే తిలఁ దెచ్చి
వారాశి నించె భగీరథుండు
కు సం ౧. ౫౭.

ద్వి చెన్ను మించిన మంచిచెఱుకులోఁటలును,
మిన్నులతో రాయు మేటికోటలును
ద్వి హరిశ్చ పూ ౧౦౭, ౭౦.

సా. మింటికి నేలకు సూత్రపట్టు = మిక్కిలి
దుష్కరమగు పనులు జేయు.

సీ. కొలిచి మింటికి నేలకును సూత్రపట్టంగ నే
నేర్తు మతియును నేసె నేర్తు .
విప్ర ౪. ౨౭

మిన్నుదన్ను = సంతోషముచే సుబ్బొంగు.

చ. నరులకు గుండెకొందు దిగ నాగకులంబులు నిద్రవోయిని, ర్జరులును మిన్నుదన్నిరి ధరామరకోటియుఁ దృప్తిఁ బొందె
కాళి. ౨. ౬౧

మిన్నుదాఁకు = సంతోషముచే మహాప్పొంగు

క. చనుదెంచి కేఁడుము వరం, బని పలికిన మిన్నుదాఁకి సాష్టాంగముగా, వినతి యొనరించి
హరి పూ. ౪ ౨౦
హరి. ఉ ౧౦ ౧౨

జ. మింటముక్కుడివల, మింటికాఁపురులు, మింటికాఁపురంబులవారు, మింటితెరువరి, మింటిమానికము, మింటిమ్రాను, మింటిపికిపేల్పు, మిన్నందు, మిన్నీరు, మిన్నుకొలఁకు, మిన్నుమానికము, మిన్నుముట్టు, మిన్నులువడ్డచోటు, మిన్నువాఁక, మిన్నువాఁకతాలుపు, మిన్నుద్రేయు, మిన్నెక్కు, మిన్నేఱు, మిన్వాఁక.

మిన్నుకొల(ను)కు. వి (మిన్ను = కొలఁకు) సురదీర్ఘిక, ఆకాశగంగ.

ఉ. వెన్నునిమించుఁ గాలిబొటద్రేలికిఁ గూఁతురు వేల్పుటాటకున్, మిన్నుకొలంకు పంటచెలి నిద్దపుఁబయ్యెద పాలవెల్లికిన్ మన్ననయన్ను నై తపసి మంతనపుందెర యైనతొయ్యలిన్
రామా. ౫. ౧౯.

మిన్నుమానికము. వి. (మిన్ను + మానికము) నభోమణి, సూర్యుఁడు

చ. మిన్నుమానికపు వంగడపుందొర వెన్నుఁ డేలిఁ బాటులయెడ నల్లఁ బోదుకె యొఱుంగమి నైన ఖెడంగుడాల్గనీ
అచ్చ. రా. బాల. ౨౦౫.

మిన్ను(లు)ముట్టు. అ. క్రి. (మిన్ను + ముట్టు)
౧. అతిశయించు.
౨. అవకాశమునంటునంత సంతోషముతో మహాప్పొంగు.

మ. అసకృత్తేజము మిన్నుముట్టి రిపుభార్యానేత్ర నీలోత్పల, ప్రసవంబుల్ నలఁగించి యాశ్రిత ముఖాబ్జశ్రేణికిన్ సంతసం, బెసఁగం జేసి విరోధిగర్వతమసం బింకించి దీపించుఁబో, బసవక్ష్మా విభుతమ్ముయ ప్రభుప్రతాపద్యావ కార్మప్రభల్
వి. పు ౧ ౪౦.

(ఇది రెండర్థములకు నుదాహరణము.)

చ. తనభాగధేయ మహిమంబున మిన్నులుముట్టి వచ్చు ధ, న్యుని నతనిన్ భజించి నదియున్ వినయంబున నొంరియై చనన్
వసు ౨ ౧౦౯.

మిన్నులువడ్డచోటు. వి (మిన్నులు + పడ్డచోటు) ఆకాశము వాలినచోటు, భూమియు నాకాశము గలిసినట్లు కనుపడుచోటు, అతి దూరప్రదేశము

చ. కటినిభయానతో నిడ పొకాలెద మిన్నులు పడ్డచోటికిన్ - కాశీ ౨ ౧౫౬.

గీ. దైవంబు కినుక నిట్లు, పాఱవైచితె మిన్నులు పడ్డచోట
మనుచ ౨ ౧౪.

మిన్నువాఁక = మిన్వాఁక. వి. (మిన్ను + వాఁక) ఆకాశగంగ, స్వర్ణది

ఆ. వెన్నునడగుపాప మిన్నువాఁక
ఆం. సం. దేవ 33.

మిన్నువాఁకతాలుపు. వి (మిన్నువాఁక + తాలుపు) గంగాధరుఁడు, ఈశ్వరుఁడు.

సీ. వలిమలల్లుఁడు మిన్నువాఁకతాలుపు కొండ కోటిజంగము గుజ్జువేల్పుతండ్రి
ఆం సం. దేవ. ౬.

మిన్నుద్రేయు. అ. క్రి (మిన్ను + ద్రేయు) బయలుప్పళించు.

చ. కరముఁ బ్రియంబునన్ దనయుఁ గౌఁగిటఁ జేర్చి త్రిలోకరాజ్యవి, స్ఫురణము నాకుఁ

-దక్కు నని పొంగి దశాస్యుఁడు మిన్ను
ద్రేయుచున్ ... నిర్వ. ౬. ౧౮౫.

**మిన్నెక్కు.** అ. క్రి. (మిన్ను + ఎక్కు) ఆకాశము నంటు.

క. ఇక్కరణి జోదు లేర్పడి పెక్కడలం బోరఁ బెరుఁగు పెనుచివ్వలు మిన్నెక్కి కలహాశి కన్నులఁ, దక్కొట్టిన విధిక కఱవుదీర స్మెక్కెన్ రామా. ౮. 3.

**మిన్నేఱు.** వి ఔ (మిన్ను + ఏఱు) ఆకాశగంగ.

సీ ఈ నగాగ్రంబున నీన గాఁడినయంత విలసైన మిన్నేఱు పెలవకున్న
హరి. ౨ ౧౬౧.

కైటభదైత్యవైరి పదకంజమునం దుదయంబు నొంది మిన్నేటికి భూతధాత్రికిని నెంతయు నచ్చినతోడఁబుట్టు వై భీమ. ౧. 30.

సీ మిన్నేటిజలము ఘుమ్మిమ్మ తోలంకెడు నవి గాచేతమణికమండలు వొసంగి
పారి. ౫. ౮౬.

**మిన్వాఁక = మిన్నువాఁక.** (మిను + వాఁక) ఆకాశగంగ

సీ. దిట్టంపుమిన్వాఁక తరఁగచాలునఁ గలుతెలి పుల్గు బురదగోటులకుఁ జనునె
నీలా. ౨ ౭౬.

**మిమ్మటము.** విణ. మిక్కుటము, ముమ్మరము.

ఉ. మిమ్మట మైనవాఁడిఁ బటిమిత్రము లై కెలఁకు గొండునీవఖా, గ్రమ్ములకున్ మృదుప్రకృతి గిల్లుట క్రొత్త పాండు ౫ ౨౭౮.

క. భావజానిగ్రాహి మిమ్మట మరయ్యెన్
దళడు. 3. ౯౫
ఉదయనోదయము. ౧. ౧౧౨.

**మిరాశి.** వి. (హిం. మీరాస్. క. మిరాసి. త. మిరాసు) ౧. పారంపర్యముగా వచ్చు సొత్తు, హక్కు. (శ. ర. గ్రా.)

౨. వంశపారంపర్యముగా వచ్చు గ్రామోద్యోగము.

(వ్యవ.) మాయూరిమిరాసి కలుగొట్లవారిది.

జ. మిరాసిదారు.

**మిరాసిదారు.** విణ. (√మిరాసి) వంశపారంపర్యముగా వచ్చు గ్రామోద్యోగము గలవాఁడు.

సీ. కాసరపూడి మిరాసిదారుల వెళ్లిఁ గొట్టి కొంపలఁ బనుల్ గట్టినావు
చంద్ర. వి. ౧. 3౨

**మిరి(రె)యము.** వి. (సం. మరీచమ్. ప్రా. మిరిఅం. త మిరియం.)

౧. మరీచము, ఒకవిధ మగు సంబారువస్తువు.

క. అంతెదవు గాక ననుఁ జెంతం జేరఁగనీక యెంత తఱిగిన మిరియాలం జొన్నల నరి పోసే, లంజెతనములందుఁ గామిరలన్ గెలువ వటే
హరి. ౧. ౭౫.

సీ. మిరియంబుతోఁ గూడ మేళవించినతేనెఁ దోరంపులడ్వాలు దోఁచి తోఁచి .

గీ వలచి భుజయించి రొగిఁ బిండివంటకములు.
నైష. ౬. ౧౨౦.

మ. పునుఁగుం దావినవోదనంబు మిరియంపుం బొళ్లితో ఆహారం బిడున్ సీతునన్.
ఆము. ౧. ౮౨.

ఆ మిరెపుగింజ చూడ మీఁద నల్లగ నుండుఁ గొఱికి చూడ లోన జుఱుకుమనును; సజ్జను లగువారిసార మిట్టుల నుండు .
వేమ. ౧. ౧౫౨.

౨. మరీచలత, మిరియపుఁదీఁగె.

క. కంజరిపజేరులు ముండల, నిగిడించి నికారత
నినయవినయులం జారుల్, దగ విస్మరించి కి
ట్లని, జగతీశ్వరునకు నిజప్రచారం బెల్లన్.
భార. విరా. ౩. ౪౯.

సీ. ఔదల ముండల యను శిరోగ్రము మీఁదు
ఆం. భా. ౨. ౧౪౫.

౨. తలముందటి జుట్టు.

ఉ. అట్టుల దున్నవేసుఁ దదయాకృతి ముండల
వట్టి యీడ్వఁగా, నెట్టు సహించె మాను
సతియేడ్పు చెలుంగున కట్టు లోర్చు
భాగ. ఉద్యో. ౧. ౩౪౪.

ఉ. ముండల పట్టినట్టు తనముఖ్యతరాస్త్రము
గొన్న దేవకీ, నందనుఁ జూచి సాధ్వసము
వానయుఁ గ్రమ్మఁ గరీంద్రు డిగ్గి సంక్రంద
నుఁడు . పారి. ౫. ౩౭

ముండలకట్టులు = తలముందున్న జుట్టు.

చ. మునిమనుజాసురాహినురముఖ్యుల వీఁపుల
తోలు లెత్తఁగా, మును గుది గట్టి మోఁది
యును ముండలకట్టులు గట్టి కొట్టియున్
కు. సం. ౨. ౨౧౧.

ముండలపట్టు = తలముందున్న జుట్టులు పట్టు
కొని చేయుపోరు

శా. . ఇంటికడ కేకిన్ విజృంభింతుకే, వా
కీ విచ్చట నంచు నిద్దఱుసతుల్ వాక్యోప
వాక్యంబులన్, గాకే ముండల పట్లకుం
దొడఁగి రాకల్యాణ కేదిస్థలిన్.
పాంచా. ౪. ౨౪.

ముండలచీర. వి. (ముండల + చీర) తలపాగా,
ఉష్ణీషము.

ఉ. మోహనబాణపాతమున ముండలచీర తొలంగ
కున్నయీ, బాహుబలంబులోఁ గడఁగి పార్థునిఁ
దాఁకెడుబుద్ధి గ్రమ్మఱన్, సాహసవృత్తిఁ
తేని యవిచారతఁ బోయితి మీవి వాఁడు
పూర్ణావాపితి చేయఁడే సకలసంధలం
బొక్కట మార్గణాగ్నికిన్.
భార. విరా. ౫. ౨౬౭.

ముందు. వి. కా. (క. త. మున్పు.) ౧. పూర్వ
కాలము.

ఉ. ముందటియట్ల యింకఁ బదుమూఁడు దినం
బుల మాత్రకున్ భవ, న్మందిరవాస మియ్య
కొనినం గద తీఱు మదీయవాంఛ
భార. విరా ౩. ౬౨.

క. ముం దెన్నఁడు తేనిరుచులమి మరియుచు
నుండెన్ నీలా ౩. ౫౪. ౨ ౩౪.

౨. ఆగామికాలము, భవిష్యత్కాలము.

వ. అతనితోడఁ గ్రిందటఁ బదితరంబులవారును
ముందటఁ బదితరంబుల వారును .
భాగ. ౧౦. ఉ. ౪౭౧.

ఉ. ఇన్నియు నీకుఁ దేటపడ నే నెఱిఁగించితి
నింక ముందటన్, సన్నము చేయఁగా
వలయు కారి వానం బిలిపించు నీకు నృథ్యు
న్నతిహేతు వయ్యెదుకులోత్తముఁ దన్న
మహీవిభుండు నిర్భిన్న విరోధిసైన్యుఁ డగు
భీమునిఁ జేరఁగఁ బిల్చి యి ట్లనున్.
జై. భా. ౩. ౪౫.

౩. ఉదర్కము, ఉత్తరకాలఫలము.

సీ. ముదిమి యెవ్వరికైన ముందు దోఁపఁగనీదు,
బాల్య ముద్దండతఁ బ్రబలఁజేయు ...
నీతి. ౪౩.

౪. పురోభాగము.

క. ఎట వోవ వచ్చు నిను ముందట నిడుకొని
పోర నున్నతగు రాజుల నొక్కటఁ దోలెడి
సాత్యకి నీ, వటఁ దరుముదుగాక యొందుఁగ
నగునే నీకున్. భార. ద్రో. ౪. ౯౪.

క. లలితకనదోయి ముందట, తళతళ నలినంబు
మలిన మయ్యెను హైమ. ౫. ౧౨.

ఉ. మువ్వలు గంటలుఁ గొలరయ ముందటి
కూఁకటి రావిరేకతో, నవ్వనజాక్షుఁ
డాడు పాలి. పూ. ౫. ౧౯౧.

౫. ముంగల, సమ్ముఖము.

చ. విరటుఁడు విన్న నెవ్వ పదివేవురముందటఁ
జెప్ప బాహుబలి, స్ఫురితుఁడు శౌర్యశాలి కుల
భూతిని శేషవిధాయకుండు భూభరణవిశా
రదుండు జనభవ్యతపఃఫలసంభవుండు గాఁ తర
పరిరక్షకుం డనుచు దానికి నీడుగఁజేయు
మి త్రతిన్. భార. విరా. ౪ ౩

జ. ముంగడ, ముంగమురము, ముంగమురాము,
ముంగమురారి, ముంగయి, ముంగయిమురారి,
ముంగల, ముంగలి, ముంగాముఁరము, ముంగా
మురారి, ముంగాముగు, ముంగాలు,
ముంగిలి, ముంగురువెంటికలు, ముంగురులు,
ముంగేలు, ముంగై, ముంగైమురార్, ముంగై
మురువు, ముంగొంగు, ముంగొన, ముంగో
పము, ముంగోపి, ముంగోరు, ముంగోలు,
ముంగోలు, ముంజూరు, ముంజేయి, ముంజే
లుగు, ముంజే, ముంజేకోక, ముంజేయి,
ముందటిపంది, ముందపోఁడు, ముందల,
ముందలకట్టులు, ముందలచీర, ముందుకొను,
ముందుపడు, ముక్కోమ్మమెకము,
ముగ్గొయ్య, ముచ్చిక, ముచ్చికకోడి, ముని
ముంగల.

ముందుకొను. అ. క్రి. (√ ముందు) వ్యాపించు.

గీ. మురజపణవాది ఘోషముల్ ముందుకొనిరి
ఉదా. ౭. ౧౭౫.

ముందుపడు. అ. క్రి. (√ ముందు) ముసుకొను,
ముందగు.

(వ్యవ.) ఏపనికిని వాఁడు ముందుపడును. (శ. ర.)

ముంపించు. స. క్రి. (√ ముంచు) మునుఁగఁ
జేయించు.

ద్వి. • వారి నందఱ నాపుట్టిమీఁద, ఘన
మైన రొంకముఁగ గాఁగ నెక్కించి, తా
మున్న యవలికి దాఁటి కావీల, నామహా
సింధుమధ్యమున ముంపించి.
ద్వి. పరమ. ౩ ౫౪౧. పా.

ముంపిరి. విణ (√ ముంపు) ప్రవృద్ధ మైనది.

ఉ. ముంపిరి రాజ్యగర్వమున ముందర గానవు
గాక ధాత్రిఁ బ్రాలింపరొ తొంటిరాజులు
దిలీపముఖుల్ మునికోటికూఁత లాలింపరొ
నొంపరొ మదవిలీఢకఠోరవిశాటరూరాట
మున్, నింపరొ దిక్కటాహముల నిర్మల
కీర్తి సుధాంశు చంద్రికల్
రాజ. చ. ౨. ౧౩.

ముంపు. వి. (ముంచు) ౧. ముంచుట.

చ. తచ్చరణంబు విక్షితో, దకముల ముంపు
నన్ దడియ రామా. ౬. ౮౬.

౨. వృద్ధి, పెంపు

సీ. వివిధసింహాసికోరవిహ్వృతివిభ్రమలీలఁ బైకొను
బహువీరభటుల ముంపు •
కవిక. ౨. ౬౩.

(కాశీఖండిన్నవము.)

వ. వయసంపన్నసంపదయుంబోలె ముంపు
దప్పక వసంతసమయతరుసంతతియుంబోలె
బలుపొదువలెత్తుచు శ్రీరం. ౧. ౧౩౨.

౩. వెల్లువ, ప్రవాహము.

ఉ. మాపునిమాయపంపు దినమానము మేల్ సడ
లింపు జాబిల్లి, జాపులపు స్తరింపు జలజంబ
లపుం దలవంపు కోకసం, పారము మట్టి
గింపు వెలబాలునిరాకరు మాముని౦౧

శృంగార రసంబుముంపు కనఁగాఁ బొగఁ
జేకొటిగుంపు పెంపుగాన్. ఆ. వి. ౪. ౪౧.

౪. గుంపు.

క. జలదములముంపు దిప్పెనఁ, గలితప్రభఁ బొల్చె
దిశలు గర్దము మింకెన్, బలి యింతకుఁ గడు
మించెన్, గొలఁది కతిగి నడుము లెల్లఁ
గొంచెము లయ్యెన్. చిత్రభా. ౨. ౭౬.

వ దట్టం బగు నెయ్యంబున వెదురుబియ్యంబు
లాండొంటి కొసంగఁ గరివరకరేణువులు
వంప ముంపు వెడి యిట్టట్టు పడి తిట్ట లగు
జిట్టల సంకటంబు లసుడొంకల నీడ్చుంచి.
మను. చ ౪. ౌ౭.

౫. అతిశయము

మ పేసటలముంపున్ మాటపై గంటగిం,
పును పర్ణ్యక్షితిపాలపాళిరయి నింపున్
నిరమిం దెల్పినన్ భోజరా. ౪. ౭౦

౬. ఐక్యము, గుటి

(కాకతీ ఖగ్గినము )

వ. అతిరథపటిష్ఠనిష్ఠురబాణశ్రేణియుంబోలె
ముంపు దప్పక యొద్ద భేదించుచు
శ్రీరం ౧౩౭

విణ ప్రియమైనది, ఇష్టము.

(ఈ యర్థమునకుఁ బ్రయోగాంతరము లేదు.
ఇంకను విచార్యము.)

చ. అమసెడఁ గ్రమ్మఅం గినిసి మాంబుఁడు నాడి
భకుండు దోడిదు, గృసుజాలఁ గూడి దిండము
కమండలువుంబిరరంబుఁ జొక్కమున్, మును
కొని వెండియున్ యతులముం పగు
పొమ్ములఁ గాల్చి కాల్చి క్రొవ్వునఁ గఱ
కట్టు లయ్యెడఁ జిపుల్గాని పోయి లేక్క
నూరిన్. ఈ హరి. ౪. ౪౧.

ముంపుగొను. అ. క్రి (ముంపు + కొను) ౧.
గుంపుగూడు.

క. ముంపుగొని విరులవానల, జొంపంబులు
గురియ మరలు ముకుళోద్ధపుల్, కుంభర
సింగముఁ బరాగపూరొంపుల భూభాగ మతి
నిరూక్షిత మయ్యెన్. భాగ. ౯. ౫౧౦.

౨. నిండు, పూర్ణమగు.

వ. (వెన్నెలలు) రత్నాంగకంరగుహాకుహారంబుల
ముంపుకొని వెలయుచు పారి. ౨. ౫౭

ముకాము. వి. (హిం ముకామ్) నివాసము,
మకాము.

క కుండినపురిని ముకామిగ, మండనవూత్ముండు
ప్రకటితోత్సవవార్తా, మండితరేఖ యొసంగ
ఖండితమతి రయము మెఱయఁగాఁ బని
వింటిన్ భోజరా. ౧ ౧౦౯.

ముకు = ముక్కు[1]. వి (క. మూక్కు.
త మూక్కు) నాసిక

క అచునొకకడితిఁ ౭తి ముకుఁ, కెలుమలోకి
యేయఁ జిప్ప చిగుఁగిఁగి, నది యుక్కటుఁ
గాఁడి డుస్సి పొడిన, నతిము తేఁ జాపరువు
వాతి యల్లటు వడియెన్.
మనుచ. ౪. ౪౫.

గీ. కోప మిటు తానొ కాదొ యోఘూపవర్షి
యది యపుడు వచ్చి నామీఁద నాపహించి,
కిటము లదరించె వెంగ మెఱ్ఱగా నొనర్చె,
బొమలు ముడివెట్టె ముకుపుటంబులు గదల్చె
కవలు. ౨. ౩౩.

ముకుచాయన్ = ముక్కునకుఁ దిన్నఁగా.

మ. మాఁదపయామంబున నొక్కనాఁటిం
ముకుచాయన్ దివ్వెటీ గ్గాల్చి గా, నవభావం
బున నింటిత్రోవఁ గలహంసాననయానం
బున్ కే. పంచ. ౧. ౧౧౫

చ. సరసిజబాంధవుండు ముకుచాయ సమాయఁడు
తేఱు గోల నుచ్ఛైరతరకన్నిబద్ధవరజిహ్మగ

పాళము లోని త్రేల నృపసుతుల లజ్జనాశ
ముల ఔపోయని కుందము శత్రుదళుల,
త్తరముల కేగు భీతి మెయిఁ దల్పి పి
శేషుఁడై రయంబునన్. బిల్హ. ౧. ౩౩.

జ. ముంకెరము, ముకుఁగ్రోలు, ముకుఁజెఱువు, ముకుఁగ్రోలు, ముకుఁజెఱువు, ముకుఁద్రాడు, ముకుదూలము, ముకుదొమ్మ, ముకుబంతి, ముకుమందు, ముకుమచ్చ.

**ముకుందకము.** సం వి అ పుం. ౧. ధాన్యవిశేషము, పప్పికలు ౨. ఉల్లి గీ.

**ముకుందము.** సం వి అ. పుం ౧. పాదరసము ౨. మణివిశేషము. ఒకజాతిమాణిక్యము. ౩ కుబేరుని నవనిధులలో నొకటి

**ముకుందుఁడు.** సం వి. అ. పు. విష్ణువు.

**ముకుందుబల్లెము.** మి వి. (ముకుందుఁడు+బల్లెము.) ఒకవిధ మైనబల్లెము.

చ. వలయుమ బోటుకోలలు పిడంగులబండ్లు ముకుందుబల్లెముల్, .. చిలుకులు చిల్లకోలలు విచిత్రగదాధనురాదిసాధనం, బులు దనరంగి వెంబడిని బొంగి చెలంగుచు నేగి రొండొరుల్ . . ఇందు. ౨. ౫౧.

పంచచామరము ముకుంద సర్పపాశటాత్తము న్యారాజిలన్ వృషా, ముకుందుబల్లెముం గరంబు పూని కృష్ణ. ౩. ౧౭.

(ముకుందబల్లెము. ముద్రి. పా.)

**ముకుఁగ్రోలు=ముక్కుగ్రోలు.** గి (ముకు+క్రోలు) ముక్కుగంధ్రము.

(బ. ముకుఁగ్రోలులు, ముకుఁగ్రోళ్లు.)

సీ కాసమూపుల కేగ వళముప ముకుఁగ్రోళ్ల, కెలికి లోనికి జంతువితతి వాఱ

భా — . యు. ౧౫౩.

ఉ. దండమె దీనివాలధి సుధానిధవాటకంటె దీనియూ, కుందపాదుంగు దీనిముకుఁగ్రోలులు భూమిబిలాంతరంబులే

పాండు. ౫. ౨౪౪.

క. వైవస్వతుండు కుమ్మెనవానిధుముకుఁగ్రోళ్లఁ బుట్టె వకులైశ్వర్యా, శ్రీనిధుఁడు సాధుజనని, వానిధుఁ డిష్వాకుఁ దర్కవంశనిధుండై.

వి. పు. ౫. ౬౫.

**ముకుఁజెఱువు.** వి. (ముకు+చెఱువు) నాసాపుటము.

(చూ. ముకు.)

**ముకుఁద్రాడు.** వి. దే. (ముకు + త్రాడు) నాథము, ఎద్దుకు ముక్కున గ్రుచ్చెడుదారము,

సీ. ముచ్చుగిత్తలఁ బట్టి ముకుఁద్రాళ్లు గుట్టించి, గంతగో నెకు వాని సంతపటిచి ..

నా. పంచ. ౫. ౧౩.

ఆ. వేగపడుట మేలె వినుము కార్యము దీఱఁ, దీఱకుండు దానికేఁగు దగినయప్పు డాడ రాద యిప్పుడు ముకుఁద్రాటఁ, గాలు గ్రువ్వ నేల కమలనాథ .

భార. ఉద్యో. ౩. ౨౨౦.

ద్వి. తెలిపింపు ముకుఁద్రాడు తిన్నని మోము, గలిగి తేజీమానగతి నొప్పు మీఱి కెలిగిబ్బ నెక్కి యుద్విధుకుండనూరి .

ద్వి. పరమ. ౨. ౫౬. పా.

**ముకుటము.** సం. వి. అ. న. ౧. కిరీటము. ౨. కురాయి. ౩. పర్వతశిఖరము, కొండకొన. (వాచ.)

**ముకుటి.** సం. వి. ఈ. స్త్రీ. వ్రేళ్లు విఱుచుట, మెటికలు విఱుచుట, అంగుళీమోటనము.

**ముకుదూలము.** వి (ముకు+దూలము.) ముక్కు నడిమియెముక. (శ. ర.)

**ముకుదొమ్మ.** వి. (ముకు + దొమ్మ) పశ్వవ్యాధి విశేషము.

సీ. వాలంగ ముకుదొమ్మ వల్లికకట్టు పుత్తడికాను పూమేను కడిసెలంబు

హంస. ౪. ౧౭౩.

సీ. వాలువ ముకుదొమ్మ వల్లిక గండె

భో. పంచ. ౧. ౨౭౪.

**ముకుబంతి.** వి. (ముకు + బంతి) పశువులకు శైత్యముచే నాసారంధ్రములయందుఁ గలిగెడు శేశావృతపిండరూపవ్యాధివిశేషము.

(దీనిని నేకరించి యుంచుకొని, మఱియొకదాని కావ్యాధి కలిగినప్పుడు తన్నివారణార్థము దీనిఁ గొని బడిసివేయుదురు.)

వ. చూఁడుఁగోడుపులును వాదోళ్లు ముకుబంతులు మొదలుగాఁ గలసాధనంబులు గొనివచ్చి తెవులుగొంటులఁ జికిత్సించువారును హరి. పూ. ౫. ౧౪౩.

ద్వి. మిలవిడి సెలతెవుల్ ముకుబంతి కవట, . . ఆదిగా సెన్నఁ, గలపసరాలరోగములకు సెల్ల .

నవనాథ. ౧. ౪౧. పా. ౫. పం.

క. ముకుబంతి తలకు సెక్కిన, నొకకాలము నందుఁ బసగ ముడుగక దగ్గున్, ఒకపిల్లిగడ్డ యూమర,భికి నస్యముసేయ దగ్గ పేర్కొని మాసున్ . గో ౧. (చి. వి.)

**ముకుమందు.** వి. (ముకు+మందు) నాసారోగముఁ బోఁగొట్టు నస్యవిశేషము.

మ ముకుమందై యేర్చువావం జిగుర్కొను పచ్చళ్లును ఆము ౧. ౭౨.

**ముకుమచ్చ.** వి. (ముకు+మచ్చ) నాసికా చిహ్నము, ముక్కునందలిమచ్చ.

సీ. మూల్పురంపుగతికేగుచు ముకుమచ్చతత్తడి వడి దుమూదారు చూడ ..

ఉ. హరిశ్చ. ౩. ౧౩౧.

(ముకుమచ్చతత్తడి = ముక్కునందు మచ్చ గల వాహనము, వృషభవాహనము.)

**ముకురము.** సం. వి. అ. పుం. ౧. అద్దము. ౨. ముకులము, అరవిరిమొగ్గ. ౩. కులాలదండము, కుమ్మరి సారె త్రిప్పెడికఱ్ఱ. ౪. వకులవృక్షము, పొగడచెట్టు. ౫. మల్లికాలత.

**ముకులము.** సం. వి. అ. పుం న. ౧ అరవిరి మొగ్గ ౨ శరీరము.

**ముకులితము.** సం విణ (అ. ఆ. అ.) ౧. ముకులములు (మొగ్గలు) గలది వికసించుచున్నది. ౨. సగము మూసికొనఁబడినది. ౩. మూయఁబడినది

**ముకుళించు.** సం. అ. క్రి మోడ్చు.

వ. . నవ్వుకెన్నెలల ముకుళించినకెందమ్మి మొగ్గలన . ఉ. రా. ౧. ౧౩౭.

**ముకుళీభవించు.** సం. అ. క్రి. ముకుళించు. మోడ్చు.

చ. నయనంబులు మూయుచు నిద్రఁ జెందెన్, యన ముకుళీభవించె దివసాంతము నందుఁ బయోజమండముల్ .

అని. ౩. ౫.

**ముకువు.** సం వి. ఉ. పుం. ౧. విముక్తి, విడుదల. ౨. ముక్తి, మోక్షము.

**ముకూలకము.** సం. వి. అ. పుం. దంతిచెట్టు. (శ ర.)

**ముక్క** = ప్రముక్క. వి. ౧. ఖండము, తునుక.

ఆ. తోయము శకలసంఙ్ఞ దనుక దుండెము
దుండె ... దునియ ముక్క .

అం. భా. ౧. ౪౫.

చ. . . కాదని తప్పు బట్టినన్, మెంక మటు
క్రిందుగాఁ దిగిచి ముక్కలు వోనియుమంప
కత్తితో, నీకె మింద లంటఁ గోకు .

(చాటువు)

౨. చిన్నమాట.

సీ. సంధ్యముక్క పఠింపఁ జాలనియతఁ డెట్లు
క్రత్వనుష్ఠానసంగతికి నోపు

రామలిం. ౫౭.

**ముక్కంటి.** వి. (మూఁడు + కన్ను. క ముక్కణ్ణి, త ముక్కణ్ణన్) త్రిలోచనుఁడు, శివుఁడు.

శా ఘంటాకర్ణుఁడ నేను నాయనుజుఁ డీకాలాం
తకుం డేను ముక్కంటిం గొల్తుము

భీ. హరి. ౨ ౧౪౦.

సీ. ముక్కంటితలపువ్వు మున్నీటిశేఁబట్టి కైట
భారాతి డాకన్నుదమ్మి

శైవ. ౮, ౭౦౧

**ముక్కంటిచుక్క.** వి. (ముక్కంటి + చుక్క) ఆర్ద్రానక్షత్రము.

(ఉత్తరభాద్రపదానక్షత్రము అని శ. ర.)

**ముక్కంటిచెలి.** వి. (ముక్కంటి + చెలి) కుబేరుఁడు, త్ర్యంబకసఖుఁడు.

**ముక్కంటిపండు.** వి (√ముక్కంటి) కొబ్బెర కాయ. (క్రొ , శ. ర.)

సీ. దం చెమ్పుకపనీకమ్మం బాపపేరక్కనందలి
కుండేటికందు నొకటి, చాయజక్కవచంటి
పాపాబుపాపని కుఱిమానిక మగుడుంక
యొకటి, ముక్కంటిపండుల క్రొంక్క
లిదెర్పు కాయంకని తండ్రిచేతం కొకటి,

జాళంబాపరపట్టఁ జంపి యూపట్టికి చే
లిచ్చుసామేని మెకము నొకటి.

గీ. నీటిరెయికిపూని మెుల నూలు బోఁటినిన్ను,
రెయింటిపంటను గలికిటి రెయింటి దక్క,
కలను నెమకిన మెకములపాలఫుఁ గాసు,
మేము కేకేలఁ గాచినసామిసంద.

ప్రబంధ ౧౬౩.

**ముక్కంటిమల.** వి (ముక్కంటి + మల) కైలాసము

ఉ వింటి నపూర్వ మూర్తి నొకవింటినరుండె
జయించువాఁడు ముక్కంటిమలం దెమల్చి
నమగింటిమిఁజో దిడుకానెము

చం రా ౫. ౫౬.

౨ట్లో, ముక్కంటికొండ, పెం.

**ముక్కంటివాల్గంటి** = పార్వతి, భవాని.

వ అని రహస్యంబుగా నవ్విద్య నాకి నుప
దేశించి, ముక్కంటివాల్గంటి మింటిచొప్పనం
జనియె . మనుచ. ౬. ౫౮.

**ముక్కఁడి.** వి. (మూఁగు + కాఁడి.) ౧ ముక్కచాలించి యాహారమునకై పోవునపుడు అరక లన్నిటి నొక్కచో ప్రోగుచేసి యొక్కటిగాఁ జేర్చి నిలిపినట్టి యాయరకల కాండ్లమొత్తము.

(శ. ర)

౨ అనేకులకు నేకకాలమున తగిలెడివ్యాధి.

(శ )

చ విరహులఁ జంపసాగితివి వేయన నేమిటికూరు
ముక్కఁడిన్, బిరగినఁ గోఁడుంబోతులరపం
బినమాటనిబంబె పోశకి.

**ముక్కటము.** వి. (√మూఁడు) ఆముదము, ఆవునేయి, నువ్వులనూనె చేర్చి శిశువులకుఁ బెట్టెడి యాహారము.

(వ్యవ.) మూఁడునెలలు వచ్చినంతనె శిశువులకు ముక్కుటము పెట్టుట యీదేశమున నాచారము.

**ముక్కటించు.** అ. క్రి. (√ముక్కు 1) ముక్కు, శ్వాసము బిగఁబట్టు

ద్వి. కూఁకటి గిలుకుచుఁ గొక్కరించుచును, మాటలు నరుకుచు ముక్కటించుచును .

పండితా. పర్వ 381. పా.

**ముక్కద్దము.** వి. (ముక్కు + అద్దము) ముక్కలోచనము

**ముక్కనుసామి.** వి (మూఁడు + కను + సామి) ముక్కంటి, శివుఁడు

తరళ. తివిరి ముక్కనుసామిఁ గొల్చినఁ దెల్వి నొందరె వేలుపుల్ .

అచ్చ భా. ర. 79. పా.

**ముక్కన్ను.** వి. (√మూఁడు) మూఁడవకన్ను; మూఁడుకన్నులు.

ద్వి. గ్రక్కునఁ దనమహోగ్రత తేటపడఁగ, ముక్కన్నుఁ దెఱచి కాముని జూచుమాత్ర, భస్మీకృతుం డయి పడియుండె మారుఁడు.

మృ వి. 2. 22.

సీ. ఎడ్డు విజృంభించి యొఱపుంటు లెగయంగ, ముక్కన్ను తెఱచెనో మదుకళపని .

వీర. 2. 122.

ద్వి. ముకురంబు గెక్కొల్పి ముక్కన్నుఁ జూపి.

పండితా దీక్షా. 43. పా.

ద్వి. పొందారఁ ఎల్స్వ్యయంభువు లింగమూర్తి, యందు ముక్కన్ను నొప్పుగు చతుర్భుజము.

పండితా. వాద. 201. పా

**ముక్కపడు.** అ. క్రి భంగపడు. (చూ. ముక్కపఱుచు)

జ. ముక్కపఱుచు.

**ముక్కపఱ(ఱు)చు.** స. క్రి. (√ముక్కపడు) భంగపఱుచు.

క. ఇక్కడఁ గాదే మనలన్, ముక్కపఱచె నొక్కబోయ ముని మునుకొని వాఁ, డెక్కడఁ బోయెనొ యిపు డనఁ, గ్రక్కున నాకాశవాణి గంభీరముగన్.

వాల్మీ. 3. 143.

**ముక్కపురుగు.** వి. (ముక్కు + పురుగు) తవుడు ముక్కినయపుడు దానియందుఁ బుట్టుపురుగు, తవుటిపురుగు. (శ. ర, బ్రౌ.)

**ముక్కర(అ) = ముంగర.** వి (ముక్కు + రాయి) నాసికాభూషావిశేషము

సీ. చెలఁత ముక్కరియందు నీలంబు గాదునా, తెలిదళుకొత్తు ముత్తియము గాని

ప్రభా. 3. 78.

ద్వి. చెక్కుల మకరికల్ చిత్రించి గొప్ప, ముక్కరల్ నాసాగ్రములఁ గీలుకొల్పి

రం. రా. బాల. 849 పా. 9. 20

సీ. నాసికాభూషణము ముక్కఱ ముంగర యనంగ ఆం భా. 2. 147.

క దక్కినదిండుకొ కూయక, ముక్కవ కూర్పు ణఖు వించు మచ్చికలకు రా, వెక్కటికు జంతరక్కని, ముక్కరకున్ నోఁచుకుండ ముక్కఱఁజేసెన్.

రామా. 9. 137.

**ముక్కరమాను.** వి. పుల్లిరిను తిరుగుచట్టము (శ. ర., బ్రౌ.)

**ముక్కరము.** వి. (ముక్కు + కారము. సంధిని వర్ణవికారము ) నాసారంధ్రము, ముకుఁగ్రోళ్లు. (శ ర.)

**ముక్కలి = ముక్కలిపీఁట.** వి. (√మూఁడు )

క. అక్కడఁ దగఁ గుందనపుం, 'జెక్కడములఁ జాల నల్లవిల్లుచు మిగులం, జొక్క మగు

ముసు భక్తు భ్రు, ముక్కాలిపై పూనిచంద్రముఖి మంచి తగన్. విప్ర. ౪. ౯౨.

ముక్కాలిపీట = ముక్కాలి, ముక్కాలిపీట.
వి. (మూఁడు + కాళ్లు + పీట. త. ముక్కాలి.) మూఁడుకాళ్లమర్చిన చెక్కబల్ల, త్రిపాద్వితి.

సీ. పచ్చలపని సొప్పుపైఁడిముక్కాలిపీటనిడిరొ వేఁడుకతోడ నింతి యొకతె
యయా. ౪. ౯౩

ఉ. ముద్దులు గుల్కఁ కుందనపుముక్కాలిపీఁట వసించె దమ్మిపూ, ముద్దియగద్దియం బోలంచు ముద్దియ యుద్ది యనన్ శుభోన్నతిన్
విజ వి. ౩. ౭౨ నీలా ౧. ౬౧

ముక్కాఁక. వి (మూఁడు + కాఁకలు) గొప్ప తాపము.

ద్వి. బావికడను బిడ్డఁ బట్టినయట్లు, నూవె మాకును గతి చూపక యున్న, ననుచు మానులఁ జూచి యల్లమ పలికె, మునులార మీ కింత ముక్కాఁక యేల ,కులభంబునను ముక్తి చొప్పడువిధము, తెలిపెద
ప్రభు. ౪. ౧౩౪. పా ౧౩. పం.

ముక్కాఁకలఁదేఱు = మిక్కిలి సమర్థుఁడగు.

ఉ. పీఁకను మెచ్చి నవ్వి రఘువీరుఁడు తమ్ముని జూచి వత్స పే దాఁకు దశాస్యు సేమఱక తచ్ఛదమార్గము లస్త్రసంపదం దేఁకువఁ బెద్దయై యతఁడు దేవగణాదులతోడఁ బోరి ముక్కాఁకలఁ దేఱినాఁడు బలుగయ్యములం దని పల్కి పొందియున్.
భా. రా యు. ౭౧౪.

క. ధీరుఁడు తనముక్కాఁకలఁ, దేఱినదళివాయి యొకఁ దతిస్థిరబలుఁడై
శుక. ౧. ౫౪౪.

ముక్కాఁకలనాఱితేఱు + మిక్కిలి సమర్థుఁడగు, అత్యంతప్రవీణుఁ డగు.

వ. బలియుం డుగ్రుఁడు యాదవసాళ్వధరణీపాలుండు శక్తిస్వస్థ్య లాఘవాల ముక్కాఁకల నారితేఱిన మహాశూరుల్
జై. భా. ౧. ౭౪.

ముక్కాని. వి. (మూఁడు + కానులు) మూఁడు కానులు.

సీ కాని యనంగను గాకిణి విలసిల్లు ముక్కాని యనఁగను బొల్చుఁ దత్త్రయ సంజ్ఞ
ఆం భా ౨. ౫౭౨.

ముక్కారు. వి (మూఁడు + కారులు1) మూఁడు కాలములు (చూ. కారు.)

కా. ముక్కారుం బండును రాజనంబుఁ జెఱకుం గప్పారపుఁజేనియల్ విక్ర. ౧ ౯౦.

కా ఉన్మాదామాణిహారవల్లులన గంగాకుల్యలేపార ముక్కారుం బండుఁ బ్రశస్య సస్యములు దశా. ౧. ౭౩. కాశీ. ౪. ౫౬.

ముక్కాలిపీట = ము క్కా లి పీ ట. వి (మూఁడు + కాళులు + పీట.)

సీ గొడుగుఁబావలు గండపాడిపెట్టె నుసుపాన గడియార మంచ ముక్కాలిపీట .
నైజ. ౩. ౪౪.

గీ. చెఱుక ముక్కాలిపీఁట రావిలుకపంజు, రములు చిత్రంపు దివ్యోగంబములు గలిగి, జాను దలశించు కొల్వుహజారమునకు
రసిక. ౧. ౬౧.

పీ. ముక్కాలిపీఁ ఠనఁ బోలుఁ (త్రిపాద్వితి .
ఆం భా. ౨. ౧౬౬.

ముక్కాలు. వి. (మూఁడు + కాళులు) ముప్పాతిక.

వ. రావణుపు ముక్కాలం గ్రాసంబుగా మెక్కినం జిక్కినక్కడొరప్రక్కం దొరఁగు నుధాధారలం గెరడం బాడ ...
రా. వి. 3. ౭౫.

**ముక్కిడి.** విశే. (ముక్కు + ఇడి. క. ముక్కడి. త. మూక్కిలి.) ముక్కు లేనివాఁడు; ముక్కు లేనిది.

ఉ. ఈ, ముక్కిడి జంతకుం దగినవెుండి విటుండు నిశాటజాతియం, దొక్కఁడు లేక తక్కఁడు
చం రా. ౫ ౪౧.

సీ. ముక్కిడితోఁ బుత్తుఁ ముత్యంపునత్తేల యద్ద మేఁటికిఁ జాత్యంధునకును
రామలిం 33.

సీ ముక్కిడి యనవిగ్రుంకు
ఆం. భా. ౨. ౧౨౧.

**ముక్కిడి.** వి. ఒకచెట్టు. (శ. ర)

**ముక్కు**1. వి. (క ముక్. త మూక్కు)

౧. నాసిక; చంచువు.

సీ. ముక్కున నాసిక పాల్పు
ఆం. భా. ౨. ౧౪౨.

సీ. దక్షుండు పాట్టిలితల ధరించినయప్డు, భారతి ముక్కు గోల్పడిన యపుడు
భీమ. ౬. ౪౪

క. కరతాడన గళరవములఁ, బరిరంభణచుంబన ములఁ బైఁ బడి పెనఁగెన్, ధరణీసురకవ ధూతము, కరిగమనం బట్టి ముక్కుఁ గఱచె నొందలికిన్.
విక్ర. ౪. ౧౫౪.

మ. కొక్కులం ముక్కుల్ తుది నప్పళించు పరిచిన్ గాళ్వించు వాత్మాంగమే, తిలకించుచున్ బతి యంచుఁ గోకి యొక కొంతేఁ గింతసంతప్తయై.
ఉ. రా. ౪. ౧౫౮.

గీ. తోఁగరు, ముక్కుబల్పుక్కి చిక్కపై నెక్కి
నీలా. 3. 3౮.

౨. అగ్రభాగము.

క. నెలమసలె నిందువదనకు, జలజాక్షికి నల్ల నరయ్యెఁ జన్నులముక్కుల్
కాశీ. ౪. 3.

(ఇటఁ జూచుకము లరిభావము.)

౩ మిక్కిలి చిన్ననూకలు. (శ. ర, బ్రౌ., వా.)

అ. క్రి. ముక్కటించు, శ్వాసమును బిగఁబట్టు.

సీ ధిక్కరింపకుఁ డంచు బ్రుక్కి పుట్టల దుక్కి ముక్కువారికి భీతి బ్రొంక్కువారు
చంద్రా ౬. ౫౪.

**ముక్కునునుండుఁగోపము** = తీవ్రముగాఁ గోపము వచ్చు ననుట

ద్వి. చాగకు మెన్నఁడు గాధిసుతుతపోవనము, జపలు గిట్టాట వృథా శాంతి యాతన్నికి, నడుగక ముక్కున నుండుఁ గోపంబు
ద్వి హరిశ్చ పూ ౯. ౫౪.

గీ. ముక్కునను యుండుఁ గోపంబు మూర్ఖ మునికి దశా ౨ ౪౩. విప్ర. ౪. ౩౧.

**ముక్కుమొగమేడ** = మంచిచెడ్డల విచారణ యనావశ్యకము.

ద్వి. ముందగోష్ఠికి ముక్కుమొగమేడఁ దనకు.
ద్వి హరిశ్చ. ఉ. ౧౦౬౧. పం.

**ముక్కునవ్రేలిడు** = ఆశ్చర్యపడు.

చ. పదునుకుమారులుం బదుఱబ్రహ్మలరూపులుం దాల్చి యొల్లెడన్, విదితముగాఁగ సృష్టిలను చేసి యొనర్చి నుతించుచుండఁగా, నొంద లిటిబ్రహ్మ వారిఁ గని ముక్కునవ్రేలిడి యాత్మ నచ్చుతం, బొదవ శిరంబు లూఁచి కొని పొందె రఘూత్తమ యేమి చెప్పుదున్.
వాసిష్ఠ. ౨. ౧౬౨.

ఇక్లే ముక్కుపై వ్రేలు నిలుపు చెను.

గీ. పనికి దిగ్గన లేచి భూపాన్పుమీఁద వ్రాలి కూర్చుండి ముక్కుపై వ్రేలు నిలిపి, యొక్క చెలికత్తె యూహార్పఁ జెక్కుటలఁపు లున్న కోన మున్నయొక పక్నె లాడిఁ గాంచి
కవల. ౩ ౨౪.

ఉ. అచపలాక్షి ముక్కుపయి నంగుళిముం గది యించి దీనికై కీచక యింత నేపితి సుఖి త్వముఁ బొందుదుగాక
భార. విరా. ౨. ౩౫౬.

**ముక్కునసూర్పుగల్గు** = బ్రదికియుండు.

ఉ. ముక్కున మూఁడులోకములు నొక్కటఁ దాఁకినయేనిఁ బోర మీ, రొక్కఁ డొకండ గెల్పుటకు నోపుదు రక్రమవృత్తి నిట్టివా, ముక్కున నూర్పు గల్గి మనమోహర నీదు వస్థ బొందుసే. భార. భీష్మ. ౨. ౧౧౬.
విరా. ౨. ౨౫౬.

**ముక్కు పట్టుకొని కూర్చుండు** = జపము చేసికొనుచుండు.

మ. అతఁడుం బోయి నికుంభిలాటవి నిశాటానీకి నీరతుఁడై, పొంకమున్నన్నిధి ముక్కు పట్టు కొని కూర్చున్నట్టియయ్యింద్రజి, ద్దివిజుం బోకిఁ జీవి చంపి మరలెన్
రామా. ౮. ౧౮౨.

**ముక్కు మొగము చూడక** = ౧. మొగమోటము లేక.

ఉ. ముక్కు మొగంబు చూడక కోకమోహము మాటమ విశ్వనాయకుం, డెక్కుడికైనఁ బొమ్మమచు నెజ్జ నిచూపులఁ జూచి యల్కతో భీమ. ౩. ౮.

ఉ. అక్కటఁ జూడ నేటి కలయచ్చకబుచ్చికి నేయునంచలం, బెక్కడి గొట్టె దేమిటికిఁ జేరఁగ వచ్చిన సుద్దులెల్లలన్, ముక్కు మొగంబుఁ జూడ కటు మట్టను బొమ్మనె దేల బోట్ల నోచక్కరబొమ్మ నీ వెగటు జాదలఁ జాచిన వింత లయ్యెడున్.
విజ వి ౩. ౩౦.

౨. మంచిచెడ్డ లాలోచింపక

సీ. అలయమాళ్యులు నిల్పు టరసి పాఱులను గంచుకి ముక్కుమొకము చూడకయె తఱుము . కవల ౪ ౧౬౪.

**ముక్కున నీరెత్తు** = శిక్షాగ్రము ముక్కులో నీరుపోయు.

క. ఓకీ కోమటి ముక్కున, నీ రెత్తుదు మేము కిరియ నేరక యున్నన్ నోకి వచ్చిన యట్టులు, నారిణ యొక్కింత లేక వదరు లుజచెడిన్ కేయూర. ౩. ౨౦౧.

జ. ముక్కటించు, ముక్కద్దము, ముక్కర, ముక్కరము, ముక్కిడి, ముక్కుఁగమ్మి, ముక్కుఁగ్రోలు, ముక్కుఁజెరము, ముక్కుదాడిమ, ముక్కునకంటి, ముక్కుపూరెడు, ముక్కుపోఁగు, ముక్కుముంగర, ముక్కుముల్లు, ముక్కువిఱుచు, ముక్కోపము.

**ముక్కు2.** అ. క్రి. (తడిచేర) చెడు.

క. చక్కెర గలుపుక తింటే, ముక్కినతవుడైన లెస్స, మోహము గలచో వెక్కురుభావిష యైనన్, మక్కువతో దివ్యభామ మహిలో వేమా! వేమన ౨. ౫౫.

జ. ముక్కుపురుగు, ముక్కుఁగొయ్య.

**ముక్కు3.** వి. భక్ష్యవిశేషము

క. పొదకంబులు, గుజ్జొదకంబులు ముక్కులు కాశీ. ౩. ౧౫౫.

**ముక్కుఁగమ్మి.** వి. (ముక్కు1 + కమ్మి) నాసాభరణవిశేషము.

చ. గవుళపుటోరగొప్ప విరిగందఁపుబొట్టును
ముక్కుఁగమ్మియు, త్రైము పెదగంద
మున్ .. చను. ౧. ౫౩.

**ముక్కు-ఁగోయ్య.** విశే. (ముక్కు2+కోయ్య)
నాశకుఁడు, నాశకము.

సీ. కడిఁదివాల్మగఁడ బంగరు దీవి రాయఁడ,
టక్కరియోకిమాంద్ర ముక్కుఁగోయ్య
అచ్చ రా. యు. ౨౦౪.

ద్వి. పాలు పొందునిజభోగముల వీడుకోలు,
నగుఁబాటుగని జవ్వనపు ముక్కుఁగోయ్య,
యగునట్టిముదిమి వాయఁగఁ జేసి నన్ను
ద్వి పరమ. ౨. ౧౦౧. పా.

**ముక్కు-(గ్రోలు = ముకుఁ గ్రోలు.** వి.
(ముక్కు1 + క్రోలు) నాసాపుటము, ముక్కుఁ
జెరమ.

శా. శుండాలంబు కరంబు సాఁప ఫణిరాజున్
మెచ్చి నాపూజ భృర్గుం డీవేళ ననుగ్రహించె
నని ముక్కుంగ్రోళ్లలో సెక్కి యుద్దండ
క్రీడఁ దదీయకుంభకుహరస్థానంబునం ద్రిమ్మ
రన్, గొండ ల్గాలఁగ సత్తిమెత్తుకొని దిక్కు
ల్మట్ట గీఁపెట్టుచున్. కాశీ. ౨. ౧౪౭.

**ముక్కు-ఁజెర(అ)ము = ముకుఁజెఱము.**
వి. (ముక్కు1 + చెరము) నాసాపుటము

వ త్రొక్కున ముక్కుంజెరము లదర నదరి వడిం
జమదేర సేపున మూఁపు లెక్కింపరాని
తెగువం దిగిచి రాజ చ. ౨. ౩౪.

**ముక్కు-టము.** వి వారమడి, తేపము. (శ. ర.
'పసలిపట్టు' గ్రా.)

**ముక్కు-టమూపురు.** స. బ (మూపురు +
మూపురు) సరిగా ముగ్గురు.

ఉ. ముక్కుటమూపు రెక్కుడగు మెక్కులు లై
యరుదెంచి రంచుఁ బేరుక్కున యాదవ

త్రయపరణోద్ధటు లై చటులైకభక్షక
ముల్. ఉ. హరి. ౨. ౩౭.

**ముక్కు-దాడిమ.** వి. ($\sqrt{}$ముక్కు.) ఒకచెట్టు.
సీ. ... కోల ముక్కుదాడిమ లీల .
హంస. ४. ౧౧.

**ముక్కు-నబంటి.** విశే. (ముక్కు1 + బంటి.
వృత్తిని వర్ణాగమము.) ముక్కువఱకు మండు
వాఁడు, సమానుఁడు

ఉ ఏ,నాఁడు దశాస్యుఁ డీతనిన నచ్చి
మదోద్ధతవృత్తి నుండు నెవ్వాఁడును
నింతచెల్లుబడివాఁడు నరేశ్వర లంకలోపలన్,
లేఁ డితఁ డెప్పుడున్ సమరలీలల ముక్కువ
బంటి వజ్రికిన్ భా రా యు ౩౪౭.

చ. మురహరపద్మజాదులకు ముక్కునబంటిగఁ
గేవలోకభీ,కరు నజితప్రతాపు సురకంటకు
నేఁ డొకబాలుఁ డట్టె సం,గరమున
నోర్చె! కా. సం ౧౨. ౭౩౩.

**ముక్కు-పూరెడు.** వి. (ముక్కు1 + పూరెడు.)
ఒకజాతి పూరేడుపిట్ట.
(శ ర. ముక్కుపురిడి. గ్రా )

**ముక్కు-పోఁగు.** వి. (ముక్కు1 + పోఁగు )
ముక్కుఁగమ్మి, నత్తు. (శ. ర )

**ముక్కు-ముంగర.** వి. ($\sqrt{}$ముక్కు1) ?ఒకాకారి
యడవిచెట్టు (శ. ర.)

**ముక్కు-ముల్లు.** విశే. (ముక్కు1 + ముల్లు)
ముక్కునందు గ్రుచ్చుకొన్నముల్లు ; బాధకుఁడు ;
బాధకమైనది.

ద్వి. ఎక్కుడుమదమున నెల్లలోకులకు, ముక్కుము
లై యున్నమూర్ఖు రావణునిఁ, దృణలీలఁ
జంపితి దివ్యాస్త్రమహిమ .
రం. రా. ఉ. ౧౪౭. పా. ౧౯. పం.

**ముక్కువిఱుచు.** స. క్రి. (ముక్కు1+విఱుచు) విరసించు.

ప. భృత్యు లవమానింప బరిజను లపహసింప బాంధవులు ముక్కువిఱువ బుత్త్రులు కేసరం గళత్రం బోకిలింప నివి మొదలుగా వార్ధక దుఃఖంబు లనేకంబు లనుభవించి
కవిక. ౫. ౧౧౦.

**ముక్కుస.** వి. (మూఁడు+కంచములు) మూఁడు కంచములు

గీ. చమను ముక్కుస వాఁగఁ బ్రహ్మస్త్రయంబు
ఆం భా. ౭. ౨౪౦

ద్వి. నిత్యనేమం బిది కేఁటిబ్రుగ్గునకు, ముత్యాల పాడి మాకు ముక్కుస వలయు
బస. పు. ౭ ౪౩౩ పం

**ముక్కూరు.** అ. క్రి అజ్ఞానమును బొందు.

వ ఈరొక్కువలక్కువలు విచారింపక వలవని పెలుపు గట్టికొని ముక్కూరి వగచుచున్న వాఁడవు భార. ఉద్యో. ౭. ౭౭౭.

(ఇది యీరొక్కుచోటనే యున్నది అని శ. ర. కొన్నిప్రతులందు లేదు ఇంకను విచార్యము.)

**ముక్కొంకులు.** వి. బ. (మూఁడు+కొంకులు.) మూఁడువంకరలు.

ద్వి. ముక్కొంకులును బోయి మోచిన మెరావు కొక్కుపాదం బట్టు లున్నది శివునకు . .
బస పు. 3 ౫౭౪. పం.

**ముక్కొటిక.** వి. (మూఁడు+కొటికలు) త్రిపుర ములు. (శ. ర)

**ముక్కొటికగెలుపరి.** వి. (మూఁడు + కొటి కలు + గెలుపరి.) త్రిపురారి, శివుఁడు.

వ. మూఁడవకన్ను దోఁచని ముక్కొటికగెలుపరి కెరవునం జూచిరి .
అచ్చ. భా. ౪. ౭౧. పొ.

**ముక్కొమ్ముమెకము.** వి. (ముందు+కొమ్ము+మెకము.) మనుబోతు, ఋశ్యమృగము. (శ. ర.)

**ముక్కొయ్యలు.** వి. బ. (మూఁడు+కొయ్యలు) మూఁడుతుమకలు.

సీ. ఎంప నర్పుడునేయు నేనికకాని ముక్కొయ్యలు వడ్రేయు గుంటుకాని
కు. సం. ౧౧. ౭౧౦.

**ముక్కోటి.** వి. (మూఁడు+కోటులు ) వైకుంఠై కాదశి, ధనుర్మాసశుక్లైకాదశి.

గీ చక్రికుధరోత్తమము నడుచక్కి కెక్కి, చక్క ముక్కోటి కరుడెంచు సౌరసతులు
రా. వి. ౧. ౩౫.

**ముక్కోణము.** వి. వి. (మూఁడు+కోణములు.) క. ముక్కోణవు. త. ముక్కోణమ్) త్రికోణము. (శ. ర., బ్రౌ )

విశే. మూఁడుకోణములు గలది.

ఉదా · ముక్కోణపుబిడ్డ.

**ముక్కోపము** = ముంగోపము. వి. వి. (ముక్కు1+కోపము) శీఘ్రముగా వచ్చుకోపము (శ. ర.)

**ముక్కోల.** వి. (మూఁడు+కోలలు. త. ముక్కోల్) త్రిదండము.

సీ. కావిగోఁచియుఁ గుశగ్రంథులుఁ బెనఁచిన ముక్కోల వలపలముష్టి నమర . .
భా. రా. అర. ౭. ౧౭

**ముక్త.** సం. వి. అ స్త్రీ. ౧. ముత్తెము. ౨. రాస్న యను మొక్క.

ముక్తకంచుకము. సం. వి. అ. పుం. కుబుసము విడిచినపాము, నిర్ముక్తము.

ముక్తకంఠుఁడు. సం. విణ. (అ. అ. అ.) విడిచినకంఠము గలవాఁడు; పైకి గట్టిగా సేయు వాఁడు.

ముక్తకంఠముగా = ఎగ్గరగ, గట్టిగా

ముక్తకచ్ఛుఁడు. సం. వి. అ. పుం. బౌద్ధుఁడు.

ముక్తకము. సం వి అ. న ౧. అస్త్రము, ఆయుధవిశేషము. ౨. వృత్తగంధి, గద్యము 3 ఏకశ్లోకరూప మనుఖండకావ్యము.

ముక్తకరుఁడు. సం. విణ. (అ. అ. అ.) దాతృత్వము గలవాఁడు

(ఇట్లే ముక్తహస్తుఁడు మొ.)

ముక్తకేశుఁడు. సం. విణ. (అ అ. ఈ. అ) విరియఁబోసికొనినజుట్టు గలవాఁడు తల విరియఁ బోసికొన్నవాఁడు.

ముక్తచక్షుస్సు. సం. వి. స్. పుం. సింహము.

ముక్తము. సం. విణ. (అ. అ. అ.) ౧. విడిచి వేయఁబడినది, త్యక్తము. ౨. ముక్తిపొందింపఁ బడినది. 3. ఆనందితము. ౪. ఈయఁబడినది, దత్తము.

ముక్తముక్తము. సం. వి. అ. పుం. అందుగు చెట్టుబంక.

ముక్తవసనుఁడు. సం. వి. అ. పుం. ముక్తాంబరుఁడు, దిగంబరశాఖలోఁ జేరిన జైనసన్న్యాసి, ఇట్లే ముక్తాంబరుఁడు మొ.

ముక్తసంగుఁడు. సం. వి అ. పుం. సంసారసంబంధము విడిచినవాఁడు పరివ్రాజకుఁడు, సన్న్యాసి.

ముక్తాగారము. సం. వి. అ. పుం. ముత్తెపుఁ జిప్ప, శుక్తి.

ముక్తాపుష్పము. సం. వి. అ న. మొల్ల, కుందము చూ.

ముక్తాఫలము. సం. వి. అ. న. ౧. ముత్తెము, ౨. లవలీఫలము. 3. కర్పూరము.

ముక్తామణి. సం. వి. ఇ. పుం. ముత్తెము.

ముక్తాయము. వి. (క. ముక్తాయ) (సంగీత) ముక్తాయింపు.

మ. గీతంబు ల్వద్దిర ముక్తాయము చాఁగుకే
యని మరుద్దేవాత్మజన్ముండు తుంబురు
దేవర్షుల మెచ్చె గానరస మింపుగ్ సొంపు
గావింపఁగన్ సమీర. ౬. ౨౦౧.

(ముక్తాయింపు అనుపదము దేశ్య మగుటవలన నీపదముకూడ శ. ర. మతమున దేశ్యమే యని తోఁచుచున్నది)

జ. ముక్తాయింపు

ముక్తాయింపు. వి (√ముక్తాయము.) ముగింపు. (శ. ర.)

ముక్తాలత. సం. వి. ఆ. స్త్రీ. ముత్తెములహారము.

ముక్తావలి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. ముత్యాలహారము.

ముక్తాశుక్తి. సం. వి. ఇ స్త్రీ. ముత్తెపుఁజిప్ప.

ముక్తాస్ఫోటము. సం. వి. అ. పుం. ముత్తెపుఁ జిప్ప, శుక్తి.

ముక్తి. సం వి. ఇ. స్త్రీ. ౧. విడుపు, విడుదల. ౨. మోక్షము.

ముక్తిక్షేత్రము. సం. వి. అ. న. కాశి, వారణాసి.

ముఖగంధకము. సం. వి. అ పుం. పలాండువు, ఉల్లి చూ.

**ముఖచపల.** సం. వి. ఆ. స్త్రీ. ఆర్యావృత్త భేదము.

**ముఖచాళిక్ర.** వి. వి. మల్లబంధవిశేషము.

వ. వాసుదేవుండు . పరిచాళిక చేసిన, తైసేయుం డత్తెఱఁగిక వాని చేయక ముఖచాళిక చేసి . హరి. 3. ఒ౪.

**ముఖచీరి.** సం. వి. ఇ. స్త్రీ. నాలుక, జిహ్వ.

**ముఖచూర్ణము.** సం. వి. అ. న. ముఖముపైఁ బూసికొను సువాసన గలచూర్ణము.

**ముఖజాహము.** సం. వి. అ. న. ముఖమూలము.

**ముఖజుఁడు.** సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు.

**ముఖదూషణము.** సం. వి. అ. పుం. పలాండువు, ఉల్లి గీ.

**ముఖదూషిక.** సం. వి. ఆ. స్త్రీ. ముఖాకారముఁ జెఱిచెడిబొబ్బ, అట్టిపొక్కు.

**ముఖనిరీక్షకుఁడు.** సం. విశ. (అ. ఈకా అ.) అలసుఁడు, సోమరి.

**ముఖనివాసిని.** సం. వి. ఈ. స్త్రీ. సరస్వతి.

**ముఖప్రియము.** సం. వి. అ. పుం. నారింజ గీ. న. లవంగము గీ.

**ముఖబంధనము.** సం. వి. అ. న. ౧. ఉపోద్ఘాతము, భూమిక, మాఁత, కప్పు.

**ముఖభూషణము.** సం. వి. అ. న. తాంబూలము.

**ముఖమండనకము.** సం. వి. అ. పుం. తిలకవృక్షము.

**ముఖము.** సం. వి. అ. న. ౧. నోరు, మూతి. ౨. నెమ్ము, ముఖాకృతి. 3. పురోభాగము, ముందటిచోటు. ౪. చాణము మొదలగువాని కొన. ౫ తొట్టిదెసక్కి పైకిఁ గవఁబడురంధ్రము, తొట్టిలోఁ బ్రవేశించెడిదారి; తొట్టినుండి పైకి వచ్చెడిత్రోవ.

౬. గృహద్వారము, ఇంటిగుమ్మము. ౭. ప్రారంభము, మొదలు ౮. ముఖ్యమైనది, ప్రధానము, మొదటిది. ౯. ఉపాయము, సాధనము. ౧౦. ఒకనాటకసంధి. ౧౧. లకుచము, గజనిమ్మ గీ

నాముఖమున = నామీఁదుగా.

గీ మీరు చెప్పినబుద్ధులు గారవమునఁ, జేయఁ గాంచినపుణ్యంబు సేయనెట్లు, నాముఖంబునఁ గార్యంబు నడవ దేమి, సేయువాఁడ నొండెడ్డియుఁ జెప్పలేదు.

భార. ఉద్యో 3. 3౭౬. (నావలన నని భావము)

**ముఖయంత్రణము.** సం. వి. అ. న. ఖలీనము, గుఱ్ఱపుఁగళ్లెము

**ముఖరము.** సం. విశ. (అ. ఆ అ.) ధ్వనిచేయునది, ఎడతెగనిచప్పుడుచేయునది, ఘల్లుఘల్లుమని మ్రోఁగునది. (అందె మొ.)

వి. అ. పుం. ౧ కాకి. ౨. శంఖము.

**ముఖరితము.** సం. విశ. (అ. ఆ అ.) ధ్వనిగలదిగాఁ జేయఁబడినది, మాఱుమ్రోఁగునట్లు చేయఁబడినది.

**ముఖరుఁడు.** సం. విశ. (అ. ఆ. అ) ౧. వదరుఁబోతు, అధికముగా మాటలాడువాఁడు, వాచాటుఁడు. ౨. దూషణము లాడువాఁడు.

వి. అ. పుం. నాయకుఁడు, ముఖ్యపురుషుఁడు.

**ముఖలాంగలము.** సం. వి. అ. పుం. లాంగలమువలె భూమిని జీల్చెడి ముఖము గలది. సూకరము, పంది.

ముఖవల్లభము. సం. వి. అ. పుం. దాడిమ చెట్టు.

ముఖవాద్యము. సం. వి. అ. న. నోటితో వాయించువాద్యము.
(మురలి, పిల్లనగ్రోవి మొ.)

ముఖవాసన. సం. వి. ఆ. స్త్రీ. కర్పూరాది వాసన.
అ. పుం. న. కర్పూరాదివాసన (శ. ర)

ముఖవిలుంఠిక. సం. వి ఆ స్త్రీ. అజ, ఆఁడు మేఁక.

ముఖవీణ(ణియ). మి. వి. వాద్యవిశేషము, వీణాభేదము
వ. మ్రోఁటుసురఠాణులు కామాక్షులు ముఖవీణెలు పిల్లఁగ్రోవులు దండెలు ఢక్కీలు చంద్రవలయంబులు ప్రబంధ. ౬౦౫.
క సంగీతపుమేళపుజత, సంగతితాళములు నాగసరములు ఢక్కీల్, చెంగలు ముఖవీణియలు న్వపాంగము కొమ్ములు గజ్జె లందుక చేరన్ ప్రబంధ ౭౩.

ముఖశుద్ధి. సం. వి. ఇ. స్త్రీ. ముఖము కడుగుట, ముఖము పవిత్రముచేయుట

ముఖశేషుఁడు. సం. వి. అ. పుం. రాహువు.

ముఖశోధనము. సం విశ. (అ. ఆ. అ.)
౧ ముఖము శుభ్రముచేయునది. ౨. తీక్ష్ణమైనది, కారమైనది.
వి. అ పుం కారము, తీక్ష్ణత.
న ౧ ముఖము శుభ్రపఱుచుట ౨ లవంగపట్ట, దాల్చినచెక్క.

ముఖశోధి. సం. వి. న్. పుం జంబీరము, నిమ్మ చెట్టు. (వాచ.)

ముఖసంభవుఁడు. సం. వి. అ. పుం. బ్రాహ్మణుఁడు.

ముఖసుఖము. సం. వి. అ. న. ఉచ్చారణసౌకర్యము, పలుకుబడిలో సౌకర్యము.

ముఖస్రావము. సం వి. అ. పుం. లాలాజలము, చొంగ.

ముఖాగ్ని. సం వి. ఇ. పుం. ౧ కార్చిచ్చు, దావాగ్ని.
౨. అగ్ని ముఖమందుఁ గల దయ్యము, కొఱివి దయ్యము
౩. శవమును దహనముచేయునపుడు ముఖమందుంచినయగ్ని.

ముఖాము. వి. (హిం. ముఖాదిమ్) మునద్ది, లేఖకుఁడు
ఉ గౌరవ మొప్ప నచ్చటిముఖాములు వ్రాయఁ దొణంగి రెంతయున్ .
కృష్ణ ౨. ౧౧౩.
ఉ జబ్బు మెఱుంగుఁజల్వలు విచిత్రగతిం దొడిపెన్ముఖా మహో, జిబ్బిలుపేశఁ గాంచి హరిసేవకు రా నమయం బిటంచుఁ దై, పట్టుటు చీట్లు వ్రాసి నిజభర్తలపాలికిఁ బంచి రంతలో, నబ్బిబంధనుండును భవాబ్ధభవాదులఁ బిల్వఁ బంచినన్. ల. వి. ౫. ౫.
చ. వలసినచేరముక్ దెలియ వచ్చినవారలు వాదు గల్గువారలు తెగ గుత్తగొల్లలున రక్షపతీశులవారు కార్యముల్, గలిగినయింగిలీషులముఖాములు చెంగట మల్లపిల్లఁగాఁ, గొలు వొసఁగు న్మహీశుగతిఁ గోమటి యాత్మగృహాంగణంబునన్. శుక. ౩. ౧౦.

ముఖాముఖి. సం. అవ్య సమ్ముఖమున, సముత్మమున.

ఉ. చేతనొకొండొకప్పు డిచటం జేసినపుణ్యాయము
చేత నింక నన్, గాదటం బెట్టకె వినుముఖాముఖిం బక్కాడ దాంచ నేటికిన్ ...
కళా. ౩. ౬౧.

**ముఖారి.** సం. వి. ఇ. పుం. మూఁడువందలయిరువది నవరాగములలో నొకటి.

సీ. మధ్య, మాళవతియు ముఖారి మలహరి
సామంత పంతువరాళియు
హంస. ౫. ౧౨౪.

ఉ. భైరవి నాట తోడి ముఖారి
దేవగాంధారి మొద లైన తగురాగము
లింపు మీఱంగన్ . చెన్న. ౨. ౨౩౬.

సీ. సామంతమలహరులును చెంచు మల
హరియు ముఖారి మాళవియును
ప్రబంధ. ౯౬.

**ముఖాసా.** వి. (హిం. మొఖాసా. మి. గ్రా)
తీరువ లేనిభూమి, మాన్యము.

క. గడి దుర్గంబులకోటల, విడుతాణపు దొరల
కెల్ల నిప్పుడుం జెల్లే, పుడమియు మన్నెవ
ళీర్లకు, నడుచుముఖాసాలు గాక నగరి
ధరిత్రిన్. ఉ. హరిశ్చ. ౧. ౬౬.

**ముఖాస్రము.** సం వి. అ. పుం. కర్కటకము, ఎండ్రకాయ, పీత.

**ముఖాస్రావము.** సం. వి. అ. పుం. లాలాజలము, చొంగ.

**ముఖోల్క.** సం వి. ఆ. స్త్రీ దావాగ్ని, కార్చిచ్చు.

**ముఖ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧ ముఖ సంబంధ మైనది.

౨. ప్రధాన మైనది, మొట్టమొదటిది. మొదటిది.

౩. శక్యము, అభిధావ్యము (అర్థము.)

వి. అ. పుం. ప్రథమకల్పము.

**ముగింపు.** వి. (√ముగించు) సమాప్తి. (శ. ర.)

**ముగితి.** వి. (సం. ముక్తి) ముక్తి, మోక్షము.

సీ. నగరు లేంగినవాంటి ముగితిత్రోవ
యయా. ౨. ౪౪.

**ముగియించు.** స. క్రి. (√ముగియు) ౧. సమాప్తము గావించు.

క కాంచి యనుష్ఠానము ముగియించి యరుగు
నట్టివేళ నెదుట నిలిచి యా, చంచలలోచన
లతనికిం, గించిద్దూరమునం జేమొగిచి మ్రొక్కు
టయున్ వైజ. ౨. ౩.

౨. త్యజించు, విడుచు.

సీ నీ వజ్ఞాతవాస ముచిత, మగునీతి ముగి
యించి యాజికి నతిమెద వాళీలరణతేజఁ
డాతఁడు రాఘవ. ౪. ౫౩

(ఇది పై రెండర్థముల కుదాహరణము.)

౩. ఖండించు, నఱకు.

సీ. ఒకమాటు గదలను నూరుతలంబులు ముగి
యించి మృగసంఘములకు నిచ్చు .
వీర ౪. ౧౩౨. ఆం. భా. ౩. ౧౨౩.

**ముగియిక.** వి (√ముగించు) ముగింపు, సమాప్తి. (శ. ర.)

**ముగియు.** అ. క్రి. (క ముగిను. త. ముగి.) ౧. పూర్తియగు.

గీ. మూఁడులక్షలపదివేలు ముగిసి పోవఁ, దాఁ
బ్రవర్తిల్లు లక్షగ్రంథములతోడ, సమధిక
స్ఫూర్తి నేపురాణములు సాటి, గొను
కందంబువకు మహాస్కాందమునకు.
కాశీ. ౧. ౬౧.

౨. చచ్చు, మరణించు.

సీ. మడిసి బ్రుంగె నమూకఁ గడసె ముగిసె
నీర్గె, .. బ్రుగ్గె, ననఁ జచ్చె ననుమాట
శాఖ్య లయ్యె .. ఆం. భా. ౩. ౯౩.

సీ. చొరఁబడ్డ ముంగిస యొరివడ్డగరివిడి, మును
పుగా గొల్లిన ముగిసి పోవ
శకు. ౪. ౨౭.

జ. ముగింపు, ముగియించు, ముగియిక, ముగిసి
వచ్చు.

**ముగిసివచ్చు.** అ క్రి. (√ముగియువచ్చు.
స్వార్థమున) ముగియు, సమాప్తమగు.

తే తత్సహోదర సంప్రవర్తనము జరిగె, నప్పు
రములోన గూఢమై యంత పేఁడు, ముగిసి
వచ్చె దానవరాజు మోదకాల, మనుచు
సంతస మంది వాతాత్మజుండు
రాఘవ. ౪. ౭౨.

**ముగుద.** వి. (సం. ముగ్ధా) ముద్దరాలు, ముగ్ధ,
ఆఁడుది.

సీ. ముద్దరా లన్నదియు ముగుద యనఁగ, ముగ్ధ
యొప్పును .. ఆం. భా ౭. ౧౦౬.

గీ. తెగదు పేటుంగద యిది యెంతముగుద
యనుచు చంద్రా ౩. ౯౩.

క. ముగుద యెటుంగక పంచినఁ, దగునే యి
ట్లేఁగుదేరఁ దమ్ముఁడ ... రాఘవ. ౩. ౫౬.

రగడ. ముగుద! పోద మశోకములు
వెలయుతావులకు .. ఉ. రా. ౬. ౬౧.

క. . సొం, పగుతమ్మి కెంపుగుంపును, ముగు
దనిగాఁంపుఁ దొగరుమోవికి దొరయే ...
నీలా. ౭. ౭౭

జ. ముగుదతనము.

**ముగుదతనము.** వి. (ముగుద + తనము)
మౌగ్ధ్యము, గోలతనము.

వ. మానికంపుఁ గంబంబులదండ నుండుదిటి
దంతపుంబొమ్మ లాడిగంపుఁ జక్కెరబొమ్మ
'లని యొూహరిలు ద్వీపాంతరజనంబుల ముగుద
తనంబునకు నగు. దశా. ౧. ౧౪.

**ముగూహము.** సం వి. అ. పుం. దాత్యూహ
పక్షి.

**ముగ్గు**[1] = **ముగ్గు.** వి (క. ముగ్గు. త. కొంగు.)
రంగవల్లి.

సీ. పలువన్నె లలరఁ గెంపుముగ్గులను బెట్టి
నీలా. ౩. ౩౬.

**ముగ్గు**[2]. అ క్రి. (క. ముగ్గు) మాగు, పండు.

(వ్యవ.) ఈ మామిడిపండ్లు చక్కఁగా ముగ్గినవి.

**ముగ్గు(గు)రు=ముప్పురు.** స. బ. (√మూఁడు.
క. మూవరు. త. మూవర్) మూఁడునకు మహ
న్మహత్వర్థక రూపము.

క. ముగ్గురువేల్పుల ముంచిన, ప్రెగ్గడ యగు
మరుని దనుకరింపం దరమే ?
తపతి. ౪. ౬౭.

ఉ. అక్కట చొక్కటంపు టిగురమ్ముల
తొమ్ములు నజ్ఞానజ్ఞాగాఁ, జెక్కుద వంచుఁగా
చేత చిత్తత ముగ్గురువేల్పు లక్కునం,
బుక్కిట నొక్కప్రక్క నొకపూఁట
వధూటుల డించఁ బోరు ...
రా. వి. ౪. ౩౫.

(ముగ్గురువేల్పులు = త్రిమూర్తులు.)

గీ ఊదిలకొనుచున్నవా రాత్రి మున్నముగురుఁ,
గాలయాపన చేయఁగాఁ గాదు నీకు ...
హైమ. ౪. ౬౪.

సీ. ముగురుమూఁకలు జగన్మోహనాకార,
లనంగశాస్త్రవిదగ్ధ లతిబిసీల.

గీ. కటిలకుంతల లద్దకుంభి కుంభయుగళ, గురు
కుచలు వారిఁ దగినట్టి వరుల కొసఁగి, వరున

మూడుహాళ్ల నిలిచె నావనుమతీశుఁ,
దంత .. విక్ర. ౮. ౫౯.

ముగ్గొయ్య. వి. (ముందు + కొయ్య) అగ్ర దండము.

విణ. అసాధ్యము. (శ. ర.)

ముగ్ధ. సం వి. ఆ. స్త్రీ. ఒకానొక శృంగార నాయిక

శ్లో. ఉదయద్యౌవనా ముగ్ధా లజ్జావిజిత మన్మథా.

ముగ్ధము. సం విణ (అ ఆ. అ) ౧. మూర్ఛ పడినది, సొమ్మసిల్లినది. ౨. వివేకము లేనిది, మూఢము. ౩. పొరపడినది. ౪ చక్కనిది, సుందరమైనది.

ముచకము. సం వి. అ. పుం. లాక్ష; లత్తుక.

ముచ(చు)కుందము. సం. వి. అ. పుం ఒక పువ్వులచెట్టు.

ముచిరము. సం వి. అ పుం. ౧. ధర్మము. ౨. గాలి.

ముచిరుఁడు. సం విణ. (అ. ఆ అ.) దాతృత్వము గలవాఁడు, ఔదార్యము గలవాఁడు

వి. అ. పుం. దేవత

ముచుండ. సం. వి ఆ. స్త్రీ. ఎఱ్ఱమల్లె తీ. (శ. ర.)

ముచు(చ)కుందుఁడు. సం వి అ. పుం. మాంధాతకొడుకు కపురాజు.

ముచుటి. సం. వి. ఈ. స్త్రీ. ౧. వ్రేళ్లు విఱుచుట (కోపమున.) ౨. పిడికిలి. ౩. పట్టుకాఱులజత.

ముచ్చ. స. త్రికము, తిగ.

సీ. తిగ ముచ్చ యనఁగను త్రికముపే రగు
ఆం. భా. ౨. ౩౦౬.

వి. ౧. నితంబపార్శ్వము.

సీ. అంకటన ముచ్చ యనఁగ నితంబ పార్శ్వాఖ్యిధ దగు .
ఆం. భా. ౨. ౧౩౬.

(చి. వి. ముద్రి. పా. ముచ్చె. శ. ర. (మంజె. (ప్రా.) మంజె. వ్రాతప్రాతప్రతులు. పా. ఆంధ్రపదాకరమున మంబి యనికలదు)

౨. తికము, ముడ్డిపూస.

గీ. త్రికాభిధాన, మలరుఁ దిక మన ముచ్చ నా నళికనయన ఆం. భా ౨ ౧౩౬.

ముచ్చెంగి. వి. మత్స్యవిశేషము

సీ కొరద దానరికొయ్య కొఱ్ఱవిసాసులస ముచ్చంగి చేడిన జెల్ల చాఱవిసాను ఆది యగువిూలఁ బట్టు నతఁడు
హంస. ౪. ౧౫౭.

ఉ. పెన్, జెల్లయుఁ బక్కపారయును నీచును ముచ్చెంగి బొమ్మడాయముల్ పరకాదిగఁ జేపలఁ బట్టి బెట్టుగన్
ప్రబంధ. ౧౮౫.

సీ. కొరదయుఁ గడిసె పాపర ముల్లు ముచ్చంగి కుంటముక్కము లాంపిఁ గ్రుచ్చుకొనిరొ
వేం. పంచ. ౧. ౨౯౪

ముచ్చట. వి. (క. ముచ్చటం. త. ముచ్చట్టై.) ౧. సల్లాపము.

ఉ. మగనిన్ జగనీలి పిసాళి జంతయు, మ్ముద్దియ సేవ సేయ దొకముచ్చట యాడదు మూఁగఁబోలె .. పాండు. ౩. ౪౧.

సీ. .. మునగొన గుసగుస ముచ్చట యన, సల్లాపసంజ్ఞ యై యుల్లసిల్లుచునుండు ..
ఆం. భా. ౧. ౧౧౪.

ఉ. అవ్వలిదిక్కు-పై మయి ప్రియంబున నొందు
లతోఁడ ముచ్చటల్, ద్రవ్వుచు నొక్కి-
కోమలి పరాకున నుండఁగ .

నైష. ౨. ౧౯౩. ఉ. రా. ౪. ౪౭.

౨. కోరిక.

ఉ. గ్రుచ్చి కవుంగిలించికొనెఁ గూర్మియు
భక్తియుఁ బొత్తుసేయఁగా, ముచ్చట వాయఁ
గొంతవడి మూర్ధము మూర్కొని లోచనం
బులం, బిచ్చిలి రాలు బాష్పజలబిందులు
నూలి నలంకరింపఁగన్.

జై. భా. ౧. ౧౧౧.

సీ. కీలాలనదులలోఁ గేళిసల్పఁ దలంచుకాకినీ
సమితిముచ్చటలు దీఱె

ఉ. రా. ౬. ౧౪౭.

గీ. ముచ్చటలు దెల్పు రతికేళి కిచ్చగించు, సన్న
దెలిసి విలాసప్రసన్నవదన, యగుచు వర్తించు.

శుక ౧. ౩౦౧.

౩. ప్రేమను.

చ. మొగము మొగంబు గూర్చి బలుముచ్చటఁ
బక్షపుటాంతరంబులన్, బిగియఁ గవుంగి
లించి వసు. ౪. ౯.

౪. వృత్తాంతము

క. వచ్చినమునిపతితోఁ దన, ముచ్చట దను
జెందు దెల్ప .. దశా. ౧. ౨౪౯.

మ. కినుకం బుట్టినయట్టి నూరిహృదయక్లేశంబు
శాంతంబుగా, మనికిమ్మప్రకరంబుతోఁడ గమ
నానృత్యాంబునన్ ముచ్చటల్, తనియం
జెప్ప చు కేల్పొసెటి వికటస్థానంబునం
దుండఁగా, వనజాక్షా భ్రూవిమండలంబు దిగిరెను
న్వారాశిదిక్పమతున్. భీమ. ౨. ౨౩.

జ. ముచ్చటకాఁడు, ముచ్చటకాపు, ముచ్చట
పడు, ముచ్చటలాడు, ముచ్చటించు.

ముచ్చటకాఁడు. విశే. (ముచ్చట + కాఁడు)
కోరిక కలవాఁడు.

హం. పంచ. ౪. ఆ. (శ. ర.)

ముచ్చటకాపు. విశే. (ముచ్చట + కాపు) సల్లా
పము లాడువాఁడు, ఇష్టగోష్ఠి నలుపువాఁడు.

ఉ. అచ్చపలాక్షు లిద్దఱును వర్మిలిఁ జెందియుఁ
బల్కు-నేర్పియున్, ముచ్చటకాపుగాఁ దను
వినోదపువెచ్చెలిగా నమం గడున్,
మచ్చికఁ జూతురు ప్రభా. ౪. ౧౯.

ముచ్చటపడు. అ. క్రి (ముచ్చట + పడు)
మిక్కిలి అభిలషించు, తహతహపడు

క. విచ్చేయు మదితిగర్భము, చెచ్చెర నొలువడి
మహాత్మ చిరకాలంబున్, విచ్చలవిడి శే
కమరులు, ముచ్చటపడి యున్నవారు మూద
మందింపన్ భాగ. ౬. ౫౦౪.

ద్వి ఇచ్చట నే నున్న నెల్లపౌరులును, ముచ్చట
పడి దినంబును వత్తు రనియు

రం. రా. అర. ౧౪౫. పా. ౩. పం.

ముచ్చటా(టలా)డు. అ. క్రి. ముచ్చట +
ఆడు.) ముచ్చటించు, సల్లాపముచేయు.

ఉ. త్రుళ్ళింతలతాగృహంబున వయస్యయుఁ
దాసుమ ముచ్చటాడఁగన్

ప్రభా. ౨. ౭౨.

సీ. నెఱిగొప్ప విరిదండ మెఱుంగుపున్నాగంపు
ముత్తెలకుచ్చుతో ముచ్చటాడ .

ఇందు. ౫. ౧౪౩.

(ఇట మిళిత మగు అనిభావము.)

సీ. సఖి గోఁగుతోఁడ ముచ్చటలాడి నురపొన్న
సవ్వాతి విదిరుచు గుణంబు దప్పె

ఉ. రా. ౭. ౩౭.

సీ. ముసుకుచు కొలఁగుతో ముచ్చటలాడుచు.

దశకు. ౭. ౧౫౪.

**ముచ్చేటించు.** అ. క్రి. (√ముచ్చేట.) ముచ్చట లాడు.

ఉ. . శా, రమచ్చేతితం బెటింగి జను లీవల వావల ముచ్చటింపఁగన్ .

భల్లా. ౨. (శ. ర.)

**ముచ్చేట్లు(టులు).** వి. బ. (మూఁడు + చోట్లు) మూఁడు ప్రదేశములు.

గీ. చరణములు కేలు గడిగి ముచ్చట్లు చఱచి, పీఠమునుండి కాళ్లు దాఁ బృథివి మోపి, యర్థి నాపోశనము బ్రాహ్మణాహుతులను, గాని గృహస్థుండు నూరి యై కుడువ వలయు. విజ్ఞా. ఆచా. ౬౩

**ముచ్చే ముడుఁగు = ముచ్చేమునుఁగు.**

అ. క్రి (ముడుఁగు + ముడుఁగు) ౧. మిక్కిలి ముడుఁగు.

గీ. ఇంక నేమి సేతు నేగతిఁ బోదు నా, కీదు రంతదురిత మెట్టు వాయు, నముచు గంగ నీట నవగాహనము చేసి, వెడలి వచ్చి ముచ్చముడిఁగి యుండె.

భోజరా. ౪. ౧౬౫.

సీ. పులకలు పైడిఁగఁ బొలయు నిశ్శోక మాటు, ముచ్చిరి యప్పుడ ముచ్చము డుఁగు కు. సం ౫. ౫౧౯.

ఉ. హెచ్చిన బొమ్మరిండ్లఁ గదియించిన చూపులకోలలన్, ముచ్చముడుంగ నేయుచుఁ జనుంగవదుర్గముఁ గ్రిందికోలలన్.

చంద్రా. ౧. ౩౩.

౨. మిక్కిలి చేష్టలు తప్పి యుండు.

గీ. శవ మరంబు గాఁడి కిఁపుర కడశీ నృయాన్య శుగంబు నెత్తు రంగ మెల్లఁ దొప్పఁదోఁగ మూర్ఛ దొదరి రథంబుపై, ముచ్చముడిఁగి పడిరొ మునివరుండు. హరి. ఉ. ౭. ౭౧.

గీ. బిట్టుకెనఁ దాఁకు చిచ్చఱపిడుగుకోల, నదలు రతిఁ దాఁకు పెంయి ముచ్చముడిఁగి పడఁగ ..

కు. సం. ౫. ౫౪౯.

**ముచ్చే మునుఁగు = ముచ్చే ముడుఁగు.**

అ. క్రి. (మునుఁగు + మునుఁగు) మిక్కిలి మునిఁగు.

సీ. మోహపతుమువారి ముంగములవగిది నంభో రుహవ్రాతంబు ముచ్చమునిఁగ

ప్రబోధ ౪. ౪౯

క. శీతోపచారముల నాఁతోదరి ముచ్చ మునిఁగి సంతాపముచే, నాతతమిహికావర్ష, ప్రాతఃకాలిక విపన్నపద్మి విభోలెన్

తపతీ ౩. ౧౦౩.

ఉ. ఇచ్చట నుండఁ గూడ దిఁక నేఁగుము నీ వన సామలార మీ, యిచ్చకొలంది చేకు రెడుపీనపువస్తువు లేల యన్న నృన్మచ్చిరఁ గాంచి ర మ్మనెడువాఁ్రత నె పైఁబడి మొత్తి త్రోచినన్, ముచ్చమునింగి వచ్చి తనముగ్దియ కంతయుఁ జెప్పఁ జెప్పినన్.

చెన్న. ౪ ౩౪౪. పాండు ౪. ౭౯

**ముచ్చేవలము.** వి. (మూఁడు + చవలములు) మూఁడు చవలములు. (శ. ర.)

**ముచ్చోటులు=ముచ్చేట్లు.** వి. బ. (మూఁడు+ చోటులు) మూఁడు ప్రదేశములు, పాదములు హస్తములు ముఖము.

క. కూటిముడి మోచునాతఁడు, పాటింపక చేతఁ గొని ప్రస్థానం బా,కూటిముడియు డించక ము,చ్చాటులు చఱవంగి వలయు సద్ధర్మ గతిన్ . విజ్ఞా. ౧. ౪౯.

**ముచ్చాయలు.** వి. బ. (మూఁడు+చాయలు) మూఁడురంగులు, త్రివర్ణములు.

సీ. వరదానములకునై వచ్చువాక్ప్రియకారి,
యుచ్చాయ లెక్కింగించుచుంగను దెల్పు .
కవల. ౨ ౪౨.

(కోరికెలకు సూచకము లగురంగు లని భావము.)

ముచ్చి. వి. (హిం. మోచీ) రంగులు వేయువాఁడు, చిత్రకారుఁడు.

సీ. కౌసల్య మొద లైనగరితలుముచ్చిపన్నుందంపుఁ
బల్లకీ ల్మ్రందు నడుచ . దశా. ౩ ౨౨౩.

ముచ్చిక. వి. (ముందు + పిక వృత్తియందు వర్ణవికారము) లేంకాయ, తాటికాయ మున్నగువాని తొడిమిక్రిందిబిళ్ల. (శ. ర. వా. ముచిక.)

ముచ్చికకొడి. వి (√ముచ్చిక) కార్యనిర్వహణకాలము.

(వ్యవ.) ఆ వివాహసంబంధము ముచ్చికకొడికి వచ్చి చెడిపోయినది.

ముచ్చిచ్చు. వి. (మూఁడు+చిచ్చులు) ౧ గార్హపత్యము, ఆహవనీయము, దక్షిణాగ్ని యను యజ్ఞమందలి యగ్నిత్రయము.

ఉ. అతఁడుం, జిచ్చున నేయి వోసిన
విశేషము దోఁపఁగ భీము నొంచి, ముచ్చి
చ్చున నేర్చునట్టులుగఁ జేసె
భార. భీష్మ. ౨ ౨౩౩.

గీ. తపసియిల్లాంద్రచెలువంబు దలఁచి తలఁచి,
మున్ను ముచ్చిచ్చును విరాళి గొన్న
చోటు మనుచ. ౨. ౯.

౨. ముక్కాఁక.

క. పచ్చవిలుకానియమ్ముల, ముచ్చిచ్చున వెచ్చి
పొందె మోహాతురయై . భాగ ౯. ౪౩.

ముచ్చిరి = మ్రుచ్చిరి. విశే. (√ముచ్చిరు) దుఃఖితురాలు; దుఃఖితుఁడు.

రగడ. మోఁదు మోదుగుపువ్వు లచ్చెను మున్ను
ముక్కులకై క ముచ్చిరి, లేదులే దుండగము
దీనికి లేదు లేదుజంపాట వచ్చిరి ..
వాల్మీ. ౩. ౧౧౪.

ముచ్చిరితనము. వి. (√ముచ్చిరి.) దుఃఖము.
ద్వి. "ముచ్చిరితనము." ద్వి. భాగ. ౧౦.
(శ. ర.)

ముచ్చిరు = మ్రుచ్చిరు. అ. క్రి. (త. ముచ్చెఱి) ౧. దుఃఖించు

చ. మునిజన మెల్ల దుర్దశల ముచ్చిరి యుండుటఁ
జూచి యప్పనిన్, వనితలయార్తిఁ జూచి
క్రతువర్గము దైన్యముఁ జూచి నామనం, బన
యముఁ దల్లడిల్లెడు నిర్వ ౪ ౨౯.

సీ పులకలు పైఁదీఁగఁ బొలయు నొక్కొక
మాటు, ముచ్చిరి యప్పడ ముచ్చముడుఁగు
కః సం ౫ ౫౦౯.

క. ముచ్చిరి యున్నది లోకము, విచ్చలుఁ
గంసాదిఖలులు నిద్రయు లేఁచన్, మచ్చిగఁ
గావఁగ వలయును, విచ్చేయుము తల్లికడుపు
వెడలి ముకుందా !
భాగ. ౧౦. పూ. ౧౦౧.

౨. పరితపించు, ఉడుకు.

చ. మును మనచేత భంగపడి ముచ్చిరి యుండుటఁ
జేసి పాండునం, దనులును నెత్తివత్తురు .
భార. ఉద్యో. ౪. ౧౩౫

చ. ఆవికయుఁ బట్టుపుట్టము చెఱుగు మఱుం
గయి యున్కిఁజేసి గౌరవపరిమాణము
దెలియరామికి ముచ్చిరుచున్నదొక్క ప,
ల్లవునకుఁ జూపె నొక్కతె విలాసముతోఁ
దనతోరపుంజనుం, గవపొడ వింత పొ
మ్మనినకైవడిఁ బానక హేమకుంభముల్.
శైవ. ౨. ౧౩౧.

౩. అవమానపడు.

గీ. పాటిగాఁ గొన కాపద్మభవునికైన, నీరసము సేయువాఁడు వినీతుఁ డర్యా నొరులలచ్చికి ద్రుచ్చిరి యొడుకువాఁడు, సర్వసముఁ డర్యా విష్ణుప్రసాద మహిమ.

పాండు. 4. ౨౧౦.

జ ముచ్చిరి, ముచ్చిరితనము

ముచ్చిలి. వి. పెదతలయందలి గుంత. అవటువు. (శ. ర.)

ముచ్చిలించే స క్రి (√ముచ్చిలు) దొంగి లించు. (శ. ర.)

ముచ్చిలిగుంట వి ముచ్చిలి (శ. ర)

ముచ్చిలిక. వి (హిం. ముచల్కా) ౧ వాది ప్రతివాదులు మధ్యస్థులకు మీరు తీర్పు చేసిన ప్రకారం మొప్పుకొనియెద మని వ్రాసి యిచ్చెడి యొడంబడిక

౨. సేద్యము చేయువారు భూస్వాములకు వ్రాసి యిచ్చెడి యొడంబడిక

(శ. ర., మి. బ్రౌ.)

ముచ్చిలిపాటు. వి కునికిపాటు. (శ. ర.)

ముచ్చిలు. స క్రి ముచ్చిలించు, దొంగిలించు (శ. ర.)

జ ముచ్చిలించు

ముచ్చివుక. వి. (మూఁడు + చివుకలు) ముద్ద గులము (శ ర. ముచ్చివక. బ్రౌ.)

ముచ్చేట్టు. వి. (మూఁడు + చుట్టులు) మూఁడు చుట్టులు.

గీ. పచ్చి కోటచుట్టు ముచ్చుట్టు వాఱంగ

దశకు. ౬. ౧౪౨.

సీ. ముచ్చుట్టు ముడిచిన ముంజితోఁ గట్టిన, చెలువంపు గోచిముంజెఱఁగు దూఁగి

హరి. ఉ. ౧౦. ౨౩౩.

సీ. గ్రుచ్చి చేతుల మేను ముచ్చుట్టు రాఁ జుట్టి, దొమ్మి యూర్పులతాలి గుమ్మరించి ...

కవిక. 4. ౧౬౭. విక్ర. 3. ౧౦౭.

ముచ్చే = ద్రుముచ్చే. అ. క్రి. (క. ముచ్చు) పోవు, నష్టమగు.

ఉ. చచ్చిన నేమి మూర్ఛ ... నేమి ప్రహార చేదనన్, నొచ్చిన నేమి పండ్లు చెవి కోరు కరాంగుళి నేత్రగోళముల్, ముచ్చిన నేమి పట్టపతి మొక్కలి బంధన కాలలోనికిన్, వచ్చిన నేమి భృత్యునకు వచ్చినయేలిక యాజ్ఞపట్టునన్ శివరా. 4. ౭౮.

స క్రి ముడుచుకొను, సంకోచపఱుచు

క. అని పలుక జరుకు మదిఁ బెనఁ, గొనఁగా మే సెల్ల ముచ్చికొనుచుం బులి మ్మెల్లనె యవలికిఁ జని పెనఁ జెంగున నచ్చటిలతలు ద్రెంచుకొనుచుం జనియెన్

శుక ౨. ౬౬౧.

వి. దొంగ, చోరుఁడు.

చ. పనిచినఁ గాలకింకరులభంగి రయంబున నేఁగి ముచ్చుఁ బట్టినక్రియఁ జుట్టుముట్టి చెనంటి! చెడుకాలము వచ్చె నీకు ర, మ్మని పెనఁ బట్టి తెచ్చిన, నరాధిపుఁ డాతనిఁ జూచి చెల్లురా, కనికర మేది యీప్రభువుకాళులఁ జేతులు నిట్లు సేయుదే.

భోజరా. ౫. ౩౧౧.

ద్వి. అనవు దయ్యధికారి , అనిరెు వారికి నిశ్చయంబుగా మీర, లచ్చు లైనది ముచ్చు లైనది తెలిసి, చెచ్చెర వన్నియుఁ జెప్పెద ద్వి. పరమ. 4. ౩౨౨ పొ.

ఆం. భా. ౨ ౨౯౧.

విశే. ఘాతుకము.

సీ. . మీలముచ్చులు ముచ్చు శేల విడుచు.

దశా. ౧. ౧౩౪.

జ. ముచ్చుపొద్దు.

**ముచ్చుప్రొద్దు.** వి. (ముచ్చు+ప్రొద్దు) దొంగలు తిరుగువేళ, నిశీథసమయము.

చ. . సేర్చున సేఁగిలి ప్రముచ్చుప్రొద్దునన్ .
దశకు. ౫. ౪౨.

**ముచ్చె.** వి. (సం. మోచక. హిం. మోజా.) మోఁగాలు గుదిగాలు సైతము కప్పుకొని యుండెడుపాపోసు, పార్ష్ణిత్రము.

సీ స ప్తర్షి కృత్తివియ ఝ్ఝరివాలుకాలింగసమితి ము చ్చెలకాళ్లఁ జమరి చమరి
ఆము ౧. ౪౧.

చ. మణిముద్రికల్ వలపు గుల్కెడుమీద్యము చంకపట్ట మం,ఘుర్ిలకుద ముచ్చెలున్ వెలయ గు స్తగుణుం డనువై ద్యుఁ డొప్పు గన్ హంస. ౧ ౨౩౨.

సీ. ఇచ్చిన దివెన లియ్యక యశ్యాశతో నేఁగు యాచకుం డైనవాని

గీ. గట్టిముచ్చెలతోఁ బట్టికొట్టి విఱుగఁ, గట్టి పంపించ వలయును గాలుపురికి .
వేఱు ౩౯. ఆం. భా. ౨. ౨౯౭.

జ. ముచ్చెవాఁడు, ముచ్చెవాటు.

**ముచ్చెబంగారు.** వి. కాకిబంగారు. (శ. ర. ముచ్చెబంగారము = ఇత్తడిలోని భేదము అని ప్రా.)

**ముచ్చెవాఁడు.** వి. (√ముచ్చె) చర్మకారుఁడు; మాదిగవాఁడు.

సీ. . చర్మకారాఖ్య పరగు గోదరి ముచ్చెవాఁ డనంగ . ఆం. భా. ౨. ౨౭౩.

**ముచ్చెవాటు.** వి. (ముచ్చె+వాటు) చెప్పుదెబ్బ.

సీ. ప్రక్కటిచిడె మాయఁ బోయి తిలోత్తమఁ వనజలోచన ముచ్చెవాట్లు పడిరొ .
కువల. ౧. ౩౯.

**ముచ్చొకము.** స. (మూఁడు + చొకములు) పంద్రెండు.

క. ముచ్చొకపురూపులుఫూ, స్వేచ్ఛనికేజేయ నంగునిసుగుం గని లో,లా చొకయిం తయు నొదవని,ముచ్చిక నవ్యానిరాచమానిసి పలికెన్. అచ్చ. రా. కిష్కిం. ౨౩.

**ముజుందారు.** వి. (హిం. ముజుమ్దార్) లెక్కలు సరిచూచువాఁడు
(ముజుముదారు. అని శ. ర.)

సీ. మునిషీ రొుకఁడు చెప్ప మొనసి బక్షీ చెప్పఁ, దరువాత నాముజుందారు చెప్ప
వేఱు. ౧౬.

**ముజ్జగము(లు).** వి. (మూఁడు+జగములు) మూఁడులోకములు.

గీ సాయకంబులు మూఁటి ముజ్జగము గెలువ
నైష. ౩. ౧౬౧.

మ. ప్రత్యక్షంబు గాకుండితే,ని శిఖిజ్వాలలఁ ద్రాఁగు ముజ్జగములన్ నిక్కంబు వాణీశ్వరా! ఉ. రా. ౨. ౧౩౫.

ఉ. అక్కట కల్ల గాదు నిజ మా జనవాక్యము ముజ్జగంబులన్ దశా. ౨. ౩౩౨.

**ముటము = మూటము.** వి. ౧ ముద్దపిడుక. (శ. ర.)
(వ్యవ.) ఔపాసనాగ్నిలో ముటాలు దాఁపవల యును.
౨. ఐ వంటచెఱుకు, కట్టెలు. (శ. ర)

**ముట్టఁబడు.** అ. క్రి. (ముట్టన్ + పడు) ౧ ఉద్రేకించు.

క. మెల నీలికాసెయును బద్మముల సోర
చ్చులం ధరించి మదము దలిర్పన్, మెల
గోలయు ములుబంతియు, బలపముఁ గత్తి
యును బూని పటుసాహసి రై.
హరిశ్చ. ౫. ౧౧౧.

గీ. కావు ములుబంతి పికముల్లు గద్దగోరు, నల్ల
దట్టిసబిల్ల కన్నుంబ్రుఁగత్తి, బూది దివ్వార్చు
పురు విను మూఁదుగ్రోవి, తోలునిచ్చెన
మొదలు ముందుగ ధరించి ప్రబంధ ౩౯౯.

క. బలపముఁ గన్నపుఁగత్తియుఁ, దలముల్లును
దొక్క నీలిదట్టి యినుముఁ జే,మలక్రోలు
గ్రద్దగోరును, ములుబంతియుఁ గత్తెరయును
మెండ లగువారిస్. పరమ. ౪. ౧౭౪.

ములుబూర్గు(రుగు.) వి. (√ములు) శాల్మలీ
భేదము, ఒకజాతి బూరుగుచెట్టు.

గీ. వెదుర ములుబూర్గ ములు రేగు వెలఁగ
వేము. వాల్మీ. ౨. ౭౨.

ములుము. వి. బావులనీరు పారించి పండించెడు
పొలము (శ. ర.)

ములుమోదుగు. వి. (ములు + మోదుగు)
కింశుకవృక్షము.

వ. . . పొనుపుంతు నిరువదిగతికట్టియల
గవాక్షం బదిములుకుల నొప్పించి నవిచిన
ములుమోదుగులచందంబు నొందించె ...
అచ్చ. రా. యు. ౩౭౪.

ద్వి. బలుసు ముల్మోదుగు పచ్చారి యాకె
వలిచేంద్ర ములుచేంద్ర వాడగన్నేరు
ద్వి. క. సా. ౨. ౭౭౧. పం.
హంస. ౪. ౧౧.

ములుమ్రోంతువు. వి. (ములు + మ్రోంతువు)
ములుమోదుగు.

వ. . . దీనికి దక్షిణమున ములుమ్రోంతువున
దీనికి దక్షిణమున దారకియుం బోలునుం
బత్తిపొలమునం గూడిన .
పిఠాపురము శాసనము. ౧౦౨౪.
Ep Ind ౫. ౯౦. పు.

ములువాలుగ. వి. (√ములు) మత్స్యవిశేషము,
ఒకజాతి చేప. (శ. ర.)

ములువెంపలి. వి. (ములు + వెంపలి) కంటక
పుంజి, ఒకజాతి చిన్నమొక్క.

సీ. ములువెంపలి ములుస్తి గలిజేరు గుంట
గల్జేరును దంతి బందారి ..
హంస. ౪. ౧౦.

ములువెలఁగ. వి. (√ములు) చతురశ్రికము,
ఒకజాతి గడ్డిదుంప. (శ. ర., బ్రౌ.)

ములువెలమ. వి. (√ములు) వికంకతము,
స్వాదుకంటకము కీ.

సీ. ములువెలమ యనంగఁ జెలఁగును స్వాదు
కంటకనామధేయము ..
ఆం. భా. ౨. ౪౩.

ములువేగి. వి. (ములు + వేగి) వృక్షవిశేషము.

సీ. రేలు తక్కిలి ములువేగి భూచక్రము
వెంకిక్కస కొక్కస మొల్లప్రూసు ...
హంస. ౪. ౧౧.

ములుస్తి. వి. (ములు + ఉస్తి) ఒక విధమగు
ఉచ్చిఁత కీ.

సీ. ములువెంపలి ములుస్తి గలిజేరు గుంటగల్జే
రును దంతి బందారి . హంస. ౪. ౧౦.

ముల్కాసు. వి. అల్లిక.

సీ. చలిదిచిక్కపుఁజల్లపాలుముల్కాసుపై వ
య్యారముగఁ బింఛ మొయ్యఁ జెరివి ...
పాండు. ౨. ౬౯.

**ము(లుగు)గ్లుత్తి.** వి. (ములు + గుత్తి) ఒక విధమైన చోరసాధనము, దొంగవాని పనిముట్టు.

ఉ. కత్తియు నీలిచీరయును గంకటిరజ్జువు నార సంబు ముల్గుత్తియు వాటురా లినుపు గొంకియు నక్షతలా ల్కిబూదియున్
చెన్న. ౩. ౨౯౮.

**ముల్త్రొల్లిక.** వి. (√ములు) మత్స్యవిశేషము, ఒకజాతి చేప ప్రబంధ. ౧౯౫.

**ముల్లంగి.** వి. (సం. మూలకమ్) ఒకజాతిదుంప.

ఆ. చేమ కంద గెనుసు చిటిగోరు పెండ్లము, పొనఁగు తెల్లగెనుసు బూరగెనుసు, లల్ల ముల్లి పసపు ముల్లంగి వెల్లుల్లి, గాఁజరయును మొదలు గాఁగఁ గలవు.
హంస. ౪. ౧౩౧.

సీ. . ముల్లంగి సాఁగను రీతిఁ గాంచు మూల శాఖిద ఆం. భా. ౨. ౩౨.

**ముల్లడఁచే.** అ. క్రి. (ముల్లు + అడఁచు) ముండ్లు గ్రుచ్చి ఆనవాలు చేయు.

సీ. మూసి ముల్లడఁచి గుమ్మలకొల్పు పైమెత్తు లాద్యఁడు ప్రస్తైన నుండుఁగాని .
పాండు. ౪. ౧౪౯.

**ముల్లాకుటాయి.** వి. (ముల్లు + ఆకురాయి) ఒక విధమగుటాయి, పత్త్రపరశుభేదము. (శ. ర.)

**ముల్లిడు.** అ. క్రి. (ముల్లు + ఇడు) కంచెవేయు, పొలముచుట్టును ముండ్లకంపలనుపాఁతు.

చ. మును దనసీమ చేసికొని ముల్లిడి గుద్దట పెండి చేసి మె, త్తనకయి చేరు వెల్లఁకియుఁ ద్రవ్వెడుకర్షకునట్లు ఆము. ౪. ౨౧౯.

**ముల్లియ(ల్లె).** వి. (సం. మూలక) ౧. మూట.

ద్వి. ఉప్పుముల్లియ నీర నుంచినయట్లు, కప్పురం బున నగ్గి గప్పినయట్లు ...
బస. పు. ౨. ౩౦౪. పం.

క. నాముద్దుతమ్ముఁ డెన్నం, డేమియుఁ దా మూటఁ గట్ట నెఱుఁగఁ డిదేమో, యీమం దుపుఁ జాడవలె నని, ప్రామినుకుతుకమున ముల్లె విదలిచి కాంచెన్ . .
చెన్న. ౧. ౧౧౫.

ద్వి. మంచిది నీపని మట్టుచేయింతు, నని కడ లేని కామాంధకారమున, మునిఁగి సొమ్ములు దీసి ముల్లెగాఁ గట్టి ..
ద్వి. శ. సా. ౧. ౩౭౦. పం.

సీ. సొమ్ములు ముడుపులు దమ్మటంచుఁ, బలుకుచు వారివెంబడి నంటి ముల్లెలు దప్పించుకొనుచును ధీరుఁ డగుచు
కేం. మా. ౩. ౬౦.

ఆ. ముచ్చు తీర్థ మేఁగి ముల్లె విడుచుఁగాని, ద్రెంక్కఁ ద్రొద్దు లేదు పెంనసి యొఖుడు, కుక్క యిల్లు సొచ్చి కుండలు వెదకదా
వేమన. ౨. ౧౯.

**ముల్లు = ములు.** వి. ఔ. (బ. ముల్లులు, ముండులు, ముండ్లు.)

౧. కంటకము, కొన్నివృక్షలతాదులకుఁ గల్గు వాఁడిదైన సూక్ష్మావయవ విశేషము.

ఆ. ఒక్కపుట్టలోన నొప్పారుజోత్యకుల, రెంటిఁ గాంచి వాఁడిముంటఁ బొడిచె
భాగ. ౯. ౫౧.

క. ముల్లు దలకొనని నవకపుఁ బల్లవములతోడ మొత్తకభామచెవులకుం, బల్లేరుఁబువ్వు లగు పువు, లల్లసిలునలర్కొని మొదుగుగఁ గొనుచున్. ఆము. ౪. ౧౯౫.

రగడ. కన్నెచంటి ముంట గీరఁ గన్నఁ గన్న తల్లి దిట్టు, నన్ను సఖియ నిట్టు లేటి కంటి కంటి కెల్ల పుట్టు.
( కరాహ. ౪. ౧౯౫. భోజరా. ౩. ౨౪౯.

౨. కంటకుఁడు (క్షుద్రశత్రువు)

ద్వి. ముల్లోకములకును ము ఖ్యైనయట్టి, బల్లిదు
మధుపుత్త్రు బవరంబులోన, నేడు శత్రు
ఘ్నుండు నిర్జించువాని .

౧౦. రా. ఉ. ౧౪౭. పొ. ౨౯. పం.

౩. ముండ్లపంది మెడమీఁద నుండు బలిష్ఠమై
వాఁడియైనరోమము, శలలము

గీ. బలితంపుటినుపశ ట్లమర నొప్పు, వెండి
గునపంబులో తాళ వెండికట్ల, యినుపగున
పంబులో యనఁ దనరి కురిసె, నెంతయును
జి త్రజల్లుగ సేదుముండ్లు. కళా. ౬. ౧౦.

గీ. పాండుబహుళశత్రుపాపరంపగలు వెడల, కింటి
లో నేదుము ల్లరయ్యె నిందుముఖికి

ఆము ౫. ౧౪.

౪. త్రాసుముల్లు, తూనికలో బరువులతారతమ్య
మును సూచించుత్రాసునడుమనుండు అవ
యవ విశేషము (వా)

౫. శూకము, నివ్వరి, మొ. ధాన్యపుగింజలకొన
నుండు సూక్ష్మావయవము

చ. బలసినవాల్లకచ్ఛటలపైఁ దమజాంజాలముండ్లు
రాయఁగాఁ, గలమము లుండుఁ బండి
రాలఁగఁబడి నీ రెడలింపఁ ద్రుప్పులోఁ,
దలకొన వంగి మున్ జలముఁ ద్రావెడు
క్రిందటిత్రెళ్లు మీఁదటన్, నిలిపి మరంద
మానుకరణిన్ నికటోపవనానిలాహతిన్.

ఆము. ౧. ౬౩.

సీ. . ముల్లు నా శూకంబు పొలుపుగాంచు.

ఆం. భా. ౨. ౨౩౬.

౬. ఒక వస్తువుయొక్క వాఁడియైన యగ్ర
భాగము.

ద్వి. కల్లుగుజ్జుమునకుఁ గంకటిం బట్టి, ముల్లును
మిరిగయు కొంపుట గాక, యు త్తమాశ్వ
ములు వా గ త్తిన రాలు, చిత్తావఁ గల
యట్లు చెలరేఁగి దాఁటు.

ప్రభులిం. ౩. ౬౨. పొ. ౨. పం.

నీళ్లలోనిముల్లు = కనిపెట్టుటకు సాధ్యము
కానిది.

గీ. ఉన్నదైతేయు లందఱుఁ గిన్నవారు, గన్న
దిక్కులఁ బోయి సంగరములోన, నడఁగి
రటు నీళ్లలోనిముళ్లైరి గాని, నేఁడు దుదిగా
ధరిత్రికి నెగయ లేరు. ఉ. హరి. ౪. ౨౪.

ఆ. అల్లనీళ్లలోనిము ల్లయినది యిది, యిట్టు
లనుచు నిశ్చయింప రాదు

సారంగ. ౨. ౨౫౪.

సా. ముల్లు పుచ్చి కొఱ్ఱడఁచినట్లు = కాలిలో
గ్రుచ్చుకొన్నముల్లు తీసి దానికి మాఱుగా
గసి దిగఁగొట్టినట్లు, చిన్నబాధ తీర్చి పెద్ద
బాధ కలిగించుట అని తాత్పర్యము.

చ. ఉడుపతిబాలికన్ వెలిచి యూఁటు యూ
వని పేరటామునిన్, ముడివడుకంతువేసలకు
మురియ్యేలగు ట్టయినట్టియుందు రా, వడఁ
గునె తాపవహ్ని మనమై హరికోక్షణ ముల్లు
పుచ్చి కొ, ఱ్ఱడఁచినచంద మయ్యెఁ బదమా
రెములదోఁటఁ జరింప కింటికిన్.

మనుచ. ౩. ౩౪.

జ. ముండ్లకంచె, ముండ్లపంది, ముండ్లములు
చీఁత, ముల్లాకు, ముల్లిదు, ముల్లుమూపు,
ముల్లాచ.

ముల్లుచో(సూ)పు = ములుచోపు. అ. క్రి.
(ముల్లు + చూపు) ౧. త్రాసునం దుంచినవస్తు
వులతగ్గుహెచ్చులను సూచించు; హెచ్చుగను
చూపు.

గీ. మనులతాల్మికి నెవ్వఁడు ముల్లుసూపు, మగల
మగువల నెవ్వండు మరులుగొలుపు ...

భాగ. ౧౦. ఉ. ౧౦౩

ఆ. సత్యా మశ్వమేధశతముఁ బ్రాముగఁ బెట్టి,
కూప్యముల్లునూపెఁ దులకు సత్యా, మట్టినత్య
మునకు నఖిలవేదంబులు, సకలధర్మములును
సాటిరావు. కృ. శకుం. ౩. ౧౩౭.

౨. అతిశయించు.

సీ. ధీరతాగుణమున మేరువుతో నెత్తుఁబూచిన
రొమ్ముడ ముల్లునూపువాఁడు ..
దశకు. ౧. ౪౫.

సీ. ఎవ్వఁ డేయవధాన మెఱుఁగు నయ్యవధాన
మున వాని కించుక ముల్లునూపు
విక్ర. ౧. ౨౦.

ముల్లూచే. వి. (ముల్లు + ఊచే) తృణవిశే
షము. హంస. ౫. ౮౫.

ముల్లూచి. వి. తృణవిశేషము, ఒక విధమగు
గడ్డి ప్రబంధ. ౨౦౧.

ముల్లెపేరు. వి. (√ముడి) స్త్రీల కంఠాభరణ
విశేషము.

సీ. బిగువుఁబయ్యెదలోనఁ బిక్కటిల్లుచుఁ జాలఁ
ద్రుళ్లుచున్నల నొప్పుముల్లెపేరు ..
కళా. ౪. ౧౦౩.

ముల్లెమారి. విణ. (√ముడి1) ఒండొరులకు
విరోధమును గల్పించునది, దుష్టుల, చెనటి;
దుష్టుఁడు.

సీ. ... ఇల్లిల్లు కవ్వులు దెచ్చుముల్లెమారి
శ్రీరం. మా. ౫. ౩౪.

ముల్లువేయు. స. క్రి. (√ముడి1) ౧. ముల్లు
పెట్టు, ఒండొంటితో బంధించు.

మ. ... శేషనాగాదిముఖ్యమహానాగిణుల ముల్లు
వేసి చుట్టినం గాని దీనిబెండలివలను
కొలపెట్టరాదు ... వరాహ. ౧౨. ౪౩.

౨. ఒండొరులకు విరోధమును కల్పించు.

(వ్యవ.) వాఁడు ముల్లువేయుటలో చాల గట్టి
వాఁడు.

మువ్వ1. వి. (మూఁడు + వ) మెలను మూఁడు
సందులుగల పెద్దగజ్జె, కింకిణి.

ఉ. మువ్వలు గంటలు న్మొరయ ముందటికూఁ
కటి రాదికేశతో, నవ్వనజాతుఁ డాడు .
హరి. పూ. ౫. ౧౯౧.

సీ. పచ్చిరేయిదికతోలుపచ్చడంబు ధరించి గిలుకు
మువ్వలతోలఁ గేలఁ బట్టి
హర. ౫ ౫౫.

చ. మలయపుగాలి కేలు వనమాలివిమానపతాక
ఘల్లుమం, చులియఁ బసిండిమువ్వగమి
రొక్కొక్కమాటు గదల్ప
ఆము. ౧. ౪౮. అం. భా. ౨. ౧౫౧.

### వ్యవహారమునందలి కొన్ని విశేషప్రయోగములు.

మొన్న కొన్నబిందె మువ్వలాగున నున్నది.
(అనఁగా తేలిక యై ఇంపుగనున్న దనుట.)

కాదివము లంఘనము చేసినచో రేపటికి శరీరము
మువ్వలాగున నుండును. (అనఁగా తేలికగా
నుండు ననుట.)

జ. మువ్వతోడియ, మువ్వదోసె, మువ్వపసరము.

మువ్వ2. వి. ఒకానొక పట్టణము.
('మువ్వపురి' క్షేత్రయ. శ. ర.)

మువ్వంక. విణ. (మూఁడు + వంకలు) మూఁడు
వంకలు గలది.

సీ. మువ్వంకమురువుతో మురళి రొక్కొకపెకె
త్తిఁలాయించు ధువ్వైకహూవాసముగ ...
పాండు. ౪. ౧౩౪.

సీ. ముప్పంకమురువుతో మురళి యూఁదెడునిండు
సొగసు గోవులఁ జిక్కఁ జొక్కఁజేయు
ఘటికా. ౧. ౧౨౭.

**ముప్పొంకపట్టెస.** వి. (ముప్పంకె + పట్టిస) త్రిశూలము.

సీ. బిరుదురాకాసులఁ బరిమార్చు ముప్పంకపట్టి
సకా మనోభవవిరామ . నిరం. ౩. ౧౩.

**ముప్పొంచే.** వి. (మూఁడు + పంచలు - వృత్తిని వర్ణలోపాదులు) మూఁడుపంచలు.

సీ. పాద సైనముప్పంచఁ బొలుచునట్లుగ నేఁకు
గులకు గుజ్జిములకిఁ గొట్టములును
భార. ఉద్యో ౧. ౬౩.

విశ. మూఁడుపంచలు గలది. (శ. ర.)

**ముప్పొంచాకు.** వి. (మూఁడు + పంచెలు + ఆకు) మురయాకుపొన్న. (శ. వి.)

**ముప్పొంచు.** వి. వృశ్చికశేషము.

ద్వి. దేవదారువు కల్వ దేవకాంచనము, వావిరి
కేల ముప్పంచు పంచాది
ద్వి. శ. సా. ౨. ౬౫౬. పం

**ముప్పొంటులు.** వి. బ. (మూఁడు + అంటులు) నెలపురుడు.

సీ. తనరి ముప్పంటుల దినములయందు పూతన
చనుబాలతోఁ ద్రావె మనుగు, నెతి బోర
గిలి యాడనేలినాఁడ పాదమునఁ దుత్తు
మురుగాఁ దాఁచె బండి.
హరి. పూ. ౮. ౫౮.

ఉ. చంట విసంబు మెత్తుకొని చంపుడు సర్భకు
నంచు వచ్చి ముప్పంటులనాఁడు పూతన
యపారణ నెత్తికొనంగఁ జన్నుఁబా
ల్గొంటయుఁ బ్రాణముల్ దిగిచికొంటను
హరి. ఉ. ౪. ౨౩౩.

**ముప్పొకోడియ(డె).** వి. (ముప్ప[1] + కోడియ) కాఁడికిని గంతకును త్రొక్కగా వలవటిచెడి యెద్దు. (శ. ర.)

**ముప్పొదోసె.** వి. (√ముప్ప[1]) అడుగున ఒంటి వేలక గలదోసె. (శ. ర.)

**ముప్పొన్నియవేల్పు.** వి. (మూఁడు + వన్నియలు + వేల్పు) సూర్యుఁడు.

క. పువ్వులఁ బూఁతలు గైకొని, యవ్వల
. యావనజబాంధవపవము లలరన్, జవ్వనులు
మెలఁగ నెత్తితి, ముప్పన్నియవేల్పు చరమ
భూధర మెక్కన్. ఘటికా. ౨. ౧౩౪.

**ముప్వన్నె.** విశ. (మూఁడు + వన్నెలు) మూఁడురంగులు గలది.

సీ. ముప్పన్నెపులితోలు మొలదిండుగాఁ గట్టి
కర్కోటకాహిఁ బాగఁగ బిగించి
హర. ౫. ౫౫.

సీ తిమభృశక్రాంత శేషనలగిన్నబర్హిబర్హంబు
ముప్పన్నెచుం గై చెలంగ
ఆము. ౧. ౩౬.

**ముప్వన్నెమెక(గ)ము.** వి. (ముప్పన్నె + మెకము) పులి, చిత్రకాయము.

సీ. కటిభాగమునయందుఁ గట్టు రింగులు వాటి
మెఱుగారు ముప్పన్నెమెకముతోలు
కాశీ. ౨. ౧౪౬.

సీ కన్నుల నిప్పుకల్ గ్రమ్మచు ముప్పన్నె
మెక మిర్లఁ గదియుపోలికల మొసలి,
కన్నులరాకాసిమిన్న కోనమెకంపుగుంపులఁ,
వార్కొని యంపవాన గురిసె .
అచ్చ. రా. యు. ౩౧౧.

సీ. ముప్పన్నెమెకముతోల్మువ్వపు నడికట్టుసొను
చక్రాయుధచ్ఛవిని దగిద .
రంగా. ౧. ౭౬.

సీ. ముడిచినరొంటికొంజడ మాయ ముప్పన్నె
 మొగిముత్తోలు కిరీటముగ ధరించి
 మను చ ౧. ౫౯

**ముప్పన్నెవిల్లు.** వి (ముప్పన్నె+విల్లు) ఇంద్ర ధనుస్సు.

గీ. వర్ష ధారావశేషాన్వవాయయుక్తి, వాయువశమునఁ దెరలుముప్పన్నెవిల్లు, వేద్యవెన్నాడుకొళవోలె వెలఁది చాపులమున సరమాహరించుకుకము దవులంచు.
 పాండు. ౪ ౨౩౫

**ముప్పపసరము** = **ముప్పకోడియ.** (శ ర.)

**ముప్వీసము.** వి. (మూఁడు + వీసములు) ౧. రూకలో పదాఱింట మూఁడు భాగములు

సీ. పణషోడశాంశంబు పరగు వీస, మనఁగ ముప్వీస మంచనఁ బొల్పుఁ దత్త్రయాఖ్యరై ఆం. భా ౭. ౨౪౭.

౨. ఒక వస్తువున పదునాఱు భాగములలో మూఁడుభాగములు. (శ. ర.)

**ముప్వు(వు)రు = ముగ్గురు.** స. బ. (√ మూఁడు) ముగ్గురు.

(మూఁడు శబ్దమునకు మహన్మహత్యర్థకరూపము.)

క. అవ్వారాంగనబానిస, ముప్పురు నీల్గంటపుఁ దాన మూలం బనుచున్, నెవ్వగలు వగల నీనం, గ్రొవ్వాఱి కొసఁ జొచ్చె నగ్నికుండము లోనన్.
 వి క్ర. ౭. ౧౩౦.

శి. ఇవ్విధమున నగ్న్యాశ్రమ మవ్వనమునఁ దీర్చి కొని వసాటప్రవరుల్, నవ్యకుఁగంబులతోఁ జని, ముప్పురుదొరలకును జాఁగి మ్రొక్కినపిదపన్.
 రామా. ౩. ౧౧.

కా. క్రీలన్ ముప్వుర నిచ్చి పాత్రమతులన్ క్లేష్మాముపూర్వంబుగాన్ ..
 ఉ. రా. ౧. ౭౯౩. భార. ఆది. ౫. ౧౪.

క. అనఘా మతిసారసంజ్ఞుఁ డతనికి ముపురుం, దనయులు సుమతియుఁ బృథుఁడును, ఘనుఁ డప్రతిరథుఁడు ననఁ బ్రకాశిత తేజుల్
 హరి. పూ. ౩. ౧౭.

క అమ్మువురకు గానము హరి, యిమ్మెయి నఖిలంబు సేప్పి . కళా. ౭ ౩౪.

గీ. అనఘు తిరదాని యగుమల్లికార్జునుండు, కూర్మి మదిగొండశరభన్నకూఁతు సుందరీసతీమణిఁ బెండ్లియై భాసురశ్రీ,మూర్తులను బోలుతన యుల ముప్పురఁ గనియె. చెన్న. పీఠి ౪౧.

**ముప్పెట్టి.** వి (మూఁడు + పెట్టులు) త్రివిధ మగుకూలి లేని సేవలు

మ అనురాగపు ముప్పెట్టియుఁ గొన్నగాత్మసకలాధీశుండ
 భా గా యు. ౭౦౦.

ఉ. ఇట్టివిధంబునన్ విబుధు లెప్పుడునం గనగాపులట్లు ముప్పెట్టియుఁ జేసి చేసి .
 హం. ౩ ౧౧.

శా తేలం గొంటి కుజోగప్రపన్నకము బల్మిం గిట్టి ముప్పెట్టులం, దూలంగోలితి వాసవాదినుగలన్
 భా. గా. యు. ౫౪.

గీ అష్టదిగ్గజులను ఐన కరియుఁ గోరు, పెట్టు కాపులుఁ జేసి ముప్పెట్టి గొనిరె . .
 తప. తి. ౧. ౨౫.

**ముప్పేత.** వి. (మూఁడు + వెతలు) త్రివిధమగు బాధలు.

ద్వి తలఁకిపోవఁగనీక స్నగ గిఱి గీచి, మొంటలు పెట్టఁగఁ గట్టి ముప్పేతఁ బెట్టి
 ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౭౪. పం.

**ముప్పేలుఁగు.** వి (మూఁడు + వెలుఁగులు.) ౧. త్రేతాగ్నులు, మూఁడగ్నులు.

గీ. కెదల బలరామకృష్ణులు పడుమఁ దాను,
భద్రదంతావళిము నెక్కి పొండ చేయ,
ముఖ్యుఁ దతిరాజసంబున ముమ్మేలుంగు,
పోలికఁ బొసంగ వచ్చెను బ్రోలికడకు
విజ. వి. ౩. ౧౪౪.

౨. సూర్యుఁడు.

గీ. ముమ్మేలుఁగులోని పరతత్త్వమా యనంగ,
శుద్ధ నాట్యంపుఁదెరువునఁ జూడఁ బొలిచె
కళా. ౩ ౭౫.

ముమ్మేల్పుటిక్క = ముమ్మేలుపులయిక్క.
వి. ముకుంద. ౧. ౩౪ పా ౨. పం

ముమ్మేలుపులయిక్క = ముమ్మేల్పుటిక్క.
వి. (ముమ్మేలుపులు + ఇక్క) సూర్యుఁడు.

గీ. శౌరి ముమ్మేలుపులయిక్క కొలమునందు,
జమిలిచామంచతేర్లిరాచలికెలుఁగున, కేపులోఁ
బుట్టె పెదరులు వాపి ప్రజలఁ, బ్రోవ నరు
దుగ నిరుపమగరూపు లూని.
అచ్చ. రా. బాల. ౧౮ ౨.

ముమ్మేలుపులు. వి బ. (మూఁడు + మేలుపులు)
త్రిమూర్తులు, బ్రహ్మవిష్ణుమహేశ్వరులు.
(చూ. ముమ్మేలుపులయిక్క.)

ముసటి. సం. వి. ఈ. స్త్రీ. ధాన్యవిశేషము,
ఒకజాతిధాన్యము.

ముష. సం. వి. అ. స్త్రీ. లోహములను కరఁగిం
చెడిమూస, మూష.

ముషితము. సం. విశే. (అ. ఆ. అ.) ౧ దొంగి
లింపఁబడినది. అపహరింపఁబడినది. ౨. మోస
పుచ్చఁబడినది. వంచింపఁబడినది.

ముష్కము. సం. వి. అ. పుం. ౧. అండము,
వృషణము. ౨. అండకోశము, అండము లుండు
సంచివంటితోలు. ౩. సమూహము, రాశి.

ప్రోగు, మొత్తము. ౪. మొక్కపుచెట్టు,
మోక్షము ? .

ముష్కరుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ౧. పెద్ద
వృషణములు కలవాఁడు. ౨ దుష్టుఁడు.

క. ముష్కర హితవృత్తిని బర, పుష్కర
పత్త్రాక్షిఁ బట్టి భోగించుటచే, ముష్కరకీ
చకుఁడవు గ మ్మని, నిష్కరుణ కపించి మూవి
నిలయముఁ జేరుచ్ దశా. ౪. ౧. ౧౬౪.

౩. కృపణుఁడు, దీనుఁడు.

మ. ధరణీరాజ్యము గోలుపోయి . ముష్క
రుల న్పార్థులఁ గొల్చిన న్గలదె సౌఖ్యం బెంత
యున్ భార. అర. ౬. ౧౬౫.

శ్లో గతశ్రీకాన్ హృతరాజ్యాన్ కృపణా న్గతి
చేతసః, అరణ్యవాసినః పార్థా న్నాను
గోప్తుం త్వ మర్హసి
సం. భార. వన. ౨౩౭. ౧౬.

౪. మూర్ఖుఁడు.

మ. అధర్మ పుత్త్రుండు జూదరి పెంటం దమకించి
సౌబలునిచేతన్ భూమి గోల్పోయి ము,
ష్కరుఁడై పెండియు నొడ్డఁగా నతఁడు నతః
ప్రాతిపై గెల్చె
భార. ఉద్యో. ౩. ౩౫౭. ౪. ౭౧.

క. గురుఁ దల్లిని దండ్రిని సోదరుని నకారణము
ప్రల్లదముఁ బల్కినము, ష్కరుచేత మాఱు
పణములు, ధరణీశుఁడు గొనుట నీతి దండుప
చేరన్. విజ్ఞా. ప్రా. ౪౩.

ముష్కుఁడు. సం. వి. అ. పుం. ౧. మాంసలుఁడు,
బలవంతుఁ డైన మనుష్యుఁడు. ౨. చోరుఁడు,
దొంగ.

ముష్టి. సం. వి. ఇ. స్త్రీ. ౧. పిడికిలి.
౨. పిడికెఁడు బియ్యము మొ.

గీ. ఇంట సెవ్వారయిన భిక్ష మిడిన ముష్టి,
పెట్టినఁ గరాలికేళికొప్పిదము దోఁప,
సొగిరిపడి యిందులకు మీర లెవ్వ రనుచుఁ,
బెద్దపులిఁబోలె రొప్పు నాబిసరుహాక్షి
శుక. ౩. ౩౪౯.

౩ బిచ్చము. (ఈయర్థము తెనుఁగునందుమాత్రమే కానవచ్చు చున్నది)

సీ. మిన్నంతసంపదఁ జెన్నారియుండియు ముష్టికి
లో నయ్యె ముదితనడుము .
చంద్రా. ౨. ౨౨౩.

(ఇట పిడికిలియని రెండవ యర్థము.)

౪. పిడి, కత్తిపిడి ౫. పలపరిమాణము ౬. అపహరించుట, దొంగిలించుట.

**ముష్టింధయుఁడు.** సం. వి. అ. పుం. పిడికిలి నోట నుంచుకొని చప్పరించువాఁడు శిశువు, చంటి పిల్లవాఁడు

**ముష్టింపచుఁడు.** సం. విశే (అ. ఆ. అ.) దరిద్రుఁడు. (శ. ర.)

**ముష్టికాంతకుఁడు.** సం. వి. అ. పుం. ముష్టికుని జంపినవాఁడు, బలరాముఁడు.

**ముష్టికుఁడు.** సం. వి. అ. పుం. ౧ స్వర్ణకారుఁడు, బంగారుపనివాఁడు. ౨. ముష్టికాసురుఁడు.

(కంసుని మల్లులలోని వాఁడు.)

**ముష్టిదేశము.** సం. వి. అ. పుం. పిడికిటఁ బట్టు చోటు, వింటినడిమి ప్రదేశము

**ముష్టిద్యూతము.** సం. వి. అ. న. ఒక రకపు జూదము, గవ్వల ముష్టితో నాడుజూదము.

**ముష్టిబంధము.** సం. వి. అ. పుం. ౧. పిడికిలి పట్టుట, సంగ్రాహము. ౨. పిడికెడుపనువు.

**ముష్టిమేయము.** సం. విశే. (అ. ఆ. అ.) పిడికిటఁ గొలవఁ దగినది

**ముష్టియుద్ధము.** సం. వి. అ. న. గుద్దులాట.

**ముష్టీముష్టి.** సం. అవ్య. ఒండొరులు పిడికిళ్లచే గ్రుద్దుకొని చేయునది. యుద్ధము.

(ఈ క్రిందిభారతపద్యమునందు ముష్టాముష్టి అని యతియం దాకారము ప్రయోగింపఁబడినది. కాని 'ముష్టాముష్టి, బాహాబాహవి' మొదలగుప్రయోగము లసాధువు లని 'అన్యేషామపిదృశ్యతే' సూత్ర మనోరమ యందు సిద్ధాంతము చేయఁబడినది.)

క. భీమానుగవీరులను, ష్టాముష్టి రణచ్ఛటచ్ఛటా
కల్పం బుద్దామం బై తద్వినము, వామృగ
పక్షులకు నతిభయానక మయ్యెన్
భా. ది. ఆర. ౩. ౩౯౫.

**ముసగుస** వి. కోపమున గిలుగు చీఁచీఁ

క. ఆసమంజుని వెడలించిన, వసుధేశ్వరుఁ
డేజనాపవాదముఁ జెందెన్, దస రెత్తేఁగినవర
ములకా ముసగుస లని కైక కోరుమాయించెఁ
బతిన్. చం. రా. ౪. ౫౬.

గీ. ముసగుసలఁబోరుగురుభీష్మముఖుల సఖుల,
నాత్మసైన్యగతుల్ శ్రేష్ఠులైనవారిఁ, జూచి
యధిపతి యొక్కఁడినుద్దు లనుచు, నడిగి వా
గించుకోఁ దగినంతఁ జెప్పె. రాఘవ. ౪. ౪౯.

౨. గుసగుస, రహస్యసల్లాపము.

క. రాచిలుక రాణివాసము, లోచెలి యొలమావి
చిన్నియుప్పరిగె పైఁ, జూచితె ముసగుస
లాడుచుఁ, జూచెద రాతలిరుటాకుపుసారణి
గిండ్లన్. కళా. ౩. ౯౧.

సీ. . ముసగుస గుసగుస ముచ్చట యన సల్లాప
సంజ్ఞలై యుల్లసిల్లు
ఆం. భా. ౧. ౧౧౪.

**ముసజ్జీ.** వి. వస్త్రవిశేషము

రగడ. పూదళింబులు పెన్నమణుగులు ముసజ్జీలు
చాదరలు పైతిణీ ల్పక్క నిఖాయిూలు.
హంస. ౫. ౩౪౬.

**ముస(ర)ద్ది.** వి. లేఖకుఁడు, వ్రాయసకాఁడు.

సీ. దేశపాండ్యా తాను దినవతి నని చెప్ప ముస
రద్ది చెవిలోన మెఱఁగి చెప్ప
వేంక. ౧౬.

చ. అనుకలనా గ్త లెల్ల సమయంపుముసద్ది
లిఖించి పంపునా, దినచరిత్రమ్మ
ల. వి. ౪ ౧౧౯.

(ముఖాది అపముద్రి.)

**ముసనాబు.** వి అందలము ప్రక్కతెర.

సీ అలరారుకురువేలుతళుకుబల్ముసనాబుఁ బరు
వంపుఁబొగడపూబటువుదిండ్లు .
చంద్రా. ౩. ౭౯.

సీ. ఊదిరికంకణము లింపొసఁగు దంతపుగొజ్జెల్
నయము మించిన ముసనాబుసదము
రా. వి. ౨ ౪౩.

సీ ముసనాబుకుచ్చులు పసిఁడిసరిగె, కుట్టు
తాపెత బటువులు అందలం బెక్కి..
దశా. ౩. ౧౭౯.

**ముసవు.** వి. ముచ్చట, కోరిక, అభిలాషము.

సీ. కేవ నాజవరాలిలావణ్యసరసితో మునుఁగుడు
నెన్నండు ముసవు దీఱ.
వరాహ. ౧౧. ౫౬.

**ముసముస.** వి ౧. పంది మూర్కొనుటయందలి
ధ్వని కనుకరణము.

గీ. ముట్టె బిగియించు ముసముస మూరుకొనుచు
నడరు సంరక్షితక్షోణి యజ్ఞఘోణి .
భాగ. ౩. ౪౧౩.

౨. ముసరుట క్రమ్ముటయం దగునను కరణము.

వ. చెదలు కదుపులకొన్నగా బుస్సుబుస్సనఁ
గూర్చి దొంగవీర్పుచు ముసముసన ముసరు
కటికచీకటికుటుములు నందంద గ్రందు
కొని బొల్లిమెకంబు మెకంబులును .
ప్రబంధ. ౧౮౭.

౩. పడిసెము పట్టినప్పుడు బిడ్డలు విడుచు
శ్వాసములధ్వని కనుకరణము

(చూ. ముసముసలాడు.)

౪ కోపమునఁ గలుగు చిఱచిఱ.

సీ. ముసముస జంకించుచుంకరితు మ్మెదబారువూఁ
బోఁడిపాలుపు చేర్చున మాలించె .
భాను. ౩. ౨౪.

(శ. ర పా. ముసరి జంకింపుచు ముద్రి. పా.)

జ. ముసముసమను, ముసముసయను, ముసముస
లాడు.

**ముసముసమను.** అ. క్రి. (ముసముస + అను)

౧. ముసముసమని ధ్వనిచేయు.

సీ. ముసముసమనఁ జుట్టి కొసమెంద్రుంకలు వట్టి
హుమ్మని యుందియు ఱలియఁదాఁచి
కవిక. ౪. ౧౭౭. (శ. ర. పా.)

౨. కోపమున చిఱచిఱలాడు.

ద్వి. ముసలి కోపంబున ముసముసమనుచు,
ముసలలాంగలముల మునుకొని విసరె.

అభిమన్యుచరిత్ర. (శ. ర.)

**ముసముసయను.** అ. క్రి. (ముసముస + అను)

కోపమున చిఱచిఱలాడు.

క. జలరుహసంజాత సభాస్థలమున కొగి పేఁగి
యతని సత్త్వగుణంబున్, దెలియుటకై నుతి
వందనములు వే యక యున్న నజుఁడు ముస
ముసయనుచున్. భాగ. ౧౦. ఉ. ౧౨౬౯.

**ముసముసలాడు.** అ. క్రి. (ముసముసలు + ఆడు) ఏడ్చుట, వడివెనుకచే ముసముసయను ధ్వనము వినుచు.

(వ్యావ.) ఆ పిల్లవాఁడు మూన్నాళ్లనుండి ముస ముసలాడుచున్నాఁడు.

**ముసరికొను.** అ. క్రి. (ముసరు + కొను. స్వార్థమున) కలియు, పర్వు, వ్యాపించు.

క. ఇది ప్రేపయదలి ప్రమథులు, మదమున శతకోటిసంఖ్య ముసరికొని ప్రియంబు దలిర్ప దీవఁ గోలలు, గుదియలు సైకొంద్రు తమకుఁ గోరి ధరింపన్.

హరి. ఉ. ౬. ౧౪.

స. క్రి. చుట్టుకొను, పరివేష్టించు

వ. అనుచుం గనుంగొనుచు ముసరికొని చను చుండం బాయిూలరాజనందన రాజమంది రంబుచక్కటికి నరుగునవసరంబున

భార. విరా. ౧. ౩౦౦.

**ముసరు.** అ. క్రి. (క. ముసఱు. త ముసు.)

౧. పర్వు, వ్యాపించు.

సీ. మోహాంబువలనఁ బై ముసరు లోభంబు లోభావేశమునఁ గాము మగ్గలించు

భార. అర. ౪. ౨౭౭.

గీ. వాకిటానవరుచిరవిశ్వాసములకు, ముసరి తారించుచెలదేటి ముసురుఁ జోపి .

కా. సం. ౯. ౩౧౭.

సీ. సంయమీంద్రులు శివార్చనలు చెల్లింపక ప్రసవంబునకుఁ దేఁటి ముసర వెఱచు

పి. శకుం. ౨. ౪౫.

౨. పైఁబడు.

క. .. ఏను నిర్భయుఁడనై, జె వ్యధ ముసరి కిరాతులు, ప్రత్యాసరంబెనఁగఁ జాలఁగొని రక్షకులన్ ...

భార. మా. ౨౧౩.

క. వాసవనందనుఁ డెంతయు, గాసిలి యున్నాఁడు మనలఁ గని యించుకయుం, దా సైరణ సేయఁడు గను, మోసము లేకొక్కటెంగిన ముసరఁగ వలయున్

భార. విరా. ౪. ౨౩౦.

క. తృణావర్తుఁ డవని కవచాటముగా, సురకిరువలిరయి బిసబిస, సరు దరు దన ముసరి విసరి పూరిఁ గొనిపోయెన్

భాగ. ౧౦. పూ. ౨౭౪

జ. ముసరికొను.

**ముసలము.** సం. వి. అ. పుం. న. ౧. దుడ్డుకఱ్ఱ. ౨. రోఁకలి. ౩. శస్త్రవైద్యమునందలి సాసన విశేషము.

**ముసలాముసలి.** సం. అవ్య. రోఁకళ్లతో జరుగు నది. (యుద్ధము.)

**ముసలాయుధుఁడు.** సం. వి. అ పుం. బల రాముఁడు.

**ముసలి = ముదుసలి.** విణ. వృద్ధుఁడు; వృద్ధ.

క. ముసలి గదా పుట్టినిల్లు ముఖ్యోక్తపతకున్.

మనుచ. ౬. ౪౭.

క. ఏలికె పెద్దలు లే క్రూరులకె పోచుకొని తిరుగునోకముసలియు నేఁ డేఁటి గలిగి రొంక రొద్దున బోరుదిగంబరుఁడు సరిదై పురికాఁ పులకున్

గా. వి. ౧. ౫౬.

సీ. ముదివాఁడు ముదుసలి ముసలి పెద్ద ముదుకు అరగడం బనఁగను వలరు వృద్ధాభిధ .

ఆం. భా. ౨. ౧౧౯. అము. ౫. ౫౩.

జ. ముసలితనము.

**ముస(వ)లి.** వి. సం. వి. న్. పుం. ౧. బల రాముఁడు. ౨. శివుఁడు. ఈ. స్త్రీ. బల్లి, గృహగోధిక.

ముసలితనము. వి. (ముసలి + తనము) వృద్ధత్వము, ముదిమి.

క. రసనీరసంబునం దన, ముసలితనం బుడిగి తరుణమూర్తియుతుం డై, వసుధాపురం డింటికిఁ జని వి(క్ర ౨. ౧౨౪.

సీ. ముదిమి ము ప్పునఁ దగు ముసలితనము ఆం. భా. ౨. ౧౧౭.

ముసల్యుఁడు. సం విణ (అ. ఆ. అ) రోఁకటిచేఁ జంపఁదగినవాఁడు.

ముసాంబ్రము. వి. (హిం. ముసాంబర్. వి. (బ్రా.) ఒకవిధమగు మందువస్తువు (శ. ర)

ముసాపు. వి నానుడువాన, ముసాబు. (శ. ర)

ముసాబు. వి. నానుడువాన

ఆ. తన్నుఁ దెలియ కున్నఁ దగి వేదములు వెట్టి, సస్యసంపదకు ముసాబు వెట్టి వేమన. ౨. ౪౨౨.

ముసానమ్మ. వి ఒకానొక గ్రామదేవత.

గీ. మోసపోక ముసానమ్మ ముద్దిగాలు, దారి పడిసప్లు లేక పాతాళిమునకు తాళ్ల ౫. ౨౮౯.

ముసి. విణ. ౧. ఆపత్యము, బొంకు.

క. గితకీవుఁడు శ్రేఁ గనిరొుదు, కత యది ముసి యరొు్యఁ బం కికంటనిరొుదఁ దా, నతఁడు మను బ్రతికి శ్రేఁ గై, బతిమాలిచె జగమఁ జచ్చి భారము వాసెన్. రామా. ౮. ౨౩౦

౨. వి బాధ.

(చూ. ముసిముట్టు.)

౫. ముసిముట్టు.

ముసించు. అ. క్రి. చెడు.

ద్వి. బుద్ధి గల్గినయాసుబుద్ధియుఁ జాటి, బుద్ధి చెప్పినను నాబుద్ధి ముసించె. ద్వి. శ. సా. ౧. ౬౯౨. పం.

ముసిఁడి. వి. ముష్టిచెట్టు, వృశ్చికిశేషము ; ముష్టిపండు.

(దీనిపండ్లు మిక్కిలి చేదై ప్రాణాపాయకరములై యుండును)

సీ పూతాక్కారపవనంబు పూరించుపుక్కిళ్లు ముసిఁడిపండులతోడ ముద్దుగురియ . క్రీడా. ౨౨౪.

సీ. ముసిఁడిబ్రమఁకునఁ బండ్లు పసమీఱఁ గలిగించి యుంచున కేల పుట్టించఁదరుయ్యె నీలా. ౧. ౧౧౧.

సీ ముసిఁడిబ్రమఁకునస్సితముసు బండ్లు గల్పించి చెంతను కేల సృజింపఁజాలౌ వైజ 3 ౧౨౧.

ఆ. వినుమ మసత్యలోభమున పిరి యసునె యూఁకొని ముసిఁడి దినినఁ గ్రొవ్వు లావుఁ, గలుగునయ్య కపనికర్ణకుశ్చాసన, మంత్రితంబు గార్యతంత్ర మగునె. భార. ఉద్యో. 3. 333.

ముసిమి. వి. క్లేశానుబంధము.

ఆ. ప్రసవభాగ్యమహిమఁ బ్రబలియు నెటువంటి, ముసిమిరోగ యెఱుంగ వినుపు లేక, తారగించి ముద్దుతమ్ములఁ జీవురాకుఁ, బోండ్లు కొలను సొచ్చి పుచ్చికొనిరి. వేం. పంచ. ౪. ౧౪౩.

ముసిముట్టు. అ. క్రి. (√ముసి) బాధపడు.

వ. ఇట్లు బహుభంగులఁ దనకావించు కల్లమంబుల ముసిముట్టుక సెంబుయు నాజగకెట్టి చందంబు విని .. నృసిం. ౫. ౪.

ముసిముసి. విణ. మందము, అలఁతి. (నవ్వు)

సీ. ప్రాణేశునానలీలాకాంతంబు వొరఁగాంచి ముసిముసినవ్వుతో మోము మలఁచు . .

సైమ. ౪. ౧౯౧.

చ. ముసిముసినవ్వు మోముపయి ముచ్చట లాడ గవంద్రమోఁతతో, గుసగుస లాడ సంచగమి గూడఁ జనెన్ జెలి కౌర్యమోలకున్

ముకుంద. 3 ౨౦౨.

క. ఒసఁగినఁ గైకొని సంతస, మెసఁగ సద న్యాలు ఫలించె నృప నీసుకృతం,బు సమ స్తం బని పలుకన్, ముసిముసినేనగవు తనదుమోమునఁ దొలఁకన్.

చం. రా. ౨. ౪౧.

క్రి. విశే. మందముగ, మెల్లఁగ. (నవ్వు)

క. పనిలేనిపని ముఖాంబుజ, మునకుం జె న్నగ్గ లింప ముసిముసి నగినన్, వనరుహాగేహిని విభునిం, గనఁగొని యి ట్లనిరెు నర్మగర్భము గాఁగన్.

విప్ర. ౪. ౩౪.

**ముసుఁగు = ముసువు.** వి. (క. ముసుకు.) కప్పడు, అవగుంఠనము.

గీ. ముసుఁగుఁ దొలఁగించి తనులత మోద మడరఁ, బద్మమధ్యంబునం దున్నపద్మ వోలె, హంసతూలికాతల్పంబునందు నుండి, యాక శావతి మునజనాయకునిఁ జూచి

విక్ర. ౬. ౧౪౦.

గీ. కొన దిగఁగ నీలిపుట్టంబు ముసుఁగు వెట్టి గాజు లెగఁద్రోసి చప్పుడు గాక యుండ, వచ్చె నూర్వశి యర్జునావాసమునకు

హర. ౪. ౧౧౯.

మ. .. సంసారంపుఁద్రోవ నృదా, చుచుచుం డున్ ఘనమోహాశేద మలమన్ సంసారి పొంతుండు వ్యాసన లన్ధూళి ముసుంగు గాఁగ ...

ఆము. ౩. ౪౦.

చ. సతు లిరువంక నిర్వరుస శయ్యాపయి న్నిదు రింప నాథుఁ డొక్క_తెకు ముసుంగు మోము పయిఁ గాంచుచు మెల్లన నొ త్తగిల్లి ...

గంధ. ౫౮.

జ. ముసుఁగుకొను, ముసుఁగుడు, ముసుఁగుడు వడు, ముసుఁగుదన్ను, ముసుఁగుబొంద, ముసుఁగువడు, ముసుఁగువాఱు, ముసుఁగు వేయు

**ముసుఁగుకొను.** అ. క్రి. (ముసుఁగు + కొను) క్రమ్ముకొను

క. తోరము లగునవ్వర్షా, వారములం దొక్కనాఁ డవారితధారా, సారంబు పయోధరముల్, ఘోరంబుగఁ గురిసి ముసుఁగుకొని నిశదాఁకన్.

హైజ. ౨. ౧౪౮.

**ముసుఁగుడు.** వి. (√ ముసుఁగు) అవగుంఠనము, కప్పడు.

(బూ. ముసుఁగుడువడు.)

**ముసుఁగుడువడు.** అ. క్రి (ముసుఁగుడు + పడు) కప్పడువడు, ఆచ్ఛాదితమగు.

క. తెచ్చవడి యుభయబలములు, నచ్చెరువుగఁ జిత్రరూపుల ట్లుండ శర,ప్రోచ్ఛలితచండ దీ ప్తిస, ముచ్చయములం పెలంచఁ బరగ ముసుఁగుడువడఁగాన్ .

భార. భీష్మ. ౧. ౨౪౦.

(శ. ర. పా. ముసుఁగువడంగాన్. ముద్రి. తాళ ప్రతి. పా.)

**ముసుఁగుదన్ను.** స. క్రి. (ముసుఁగు + తన్ను) ౧. మఱుఁగుపఱచు

సీ. కద లేనివిద్యుంపుఁగప్పు చందురకావిమోవి పల్లొత్తుల ముసుఁగుదన్న .

పాండు. ౩. ౧౦.

౨. ఆచ్ఛాదించు, కప్పుకొను.

(వ్యవ.) వాఁడు దుప్పటి ముసుఁగుదన్ని పండు కొన్నాఁడు.

**ముసుఁగుబొంద.** వి. (ముసుఁగు+బొంద) పట్ట లాడవికాడు లోనగు చిన్నచెట్టు. (శ. ర.)

**ముసుఁగువ(ప)డు.** అ. క్రి. (ముసుఁగు+పడు)
౧. వ్యాపించు, క్రమ్ము.

క. కడులజ్జయు దైన్యంబును, వడరి ముసుఁగు వడఁగ నాకు నాత్మగతమునం, బుడమి వివరంబు లేదే, యడఁగడ వన్నట్టి దయ్యె నప్పుడు కర్ణా    భార. అర. ౬. ౧౪.

గీ. మెంగముపై శోకదైన్యముల్ ముసుఁగు వడఁగ    మార్క. ౩. ౧౧.

సీ. ఉడురాజబింబంబు నల్లసమాడెడుముక్తాత పత్త్రముల్ ముసుఁగువడఁగ
భా. రా. యు. ౪౩౦.

౨. ఆచ్ఛాదితమగు, కప్పఁబడు.

గీ. చాతుకీకి వేర్వేఱ సంగ్రహించి, వనిత యొకజీనిపావడ వానిమీఁద, ముసుఁగువడఁ జుట్టి పై లక్క ముద్రఁబెట్టి, యొరులు గనకుండ నలుదిక్కు లరసి చూచి
విప్ర. ౨. ౭౩.

వ. . కొండగోఁగియ ముఱుఁగుడుబొందులకు సందడించుకంకగృధ్రావళుల మొల్లంబుల ముసుంగుపడుపల్లంబులును .
మనుచ ౪. ౩౫.

**ముసుఁగువాఱు.** అ. క్రి. (ముసుఁగు + వాఱు) వ్యాపించు.

సీ. చరణాబ్జనఖకాంతిచంద్రికల్ నతభూప ముకుటాగ్రమణులపై ముసుఁగువాఱ .
కవిరా. ౧. ౧౦౧.

**ముసుఁగువేయు.** స. క్రి. (ముసుఁగు + వేయు) కప్పు, ఆచ్ఛాదించు.

సీ. మొరుముంజిముత్యాల యొరగుపాగ మెఱుంగు నొసలిబొత్తరిఁబొట్టు ముసుఁగువేయ ...
సారంగ. ౧. ౫౯.

**ముసుఁడి.** వి. (క. ముసుండి.) సమూహము.

ఆ. బరకు వెత్తియున్నపరుసంపు టొడలును, గలుగుపెఱుఁకుముసుఁడిఁ గనిరి సతులు .
కు. సం. ౬. ౬౯౪.

**ముసురు.** వి. నిరంతరవర్షము, ఎడతెగనివాన; వృష్టి, వర్షము.

(బ. ముసురులు, ముసుర్లు, ముసుళులు, ముసుళ్లు.)

క. చలిగాడ్పుల ముసురుల మెయి, వలిగొని ధాత్రీపురంధ్రి వలఁ బచ్చనికం, బలిఁ గవిసి కొన్న విధమునఁ, బొలుపుగఁ జెప్పరలు గవిసె భూతలమెల్లన్.    కు. సం. ౬. ౫౫౫.

చ. ముసురుదివంబులందు మనమోసలఁ బంచుట రంగు మీఁదటన్, . గిరికభక్త లకేకులు నిండియుండ్రు    హర. ౨. ౪౦.

మ. జమ్ముగూడఁ బోల మంబళోగియుచుం బట్టి సైస్మనురం దీఁగడుకాఁపుగుశ్చైతల    ఆము. ౪. ౧౩౩.

సీ. పసపస యను నది ముసు రనఁగను మీఱు .    అం. భా. ౧. ౫౫.

గీ. వానితానసరుచిరనిశ్వాసములకు, ముసరి కారించువెలఁదేటి మునురు బోఁడి ...
కు. సం. ౯. ౩౧౭.

(ఇట సమూహము అని భావము.)

క. . . కురిసిరి ముదమున, సెగడుచోఁ గుసుమముల ముసురు నిర్జరు లధిపా ..
భాగ. ౧౦. ఉ. ౨౩. భాగ. ౪. ౩౫౫.

జ. ముసురుకొను, ముసురుగవియు, ముసురు మూఁతి.

**ముసురుకొను.** అ. క్రి. (ముసురు + కొను)

౧. ఎడతెగక కురియు.

క. దెసలు ప్రసన్నము లయ్యెను, ముసురు కొనియెం బుష్పవృష్టి మురజధ్వని పెల్లెసఁగె దివి శుభానిలము లొలసె పవిత్ర ప్రదక్షిణార్చులం గనుపట్టెన్. — హై. భా. ఒ. ౧౭.

గీ. పతికు, లుసురుసున ముసురొన్న యమ్మునురులాను, రాఁడు పతి యంచు నిర్భర గతులఁ జేల . శుక. ౨. 3౮3.

౨. కవియు, ఆవరించు.

క. ముసురుకొమజరభరంబున, నసురను రై యున్నమమ్మ నడకించిరి వి, ట్లుసురుమనఁ బట్టుపడు పెంక, యసురక నీ పసుచుఁ బలికె వాగ్రహ మెసఁగన్. — మనుచ. ౪. ౧౪.

వ. విసరువాదరినయనలు ముసురుకొని బలిసి నిలిచి కొలువఁ బ్రతిసంక్రమణావాశోత్స వాదులయందుఁ జేకొలగం బసరిం తువు . — భీమ. 3. ౨౧౧.

**ముసురుగవియు.** అ. క్రి. (ముసురు + కవియు) కవియు, వ్యాపించు, ముసురుకొను.

గీ. నరుని పాశుపతాదిబాణముల పెంపు, భీము గదపెంపు నమ్మి యుద్ధామలీలఁ, జెలఁగి పెం పేది యక్కడిబలము ముసురు, గవిసి యొప్పుడుఁ గయ్యమునకుఁ గాలుద్రవ్వు. — భార. ఉద్యో. ౨. ౨౨.

(ముసురుకవియు అని శ. ర.)

**ముసురుతేనె.** వి. ఒక విధముగతేనె, మధువిశే షము.

వ. . ముసురుతేనె పూఁదేనె జుంటితేనె పుట్టతేనె పెరతేనె కజ్జతేనె పురుజు తేనె . . ప్రబంధ. ౧౧.౬.

**ముసురుమూఁతి.** వి. (ముసురు + మూతి) కోప వికారము గలముఖము.

ఉదా: ముసురు మూతివాఁడు. (శ. ర.)

**ముసువు = ముసుఁగు.**

మ. ముసువు స్మృచ్చటయు ప్రవాహ్యమునను స్మరించి నాసాదివో, తను లాస్థానముఁ గూడి యాడుదురు శ్రీకాళిప్రదేశంబునన్, గన పై పుట్టెడుభాగ్యమైన మనకున్ గల్పింప దాదైవము — కాశీ. ౩. ౨౦౩.

**ముస్టి.** వి. ముసిఁడి, వృక్షవిశేషము

సీ. పురుషుఁ డొల్లనియట్టి పొలఁతియావన మెల్ల ముస్టిచె ట్టడి పూలఁ బూసినట్లు — కలు. శ. 3౪.

**ముస్త.** సం వి. అ. స్త్రీ. నిడుముస్తె, తుంగ ముస్త. శ్రీ.

**ముస్తము.** సం. వి. అ. పుం. ౧. ఒక దినుసుగడ్డి, నిడుముస్తె. శ్రీ. పుం. స్థావరవిషభేదము.

**ముస్తాదము.** సం. వి. అ. పుం. పంది, సూక రము.

**ముస్తాదు = ముస్తీదు.** విణ.

(సంసిద్ధము)

సీ. బిరుదువస్తాదులఁ బేర్వేల నాడాడ ముస్తా దుగా నిల్వఁ గుస్తరించి — రంగా. ౨. ౧౫౧.

**ముస్తాబు = ముస్తీదు.**

(విణ. సంసిద్ధము)

(వ్యవ.) అ కోమారింటికి కెళ్లుట కతఁడు ముస్తా బై నాఁడు.

ముస్తీదు = ముస్తాదు, ముస్తాబు, ముస్తీబు, ముస్తైదు.

విశే. (హిం. ముస్తయిద్) సంసిద్ధము.

సీ. కండచక్కెర దండిఖాణంపుబొంతల జీని
ముస్తీదుకేలీలం నడుంత ...
ఉ. హరిశ్చ. ౩. ౧౩.

సీ. తలబొమిండికము కత్తళము కేడెము కత్తి
యాదిగాఁ గలవి ముస్తీదొనర్ప .
ఉ. రా. ౪. ౨౫౭.

వి. పరికరము, పనిముట్టు.

గీ. రాజు, స్వారి వెడలెడివేడ్కతో సాదిఁ
జూచి, తెమ్ము ముస్తీదు ఘటియించి తేజి
ననఁగ ఉ. హరిశ్చ. ౪. ౧౭.

వ. తమతమ ముస్తీదులతో పిస్తుగా దోస్తిని
చుట్టుముట్టి కోపాటోపంబున . .
ప్రబంధ. ౫౭౭.

ముస్తీబు = ముస్తీదు.

విశే. (సంసిద్ధము)

సీ. ఎలదేఁటిగమిమేటి రొలగోలుమూఁకల నెల్ల
ముస్తీబుగా నెచ్చరించి శశాం. ౪. ౭౨.

గీ. అనిన నీ వంతనేర్పరి వగుదువమ్మ, తెమ్మ
ముస్తీబు గమ్మ శీఘ్రంబుగాను .
చంద్ర. వి. ౩. ౭౪.

ము(స్తియ)స్తె. వి (సం. ముస్తా) ౧. తుంగ
గడ్డ.

సీ. సెలయేటియిసుకలంకల వరాహంబులు
మొత్తంబులై త్రవ్వి ముస్తె లెత్త
మనుచ. ౨. ౫.

౨. తుంగ కీ.

(దీనిభేదములు నిడుముస్తె, నాగముస్తె, వత్రుమ
ముస్తె.

ముస్తైదు = ముస్తీదు.

విశే. (సంసిద్ధము.)

గీ. అమరముస్తైదు తేజితో నరుగుదెంచె, దారు
కాకారుఁ డైనయుద్ధారుఁ డొకఁడు ..
కుశ. ౨. ౪౭.

ముహిరుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) తెలివి
తక్కువవాఁడు, అవివేకియైనవాఁడు. వి. అ.
పుం. మన్మథుఁడు.

ముహుర్భాష. సం. వి అ. స్త్రీ. మాటిమాటికి
మాటలాడుట, అనావశ్య సంభాషణము.

ముహుర్భుక్కు. సం = ముహుర్భుజము.

ముహుర్భుజము. సం వి. జ. పుం. గుఱ్ఱము,
అశ్వము.

ముహుస్. సం. అవ్య. (దీనికిఁ దెనుఁగున వ్యస్త
ప్రయోగము లేదు) తరుచు, మాటిమాటికి,
విడువకుండఁగ

ముహూర్తము. సం. వి. అ. న. పుం. ౧.
నిమేషకాలము, క్షిప్త, అల్పకాలము. నలుబది
యెనిమిది నిమిషముల కాలము.

## మూ

మూ. విశే. వృత్తియందు మూఁడుశబ్దమునకు మీఁది
వర్ణము లోపింపఁగా మిగిలినరూపము.

గీ. వరవతో త్తమ తేఁడు మూనాళ్లనుండి,
యమునజలగోన వెంటఁ దిరిగెడు నమర
రాయఁడు ... మనుచ. ౪. ౫౩.

(మూన్నాళ్లనుండి. శ. ర. పా )

మూాండు = మూఁడు. స. రెండుపైనొకటి.

క. పొండిగ నగజ తపశ్శిఖి, మూండుజగంబులకు
దీవ్రముగఁ జర్విన బ్రహ్మాండము గాఁచిన
కాంచన. భాండముక్రియఁ దాల్చెఁ దత్ప్రౌ
భా భాసితమై. కు. సం. ౨. ౬౧౪.

**మూఁక.** వి. (√మూఁగు.) ౧. సేన, దండు.

క. వీఁకఁ జలించి నలుగడఁ, దాఁకిన గడు నలిగి ఘోరతరశరహతి న్మూఁకలు విరియఁగ నర్జునుఁ, డాఁకరమున జేసె నుగ్రుఁడయి రణభూమిన్.

భార. ఆది. ౮. ౨౦౦.

సీ. మూఁకల విరియించి వీఁక నాచార్యాది యోధుల నెల్లర నొక్కెడనకు వెలిచి ..

భార. ద్రో. ౨. ౧౩౬.

క. అఁకరమునోడ నప్పను,మూఁకలపై కుటికి కఠినముష్టినిపాతులఁ, బ్రాఁకుల శిలలను వీనఁగు,బ్రోఁకలు గావించి రపుడు పాదప దళ పడిన్.

భా. రా. యు. ౫౩౪. భోజరా ౪. ౮౪.

౨. సమూహము.

చ. . నిరవద్యకలారవామృతం, బులకలివిం బికాంగనలమూఁకకు మూఁకత సంఘటించుచున్, చిలుకలకొల్కి కంధర భుజింపఁగఁ జెల్లద కంధరాంకము౯. వసు. ౨. ౪౧.

ఆ. కొన్ని పెంటిరేఁనుఁగులఁ దాను జోకయై, మూఁక దప్పి దప్పి మోము లెండఁ జల్లగాలి జాడ మెల్లన యరిగి యూ,సరవిదరిని నింపు బెరసి యుంత.

వాల్మీ. ౧. ౧౦౦. కవిజ. ౩. ౨౧.

ఆం. భా. ౨. ౧౦౦.

**మూఁకలుగట్టు** = గుంపుగూడు.

ద్వి. అనశనవ్రతులఁ బంచాగ్నిమధ్యగులు, వెండ్రై నశాఖనుల్ మూఁకలుగట్టి, సదయాత్ముఁ డగురామచంద్రునిఁ జేరి ...

రం. రా. అర. ౧౪౮. పా. ౨౧. పం.

**మూఁకలుగొను** = సమూహములుగా నుండు.

వ. మూఁగ వేఁగిన కొందలంగఁ బొక్కెంటంగుల బ్రాఁకులు మూఁకలుంగొని ...

పి. శకుం. ౨. ౧౪.

వ. వీరంబు బహుశరీరంబు శక్తివదాద్భుత మూఁకంగొని పేక నిడవి నాఁకం గొనక వీఁక వొక్కెఁడనం గరిపురాధీశ్వరుం దాఁకె పి. శకుం. ౩. ౧౧౩.

**మూఁకవిప్పు.** విణ. (మూఁక + విప్పు) చెదరఁగొట్టునది.

సీ. మొనయు చింతాక్రేణి మూఁకవిప్పు .

మనుచ. ౪. ౧౦౮.

**మూఁకుడు.** వి. దే. (మూఁత + కుడుక.)

౧. కుండమీఁద మూయుట కుపయోగించు మృణ్మయపాత్రము, శరావము

చ. పతి చెప్పిన సంతస మంది దాని నొయ్యన దరిఁ జేరఁ బిల్చి పులియంబలి యించుక వోసె మూఁకుటన్

చెన్న. ౨ ౨౬.

గీ. వాసిఁ దలిరేకుమూఁకుటఁ గేసరాన్న,పుంజ మపుడు బడిమిఁ ద్రిప్పి పోసె నొకతె

చమ. ౧. ౮౧.

గీ. చిలుకవోయిన మూఁకుటిచెలువుఁ దాల్చి, పూర్తి నొకచో విశాఖ వింధ్యాద్రి యుండు .

కాశీ. ౧. ౧౩౭. ఆం. భా. ౨. ౨౪౭.

౨. మూఁత.

గీ. దాది యటు పెట్టి మునుపాడఁ దలఁగి చనుడు, బరణిమూఁకుట నెలకొన్న బన్న సరముఁ,గఱచి కొనిపోయెఁ జిల్క ప్రగల్భవిటుఁడు, బాలి కామానసముఁ గొనుపగిది నపుడు ...

పాండు. ౪. ౨౩౧.

**మూఁగ¹ = మూఁప¹.** విశే. (సం. మూక. త. మూక్క, క. మూగ.) మాటలాడని; మూఁగది.

(ఇది సానుస్వార మని శ. ర. నిరనుస్వార మని, చి. వి.)

సీ. పెక్కుకాలపుమూఁగ కెక్కుడు వాక్ప్రౌఢి. వసు. ౩. ౧౩౪.

ఉ. ఊరక మూఁగలో యనఁగ నుండి రగ స్త్రీ పుల స్త్రీ గాతముల్ . హరిశ్చ. ౧. ౧౩౦.

సీ. మూఁగ నా పెలయు మూర్ఖుఁడు ఆం. భా. ౨. ౧౨౧. దశా. ౧ ౧౦.

జ. మూఁగదయ్యము.

**మూఁగ².** వి. ఒకానొకచెట్టు.

వ. . ఇప్ప కప్పురమద్ది గద్దగోరు గోరంట వెలమ యులిమిరి మూఁగ వేఁగిస మొదలుగఁ బెక్కుతెఱంగుల మ్రాఁకులు పి. శకుం. ౨ ౧౪.

**మూఁగ³.** వి. త. (మూక్కు) ౧. పక్షివిశేషము.

సీ. సామాలకేతఁడు నల్లాస కొప్పెట కాకి యుంబటికోరిగాఁడు మూఁగ . హంస. ౩. ౧౨.

సీ. వంగపండును గోరువంక కొప్పెట పొట్టిపిట్ట పావురము కొక్కెంటి మూఁగ సుద ౩. ౧౯౪.

౨. దోమ. (శ. ర.)

ద్వి. పుతియమూఁగలు పొదపొదవుని మ్రోయ. ద్వి. హరిశ్చ. పూ. ౨౦౬౦. పం.

**మూఁగ⁴ = మూఁప.** వి. ౧. ముష్క.

ద్వి. కనకఘంటలును మూఁగలును గజ్జెలును, దనరుకొమ్ముల కటిస్థలి నలవడఁగ ... (నవనాథ. ౪. ౧౯౨. పా. ౨. పం.)

౨. ఫలహారవిశేషము.

వ. . చిమ్మిలుంటలు నటుకలు మూఁగలు లాజలుఁ జేలాలు ... ద్రాక్షలాది రైన ఫలహారంబులును హంస. ౧. ౧౦౫.

**మూఁగంబాఱు.** అ. క్రి. (మూఁగన్ + పాఱు, స్వార్థమున) మూఁగు.

శా. ఏఁగాదే నదవం జతుర్ముఖునితో నింద్రాది దిక్పాలకుల్, మూఁగంబాఱి భవత్పదాబ్జములకున్ మ్రొక్కంగ లే కున్నచో, నాఁగన్ వచ్చియు నాఁగఁ జాలని ప్రతీహారున్ విదంబించుచున్, దాఁగన్ బోయి తలారివాని యెదురన్ దాఁగంగ నీ కేఁటికిన్. ఉ. హరి. ౪. ౯౨.

**మూఁగఁబడు.** అ. క్రి (మూఁగన్ + పడు స్వార్థమున) చుట్టుకొను.

ఉ. ఆరయెలదేఁటిదాఁటు లోనూనినదప్పి మూఁగఁబడి యున్నతచంచలచంచుకోటిచే నానెడుఁ జూడు మందగరుదంచలఝంకృతు లుల్లసిల్లఁగన్. పారి. ౪. ౫.

**మూఁగతీఁట.** వి. (√మూఁగు) దట్టముగా పెలినతీఁట. (శ. ర.)

**మూఁగదయ్యము.** వి. (మూఁగ¹ + దయ్యము) మూకపిశాచము.

క. గిట్టిగను మూఁగదయ్యము, పట్టినదో కాక చెట్టో బలురాచట్టో యిట్టులు మన మిందఱమును, బట్టుం దిలువఁగ నొకింత చూడక యున్నే. వాల్మీ. ౩. ౧౧౮.

**మూఁగపోఁత.** వి. (√మూఁగు) కుప్పవేత ధాన్యము.

గీ. .. భువన,మేలిధాన్యాభిఖలు మూఁగఁబోఁ
తవంగ, మూఁత యనఁగాను .
ఆం. భా. ౫. ౫౩౮.

**మూఁగికొను.** స. క్రి. (మూఁగు + కొను, స్వార్థమున) చుట్టుకొను, ఆవరించు.

క. ఏఁగి పురద్వారము వి, ట్టాఁగి నిలిచి తన్నుఁ
జూడ నడవిదిరుగుదుర్, మూఁగికొన గినన
మట్టేట్టుగాఁగ లయాంబుదములీల గర్జించు
టయున్ ఉ. రా. ౩. ౫౬౯.

**మూఁగు.** స. క్రి. ఆవరించు, చుట్టుకొను

సీ. గోపాల నవపుష్పగుచ్ఛంబు మూఁగినపరిచారి
కాద్విరేఫములలోనఁ .

గీ. గిలయఁ దోలంబాముశోమలం గలవు
ఉ. హరి ౪ ౧౩౪.

అ. క్రి. ౧ కవియు, ముసురు.

ఉ. ఒక్కటి కోయుగ తికిన్, మూఁగుచు
కళా. ౩ ౧౪.

౨. గుంపుగూడు, సంక్షోభించు.

చ మూర్చలో, మునుఁగఁగఁ జేసి యూర్చి
దివి మూఁగిన వేల్పులు భీతి నొందఁగన్
హరి ఉ. ౧. ౧౫౯.

౩. అతిశయించు

ఉ. పెంత్తితి సర్వదిక్పతుల మూఁగిన గర్వము
విచ్చి పాఱఁగా పెం. రా. సుం. ౪౯.

మ ఉగ్గడువై కోర్కులు మూఁగ వస్తువులపైఁ
గగ్గొనలం దంద్ర యొక్కడుఁ దోఁచెం
గమనీయ దోహ్వద పరిశోభంబునం బొల్తి
కిన్. హరి. ఉ. ౩. ౧౮౦.

క పురుషవర్గంబు బయ,శ్రీలోలత నేతెం
చుట, గేల యువిసి మూఁగినట్లు కెలు కె
బలంబుల్ భార. భీష్మ. ౧. ౧౩౬.

౪. వ్యాపించు.

క. పాలియుం, గినిసి విశిఖంబు లేసిన, పెండపెడె
గగనంబు మెయిలు మూఁగినమాడ్కిన్ ..
ఉ. హరి. ౧. ౧౪౩.

(పెంపడు. ముద్రి, వ్రాఁతప్రతిపా.)

జ. ముక్కఁడి, మూఁక, మూఁకవిష్వ, మూఁగం
బాలు, మూఁగఁబడు, మూఁగటీట,
మూఁగపోఁక, మూఁగికొను.

**మూఁడవకంటివేల్పు.** వి. (మూఁడు + కన్ను + వేల్పు) శివుఁడు.

ఉ. మూఁడవకంటివేల్పుఁ బిమముందరఁ బెట్టుక
నిశ్చలస్థితిన్ కాశీ. ౪. ౯౯.

**మూఁడి.** వి ముద్ది, గుదము.

గీ వేఁగు తగవరి యుండఁగ మూఁడి చూచ్చి,
వాత వెళ్ళిడువాఁడె యెవ్వాఁడు నంచు
కళా ౫. ౪౯.

ద్వి. ఓదక కురులు వి ట్టోడిని రాఁ దిగిచి,
మూఁడితోఁ దాటించి మూతులు నలిమి,
యొగ్గులుఁదప్పులు కెన్ని
ద్వి. హరిశ్చ. ౧౫౦౪. పం.

గీ ముడ్డి మూఁడి యనంగను బోలుచు
గుదము ఆం. భా. ౫. ౧౩౬.

**మూఁడు = మూండు.** స ౦. (త. మూన్ఱు; క. మూఱు; మ. మూన్ను. తు. మూజి. దీనికి ద్వితీయాది విభక్తులందు మూఁటిని, మూఁడిటిని మూఁడింటిని మున్నగురూపము లగును ) రండునొకటి.

గీ. అనుదినంబును గొలువంగ నార్యు మెచ్చి,
మూఁడు వెలలకు వరదుఁడై వేఁడివెలుఁగు
మార్క. ౪. ౧౬౦.

౬౪౭. మూఁడుమోములపోటుమట్టుఁ బట్టెడు కూర, కేడిమూపునఁ దియ్యవిల్లంతుఁ ద్రుంచినధీర!

(సంబోధనవిభక్తి)

త్రిపురాంతకోదాహరణము. ౨౦. పా.

ఉ. మూఁడుగుణంబులన్ వరుస మూర్తులు మూఁడు ధరించి లోకముల్, మూఁడు రచింపఁ బెంప లయముం బొరయింపఁగఁ జాలుదేవుఁ డ,న్వాఁడవు నీవకావె సుర వర్గముఁ బ్రోవఁ బురందరుండవై,నాఁడవు నీవ ధర్మ్ముఁడ వనం బితృవర్గము నేలువాఁడవున్. భా. రా. యు. ౬. ౨౨.

క. మూఁడుంజగంబులలోపల, వాఁడిమగంటిమిఁ గడంగి పడి నాలమునన్, వేడిమితో మార్కొన నెవ్వాఁ డోపును రామవిభుని వాసవ శౌర్యున్

భా గా. ౭౮. ౨౩౯

గీ. ఆయుపాయముల్ మూఁటికి ననువుగాని, యట్టిపగతునిరెడ భేద మాచరింప, వలయు భార. శాం. ౨. ౮౧౬.

సీ. తద్గణము త్రిగుణిత మైన,నాపిని యగు దాని వడి మూఁట గుణియింపఁ బ్రుతన నాఁ బరఁగుఁ దత్ప్రుతన మూఁట

ఆ. గుణిత మైనఁ జము వగున్

భార. ఆది. ౧. ౯౦. చిత్రభా. ౭. ౯౦.

మూఁడవతోలుపల్కు = సామవేదము.

సీ. తులకించుమూఁడవతోలుపల్కుదరిపలి కోవెల మూఁతలకు నొక్కబింత నొసఁగు.

యయా. ౨. ౫౦.

మూఁడుజాలు = మూఁడు యామములు. (చూ. జాలు.)

ఆ. కనిపి మూఁడుజాలతత్తి ద్రాఁకించుక, చల్లవడిన వల్లవల్ల కదలి ...

హరి. పూ. ౬. ౯౯.

మూఁడేమాటలు = సంగ్రహముగా నున్నది, లేక కొంచెమే యనుటను దెలుపును.

క. అన కుశ మిట్లనుఁ గుశకం,బునఁ గథ కొదవ యన నెంత మూఁడే మాటల్,విని పొమ్ము కుశ. ౨. 308.

మూఁడుకన్నులయ్య. వి (మూఁడు + కన్నులు + అయ్య) శివుఁడు, ముక్కంటి.

ఆ మూఁడుకన్నులయ్య ముదముతో నిచ్చిన, ప్రళయకాలభూరి భయదవహ్ని, చటులకీల జాలసంయుక్తి మైపట్టి,పాశుపతముఁ బూని ఫల్గునుండు గరుడా. ౨. ౬.

మూఁడుకన్నులవాఁడు. వి. (మూఁడు + కన్నులు + వాఁడు) శివుఁడు, త్రిలోచనుఁడు.

వ. సుమ్మంతుం దలంతులం బోవువాఁడు కాఁడు, వాఁడితూపులకేఁడిమిఁ జూపక మూఁడు కన్నులవాఁడు వచ్చిన తెచ్చపడండు

పి. శకుం. 3. 3౧.

మూఁడుకన్నులవేల్పు. వి. (మూఁడు + కన్నులు + వేల్పు.) శివుఁడు, త్రినేత్రుఁడు.

గీ. మూఁడు కన్నులవేల్పుతో పోహరించి, నేఁడు దేహంబు లేక యున్నాఁడు దాను . సైష. ౮. ౨౩.

మూఁడుకా(గా)ళ్ల ముసలి. విణ. (మూఁడు+ కాళ్లు + ముసలి) నడవ వోపిక లేనంతటి మిక్కిలిముదుసలి. (చేత నూఁతగ నుండుకఱ్ఱయే మూఁడవకాలు.)

సీ. తల్లి మదేకపుత్త్రిక పెద్ద కన్నులు గాన విప్పఁడు మూఁడుకాళ్లముసలి ..

నైష. ౧. ౧౦౯.

(కన్నులుగానడు అని వావిళ్లప్రతిపా.)

మ. వరుసన్ మారసు మూఁడుగాళ్లముసలిన్ వర్జించి కేళోద్ధురం, ధరమిత్త్రి(ప్రియపుత్త్రి) పుణ్యోజ్జ్వలన్ వర్జించి రత్నాకర, స్ఫురదావాస మహాబలార్ణవరవిస్ఫూర్తుల్ విసర్జించి.
చంద్రా. ౩. ౧౩౦.

మూఁడు2. అ. క్రి. ౧. (చేటు మొ.) సంభవించు, కలుగు.

గీ. ఓలతాతన్వి శివయోగి యొకఁడు లేఁడు, లేఁడు వెంగసాల నిది యేమి మూఁడె నాకొక్కొ! హర ౨. ౩౯

ద్వి ధనమును భార్యయుఁ దనయు లనంగఁ, దనరినయేషణాత్రయమును మూఁడి, వదలక బహుమోహవార్ధిలోఁ జిక్కి
ద్వి. శ. సా. ౩. ౧౧౬. పా. ౧౩. పం

క. నాఁ డర్ధరాత్రి పూతన, పోఁడిమి చెడ మెన్న బండి పారలఁగఁ బడిరొయన్, నేఁ డిది యీమద్దులకును, మూఁడెను నిష్కారణంబు మూలాగ్రముగన్. వి. పు. ౩. ౧౪౪.

(కీడు అని అధ్యాహారము)

గీ. అట్టిజెట్టికిఁ బోరఁ జా పెట్టిభంగి, నయ్యెఁ దేరికి నూఁకున కంచితాస్త్రములకు దైవోపహతిఁ జేటు మూఁడెనొక్కొ!
భార. కర్ణ. ౧. ౪౨.

క. విదురుఁడుఁ దండ్రియుఁ దనకుం, బదివేల విధములఁ జెప్పఁ జాటింపఁడు దుర్మదమునఁ దగిరొయిదుంబుద్ధులం,విధి మూఁడినమర్త్యుఁ డేల వినుహితోక్తుల్ భార. స్త్రీ. ౨. ౪౦.

ఉ. కోదలం క్రౌంకృనన్ మదిని గుందుచు నక్కున నక్కఁ జేర్చి నిన్, వేడుక నిచ్చనవ్వ రఘువీరుఁడు రాముఁడు వార్ధి మేరగా, నీడికకీర్తితోఁ బుడమి యేలెడు వంచుఁ దలంచెఁ గైకచే, మూఁడఁగ మన్నదీని మునుముట్ట భవజ్జనకుం డొయింగునే.
భా. రా. అయో. ౯౧.

(ఇట ప్రాపసాంకర్యము కన్పట్టుచున్నది.)

౨. మునిగియు.

ఉ. అంతటఁ గాలియాహివిభుఁడు ... సంతత కాలకూటనిభ చండవిషోల్బణ ఫూత్కృతుల్ జగం,బంతయు మూఁడఁజేయఁగ రయంబున వచ్చె వి. పు. ౩. ౨౬౬.

జ మూఁడ్చు.

మూఁడ్చు(డుచు). స. క్రి. (√మూఁడు2.) (చేటు మొ.) కలిగించు, సంభవింపఁజేయు.

గీ తాన యుత్పాతములు మూఁడ్చుఁ దరతరంబ కాశీ ౬. ౫౯.

మూఁత. వి. (√మాయు.) ౧. మూయుట.

గీ. అటుల నడిగిన ప్రియభర్త యంబకములు, మూఁత చేలించి యామించుముద్దగుమ్మ, సిగ్గు కడ్డంబుగాఁ బలిచేల మలమి, కొనుచుఁ బలికెను జిన్నెలు కొసరుచూప
హంస. ౨. ౭౩.

౨. మూయుటకు తగినమూఁకుడు లోనగునది.
(శ. ర.)

౩ అడ్డము, వ్యవధానము.

గీ. అడ్డి యడ్డము మాయి క ప్పడ్డపాటు, మఱుఁగు చాటోల మొలిమి మాటు మూఁత, యనఁగ వ్యవధాన మా .
అం. భా. ౧. ౮౯.

మూఁతపొడుపు. వి. (మూఁత + పొడుపు) బాలక్రీడావిశేషము.

సీ. దాయాలు సొగటాలు దాఁగ్రాయి చదరంగమును కోడురాళ్లును మూఁతపొడుపు .
హంస. ౩. ౧౪౬.

మూఁతబల్ల. వి. (మూఁత + బల్ల) వాచాయపెట్టె. (శ. ర.)

మూఁపు. వి. (త. మారి. క. మ. తు. మురి.) భుజశిరస్సు.

సీ. ... చండభానుని కధిష్ఠానమగుట, భారంబు
భరియింప బరువు పద్దదివో శ మూఁపుమూఁ
పునమండి వెంక్కలమున, నినిలంబు లేదున
నంచెలంచెలు గట్టి యాకాశవీథి నందంద
నడవ .

గీ. నడచు రవితేరు . కాశీ. ౧. ౧౩౭.

సీ. అనుకువేళ్లను గంధమును నాభినుండి మూఁపుల
దాఁక బంగారు పూఁతఁ బూసి
వైజ. ౪. ౬౩.

గీ. కొప్పరము మూఁ పటంచన నొప్పు
నంసము .
ఆం. భా. ౭. ౧౩౩. విక్ర. ౮. ౧౮.

**మూఁపులు మూఁడగు** = ఒడ లుప్పొంగు, ఉత్సాహ మధిక మగు.

ఉ. ఆపురమర్దనం డయిన నాతని నడ్డము దాఁకి
నిల్వఁగా, నోపఁడు మత్స్యయంత్రము
మహోద్ధతి చేసి స్వయంవరంబునన్,
ద్రౌపదిఁ గైకొనం జెనకు రాజకుమారులపా
టెఱుంగమే, మూఁపులు మూఁ డగున్ రిపు
చమూపులఁ గన్నపుడే కిరీటికిన్.
విజ. వి. ౩. ౧౬౯.

ద్వి. మనమున నిటువంటి మనుమండు గలిగె, నని
సంతసించి మీయవ్వ తాతయును, బొదలుచు
వచ్చి మూఁపుడు మూఁడు గాఁగ, నది
వీర్పదరు మాట లాడరే తండ్రి!
ద్వి. పరమ. ౩. ౧౫౩. పా.

క. అని మూఁపులు మూఁడై లావుల రథకారు
నకు సంబళముఁ గంబళి మిచ్చి నిలిచి కుమా
రార్తి గడల్యాన నప్పుడ నిలిచి పేరుకొని
పతి కనిరంత్. రం. పంచ. ౩. ౭౭౭.

**మూఁపురము.** వి. (త. మూపు. క. మ. తు. మురి.) మూఁపురము, కకుద్మము.

61

వ. .. మేరుతటీ మీఁద నెక్కి లేఁ జొక్కి ఱెక్కలు
మూఁపురంబు గదిచి కదిచి రాచి పద
వైపక దోడిరాయు రెండుమూఁడు మెట్ల
ముందఱ సందంద కాళ్లఁ బెనంగుచు ...
మనుచ. ౪. ౩౭.

గీ. దరులతడిపండు పొదవు మూఁపురము లంటు,
కొల్లగంటల నాఁబోతు లుల్లసిల్ల . .
అము. ౪. ౧౫౬.

సీ. మూఁపుర మంచన నూఁపుర మంచవఁ గకు
దభిధాన మై క్రాలుచుండు
ఆం. భా. ౭. ౭౬౭.

**మూకము.** సం. వి. అ. పుం. మత్స్యము, చేప.

**మూకాంబ.** సం. వి. ఆ. స్త్రీ. దుర్గాదేవి యవతార భేదము.

**మూకీభవించు.** సం. అ. క్రి. మూకత్వము నొందు, మూఁగవై యుండు.

వ. శరీరసహస్రంబు వెడవెడం బడిన వీర
శంఖపణవ దుందుభికాంస్య కాహళాదు
లును సమానవ్యసనంబు లయి మూకీభవించి
నన నడంగి యుండె .. హరి. ఉ. ౭. ౫౪.

**మూఁకుడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧ మూఁగవాఁడు. ౨. దీనుఁడు, కనికరింపఁ దగిన వాఁడు, చెడ్డస్థితిలో నున్నవాఁడు.
పుం. ఒకానొక రాక్షసుఁడు.

**మూగురు = మువ్వురు.** స. ముగ్గురు. (మూఁడు నకు మహన్మహత్వార్థక రూపము.

**మూగేలు.** వి. గంధమూషిక, చుంచు. (శ. ర.)

**మూచూచు.** స. క్రి. (మూర్కొను + చూచు, మూతి + చూచు. శ. ర.) మూర్కొను, ఆఘ్రాణించు.

క. నిను కెందరు చూచినమాచూ, చినతోజ్యము
నింద్యము ... భార. అను. ౪. ౧౦౯.

**మాటు.** వి. (త. మాట్టై, క. మాటె. మ. మాత.) వరకులు పోగుచేసి కట్టినముడియ.

సీ. .. ద్రవణంబుమాట వారలకు నిచ్చి .
హర. ౧. ౨౦.

సీ. ... వన్నెలగని చౌకారపు మానికముల
మాటు ... నీలా. ౨. ౨౩.

జ. మాటకట్టు.

**మాటకట్టు.** వి (మాట + కట్టు) మాట కట్టుట.

సీ. శరభంబు పైనను వరభసంబునఁ గిట్టి మాట
కట్టుగఁ గట్టు మెుక్కలములు
విక్ర ౧ ౪౪.

(మాటకట్టుగన్ = మాటకట్టినట్లు గట్టిగా)

క వెఱవక నీగుడిలోపల, గుఱుకొని యాలాపు
పెట్టుకొని యుండెడిపా, దతిజమునూతలు
గుక్కలఁ, గఱపింతురు మాటకట్టు గట్టి
మహేశా ? శివ. పా ౭౦౯.

**మాటము = ముటము.** (శ. ర)

**మాడమంచు.** వి. హిమాని, దట్ట మగుమంచు, లోకమును మాఢముగా చేయుమంచు.

గీ. అర్జునుఁడు గవియించిన యంపమాడ, మంచు
దశిమఁగఁ గప్పిన మార్గకాంతు, జాలముల
వెస విరియించె కాంతనవప, తంగుఁ
దుద్యోతమాన ప్రతాపలీల.
భార. విరా. ౫. ౧౭౯.

(అంపమాడుమంచు. భా. ఱ. వ్యా. పా.)

క. ... అంబర సెల్లఁ గప్పి పేసవిఁ,
బరలగుం బెనుమాడమంచు పారవమ్మున్యా !
భార. శా. ౪.

**మాఢగర్భము.** సకి. వి. అ. పుం. విరుద్ధగతి మైన గర్భము.

శ్లో. పర్యావయుక సంభ్రాన్ణో, మసోబుద్ధ్యాది
పంయుతః విగుణాపావనం మాఢో, మాఢ
గర్భోభిధీయతే
(సంస్కృత వ్యాఖ్యానము.)

**మాఢము.** సం. వి. అ. పుం. ఐ. (సాంఖ్య) పంచభూతములు.

విశ. ౧. మూర్ఛపడినది; పొమ్మనిలిచి. ౨.
తెలివిలేనిది; మందబుద్ధి. ౩. (జ్యోతి)
సూర్యునకు సమీపించినది, అస్తమించినది.
(గ్రహము.)

**మాఢసత్త్వము.** సం. విశ. (అ ఆ. అ.) వెఱ్ఱి యెత్తినవాఁడు, మతి లేనివాఁడు

**మాలతము.** సం. విశ (అ. అ. అ) కట్టఁబడి నది, బద్ధమైనది.

**మాఱి.** వి. (క మాఱి. త. మాఱంజి. మ. మాచ్చి)

౧. పై పెదవియు క్రింది పెదవియును; మాఱి
పలెమండు అగ్రభాగము.

సీ. అగు వా వాయి నో ద్యూతి వా
వస్త్రంబు ఆం. భా. ౨. ౧౪౨.

గీ. ద్రుపదనందన పరిభవదుఃఖమునకు నల్లమున
దురపిల్లుచు నున్నసరిసె, వేఁడినిట్టూరుపో
యన పెదలెఁ గ్రొత్తకాని మాఱులు మిచ్చు
సెత్తమ్మివిరుల. భార. విరా. ౨. ౨౩౭.

గీ. నవ్వున ట్లల్ల విచ్చెఁ, గలయ మాఱులు
కేకేకగనతతులు . అను. ౪. ౯౪.

౨. మోసముసు గడ్డమును, శ్మశ్రువు.

క. అలరుమ్మీ దుష్మవనుఁడు, తలయును మాఱి
యును గొర్గి తను విడుచుటకున్, విల
పించుచు ... భోజుకా. ౪. ౧౪౫.

క. తలయును మూతియు గొఱుగుట, తలఁ దఱు
గుటకంటెఁ దుష్కరము మహాత్మా ..
భాగ. ౧౦. పూ. ౧౪౪౦.

జ. మూతిముట్టు.

**మూతిముట్టు.** స. క్రి. (మూతి + ముట్టు) ౧. మూతితో ముట్టు, వాసనచూచు.

సీ. పెంకరితుమ్మెద మూతిముట్ట కోడిపేఁడి
నిశ్వాసపవనంబు నివ్వటిలఁగ
శివరా. ౨. ౧౦౪.

సీ. కోమలినిట్టూర్పుక్రొవ్వేఁడి సెత్తావి పెంకరి
తేంట్లును మూతిముట్ట వెఱచె
నైష. ౨. ౧౦౩.

౨ తిను, భక్షించు.

సీ పెంకరితేఁటులుం మూతిముట్టవు తేనియల్
క్రిమధుశాసి కల్పించి కాని
ఘటికా ౧. ౪౮.

సీ. ప్రాణరక్షార్థంబు పర్ణాంబువులు గాని మూతి
ముట్టదు కందమూలఫలము
పి. శకుం. ౮. ౧౨౧.

**మూత్రకృచ్ఛ్రము.** సం. వి. అ. న. నీరుకట్టు, మూత్రము పడునప్పుడు నొప్పి గలుగు రోగ విశేషము.

**మూత్రగ్రంథి.** సం. వి. ఇ. పుం. మూత్రాశయము మీఁద గట్టిపడుట.

**మూత్రపుటము.** సం. వి. అ. న. పొత్తికడుపు, వస్తి.

**మూత్రము.** సం. వి. అ. న. ప్రస్రావము, ఉచ్చ.

**మూత్రవర్ధకము.** సం. విశే. (అర్థిశా. అ.) మూత్రవృద్ధి చేయునది.

**మూత్ర శుక్రము.** సం. వి. అ. న. మూత్రముతో శుక్రము పడిపోవునట్టి రోగము.

**మూత్రాశయము.** సం. వి. అ. పుం. వస్తి, పొత్తికడుపు, మూత్రస్థానము.

**మూత్రించు.** సం. అ. క్రి. మూత్రమువిడుచు, నీరువిడుచు.

గీ. ఇతఁడు కలఁ ద్రాగ ఱంకాలె రొంఙి
దివిరి, నిలిచి మూత్రించెఁ జండాలలఱఁ
గూడ శివరా. ౪. ౫౮.

**మూదల.** విశే. (క. మూదలి. మూల + తల. శ. ర.) ౧ ప్రమాణము, నిర్ణాయకము.

క. వేదములకు నిఖిలస్మృతివాదములకు బహు
పురాణవర్గంబులకున్,వా దైనచోటులను
దా, మూదల ధర్మార్థ కామమోక్షస్థితికిన్
భార. విరా. ౧. ౮

౨. సంబంధించినది.

ఆ. విశ్వరూపువలన నైశ్వర్యకర మైన, యిట్టి
విద్యఁ దాల్చి యింద్రుఁ డపుడు, మూఁడు
లోకములకు మూద లైనట్టిశ్రీ, ననుభవించి
మించె నధికమహిమ. భాగ. ౬. ౩౧౩.

జ. మూదలించు, మూదలిక.

**మూదలించు.** స. క్రి. (√మూదల. ఉ. మూదలి. క. మూదలిసు) ౧. తాఁకు, స్పృశించు.

ఉ. చూచె వనీవిభూతి యెద సొచ్చిన నిద్దుర
కన్ను మూయను,స్నేచె మెఱుంగు శిల్లెదల
నిండఁ దళుక్కనఁ దోఁచి మాయమై,
తోఁచె సభీనకాశరుచిఁ దొయ్యలి యమ్మని
మూదలింపఁగా,మాచె సమీపవుం గదలి
మోహనగర్భము మెచ్చ నచ్చరల్.
కళా. ౩. ౫౬.

౨. తాఁకు కవియు.

వ. ఇట్లు దారుణమహాఘోరయుద్ధంబు సేయు
చున్న త్రిలోకనరేంద్రు నిశ్శ్వాకునరేంద్రుండు
గని కోపించి వాని కరచరణశిరంబు లొక్క

పెట్టఁ దగ నేసి మేఱువాడి జంఘానుకేం
ద్రుం గిట్టి ముట్టి మూదలించిన నతనికవిదల
కళ్ళుగింపక గూండ్రించి .

కు. సం. ౧౨ ౭౪౫.

౩. ఎచ్చరించు.

ఉ. పాండునృపాగ్రనందనుఁడుఁ బావనియుం
గవలుం జలంబుమైఁ గొండొరు మూదలించు
కొని రొమ్ముకట్టఁ దాఁకినఁ దీవ్రవిస్ఫురి,
త్కాండవిదారితాంగకులఁగా నొనరించి

భార. కర్ణ. ౨ ౧౯.

౪. స్మరింపఁజేయు.

ఉ. మును సుయోధనుచందముఁ జూపి
యప్పుడే,మంటి యుపేంద్ర నన్ను రణాగ్ర
మునన్ నిను మూదలించెదన్

భార ఉద్యో ౩ ౫౯

౫ ఎత్తిపొడుచు, ముదలించు.

ఉ. పన్నినివాఁడ వింకఁ జెడి పాఱకుమీ యని
మూదలించి చేఁ,మున్ననిశాతబాణము మహో
ద్ధతిమై నరిఁ జోసి యేసినన్,గన్నుల
నోరసెత్తు రొలుకంగ శతాంగముమీఁద
వ్రాలె ఉ. హరి. ౩ ౫౨.

ఉ. పాడియు సత్యముం గలుగుపాండవకోటికి
నీవు దొల్లి యొ,ప్పాడిమెయిన్ సభం గరము
భంగ మొనర్చితి నాఁటియుండఱుం,జూడఁగ
నేఁడు తత్ఫలము మూపెద నీ కని మూద
లించి మై, నాడఁగ నేసెఁ .

భార. భీష్మ. ౩. ౧౧౩.

గీ. నిన్నుఁ గన్నుష్ట చక్రాగ్ని నీఱుసేయ,వచ్చు
మూదలించుట కింత వలసెఁ జేయ

హరి. ఉ. ౬. ౨౧౩.

౫. పుట్టించు.

సీ. . కావున నయంబు ..

గీ. కప్పు కందంగ నే జేసి తప్పుటొంఱు, మత్స
రాహంకృతులను గామమునఁ గ్రోధ,మోహ
ములఁ బ్రత్యవాయంబు మూదలించు,తప్పు
లేకయు శిక్షింపఁ దగవు గాదు.

కాశీ. ౫. ౩౧౯.

మూదలిక. వి. (√మూదల) తార్కాణము. (శ. ర.)

మూన[1]. వి. ౧. తుషసమేత ధాన్యము.

సీ. ... తుషసమేతధాన్యాభిధలు మూఁగపో
తనంగ,మూన యనఁగాను . .

ఆం. భా. ౨. ౨౩౭.

౨. నాఁటెడు వరిమొక్క.

(వ్యవ.) ఈయేఁడు ఆచేనిలో ఒక్కమూనకూడ
పెట్టలేదు

మూనదిరుగు = నాఁటినవరిమొక్క వేళ్లుపాఱు, నాఁటుకొను

(వ్యవ.) ఈచే నప్పుడే మూన దిరిగినది.

మూన[2]. వి. వస్త్రగాలితముచేయఁగా రాలక నిలిచినది. (శ. ర.)

మూను. స. క్రి. వస్త్రగాలితము చేయు. (శ. ర.)

మూనాళ్ళ(నా)ళ్లు. వి బ. (మూఁడు + నాళ్లు)
మూఁడు దినములు.

గీ. చెంగు మాపినమూన్నాళ్లు పిగ్గులోఁ,బఱవి
లోకనమార్గంబుఁ బరిహరించి . .

కాశీ. ౨. ౬౨.

క. శిరము దగఁ గోసి నీపద,సరసిజములఁ
మూన్చి నీప్రసాదంబున శం,కర మూన్నా
ళ్లిటుఁ గరుణా,కర గోవిందుండు వడసె ...

శివ. పా. ౪౦౩.

గీ. అని వసిష్ఠుండు మఱియు నిట్లనిరి నట్లు,
దానవునిఁ గూల్చికొని రఘూద్వహుఁ

దతండు, దెలుత మూనాళ్లు బార్థిఁ
బ్రార్థించి పిదప, నలువు గుందించి బ్రెంక్కిన
నథయు మెసఁగె. సమీర. ౩. ౧౪౩.

సీ. పెనలలో మూనాళ్ల పెన్న లుండఁగ వాఁడు
కాఁచి డించినవెయ్యిఁ గరఁగఁబెట్టు.
శుక. ౨. ౫౬౧.

**మాన్నెలలు.** వి. బ. (మూఁడు + నెలలు.) మూఁడునెలలు.

క. వినుతగుణ హవిష్యాన్నం,బున నొకనెల
మత్స్యమాంసమున రెండునెలల్, విను లేడి
మాంసమునఁ బిత,లొనరఁగ మాన్నెలలు
దృప్తి నొందుదురు గడుస్.
మార్క. ౩. ౧౯౯.

క. తెగ దిప్పుడు మాన్నెలలకుఁ దగ వడుగఁగ
రండు దీర్చెదను జై. భా ౭ ౨౦౯.

(ఈ క్రింది ప్రయోగమున మాన్నెల్లు అని కలదు
సాధుత్వము చింత్యము.)

ఆ. మొదటిమాసమందుఁ బదనుగా బుద్బుద,
భాతి నుండు నాల్గుపక్షములకుఁ, బిండరూప
మగుచుఁ బెంపొంది మాన్నెల్ల, కవయవ
ములు పుట్టు వనఘచరిత.
సానందో. ౪. ౫౭.

**మాయి.** వి. (√మాయు) కప్పు, మూఁత.

గీ. అడ్డి యడ్డము మాయి క ష్పడ్డపాము ..
మాటు మూఁతయనఁగ వ్యవధాన మా
ఆం. భా. ౧. ౭౬.

**మాయించు.** స. క్రి. (√మాయు.) మాయఁ జేయు.

క. అనుమంజా పదల నడిచిన, వసుధేశ్వరుఁ
డాసాధుపాదముఁ బెంచెన్, దన పాటఁగిన
వరములకా, మునగవ లని శైక కోరు
మాయించెఁ బతిన్. దం. రా. ౪. ౫౬.

**మాయు.** స. క్రి. (త. మూడు. మాయు. క. ముచ్చు.) ౧. కప్పు, ఆచ్ఛాదించు.

సీ. నమబట్టతలలపైఁ గనకంపుఁ బెంగులఁ
బట్టుఁజీరలు మాయఁ బట్టినారు ..
హైమ. ౭. ౬౩.

ఉ. .. మటుమాయల నీలికాన వా,మూపిన
ముత్తైపె మెలఁగు ముద్దుఁగుమారునిమీఁద
నెట్టుగాఁ, జేవితి వింతమచ్చరము చెల్లినచో
మతి యాఁడుదానికిన్. సారంగ. ౩. ౫౩.

క. మతి రైదువేలరోఁదులు,దెలిదినకను మాయు
కినునిదెసఁ జూచుచు స్నేహము మార్గ్వాభా
హుఁడై మతిఁ,దలువక క్రుతి నొడివి
కొనుచుఁ దప మొనరించెన్ . .
ఉ. రా. ౨. ౧౬౪.

(కనుమాయుక = కప్పువేయుక.)

౨. మూఁతపెట్టు.

గీ. ఇలఁ జెరవ మాయ మూఁకుడు గలదు
కాక, కోరు మాయంగ మూఁకు డొందులను
గలదె సారంగ. ౨. ౨౪౯.

క. అనఁ జెవులు మూసికొనుచుం,దనమదిలో
నలిగి కచుఁడు తలిరుంబోఁడీ, వినఁ దగని
పలుకు పలుకం,బను నే తలపోయ నిట్లు
చాలుమదుగుమీ. యయా. ౩. ౧౫౪.

అ. క్రి. ౧. ముకుళించు, ముడుగుడు.

ద్వి. కలువలు మాయు నక్షత్రములు మాయు,
జలజముల్ వికసింప ... పెటేదూర్పు
గొండపై నిలిచెనాదిత్యుఁడు ...
ద్వి. మారిచ్చు. పూ. ౫౫౧. పం.

౨. మూఁతపడు.

క. వినవయ్య కర్ణగర్వం,బని వాతఁ దశేద్యక
వచుఁ దగుటయు విలుస్సేద్యును వతనిబాహు

విక్రమ్యముకు దలఁచినవాఁడు గన్ను
మూయుడు వాకిస్ ...
భార. అర. ౧. ౨౫౦.

(కన్నుమూయుట = నిద్రరాదని భా.)
తలుపుమూయు = తలుపు దగ్గఱగావేయు,
బంధించు.

గీ. శాస్త్రపాఠక్రమానంతజాడ్యుఁ డైన,ధవుని
గని యున్న రంచును దలఁపు మూసి,గుబ్బ
కవమీఁదిపయ్యెదకొంగు పఱచి,సేలఁ బవ
ళించు మగువ కన్నీరు దొరఁగ
శుక. 3. ౪౯3.

జ. మూఁకుడు, మూఁత, మూఁతపాడువు,
మూఁతబల్ల, మూయు, మూయించు, మూసి
కొను, మూసినమురికి.

మూర. వి. (త. ముళమ్, క. మొళ మ. తు.
ముళమ్.) హస్తప్రమాణము, రెండుచేనలకొలఁది.

వ. మూర కొక్కండును జేన కొక్కండు
నుగాఁ గుట్టినడొల్లుటుల్లారు ఉల్లవిల్లఁ
బల్లించినపల్లంబులపై . ఆము. ౪. 3౫.

మ. ఇరువై నాలుగుమూళ్ల మేర యని గో పెక్కం
పఁగా సేల .. కాశీ. ౧. ౫3.

సీ. . మూర నా హస్త మొప్పను .
ఆం. భా. ౨. ౧౪౧.

జ. మూరకోక, మూరకోల.

మూరకోక. వి. (మూర + కోక) బారచీఁవు
(చి. ని., శ. ర.)

మూరకోల. (మూర + కోల) గజపుగోల వి.
గజముబద్ద (శ. ర. మూరకొలతకోల చి. ని.)

మూరటిల్లు. అ. క్రి. క్రాయు.

సీ. రాజులు గొల్వ భద్రగజాధిరూఢుఁడై భేరీ
మృదంగముల్ మూరటిల్లఁ .
శ్రీరం. మా. ౧౦. ౧౧౪.

(ప్రయోగాంతరము కనఁబడలేదు.)

మూరి. వి. (√మూరు.) ౧. చిత్తవిభ్రమము,
మోహము.

చ. అనుపమదివ్యమూర్తి . నుకుమారి తన్ను
విటవర్గము నల్గడ వచ్చి ప్రీతితోఁ, గనుఁ
గొని మూరిఁ జూడ నెడ గానక నూకెలం
వాఱుచుండె మోహినియను బోఁక నొక్క
శరదిందునిభానన విల్చి ముంగిటన్.
కు. సం. ౧. ౧౨౪.

౨. అతిశయము. (చూ. మూరిఁబోవు)

మూరిఁబుచ్చు. స. క్రి (√మూరిబోవు) ౧.
వర్ధిల్లఁజేయు.

పీ వెన్నుఁడు సొంపు రెట్టింపఁ గ్రమ్మఱఁ
బట్టి రొమ్ముఁదఁ .

గీ. దమక మినుమడిగాఁ గొను దక్కఁ దొడిగి,
బిగువుఁ గౌఁగిటఁ గదియంగఁదిగిచి తివుట,
మోవి గదియంగఁ గోర్కులు మూరిఁబుచ్చు,
కలిమి యాబిదచూడ్కులు గాచుఁగాత.
ద్వా. ౪. ౨౧౯.

౨. సంతోషపెట్టు.

సీ. మధురార్థదండకమంజరీ మంజూతబుధుల నిం
పుల మూరిఁబుచ్చదేని ...
కావ్యా. ౪. ౪౪.

మూరిఁబోవు. అ. క్రి. (మూరి + పోవు.) ౧.
అతిశయించు.

గీ. లీల మూరిఁబో నచ్చరలేమపిండు, బలసి
యభివందనము సేయఁ బొలిచె ...
భార. శాం. 3. 33౭.

శా. దేవో త్తంసుఁడు భక్తవత్సలుఁడు చిత్తేశస్వ
భావుండు గౌరీవామాంగుఁడు శంకరుండు
దయ మూరింబోవఁ గంగేలువస్, జూడ
న్వచ్చినపుద్యఁ బట్టి తగునీసఖ్యత్రిక్

మెలఁకువకాఁడు. విశే. (√ మెలఁకువ) జాగరూకత కలవాఁడు.

సీ. జాగరూకాభిధాన, మలరు మెలఁకువకాఁ డన . ఆం భా. ౩. ౧౧.

మెలఁకువపడు. అ. క్రి. (మెలఁకువ + పడు) జాగరూకత వహించు, దూరదృష్టి కలిగియుండు.

(వ్యవ) మా రాపవిలో మొంచే మెలఁకువ పడితిరి కనుక నెఱవేఱినది.

మెలఁగాడు. అ క్రి. (మెలఁగు + ఆడు స్వార్థమున) సంచరించు.

ద్వి. వెలుఁగొందు నవరత్న విమల శృంగముల, మెలఁగాడు కస్తూరి మృగములగముల నవ ౪. ౨౦౬. పా. ౧౩. పం.

మెలఁగించు. స క్రి. (√ మెలఁగు) ౧. వర్తింపఁ జేయు, నడపు.

క. . వీరిన్, పరిఁ దనకొడుకుల మెలఁపిన, తెరువున మెలఁగింప వలదె ధృతరాష్ట్ర నకున్ భార ఉద్యో. ౧. ౩౪౬.

ద్వి. కారణభూత పై కర్మజాలముల, మేరల సకలంబు మెలఁగించువాఁడు రం. రా. ఉ. ౭౯. ౨౨. పం.

క. సంగడి లోకము లన్నియు, మ్రింగుచుఁ గ్రక్కుచును బయల మెలఁగించుచు ను, ప్పొంగెడు వేడుకకాఁ డటు, మ్రింగుడువడె బకునిచేత మాఁ దెలిఁగి నృపా. భాగ. ౧౦ పూ. ౪౪౬.

౨. త్రిప్పు, తిరుగఁజేయు.

క. నీ,కోమలిక మెఱుఁగుటకునై, రాముఁడు మెలఁగించి చూచె రమణీ నిన్నున్ . భా. రా. అర. ౧. ౧౪౭.

మెలఁగు = మెలవు. అ క్రి. ౧. ప్రవర్తించు, నడచుకొను ; అనుకూల్యముతోఁ బ్రవర్తించు.

క. అరయ నెన్నండైనను, మీరలు నా కొఱ్ఱగాఁగ మెలఁగుట లే దో,పౌరవరులార ... భార. ఆశ్ర. ౧. ౯౪.

క. పతికనుసన్నల మెలఁగుము . విక్ర. ౪. ౧౯౭.

క. ఇల్లాలు మెలఁగకున్నను, గుల్లా సౌఖ్యంబు పతికిఁ గొండంతైనన్, ఇల్లాలు మెలఁగు చున్నను, గొల్లా సౌఖ్యంబు పతికి గోరంతయునన్. శేమ. ౧. ౧౩౯.

౨. వర్తించు, ఉండు.

చ. కలిమికి నొప్పు గాఁగ బలగం బయి నీకడ నాతనూభవుల్, మెలఁగఁగఁ జూడఁ గానన యమేయభుజాబలశాలి విక్రమో,జ్జ్వలుఁడు సుభద్రపట్టియును వమ్మయి పోయెను భార. సౌ. ౨. ౨౯.

గీ మీనరాశిని సూర్యుండు మెలఁగుచుండ .. భీమ. ౭. ౩౭.

క. మెలఁగుదురు గాక కడుఁబ్రునఁ, గలకాలము జాతరాగ్నిఁ గమలి బలీంద్రా . దశా. ౨. ౩౭౫. ఇందు. ౩. ౪౨.

౩. సంచరించు, తిరుగు.

సీ. మిట్టుఁ బల్లంబు నై మెలఁగంగఁ దశరథ ప్రముఖ వాహనములఁ బఱప నవువు, గాకున్న మేదినిఁ గడుసమస్థలిఁ గాఁగ వెర వున నొనరించి భార. ద్రో. ౨. ౨౧౧.

ఆ. కుడిచినపుడు నిద్ర గూరినయప్పుడు, మేలుకొనినయపుడు మెలఁగినప్పుడు, విష్ణుకీర్తనంబు విష్ణుచింతయుఁ గాని, పలుకఁ డొండు బుద్ధిఁ దలఁపఁ డొండు. నృసిం. ౩. ౧౫౦.

క. మెలఁగక మృగములు విహగము, లలియక లేఁబోఱలఁ జిగుళ్లు లొత్తక .. వెల

పుల, నలవడి వన మమరెఁ జిత్రితాటవిలో
లన్. కు. సం. ౫. ౪౭౭.

౪. (పాట్టతో మెల్లమెల్లన) జరగు, ప్రాకు.

సీ. పాలుపారఁగా బోరగిలి పాన్పునాల్గు మూల
లకును వచ్చును మెలఁగి మెలఁగి ..
హరి. పూ. ౫ ౧౯౦.

౫. ప్రసరించు, వ్యాపించు.

సీ. పతిదిలోకనములు పదఁతుకి మైఁదీవఁ గల
యఁగాఁ బలుమఱు మెలఁగుచుండు .
భార విరా ౫ ౩౯౫.

౬. ప్రవహించు, పాఱు.

క. గుఱ్ఱముఁ గొనిపో బుద్ధుల, కుఱ్ఱఁడ మీతాత
యొద్దకున్ నీతండ్రులె, వెఱ్ఱులు నీ కైరద
యీ,మిఱ్ఱున గంగాజలంబు మెలఁగ శుభ
మగున్. భాగ. ౯. ౨౧౫.

౭. వీఁచు

క. తలిరులకుదఁ జినుకులు జల,జల వడియఁగఁ
దడిసి మెలఁగు చలికరువలిమ, న్పొలపమున
విరియు పరువపుఁ, దొలుమొగదలవలపుఁ
దెలుపు తోఁటలలోనన్. పారి. ౫ ౧౦౩

సీ కమనీయ తపనీయ కదళికాపవనంబు కద
ళికా పవనంబుఁ గలసి మెలఁగి
వసు. ౧ ౧౪౯.

౮. మెలఁకువ, మెలఁకువకాఁడు, మెలఁకువ
పడు, మెలఁగాడు, మెలఁగించు, మెలపు,
మెలన.

**మెలఁత.** వి (√ మెలయు) స్త్రీ, ఆఁడుది.

సీ. ఎలమి నమ్మెలఁత న న్నెలయింపఁ దివిరిన
చెదద యానందంబునిక్క గాదె .
భార. విరా. ౨. ౭౭.

గీ. అలక తిమిరాళిదృశ్య ఫాలార్ధచంద్ర, మెలఁత
యిది కృష్ణపక్షాష్టమీరాత్రియామ.
వైజ. ౩. ౧౭౦.

ఉ. ఆపురిమించుటోవరుల వాడు మెలంతలగాన
మాధురిన్, ప్రాపితజీవ లయ్యును దదగ్రమణి
ప్రతిమల్ ..
హ. స. ౧. ౭. సుసుచ. ౭. ౭౭.

సీ. . మెలఁతుక చెలఁది మెలఁత .
గీ ముద్దుగుమ్మ యన స్త్రీసమాఖ్యలు .
ఆం భా. ౨ ౧౦౪.

**మెలఁతుక.** వి (మెలఁత + ఉక స్వార్థమున)
ఆఁడుది, స్త్రీ.

చ మెలఁతుక లప్పురిన్ నిడుద మేడలఁ గ్రీడలు
సల్పుచుండి మిం,చులు జళిపించుకన్నవల
సోరణగండ్లను జూడ నీ దగున్
పి. శకుం. ౧. ౩౩.

గీ. మెలఁతుకలమిన్న విద్దంపుమేల్బసిండి, గలుగ
కుండిన నిప్పచ్చరంబు, విడుచు కొటులు
నీలా. ౨. ౩౭.

సీ మెలఁతుక చెలఁది మెలఁత
గీ. ముద్దుగుమ్మయన స్త్రీసమాఖ్యలు .
ఆం. భా. ౨. ౧౦౪.

**మెలఁ(చే)పు.** స. క్రి. (√ మెలఁగు) మెలఁగఁ
జేయు, నడపు.

క. పరిచారకులై యుండుదు, రరివర్గవ్యతికర
మున కగుదురు వీరిన్, సరిఁ దనకొడుకుల
మెలఁపిన, తెరువున మెలఁగింపఁ దగదె ధృత
రాష్ట్రునకున్ భార. ఉద్యో ౧. ౩౫౯.

(చి. వి., భా. ల. వ్యా. పా. "తనకొడుకులు
మెలఁగిన తెరువున" ముద్రి. పా.)

వ. దర్పోద్రేకంబు లనిర్వార్యంబులుగా మెలంగక
దేజశ్శౌర్యంబు మెలంపుచు .
మనుచ. ౮. ౧౧౫.

**మెలకు.** అ. క్రి. జ్వలించు, మండు.

వ. హాలాహలదహనంబు జగంబులం గోలాహలంబు సేయుచున్నసమయంబున మెలకు సెగల మిడుకం జాలక నీ కైవ దేవతలును ' భాగ. ౯. ౨౧౭.

**మెలన.** వి. (√ మెలఁగు) నడక, ప్రవర్తన.

గీ. ఖ్యాతి మగవాని నమ్మట రోఁత గాదె, వాని మెలన తా నడ్డంబులోని ముడుపు.
Miscell 1 557. Line 9 (క్రా.)

**మెలపాడు.** అ. క్రి (√ మెలపు) నర్తించు, నృత్యము చేయు.

సీ. రంభాదిహరిణనేత్రలు మెలపాడిరి పాడిరి కిన్నరాజ్ఞాతముఖులు
హ. న. ౨. ౧౧౮.

**మెలపారు.** అ. క్రి (మెలపు + ఆరు) మృదువగు, మెత్తనగు

సీ. తలిరాకుకంటెను మెలపారునడుగులు ధర మీఁద మోపుడుఁ దిరలి పోవు
కు సం. ౬. ౬౪౦. కు. సం ౫. ౫౦౭.

**మెలపు.** స. క్రి. (√ మెలయు) మెలయఁజేయు, ప్రవర్తింపఁజేయు, నడపు.

క. మును సరసీరుహగర్భుఁడు, తనమదిలో మద్వివిశ్మితప్రజ ధర్మం,బున మెలపఁ జాలు పురుషుం, దనవద్యుం డౌకఁడు వలయు నని చింతింపన్. వరాహ. ౪. ౧౮.

క. నృపతి మన సీయక కడుఁ, జను నీయక మెలపవలయు షణ్ముఖచరులన్ ...
కవిక. ౨. ౧౯.

సీ. సింధుజ నెద నుంచి సిరుల మించినఁ గాని మిహికాంకుఁ గనుచున్న మెలపరాదు . .
వసు. 3. ౯౪.

క. పగవాని పత్నుమనవాఁ, దగపడినం గాచి పేని నత్యాసన్నుం,డుగ మెలపఁ దగదు మెలపినఁ, దాగు నుపమర్దుండపాశ ధీరహితుండై.
నా. పంచ. 3. 30౯.

వి. = మెలంపు, మెలుపు ౧ జాగ్రత్త, అప్రమత్తత.

గీ. ఇట్లు దమతమవర్తించు నెడల సకల, జనములకు హృదయానురంజన మొనర్చి, శాల్మిపురిలోఁట యదేఁకుద తగవు మెలపు, నెఱిదొలంగను బాటింప నేర్పు గలిగి.
భార విరా ౨ 3.

ఆ. మీరు నిదుర దక్కి మెలపున నాచర, ణంబు గాత్రుచునికి నాకుఁ బ్రియము
భార ఆను. ౨ 300 పారి ౨. ౧౨.

౨. చాతుర్యము, నేర్పు.

గీ. అలరు నెత్తావి పాలితోని యలరు తేటి, మెలపు నలవాటు నెడఁదల మేకొనంగఁ, బ్రణయ సఖులకుఁ గన్నులపండు వగుచుఁ, జతురముగ నొత్త పుష్పాపచయము చేసె.
నిర్వ. ౯. 3౯.

ఆ. రాజకీరములకు రసవంతముగఁ బల్కు, మెలపు దెలుపు కరణిఁ బలుకఁ గఱచె .
కు. సం. 3. ౨౪౫. రాఘవ. ౨. ౬.

3. సౌందర్యము, చక్కఁదనము.

సీ ఒఱపుమించినవాని నెఱమించు నెఱమించు మెలపుఁ గందించు కేమ్మెనివాని .
చంద్రి. 3. ౪౯.

గీ కడిఁది జడదారిపిగపూవు కోలుబ్రోవు, మెలపులకు సీమ కాముని మేనమామ, కత్తికేల్పు

మలింది భోగములగొంది, రిక్కగమిమక్కువ
బోలంగు రేపలంగు.

కృ. శకుం. ౧. ౨౨. గంధ. ౧. ౪౮.

౪. మార్దవము, మెత్తఁదనము.

సీ. అజగన్నాథుల నలవోకవోలెఁ గన్గొని దక్షిణ
మునకుఁ జన నజాండు, మెలపుతో మృత్యువ
మృత్యువ యెట వోయె దని పలుమాఱు
పాంత్వనము దోఁపు.

భార. ద్రో ౨ ౧౬౭.

ద్వి. పాలిండ్లపయ్యెద బయలుపచ్చితినో, మేలపు
మాటల మెలవు దప్పితినో

పండితా పురా. ౧-౫౫

౫. ఉల్లాసము, ప్రమోదము.

చ. చలువులపుట్టినిండ్లు నవసౌరభలత్మ్ముల కింత
రంగముల్, మెలపులకు న్నివాసములు
మెచ్చులచేరుగడల్ విరిత్తితా, కిలవల
కొత్తుకోళ్లు తమకంబులకుం గయిదండ లాము
నిన్, మలయుచు వచ్చె గంధగిరి మంధర
బంధురగంధవాహముల్. కవిక. ౪ ౧౨.

౬. నడక, సంచారము.

ఉ. కాలుమెలుంగులో మెలపుఁ గైకొన
నేర్చినపైఁడిబొమ్మలో, వారునిదీములో కలికి
మాటలచంద్రికలో చెలంగుశృం,గారరసాధి
దేవతలా కమ్మనిక్రొవ్విరి తీఁగలో యనన్,
వారిజపత్త్రిలోచనలు వచ్చిరి మోహవిలాస
మూర్తులై. వి. పు. ౫ ౧౪౬.

౭. చాంచల్యము, కదలిక.

సీ. మృగమదంబును మదమృగమును హసియించు
గాయంపువలపు కన్గొనియి మెలపు

అని. ౨. ౨౬.

౮. స్థైర్యము

సీ. కదుఁబేద యసుకొను గమనవేగంబున మెల
పేది జవజవ జలదరింప ...

కవిక. ౩. ౧౫౧.

౯. మాంద్యము, మెల్లఁదనము.

సీ. పూఁదీఁగఁబోఁడిచూపులు చంచలము లని
మెలపు సెన్నదపున మేళవించె ...

విక్ర. ౪. ౧౩.

౧౦. విధము, రీతి.

వ. తనయందు నివి మొదలయిన తీర్థంబులు గల
వని యవనీజనంబులకుఁ దెలుపు మెలపున
వెలుంగుచు కాశీ. ౧. ౧౪౨.

మెలయు = మెలియు. అ. క్రి. ౧. వర్తించు,
ఉండు.

(చూ కలయు. ఇది కలయు ధాతుపూర్వకము
గానే ప్రయోగములయందుఁ గానవచ్చు
చున్నది.)

గీ. కాంతలిద్దఱు నచ్చటఁ గలసిమెలసి, సంభ్ర
మంబునఁ బుష్పాపచయ మొనర్చి

రాజ. చ. ౩. ౪౨.

గీ. మాటలాడుచుఁ బాడుచు మందమంద, గమన
ములఁ గామినీమణుల్ గలసిమెలసి, వన
విహారంబు గావింప వారిఁ గూడి, యలరె
నవమన్మథునిలీల నర్జునుండు.

ఉ రా. ౩. ౨౦౯.

గీ. అనుచు సనిచినకూరిమి వణఁగి మణఁగి, కలిమి
లేమిని భర్తతోఁ గలసిమెలసి, హెచ్చు
తగ్గుల నోకరీతి సెసక మెసఁగ, వెలసె విల
సితకీర్తుల వెంగమాంబ.

కృ. శకుం. పీఠి. ౧. ౪౯.

౨. జాగరూకతతో నుండు. (శ. ర.)

౩. పెనఁగు. (శ. ర.)

జ. మెలఁత, మెలఁకువ, మెలపాడు, మెల
పారు, మెలవు

**మెలరారు.** అ. క్రి. ౧. మనోహరమగు, ఒప్పిద మగు.

(ఈ రూప మెుక్క కు. సం. నందే గానవచ్చు చున్నది)

సీ. మెలరారు క్రేఁగంటి మెఱుఁగు దీఁగల దుఖ్ఖ కారాకు లాకొ్క్ర క్రొక్కారు మెఱుఁ గు,లు కు సం ౪ ౯౦౩.

సీ. తెలిమోముపైఁ బర్వి తొలఁకాడుచాయలో మెలరారు కనుఁగవ మెఱుఁగు లదరు కు. సం. ౨. ౯.

౨. చలించు, త్రుళ్లు

క ఎల మెడు జలజాతంబులు, మెలరారెడు జల చరములు మేలిల్లెడుని,కొ్కల నుండ కు సం ౧౦ ౩౯౧

**మెలవు = మెలఁగు.** అ క్రి (మరలు, తిరుగు.)

వ. దీనిపడుమట పడగొండియేఱు ఉత్తర మించి మెలవిన మెలవంక కొల్లిప్రోలును మల్ల ప్రోలును గూడినచోటి పుట్టయసీమము పి. శా. శ. ౧౦౨౮. Ep Ind ౫

**మెలి.** వి. (√ మెలియు సం. మిళితం) మెలిక, పెన.

శా. శైలాంచత్కచపాళిఁ గూర్చి మెలు లాందం జుట్టి మేల్పాగలన్ రా. వి. ౨ ౫౧.

౨. చిక్కు.

సీ. జన్నిదంబులు ముత్తెసరులు జిక్కులంపడ్డ మెలులు విప్పుచుఁ గొంత మేల మాడి .. మృ. వి. ౩. ౭౭.

**మెలిక.** వి. (మెలి + ఇక, స్వార్థమున) మెలి, పెన.

(వ్యవ.) హారములు మెలికలు పడినవి.

**మెలికించు.** స. క్రి. (√ మెలిక) మెలిపెట్టు, పెనవేయు.

సీ. బహుమార్గముల నందిపదగలు గట్టిరి మెలి కించి కట్టిరి మేలుకట్లు . వీర. ౩. ౧౧౩.

**మెలిగొను.** అ. క్రి. (మెలి + కొను) ౧ పెన గొను, చిక్కువడు.

సీ నవమైనకృష్ణాజినముతునక్క మెలిగొన్న ధవళి యజ్ఞోప వీతంబు మెఱయ ద శా. ౫ ౭౧

చ తాళిగతి బంగరుగాజులు మ్రోయ హార ముల్, మెలిగొన నూర్పు లుప్పతిల . అలికులవేణి యొూర్తు శిర సంటెను కెంజిగు రాకుఁ బోఁడికిన్ కవిజ ౩. ౨౬.

౨ వంకర దిరుగు.

సీ ఇనుపకడెంబులు నింగలంబు, గురిగెడు మిడిగ్రుడ్లు నెఱిచూపులను నేపుమీరెడు మెలిగొన్న కోఱమీసలు ఉ. హరిశ్చ. ౪. ౧౫౪.

**మెలిదారము.** వి (√ మెలి) జాలిపనివాండ్రు దిండుప్రక్క కొయ్యలకుఁ గట్టెడు బిగిదారము. (శ. ర.)

**మెలిపె(వె)ట్టు.** స. క్రి. (మెలి + పెట్టు) పెన వేయు.

సీ. మెలిపెట్టి చుట్టిన తెలిపరంగిముడాసు పైల పేటాదట్టుపనులఁ దెలఁగు, బంగరు వ్రాఁతల పట్టుహిజారు . శుక. ౨. ౪౨౬.

**మెలియు = మెలయు.** అ. క్రి. పెనఁగు. (శ. ర.)

జ. మెలి, మెలిక, మెలికించు, మెలిగొను, మెలిదారము, మెలిపెట్టు, మెలివడు, మెలుచు, మెలుపు.

**మెలివడు.** అ. క్రి. (మెలి + పడు) మెలిగొను. (శ. ర.)

**మెలుఁత = మెలఁత.** మెల, వి. కలఁత, స్త్రీ.

క అమ్మని, లోకము నేరుటయు నమ్మె లుఁత రిమెలుఁ గనఁగన్

భార అను 3. ౨౨౧.

ద్వి. మెచ్చ దింద్రాదుల మెలుఁతి యీనంటి, మెచ్చునే రమణుఁగమే మీదాసికోలఁది ..

పండితా. మహిమ. ౨౭౧ పా.

(క్రొత్త ప్రతిపా మెలఁత ప్రాఁత ముద్రి పా)

**మెలుచే.** స. క్రి (√ మెలియు) మెలివేయు, పెనవైచు

ద్వి అనుమాన మేల రమ్మని చెట్టఁబట్టి, మెలుచుచు బంగారు మేడలోపలికిఁ. దొలఁగ నీయక వెంటఁ దోడ్కొని పోయి

ద్వి క సా ౧. ౫౦౯ పం

(మెలఁచుచు అపముద్రి)

చ. కేలఁ గేల్, మెలిచిన బెళ్కుచేడిసల మిన్నలచిన్నెల వెన్నుదన్నుబల్, సొలపుల చూపులత్తుకలఁ జొత్తిలఁ జాచె లతాంగి నాథుచిన్ ర స. ౧ ౨౭.

**మెలుపు=మెలపు, మెల్పు.** వి (√ మెలియు)

(మార్దవము, సౌకుమార్యము)

సీ. అలసభావంబున సొలుపును మెలుపును గలుగు నగ్గిరి కన తలఁచి తలఁచి . .

భార. ఆది. 3. ౨౪

క. మెలుపున గెంపున మస్థితి, దలరులయందేమి లేదు తమ ఘనపలనకొ, విలుకడ యగు నని

తత్పద,తలముల కెలసె నవఁ బాదతలములు వొల్చున్. కు. సం. 3. ౨౭౫.

క. వనితలు కేలుపుమెయి మెలు,పునఁ దిగిచిన నొప్పువారములు మొదలగు ప్రన్నని తోడవులు గ్రద్దలు దివి,య వరేంద్రులు గొంద ఱునికి యచ్యుత కంటే.

భార. స్త్రీ. ౨. ౧౪. కు. సం. ౭. ౧3.

(మెల్లఁదనము)

సీ. . గౌరి వచ్చి, వెనుకదిక్కున మెలుపునఁ జేరి మోమున కలఁతిన వ్యిసమడిచెలువు నొసఁగఁ, దమ్మికేలను మల్లసమ్మాడు తన మృదుకర యుగ్మమునను శంకరుని నేత్ర, యుగ్మమల్ల మూసి

భార. అను. ౪. ౪౧౯

(చాతుర్యము, నేర్పు)

సీ ఆసీనుఁ డయి తదీయాంఘ్రి పద్మంబులు తన చారుపాణి పద్మముల మెత్త,మెత్తన రొమ్ముచు మెలు పొందఁ గర్జంపుఁబలు కులఁ జిత్తవిభ్రమము మాన్చి.

భాగ. మా. ౧. ౪3.

చ. చెలువమ గాఁగిలించుకొని చెక్కును జెక్కున సంఘటిల్లఁ దొ,క్రిలుచుఁ బదంబు లొక్క టొకటిం బెనఁగన్ మెల పొప్పుఁ దార్చి తేఁ,దలిరుల జొంపముగ్ గలుగు దట్టపుఁ బూఁబొదరింటి లోనికిన్.

కళా. 3. 3౪.

(చక్కఁదనము, సౌందర్యము)

సీ భద్రవిద్యోతాతపత్త్రింబు గ్రాలుచు మిన్నేటి తరఁగల మెలుపు గొలుప

భాగ ౬. ౨౭౦.

**మెలుసు.** వి (సం. మిళితమ్?) మెలిక, పెన.

గీ. బలుగు మెలుసులకలఁకలు గలిగికొనుచు, మెలఁగుప్రకృతిని దగులక మిగిలివెలుఁగు,

తెలుఁగు తెలుఁగంగఁ జేయుచుఁ గలయ
తెలుఁగుఁ, బరమపరిపూర్ణ నిర్గుణబ్రహ్మ
మనఘ. సీతారా. ౨. ౬.

వ. అప్పుడు నప్పుడు గాకుండఁ దప్పటడుగు
లిడుచు వినుపగోలుంగుల మెలుఁగులు వీడినఁ
దాలంబులు మహోత్తాలం బయిన బిడ్డనికి
నడ్డంబు గాక కీలూడి వీడిపడ
భాగ. ౧౦ పూ ౧౪౩.

మెల్కువ. వి. జాగరూకత, మెలఁకువ

ఉ. తద్గుణ, స్తోమము గాంచి భక్తి మదిఁ
దొల్కఁగ సంగయ పల్కె మెల్కువన్
చెన్న. ౩ ౨౩౪.

మెత్త = మెలుఁత. వి. ఆఁడుది, స్త్రీ.

ఉ. సా, గంగముఁ బాయఁ డీయవసరం
బున మే లని మెచ్చిరో సుమీ, త్రింగి
యుఁ గ్రాయు నచ్చిలువ మెత్త విధుం గను
గందకుండఁగన్. సైమ. ౯ ౧౪౩.

జః మెత్తుక.

మెత్తుక. వి. (మెత్త + ఉక. స్వార్థమున) ఆఁడుది,
స్త్రీ.

ఉ. మేదినీ, పుత్త్రి మదాశ్రమ స్థలము
ప్రాంత వనంబునఁ ద్రోచి వచ్చె పౌ,మిత్త్రి
తపస్వి బాలకులు మెత్తుకఁ గట్గొని వచ్చి
నాకుఁ దృష్ణాత్త్రి తెలుంగఁ జెప్పుటయు.
నిర్వ. ౧౦. ౧౩౧.

చ. మెలఁగుచు నున్నవానిఁ గని మెత్తుక
యెప్పటి భూమియందఁ కాఁ, దలఁచి .
మార్క. ౫. ౧౩.

మెల్పు = మెలుపు.

(సౌకుమార్యము, మార్దవము.) .

చ. విదురాది సజ్జనులబుద్ధికి రా మదితంబు
తోడిమెల్పునఁ బరనందనంబునను భూపతు
లెల్ల నెఱుంగ నాడుమీ .
భార. ఉద్యో. ౩. ౨౩.

సీ. భారతి నడపాడు పదగతు లన మెల్పు దల
కొని క్రాలు పదక్రమములు . .
కు. సం. ౬. ౪౧౩.

(మాంద్యము, మెల్లఁదనము)

ఉ. అప్పు డొకర్త కొంచె మగు నాభరణంబులు
సన్నపూఁతయున్, గా ఢ్పిడి త్రిప్పి లోఁ
జెరివికొన్న నడంగినపూవులుం బయిం, గప్పిన
చేలకొంగు నునుఁగప్పును మెల్పున కేఁగు
మెట్టెలేఁ, బప్పుడు చెన్నుఁజేయు గతి
చందము వింతఁగఁ బోవు నయ్యెడన్.
నిర్వ. ౬. ౫౯.

శా. ధేనుగ్రాసము మాన్ప దోస మని సందేహిం
చినన్ సస్య మెంతే నష్టం బగు నైన నేమి
మతియున్ వి త్తంగ యామంబులో, నా
నన్నున్ మనులెల్ల మిక్కిలియు నేఁ డాఁ
కొందు రీధేనువుం, దాశో మానము దప్పి
మేసినది యింతం దోలెదన్ మెల్పునన్.
వరాహ. ౧౦. ౪౦.

ఉ. గంధవహుండు వీచె నెసకంబున నాత్మజా
మీఁద మెల్పునన్ ...
భా. రా. యు. ౧౪౧౯.

(తేలుపు.)

సీ. కాఁడిన విమకంటకములు మెల్పునఁ బుచ్చి
తన పెచ్చు పాదపద్మములు గాఁచి ...
హై. భా. ౬. ౭౫.

(రీతి, విధము.)~

చ. నిలుపక మెల్లఁ దాఁటు నట్లు నిల్చిన మెల్పు
 నటించుఁ బట్టఁ జేయలఁతిఁ జేరిన జిదిమి
 నట్టులు దూరము దాఁటు .
 భా. రా. అర. ౨ ౪౬.

మ. . మాయఁ బన్ని పెలుచం గోశంబులో
 వాలు మెల్పున రాజిల్లుచు మాట మెత్తఁ
 దనమున్ లో వాఁడియు న్నేర్పడన్
 భాగ. ౧౦. పూ. ౨౨౩.

మెల్ల[1]. విశే. కొంచెము వంకరైనది, (కన్ను, చూపు) కేకరము
 (వ్యవ.) ఆ పెండ్లి కుమారునిది మెల్లకన్ను అట్లు మెల్లచూపు చూడకు.
 జః మెల్లకంటి, మెల్లకంటివాఁడు.

మెల్ల[2]. విశే. (త. మెల్. కర్మధారయమున నిగా గమము) ౧ మందము, వేగము లేనిది.
 ద్వి మెల్లనినడపులు మృదుభాషణములు, వల్ల భత్వములు చిత్తోల్లాసములును
 పండితా. పర్వ ౩౩౫. పా
 ౨. శాంతము, ప్రసన్నము.
 ఉ. మెండుగ బ్రోయుగజ్జెలును మెల్లనిచూపులు మందహాసముల్. చాటువు.
 ౩. మేలైనది.
 (వానిపని యిప్పుడు మెల్ల. శ. ర.)
 క్రి. విశే. ద్ర. ౧. మందముగా, త్వరపడక.
 (దీని యామ్రేడితరూపము మెల్లమెల్లన్, మెల మెల్లన్, మెల్మెల్లన్)
 శా. ఏమే చెల్లె బితీన రాఁగదవె యేలే జాగు రూపక్క లోఁ, లేమా పే వెంటన్ భళా రాజుఁగమే యీబూటకా లమ్మలా, రా మెల్లం దిగరమ్మ ఉ. హరిశ్చం. ౩. ౩౪.

ఆ. నల్ల గ్రోల నిచ్చి మెల్లనె చివ్వంగి, కోరి జంకఁ దివియుకేర పాదవు, వేటకాఁడు కోశ అము. ౪. ౧౬౩.

మ. కర మొప్పారు నిశానబోధిత నిశాకాం తుండు మెల్మెల్లనే, కరముల్ సాఁచి తమోవినీలపట ముత్కంఠం దొలంగింప .
 కవిజ ౩. ౪౪.

గీ అలయ మెల్లఁగ నన శనైరర్థ మగుచు
 ఆం భా. ౩ ౪౬.

౨. బిగ్గరకాకుండ, ఉచ్చైర్ధ్వని లేకుండ
 (వ్యవ) మామకు నిద్రాభంగము గలుగును, మెల్లఁగాఁ జదువుకొనుము పెద్దలతో మెల్లఁగా మాటాడ వలయును
 జః మెల్లన.

మెల్ల[3]. వి ఊరిబయలు
 సీ. మె ల్లన నికర్షణ మొప్ప
 ఆం భా ౨. ౨౩.

మెల్లకంటి. విశే (మెల్ల[1] + కన్ను) కేకరా క్షుఁడు, కొంచెము వంకర యైనచూపు గల వాఁడు, కడకంటి కొరగిన కనుపాపగలవాఁడు; కలది
 వి. వాయసము, కాకి (గ్రా.)

మెల్లకంటివాఁడు. విశే. (√ మెల్లకంటి) కేక రుఁడు.
 గీ మెల్ల, కంటివాఁ డనఁ గేకరాఖ్య యగు ఆం. భా. ౨. ౧౭౦.

మెల్లన. వి. (√ మెల్ల[2]) ౧. అల్లన, మాంద్యము; మందస్వరము.
 సీ. భోగించువారలఁ బుల్కుపుల్కునఁ జూచి మెల్లన గ్రుక్కిళ్లు మ్రింగువారు
 హైమ. ౪. ౫౩.

సీ. మనసుకక్కుఱితి మెల్లన లేచి చేతులఁ గాం
తుని బిబ్బగాఁ గౌఁగిలించు ...

మను. ౩. ౧౨౩.

క. తనరెడు లజ్జాభయవ్యాసన లందోళ్ళధముసఁ
దనర సతి గనుఁగొని మెల్లన నిలుఁ దని
యాన లిడన్, జని రోక్కొకసాపముఁ జెప్పి
సఖియ లిరువురున్.

ప్రభా. ౫. ౩౪. నీలా. ౨. ౧౧.

౨ శైథిల్యము, సడలు

సీ అంగంబు మెల్లన నక్కుఁ జేర్పవె గాని
మించి బిగ్గరఁ గౌఁగిలింప రాదు

దశా. ౨ ౩౧౧.

మెల్లము. విశ. ఉపశమిల్లినది, తగ్గినది.

ద్వి. మీఱినతాపంబు మెల్లంబు సేసి

ద్వి. పరమ. ౫. ౮౧. పా.

మెల్లా. వి చవిక. (శ. ర, బ్రా)

(వ్యవ.) వా రామెల్లాలోఁ గూర్చుండి మాట
లాడుచున్నారు.

మెల్లె. వి. చివక, చువ్వ.

సీ. పెండె గట్టెడుచోటఁ బెనుపగడుపుఁదీఁగ
లీత మెల్లెలు దుల్య మెపుడు నృపతి

రా. వి. ౩. ౮౧.

మెళవ. వి. ఒంటిపాటు, ఏకాకిత్వము.

గీ. ఒంటిపై సేఁగుచలముల నడుగరమ్మ,
మెళవ లిడరమ్మ కవగూడి మెలఁగరమ్మ,
తగినజత గూడి తలఁపులు దలఁచరమ్మ,
రేను చెలిమిచందమే యెన్నరమ్మ.

చంద్రా. ౮. ౧౯౪.

మెసఁగు = మెసవు. స. క్రి. ౧. తిను, భుజించు;
మ్రింగు, కబళించు.

సీ. తివుటఁ జొక్కులకొని దివగోరు మెసఁగిరి ..

శైవ. ౪. ౭౨.

గీ. ఎంగిలికి సోఁక పడక మెసంగువారు, గాన
విద్యలపైఁ బ్రేమ గలుగువారు, విష్ణునామ
త్రయజపంబు విడుచువారు, నిరయమార్గాను
వర్తులు నిశ్చయంబు. శేష. ౩. ౮౮.

గీ. మంచిపనసపండుల మెసంగు, జాణలకు
మావిపండులు చవియ కావె .

నీలా. ౨. ౩౧.

వ పంచతన్మాత్రసహితం బైన యమ్మహాభూన
సంబు నిద్రాసమయంబుఁ గబళించుచాడ్పున
నహంకారంబు గబళించు, నయ్యహంకృతి
మహాబుద్ధి మెసంగు. సీతారా. ౨. ౧౫౭.

౨. అనుభవించు.

క. శివయోగినింద వినిరెడి, యవివేకులు తనువు
వెడల నంతమునందున్, దవిలి నరకంబు
మెసఁగుచు, భువి చనునందాఁక యమునిపురి
మందు రోగిన్. శివధ. ౩. ౩౯.

మెసవు = మెసఁగు. స. క్రి. తిను, భుజించు;
కబళించు, మ్రింగు.

గీ. వేఁడి యగుదాఁక సోరువ మాఁడు గలిగెఁ,
బులిసినది గగ్గె నన్నంబు పోఁకయంత,
యొసఁగి యు త్తార్చు వెసఁ జల్ది మెసవనైన,
పాప ముడిపించుకొందుఁ దపంబుకలిమి.

పాండు. ౮. ౧౫౩.

క. . నిలింపవిరోధీ, నా మెయిమేదోమయదృ,
ప్తామిషములు మెసవు మన్న నతఁడును
నా ర్తిన్ . అము. ౬. ౫౩.

క. ఘాలాహలుఁడు కబళింపఁగ, హాలాహల
విషము కొంత యవశిష్టం బై, తూలగ నది
వృశ్చికములు, వ్యాళింబులు మెసవి విషవ
దాఖ్యల వెలసెన్. దశా. ౨. ౨౨౨.

గీ. కలువపీఠంబు మెసవురాకాని కాక ...
కాశీ. ౨. ౮౯. ఆం. భా. ౩. ౧౧౯.

# మే

**మే** = మేను. వి. ౧. దేహము, ఒడలు.

ఉ. పరిశ్రమ పారవశ్యమునం, గూడి ప్రమాణ కోటి వనఘుండు సమీరణనందనుండు మే, యాదక నిద్రపోయె
భార ఆది ౫. ౧౪౦.

శా. విధి నామేఁ బ్రాణముల్ నిల్పు
భార. శల్య. ౨. ౨౧.

క. మే నిమిరి శిరము మూర్కొని, దానవపరిపంథి యొంతధన్యనో నియత, ధ్యానపరు లయిన మునులుం, గానని నినుఁ గంటి మంటి గత కల్మష నై పారి. ౩. ౨౬.
ఆం భా ౨. ౧౩౮.

౨. విధము, ప్రకారము.

ఉ. పాండవుల్, మిక్కిలివారు నీతలఁపు మే గెలువన్ వశమే మహీశ్వరా
భార ద్రో. ౫. ౧౨౮.

౩. తెగ, సంఘము.

చ. అమవినమీనుమాట విని యందఱుఁ గన్గొని పెద్దలెల్ల ని, న్నమమతి సేయ సైన్యముల నన్నిటఁ బన్నఁగఁ బంపు రెండుమేల నదక మిాత్రిగర్తులబలంబుల ముందటఁ బంచి వానిపో, యిన మఱునాఁడు పోద మనిరొం గురుసాథుఁడు దుస్సహేమతోన్
భార. విరా. ౩. ౧౨౩.
(రెండుమైల. శ. ర. పా.)

౪. పార్శ్వము.

శా. ఇ, ర్మేలం బాయనివేల్పుచాలు గల సామిన్ మెచ్చునిం గొల్చెదన్ ..
చంద్ర. ౫. ౫౯.

శా. ఇర్మేలన్ వేర్కొనుకేల్పుచాలు సెద నెమ్మిన్నిల్వఁ బూఁజాలు దేవేశం బూతల మేలుమేలును గలావెన్నున్ నినుం గొల్చెదన్ ప్రబంధ. ౧౫౮.

జ: మేకాను, మేకాలుపు, మేకోలు, మేగలి, మేకాలుపు, మేపుట్టువు, మేమఱుఁగు, మేవడి, మేవడికాఁడు

**మేండుఁడు.** సం వి. అ పుం మేషుఁడు, మావటివాఁడు (త్రి ని)

**మేండ్రించు.** స క్రి. పోఁగొట్టు, నశింపఁజేయు. (ఖేదించు అని శ. ర)

శా. మింటన్ బ్రామోసినబ్రామోఁత దాలిమిని లో మేండ్రింప మున్ నీవు నా, యింటం బుట్టెద వంచుఁ గంసుఁడు దొడిన్ హింసించె నీ యన్నలన్ భాగ. ౧౦. పూ ౧౨౮.

**మేంధి.** సం. వి. ఈ. స్త్రీ. మేంధిక, మేంతి ఁ.

**మేఁక.** వి. (సం. మేకః) ౧. ఛాగము, అజము.

గీ. ఓమే యేమే యి దే మేమే లేమ యేమే, మేఘపుష్పంబు దే వంచు మేలమాడ, మేమేమేమేలు దఱ చయ్యె మేలుమేలు, మేఁక మేఁ కన సభవారు మిగుల నగిరి.
నైష. ౬. ౧౧౮.

మ. మేఁ, కెరువుం గుంపటిమంచ మెక్కి ర ప్రభుశైవ్యాకాప్తి ర ద్గజడిన్
ఆము. ౪. ౧౩౮.

౨. చింబు, ఛాగి, ఆఁడుమేఁక.

సీ. మేఁక చుచ్చున చింబు మీఱు ఛాగి.
ఆం. భా. ౨. ౧౬౫.

**మేఁకవన్నెపులి** = మేఁకవలె పైకి సాధువుగాఁ గనఁబడుచు లోపల పులివలె క్రూరస్వభావము కలవాఁడు; కలది.

ఉ. అక్కట మేఁకవన్నెపులు లంగన లెన్నిట
నెన్ని చూచినన్ .. కవిరా. ౧. ౧౩౪.

జః మేఁకతిండి, మేఁకపోతు, మేఁకసారము.

**మేఁకతిండి.** వి (మేఁక + తిండి) అజాదనము, తోఁడేలు. (శ. ర)

**మేఁకపోతు.** వి. (మేఁక + పోతు) ఛాగము, మగమేఁక.

(వ్యవ.) వానిది పట్టిమేఁకపోతు గాంభీర్యము.

**మేఁకసారము.** వి (మేఁక + సారము) స్వరవిశేషము, గాంధారము. (శ ర.)

**మేఁగు** = మ్రేఁగు. స క్రి పూయు, లేపనము చేయు

సీ కమ్మగొజ్జఁగినీటఁ గలయంపి చల్లిరి మేఁగి
మెత్తిరి క్రొత్త మృగమదంబు .
శివరా ౨ ౫౩.

ద్వి పెన్నలుపు, మించి కందనమూనె
మేఁగిన ట్లున్న, మొగమునఁ జీకట్లు ముడి
వడఁ గల్గు
ద్వి. హరిశ్చ. ఉ. ౧౩౯౦. పం.

సీ సుమాంబువులు పైనఁ జిలికి కప్పురము
వీనుల నూఁది మేలిచందన మెద మేఁగి తాళ,
వృంతంబు చేఁబూని
చెన్న. ౪. ౨౧

**మేఁడి.** వి. (సం. మేధీ, ప్రా. మేఢీ. ఇది శ. ర. ననుసరించి సామస్వారముగా గ్రహింపఁబడినది కాని నిర్ధారకప్రయోగము లేదు) మేఁడితోఁక.

సీ. గీ. ముష్టి సంగ్రాహ్యదారువు పొలుచు
మేఁడి, యనఁగ ఆం. భా. ౨. ౨౩౨.

ఉ. మేఁడియు నీరమున్ భుజము మీఁద ధరించుచుఁ బోతుపెద్దతోఁ, గూడఁగఁ గాఁడిఁ
బూన్చి మునికోల కరంబునఁ బట్టి పగ్గముం,
ద్రాడును జోకు వాకొనయు దాలిచి
ముందటపెన్కఁ బాంగు ద్రొక్కులాడఁగఁ గాడి
కట్టుకొని యక్కటిలాత్మకుఁ డేగెఁ జేని
కిన్. శేష. ౪. (శ. ర.)

జః మేఁడికోరు, మేఁడిచీల, మేఁడితోఁక, మేఁడిపాలు, మేఁడిసోఁగ.

**మేఁడికోరు.** వి. (√మేఁడి) సేద్యగానికి వచ్చు ధాన్యభాగము.

**మేఁడిచీల.** వి. (√మేఁడి) మేఁడి జాతి రాకుండ వేసిన చీల (శ ర)

**మేఁడితోఁక.** వి (√మేఁడి) దున్నువాఁడు పట్టుకొనుటకు మేఁడిచివర అడ్డముగాఁ జెక్కిన చిన్నకొయ్య. (శ. ర)

**మేఁడిపాలు.** వి. (√మేఁడి) సేద్యగానికి వచ్చు ధాన్యభాగము. (శ ర)

**మేఁడిసోఁగ.** వి మేఁడితోఁక. (శ. ర.)

**మేఁత.** వి. (√మేయు) పశుపక్ష్యాదుల యాహారము.

(ఇది మనుష్యుల విషయమునఁ గూడ నుపయోగింపఁబడును.)

సీ. తనసంతతికి మేఁతఁ గొని వచ్చురీతి దిక్కరి
కరీరంబుల గఱిల నాను ...
దశా. ౧. ౨౯౯.

గీ. మఱియుఁ గలదిన్యసరసులు సొంపుఁ జెలిచి,
తనదుకేళి దీర్ఘికలందుఁ గనకనళిన, జాతు
లెల్ల నాఁటించినాఁ డాతఁ డింద్ర, యటు
చనక మేఁత నడచునే హంసములకు.
ప్రభా. ౧. ౧౨౦.

చ. కొలకొలమంచు మేఁతలకు గూఁడులు
వెల్వడు పక్షిరావముల్ ...
పారి. ౨. ౬౯.

వి. మినుకుటూర్పులవాని మిసిమిమేఁతలవాని
మెఱుఁగుఁజామని చాయమేనివాని
పాండు. ౧. ౨౧౩.

సా : ఏఁటియాఁతకు లంకమేఁతకు సరి.

**మేఁతకాఁడు.** విశే. (మేఁత + కాఁడు) తిండి
పోతు, మేఁతరి

సీ. కోలాహలాభీలహాలాహలజ్వాల మెదబంటి
మెసఁగిన మేఁతకాఁడు
వరాహ ౧౧. ౧౪.

**మేఁతరి = మేఁతరీఁడు.** విశే. (మేఁత + అరి)
౧. తిండిపోతు, ఘస్మరుఁడు.

క. ఆప్పాలమేఁతరిచెలి ద్రిమ్మరు, పాల
మేతతినైన వేలుపులు సొరరునుమీ
అచ్చ రా. బాల ౧౧౩.

౨. ముఖ్యుఁడు

సీ అంతట చామయ్య యనుదొమ్మరీలమేఁతరి
తనవీడును దాను గదలి
చెన్న. ౨. ౨౦౪.

**మేఁతరీఁడు = మేఁతరి.** విశే. (మేఁతరి+ఈఁడు
స్వార్థమున) (ముఖ్యుఁడు.)

మ. కనిరెయం దొమ్మరిమేఁతరీఁడు ఉద్యాన
ముస్ చెన్న. ౨ ౨౧౪.

**మేఁ(తా)తలాడు = మేపాడు.** అ క్రి.
మేఁతలు + ఆడు.) మేఁతమేయు.

సీ. మిన్నేటిదరులందు మేఁతలాడుచు నున్నయు
దుటురాయంచలేఁగొదమ యనఁగ
సారంగ. ౧. ౧౨౨.

క. ఆకాశ వాకపథమున, నేకాకిత మేఁతలాడ
నీరముగములం, గీకామండల మగుసర,యూ
కావనమునకుఁ బోవ నుక్కెద నటుకుస్ . .
వేం. పంచ. ౨. ౬.

**మేకము.** సం. వి. అ. పుం. - మె అని ధాయియి
నది. మేఁక, ఛాగము.

(కల్పద్రుమాది కోశములం దీపదము రా. వి.
లోనున్న దని కలదు. కాని రా. వి. లో
లేదు వ్యుత్పత్తినిబట్టి వ్యాకరణముచే
సాధువు గాన గ్రహింపఁబడినది )

**మేకలకన్య.** సం వి. అ. స్త్రీ నర్మదానది.

**మేకలము.** సం వి అ. పుం ఒకానొక
పర్వతము

**మేకు.** వి. ఇనుము మున్నగువానితో చేసిన చీల.
(శ ర)

ద్వి. మొన చూపి నన లొత్తుమొగడలం దనర్చి,
మినుకుఁదేఁటులతోడ మేకులు చేసి, యీని
నగతి నాకు నిగురుఁబకొ్క్కమ్మ, గానరాకుండ
నల్గడ విఱ్ఱివీఁగి
ద్వి. పరమ. ౪. ౨౬౬. పా.

సీ. మేఁ కన సెసఁగు కంకు
ఆం భా. ౨. ౨౧౭.

**మేకొను = మైకొను.** స క్రి. అ. క్రి. (మే+
కొను) అంగీకరించు, ఒప్పుకొను

క. ఉన్నారు మంచి యేర్పిన, మిన్నలవరి రాజ
పంపు మేకొనకీఁక మీ, రన్నఁటికి మిావిలా
సము, లిన్నియు సెప్పటికిఁ జెప్పరే చెలు
లారా . రామా. ౨. ౭౩.

ద్వి. ధారుణిపై నవతారంబునేయ, మీారును
దోడ్పాటు మేకొనవలయు .
రం. రా. బాల. ౧౭. పా. ౩౦. పం.

ఉ. అక్కట కౌరవాన్వయ మహార్ణవ మింకెడు
నట్లు పుట్టి నిం, దొక్కరుఁ డైనఁ గేశవు
హితో క్తి మేకొనఁ దయ్యె .
భార. ఉద్యో. ౪. ౫౪.

ఉ. పై, క్లిత్తినపక్క నవ్వరమహీరుహాముం
దనపొమ్ము పేతకై, మెత్తన వేడఁ జిత్తవిభు
మేకొని యచ్చతురుండుఁ జెచ్చెరన్ .
హరి. ఉ. ౪. ౨౦౪.

౫. క్రి. ౧. పొందు.

క. మృతుఁ డట పుట్టుఁ బెరుఁగును, మృతుఁ
డట కేలోకఁడు గుడువ మేకొనుఁ
దృప్తిన్ నైష. ౮. ౩౫

క. ఇనుమంతగాని లేఁడే, పసిబాలుఁడు కూడు
గూటిప్రాయమువాఁడె, బ్లైసరి బహుభత్యు
రానులు, మెసఁగెడి వినువఁడు ప్రతుష్టి
మేకొనఁడు గదే పాండు. ౪ ౧౭౦.

ఉ. భూరిజటల్ ప్రవాళములపోల్పుఁ గనన్
ఘనబాహుశాఖలన్, మీఁది యపర్ణ పర్ణరుచి
మేకొనఁ గ్రొన్నెలరేక కోరకా, కారముఁ
బూన నీలగళకాంతులు తేఁటులనీటుఁ జెంద
మం, దారుములీల శూలి ధననాథునకున్
గనుపించి యిట్లనున్
ఉ. రా. ౭ ౩౧౫.

౨. చేయు, ఒనర్చు.

ఉ మించి ముఖాబ్జ చుంబనము, మేకొని నవ్వు
విధుండు నేర్పునన్ .. నైష. ౮. ౧౭౩

౬. క్రి. ౧. పూను, ప్రయత్నించు.

ఉ. ప్రుచ్చిర నేల యేఁ గలుగ ముద్దియ నాకు
వృకోదరుండు వి,వ్వచ్చుఁడుఁ దోడు గాఁగ
జనవంద్యుఁడు ధర్మసుతుండు పంప నీ,
మెచ్చుగ శత్రుసంక్షయము మేకొని చేసెదఁ
గాక భార. ఉద్యో. ౩. ౧౨౦.

ఉ. . మీ, మీనిపుణత్వముల్ దెలియ
మేకొని యమ్మని లోనుచేసినన్ .
వాల్మీ. ౩. ౭౯.

చ. చలనము లేక యీనృపతి శయ్య నహర్ని
శమున్ సుఖించు నా,మెలఁకువ నాని చేయు
టకు మేకొని రాఁదగునయ్య .
నా. పంచ. ౧. ౩౧౫.

౨. ఓర్చు, తాళు, సహించు.

చ. ఇది గడుముద్దరాలు పను లేమియుఁ జేయఁగ
నేర దింతయున్, మృదు వొకకీడుపాటునకు
మేకొనఁ జాల దుదాత్తచిత్త
భార విరా. ౧ ౧౦౩

౩ కలుగు, సంభవించు.

ఉ మిత్రులచెద్దులన్ సుఖము మేకొనునంటయుఁ
జెందు దుఃఖముల్, శత్రులచెద్దు నంటయును
సన్మతి దా ధనమూలమంటయున్
భార. శాం ౨ ౨౦౮

దండకము మేకొన్న పేరల్కతోఁ బుమ్కలా
వర్తకాబ్డింబులం బంపఁగా .
పారి. ౩. ౩౭.

౪ తహతహపడు.

క ఇనుఁ డెలిఁగ నమచు నమయాం, గన నీల
పటంబు దాల్చి కలయాశల మ్మేకొనిరెుడు
జారిణికైవడి, నవఁ జీకటి పుడమిఁ జెలఁగ
నతిబహుళంబై . బిల్హ. ౨. ౨౨.

(ఇది కొన్నిరెుడల పాదపూరణమునకై ప్రయో
గింపఁబడును )

ఉ. మేలున సంతసిల్లి పెద మేకొని యాపద
లొందు నాపదల్, తూలఁగఁ బూని సౌఖ్య
ములు దోఁచు భార. అర. ౫. ౩౪౧.

ఉ. మేకొని నీదుభక్తి మది మెచ్చితి దక్షిణ
లిచ్చినట్లు గా,తాన కనఁగొంటి నీదగు
కృతజ్ఞత యింతియు చాలు .
ఇందు. ౧. ౧౮౮.

మేకొలుపు. స. క్రి. (√ మేకొను) ౧. మేకొనఁ
జేయు, అంగీకరింపఁజేయు.

చ. మెయిబడి గౌరి నీళ్వరుడు మేకొలిపెన్ రతికిం గ్రమంబునన్

కు. సం. ౯. 3౪౫.

క. అని ప్రియము గదల్కాఁగ బల్కిన సెంతయు హావభావలీలాగతులన్, దనచకు తోకులచే న్యాయనమది మేకొలుప శేక వ్యాకులమతి యై . పారిం ఆ. ౨౫.

౨. కలిగించు.

ఉ. . కర, శ్లాఘఁగనీక మంథనగి మాడిన నాఁటి పరిశ్రమక్రమా, క్రమేడికశేగవాసనలు మేకొలిపెన్ బలిశే తదమ్రముర్

రామా ౭. ౧౦౭.

3. పొందించు.

సీ. పులితోలు విడిపించి జిలుగుదుప్పటపురింగుల వల్లెవాటు మేకొలుప వచ్చు రామా. ౭ ౧౧౦ (ధరింపఁ జేయవచ్చునని భావము)

మేకోలు = మయికోలు, మెయికోలు, మైకోలు,

వి. (√ మేకొను) ౧ సమ్మతి, అంగీకారము.

మ. అని యామాకర్తికపాల మిచ్చుటయు పాంద్రానందముం బొంది మాను, నివి మేకో లునఁ గుండలావదనమున్ వీక్షింప నయ్యం బుజాననకాని మ్మని పల్కఁ గృత్రిమ విమానం బెక్కఁగాఁ జేసి యద్భుతమూర్తీ కుఁడు తా నదృశ్యుఁ డయి చెంతం బోయి సంతుష్టుఁ డై. కువల. ౪. ౯౧.

మ. ... పూఁదోఁటలోఁ, దనమేకోలున వచ్చి యున్న యుపనాథప్రౌఢు నాథొకమా,నవి రూఢిప్రథితానురాగ మిగురొందం గూడి క్రీడింపఁగన్. శుక. ౨. 3౯౯.

సీ. ఇయ్యకో లాస్పికో రికోలు మైకోలు మేకోలు సమకోలు మేయు దొడఁబడిక యొడఁబా టనుట కనుపట్టుచునుండు సమ్మతి పేరు . ఆం. భా. ౧. ౧౦౪.

౨. కోరిక, అభీష్టార్థము.

గీ. తగులు గానిచ్చుపిత సుగ్దవిటచేట, తలకును విదూషకులకు మేకోలు నడపి, తండ్రి గడి యించినట్టి విత్తంబు బోవ, లాల్లగాఁ దయ్యె నవ్విప్రపల్లభుండు. శుక. ౪. ౧౧౧.

3. పూనిక, ప్రయత్నము.

మేఖల. సం. వి. ఆ. స్త్రీ. ౧. నడికట్టు, మొల నూలు, మొలత్రాడు. ౨. ద్విజాలు ధరించెడి మూంజీ, ఉపనయనమందు ధరించెడి తృణవిశే షముతోఁ జేసిననడికట్టు. 3 పర్వతనితంబము, కొండనడుము. ౪ కత్తి పట్టుకొనుటకై కట్టిన త్రాడు ౫ గుజ్జము కడుపుక్రిందనుండి జీను మొదలగునవి కట్టెడితోలుపట్టె, టంగువాఱు. ౬. నర్మదానది. ౭ పృశ్నిపర్ణి, ఉమ్మెత్త.

మేఖలము. సం. వి. అ. పుం. ఒకానొకకొండ.

మేగలి = మైగలి. విణ. (మే + కలి) కూరుఁడు. (వి. పూనిక అని శ. ర.)

క. ఆటోప మదఁగ యచ్చటి, మేటిమగలు తీచ్చవడిరి మేగలి కర్ణుం, డే టలవిఁ గవిసె ధను,ర్వ్యాటంకృతి పెలఁగఁ బాండవాగ్రజుఁ బెలుచన్. భార. కర్ణ. ౨. ౧౭౩.

(శ. ర. కరాళిప్రతిపా. మెయిగలి. ఆనంద ప్రతిపా. మేగరి. జ. పా. అని ఆనందప్రతి. మేగల భా. ల. వ్యా.)

మేఘంకరము. సం. విణ. (అ. ఈ. ఆ) మేఘ ములఁ గలిగించునది.

మేఘకఫము. సం. వి. అ. పుం. కరక, వడగల్లు.

మేఘచింతకము. సం. వి. అ. పుం. చాతకపక్షి.

మేఘజాలము. సం. వి. అ. న. ౧. మేఘసము దాయము, మబ్బులగుంపు. ౨. అభ్రకము.

మేఘజీవనము. సం. వి. అ. పుం. చాతకపక్షి.

మేఘజ్యోతిస్సు. సం. వి. స్. న. మెఱుపు, విద్యుత్తు.

మేఘడంబరము. సం వి అ పుం. ఉఱుము గర్జితము

మేఘదీపము. సం వి. అ పుం. మెఱుపు, విద్యుత్తు.

మేఘద్వారము. సం వి. అ న. మొగులుదారి, ఆకాశము

మేఘనాదము. సం. వి. అ పుం. ౧. మేఘ ధ్వని, ఉఱుము. ౨. పలాశవృక్షము. ౩ తండు లీయము, చిఱ్ఱికూర ఱి.

మేఘనాదానులాసకము సం వి. అ. పుం. మయూరము, నెమిలి.

మేఘనాదానులాసి. సం వి న్ పుం. మయూరము, నెమిలి.

మేఘనాదుఁడు. సం. వి. అ పుం. ౧ వరు ణుఁడు. ౨ రావణునికొడు కైనయింద్రజిత్తు.

మేఘనామ. సం వి న్ పుం ముస్తకము, ముస్తె ఱి

మేఘనిర్ఘోషము. సం. వి. అ పుం ఉఱుము.

మేఘపథము. సం వి అ పుం మేఘమార్గము, ఆకాశము.

మేఘపుష్పము. సం. వి అ న. జలము, నీరు

మేఘభూతి. సం. వి. ఈ. స్త్రీ. పిడుగు, అశని.

మేఘమార్గము. సం వి. అ. పుం. ఆకాశము.

మేఘము. సం. వి. అ. పుం. ౧. మబ్బు. ౨. (సంగీ.) రాగభేదము ౩ ముస్తె ఱి. న. అభ్ర కము.

మేఘయోని. సం వి ఇ. పుం. పొగ, ధూమము.

మేఘరంజి. సం. వి న్. న. ఒకానొకరాగము.

గీ. అనిలసుతుఁడు త్రిలోకమోహనము గాఁగ,
మేఘరంజి రొయర్చియమేయతాన, లవారిఁ
జెంగటిగంజోపలంబు గరఁచె

సవిూర. ౬. ౨౧౩.

గీ శంక, రాభరణమును శోకవిరాళి మేఘ,
రంజి గుజ్జరి పంతువరాళి నాట

ప్రబంధ ౯౭ హంస. ౫ ౧౨౪.

మేఘవన్నె. మి వి. ఒకవిధమగు వస్త్రము. మబ్బురంగుబట్ట.

గీ. మేఘవన్నెలు పచ్చపట్టు, గరుడపచ్చలు
నేత్రముల్ తురగవల్లు, హంసవల్లును
బద్మాలు హరిణవల్లు, మొదలుగా వల్వలు
ధరించి ముదిత లపుడు

ప్రబంధ. ౨౭౨.

మేఘవర్ణ. సం వి. ఆ. స్త్రీ. నీలిమందుచెట్టు.

మేఘవర్ణము. సం. వి. అ. పుం. న. వస్త్ర విశేషము

వ. తోఁపులు మేఘవర్ణంబులు పచ్చపట్టులు
చీనీలు సాలువులు కబ్బాయిలు నడికట్లు
చాదరులు పాసావళులు తగటిపాగలు .

ప్రబంధ. ౭౦౫.

మేఘవహ్ని. సం వి. ఇ. పుం. మెఱుపు. విద్యుత్తు.

మేఘవాహనుఁడు. సం వి. అ. పుం. ఇంద్రుఁడు, మబ్బురాజు

**మేఘవిస్ఫూర్జితము.** సం. వి. అ. న. ౧. మేఘ ధ్వని, ఉఱుము.

౨. (ఛంద.) వృత్తభేదము.

**మేఘవేశ్మము.** సం. వి. న్ న ఆకాశము, మింగులుపట్టు.

**మేఘసారము.** సం వి. అ. పుం. ఒక దినుసు కర్పూరము, చీనకర్పూరము. (వాచ)

**మేఘసుహృదము.** సం వి చ్ పుం మయూరము, నెమిలి.

**మేఘాఖ్యము.** సం వి అ. న అభ్రకము.

**మేఘాగమము.** సం వి. అ పుం మబ్బులరాక, వర్షర్తువు, వర్షాకాలము

**మేఘానంద.** సం వి. ఆ. స్త్రీ. ఒకజాతికొంగ, ఒక విశేషము.

**మేఘానంది.** సం. వి న్ పుం మయూరము, నెమిలి

**మేఘాస్థి.** సం వి. ఇ. న కరక, వడగల్లు

**మేచకము.** సం. విశే. (అ. చికా. అ.) నల్లనిది, నలుపురంగు గలది.

వి. అ. పుం. ౧. నలుపు. ౨ నెమిలికన్ను. ౩. మేఘము. ౪ పొగ. ౫. చనుమొన.

న. ౧. చీకటి. ౨. స్రోతోంజనము.

**మేట.** వి. ప్రవాహముచే కొట్టికొనివచ్చి కమ్ము కొనిన యిసుక. (శ. ర.)

**మేటరి.** విశే. (మేటి + అరి స్వార్థమున) మేటి, శ్రేష్ఠుడు.

శా. జ్యోతిశ్శాస్త్రిలకెల్ల మేటరివి

భాగ. ౧౦. పూ. ౨౦౫.

**మేటి.** విశే. (క. మేటి) ౧. గొప్పవాడు.

(క) పరాక్రమమున.

క. గురుపుత్త్రుడు తేజోనిధి, సురాసురుల కైనఁ జేతిచూడ నరిది సంగరమున నీతని నీశ్వర, వరజనితుడు మేటి కౌరవవ్యూహమునన్.

భార. విరా. ౫. ౮.

(చ) ధనమున

సీ అచటిమేటికిరాటు లలకాధిపతులైన మును సంచిమొద లిచ్చి మనుప దక్షులు

మనుచ. ౧. ౫౦.

(ట) పరిమాణమున

గీ మేటినక్రంబు సందిటఁ బ్రాటఁ బట్టి

కాశీ. ౪. ౭౯.

క పోటరి రైరణములోన భుజబల మెల్లం, జేటపడఁ జూప కుండిన, మేటియశం బేల కలుగు మీరాజానకున్ విక్ర. ౪. ౭౯.

గీ పెటిలె బ్రహ్మాండభాండంబు చిటిలె దిక్కు, లురలె పాతాళభువనంబు లదిలె నభము, మేటిధాటీ జనితకాల కూటవిషము, చిచ్చు వెలువడి యంతంతఁ జెచ్చుపెరుఁగ

భీమ. ౪. ౭౧.

(త) విద్యలయందు.

క. చాటు ప్రబంధరచనా, పాటవకలితుఁడవు శబ్దపరిచితియందున్, మేటివి దీనిం దెనుఁ గునఁ, బాటించి రచింప నీవ ప్రౌఢుఁడ వరయన్.

రాఘవ. ౧ ౧౨.

(ప) కులాచారములయందు

శా. దుశ్శీలాగారము వారయావతము నిప్పో మేటి వాటించునే ..

పాండు. ౩. ౪౨.

౨. అధిపుఁడు, ప్రభువు.

గీ. అంబురాశి పదంబుల కచలములకు, సాహి
మాద్రి పక్షులకుఁ గక్ష్యపనతుండు, మేటి
యై యుప్పక్రియ నరకోటి కెల్లఁ, బ్రభుండ
వీ కౌక్కరుఁడ కావ పద్మనాభ.
హరి. పూ. ౭. ౨౦౬.

3. శ్రేష్ఠుఁడు.

మ. ఇం కేల చింతిల నీపుత్త్రులయందు మేటి
యనఁగా దీపించు విద్యాగరిష్ఠులలో
శ్రేష్ఠుఁడు బ్రహ్మనిష్ఠుఁడు గనిష్ఠుం డిందు
బింబాననా. ఉ. రా. ౨. ౧3౪.

సీ కస్నాకు మేల్పంతి నికరము మేటి
మేలు, . తనరు శ్రేష్ఠము
ఆం భా. 3. ౧౫

వి. (క మేద) (కసవు) వామి, (గడ్డి) కుప్ప.
(శ. ర.)

జ. మేటరి, మేటితనము, మేటిల్లు

మేటితనము. వి (మేటి + తనము) గొప్పతనము.

క. తనువు గలయాత్మ లెల్లన్, దనవశముగఁ
దనరుదండధరుఁ డట్లు విచ్చేతనుఁ డయ్యె
మద్భుజాఘూతక కింతియు చాలు మేటితన
మని యెలమిన్. హరి. ఉ. ౧౦. ౧౪౧.

మేటిల్లు. అ. క్రి. (√ మేటి) అతిశయించు.

క. నీమి మడివాల యే మ్మాభూమీశ్వరు నర్థిఁ
గానఁ బోయెదము సభాభూమికిఁ జనియెడు
వారికి, శ్రీ మేటిల్లంగ మంచిచీరలు వల
యున్. హరి. పూ. ౯. ౧3.

మేటులు. సం. వి. ఆ. స్త్రీ. ఆమలకి, ఉసిరిక
చెట్టు. ?

మేతి. సం. వి. ఇ. పుం. ౧. స్తంభము. ౨.
కళ్లము మధ్యమున నెడ్లను గట్టెడిరాడు.
(స్తంభము.)

మేతుఁడు. సం. వి. ఆ. పుం. మావటివాఁడు ఏనుఁ
గును నడుపువాఁడు.

మేడ. వి. ౧. సౌధము.

సీ. మేడల ముత్యాలమేలుకట్టులు గట్టి రత్న
దీపిక లగారముల నుంచి .
విక్ర. ౪. ౧3౭.

సీ. మే డన స జ్జన మేలుమ చ్చునఁగను నుప్పరి
గవ సౌధ మొప్పుచుండు .
ఆం. భా ౨. ౧౭.

సీ. మలయజం బేటిటఁ దొలుఁకెక్క డులిచి
మేడల కిడ్డమిగులు ధూములకు డిగ్గ
ఆము ౨ 3.

౨. దేవళము, దేవగృహము.

సీ. ఆడ కుక్కుటేశ్వరం బయ్యుపాంతము మేడ
హుంకారిణీ దేవియాలగంబు
భీమ 3. ౫౭.

మేడి. వి. అత్తి, ఉదుంబరము ?

గీ మేడిపండ్లను మొదలుగాఁ గూడిమాడి,
నెంచెతలు దత్తు రిత్తు విచ్చేయవయ్య ..
కాశి. 3. ౭౯.

దండకము. . నీ మెయి న్నల్వగ్రుడ్డుంగముల్
మేడిపండ్లన్ వలెం బ్రోవు లై యుండు .
నీలా. ౨. ౪౧.

సీ. అత్తిమేడి యనంగ నవు నుదుంబ
రంబు .. ఆం. భా. ౨. ౪౭.

మేడికాయబోనము = సారహీనము.

క. రాగంబు నొడిచి ము క్తి, శ్రీగారవముల
కోపితు చేయుమనుమలకున్, నాగేంద్రశయాన
యైహిక భోగం బిది మేడికాయబోనము
మమ్మి. విప్ర. ౨. ౬౦.

మేడించు = మేదించు. స. క్రి. (సం. మృద్)
మర్దించు.

సీ. భూఁదేశ జిలిబి కెంబుపావడి మేడించి
చుక్కబొట్టుగ దిద్ది నొక్కచెలిబి ...
చమ. ౧ ౪౪.

**మేదు.** వి. ౧. అజ్ఞానము.

(చూ. మేదుపడు.)

౨. వంచన, మోసము.

(చూ. మేదుపెట్టు.)

జ. మేదుపడు, మేదుపఱచు, మేదుపెట్టు.

**మేదుప(డ్డు)డు.** అ. క్రి. (√ మేదు) అజ్ఞత నొందు.

క ఈగిలిఁ గలంచు హారిద్రారాగం బది నిల్వదె
యిది రతి మేదుపడి సంభోగగతిఁ గలంచు
విటువివిరాగం బది నిల్చు భావరస జననం
బై. కు. సం ౭. ౧౬౩.

గీ. చవురుఁ దై మేదుపడి యడుగువాఁడు
దశకు. ౬. ౧౩౩.

ఉ. మేదుపడి రాజ్యగర్వమున మీఁదు తలంపవు
గాక ఉ. హరి. ౪. ౧౯౭.

ద్వి. ప్రామిడి రై మేదుపడియెదుదావఁ, గామి
నీ పెఱుఁగవే కడయింటిపాడువ .
బస. పు. ౪. ౫౦౩. పం.

(ప్రామిడి పై మైమఱడిరెంకు దావఁ,గామి .
ప్రాఁతప్రతి పా.)

**మేడము[1].** వి. (క. మేద) ౧. గుంపు, సంఘము.

సీ. రతికివా స్త్రీపకతారంగిపల్ వలగొని మేడపై
కనఁజూపుమేర నడవ .
ఉ. రా. ౩. ౧౭౬. (మేదమై శ. ర. పా.)

౨. యుద్ధము.

క. ఓరోరి వంకముక్కన, మూరుపు దెల్లి దిఁక
సేల రాఁడితి నన్నస్, వారికి మేడముఁ
బొడుతురె . బస. పు. ౬. ౨౫. (గ్రా.)

(మేదము పొడతురె. శ. ర. పా.)

ద్వి. ఓడితి సన్నస మేడము పొడువఁ, బాడియే.
బస. పు. ౬. ౫౭. పం.

**మేడము[2].** వి. చెక్కడపు జామికీయందు పని తనము. (శ. ర., గ్రా.)

**మేడము[3].** వి. గుదస్థానము.

సీ. వాఁడికొట్టుల నాఁటపైచి మేడములోన .
వి. పు. ౭. ౩౪౧.

**మేడ్పఱచు = మేడ్పెట్టు.** స. క్రి. (√ మేదు పడు) వంచించు.

సీ. దవాభ్యంతరమున, కరిగి మేడ్పఱచి
కామాతురుఁ జేసి యిమ్మునినాథు నిట దెచ్చె
ముదముతోఁడ . దశకు. ౫. ౩౫.

**మేడ్పెట్టు = మేడ్పఱచు.** స. క్రి. (మేదు + పెట్టు) వంచించు.

సీ. మును వనుపాలితుధనము పెద్దునఁ గొన్న
తరుణి మేడ్పెట్టెదువెఱవు గొఁఱలి
దశకు. ౫. ౭౭.

**మేఢ్రము.** సం. వి. అ. పుం. పొట్టేలు, గొఱ్ఱె పోతు.

న. శిశ్నము, పురుషునిగుహ్యావయవము.

**మేణత.** వి. ముట్టడి.

వ. కృష్ణరాయమహారాయలు వుదయగిరి
దుర్గంమీఁద విడిసి ప్రతాపరుద్రగజపతిని
కొండవీడు పర్యంతం విరుగంబొడిచి వుదయ
గిరిదుర్గానకు మేణత చేయించి దుర్గం
పుచ్చుకొని . సె. శా. ౩. ౧౩౭౬.

**మేతాలుపు(లు).** వి. (మే + తాలుపు) శరీరధారి.

సీ. పొర యియాని మేతాలుపులఁ జిట్టుమని పెం
కొలుపుచు రెండుకాళ్ళలు దవరిచి .
అప్ప. రా. బాల. ౧౦౬.

క. తల లేక నిరుళ్ళు లగుచేతులు గ్రాలఁగ వదవి లోన దొరకినమేకా,ళ్ళల నెల్లఁ బట్టి మ్రింగెడు, పాలమేపరి నొకనిఁ జూచి పొడ లిన కినుకన్. అచ్చ. రా. అర. ౧౧౪.

మేథి. సం. వి. ఇ. పుం కళ్లమునందు పశువులను కట్టుటకు పాఁతినరాటు.

మేథిక. సం. వి. ఆ. స్త్రీ. తృణవిశేషము, మెంతి శ.

మేథిని. సం వి. ఈ స్త్రీ. = మేథిక, తృణవిశే షము శ.

మేద. సం. వి ఆ. స్త్రీ ఒకానొక ఓషధి.

మేదకము. సం. వి. అ పుం ౧. పిండితో చేసినకల్లు. ౨. మద్యపిష్టము.

మేదకుఁడు. విణ. కొట్టిబాగులవాఁడు.

గీ. మతి లేని మేదకుండు, మానివర్యులఁ జది వించిమట్టినీడఁ, బంచముఖుపీఠ మే శోస రించె నేని పాండు. ౧. ౧౦౧.

ద్వి. ఒకవిచారము మాకు నొదవె నీరాజు, సుక వాసి పలిపంద చూపుగుజ్జంబు, మామిడిక్రింది సోమరి మేదకుండు

ద్వి. హరిశ్చ. ౧. ౧౪౯౪. పం.

సీ మితభాషి యగువాని మేదకుం డని పల్కు- జడుఁడంచు వచియించు శాంతిపరుని ..

రామలిం. ౩౭.

మేదజము. సం. వి. అ. న ఒకజాతి గుగ్గిలము.

మేదము. సం. వి అ. పుం. ౧. ఒకానొక సంకరజాతి. ౨. అలంబుస యనెడి యోషధి శ.

మేదర. వి. వెదురుతడకలు, చాపలు మున్నగునవి అల్లుకొని జీవించు ఒకజాతి. (శ. ర)

జ. మేదరి, మేదరిసాని.

మేదరి. వి. (మేదర+ఇ3) మేదరవాఁడు, వెదురు- బద్దలతో చాపలు లోనగునవి యల్లెడి యొకజాతి వాఁడు.

ద్వి. మీఁగుచుఁ జేటలమేమయ్య భువిని, దాఁ గాక మఱియు మేదరులు గొందఱకు, జీవితంబులు- చేసి చేటలు చాలఁ, గావించి .

పండితా. పురా. ౧౬౨. పా.

ద్వి. తనతోడితోడు మేదరులు సోదరులు

ద్వి. పరమ. ౨. ౧౨౪. పా.

మేదరిసాని. వి. (మేదరి + సాని) మేదరివాని భార్య.

సీ. కొడుకుఁగుఱ్ఱఁడు చన్నుఁ గుడువ కట్లుంట విచారించి మేదరిసాని యప్రడు .

పరమ. ౧. ౧౩౯.

మేదస్తేజస్సు. సం వి. స్. న. అస్థి, ఎముక.

మేదస్సు. సం. వి. స్. న వప, (సప్తధాతు వులలో నొకటి.)

మేదావి. వి. ౧. బ్రహ్మచారులు మేధావిర్భూ యాసమ్ అను మంత్రమును జెప్పుచు అగ్ని కార్యాంతమందు ధరించుబొట్టు

గీ. దబ్బ్రవేలియుంగరము మేదావిబొట్టు, మడుఁగు పేలిక పిరిచుట్టు పెడఁగుఁ గాఁగ, వడుగు చందంబు హరి. ౧. ౧౦. ౨౩౩.

సీ. మూర్తిత్రయీమధ్య మునివర్ణ మిదియ నాఁ ద్రైపుండ్రమధ్య మేదావి యొనర

రా. వి. ౨. ౮౬.

౨. అగ్నికార్యభస్మము.

వ. బొట్టునకు మేదావి మేనునలవాటునం గందిన యంగుళీద్వితయంబు దేఁటి గుట్టినం బృథగ్వర్ణమూర్త లగునంవత్రికలు గలజల

రుహం బనఁ బ్రశ స్తం బగుహ స్తం శె త్తి స్వ స్త్యస్తు తే యని యాశీర్వదించుట.

పాండు. ౪. ౧౫౧.

మేదించే = మేడించే. స. క్రి. (సం. మృద్.)

౧. మర్దించు.

సీ. మంచిపస్నిట మేదించినసారంగనాభి పంకం బున నాభిదీర్చి వరాహ. 3 ౧౦౯.

సీ. గోదలం పూయంగఁ గుమ్మి గందంబున మేదించినట్టి జవ్వాదియడుగు

యయా. ౧ ౧౧౯.

సీ గొజ్జంగిపూఁదేనె కలికి మేదించిన కమ్మ కస్తురి మేనఁ గలయ నలఁదు

కాశీ 3. ౧౧౭.

౨ సేయు, అభ్యసింపఁజేయు, మప్పు

సీ కోడె లన్నింటిని గూడంగఁ దోలించి మేదింప దుక్కికి మెసుకి లైన, మ్రుచ్చు గిత్తలఁ బట్టి ముకుద్రాళ్లు గుట్టించి

నా. పంచ. ౫ ౧3.

మేదిని. సం. వి ఈ. స్త్రీ. ౧. భూమి. ౨. ఒకానొక సంస్కృత నిఘంటువు. 3. మేద స్త్రీ.

మేదినీద్రవము. సం. వి. అ. పుం. దుమ్ము, ధూళి. (త్రి. వి.)

మేదినీపతి. సం. వి. ఇ. పుం. భూపతి, నేలఱేఁడు.

మేదిరము. వి (సం. మేదస్) మెదడు.

సీ. వాయునిచే మడిసినయంధకాసుర నాఁడు మెసఁగమే కడుపాం మేదిరములు .

మైరా. 3. ౧౪౫.

మేదు. స. క్రి. ౧. పూయు.

సీ. లోకపాలోన్నత ప్రాకారములయందు మృగమదపంకంబు మేదిరో కొ

భోజరా. ౨. ౧౦౧.

౨ మెదుపు.

వ. బొట్టునకు మేదావి మేదునలవాటునం గందినయంగుళీద్వితయంబు దేఁటి గుట్టినం బృథగ్వర్ణమూర్తు లగుసంవర్తికలు గలజలరుహం బన పాండు. ౪. ౧౫౨.

మేదుఁడు. సం. వి అ పుం ఒకానొక రాక్షసుఁడు.

మేదురము. సం విశే (అ ఆ అ) సాంద్రము, దట్టమైనది

మేదురితము. సం విశే (అ ఆ అ) దట్టమైనదిగాఁ జేయఁబడినది, సాంద్రీకృతము.

మేదోజము సం వి అ. న అస్థి, ఎముక.

మేదోర్బుదము. సం వి అ న. మేదోధాతువు.

మేధ. సం వి ఆ. స్త్రీ (సు, దుర్, వ్యతిరేకార్థకమగు నఞ్ అ, పూర్వపదముగా నుండిన బహువ్రీహిసమాసమున మేధస్ అని మారును. ఉ. సుమేధస్, దుర్మేధస్, అమేధస్).

౧. ధారణశక్తిగలబుద్ధి. ౨. తెలివి, బుద్ధి.

మేధము. సం. వి. అ. పుం ౧ యజ్ఞము. ౨. హవిస్సు. (కల్ప.)

మేధాజిత్తు. సం. వి. త్. పుం కాత్యాయనుఁడు. (త్రి. వి.)

మేధాతిథి. సం. వి. ఇ. పుం. మనుస్మృతిపై వ్యాఖ్యానము రచించిన యొక పండితుఁడు.

మేధారుద్రుఁడు. సం. వి. అ. పుం. కాళిదాసుఁడు. (త్రి. వి.)

మేధావంతుఁడు. సం. విశే. (త్, వతీ, త్) తెలివిగలవాఁడు, బుద్ధిమంతుఁడు.

మేధావి. సం. విశే. (న్. నీ న్.) ౧. చాలబుద్ధిమంతుఁడు, మంచిజ్ఞాపకశక్తి (ధారణ) గలవాఁడు ౨ తెలివి గలవాఁడు, బుద్ధిమంతుఁడు.

వి. న్. పుం. ౧. శుకము, రామచిలుక. ౨. మద్యము, సారాయి.

మేధావిని. సం. వి ఈ. స్త్రీ బ్రహ్మభార్య, సరస్వతి.

మేధి. సం. వి. ఇ. స్త్రీ. = మేథి

మేధ్య. సం. వి. ఆ. స్త్రీ. మండూకాద్యాది

శ్లో మండూకీ బ్రహ్మజా శంఖపుష్పీ జ్యోతిష్మతీ మునిః, విష్ణుక్రాంతా వచా శ్వేతా మేధ్యాయాం సప్త సమ్మతాః (రా ని)

మేధ్యము. సం. విశే. (అ. ఆ. అ) ౧ యజ్ఞమునకుఁ దగినది. ౨ పవిత్రమైనది.

వి. అ. పుం. ౧. ఛాగము, మేఁక ౨ ఖదిరవృక్షము, చండ్రచెట్టు. ౩ యవధాన్యము.

మేన. విశే. (√మేను) స్త్రీకి తోఁడఁబుట్టినవానియొక్కయు పురుషునకు తోఁడఁబుట్టిన దానియొక్కయు స్త్రీ పురుషులకు తండ్రి తోఁడఁబుట్టిన దానియొక్కయు తల్లితోఁడఁబుట్టిన వానియొక్కయు దేహసంబంధము కలవాఁడు; కలది.

(దీనికి వ్యస్తప్రయోగము లేదు)

ఉదా మేనల్లుఁడు, మేనత్త, మేనమామ

మేన. సం. వి. ఆ. స్త్రీ. హిమవంతునిభార్య యగు మేనక.

మేనక. సం. వి ఆ. స్త్రీ ౧. ఒకానొక యప్సరస్త్రీ. ౨. హిమవంతుని భార్య.

మేనకాత్మజ. సం. వి. ఆ. స్త్రీ. పార్వతి.

మేనకోడలు. వి. ఈ. (మేన + కోడలు) పురుషునకు తోఁడఁబుట్టినదాని కూఁతురు; స్త్రీకి తోఁడఁబుట్టినవాని కూఁతురు.

(వ్యవ.) ఆమె తనమేనకోడలినే కొడుకునకు చేసికొనవలె నని గట్టిపట్టు పట్టినది.

మేన(య)త్త వి. (మేన + అత్త) తండ్రితోఁడఁబుట్టినది

సీ. పద్మనాభుఁ, గానంగఁ జనుదెంచి కడుఁ బ్రీతి ని ట్లను నసఘ యే నీకు మేనత్త మగఁడ　　హరి ౧. ౧౩౬.

చ అతివికృతస్వరూపధరుఁ డైన కుమారకుఁ బ్రీతితోఁడ సాత్వతిఁ దమమేనయత్తను ముదంబునఁ జూడఁగఁ గోరి యద్భుత, ప్రతిభులు రామకేశవులు పన్నగ కేఁగిరి
భార. సభా. ౨. ౫౫.

మేనబావ. వి. (మేన + బావ) తనకంటె పెద్దవాఁ డగు మేనమామకొడుకు, మాతులేయుఁడు, తనకంటె పెద్దవాఁ డగు మేనత్త కొడుకు.

క నిను సెలుఁగి కుండి యాదవుఁ, డని సఖుఁ డని మేనబావ యని యే సహభోజనములు సల్లాపంబులు, నొనరించుచు మేలమాడుచుండుదు సెప్పుఁడున్
భార. భీష్మ. ౧. ౭౧౪.

ద్వి. కురునాయకుని కొలకొలమాటలకును, హరిమేనబావను నాత్మఁ గైకొనక .
అ మ కే. ౫. ౭౫౫. పా. ౭. పం.

సీ. మేనబా వని మేర మాని యుండక బుద్ధి ఖలదేవుసెడ భక్తి మెలఁగవమ్మ
ముకుంద. ౩. ౩౦౯.

మేనమఱఁదలు. వి. స్త్రీ. (మేన + మఱఁదలు) తనకంటె చిన్న దగుమేనమామ కూఁతురు; మేన త్తకూఁతురు.

సీ. భరతకులాగ్రణి పాండవసింహంబు సర్వ ధర్మజ్ఞుఁ డాసవ్యసాచి, తనమేనమఱఁదలి ధవళాక్షిఁ దోడ్కొని చనియె వాతని కది చనదె చెప్పఁడ

భార. ఆది. ౮ ౨౦౮.

ఉ. ఇది వీరభద్రధ్వజ వీర్యశుల్కయే, మిన్నక కాదు నీదయినమేనమఱందలు నీక చేర నీ, యమ్మఁ బరిగ్రహింపుము

హరి పూ ౬ ౧౬౮.

మ సందర్శనశోణిపా, ద్యమజన్ మేన మఱందలిన్ విమలలోలాపాంగన్ వన జాతాక్షుఁడు పెండ్లియాడె నిహితప్రాతంబు ప్రీతంబుగన్ భాగ ౧౦ ఉ ౧౮౫.

మేనమఱఁది. వి (మేన + మఱఁది) తన కంటెఁ చిన్నవాఁడగు మేనమామకొడుకు, మేన త్తకొడుకు.

చ భువనము లాక్కపెట్టు మృతిఁ బొందిన జీవము లావహింప నేర్త వలచినట్లులైన గుణరూఢుఁడు మేనమఱంది పొత్రుఁజూ, వవిడుతె

నా ర అశ్వ 3 ౧౩౩

మేనమామ. వి (మేన + మామ) తల్లితోఁ బుట్టినవాఁడు, మాతులుఁడు

క. మదమథనుఁ డాత్మజంబున, మధురగ కుతిచి కదలి మేనమామఁ దగఁ దడీ, యధరిత్రికి నీడుకొలిపి, యధికప్రమదంబుతోడ నన్నయుఁ దానున్

హరి. ఉ. ౧. ౧౬౯

గీ. మిహిమిహరనీమ వలరాజు మేనమామ .

మనుచ. ౧. ౧౭.

క. కంచితిఁ జని బహువిభవస, మంచిత మగు మేనమామమందిరము ప్రవేశించి తనవనితఁ గమఁగొని, సంచలత వహించి గుండె జల్లన నున్నన్ ..

వి(క్ర. ౩. ౧౩౬.

మేనత్తరికము. వి. (మేన + ఱికము) ౧. మేన మామకూఁతును మేన త్తకొడుకున కిచ్చి చేయు పెండ్లి సంబంధము.

(తోఁడఁబుట్టిన దానియొక్కయు తండ్రితోడఁ బుట్టిన దానియొక్కయు దేహసంబంధ భావము. శ. ర)

(వ్యవ.) వారిపిల్లవానికి మేనత్తరికమే కాని పై సంబంధము చేయరు

౨. పరిహాసము.

ఉ. గిరీశ గళిమూలహాలాహల కాలకాం తితో, మేనత్తరికంబు లాడుతనమేటి త్రిశూ లముఁ బూని యుద్ధతిన్

మనుచ. ర. ౯౬.

మేన(య)ల్లుఁడు వి (మేన + అల్లుఁడు బ. మేనల్లురు, మేనయల్లురు) పురుషునకుఁ దోఁడఁ బుట్టిన దానికొడుకు, భాగినేయుఁడు; స్త్రీకి తోడఁబుట్టిన వానికొడుకు.

మ. హరిమేనల్లుఁడు గొంతికూర్చుమనుమం డ స్మత్తనూజుండు

భార. ద్రో. ౨. ౨౦౬.

సీ అమ్మహాసురుని మేనల్లుఁడు లవణుండు మధు దైత్య తనయుఁ డున్మాద బలుఁడు

హరి. పూ. ౫. ౫౯.

క. నినుఁ బట్టి పాండుపుత్రులఁ, దన, మేనల్లురఁ దొఱంగె ధరణీశ్వర ..

భార. శల్య. ౧. ౩౯.

శా. నా మేనల్లురు బాహుసత్త్వనిశసన్మాహాత్మ్య విఖ్యాతు లా, రాముం గృష్ణునిఁ జూచు వేడుక మనోరంగింబున దాడెడున్ ...

హరి. పూ. ౭. ౩౫.

మేవాదము. సం. వి. అ. పుం. ౧. మయూరము, నెమలి. ౨. పిల్లి 3. మేఁక.

మేని. వి కాంతి. (శ. ర.)

మేను = మే. వి. ఔ ౧. శరీరము

(కొన్నియెడల దీనికి హల్లు పరమగునపు డుత్వలోపము)

సీ అతఁడు పంౘడెండు వాలమ్ము లాలీభత్సు మెయిఁ గ్రుచ్చి కృష్ణుని మేనియందుఁ, బది వాలు తూపులు పఱపిన మదిలోన నగ్గించి
భార. శల్య. ౧. ౨౧౨.

సీ. మెలఁత మేనిమెఱుంగు మెఱయు కారు మెఱుంగు చిగురు కెంపులక్రోవి చిన్నిమోవి.
విక్ర ౧. ౧౧౯

ఉ న, న్మిఱఁగ భానిపీఠి నాకనిం బురిఁ గానవియట్లు గాఁగ మేన్, గాతియ వెట్టి రైన నొడికంబుగ వండుదు వెల్ల గూరలున్ భార. విరా. ౧. ౩౩
ఆం భా. ౨ ౧3౪.

౨. జన్మము, పుట్టువు.

పీ. ఏమిటఁ జూచిన నీయింతి తొలుమేన సుకృతంబు సేయుట ప్రకట మయ్యె .
విక్ర. ౪. ౧౯౭

క. విను ప్రద్యుమ్నునిఁ దక్కన్, మనమున నేనొరు వరించుమాట విడువు మ్మాఘనుఁ డొల్లకున్నఁ జెందుదు, మనసిజ శిఖిఁ దనువు ౘేర్చి మఱుసటి మేనన్
ప్రభా. 3 ౧౦౨.

గీ. శౌరి తొలుమేనఁ దన కైన కొడవరెల్ల, మాన్పుతోన వచ్చి పారి. ౧ ౧౩

3. పార్శ్వము, ప్రక్క.

(ఇరుమేను = రెండుప్రక్కలు.)

గీ. తజిమి సాత్యకి గృతవర్మ దాఁక నతఁడు, నేది మార్కొన నిరుమేను పూచి యొప్పు, మిగులు మోదుగుప్రాఁకులపగిది గాఁగ నడర మార్కొన్న రెండు వాలంపగములు.
భార భీష్మ. ౧. ౨౪౧.

క పెంబో తద్దాసరి యుగ్మపుం బదహతులను గపోలపోటుల నిరుమేనం బొడుచుచుఁ బెనఁగుచు బోవం బట్టి పటంబుఁ జేర్చి వాఁడి ట్లనియెన్. ఆము. ౬. ౨౪.

మేనుపూను = జన్మమెత్తు, అవతరించు.

మేనుమఱచు = ఒడలెఱుంగకుండు, పరవశమగు

సీ. మరువంపువలపుఁ బల్మఱు గ్రోలి గ్రోలి కన్ ప్రాన్పి యూఆలి మేనుమఱచుఁ గొన్ని
పాండు ౧. ౧౭౧.

మేనువైచు = పండుకొను, శయనించు

వ అయ్యింతి నీకాంత భవనంబున విరహశయ్యపై మేనువైచి చింతాక్రాంతయై యుండె
శివరా. ౨. ౨౨.

గీ జన్నంపుఁ గూటిదొరల, మాటకయి మేను పూనిన మేటిపేల్పు నీలా. 3. ౫౧.

జ' మేన, మేనకోడలు, మేనత్త, మేనబావ, మేనమఱఁదలు, మేనమఱఁది, మేనమామ, మేనతీకము, మేనల్లుఁడు.

మేపరి. విశ. (మేపు + అరి) తినువాఁడు. (చూ. పాలమేపరి.)

మేపాడు. అ. క్రి, (మేపు + ఆడు) ఆహారము గొను.

క. పాలమున మేపాడి కపిం,జల వ త్తటి మఱలి వచ్చి కళము నివాస,స్థలిఁ గనుఁగొని .
వేం. పంచ. 3. ౧౦౭.

(మేఁతాడు. శ. ర. పా.)

మేపు. స. క్రి. (√మేయు) పశుపక్ష్యాదులను ఆహారము తినునట్లు చేయు.

(ఇది మనుష్యాహారవిషయమున నిందాద్యోతక ముగా నుపయోగింపఁబడును.)

సీ. వత్సముల్ మేపుచు వత్సన్నపుఁడు
దశా. ౨ ౧౫౫.

క నృప కృప, చాలం గారాకు మేపి
చంపకు ప్రజలన్ ఆము 3 3౭.

(వ్యవ.) చిన్న తనమునుండియు వీరి కుటుంబము నంతయు తెగ మేపఁగా తుదకు విశ్వాసఘాతుక్కు లైనారు. వానిని అత్తవారు చాలాకాలము మేపినారు

వి ౧. (పశుపక్ష్యాదుల) ఆహారము, తిండి

క. రేపకడ నీరు ద్రావక, మేపు గానక మున్న
గోవు మిక్కిలి భక్తిన్
భార. ఆను. 3. ౧౭.

క గోపకుమారశేఖరు, సేపున సర్పంబు గఱచు టీక్షించి వగన్, మేపులకు దొలఁగి గోపులు, వాపోవుచు నుండె వృషభ వత్సంబులతోన్.
భాగ. ౧౦. పూ. ౭౪౭

చ. కనుకని తెల్లవారుదనుక ప్రతి గోరెడు పల్ల వాళిమే, ల్గమఁగాని వీడెముంగలుపు లాహిరి మేపుల విద్రఁబుచ్చి చెంది వ చిఱునవ్వుతో నపుడె విద్దురలా యని వింతపైఁడి పుట్టిన కెలముద్దుగుమ్మలు వడిన్ శయించిరి చప్ప రంబులన్ కువల. ౨. ౧౧౭.

౨ దోశ పిండి మెందలైనదానికి నూతి కూడఁ జేర్చెడు మినపపప్పు లోనగునది. (శ. ర.)

మేపుట్టువు. వి. (మే + పుట్టువు) ౧. కుమా రుఁడు, ఆత్మజుఁడు.

ఆ. అనిది సోఁకుతోని యనుఁగు మేపుట్టువుఁ, బొదివికొనిన వాఁడు పదరి లేచి, బ్రహ్మ పోవఁజెట్టి బ్రహ్మిడిఁ దె కొక్కి కడిఁది పగ కనంబుఁ గదలుకొనఁగ .
అచ్చ రా. యు. 3౪౦.

౨. కూఁతురు, తనూజ (శ. ర.)

మేపుడు. విణ (√మేయు) మేయునది

క గాలికవణంబు మేపుడు, చాలు పులంబోలి తరకసంబున నొఱపూ, స్మైలి యపరంజిపిం జల, వాలారుందూపు లుఱక వామిగ చేసెన్. అచ్చ రా యు. ౨౯3

మేమఱుఁగు. వి (మే + మఱుఁగు) మైమఱువు, కవచము.

సీ మైమఱు వవఁగను మేమఱుఁ గనఁ గ త్తిమ్మనఁగా బొందళం బనంగ, జో డనఁ గవ చంబు కొఖిల్లు ఆం భా ౭ ౭౦౪.

మేము. అ క్రి స క్రి అంగీకరించు, ఒప్పుకొను (చూ మేముడు)

జః మేముడు

మేముడు. వి (√మేము) అంగీకారము, ఒప్పు దల.

సీ. ఇయ్యకో లొప్పుకో లీకోలు మైకోలు మే కోలు సమకోలు మేము డొడఁబడిక యొడఁబా టనుట కనుపట్టుచునుండు సమ్మతి పేరు ఆం. భా. ౧. ౧౦౪.

మేమెయి = మయిమయి, మేమే, మైమై. వి. అనాయాసము.

"క్రి. విణ. అనాయాసముగా" అని (శ. ర.)

ఉ. వాలి రొమ్ములంగు నూపి కృతవర్ముఁడు సైన్యము నిల్వరించి యుస్మిలితవిక్రమం బగుడు మేమెయి వాతనిఁ దాఁకె నమ్రుని, ద్యాలసితుండు సాత్యకి .
భార కల్య. ౧. 3౭౭.

గీ. వారి మేమెయిఁ గొనియాడువారికోర్కు, లాచర జంగమమల్లికార్జునుఁడు నొసఁగు
కు సం ౧.౨. ౧౦౦౪.

ఉ. ఆటున మూర్ఛబోయినఁ బ్రహస్తుఁ గనుం గొని యింకఁ దాఁకినన్, గీటడఁగించు నర్జునుఁడు గేవలుఁడే యని భీతచిత్తులై, మేటిమగల్ సలం బెదరి మేమెయి మార్కొన లేక పాఱినం, గాటుకకొండ వోలె దళకింతుఁ జెదిర్చి మహీమహేం ద్రునిన్.
నిర్వ ౪ ౫౨

మేమే[1] = మేమెయి.

మ ఇద్దరున్ భుజబలాటోపంబుపై నొండొ రున్, మిగులం జాలక కొంతసేపువడి మేమేఁ బోరి రుగ్రాకృతిన్
భార. విరా. ౨. ౩౪౩.

మేమే[2]. వి శాడనాదులయందు దుఃఖమువలన కలుగుధ్వని కనుకరణము.

క. సామీ యల్లధరాసురు, సామీకృతదే హుఁగా వచఃకశచేతన్, మేమే శిక్షించుతతి, స్మే మే యన విడిచినాము మిము దూరు టచేన్.
పార్వ. ౪ ౧౭౭.

మేయము. సం విశే. (అ. ఆ. అ.) ౧. కొలువఁ దగినది. ౨. జ్ఞేయము, తెలియఁ దగినది.

మేయించె. సం స క్రి. ఊహించు, అను మానముసేయు.

క. ఆరయఁ నిద్దఱుమిండలఁ, బాయక రతి సల్పుకాఁపపడఁతుక రొట్టులన్, మేయించి బొంకవలెఁ జెపు, మా యని చక్రాంగవంశ మండన మనినన్.
హంస. ౪. ౧౬౧.

మేయు. స. క్రి. (పశ్వాదులు) తిను, భక్షించు.

చ. పసుఁదిగురాకు మేయుకతి కోరికలంతులఁ దేఁటి గుట్టినన్, వనతరుశాఖలన్ గుపతువ ధ్వనిఁ బాఱుపికాంగనన్
మనుచ. ౩ ౭౨.

సీ. ఎల్లకడల, మెలఁగుచు నవి సెల్ల మేయుచు గోదలు వెలుగులు పెండెములో విఱుగఁ ద్రొక్కి
నీలా. ౨. ౪౩.

వ. తియ్యనికోరం జేదు మేయుట నాయంబు గాదు .
ప్రభా. ౧ ౯౦.

౨. అనుభవించు.

క వాని నయినాఁడ రాముని, చే నొగచేపట్టు మేసి చిత్తంబున కుద్యానారామపదం బవ, సానవిరామామ్నాయంబు జుఱు కగు వనినన్
చం రా ౫. ౬౦

౩. నోటనుంచు.

మ కలుచం గోశబిలంబు వెల్వడి యదుఃఖడ్గా హిపై వచ్చుచోఁ, జలనం బించుక లేక యాతనిరిపుక్ష్మాపాలసంఘాత మా, చెల హాస్తాంబురుహాంగుళీమయమహాసిద్ధౌషధీ పల్ల వాంచలము ల్మేసి భజించుజాంగులికతన్ సంగ్రామరంగంబునన్.
సైమ. ౫. ౧౨౭.

జ. మేఁత, మేఁతకాఁడు, మేఁతరి, మేఁతరీఁడు, మేఁతలాఁడు, మేపరి, మేపాడు, మేపు, మేపుడు.

మేర. వి. ౧. ప్రదేశము, చోటు. (సం. మిరా, ప్రా. మేరా, క మేరె)

సీ. విట్టలు ద్రోచుచు సెరవులకలమేర కెల్లను బిగిరొక్కి యేర్పడంగ . .
భార. విరా. ౧. ౨౪౫.

చ. మదగజరాజకుంభముల మచ్చరికించు చకోర కుంభముల్, గదిసి కలంతమేరయునుఁ గైకొని యున్నవి యుల్లవారికిన్, విదితము గాఁగ ...
సైమ. ౭. ౬౫.

సీ. ఒకమేర కుకుమారసకుమార శరవీరవరవీర
తరుసముత్కార మెసంగ .
ఇందు. 3. 30.

౨. క్రమము, విధము.

సీ. సూశరపతిమేర సేశపద్ధతిఁ బూని యలరు
విల్తునిభంగి యతనుతఁ గని
ప్రబంధ ౬.

మ. అమలాత్మం దగునట్టిధీరునకు పింగాధీశతి
మ్మావనీ, రమణీనాథకుమార తిమ్మమనుజేంద్ర
స్వామిరంగతమా, రమణు ల్లద్ధి ధరిత్రి దాశ
రథిమేర ద్దాల్చివారు భాను. ౧ ౨౩.

సీ. భయభ క్తియు క్తి సెప్పటిమేరఁ దనయాజ్ఞఁ
బాలింప దర్యోను జారకులము
దశా ౨. ౫౧

3. ధర్మము, న్యాయము.

చ. అమృతంబు సురాళికిఁ బంచిపెట్టె నిం,
కెటువలె నమ్మ వచ్చు జగదీశ్వరుఁడే యొక
యింత మేర లే, కిటువలెఁ జేయఁ జూచె
మన కెయ్యది తప్ప గణించి చూడఁగన్ .
దశా. ౨. ౩౮౨.

గీ. అప్పు డట నుండ మేర గా దనుచు మేము,
విడిచి కీమెను దోడ్కొని వెడలి రాఁగ,
నతఁడు చపవల దం చని యడ్డగింప
పార్వ ౪. ౧౬౦.

శా. చేరన్ బోవఁ బ్రభాను లడ్డమయి యాత్మే,
పించి యట్లేఁగఁగా, మేరా నీ కెటఁ బోయి
దెవ్వఁడవు ఉ. రా. 3. ౨30.

౪. ఏర్పాటు.

క. ఏమిట నీ కేఁ దక్కు వ, నామేరకు నడ్డపడి
తివి భార. ఉద్యో. 3. ౨౯౬.

ద్వి. ఆమేర శిల్పను నబ్జాం డెటిఁగి, సామీఁదఁ
గోపించి నయ మింత లేక .
రం రా. యు. ౨౯౩. పా. ౫. పం.

గీ. కెలంచి పలుమాఱుఁ దా కెడివిఘ్నభటులు,
మిమ్ము సెగచుట దైవంబుమేర గాదె,
మనకు సెప్పుడు దైవంబు మంచి దగును,
నాఁడు గెలుతము పగవారి నేఁడు వలదు.
భాగ. ౧. ౬౩౬.

౫. మర్యాద, హద్దు.

ఉ. అంబుధి మేర తూర్పునకు నద్దియ నీ మటు
యామ్యదిగ్విభా, గంబునకుం బ్రతీచికిని
గాతమి సీమ భీమ. ౫. ౩౬.

శా ఓం,రారా యాసకు మేర లే దనుట
సత్యంబే కదా భారతిన్
దశా ౨ ౨౪౬. ౬౦ భా. ౨ ౧౯౧.

(కుద, అంతము అని భావము)

౬. దూరము

వ మహానుభావులం గొంతమేర దైనం గొలిచి
వచ్చుట భాగ్యంబు కాదే
కళా ౧. ౫౩.

మ. ఇరువై నాలుగుమూళ్ల మేర యని గోపక్కిం
పగా నేల కాశీ. ౧. ౫౩.

౭. పద్ధతి

క. మీ రరయనిధర్మంబుల, మేరలు సెటుక
లును గలవె మీకుం దగ నే, నారాయణభ క్తి
పరత, వారించెద ననుట యిట్లు వైదిక
వర్యా న్ఫ. పిం. ౫. ౧౭.

మేరకంబము = సరిహద్దు దెలుపుటకు పాతిన
కంబము.

మ. స్వగతక్షోణికి మేరకంబములు ప్రాక్ప్రత్యా
లంబు నస్త్రాద్రియున్. కవిక. 3. ౧౪౬.

మేరమానిసి = మర్యాదగల మనుజుఁడు, పెద్ద
మనిషి.

గీ మేరమానిసి పా దుపకారి గోల, నిర్మ
లుండు సారంగ. ౨. ౭౬౪.

మేర(లు)మీాఱు = అధికమగు.

సీ. వారాశిగర్వంబు మేరమీాఱె .

మనుచ. ౩. ౨౩.

ఉ. విషాదహర్షములు మేరలుమీాఱుట

లేర్పడక బడక్, దోఁచె నభస్వరత్స్వర

విషాదమచూడ్కుల నీఱు నిప్పులన్

కళా. ౨. ౧౨౭

మేరవెట్టు = కట్టడసేయు.

ఆ శిఖలు చూపకుండ శిక్షింప హంతికిన్సై, నోరు

దెరవకుండ మేరవెట్టి, వేఁడి యెల్ల నడిపి

విబుధారి కినుకన్సై, భీతిస్రాంతుఁ జేసె భీతి

హాోత్రు నృసిం. ౨ ౧౧౭

జ మేరగట్టు.

మేరకుఁడు. సం వి అ పుం ఎష్ణుశత్రువు

మేరగట్టు. వి. (మేర + గట్టు) చక్రవాళ పర్వతము

సీ. చుట్టుకొం దన మేరగ ట్టనఁ జక్రవాళాచల సంజ్ఞ లై యలరు ఆం భా. ౭. ౨౭.

మేరు(వు). సం. వి. ఉ. పుం. హేమాద్రి, సుమేరుపర్వతము.

మ. బలవన్మేరుశరాసనంబును బరబ్రహ్మ

స్త్రముం గల్గుబ,ల్పెలుకానిం దృణ మైన

చాపమున గాలిం బోవుపేయగ్గాలం, జల

మూనించి సగంబు చేసి తవు నా సంకల్ప

సిద్ధుల్ గానం, బలుమేరు న్నిరసింప

లేఁజేగురుఁగొమ్మం జేవ గాకుండునే.

వసు. ౩ ౧౮౩.

ఉ. అక్కట దిక్కులేమి రజతాచల మొక్కఁడు

పెల్లగించె పైతొక్కఁడు వంచె మేరు మతి

యొక్కఁడు వింధ్యము నేల దాచె .

చంద్రా. ౧ ౧౪.

మేరుకము. సం. వి. అ. పుం. ధూపము, యక్షధూపము, (వాచ)

మేరుధాముఁడు. సం. వి న్ పుం. శివుఁడు.

మేరుపృష్ఠము. సం. వి అ. న. ౧. స్వర్గము. ౨. ఆకాశము.

మేరువు. వి. ౧. వీణాగ్రము.

ఉ పచ్చలం, బన్నినయట్టి మేరువును

బాగగుతంత్రులు మించ నొప్పమే,ల్కొన్నర

కెంతఁ జేరి యొకకిన్నరకంతి యొసంగ

నయ్యెడన్.

చంద్రి ౭. ౯౪. అం బా. ౧. ౧౨౬

౨ ఎక్కుటకును బరువెక్కించుటకును పొడుగుగా కట్టవలె వేయించెడియినుక లోనగు

వానిదిబ్బ, సొరువ.

క. మేరువలతీరు కురుఁజాల,సౌరు వితానప్రతాన

చతురపతాకా, చారువిపణి గారుడమణి,

తోరణఘృణి యేమి చెప్పుదుం బురిలోనన్.

రా. వి ౪. ౪౯.

ఉ. వేడుక వి ట్లగణ్యారుచివిభ్రమధన్యయగేంద్ర

కన్య రాఁ, బూడఁ దలంచి నిల్చిరి

వసుక్షితిపాలపురీపురంధ్రికల్, మాడువు

లన్ హజారముల మచ్చుల సజ్జల గోపురం

బులన్, మేడల నాట్యశాలికల మేరువలన్

భువనేశ్వరంబులన్. వసు. ౬. ౬౪.

గీ. ఎచటఁ జూచిన నాణిగా నేర్పరించి, పెద్ద

ముత్యాల ముగ్గులు పెట్టువారు, కొందఁ

బగడఁపుమేరువు లెత్తువారు, నైరి వీటను

గలిగినవారి లెల్ల.

యయా. ౪. ౭౧. విజ. వి. ౨. ౭౯.

౩. హారము మధ్యమందు గ్రవేలెడుమణి. (శ ర.)

మేల. సం. వి. ఆ. స్త్రీ. ౧. సంగమము, కూడిక.

౨. సభ, పెక్కండ్రు కలిసినసంఘము. ౩.

మర్మా, కాటుక. ౪. నీలిమందుచెట్టు. ౫. మసి, సిరా ౬. రాగానుగుణముగ స్వరస్థానముల యందు మెట్లు కుదుర్చుట, శ్రుతి పెట్టుట.

మేలగొను. అ క్రి (మేలము + కొను) పరిహాసకములాడు, మేలమాడు

సీ. సునుపెడంద యురంబునను జీనిసరిపెణ
ల్మిన్నజిన్నిదముతో మేలగొనఁగ
దశా. ౧ ౨౮

మేలనము. సం వి. అ. న ౧ కూడిక, సంగమము, కలయిక ౨ సభ, పెక్కండ్రు కలసి చేరుట ౩ కలుపుట ౪ యుద్ధము, తాఁకుట

మేలమాట. వి (√మేలమాడు) పరిహాసము చేయుట

చ. గురుతర సుందరాననము కోమలికంబులు
ముద్దుమాటలు, న్నరపు లతిప్రసంగములు
నప్పుట నప్పుట మేలమాట లం,తరిత కళా
విధానములఁ దాడనపీడన భాషణంబులున్,
బరువడి నొందనేర్చు ప్రియభాషలు గల్గు
నరేంద్రభామకున్ వీధి ౬.

మేలమాడు. అ క్రి. (మేలము + ఆడు) పరిహసించు, గేలిసేయు.

క. నిను నెఱుఁగి కుండి యాదవుఁ, డని సఖుఁ
డని మేనబావ యని యే నహహా,జనములు
సల్లాపంబులు, నొనరించుచు మేలమాడు
చుందుదు నెపుడున్.
భార. భీష్మ ౧. ౨౧౮

గీ. ఓమె యేమె యి దే మేమె లేమ యేమె,
మేఘపుష్పంబు దే వంచు మేలమాడ,
మేమెమేమెలు దఱుచయ్యె మేలుమేలు,
మేఁక మేఁ కన సభవారు మిగుల నగిరి.
హైమ. ౬. ౧౧౪.

సీ. కలహంసగమనల కన్నులబెళుకులు మీన
పత్రులతోఁడ మేలమాడ అని. ౨. ౫౬.

(ఇట నుపమాద్యోతకము)

మ. · తమలముం బుష్పంబులున్ లోనుగా,
లలితద్రవ్యము లెల్ల నా కొసఁగ మేలం
బాడుచున్ శ్రీతిలోన్ దశకు. ౪. ౭౦.

మేలము. వి ౧. పరిహాసము.

క. వనితలు మేలపు మెయి మెలు,పునఁ దిగిచిన
నొప్పుహారములు మొదలగుప్ర,వ్నితోడవులు
గ్రద్దలు తివి,యనరేంద్రులు కొంద ఱునికి
యచ్చ్యుత కంటే. భార స్త్రీ ౨ ౧౮.

వ. అన్నారీనివహంబును మేలంపుమాటలకై వడి
హంసగిమన హంసాభిముఖి యైన యాత్రఁ
బెద్దలు నిషేధింతురనుమీ యనుచు
నైష ౨ ౪౬.

గీ మేల మన మందమేల మనఁగఁ,
బొలుచుఁ బరిహాసములు
ఆం భా ౧. ౧౩౬.

౨. పరిహాసోక్తి.

క. రాజునకుఁ దియ్య మెసఁగెడు, పూజావచన
ముల నెయ్యపుంబలుకులఁ జే,రోజ మెయి
బంధుమిత్రప,మాజములకు మేలములఁ గుమా
రులకుఁ దగన్ .
భార ఉద్యో. ౩. ౧౮౬.

చ. బలిదనుజేంద్రుఁ గట్టి తని పల్కఁగ విందుము
గాని నేడు మా,చెలి యెద పుష్పదామక
ముచే నినుఁ గట్టఁగఁ గంటి మింక నె,మ్మెలు
పచరింప రా దనుచు మేలము లాడెదునత్య
భోంట్లు సన్నుల నెసకొల్పుచుం గెలన
నవ్విరి ధర్మజభీమ ఫల్గునుల్.
పారి. ౫. ౭౧.

౩. జాగరూకత.

క. ఆలోసన తా మేల్కని, బాలారత్నంబు కూర్మిపతి కౌఁగిటిలో, నాలీఢ యగుటఁ గదలక, మేలమ్మున నుండె విభుఁడు మేల్కను నసుచున్. కృ. శతం 3. ౫౯.

జ. మేలగాను, మేలమాట, మేలమాడు.

మేలము. సం వి అ. పుం. కలయిక, మేలనము

క. అమ్మదిత రత్నకటకచ్చయ మ్మదితనినాద మస్యో నర్యోదఁ జల మే, ల మ్మని పతితోఁ దగు మేల మ్మని సహజానుర క్తి లాలించు క్రియన్ వసు. ౬. ౭౦

సీ. పొలుపొంద నలగుణంబులపై క్రతువు ల్గార్చి సారెఁ దస్మేళ ప్రకార మరసి హ న ౨ ౬౭.

౨. నివాసము

సీ. రమణ లక్ష్మీ మందిరమ్ము మేలమ్ముగాఁ గని సదాళి గుణమ్ముగా గ్రహించి . బిల్హ. ౧ ౪౪

మేల(క)ము. సం వి అ పుం ౧ సమావేశము, కలయిక ౨. ఐకమత్యము. 3. అంగడి, బజారు; సంత. ౪ సంఘము. ౫. సభ

మేలాంధుకము. సం వి అ పుం. మసిబుడ్డి, సిరాబుడ్డి.

మేలాంబువు. సం వి. ఉ. పుం. మసిబుడ్డి, సిరాబుడ్డి. (వై ని)

మేలానందము. సం. వి. అ పుం మసిబుడ్డి, సిరాబుడ్డి. (వై. ని.)

మేలిగాఁడు. వి (మేలిమి + కాఁడు) శ్రేష్ఠుఁడు.

సీ. సలుపకూ పదిలోని బలిమిమై వర్గోసకారి రక్కసు మేలిగానిమీఁద, సేవిన అచ్చ. రా. యు ౨౬౭.

మేలిమి(ల్మి). వి. (మేలు+ఇమి) ౧. శ్రేష్ఠత; ఆధిక్యము.

చ ఏమిగతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా భార. ఉద్యో. 3. ౨౧

ఉ ఆజకిం, బూనితి నిల్వ నింక నెటఁ బోవఁగ వచ్చు భవద్దిగీశల, క్ష్మీవిరవద్య భోగముల మేలిమికిం దుది యయ్యె నియ్యెదన్ హరి. ఉ ౭. ౬౭౧

క. మేలిమి నేసె మృగాంకుని, మేలిమి గను రతి యిడె ను మేఘుఁడు నుదుటన్ దశా ౫ ౩౫.

చ చవుపుల మేలు సామపస చక్కఁదనంబు తెఱంగు సంపదం, బొదలెడు మేల్మి పేర్మి గల భూరిభుజాబల శౌర్యధైర్యముల్, సద యతయు న్వివేకసరసస్థితు లాకృతిఁ జెందఁగా యనన్ శుక ౧. ౨౬3.

౨ అపరంజి, ప్రశ స్తమైన బంగారము.

ఉ. చొక్కపు రత్నపుందళుకు సోయగపున్నెర మేల్మితోట్లలో, మక్కువ నుంచి తేట వగమాటలు నీ కెనయన్ సువర్ణస, మ్యక్కర కంకణధ్వనులు మార్మలయం గొలుసుల్ గదల్చుచున్, జొక్కుచు రాజనందనకు జోలలు పాడుదు రంగనామణుల్ ఇందు. ౨ ౧౪౦

సీ. . అతిశుద్ధచామీకరాఖ్యలం చనుఁ గడాని, మేలిమి యపరంజి జాళువా కుందనం బుదిరి నా . ఆం. భా. ౨. ౨౩౯.

3. వలపు, ప్రేమ.

గీ. అనిన విని యావికాల యారౌర యనుచు, మెచ్చి తనమదిలోఁ గలమేలి మెల్లఁ దెలిసి తిని జాణ వౌ దని పలికె హంస. 3 ౨౨౭

విశే. ౧. శ్రేష్ఠము, ఉత్కృష్టము.

(దీనికి వ్యుత్పత్తియం దంత్యవర్ణము వికల్పముగా లోపించును.)

వ. కయ్యంబు గెలిచెగాఁ దలంచుచు వాని పిన్నతమ్ముండు మేలిమిరథంబునం దగుకు రంగంబులం బూన్చికొని
భార. ద్రో. ౪. ౨౬౫.

ద్వి. మా రానతిచ్చిన మేలిమిమాట, వారు వీరన కెల్లవారికి హితము
రం రా. అయో. ౯౬. పా ౧౬. పం

సీ. సభాపర్వంబు విని పావిష్య, మిదునది యారణ్య మింపార విని తనిపండ్లును మేలి దుంపలును శీతజలకుంభములు గలసర్వకామ సమృద్ధి గలిగించునన్న మిం పాలయ నొసఁగఁగీదగు
హరి ఉ ౧౦ ౩౦౦

గీ పాలఁ బుట్టినమాత్రాన మేలిగుణము, సేఁకు నీ కేల గల్గు కోనీరజాక్షి
మనుచ 3 ౪౧.

౨. శుభప్రదము, మేలుకలిగించునది

ద్వి. మేదినీవిభుఁగాంచి మేల్మియక్షతలు, వేద మంత్రముల దీవించి యిచ్చుటయు
ద్వి. హరిశ్చ పూ. ౪౪౪ పం

మేలిమిగట్టు. వి. (మేలిమి + గట్టు) మేరుపర్వతము, బంగారుకొండ

సీ. జగముల దిసుల విచ్చలవు మేలిమిగట్ట
అచ్చ రా యు ౨౦౪.

మేలిల్లు. అ. క్రి. (√మేలు) శ్రేష్ఠమగు; ఒప్పు.

క. ఎలమెడు జలజాతంబులు, మెలరారెడి జలచరములు మేలిల్లెడునిక్కొలమండ సెందుఁ బోయితో జల మనునాకంకజేయు జలము మలయుచిన్
కు. సం. ౧౦. ౩౯౧.

సీ. మేలిల్లునీలతమాలమేల్ ధూమసంహతు లనఁ దనరు నత్యసితభాతి ..
కు సం. ౫. ౫౬౧ ౧. ౩౬.

క. మడియిల్లు తత్త్వముల నెన్నబడక విజ్ఞాన ప్రశస్తి భావింపఁగఁ బొంపుడు సాత్త్వికగుణ సంగతి, మృదుఁ దనునామంబు నీకు మేలిల్లు శివా
శివ సా ౯౨.

౨ ఒప్పు, సొగసు.

గీ. చెల్లుఁ బైమేడ యొప్పు మేలి ల్లనంగ .
ఆం భా 3 ౪౯.

మేలిల్లు2. వి (మేలు + ఇల్లు) చంద్రశాల, పైమేడ.

గీ చెల్లుఁ బైమేడ యొప్పు మేలి ల్లనంగ
ఆం. భా. 3. ౪౯.

మేలు. వి. ఔ. అవా. (క. మేలు) ౧. శ్రేష్ఠత, గొప్పతనము, ఆధిక్యము

(బ. మేలులు, మేళ్లు, మేల్లు, దీనికి కొన్ని పట్ల వాల్లు పర మగునపు డుత్వలోప మగును.)

వ కొదమతా మేళ్లిమేళ్లి నగుమోఁగాళ్లతో
ఆము. ౬ ౯౯.

చ. అవిన నునందపల్కు విని యారయిలనాగమతోక్కరాజమేల్, విననగఁ దలంచి పేద్కఁ బదవే పదకేగలి చిత్రలీలతోఁ
ఇందు. ౫. ౧౩౦.

శా సియేభూములు చూచినావె కొరవంతి రూపలావణ్యాకే, బాయ క్తిం దగుకొమ్మ సెందుఁ గల రీత్మామండలిక్ పాంచభా,వాయత్తైక విలాసపైభరులమే లం దెవ్వరిం జెందు .
శుక. ౧. ౧౪.

౨. వరము, దేవతలవలన నగులాభము.

మ. . సరోజాక్షా తపస్సిద్ధికిం, దగుమే
లిచ్చుటం గాదు పూర్వనిహితార్థం బింత
కిం తేంటికిన్ . ఉ. హరి. ౨. ౨౦౦.

౩. ఉపకారము..

క. తన లోకము గొనియాడంగ, విని
యుబ్బందు సజ్జనుండు వెండియు గడుమే,
లొనరించం గీ డొకించుక,యును దనదెసం
దోంపనీక యొడుపుచు వచ్చున్

భార ఉద్యో ౨ ౪౮.

మ. సరోజాక్షా తపస్సిద్ధికిం, దగుమే
లిచ్చుటం గాదు పూర్వనిహితార్థం బింత
కిం తేంటికిన్ . ఉ. హరి ౨ ౨౦౦.

౩. ఉపకారము

క. తన లోకము గొనియాడంగ, విని యుబ్బందు
సజ్జనుండు వెండియు గడుమే, లొనరించం
గీ డొకించుక, యును దనదెసం దోంపనీక
యొడుపుచు వచ్చున్

భార. ఉద్యో. ౨ ౪౮

గీ. మీకులములేటిం జేపట్టి మీవిరోధి, రైవపురిం
జెంది మైచర్మ మూనెం గాదె, యట్టిమే
లైన నెఱింగి యాహరుని పేర, వెసంగుసారంగ
ధరుం డాపుం డేఖలారు.

సారంగ. ౩. ౨౩౫.

౪. సుకృతము, పుణ్యము.

ఉ. శత్రుఘాతులకు సాఁద వచ్చిన వారి
యాపదల్, గ్రన్నన మాన్చి వారికి సుఖం
బులు సేయుటకన్న నొంటుమే, లున్నదె

భాగ. ౯. ౭౪౩.

౫. సుఖము.

క. గ్రక్కునం జని యక్కుఅతోం, జక్కెరవిలు
కానికిలిం జతురుండనై కేం, దక్కాంతల
నిద్దఱ విరు, బ్రక్కల నునిచికొని మేలు వడ
సెద ననుచున్ . శుక. ౨. ౩౪౭.

ఉ. ఎలం బ్రాయపుముద్దుగుఱ్ఱుడుమే, లెన్నక
యుద్భటం జడుని కే ననిని నీడుకుండు చింతి
లున్ . దశా. ౮. ౩౪.

గీ కామసుఖదివ్య సుఖములు కాంక్షదోఱంగు,
మేలి షోడశాంశంబునం బోలలేవు, గాన
కామము విను శత్రుకరణిం జంపి, బ్రహ్మ
పురమున సుండెడ రాజ్యంబోలె.

భాగ. శాం. ౪. ౫౩.

శాంతి పర్వణి శ్లో. యచ్చ కామసుఖం లోకే
యచ్చ దివ్యం మహత్సుఖం, తృష్ణాక్షయ
సుఖస్యైతే నార్హతష్షోడశీం కలాం. అని
గీతయం దున్నందున మూలభూతభారతాను
సారమున మేలుశబ్దమున కిట సుఖమర్థము.

౬. లాభము.

గీ. సింధురమహాశ్వ ముఖ్యముల్ చేర్పదొల, దీవి
వణిజుల మూళ్లు సద్గ్రహముబు బ్రోరిం,
గొలువుం దేజంబు వెల మేలు గలుగం
బ్రాంత,వారింగాం జేయు నవి నవి చేరకుండ.

ఆము. ౪ ౨౫౭.

సీ. మేలు చేరిన మహీపాలున కెఱింగించి
యనుభవించుట నీతి . దశకు. ౬. ౧౪.

౭. శుభము.

ఉ. మేలున సంతసిల్లెద మేకొని యాపద
లొందు , , భార. అర. ౫. ౩౪౧.

ఉ, , , వి, శ్వేశ్వర మేలుకుప్పు నిను నెవ్వండు
గోరి భజించు వాండపో శాశ్వతలక్ష్మీ
మృత్యుంజయ సౌఖ్యయుతుండు ...

భాగ. ౧౦. పూ. ౧౨౭.

వ ఇంతనుండియు మీకు మే లయ్యెడు .

హర. ౩. ౧౯.

౮. శ్రేయస్సు, క్షేమము.

శా. ఈ యర్థంబు ఘటింపనున్న నృప నీ కింతేని
మే లయ్యెడున్ .. వైజ. ౩. ౬౦.

క. ఓవెఱ్ఱులార యేఁటికి, నీవడఁగు విచారములు
సహింపఁగ రాదా, యేవారి కైన మేలా,
చావులు తక్కిఁతము లుగ్ర సంగ్రామములన్.
భీష్మ. ౪. ౫౭.

౯. హితవచనము, మంచిమాట.

వ. నాకు నీవు సుయోధనునట్ల కావున మే
లాడెద . భార. ద్రో. ౧ ౫౧

౧౦ న్యాయము, పాడి.

ఉ మంచికుమాటలం గుసుమ మంజుళవీథులఁ
జిచ్చి చెల్లరే, యంచితవజ్రసానులు మహాద్రి
కఠోరులు నైనచుల్లరం, గ్రించులఁ బెట్టి
రాజు పెనఁగించుచుఁజూచుచు నున్నవాఁడు
మే, లించుక లేదు
భాగ ౧౦ పూ ౧౩౫౦

౧౧ అందము, చక్కఁదనము

సీ చెలికై నొక్కట లీలఁ గ్రొ త్తిసఁగెడువాలు
గుసోగిలమేలు డించి
భార. విరా ౨ ౭౩.

సీ అనుగుఁదమ్ములకాంతి విడివడి పగడంపు
జిగురుటాకులమేలు చిందువేయు
జాహ్నవీ. ౪. ౭౧.

౧౨ మహము.

ఉ మ స్తకమంటుచు దృష్టివండగ, నుట్టిన
కర్ణచామర మహారథుమేలును, మేలు
మేలనం, బట్టభద్రదంతి నిల్చె నరహోలుని
చెంగటమావటీఁ డోన్. రా. వి. ౨. ౪౫.

మ. తలిసుంజోంపపుడాలు పూరజపుదిద్దాజాలు
బ త్తేఁటిగం, టలచాలున్ వరితేనమేలు
తను లంటంద్రాఁకు లేఁదీఁగ చేర్కల
బారీలు .. వలరాదంకులకై వడిన్ వనము
త్రోవన్ ద్రిమ్మరున్ దిమ్మరన్.
చంద్రా ౪. ౭౩.

౧౩. వలపు, మోహము.

గీ. మీకు నావాఁడ మిక్కిలిమేలు గలిగె, నేని
దేవరయూడిగం బిచ్చవచ్చి నట్లు గాలింప
కుండ నే నంతకుమతి, నయ్యా .
వి. పు. ౨. ౭౧౯

ఉ చెప్పెడి దేమి నాకుఁ గలతీవన మంతయు
నీక కూర్చి యెల్లప్పుడు నిన్నుఁ బాయక
ప్రియాచరణం బొనరింప నేర్తు నీ, చొప్పున
కీవు నియ్యకొని చొక్కపుజక్కవగుబ్బ
లాడి మేల్, దప్పక యంతరంగమునఁ
దాలిచి నన్ను నధీనుఁజేయవే
వసు ౨ ౧౩౦.

గీ వలపు కూరిమి మేలు నా వలరుఁ జేర్లు,
మోహమునకును శారాదాంబుదవిభాంగ
ఆం. సం మాన. ౪౩.

౧౪ సారము, నిగ్గు

శా ఈసభామండప, శ్రీవిస్ఫూర్తికతంబున
న్మిగులనాచిత్తంబు నానందము, ద్రావైచిత్రిఁ
గరంచుచున్నయది యేతద్ద్వారకాపట్టణం,
బీవిశ్వంబునఁ గల్గుమే లిదియపో యెందు
న్వీక్షించినన్. కళా. ౨. ౧౨

క. నటనాహంకృతిఁ దమలోఁ, జిటిపొటిజగ
డంబు లూర్ధ్వకిరంథలకుం, బొటమిన మే
లేర్పఱుపఁగ, నిట నిను రప్పించె నిగ్జరేశ్వరుఁ
డధిపా. విక్ర. ౨. ౭౪.

౧౫. పై భాగము, ఉపరిదేశము.
చూ మేలిల్లు, మేలుకట్టు.

౧౬. భద్రము, జాగ్రత్త.

సీ. మే లుప్పరంబు కుమ్మెదమందరాద మంద
టిలు పొదల్ దూఁటుచోఁ గలువకంటి ...
చంద్ర. ౩. ౧౪౮.

విశే. ౧. మంచిది, ఉచితము.

శా . ఏ, మేమా కృష్ణుఁడు మందలోఁబలెనౌ
కా నింద్రద్రుమమాకాప్పటనం, బీపై నిచ్చటఁ
జూప వచ్చె నిది మేలే ... పారి. ౪. ౭౦.

ఉ. ఏల దురంతవేదన మెయిన్ బొరలాడెదు శార్మి దక్కి మేలిరి లలితాంగి రయింతపని కిమ్ము మను. ౩. ౬౪.

గీ. తాము చేసినయవి యెల్ల ధర్మములఁట, మేము చేసిన దఘమఁట మేలు గాదె, యే కరణి వచ్చె వారల కింతయగ్రత, గన్యాతయు మాకు వింత లాఘవము జగతి.

దశా. ౧. ౨౫౪.

(ఇందు వ్యతిరేకలక్షణచే అనుచితమును దెల్పును)

౨. శ్రేష్ఠము

చ. సురజలపూరితంబు లగుమాతులు నూఱిటి కంటె సూనృత,వ్రత యొకబావి మేలు

భార ఆది. ౪. ౬౩.

క. అతిసంభ్రమమునఁ ద్రిజగత్పతి నర్చన సేయఁ దలఁచి పరిమళమంద, స్మితకుసుమమృదుల పల్లవ, తతిలో మే లేతికొని ముదం బొదవ మదిన్ కు. సం. ౫. ౫౦౧.

గీ. దీవులం దెల్ల నేరేటిదీవి సెప్ప, భరతఖండంబు మే ల్తదంతరమునందు హర ౨. ౩

౩. శుభప్రదము, క్షేమంకరము.

ఆ మంచివారి కెల్ల మంగళప్రద లయ్యుఁ, గల్ల రులకు మేలు గానియట్టి, తమవు కెన్నియైనఁ దాల్చి లోకములకు,సేమ మెల్లఁ బ్రాప్తిఁ జేయు దీవు భాగ. ౧౦. ౬౩.

ఆ దానవనాయక నీకుం, గానుకగా మేలువా ర్త గలిగినఁ జెప్పం,గా వరుదెంచితి .

శరాహ. ౧౧. ౩౬.

ఆము ౫. ౧౨౦.

౪. అధికము ; ఎక్కుడు ; అధికురాలు.

శా. శైలోత్తుంగకరీంద్రఁ డైనరిపువు స్తంబుగ్రదం భోళికిన్, మే లై పేర్చుకఠోర ముష్టినిహతి న్నిర్భిన్నముం జేయఁగా

హరి. పూ ౪. ౧౦౪.

మ. పరిహా దాస్పదవాదకౌదదుదిరాపానంబుచే మత్తు లై హరి మే లంచు హరుండు మే లనుచు వాహాకొంద జీపాం దెఱుం,గను కైలాసనగంబునందు మును లేకత్వంబు భావించిరి

ఉ. హరి. ౨. ౬౭ ఆము. ౬ ౩౦

ఉ అరయ సెజ్జప్రోలవికులాంగ్గన గొమ్మను మేలు సీతకున్, వారిజబంధుకాంతిమ వాసవు కాంత్తకు లక్ష్మి దేవికి

శా. ప మ ౫ ౪. ౪, పా.

౫. బాగు, లెస్సయైనది

సీ. మా ఆంధ్రకవిత్వంబునందుఁ బ్రబంధంబు మేలుగాఁ దక్షులు మెచ్చఁ జెప్ప .

విక్ర. ౧ ౨౦

క్రి విశ. సంపూర్ణముగా.

సీ. పరశురాామునకు మే ల్సరియైన తనయుండుఁ గలిగ భంగంబు శిఖండిచేత

భార. భీష్మ. ౧. ౪౪.

అవ్య ౧ ప్రశంసను దెలుపును.

(దీనియామ్రేడితరూపము మేలు మేలు.)

ద్వి. మేలు నీమాటలు మెచ్చి రందఱును, జాలుఁ బురే రి త్తసంవాద మేల .

ద్వి. హరిశ్చ. పూ. ౩౪౦ పం.

ఉ. . సిం,గారము బాగురే బవరిగడ్డము మేలు నురస్థలోరువి, స్తాము చాలురే ..

శుక. ౧ ౨౬౭.

క. .. వీరులు నూఁది మేలు మే లని పొగ డన్ భార. ఆది. ౬ ౩౨.

౨. పరిహాసమును దెలుపును.

గీ ఓ మె యే మె యి దే మే మె లేమ యే మె మేఘుపుష్టంబుఁ దే వంచు మేలమాడ, మే మె

మేమెలు దళు చయ్యామేలుమేలు, మేలే
మేఁ కన నభవారు మిగుల నగిరి

వైజ. ఓ. ౧౧౪.

మ. . యా,మిణఁజో నాఁ దిరిగెన్ గొలంకు
రమణు స్త్రీ శంతపీనంబాశో

జ. మేలిమి, మేలిమిగట్టు, మేలిల్లు1, మేలిల్లు2,
మేలుకట్టు, మేలుకను, మేలుకనుపు, మేలు
కమ్మిచీర, మేలుకాంచు, మేలుకొను చెం.

మేలుక(ల్క)ట్టు. వి. (మేలు + కట్టు)
౧. ఉల్లెడ, వితానము.

సీ. అరుదారుమేలుక ట్లాయితం బై చూడ
నొప్పారి తను పసుపుష్పరములు

భార. ఉద్యో. ౧. ౯౩.

క. సరోవరలక్ష్మికిఁ, గట్టినకెంబట్టుమేలుకట్టుఁ
బోలెన్ కు సం ౧౦ ౩౭౬

సీ. మృదులాంబరంబుల మేలుకట్టులచేత సరి
లేనిధూపవాసనలచేత

శై. భా. ౫. ౧౧౭

ఉ. . పచ్చతాపలకపీటలు మేలిమకాను కట్టు
మేల్, కట్టులు గ్రొత్తచెత్తపలకల్ తెరలుం
బికదారిభారువా, బిట్టలగొండ్లు

వాల్మీ. ౩. ౭౪.

సీ. పట్టుఁబుట్టములమేల్కట్టు లమర్చి కీలిని
బయళులను గొల్లెనలు వన్ని . .

నీలా. ౩. ౪౮. ఆం. భా. ౨. ౧౫౮.

౨. మెట్టు.

ద్వి. స్ఫటికంపుమేల్కట్లపై చెక్కనేని, కుటిల
కుటకల రెయ్యిల గుట్ట లెక్కుదవు . . .

ద్వి. నల. ౨ భ . (ౘ. ౭.)

మేలుక(ల్క)ను = మేలుకొను. అ. క్రి.
(మేలు + కను) నిద్రనుండి లేచు, మెలకువ
నొందు.

క. . . . ప్రస్పందితపాతకరవములు, క్రందున
ధర్మజాఁడు మేలుకనిరయ నరేంద్రా . .

భార. ద్రో. ౩. ౧.

సీ. కాఁకినవాఁడు ద త్తరపాటుతో మేలుకని
మ్రుచ్చుమ్ర చ్చుంచుఁ గళవళించె

కాశీ ౪. ౧౨౪.

క. అనిలసుతుండు దంతన మేల్కని నీల్లుడు నతని
వజ్రఘనకాయముఁబొం, దినలతికాజాలము
లెల్లను ద్రెస్సె . భార. ఆది. ౫ ౧౭౭.

మ. అనఘా యింత తపీయను ప్తిదళ కర్గంబైన
కాలంబు మేల్కనుచుందం బిది నా
నెలుంగిఁ డొకఁడుం . .

హరి. ఉ. ౯. ౯౭.

మేల్కననినిద్గుర = పెద్దనిద్ర, చావు.

ఉ. వాలుమగం డితం డనఁగ వారికి చెక్కు
దళాన్యుక క్తిచే, నేలకు వ్రాలి మేల్కనని
నిద్దుర నొందితి వయ్య తమ్ముఁడా

భా రా యు. ౧౫౭౪.

మేలుక(ల్క)నుపు. స క్రి. (√ మేలుకను)
మేలుకనఁజేయు, మేలుకొలుపు.

గీ. ఇట్టిదురవస్థఁ బొందితి నేమి చెప్పఁ, గలదు
కుంభకర్ణుని మేలుకనుపుఁ డింక

భా. రా. యు ౭౫౪.

సీ. దుర్గాద్రిలోపలితోయజాక్షుల మేలుకనిచి
తీర్చంబున కనుపకున్న

భోంగా. ౧ ౨౯.

సీ. కాంచీపురోపాంతకంపాతరంగిణీనాళికావన
రాజి మేలుకనిపి . కాశీ. ౧. ౧౩౦.

(ఇట వికసింపఁజేయు అని భావము.)

క, అని తనుఁ గౌశికముని మేల్కనుపంగా లేచి
ప్రథమకాలవిధులు దీర్చి . .

భా. రా. బాల. ౩౩౭.

మేలుకమ్మిచీర. వి. (మేలు + కమ్మి + చీర) ఓర మూఁడంగుళములవెడల్పు చాయనూలితో నేసిన అంచులు గలకోక. (శ. ర.)

మేలుకా(ల్కా)ంచు = మేలుకొను. అ. క్రి. (మేలు + కాంచు) నిద్రనుండి లేచు.

గీ. మంజుపాఠకరవమును మధురమాగ, ధస్వనం
ఒను వినుచు మాధవుఁడు మేలు,కాంచి
భార. శాం. ౨. ౧౨౭.

గి. మృదులభస్మరచితశయ్య మేలుకాంచి,యమల
రుద్రాక్షధారణం బాచరించి
హర ౩. ౩౦.

సీ. ఏను పడ్డింపంగ నింపారఁ గుడిచి మెత్త
నిశయ్య నిద్రించి వినుతభద్ర గీ గానకరిబృం
హితముల మేల్కాన్చునట్టివారు .
భార. ఉద్యో ౩. ౧౭౩.

గీ. వెన్నెలలు గాసెఁ గన్నులవిల్తునయ్య, నిదుర
మేల్కాంచెఁ గదలి నయ్యాదనువంపు
అచ్చ. రా. కిష్కి. ౭౯.

మేలుకొ(ల్కొ)ను= మేలుకను, మేల్కాంచు. అ. క్రి. (మేలు + కొను) నిద్రనుండి తెలివి నొందు, జాగ్రదవస్థనందు.

గీ. మేలుకొనఁగదె రాజ్యమహానలక్ష్మి, కాలకంఠ
సమర్పనాకాల మరియ్యే .
సైమ. ౭. ౧౩.

మ. అనినం బెబ్బులి చిన్నకోయి మఱి రయ్యంచా
లాపము ల్మాని యుం,డ నరేంద్రాత్మజుఁ
డంత మేలుకొనినిజూన్ డెందంబునన్ ..
విక్ర. ౩. ౯౪.

గీ. నిదుర మేల్కొని వేదము ల్నెమకి కానఁ,
జాల కంభోజభవుఁడు . .దశా. ౧. ౩౦౨

మ. జయ శీతాంశుకులావతంస విపథస్వామీ
మహారాజ యశ్వర్యధైర్యాకర నిద్ర
మేల్కొనుము సంధ్యావేళ రమేశుంచి .
సైమ. ౭. ౬.

౨. రాఁబోవుకష్టము తప్పించుకొను, జాగ్రత్త
పడు.

ఉ. అవసానపువేళల దండధారచే, జడ్డల
కాని మేలుకొన సాగ దయో తలపోసి
చూచినన్, బిడ్డలు లేనివాని కడలిన్ మృత
జన్మము లోఁక పుట్టదే
వి పు. ౫. ౧౦౨.

(వ్యవ) అతఁ డావిషయమున ముందే మేల్కొన్నాడు.

స క్రి మోహించు

ఉ. రా ౪. అ (ర. క)

మేలుకొ (ల్కొ) లుపు (ల్పు). స. క్రి. (√మేలుకొను) ౧. మేలుకొనఁ జేయు.

గీ. ఎందు ద్విజరాజు నా వింటుచందమామ,
మనల నిద్రాంధకారాబ్ధిమునుఁగఁ జేసి
మేలుకొలిపె వినుండు .
ఉ. రా. ౪. ౨౪౭.

వ. చని తదీయగేహదేహళీ ప్రదేశంబున నిలిచి
పరిచారికల మేలుకొలిపి .
విక్ర. ౭. ౧౫౯.

గీ. మేల్కొలిపి యిందుబింబాస్య మెల్ల మెల్ల .
హర. ౪. ౧౨౧.

సీ. విలుచుండి వీణెచేతులఁ బూని తెలుగంటి
బయకాఁడు మేల్కొల్పుపదముఁ బాడ . .
కవల. ౨ ౧౨౫

౨. వ్యక్తీకరించు, స్పష్టపఱచు.

గీ. అతివ వీణావదాతాయణానీతమణి, దీప్తికల్పిత
దేహోపదేహ యగుచు, సారగోరోచనా

గంధసారఘనసృణ, మృగమదాలేపపుసరు_త్తి
మేలుకొలిపె .. సైమ. ౫ ౬.

**మేలుకోలు.** వి. (√ మేలుకొను) ౧. మేలు
కొనుట.

సీ. మేలుకోలును జగ మేలుకేలును శిల్పిజాలు
నాలును గలలీలవాఁడ .
ప్రబంధ. ౨౪.

౨. మేలుకొనుట, అవబోధము (శ. ర)

**మేలుచే(యి).** వి. (మేలు + చే) హెచ్చు.

చ. అనితల నీవ పాండుతనయావలి కెప్పుడు
మేలుచేయ నా,తనయులకుం బరాక్రమము
తక్కువయుం బ్రకటింప వింద
భార భీష్మ. ౨ ౨౬౭.

(మేలుచేయి. శ. ర. పా.)

విణ హెచ్చైనవాఁడు.

సీ త్రివశేంద్రుఁ డాత్మీయపదపరిభ్రష్టుఁ డై
యదితిఁ గానఁగఁ బోయి యాహవమున,
బలి మేలుచే యైనభంగియు వజ్రంబుగై
కొన్న తన్ను నాకాశవాణి, వలదన్న తె
అఁగును వరుసతోఁ జెప్పిన
హరి. ఉ ౧౦. ౧౬౧.

ఉ హేమధరాధరేంద్రమున కెక్కుటి పెద్ద
ధృతిన్ భుజంగము, స్వామికి మేలుచేయి
పటువాగ్విభవంబున . సైమ. ౧. ౨౭.

గీ. అట్లు దనవారు మేలుచే యైనభంగి, విరివధృత
రాష్ట్రుఁడు . భార భీష్మ ౨౩.

గీ. భండనంబునఁ బార్థుచేఁ బడక సేఁడు,
మేలుచే యైతిసేనియు మృత్యువునను, సెన్నఁ
డును వగపడ
భార. కర్ణ. ౨. ౧౦౪.

(గెలుపుకలవాఁడు. అరి. శ. ర.)

**మేలుప(ల్ప)డు** = మేలువడు. అ. క్రి.
(మేలు + పడు) వలపుగొను, ఉత్సాహమందు.

ఉ ఎవ్వనిఁ జూచి మేలుపడితే యరవింద
దళాక్షి నీమనం, బెవ్వఁడు నొచ్చెఁ జెప్పఁ
గదవే మదకోకిలవాణి
విజ. వి. ౩. ౩౧.

గీ. మేలుపడినకోమలులచేష్ట, లట్టు కాఁగద
ప్రాణనాయకులయెడల
కవిరా. ౫. ౩౪.

మ. సఖిహితోక్తులపరాకున్ వినుచుండెనల్ప
యొక్కనిపై మేల్పడి యేఁగుచున్నపొలపుం
గాన్పించె నామాధ్వికిన్
ఉ. గా ౪. ౧౬౨,

సీ. పాలేటిమాలి యై యాలగాఁపరిపయి దద్దయు
మేల్పడుమద్దరాలు
అచ్చ. భా. ౧. ౧. పా.

**మేలుబ(ల్బ)ంతి.** వి ౧. (మేలు + బంతి)
౧. విద్యార్థులు ఒరవడి వ్రాయు పుటిరికి పైఁద
మొదట వ్రాసిన అక్షరములపంక్తి, ఓరవడి,
ఒజ్జబంతి. (శ. ర)

ఉ. కన్నులు దీర్ఘముల్ నగుమొగం బవురా
తలకట్టు తమ్మిపూ, పున్నమచందమామలకుఁ
బొక్కిలిచెక్కుఁదనంబుఁ జెప్పఁగా, నున్నది
మేలుబంతులు పయోధరముల్ మఱి కొను
నున్న యా, సెన్నిక కెక్కు వ్రాఁతఫల
మివ్వరపన్నినికి న్నిజంబుగన్
విజ. వి. ౨. ౧౦౪.

(ప్రశస్తమైనవెం డ్లని వ్యాఖ్యానము.)

౨. ఒరవడివంటిది; ఒకపని ఇతరులు నేర్చుటకు
మొదట మాపువాఁడిది

గీ తొంటిసీవంశకీర్తిలచోరతనములఁ, బ్రబలు
సచ్చరితంబులు భావికాల, మేదినీనాథులకు

కెల్ల మేలుబంతి,గాఁ బ్రవర్తింప నేల
దుష్కర్మి వైతి . వి. పు. ౫. ౧౦౯.

గీ. అతనియుత్తమచారిత్ర మఖిలవిష్ణు, భక్తజన
ముఖ్యులకు మేలుబంతి యగును .
దశా. ౩. ౧౦౭

మ. జననీ నీవు మహాపతివ్రతవు నీసౌశీల్య
మిల్లాంధ్ర కెల్లను మేల్బంతి రఘూద్వాహాం
ఘ్రియుగళీలగ్నాత్మ వై యుండుమీ
భా. రా. ౬. ౨౩౮

ఆ భక్తి నీకు హితుఁడు పరమవిశ్వాసియు, భక్తి
బుద్ధి మేలుబంతి నీకు
విక్ర ౩ ౧౩౧.

ఆ. హీనజన్మ మటుట యెవ్వఁడే నొకప్రాణి,
పంతపిలుట ముక్తిపొంత గనుట, మేలె
కాదె శిబియ మేల్బంతి గాఁడె స్వశ్వరిపు
దేహ మమ్మి పరమ గొనుట
ఆము ౬. ౭౯.

విశా శ్రేష్ఠుఁడు, శ్రేష్ఠురాలు

గీ. అవ్వలంతి, మన్న వేలుపు మేల్బంతిమదికి
మీఱ నీలా. ౨. ౪౭.

క. సైకము నసుము విలాసర,సైకము నెమ్మో
గము దీనివృదుమధురోక్తుల్, సైకముఁ
డెగడు న్నవలా, సైకములో నెల్ల మేలుబం
తిది బళిరా విజ. వి. ౨. ౧౦౪.

క. ఇంతి మదనునిపట్టపు, దంతి యొసపరిమిటారి
తందములో మేల్బంతి యేమే రతిపూ,బంతి
దయఁ జూచి నన్ను బ్రతికింపఁగదే ...
సారంగ. ౨. ౨౧౧.

**మేలు(ల్మ)మచ్చు.** వి. (మేలు + మచ్చు) ౧.
ఉప్పరిగ, సౌధము.

సీ. అచ్చరల్ గొలువఁ గొలై వ్వ చెల్వొగను
వారి మేలుమచ్చులమీఁద మెలఁగువారి ..
భా. రా. ౩. ౩౭౬

సీ. విష్ణు స్థలములులకెలఁ దీర్పు బలుబచ్చు
శ్రీళకాంగి - సించు మేలుమచ్చు
ఘటికా. ౧. ౧౪౦.

గీ. మేదన పజ్జన మేలుమ చ్చునఁగను నుప్పరి
గన సౌధ మొప్పచుండు
అం. భా ౨. ౧౪.

క. అచ్చటి యిరువంకల మేల్మచ్చులపై భారు
దీరు మగువల మొగముల్, నిచ్చలపు మేలు
కట్లఁ, గ్రుచ్చినయద్దంబు లని తగుల్పడు
జగముల్ రా. వి. ౫. ౬౬.

సీ పచ్చడాల్ హెచ్చురాగచ్చు రాణించు
డాల్మచ్చటల్ మేచ మేల్మచ్చగములు .
కృష్ణ ౨. ౧౨౩.

౨. బాల్యక్రీడావిశేషము

క. అచ్చిన్ని చెలువ వాఁగన, గ్రుచ్చిళ్లను
వాగ్లుకంబముల యాటలు మేల్మచ్చులను
గచ్చకాయలు, నచ్చనగం డ్లాడు సరివయ
స్యలతోడన్. పాంచా. ౧. ౫౪.

**మేలుము(ల్ము)సుఁగు.** వి. (మేలు + ముసుఁగు)
సువాసినులు వేసికొను ముసుఁగు, అవకుంఠము.

చ. ఇనకరత ప్తయై ధర యహీన సమీర విధూప
కాల్మలీ, ఘనతర తూలరాశి పయిఁ గప్పఁదఁ
బర్వుమహారశోభితం,బునఁ బొలుపొంద
నొక్క కెలిపుట్టము మేలుమునుంగుఁబూని
య,ద్దినమణి కార్తిఁ దల్పి మరదిర్ఘుకఁ
గ్రుంకిదఁ బోవుచాద్బునన్.
హె. శకుం. ౨. ౨౩౪.

సీ. సలిలాబ్జపాణి యచ్చపు మేలుముసుఁగు నా
శ్రీనపంక్తులు దరివాని యొసఁగ ..
కు. ౩. ౩౭౦.

వ. ... బహిర్గతంబులగు జటిజూటము కదంబం
బుతపయిం గమపట్టు మేల్ముసుంగుల కెంపు

గున రంగమిగిలి ఖరకరం దురుకిరణ నికరం
బులు పఱచి . విప్ర. ౨. ౧౪.

**మేలురా.** అవ్య. (√ మేలు) ఆశ్చర్యార్థకము.

శా. ఔరా మైజిగి మేలురా వగుమొగంబ
న్నన్న కెస్బిక్కు ల,య్యారే చన్గవ సైక
ఫుంగవుమతీ రర్ఘ్యార యేలోకఘం, దీరా
మామణిపాటిఁ బోలఁగలదే యొవ్వానిఁ
గాంక్షించునో, వారింకెప్పవళంబె యిజ్జగతి
దైవానుగ్రహం బెట్టిదో.

ఇందు. ౫. ౧౧౪.

**మేలురాక.** వి. (మేలు + రాక) స్వాగతము

ఆ. సంప్రీత జవలోక, రాకవచ్చె మేలు
రాక యగుచు

భాగ. ౧౦. పూ. ౯౬౩

**మేలురాసి.** వి. (మేలు + రాసి) తూర్పెత్తిన
ధాన్యపుప్రోగు. (క. ర. చి. ని. గ్రా.)

**మేలువడి.** విశ (√. మేలు) బుజావు.

వ. .. అతండును గొండరాచూలి సేయు
సత్కారం బంగీకరించి ముహూర్తమాత్రంబు
విశ్రమించి మేలువడిచూపునం జూచి
ప్రస్తావ సోచితంబుగా ని ట్లనియె

హర. ౪ ౧౬.

శ్లో. ఈమాం స పశ్యన్న ప్రాజ్ఞ నైవ చక్షుషా . .
సం. కు. సం. ౫. ౩౭

**మేలువడు = మేలుపడు.** అ. క్రి. (మేలు +
పడు) వలపుగొను.

చ. కపుఁదకేత్ఱలో యమరకాంతు జయం
తుఁడు సేన గూడియుం,టిమి కద కాఁడు
వానిసొంసీటు ల కొక్కడ వాని బింకయం,
దముల ో వాని యిచ్చకపుఁదల్కులకున్
మఱి వానిమేనిడాల్, కొమరుఁన కేమ
మేలుపడి గుత్తకు నిచ్చితి నేమి చెప్పుదున్.

కువల. ౪. ౧౭౬.

**మేలువాఁడు.** వి. (మేలు+వాఁడు) ౧. వల్ల
భుఁడు, వలపుకాఁడు.

గీ అంబుదప్రదంబు నీలాంగాత్రంబు
వాని, మేలు సమకూర్చు వలమేలు మేలు
వాని ఘటికా. ౨ ౧౯౫

గీ. భువనసుందరి యనియెడుభోగసతికి,
మేలువాఁడు సారంగ ౩. ౧౭౫

౨. జారుఁడు.

క వలచినసతి కేచిన్నెలు, గలవో యచ్చిన్నె
లెల్లఁ గనుపించుచు నవ్వేలవెలఁది సోమ
దత్తుని, వలకు న్నొఁబఱిచి మేలువానిం
జేసెన్, పక. ౩. ౫౭.

గీ. జారుఁపేరు మేలు,వాఁ డనఁగ మిండఁ
డన మిండగీఁ డనఁదగు .

అం భా. ౨ ౧౧౫.

విణ ౧ శ్రేష్ఠుఁడు

గీ మేది నీంద్రులలోనెల్ల మేలువాఁడు

సారంగ. ౩ ౧౭౫.

౨ శుభకరుఁడు.

సీ మను మేలువాఁ డవఁగను శుభకరసంజ్ఞ

అం. భా. ౩. ౩.

**మేలైవచ్చు.** అ. క్రి. (మేలు + ఐ + వచ్చు)
అచ్చివచ్చు.

సీ అచ్చివచ్చె ననంగ నైవచ్చె ననఁగ మేలై
వచ్చె ననుట యగు

అం. భా. ౩. ౯౪.

**మే(లుక)ల్క_త్తి.** వి. (మేలు + కత్తి) ఖడ్గము,
ఆడిదము.

సీ. వాలు ఖండా కరవాలు మేల్కత్తి తరవలి
వరాళి పిరంగి యడిద, మన ఖడ్గసాము పై
యలరుచునుండును ...
ఆం. భా. ౨. ౨౧౪.

మేల్తరము. విశే. (మేలు + తరము) శ్రేష్ఠము,
చ. సరిగ మెఱుంగుఁ జంటకుబుసంబునఁ జగ్గవ
పిక్కటిల్ల మేల్తరమగు కాఁచిపింజియ పదం
బులఁ జెందులుద్రొక్కఁ .
వాల్మీ. ౩. ౧౩౦.

ఉ. బిండ్లకు మేల్తరంబు ఘనవేణి కనుంబొమ
దోయి బంగరుం, గిండ్లకు మేటిసాటి తుల
కించు చనుంగవ   హంస ౧. ౯౧

మేల్దాపరి. వి. (మేలు+దాపరి) వేశ్య
సీ. పదపుఁజాన గడించు పడఁతి మేల్దాపరి
బోగపుఁజేడియ పొత్తుటాలు   నా వేశ్య
వెలయు   సాం. ని. మాన. ౧౩.

మేల్పని. వి. (మేలు + పని) శుభకార్యము.
ఆ. అప్పు డదనుచెయ్వి లలరించి సత్తి
యొప్పయు సుమంత్రుఁ డనఁగఁ బరఁగు
ప్రెగ్గడయును మేల్పనికిఁ గడంగి తూరుపఁ
దగు, సగరులెల్ల సంతసమునఁ గూర్చి.
అచ్చ. రా. అయో. ౪౪.

మేళ(ము). సం. వి. అ. పుం. వాద్యాది జనసమూహము. (ఈ యర్థమునకు సంస్కృత గ్రంథముల యందుఁ బ్రయోగము కానఁబడదు.)
రగడ ... మిళులఁ దపకిక బించె మేళములఁ
దాళములు.   రాఘవ. ౨. ౬.

గీ. మేళములఁ గూడి విటులతో మేలమాడి,
కొనుచు వత్తురు వెలజాతికొమరె లెల్లడు...
ప్రబంధ. ౧౯.

వ. ... రామలింగపాని సర్వపాని సైతమైన
మేళ ౧ కి. కాకాండిని గ్రామం ...

తిరుమలంపులంగారి చెర్వుకింద వరిమడి. ఫం.
దశా. ౪౦౨.

మేళగాఁడు. వి. విశే (మేళము + కాఁడు)
౧. మేళము వాయించువాఁడు. (శ. ర.)
౨. నర్తకసంఘమున నుండువాఁడు.
వ. అనుచుఁ దలంగిపోక యిట్టునట్టుం జొట్టు
మెట్టాడు చిట్టివడుగుల నానట్టు నగవులం
గోపంబుఁ గదుర నదలించుచుం దనమేళ
గాండ్ర నాలోకించి .
ప్రభా. ౧. ౧౦౪

మేళగి(వి)ంచు. సక్రి. (√మేళము) ౧. జత పఱచు
చ. ప్రహరిచరింతు రప్పుడును భైరవు లర్ధనిశా
గమంబులన్, గహకహ నిష్ఠురాట్టహాస
గర్వితకంఠకఠోరహుంకృతుల్, బహుల
భుజాదమడ్డమరుభాంకృతినాదము మేళగించి
దిక్కుహరము ల్వొర్వుచాటక పుఁగోటల
మీఁదట దక్షవాటికన్.
భీమ. ౧. ౧౦౭.

౨. కలుపు, మిశ్రముచేయు.
ఉ. భావము పల్లవింప నొకపంకజలోచన
ప్రాస నొక్క లజ్జావతి మించుగుబ్బవలి
చన్నులపై మకరీకలాపమున్, ... వాదిరఁ
గమ్మనీరు మృగనాభిరసంబున మేళవించి...
వైమ. ౩. ౧౦౨.

గీ. తేనెయును గోఘృతంబును దిలలు మేళ,
వించి సౌభాగ్యపతయే యటంచు వేల్చి ...
వరాహ. ౯. ౫౯.

వ. ... పరిఘృష్ణకాశ్మీరకేసరాసారంబులు, పరి
మృదితశైలేయసారంబులుఁ బవిమిరియోనఁగ
సగఁబాలు మేళవించి ...
వైజ. ౨. ౧౧.

చ. ప్రియ మెసఁగం దగం దెలిచి పెట్టెడివా
డ నెన్నఁడుఁ దఁ ద్రియనయహీనతం
దనకు నాపద లైనఁ బట్టు వట్టు, నే
మియు ననరేనివాఁ డదియు మేవడి లై
చను . భార. ఉద్యో. ౩. ౨౨౨.

చ. తనవుడి లజ్జ వాపి వసుభాపతి మేవడి
లైన మాటవాం, దునఁ దగఁ జేరి కోరికలు
దోఁచు తెఱం గెఱుఁగం దలంచి యవ్వల్లన
యదుగంగ సమ్మద విరాసము సేద్దెల పెన్మి
గంబు నూ, తనరుచి నొప్ప గా విశచతామర
సానన వేడ్క విట్లనున్.
నిర్వ. ౭. ౭౭.

మేవడికాఁడు. విశే. (మేవడి + కాఁడు) ౧. నమ్రత కలవాఁడు (శ. ర.)
౨. ఉపాయము కలవాఁడు. (శ. ర.)

మేవీది. వి. (మేలు + వీధి) రాజమార్గము.
ద్వి. మేవీది వడి బండ్లమీఁది కెత్తుచును.
ద్వి. పరమ. ౩. ౫౧౬. పం.

మేవు = మేఁగు. (శ. ర.)

మేష. సం. వి. ఆ. స్త్రీ. చిన్న యేలకులు.

మేషకంబలము. సం. వి. అ. పుం. రోమముతో నల్లిన గొంగళి, ఉన్నికంబళి.

మేషము. సం. వి. అ. పుం. ౧. పొట్టేలు, గొఱ్ఱె. ౨. మేషరాశి.

మేషాండుఁడు. సం. వి. అ. పుం. ఇంద్రుఁడు.

మేషి. సం. వి. ఈ. స్త్రీ. ౧. ఆఁడుగొఱ్ఱె. ౨. తివిశము, సెమ్మి ఱ్ఱ. ౩. జటామాంసి ఱ్ఱ.

మేహఘ్ని. సం. వి. ఈ. స్త్రీ. పసుపు.

మేహనము. సం. వి. అ. న. ౧. మూత్రవిసర్జనము, ఉచ్చపోయుట. ౨. మూత్రము. ౩. శిశ్నము.

మేహము. సం. వి. అ. పుం. ౧. మూత్రము విడుచుట, ఉచ్చపోయుట. ౨. మూత్రము, ఉచ్చ. ౩. ప్రమేహరోగము. ౪. పొట్టేలు, గొఱ్ఱె.

## మై

మై = మయి. వి. ౧. శరీరము.
సీ. మదతి నీమైచక్కఁ జూచుట కోడదఁ గను
బాటు వారయుకో యని తలంచి .
భార. విరా. ౨ ౪౩.

చ. . కాంతకు గొజ్జఁగినీటఁ దేటచే, జలకము
లార్చి మైఁ గలయఁ జందనపంక మలంది
రొంతయున్    ఐక్రీ. ౧. ౧౩౬.

సీ. ఉత్సాహ మొదవ మై నుబ్బించి సేవియుఁ
బచ్చిగోడలజాడ విచ్చు దిశలు .
ఉ. రా. ౨. ౧౯౬. పారి. ౨ ౪౯.

౨. జన్మము.
క. ఇల నొంగి నట్లు భుజగం, బులు పెనఁగొన
రామఁ డాదిపురుషుం డయ్యున్, బలి మును
బంధించినయా, ఫల మొక మైఁ గుడువ కేల
పాయు ననంగన్.
భా. రా. యు. ౫౬౩.

౩. పార్శ్వము.
మ. .. వీఁడె పతి చేర్పం జేర నంచున్ మదిన్,
దొలఁగం గోరి రయింత రజారవిలి కాంతుం
డున్నయామైఁ జే,ర లతాతన్వి విధుండు
తా నపుడు తార్చన్ బెజ్జమున్ ...
చంద్రా. ౫. ౧౩౭.

ఉ. క్షేత్రముఁ గేలఁ బూని ... విశ్వలు లై
యిరుమై మనాఙ్మను,గ్గాత్రులదంతి వక్త్రల
శతంబు వినీతి భజింప ..
ఆము. ౬. ౯౫.

౪. విధమున,

క. తలకొని నీకుం బ్రాణం, బులు డాపక మోపి
నట్లు పోరఁగ నిమ్మైఁ, బలుకఁ దగునె .
భార. భీష్మ. ౩, ౧౪౫.

క. ఒక తెంతయుఁ బులకింపఁగఁ బుడుకుచు
మేలములు మోసపుచ్చుచు నమ్మై, బెదరగు
పిలుగులం బెట్టిరి, పదఁతుక లాబుఖ్యశృంగుఁ
బాద్రివముఖ్యా
భా. రా. బాల ౪౯

శా. ఏ,మేమీ కృష్ణుఁడు మందలోఁబడెనె
తా నింద్రద్రుమోత్పాటనం, బీమై నిచ్చటఁ
బాప వచ్చె నది మేలే
పారి ౪ ౬౦

౫. తడవ.

ఉ. చిత్తము లుల్లసిల్ల నలపింఛకిశోరము
లొక్కమై మదోన్మత్తగజావళిం బొదువు
మాడ్కి భార ఉద్యో ౨. ౧౪౦.

౬. మీఁదు.

ద్వి. అతనితోడిద లోక మని కూడు నీళ్లు, మఱి
దలంపక నేలమై శయనించు .
ద్వి. పరమ. ౪. ౩౧౧.

ద్వి పసుపడఁ గదళీకాపత్రములఁ బఱచి, యం
దుమై పేర్వెఱ వావిదు లనిచి
ద్వి. పరమ. ౪. ౨౬౪.

౭. మైకొను, మైకోలు, మైగవి, మైజాఱు,
మైజాఱుచీర, మైతాలుపు, మైతెంచు,
మైపూఁత, మైమఱచు, మైమఱపు, మైమ
ఱువు.

మై. ప్ర. ౧. తృతీయావిభక్తియందు వచ్చెడి
ప్రత్యయము.

ఆ. ఒంటిమైఁ గళింగ సురపడిఁ దలపడి, పుత్ర
సోదరాప్తభూరిసైన్య, హీనుఁ జేసి ...
భార. భీష్మ. ౨. ౭౪.

(ఒంటిమై = ఒంటిగా.)

మ. లయకాలంబునఁ బ్రాణిజాతము వశాలస్యం
బుమై బ్రింగ నేఁ,డి యుదగ్రోద్ధతిఁ దోఁచు
దండధరుమాడ్కి నీ వచ్చుదుర్వారని,శ్చయ
నాశాత్రవుఁ గాంచి .
హరి. ఉ. ౧. ౧౫౧.

మ . చెప్పెద సమాధానంబుమైఁ గార్యముం,
గనుఁగొ మ్మాహవభూమి రాముఁ జెనయంగా
రాదు భా. రా అర. ౧. ౨౪౪.

౨. చతుర్థీ విభక్తిప్రత్యయము

చ. అడవికి వేటమై నరిగి యాతఁ డొకానొక
నాఁడు పాండు. ౫. ౧౪.

ద్వి మకరకేతనుతండ్రిమై నంకితముగ, నొక
కొన్నిపద్యంబు లొనరించి మఱియు .
ద్వి. పరమ ౩ ౧౬౫ పొ.

౩. సప్తమీవిభక్తిప్రత్యయము.

సీ. రాత్రిమైఁ దాఁకి క్రూరతఁ బోరి మగఁటిమి
వాపినయంగారపర్ణుకంటె
భార. కర్ణ. ౨. ౨౪.

ఉ. అప్పుడు కర్ణసైన్యమమరాధిపనందనుఁ జొట్టు
ముట్టఁ దే, రుప్పురవీధిమై వలయ మొప్ప
వెసం బఱపించి క్రీడి .
భార. విరా. ౫. ౯౭.

ఉ. ఎవ్వఁడు కోరి తాను నొకరుక్కడు
మీరఁడపోక రాత్రిమైఁ, జివ్వకు వచ్చి
ప్రుచ్చి మిగఁ జేరినవాఁడు
ఉ. హరి. ౩. ౪౩.

మైందహనుఁడు. సం వి వి. పుం. మైందుని
జంపినవాఁడు, కృష్ణుఁడు.

మైందుఁడు. సం. వి. అ. పుం. కృష్ణునిచేఁ జంపఁ
బడిన యొకానొక రాక్షసుఁడు.

మైకము=మయికము. వి. మత్తు.

ద్వి. ఉడుగనిబుడతల నోలయుటకు బెల్మిదలం,
కడు నొప్పునమ్మదకరు లల్ల నిభ్రుడం, కడు
మేనుడిల్ల మెకంబులతోడ, మెండ లెత్తుకొని
గ్రుంక్కి మెదలకున్నవియు ...
రం. రా. యు. ౨౯౦. పా. ౨౨ పం.

మైకొను = మయికొను, మేకొను. స. క్రి.
అ. క్రి. ($\sqrt{}$ మై1.)
౧. సమ్మతించు, అంగీకరించు.
శా. నిఖిలస్త్రీరత్నమున్ నీకు నే, నావా
హించితి మీరు సన్మిథునచర్యాసక్తి
మైకొన్న నా, కోవిశ్వోదయ కార్యసిద్ధి
యగు కు సం. ౧. ౪౨.
మ. ఈ, స్మరుఁ డై యింతి వధింపఁ గా
దనక యన్యాయంబు మైకొన్న నా,పద
లేతెంచుట కేమి సందియము .
భా. రా. యు. ౧౪౧౩.
క. మమకారదూరునకు మిత్రములు గళత్రములు
నన్నదమ్ములు ననుబం, ధములపరిష్వంగము
ధర్మమె మైకొన మణుఁగు సగము మైలయు
సగమే .
పాండు. ౫. ౨౨౦. కు. సం. ౪౧౦.
స. క్రి. పొందు.
సీ. అల్లఁదనంబున యౌవ్వు మైకొనఁ జూచు
నడపు కాంతికి వింతలోదవు గాఁగ
భార. విరా. ౧ ౨౪౫.
అ. క్రి. కలుగు.
సీ. లలితమాణిక్యకలాకలలాగు మైకొన నమ
ర్చిన భరణిఁ గొమ్మ లొప్పు .
బా. రా. అర. ౨. ౨౪.

మైకోలు = మయికోలు. వి. ($\sqrt{}$ మైకొను)
సమ్మతి, అంగీకారము.
శా. ... నీ, వాక్యార్థభుజాక్షసేయఁ దగదే
యుష్మాక మైకోలు మైన్. . హైమ, ౩. ౧౨౫.

సీ. అల్లయాడెటి మంచి జని పొందుపటోఁ గోప
గించ. మైకోలు గాంచుసేయు ...
కళా. ౫. ౩౫.
సీ. ఇయ్యకో లొప్పికో లీకోలు మైకోలు
మేకోలు . ఒడబా టనుట కనుపట్టుచు
నుండు సమ్మతిపేరు ఆం. భా. ౧. ౧౦౪.

మైగలి = మేగలి. విశే. ($\sqrt{}$ మై1) కూరుఁడు.
ఉ. ధీరజసూత్తముండు సహదేవుఁడు మైగలి
దుస్ససేనుఁడున్, వీరులు పిచ్చలింపఁ బ్రజ
వి స్ఫుద్రవం బోరి నార్వఁ బోరుచో
భార. కర్ణ. ౧. ౧౧౬.

మైజోబు = మయిజోబు. వి. (మై1 + జాబు)
ఒకవిధమగు పైటకొంగు. (కొంత రొమ్ము మెడ
ముగా నద్దకమ్ములు పాటించిన యొఁడుదాని
చీరకొంగు. శ ర.)
చూ మైజాబుచీర.

మైజోబుచీర. వి. (మైజాబు + చీర) ఒకరక
మగు పైటకొంగు గలచీర,
సీ గొంటుపూసలు రెండు గుండ్లముంగరలు
మైజాబు చీరలు పెనసన్నగొలుసు .
శుక. ౨. ౩౩౨.
సీ. కాసెక ట్టిడి యేల కప్పుగా మైజాబుచీరఁ
దాల్చు మటంచుఁ జిమ్మ రేఁగు ..
శుక. ౨. ౪౫౬.

మైతాలుపు. వి. (మై1 + తాలుపు) ప్రాణి,
శరీరి. (శ. ర.)

మైతెంచు. స. క్రి. ($\sqrt{}$ మై1) ధ్యానించు.
మ. శివు గాంచి సహితంబు సమ్మనములం జింతించి
మైతెంచి శైవరపు యోగీంద్రులఁ గొల్చి ..
కు. సం. ౯. ౩౨౪.

మైత్త్రము. సం. విశే. (అ. ఈ. అ.) మిత్రుని
సంబంధమైనది. వి. అ. పుం. ఒకానొక సంకర

జాతి. స. ౧. మైత్రి, స్నేహము. ౨. అనూరాధా నక్షత్రము. ౩. ఆదిత్యలోకము. (వాచ.)

౪. పురీషోత్సర్గము. ౫. ఉష్ణకాలము.

**మైత్రావరుణి.** సం. వి. ఇ. పుం. అగస్త్యుఁడు.

**మైత్రావరుణుఁడు.** సం. వి. అ. పుం. అగస్త్యుఁడు.

**మైత్రి.** సం. వి ఈ. స్త్రీ. ౧. దయ.

క. మైత్రిం బోలెడు ధర్మము, ధాత్రిదివిజులకు లేదు భార. శాం. ౫. ౧౦౨

శ్లో॥ జప్యేనైవ తు సంసిధ్యే ద్బ్రాహ్మణో నాత్ర సంశయః, కుర్యాదన్యన్నవా కుర్యా న్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే

౨. స్నేహము, చెలిమి ౩ అనూరాధా నక్షత్రము.

**మైత్రుఁడు.** సం. వి. అ పుం. ౧ గొప్ప బ్రాహ్మణుఁడు, బ్రాహ్మణశ్రేష్ఠుఁడు ౨ స్నేహితుఁడు.

**మైత్రేయము.** సం వి అ పుం. ఒకసంకీర్ణజాతి

**మైత్రేయిక.** సం. వి. అ. స్త్రీ. మిత్త్రయుద్ధము, స్నేహితుల యుద్ధము. (త్రి. వి.)

**మైత్రేయుఁడు.** సం వి అ. పుం. ౧. ఒకానొకముని, ౨. బుద్ధదేవుఁడు

**మైత్ర్యము.** సం. వి. అ. న స్నేహము, చెలిమి.

**మైథిలి.** సం. వి ఈ. స్త్రీ. సీత

**మైథిలుఁడు.** సం వి. అ. పుం. మిథిలాధిపతి.

**మైథిలులు** = మిథిలాజనులు.

**మైథునము.** సం విశే. (అ ఈ. అ.) ౧. దంపతులలోగానైనది, జతయైనది.

౨. వివాహముచేఁ గలిసినది, ౩. రతిసంబంధమైనది.

వి. అ. న. రతి, సురతము, (దీనియంగము లెనిమిది.)

శ్లో॥ స్మరణం కీర్తనం కేలిః ప్రేక్షణం గుహ్యభాషణం, సంకల్పోఽధ్యవసాయశ్చ క్రియానిష్పత్తిరేవ చ ఏ తన్మైథున మష్టాంగం ప్రవదంతి మనీషిణః.

౨ వివాహము. పెండ్లి. ౩. పరస్పరము కలియుట, కలయిక, కూడిక, ౪. అగ్న్యాధానము, దంపతు లగ్నిని స్థాపించుట.

**మైద**[1]. వి. (సం. మదః) మత్తు, మైకము.

చ. తనుతర నిత్యపుష్టితల తారతిలోనన యుండి నిద్రమైదము బడి రేప మేల్కను సుదార మధువ్రత నాఘుధంగి

హ. పూ. ౧ ౪౦.

**మైద**2. వి. కురంటకము, గోరంట కీ.

సీ. మైద గోరంట నా మనుఁగురంటక సంజ్ఞ — ఆం భా. ౨ ౫౩.

**మైదు** = **మయిదు.** వి. ౧. మాయ.

౨. మైకము.

౩. చొక్కుపొడి (శ. ర.)

**మైనపుజిడ్డి.** వి. (మైనము + జిడ్డి) మైనపుగడ్డ. (శ. ర.)

**మైనపువత్తి.** వి. (√ మైనము) దీపము వెలిఁగించుటకు మైనముతోఁ జేసినవత్తి. (శ. ర.)

**మైనము** = **మయినము.** వి. (సం. మదనః) సిక్థకము, మధూచ్ఛిష్టము.

సీ. బూది బ్రుంగిన మెుంగంబున గొడకట్టు మైనపు మైలఁబోఁతొకు నా వెలుంగ ...

ఆ. ము. ౨. ౧౦.

చ. కలికి వరాటరా జపుడు గప్పురబీడము
కట్టె నవ్వుచు,న్నలు నడపంబు వానికి ఫణా
ధరవల్లి దళాంతరంబునన్, బలితపుదేలు
మైనమునఁ బన్ని యతం డది చూచి భీతిఁ
ద,మ్ములమీఁద వైచిన న్నగిరి మూఁగిన రాజ
కుమారు లందఱున్. నైష. ౬. ౧౪౧.

గీ మైన మనఁగ, బొలుచు సిక్థంబు
ఆం భా. ౨ ౨౯౦.

జ' మైనపుబెడ్డ, మైనపువత్తి

మైనాకస్వస. సం వి. ఋ. స్త్రీ పార్వతి, మైనాకుని తోడఁబుట్టువు.

మైనాకుఁడు. సం. వి అ పుం. హిమవంతుని పుత్రుఁడు. (పర్వతవిశేషము)

మైనికుఁడు. సం. వి. అ పుం. జాలరి, కైవర్తుఁడు. (శ. ర.)

మైపూఁత. వి. (మై[1] + పూఁత) కలపము, అంగరాగము

గీ. చెమటచిత్తడి మైపూఁత దెమలి చనిన, సెమ్మసంబునఁ దమకంబు నివ్వటిల్ల
విక్ర. ౪. ౨౭౭.

సీ పుడమిపై నిచ్చలుఁ బొరలుచోఁ మెదలిన బూడిద మైపూఁతబూది గాఁగ
అచ్చ. రా. సుం. ౨౮.

మైపూఁత పసపు = చాయ పసపు.

సీ. మైపూఁత పసపును మధుకంబు సైంధవ లవణంబు చిత్రమూలంబు బరడు .
అప్ప. ౨. ౪౩౧

మైపోక. విణ. కేలిక.
కాశీ. ౬. (శ. ర.)

మైమయి=మయిమయి, మైమేయి, మైమై. వి. అత్యాధూనము.

మ. ప్రసవాకోత్సాహముల ధరాదపోతకములతం బ్రత్యర్థ రై కొల్లి యే,మగలున్ మైమయిఁ భోరానర్చిర వృథామానాహమం దైనయీ, మగతుం డెంతటివాఁడు ..
హరి. ఉ. ౬. ౧౩౧.

ఉ ఆ, భూవిబుధుండు నీవు నమఁ బొందక పోరెడు నన్ను మైమయిన్, భోవఁగ నేల యిత్తునని పూని స్వపాత్మజ నంటఁ బట్టి
భోజ. రా ౪. ౨౭౯.

మైమఱచె. అ క్రి. (మై[1] + మఱచు) ఒడలెఱుంగకుండు, పారవశ్యమునొందు

ఉ. వ్రాణిపతిఁ డిప్డు మైమఱచి నిద్దుర వోవఁగ
దశా. ౧. ౨౩౯.

వ ఇట్లు వారవిమంతినికృతనిరంతరలతాంత శరలీలాసంతోషితస్వాంతుం డై మైమఱచి
విక్ర ౬. ౧౦౪.

౨ మూర్ఛిల్లు.

గీ. మైమఱచెఁ గడపట్టై సొమ్మసిలె ననఁగ, మూర్ఛ గాన్ సాం. ని. మాన. ౪౭.

మైమఱపు. వి. (√ మైమఱచు) ౧ మూర్ఛ.

సీ. మైమఱపు బ్రమరి, యనఁగ మూర్ఛా వ్యాయం బలరారుచుండును
ఆం. భా. ౨. ౨౨౩.

౨. పారవశ్యము. (శ. ర.)

మైమఱుపు = మైమఱుఁగు. వి. (మై[1] + మఱుపు) కవచము, తనుత్రాణము.

గీ. భల్లముల గట్టిమైమఱుపెల్లఁ జించి, యతని సెత్తుటిలో ముంచె శితశరముల .
భార. భీష్మ. ౩. ౫౪.

సీ. .. మావుల రెంట మైమఱుపు నొకట, నాతప త్రము రెండు నాతశరంబుల ఘనరయంబునఁ ద్రుంచి . .
భా. రా. అర. ౧. ౨౭౧.

క. కామునిచేఁడును దుర్బలుఁడు, నై మైమఱవు
అను వాండ్లు నమ్ములు గదలుచ్ .
మార్క. ౫. ౧౧౧.
ఆం. భా. ౨. ౨౦౪.

మైమెయి = మైమయి. వి. అనాయాసము.

చ. . ఎంత ధీశరులు లయ్యు వచ్చిఁ బడి
కాలక మైమెయిఁ బోవ నేర్తురే .
కు. సం. ౧౨. ౮౩౮.

మైమై = మైమయి. వి. అనుపద్రవము.

క. ధర్మతనూభవుదెస దుష్కర్మము రూపించి
సభ నొకండును మైమైఁ, బేర్మి పెడక
పో నేర్చునె భార ఉద్యో. ౧. ౨౯

మైరేయము. సం. వి. అ పు. న. ఒకదినుసు
మద్యము, ఆసవము.

మైల = మయిల. విశే. (సం మలినమ్) ౧
మలినము, మురికియైనది

సీ పరవధూటుల మైలపరిధానములు గట్టు
చూలాండ్రఁ గొందఱు సోఁకుఁ డనియు
వరాహ ౧౧ ౧౩౧.

౨. అశుచి (శ ర)

వి. మలినవస్త్రము, మురికిగుడ్డ

క. . నేఁ, బ్రాకట భూసుర కన్యక, నీ
కట్టినమైలఁ గట్ట నేర్తునె యనినన్ .
భార. ఆది. ౩. ౧౩౫.

ఉ. ... చేలు వొప్పు సోఁకుడుం, బట్టము
కట్టుకొన్న వృషపర్వుని కూఁతుర నట్టిసేను
నీ, కట్టినమైలఁ గట్టుదునె కావర మేఁటికి
వచ్చె నీ కనన్
యయా. ౩. ౪౫.

ద్వి. ఉడికించి విదిలించి యుదికి ఘట్టించి, మద
చుట మైలలు మడుగు సేయఁగను.
పండితా. దీక్షా. ౧౬. పా.

౨. మాలిన్యము, మురికి.

ఉ. ... ఒక్కప్పుడు మైల దోఁప నథ
యాడదు రాధ ముకుందు చెంగటన్ ...
దశా. ౮. ౨౨౦.

౩. మడ్డి

సీ. బూది బ్రుంగిన మెుగంబున గోదకట్టు
మైనపుమైల పాఁదొళ నా వెలుంగ ...
ఆము. ౬. ౮౦.

౪. చీకటి, అంధకారము.

చ. జిలిబిలిమైల నద్దెసలఁ జేకొనియున్ జని
యెన్ మరీచికల్ హంస. ౪. ౪.

౫. ఎఱుపు తెలుపు పసుపు నలుపు కలిసిన
రంగు

ఉదా :—మైలావు.

జ మైలక్రోవి, మైలచాయ తొండ, మైలపడు,
మైలసంత మైలారి, మైలారు, మైలావు.

మైలక్రోవి. వి (మైల + క్రోవి) మురళి.
(శ. ర.)

మైలచాయతొండ. వి (మైల + చాయ +
తొండ) ఒక దినుసుతొండ. (శ. ర.)

మైల(ప)పడు. అ. క్రి. (మైల + పడు.) ౧.
మాలిన్యమునొందు, కళంకితమగు.

చ. ... నిజవంశము మైలపడంగఁ జేసి తిం,టి
జగద మింటిలోనె పావణింపక నీ విటు
లాంటి వచ్చుటన్ .. శై. భా. ౬. ౨౮.

౨. కాంతి హీనమగు.

ఆ. అగ్ని సల్లసైన వజ్రమిత్రుఁడు మైల,పడ్డ
మర్వి వొరలఁబడిన మేరు, నగము సంచలించి
వను బొంకు వొరయునే, నాదుపలుకు
నెమ్మనమున నమ్ము.
భార. ఆశ్వ. ౧. ౩౮.

మైలసంత. వి. (మైల + సంత) మత్స్య మాంసాదులు విక్రయించు సంత.

గీ. ఇంతులకుఁ బ్రీతిగా మైలసంతలోన .

క్రీడా. ౪౪.

మైలారి = మయిలారి. వి. (మైలారు) ఒకానొక క్షుద్రదేవతను బూజించువాఁడు.

వ. మైలారి మస్నెరితలారి తురకపింజారి విప్ర వినోదులును.

హంస. ౩. ౨౯.

మైలారు. వి. (√ మైల) ఒకానొక క్షుద్ర దేవత.

గీ సందులను సారసంబులు సలుపువారు. సెడము గుడిచేత నారతు లిచ్చువారు, సాహసము మూర్తి గైకొన్న సరణివారు, ధీర హృదయులు మైలారు వీరభటులు

క్రీడా. ౧౮౨.

సీ. గొరగ రైౖ మైలారుఁ గొనియాడు నొకవేళ నొసలిపై బండారు పసుపు దాల్చి

కాశీ. ౪. ౨౩౦.

మైలావు. వి. (మైల + ఆవు) ఎఱుపు + పసుపు + తెలుపు + నలుపు గలసినరంగుగల ఆవు.

(పొగచాయ గల ఆవు. అని శ. ర.)

మైలుతుత్తము = మయిలుతుత్తము. వి. (సం. మయూరతుత్థమ్) ఒకానొక మందు వస్తువు. (శ. ర)

మైవడి = మయివడి. విశే. అనుకూలము.

వ. కెలు సంగడీలకైవడి కెల్లనదవడికి మైవడి రైౖ మెలయు చిఱుఁదొడలును .

నృసిం. ౩ ౧౮.

వి. ౧. సమ్మతి.

వ. అంత వసంతుం డక్కుసుమకోమలి మారార్చి కుసుమాయుధు ప్రవరవశారంబు నకు నుద్యోగింపు మని మైవడి నాలుకొలిపి.

కు. సం. ౫. ౫౭౧.

ద్వి. వడ్డింపఁ దపసి మైవడి నారగింప.

బస. పు. ౬. ౪౯౯. పం.

గీ. బెదరి చేరని బలియుని బిగియఁబట్టి, కలని మైవడిచే వచ్చి హత్తఁ జేత, క్రమము పెనఁగెడు బలుమీను ద్రాటఁ జేద్య, నొడ్డుగాలంపు వేటకాఁ డుపమ వాఁడె.

ఆము ౪. ౨ ౨౫౧.

౨. అనుకూల్యము.

చ. వెలయు మహామహైశ్వర్యులవీర్యమునం దుదయించునట్టి దోర్బల కలితుండు గాని సురపాలకవిద్విషుఁ దారకాసురుస్, గెలువఁడు పోరిలో మకరకేతనుఁ బంపుఁడు వారికిం దపశ్చలనము సేసి మైవడిఁ బ్రసంగము సేయు జగద్ధితంబుగాన్.

కు. సం. ౪ ౩౭౯.

౩. తీర్పు.

చ. .. తగిన పల్కులమైవడిఁ గల్పనుందరిన్, జనపతియందుఁ జాల విరసం బగు చందముఁ బొందఁ జేసితిన్ ..

దశకు. ౪. ౫౨.

౪. విధము, రీతి.

శ. మేలవు మైవడి నగవున, మేలుపులం జోడి వారి వీక్షించి ... సైమ. ౩. ౬౪.

మైసరి=మయిసరి. వి. చక్కటి యను నాట్యము నందలి యంగవిశేషము.

సీ. లాఁగు మైసరియుఁ బల్లటియుఁ గత్రియు చొక్కు విలపిల్లు చక్కడివిధ మొత్తు.

ఉ. రా. ౬. ౧౩౯.

# మొ

**మొంటె = మొరిటె.**

సీ. . మొంటె మొరిటె యనఁ బ్రహ్వ
కూరాఖ్య యలరుచుండు
ఆం. భా. ౨ ౨౪౦.

**మొండరి.** విశే (మొండి + అరి3 స్వార్థమున) మొండివాఁడు, మూర్ఖుఁడు.

ద్వి. ఒకవిచారము మాకు నొదవె నీరాజా, సుక
వాని పనిపంద చూపు్రగుఱ్ఱంబు మొండరి
చల్లచవ్వడు గోడచేర్పు, చండిపో తనుసట్టి
జాడ నున్నాఁడు.
ద్వి హరిశ్చ ఉ ౧౪౬౬. పం.

ద్వి బందఁ దనక కదుమొండరి యనకి, రెంకు
చేతులు లేనిమొండి వీఁ దనక.
పండితా. పురా. ౧౦౧ పా.

**మొండి = మొండు.** విశే (సం. ముండమ్. ప్రా. మొండం) ౧. చేతులు కాళ్లు తెగిన వాఁడు; తెగినది; కాళ్లు చేతులు లేనివాఁడు.

ద్వి. మొండి యైనెత్తుట మునిఁగి యున్నాఁడ,
దండించి బేతాళ తల ద్రుంచి పొమ్ము.
ద్వి. క. పా. ౨. ౩౩౪ పం. (క. ర. పా.)

ఉ చీ కొఱమాలిన మొండివాని కేఁచొప్పునఁ
జిక్కెనో తరుణి చుట్టలలోఁ దలవంపు
చేసె. భోజరా. ౫. ౨౯౭.

సీ. . మొండి నా నపమఁ డొనఁగు
ఆం. భా ౨. ౧౨౨.

౨. కొంతతెగినది (కాలు, చేయి మొ.)

ద్వి. తనమొండిచేతులు తలమీఁదఁ జేర్చి,కొని
నమస్కృతుకు బొసంగుటయు ...
ద్వి. తి. పా. ౨. ౩౯. పా.

సీ. ... మొండి, మొం ఱున భిన్నత్వ మొనరుము.)
ఆం. భా. ౨. ౧౨౪.

౩. మొక్కపోయినది.

ఉదా :—మొండి గంటము, మొండికత్తి. మొ.

౪ మూర్ఖుఁడు; మూర్ఖురాలు.

సీ. నక్క చిక్కులమారి పెక్కుకుయూపి దూబర
దిండి బొంకులబాన మొండి.
చెన్న. ౨. ౨౪.

౫. బోసియైనది, పట్టిది, ఆభరణాదిశూన్యము.

ఉదా :—మొండి మెడ, మొండిచెవులు మొ.

జ : మొండరి, మొండికట్టె, మొండికత్తె, మొండివాఁడు. మొండీఁడు.

**మొండికట్టె.** విశే (మొండి) మొండితనము కల వాఁడు; కలది, మూర్ఖుఁడు, మూర్ఖురాలు

సీ. ఆకతాయి బికారి యడిబంద గుండఁడు
మొండికట్టె గులాము ముప్పెగోవు.
హంస ౫. ౧౧౩.

౨. కుబుసుఁగు

గీ. మొండి, కట్టె నాఁగను గుబినాఖ్యగాఁ
దెలంగు
ఆం భా. ౩. ౭.

**మొండికెత్తు.** అ. క్రి. (√ మొండి) బండతనము కలవాఁ డగు

(వ్యవ.) వాఁడు ఎంతకొట్టినను మొండికెత్తి కదలకున్నాడు.

**మొండియము = మొండెము.** వి. కబంధము, తలలేనిదేహము.

ఉ. గం డొకపండితోఁ తొడుకం గదకం
జెఱపంది గొట్టిన, న్మొండియు మూడి కుక్క
తల పడిన న్వరాహ మ్మాయుండలఁ జెట్టు
గుట్ట యన కన్నిటి రాచిన నూడ దియ్యె .
కపు. ౪. ౯౧.

**మొండివాఁడు.** విశే. (మొండి + వాఁడు) ౧ చేతులు లేనివాఁడు.

ద్వి. ఒం డేమి నీదుదోర్దండమంగతిని, మొండి
వానికి వచ్చె రెండు చేతులును . ..
పండితా. పురా. ౧౦. ౪. పా.

౨. మొండితనము గలవాఁడు, మూర్ఖుఁడు.

(వ్యవ.) మొండివాఁడు రాజుకంటె బలవంతుఁడు

మొండీఁడు. విశే. (మొండి+ఈఁడు. స్వార్థమున) మొండితనము గలవాఁడు, మూర్ఖుఁడు.

క. మొండీఁడు పాపకర్ముఁడు, చండాలుండాదినీచజనుఁ డుత్తముఁడం,గుండైనవాని నడిచిన, దండు వుడిగి చంపు టుచితధర్మము పతికిన్
విజ్ఞా. ౨. ౧౨౪.

క. తెలుసంటి దన్ను సెదిరిని, సెలుఁగఁడు దన కోలఁది పుడుకలేఁడు మొండీఁ, డటు జాతి ..
క్రీ. సం. ౭. ౯౯౦.

మొండు = మొండి. (క ర) విశే. కొంత తెగినది (కాలు, ముక్కు మొ)

ద్వి. ముక్కుక రామానుజుండు శూర్పణఖ, ముక్కును చెవులును మొండుసేయుటయు
రం రా బాల. ౬ పా ౧౬. పం.

(చి వి. పా. మోడుసేయుటయు ముద్రి. పా. మొండిసేయుటయు శ. క. సా.)

మొండెపుగాము. వి. (మొండెము + గాము) కేతుగ్రహము.
(రాహువు. అని. శ. ర.)

మొండెపు రక్కసుఁడు. వి. (మొండెము + రక్కసుఁడు.) కబంధుఁడు.

క. రెండు మొనవాఁడికోలల, రెండుభుజంబులను వానిరెం గూర్చి కడుం, గొండవలె నున్నయబ్బులు, మొండెపు రక్కసుని మేను మురియలు చేసెన్.
అచ్చ. రా. అర. ౧౧౭.

మొండెము = మొండియము. వి. (సం. ముండకః, ప్రా. మొండం) తల లేనిశరీరము.

క. రండమ్ములఁ గరయుగ్మము, ఖండించి పటు ప్రచండకాండం బోకటన్, గుండలదీప్తుల తోడను, మొండెము భువి ద్రొల్లఁ జేసి ముదమున వార్చెన్.
హరి. ఉ. ౪. ౧౨౯.

మ. అలకాధీశునిదూత ని ట్లతఁడు ప్రాణాంతంబు నొందించి యా,తలయున్ మొండెముఁ గొల్వులో మెలఁగుభృత్యవ్రాతకిన్ పార్చెనె . ఉ. రా. ౨. ౩౨౨.

సీ. మొండెముల్ మొనసలు కండలు కప్పులు మెద దస లేనుంగుపదుపు దీవు,లు
అచ్చ. రా. యు ౪౯౨.
అం భా. ౨. ౨౨౫.

జ. మొండెపుగాము, మొండెపు రక్కసుఁడు.

మొకబంగము. వి (సం. ముఖభంగః) మొగము విఱుపు, కోపము.

ద్వి ముక్కున చేయాలు మామూలు గాఁగ, ముక్కు తోకాని రమ్మ మొకబంగ మెదయు . ద్వి. పరిమ. ౪. ౩౧౩.

మొకమాలు = ముకమాలు. వి. (హిం. ముహ్మూల్) ఒకవిధమగు మేలుజాతిపట్టు.

సీ. పగడంపుఁగంబము ల్పచ్చరాచోదులు గొన వారు మొకమాలుగోడబారు.

గీ. కలిగి . అలరారుడేరాహజారమునను . .
రసిక. ౩. ౧౪౧.

చ. సకిసెలి పట్టెమంచమునఁ జాయన కాసితివాకి హైదరం, గికమొకమాలుతేప్రున నొగిన్ శయనించి మనోభవవ్యథన్ . .
హంస. ౧. ౭౯.

మొకము = మొగము. వి. (సం. ముఖమ్. ప్రా. ముహం) ముఖము, వదనము.

ఉ. ... ఈశ్వరకే మహిఁ గన్నుఁద్రావమి విధి రత్నపుబొమ్మల వాఁచికొన్నవా, మొకమున (వేలుచున్నయది ముఖ్యేరమార్తుల నంచు నార్తుఁ డై. ఉ. హరి. ౨. ౬.

ద్వి. చికిలిచూపులు మనుజెక్కులముద్దు, మొకము కెంపులమోవి మొలకనవ్వులును .

రం రా. బాల. ౬౧. పా. ౧౫ పం.

చ. మీ, సకియ వివాహవేళఁ బురశాసను పాణిఁ బరిగ్రహించుచో, మొకమున బున్ను మంచు నహి ప్రమోగిన ట్లు భయంబుఁ జెందుచో హర. ౪. ౨౪.

మొకమజ్జనము= ముఖమార్జనము, మొగము కడుగుకొనుట

క. మొకమజ్జన మై సంధ్యా, దికకృత్యము లాచరించి సారంగ. ౩. ౧౫౬.

మొకమెఱుక = ముఖపరిచయము, కొంచెము స్నేహము

క. మొకమెఱుక గలదు గదక్కే, మకరాంకుని యనుఁగుమేనమామకు నీకున్, దికమకలు సేయవల దను, మకటా మేడపయి కేఁగు నవు డైవఁ జెలీ. విజ. వి. ౨. ౧౯౯.

జ. మొకమోట, మొకమోడు, మొక్కట్టు.

మొకమోట (ము) = మొగమోటు. వి. (మొకము+ఓట) ౧. దాక్షిణ్యము, పరచిత్తానుకూలవర్తనము.

చ. అని కడుఁ దెంపుచేసి మంతుఁ డాడినమాటకు మాఱుపల్క స్మేరని మొకమోట నాన్నపతి రత్నము కొండొక నెచ్చనూర్చి

భోజరా. ౪. ౪౬.

క. పాటి గలదె పసరముసకు, (క్రేటలవిం గదిసి నపుడె విఱువక నే స్వమ్ముటల నేలుపడితి మొక్కమోట దరిద్రత్వమునకు వోఁగఁ బొత్తి ద్యోగ్ ... భోజరా. ౬. ౫౫.

౨. సంకోచము.

క. వికచితకిరీమతొరక, మకుమారకరీర సార శోభాన్వితలన్, మొకమోట మింత గలుగక, యకటా మోదంగఁ జేతులాడదొ నీకున్

హరిశ్చ. ౨. ౧౫౮.

మొకమోడు. అ. క్రి. (మొకము + ఓడు) దాక్షిణ్యపడు, సంకోచించు

క. అకటా తగ దని పలికిన, మొకమోడక నన్ను బన్నములఁ బఱచి రోగిన్

దశకు. ౩. ౧౨.

క. ఒకనిని జంపను జెఱపను, (బకటితముగఁ బ్రోవ నెఱిఁగి బలవంతుఁడు వ్వానికి నడ్డపడక యున్నను, మొకమోడక పఙ్సహస్రముం గొనవలయున్ విజ్ఞా. ౨. ౧౦౧.

మొకరము=మొక్కరము. వి స్తంభము

ఉ వచ్చి నృపాలకేళిగృహవాటము నెచ్చెలి పిందుచాటునం, జొచ్చి మెఱుంగుదేఱు తోఁగచుట్టపుటామొకరంబు మాటుగా, నచ్చపలాక్షి నిల్వ

వసు. ౬ ౨౬.

(శ. ర. పా. మొగరము. ముద్రి. పా.)

సీ. రమణ మాటుగ నున్నరతనంపుమొకరంబు దంబుగా నవలఁ గొండెంబు నెప్పు

చమ. ౩. ౯౦.

మొకరి. విణ. (సం. ముఖరః) ౧. ప్రోయునది ధ్వని చేయునది.

సీ. మొకరి మట్టెలమ్రోత ముద్దుచూపఁగ రంభ కనకంపు గొడుగుబాగాలు దొడిగె...

హర. ౪. ౧౩౪.

మ. వలిపంపుఁదరమాటులం దిరుగు జాళ్వాకేలి కీలాబ్బమ్మలం, దెలసాదుల్ విరిచందువా మొకరిలేదెంట్లార్భటు శ్వేత్రమా, స్తులు

పామంతులు కొల్వ దెబ్బవలుకుద్దుల్
చామరగ్రాహిణీ, వలయూరావము వంది
మాగధులకై వారంబు తోరంబుగన్.

చం. రా. ౨. ౫౬.

క. అదొర యేగతి వారల,వా దుడుపన్
వలయు వింటివా వినలేదో, పైదలి యనినఁ
బ్రభావతి, మోదము వెలిఁజిలుకఁ జిలుక
మొకరిఁ బలికెన్. శుక. ౨. ౭౯.
(చిలుకమొకరి, విశేషణోత్తరపదకర్మధార యసమాసము).

౨. అగ్రేసరము, ముంపునడచునది

సీ. ఇరుఁగోపులను దుమ్ము రేగయింపునది విశే
ము స్త్రీబు గలకాలు మొకరిపోఁజు

కువల ౨. ౧౭౪.

౩. అసంబద్ధవచనము లాడువాఁడు; పొసఁగని మాటలాడునది.

ద్వి. మొకమునఁ దగ బొమముడి పెట్టుకొనుచు,
మొకరియై పెరిఁగి యేపున మల్లచూచి

రం. రా. కుం.

(శ. ర.)

జ. మొకరితనము.

మొకరితనము. వి. (మొకరి+తనము) వాచాలత, అసంబద్ధవచనములాడుట.

చ. మొకరితనంబుతో వెనుక ముందఱ రెఱుంగక
తామె గానవి,ద్యకుఁ బ్రభు వైనలీల దుర
హంకృతిఁ బోరడు వీరితోడ..

సమీర. ౯. ౧౩౭.

మొక్క¹=మోక. వి. (సం. మాలికా) ౧. మొలక, అంకురము.

సీ. మొలక మొలక మొక్క మోక మోసిరా
మొటికె నా సంకురం బొప్పచుండు. .

అం. భా. ౨. ౩౫.

ఉ. మానపుమొక్క నిక్కనక మిక్కిలిదొక్కరి
వాన కుంతలా,సికురపాల నీలమణిలీలకుఁ
గ్రొమ్ము రుమాన . రా. వి. ౨. ౨౫.

శా. కాసీ రం దని శేకరాశ్రీరుచిమొక్క
ల్రువ్వక్కలన్ . తారక. అము. ౨. ౨౬.

౨. పల్లవాంకురము, చిగురుమొలక.

సీ. ముందట సెలమావిమొక్కల నలరింపఁ గర్త
దా నగుచెలికాఁడు నడువ

హరి ఉ. ౬. ౫౭.

౩. ఐ ఒకజాతి జొన్నలు (శ ర)

జ. మొక్కజొన్న, మొక్కమామిడి.

మొక్క². వి ౧ మదఁగినమొన

గీ కురునిఁ దునిమిన శితిసాయకంబు మొక్క
దీర్చుచున్నాఁడు కంటి వైదేహివిభుని

భా. రా. యు. ౩౭౧.

సీ. గురుకుచాకుచపాతకుంతాంగజాంబుజాస్త్ర
ములమొక్కలు దిద్దుసాన యనఁగ

రా వి. ౩. ౩౦.

౨ కొఱఁత, లోపము.

శా. వేసం డీగతిఁ బాపకర్మములు గావింపంగ
నాకీడునన్, వాన ల్లల్లక మాని వారణము
లెందుఁ జొచ్చెఁ జెక్కపడల్, గాన
న్వచ్చె సమస్త దేశముల మొక్కల్ దాఁక
నశోన్యాదు, ర్మానక్రోధమునం బ్రజ ల్చెడిరి
తాపం బయ్యె నానాఁటికిన్.

వి. పు. ౨. ౧౦౪.

౩ గంటి, గాయము.

మ. ఉద్భటా, చలకూటోపలతోటిరూపు
చెడ నిచ్చల్ రాయఁగా నైనమొ,క్కలు
భూకాంతకు నున్ననయ్యె.

మనుచ. ౧. ౩౫.

విణ. (సం. మోఘః) ౧. వ్యర్థము (శ. ర.)

౨. మొనచెడినది, వాఁడి చెడినది.

ద్వి. అక్కజంబగుచు వక్రాభయుద్ధం బుండ,
మొక్కపరివయకును మోహించినట్లు ..
భాస. పు. కి. ౧౩౧. పం.
(మొక్కలపురియు. (శ్రీ త్రప్రతి. పా.)

3. లేఁత, చిన్న.

వ. గ్రక్కునఁ బోదము మొక్కనగవులమోము
దమ్ములకు కేటొక్క వింతతెలివి రొక్క
ఆము. ౪. ౩౫.

జ : మొక్కపడు, మొక్కపఱచు, మొక్క
పాటు, మొక్కపుచ్చు, మొక్కపోవు,
మొక్కలుపోవు.

**మొక్కఁడు.** విశే ౧ బలసినవాఁడు
(శ ర ప్రా.)

౨. దృఢచిత్తుఁడు పట్టినపట్టు విడువనివాఁడు.
(ప్రా.)

**మొక్కకట్టు** = మొలకకట్టు.

**మొక్కచె (సె)డు.** అ క్రి ౧ ఆశాభంగము
నొందు.

వ చక్కరవింటి చక్కనిసామి పువ్వు
ములుక్క లేసి చిక్కపఱుప జక్కవజవరాలు
మొక్కచెడి యిక్కదక్కదం దిరిగి
ప్రద్యుమ్నచరిత్రము. 3. ౭౫.

౨. అవమానము. (శ. ర.)

**మొక్కట్టు.** వి (మొకము + కట్టు) ముఖవైఖరి.
(శ. ర. ప్రా.)

**మొక్కజొన్న.** వి. (మొక్క1 + జొన్న)
యావనాళభేదము, ఒకజాతి జొన్న f
(వ్యవ.) ఈ సంవత్సరము మొక్కజొన్న
బాగుగా అంటలేదు.

౨. బ. ఒకజాతి జొన్నలు.

(వ్యవ.) ఇప్పుడు మొక్కజొన్నలను గూడ
ఆహారముగా నుపయోగించుచున్నాము.

**మొక్కడి** = మొక్కలి. వి. చిన్నదంతములు
గలవాఁడు. (శ. ర.)

జ : మొక్కడీఁడు.

**మొక్కడీఁడు.** వి. (మొక్కడి+ఈఁడు స్వార్థ
మున.) మొక్కడి.

సీ. . . మొక్కడీఁ డన నల్పదంతగజాఖ్య
దనరు ఆం. భా. ౨. ౧౯౪.

**మొక్కపడు.** అ. క్రి. (మొక్క+పడు.) ౧.
మొనచుఁగిన దగు

సీ. కరముఁ గోకిలభటోత్కరముచేఁ జగురుఁ
గ్రొంబదనువంకిణి మొక్కపడఁగఁ జూచి.
చంద్రా. 3 ౧౧౪.

౨ భంగపడు, చెడు
(చూ మొక్కపఱచు.)

**మొక్కపఱ(ఱు)చు.** మొక్కపుచ్చు స క్రి.
(√మొక్కపడు) ౧ మొనవపోఁజేయు,
కుంఠితముచేయు

సీ రాజుపైఁ గొఱగానిరహిఁ జూచి తనవాలు
మొక్కపఱచునగుమోముఁ దలఁచి
బాలకుఁజేసినవాఁడిచూపుఁ దలఁచి .
రా. వి 3. ౧3౯.

సీ. పరికించి చారలేక పై పైచి వజ్రాది బహు
శస్త్రములు మొక్కపఱచుటకును
దశా. ౧౦. ౯.

౨. భంగపఱచు, పరాభవించు.

గీ. . అబల్లిదుండు, వారి నందఱఁ బెక్కు
క్రొవ్వాఁడిములికి, మొత్తములచేతఁ దద్దయు
మొక్కపఱచి
అచ్చ. రా. యు. 33౨.

వ. చుక్కలజిగి మొక్కపఱుచుచుఖ చక్ర
వాళి చంద్రికల ...
ఆము. ౬. ౯౦. ౯౪. ౨. ౨౦౦.

౩. చెఱుచు, భగ్నముచేయు.

క. ఒక్కసీమగుపలయీలువు, మొక్కపఱిచె దీప . పారి. ౧. ౫౦.

గీ. పాలను మేఁతరక్కొన్నఁబోఁడి తెగల, యీలువు మొక్కపఱిచియు మేలికత్త, లాని పై మొక్క మొనసి పాలనుల సెల్లఁ, జిదుమఁ గలబల్లిదుఁడ వల గదల తంద్రి. అచ్చ రా. బాల ౧౫౯

**మొక్క-పాటు.** వి. (√ మొక్క-పడు.) భంగపాటు, పరాభవము.

ఉ. కల్లరి చేరజంబు విటకంటకి మిక్కిలితత్తమాజయము, దల్లి నతిక్రమించినను దాను వహించుకొనంగ జాల ది, ట్లల్లనఁ జేరఁదీసి యిపు డాచెడు గక్కడ మొక్కపాటు దే, నుల్లమునం దలంచినదొకో. విప్ర. ౪. ౧౭.

**మొక్క-పుచ్చు** = మొక్క-పఱచు. స. క్రి. (మొక్క 2 + పుచ్చు) మొక్క-పోవఁ జేయు, కుంఠితము గావించు, భంగపఱచు.

ఉ. అడ్డ మ్ముస్నాఁడు మదాతిరేకమున నా కిపరోధము సేయ జేఁడి యవ్వాఁడిమి మొక్కపుత్తునని వత్సమునన్ బఱతెంచి తాఁకినన్ ... భా. రా. సుం. ౭౭.

**మొక్క-పో(వో)వు.** అ. క్రి. (మొక్క 2 + పోవు) ౧. వాఁడిచెడినదగు, మొఱవపోవు, కుంఠితమగు.

మ. కదనోద్దండత నొక్కయమ్మునన ప్రక్కల్ సేసి నవ్వాలి నా, ప్రదరం బిప్పుడు మొక్కపోదు నిను ద్రుంపంజాలుఁ గ్రొవ్వాడిమిన్ . . భా. రా. కిష్కిం. ౪. ౭౪.

సీ. గురుగోత్రతటములం గోరాడ మను మొక్కపోయినవలిగొమ్ము దోయి మెఱయ పారి. ఉ. ౪. ౪౯.

౨. భంగపడు, పరాభవము నొందు.

గీ. మునులమునులు నొప్పించి మొక్కవోఁగా, బైనిదొలఁగినవా రంతలేనివార, లు ... సి. శకుం. ౨. ౩౪.

సీ. భృంగంబు చెలిమావు బొఱుకులో నిలువమి మొక్కలంబున నొంటి మొక్కపోక వాల్మీ. ౩. ౧౨.

సీ. భూమిధరారాతిచే మొక్కవోవనియురిది బిడ్డనిఁ గాంచినట్టిమేటి విజ. వి. ౧. ౧౭౪.

వ. అంత నక్కడఁ గంసుఁడు పూతన పోయిన పోక నిజాప్తు లగు దనుజులచేత విని నంద గోపతనయుఁడన శంకించి మున్ను కాశికాదేవిచేతి పరిభూతివలన మొక్కవోయి లజ్జించి యున్నవాఁడు. హరి. పూ. ౫ ౧౭౭.

(ఇట శౌర్యహీనుఁ డయి అని భావము.)

౩. నశించు, చెడు.

వ. పెరుగ లబిరుదుమాన్దిలఁ బొక్కండ్ర జయించి రొక్కడను మొక్కవోనిమానంబున నమానగర్వుండ నగుచు కళా. ౭. ౧౦౭.

౪. హానిచెందు, కీడొందు.

గీ. లక్కయిలు చెంత నొక్కింత మొక్కవోక, పొక్కనపుఁ గొగవుల నెల్ల తెక్కఁగొనక, కన్యఁ గైకొంటి రెఁక మేలు గలుగు ననుచు, నతని నూరార్చి సబలుఁ డై చనిరి కొ. పాంచా. ౩. ౧౭

ఆ. కక్కసంబుచేతఁ గాలునిచేతను, మొక్కవోదురు తుది మొనసి వేమ వేమ. ౪. ౧౭౪.

**మొక్క-మామిడి.** వి. (మొక్క 1 + మామిడి.) ౧. టెడిమామిడి, అట్టిబీజము ? (శ. ర.)

౨. వి తనము వాఁటి పెంచిన మామిడి, అంటు మామిడి కానిది శ్రీ. (వా.)

మొక్కము. వి. (సం. ముష్కకః) వృక్షవిశేషము, మోక్షము శ్రీ. (శ. ర.)

మొక్కరము. వి. ౧. గడ్డమాను, గడియ, అర్గళము.

గీ. నీమనములోన, గడియ సడలించు తలుపు మొక్కరము బిగిచి ..

వి.ప్ర. ౪. ౬౭.

క. మత్తచకోరాక్షీ కేళి మందిర మపుడు,ద్వృత్తిఁ దోరంబాటి మూసినమత్తము వలెఁ దలుపుమూసి మొక్కర మిడియెన్.

శుక. ౨ ౧౩౬.

౨ నిరోధము, ఆటంకము

ఉ. ముక్కున నొక్కటిం గఱచి మొక్కరి మేమియు లేక పాటి తా, నొక్కి శిలాతలంబుపయి నుండి రయంబున మెక్కవచ్చి

నా పంచ. ౧. ౨౨౪.

3. స్తంభము. (శ. ర)

మొక్కరము²=మొక్కలము. వి. శౌర్యము.

సీ. కరము వా దిదుమామయురము వాలించు మొక్కరము వారనిమేలి కరముపాఁద ..

ప్రబంధ. ౨. ౨౧౩.

మొక్కలపడు. అ.క్రి. (మొక్కలము + పడు) ఔద్ధత్యమువహించు, మిడిసిపడు. (చూ. మొక్కలపాటు.)

మొక్కలపాటు. వి (√ మొక్కలపడు) ముష్కరత్వము.

ఉ. పెక్కు తెఱంగులం గరవిపీడన మే నొనరించి వంచినన్, ప్రుక్కక మిట్టిమిట్టి తలఁజూపుచు .. మొక్కలపాటుఁ జూపెదవు ..

చంద్ర. వి. ౨. ౧౭౯.

మొక్కలము=మొక్కరము², మొక్కలి. వి. (సం. ముష్కరః, ప్రా. మొక్కలం) ౧. మూర్ఖత, మొఱకుతనము.

చ. ... కౌరి మొక్కలమున యాదవులఁ గానఁగఁగాఁ గని మూన్పఁ దుపేక్ష సేసె .

భార. మా. ౧౧౭.

క. నిక్కము హరిదాసులకును, మొక్కలమునఁ గీడు చేయ మొనసిన యేనిన్, ప్రుక్కడ వానపు పట్టిన, చొక్కపుఁ బలకైనఁ బెద్ద కూలంబైనన్.

నృసిం. ౪. ౧౧౬.

చ. తొలఁగగదమ్మ నాకు నిటు దోసము గట్టకు మమ్మ యింత మొక్కల మిది యేఁటికమ్మ కోఱగాని కులంబునఁ బుట్టినట్టి నావలనఁ బ్రయోజనం బొకటి వచ్చునె చెప్పఁగదమ్మ

భోజరా 3. ౧౦౩.

౨. మోటుతనము.

ఆ. లావు గలిగి మొక్కలమ్మునఁ గీచకారాతి సొచ్చి ధార్తరాష్ట్రసేనవు, వలన నొచ్చుచున్న వాఁడు గావున ధర్మసంగరమున నరిది జయము గొనుట.

భార. శల్య. ౨. ౨౩౦.

ద్వి. విప్రుండ వై యిట్లు విపులకోపమున, నీప్రాణి నొప్పింప నేల నా కనక, తక్కక నీకుక్కలల ప్రయ్యవాలు, మొక్కలంబుగ నీకు మోడంగఁ దగునె.

రం. రా. ఉ. ౧౩౫ పా. ౨ పం. కవిక. 3. ౧౦౫.

3. ఔద్ధత్యము, మిడిసిపాటు.

ద్వి. వాఁడి తేజముతోడ వచ్చుకొకవి, కన లెడు తెంపు మొక్కలమును జలమును, గమ గొని చిత్తంబు గలఁగి ధూమిభుఁడు.

ద్వి. పరిశ్చి. ప్ర. ౧౧౬౯ పం.

సీ. అడవులోఁ జేటి చన్నవిని రాజధుల
మున్నాడఖ కొండల కెల్లఁ బిదుక కైతెఁగ...
మనుచ. ౨. ౧౧.

ద్వి. ప్రొద్దు కేఁ దీర గ్రుంకెఁ జాలమున
నంతి, మద్దు తేఁగలు వచ్చి మొదవులఁ
గలచె. ద్వి. హరిశ్చ. ఉ. ౧౭౭. ౪. పం.

ఉ. శ్రీరాభిషేకము . మొదలియుడపున నాళ
కోల పోషనివసమున మొదవులు ...
ద. శా. ౪. ౧౧౩౭.

క. ఉదకము చేతను కపటపు, మొదవు మడిచె
మొదల నుదకములచేన ఉడిన్, బ్రతిక
నుదకంబు ధరలో, నది గాన విపాహృతా
హ్వాయంబులు దాల్చెన్.
వరాహ. ౧౦. ౭౧.

సీ. అడిగినఁ గాడుకక ప్రదరు తేల్పులకు
నిచ్చులఁ బాఁడి మొదవులఁ జాల
కొసఁగు ... నీలా. ౧ ౪౯.

౨. తొలి చూలి యావు.

సీ. ప్రథమ గర్భిణి పేర వరగును మొదవన...
ఆం. భా. ౨. ౨౭౨.

మొదుగ. విశే. ౧. కింశుక, బిఱుసు. (కర్తృధారయంబున దీనికి విగాగమము బహుళము.)

సీ. పొదివిన వందంద మొదుగని యుటచేత
పిడత తో కారలు గ్రేవి గ్రేవి ...
హరి. పూ. ౭. ౧౭౧.

౨. పాంద్రము, దట్టమైనది. (శ. ర.)

వ: మొదుకన.

మొదుకన. వి. (√మొదుక.) ౧. కఱుకఁదనము. (దీని యాక్రేఁడిత రూపము మొదుమొదుకన.)

ఉ. ...మొదుకొమ్మ అరటికొనుట మొదుకగాని
మొదుక నుడు విడిచినరకోల మరుమడుంచు
తెలియక ... హరి. పూ. ౫. ౧౪౨.

సీ. మార్వశ్చైచాలిల మొదుమొదుకన రైవ
చేని దాఁ పత్యగ్ర మైనటించు ...
మద. ౫. ౫౯.

౨. బరువు.

ఉ. ... కరవాలంబు శుండాల కుంభస్థలంబులు
వగులఁగ్రేసిన మొద దంటి మొదుక నైనఁ
గెడు దంతంబులు నఱకి చులకం జేయుచు...
భార. భీష్మ. ౨. ౪౧

మొద్దఁడు. విశే. (సం. ముగ్ధః) ౧. మూఢుఁడు. (శ. ర.)

చ. ... తా, నిటువలె సెద్దు మొద్దనికి సేమి
టికిం దగులంబు పేసె ... సురా. ౭౦.

౨. లావైనవాఁడు. (శ. ర.)

మొద్దు. విశే. (సం. ముగ్ధః) ౧. మూఢుఁడు, మూఢురాలు.

క. మద్దుమమిా యిదిమాడని, మద్దు మమిా నాదు
మాట పాలించితివా, ముద్దుమమిా యూ
పానిది, మొద్దుమమిా...చంద్ర. వి. ౩.౪౨.

౨. వాఁడిచెడినది, మొనపోయినది.

(చూ. మొద్దువోవు.)

౩. లావైనది, స్థూలము.

సీ. మొద్దు ప్రాఁదులు దాఁకి మొనగోళ్లుపట్టుచు
మురిసిపోయిన కాళ్ల మొద్దుప్రేళ్లు ...
సురా. ౫౪.

ద్వి. బద్దపిక్కలు నంటు బలిసినతొడలు,
మొద్దుఁబాదంబుల మడిగినప్రేళ్లు ...
ద్వి. హరిశ్చ. ఉ. ౧౯౦. పం.

వి. ౧. కొమ్మలు విఱిగినప్రాను, స్థాణువు.

సీ. మొద్దు ప్రాఁదులు దాఁకి మొనగోళ్లుపట్టుచు
మురిసిపోయిన కాళ్ల మొద్దుప్రేళ్లు ...
సురా. ౫౪.

౨. [illegible] భాగము, ప్రకాండము.

వి. ౧. ఉత్సాహజనకమగు మూలికావిశేషము. (ఓకాహళ స్తంభనమూలిక. శ. ర.)

సీ. మొనకట్టు పెత్తమ్మి మొత్తమ్మునకు రచ్చ
పట్టు రమా వధూపరివృఢునకు ...
చంద్రా. ౫. ౧౨౦.

(విణ ఉత్సాహకరము. అని శ. ర.)

సీ. చనవులోఁ దారికట్టును మొనకట్టును దెలుపు
వారల మనవులు ఫలించె ...
కువల. ౫. ౫౬.

౨ ఉత్సాహము. (శ. ర.)

**మొనకా(గా)ఁడు.** విణ (మొన + కాఁడు. బ. మొనకాండ్రు, మొనకాండ్రురు, మొనకాఱు)

౧. శూరుఁడు.

క. ఎట్టి మొనగాండ్రు లేనియుఁ, గట్టిగ నా
యెదుట నిటము గలఁగఁగఁ బలుకు, ర్నట్టు
కాని నేఁడు మిగుల, నొవ్వట్టిఁడ వీ వెట్లు
నిలిచి పోరెదు చెపుమా.
అచ్చ. రా. బాల. ౨౦౨.

౨. ముఖ్యుఁడు, ప్రధానుఁడు. (శ. ర.)

౩. సేనాధిపతి.

క. అని యతఁడు వల్కఁగా నింద్రుని మొనగ
మును జాచి నారదుఁడు తా లింకన్,
మొనగాండ్రకు మద్దత్తుగ, వని సేయఁగ
వేల్పు టొజ్జ నంపఁగ వలయున్.
మల్లు. పు. ౨. ౧౦.

**మొనకాలు.** వి. (మొన + కాలు) పాదాగ్రము, కాలికొన.

సీ. కవీరవయోజజైల సంఘట్టనమునఁ, దిరిగెఁ
దరఁగలు ధూమి ధృద్వయుల, సత్త్వగరిమ
రొంచని బలుకొ్లన కాళ్ళమీఁద, వడరు
జడమాత్రులకు మొలు వగు రొండు . .
ఘటికా. ౨. ౧౨౩.

**మొనకెక్కు.** అ. క్రి (√ మొన) అధికమగు హెచ్చు.

క. మనసు గరఁగించు శిగ్గులు, మొనకెక్కని
కోపములను మచ్చుటగా నూతన భూషణ
ములం గోరుచు, మొనయుట మొదలైన
పెల్ల ముగ్ధల చేష్టల్.
గంధ. ౧ ౩౮

**మొనకొను.** అ. క్రి. (√ మొన) ౧. తోఁచు, స్ఫురించు.

క చని యమ్మౌని గనుఁగొనఁగను, దవపాదాం
గుష్ఠమునను ధర వ్రాయుచు నిల్చిన పెవ్వతె
దీ వనిసను, మునివర చిత్తమునఁ దలియ
మొనకొను ననిరాయెన్
అధ్యా. ఉ. ౨౨౪. శ్లో.

౨. సమీపించు, చేరువగు

క. విన రైతి రిట్టి హేతువు, జనియింపఁగ వలె
మనకు సాంఘాతిక మై, మొనకొవిరొు
మరణకాలం, బనుమానం బింక నేమి యున
వుడు నంతన్.
రంగా. ౩. ౧౫౫.

**మొనగాలు.** వి (మొన + కాలు) అశ్వగతి విశేషము.

గీ. పొలుచు నాస్కందిత విశేషము మొనగా
ల్పనంగ .. అం. భా. ౨. ౧౯౮.

ఉ. వీతఖలీన మై యతుల వేగమున న్మొనగాలు
ద్రొక్కుత్రు,స్థా తురగంబు నెక్కి యులస
త్స్థితిఁ జేస్పదమంబు వానికిం, జేరఁడు వేల
మేరుగిరి సింధుత్ర నత్సపదంబు దూరత్రు,
స్థాలము దైవజానికి నిజాంగక తార్క్ష్యము
దక్ష్య పెద్దయున్ ..
శేష. కంక. ౨. ౧౫౦.

**మొనగుబ్బు.** వి. (మొన + గుబ్బు) స్తనాగ్రము.

గీ. అఱచె వాపోయె పెద్దపు మొఱలిడె నవఁ,
దనరు రోదనమును జేసె నటుల కాఖ్యలు .
ఆం. భా. ౩. ౧౮. దశా. ౪. ౧౮.

మొఱయు. అ. క్రి. ధ్వనించు.

సీ. మొఱయుకనిడుకంతి మొఱయ నానందాబ్ధి
మునిఁగి కన్ రెప్పలు మోడ్చి మోడ్చి
మల్లపు. ౨. ౧౯.

జ : మొఱయించు, మొఱయిక.

మొఱవ. విశే. వాఁడిచెడినది. (చూ. మొఱవ పోవు)

జ : మొఱవపోవు.

మొఱవపోవు. అ. క్రి. (మొఱవ + పోవు) ౧. వాఁడి చెడిన దగు, మొక్కపోవు.

సీ. మొఱవవోయెనో వక్రముఖవక్రహరమహా
సంపర్కనిర్వక్రచక్రధార .
సిం. నార. ౪.

౨. క్షీణించు.

సీ. ముదిమి నింద్రియశక్తి మొఱవ వోకుండంగ
మైథునక్రీడ రేమఱమి యొఱవు
కాశీ. ౬; ౧౩.

మొఱ(లు)పెట్టు. అ. క్రి. (మొఱ(లు)+పెట్టు) ౧. ఆర్తనాదముచేయు, కూపెట్టు.

మత్తకోకిల. ఎంతయున్ మొఱపెట్టె వేదము
లీశ్వరా మము దేవతాంతకుచేఁ బడకుండఁ
బ్రోవవె యంచు దశా. ౧. ౨౪౩.

౨. కష్టములు చెప్పికొను.

క. వగఁ బొగులు దీనజనముల, ఖగగమనుఁడు
బ్రోచుచున్న గతి యొప్ప శిలన్, మగువ విను
రాజా గొట్టఁగ, మొగసాలకు మొఱలువెట్టు
మాధులు గలరే. కుచేల. ౧. ౭౫.

౩. పెద్దగా ధ్వనిచేయు.

మ. ... కసవుఁ గఱచి చేరయుత్తి మొఱపెట్టుట
కరులయందు .

ఆము. ౪. ౧౨౩. (ఏనుఁగు పక్షమున)

మొఱవైచు. అ. క్రి. (మొఱ+వైచు) మొఱ పెట్టు; ఆర్తనాదముచేయు; పెద్ద ధ్వనిచేయు.

ఉ. . సమస్త నిర్మాణ ధృతిప్రకాశకరు
మాధవునిం గెనకంగఁ బోవు గీర్వాణుల
బోకుఁ డంచు మొఱవైచెనో యన
బ్రోసె నంత నిస్సాణము పాకశాసనుహా
జారమునం గదనాభికంపిరయై
పారి. ౪. ౭౩.

మొఱసడము. వి కుడుపకుక్క, కుడుములు మున్నగువానిని వేటాడెడు శునకము

ఆ. కొలంద్రదివ్వె యునికిఁ గని కొమ్మటుడు
ములఁ, గఱచి తిగిచెఁ గొన్ని మొఱసడ
ములు చంద్ర. ౨. ౪౫.

క. జాగిలములు మొఱసడములు, సాగఁ గలిసి
చాపముక్త శరగతి నంచా, జాగిలము లెదిరెఁ
బందుల, క్రోధాదికముగాలి కదర నితర
ముగ్. మనుచ. ౪ ౪౧.

మొఱి. (కి). విశే. మొఱ్ఱి. (శ. ర.)

మొఱఁగు=మొఱవు. అ. క్రి. ౧ (కుక్క) కూయు, అఱచు.

సీ. పెక్కు లయ్యెఁ గుక్క, లిభకుంభదళన
మహాస్థనిష్ఠురనఖముఖుఁ దగుహరివిరాఁక
మొఱిఁగి రేమి, అ పేయకోపు .
భార సభా. ౨. ౩౧.

చ. దవుదవ్వులఁ గన్గొని పారసేయుమున్,
మొఱఁగఁగఁ గొరబాలకులు మూఁకలు గట్టి
మిఱుంద రాఁగ .. కూఁగుడు వచ్చె

వాకొందు భీషణన్ ...

భోజరా. ౩. ౪౨. ఆం. భా. ౧. ౧౨౨.

౨. ప్రేలు, ప్రలాపించు.

క. మఱి శివుఁడు భక్తిఁ గొండంతం, దఱిగిన చిఱుతొండనంబిఁ దనవాఁ డనఁగా, మొఱుఁ గక రేఁటికిఁ గారులు, మొఱిఁగెదు నీ మంత్ర తంత్రములు సేకొనునే.

శివ. సా. ౪౭౩.

వి. ౧. కుక్కకూఁత భషణము. (శ. ర.)

౨. ప్రలాపము, ప్రేలుట.

(వ్యవ) ఇంక నీమొఱుఁగులు కట్టిపెట్టు.

జ : మొఱుఁగుడు

మొఱుఁగుడు. వి. (√ మొఱుఁగు) కుక్కకూఁత, భషణము (శ. ర)

మొఱువు = మొఱుఁగు. (శ ర)

మొఱో = మొఱ్ఱో. వి. (భయదుఃఖాదులచే చేయు) ఆర్తధ్వనికి అనుకరణము

మ. పని లే దేఁటికి బాధపెట్ట నమన బ్రహ్మణ్యా మైలో మొఱో, యని యుచ్చైర్ధ్వనిఁ గూఁతపెట్ట ముఖశాలాగ్రంబునన్ శ్రాద్ధదే, వునిఁ గట్టించెను వీరభద్రుఁడు .

కాశీ. ౩. ౭౯.

మొఱ్ఱ = మొఱి. వి. ఆర్తధ్వని.

చ. తగవులు నిల్పఁ జాల్పడిన దైవము వక్కట నీవు ప్రముచ్చువై, మగువల మాత్రమున్ బయిసిమాలిన సేరికిఁ జెప్పికొందు మిఱ్ఱగ మున రావాగొట్ట మొగసాలకొ మొఱ్ఱ పవిత్ర కీర్తి యున్, జాగడికిఁ గన్ననీవ తలపోసి రొఱుంగుట కాక యచ్యుతా.

పరమ. ౪. ౧౧౦.

గీ. మొఱ్ఱి యన మొఱ యనఁగ వాపోక యనఁగఁ, గూయి వాఁ గూఁత వాఁగ వాక్రోశ మొప్ప ..

. ఆం. భా. ౧. ౧౧౫.

మొఱ్ఱి. వి. అంగన్యూనత.

(వ్యవ.) ఆ పెండ్లికొడుకునకు కొంచెము గ్రహణపు మొఱ్ఱి యున్నది.

సీ. మొఱ్ఱిన భిన్నత్వ మొనరును .

ఆం. భా, ౨ ౧౨౪.

విశే. ౧. అవయవలోపము కలది, మొఱి.

(చూ. మొఱ్ఱివోవు)

౨. న్యూనము, (సందర్భాదుల) కొఱఁత కలది.

వ. ఓరి నీవు నక్కడ వెఱ్ఱిమొఱ్ఱిచేష్టలు చేసిన భంగము నుమీ యనిన మనత్రుకులే వెఱ్ఱి మొఱ్ఱి రై యున్నది

మృ వి. ౨. ౩౨.

జ : మొఱ్ఱివోవు

మొఱ్ఱివో(పో)వు. అ. క్రి. (మొఱ్ఱి + పోవు.) అవయవలోపము కలది యగు.

(వ్యవ) ఆ కుండ మొఱ్ఱిపోయినది.

మొఱ్ఱో. వి. (భయ దుఃఖాదులచేఁ జేయు) ఆర్తనాదమున కనుకరణము.

గీ ఓడిలేవియుఁ బట్టి మొఱ్ఱో యనంగ, లింగ ముమ గట్ట కుడుగిము

ఆము. ౪. ౬౦.

ద్వి. మొక్కలంబుగఁ గురియా మొఱ్ఱో యనంగ, బిగువు పగ్గంబుల బిర బిరఁ దెచ్చి, తగ వంటఁ గట్టి రాస్థానంబునందు.

ద్వి. శ. సా. ౩. ౧౫౭. పం.

క. అందునఁ జావక మిగిలిన, కొందఱు పఱతెంచి యనురకొల్వున మొఱ్ఱో, యందఱు ప్రింగొను

దానవు, లందఱకును పీడం దారకొంకతం
దనుచుచున్. మొ. రా. సుం. ౧౩౨.

మొల¹. వి. ౧. చీల, కీలము.

సీ. గతి గాన నొదళుల విజిగడు వస్త్రముల్
దొలఁగు సంధుల కీచ్చు మొలలు గాఁగ ...
కు. సం. ౧౧. ౬౯౨.

(నక్షత్ర వర్ణనము.)

సీ. ఇనశరము క్త పై యిలఁ బడు నభమని నలుప
దాఁచిన వెండిమొల లనఁగ ...
శివలీలా విలాసము. కామ్మన. ౧.

గీ. చిత్తరవుగుబ్బ లేఁపునఁ జెరఁగు నంచు,
కొంచి మును నల్వ మొనలను నినుపమొలలు,
నించ నవి యంత నిలువక కొరయఁ జెరఁగఁ,
బొలఁతి కొంకి గంచెల బిగించఁ బోలుఁ
జామ్మ.
అచ్చ. రా. అర. ౨౪.

క. అరపైకంబున జేయని, హరివాసరమునకునై
నిజాత్మజుఁ దునుమన్, గరవాలుఁ జేతఁ
బూనిన, కరణి యునుపమొలకు కేడఁ
గాల్పుట సుమ్మీ. రుక్మాం. ౫, ౧౪౩.

౨. త్రాసుమల్లు. (చూ. మొలత్రాసు.)

జః మొలత్రాసు.

మొల². వి. ౧ నడుము, కటిప్రదేశము.

క. తలుగులబాది రొంటి దెసఁ జెయ్యలదా మొన
మొక్కవలన ననువై యుండన్, మొల
మోపి పెక్కుచుట్లన్, బలుద్రాటం జుట్టి
గోపభావం బమరన్ ...
భార. విరా. ౧. ౨౩౫.

చ. కలుచినపీసఁగు స్వేదదశ స్ఫురయున్ మొలఁ
బచ్చితోఁకలున్.
ఉ. హరి. ౨. ౧౨౬.

గీ. నలదు పక్కల విదుపంగ నలవ దేయు,
నడిచి మొలనిడియున్మనఁ బొడుగ నచ్చు...
మనుచ. ౪. ౨౦. అం. భా. ౨. ౧౩౬.

౨. కట్టుబట్ట.

సీ. తల పీద మొల పీద నలుగఁ దఁ బుచ్చినఁ
బూరి గ్రహించినః బోవనీక . .
దశా. ౬. ౧౩౫.

జః మొలకట్టు, మొలకత్తి, మొలగులికె, మొల
త్రాడు, మొలపూస, మొలవంకీ, మొలవిడి.

మొలక(ల్క)=మొలవ మొక్క. (√మొలచు
క. మొలిక త ముక్కై.) ౧. అంకురము,
మొక్క.

పీ. మొలక మొలవ మొక్క మొంటి కనంగ
నంకుర మొప్పుచుండు .
అం. భా. ౨. ౩౫.

సీ. తోరణమాలికాహారాంకురచ్ఛాయ వెలఁతి
లేఁజిటునవ్వు మొలక గాఁగ
సైమ. ౬. ౯౨.

గీ. మొనలు చూపినముత్యాలమొలక లనఁగ,
కొలుపు తోడుతఁ జెలిపలువరుస దనరె .
యయా. ౪. ౩౯.

సీ. తనతల నెలమొల్క తళతళ జిగిగుల్క వెలయు
ను త్రిపురారాశి గాఁగ
ఇందు. ౧. ౩.

(నెలమొల్క = బాలచంద్రుఁడు)
ఉ. రా. ౧. ౧౩౬.

౨. అంకురితబీజము, మొలకత్తినవిత్తు.

వ. .. చతురవాలికందు పల్లపదుకం బ్రమొల
కలచెలువునఁ జెల్లుడుల్లు ఫల్గునాకుగసంతా
దనవికీర్ణ శత్రుశేఖరపత్రపత్రంబులవలనను
భార. విరా. ౫. ౬౦.

౩. మూలవ్యాధి, అర్శము.

సీ...అర్ధంబు మొలక యం చనఁగ మెలయు .

ఆంధ్రా. ౨. ౧౨౮.

౪. వ్రణమునందలి దుర్మాంసవికేషము. (శ.ర.)

విశే. లేఁత ; చిఱుత, చిన్న.

సీ. ఈరేడు భువనంబు లేలు సంపద చేడె మొలక
చందురుఁ దాల్చు ముద్దరాలు ..

భీమ. ౧. ౪.

క. మొలకలు రాజకుమారులు, తలిదండ్రులు
లేనివారు దయకర్హులు భూతలమునఁ గల
ప్రజ లందఱు, నొలిచిన నొలి వాడెదరు
నంతోధనబాధన్ జై. భా. ౧. ౬౩.

శా. జీవంజీవనుహృత్కళాధరుఁడు లక్ష్మీ
భర్త యుం దక్క నయ్యా వాచంయ
మవర్య యిమ్మొలక ప్రాయంపున్నరల్
సేర్తురే, యావి ల్లెక్కిడ

రామా. ౪. ౭౬.

సీ. పలుకంగ నేర్తురు పాటలాధరముల మొల్క
లేనగవులు ముద్దుగురియ .

భీమ ౧ ౯౪.

మగమొల్క= పురుష శిశువు

ఉ . నాదు సంపదకు దిక్కగుచున్ మగ
మొల్క నీకిఁకన్, బుట్టునో యంటిమే
నిరనిపోఁడిమి గంటిమ. . కళా. ౪. ౩౪.

మొలకకట్టు=మొక్కకట్టు. స. క్రి. (మొలక+
కట్టు.) మళ్ళలో చల్లుటకై విత్తనములు మొల
కెత్తుటకు తడిపి ముడియఁగట్టు.

గీ. అలనఁ జేనియ నానిచి మొలకకట్టి, శర్కరా
బీజముల ముఖాశాదభూమి, భావజుఁడు
విత్తు ..

పాండు. ౩. ౧౯౧.

మొలకట్టు. వి. (√మొల2.) ౧. మొలత్రాడు,
కటిసూత్రము.

ఆ. బంగరు మొలకట్టురంగు మీఱంగ నాభిగ
భోగ ముద్రికయునుఁ బెట్టి...

దశా. ౨. ౧౮౪.

సీ. వాలుగడ్డంబుల కేల జాడింపుచు మొలకట్ల
గచ్చడంబులు చెరువుచు...

చెన్న. ౫. ౩౭౮.

౨. కట్టుకోక, అంతరీయము.

సీ. మొలకట్టు పాఱుటాకులు జాఱకుండఁగ
దీటి కట్టిన బలుతీవకట్టు. .

చంద్రా. ౨. ౩౯.

(శ.ర. వ్రాఁత ప్రతి పా. మొలఁగట్టు
ముద్రి పా )

మొలకకెంపు. వి. (మొలక+కెంపు.) రత్నాం
కురము, లేఁతకెంపు.

ద్వి. మొలక కెంపులపిడి మొలవంకిఁ జెక్కి

రఘునా. ౩. పా. ౧౩. పం.

మొలకత్తి. వి. (మొల2+కత్తి) బాకు, మొలను
చెక్కు కొను కత్తి.

సీ కిసలయాధర మేమిపసవుడాల్గుప్పటి కాసె
నొప్పుగ మొలకత్తి యమర .

శకుం. ౫. ౧౪.

మొలకబంగారు. వి. (√మొలక) పుట్టలలో
పురుగులవలన కలుగు బంగారము. (శ. ర., శ్రా.)

మొలకబేడలు. వి. బ. (మొలక+బేడలు) నీట
నానఁబెట్టి పొట్టు తీసినకాయ ధాన్యముల
దళములు.

సీ. శాల్యోదనంబులు సద్యోఘృతంబులు మొల
కబేడల పప్పు మోదకములు, కలవంటకంబు
లప్పళములు వడియంబు లతిరసంబులు వడ
లామవడలు . బ్రహ్మో. ౩. ౩౩౦.

మొలక (ల) లెత్తు. అ. క్రి. (మొలకలు+ఎత్తు)
కలుగు ; అంకురించు.

ఆ. ఆట మంకిలమగఁడు విరచించి మొలకెత్తె,
దివసములకు దొరలఁ దిరిగియుఁ జానఁ, గొకి
తనకులంబు వానియు వర్చెనయుఁ, దలఁచు
కొనుచుఁ దెలివి మొలకెత్తె.

పాండు. ౪. ౨౦౪.

గీ. మునిజనానంద కందముల్ మొలకెత్తె,
రావణగ్రీష్మతప్తధరాతలంబు, పైత్య
మొందంగ .. దశా. ౩. ౧. ౧౭.

మొలగ. వి. ఒక జాతిచెట్టు.

వ. వెలఁగల మొలగల బీఱల గారల వేములఁ
బ్రేముల పి శకుం ౨. ౧౪

మొలగులికి. వి. (మొల2+కులికి) ౧ సస్య
విశేషము.

౨. బ. ధాన్యవిశేషము (శ. ర)

మొలకొలికి, మొలకొలుకులు (వా. శ ర)

మొలచు(ల్చు). అ. క్రి ౧ (వృక్షాదిస్థావ
రాదికములు) పుట్టు, జనించు

(క) వృక్షాది స్థావరములు.

చ. పలవదు రోయఁ బాండవుల వారొక
యూటలేని క్రిమ్మటన్, బలమతి వన్య
సత్త్వముల పాల్పడి చచ్చినచోటఁ బూరి
యున్, మొలవద ..

భార. విరా. 3 ౧౪

చ. తో,య్యలిహృదయాల వాలమునయం
దమరాగ లతా వితానముల్, మొలచు
కొతింగి యంగజాఁడు మోహనశాణము
నారఁగూర్చినన్. విక్ర. ౪. ౧౪౭.

మను. చ. ౨ ౧౦.

(చ) సంతోషాదిమనోధర్మములు.

క. తదనంతరంబ గాముఁడు, మొదలగు యాద
వుల కెల్ల మోదము మొలఁగున్, మదిమొలవఁ
జక్రధరుపై, వదలక విమతిధిఁ బువ్వువర్ష ము
కురిసెన్.

హ. హరి. ౧. ౧౨౭.

చ. పాలఁకుక గంగచేయక తపోవన భూముల
చూడ నీమదిన్, మొలచిన కౌతుకంబు దుది
ముట్టఁగ లక్ష్మణాదేవు నిన్ను నం,దులకు మనో
ముదం వెనఁగఁ దోకొనిపో నిశువించి
తిన్

నిర్వ. ౮. ౧౩౭.

సీ. చూర్ణాలకంబుల క్రుక్కుఁ జక్కఁగఁ దీర్చి
నలువు సెమ్మనములో మొలవఁ బెట్టు ...

వైష. ౩. ౧౩౭.

(ట) మానవాది జంగములు

చ. చలువవెలుంగు వేల్పుల రసాయనపుంవొన
పాలవెల్లిలో, మొలచిన ముద్దుపాపఁడు
కుముద్వతి వేడుకకాఁడు తమ్మిలోఁ,గిలి గల
చంద్రబింబముఖికిన్ సయిదోడు చకోర
భోజనం,బుల సెఱదాత చందురుఁడు పూర్వ
దిశాస్థలి నొప్పె నయ్యెడన్.

కవిరా. ౫. ౧౭౦.

శా. పుట్టం బుట్ట శరంబునన్ మొలవ నంభో
యాన పాత్రంబునన్, సెట్టం గల్గను గాళిఁ
గొల్వను బురాణింపన్ దొరంకొంటి

భాగ. ౧. ౩.

సీ. తమ్మిఁ దాల్చినవానిఁ దమ్మి దొల్చినవానిఁ
దమ్మి మొల్చినవాని, దాగపించు

నరస. ౧. ౭౪.

౨. అవిర్భవించు, ప్రత్యక్షమగు.

క. అచ్చుతురానసురాసుం, దచ్చటఁ దా నపుడు
మొలచి యాశీర్వాదం, బిచ్చె సెయింద్రుఁడు
మెఱుంగులు, దచ్చెఁగదా ప్రాయమునకు
దీవన ననినన్ కళ. 3. ౪౫.

3. ప్రాప్తించు, సంభవించు.

మ. ... ఇభ్రుడు కళ్యాణ్య ప్రసాదంబుచే, మొలచెన్ గర్భము నాగమారమతి కాము గ్ధన్ విచారింప నేతలభ్రుం కెంద నెలం గనట్టియబలం దప్పించుచే తప్పగన్ ...
చెన్న. ౧. ౨౦౨.

ద్వి. మొలచెఁ గాళ్లును రెండు మును గురుభక్తి.
పండితా. పురా. ౧౦౯. పా.

క. అలుకయు మదమును గర్వము, నొలుకు నకారణవిరోధ మొందుజనులచె,య్యల కెక్కుడైనయాపద, మొలచును మధుబిందు కలహములచందమునన్
కేయూర ౨. ౧౦౯

జ : మొలక, మొలకకట్టు, మొలకకెంపు, మొలకబంగారు, మొలకచేదలు, మొలకరెత్తు, మొలతెంచు, మొలపఁబెట్టు, మొలవేయు.

మొలతెంచు. అ. క్రి (మొలచు + తెంచు. స్వార్థమున) కలుగు, పుట్టు

క. మునివర పాదగుచి త్రం,బునఁ గౌతూహలము ప్రాల మొలతెంచి తల్రు,ర్పున నెల రారెదు .
భార. అను. ౪. ౪౪౪.

క. ఏనుఁగు చేయుతెఱం గద,లోఁ బాలోకించి ధర్మలోభము ధర్మ,గ్లాని కర మయ్యె నని య,జ్ఞానవనఁ బొందుటకు సంశయము మొల తేరన్.
దశకు. ౫౯౨.

సీ. తరణికూటమున మే యురలి పద్మినిమేన మొలతెంచుమధుమద మొలంకకుండ

గీ. గిరిజ పూజించెబసిఁడితామరల వరదు ..
కు. సం. 3. 3౫౧.

మొలత్రాడు. వి. దే. (మొల2+త్రాడు) కటిసూత్రము, మొలకు కట్టుకొనుత్రాడు.

సీ. ముందటిధి ఠక్కాడి మొలత్రాటఁ దవిలిచు తోఁకగోఁచులబెంటఁ దూలువారు ...
ఉ. హరి. ౧. ౧౦౨.

గీ. జవిలిమొలత్రాట విసుక కచ్చడ మమర్చి .
విక్ర. ౨. ౯౪.

ద్వి మువ్వురి యగుదొడ్డమొలత్రాడు గట్టి .
పండితా. పురా. ౧౦౦. పా.

మొలత్రాసు. వి. (మొల1+త్రాసు) ముల్లు గల త్రాసు.

చ. ధమనియు శ్రావణంబు మొలత్రాసును బట్టెడ నీరుకారు కా,ణము పటకారు మూస బలువాకొపరీతులమచ్చు లాదిగా, నమరఁగ భద్రకారకసమూహ్యాయుఁ డొండొకఁడుండు నప్పుడిన్.
హంస. ౨ ౧౮౧

మొలనూలు. వి. దే. (మొల2+నూలు) స్త్రీలు అలంకారార్థము ధరించెడుకటిసూత్రము, రశన.

సీ. మొలనూలిమువ్వలమ్రోఁత విగుడ.
విక్ర. ౮. 3౯.

సీ భాత్రీమహాదేవి తాల్చినమున్నిటి మొలనూలి రత్నంపుమెఱుగ పసంగ
ప్రభా. ౧. ౫౪.

సీ. ముత్యాలపేరులు మొలనూళ్లు .
ధనా. 3. 34. ఆం భా. ౨. ౧౫౦.

మొలపించు. స. క్రి. (√మొలచు) మొలచునట్లుచేయు.

ఉ. ఏరొమిద చెన్నఁడున్ గనవియుంభ్రు.. గుర్కాడుతద్గళస్వనం, బాయతమైనకోకకము నద్భుతము మొలపింప ...
కళా. ౧. ౯౨.

సీ. కందచక్కారదీధి దండకెంపులతీవి మొలపించు చెంగావిమోవిదాని
ఉ. రా. ౨. ౨౩౩.

మొలపూస. వి. (మొల2+పూస) మొలత్రాటి యందుఁ గ్రుచ్చెడిపూస, బాలురకటి సూత్రము నందు గ్రుచ్చుబంగారుమొదలగువానిపూసలు.

గీ. ఘోరవాలంబు దలపోయ మేరు వయ్యె, భూరికారావళులు మొలపూస లయ్యెఁ, గమలినీనాయకుఁడు బొడ్డుపుంట మయ్యెఁ, దనుచు రాఘవునకుఁ దోఁచె నట్టివేళ.

సీతావి. ౨. ౧౩౦.

మొలవ. వి. అంకురము.

సీ. మొలక మొలవ మొక్క మోక మో పిలక మొటిక నా నంకురం బొప్పుచుండు

ఆం. భా. ౨. ౩౫

మొలవంకి. వి (మొల2+వంకి) మొలలో చెక్కుకొను కత్తి.

సీ. మొలవంకికొద్ది దెబ్బలిని గెల్చినవాఁడు గలిగె నీముంజేతి గవ్వదండ .

చంద్రా. ౨ ౫౪.

చ. అని మొలవంకి దుస్సి సమరార్భటిఁ జావడి క్రిందికిన్ గుభాలున దుముకన్

అహ. ౧. ౧౦౪.

మొలవఁబెట్టు. స క్రి (మొలవన్ + పెట్టు) నాఁటు.

సీ. ఈ నీరజాసన దాన కుసుమచేసి వలయు బీజము లెల్ల మొలవఁబెట్టె

కు. సం. ౪, ౧౫౦.

మొలవిడి. వి. (√ మొల2) పశువులోగవిశేషము

ద్వి. మొలవిడి పెలతెవుల్ ముకుబంతి కిపటు, తలమేదు తొడకు వాతము కల్లవాపు, . ఆదిగా నెన్నఁగ, గలపసరాలరోగములకు నెల్ల నవ. ౧ ౪౧. పా. ౩. ౬౦.

మొలవేయు. స. క్రి (మొలక+వేయు) నాఁటు. శాకరగింజలు మొలవేసితివి. (శ. ర.)

(వ్యవ) చింతగింజ మొలవేసినాఁడు = బాల కాలము నిర్వహింప సంకల్పించినాఁ డనుట.

మొలాజేమతు. వి. (హిం. ములాజిమిత్) ఆశ్రయించుట.

శా. రంగారాయఁడు మా మొలాజేమతుకై రా కేఁటికిం జిక్కె .

రంగా. ౨. ౧౯.

ఉ. . మ్యాయాదరణన్ మొలాజామతుకై చనుదేరఁ దలంచినాఁడు స, మ్మోదముచేత ర మ్మనెడిముఖ్యముగాఁ దమకోలు వచ్చినన్ .

రంగా. ౨ ౧౬౪.

మొలాము = మలాము, మొల్లాము, మోలము. మోళిము వి. (హిం ములమ్మా) ౧. బంగారు, వెండిమొ వానిపూఁత (శ ర)

౨ పుండ్లకు పూసెడిమందు (శ. ర)

మొలుగు(లు)= మోలుగు. వి వృక్షవిశేషము.

సీ. జువ్వి మామిడి జీడి సురుగుడు మొలుగు పాపట చంద్ర పవిరిక పాల రేల .

హం. పంచ. ౪. ౫౨౨.

సీ. గరగుకాయయు మొల్గుకాయ యందుగు కాయ లువిరికాయలు మస్తికాయ.

గీ. ఆది యైన యూరుఁగాయలు గల వతని యింట హంస ౪. ౧౩౫.

ఆ. పక్క పేర్చిపెట్ట పరగంగ పెనుకురు పెరపట్ట మిరెము వెల్లులియును, నూరి నీళ్లఁ ద్రావి నూసెయు మొలుగాకు, రసము గొనఁగ నెలుక విసము లడఁగు.

(బి. చి. వి.)

మొల్ల. వి. కుందలత, బొడ్డుమల్లె తీఁ; బొడ్డుమల్లె పూవు.

సీ. .... మొల్ల యనఁ గుందము చెలంగుచు....

ఆం. భా. ౨. ౫౨.

సీ. సన్నజాజులు సురపొన్నలు గలిగొట్లు
మల్లెలు సంపఁగెల్ మొల్లవిరులు ..
ఉ. రా. ౩. ౨౦౧.

చ. దృక్తరళ కాంతులు నుత్తర మిచ్చు
నంతరాం, తరముల నవ్వులుం గలుపతండము
మొల్లలు నంచు ఆము. ౨. ౨౦.
పారి. ౩. ౫౧

జ మొల్లప్రూను, మొల్లసుగంధి .

మొల్ల¹మి= మొల్ల¹ము వి ౧ సాంద్రత,తఱుచు

ఉ వల్లకముల్ సనిద్రకములై పొరలన్ జల
జాత జాలముల్, మొల్లమి నల్లసిల్లఁ దమ
ముల్ దమముందటిచోటి కేఁగఁగా,
బల్లునఁ దెల్లవారె నుమభల్లరణార్థులగుండె
ఝల్లనన్ రా వి ౧ ౭౮.

వ అవిరళవికచకిసలయవిలసితలతావితానంబులు
మరకతహరువిందనిచయఖచితంబులగు సగ
తులపగిదిఁ జూపట్ట సమకట్టు జల్లుల మొల్లమి
నుల్లసిల్లుచు
కళా. ౬. ౨౨౪.

౨. వర్గము, గుంపు

క. చల్లని కమ్మఁదనంబులఁ, జల్లెడు ననుకూల
పవనసంతతు లెసఁగన్, మొల్లమి గని
యుప్పమది, గ్వాల్ల భునాఁబోతు అంకపై చె
న్నొంటన్ . రామా. ౭. ౧౬౫.

గీ. తుటుము మొల్లము మొల్లమి తుట్టె వర్గ,
మనఁగ వర్గము తగు .
ఆం. భా. ౨. ౧౦౦.

విశే. సాంద్రము, దట్టమైనది, తఱచైనది.

క. మొల్లల పైచినలత్మ్రి, వల్లభనుతుఁ గాల్పవే
యవారితవృత్తిన్, మొల్లమిగ తాల పైచిన,
యల్లగాధిపున కివె యపవర్గ మజా
శివ సా. ౭౭౯

వ. ... మొల్లమిగ నంతకంతకు దిగంతరంబుల
దంతంబును దీరిచిన యిదుపులంబోశం
దీంద్రింప .. మనుచ. ౩. ౨౯.

మొల్లమి²= మొల్ల²ము. వి. ధనము.

క. అని యిట్లు పలికి మంతన, మున కాతనిఁ
బిలిచి మీరు మొల్లమి గలవా, రని కంఠుఁ
డాతేఁగి యుంచును, జన దిచ్చట నుండ
నొందుచాయకుఁ జనుఁడీ.
వి. పు. ౭ ౧౦౩.

గీ తల్లులును దండ్రియును దాము మొల్లమి గని,
మెల్ల సంతోషములఁ జెంది యుల్లసిల్లఁగ .
దశా ౮. ౨౬.

మొల్ల¹ము= మొల్ల¹మి వి. ౧. మొత్తము,
గుంపు

సీ జలధరంబన నెద్ది పాలపుంబు పుట్టించు
నిల్లాలి మెఱుఁగుల మొల్లములకు
పాండు ౫. ౨౬౧.

గీ. తుటుము మొల్లము మొల్లమి తుట్టె వర్గ,
మనఁగ వర్గము తగు ఆం భా ౨. ౧౦౦.
రగడ చాలు చాలు నీసంపెఁగ మొల్లము,
చాల కంటిపే పాదిరి మొల్లము
కువల. ౩. ౧౨౭.

౨. తఱుచు, సాంద్రత.

వ కొండగోఁగియుమఱుగుడుబొందులకు నంద
డించుకంకగృధ్రావళుల మొల్లంబు లు
ముసుంగుపడు పల్లంబులును .
మనుచ. ౪. ౩౭.

౩. పెంపు, అతిశయము.

ఉ పెల్లగ గుబ్బచేన్గవలు పెంపెసలారఁ గడింది
పేదుకల్, మొల్లము మీఱఁ గ్రొత్త తెలి
ముత్తియపున్ రతనంపు సేసబ్రాల్, చల్లుచుఁ
బేరటాండ్రు ధవళంబులు పాడిరి కొంద
అరయ్యెదన్ రసిక. ౬. ౨౦౦.

వ ..అల్లంబు మొల్లంబున ..శాశి. ३. ౧౭౫.

విశే. ౧. సాంద్రము, దట్టమైనది.

ఉ. మొల్లపు మొల్లపూఁ బొదల మొగ్గల నగ్గల
 మైనతీవలం, దల్లనఁ జల్ల నై రొలయు
 వందపు గందపుఁ గొండ గాడ్పుచే, నల్లిక
 బిల్లికన్ దనరు నామిడిమామిడిక్రింద
 భూమిభృ, త్తల్లజుఁ డల్లజాలవివిధంబునఁ
 బొంచి వారించె డెందమున్

కృ శకుం ౨. ౨౨౦.

ఉ. ఇల్లాక పట్టునం గడచి యేఁగఁగ సేరని
 చుంచు కుఱ్ఱలన్, మొల్లపుఁగాఱు కోనలకు
 మున్నరకం గొనిపోవఁ జూతురే

అచ్చ. రా. బాల. ౧౦౪.

౨. అధికము, హెచ్చు.

శా. బ్రహ్మాండ భాండంబు భేదిల్లన్
 బెట్టుగ వార్చి పేర్చి ప్రణయోద్వృత్తాంత
 కాకారుఁ డై, మొల్లం బైన బలంబులం
 బొలిచె సమ్మార్ఛ ప్రతాపంబునన్ .

భా. రా యు. ౧ ౩౪౪.

గీ. మొల్ల మగుకీ ర్తివాఁ డేడి మొల్లలార, శుక
 విగదితునిఁ జెప్రఁడు కింశుకములార.

భాగ. ౧౦. పూ. ౧౦౧౫.

ఉ. ఎల్ల విధంబులన్ విమతికెక్కిన యీనృపు
 మూర్తి పత్నియై, మొల్లము లైన సఁపదలు
 మోచి వెలుంగుచు నున్న నాకు నీతల్లి
 నపత్ని నాడు నని తాఁ బలుమాఱును వచ్చి
 నాకడం, బ్రల్లదముల్ వచించు నది పల్కులు
 సే వినఁ జాల నెన్నఁడున్

వి. పు. ౨. ౧౨.

మొల్ల²ము= మొల్ల²మి. వి. (సం. మూల్యమ్)
 ధనము.

ఉ. ఎల్లధనంబు కోటుపడి తిందుకుశేశ్వర
 యింక నొడ్డఁగా, మొల్లము నాకుఁ జూపు
 మని ముందట సారెలు ద్రోచి యాడఁగా,
 నొల్లక యున్నచోటలంపక ..

భార. సభా. ౨. ౧౯౪.

క. నాయింటి మొల్లమునకును, నా యుదలికిఁ
 బ్రాణములకు నావారికిఁ దా, నాయికయై ..

దశకు. ౫. ౫౫.

ద్వి. తనమొల్ల మంతయుఁ దత్కారణమున,
 వనయుడు బస పు. ౪. ౭౯౩.

మొల్లమ్రాను. వి. (మొల్ల + మ్రాను) వృక్ష
 విశేషము.

సీ మొక్కపు కొక్కిన మొల్లమ్రాను .

గీ. మొదలుగాఁ గల్గు బహువిధ భూరుహములు.

హంస ౪. ౧౧.

మొల్లసుగంధి మి విశే. (√ మొల్ల) మొల్ల
 పూవువంటి పరిమళము గలది

ఉ. మొల్లసుగింధి నామనసు మోహము నాటడి
 వెట్టి నీవు నవ్వొల్లక వీడనాడెద వరూ
 తగవా వి పు. ౨. ౨౩౩.

మొల్లా. వి (హిం ముల్లా) మహమ్మదీయ పురో
 హితు లుచ్చరించు మంత్ర విశేషము.

మ. .. పైశారవం,బుల మొల్లా పఠియించు
 చున్ మధుజలంబుల్ జల్లి వేగాడ్పు భూము
 లచేఁ జైత్రపు సైదుజీర్ణదళి వహ్నుల్ గంటె
 త్రొక్కింపఁగన్

చంద్రా. ౪. ౨౦౭.

మొల్లాము = మొలాము.

ద్వి. పసిఁడి మొల్లాము గుబ్బల కవాటములు.

ద్వి పరమ. ౩. ౧౪౨.

మొవము = మొగము. వి.

సీ. మొవమున కగయు చన్గవపైని నునుమోవి
 తళుకుఁ గుంకుమ వసంతములు చల్ల ..

దశా. ౨. ౨౩౩.

**మొవలి.** వి. మొగలి. కే.

పి. శా. క. ౧౦౨౪.

**మొవు = మొవ్వు.** వి. మోవు.

ఉ. నాసికపేరురిమవ్వపుటనంటికిఁ బై బోవు లాకు లరయ్యో మ్నల్లానము చూపురేఁత మొవు లాగు మెయిం దిలకంబు గర్గెదుస్ .

కవిక. ౩. ౨౦౯.

**మొవుదు = మొగుడు.** అ. క్రి. ముకుళించు,

క. కవిసర్ప గారుడం బను, కవితా లక్షణ మొనర్చి గర్వితమద దుష్కృవి సర్పంబుల మొగములు, మొవిడించి కలంచి ముంచ ముందుగ చేర్తున్

కవిస. ౧.

**మొవ్వి.** వి. ఒకానొకచెట్టు,

వ ప్రోఁగువాఱించి రావుల మోవుల జావ్వుల మొవ్వుల రేఁగుల గోఁగుల రేలలఁ జాలల నొద్దుల మద్దుల విరుగుల విరుగుల నెమ్ములు జమ్ముల . పి. శకుం. ౨. ౧౪.

**మొవ్వ = మొవు.** వి. మోవు. అరఁటిచెట్టు లోనగువానియందు పుట్టెడు ముదుత వీదనిరేఁత అను మొలక.

రగడ. మొలచు మొవ్వుల నంటిమోవులను మోవు లను.

భాను. ౨. ౩౦.

**మొసడి.** వి. = మొసలి.

తరలము . . విన్మిదింపు శా దివి రేను తీర్థము లీసముద్ర తటంబువన్, విదితముల్ దురితాప హంబులు వీవి నెన్నఁడు వాడ నొ్వదు దురు సమ్మను లిందఁ గోల్మానదుల్ గొనున్ వడిఁ జొచ్చుదున్.

భార. ఆది. ౭. ౧౪౭.

**మొసరు.** వి. (క. మొసరు) ౧. పెరుఁగు, దధి.

గీ. అవ్వాడె పవితతి వర్ణించి కొలువు శ్రాడిడి ఫలంబు గొనుట పతయఁ గనెడి, పవ్వరిష్ఠ ఫలదు బంగవు మల్లికాద్యునికొలుపు మొసరు మమఁగఁ గొనుట.

కు. సం. ౧. ౧౨.

క. పెనరుంబ స్నేమిటి కని, కసరు స్నేయి గొనదుం పండుగను గొయకూర్చే, కొసరుం బలుచనిచల్లరొ మొసరుం గనఁ దతవిలోభ మున కే మందున్.

బహు. ౫. ౭.

**మొసలి.** వి. (బ. మొసలులు, మొసళులు, మొసళ్లు) నక్రము, జలజంతువిశేషము

ద్వి. కపిమసఁగుచుఁ దీవ్రగతి నంది వొక్క మొసలి యేతెంచి సముద్ధతిఁ బట్టుకొని పోవ దరి మన్నకొడుకు వాపోవ

పండితా మహిమా. ౨౭౪ పా.

ద్వి. పస విల్లు వెదలిన భయపడుతల్లి, మొసలి కొప్పించి యిమ్ముల మనఁ గలసె.

పండితా. మహిమా. ౨౭౫. పా.

గీ. . ఊడుము లన కెల్లిరిగఁ గుక్కపసికి బావులఁ బడుటకుఁ బనులరోయరవు, పెరలకు మొసళ్లు . .

ఆము. ౨. ౫౩. ఆం. భా. ౧. ౧౩౦.

**మొసలి పెక్కుముజోదు = మకరకేతనుఁడు,** మన్మథుఁడు.

సీ. కలువలచెలికాఁడు గాదిలిపైదోడు మొసలి పెక్కుముజోదు ముద్దుకొడుకు . .

జాహ్నవీ. ౧. ౩.

**మొసలిడాలు వే(ల్వే)ల్పు(లుపు) = మకర** కేతనుఁడు, మన్మథుఁడు.

క. గోలపయి వ్యాలారుం, గోలలఁ బరగించి మరులుగొల్పుచు మిగులం, దూలించుట కేఁకఁ దాశం, జాలము నీయాన తెరా మొసలి డాల్వేల్పా.

నీలా. ౩. ౪౧.

ఇట్టి : మొసలి పిడమువాఁడు.

ఉ. కీసలయకయ్యె డిగ్గి యొకక్రేవ శకుంతల నిల్చియుండఁ దుష్కృతుఁ నవాంక మంటు కొని క్రొత్తవిరు ల్గనపట్టి పెంతయు, న్మొసలిపిడంబువాని నవమోహనవల్లియొ యంచు రాజా నింపొసఁగఁగఁ జూచుచుండె మధురోల్లస దుగ్ధములైన చూపులన్

పి. శకుం. 3. 84

జ : మొసలికాటు, మొసలి దోరణము, మొసలి పట్టు, మొసలిపోగులు, మొసలిరాసి, మొసలివా, మొసలివాతమ్మంట్లు, మొసలి వాపోగులు, మొసలివాయొంట్లు, మొసలిసొమ్ములు

మొసలికాటు. వి (√ మొసలి) మకర ముఖ రూపము గలక త్తిపిడికోన, చిమట

పీ. పరఁజాలోపలఁ జీల పట్టించువలుఁగువా యనుసుప యోగ్యమైనట్టికావు, మొసలికా టనఁగను మొసలివా యనఁగను జిమట యనంగను జెలఁగుచుండు .

ఆం. భా. ౧. ౨౧౬.

మొసలిదోరణము. వి. (√ మొసలి) మకర తోరణము.

గీ. మొసలిదోరణ మెక్కి యామునఁ జెలంగు, చున్నఁ బొలియక చిక్కిన యజీయ బంట్లు, పూఁచి తోలివేల్పు కేని క త్తెఁగు దెలుప

అచ్చ. రా. సుం. ౧౧౧.

మొసలిపట్టు. వి (√ మొసలి) మకరాలయము, సముద్రము.

క పంతమునఁ బ్రొద్దుపస యుడిగింతుమొ సత మొసలిపట్లఁ గిమక నిగుడ నింకింతుమొ .

అచ్చ. రా. యు. ౧౬.

మొసలిపోగులు. వి. బ (√ మొసలి) మకర కుండలములు.

సీ. మొసలిపోగులనిగ్గుటొసపరిసొము కొట్టుకు లైన చెక్కు టద్దములవాని .

చం. రా. ౨. ౫౯

మొసలిరాసి. వి. (√ మొసలి) మకరరాశి. (చి. ని., శ. ర.)

మొసలివా(యి). వి (మొసలి మోమురూపము గల క త్తిపిడికోన, మొసలికాటు.

మ జాళువా మొసలివా దీప్తార్చి గాఁ గజ్జలాన్వితధూమాసితరేఖ పైయలుఁగు గా విజ్ఞాన దీపాంకురాకృతి నందం బగు నందకం బఘ క్షాళ్రేణిచ్ఛిదం జేయుతన్.

ఆము ౧ ౬ ఆం భా. ౨౧౬.

మొసలివాతమ్మంట్లు. వి. బ. (మొసలి + వాయి + తమ్మంట్లు) మకరకుండలములు, మొసలిమోము చెక్కిన కర్ణాభరణ విశేషము.

సీ మిసమిసల్ నిగిడించు మొసలివాతమ్మంట్లు నొకకేలఁ బద్మంబు నొకట గదయు.

విప్ర. ౫. ౬౫.

మొసలివాపోఁగులు. వి. బ. (మొసలి + వాయి + పోఁగులు) మకర కుండలములు.

గీ. మొసలివాపోఁగు లింపెసఁగ వీసులఁ బెట్టి తలల హోంబొమిడికల్ దవర నిల్పి.

అచ్చ. రా. సుం. 34.

మొసలివాయొంట్లు. వి బ. (మొసలి+వాయి+ ఒంట్లు) మకరకుండలములు.

సీ మొసలివాయొంట్లకెంపులకెంపు దృక్కోణ సంక త్తరుచులతో సంధిచేయ .

ఉ. రా ౨౫౦.

మొసలిసొమ్ములు. వి. బ. (మొసలి+సొమ్ములు) మకర కుండలములు.

ద్వి. ముద్దుల మొనలినోమ్ము అచకచేతలు,
కద్దయుఁ జెక్కుటద్దముల నత్తిరచు.
ద్వి. పరమ. ౨. ౧౨౨. పా.

మొహాదా. వి. అద్దకత్తి, పట్టిసము.

సీ. ఏహిపపిండి పరుంజా మొహాదా కలంకుల
కావు గుజ్జరిసేఁత కేవడంబు
మనుచ ౪ ౨౮.

సీ. పట్టిసతామము ల్వట్టె మన మొహాదా యన
నద్దకత్తి నా నలరుచుండు
ఆం భా. ౨ ౨౧౫.

మొహరి(రీ)వి. (హిం. మొహర్) ముప్పది చిన్న
ములయెత్తు బంగారు నాణెము

(వ్యవ) పూర్వకాలమున ధనికులు మొహరీల
పేర్ల నెక్కువగా ధరించెడివారు

మొహరు. వి (హిం ముహర్) ముద్ర.

గీ. మోఁగాళ్లపై బింకె బా గైనదోవతుల్ జిగి
తరం బైన ఫార్షీ మొహర్లు
వేమ ౫౯.

మొహాళిము. వి ఒకవిధమగు కూరాకుచెట్టు.
(శ. ర.)

## మో

మోఁకతి(రి)ంచే=మోఁకారించే. అ. క్రి.
(√మోఁకాలు) మోఁకాళ్లు నేల కానునట్లు
ముందటి కొఁగు.

గీ ప్రొక్కమైతిమి భవుఁ దని మోఁకతించి ,
కాశి. ౪. ౧౧౦.

వ. వాఁడు భయభక్తితాత్పర్యంబులతోడ
మోఁకతించి వరంబులు నేల నూఁది నమ
స్కరించి ,.
వి. పు ౭. ౩౮౧.

మోఁకతి(రి)ంచుకొను. అ. క్రి. (మోఁక
తించు+కొను=స్వార్థమున) మోఁకాళ్లు నేల
కానునట్లు ముందటి కొఁగు.

వ ఘోటకంబు వెగ్గలంబుగ ప్రొగ్గియు
నగ్గలిక చెదక మోఁకతించుకొని
మనుచ. ౪. ౧౧౫

మోఁకతిల(ల్ల)ఁబడు. అ. క్రి (మోఁకతిల్లన్+
పడు స్వార్థమున) మోఁకతించు, మోఁకాళ్లు నేల
కానునట్లు ముందటి కొఁగు

గీ అర్చి యెడవంక సాత్యకి యడ్డగింప, వాసు
దేవుండు వలవంక వచ్చి యురము, ప్రేయ
నవ్వీరుఁ డచ్చోట ప్రేసఁ దత్తతించి
పాండ్రుఁడు ధర మోఁకతిల్లఁబడిరి
ఉ. హరి. ౩. ౬౫.

వ అమ్మేదినీపతి పార్శ్వభాగంబు బెట్టడఁచిన
మోఁకతిలంబడియును
భార కల్య. ౨. ౨౬౭

శ ర. పా. 'మోఁకరిలంబడియును' ముద్రి పా

శ్లో. స విహ్వలః ప్రహారేణ జానుభ్యామగమన్మ
హీం. సం. భార. శల్య ౫౮. ౫౬.

క. వీఁక నెడి ఘనగదాహతిఁ, దోఁకయుఁ గద
లింపలేక దుస్సహపీడన్, మోఁకతిలఁబడిరి
నేలను, పోఁ కోర్వక దిగ్గజంబు నుడికొడి
గొంచున్. భాగ. ౮. ౩౬౧

మోఁకతి(రి)ల్లు(లు) = మోఁకతించే.
అ. క్రి. (√మోఁకాలు) మోఁకాళ్లు నేల
మోఁద నానునట్లు ముందున కొఁగు

చ వస మతి మోఁకతిల్లి రథవాజులు మార్గము
దప్పి నిల్చినన్
భాగ ౧౦ ఉ ౧౩౦౫

మోఁకారించే = మోఁకతించే. అ క్రి.
మోఁకాళ్లు నేల కానునట్లు ముందటి కొఁగు.

క. ఒకచేతఁ బట్టి త్రిప్పిన, కోకయుంతయుఁ
గదల కున్నఁ గొని మోఁకాలిం,చుక బలిమి
రెండుచేతులఁ, బెకలింపఁగఁ బూనుట
యును భేదిలకున్నన్.

కాశీ. ౮. ౪౩.

క. పుడమిన్ మోకాలించిన, నడితోఁ జే
యూఁది శ్రీనివాసయగారే, యడిగో నవి
కొండోరులం, బడి రయగాం ద్రసలం
పెంటప ట్టన కచటన్ .

పాంచా. ౧. ౪౩.

**మోఁకాలు.** వి ఛా. (మోఁడు + కాలు. మోఁద+కాలు. శ. ర. క. మోణకాలు) జానువు (బ మోఁకాలులు, మోఁకాళులు, మోఁకాళ్లు.)

గీ. చచ్చినట్లు, మూర్ఛవోయి మోఁకాళులు
మోవఁబడిరియె భార. ద్రో. ౪. ౪౫.

క. శిర సుంచఁగ మోఁ,కాలను సేసలు పెట్టుట,
జేలతనము గాక మీకుఁ బెద్దతికంబే

హరి ౧. ౯౬.

గీ . గాడుపుకుల్లఁ దవ్వాలువనుమఁ, బట్టు
కొని కిన్క మోఁకాలఁ బెట్టి విఱిచె .

అచ్చ. రా యు. ౭౪౭.

ద్వి. మోఁకాళ్ళ మోచేత ముష్టి వందంద,
దాటించి పడఁవేసి తలలు ద్రొక్కించు

రం. రా. యు. (చి. వి.)

గీ. ముదిమి మోఁకాలు వాఁగఁ జెన్నఁదరు
జాము . ఆం. భా. ౭. ౧౩౫.

శ్రీ రా మోఁకా లొడ్డుట=ఐశ్వర్యము కలుగు చుండ వారింపఁ జూచుట.

క. కౌరవనాయక పాండుకుమారులు నీతోడి
పొత్తు మనిరెద మనఁగా, శ్రీ గా మోఁకా
లొడ్డి,వారినినము కాదనీవు వల దను
చెల్లన్ . భార. ఉద్యో. ౩. ౩౪౩.

జః మోఁకరించు, మోఁకరించుకొను, మోఁకరిల్లఁబడు, మోఁకరిల్లు.

**మోఁచెయ్యి(యి)మోఁచేయి.** వి. మోఁడు+చెయ్యి. మోఁద+చెయ్యి. శ. ర.) కూర్పరము.

ద్వి. అణుమూర్తియును భర్తఁ దశఁడు మోఁ
చెయ్యి, గణనాథ పానపైఁ గదియించి
తివియ . పండితా. పురా. ౧౩౫. పా.

పీ. కూర్పరంబు మోఁచెయ్యి నా

ఆం. భా. ౭. ౧౩౭.

**మోఁచేతిమ (డుపు) డ్పుటిల్లు.** వి. (మోఁచేయి+మడుపు + ఇల్లు) మోఁచేతిమడుపువలె కట్టినకట్టడము.
(రెండిండ్లు కలిపి కట్టినకట్టడము. శ. ర)

**మోఁచేయి = మోఁచెయ్యి.** వి ఛా. (మోఁడు + చేయి. మోఁద+చేయి. శ. ర.) కూర్పరము

గీ. చిత్తజలజంబులో నున్నశివుని వీడి, వెలి నవమి
యించు వేల్పు సేవించు టెల్లఁ, జాణి నున్న
ట్టికబళంబుఁ జాఱవైచి, కడఁగి మోఁచేయి
నాకుట గాదె తెలియ.

శివధ. ౨. ౧౧౭.

వ. పాంతకాయలపైఁ బడి మడిఁగి రెండుమోఁ
చేతులపోటుల . ప్రబంధ. ౪౭.

ద్వి. మోఁచేతఁ బగులంగ మొగములు పొడిచి
పూఁచిన శస్త్రాస్త్రములు పొడిచేసి.

రం. రా. యు. (చి. వి.)

**మోఁత.** వి. (√ మోయు) ౧. మోయుట, వహించుట.

ఆ. పుస్తకములు జదలు పులితోలు, చర్మంబు,
కఖపాలలు పదిలతనైన, మోఁతచేటు
గాని మోక్షంబు లేదయా ...

వేమ. ౩. ౧౯౬.

౨. బరువు, భారము. (శ. ర.)

మోఁద. వి. (√ మోఁదు) మోఁదుచేత కట్టిన పెత్తురుగడ్డ. (శ. ర.)

మోఁదకట్టు. అ. క్రి (మోఁదు+కట్టు) మోఁదుచేత పెత్తురుగడ్డకట్టు. (శ. ర.)

మోఁదు. స. క్రి. కొట్టు, ప్రహరించు

గీ. కోపించి మొఱపిన ప్రతిభటాళి, మోఁద గవిసి తుంగలఁ గొని మోది నిరవ, కేవ మునఁ జేసి

భార మా ౧ ౬౧

క. రాఁ దిగుచు పెరుచు నగుచుం, బోఁ దట్టుం బట్టుఁ దిట్టుఁ బోరిఁ బోరి కోఁజున్, మోఁదు మెడ ద్రొక్కు నెక్కును, మోఁదికి నెగ యించు వంచు మెయి నారించున్.

ఉ హరి ౬. ౧౦౩

ఉ వేదుఱు గొన్న మానవుని వేమఱు గంటియు బిట్టు గాల్చియున్, మోఁదియు నీటఁ ద్రొక్కి యును మున్కని తీర్పఁ గడంగువెజ్జు న, ట్లేఁ దగ నిన్నిచందముల నీపనిఁ దీర్చుటకై పెనంగితిన్, ఏమి సేయుదున్

నృసిం ౫. ౧౨.

వి. దెబ్బ, ప్రహారము.

మ. అని నీచే వటు మోఁదులం బడి కడుం బ్రాణార్తుఁడై పాఱిపోయిన సుగ్రీవుఁడు

భా. రా. కిష్కిం. ౨౦౩.

ఉ. మోఁదుల కోపక నన్ను జావిసన్ .

దశకు. ౪. ౧౨.

జః మోఁకాలు, మోఁచెయ్యి, మోఁచేయి, మోఁచేతిమడ్పుటెల్లు, మోఁద, మోఁద కట్టు, మోఁదులాట, మోఁదులాడు.

మోఁదులాట. వి. (√ మోఁదు) కొట్లాట, దెబ్బలాట.

గీ. ... వృష్ణిభోజాంధక వీర కెల్ల, మునివర నిర్దిష్ట ముసలాత్మకము లైన మయ్యంచు తుంగల మోఁదులాటఁ.

సీ. చెర్చి యొండొరువులఁ బరిమార్చుటయును

భార. మా. ౬౫

మోఁదులాడు. అ. క్రి. (మోఁదులు + అడు) దెబ్బలాడు.

చ. బోరలుం, దొడలును వీపులున్ దలలు నొవ్వఁ గడిందిగ మోఁదులాడుచున్

అచ్చ. రా యు ౧౬౪

మోక = మొక్క, మొలక. వి ౧ అంకురము

సీ మొలక మొలవ మొక్క మొ సీక మొటిక నా నంకురం బొప్పుచుండు

ఆం భా. ౨. ౩౫.

౨. వృక్షకము, చిన్నచెట్టు.

గీ ధవళకేతకిధూళి గాత్రమునఁ జఱచి, మోక మామిడి కొకకొంత మ్రొక్కి నిలిచి, యొంచ లిలోఁ జక్కనగము నా కొసఁగు మనుడు, నద్రికన్యక తల వాంచె హరుఁడు నవ్వె.

ఉ. హరి. ౫. ౫౬.

సీ తిలకంబు బలు కేనియలఁ బోఁక మోకల పువ్వుఁ బాళల తావిఁ బుక్కిలించి ..

భీమ. ౧. ౬౩.

ఉ. కా యను మేటితప్పు కొడుకా యను నిద్దపుఁ బూఁతమోవి మో, కా యను .

అచ్చ. రా. అయో. ౬౦.

మోకు. వి. లావుత్రాడు; కాడి మొదలగు చె ట్లెక్కుటకు నుపయోగించు లావుత్రాడు.

గీ. అనఁడు రొక్కను లతనీఁడొడ్కొని తోలంగ, సేఁగి మోకులు పగ్గము లన్నియును, గూర్చి

విగఁగట్టి కద్దయు వార్చికొనుచుఁ, దన్నెలు
ద్రోయఁ ద్రొ కొల్లఁద్రిప్పి మఱియు.

అచ్చ. రా. సుం. ౧౬౫.

వ. ఇట్లు తాఁ దెచ్చినరొండ్లు సెనపోతును
మెడఁ గాడి గీలించి ప్రచ్ఛన్నరూపంబున
బాదరక్షలు తోలుమోకు మునికోలయు
నంటఁగట్టి పెద్దమేడికోల యమర్చిన నాఁగలి
భుజాగ్రంబున దాల్చి

శేష. 3 ౧౯౯

క. మోకను నిచ్చెనయును ద్వాటాకులబందంబు
మెత్త నగువడదోలున్, జో కగుకత్తుల
దోనయును, దూకంబునఁ బూని నిల్చెఁ
దొయ్యాలి యెదుటన్ సురా. ౫౮

మోక్షకుఁడు సం విణ (అ క్షికా అ) ౧. విడుదలచేయువాఁడు, విడిచిపెట్టువాఁడు ౨. ఉద్ధారకుఁడు, కష్టములనుండి తొలఁగించి రక్షించువాఁడు.

మోక్షణము సం. వి. అ న ౧. విడిచిపెట్టుట, వదలివేయుట, ౨. నిర్బంధమునుండి తొలఁగించుట, కష్టమునుండి కాపాడుట, 3 (కన్నీరు) కార్చుట, ౪. అమితవ్యయము చేయుట, ౫. బాణము మొ విడుచుట, వేయుట

మోక్షద్వారము. సం వి అ. న. సూర్య మండలము.

మోక్షపురి. సం వి. ఈ స్త్రీ. కాంచీ పురము.

మోక్షము. సం వి. అ. పుం ౧. విడుపు, విడుదల. ౨. కష్టమునుండి తొలఁగుట. 3 ముక్తి, జన్మ పరంపరనుండి విడుదలయగుట (ఇదియ నాలవపురుషార్థము) ౪. మరణము, చావు. ౫ (జ్యోతి) రాహు కేతువులు సూర్యచంద్రులను విడుచుట, గ్రహణకాలమున విడుపు, గ్రహణాను యొక్క సమాప్తి. ౬. మొక్కపుఁ జెట్టు. ౭. పాటల కొ.

మోక్షి. సం. విణ. (న్. ణీ. న్.) మోక్షము గోరువాఁడు, ముక్తి పొందువాఁడు,

మోఘ. సం. వి. ఆ. స్త్రీ. ౧. పాటల, కలిగొట్టు. కొ ౨. విడంగము, వాయువిళంగము కొ.

మోఘపుష్ప. సం. వి ఆ స్త్రీ. గొడ్రాలు, వంధ్య.

మోఘము. సం విణ. (అ ఆ. అ.) వ్యర్థమైనది, నిష్ప్రయోజనమైన . ౨ సోమరియైనది, అలసము. 3 దీనము వి అ. పుం. ఆవరణము, కంచె, వెలుగు

మోఘాలి. సం వి ఇ పుం. ఆవరణము, వెలుగు, కంచె

మోచ. సం. వి ఆ స్త్రీ ౧. కదళీవృక్షము, అరఁటిచెట్టు ౨ బూరుగు, శాల్మలి, కొ 3 నీలిమందు చెట్టు

మోచక. సం వి ఆ స్త్రీ. ముచ్చె, ఒకవిధ మగు పాదరక్ష (శ. ర స. సం.)

సీ చివురుల గొలువఁ దాల్చిన కెంపు జోడుల
కరణి నంఘ్రుల మోచకలు రహింప

కృ శకుం. 3 ౨౮.

('మోచికలు'ముద్రి.)

మోచకము. సం విణ. (అ. చికా అ.) ౧. విడిచిపెట్టునది. ౨. విడిపించునది. వి. అ. పుం. ౧. మోక్షము, మొక్కపు చెట్టు. ౨. శోభాంజన వృక్షము.

మోచనపట్టంకము. సం. వి. అ. పుం. నీళ్లు మొదలగునవి వడియఁగట్టు సాధనము.

మోచనము. సం. విణ. (అ ఈ. అ.) విడుపు గలిగించునది, నిర్బంధము మొదలగువాని నుండి

తొలఁగించునది(సాధనము). వి. ఇం. గ్రహించుట.
౨. గర్వము, తలతిక్క. 3. వంచన, మోసము.

మోచని. సం. వి. ఈ. స్త్రీ. మోఁగాలు గుది
కాలు సైతము కప్పుకొని యుండెడు పావోను,
పార్ష్ణి త్ర. (శ. ర)

మోచము. సం వి. అ. పుం ౧ కదళీవృక్షము,
అరఁటి చెట్టు ౨ శోభాంజనవృక్షము

మోచయిత. సం. విశే (ఋ. త్రి ఋ.) విడుచు
వాఁడు, వదలి పెట్టువాఁడు.

మోచాటము. సం. వి అ పుం. ౧ రంభాష్ఠి,
అరఁటి దూట ౨ చందనము. 3 కృష్ణ జీల
కఱ, నల్ల జీలకఱ్ఱ

మోచికొను. స క్రి (మోచు+కొను - స్వార్థ
మున) ఎత్తికొను, వహించు

క మోచికొని వాసవాత్మజుఁ, డావెలువం
దేర నిట్టు లరిగి పురము దృగ్గోచర మగు
టయుఁ దమ్ములఁ, జూచుచు వారలకు ధర్మ
సుతుఁ డి ట్లనియెన్.
భార వి రా. ౧. ౧౪౪.

మోచితము. సం. విశే. (అ. అ. అ.) విడిపింపఁ
బడినది. (శ. ర.)

మోచే = మోయు. స. క్రి. ౧. వహించు.

సీ. పొంద్ర భూవర నీవు భావంబునందు మదీ
యాంశములు మోవఁ దివిరితేని, నాపాలి
కేతెంచి నన్నుఁడ పై రేను నీవాఁడ నా
కిమ్ము నీదు చిహ్నం, మాల .
హరి. ఉ. ౬. ౨౦3.

గీ. అడుగుఁ జెంది భోగావతి యతికయిల్లఁ,
బడిరి లక్ష్మి కుశరణిఁ జూపట్టె వనిరు,
దాను బుజిలోట యాకాశతటిని మోచి,
సమధికోన్నతి గౌరీశుచంద మెంచె...
విక్ర. ౧. ౬౪.

ద్వి మోవ కోపినవస్త్రములు మోపుగట్టి,
లావునఁ గొనిపోయి లంకయ కిచ్చె .
పండితా. దీక్షా. ౩౮. పా.

ఉ. భూవర ముఖ్య సన్నిధికిఁ బోయెడు మామిడి
పండ్ల పుట్టికర్, మోవఁగఁ గూలి పుచ్చు
కొని మూఢతఁ గుఱ్ఱడు గ్రామ్య చేష్టితం,
బావహిలంగ నేఁగి కళా ౬. ౧౪౫.
ఆం భా. 3. ౧౧౯.

౨. ఎత్తికొను.

ఆ అకట మనము వచ్చినది కడుదవ్వు నేఁ,
డప్పరంబు సొత్తమని తలంచి, తతిమి నడచి
తిమి లతాతన్వి యిది వడ, గొనిరు మోచి
తెమ్ము కొంతదవ్వు
భార. విరా ౧ ౧౪౧.

క. విమఁ డీతనుసంబంధపు, టెనయికఁ గని
మోచి తెచ్చి యిచ్చె నసర చుల్కని
నరులు కాన మాపుర, మునకున్ విజయంబు
నేయఁ బుత్రిక నిత్తున్
అను. ౬. ౧౧౯.

3. తాఁకు, స్పృశించు

ఉ. పూచిన కింగలన్ మధురభూరిఫలంబుల
ప్రేంగునక్క మహిన్, మోచిన కొమ్మలం
గలిగి .ఒప్పు వింధ్యాచల పార్శ్వ
కానన మనస్యవనీవిభవోపమాన మై ..
కేయూర. 3. ౧౦.

గీ. కమియ నామూలచూడంబుగా ఫలించి,
యంబరము మోచి యున్న యడుంబర
ములు.
కాశీ. ౧. ౯౧.

ద్వి. అవి పెక్కు భంగుల నారాజాదులు, దమ
మోవ నాడిన ధర్మ వాక్యములు.

ద్వి. పారిజా. ఉ. ౧౧౭౨ పం

పాండు. ౩. ౧౫౩.

మ. బలిమిం ద్రుంపఁగఁబోలెఁ బాయకదుచుం
బర్యాయభంగంబునన్, గలనా తెల్లను
వంటుమోవఁ దగి అము ౪. ౩.

(అంటుమోవన్ = అతుకుకొనుటకు)

౪. అను, ఆక్రమించు.

శా. నీ వింక నన్, బాధం బెట్టకు వాఁడి
నూదిమొన మోవం జాలు నంతైన న్నే, నీభా
త్రీతల మీను వారలకు

భార. ఉద్యో. ౨. ౨౫౧.

౫ అంటుకొని పోవు.

చ. కమఁగవ ద్రుమాన్నదంగ నెఱక ల్వీరియంబడ
భోర మోవ నెం,డిన వదనంబులం దెఱచి
నిక్కినయట్టులు దల్లడించుటల్, గవఁబద
మూరుపు ల్దళిముగా విగుడ న్వడఁ గుంది
యీరెలం, గువఁ దమవాని బిల్చుచు
శకుంతము లయ్యెడ నిల్చె ద్రుంకులన్.

పారి. ౪. ౨౧.

౬. పొందు.

గీ. అట్టి వానికి నింద మోవఁ, జేసెఁగా
విధి కటకటా దోసకారి.

పారంగ. ౨. ౨౩.

ఉ. ఎల్లవిధంబులన్ వినుతికెక్కిన యీనృపు
మూర్తిపత్ని నై, మొల్లము లైన సంపదలు
మోచి వెలుంగుచు నున్నవాడు నీతల్లి
పత్ని నాడు వని తాఁ బలుమారును వచ్చి
చూకదన్, ప్రల్లదమల్ వచించు నది పల్కురు
నే వినఁజాల నెప్పుఁడున్. వి. పు. ౨. ౧౨.

ఉ. ఆవముధామరప్రభువు నమ్ముని యి ట్లను
వర్నె విన్ను నా,భావ పథంబునన్ విను నపా
ధురినీగాఁ గమఁగొంటి నాగ్రహా, వ్యాపృత
చిత్తవృత్తి నిటు లాడితి మీఁ దరయంగ
లేక నా,యావచనంబు తప్పు దనయం బెద్ద
మూర్ఖత నన్ను మోచుటన్.

పాండు. ౫. ౨౫౯.

౭. పోషించు

ద్వి. తన్ను మోచినచోటఁ దగ వట్టె పెట్టి,
మిన్నక మురిఁ గిన మెత్తురే జనులు

ద్వి పారిజా. ఉ ౨౪౩౭ పం.

౮. లక్ష్యముగాఁ గొను, గుఱిసేయు.

ఉ చిత్తరు వన్న నిశ్చయముచే నెదు రుండి
మొగంబు చూడ మో, మెత్తును సత్యపుం
భ్రమ సమృద్ధిని గ్రమ్మఱఁ దక్షిణంబు లో,
నొత్తుచుఁ దత్తఱంబుఁ ద్రపయున్ మగు
డంగ నికీక్షణేచ్ఛఁ బో, మొత్తుమ భర్త
చూపు దను మోచుట దోఁచిన నోసరిల్లు
చున్.

ప్రభా. ౧ ౧౩౯

౯ క్రి. అనుకొను.

సీ. నిమ్మలు మాదీ ఫలమ్ములు నతిరమ్యముగఁ
బండి నేలపై మోచి యుండు ..

కు. సం. ౭. ౯౩౦.

౧౦. నిండు.

చ. కంజభవాండము మోవ లీల మ్రై,
పెనిచిన దంభవామను నుపేంద్రుని నిన్ను
సమాశ్రయించెదన్ . మను చ. ౬. ౧౧౧.

ఆ. ఇతనిఁ జూచి మీకు నెంత మోహము గల,
దంతకంటె మాకు నధిక మైన, మోహ
రసము మూరి మోచియున్నది యీశ్యమూరుఁ
డొక్కరూప మాకు మీకు.

వి. పు. ౭. ౧౦౦.

౩. మొదలుకొను, ప్రారంభించు.

గీ. ... శంకరాద్రి, కాననము మోచి మంద
రాగంబు దాఁక, ఛాయాపెట్టిరి తమ్ముల బలము
దొరలు. మనుచ. ౫. ౪౪.

తలమోచు = శిరసావహించు.

సీ. ప్రచండమేఘు, కులము లాతని యాజ్ఞ
దలమోచి యతని యాయుధము చిహ్నం
బగునొడళు లాప్పు
హరి. పూ. ౩. ౧౫౧.

జ. మోచికోను, మోపరి, మోపరిగాఁడు, మోప
రీఁడు, మోపు, మోపుకాఁడు, మోపుకోను,
మోపుకోలుపు, మోపుదల, మోపెట్టు.

మోజా. వి ఒక జాతిచెప్పు, పాదరక్షా విశే
షము

సీ. పాదరక్షాభిధ పరగుఁ జె ప్పన మలకడ
మ్మనఁగ నమ్మాళి యనఁగఁ, దద్విశేషమ్ములు
తగుఁ బాయపోసు పాపోసు సూడు పుద్దము
మచ్చె మెట్టు, కవును మోజా యనఁగ
ఆం భా ౫. ౫౯౭

గీ. చరణముల లేఁత చిగురుమోజాలు దొడిగి,
కటిభరంబునఁ గురుచేర కలయఁగట్టి, పొగ
డలును బొడ్డుమల్లెలు పొన్నవిరులుఁ, బొప్పు
నను వాల్గదిక్కులఁ బఱచివైచి.
వి. శకుం. 3. ౪౧.

మోట. విశ. (సం. మూఢ) ౧. మూర్ఖుడు,
మొద్దు.

ద్వి. చదువును సంధ్యయు జపమును లేక్మి,
మొదలు ముట్టఁగఁ బోయి మోట వై
బదరి... ద్వి. హరిశ్చ ఉ. ౧౫౧౨. పం.

౨. స్థూలము, బలిష్టము.

ద్వి. మాటున నమర గ్రమ్మఱ వచ్చి తాఁక,
మోటతో జెత్తుక మోఁదె వాలి .
రం. రా. కిష్కిం. ౫౮ ౪ పం.

వి. కపిల, ఎడ్లను కట్టి నీరు తోడెడుయంత్ర
విశేషము.

సీ. ఏత మనఁగ ఘటీయంత్ర మెనఁగుచుండు
మోటనంగను దర్శ్యేద మెనరు ..
ఆం. భా. ౨. ౫౯౩.

జ. మోటక త్తి.

మోటక త్తి. వి. (మోట+క త్తి) మచ్చుక త్తి.
చెట్టు కొమ్మలను గొట్టు పెద్దక త్తి

ఉ. కట్టినసీలిదిండ్లు పెల కట్టియపిండ్లును పిండ్ల
గొనెనల్, చుట్టి నొసళ్లపై నిడినజాంజాఱుఁ
బల్లసిగల్ కటీతటిన్, బెట్టిన మోటకత్తు
లును మనుచ. ౪. 33.

ద్వి మలయంగ నెదరొండియు మీఱ గాఁగ,
మొలద్రాటఁ జెక్కిన మోటక త్తియును .
ద్వి పరమ (చి. ని)

మోటకము. సం. వి. అ. పుం, న. మాత్ర,
గుళిక. న శ్రాద్ధకాలమున నీయఁబడిన భగ్న కుశ
ప త్త్రిద్వయము, విడదీసిన రెండు దర్భపుదళలు.

మోటనము. సం. వి. అ. న. నలఁగఁగొట్టుట
పిండిచేయుట, బ్రద్దలు కొట్టుట. పుం. వాయువు,
గాలి.

మోటపాటి=మోటాటి. వి. కడ్లలోనొకతెగ
(శ. ర.)

మోటబరి. వి. బరువు మోపెడియెద్దు. (శ. ర.)

మోటాటి=మోటపాటి. వి. కడ్ల (కాఁపుల)
లోనొకతెగ.

గీ. పంట మోటాటి పెదకంటి పాకనాఁటి,
కొణిదాకాఁపులు మొద లైనమోటీఁ దనరు,
కాఁపులకు పెల్ల మిన్న యకాన్న యు
కొడుకు . హంస. ౪. ౧౩౩.

మోటించు. స. క్రి. పోటీగా నిలుచు.

(వ్యవ.) దూలము పడకుండ స్తంభమును మోటించినారు. (శ. ర.)

మోటిక = మొటిక. మొట్టిక. వి. అంకురము, మొలక.

ఉ. పరిపాటిగఁ గెంజిగురు రెక్కదెక్కదన్, మోటికలెత్తి క్రొవ్విరులు మొగ్గలు వగ్గల మయ్యె నయ్యెడన్ (మోటికలెత్తు = అంకురించు అనిభావము) విప్ర ౨. ౨౩.

మోటు. వి (సం. మూఢః) ౧. స్థాణువు, మోడు.

సీ. పాట పాడుచు రొక్కచోట మోటులు పల్లవించి కోయిలలకు విందుసేయ .
ఉ రా. ౧. ౧౪౦

ఉ. కాలిన మోటువంటి కోఁగాని శరీరము పల్ల వెంట్రుకల్
వి. పు. ౨. ౧౩౪.

సీ. మోడు మో టనఁగ వొప్పును స్థాణు నామంబు . ఆం. బా. ౨ ౩౬.
దశా. ౯. ౧౯.

౨. మాటు, వేటకాఁడు పందివేటలో దాఁగుటకయి ఉపయోగించు తెర, పల్లము మొ॥

సీ పట లెత్తుకొని రొమ్ముత్తుకిటి నైన మోటాస పడి రొయ్యఁ బొడుతు నీపాద మాన
మనుచ. ౪. ౩౪.

సీ. పాదిగువ్వలు మోటుపలకలు పోటుగుంజలు చిక్కములు మరు జాగిలలములు
శుక. ౧. ౧౬౫.

గీ. జారకిరిపం క్తులకు మోటు
హంస. ౨. ౧౪.

గీ. మొద్దుగుబ్బము, మూఢకహయము.

ఉ. . నడకగుబ్బపుమోటుల వేసడంబులం, బెల్లుగ సొక్కి వారజనబృందము వోఁ బురి సైదుబాళ్ళ భూవల్లభుఁ దుండి కాఁ గదలె వాయుజముఖ్యులతోడ పేరుకన్ ...
జై. భా. ౨. ౧౧౩.

౩. మూఢకహయంబు వెలయును మోటు నాఁగ ఆం. భా. ౨. ౧౯౬.

విశే. ౧. పెద్ద, స్థూలము, దట్టమైనది.

గీ. మోటుపలుక నిజాంగింబుమాటు గాఁగ, వెలయు . రావి. ౫ ౨౦.

౨ పరుసము, కఱకైనది.

(వ్యవ.) వాఁడు తఱచు మోటుమాట లాడును.

౩. మూఢుఁడు

గీ. మొరకు మోటు పిసాళి నా మూఢుఁ డొప్పు ఆం భా. ౩. ౭.

జ : మోటుకన్ను, మోటుకాఁడు, మోటు పఱచు, మోటువడు

మోటుకన్ను. వి. (మోటు+కన్ను) మొద్దువాటి నకన్ను, ఒకవిధముగాఁ జెడినకన్ను

ద్వి. తూఁటు గట్టినకన్ను దూలగొన్కన్ను, మోటుకన్ను నబాపనునిగిడకన్ను.
పండితా. మహిమ. ౨౪౩ పా.

మోటుకాఁడు. విశే. (మోటు + కాఁడు బ. మోటుకాండ్రు మోటుకాఁఱ) మాటు పెట్టుకొని వేఁటాడువాఁడు.

ఉ. అ త్తతి వేపికాండ్రు యమునాంబుతరంగ పరంపరాకృతిన్, ము త్తర మైనమూకరిప ముత్కరమున్ గని మోటుకాండ్రు వి, ల్లెత్తికమున్న రాజమది కెక్కుడువట్లుగ దీని మి త్తికిం, బు త్త మటంచు బట్టెదలు బోరన దయ్యె భయంకరార్భటిన్. మనుచ. ౪ ౪౦.

మోటుపఱచు. స. క్రి. (√ మోటుపడు) ౧. నఱకు, ఖండించు.

గీ. కొలనికి సీమసవతోటకు మక్కువెపులు,
మోటుమూఁచినఖడ్గంబె [illegible] క్రాల .
భా. రా. యు. ౩౨౧.

(మోదుపఱచు క. ర పా)

౨. కొట్టు, ప్రహరించు.

క. మోదిన నహ్హాలబోనవు, బోదులు వెండి
యును వాఁడినుఱియల గుదెలం, గైదువుల
నారసంబులఁ, బాదుకొని కలంచి మోటు
పఱచిరి వారిన్.
అచ్చ రా. యు ౧౩౩

**మోటువడు.** అ. క్రి (మోటు + పడు) మొద్దు
వాఱు, చెడిపోవు

గీ. ఇవ్విధంబున నావిద్య కెల్ల మోటు,వడినఁ
జె ట్టెక్కి చేతులు విడిచినట్లు, శోకచింతా
నిమగ్నుండ నై కురంగ, నయన కృపఁ గాచి
రక్షించు న న్నటంచు
వరాహ ౧. ౯౭

**మోట్టాయితము.** సం. వి. అ న విరహ కాలం
బునఁ బ్రియునికథాదులయందు మనసు దగిలి
యుండుటను దెలియఁజేయు స్త్రీ యొక్క
శృంగార చేష్టా విశేషము.

**మోడము.** వి మేఘావరణము, మందారము.

గీ. . మోడ, మనఁగ మందార మనఁగ
మేఘావృతి దగు
ఆం. భా. ౧. ౪౧.

**మోడామోడి.** వి. ఒకానొక స్వరస్థాయి.

ద్వి. కురుడి మోడామోడి ఆదిగా సొగ
యుతాయములు. బస. పు ౩. ౯౮౨ పం.

**మోడి1.** వి. గణికాదులు మొగ్గవాలి కాలికి
సమీపమం దుంచిన వస్తువు చేకొనుట.

క. లయ తోపు దృష్టియును నభి,నయ ముదుటు
దురమ్ము మోడి నయ మున్నతి రేకయును
బ్రమాణము హారువున్, మెంఱుపిరి యన
ఘశిము మురువ్గు మెలకువ యనురయన్.
ప్రబంధ. ౧౦౮.

**మోడి2.** విశే. (సం. మూఢః, క. మోద) మొండి,
మూర్ఖుఁడు.

గీ. వారసతు లైన యీ సీమ వారివలెనె, మోడి
మానిని నైన నే గోడు లేదు
వైజ. ౨. ౯౫.

వి. ౧. అనాదరము.

(చూ. మోడిసేయు)

౨ చలము, పట్టుదల.

గీ. కొమ్మ విను దక్కి దక్కించుకొనెడి యాస్య,
ముమ్మరమ్ముగ న న్నేఁచ మోడి దగునె
ప్రబంధ ౪౩౯.

౩. కోపముచేఁ దాల్చు మానము ; కోపము.

గీ. మోడి యనఁ గోపమానంబు పొల్చు నభవ .
ఆం. భా. ౧. ౧౩౫.

గీ. కోపకీలులు మోడి నాఁ గొఱలుచుండు
ఆం. భా. ౩. ౫౮.

సీ. మ్రొక్కి కేడినఁ గావి మోడి మానని
వాఁడు పెక్కులు బతిమాలి వేడపాగ
కలు. క. ౭౪.

సీ. చూడవే క న్నెత్తి పీడవే మోడి నీ పీడ కే
రావె నీవాఁడ నేను కళా. ౪. ౭౪.

౪. బింకము.

గీ. పంచకము తొమ్ము విరివిరియై పరిఢవిల్ల, మోడి
శిర పెత్తుటయుఁ గల్గి మొయిలులోని,
జలము లే నోపు పాదరసంబువంటి, యుత్త
మాశ్వంబు సాహిణి యొకఁడు నిలిపె
సారంగ. ౧. ౭౧.

చ. బొమ ముడిపాటు బంకెనయు పూనికయున్
మురిపెంబు మోడి పం,తము చిరునవ్వు
దోఁప .. కళా. ౩. ౨౭.

జ: మోడిసేయు.

మోడి3. వి. నర్తకీవైఖరి; వైఖరి, విధము.

సీ. .. త జోలిటాగోడ జాబాటూకు, చేతొను
బొన్నుకాన తీఁగ మోడిపములఁ జిత్ర
పటముల తళుకు వెలసి

గీ. కళుకు బంగారు రేకుల కుళుకు మీఱు, చెళుకు
తెలిమావికపు జగతులను సోయగంబుడం
బగువై జయంతంబులోన
ఘటికా ౨. ౬౬.

గీ మోముఁ జూచిన శశిరేఖమోడి యమరె,
మాటపోడిమి జూచిన మంజుఘోష
శశాం ౩. ౫౦

చ. పలుకులనేర్పులన్ జిలుఁగుఁ బయ్యెద
జార్పులు వింతమోడి నవ్వులు
శశాం ౨ ౧౦౪

మోడిసేయు. అ క్రి. (మోడి2 + చేయు)
అనాదరము చూపు.

గీ. పసిడి చీరలు గోవులుఁ బసులుఁ గొల్చు,
నూళులిండ్లును బండ్లును నోలి నొసఁగ,
వలయు నివియెల్ల నొసఁగి యవ్వలన మోడి,
సేయ కెంతయు సంతుష్టి సేయవలయు,
హరి. ఉ. ౧౦. ౩౧౬.

మోడు = మ్రోడు. వి. ౧ స్థాణువు.

సీ. మోడు మో టనఁగ నొప్పను స్థాణు
నామంబు ఆం. భా. ౨. ౩౬.

౨. ఉండవలసిన యవయవాదులు పోవుటవలన
మొద్దువలె నుండు పదార్థము.

గీ. తామఁ బాసిన కనులంబు కరణిఁ బోలుచు,
కర్ణతల యిలఁ బడియు నుపీర్ణకాంతి, నొప్పు
వట్టియుఁ జూచి కల్యాంము నిదము, ద్రిప్పి
మో డైన యరదంబు గ్రిప్పె నధిప.
భార. కర్ణ. ౩. ౩౪౧.

మోడి2. విశే. (మూఢుఁడు.)

సీ. భాగ్గునం దైలంబు బుట్టంగ నేర్చునే యిల
మీఁద మోడు వి గ్గేల తలఁచు .నీతి. ౪౩.

(చంద్రవర్ణనము.)

చ. గురునతిఁ గూడు రట్టునకుఁ గొంకని మోడు
విరామిగనీన మృత్యుగముల కీడు
వరాహ. ౪. ౨౪.

జ. మోడుపడు,

మోడుచే(డ్చు). స క్రి (√ మొగుడు) ౧.
(చేతులు) జోడించు

ఉ. మ్రొక్కెద వాసుదేవునకు మోడ్చెదఁ
జేతులు సవ్యసాచికిన్
భార ఉద్యో. ౧. ౩౦౨.

ఉ తోడి కుమారులున్ సఖులు దూరమునంద
కరారవిందముల్, మోడిచి ఫాలభాగమున
మోపి నమస్కృతు లాచరింపఁగా .
కాశీ. ౬ ౫.

ఉ. మ్రొక్కు లొనర్తుఁ గేలుగవ మోడిచి
నీలా. ౧. ౪.

ద్వి. మోడ్వఁడు చేతులు మ్రొక్కఁడు పొఁగి
పండితా. మహిమ. ౨౯౦ పా.

౨. (కన్నులు) మూయు.

చ. మొలచిన కూర్మిఁ గన్నుఁగవ మోడ్చిన
యప్పు దశప్రభావనా, బలమున నాభ్యపాల
కునిఁ బాయక చూతురు మర్త్యభామలు .
నైష. ౧౬౪.

చ జలదేవత హా యని కన్ను మోడ్చె
నా, వనరుహముల్ ముడింగ ..
పారి. ౨.౨.౨.

సీ. అవులు నాకఁ గ న్నులుమోడ్చు పులులను
బులుల చ న్గడువంగఁ బోవు లేళ్లు ..
కళా. ౩. ౧౦.

౩. (శత్రువులు) ముడుచు.

౪. కలపములు గూర్చ బహుపిన, తిలకంబులు
పెట్ట వింతతీరవున బలు పువ్వులు గట్టి కట్టి
మోడ్పుఁగఁ, దల ముడువఁగ సరులు గ్రువ్వఁ
దద్దయు నేర్తుస్. భార. విరా. ౧. ౩౨౦

మోడుప(డ్పు)డు. అ. క్రి (మోడు + పడు)
౧. కుముఁగు, తెగు.

క మోడుపడిన చేతులతోఁ, గిడసుదశఁ బొంది
కాక కిన్నరగీతా, మ్రేడిత ముద్భుజ సంప,
త్క్రీడలు నీ కకట యిపుడు దెలియఁగ
నగునే హరి ౫ ఆ. ౧౪౭.

౨. బోడియగు, కొమ్మలు ఆకులు లేక యుండు

గీ. అర్ఘ్యగులు కోడిగములకై యూకు లెల్ల, ద్రెంచి
శాఖా వితానముల్ ద్రుంచివైవ, మోడుపడి
యుండె నది నిల్వ నీడ పట్టఁ, గొమ్మయును
లేమి తనయందు గుదురుకొనఁగ.
శుక. ౩. ౪౩౯.

౩. మొక్కపోవు.

చ. అనుటయు నాదిదేవుఁ బరమాత్ముఁ గనుం
గొన నెమ్మనంబులన్, మొనయు కుతూహ
లాంకురము మోడ్పడఁ గోపము చిచ్చు
కాఁకునన్, ఘనతర బోధపల్లవము గందఁగ
సైరణ యన్మహావ్రతంబునకు విఘాత
మొందద మునిపుంగవు లొక్కట మగ్గ
మాత్తరై. నృసిం. ౧. ౭౩.

౪. గ్రూనుపడు, నిశ్చలమగు.

ఉ. తీరలు గంగలోఁ బులినవేదులమీఁద
బ్రుసీని విష్టరై, కోరు వృథా మొదల్పుచుఁ
గఱంగవ మోడ్పడ నక్షమాలికల్, పారకుఁ
ద్రిప్పుచున్ . ప్రబోధ. ౨. ౭.

మోడుపు(డ్పు). వి. (మోడుచు) మొగుడుట,
ముకుళించుట.

మ. ... వికృటంబుఁ దమి ప్రొక్క కాంత
కన్మోడ్పునన్ ..
దశ. ౩. ౩౪.

క. పెన్నురులఁ జెనట మోడ్పుం, గన్నులు
వదలుకవుఁగిళ్లు గలవారలకున్, బన్నీరు
గ్రోలంటయు నంత న్నిద్దుర పోవుటయు
హితం బై యుండెన్.
సారంగ ౩. ౧౫౧.

సీ అలాపగతిఁ జొక్కి యరమోడ్పుఁ గన్ను
దోయి రతిపారవశ్య విభ్రమముఁ దెలుప
మనుచ. ౨ ౨౪

మోడుపు(డ్పు)ఁగేలు. వి. (మోడుపు+కేలు)
దోసిలి, అంజలి

గీ మ్రొక్కి నిలుచుండి నుదుటిపై మోడ్పుఁ
గేలు, భక్తిఁ గదియించి యిట్లని ప్రస్తు
తించె
భార. ద్రో. ౫. ౪౦౯.

మ అని కీర్తించి తపస్వికేసరి యఖండానంద
దుగ్ధార్ణవం, బునఁ గ్రీడించుచు ఫాలభాగ
మున మోడ్పుంగేలు గీలించి .
కాశీ. ౧. ౧౪౩.

మోడ్పుఁజేయి. వి. (మోడ్పు+చేయి) నమ
స్కారమునకై చేసినయంజలి.

సీ. అంతరాంతరముల నాకాశచరకోటి మోడ్పుఁ
జేతులు మస్తముల ధరింప... హైమ. ౩. ౯.

మోణము. సం. వి అ. పుం. ౧. ఎండినపండు.
శుష్కఫలము.

౨. పాములపెట్టె. పాములబుట్ట, ౩. వక్రము. ౪.
మక్షికము, ఈఁగ. (మే. వి.)

మోతాదు. వి. (హిం. మాతాద్) ఒకసారి
యిచ్చునందు ; అనల్పానధికమగు పదార్థము,
పుచ్చుకొదగు కాని పదార్థము.

(స్థిప.) వైద్యుడు మూఁడు మోతాధులను దిచ్చెను.

కా. మం దెల్లప్పటికిం గళింగమునకున్ మోతాదు కాఁగన్ జమ్మాబందీ ద్వాదశలక్ష రూపికల కేర్పాటున్నది . రంగా. ౨. 8.

మోతుకు = మోదుగు. వి. పలాశము. ?

ద్వి. జాతిగా గళిములు చాఁచి చెలంగి, మోతు కుమొగ్గలమురువు నటించు

నవ. ౧ ౧౦ పా. ౧ పం.

మోద. వి. ఇన్నూరు తమలపాకుల కట్ట (శ ర వా)

మోదకము. సం విణ (అ దికా. అ) ౧ సంతోషించునది, ఆనందించునది ౨. సంతోషింపఁ జేయునది, ఆనందింపఁ జేయునది, వి పుం న ౧ ఉం(డ)ము. ౨. గుడము, పుం క్షత్రియపురుషునకు శూద్ర స్త్రీయందుఁ బుట్టిన సంకరజాతి

మోదనము. సం వి అ న ౧ సంతోషము, ఆనందము ౨ సంతోష పఱుచుట, ఆనంద పఱుచుట 3 మైనము

మోదమానము. స. విణ. (అ ఆ. అ.) సంతోషించుచున్నది (శ. ర)

మోదము. సం. వి. అ. పుం. ౧. సంతోషము, ఆనందము, ఉల్లాసము. ౨ పరిమళము, సువాసన.

మోదయంతి. సం. వి. ఈ. స్త్రీ. ఒక జాతిమల్లె, వనమల్లిక ?.

మోదయము. వి. తృణవిశేషము, ఒల్పజము. (శ. ర.)

మోదర. వి. ఖండము. (చూ. మోదరలాడు.) జ. మోదరలాడు.

మోదరలాడు. స. క్రి. (మోదరలు+ఆడు) తునుకలు చేయు, ఖండించు.

సీ. విఱువు కంఠాస్థుల నఱిచి చివ్వంగుల మొత్తి మోదరలాడు మ త్తకరుల .

పి. శకుం. ౨. ౧౨.

ద్వి. భటుల నందరను, మొత్తి మోదర లాడి మెనసి గుండెలను, నెత్తుట దిగఁబన్నిసీ కెల్లఁ జెఱచి

ద్వి పరమ ౬. ౪౬౧. పా.

మోదాఖ్యము. సం. వి. అ పుం. ఆమ్రవృక్షము. మామిడిచెట్టు

మోదా(ద)లు. వి బ మొదవులు, ఆవులు. (ఇది శాసనములందు మాత్రమే గానవచ్చు చున్నది)

వ జాయపనాయకుండు అఖండ దీపమునకుం బెట్టిన మోదాలూ ౫౦. Ep ind No 3 No 15 (year S 1153)

వ. అడవున బ్రుంచె కొమ్మనబోఇని అ [ద్యమును]కల ఎఱ్ఱబోల వసమునంబెట్టిన మోదాలు ౫౦ నిత్యపడి అడువఁల త్రిభువ నాంకుశ .

ద. శా. ౪. ౧౦3.౨. A

వ. స్వస్తి [౧౧ ?] శ్రీ [శకవర్షంబు] లు ౧౧౩౪ అగు ప్రమాధి సంవత్సర జ్యేష్ఠ బు [ద్ధ] 8 మ, పిన్నిమల్లె పెగడ గణపయ శ్రీదాక్షారామ భీమనాథ దేవరకు అనవల . ఇచ్చిన మోదలు ..

౧౦. ద. శా. ౪. ౧౦౪౩.

మోదించె. సం. అ. క్రి. ౧. సంతోషించు.

ద్వి. అదటఁ జిరిచి తె మ్మని పంచె నసుఁడు, మోదించి చిఱునవ్వు మొలకలు నిగుడ ...

రం. రా. అయో. గా. పా. ౩. ప.

శా. శౌర్యాఖ్యాన మెఱింగి చిత్తమునయం
దేర్పాటు మోదించువాఁ, డాయమ్మంతుఁడు
క్రీడ సేకుఁడు . హరి. పూ. ౧. ౧౩౪.

౨ క్రీడించు, విహరించు

ద్వి. అందంద నందమై యాపర్ణశాల, ముందఱ
మృగ మిట్లు మోదించుచుండె
రం. రా. అర. ౧౪౩ పా. ౧౯ పం.

మోదివి. సం. వి ఈ స్త్రీ. ౧ అజామోద టీ.
౨. మల్లిక టీ. ౩. యూధికయనులతావిశేషము.
౪. కస్తూరి. ౫. మద్యము

మోదిలు(ల్లు)=మోదించే. సం. అ క్రి సంత
సించు.

క. అ, వ్వేదమయుమొుగము గనుఁగొని,
మోదిలి మృదుమధుర వాక్యముల ని ట్లని
రొనె వా రా ౧ ౫౪.

ద్వి. అని పల్కి రాముఁడు నాలత్మ్రణుండు,
జనకాదులును సభాసదులు మోదిలిరి
రం రా. బాల. ౭౧. పా. ౧౪. పం.

మోదుగ(గు,వు). వి కింశుకవృక్షము; దీని
విత్తు.

సీ. మొగడుఁ గింశుకము మోదుగ యనంగ
ఆం. భా. ౧. ౪౪.

గీ. ఎలమిమై జాజి యీరంభ్రు సేనుఁగులను,
నొంచుసామని యనుకొంకోరిమొకము, గో
ళ్లినంగను దగుమోదుగులను మొగ్గ, లమరెఁ
దమరంగు మి న్నెల్ల నలముకొనఁగ
యయా. ౪. ౫.

గీ. అతఁడు మృగకృత్తి పెళపెళ యనఁగఁ
బనుపు,గోఁచి గట్టినమోదుగుకోల పెగయ .
ఆము. ౪. ౭౭.

క ఈ చందంబునఁ దొఱపులు, వేఁచియుఁ బయిఁ
బూఁచి లాఁచి వేసియుఁ బైపైఁ ద్రోఁచురు
ధిరమునఁ దడిసిరి, పూచినమోదుపులకోఁక
బుట్టువు లనఁగన్. ఉ. హరి. ౩. ౭౩.

౨: మోదుగతోడిమలు, మోదుగుమాడు.

మోదుగతోడిమలు. వి. బ. (మోదుగ +
తొడిమ) ధాన్యవిశేషము.

సీ. గరుడసరు లోప్రెతుగంటరాజనములు మోదుగ
తోడిమలు ముదుకసరులు
హంస. ౪. ౧౨౯.

మోదుగుమాడ. వి (√మోదుగు) మోదుగు.
విత్తు (శ. ర.)
బ. శాలిధాన్య విశేషము. (శ. ర.)

మోదెన. వి శివమల్లిక టీ
(రూ. మోదనము. శ. ర. పాశుపతము చి. ని.)

మోపరి. విణ (మోపు + అరి.) భారమును
వహించువాఁడు

చ. తరుణులకౌఁగిట న్ననుచుతమ్ము వృథా విరు
లొత్తఁజేసె మోపరులుఁగఁ జైత్రుఁ
డంచు . ఆము ౫. ౧౨౭.
చం. రా. ౧. ౧౦.

సీ. మోపరి యొం తైన మోవ పేసారఁడు సారిది
నాదాయమే చూచుఁ గాని .. నీతి. ౪౩.

ద్వి. మోపరి కసుతగ్గు మొగ్గులభరము, మోపింపఁ
గొనునట్టిముగ్ధన కసుగె .
ద్వి. భాగ. ౧. స్కం. (శ. ర.)

సీ. భారవాహకుపేరు పరగుచుండును జెత్త
మోఁపరి బోయఁడు బోయ నాఁగ
ఆం. భా. ౧. ౧౭౭.

మోపరిగాఁడు. విణ. (మోపరి+కాఁడు) నీచుఁ
డగు మోదువాఁడు.

ద్వి. గడిక్రుతుల్ మోపరిగాండ్లై మోవంగ ...
పండితా. దీక్షా. ౧౯ పా.

**మోపరేడు.** విశే. (మోపరి+ఏఁడు, స్వార్థమున) మోయువాఁడు.

సీ. పుడమిమినివాల్గంటి నిడువాలు పడగగుంపుజను
నెత్తుక మోయుమోపరేడు .
ల. వి. ౧. ౯౫.

**మోపాది.** వి. (మోపు+అది) అపాయము.
(చి. ని ౹౯. శ. ర. ఇదియేఁడాదివంటిది)

**మోపి.** వి. ముండమోసినది, విధవ (చి. ని. ౹౯ శ. ర)

**మోపించే.** స. క్రి (√ మోచే) మోయఁజేయు.

క. కోపించు సురల పెలువడఁ, ద్రోపించె
సురారి బలిమి ధూర్జటి నీళ్లన్, మోపించె
విష్ణుఁ బసులం, గాపించెను మాకు నొరయు
గ . దాపించెన్
కు. సం. ౪. ౩౭౧.

క. నడవం జాలనివారలఁ, దడయక మోపించి
తెచ్చి ధరణీశుఁడు తాఁ, దడ వొర్వని
కార్యములకు, నెడనేయక పాడి నిర్ణయిం
పఁగ వలయున్
విజ్ఞా. ౩. ౧౭. కాశీ. ౫. ౭౭.

**మోపిక.** వి. (√ మోయు) భారము. (శ. ర.)

**మోపిడు.** స. క్రి (మోపు+ఇడు.) ౧. ఎక్కు పెట్టు.

ఉ. అపువువింటిజోదు మధుపావళి నారి
యొనర్చి చొక్కఁగా, మోపిడి పట్టి జా మ్మనుచు
క్రోయఁగ మోఁటుము నున్న వాఁడు
వి. శకుం. ౨. ౧౩౦.

ఉ. కొండ తోలింక యొత్తె నాక కొండలు
మోపిద లేక దక్కఁగాఁ, గొండ తోలింక
యొక్కుడుచు .. భాగ. ౧౦. ఉ. ౧౦౯౦.

౨. మూటగట్టు.

ద్వి. మోపిడి లేవమోవ సోపినన్నియును, శేపారఁ
గొనివచ్చి యిచ్చె లంకయును.
బస. పు. ౩. ౭౭.

**మోపిల్లు.** వి. ఒ బాలక్రీడా విశేషము.

సీ. గోట దొర్లుడుకాయ గొబ్బిళ్లు మోపిల్లు .
హంస ౩. ౧౪౭.

**మోపు.** స. క్రి. (√ మోచే) ౧. వహింపఁ
జేయు, మోవఁజేయు.

గీ. మరల సొమ్మిచ్చుటకు పూఁటకాక పైన
హాలి, జట్టు మోపి రసంగఁ గచ్ఛపముమీఁద
గట్టు నిల్పె సురాసురగణము లపుడు
దశా. ౨. ౧౯౩.

౨. అనించు, అనునట్లు చేయు

గీ. శాంతి నొందుటకై ధర్మ సంవిభాగ, కరణ
మొనరింప వచ్చిన కమలనాభు, వాక్యవృత్తిఁ
బాటింపక వాఁడిమాది, మోపి నంతైనయుర్వి
నీ నూప నంటి భార. శల్య. ౨ ౪౮.

ఉ. గాఢతరత్వరఁ దూలి నేలపై, జానులు
మోపి మాగధుఁడు సత్త్వ మఱం బడి సొమ్మ
సోయినన్.
హాలి ఉ ౧. ౧౭౭.

క. వినుమాయావిధ మిట్టిది, యని యూరయు
వెరవు గలుగ దవనిం జకణం, బనఘా
మోపని జంతువు, పమచా స్ఫురయుంగ రాని
చందం బొందున్.
భార. శాం. ౪. ౧౯౦.

ఈ. చమఁగవక్రేఁకము స్ఫుట చక్రధరంబున
మోవ లేక యొయ్యనఁ బదపంకజంబు లల
సాలనపై ఖరి మోపుచుం జనా్యర్ధసుభుజ
మూఁతగాఁగ వనితామణి యోఁగెఁ బరస్పు
రాంగ మేౕనమున రోమహర్ష ముకుళిత్రభ
మొందొరుమేను నిండఁగన్.
పాక. ౪. ౨౫. హర. ౨. ౧౧౩.

ఉ. . విడియంపుఁ జొక్కాలో, మైలలమోపు
వీఁపున నమర్చిన కేవుగుఱాని నెక్కి ..
కుశ. ౩. ౧౦౩. భార అశ్వ. ౩. ౧౫౪.

౫. భారము, బరువు

సీ. క్రొవ్విరు లెసఁగి పూగొలలమో పోపక
నవశంపు లేదీఁగె నెవులునట్లు.
కు. సం. ౯. ౬

ఆ మాతపుత్ర యితఁడు నాతలఁ బెద్దమో,
పెత్తి నమ్మి యున్నయట్టిచోటఁ, గ్రందు
సేయ నాకుఁ గా దని సైరించి, యున్న
బ్రదికి తింక యూరకుందు
భార. ఉద్యో ౪ ౨౫౧.

చ. . ట్క్కరి బలుమోపు మోచు నయగారి
తనం బది యుట్టిగట్టినన్
ఉ హరి ౪. ౪౭

౬. బరువైనవస్తువు.

మ. పలుమారుల్ బలభేదిదొట్టినురలన్
బాధించుటం జేసి వా,రలు నాకుం దలచూప
నోడుదురు కూడ్రశ్వేస్థు లన్యూల్ జగం,బుల
శే రివ్వారుఁ గయ్యపున్గులవునన్ బొందన్
ద్రిలోకేశ బాహులు వే యాఁడిమోపు
లై రొయిటులు పోనోపుం దలం కయ్యెడున్
హరి ఉ ౭. ౧౭.

ఉ. అపరమోపకారనిధి యప్పుడు వేల్పులరా
యబార మ,న్మోపు వహించి
నైష. ౩. ౭౭.

సీ. కమల రేనిశ్చల రమణులేకదకు మోపై
నిల్పి యతనిపై రమగుపతిచె .
వసు. ౧ ౩౭.

౭. ఎక్కు, జ్యాసంధానము.

క. రిపుభంజనము రత్నభూషిత రూపం,బును
గురుదేశాహ్లాదన,మును నగునిజకార్ము
కంబు మో పెదలించెన్ .
భార. విరా. ౧. ౧౭౦.

౮. శాధ్యత, పూచి.

సీ. కన్నులు లేనిమాకన్నులఁ గాకుండు నీవ
కదన్న మానిభిలవంశ ఆ. మను ధనుద్ధ
రించుమోపు నీయదిథు క,దన్న .
భార. ఆర. ౭. ౨౭౧.

క. పృధివీపతి నీ,తలన తనకార్యభద్గం,
బులమో పెక్కించెరి త్త వోవుని నీకున్ ..
భార. విరా. ౫ ౨౩.

విణ అధికము

ఉదా॰ అవుపెల మోపైనది

మోపుకాఁడు. విణ (మోపు+కాఁడు) భార
వాహి

క. నీ వేటిమోపు కాఁడవు, నావెరవున నిన్ను
నడపినను గర్వం బే,లా వెడఁగ
భార. ఉగ్యో ౩ ౩౩౦.

మోపుకొను సక్రి (మోపు+కొను, స్వార్థమున)
చేర్చు, పెట్టుకొను

వ. ఆబ్రహ్మచారి దెచ్చినపుస్తకంబుఁ బుచ్చు
కొని శిరంబున మోపికొని కన్నుల కద్దుకొని
తియగ నతనిచేతిక యిచ్చిన
కళా ౪. ౫౯.

మోపుకొలుపు(ల్పు). స క్రి. (√ మోపుకొను)
మోపుకొనఁజేయు, ఆరోపింపఁజేయు.

గీ చేరిక లొనర్చి తేనియ ల్చిలుకఁ బలికి,
మోహ మూరించి తరితీపు మోపుకొల్పి,
యతనినూఁదను బతికిని హితము వొడమ,
ముస్నె రొయినరించి వానితో మురియఁ
దొడగ హంస ౨ ౧౭౯.

మోపుదల. వి (√ మోపు) ౧ ఆరోపణము.
౨. భారము. (శ ర.)

మోపెట్టు. స. క్రి. (మోపు+పెట్టు) ఎక్కుపెట్టు,
జ్యాసంధానము చేయు.

క. ఎవ్వరికిని కెూపెట్టను, దివ్యను కళ్యంబు
కానిదృఢకార్ముకమున్ ..

భార. ఆది. ౫. ౨౫.

మ. పాలీక గర్వంబులాడిన నిక్కంబగు
నల్కనర్జునుడు గాండీవంబు మోపెట్టి
గృష్ణుని సారథ్యము నై జగత్త్రితయసం
క్షోభంబు గాకుండునే ..

భార విరా ౧ ౨౬౬.

మ సుతశక్తిన్ నృపసూనుఁ దట్టిధనువున్
మోపెట్టియైంద్రాయుధోద్ధతి పాథోదనిరావి
యర్యో

రాఘవ ౨. ౧౦౮
ఆం భా ౨ ౧౧౨

మోము = మొగము వి. ముఖము

క. భూమీశుఁ దఫుడు మంత్రుల,మోముల
గనుఁగొని సగర్వమున ని ట్లనియెన్

భార విరా ౫ ౨౮౧

ఉ మొగ్గతిలంబడెం జెమట మోమునఁగ్రమ్మఁగ
ద్రావిడోత్తముండు హర ౧ ౨౧

గీ. మోముదమ్మి వి జిరునవ్వు మొలకలెత్త

నీలా. ౧. ౧౩.

శా. అయ్యా మీతండ్రి గడింపలేదుగద
వెయ్యాశ్లెన్నడుం జాలు మీమోముల్
దిందురుగాక యిం కనుచు వీఁపుల్ చిట్లిపోఁ
గొట్టుచున్ శుక ౩ ౨౩౩

ఆం భా ౨. ౧౮౨.

(ఇటు నిందాద్యోతకము )

మోమునఁ(వేలు = ఎల్లప్పుడు కన్పడుచుండు.

వ. . కర్ణభితి, నల్లల నుడుకుచు నుండుదుఁ
గిర్ణిఁడు విడువక మోమునఁవేలు నాకు

భార. కర్ణ. ౩. ౩౩.

మోముచూచు = మోమోటపడు

ద్వి. కెమ్ము మా కని యని దేవుమై నున్న,
సొమ్ములన్నియుమోమూఁజూరక రాలిచి..

ద్వి. హరిశ్చ. పూ. ౧౫.౨౩. పం

మోముముడుచుకొను = కోపగించు.

సీ. మీఁదఁ జల్లక మూన మిట్టిమీసైపడ్డ మంతు
నింతకు మోము ముడుచుకొనిన.

బహు ౨. ౬౧

మోమువిచ్చు = ముఖవికారముచేయు.

చ దళన కోరకముల్ వెలయంగ మోవిమై,
పులరఁగ మోమువిచ్చుచును వద్దముఁ జూచె
నొక ర్తు వేడుకన్ నృసిం ౨. ౦౭౨

జ. మోముట్టు, మోముపట్ట, మోముముట్టు,
మోమోట, మోమోటపడు, మోమోటమి,
మోమోటము, మోమోడు

మోముట్టు = మోముపట్ట. మోముముట్టు.
వి. (మోము + ముట్టు) అశ్వాదులముఖాలం
కారము

సీ. గండురానిగ్గు చౌకాటంపు మోముట్టు తోఁగ
రీకలపతాణి దుమికియాడ

ఉ. హరిశ్చ ౩ ౧౩౧.

(మన్మథాశ్వవర్ణనము )

వ అయ్యెడం గన్నెరుల మోముట్టు మల్లెవిరుల
జాలంబు మంకెన పూసెంకవన్నెలు దాప
నంబుల పక్కరలును

సానందో ౫. ౧౩౬. (౯౧ పా ౨౧ పం)

మోముపట్ట = మోముట్టు. (√ మోము)
అశ్వాదుల ముఖాలంకారము.

చ మోముపట్టనీ, టలరిచి రాజార్మోలకు
హాయం బొకసాహిణి దెచ్చెఁ జెచ్చెరన్.

పె. శకుం ౧. ౧౧౩.

మోముముట్టు = మోముట్టు. వి (మోము+
ముట్టు.)

ఉ. ఛక్కని మోమువట్టు మణిశాలిఖలీనము
మేలుబాళ్ళవా, పక్కెరవేలిముప్పు లిరు
గ్రక్కల చెక్కిడి చేర్చుసింగిణుల్ .

రామా. ౨. ౨౦.

ఉ. బంగరుజల్లులున్ తిళితిబంతితలాటము
ము త్తియంబులున్, రం గుగ మోముముట్టు
నపరంజిఖలీనము పట్టుపల్లమున్, సింగిణి
బిండ్లు తూణములు చిల్కు లకోలలు పట్టి
యంబులున్, సంగతిపార్శ్వభాగములఁ
జక్కఁగఁ బూనిచి పాది నిల్పవన్.

ప్రబంధ. ౧౯౨.

మోమోట=మోమోటమి. మోమోటము

వి. (√ మోమోడు)

౧ దాక్షిణ్యము, కనికరము.

గీ. అకట మోమోట లేక తా రంత చేసి, బ్రతికి
పోయిరె పులి పేదవడినఁ బసుల,వాంఛ్రడె
రొు క్కాడి రసుకత వచ్చె నాకు

ఉ హరి. ౪. ౧౦౨

మ ఇతఁ డాపాపనియట్ల వెంట్రుకలు మో
మింపారుకన్నుల్ జగన్నుతుఁ దబ్జాక్షుని
పోలికై నయురమున్ మూర్ధంబు మోమో
టకుం, బ్రతి రేమే నొక దైవ సంఘటనమైఁ
బ్రాణావ్యపాయంబు లే,క తగం బుత్రుఁడు
వచ్చెనొక్కొ నను మాంగళ్యంబు నొందింపఁ
గన్.

హరి. ఉ ౩. ౨౦౩

మ. జగతీబాలివతంసభామణుము విఖ్యాతముం
గాళికా, నగరంబు స్వైరఁబాసి కీకుమ జగ
న్మాన్యైకచారిత్ర యూ, చిగురుం బోఁడికి
నాకునుం గటకటా చేడ్పాటు వాటిల్ల నీ,
మగురం గూర్చిన మందదైవమునకున్
మోమోట లేదోముమి ధీను. ౩. ౫.

౨. క్రీతి.

సీ. మోమోట వలరు తమ్ముల శాత్రు లగతింపఁ
గమనన్నమను రఘువరేముల వలదు...

వేం. పం. చ. ౪. ౧౨౨.

౩. మనస్సంకోచము.

శా. నీమోమోటలు మాని నీరజముఖి విక్కం
బెటింగింపవే పారి. ౧. ౯౩.

శా. మోమో టేమియు లేక దూరెదరు మీ
మోపంబు చింతింపరు .

భాగ. ౧౦. పూ. ౯౨౬.

మోమోటపడు. అ క్రి. (మోమోటము +
పడు.) మనస్సంకోచమునొందు.

సీ మోమోటపడక తమ్ములదాయ నిరసించి
పలుతెఱంగులఁ గుందముల హసించి

పె శకుం ౧. ౪౩.

ద్వి మురు మోమెఱుఁగక మోమోటపడక,
బ్రొుక్కలీఁ దనుచందమున విడనాడ.

అ మ. క ౨ ౯౨. పా. ౧౪. ప.

మోమోటమి = మోమోట, మోమోటము. వి.
(√ మోమోడు) మనస్సంకోచము.

క. మోమోటమిచే మీతో, సేమియు ననకోపఁ
డీతఁ డిప్పుడు మీ రా,రాముని కానల కను
పుఁడు, నేమంబునఁ బదమికొనిఁ జేయుఁడు
భరతున్. అచ్చ. గా. అయో. ౪౯.

మోమోటము = మోమోటి, మోమోటమి.

వి. (√ మోమోడు) మనస్సంకోచము

క రాముచెదన క ట్టిఁగిన, ప్రేమావేశమున
మనసు బెగడి వివేకం, బేమియుఁ దోఁపక
తగవును, మోమోటము దక్క యులంక
ముద్దియ వలికెన్. భా రా. అర ౨. ౭౨.

శా. అ ముక్కంటి దరస్మితంబున సుపర్వా
ధీశులన్ జూచి వా,తో మోమోటము లేక
తెల్పెద ఉ. రా. ౧. ౩౧౩.

తే. లేమ నీవెత మానుష్య లేమ మోమోటమున
సలిపెదఁగ నిప్పుడే, శే మాయదమాట రామసఁ
గుము, లేమాయను దలఁచి నిల వేదములు
మానుఁ.

నీలా. ౨. ౯౩.

మోమోడు. అ. క్రి. (మోము + ఓడు) ౧. దాక్షిణ్యపడు.

క. ఆడిరి ప్రమోదనృత్తము, పాడిరి మంద్రోక
మహాప్రబంధమ్ముల మో, మోడిరి తైర్థికులకుఁ
గొల్లాడిరి కైవల్యలక్ష్మి సమరులు మును
లున్.

కాశీ ౭. ౩౪.

దండకము ఈ తావకస్తోత్ర మెవ్వారికిన్
బారమా వారికిన్ ఘోరశారాలగ చ్ఛృంఖ
లాబంధముల్ వీడు మోమోడు భూపాలుఁ
డాలంబులో పైరిసంఘంబు లోడున్.

వరాహ. ౧౧. ౧౧౬.

౨. సంకోచించు.

గీ. మొదల సత్ప్రియ మయ్యును దుది గరంబు,
పథ్య మగుపల్కు ప్రియులందు బలిమిపైనఁ,
బలుకవలయు మోమోడక రొలసి యట్టి,
వాఁడు దగునహాయుండు భూ వల్లభునకు.

భార. సభా. ౨. ౧౯౨.

క. అక్కట బలితపుటడవిన్, మొక్కలముగ
గోల సరిచి మోమోడక నీవిక్కడకు రాఁగ
నెదలో, వక్కటికం బేల పాడను
దయ్యోగ్ జెపుమా.

అచ్చ. రా. అర. ౪౯.

శా. సాహంకారత శంకరుం దలిగి నేత్రాగ్నిన్
పయిన్ బంపినన్, స్వాహాకాముకుఁ డాట
ని న్నతఁడు గావంబోలు మోమోడి ..

మనుచ. ౩. ౯౪.

మోయించు. స. క్రి. (√ మోయు) మోవఁ జేయు, వహింపఁజేయు.

గీ. మందరాద్రిని మోయించి మాధవుండు, పట్టి
తెప్పించె నిర్జర ప్రతతిచేత .

హర. ౬. ౯౯.

వ. కొందఱు కుఱుకులాఁపులు తమకులకు
గుబ్బలం బోలకున్న నిర్లు మోయించి రనఁ
జాలు జాలువాగిండ్లు పూని

ఉ. రా. ౫. ౨౪౯.

మోయీను. వి. (హిం మోయిను వి. (గ్రా.) బత్తెము

సీ. మోయీను కగ్రాణమును జెప్పు వద్దగింజలకు
బరాతముల్ సరవి వ్రాయు

హేంబ. ౬౫

మోయు. స క్రి ౧. వహించు.

గీ. తోయజాక్షుండు బాహాచతుష్టయమున,
మాటమాత్రనె మోయఁడే మందరాద్రి.

హర. ౬. ౯౭.

మ. పాల మంబలోన్మేయుచుం బట్టి పెన్మ
నురం దీఁగెడు కాపు గుబ్బెతల .

ఆము. ౯. ౧౩౩.

౨. అంటు, తాఁకు.

గీ మెదడు ముద్దలు గావించి మెసవి మెసవి,
కుతిగ మోయఁగ నెత్తురుల్ గ్రోలి గ్రోలి.

దశా. ౨. ౯౩౫.

గీ తన్నృపతి బలశ్రీ గెలంగ, వరిగి
మునిఁగెఁ దత్కాంతచయంబులోన, మునిఁగి
యాఁగెను దనమేను మోయకుండ, దాని
తిరమైన వాస్తంభ ధర్మపటిమ.

రాఘవ. ౯. ౨౩౬.

జ : మోఁత మోపిక, మోయించు.

మోర. వి. (క. మోరె, త. మురై) ౧. పశ్వాదుల దీర్ఘ ముఖము, ముట్టె.
(పందిముట్టె.)

సీ. తునుమ మించి విడుమోర యుంచి దూటిన
మహోజలధిపూరము దలకొదవు గాఁగ
హరి. పూ. ౪. ౧౭.

చ. బల మిఁక లేమి చెప్పు వినుపందుమెదు క్లవ
లీల మోరత్రోఁపులఁ బడఁ జొప్పు వంచు
కోమహోలిక వంచి తదగ్రధాన్యముల్,
సెలవులఫేన ముట్టిపడ జిట్టలతోఁదనె చప్పు
రించు వృషాలమువరాహపోతములు
భూవర తొండము లేని యేనుగుల్.
మనుచ ౪ ౯౭.

సీ మోర నా ముట్టె నా వెలయును ముఖ
విశేషము లగు ఆం భా ౨. ౧౪౨

(పశుముఖమునకు.)

సీ అరచేత మోరలు చఱచియొం దఱిమి
నీలా ౩. ౪౪

(నకుల శునకముఖములకు)

వ ముంగిస మోరలంబోని మోరలు సంసార
సారెకు నెత్తి. మనుచ. ౪ ౨౭

కి మోరలు పై కెత్తుచు జాగారవములతోఁ
జెలంగ భషకము లపుడు
రసిక ౧ ౧౦౭.

(ఉష్ట్రముఖమునకు.)

ఆ. సరువు లరువు వెడదకోల్లతోఁడుత మోరఁ
రెత్తికొనుచు కేఁకు లెత్తినట్టు, లుబ్బు
లేఁగి యున్న యుష్ట్రమాలును
భా. రా. యు. ౫౧౮.

(భల్లూకముఖమునకు.)

వ. మృగాంక మండలంబు సగము కబళించిన
రాహుగ్రహ భూమికల చందంబున నందంద
తిరుగు బొల్లిమోర భల్లూకంబులును.
పారి. ౨. ౮౭.

(అశ్వముఖమునకు.)

వ. . వివిధవిశిఖ పరంపరలు వరఁగించు
మందటికాల్లు దునిసిన క్రొమ్ముగ్గతిలంబడి
యును మోరలు పఱియలైన సెలవి దప్పం
గూలియు అనేక ఘోటకంబులు రూపు
ఱిన. భార. భీష్మ. ౩. ౨౩౯.

(కొన్నిరెడల ముఖసామాన్యముగ నుపయో
గింపఁ బడినది.)

సీ. దక్షవాటికిఁ జాచి దక్షప్రజాపతిఁ బొగడె
నల్మోర్ల సంభోజభవుఁడు
భీమ. ౩ ౧౩౯.

శ్లో బ్రహ్మా తుష్టావ సంతుష్టశ్చతుర్భి ర్వదనై
రపి సం భీ మ.

సీ. కూడ'త్తునె మాఱుకొని మోర రెత్తిన
గదిమెద బహు ౨ ౬౧.

సీ జోడుల తనువులు ఛేదించి మోరలు గళ్యాల
తోడఁ జెక్కులుగఁ జేసి
భార. కర్ణ. ౧ ౧౪౦.

జ. మోరకొట్టు, మోరతెల్పుమెకము, మోర
తోపు, మోరత్రోపుఁదనము, మోరపక్కియ,
మోరమెకము

మోరకొట్టు. వి (మోర+కొట్టు) చపేటము,
చంపకాయ.

క. కొసరు వగమాట లలుకలఁ, గుసిగుంపులు
తిట్లు మోరకొట్టులు జారుం, దనముఖం
బుగఁ గైకొను, బసవె ద్దగుచుగఁడు మండి
పడుఁ గునుమాంగీ.
( కుక. ౧. ౪౪౧.

మోరట. సం. వి. ఆ. స్త్రీ. మూర్వ, వింటినారికై
యుపయోగించెడి నారచెట్టు, చాఁగ కి.

మోరటము. సం వి అ. పుం. ౧. తియ్యనిరస
ముగలచెట్టు, ౨. క్రొత్తగానీనినయావుపాలు,
ముఱ్ఱుపాలు, జున్నుపాలు. వ. ౧. ఇక్షు

మూలము, చేతులెందలు, ౨. అంతోలము, తొడుగు శ్రీ.

**మోరటి.** వి. క్రియాశీమ. (శ. ర.) శ్రీ.

**మోరటిలు(ల్లు.)** అ. క్రి. మోము విరాది కత్తు.

ద్వి. ఏకోక్కుదంఠ నక్సీటం దో డోకరిం, గానక
బెగడి నల్లడలు చూచుచును, ఐదలంచు
గగ్గోలుపడి మోరటిలుచు

విష్ణు. పు. 3 ఆ (శ. ర)

**మోరడి.** వి. పెచ్చరికపదము. ప్రబంధ ౬౦౫.

**మోరడు=మెరడు.** వి మోడు, మొద్దు, స్థాణువు

(బ మోరడులు, మోరళులు, మోరళ్లు.)

సీ. అమృతంపుసోన పై నడచినట్లీ పాట చెన్నన
మోరళ్ళం జవుళు లె త్తె

నృసిం ౨. ౮౩

**మోర తెల్పు(బ)మెకము.** వి. (మోర+తెల్పు+మెకము) భల్లూకము, ఎలుగు

గీ అంతఁ గొందఱు కోంతిబంట్లా తెలుంగు, రాము
కడ కేగి తెలుప నారాచమిన్న, మోర
తెల్పు మెకపుఱేఁడు మొదలు గన్ని, బల్లి
దుల చేర్చి పోరికిఁ బనుపుటయును.

అచ్చ. రా. యు. ౨౯౮.

(మోర తెల్పు మెకపుఱేఁడు=జాంబవంతుఁడు.)

**మోరతో(త్రో)పు.** వి. (√మోర) అనాలోచనము ; అనాలోచనచేష్ట.

ద్వి. మునియమర్థాన మిమ్ములఁ జేయఁ బోవ,
మునికేల్పులను బట్టి మోరత్రోపునను, మనధి
లోపలఁ బాఱవై చె ననలుఁడు .

రం. రా. యు. ౩౧౧ పా ౨౨ పం.

ఉ. . చూపు నీ వీరతఁ గాందిశీకపదవీరత
కృత్తిని మోరత్రోపునం, బాఱెద నన్నఁ
బోవిడఁడు స్వర్గవిలోచమఁ దంచు
నుగ్రుఁడై దశ. 3. ౨౦౦.

ద్వి. కడుకోపమున విటకంటకి పలికె, వల దన్న
సేటికి వచ్చెద వింక, పొలను పై వఁగ నడ
పోపొమ్ము కొండఁ, దల సెత్తుకొన నీకుఁ
దరమె యిం కేలఁ, దొలఁగరా యీమోర
తోపు లేమిటికి ద్వి పరమ. ౪. ౩౦౯.

**మోరత్రోపుఁదనము.** వి (మోరత్రోపు+తనము స్వార్థమున) అనాలోచనము; అనాలోచనచేష్ట.

గీ. దైవతసైన్యపు నాథునంబు, గురియు శర
వర్ష మెక్కింత సరకుగొనక, మోరత్రోపుఁ
దనంబున మోఱకించి, తాఁకె నెనబోతురా
కాని నాకవిభుని వరాహ, ౧౧ ౬౪.

ద్వి తూలగించక మోరత్రోపుఁ దనంబు,
చాలింపు మనవుడు సచివనందనుని

నవ ౧ ౪౧ పా ౧౦. పం.

**మోరప(క్కె-)క్కి-యు.** వి (మోర+పక్కి-యు3) మత్స్యవిశేషము, ఒక జాతిచేఁప.

గీ మోరపక్కియు దొండును గూరముక్కు,
పుల్లరుజు గెచ్చె గొండెయు బొమ్మడాయ .

హంస. ౪ ౧౭౩.

**మోరపాక=ఓరపాక.** వి. పంచమ దూలములు లేక గోడపైనుండి ప్రక్కకు దింపి రాదులయాధారమునఁ గట్టినశాల. (శ. ర.)

**మోరము.** వి. మోర, ముఖము.

క. నాటకశాలను మోరపుఁ, బాటను మాతంగ్రి
యచలవరుఁ డుంచుట నెఱపోచ్చేటికి నిజ
ముగఁ జనినం, జీ టియ్యఁడు సంబళంబు
చెల్లడిపోటక. పార్వ. ౨. ౧౭౮.

(మోరపుఁబాట=మోటిపాట, కంఠగానము)

**మోరమెకము.** వి. (మోర+మెకము) వానరము.

ఆ. అంతఃప్రాద్యమాలియానతిఁ గడలకు, దఱు
లమోర మెకపుదాటు లేఁగి ...

అచ్చ. రా యు. ౭౧.

**మోరిజా.** వి. (హిం. మోర్జా. మి. (గ్రా.) కుపా
కులు పిరంగులు పెట్టుకొనుచోటు.

చ. బలముల నెచ్చరింపుచుఁ దుపాకులయూఁకలు
దంధమాలు ని,ట్టలముగ మోరిజా ల్బురుజా
డాయఁ గిలార్చుచు రంగా. 3. 88.

**మోరు1.** వి. (త. మోర్, క. మోసరు,
మ మోర్ ) చల్ల, దండాహతము

గీ పాలు ఫలములు సెకనీళ్లు పానకములు,
నారుఁబిం ద్లారుఁగాయలు తైరు కొంతి,
పాంశులవణంబు జంభలఫలరసములు, నించఁ
దగునీరుమో రారగించి లేచి.

ఘటికా. ౨ ౧౬.

ఉ. వడ్డన జాపి రంత చెలువల్ తెలియోగిర
మొల్పుఁబప్పు మెం, డొడ్డినకూరగాయ
ఘృత ముక్కెర చక్కెర లేసె లడ్డువా,
లిడ్డిన నానబాలు చలియించవితైరులు
మోరుమేరుపై, గిడ్డిఁ దలంచితోయనఁగ
గేస్తుల కబ్బె నను స్వభాగ్యముల్.

పాంచా. ౪. ౪౨

సీ. గారెలు బూరెలు చారులు మోరులుఁ గమ్మని
మాంసముల్ ఘుమ్ముమనుచు

ఉ. రా. ౬. ౧౨౨.

జ: మోరుండ.

**మోరు2.** వి. (పర్వత) శిఖరము.

వ ఇవ్విధంబున నమ్మేరునగంబునం దొక్క
మోరు నీ అగుటయు

ఉ. హరి. ౬. ౩౬

గీ. దరులతడివందు బాదవుమూపురములంటు
తెల్లగంటల నాఁకతో అల్లసిల్లె, గిరుల
మోరులసవి దమున్గిన్నసలిల, జలధరచ్ఛేద
ములు వ్రాలఁ కెలఁగుకరణి ...

ఆము. ౪. ౧౫౬.

వ. కనకమన్దామ తేజోధరంబునన్ జడిసిన మేరు
గిరిమోరులంబోలె .

మనుచ. ౫ ౩౧.

గీ. పాలుచు శిఖరపుగొనపేరు మోరు నాఁగ

ఆం భా ౨. ౧౭.

**మోరుండ.** వి (మోరు1 + ఉండ) భక్ష్య
విశేషము.

సీ లడ్డువంబులు చక్కిలాలు మోరుండలు
ఖండంబు చెలిమిడి మండపప్పు

హర. ౬. ౫౫

వ తిమ్మనంబులు పాలకాయలు చక్కి
లంబులు మోరుండలు మనోహరంబులు

ప్రబంధ ౧. ౧౧౨.

హంస. ౧. ౧౦౫.

**మోటుకతై(తియ).** వి (మోటుకము+కత్తె)
మూర్ఖురాలు.

కృష్ణా. 3. (శ. ర.)

**మోటుకము.** వి. (√ మొటుకు సం. మూర్ఖతా)
మూర్ఖత్వము.

సీ. అఖిలలోకేశ్వరం డగురమాధిపులోన విడు
వనివైరంబు దొడరుకట్టి, మేటి రోటికో
మొలచె దైత్యునిబుద్ధి

నృసిం. ౧. ౨౦.

సీ. ఇక్కొమ్మ నడపించుకెడ ఏరిఁ బంపుడు
ననుట మోటుక మగు నని తలంచి ,

దశకు. ౫. ౯౧.

సీ. చంపకం వచ్చినజమునిదూతలను లంచ ము
పెట్టి వచ్చెనో చావ నొల్లఁ, బో మ్మని
మోటుకంబునఁ గ్రోధి వచ్చెనో ...

భోజరా. ౪ ౫౯. పద్య. ౧౦. ౬౩.

విశ. మూర్ఛము.

ఉ. చర్మభావ మొంది స-స్పర్శసుఖముల, కాన జేసి నీవు పనుదినంబు, గజముపేర్కొ-(దగిలి గజము లోఁబడుభంగిఁ, గట్టువడక మోఱ కించు మనస వా. రా ४. ౧౭४.

మోాఱకించే. అ. క్రి (√మోాఱకము) మూర్ఛ మవలంబించు.

గీ దైవతసైన్య ఘనాఘనంబు, గురియుశర వర్ష మెక్కి-ంత పరఘనానక, మోాగ్రోప్రుఁ దనంబున మోాఱకించి, తాఁక నెపపోశు రాకాని నాకవిభుని వరాహ ౧౧ ౭४.

మోాఱకుఁ(డు)=మోాఱకు (సం మూర్ఛ) విశ మూర్ఛఁడు.

ఉ పాఱుగ నమ్మహీపతియుఁ బాయక తోడన పాఱెఁ బాఱ న,క్కా-ఱడవిం గిరాతతతి కాపురముండెడుపల్లె చొచ్చి పె,న్మోాఱకు భంగి మాంసములు ముక్కా-నబంటిగ (మింగు చుండ దై,వాఱెడుభక్తి నర్తిమునిపట్టియ కామదిలోఁ దలంచుచున్. భోజరా ౧ ౧౧౫.

క. అగు దేశకాలబలయుత, ముగఁ జేసినఘోర వర్ధములు మోాఱకు లై, తెగబాఱె తమ్ము నెదిరిని, వగవక తోదరుటలఁ గిఱు వర్లిలుఁ దుదిన్. భార. విరా. ४. ౭౦౭.

శా. మోా మద్దంబు గదల్చి మోాఱకుఁడుమంబో లెన్ శివారాధకుం,డు పార. ౨, ౫౩.

వ అప్పు డమ్మోాఱకుండు పురోహితులం బిలి పించి . నృసిం ४. ౯౦.

ఙ : మోాఱకత్తె, మోాఱకము, మోాఱకించు.

మోాలము=మొలాము. వి. బంగారులోనగు వానిపూఁత. (శ. ర.)

మోాలుగు=మొలుగు. వి. నల్లచాయచెక్క-.

వ. . మోాలుగునడ్డిం గోఁచి మూర కొక్కం డును జాన కొక్కండును గాఁ గట్టినవాల్లు టుల్లారు లుల్లనీల్ల ఆము. ४. ౩౫.

మోాళంగి. వి. ములక్కి. (శ. ర)

మోాళము=మొలాము. వి. బంగారులోనగు వానిపూఁత.

గీ. జమునికాలుకతో నెకసక్కె-మాడఁ, దమక పడుగ్రొత్తపైఁడిమోాళముకటారి. నైష ౬. ౬४.

మోావి¹. వి పెదవి, ఓష్ఠము

క. తమ్మికెంపుగుంపును, ముగుదనిగారిం పుఁదొగరుమోావికి దొరయే నీలా. ౨. ౨౨

లయవిభాతి చిగురుజిగి నెగచుమోావిన్, నగవు నిగుడన్ మనుచ ४ ౧౧౩.

గీ పగఁగఁ బల్కు-ప్పు మోావి వాతెఱ పెదవియు, నాఁగ నోష్ఠంబు ఆం. భా ౨ ౧४౨.

సీ. మెఱఁతమేని మెఱుంగు మెఱయుకాఱు మెఱుంగు చిగురుకెంపులక్రోవి చిన్ని మోావి ... విక్ర. ౧. ౧౧౯.

మోావి². వి. ఒకజాతి యడవిచెట్టు

(ఇది పనస వంటి యాకుల గలిగి యుసిరిక లంత పండ్లు గలిగియుండు. ఇది శ్వేతనీల భేదంబులచే ద్వివిధంబు. నల్లమోావి పండ్ల కంటెఁ దెల్లవివి మిక్కి-లి మధురంబు లయి యుండు. ఈ వృక్షంబులు వేంకటాద్రి లోనగు ప్రదేశంబులఁ గలవు. చి. వి.)

తోటకము. మోావులు రావులు మోాఁదుగు లొద్దుల్, రావులు నిప్పలు రాజ దలిర్పన్. యయా. ౨. ४౭.

సీ. కలగపండులు బ్రల్ల కలగపండులు మోవి
పండ్లు నంకెనపండ్లు బలుసుపండ్లు.

కాశీ. ౩. ౬౯

సీ. ఎలమి పల్వరుసల నీమోవి ఫల మంద
సొరిది నీకును జవి చూపఁగలను.

విప్ర. ౩. ౧౯.

మోవి3. వి. చిన్న మట్టిపాత్రము.

సీ కాంతు దంతక్షతిఁ గాంచని మోవియు
మోవిరే చ ల్లమ్మ మోవి గాక.

అహ. ౩. ౨౮.

మోవి4. వి. అగ్రభాగము

ద్వి నులిగాయ లేదను గానుగుగింజమోవి, నులి
చినపేరు చన్నులమీఁద బెళుక

ఆ మ శ. ౧. ౨౭ పా ౨౦ పం.

మోవు వి ముదుత పీదని లేఁత ఆకు మొలక,
అట్టి కాడిచెట్టు మొలక.

రగడ మెలచు మొవ్వల వంటిమోవులను
మోవులను భామ. ౨. ౬౮.

గీ. విలసితోరుల నవఁటిమోవు లెనయించి, లలిత
పదముల జిగురాకు లలవరించి, యంద
మగుమేనఁ బన్నీటిగంద మలఁది, నలిపి
రింతికి శైత్యోపచారవిధులు.

ఇందు. ౩. ౧౯.

గీ. మోవు, సాఁగఁ దాళాగ్ర తరుణ
పర్ణంబు చెలఁగు ఆం. భా. ౭. ౪౪.

మోషకుఁడు. సంవి. అ. పుం. దొంగ,
చోరుఁడు.

మోషణము. సం. వి. అ. న. ౧. దొంగిలించుట,
అపహరించుట, ౨. నఱకుట, ౩. నశింపఁ
జేయుట.

మోషము. సం. వి. అ. పుం. చౌర్యము, దొంగ
తనము.

మోస = మోసము. (క. మోస) ౧. దొంగ
తనము.

గీ. మోసఁ దర్కించి యవైశ్య ముభ్యుఁ
డేడ్చు. కాశీ. ౫ ౬౮.

౨. ప్రమాదము.

గీ. కాన కెంత రహస్యంపుఁగార్య మైన, నొరు
లెఱుంగరు న న్నని యునికి మోస

భార అను ౨ ౨౧౪.

చ. ముదితల నమ్మి యేమఱుట మోసముమీ యని
బుద్ధి చెప్పుచున్. కాశీ ౯. ౯.

ఆ ఉర్వి నేలునాతఁ డుద్ధరింపఁడు నెయ్యి,
మెసఁగి భ్రాతృజనము నింత దెలియ, నేర
కునికి యధిప నీమోస భ్రాతృపుత్రులకు నేల
మీఁదఁ గలుగుఁ బొందు

మార్క ౮. ౧౪.

౩. అసత్యము.

సీ ఇది భోగమోక్షసంపదలకు మూలంబు
మోస లే దది ఘనంబులకు ఘనము

ప్రబోధ. ౧. ౨౧

౪. అడ్డు.

గీ రాజ పరిపరవర్తులు రాష్ట్రజనము, మున్న
నశియించి చనుటకు మోస లేదు, గాన
సర్వజ్ఞుఁ డనఁగ లోకంబుచేత, వినుతిఁ
బొందినరాజు వివేకి మునుకు.

సా. పంచ. ౧. ౧౩౮.

౫. వంచన.

గీ. మోస గాకుండ నపరాధములకుఁ దగిన,
శాస్త్రి యన్నింటి కిట్టింగి సంభవించె.

సైమ. ౪. ౧౯౨.

జ : మోసకారి, మోసపుచ్చు, మోసపోవు.

మోసకారి. విణ. (మోస + కారి) వంచకుఁడు,
మోసము చేయువాఁడు.

గీ. . . . అప్పుడప్పుడు మోస, కారి మిటి మా
వస్సె కారి మగఁడ, యేల చూపితి విప్పుడ
యీధనంబు, ధనపిశాచము లిది యథార్థమ్ము
సుమ్ము.

శుక 3. ౨౨3.

మోసనాలు. వి. బ. ధాన్యవిశేషము.

వ. కూటికుప్పలు తాటుసంపెఁగలు కందర్ప
భోగులు గజపతిలాగీలు బొందడీలు పునఁగుఁ
దావులు తేనెతోలలు మోసనాలు గుజ్జుపుఁ
దోఁకలు తేటచలములు

ప్రబంధ ౧౧౩.

మోసపుచ్చు. స. క్రి. (√ మోసపోవు)
వంచించు, మోసముచేయు

చ. వికటవర్మని సెంతయు మోసపుచ్చి
దశకు 8 ౧౭౯.

క. అని తపసి తప్పులిందుఁడు, ధన మడుగక
మోతమ్ మడుగఁ దలఁచిన నీలాఁగున మోస
పుచ్చి యేఁగిన, మెనక నియమపరత నాట
విక వల్లభుఁడున్. వరాహ. 8 ౯౪.

గీ. హాటిక మై రామపర్ణశాలాంచితవన, భూముల
బెడంగు దృక్పర్వముగ మెలఁగుచుఁ, బ్రబలు
మార్తాండసంతతిప్రభువు మోస, పుచ్చు
టకు నంచి తా మోద మచ్చుపడఁగ.

రాఘవ 3. ౦౫.

మోసపోవు. అ. క్రి. (మోసము+పోవు) ౧.
భంగపడు, వంచితుఁడగు

గీ. పరవనీతప్రబంధముల్ భంగపఱుపు, మెంగిసి
ప్రాసంబుచేతనే మోసపోవు

రా. వి. ౧ ౧3.

చ. . . ఈ, యఱవకు వాళి యింతయుని యేగా
వని కానక మోసపోయితిన్.

వైజ. ౪. ౯౫.

ఆ. మనము మోసపోయి యనిమిషపతిసూతి,
తోడఁ బొడిచితిమి యదేపవృత్తి, నతఁడు
సమయకాల మంతయుఁ గడచిన, వచ్చెనో
యెఱుంగ వలయు నిజము.

భార. విరా. ౫. 38౨.

క. తనచేసిన పురుషార్థము, తనసొమ్ముగ నెఱిఁగి
నరుఁడు దానపరుం డై, యనఘవి రైు మన
వలదా, దినములచే మోసపో కతిసిరథ క్తిన్.

విక్ర. ౨ ౧౦౫.

గీ. ఏమఱుటఁ జేసి యిటువంటి యెడరు పుట్టె,
మోసపోయితి మెఱిఁగిన మోస గలదె .

నా పంచ. 3 ౯౪.

మోసము = మోస. వి. ౧. వంచన, దగా.

క. మోసంబు గాక ధర్మజుఁ డ ట్లు, ద్రినఁ
బోనిచ్చుట రాధా, తనయుపకున్ బుద్ధియగునె
తప్పెం దప్పెన్. భార. కర్ణ 3. 3.

గీ. కంటిరే వీరవరులార కార్య మంత, మోస
మయ్యెను సురల నమ్మటను సేఁడు.

దశా. ౨. 3౦౧.

౨. ప్రమాదము, పొరపాటు.

ఉ. ముక్కు మెంగంబు చూడ కొక మోసపు
మాటకు విశ్వనాయకుం, డెక్కడికైనఁ
బో మ్మనుచు నెఱ్ఱిచూపులఁ జూచె నల్క
తోన్. భీమ. 3. ౭.

క. విని తద్గ్రంథార్థము నెమ్మనమున నూహించి
తెలసి మ్రాన్పడి కడకుం, దన మోసమునకు
భయపడి, జనపతి యటు చనఁగ నిలిచి
సంతాపమునన్. ఆము. ౨. 82.

సీ. మోస మనఁ బరా కనఁ జనుఁ బ్రమా
దము . . . ఆం. భా. ౧. ౧3౦.

3. అసత్యము.

క. అనుటయు నా రందఱు హంసునితో
ని ట్లనిరి రాజనూయమునకు మ్యాజనకుఁడు

దొరఁగినఁ జాలును, మొదలుముట్టిన వత్తు
మిందు మోసము గలదే.

ఉ. హరి. ౪. ౪౦.

ఉ. నీసరి యైన దేవతటినిం గలఁగించెద నీ పదం
బుమా, నాసరి శేషపన్నగఫణానివహంబు
నటంచు నప్పురిం, బాసలు చేసికొన్న వన
భాసిలు పాలశిఖాలి శేయముస్, మోసమె
యైన విష్ణుపదముస్ బలిపీఠము ముట్ట
నేటికిన్. విజ. ౧. ౫.

౪ తప్పు, అపరాధము.

ఆ కాలఁ జేతఁ జేద గావు నీయట్టివాఁ, దకట
యుండఁదగిన యాలయంబు, మున్ను జేసి
కొనని మోసాన నీపాట్లు, పడగవలసె నిట్లు
నడికి రెయి కేయూర. ౩. ౨౭౭

౫. భంగము, అపాయము

శా. తా నందఱున్, మోహాయత్తులఁ జేసి
వాఁడు మనకున్ మోసంబు వాటిల్లె నీ,దత్త
త్వంబునఁ జక్కఁజేయ వలయున్ దైతేయ
వంశాగ్రణీ భాగ. ౭ ౨౫౧

క కాలంబు నన్నులప వయసుఁ బుచ్చి
మోసము దెచ్చున్ ఆము ౨ ౭౯

ఉ. ఇవ్విభుఁ డివ్విధి నీల్గినట్లుగా,
ము న్నొకనాని దిట్టుటయు మోసము నే
డిటు గల్గె కవిక ౧. ౫౨.

౬. అవమానము.

క నీమాట నమ్మి పోయిన, నామోసముఁ
జెప్ప నేల కాశీ. ౩ ౧౬౩.

౭. అజ్ఞానము.

క. తనయందు లోఁచువిషయము, లనుభవగో
చరము లగుట యది మాయాసం, జనిత
స్వప్నం బై యాత్మనికిం దనఁ గానలేని
మోసము దెచ్చున్

భార. శాం. ౪. ౧౨౩.

**మోస(సా)ల** = మొగసాల. వి. (సం. ముఖ
శాలా) ౧. నగరితల వాకిటిపంచ.

ద్వి. జవకుఁ బాసి నాజవాదుఁ డంచుఁ,
జనుదెంచి యరిగి మోసల డేయ డిగ్గి

రం. రా. ఉ. ౧౨౫ పా. ౨౩ పం.

క. రాముతుఁ దని తోడ్కొనఁ దగి, గావిని
బెట్టి కడియాసఁ గాచుక మన మీ,మోసాల
నున్న నెక్కడ, మోసా లాలో యటంచు
ముంచినభీతిన్.

సారంగ. ౩ ౩౪.

సీ. మోసల ల్గడవి లోముంగిళ్లు గనుఁగొని
గొందులు పరికించి కొల్లగాంచి.

అచ్చ. రా. సుం ౧.

౨ ముంగిలి, ఇంటిముంగిలిసాల.

సీ దుంఠివిఘ్నేశుఁ దుండుప్రదేశ మీక్షించి
లోలార్కు నగరిమోసాల వెదకి

కాశీ ౨. ౪౧.

ఉ ఆతరలాక్షి యెక్కుతెయ యానదురాతిరి
పెక్కుమోసలల్, వే తఱియంగఁ దూఱి
యట వీథికి వెల్వడి సంధ్రక్రంతగా, నాత
నియిల్లు సొచ్చి

వా. రా. ౨. ౧౭౭.

సీ. పోజారము హజార మనునవి రెండును
మోసాల మొగసల మోస లనెడివివి
మూఁడు నంతైదు పెసఁగును ముఖశాలకు. .

ఆం. భా ౨. ౧౪.

౩. తలవాఁకిలి,నూరు.

సీ. పెనుతాఁగరై ప్రోఁగుచును మోసలకు నేఁగు
నలుమొగంబులపేల్పు చెలువ దొరయు ..

నీలా. ౧. ౫౨.

(౧. ౩ అర్థముల కుదాహరణము.)

**మోస్తు.** వి. ౧. పోలిక, అంతరము.

చ. మలయసమీరణాభిహతి బ్రాఁకుల శాఖలు
జల్లి దుల్లి క్రొ,మ్మొలకలు సాఁగి సాఁగి విరి
మోసులు గెందలి రొత్తి యొత్తి...
కు. సం. ౪. ౪౪౩.

సీ. మొలక మొలవ మొక్క మోక మో నీరు
మొటిక నా వంకురం బొప్పుచుండు
ఆం. భా. ౨. ౩౫

శా. ఆనుద్దుల్ విని చేఁ గృపాణిఁ గొని బాహా
యుగ్మ మాఁడించి బల్,మోసంబుల్ వడిఁ
గొల్పి బల్మినగపుల్ మాఁటన్ దృగారుణ్య
ముల్, మోసుల్ బూనఁగ మానసారమహి
పాలుం డాఫ్రులం గాంచి యోహో,హో
మారుం దరుదెంచె నంచుఁ బలికెన్ హుం
కార మేపారఁగన్.
రా. వి. ౯. ౧౨౫

౨. మోవు, మొవ్వు.

చ. మొలక లాకింత గానఁబడి మోసులు
మొల్లసె వెల్లి సోగ లై.
సారంగ. ౩. ౨౫౪.

ద్వి. తునిసిన మొండిచేతులు రెండు నపుడు,
మొలచి యంకురము లై మోసులు సాఁగి
పండితా. పురా ౧౦౩

క. ముదిత కనుబొమల్, ముడిపెట్టె నాలి
సిగ్గున, ముడిపెట్టెన్ నారి చెలఁకుమోసున
మరుఁడున్.
మనుచ. ౫. ౯౪.

౩. అందము.

సీ. నాభి నామంబు నెన్నడుమఁ గస్తురిరేఖ
మోసుగాఁ బ్రాఁటు మోయఁ దీర్చి
వైజ. ౪. ౩౦.

జ: మోసులెత్తు.

**మోసు(సె)లెత్తు.** అ. క్రి. (మోసులు+ఎత్తు)
౧. మొలకలెత్తు, అంకురించు.

మ. బలిచూడాముణు లందు విష్ణుపదబాల్ స్ఫోటిం
చుఘాన్యంబుద్ధి,ష్ఫులు చంద్రామృతసాంద్ర
సేకముచఁ బైపై మోసులెత్తంగ .
వసు. ౧. ౧౦౦.

మ. మొదలం బీజము గల్గి యుండఁగఁ గదా
మోసెత్తి మూలంబుతో, విదితస్కంధము
మించి
వి పు. ౩. ౧౫౨.

చ పొలుపుగ మోసులెత్తుచునుపూపలు తొమ్మన
నిక్క శుక ౨. ౧౫౪.

౨ పుట్టు,కలుగు

గీ. మోహ మెంతయు నెమ్మది మోసులెత్త,
నహహ వల పంత బలవంత మయ్యె
ననుచు చంద్రా. ౪. ౧౪౭.

గీ. ఆమహాదేవి కడుగళ యనుదినంబు, ప్రొక్క
దము ప్రొక్కదము భక్తి మోసులెత్త .
మార్క. ౬. ౧౩౨.

౩. కొంచెముకొంచెముగా పైకివచ్చు.

ఉ. అంకుశభిన్న మై కుపిత మైనమఁ దాఁకి
యురంబు దూర్చి వ్రజాంకునిదంతిదంతము
లుదగ్రగతిం బెకలింపరాక యా,తంకము
నొందఁగా విఱిగి తచ్ఛకలంబులు మోసు
లెత్తఁ గీ,ర్త్యంకురలీలఁ దాల్చె నిఁక నవ్వల
నా కెవ రెవ్వ రెయ్యెడన్.
రాము. ౪. ౧౩౧.

**మోహాణము.** సం. వి. అ. న. కత్తిలోనగు
వానిపిడి

ద్వి. అలుఁగుమోహాణమున హస్తంబు దొడిగి
బస. పు. ౫. ౪౪౪ పం.

**మోహాన.** సం. వి. ఆ. స్త్రీ (సంగీ) ఒకానొక
రాగము. (శ. ర)

**మోహానపుసరులు.** వి. బ. భావ్యవిశేషము

వృక్షము. ౨. ఖదిరవృక్షము. ౩. బ్రహ్మయష్టి, చిఱుతేఁకు ౹. ఆ. స్త్రీ. సోమలత.

**యజ్ఞాంతము.** సం. వి. అ. పుం. ౧. యాగసమాప్తి ౨. యజ్ఞాంతమునఁ జేయఁబడెడి యవభృథస్నానము. ౩. యజ్ఞశేషము.

**యజ్ఞారి.** సం. వి. ఇ. పుం. ౧. యజ్ఞరిపువు, శివుఁడు. ౨. రాక్షసుఁడు.

**యజ్ఞార్హము.** సం. విణ. (అ. ఆ. అ.) యాగయోగ్యమైనది. వి. కృష్ణసారమృగము. (శే. వి.)

**యజ్ఞికము.** సం. వి. అ. పుం. పలాశవృక్షము, మోదుగుచెట్టు.

**యజ్ఞియదేశము.** సం. వి. అ. పుం. యజ్ఞములు గల దేశము, యజ్ఞకర్మ యోగ్యదేశము.

శ్లో. కృష్ణసారస్తు చరతిమృగోయత్ర స్వభావతః సజ్ఞేయో యజ్ఞియోదేశః. (వా. చ.)

**యజ్ఞియము.** సం. విణ. (అ. ఆ. అ) యజ్ఞమునకుఁ దగినదిఁ యజ్ఞమునకు హితమైనది. వి. అ. పుం ౧. ద్వాపరయుగము. ౨. ముంజదర్భ. (వై. వి.)

**యజ్ఞియశాల.** సం. వి. ఆ. స్త్రీ. ౧. యజ్ఞశాల, యాగశాల.

**యజ్ఞియబ్రహ్మపాదపము.** సం. వి. అ. పుం. (స్రువాది యజ్ఞసాధనముల కుపయోగపడు) వికంకతవృక్షము. (రా. వి.)

**యజ్ఞీయము.** సం. విణ. (అ. ఆ. అ) యజ్ఞసంబంధమైనది. వి. అ. పుం. ఉదుంబరవృక్షము, మేడిచెట్టు.

**యజ్ఞేశ్వరుఁడు.** సం. వి. అ. పుం. విష్ణువు.

**యజ్ఞేష్టము.** సం వి. అ. న. దీర్ఘరోహితతృణము, ఒకదినుసుగడ్డి. (రా. వి.)

**యజ్ఞోదుంబరము.** సం. వి. అ. పుం. ఉదుంబరవృక్షము.

**యజ్ఞోపవీతము.** సం. వి. అ న జన్నిదము, యజ్ఞసూత్రము

శ్లో. ఊర్ధ్వంతు త్రివృతంకార్యం తంతుత్రయమథోవృతమ్, త్రివృతం చోపవీతం స్యాత్తస్యైకో గ్రంథిరిష్యతే. (వా. చ.)

**యజ్వువు.** సం. విణ. (ఉ) యజ్ఞముచేయువాఁడు, యజమానుఁడు. వి. ఉ. పుం యజుర్వేదాధ్యయనముచేసిన పురోహితుఁడు, అధ్వర్యుఁడు.

**యజ్వ.** సం. విణ. (న్. రీ. న్.) యజ్ఞము చేయుచున్నవాఁడు. వి న్. పుం. విధిప్రకారము యజ్ఞము చేసినవాఁడు

**యత్.** సం స. చ్. ఎవఁడు; ఎవతె; ఏది. (దీనికిఁ దెనుఁగున వ్యస్తప్రయోగ ముండదు.)

క. మనమున శద్ధి శుభాశ్రయ, మనసు రయింగింపుమటి సమస్తాధారం, బనఁజను యద్వస్తువు యన్మనన మశేషోరుదుఃఖముం దలిఁజెఱుచున్. ఆము. ౩. ౭౨.

**యతనము.** సం. వి. అ. న. ప్రయత్నము.

**యతమానము.** సం. విణ (అ. ఆ. అ.) ప్రయత్నించుచున్నది.

**యతము.** సం విణ. (అ. ఆ. అ.) ౧. అణఁపఁబడినదిఁ అడ్డగింపఁబడినది, బద్ధము. ౨. ఉపరతము. వి. అ. న. ౧. ఏనుఁగు నెక్కినవాఁడు తనకాలితో నేనుఁగును దన్నుట లేక తోలుట. (హలా. వి) ౨. నియమనము. (శే. వి.) ౩. నియతము.

ద్వి॥ అగ్నిని ధరియించి యనయుండుబుఁగొల్చి.
యగ్నిత్వ మది దనయతముగాఁ బడసె.
పండితా. దీక్షా. ౧౯. పా.

**యతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. అడఁపుట, జయించుట; వశపఱుచుకొనుట. ౨. (సంగీ) తాళప్రాణ కలావిశేషము. ౩ విశ్రమము, వళి. ౪. విధవ, విగతభర్తృక స్త్రీ. ౫. రాగము ౬. సంధి. (వా. చ) ౭ వాద్యాంగప్రబంధభేదము (వా. చ) ౮. కారాగృహము. (కేవి) వి. ఇ పుం. ౧. సన్న్యాసి. ౨ విష్ణువు. వి. స. పుం. సన్న్యాసి, పరివ్రాజకుఁడు. ౨. జితేంద్రియుఁడు.

**యతిచాంద్రాయణము.** సం. వి. అ. న. సన్న్యాసులు చేయవలసిన వ్రతభేదము. శ్లో. అష్టావష్టౌ సమశ్నీయాత్ పిండాన్ మధ్యదినే గతే. నియతాత్మా హవిష్యాశీ యతిచాంద్రాయణం చరన్. (వా. చ)

**యతితము.** సం. విణ (అ ఆ. అ.) ప్రయత్నింపఁబడినది.

**యతిని.** సం. వి. ఈ. స్త్రీ. విధవ, వితంతువు.

**యతుక.** సం. వి. ఆ. స్త్రీ. వృక్షవిశేషము (వా. చ.)

**యతూక.** సం. వి. యతుక. (వా. చ.)

**యత్తము.** సం. విణ. (అ. ఆ. అ) యత్నించునది. ౨. నిశ్చయింపఁబడినది.

**యత్నము.** సం. వి. అ. పుం. ౧. ప్రయత్నము, పూనిక. ౨. అభినివేశము, పట్టుదల. ౩. శ్రమము, పాటుపడుట.

**యత్నించు.** సం. అ. క్రి కడఁగు, ఉద్యోగించు. వ. ... ఇంక వివిక్త ప్రదేశంబున నిలిచి నిశ్చలుండనై మోక్షార్థము యత్నించెద. .
మార్కం. ౨. ౩౧.

**యత్రత్యుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఎక్కడనున్నవాఁడు, ఏదేశమున నివసించువాఁడు.

**యథా.** సం. అవ్య. (ఇది తెలుఁగున సమాసపూర్వపదముగనే ప్రయోగింపఁబడును. ౧. ప్రకారము. (ఉదా-యథాపూర్వము. మొ.) ౨. అనతిక్రమణము. (ఉదా-యథాశక్తి. మొ.) ౩. అనుసారము. (ఉదా-యథేచ్ఛ. మొ)

**యథాకామము.** సం. క్రి విణ. ఇచ్ఛానుసారముగా, మనస్తృప్తియగునట్లు.

**యథాకామి.** సం విణ (స. ఈ. స.) స్వేచ్ఛగలవాఁడు, ఇష్టానుసారము తిరుగువాఁడు

**యథాకాలము.** సం. క్రి. విణ. సరియగుకాలమున! అదనున.

**యథాక్రమము.** సం అవ్య. క్రి. విణ. క్రమానుసారముగా, వరుసగా.

**యథాగతుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) తెలివిలేనివాఁడు, అవివేకి, మూర్ఖుఁడు.

**యథాజాతుఁడు.** సం. విణ. (అ ఆ. అ.) అవివేకి, మూర్ఖుఁడు. ౨. నీచుఁడు, నీచజాతివాఁడు, అనాగరికుఁడు.

**యథాతథము.** సం. అవ్య. క్రి, విణ. ౧ సరిగా, హెచ్చుతగ్గులు లేకుండగా. ౨. తగునట్లుగా, ఉచితమైనట్లు. ౩. నిజముగా జరిగినట్లు.

**యథాపురము.** సం అవ్య. క్రి. విణ మునుపటివలె, పూర్వకాలమందువలె.

**యథాపూర్వము.** సం. అవ్య. క్రి విణ మునుపటివలె, ఎప్పటివలె.

**యథాప్రాణము.** సం. అవ్య. క్రి విణ. బలానుసారముగా, శక్త్యనుసారమున, యావచ్ఛక్తిని.

**యథాభాగము.** సం. అవ్య. క్రి. విశే. ఒక్కొక్క విభాగముల ప్రకారము, వాటాల వంతప్రకారముగా. ౨. తగినచోట, అగ్రస్థల మున.

**యథామతి.** సం. అవ్య. క్రి. విశే. బుద్ధ్యను సారముగా, బుద్ధికోలది.

**యథాముఖీనము.** సం. విశే. (అ. ఆ. అ.) అభిముఖముగా నున్నది, ఎదురుగా నున్నది

**యథాయథము.** సం అవ్య. క్రి. విశే. ౧. సరిగా. ౨. క్రమప్రకారముగా, యథాక్రమ ముగా ౩ చెల్లాచెదరు.

క. క్రమానికి బోటియకు సలిల, స్థానమునకుఁ గాకవి వరసజ్జలచరముల్,లో నెఱిపిన భీతిఁ బసిం, దానిఁ గనుంగొని యథాయథముగాఁ బఱచెన్

వెం పంచ ౨ ౧౪౪.

**యథాయథలు.** సం. అవ్య. బ. చెల్లాచెదరు.

క. ఆఁకలియు నీరుపట్టును, దాఁకిన ప్రజ కలము డిగి యథాయథలుగ నే, క్రమంఁకులకుఁ జేరి.

దశమ ౧౦ ౬౫.

చ. దళితులం బినిఁ గన్గొని యథాయథలయ్యె మరాళికేతనా,దులు సమరస్థలిం బడి రదు ర్కొని నీవును నేను బినితోఁ,డఁబడి ఘోర మన్నఁ బనితప్ప నిజంబు

హై. భా. ౪ ౧౮౧.

సీ. కరమొత్తి ఘీంకార భర వృత్తి పదహత్తి యలికి యథాయథలయ్యెఁ గరులు.

రా. వి. ౫. ౧౫.

**యథార్థనాముఁడు.** సం. విశే. న. సార్థకమైన పేరుగలవాఁడు. పేరును సార్థకపఱిచెడి పనులు చేయువాఁడు. శ్లో. పరంతపోనామ యథార్థ నామా, రఘువం. ౬. సర్గ.

**యథార్థము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. సత్య మైనది, సరియైనది. ౨. అన్వర్థమైనది, అర్థ మునకు సరిపడినది; ఉచితము, సార్థకమైనది. అవ్య. క్రి. విశే. ౧. సత్యముగా. ౨. సరిగా, ఉచితరీతిని.

**యథార్థవర్ణుఁడు.** సం. వి అ పుం. చారుఁడు, వేగువాఁడు. (హాలా. వి.)

**యథార్థీకరించు.** సం. స క్రి. సత్యముగాఁ దలంచు

గీ మంత్రులకు నైజములు మృదుమధురఫణితు, లవియథార్థీకరించి వాయసముఁ బెంచి, యేల చెడిపోయెదవు ..

వెం. పంచ. ౩. ౨౮౩.

**యథార్హ్వము.** సం క్రి. విశే గుణానుసారముగా తేక విలువ ననుసరించి.

**యథార్హ్వవర్ణుఁడు.** సం. వి. అ. పుం. చారుఁడు, వేగువాఁడు, దూత.

**యథావిధి.** సం. అవ్య. క్రి. విశే. విధిప్రకార ముగా, శాస్త్రానుసారముగా, తగునట్లు, శాస్త్ర ప్రకారముగా.

**యథాశక్తి.** సం. అవ్య. క్రి. విశే. శక్త్యనుసార ముగా, శక్తికొలఁది.

**యథాశాస్త్రము.** సం. అవ్య. క్రి. విశే. శాస్త్ర మునందుఁ జెప్పఁబడినరీతిగా, ధర్మశాస్త్ర ప్రకా రముగా.

**యథాశ్రుతము.** సం. అవ్య. క్రి. విశే. ౧. వినినట్లుగా, వినిపింపఁబడినట్లుగా, తెలుపఁబడి నట్లుగా. ౨. వేదానుసారముగా, వేదప్రకార ముగా. విశే. అ. ఆ. అ. వినిపింపఁబడినదానిని ననుసరించినది, తెలుపఁబడినదాని ననుసరించినది.

యథాసంఖ్యము. సం. వి. అన. అర్థాలంకార విశేషము. అవ్య. క్రి. విశే. సంఖ్యననుసరించి, సంఖ్యాప్రకారముగా, వరుసగా.

యథాసంభవము. సం. విశే. (అ ఆ అ.) సంభవించినది, సాధ్యమైనది.

యథాసుఖము సం. అవ్య. క్రి. విశే. సుఖముగా, ఆనందముగా, ఆనందమిచ్చునట్లు వి. పుం. చంద్రుఁడు. (వై ని)

యథాసుఖుఁడు. సం. వి. అ. పుం. చంద్రుఁడు.

యథాస్థితము. అవ్య. క్రి విశే. ౧ నిజముగా, సరిగా. ౨ ఉన్నదియున్నట్లు.

యథాస్వము. సం అవ్య క్రి విశే. ౧. ఉచితముగా. ౨. సరిగా, తనమాటప్రకారముగా.

యథేచ్ఛము. సం. అవ్య. క్రి విశే. ౧ కోరిక ప్రకారము, ఇష్టమువచ్చినట్లు ౨. కావలసినంతగా, మనస్తృప్తిగా, తృప్తియగువఱకు.

యథేప్సితము. సం. అవ్య. క్రి. విశే యథేచ్ఛము

యథేష్టము. సం. అవ్య. క్రి విశే. యథేచ్ఛ.

యథోచితము. సం అవ్య. క్రి. విశే. సరియగునట్లు, తగినట్లు.

యథోత్తరము. సం. అవ్య. క్రి. విశే. వరుసగా, ఒకటితర్వాత నొకటిగా.

యదార్థము. సం. అవ్య. క్రి. విశే. ఎందునిమిత్తము, ఎందుకు, దేనికై.

యదా. సం అవ్య. ఎప్పుడు, ఏకాలమున. (తెలుఁగున సమాసపూర్వపదముగనే ప్రయుక్తము) ఉదా. యదాకృతము, యదాగతుఁడు.

యదీయము. సం. విశే. అ. అ. అ. ఎవనిసంబంధమైనది. ఎవరిది, దేనికి సంబంధించినది, దేనిది.

యదువు. సం. వి. ఉ. పుం. ౧. యయాతిదేవయానులకుఁబుత్రుఁడును యాదవుల కాదిపురుషుఁడునగు నొకరాజు. ౨. మథురాపురమునకుఁ బ్రాంతమునునున్న యొక దేశనామము, దశార్హదేశము ౩. యదువంశీయుఁడు. ౪. మనుష్యుఁడు. (కే. ని)

యదృచ్ఛ. సం. వి ఆ స్త్రీ. ౧ ఇచ్ఛాపూర్వన, ఇష్టము వచ్చినట్లుచేయుట. ౨. ఆకస్మికముగా సంభవించుట, ప్రయత్నములేకయే ప్రాప్తించుట.

యదృచ్ఛాభిజ్ఞుఁడు. సం. వి. అ. పుం తనంతట తానే వచ్చినసాక్షి, ప్రయత్నములేకయే వచ్చిన సాక్షి, దబ్బాటుసాక్షి.

యదృచ్ఛాశబ్దము. సం. వి అ. పుం గుణాదులను దెలుపనినామవాచకము, సంజ్ఞా శబ్దము, సంజ్ఞావాచకము. (డి. థ్థ. దపిత్థాదికము.)

యదృచ్ఛికుఁడు. సం. వి అ. పుం. స్వయం దత్తుఁడు, కుమారునిగా స్వీకరింపుమని తనంతట తానే వచ్చినవాఁడు.

యద్భవిష్యుఁడు. సం వి అ. పుం. తన ప్రయత్నము లేకయే కావలసినది యగునని యూరకుండువాఁడు, దైవమునిూద యాధారపడియుండువాఁడు. (వై. ని)

యద్వదుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) అనృతుఁడు, సమాధానము చెప్పనివాఁడు. (వై. ని.)

యదృత్త్వము. సం. వి. అ న. సాహసకార్యము. (విల్సను.)

యభనము. సం. వి. అ. న రతి,సురతము.

యమకము. సం. వి. అ. పుం సంయమము. ౧. (న) శబ్దాలంకారభేదము. ౨. యుగళము, జంట. ౩. కవలలు, యములులు. ౪. నూనెతో

కలిసిన కేంపేరు. (వై. వి.) విణ. (అ. ఆ. అ.) నియమించువాఁడు. (శే. వి.)

యమకింకరుఁడు. సం. వి. అ. పుం. యమదూత.

యమకీటకము. సం. వి. అ. పుం. ౧. అడవి పేను. ౨. వానపాము. ఎఱ్ఱ. (విల్సన్సు) ౩. కమ్మరిపురుగు. (శ. ర.) ౪. జలజంతువిశేషము, ఘుర్ఘురి. (రం. వి.)

యమకీలుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు. (విల్సన్సు).

యమకుఁడు. సం. విణ. (అ. ఆ. అ) కవలపిల్లలలో నొకఁడైనవాఁడు. వి. అ. పుం ౧. కవలలో నొకటి, జంటలో నొకఁడు, వేరుగా నుండువాఁడు.

యమకోటి. సం. వి. ఇ. ఈ. స్త్రీ. లంకకుఁ దూర్పుదిక్కునను పురాణప్రసిద్ధమైన పట్టణము, దేవనిర్మితమైనది.

యమఘంటము. సం. వి. అ. పుం. (జ్యోతి) యోగవిశేషము ..

యమజుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) కవలలుగాఁ బుట్టినవారిలో నొకఁడు.

యమదంష్ట్ర. సం. వి. అ. స్త్రీ. ౧. యముని కోఱ, యముని దంతము. ౨. మృత్యుముఖము. (వి. వ. ఆశ్వయుజమాసమునఁ దుదియెనిమిది దినములును గార్తికమాసమంతయును యమదంష్ట్రాదినములు.) ఇవి రోగ దినములుగా నెంచఁబడినవి. (యమదశనములు. (వా. చ.)

యమదగ్ని. సం. వి. ఇ. పుం. జమదగ్నిముని (వాచ.)

యమదలము. సం. వి. అ. పుం. ఒకానొక వృక్షము, అశ్మయోని. (రం. వి.)

యమదూత. సం. వి. అ. పుం. ౧. మృత్యుదూత, యమభట్టుఁడు. ౨. కాకి. (విల్సన్సు)

యమదూతకుఁడు. సం. వి. అ. పుం. ౧. యమభటుఁడు, యమదూత. ౨. కాకి.

యమదూతిక. సం. వి. అ. స్త్రీ. చింత, తింత్రిణి.

యమదేవత. సం. వి. అ. స్త్రీ. భరణీనక్షత్రము.

యమద్రుమము. సం. వి. అ. పుం. శాల్మలీవృక్షము, బూరుగుచెట్టు. (వాచ.)

యమద్వితీయ. సం. వి. అ. స్త్రీ. కార్తిక శుక్లద్వితీయ, భ్రాతృద్వితీయ, ఆఁడుతోఁబుట్టువులు అన్నదమ్ములకు భోజనముపెట్టఁదగినదినము.

యమధాటి. సం. వి. ఈ. స్త్రీ. ఆయుధవిశేషము, జమదాడి.

యమధారము. సం. వి. అ. పుం. రెండువైపుల వాఁడిగల యొకవిధమగు కత్తి, అట్టియాయుధము.

యమనము. సం. విణ. అ. ఈ. అ. నియమించునది. వి. అ. న. ౧. ఆఁపుట, అణఁచుట. ౨. బంధించుట. ౩. రమించుట. ౪. నియమించుట, ఏర్పఱచుట.

యమనిక. సం. వి. అ. స్త్రీ. = యవనిక, తెర, తిరస్కరిణి.

యమనుఁడు. సం. విణ. అ. ఈ. అ. నియమించువాఁడు. వి. అ. పుం. యముఁడు, మృత్యుదేవత.

యమపాశము. సం. వి. అ. పుం. యముని పాశము, యముఁడు వేయునురి.

యమప్రియము. సం. వి. అ. పుం. వటవృక్షము, మఱ్ఱిచెట్టు.

**యమభగిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧ యమునా నది ౨. పార్వతి. (వై. ని.)

**యమము.** సం. వి. అ. పుం. ౧. అణచుట. ౨. వశము,లో నుంచుకొనుట. ౩. ఇంద్రియజయము, ఇంద్రియముల స్వాధీనతలో నుంచుకొనుట ౪. అహింసావ్రతము ౫ యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధారణసమాధు లను నెనిమిది యోగాంగములలో మొదటిది ౬. శాశ. ౮ రెండుసంఖ్యకుసంకేతము. న. ౧. కవ, జంట.—భరణీ నక్షత్రము ౨. (వ్యాక.) ప్రాతిశాఖ్య ప్రసిద్ధమైన వర్ణవిశేషము ౩. అష్ట విధములగు నశ్వగతులలోనొకటి (శే. ని)

**యమరథము.** సం. వి అ పుం ౧. మహిషము. ౨. యమునిస్యందనము (శే ని)

**యమరాట్టు.** సం వి. ఘ్ పుం యముఁడు, మృత్యుదేవత.

**యమలపత్రము.** సం. వి. అ. పుం కోవిదారము, అశ్మంతక వృక్షము.

**యమలము.** సం. వి. అ. పుం. రెండుసంఖ్యకు సంకేతము, జోడు అ న. జేత. కవ.

**యమలి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. జేత, జోడు, కవ. ౨. రెండు ముక్కలుగల బట్ట.

**యమలుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) కవలలో నొకఁడు. ద్వివ కవలు.

**యమలిక.** సం. వి. ఆ. స్త్రీ చర్మవాద్యవిశేషము, జమలిగ (శ. ర.)

**యమవ్రతము.** సం. వి. అ. న. రాజధర్మవిశేషము (పక్షపాతము లేక పాపులను శాసించుట (రం. వి.)

**యమసూర్యము.** సం. వి. అ. న. పడమట ముఖముగల గది యొకటియు నుత్తరముఖము గల గదియొకటియుఁ గల పెద్దయిల్లు. (విల్సన్సు)

**యమస్వస.** సం. వి. ఋ స్త్రీ. ౧. యమునానది. ౨ దుర్గాదేవి.

**యమి.** స. విశే. (న్. న్. న్) సంయమము కలవాఁడు. వి. న్. పుం. ౧. కామాది వికారములనణఁచినవాఁడు, ముని. ౨. హంస. (ఆమ ర. శ ర) ఈ. స్త్రీ. యమునానది. ద్వి ద్యావాపృథువులు, భూమ్యాకాశములు.

**యమించు.** సం స. క్రి అణఁచు.

ఉ. నిక్కమునట్ల కాన తగునీతి పరుల్ సురలుక్క వంబునన్, మిక్కిలిరైన వారిని యమింపక తక్కదుకే ధనేశ్వరుం డక్కట లెస్సనేసె నడి యాసపెడన్ దిగధీశుఁడొక్కఁడున్, ద్రిక్కక యుండఁ ద్రుళ్లిదఁపఁ ద్రిమ్మరఁబోవలసెం గ్రమం బునన్. నిర్వ. ౪ ౪౨.

**యముఁడు.** సం. విశే (అ. ఆ. అ) ౧. కవలలో నొకఁడు, ఒకమాఱు ఒకగర్భమునఁ బుట్టిన వారిలో నొకఁడు; ఒకటి (మే. ని.) ౨. సహవాసి, సహచరుఁడు. వి. అ. పుం. ౧. మృత్యుదేవుఁడు. అంతకుఁడు. ౨. శని. బ. యములు, అమడలు, కవలు

క. యము లమితశౌర్యులరిన్నృప, యము లమల చరిత్రనిరతు లనఁగా .

భార. అ. ది. ౬. ౯౬.

**యమున.** సం. వి. ఆ. స్త్రీ. ౧. యమునానది, యమసోదరి. ౨. దుర్గాదేవి.

**యమునాభిదుఁడు.** సం. వి. ద్. పుం. బలరాముఁడు.

**యమునాభ్రాత.** సం. వి. ఋ. పుం. యముఁడు, మృత్యుదేవుఁడు.

**యయాతి.** సం. వి. ఇ పుం. నహుషుని కుమారుఁడగు నొకానొక చంద్రవంశపు రాజు, షోడశ మహారాజులలో నొకఁడు.

**యయావరము.** సం వి. అ. పుం. యాయావరము.

**యయావరుఁడు.** సం. వి. అ పుం. యాయావరుఁడు

**యయి.** సం వి ఇ ఈన్ పుం. ౧ అశ్వమేధ యాగమున నుపయోగించెడి గుఱ్ఱము ౨ అశ్వము, గుఱ్ఱము ౩ బాట, దారి ౪ మేషము (వి న్ పుం) ౫ శివుఁడు (విల్యమ్సు) ౬ సూర్యుఁడు ౭ బ్రాహ్మణుఁడు ౮ మోక్షమార్గము (కే ని స్త్రీ) ౧ ఆప్తి, పొందుట. ౨ దివ్యదృష్టి ౩. దీర్ఘదృష్టి (కే. ని)

**యయువు.** సం వి. ఉ. పుం ౧. యాగమున నుపయోగించు గుఱ్ఱము ౨ గుఱ్ఱము. ౩ మోక్షమార్గము ౪ బ్రాహ్మణుఁడు (రం ని.) ౫ ప్రాప్తి (వై ని) స్త్రీ ౧. పొడుగుదండము ౨. పొందుట (వై ని) న వాక్కు (కే ని)

**యవ.** సం. వి. ఆ. స్త్రీ. ౧ రశ్మి, కిరణము. ౨. మనీష, తెలివి

**యవ(ము).** సం. వి అ పుం. ౧. యవధాన్యపు గింజ ౨ అణు ఆవగింజలరొత్తు ౩. అదృష్టమును సూచనచేయు చేతి(వ్రేళ్ళపై నుండెడి యవగింజవంటిరేఖ ఐ వ ధాన్యవిశేషము.

**యవకము.** సం. వి. అ పుం. యవలు అనెడి ధాన్యవిశేషము. ౧. అలసందెలు ౨. కారుమినుములు (శ. ర)

**యవక్యము.** సం వి. అ. న. చిన్నయవలు పండెడి నేల (హలా. ని.)

**యవక్షారము.** సం. వి. అ. పుం సురేకారము, పెట్లుప్పు, యవలవలననగలుఁగు ఉప్పు.

**యవక్షోదము.** సం. వి. అ పుం. యవలపిండి.

**యవమార్ణము.** సం. వి. అ. న యవలపిండి.

**యవజము.** సం. వి అ. పుం. యవక్షారము, సురేకారము

**యవతిక్త.** సం వి ఆ స్త్రీ. శంఖినియను లతావిశేషము (వా చ)

**యవనద్విష్టము.** సం, వి అ పుం గుగ్గిలము, (రాజని)

**యవనప్రియము.** సం. వి అ. న మరిచము, మిరియము (హేమ. ని)

**యవనము.** సం వి అ పుం ౧ పందెపు గుఱ్ఱము లేక వేగముగల గుఱ్ఱము ౨ వేగము, వడి. ౩. గోధూమము ౪ తృణవిశేషము,గఱ్ఱితృణము. ౫. ఒకానొకదేశము విశా. (అ. అ. అ) వేగముకలవాఁడు. (వా చ) న. మిశ్రణము. (కే ని)

**యవనాచార్యుఁడు.** సం వి అ. న. జ్యోతిశ్శాస్త్రమును రచించినపండితుఁడు (వా. చ.)

**యవనాని.** సం. వి ఈ స్త్రీ యవనుల లిపి, యవనభాషాలిపి

**యవనారి.** సం వి ఇ. పుం. కృష్ణుఁడు.

**యవనాలము.** సం. వి అ పుం ధాన్యభేదము.

**యవనాళజము.** సం. వి అ. పుం యవక్షారము.

**యవని.** సం. వి. ఈ. స్త్రీ. ౧ యవన స్త్రీ. ౨. తెర. ౩ ఒకానొక ఓషధి. (వాచ.)

**యవనిక.** సం. వి. ఆ. స్త్రీ తెర, తెరచీర.

యవనుఁడు. సం. వి. అ. పుం. ౧. గ్రీసుదేశస్థుఁడు. ౨. ద్వీపాంతరవాసి, మ్లేచ్ఛుఁడు. (శ. ని) బ. ౧. గ్రీసుదేశపుజనులు. ౨. గ్రీసుదేశపు జ్యోతిశ్శాస్త్రజ్ఞులు.

యవనేష్ట. సం వి. ఆ. స్త్రీ ఖర్జూరి.

యవనేష్టము. సం. వి. అ. పుం. ౧. ఒకదినుసు వెల్లుల్లి ౨. వేపచెట్టు, నింబవృక్షము. అ. న ౧. సీసము. ౨ నీరుల్లి లేక వెల్లుల్లి. 3 మరిచము, మిరియము చె

యవఫలము. సం. వి అ పుం. ౧. వెదురు చె. ౨ జటామాంసి చె 3 కుటజ చె. కొండపిచెట్టు ౪ ప్లక్షు, జువ్వి చె

యవమధ్యము. సం వి అ పుం ౧ వాద్యవిశేషము. (విల్యమ్సు) న ౧ తపోవిశేషము, చాంద్రాయణవ్రతభేదము. ౨ పాదవు, కొలత. (విల్యమ్సు) స్త్రీ. (వైదిక) చందోభేదము. (రం ని)

యవలాసము సం. వి అ పుం. యవక్షారము, సురేకారము.

యవశూకజము. సం వి అ. పుం యవశూకము. (రా. ని)

యవశూకము. సం వి. అ. పుం. యవక్షారము, సురేకారము, పెట్లుప్పు

యవసము. సం. వి. అ. న. కసవు.

మ చూడఁజూడఁ బుడమి స్ఫాటిల్లిపై విప్పులై, యవసంబంచులనాడఁగాసెగసె వాత్యాళిక్రజశ్చక్రముల్. ఆము. ౨. ౪౭.

యవసురము. సం. వి. అ న యవలనుండి తీసిన సారాయి.

యవాగువు. సం. వి. ఊ ౧. గంజి, అన్నపుగంజి, ఇతరధాన్యములనుండి తీసిన గంజి; జావ.

యవాగ్రజము. సం. వి. అ. పుం. ౧. యవక్షారము, సురేకారము, పెట్లుప్పు. ౨. యవాని. (దుష్టయవము)

యవాని. సం. వి. ఈ. స్త్రీ. ౧. దుష్టయవము (వా చ) ౨. ఓమము. వై. ని. విణ. వడిగలది. (శ. ర.)

యవానిక. సం. వి. ఆ స్త్రీ. యవాని.

యవాపత్యము. సం. వి అ న. యవక్షారము, సురేకారము.

యవామ్లజము. సం వి అ పుం. పులిసినయవల గంజి, ఆరనాళి(ము)

యవాషము. సం. వి ఆ. స్త్రీ పంచదారలో నొకభేదము

యవాసకము. సం వి అ పుం ౧. ఒకజాతి ఖదిరవృక్షము. ౨ తీటకసింద చె. ఆ. స్త్రీ. ఒకానొక తృణము, గుండాసిని.

యవాసిని. సం వి. ఈ స్త్రీ యవాసదేశమున నొక మండలము (విల్యమ్సు)

యవాహ్వము. సం. వి. అ. పుం. యవక్షారముఁ

యవిష్ఠుఁడు. సం విణ. (అ. ఆ. అ) చాల చిన్నవాఁడు, కట్టకడపటివాఁడు. వి. అ. పుం. ౧. అనుజుఁడు, అదఱికంటె చిన్నతమ్ముఁడు. ౨ అగ్ని, రోగాగ్ని.

యవీయసి. సం వి ఈ. స్త్రీ. ౧. కొమ్మచెల్లి (రం. ని) ౨. చెల్లెలు, అనుజ.

యవీయసుఁడు. సం. విణ. (వ. సీ. వ.) ౧. మొదటివానికంటె చిన్నవాఁడు. ౨. యువకుఁడు. వి. వ. పుం. ౧. ఒకనికంటె చిన్నవాఁడైన సోదరుఁడు, అనుజుఁడు. ౨. శూద్రుఁడు. (అ. ని)

**యవ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) యవలు చల్లఁదగినది; యవలుపండునది. వి అ. పుం. ౧. మాసము, నెల. న ౧ యవలపొలము

**యశఃపటము.** సం. వి అ. పుం. వాద్యభేదము, ఢక్క,

**యశదము.** సం. వి. అ న. ధాతువిశేషము.

**యశము.** సం. వి స్. న ౧ కీర్తి, ప్రఖ్యాతి. ౨ మహాత్మ్యము ౩. ప్రతాపము ౪ సత్త్వము, బలము. ౫. ధనము ౬ సిరి. ౭ జ్ఞానము ౮ జలము, నీరు. (శే ని)

**యశశ్శేషము.** సం. వి అ పుం చావు, మరణము

**యశశ్శేషుఁడు.** సం విణ (అ ఆ. అ) కీర్తిశేషుఁడు, మృతినొందినవాఁడు

**యశస్కరము.** సం. విణ అ ఈ అ కీర్తిని కలిగించునది, పేరుతెచ్చునది

**యశస్కరి.** సం. వి ఈ స్త్రీ పాలకూర, జీవ ‡ (రం ని)

**యశస్య.** సం వి ఆ. స్త్రీ. ౧. పాలకూర, జీవంతి ‡ ౨. గంధద్రవ్యవిశేషము. బుద్ధి (గం. ని.)

**యశస్యము.** సం. విణ అ. ఆ. అ. ౧. కీర్తికరము ౨. ప్రఖ్యాతిగలది.

**యశస్వి.** సం విణ. (న్ ఈ. న్) కీర్తిగలది, ప్రఖ్యాతిగలది.

**యశస్విని.** సం వి. ఈ. స్త్రీ ౧ అడవిప్రత్తిచెట్టు ౨ మీఁ పేరుతీఁగె, జ్యోతిష్మతి. ‡ ౩. యవతిక్త. ‡ (రాజ. ని.)

**యశస్సు.** సం.=యశము.

**యశోద.** సం. వి అ స్త్రీ. ౧. నందుని భార్యయుఁ గృష్ణుని తల్లియగునామె. ౨. ఒకానొక ప్రేతకర్మలో నుపయోగించు నిష్టకలు. (శే ని.)

**యశోదము.** సం. విణ (అ. ఆ అ) కీర్తిని యిచ్చునది, కీర్తి గలిగించునది వి. అ పుం. పాదరసము

**యష్ట.** సం వి. ఋ పుం. యజ్ఞము చేయువాఁడు,

**యష్టి.** సం వి ఇ ఈ పుం స్త్రీ ౧ దండము, కఱ్ఱ ౨ ఊఁతకఱ్ఱ, భుజదండము ౩ చేతికఱ్ఱ. ౪. జండాకఱ్ఱ, ధ్వజస్తంభము ౫. ఆయుధవిశేషము. ౬. హారము, సరము, పేట ౭. లత, తీఁగ ౮ యష్టిమధుక మొ. అతిమధురము. ౯. వృక్షవిశేషము, భార్గి (వాచ.) ౧౦ తోమరము ౧౧ తరవారి, ఒకానొక యాయుధము. (శే. ని.)

**యష్టిక.** సం వి ఆ స్త్రీ నూఱుపేటలహారము. (శ ర) ౧ కఱ్ఱ, దుడ్డుకఱ్ఱ. ౨ ముత్తెములహారము, ముత్తెములపేట ౩. వాపి, దిగుడుబావి. ౪. యష్టిమధుకము, అతిమధురము ‡

**యష్టికము.** సం వి అ పుం. నీటిపక్షులలో నొకటి, జలపక్షివిశేషము.

**యష్టిప్రాణుఁడు.** సం విణ (అ. ఆ అ) ౧. దుర్బలుఁడు, బలములేనివాఁడు, శక్తిలేనివాఁడు ౨ శ్వాసములేనివాఁడు.

**యష్టిమధుక(ము).** సం. వి ఆ. స్త్రీ. న. అతిమధురము ‡

**యష్టిమధువు.** సం వి. ఉ. న. యష్టిమధుకము ‡.

**యష్టీకము.** సం వి. అ. న. యష్టిమధుకము ‡.

**యష్టీపుష్పము.** సం. వి. అ. పుం. ఒకానొక చెట్టు, పుత్రజీవవృక్షము. (వాచ.)

**యష్టీమధు.** సం. వి. ఉ. పుం. యష్టిమధుకము కీ.

# యా

**యాగము.** సం. వి. అ. పుం ౧. దేవతలకు హవిర్భాగము లిచ్చుట, యజ్ఞము ౨. శైవులు మున్నగువారు చేయు సర్వతోభద్రాది మండలము (శే ని)

**యాచకుఁడు.** సం. విణ (అ క్రి అ) ౧ భిక్షుకుఁడు, బిచ్చగాఁడు ౨. ప్రార్థించువాఁడు, మనవిచేయువాఁడు.

**యాచన.** సం. వి. ఆ స్త్రీ యాచనము

**యాచనకుఁడు** సం. విణ. యాచకుఁడు

**యాచనము.** సం. వి. అ పుం ౧ అడుగుట; ప్రార్థించుట ౨. మనవి, ప్రార్థన, విజ్ఞాపన.

**యాచించు.** సం. స. క్రి అడుగు.

గీ శతమతికి నాస్తికునకుఁ జాపండునకును,
గర్మముగుతించి యాచించు గర్హితునకు, నీ
పరము గోప్యమో పుత్ర యోపురంధ్రి, తప్పి
దారియు నెఱిఁగింపఁదగవుగాదు.

పాండు. ౧. ౨౧౧

**యాచిత.** సం. వి. ఋ. పుం. ౧. యాచకుఁడు. ౨ ప్రార్థించువాఁడు.

**యాచితకము.** సం. వి అ. న ౧ యాచనవలన సంపాదింపఁబడినవస్తువు. ౨. ఎరవుపుచ్చుకొనిన వస్తువు.

**యాచితము.** సం. విణ. అ. ఆ. అ. అడగఁబడినది ౨. యాచించువాఁడు. (వాచ.) వి అ. న. ౧. యాచకవృత్తి, యాచన.

**యాచిష్ణువు.** సం విణ. (ఉ.) యాచనాస్వభావముగలవాఁడు, యాచ్ఞాశీలుఁడు.

**యాచ్ఞ.** సం. వి ఆ స్త్రీ. ౧. కోరుట; అడుగుట ౨. భిక్షావృత్తి, భైక్షజీవనము. 3. అనువర్తనము (శే ని)

**యాజకము.** సం వి. అ. పుం ౧. రాజసంబంధమైన యేనుఁగు ౨ మదపుటేనుఁగు మత్తగజము (రం ని)

**యాజకుఁడు.** సం వి అ పుం ౧. యజ్ఞము చేయువాఁడు ఋత్విక్కు

**యాజనము** సం వి అ న యాగముచేయించుట.

**యాజన్యము.** సం. వి. అ. పుం. యజ్ఞము. (శే ని)

**యాజన్యుఁడు** సం వి. అ. పుం క్షత్రియుఁడు. (శే ని)

**యాజము.** సం వి అ పుం ౧. వండినయన్నము, ఆహారము. ౨ యజ్ఞభూమి (రం ని)

**యాజయితృ.** సం వి ఋ. పుం. యాగము చేయించెడి ఋత్విక్కు.

**యాజి.** సం. వి. ఇ. స్త్రీ. యాగము, క్రతువు. విణ. (న్ నీ న్.) (సమాసాంతమున) యాగము చేయుచున్నవాఁడు (సోమయాజి)

గీ. హృదయవేదికయందు సమిద్ధమూర్తి, వెలుఁ
గుచుండు తేజమునందు ప్రేల్చుఁబ్రాణము
లను యాజియ ట్లంతరమున నొనర్చు, యాగ
మున వీతకల్మషుఁడై వెలుంగు.

భార శాం. ౫. ౧౪౯.

**యాజుఁడు.** సం. వి. అ పుం. యజ్వ, యజ్ఞము చేసినవాఁడు. (విల్సను)

యాజుషము. సం. విణ. (అ. ఈ. అ.) యజుర్వేద సంబంధమైనది.

యాజుషుఁడు. సం. వి. అ. పుం. యజుర్వేద ప్రకారము కర్మములం జేయువాఁడు.

యాజ్ఞవల్క్యుఁడు. సం. వి అ. పుం ఒకానొక ముని. (యాజ్ఞవల్క్యస్మృతి) ధర్మశాస్త్ర కర్త, శుక్లయజుర్వేద ప్రవర్తకుఁడు

యాజ్ఞసేని. సం వి. ఈ. స్త్రీ. యజ్ఞసేనుని కూఁతురు, ద్రౌపది

యాజ్ఞికము సం విణ (అ ఈ అ) యజ్ఞ సంబంధమైనది వి. అ పుం. (కుశ) తృణ విశేషము ౨ యజ్ఞోపయోగివృక్షము. అశ్వత్థము, ఖదిరము, పలాశము.

యాజ్ఞికుఁడు. సం. వి. అ పుం ౧ యజ్ఞము చేయువాఁడు, యజ్వ, యజమానుఁడు ౨. యాజకుఁడు, ఋత్విక్కు. విణ. (అ. ఆ. అ) యజ్ఞవిద్య చదువువాఁడు; తెలిసినవాఁడు. (కే. వి)

యాజ్యము. సం. వి అ. న. ౧. యాగదక్షిణ. ౨. యాగలబ్ధధనము. (రం. వి.) ౩. యజ్ఞమున కుపయోగించు స్థలము. మొ. (వాచ)

యాజ్యుఁడు. సం. విణ. (అ. అ అ.) ౧. యజ్ఞ సంబంధమైనవాఁడు. యజ్ఞమునఁ బ్రధానముగా నుద్దేశింపఁబడినవాఁడు ౨ శాస్త్రప్రకారము యజ్ఞము చేయుట కర్హుఁడు. వి అ. పు ౧. యజ్వ, యాగము చేయువాఁడు ౨. ఇతరునికై యజ్ఞము చేయువాఁడు

యాత. సం. వి. ఋ. స్త్రీ. ౧. తోడికోడలు, మగనిసోదరునిభార్య. వి. ఋ. పుం. ౧. పథికుఁడు, బాటసారి, వెళ్లువాఁడు. ౨. అత్త, భార్య తల్లి. ౩. మేనమామభార్య. (రం. వి.)

యాతన(ము). సం. వి. అ. స్త్రీ. ౧. తీవ్రవేదన, బాధ. ౨. నరకదుఃఖము.

యాతము. సం విణ. (అ. ఆ. అ) కడచినది, గతించినది, గతము. వి అ. న. ౧ అంకుశముతో నేనుఁగును దోలుట, నడిపించుట. ౨. గత కాలము, కడచినదినములు.

యాతయామము. సం. విణ (అ. ఆ. అ) ౧. పాసినది, రుచిచెడినది. ౨ ఉచ్ఛిష్టమైనది; తిని మిగిలినది ౩ జీర్ణించినది; వయసుమరలినది.

యాతవ్యుఁడు. సం వి. అ. పుం. శత్రువు, యుద్ధార్థము వెళ్లఁదగినవాఁడు. వి. ణ. (అ. ఆ. అ) గంతవ్యుఁడు (వాచ)

యాతుఘ్నము. సం వి అ. పుం గుగ్గులు. (రాక్షసులఁ బోఁగొట్టునది)

యాతుధానుఁడు. సం వి. అ పుం. ౧. రాక్షసుఁడు ౨ నికృతి (శ. ర.)

యాతువు. సం. వి ఉ. పుం ౧. బాటసారి, పాంథుఁడు ౨ వాయువు, గాలి. ౩. సమయము, వేళ ౪ యముఁడు. (శ ర.) వి ఉ. న ౧. పిశాచము, రాక్షసుఁడు వి. వెళ్లువాఁడు ౫ పాపము (కే.వి.)

యాతృకుఁడు. సం. వి. అ. పుం. బాటసారి, మార్గస్థుఁడు.

యాత్ర. సం. వి. అ స్త్రీ. ౧. ప్రయాణము వెళ్లుట, గమనము. ౨. సేన వెడలుట, దాడి వెడలుట. ౩. తీర్థమునకుఁబోవుట ౪. మహోత్సవము. ౫. ఉత్సవదినము. ౬. జాతర. ౭. జీవిక, జీవనసాధనము. ౮. (కాలము) కడపుట. ౯. త్రోవ. ౧౨ ఉపాయము. ౧౩. సాధనము.

యాత్రసంచి. మి. వి. (యాత్ర+సంచి) అనిమి సంచి; ఒకవిధమగు చిన్న గోనె. (బ్రా. వి.)

యాత్రికము. సం. విణ. (అ. ఈ. అ.) యాత్రకు సంబంధించినది. (సత్రము, సాధనము. మొ.)

యాత్రికుఁడు. సం. వి. అ. పుం. ౧. బాటసారి, మార్గస్థుడు. ౨. తీర్థవాసి, తీర్థయాత్రచేయువాఁడు.

యాథాకథాచము. సం విణ. అ ఆ అ. ౧ ఏసందర్భమునసైనఁ దటస్థించినది, ఏసందర్భమునసైన వచ్చినది ౨. అప్పుడపుడు సంభవించినది, తాత్కాలిక మైనది

యాథాకామి. సం వి న్ పుం. తనయభిప్రాయప్రకారము పనిచేయువాఁడు, తనయిష్టము వచ్చినట్లు పనిచేయువాఁడు

యాథాకామ్యము. సం. వి. అ న తనయిష్టము వచ్చినట్లు పనిచేయుట, తన యభిప్రాయప్రకారము పనిచేయుట

యాథాతథ్యము. సం వి అన ౧. సత్యత్వము, యాథార్థ్యము, సరళత, తిన్నఁదనము

యాథార్థ్యము. సం. వి అ. న. ౧. సత్యత, వాస్తవికత్వము. ౨. న్యాయము ! ఆర్జవము.

యాదఃపతి. సం వి ఇ పుం ౧ సముద్రుఁడు; సముద్రము ౨ వరుణుఁడు (నీటికిఁ బ్రభువు)

యాదము. క్రి విణ. గాఢముగా.

సీ అమృతాబ్ధి సొచ్చి యాదము నిద్రవోయిన పీతాంబరుఁడు బిట్టు బెదరి లేవ.

కు. సం. ౧౧ ౫౭౩

యాదతము. సం. వి అ న ౧. యాదవులకు సంబంధించినది. ౨. గోమహిషాదికధనము, పశుధనము.

యాదవి. సం. వి. ఈ. స్త్రీ. దుర్గాదేవి.

యాదవుఁడు. సం. వి. అ. పుం. యదువంశమునఁ బుట్టినవాఁడు; యదువంశపురాజు. ౨. శ్రీకృష్ణుఁడు.

యాదస్సు. సం. వి. స్. న. క్రూరమైన జలజంతువు; నీటిజంతువు.

యాదృక్షము. సం. విణ. (అ. ఈ. అ.) దేనివంటిది ఏవిధమైనది

యాదృచ్ఛికము. సం విణ. (అ ఈ. అ) ౧. తనంతటఁ దానే తటస్థించినది, ప్రయత్నము లేకయే వచ్చినది ౨ ఆకస్మికమైనది. అనుకొనకయే సంభవించినది

యాదృశము. సం విణ (అ. శ్. ఈ. అ) యాదృక్షము.

యాదోనాథుఁడు. సం వి. అ పుం. ౧. సముద్రుఁడు. ౨ వరుణుఁడు.

యానకము. సం. వి అ న వాహనము, బండి. మొ

యానపాత్రము. సం వి అ. న. నౌకాభేదము, ౙోగు. జనులెక్కి పోయెడి యోడ.

యానము. సం వి అ. న. ౧. గమనము; ప్రయాణము. ౨. శత్రువులమీఁదికి వెళ్లుట, దాడివెడలుట (రాజ్యతంత్రమునందలి యాఱుగుణములలో నొకటి. 3. వాహనము. (బండి. రథము. పల్లకి. అశ్వము. గజము. మొ.) ఇది పంచవిధము ౧. సంధానయానము. ౨ ప్రసంగయానము. 3 విగృహ్యాయానము ౪ సంభూయయానము ౫. ఉపేత్యయానము.

క. కరితురగరథపదాతులు, ధరణీదేవునకు గంగదరి నిచ్చినభూధవుఁడు రవిబింబ శశిభా స్వరయానము లెక్కి తిరుగు సురలోకమునన్. జామ్నా వి. ౧. ౫. ౩.

**యానముఖము.** సం. వి. అ. న. బండియొక్క ముందుభాగము. కాడి కట్టెడిచెపు. చోటు.

**యాపకము.** సం. విశే. (అ. అ అ.) యాపనము చేయునది.

**యాపన.** సం. వి ఆ స్త్రీ. యాపనము.

**యాపనము.** సం. వి. అ. న. ౧. వెళ్లునట్లు చేయుట, పంపుట. ౨ వెడలఁగొట్టుట బయటికిఁ ద్రోసివేయుట. 3. కాలక్షేపము చేయుట కాలము గడుపుట.

**యాప్త.** సం వి ఆ. స్త్రీ శిఖ, జట.

**యాప్తకములు.** సం వి అ పుం. ద్వి వ పునర్వసూ నక్షత్రములు. (వై. ని)

**యాప్యము.** సం. విశే (అ. ఆ అ) ౧. త్రోసి వేయఁదగినది, నిరాకరింపఁదగినది ౨. నీచమైనది అధమ మైనది 3 నింద్యమైనది ౪ వ్యాధి విశేషము.

**యాప్యయానము.** సం. వి. అ. న. పల్లకి, సవారి.

**యాభము.** సం. వి. అ. పుం. మైథునము. సురతము.

**యామకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) వెళ్లు వాఁడు, పోవువాఁడు. వి. అ. పుం. పథికుఁడు, బాటసారి. (శే. ని)

**యామఘోషము.** సం. వి. అ. పుం. ౧. కోడి పుంజు. ✓ ఆ. స్త్రీ. (ప్రతిజామునకు గంటలు కొట్టెడు) ఘటికాయంత్రభేదము. ఒకానొక యంత్రము.

**యామనాలి.** సం. వి. ఈ స్త్రీ. యామఘోషము

**యామము.** సం. వి. అ. పుం. జాము. అహో రాత్రకాలములో నెనిమిదవ భాగము. మూఁడు గంటలకాలము. ౨. యమము, యోగవిశేషము. 3. సంయమము, నిగ్రహము. ౪. సామభేదము. (శే. ని)

**యామలము.** సం. వి. అ. న. ౧. జత. యుగళము. కవ. ౨. తంత్రశాస్త్రభేదము.

**యామవతి.** సం. వి. ఈ. స్త్రీ. త్రియామ. రాత్రి.

**యామాత.** సం. వి. = జామాత.

**యామి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. స్వస. ఆఁడు తోఁబుట్టువు. ౨. రాత్రి. రేయి. 3. కోడలు, స్నుష. (ఆ. ని) ౪. పూజ్య స్త్రీ, కుల స్త్రీ. యముని భార్యలలో నొకతె. (వా. చ) ౫. దక్షిణదిక్కు. ౬. యమయాతన. ౭. భరణీ నక్షత్రము.

**యామిక.** సం. వి. అ. స్త్రీ. ౧. రాత్రి. ౨. పసుపు. (ఆ. ని)

**యామికుఁడు.** సం. వి. అ. పుం. కావలివాఁడు, ఆరక్షకుఁడు. రాత్రి కావలికాచువాఁడు.

**యామిత్రము.** సం. వి. = జామిత్రము.

**యామిని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. రాత్రి. ౨. పసుపు.

**యామినీపతి.** సం. వి. ఇ. పుం. ౧. చంద్రుఁడు. ౨. కర్పూరము.

**యామీర.** సం. వి. అ. స్త్రీ. రాత్రి.

**యామీరుఁడు.** సం. వి. అ. పుం. చంద్రుఁడు.

**యామునము.** సం. విశే. (అ. ఈ. అ.) యమునానదీసంబంధమైనది. వి. అ. న. నీలాంజనము, ఒకవిధమైనకాటుక.

**యామునాచార్యుఁడు.** వి. వైష్ణవాగ్రేసరుఁడు, ఆళువందారు, విశిష్టాద్వైతమతోద్ధారకుఁడు.

గీ. యామునాచార్యుఁడొక్కఁడు నీమహాత్మ్యుఁ
డొక్కఁడునుగాఁడ మస్మత్కులుద్ధరించిరి.
ఆము. ౪. ౩౮.

**యామునేష్టకము.** సం. వి. అ. న. సీసము.

**యామేయుఁడు.** సం. వి. అ. పుం. భాగి
నేయుఁడు; మేనల్లుఁడు.

**యామ్య.** సం. వి. ఆ. స్త్రీ. ౧. దక్షిణదిక్కు.
రాత్రి.

**యామ్యము.** సం. విశే. (అ. ఆ. అ) ౧. దక్షిణ
దిక్కున నున్నది. ౨. యమునిసంబంధమైనది.
వి. అ. పుం. ౧ చందనము. ౨ ఏనుఁగు.
(రం ని) న. భరణీనక్షత్రము.

**యామ్యాయనము.** సం వి. అ. న. దక్షిణా
యనము.

**యామ్యుఁడు.** సం. వి. అ. పుం. ౧. యమ
భటుఁడు. ౨. అగస్త్యుఁడు.

**యామ్యోద్భూతము.** సం. వి. పుం. ఒకానొక
వృక్షము; శ్రీతాళము. ?

**యాయజూకుఁడు.** సం. వి. అ. పుం. పలుమాఱు
యజ్ఞములుచేయు స్వభావము కలవాఁడు, ఇజ్యా
శీలుఁడు. పలుమాఱు యజ్ఞములు చేయువాఁడు.

ద్వి. వయనముగా వీచె గ్రొన్నవతావిగాలి, యలయుచు
యాయజూకాగ్నిహోత్రములు. వలగొను
శిఖలఁ బావకుఁ డొప్పమిగిలె.
ద్వి. పరమ. ౩. ౧౪౮. పాం. ౧౩. పం.

**యాయావరము.** సం. వి. అ. పుం. ౧. అశ్వ
మేధయాగమునిమిత్తమై యున్నఁబడిపగుఱ్ఱము.
౨. రాజశేఖరుఁ డను నాలంకారికుఁడు
పుట్టిన వంశముపేరు. వి. అ. న. అయవారము,
ఇంటింటికిఁ దిరుగుచు ధాన్యమునుగాని విద్య
మునుగాని యాచించుట.

**యాయావరుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.)
తిరుగుచు తిరుగువాఁడు, భ్రిమ్మరియైనవాఁడు.
స్థిరనివాసములేనివాఁడు. వి. అ. పుం. ౧. తిరి
గెడి భిక్షుకుఁడు. ముని. ౨. జరత్కారుఁడను
పేరుగల ముని.

**యాయి.** సం. విశే. (న. నీ. న) వెళ్లుచున్న
వాఁడు, గామి.

**యావకము.** సం. వి. అ. పుం. న. ౧. యవా
న్నము. యవాహారము. ౨. లత్తుక. ఎఱ్ఱరంగు.
౩. సగము పండినయవలు (వై. ని.) ఈ. కాఱు
మినుములు.

**యావచ్ఛక్తి.** సం. అవ్య. క్రి. విశే. శక్తి
కొలఁది. సాధ్యమైనంతలో.

**యావజ్జీవము.** సం. అవ్య. క్రి. విశే. బ్రతికి
యున్నంతవఱకు, ప్రాణమున్నంతకాలము.

**యావత్.** సం. విశే. (త్. తీ. త్.) (ఇది తెనుఁ
గున సమాసపూర్వపదముగనే ప్రయుక్తము.)
సాకల్యమున. ఉదా. యావజ్జీవము. పరిమితి.
యావచ్ఛక్తి. సాకల్యము. యావద్ధనము.

**యావన.** సం. వి. ఆ. స్త్రీ. నింద. (శే. ని.)

**యావనము.** సం. విశే. (అ. ఈ. అ.) యవన
సంబంధమైనది. వి. అ. పుం. ధూపద్రవ్యము;
చిల్లమడ్డి.

**యావనాలము.** సం. వి. అ. పుం. సస్యవిశే
షము; జొన్న.

**యావనాలి.** సం. వి. ఈ. స్త్రీ. యావనాలముల
నుండి తీసిన శర్కర.

**యావనాళశరము.** సం. వి. అ. పుం.
శరభేదము.

**యావన్మాత్రము.** సం. విశే. (అ. ఆ. అ.)
ఎంతపరిమాణముగలది; ఎంతదూరముగలది.

యావనము. సం. విశే. (అ. ఆ. అ.) యవలసంబంధమైనది. యవలతోఁ జేసినది. వి. అ. పుం. ౧. యవాన్నము. ౨. లక్కు. ఎఱ్ఱరంగు ౩. లక్క. ౪. మాసము. (శ. ని.) ౫. మావము

యావశూకము. సం. వి. అ. పుం. యవక్షారము; సురేకారము. పెట్లుప్పు. (వై. ని.)

యావసము. సం. వి. అ. పుం. ౧. గడ్డిమోటి. ౨. గోగ్రాసము, మేఁత. ౩. మిత్రుఁడు. (శ. ని)

యాష్టీకుఁడు. సం. విశే. (అ. ఈ. అ) దుడ్డుకఱ్ఱతో యుద్ధము చేయువాఁడు కఱ్ఱ యాయుధముగాఁ గలవాఁడు. వి. అ. పుం. దుడ్డుకఱ్ఱ యాయుధముగాఁ గల యోధుఁడు.

యాస. సం. వి. ఆ. స్త్రీ. మదనశలాకపక్షి. (రం. ని.) .

యాసము. సం. వి. అ. పుం. ప్రయత్నము పూనిక (ఆ. వి) తీఁటకసింద. యవసము ?

యాస్కుఁడు. సం. వి. అ. పుం. నిరుక్తము రచించిన యొకగ్రంథకర్త.

# యి

యియక్షువు. సం. విశే. (ఉ) యాజింప నిచ్ఛగలవాఁడు. యాగముచేయఁగోరువాఁడు.

యియాసువు. సం. విశే. (ఉ) పోవనిచ్ఛగలవాఁడు; వెళ్లఁగోరువాఁడు.

# యు

యుంజానుఁడు. సం. వి. అ. పుం. సారథి, బండి తోలువాఁడు. ౨. బ్రహ్మముతో నైక్యము సంపాదింప యోగాభ్యాసము చేయుచున్న బ్రాహ్మణుఁడు. ౩. బ్రాహ్మణుఁడు.

యుక్త. సం. వి. ఆ. స్త్రీ. వృషనికేశము. ఏలకి ?

యుక్తము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. కూడుకొనినది, కలిసికొనినది. ౨. న్యాయమైనది. ౩. ఉచితమైనది, యోగ్యమైనది. ౪. శక్తి కలిగియుండినది. వి. అ. న. భార.

యుక్తరథము. సం. వి. అ. పుం. ఒకదినుసు రసాయనము. (విల్సన్సు)

యుక్తరస. సం. వి. ఆ స్త్రీ. రాస్న, సన్నరాష్ట్రము. ?

యుక్తరూపము. సం. విశే. (అ. ఆ. అ) తగినది, యోగ్యమైనది

యుక్తాయాసము. సం. వి. ప్ర. న. కాష్ఠకుద్దాలము. కఱ్ఱగుద్దలి. (రం. ని.)

యుక్తి. సం. వి. ఇ. స్త్రీ. ౧. కూడిక, కలయిక, ౨. ఉపాయము. సాధనము. ౩ పన్నుగడ. యోజన. ౪. న్యాయము. సకారణముగా విషయములను తెలుపుట. ౫. ఊహ. అనుమతి. ౬. కారణము. హేతువు. ౭. వ్యవహారము. ౮. అర్థాలంకారము. ఉద్దేశమును సూచించుట. ఉద్దేశమును మఱుఁగుగాఁ జెప్పుట. ౯. నాటకాంగ విశేషము. ౧౦. విధము. (ఈయర్థమాంధ్రగ్రంథములందే కానవచ్చుచున్నది.)

శివసా. ౧౫౪. సంఘటన, యోగము.

క. చూడఁగ శివభక్తునిఁ గని, వేడుక గాని యాడఁడేని వృథయాతని మిథ్యాడంబర దేవార్చన, యాడుమఁబోసిన జలంబు యుక్తిమహేశా! శివసా. ౧౫౪ సంఘటన, యోగము.

క. కురుముఖ్యాంధ్ర కృతరాష్ట్ర్ర ✓ వి,దురభీష్మాదిగురులం జూడ ద్రుపదప్రభుఁడున్, గురుఁడు మురాంతకుఁడు జగ,ద్గురుఁ డిందఱుమతముననునగున్ యుధయుక్తుల్. భార. ఆది. ౭౭౧.

యుక్తికరుఁడు. సం. విశే (అ. ఈ. అ.) ౧.తగినవాఁడు. అర్హుఁడు (యుక్తి చేయువాఁడు. వ్యు.

అర్థము) ౨. రజాపుచేయఁబడినవాఁడు, నిరూపింపఁ బడినవాఁడు.

**యుక్తుఁడు.** సం. వి. అ. పుం. పరబ్రహ్మముతో నైక్యముచెందిన యోగి. (బ్రహ్మైక్యానుసంధానముగల సన్న్యాసి. విశే. (అ. ఆ. అ.) నియుక్తుఁడు, అధికారిగా నియోగింపఁబడినవాఁడు అధికృతుఁడు.

ఈ. ధర్మసుతుండు పెంచె నపుఁ డాన తురంగమ
 కాప్తరక్షకుం, గర్మఠుఁ జేసి యాత్మతురగంబులకెల్లను నన్నయుక్తుఁగా నర్మిలి,
 నిల్పి — భార. విరా. ౧. ౨౬౪.

**యుగంధరము.** సం. వి అ. పుం. న ౧.బండిలో నగువానినొగ, కూబరము. కాఁడికట్టెడి కఱ్ఱ ౨. పర్వతభేదము. (వా. చ.) ౩. సాళ్వదేశములోని యొకరాష్ట్రము. (వై. ని)

**యుగకీలకము.** సం. వి. అ. పుం. కాఁడిసీల, (బండిసీల)

**యుగపత్.** అవ్య. (దీనికిఁ దెనుగున వ్యస్తప్రయోగము లేదు.) ఒకమాఱుగా, ఒకపర్యాయముగా

**యుగపత్రికము.** సం, వి. అ. పుం. యుగపత్రము.

**యుగపత్రము.** సం. వి. అ. పుం. కోవిదార వృక్షము, తుమికిచెట్టు ఎఱ్ఱకాంచనము.

**యుగపార్శ్వగము.** సం. వి. అ. పుం. మరపటముఁ గాఁడి కిరుపెడియెద్దుల దాపునఁ గట్టెడి యెద్దు.

**యుగము.** సం. వి. అ. పుం. ౧. బండి,నాఁగలి మున్నగువాని కాఁడి. (న) ౨. జత. జత. ౩. యుగ్మము, ఏకాన్వయముగల రెండుశ్లోకములు. ౪. ప్రపంచకాలవిశేషము. (కృతత్రేతాద్వాపరకలియను యుగములు నాలుగు) అనేక సంవత్సరములకాలము. దీర్ఘకాలము. ౫. నాలుగు సంఖ్యాసంకేతపదములు. ౬. నాలుగు మూరల పరిమితిగల కొలత.

భార. ౪. ఒకానొకయోషధి,బుద్ధి.

**యుగలకము.** సం. వి. =యుగలము.

**యుగలము.** సం. వి. అ. న. ౧. జత. కవ. ద్వయి. ౨ ఏకాన్వయముగల శ్లోకద్వయము.

**యుగలాత్మకము.** సం. వి, =యుగలాఖ్యము.

**యుగలాఖ్యము.** సం వి. అ. పుం. వర్వరము, బరూర్వరము.

**యుగళి.** సం. వి ఈ స్త్రీ=యుగలము.

**యుగవర్తకుఁడు.** .సం. వి. అ. పుం కని.(వై.ని)

**యుగాంతము.** సం. వి. అ. పుం. యుగము యొక్క అంతము. ప్రళయకాలము; మహాప్రళయము. ౩. మధ్యాహ్నము.

**యుగాంశకము.** సం వి. అ. పుం. సంవత్సరము. ఏఁడు. ఏడాది

**యుగి.** సం. వి. న్. పుం. సాంగవేదవేత్త (వై.ని)

**యుగ్నకము.** సం. వి. అ. న. యుగ్మము.

**యుగ్మపత్రము.** సం. వి. అ. పుం. కోవిదార వృక్షము. ఎఱ్ఱకాంచనము.

**యుగ్మపత్రిక.** సం. వి. అ. స్త్రీ. శింశుపాల వృక్షము.

**యుగ్మము.** సం. విశే. (అ. ఆ. అ.) సరిసంఖ్యగలది. వి. అ. న. జత. యుగలము. ౨. కూడిక, కలయిక. ౩. కవలు. ౪. ఏకవాక్యముగా నుండెడి రెండుపద్యములు. ౫. మిథునలగ్నము. ౬. తిథివిశేషయోగము. (వాచ.)

**యుగ్యము.** సం. విశే. (అ. ఆ. అ.) కాఁడికట్టఁదగినది. గుఱ్ఱము. ఎద్దు. వా. వి. అ. పుం. ౧.

కాఁడికట్టఁబడిన ఎద్దు. ౫. రథాశ్వము. రథమునకుఁ గట్టెడి గుఱ్ఱము. అ. న. ౧. వాహనము. బండి. ౫. ౨. శివునివిల్లు, శివధనుస్సు. (వై. ని.)

**యుజము.** సం. విశే. (జ్.) ౧. సహాయకము. ౨. సరిసంఖ్య గలది. (శే. ని.)

**యుజినుఁడు.** సం. వి. అ. పుం. వాయువు, గాలి (వై. ని.)

**యుజుఁడు.** సం. వి. జ్. పుం. సమాధిలోనున్నవాఁడు.

**యుతకము.** సం. వి. అ. న. ౧. జత, కవ, ౨. మైత్రి, చెలిమి. ౩. అరణము పెండ్లికాలమున వధూవరుల కిచ్చినసొమ్ము (పెండ్లిబహుమతి) ౪. స్త్రీ ధరించెడి యొకరకము వస్త్రాదికము. ౫. స్త్రీ వసనాంచలము అనుదాని పైటకొంగు ౬. స్నేహమేర్పఱుచుకొనుట, ౭. ఆశ్రయము. సశరణము. దిక్కు. ౮. శూర్పాగ్రము చేటయంచు ౯. పాదాగ్రము. కాలిముందుభాగము. ౧౦. సంశయము.

**యుతము.** సం. విశే. (అ. అ. అ.) ౧. కలిసినది. మిళితమైనది. ౨. కలిగియున్నది. కూడినది. ౩. విభేదీయఁబడినది. వేఱుపడ్డది. ౪. కొక్కెకలియఁగూడినది. వి. అ. న. ౧. పోరు. సమరము ౨. గ్రహయుద్ధము.

**యుద్ధరంగుఁడు.** సం. వి. అ. పుం. కార్తికేయుఁడు, కుమారస్వామి. (రం. ని.)

**యుద్ధసారము.** సం. వి. అ. పుం. గుఱ్ఱము. (రం. ని.)

**యుద్ధము.** సం. వి. ధ. స్త్రీ. యుద్ధము, కయ్యము, పోరు.

**యుధానుఁడు.** సం. వి. అ. పుం. ౧. యోధుఁడు క్షత్రియుఁడు. ౨. శత్రువు. వైరి.

**యుధిష్ఠిరుఁడు.** సం. వి. అ. పుం. ౧. యుద్ధమున స్థిరుఁడు (జంకనివాఁడు) పాండవజ్యేష్ఠుఁడు, ధర్మరాజు. ౨. ఇంద్రుఁడు. (వై. ని.)

**యుధుఁడు.** సం. వి. ధ్. పుం. యోధుఁడు. వీరుఁడు.

**యుధ్మము.** సం. వి. అ. పుం. ౧. యుద్ధము. ౨. బాణము, అమ్ము. ౩ ధనస్సు, విల్లు. (విల్యమ్సు)

**యుధ్ముఁడు.** సం. వి. అ. పుం. యోధుఁడు. (విల్యమ్సు)

**యుయుత్స.** సం. వి. ఆ. స్త్రీ యుద్ధము చేయవలయు ననెడి యిచ్ఛ, కయ్యమునందలి కోరిక.

**యుయుత్సువు.** సం. విశే. ఉ. యుద్ధముచేయవలయునని కోరుచున్నవాఁడు పోరనిచ్ఛగలవాఁడు. వి. ఉ. పుం. పోట్లాడువాఁడు. కలహశీలుఁడు. జగడమాడెడివాఁడు.

**యుయుధానుఁడు.** సం. వి. అ. పుం. ౧. ఇంద్రుఁడు. ౨. క్షత్రియుఁడు, యోధుఁడు. ౩. సాత్యకి.

**యుయువు.** సం. వి. ఉ. పుం. అశ్వము, గుఱ్ఱము

**యువ.** సం. విశే. (న్. త్. న్.) ౧. ప్రాయపువాఁడు, పడుచుఁదనముగలవాఁడు. (పదియాఱేండ్లు మొదలు ముప్పదియేండ్లవఱకుఁగల వయస్సుగలవాఁడు.) ౨. బలవంతుఁడు, ఆరోగ్యవంతుఁడు. ౩. శ్రేష్ఠుఁడు. మంచివాఁడు. వి. న్. పుం. ౧. పడుచువాఁడు. తరుణుఁడు. ౨. (వ్యాక) పెద్దవాఁడు. బ్రతికియుండఁగనప్పుడు ఆవంశమునఁబుట్టినవారిలోఁజిన్నవాఁడు. ౩. అఱువది సంవత్సరములలోనొకటి. ధాత, తరువాతిది.

**యువఖలతి.** సం. విశే. (ఇ. ఈ. ఇ.) యౌవనమునందు బట్టతలగలవాఁడు. బట్టతలగలది.

**యువగండము.** సం. వి. అ. పుం. పాలిత్యపు బొటిమె. పడుచువాండ్రకు గండస్థలమున బయలు దేఱుపొక్కు.

**యువతి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. ౧. పడుచుం దనముగల స్త్రీ. తరుణవయస్కురాలు. (పదియాఱేండ్లు మొదలు ముప్పదియేండ్లవఱకుంగల వయస్సుగల స్త్రీ. ౨. కన్యారాశి. ౩ పసుపు

**యువతీష్ట.** సం. వి ఆ. స్త్రీ. స్వర్ణయూథిక (వాచ) ?

**యువరాజు.** సం. వి. అ. పుం. చిన్నరాజు. పట్టమహిషికిఁ బ్రథమపుత్రుఁడై పట్టాభిషేకమున కర్హతగల రాజపుత్రుఁడు.

**యుష్మద్.** (సమాసాదియందుఁ బూర్వపదముగా నుండి మీరు అనునర్థమిచ్చెడి) మధ్యమ పురుష సర్వనామము ఉదా యుష్మదాగమనము. యుష్మత్కారుణ్యము మొ.

**యుష్మదీయము.** సం. విశే. (అ. ఆ. అ.) మీసంబంధమైనది. భవదీయము

**యుష్మాదృశుఁడు.** సం. విశే. (అ. ఆ. అ) మీవంటివాఁడు, భవాదృశుఁడు.

## యూ

**యూక.** సం. వి. ఆ. స్త్రీ. పేను.

**యూకము.** సం. వి. అ. పుం. పేను.

**యూతి.** సం. వి. ఇ. స్త్రీ. మిశ్రముచేయుట. కలుపుట. ఏకమగుట.

**యూథనాథము** సం. వి. అ. పుం. తెగకు ముఖ్యమైన యేనుఁగు. పరికాఁడు. గజరాజము.

**యూథపము.** సం. వి. అ. పుం. యూథనాథము

**యూథము.** సం. వి. అ. న. మంద. సజాతీయ పశుపక్షిసమూహము. (గొఱ్ఱెలమంద. పక్షుల గుంపు.)

**యూథి.** సం. వి. ఈ. స్త్రీ. యూథిక. ?

**యూథిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఒకజాతిమల్లె. అడవిమొల్ల. ? ౨. పెద్దగోరఁట. ? (శ. ర.)

**యూపకటకము.** సం. వి. అ. పుం. యూపస్తంభముపై నుంచెడి గుండ్రనికఱ్ఱబిళ్ల.

**యూపకర్ణము.** సం. వి. అ. పుం. (యూపమునకుఁ జెవివంటిచోటు) నేతితోఁ దడుపఁబడెడి యూప స్తంభ భాగము.

**యూపద్రుమము.** సం. వి. అ పుం. ఖదిర వృక్షము; చండ్రచెట్టు

**యూపద్రువు.** సం. వి.. ఉ=యూపద్రుమము.

**యూపము.** సం. వి. పుం ౧. యజ్ఞపశువును గట్టుటకై పాతినకొయ్య ౨. జయ స్తంభము. జయమునుసూచించు స్తంభము. ౩. గంగరావి చెట్టు

**యూవు.** సం. వి. ఊ. పుం. యూషము. (వై.ని)

**యూష.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఛాయ. ౨. హింస. (కే. ని.)

**యూషము.** సం. వి. అ. పుం. ౧. హింస. (శ ని.) ౨. బ్రహ్మదారు వృక్షము. (వాచ) పుం. న. ఏదైన పదార్థముతోని కాచిన చేరు ద్రవము; పప్పుకట్టు.

**యొక్క.** అప. షష్ఠీవిభక్తి ప్రత్యయము. (ఇదిసమాసవిగ్రహవాక్యములయందే కానవచ్చుచుండును.) ౧. సంబంధార్థకము. ఉదా.-వాని పుస్తకము=వాని యొక్క పుస్తకము. ౨. కర్త్రర్థకము.

సీ. కోరిఫలార్థులై వారలయొక్కన ప్రాఁకుల మొదకులు వీఁకఁబట్టి. భార. ఆది.౫.౧౬౫.
(వారలయొక్కన ప్రాఁకులు-వారలయొక్కయొక్కన ప్రాఁకులు-అనఁగా వార లొక్కన ప్రాఁకు లని భావము.)

క. నీవగచిన యీయర్థము. భార. ఆది, ౫.౧౩౧
క. అనిలజాపుటివదివసము, నవ యేట
దుర్యోధనుండు. భార. ఆది. ౫. ౧౦౫.

యోక్త. సం. విణ. (ఋ. త్రి. యు:) యోజన చేయువాఁడు; యోగకర్త.

యోక్త్రము. సం. వి అ. న. ౧. త్రాడు. పలుపు. పగ్గము. ౨. అంగుళి. (శే. ని)

యోగక్షేమము. సం. వి. అ. న. సంపద సంపాదించుటయును సంపదను పదిలపఱుచుటయును.

యోగజము. సం. వి. అ. న. అగరుచందనము. పుం (న్యాయ) అలౌకికసన్నికర్షవిశేషము. విణ. (అ ఆ. అ.) యోగమువలన జన్మించినది.

యోగదానము. సం. వి. అ న. మోసముగల దానము.

యోగనిద్ర. సం. వి. ఆ. స్త్రీ. ౧. యుగాంతమున శ్రీవిష్ణుని నిద్ర. ౨ దుర్గాదేవి.

యోగపట్టము. సం వి. అ. న. యోగి ధ్యాన సమయమున వీఁపుమీఁదనుండి మోఁకాళ్లమీఁదికిఁ జుట్టపెట్టుకొనెడిబట్ట; అవసక్థికము. యజ్ఞోపవీతమువలె యోగి ధరించఁదగిన వస్త్ర భేదము.

యోగపట్టె. మి. వి. (యోగము+పట్టె) యోగులు జందెమువలె వేసికొనెడి పట్టులో నగువానితోఁ జేసిన పట్టె.

సీ. పంచవన్నెలయోగపట్టె పొందుగనైచి
ప్రొద్దునిద్దపుమేనఁ బూఁదిఁబూసి.
సారంగ. ౩. ౧౭౧.

యోగపదకము. సం. వి. అ. న యోగపట్టము

యోగపీఠము. సం. వి. అ. న. దేవతలయొక్క ఆసనము.

యోగమాయ. సం. వి. ఆ. స్త్రీ. ౧. ప్రపంచసృష్టినిమిత్తమగు భగవంతుని శక్తి. ౨. దుర్గాదేవి.

యోగము. సం. వి, అ. పుం. ౧. కలయిక, కూటమి; యుక్తి, కూర్పుట. ౨. ఉపాయము. ౩. కవచము ౪. ధ్యానము; చిత్తవృత్తి నిరోధము. ౫. ఇంద్రియ నిగ్రహము. ౬. విశ్వాసము సంధానము; జీవాత్మను పరమాత్మయం దైక్యము చేయుట. ౭. అపూర్వవస్తులాభము. ౮. దేహస్థైర్యము. ౯. శబ్దప్రయోగము. ౧౦ క్షేమము, ఔషధము. ౧౧. ఒకానొకశాస్త్రము. (రాజ హఠయోగము. ౧౨. ద్రవ్యము; ధనము. ౧౩. కార్మణము; చిల్లంగి. ౧౪. సముదాయార్థమున కనుకూలమైన వ్యుత్పత్తికలుగుట; అవయవశక్తి. ౧౫. అన్యథారూపప్రతిపాదనము. ౧౬ జ్యోతి. ౧౭. సంయోగ విశేషము; సంబంధవిశేషము. (సిద్ధయోగము; అమృతయోగము) ౧౮ ఛలము; మోసము. ౧౯. (వ్యాక) సూత్రము. ౨౦. (జ్యోతి) గ్రహకూటమి. (రాజయోగము, నాభస యోగము.) ౨౧. వేగము. (శే. ని.)

యోగరంగము. సం. వి. అ. పుం. నారంగము; నారింజ. ‡

యోగరత్నము. సం. వి. అ. న. ఐంద్రజాలిక మణి.

యోగరూఢము. సం. విణ. (అ. ఆ. అ.) అవయవశక్తి-సముదాయశక్తి-చేతనుగూడ నొక పదార్థమును దెలుపుపదము. పంకజము-ఆతపత్రము నెం.

యోగవాగ(ము)లు. మి. ఛి, బ. (యోగము+వాగ(ము)లు) అంతరిక్షమార్గమునఁ బోయెడి యోగసిద్ధులు పెట్టెడు పావకోళ్లు.

ద్వి. యోగవాగలు పెట్టి సద్యస్తుండగుఁడు
బాగలు గిరులపైఁ బడిలేయుచుఁడు.
పండితా. పర్వ ౩౯౪. పా.

వి. .పైకప్పుకొనుగోరు పదముప్రజ.

గీ. కవచముగఁ జేసి యోగవాగములుఫాల,నయన
మును మతిస్ఫుర్యవేదియు నొసంగి.
చెన్న. ౩౨౩

చ. పదముల యోగవాగలును పాణితలంబున
వాగబెత్తమున్, నుదుట విభూతిరేఖయు
మనోజ్ఞకటీతటిఁ గావిచీర అహ ౩. ౫.

ద్వి. ఘనమైన యోగవాగంబులఁ దొడిగి, తన
రంగఁ జికిలిబెత్తముచేతఁబట్టి.
ద్వి. శ. సా. ౨. ౯౨౦ పం. (బ్రౌ. పా.)

యోగవాహము. సం. వి. అ. పుం. (వ్యాక) విసర్జనీయజిహ్వామూలీయోపధ్మానీయానుస్వారీక్య ములధ్వని.

యోగవాహి. సం. వి. న. పుం, ౧. క్షారము. ౨. పాదరసము.

యోగసారము. సం. వి. అ. పుం. అన్నిజబ్బులను గుదిర్చెడిమందు. సర్వరోగహరమగు చింతామణి.

యోగాచారుఁడు. సం. వి. అ. పుం. విజ్ఞానమునకు నిత్యత్వమును బోధించు బౌద్ధమతావలంబి.

యోగాధమనము. సం. వి. అ. న. పెనుసముగల శాకట్టు, వంచనగలకుదువ.

యోగారూఢుఁడు. సం. విశే. అ. అ. అ. నిశ్చలముగ సమాధియందున్నవాఁడు.

యోగాసనము. సం. వి. అ. న. నిశ్చలధ్యానము చేయుటకుఁదగిన యాసనము. (స్వస్తికాసనము మొ.)

యోగి. సం. విశే. (న. సి. న.) ౧. అన్వితుఁడైనవాఁడు. కలిసియున్నవాఁడు. ౨. యోగమభ్యసించువాఁడు, యోగాభ్యాసము కలవాఁడు. వి. న. పుం. ౧. ధ్యాననిష్ఠుఁడు; సన్యాసి. మంత్రశాస్త్రజ్ఞుఁడు; మాంత్రికుఁడు. ౩. యోగమతానుసారి, యోగమతావలంబి. ౪. సంకరజాతివిశేషము. ౫. సారంగము; వారిజశ్రీ. యావకూకము, ఒకానొకయుప్పు. (శ వి.)

యోగించు. సం. స. క్రి. కూర్చు.

గీ. కుష్కములు దల్పలేకున్నచోట సార్ద్రి,
కంబు వినుమడి యోగింపఁగలుగుగుణము.
శేషజకల్పము. ౨౧. పా.

యోగిని. సం వి. ఈ. స్త్రీ. ౧. మాంత్రికురాలు, మంత్రకత్తె. ౨. భక్తురాలు, సన్యాసిని. ౩. శివపరిచారికల లేక దుర్గా పరిచారికలజాతి. ౪. దుర్గ.

యోగీశ్వరి. సం. వి ఈ. స్త్రీ. ౧. మంత్రకత్తెలలో ముఖ్యురాలు; మాంత్రికశ్రేష్ఠురాలు. ౨. దుర్గ.

యోగీశ్వరుఁడు. సం. వి. అ. పుం. ౧. యాజ్ఞవల్క్య మహర్షి. ౨. యోగిశ్రేష్ఠుఁడు.

యోగుఁడు. సం. వి. అ. పుం. ౧. విశ్వాసఘాతుకుఁడు. ౨. చారుఁడు. ౩. నైయాయికుఁడు.

యోగేశ్వరి. సం. వి. ఆ. స్త్రీ. ౧. దుర్గ. ౨. వంధ్యాకర్కటి. *

యోగేశ్వరుఁడు. సం. వి. అ. పుం. శ్రీకృష్ణుఁడు.

యోగేష్టము. సం. వి. అ. న. సీసకము.

యోగ్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. అభ్యాసము. ౨. శాస్త్రాభ్యాసము. (మహాయోగ్యా ధను

శోగ్య; అత్రియోగ్య. కెం. ౩. సూర్యుని భార్య. ౪. గుణనము; హెచ్చువేయుట. ౫. ఎఱ్ఱగన్నేరు, రక్తపువర్ణము. ౬ ౭. భరణీ నక్షత్రము. (శే. ని.)

**యోగ్యత.** సం. వి. ఆ. స్త్రీ. (న్యాయ) అర్థశక్తి, ఒకపదార్థమునకు మఱియొకపదార్థము కలిపినపుడు బాధలేకపోవుట. "అగ్నినాసించతి" అనుచోట యోగ్యత లేదు.

**యోగ్యము** సం. విణ. (అ ఆ అ) అర్హమైనది; తగినది, ఇంద్రియగ్రాహ్యము, ఇంద్రియములచేఁ దెలిసికొనఁదగినది. వి అ పుం. ౧ పుష్యనక్షత్రము. న ౧ యానము, వాహనము, బండి. ౨. చందనము, పరిమళద్రవ్యవిశేషము. ౩. రొట్టె; అపూపము ౪. పాలు ౫ యంత్రము న. స్త్రీ బుద్ధి ౨. ఒకానొక గంధద్రవ్యము, భరణీనక్షత్రము (శే ని)

**యోగ్యుఁడు.** సం. విణ. (అ ఆ. అ) ౧. తగినవాఁడు. అర్హుఁడు. ౨. సుగుణములుకలవాఁడు. ౩ ఒకపనికిఁ దగినవాఁడు. ౪. యోగమునకుం దగినవాఁడు ౫. నిపుణుఁడు, ఉపాయముగలవాఁడు.

**యోచించు.** సం. అ. క్రి. ఆలోచించు (శ. ర.)

మ. అనివార్యుండు శేషుఁడాహవము సేయం
బూను వాక్యంబులన్, విని యోచించి వినోద
ముల్గమట కావేరిన్ రమేశుండువారిని
వారింపక ..

హం. మా. ౪. ౫౧.

ఇట్లు ప్రయోగమున్నదిగాని యోచశబ్దము సంస్కృతమున కానరాదు.

**యోజకుఁడు.** సం. విణ. అ. ఆ. అ. యోజనము చేయువాఁడు.

**యోజన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సంధానము, కలుపుట. ౨. వ్యాకరణానుసారమైన యన్వయము. ౩. నిర్మించుట, కట్టుట, కూర్చుట. ౪. స్థితి.

క. రాజాయేమని చెప్పుదు, నాజగతీసురుని మొదటి
యణఁకువకును ధా, త్రీజనులు లోయనప్పటి,
యోజన కాశ్చర్యమయ్యె నొకపర్వతమై.

నిరం. ౨. ౧౪. ౨.

ఆలోచన.

గీ. అట్టినన్ను నుజేరిభయంబులేని, పాలుపుత్తెనన్న
దీపువుఁ బోణి చెంత, ననుచు గవుకునఁ బట్టరా
దరయువలయు, యోజనయొనర్చి సేయుట రాజ
నీతి శుక. ౨. ౨౪౯.

**యోజనము.** సం వి అ. న ౧. కలుపుట, సంధానముచేయుట. ౨ అన్వయించుట, వాక్యార్థమునన్వయించుట. ౩. నాలుగుక్రోసులదూరము; ఆమడ ౪. సంయోగము ౫. పరమాత్మ, పుం. మొదిగొంటువక్క

**యోజనగంధ.** సం. వి. ఆ స్త్రీ. ౧. కస్తూరి. ౨. వ్యాసుని తల్లియగు సత్యవతి. ౩. సీత.

**యోజనగంధిక.** సం. వి. = యోజనగంధ.

**యోజనపర్ణి.** సం వి ఈ. స్త్రీ. మంజిడి; మంజిష్ఠ. ౬

**యోజనవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. యోజనపర్ణి.

**యోజనీయము.** సం. విణ. అ. ఆ. అ. యోజనము చేయఁదగినది.

**యోజయిత.** సం. విణ. (ఋ. ఈ. ఋ.) యోజకుఁడు.

**యోజించు.** సం. స. క్రి. ఆలోచించు.

క. యోజింపుమనుచుఁ జెప్పిన, హాజారమునను
వచ్చియమ్మంత్రివరుం, డేజాడఁ బ్రతుకు కొంత

ర్పెద, రాజాన కని తలఁచుచుపరంబునకుఁ దగక.

రామా. ౨. ౪౪.

అ. క్రి. కూర్చు; యోజనసేయు.

కా ..మారుండు జంతువులకుం బ్రాణాంతకాలంబునం, దోంకారాత్మకమంత్రరాజము చెవిన్ యోజించు నెల్లప్పుడున్.

కాశీ. 3. ౯౫.

యోటకము. సం. వి. అ. పుం నక్షత్రమేలనము, నక్షత్రముల కూడిక.

యోత్రము. సం. వి. అ. న. యోక్త్రము.

యోధనము. సం. వి. అ. న. ౧. యుద్ధము, పోరు. ౨. ఆయుధము.

యోధనుఁడు. సం. వి. అ. పుం. యోధుఁడు, వీరుఁడు, యోద్ధ.

యోధము. సం. వి. అ. పుం. యుద్ధము, కయ్యము.

యోధి. సం. వి. ఇ. పుం. యోధుఁడు, పోటరి, యుద్ధభటుఁడు, సిపాయి, జగడమాడువాఁడు.

యోధుఁడు. సం. వి. అ. పుం. (యుద్ధము చేయువాఁడు) వీరుఁడు, పోటరి, యుద్ధభటుఁడు, సిపాయి.

యోద్ధ. సం. వి. ఋ. పుం. యోధుఁడు, యుద్ధభటుఁడు.

యోని. సం. వి. ఇ. ఈ. పుం. స్త్రీ. ౧. స్త్రీగుహ్యము, ఆఁడుగుఱి. ౨. జన్మస్థానము, ఉత్పత్తిస్థానము. 3. ఆకరము, గని. ౪. గృహము, ఉనికిపట్టు. ౫. కారణము. ౬. పూర్వఫల్గుని నక్షత్రము. ౭. జలము; నీరు. ౮. తామ్రము.



యోనిజము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. యోనినుండి జన్మించినది, జరాయుజము. ౨. అండజము. (వా. చ.)

యోనిముద్ర. సం. వి. ఆ. స్త్రీ. ౧. (తంత్ర) దేవపూజాంగమైన ముద్రావిశేషము, అంగుళసన్నివేశవిశేషము. ౨. రతిబంధవిశేషము, మూలబంధము.

యోనిరంజనము. సం. వి. అ. న. ఋతుస్రావము. ముట్టగుట.

యోనిసంకరము. సం. వి. అ. పుం. అశాస్త్రీయమైన పరస్పరజాతి వివాహములచేత వర్ణసంకర మగుట.

యోనిసంబంధము. సం. వి అ. పుం. వివాహసంబంధము, స్త్రీపురుష సంబంధము.

యోష. సం. వి. ఆ. స్త్రీ. స్త్రీ, ఆఁడుది.

యోషణా. సం. వి. ఆ. స్త్రీ. కన్యక, చిన్నపిల్ల.

యోషిత. సం. వి. ఆ. స్త్రీ. యోష.

యోషిత్తు. సం. వి. త్. స్త్రీ. యోష.

యోషిత్ప్రియ. సం. వి. ఆ. స్త్రీ. పసుపు.

## యౌ

యౌకము. సం. వి. అ. పుం. శ్వాసనిరోధక రోగము, ఊపిరికుట్టు.

యౌక్తికము. సం. విశే. (అ. ఈ. అ.) ౧. యోగ్యము, తగినది. ౨. యుక్తియుక్తమైనది.

యౌక్తికుఁడు. సం. వి. అ. పుం. రాజాయొక్క నర్మసచివుఁడు.

యౌగపద్యము. సం. వి. అ. న. ఏకకాలమందు సంభవించుట.

**యౌగికము.** సం. విణ. అ. ఈ. అ. యోగ మునకు తగినది. ౨. వ్యుత్పత్తిగలది; వ్యుత్పత్త్యర్థముగలది.

**యౌగికరూఢము.** సం. విణ. అ. ఆ. అ. రూఢ్యర్థమందే కాక యౌగికార్థమందుకూడ ప్రయోగముకలది.

**యౌగుఁడు.** సం. వి. అ. పుం. యోగమతా వలంబి, యోగమతము ననుసరించువాఁడు.

**యౌతకము.** సం. వి అ న అరణము, పెండ్లి కాలమున వధువున కిచ్చిన ద్రవ్యము.

**యౌతవము.** సం వి. అ. న. పరిమాణము. కొలత, తూనిక.

**యౌతుకము.** సం వి. యౌతకము.

**యౌధేయుఁడు.** సం. వి అ. పుం. యోద్ధ

**యౌనము.** సం. విణ. (అ. ఆ. అ) ౧ యోని సంబంధమైనది ౨. వివాహసంబంధమునఁ గలిగినది. వి. అ. పుం. ౧. యోనిసంబంధమువలన కలిగిన పాపము. న. గర్భాధానము, షోడశ కర్మలలో ప్రథమసంస్కారము. (వై. ని)

**యౌనికము.** సం. వి. అ. పుం. వాయుభేదము, స్వేదమును హరించునది. (వై. ని)

**యౌవతము.** సం వి. అ. న. యువతీబృందము. యువతీసమాజము.

**యౌవనకంటకము.** సం. వి. అ. పుం. న. వ్రణభేదము, యువగండము.

**యౌవనము.** సం. వి. అ. న ౧. యువభావము, పడుచుతనము. తారుణ్యము (పదునారేండ్లు మొదలు ఏఁబదియేండ్లవఱకుఁ గల ప్రాయము.)

**యౌవనలక్షణము.** సం. వి. అ. న. లావణ్యము ౨. కుచము. స్తనము.

**యౌవనాశ్వుఁడు.** సం. వి. అ. పుం. యువనా శ్వుని పుత్త్రుఁడగు మాంధాత.

**యౌవరాజ్యము.** సం. వి. అ. న. యువరాజ త్వము. తేక యువరాజారయుక్త్యా పహోదా.

**యౌషిణ్యము.** సం. వి. అ. న. స్త్రీత్వము. స్త్రీధర్మము.

**యౌష్మాకము.** సం విణ అ. ఈ. అ. మీసం బంధమైనది మీది. యుష్మదీయము.

**యౌష్మాకీనము.** సం. విణ. అ. ఆ. అ. మీసంబంధమైనది మీది యుష్మదీయము.

**య్వాగులి.** సం వి ఈ. స్త్రీ. మండిక,అన్నము వండితీసిన కల్లు వై. ని

**య్వాగుల్యా.** సం. వి. ఆ. స్త్రీ. ఫుల్లగంటి. (వై. ని.)

# ర

**ర.** ఊథ. ఒకానొక అక్షరము

**ర.** సం. వి. అ. పుం. ౧ అగ్ని. ౨. కామము, కామాగ్ని. ౩. భయము, నాశము. ౪. వజ్రము. ౫. హస్తము. ౬. ఋతువు. న. ౧. రుధిరము, నెత్తురు. ౨. శిరము, తల. ౩. ధాన్యము. ౪. ఆకాశము. ౫. గ్రుడ్డు, అండము. ౬. కడుపు, కుక్షి. ౭. వస్త్రము. ౮. భయము ఆ. స్త్రీ. ౧. బంగారము. ౨. కాల. ౩. దానము. ౪. నడచుట. విణ. ౧. విరసము, రసహీనమైనది. ౨. తీక్ష్ణము, ఉగ్రమైనది. (దీనికి తెనుఁగున వ్యస్తముగ ప్రయోగము కనఁబడదు.)

**ర=రా1.** అవ్య. ప్రశంసాదులను తెలుపును.

(కి) ప్రశంసకు.

(వ్యత) నీవు ర సత్పుత్త్రుఁడవు.

(చ) ఆశ్చర్యమునకు.
ఉదా:- అద్దిర, బళిర.

(ట) సంతాపమునకు.
గీ. అతనిరాకఁ దలంపక యధికభీతిఁ
బోవుటయు తెచ్చరది ముందభూలుగు లకట,
మోసపుచ్చెర న న్నని డాసి పోయ,
యలిగి మతిమంతు మెడ బిగ్గ నలిమి చంపె.
కేయూర. ౩. ౪౮.

(ఠ) సంభావనకు.
క. నలకూబరుండు రంభం, గలయుట విని చిన్నఁ
బోవు కలభాషిణిరో, కులు దిరిగిచూచి దీనిం
గలఁచెర యివ్వార్త తాపకరమై యనుచున్.
కళా. ౩ ౪౮.

(ప) వాత్సల్యమునకు.
చ. జననముఁ జెప్పి యేఁ దలంప సత్యమునమ్మర
కుంతిభావణం, బనితనుజత్వజాత కృప
నంబుజ మిత్రుఁడు వల్కె—
భార. శాం. ౧ ౩౭.

(గ) సంతోషమునకు.
ఉ. నీ చెఱఁ బాసి పోయి రజనీచర చక్రి భజింప
ముక్తిపాం, దేచెర యేచెలం దవుల నే నిఁక.
ఆము. ౬. ౪౫.

(జ) కోపమునకు.
గీ. ఎవ్వఁడవు కోరి నీవు నా యొదురఁబాఱు, పంది
నేసితి బాహుదర్పంబు మెఱసి, యెఱుఁగవుర
యూరి నన్ను. పార. ౨. ౫౦.
మ.... నారూపముం దాల్చి వంచన నెవ్వాఁడుర
చేరినాఁ డట దురాశన్ రంభ నంచున్
వాసన్. కళా. ౩. ౨౪౩.

(డ) నిందకు.
ఉ. వంచన రాముఁడేనిఁ గొనివచ్చిన యట్టులు
గాదు కోరి నృ త్తంచర
భా. రా. యు. ౪౧.౪

(ఢ) ప్రార్థనకు.
ఉ. ఏలర యీ చలం బుడిగి యేలర
హంస ౩.౧౬౩

రంకుఁడు. సం. విణ. (అ. అ. అ.) ౧. దరిద్రుఁడు, దీనుఁడు. ౨. మందుఁడు, త్వరలేనివాఁడు.

రంకుటి. సం. వి. ఇ. స్త్రీ. ఒకానొకవృక్షము. (వై. ని)

రంకువు. సం. వి ఉ. పుం. ౧. ఇఱ్ఱి, జింక. (తెల్లనిచంద్రకలును మెత్తనితోలునుగల ఇఱ్ఱి) ౨. నీవృద్భేదము.

రంగఁడు. వి. శ్రీరంగనాథుఁడు. (శ. ర)

రంగజము. సం. వి. అ న. సిందూరము.

రంగజీవకుఁడు. సం. వి. అ పుం. ౧. నటుఁడు, నాట్యజీవి ౨. రంగులువేయువాఁడు, చిత్రకారుఁడు, శిల్పి.

రంగద. సం. వి. ఆ. స్త్రీ. స్ఫటిక (వాచ)

రంగదము. సం. వి. అ. పుం. ౧ వెలిగారము, టంకణము ౨. ఖదిరసారము, కవిరి.

రంగదాయకము. సం. వి. అ. పుం. ౧. కంకుష్ఠము. ౨. ధాన్యభేదము. (వాచ)

రంగపత్రి. సం. వి. ఈ. స్త్రీ. నీలీవృక్షము, నీలిమందుచెట్టు.

రంగపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. రంగపత్రి.

రంగబీజము. సం. వి. అ. న. రజతము, వెండి.

రంగభూతి. సం. వి. ఇ. స్త్రీ. ఆశ్వయుజ శుక్లపూర్ణిమ.

రంగభూమి. సం. వి. ఇ. స్త్రీ. ౧. నాటకరంగస్థలము, నాటకశాల. ౨. యుద్ధస్థానము, సాముచేయుబయలు.

**రంగమల్లి.** సం. వి. ఇ. స్త్రీ. నీలి. (ఆ. ని.)

**రంగమాత.** సం. వి. ఋ. స్త్రీ. ౧. లక్క, ఎఱ్ఱరంగు. ౨. కుట్టిని, కార్యకర్త్రి.

**రంగము.** సం. వి. అ. పుం. ౧. రంగు, వర్ణము. ౨. నాటకరంగము, నాటకమాడెడిచోటు. ౩. స్థలము, ప్రదేశము. ౪. దర్పము, గర్వము. ౫. యుద్ధరంగము, కయ్యపుసేల. ౬. నృత్యము ౮ (శిక్ష) అచ్చున అనునాసికముగాఁ బలుకుట. ౯. ఖదిరసారము. ౧౦. వెలిగారము (వా. చ) పుం. సు. ౧. తగరము. ౨. శ్రీరంగపట్టణము.

**రంగము.** వి. సోద (శ. ర.)

**రంగ (గా) రి.** వి. (రంగు+అరి౩.) రంగులు కేవి జీవించు ఒకానొకజాతి. (శ. ర.)

**రంగరించు=రంగలించు.**

ఆ. పిడికబూడిదయును వెంపొందుకలబంద, రసము నాముదమును రంగరించి, తలకు వంట నిలుచుఁ దఱుచైనవెక్కులు, మగఁడు బొన్నకాయ మరునఁ గూర్చు. (చి. కి. చి. ని)

**రంగలరు.** అ. క్రి. (రంగు+అలరు) శోభిల్లు, ఒప్పు.

వ. హరిద్రాచూర్ణమువర్ణరజోవర్ణ వికీర్ణార్ణవర్ణ పయోరుహపరాగరంజితార్ణోనిషిక్తంబులైన చలువ నిగనిగని జిలుగుపావడలు హేమాంబరమ్ముల కెంగున రంగలర...

ఇందు. ౩.౫౯.

**రంగలాసిని.** సం. వి. ఈ. స్త్రీ. పల్లవాదిరి, శేఫాలిక.

**రంగలించు=రంగరించు.** స. క్రి. (దే. రంగళిను) ద్రవ ద్రవ్యమునందు మఱియొక వస్తువునుచేర్చి త్రిప్పి కలయబెదకు; కలయఁగలుపు.

వ. రంగుమీఱుచుఁ గూలరంగరంగక్కుడుంగంబు లంతరంగంబునను వేడుక రంగలింప మరాళమందయానాధవళవర్ణపరిపూరితంబై.

చంద్రి ౪. ౩౯.

**రంగవల్లి.** సం. వి. ఈ. స్త్రీ. ముగ్గు, శ్వేతచూర్ణాదికముతో లతాద్యాకారముగా రచింపఁబడు చిత్రము.

**రంగశాల.** సం. వి. ఆ. స్త్రీ. నృత్యశాల, నాటకశాల.

**రఙ్గాజీవుఁడు.** సం. వి. అ. పుం. రంగజీవకుఁడు

**రంగాయించు.** స. క్రి. (√రంగు.) రంగుచేయు (శ. ర.)

**రంగారి.** సం. వి. ఇ. పుం. కరవీరము. గన్నేరు చెట్టు

**రంగారు.** అ. క్రి. (రంగు+ఆరు) ౧. ప్రశస్తమైన వన్నెగలుగు.

సీ. రవలపావడదాని రంగారుబంగారు తమ్మలఁ గేరుహస్తములదాని దశా. ౨. ౧౦.

గీ. పాలుచురంగారు బంగారుపాదలవెడఁగు.

దశా. ౧. ౨౦౩.

వ. రంగారుబంగారుబొమ్మల ప్రతిబింబంబులకు

ఉ. రా. ౧. ౧౩౯.

౨. ప్రకాశించు, ఒప్పు.

సీ. బంగారుద్రాఁక చెఱంగుల రంగారుపట్టు దుప్పటి కటిఁగట్టువాని. ఘటికా. ౨. ౧౪౪.

సీ. బంగారువలువున రంగారుకటిమీఁదఁ జక్కఁగా నొక్కహస్తంబు చాచి.

కళా. ౮. ౧౪౯.

౩. విలాసయుక్తమగు.

ద్వి. రంగారఁగా బొంగరా లాడు చవుడు, సంగడీంద్రసుతోడి చరియించుచుండ.

ద్వి. శ. పా. ౧. ౪౯౦.

**రంగావతారకుఁడు.** సం. వి. అ. పుం. నటుఁడు, నాటకీఁడు.

**రంగావతారి.** సం. వి. ఇ. పుం. రంగావతారకుఁడు.

**రంగి.** సం. విశే. ఇ. ఈ. ఇ. రంగిణి. స్త్రీ రూ. ౧. రంగువేయువాఁడు. ౨. అనురాగముగలవాఁడు.

౩. నాటకరంగమున నాడువాఁడు.

**రంగిణి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. శతమూలి, పిల్లితీఁగెర. కై

౨. కైవర్తిక, కుంకుమపుష్ప కై

**రంగిల్లు.** అ. క్రి. (√రంగు) రంజిల్లు, ప్రకాశించు.

సీ. క్రొవ్విరిదిండువవ్వ నవ్వారెడు కాంతి రంగిల్లి పికిరుచుల్ దొంగలింప. కు. సం. ౫. ౫౨౦

**రంగు.** వి. (సం. రంగ, క. రంగు. హిం. రంగ్) ౧. సొంపు.

గీ. ఒదవెఁ గడు రంగు రక్తియు మదనమీఱ, కదనజయభద్రకామాళీకలకలాను, కరణచణ కోకిలకలాపకంఠకలిత, కాకలీకలందును బలాకకలికలందు.

చం. రా. ౨. ౮.

ఉ. రంగగు నీనిజాకృతికిఁ గేలుఁగొంగ నిజంబు వట్ట్రుమా, యంగననిన్నుఁ గన్గొనినయంత ననంగుఁడు పండడించెడిన్.

భాగ. ౫. ౨౦

శా. ఆయారమ్ములఁ బొల్చు కొమ్మల వెదం గాపల్లవశ్రేణిరం, గాయాతావుల మించు పూఁబొదులు లాపే యున్న గోకక్యమే.

వసు. ౧. ౧౩౦.

౨. రంజనము, రాగ.

సీ. రంజన మగు రాగ రంగు రతి మన.

అం. భా. ౨. ౨౦౮.

౩. శుక్లాదివర్ణము.

శా. .అప్పట్టునన్, బుట్టుంగెంపున వింపునీరుఁ రవిపెంపుం బెంపి దట్టంపుకెం, బట్టుంబుట్టమురంగు వింగిరము కాపాడించు దివ్యప్రభా, ధట్టంబౌక్కటి పుట్టెఁ గట్టెదుర సంధ్యా లక్ష్మికిన్ జొట్టమై.

వసు. ౪. ౫౫.

ఉ. వింగడమైన యుక్కవనవీథిఁ గనుంగొని నీడనున్న పున్, రంగుటరంగుపచ్చల యరంగయిపో వెలిదమ్మి బావికిన్, వెంగట నల్ల పిల్లి తులసీవనసీమ శుభాంగి నొక్కచా, లం గురువిందకందళదళప్రతిమాంఘ్రికశో దరాధరన్.

ఆము. ౫. ౪.

౪. ఒప్పు, శోభ.

మ. అనుదుం గెంపు మెఱుంగుకన్నుఁగవచాయన్ జేవురింపం గనుం, గొని యుక్కించుక జాఱు పయ్యెదచెఱుంగున్ రంగుగాఁ జేర్చి కొ, ప్పును జక్కన్ సవరించి.

విప్ర. ౨. ౭౨.

క. ఆ మెడ యానద యాజడ, యామేని మెఱుంగు రంగు లలివిరియ పాగడన్.

శుక. ౧. ౨౩.

ఉ. రాక్షసరాజ్యలక్ష్మి యన రంగువహించిన యప్పురీరాజ ప, శ్రేష్ఠుల విట్లు పెండ్లియయి.

ఉ. రా. ౨. ౨౮౩.

౬. కాంతి.

సీ. దొరమించు మైరంగుతో క్రొమ్మెఱుంగు.

నీలా. ౧. ౫౬.

సీ. కడవక్షురకోరుకు బంగరుకోటకెంజాయ సంజ కెంజిగిరంగు నవదరింప. దశా. ౧. ౨౭౨.

సీ. తరుణాంగకిచ్చానుదంతభుసరకట్టు లింగి
చీకభువింతరంగు లీన.
మనుచ. ౧. ౫.

౫. విధము, రీతి.

క. సంగీతవిద్య కెలమిన్, సంగడి సాహిత్యవిద్య
సరిగా రెండున్, మంగళపతి కలిగిన యా,
రంగువచింపంగఁ దరమె లావణ్యనిధీ.
విల్ల. ౧. ౧౨౦.

వ. ఒక్కకేప బొంగరంబురంగున బిఱబిఱం దిరు
గుచు. కువల. ౪. ౯౨.

విశే. ౧ శ్రేష్ఠమైనది.

క. గంగాసాల గ్రామము, లంగలుగు విశేషతీర్థ
లక్షణములు నా, కుం గలపి తింక నిలలో,
రంగగు ప్రతిమెద్ది పలుకు రాజీవాక్షా
శేష. 3 ౧౪౨

సీ రంగుబంగరువు మెఱుంగుటరంగులు
నీలా ౧. ౨౩.

రగడ. రంగుగఁదనప్పు నారంగముల సంగములఁ,
బింగళితఁ జెంచె మదభృంగములతుంగములు.
రాఘవ. ౨ ౬.

౨. ఇంపైనది, మనోహరమైనది.

వ రంగగురక్తు లెసంగ విభినయించుచు .
ఉ రా. ౫ ౨౪౭.

3. రంగుకలది.

క. వంగము పదింటి కొక్కటి, యంగజహరు
వీర్యమిచ్చి హరితాళము న, ట్లుం గలయఁజేసి
మారిన, రంగయి భస్మంబు తొగరాజీ
వనంచున్. (చి కి. చి ని)

జః రంగరి, రంగలరు, రంగాయించు, రంగారు,
రంగిల్లు, రంగుపాణి.

రంగుపాణి. విశే. (√రంగు) ఎఱుపురంగుచేసి
నది. (క. ర) వి. రంగుపని. (చి. ని)

రంగేశుఁడు. సం. వి. అ. పుం. శ్రీరంగనాయ
కుఁడు.

వ. శ్రీరంగంబునకు రంగేశు సేవింపఁ దోడుకొని
పోయి .
ఆము. ౬. ౪౦.

రంగోష్ఠాలుకము. సం. వి. అ. న. స్వస్తికముకి
(త్రి ని)

రంగోపజీవి. సం. వి. న్. పుం. రంగజీవుఁడు.

రంఘస్సు. సం వి. స్. స్త్రీ. వేగము, వడి,
రంహస్సు, త్వర.
రంచె వి చేనుఁగుమీఁది అంబారి.

వ రంచెలుడించి కదళికాకుధ కంఠరజ్జుఘంటిక
వ్రచ్చి తోత్త్రాంకుశహస్తులై సాహిణంబు
లకుఁ దెచ్చి గంధసింధురంబుల నాలానంబుల
బంధించు మావుతుల యితరేతరాలాపంబులు
వరాహ. ౪. ౧౨౦.

రంజకము. వి. తుపాకి చెవినికాల్చుటకు పెట్టెడు
మందు.

వ. .వీరంగులు చుట్టుకొనుహారువున సరవత్తుల
వేగమున రంజకంబుదినునున నురటిదిప్పినట్లు
ప్రబంధ. ౪౮౭.

సీ. బాదుషాఁగను బరఁగుఁదుపాకిలోపలను
జానకిత్రాఁడునిలుపుతావు, చుఱుకైనమందు
పేర్వరఁగు రంజక మన. ఆం. భా. ౨.౨౧౨

రంజకము. సం. విశే. అ. అ. అ.
౧. రంగుచేయునది. ౨. కామమును పెంచునది,
కామోద్రేకము గలిగించునది. 3. సంతోషపఱ
చునది, ఆనందింపఁజేయునది.

వి. అ. న ౧. హింగులము, ఇంగిలీకము.
౨ ఒకఓషధి, కాంపిల్లము, రోచనికి 3. ఏరం
డము, ఆముదపుచెట్టు (రం. ని)

**రంజకుఁడు.** సం. వి. అ. పుం. ౧. రంగులు వేయు వాఁడు, చిత్రకారుఁడు.

**రంజేణ=రంఝేణి.** వి. గాదెవంటికాగు. (శ. ర.)

**రంజేణి=రంఝేణ.**

గీ గాదెపోలికనుండెడి కాఁగుపేరు, రంఝేణి యనంగ వెలయు

ఆం. భా. 3. 3౫.

**రంజన.** సం. వి. ఆ. స్త్రీ. రంజనము. (శే వి)

**రంజనము.** సం. విణ (అ. ఈ. అ) ౧. రంగు వేయునది. ౨ ఆనందపఱుచునది, సంతోషపెట్టునది. 3 కామాది వికారము నుద్రేకింపఁజేయునది

వి. అ. న ౧ రంగువేయుట ౨. రంగు, చాయ 3 సంతోషము, ఉల్లాసము. ౪ ఆనందపఱుచుట, ఆనందము గలిగించుట ౫. రక్తచందనము, ఎఱ్ఱచందనము ౬. ముంజగడ్డి, తృణవిశేషము. ౭. హింగులము, ఇంగిలీకము. ౮. కట్టులము, చెకు ?

**రంజని.** సం. వి. ఈ. స్త్రీ. ౧. నీలివృక్షము. నీలిమందుచెట్టు. ౨. పసుపు. 3. మంజిష్ఠ, మంజిటి. ౪. గుండారోచనిక, కంపిల్లము ? ౬. మణిశిల, మనశ్శిల (శే. వి)

**రంజసానువు.** సం. వి. ఉ. పుం. ౧. మేఘము, ౨. ధర్మము. (శే వి)

**రంజితము.** సం విణ. అ. ఆ. అ. ౧. రంగు వేయఁబడినది, వర్ణము వేయఁబడినది. ౨.సంతోషపఱుపఁబడినది, ఉల్లాసపఱుపఁబడినది.

**రంజిల్లు.** అ. క్రి. ఎఱ్ఱనగు.

మ. వలిఁ గేల్ దమ్ములచాయఁ గెంపులబలెన్ రంజిల్ల నమ్ముత్తియం,బులు రాపాడుచు దోయిలింపుచును మోముంజందురున్ నవ్వు
వెన్నెల లల్లల్లన పోఁకగాను మిగుల
న్నిక్కంగ జొక్కమ్మడిన్, దలఁద్రా
లొప్పె నెలంత రాచెలువున్ దార్కొన్న
కోర్కెన్ దగన్. యయా. ౪. ౧౧౧.

**రంజిల్లు.** (లు) సం. అ. క్రి. ౧. అనురాగము పొందు. (శ ర)

౨. ఒప్పు, ప్రకాశించు

చ. సలలితచర్య భర్తృపదసారసభక్తి చేతా ర్ద్ర యార్య రంజిలు నలసీనయార్యపతినీతమ శీత మయూఖ కీర్తియై.

కళాం పీఠి ౧. ౬3.

సీ. మెఱుఁగంచు కమ్మలు దొరయవం చటు డించి మణుల రంజిల్లు కమ్మలు ధరించి.

హంస. ౧ ౨౧౪.

వ హృదయకంజమ్మున రంజిల్లు నమందానురాగరసమకరందమ్మున మనుచు. ౨. ౭౪.

3. సంతోషించు.

ఉ. ముచ్చటలుం బ్రసంగములు ముఖ్యటిరాజుల చర్యలుం గథల్, చెచ్చెర నానతి మ్మనినఁ జిత్తము రంజిల నాతఁ డత్తఱిన్.

హంస. ౧. 33. హంస. ౧. ౫౧.

**రండ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నింద్యయగు స్త్రీ, దుర్మార్గురాలు.

సీ. ఏఱంత బోధించెనే నిన్ను జోతల్లి కాన పాదుం దసంగతుల మెలఁగ, ఏరండ భ్రమయించెనే నినుఁ దల్లిధర్మంబు మోక్షం బబద్ధంబు లనుచు. ప్రబోధ. 3. 3.

౨. విధవ, భర్తృహీన.

శ్లో॥ రండా. పీనపయోధరా:... .శోగాఢ మాలింగితా:

సం. ప్రబోధ, 3. ౧౯.

3. మూషకపర్ణి, ఎలుకచెవిచెట్టు.

రండకము. సం. వి. అ. పుం. గొడ్డుచెట్టు, కాపు లేనిచెట్టు వ. వ్యసంబంధార్థకాన్వయము అంతః కరణము.

రండుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) వికలాంగు డైనవాఁడు, అంగచ్ఛేదముచేయఁబడినవాఁడు. ౨. ధూర్తుఁడు, మోసగాఁడు.

రంత. సం. విణ. (ఋ. త్రి. ఋ) రమించువాఁడు, క్రీడించువాఁడు.

రంతిదేవము. సం. వి. అ. పుం. కుక్కము,కుక్క.

రంతిదేవుఁడు. సం. వి. పుం ౧ భరతునితర్వాత వాఁడవపురుషుఁడగు చంద్రవంశపురాజు ౨. విష్ణువు.

రంతు=అంతు. వి. (సం. రతిః) ౧. క్రీడ, ఆట. మ త్తకోకిల. రంతుసేయుచు వాతఘాతకరాళ భంగురభంగదుస్తాంతసంతత సాగరోదక తల్ప మెుంది వసించు బ్రహ్మంతవానిని బొడ్డుఁదమ్మిని వాఁచి కాచిన పేర్పరిక్. భాగ. ౭. 3౭౮.

ఉ. అప్పుడు భారసాఁచి తనయర్మిలివిందులు వచ్చి రంచు నవ్వొప్పుఁగఁ జేయత్లిదెన కొ త్తిలి కృష్ణుఁడు రంతుసేయుచు, నెప్పటి వచ్చి చెప్పుడుచును. భాగ. ౧౦. పూ. 30౭

౨. రతి, కామకేళి.

గీ. దాయవనవీధి శీతాంశుధరునిరంతు, కౌరి గోపాలకామినీ చార్యకేళి, కామరసభావ ములు మించి కానఁబడఁగ, దీర్చి యిడుపుల యందుఁ జిత్రించినారు. సైమ. ౪. ౧౫౧.

3. ఒప్పిదము.

సీ. చూపుచున్నది జోగిణీపంతుగంతుగా రంభ నాట్యగృహాంతరంబునందు. కవిదా. 3. ౮౮.

౪. కలకలము, అలబలము; శబ్దము, సద్దు.

ఆ ..పురములోన ఘనముగా రంతయ్యె, నారె కులను దివియ లందుకొనుచు, గల్ల బుట్టె ననుచు నెల్లదిక్కుల జాడ,లరయఁబోచ్చి రతి విహస్తులగుచు.

ద్వా. ౧౦. ౧౭౫.

క.. రంతుసేయని విద్యుద్వ్రాతంబుఁ జూచి లాఁతుల, మాతరవాయినగ మాటలాడుం డనుచున్.

ఆము. 3. ౪.

౫. మనవి, విన్నపము.

ఉ. అంతటఁ బ్రొద్దుగ్రుంకుటయు నాళకకంబు గి జేంద్ర రోహిణీ, కాంతునిఁగొల్చుచూచు టకుఁగాఁ దొడిగెచ్చితఁ జూడుమంచు ని,శ్చింతతఁ జేరి దంతికి శశిప్రతిబింబముఁ జూప వెుక్కుచో,రంతులు చి త్తగింపు మపరాధము సైపు మటంచు వేడుచున్.

వా. పంచ. 3. ౧౧౭.

౬. సింహనాదము, పెద్దమ్రోఁత. (అంజనేయ స్వామి.)

పీ. రంతుమాపినపట్ల పంతుమోపినయట్ల గుహలు ప్రతిధ్వనుల్ గ్రుమ్మరింప. రామా. ౭. ౮౮.

పీ రట్టు రట్టడి రవ్వ రద్ది రద్దుప్పత రంతుగోవారు గోరపన కెలయు, నాధుకోమణసమాఖ్య

ఆం. భా. ౧. ౧౧౫.

౭. కలహము, వాక్కలహము, రచ్చ.

శా ..తీ, పార స్నేఁ జననీమియు న్నగిడి నీ నా రామియుం దెల్ల యేఁ,లా రంతుల్ పలు పల్కు లంత్యకుల రేలా చింత లేలా నగర్.

ఆము. ౭. ౪౧.

౮. మిడిసిపాటు?

మానిసివృత్తము. అంతమదింపకుసే యని పల్కిన నంత మదింపకుసేయుచున్, గంతు లడంచెద

కొమ్మని పల్కిన గంతులిడం జెడ కొమ్మయుచున్
రంతులజేసి ఫలంబువిపల్కిన రంతులజేసి
ఫలంబుచున్. కళా. 3. ౧౭౫.

జ. రంతుకర్త్రి, రంతుకాఁడు.

**రంతుకర్త్రి.** విణ. (రంతు+కర్త్రి) క్రీడాపరురాలు.

సీ. బవనీల జవనికపాటల నిల్లాంధ్రరమణిఁ ద్రుళ్లా
డించు రంతుకర్త్రి: క్రీడా. ౧౨౭.

**రంతుకాఁడు.** విణ. (రంతు+కాఁడు) క్రీడా
పరుఁడు.

వ. అతండు నిర్జితుండగుట మనకుఁ గీర్తికరంబగు నిన
యారంతుకాంద్ర కఱవులు విని యక్కవార
నం దానును. హరి. ఉ. 3. ౨౨౭.

(ఇట ద్యూతక్రీడాపరాయణులని భావము)

**రంతువు.** సం. వి. ఉ. పుం. ౧. మార్గము, దారి
౨. నది, ఏఱు.

**రంధనము.** సం. వి. అ. న. ౧. పాకము, వంట
వండుట.

**రంధి.** వి. ఏకచిత్తత, తత్పరత. (ఇది బహుళవంటిది)

గీ. పదిఁడియందెలు గల్లనఁ బాతిపాతి, మెచ్చ
నద్దేవి పనిసేయనొచ్చెవనక, ఘటిక ద్రింగిన
సిద్ధునియటుల నుండు, వినజపరిపంథి యతని
కేదేటి రంధి. పార్వ. ౨. ౧౫౩.

**రంధితము.** సం. విణ. అ. ఆ. అ. ౧. పాకము
చేయఁబడినది, వండఁబడినది.

**రంధ్ర. కంటము.** సం. వి. అ. పుం. బర్బురవి శే
షము, జలబర్బురము. ‡ (వా. చ.)

**రంధ్రబభ్రువు.** సం. వి. ఉ. పుం. ఉందురము,
ఎలుక.

**రంధ్రము.** సం. వి. అ. న. ౧. బెజ్జము, కన్నము
ద్వారము. ౨. నింద, దూఱు, 3. తప్పు, అవ
రాధము. ౪. (జ్యోతి) జ్యోతిష్యాది సంఖ్యాత
సంకేతపదము.

**రంధ్రవంశము.** సం. వి. అ. పుం. కీచకము,
బొంగువెదురు. ‡

**రంధ్రాగతము.** సం. వి. అ. న. గుఱ్ఱములకు
రోగభేదము, గుఱ్ఱముల కంఠరోగము. (అ. ని)

**రంధ్రాన్వేషి.** సం. విణ. (న. ఈ. న) రంధ్ర
ములు వెదకువాఁడు, లోపములు కనిపట్టువాఁడు

**రంధ్రుఁడు.** సం. వి. అ. పుం. సంకరజాతివాఁడు
(శ. ని.)

**రంపు.** వి. రాయిడి, ఒరపిడి.

చ. రతిపతి యంపఱంపముల రంపునఁ గంపము
నొంది సేను మున్, రతికయి వచ్చి మచ్చిక
లొనర్చినఁ జెచ్చెరనొందసేరకే, బుకుదివ
సంబుద ప్పెఁ గదకేఁగు మ టంటివి.

అహల్యా. 3. ౪౫.

సీ..... .. రాయిడి రారాపురంపునంగ, నమ
మర్దనం బొప్పు ఆం. భా. ౨. ౨౨౩.

**రంపె.** (పియ) వి. ౧. మాదిఁగవాఁడు తోలుకో
సెడి సాధనవిశేషము. (శ. ర.) ౨. కాటాకులు
మట్టగించికోసెడు సాధనవిశేషము. (ర. ర.)

**రంపె.** (పియ) వి. దారుణకృత్యము. (చూ. రంపె
లాఁడి) జ. రంపెలగొట్టు, రంపెలాఁడి.

**రంపెలగొట్టు.** విణ. (రంపెలు2+గొట్టు2)
దారుణకృత్యములుగలవాఁడు, దారుణకృత్య
ములుగలది.

ఉ..... ...విరాళిగాకయే, రంపెలగొట్టుగాక
బలురాయిడి కర్తియగాక యుప్పుడున్,
సొఁపాకయుంతలేని యుదజాదర కర్తియగాక
యుంతయున్.

ధనాభి. ౨. ౬౦.

**రంపెలాడి.** విశే. (రంపె౨+ఆడి) దారుణ కృత్యములు గలది. (ఆఁడుది.)

సీ. చించివైచుచో కాని చీరలిచ్చినఁ గటీరమునఁ గైసేయ దా రంపెలాడి.

శేం. పంచ. ౩. ౧౭౩.

(శ. ర. పాలింపులాఁడి ముద్రి. పా)

**రంబారూళ్లు.** వి. బ. ఇక్కట్టులు.

ద్వి. మమ్మునిందాఁకరంబారూళ్లుసేసి, లెమ్మన్న లేవక లీలనాశింక, నతనితోఁడిదలోకమని కూడునీళ్లు, మతిఁదలంపక నేలమైశయనించు

ద్వి. పరమ. ౪. ౩౧౧. (చి ని పా రంచారాముళ్లు వా)

**రంభ.** సం. వి. ఆ స్త్రీ. ౧. కదళీవృక్షము, అరటిచెట్టు. ౨. గౌరి. ౩. ఇంద్రసభలోమిగుల సౌందర్యవతియని ప్రసిద్ధికెక్కినదియు నలకూబరుని భార్యయు నగు నప్సరస్త్రీ. ౪ లంజె, వేశ్య. ౫. ధ్వని, పసులయార్పు. ౬. ఆవులయఱపు. ౭. ఒకజాతి వెదురు ౮. ఉత్తరదిక్కు. (వా. చ.) ౯. కొలత్రాడు. (శే. వి.)

**రంభచెక్కుళ్లు.** మి. వి. బ. ఒకవిధమైన ధాన్యవిశేషము.

వ...పసపుముద్దలు మంచివిరులు రంభచెక్కుళ్లు చిలుకముక్కులు.

ప్రబంధ. ౧౧౨.

**రంభము.** సం. వి. అ: పుం. ౧. ధ్వని, పసుల యార్పు మొదలైనవి. ౨. దండము, కఱ్ఱ. ౩. వెదురు. ౪. దుమ్ము.

**రంభాతృతీయ.** సం. వి. ఆ స్త్రీ. మార్గశీర్ష శుక్ల తృతీయ, ఆనాఁడుచేయు వ్రతము

**రంహస్సు.** సం. వి. స్. న. ౧. వడి, వేగము.

**రకము.** వి. (హిం. రకం) ౧. సౌందర్యము.

చ. జిలిబిలి సొక్కులాప్పుచు ఖచిక్కున నుక్కునఁ బక్వదాడిమీ, ఫలయుగళంబు నొక్కనొకచాల శుకంబురకంబుఁజూచినా, బలిమి నదల్చుచున్ విరులబంతి సెలంతుకదాని నేసె.

కృ. శకుం. ౨. ౩౩.

సీ. ఉపధానికరస్థితోత్తమాంగోత్తుంగముకుట రత్నప్రభల్ రకముఁజూపః

ఘటికా. ౧. ౭౧.

మ. చైత్రుండొం, దు రజస్సత్త్వతమోగుణో న్నతు లనం దోఁచెం జిగుళ్లంజిగుళ్ల రకం బయ్యెడు క్రొవ్విరుల్ విరులపట్లన్ ద్రావాలు భృంగంబులున్.

చం. రా. ౬. ౪., శుక ౨. ౨౪౧.

౨. శ్రేష్ఠత.

వ. వావిలి యిందుగు మొదలగు తరుల పలువు పొదల రొదలఁ బొదలు రకముగల మొకము లదరు జాద లరసి ఉత్తమదిక్స్థలంబులఁ దెర వెత్తించి వలలు పాత్తించి

ఇందు. ౨. ౬౦.

౩. విధము.

గీ. అచటికోటలు పేటలు వలరుఁదోఁట, లచటి చిన్నెలు వన్నెలు నమఁగుఁ గన్నె, లచటి శుకములు పికములు నళుల రకము, లేమనఁగ వచ్చు నగవచ్చు నెంతు మనిన.

ల. వి. ౩. ౪౦.

౪. రంగు, రంజనము.

సీ. రంజన మగు రాణ రహి రంగు రక మన ..

ఆం. భా. ౨. ౨౭౬.

విశే. ౧. సుందరము.

చ. కలువలసేలు చూపులురకం బగు మా చెలి మోముముంగలన్, విలువఁగలేక వెల్ల నయి

ఇందు. ౩౭౪.

ఉ....త్రిశిఖగతిన్, రక్తమా జాతధుమిం గమంగొని... దశా. ౪. ౧౯.

క. మకరములనులోఁ బెట్టుక, రకముగవరకాలులను ధరం బదవైచెన్, నకిలంఘిక లనిరెుంతయు, ప్రకటించెం గామకులు రవంబుల దిశలన్.

విల్హ. ౨. ౧౧౩.

సీ. రవణము చొక్కము రకము చొక్కటము .

గీ. చొక్కటించిన వెలయు మంజులసమాఖ్య.

ఆం. భా 3. ౧౪.

౨. శ్రేష్ఠము.

సీ. నవచకోరకములు నయనముల్ కోరకములు దంతములు రకము పురికేణి.

ప్రబంధ. 304.

సీ. రకపుదంతపుహజారంబునకును బచ్చతోరణంబులు లసద్యుతుల నింప.

ఉ. హరిశ్చ. ౧. 3౯.

రక్కసి. వి. (సం. రక్షస్) ౧. రాక్షసుఁడు, రాక్షసి.

సీ. పసిడిండి మెకపురక్కసితోలు మొలఁజుట్టి.

నీలా. ౧. ౧3.

క. రక్కసి మగువలయాలువు, మొక్కపరచి దీవ... పారి. ౧. ౫౦.

ద్వి. పలుగాకిగాక యీపాప మెందైనఁ, గలదమ్మ రెుంత రక్కసి యనువారు.

ద్వి. శ. సా. 3. ౧౭౫. పం.

౨. నైరృతుఁడు.

గీ. ... పొలమునుండి రక్కసి రాతిరిదిరుగుమేటి, యనఁగ నైరృతి దగు .

ఆం. భా. ౧. ౫౦.

జ: రక్కసిగొంగ, రక్కసిదాయ, రక్కసిఱేఁడు, రక్కసులగొంగ.

రక్కసిగొంగ. వి. (రక్కసి+గొంగ) దైత్యారి, విష్ణువు.

ఉ. రక్కసి గొంగ పైఁగదుఁ దిరంబుగ నిల్చిన డెంద మింకఁ దాఁ దక్కరి తొక్కనిం గవ యేట తెన్నుఁ జేఁగోయరె ..

నీలా. ౨. ౧౧౫.

రక్కసిదాయ. వి. (రక్కసి+దాయ) దైత్యారి, విష్ణువు.

రగడ. రామ తెలుపె నీ రక్కసిదాయవు, నీమ్మపలన్నియు నిజ మని దాయకు.

చమ ౧. ౧౦౪.

రక్కసియ(సె). వి. (సం. రక్షః) రక్కసి.

సీ. కదలక పెన్నిధి గాచు దయ్యంబులు రచ్చరావుల బొమ్మరక్కసియలు.

కవిక. ౪. ౧౧౦.

(ముద్రి. పా. రక్కసీలు అని రక్కసీఁడు అని గ్రహించిన శ. ర. పా.)

గీ. ఒల్లఁ బొమ్మన్నఁబోద తా పల్లవములు, సేపనది రక్కసియ యాటయొగ్గ ..

ఆము. ౫. ౫౧.

రక్కసిఱేఁడు. వి. (రక్కసి+ఱేఁడు) రాక్షసరాజు.

క. వినుమా దేవర రావణుఁ, డను రక్కసిఱేఁడు చెనఁటియై నీ పాలితిం, గొనిపోవఁగ వానిం బై, కొని యని రెుుఱింప నిట్టిగొడవలు సెందెన్. అచ్చరా. ౫౮. ౧౧౧.

రక్కసుఁడు. వి. (సం. రాక్షసః) ౧. రాక్షసుఁడు.

ఉ. ఉక్కఱి యిట్లు మధ్యమ మహోగ్రశరంబులచేత శౌర్య శా, రక్కసులెల్లవారలవ పరాఙ్ముఖు లైన...

భార. అర. ౪. ౧౨.

ఉ. ...వై, వ్యాజగతిన్ మహార్ణవమునం దొలఁ
గుక్కల దొంగ రక్కసునిన్, వాలికవంక
వాఁడిగతిన్ వచ్చి వెస నిగ్గమూలిఁ దమ్మిపూ,
చూలికిఁ దెచ్చి యిచ్చె త్రిదశుల్ గొనియాడ
మురాసురాంతకా.

పారి. ౩. ౨౮.

గీ. . రక్కసుతో దైన్యవిరహితముగ, ధర్మ
మెఱిఁగింప మూర్తి నాతండు వలికె.

ఆము. ౬. ౨౪.

ఉ. కావున క్రమ్మఱ రక్కసునిఁ గ్రక్కున
నొక్కట మక్కడంచి .

దశా. ౧. ౨౪౭.

౨. నైరృతుఁడు.

మ. మలనాదగ్గిజముందు రక్కసుఁడు నీర్రత్త
తాల్పురాగాడ్పుజక్కుల కొండ్లున్యాసదారి
తాలుపుమ బల్కుంబోటి గేస్తుండుఁబుల్గుల
రాడాల్ దొరయు న్మోద ల్గలుగు వేల్పు
ల్గాల్వ న వ్వెండిగుబ్బలిపైనుండి జగంబు
లెలు బలు వేల్పు గట్టు విల్గాలుపా.

నీలా. ౨. ౧౧౭.

రక్కసులగొంగ. వి. (రక్కసులు + గొంగ). రక్కసిగొంగ. (శ. ర)

రక్కాముకోళ్లు. వి. ఆరణ్య జంతువిశేషము.

గీ. అమరికలఁగల్గి సంకటి తమిఁదరొట్టు, పేట
పొట్టకెన మినుపపిండి మెఱిక, లాడికముగ
బొక్కఁదగదీరఁ బడినకోళ్లఁ, గఱచి కాటుల
గాల్చు రక్కాముకోళ్లు. ప్రబంధ ౧౩౨.

రక్కెస, వి. (సం. రాక్షసః) ౧. రక్కసి.

క. రక్కసఁ దాను మెక్కుడు, రక్కసయై
కృష్ణుఁడిట్లు క్రౌర్యావేశం, బక్కజముగఁ
బ్రచురింపఁగ, న క్కుటిలామరియుఁ గౌదవె
వోయననుచుదునిన్,

హరి. పూ. ౫. ౧౫౧.

క. ఏతెంచు పాండుపుత్రుని, కెఱవముననుండి పోరి
కిన్ మలసెదున,వ్యాకూలతనుని గవిసం,
జాతస్మరణముల రక్కెసలు కమలోచన్.

జై. భా. ౫. ౧౩౪.

౨. గయ్యాళి, ధూర్త స్త్రీ.

సీ. యువతిసేవిన యపూర్వోపచారమునకు నెన
మిన్నుముట్టియుమ్మసలిపెట్టి, యిచ్చ వచ్చెర
వంది ముచ్చటైనను బెంగటీని రక్కెస దను
దాన వచ్చినను విట్లు కాఁగిలించినది నేఁ డిం
దుకుఁ గారణం బేమేని గలుగవలయు.

వేం. పంచ. ౩. ౨౦౨.

౩. వృతువిశేషము. (శ. ర)

విణ. ౧. అయుక్తము.

ఉ. రక్కెసమాట లాడెదరు రాజును దమ్ములు
వానిలోన నీ, వొక్కటివైనఁ గాదనక
యూరకొను చుండుట యంతకంటె మేలు

భార. ఉద్యో. ౩. ౭. ౪

క. అలంబులోన రక్కెస, మేలంబులుగలవె .

ఉ. హరి. ౬. ౫౪. రాజ. చ. ౩. ౪౭.

౨. దుస్సహము.

ఉ. సెట్టన యిట్టియల్క మదినిల్పితి రక్కెస
తాల్మిఁజిచ్చొడిం, గట్టినయట్లు పెద్దయును
గాలము దీవికి నాఱుపెన్నఁడుం, బుట్టదు
దుష్టనిగ్రహము పూని జగంబులుగాచు
నట్టి తోఁ,బుట్టువునీవుఁ దేజమునఁబొల్చిన
భర్తలుఁ గల్గ నచ్యుతా.

భా. ఉద్యో. ౩. ౧౧౭.

రక్కొను. రక్కొను. అ. క్రి. ౧. కలుగు,
జనించు.

సీ. కర్పూరంపుఁ బలుకులు గలగల రాలుట క్రొత్త
చిట్టములు రక్కొనుట తెలుపు.

శకు. ౪. ౮౨.

రక్తకేసరము. సం. వి. అ. పుం. ౧. ప్రవాళవృక్షము, పగడపుచెట్టు. ౨. పొన్నవృక్షము, పున్నాగము కీ, 3. పారిభద్రము కీ.

రక్తకైరవము. సం. వి. అ. న చెంగలువ పువ్వు.

రక్తకోకనదము. సం. వి. అ. పుం. చెంగలువ పువ్వు.

రక్తగంధకము. సం. వి. అ. న గోపరసము, పరిమళముగల యొక రొట్టినిబంక.

రక్తగ్రహుఁడు. సం వి. అ పుం. రాక్షసుఁడు. (వై. ని.)

రక్తఘ్నము. సం. వి. అ. పుం. రోహితక వృక్షము, ములుమోదుఁగుచెట్టు.

రక్తఘ్ని. సం. వి. ఈ స్త్రీ, దూర్వాతృణము.

రక్తచందనము. సం. వి అ. న. ౧. ఎఱ్ఱచందనము.

రక్తచిత్రకము. సం. వి. అ. పుం ౧ ఎఱ్ఱచిత్రమూలము.

కీ-౨. తు. ప, హనువు. (వాచ)

రక్తచూర్ణము. సం. వి. అ. న. సిందూరము.

రక్తచ్ఛర్ది. సం. వి. ఇ. స్త్రీ. రక్తము (నెత్తురు) క్రక్కుట, రక్తవమనము.

రక్తజిహ్వము. సం. వి. అ. పుం. సింహము.

రక్తతుండకము. సం. వి. ఈ, స్త్రీ. ఎఱ్ఱగోరంట.

... భూ నాగము, వానపాము.

రక్తతుండము. సం. వి. అ. పుం. చిలుక, రామచిలుక, భూనాగము, వానపాము (రా. ని.)

రక్తతృణ. సం. వి. ఆ. స్త్రీ. ఒకానొకతృణము, గోమూత్రిక (రా. ని.)

రక్తతేజస్సు. సం. వి. స్. న. మాంసము (విల్యమ్సు)

రక్తదంతి. సం. వి. ఈ. స్త్రీ. దుర్గాదేవి.

రక్తదంతిక. సం. వి. ఆ. స్త్రీ. దుర్గాదేవి.

రక్తదల. సం. వి. ఆ. స్త్రీ. నలిక, గువ్వగుత్తి. కీ.

రక్తదృశము. సం. వి. శ్. పుం. పావురము, రక్తాక్షము, ఇట్టే రక్తదృష్టి.

రక్తధాతువు. సం. వి ఉ. పుం. ౧. గైరికము (ఎఱ్ఱనిధాతువు) ఎఱ్ఱమన్ను. ౨. తామ్రము, రాగి 3 రుధిరము, నెత్తురు.

రక్తనాలము. సం వి అ. పుం. జీవశాకము కీ (రా. ని)

రక్తనాసికము. సం. వి. అ. పుం. ఉలూకము, గుడ్లగూబ (విల్యమ్సు)

రక్తప. సం. వి. ఆ. స్త్రీ. ౧. జలగ, రక్తము త్రాగునది. ౨ డాకిని, రాక్షసి

రక్తపక్షము. సం. వి. అ. పుం. గరుడపక్షి, గరుత్మంతము (విల్యమ్సు)

రక్తపత్త్రిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. నాకులి కీ. ౨. రక్తపునర్నవ. కీ.

రక్తపము. సం. వి. అ. పుం. పిశాచము, దయ్యము.

రక్తపల్లవము. సం. వి. అ. పుం. అశోకవృక్షము.

రక్తపాకి. సం. వి. ఈ. స్త్రీ. బృహతి, వాఁకుడు కీ.

రక్తపాటలికము. సం. వి. అ. న. ఉత్పలము, కలువ. (వై. వి.)

రక్తపాత, సం. వి. ఆ. స్త్రీ. ౧. జలగ. (అ. ని)

రక్తపాతము. సం. వి. అ. పుం. రక్తస్రావము, ప్రాణహాని.

రక్తపాదము. సం. వి. అ. పుం. ఎఱ్ఱని పాదములుగలపక్షి, చిలుక.

రక్తపాది. సం. వి ఈ. స్త్రీ. ౧. లజ్జాలువు, ముడుఁగుఁదామర, ౨. హంసపది ౨. (వాచ)

రక్తపాయి. సం వి న్. పుం. మక్కుణము, నల్లి. (విల్సన్సు)

రక్తపాయిని. సం. వి. ఈ. స్త్రీ. జలగ.

రక్తపారదము. సం వి. అ. పుం. న. ఇంగిలీకము.

రక్తపిండము. సం. వి అ న. ౧. ఎఱ్ఱని మొటిమ, ఎఱ్ఱఁగ చర్మముపై బయలుదేరెడి కాయ. ౨. ముక్కునుండియు నోట నుండియు నాకస్మికముగా రక్తము కాఱుట. (విల్సన్సు) ౩. పుం. ఓడ్రపుష్పము, దాసనము. ౯. (త్రి. వి.)

రక్తపిత్తము. సం. వి. అ. న. రోగభేదము. పిత్తమున బయలుదేఱిన రక్తము క్రమము తప్పి పోవుట (వ్యత్యస్తమగుట)

రక్తపుచ్ఛిక. సం. వి. ఆ. స్త్రీ నలికండ్లపాము.

రక్తపుష్పము. సం. వి. అ. పుం. ఎఱ్ఱని పువ్వులుగలచెట్టు, కరవీరము, రోహితకము, దాడిమము, బంధూకము, పున్నాగము. మొ॥

రక్తపుష్పి. సం. వి. ఈ. స్త్రీ. ౧. పాటలీవృక్షము. ౨. జపాలత; ౩. ఆవర్తకీలత. ౪. నాగదమనీలత, ౫. కరుణీవృక్షము. ౬. ఉత్పత్తికాండీలత. ౭. బ్రాహ్మణి, ఒకానొకచెట్టు. (వాచ) (శే. వి.)

రక్తపుష్పిక. సం. వి. ఆ. స్త్రీ. ౧. లజ్జాలువు, ముడుఁగుఁదామర. ౨. ౨. రక్తపునర్నవ. ౨. ౩. భూమిపాటలము. (వాచ)

రక్తపూరకము. సం. వి. అ. న. వృక్షామ్లము. (మారేడు, చింతచెట్టు)

రక్తఫల. సం. వి. ఆ. స్త్రీ. ౧. బింబిక. దొండతీఁగ ౨. స్వర్ణవల్లి.

రక్తఫలము. సం. వి అ. పుం. ౧ వటవృక్షము, మఱ్ఱిచెట్టు. ౨. దొండ.

రక్తబిందువు. సం వి. ఉ పుం రత్నదోషము. క. 'సెట్టనమణిపై సెత్తురు, పెట్టినయట్టున్న రక్తబిందువు,' గానం, బట్టకు రత్నపరీక్ష. ౨౧.

రక్తబీజము. సం. వి అ పుం రూ. రక్తబీజము, దాడిమవృక్షము, దానిమ్మచెట్టు.

రక్తభవము. సం. వి. అ. న. మాంసము.

రక్తమంజరము. సం. వి. అ. పుం. ఎఱ్ఱగన్నేరు, నిచులవృక్షము.

రక్తమండలము. సం. వి. అ. న కెందమ్మి, చెంగల్వపువ్వు.

రక్తము. సం, వి. ణ. అ. ఆ. అ ౧.' రంగు వేయఁబడినది, వేఱురంగు కలుపఁబడినది, చిత్రితమైనది. ౨. ఎఱ్ఱనిది, కెంపువన్నెగలది. ౩. వలచినది, ఆశ్యాసక్తమైనది. ౪. క్రీడాసక్తమైనది.

వి అ. పుం ౧ ఎఱుపురంగు, కెంపువన్నె. ౨. కుంకుమపుష్పము. ౩. హిజ్జలము. ౪. పరాగము, పుప్పొడి. ౫. రంగు,

వర్ణము, న. ౧. నెత్తురు. ౨. తామ్రము, రాగి. ౩. ఇంగిలీకము. ౪. కుంకుమపువ్వు. ౫. సిందూరము. ౬. పద్మకము. శ. ౭. ప్రాచీనామలకము. శ. ౮. రాగము, ఎఱుపు. ౯. ఆర్తవము, ముట్టునెత్తురు. ౧౦. రంగు, వర్ణము.

రక్తమూల. సం. వి. ఆ. స్త్రీ. లజ్జాలువు, ముడుంగుదామర (వాచ)

రక్తమూలకము. సం. వి. అ. పుం. దేవసర్షపము. శ. (వాచ)

రక్తమేహము. సం. వి. అ. పుం. మూత్రముతో రక్తము పడుట, మేహరోగవిశేషము.

రక్తమోక్షణము. సం. వి. అ. న. రక్తస్రావము, నెత్తురుకాఱుట.

రక్తయష్టి. సం. వి. ఇ. స్త్రీ. మంజిష్ఠ, మంజిటి. శ.

రక్తరాజి. సం. వి. ఇ. స్త్రీ. ఒకానొక నేత్రరోగము, ఒకరకము కంటిజబ్బు. (విల్యమ్సు)

రక్తరేణువు. సం. వి. ఉ. పుం. ౧. సిందూరము. ౨. పున్నాగవృక్షము. ౩. కోపి, కోపముగల మనుష్యుఁడు, ౪ పలాశకలిక, మోదుగుమొగ్గ.

రక్తల. సం. వి. ఆ. స్త్రీ. కాకతుండి. శ.

రక్తవటి. సం. వి. ఈ. స్త్రీ. మసూరిక (మసూచకము) అమ్మవారి జబ్బు.

రక్తవరటి. సం వి. ఈ. స్త్రీ. రక్తవటి.

రక్తవర్గము. సం. వి. అ. పుం. ౧. లాక్ష, లక్క. ౨. దాడిమవృక్షము, దానిమ్మచెట్టు. ౩. కుంకుమపువ్వు. (దాడిమాదిసమూహము అని వాచ)

రక్తవర్ణము. సం. వి. అ. పుం. ఇంద్రగోపము, ఆరుద్రపురుగు.

రక్తవర్ధన. సం. వి. ఆ. స్త్రీ. వార్తాకి, ములక శ.

రక్తవాహు. వి. శబరి, ప్రాయపువాఁడు.

గీ. సవితృఁడైనట్టి కాలంపు రక్తవాహు, తనర బ్రహ్మాండ మను పెద్ద దవతిలోన, కాయి
సిందూరముఁబోసిన చందమునను, గారు రవిమి
రంపుగుంపు సొంపారఁ బర్వె.

హంస. ౧. ౧౪౧.

రక్తవాలుక. సం. వి. ఆ. స్త్రీ. సిందూరము.

రక్తవాలుకము. సం. వి. అ. న. సిందూరము.

రక్తవృంత. సం. వి. ఆ. స్త్రీ. శేఫాలిక, వావిలి శ.

రక్తశాలి. సం. వి. ఇ. పుం. రక్తవర్ణ ధాన్యవిశేషము.

రక్తశీర్షకము. సం. వి. అ. పుం. ౧. ఒక జాతి నారాయణపక్షి. ౨. సరళద్రుమము. ౩. కర్పూరతైలము. (వై. ని.)

రక్తశీర్షము. సం. వి. అ. పుం. శ్రీవేష్టమను నిర్యాసము, ఒకవిధమగు బ్రూనిబంక. (శే. ని.)

రక్తశృంగికము. సం. వి. అ. న. ఒకవిధమైన విషము.

రక్తసంకోచకము. సం. వి. అ. న. ఎఱ్ఱతామర పువ్వు, కెందమ్మి.

రక్తసంకోచము. సం. వి. అ. పుం. కుంకుమపువ్వు.

రక్తసంజ్ఞము. సం. వి. అ. న. కుంకుమపువ్వు.

రక్తసందంశిక. సం. వి. ఆ. స్త్రీ. జలగ.

రక్తసంధ్యకము. సం. వి. అ. న. ౧. చెంగల్వ. ౨. కెందమ్మి.

రక్తసరోరుహము. సం. వి. అ. న. ౧. ఎఱ్ఱ తామర. ౨. కుంకుమపువ్వు.

రక్తసర్షపము. సం వి. అ. పుం. రాజిక, నల్ల ఆవ. క్రి.

రక్తసారము. సం. వి. అ. న రక్తచందనము, ఎఱ్ఱచందనము

రక్తాంగ. సం వి. అ స్త్రీ ౧. కాంపిల్లము, రోచని. క్రి. ౨. జీవంతి, పాలకూర. క్రి. (కే. ని)

రక్తాంగము. సం. వి. అ. పుం. ౧ మత్కుణము, నల్లి. ౨. కంపిల్లము. క్రి. ౩ గ్రహమండలము. న. ౧. పగడము. ౨. కుంకుమపువ్వు

రక్తాంగుఁడు. సం. వి. అ పుం. ౧. అంగారకుఁడు

రక్తాకారము. సం. వి. అ. పుం. ప్రవాళము, పగడము.

రక్తార్కము. సం. వి. అ. న. రక్తచందనము, ఎఱ్ఱచందనము.

రక్తాక్షము. సం. విశే. (అ. ఈ. అ.) ౧. ఎఱ్ఱని కన్నులుగలది. ౨. భయంకరమైనది, కెంపుగలిగించునది.

వి. అ. పుం. ౧. మహిషము, దున్నపోతు. ౨. పారావతము, పావురము. ౩. సారసము, బెగ్గురుపక్షి. ౪. చకోరపక్షి.

రక్తాక్షి. సం. వి. ఇ. పుం. అఱువది సంవత్సరములలో నొకటి రుధిరోద్గారికి తరువాతిది.

రక్తాతి (తీ) సారము. సం. వి. అ. పుం. రక్తవిరేచనము.

93

రక్తాధారము. సం. వి. అ. పుం. చర్మము, త్వక్కు.

రక్తాపహము. సం. వి. అ. పుం. బోలము, గోపరసము, పరిమళముగల యొక బంక.

రక్తామ్రము. సం. వి. అ. పుం. కోశామ్రము, కొండమామిడి.

రక్తార్బుదము. సం. వి. అ పుం. రక్తగ్రంధి, శరీరముపై బయలుదేఱెడి యెఱ్ఱని కాయ, రోగవిశేషము.

రక్తార్శస్సు. సం. వి. స. న ఒకవిధమైన రోగము, మూలశంకరోగములలో నొకజాతి.

రక్తాలువు. సం వి ఉ పుం. తియ్యదుంప, ఎఱ్ఱదుంప

రక్తాశోకము. సం వి. అ పుం. ఎఱ్ఱని పువ్వులుగల యశోకవృక్షము.

రక్తాశ్మము. సం. వి. న. పుం. కావిఱాయి. (శ. ర.)

రక్తి. సం. వి. ఇ. స్త్రీ ౧. మనోహరత. ౨. రాగము, అనురాగము.

రక్తిక. సం. వి. అ. స్త్రీ. ౧. గుంజాలత, గురిగింద తీఁగ. ౨. తూనికలో నుపయోగఁబడెడి గురిగిందగింజ. ౩. బంధూకము, మంకెన. క్రి (కే. ని.)

రక్తిమ(ము). సం. వి. న. పుం. రక్తవర్ణము, ఎఱుపురంగు.

రక్తైరండము. సం. వి. అ. పుం. పేరాముదపు చెట్టు.

రక్తోత్పలము. సం. వి. అ. న. ఎఱ్ఱకలువ.

రక్తోపలము. సం. వి. అ. న. ౧. ఎఱ్ఱసుద్ద, ఎఱ్ఱమన్ను, గైరికము.

సీ. చిక్కారి పొక్కారి చిఱుతకూఁకటివాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర.
కాశీ. ౧. ౭.

వ. చంద్రాంగద చరిత్రానుబంధం బగు నొక్క మహాప్రబంధంబు నవరసనిబంధబంధు రంబుగా రచియింపఁ బూని.
చంద్రా. ౧ ౧౭.

3. పన్ను, సిద్ధపఱచు.

రచితము. సం. విణ. (అ. ఆ. అ) ౧. సిద్ధ ఱపఁబడినది, చేయఁబడినది. ౨. నిర్మింపఁ బడినది.

రచ్చ. వి. ౧. (గ్రామములో) పెద్దమనుష్యులు గూర్చుండు చావడి, మొగసాల.

సీ. కావున నాచారగతి వింట గడుబెన్నరాజ మార్గంబున రచ్చ మంద, మాత్రపురీపవిహా తుంబుసేయమి భార శా ౮ ౧౧౭

ద్వి. రచ్చలు సంగల్లు రాజమార్గములు, నచ్చుగాఁ జెన్నారు నా రామములును
రం. రా. ఉ. ౧౮౧. పా. ౧ పం.

చ. రయమున వృష్టికై యొడిగి రచ్చలపై విధి యింతు రుగ్రతన్, పాయపతిమీఁద దంతిపతి పాతనిపై నృపతిం గజాదినిర్ణయముల మెత్తు లాడుదురు అర్థ్యగుల్.
ఆము. ౪. ౧౩౧.

౨. కొలువు, సభ.

మ. స్మరణంబాసిన సజ్జనుండు ధనలుబ్ధుండైన రాజన్నిర, తుదఁడొరూపరి రచ్చలోభ లుఁడు నిష్కంజంబులో తోయముల్.
మల్లభూ. ౧. ౪౭.

శ. రంభకు సహావాహొ యొకప్రతి, రంభగలిగి తిగిచి తెచ్చె రచ్చల కని సం, స్తంభింపనీరు పాసాద్యా, రంభణమిపోరు నిర్జరవిటుల్ నగుచున్
కళా. 3. ౨౪3.

3. రాజమార్గము.

ఉ. ...తారకగణమ్ఫురితద్యుతిఁ దాల్చిపాల్చిపం, ధ్యాంగనవోలెనొక్క వనజానన భోరనవచ్చి రచ్చకున్.
కు. సం. ౧. ౧౨౫.

సీ. కచిమాలుమనువు రచ్చలఁబెట్టి యెందోట నింద్రుల మనువారలేఁగి రహహా. గీ. చూడనివి యెల్లయగ చర్య మద్దలయ్యె.
హంస ౧. ౧౧౧.

మ నాకాన్ను ర, చ్చలకెక్కెంగద యింక మానుదురె యీ సాధ్వుల్ ననుందూఱఁగా.
శుక ౪౪౧.

౪. స్థానము, ఉనికిపట్టు.

చ. చెలువమురచ్చ కాముకుల జీవన మంగజ రాజ్యలక్ష్మి కూ, రలు గనునట్టిసద్గతి మరు ద్గణికామణిసోమయాజుల, న్వలవఁగఁజేయు నావధము స్వర్గవిభూషణ మంబురాశి స, త్క్కలభవ పుణ్యరాశి నలకూబరు ప్రాణ పదంబు రంభదాన్.
చిత్రభా. ౨. ౯౪.

౫. గోష్ఠి.

చ . శ్రుతిహితస్వరవైఖరు లుచ్చరించుచున్, మనుకుభదీప్తిదీప్త భువనద్విజరాజుల రచ్చ లచ్చుటన్, గనఁగొనిసాంద్రవిస్మయవికాస విభాసిత మానసాబ్జుఁడై.
హ నల ౨. 3౧ (హరిశ్చంద్రపక్షమున)

చ . ఇంటగెల్చికదదయ్యకరచ్చలగెల్వఁ బోవలెన్
ఉ. రా. 3 ౧౪౫.

౬. కలకలము.

చ శ్రుతిహితస్వరవైఖరు లుచ్చరించుచున్, మనుకుభదీప్తిదీప్త భువనద్విజాళుల రచ్చ

లచ్చటన్, గనుఁగొని పాంద్రవిష్ణుయవిశాస
విభావితమానసాబ్జుఁడై.

మా. నల. ౨. ౩౧. (నలపక్షమువ)

౩. కలహము.

ఉ. వికేమురెల్లను వెచ్చఁబెట్టిరి, రిచ్చట
దొమ్మిగూడి కలహించిన తేయగడేలబుట్టు నీ,
రచ్చలణంపఁగావలయు రాయని యింద్రుఁడు
చేయమన్చుమన్.

ఆహా. ౧. ౧౦౫.

క. అజాఁదరుగుదెంచి గురునిన్, రజనీకరుఁగాంచి
యిట్టి రచ్చలుగలవే, గజబిజి వలదనితారా,
గజయానం జేరఁబోయి(గక్కునఁబలికెన్.

శశాం. ౫. ౧౨౪

౪. సమ్మర్దము.

వ. మెఁగులు తెగలరచ్చలనచ్చటం బెచ్చు పెరుగు
జాంఞానదాంబుజకదంబ కాలంబ కాదంబ
కాదంబరములు వారించుచు.

వసు. ౨. ౧౪౦.

సీ. బలుపచ్చ బెడఁగుసిగ్గుల రచ్చలుదఁగల్గు ఘన
కిరీటము మస్తకమునలగ్న.

ఉ. హరిశ్చ. ౧. ౫౫.

౫. శాఖ, ఉపద్రవము. (చూ రచ్చవేయు)

జ. రచ్చకొట్టము, రచ్చగొను, రచ్చపట్టు
కొట్టము, రచ్చబండ, రచ్చమ్రాను, రచ్చ
యుండు, రచ్చరొయునర్చు, రచ్చరావి, రచ్చ
తాయి, రచ్చవేయు.

**రచ్చ²**. వి. (సం. రక్షా) కాపు, రక్షణము. (చూ.
రచ్చవేయు)

జ. రచ్చవేయు

**రచ్చకొట్టము.** వి. (రచ్చ+కొట్టము.) ౧. రచ్చ
చావడి (మండపము) సభామందిరము.

సీ. సత్రంబుసాలయుఁ జలిపందిరియు రచ్చకొట్టము
బ్రచ్చుట గురుజనముల, నిందించుట ..
విధయ హేతువులు.

భార. అను. ౨. ౬౧.

గీ. క్రోధలోభాత్ముఁడై రచ్చకొటమును మ,
రాలయంబును బ్రపయును గూలఁద్రోచి,
నతని తిత్తొల్చెదరు లోభియైన సకల, సుకృత
విక్రయు సుతిచెదరుచ్చుడుమధిప.

మార్క. ౨. ౧౮.

క. దేవగృహముకడ వీధిని, గోవాటమునందు
రచ్చకొట్టముపొంతన్, భూవర సస్యముల
ను విస్తావిసృజన మెప్పు దండ్రు చారిత్ర
విదుల్.

భార. అను. ౪. ౯౮.

౨. ధర్మశాల.

సీ రచ్చకొట్టంబు నారామంబుఁ గూపంబుఁ
బ్రపయుఁ గావించుట .

భార. అను. ౨ ౬౪.

గీ . నానావనీ సమాయాతపథికు, లమరఁగను
పట్టు రచ్చకొట్టమున కరిగె.

శుక. ౩. ౧౯౮.

ద్వి . రచ్చకొట్టమె నాయున్న కొలువు
కూటంబు, ఇక్కడ నాయింట నీరితియైన,
దిక్కులనెట్లు వర్తిలు మదీయాజ్ఞ.

ద్వి. పరమ. ౩. ౨౧౦. పా.

**రచ్చగొను.** అ. క్రి. (రచ్చ¹+కొను) గుంపు
గూడు

వ. అచ్చెరువడివియచ్చరులు వచ్చి రచ్చగొని
యాడ.

రామా ౫. ౧౮౮.

**రచ్చపట్టు.** వి. (రచ్చ¹+పట్టు) కొలువుకూటము,
సభాభవనము.

సీ. వెలసోట్టు కొత్తమ్మి వెలుత్తమ్మనకు రచ్చ
పట్టు రమారధూపరివృఢునకు.

చంద్రా. ౪. ౧౨౦.

(మార్యోదయవర్ణనము)

వ. అచ్చిత్రరేఖయమ్మ చెచ్చెకంటి పచ్చవిలుతురచ్చ
పట్టయిన పాము్నపం బవళించియున్న నచ్చో్చి
టికింబోయి .. ఉ. హరి. ౪. ౧౩౮.

౨. గోష్ఠీస్థానము

గీ. కనకగమిసీమఁగల్పవృక్షములనీడఁ, బచ్చరా
చట్టుగమి రచ్చపట్టు మాకు.

మనుచ ౨. ౪౩.

౩. ఊనికిపట్టు, ఆశ్రయము.

మ దయకుంగండవ దానకేళి కిర వంకక్కుద్ధికిం
జన్మభూమి యుదారత్వమురచ్చపట్టు
గా బ్బ రి నారళింపాపమనుశేంద్రస్వామి
సామాన్యుఁడే. రామా. ౧ ౯౨.

చ. చలువలరచ్చపట్టు జలజంబులకుట్టు విరాలి
కల్కిప్రోగుల కనుకట్టు జక్కపలగొట్టు
చకోరులమేలియట్టు . రా. వి. ౩. ౯.

రచ్చపట్టుకొట్టము=రచ్చపట్టు. వి. (రచ్చ
పట్టు+కొట్టము) సభామండపము.

వ . పచ్చతాజంతులంగను పట్టుకోటవాకిటిరచ్చ
పట్టుకొట్టంబున వట్టనడికెరవుం బట్టుకొని

ఉ. రా. ౩. ౨౨.

రచ్చేబండ. వి. (రచ్చ1+బండ) రచ్చసేయు
కాలమందు పదిమంది కూర్చుండెడిబండ, రచ్చ
తాయి. (శ. ర.)

రచ్చేమ్రాను. వి. బొ. (రచ్చ1+మ్రాను) జనులు
గోష్ఠిసేయుచోట నీడకై పెంచిన చెట్టు,
చైత్యము.

గీ. విడువకెప్పుడు పెనుగాలిచెవఁదొడఁగెఁ, దోచ
దక్షిణ దిక్కున ధూమకేతు, వనురకన్యలు
పూజింపనరుగుత్రోవ, నున్నకంబైన రచ్చ
మ్రాకొఱిగి కెడసి.

ఉ. హరి. ౪. ౩౬.

సీ. కలువపూదూలము కొట్టములు సోగరాగాఁడి
మచ్చుముంగిట రెండు రచ్చమ్రాఁకు, లీను
గోడిగసేపరింటి వి ద్ద లు మాళ్ల కొర్పులు
నూపపాఁతరలఁగొలుచు.

హం. పంచ. ౪. ౪౧౨.

రచ్చేయుండు. అ. క్రి. (రచ్చ+ఉండు) సభచేసి
కూర్చుండు, కొలువుండు.

గీ. ఇచ్చుటకెకాద పచ్చరాగమ్ము దిక్కు,
ముచ్చటలు మీఱ మెచ్చుచు రచ్చయుంట.

ఇందు ౩. ౩౩.

రచ్చేయొనర్చు. అ క్రి (రచ్చ1 + ఒనర్చు)
కొలువుసేయు , నివసించు.

ఉ. పచ్చికచాయయొం బెట్టుకపాయముగల్గ
వెలుంగునిచ్చలో, రచ్చయొనర్పునందలి పరా
కునఁదేలుచు పేద్క సేలుచున్.

పాండు. ౪. ౪౭.

రచ్చేరావి. వి. (రచ్చ+రావి) పెద్దమనుష్యులు
కూర్చుండుచోట నీడకై పెంచిన రావి చెట్టు.

చ. విపులధరాధరాగ్రమున పేలుపుమాఁకలరచ్చ
రావిది, వ్యపరిమళింబుతోఁ గడవలంతలు
పండుల విఱ్ఱవీగు...

వరాహ. ౧౦. ౧౨౦.

సీ. కదలక పెన్నిధిఁగాచుదయ్యంబులు రచ్చ
రావుల బొమ్మరక్కసియలు. గీ. లంజకల్లుల
నరక...

కవిక. ౪. ౧౧౦.

రచ్చేతాయి. వి. (రచ్చ1+తాయి) రచ్చచేయు
కాలమున పదిమంది కూర్చుండు తాయి, రచ్చ
బండ.

సీ. అచ్చమైనకాటరచ్చ కాయిమొఱంగు పంచ
తిప్పెలు గొప్ప పారిగోడ.

శుక. ౨. ౪౦౭.

రచ్చసేయు1. అ. క్రి. (రచ్చ1+చేయు)
౧. గోష్ఠిసలుపు.

క. ఈరీతిసెల్లవారలుఁ,జేర హాలాంకుండు రచ్చ
సేయఁదదీయాం,ఘ్రోరుహాముఖ సరికా
పుటొ,యారులఁ గూడికొని నిజగృహాంతర
సీమన్.

శుక. ౨. ౪౧౮.

౨. గుమిగూడు, సభచేయు.

గీ. క్షురాల పరిపక్వకానసూ దుంబరాగ్రగ, రంధ్ర
ముల వానీరు పొరంగవెడలె, మశక
పంక్తులు దావధూమంబులనఁగ, రచ్చ
సేయంగవెడలె విభ్రాంతి కనఁగ.

ఆము. ౪. ౧౧౧.

3. కలహించు.

ద్వి. రతాన్నలకుప్పయా రాజీవనేత్ర, రతాన్నంగి
నీతోడ రచ్చచేసినది.

ద్వి. శ. పా. ౧౭౮. పం.

స. క్రి. ౧. బయలుపఱుచు.

గీ. రవిక బిగియింతు నదియును నవలవైచి, కుంక
మపుఁ బూఁత చిమచిమకొనుచున్న, పచ్చి
కానగోటికాఁకులు రచ్చసేయ, గుబ్బయర
గావరాఁబైఁట కొంగువైతు.

కువల. ౪. ౧౮౮.

౨. బాధించు.

గీ. రచ్చసేయఁగ దొరకొమరాగ్రులందు, ముని
కుమారుల బెదరించికొనఁగఁ దొడఁగుఁ,
గామినీమారవాఁడు విక్రమముగఁ జేసె, నిందు
రమ్మన్నచోటనిల్లల్గొనుట.

కువల. ౨. ౨౩.

రచ్చసేయు2. అ. క్రి. (రచ్చ2+చేయు) కాచు,
రక్షసేయు.

సీ. క్రేతల వలపుఁగొల్పుడు దిప్పమొలహత్తి
గచ్చకాయలత్తి రచ్చసేయ.

ఘటికా. ౧. ౧౨౮.

రజే. డి. (సం. రజ్జు. క. రజ్) రజ్జువు, త్రాడు.

సీ. పత్తుభాగములవెంబడి కుథంబులు జాతిపోవ
రజల్ ద్రవయ్యఁ బొంగిపొంగి.

వేం. పంచ. ౧. ౬౨.

రజఃపుష్పము. సం వి అ. పుం. కేతకి,
మొగలి. శ్రీ.

రజక. సం వి ఆ. స్త్రీ చాకిత, చాకలది.

రజకము. సం. వి. అ. పుం. ౧. చిలుక, కీరము.

రజకి. సం. వి. ఈ. స్త్రీ ౧. చాకిత, చాకలది

రజకుఁడు. సం. వి. అ. పుం. బట్టలుతుకువాఁడు,
చాకలివాఁడు.

విణ. (అ ఆ. అ.) మృగముల నానందపఱచు
వాఁడు.

రజతప్రస్థము. సం. వి. అ. పుం. కైలాసము,
వెండికొండ.

రజతము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. తెల్లనిది,
శ్వేతమైనది.

వి. అ. పుం. న. ౧. వెండి. ౨. బంగారము.
3. ముత్తెములసరము, ముక్తాహారము.
౪ రక్తము, నెత్తురు. ౫ దంతము.
౬. పర్వతము. ౭. ఏనుఁగు. ౮. రూప్యము.
౯. తెలుపు. ౧౦ ప్రాదము. (శే. ని.)

రజతాద్రి. సం. వి. ఇ. పుం వెండికొండ, కైలా
సపర్వతము. ఇట్లే రజతాచలము. మొ.

రజన. వి. గదన, సంపాదనము. (శ. ర.)

రజనము. సం. వి. అ. న. ౧. రంగుచేయుట. ౨. కుంకుమపువ్వు. ౩. రాగద్రవ్యము. (శే. వి.)

రజని. సం. వి. ఇతీ. స్త్రీ. ౧. రాత్రి. ౨. పసుపు. ౩. లక్క. ౪. దుర్గాదేవి. ౫. కుంకుమపువ్వు. ౬. జతుకృత్తు, కొరింద కే. (శే. వి.) ౭ నీలి, ఒకానొక ఓషధి.

రజని (నీ) కరము. సం వి అ. పుం. కర్పూరము.

రజని (నీ) కరుఁడు. సం. వి. అ పుం. చంద్రుఁడు.

రజని (నీ) చరుఁడు. సం వి. అ. పుం. ౧. రాత్రించరుఁడు, రాక్షసుఁడు, పిశాచము ౨ చోరుఁడు, దొంగ ౩. రాత్రికాపలి యుండెడివాఁడు. ౪. చంద్రుఁడు

రజని (నీ) జలము. సం వి. అ. న. రాత్రి పడెడిమంచు, తెల్లమంచు.

రజని (నీ) పతి. సం వి. ఇ. పుం. చంద్రుఁడు

రజని (నీ) ముఖము. సం వి. ఇ న నిశాముఖము, సాయంకాలము, ప్రొద్దుకుంకువేళ.

రజము. సం వి. అ. పుం. రజస్సు, ఆర్తవము. ౨ రజోగుణము. ౩. పాంసువు, ధూళి. (శే. వి)

రజసానువు. సం. వి. ఉ. పుం. ౧. మేఘము. ౨. జీవుఁడు. ౩. హృదయము. ౪. ఘర్మము. (వై. వి.)

రజస్వలత్వము. సం. వి. అ. న. రజోగుణము కలిగియుండుట.

రజస్వల. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఋతుమతియగు స్త్రీ. ముట్టయినయాఁడుది. ౨. పెండ్లియాడు గల కన్య.

రజస్వలము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. దుమ్ముగలది, దుమ్ము గ్రమ్మినది. ౨. ఉద్రేకము గలది, రజోగుణముగలది. వి. అ. పుం. మహిషము, దున్నపోతు.

రజస్సు. సం. వి. స్. న. ౧. దుమ్ము, ధూళి. ౨. పుష్పపరాగము, పుప్పొడి. ౩. సూర్యకిరణములో కనఁబడు అణువు; పరమాణువు. ౪. దున్నఁబడిన భూమి, సేద్యము చేయఁబడిన పొలము. ౫ త్రిగుణములగు సత్త్వరజస్తమోగుణములలో రెండవదియగు (రజో) గుణము. ౬. ఋతురక్తము, ముట్టునెత్తురు. ౭. కుంకుమపువ్వు. ౮. తగరము. ౯ శరదృతువు. ౧౦. నీరు. ౧౧ పూలమాల. ౧౨. తేజస్సు, కాంతి. ౧౩. రాత్రి. ౧౪. రేతస్సు, వీర్యము. ౧౫. పగలు. (శే వి.)

రజోయి. వి. చలికి కప్పుకొనెడు దుప్పటి. (శ. ర.)

రజోబలము. సం. వి. అ. న. అంధకారము, చీకటి.

రజోమత్త్వము=రజస్వలత్వము.

క. పార్థివులకు దివము రజోమత్త్వకలితవర్తనులకు మధ్యభువనవాసిత్వముఁదామసుల కు నీచత్వకరాధోజగంబు సంప్రాప్తమగున్.

భార. అశ్వ. ౨. ౧౭౯.

(ఈప్రయోగము సంస్కృతవ్యాకరణ విరుద్ధము)

రజోరసము. సం వి. అ. పుం. అంధకారము, చీఁకటి.

రజ్జాడు=రజ్జులాఁడు. అ. క్రి. (√రజ్జ.) వ్యర్థవచనములాడు.

గీ. చేయు నా యాజ్ఞ కెన్నఁడూ చేయకున్న, నెటిఁగదవుగాక రజ్జాడనేల యిపుడు.

కాశీ. ౭. ౧౬౩.

రజ్జ. స. క్రి. ప్రేలు, వదరు.

క. రిత్తలు రజ్జలువాఁడే, మత్తగజాయుత
బలుండు మారుతి యని మద్వృత్తిఁ దగు
దుష్టసేనుని,కెత్తు రురము వ్రచ్చి త్రావు
నీవుం జూడన్.

భార. ఉద్యో. ౪. ౨౦౪.

రగడ. చిలుకఁబోంట్ల కొసఁగె గుజ్జనఁగూళ్లు
గొజ్జంగ, యెలుఁగ కది పూ బంతులెల
యిటు రజ్జంగ. మనుచ. ౩. ౭౪.

అ. క్రి. ఆత్మస్తుతిచేయు.

చ. నిను నిఖిలార్థకారియనఁగ నెమ్మది నమ్మిన
వాఁడు కంసుఁడె, య్యానవునఁ గ్రుస్సిపోక
బలమంతయుఁ జూపుదుగాక రిత్తరజ్జనపని
దీఱునే పెదఁగ చండికవంబున నీవుగన్ననీ,
యనుపమకీర్తి కింతట సమాప్తి యొనర్పఁగఁ
జూపవచ్చితిన్.

హరి. పూ. ౯. ౧౦౭.

(రజ్జన = రజ్జన్ అ = ప్రేలగానే, రజ్జనఁబని
దీఱునే క్రొత్తప్రతిపా)

విశే. వ్యర్థము.

సీ. రచ్చలకెక్కి పెన్ రజ్జఁజేతల సరివారిలో
పలఁ దలవంపు చేసి. భాగ. ౬. ౧౩౫.

(రజ్జఁజేతల = వ్యర్థకార్యములచే)

వి. ౧. వ్యర్థభాషణము.

చ. ఇలువడిగన్ననేని నిలయెల్లను నేలఁగఁజాలు
చేయు రజ్జలు విను రాజ నేర్పరియు కూరఁ
దుఁగ వలయుం జుమీ.

భార. శాం. ౩. ౧౦౩.

సీ. అనిశమదల్పినను వారణవాయి గొనక యప్పులు
కు లన్నియును రజ్జలుగఁ గొనుచు.

భార. మా. ౧౭౫.

౨. దుర్భాషణము.

క... సిరియా, దయను గాని రజ్జలేటికి, మహిని
బయ్యదంపుఁ బోంటి చందములగు లకే.

భార. విరా. ౪. ౧౯౩౦

ద్వి. రజ్జలాడెదవు నారాయిడఁగలఁగి.

ద్వి. హరిశ్చ. పూ. ౨౧౧౦. పం.

గీ. అమ్మ నేఁజెల్ల వాఁడనయ్య మకేమి, రజ్జ
లాడెదు మంచి గురస్తువగుదు, చేరి మాటాడి
నపుడె నా సిగ్గువోయెు, నార యంటివి కెన్న
బాగాయెఁగాదు.

శుక. ౨. ౪౨౩.

౩. ఆత్మశ్లాఘనము, డంబము.

మ. తగవే రజ్జలు నేఁడు నీదగు మహాస్థానంబులో
నింతటన్, పగవారక్కడ గ్రుక్కరే

భా. రా. యు. ౧౧౨.

గీ. ఒకట నైనను వారియం దొకరిలోని, చిదుర
పాలును బోలందు సిగ్గులేక, పాండవులగెల్తు
నేనని పలుకుచుందు, వీనిరజ్జలు తులువలు
విం(ద్రు దగిలి.

భార. ఉద్యో. ౨. ౧౬౧.

ఆ. సభల బలుకు దీవు సరిలేరు నాకని, విదరణంబు
వచ్చెనెల్ల వారి, కెఱుఁగవచ్చు దీనఁ బెం
చోట రజ్జైన యట్లు పూరగింప నగునె
యిచట.

భార. విరా. ౫. ౭౭.

ఉ. వాయసు రజ్జలేల మునివల్లభ వృద్ధుఁడ
నొండఁగావులేఁ, బ్రాయపువాఁడవద్రివన
రమ్యములైన యనేక దేశముల్, ధీయుత
యల్పకాలమునఁ ద్రిమ్మర కొక్కొ మెనీకు
నెమ్మయిన్.

మార్క. ౪. ౨౧౪.

౪. దురభిమానము, తగనిగర్వము.

౨. అపకీర్తి.

గీ. రాజవై యేడు కడపట సోజమాలి, తెచ్చి
కొంటివిపొమ్మని తిట్టురట్టు, సకటయిఁక నైన
నా చెప్పినట్లుచేసి, దేవశాచార్యునకుఁ దారఁ
దిరుగనిమ్ము.

వరాహ. ౩. ౨౬.

ఉ. అట్టివదీయమైనవపురాశ్రయలోభ మహా
పరాధమే, గట్టిగ లేచివచ్చుటకుఁ గారణ
మైనది నాకు దోసముల్, గట్టెదుటనీ మృషా
చటువికారముఁ జూడఁగఁజేసియిప్పుడున్,
దిట్టునురట్టున గ్గమగు దీనికి నిన్ననఁ జెల్ల
జేసియున్

ప్రభా ౫. ౧౩౭.

ద్వి. ఏరట్టుఁదిట్టునా కేసఁగకయుండ, బోరన
మునిపుత్రుఁ బ్రోచితిగాన

ద్వి. హరిశ్చ. పూ. ౨౮౩౯. పం.

౩. ఉపద్రవము, ఆపద

ఉ. గొట్టుతనావఁదన్ వెడలగొట్టిన దిట్టును రట్ట
డంచుఁ దోఁబుట్టువనాట నొండనోకపోయితిఁ

ఉ. రా. ౨. ౩౦౯.

ఉ. రాచకుమారుపోరు భువి రట్టని యెంచక నైజ
వంశమున్, నీచతఁజెందువం చవక నెమ్మది
మామయశోవిలాసమా, రోచితవృత్తియుండ
లియకోపకవల్లను నీలలోహితుం, జూచిన
చూపెభావమునఁ జూచుచుఁగాఁ పమిటారి
యేఁపునన్.

ఉ. హరిశ్చ. ౪. ౩౫.

(ఉపద్రవకరమని భావము.)

ఉ. హత్యకుఁలోఁయుఁజూతురె దురాత్ముకుశై చరి
యించురాక్షస, బ్రాహ్మణులు వీరివంకనగు
రట్లకుఁ దిట్లకుఁ జెట్లకోర్చునా, ధర్మ్యవిశేష
మెక్కుడిది.

చం. రా. ౨. ౧౫.

౪. పెంకె, (ఫిర్యాదు)

దండకము...పిన్నదేమాయుఁగొల్లాఁడఁగా గొల్ల
యిల్లాండ్రు నందారవిందాస్యతో రట్టు
గావించినన్. పారి. ౩. ౩౯.

౫. గోల, అల్లరి.

సీ. ఏచినకలపోఁక దాఁచెదమంటిమా విట్టూర్పు
గాడ్పులు రట్టుసేయు.

వరాహ. ౪. ౧౯.

గీ. తనదు చిన్నెలకైయాసఁ దదవుసేయ, వడుగ
వచ్చిన మనను రావట్టివారి, రట్టుగావించి
మగనాలిఁ బట్ట డాసి, తారమెట్టోయటని
దుమ్మెత్తురాదు పెత్తు.

శుక. ౨. ౧౦౫.

౬. చౌర్య, సాహసము.

క. చుట్టటికమెంతగల్గిన, రట్టునరా రానిరెుదకు
రా వారలపై, సెట్టి సుబుద్ధుల కైనను,
బుట్టును లోపంబు దాన బుట్టుం జెట్టన్.

హంస. ౫. ౩౯.

సా. అట్టుపెట్టుసాఁపాదివానిది రవ్వరట్టు గంగా
రమ్మది.

౭. గట్టుకత్తె, రట్టుపడు.

రట్టుకత్తె. వి. (రట్టు+కత్తె) సాహసికురాలు,
చోరవకత్తె.

సీ. అలిగిరెుంతటిరాజు కాంద్రయైనపుట్టి పుట్టు
పాపలకేయు రట్టుకత్తె.

క్రీడా. ౧౭౯.

రట్టుపడు. అ. క్రి. (రట్టు+పడు) రవ్వపడు.

క. పెట్టుదను పెరావవచ్చిన, పట్టున ధైర్యంబు
వదలి పలుమఱుమిగులన్, రట్టుపడి తమకి
మదిలో, వట్టిట్టపెనోవి నవ్వారా నరివారల్.

హరిశ్చ. ౪. ౧౧౪.

గీ. చాలభువిదట్టుపడి హరిశ్చంద్రుచేత, లీల
భూచక్ర మెల్ల నేలించుటకుఁ నిలఁబడదు

´ పుణ్యమటుబంచి యుద్ధుటకును, కారణం
చేమి గాధి తపూరయనకును.

ఉ. హరిశ్చం. ౪౩౭.

రడి=రడ్డి. (శ. ర.)

రడ్డి=రఢి. వి. (సం, రాట్.) శూద్రులలో నొక
తెగవాఁడు.

వ .. శ్రీమతు కారపతి వచ్చయరడ్డికొడుకు
సూరయరడ్డి. ద. శా. ౪ ౧౧౫.౨

క. ఎడ్డెలనపుఁగయిపేతల, రడ్డులనదచిరి పుర
స్సరద్వార్థ్యముగా, గుడ్డంబుచక్కఁగట్టం,
బడ్డమువాళకత్తి దివ్య భవనంబునకున్.

పాండు 3. ౩౫.

సీ. శూద్రనామంబులు శోభిలు. తద్విశేషమ్ము
లై తనరుఁ గమ్మని వెల్మయని రెడ్డియని రడ్డి
యని వచింప.

ఆం. భా. ౨. ౨౭౨.

గీ. రాజశేఖరుఁడగు వెల్లరడ్డిరాణి, భూరి సద్గుణ
నికరంబ పోచమాంబ.

శివ. ధ. ౧. ౧౦౩.

వ ... బుధవారమునాండు శ్రీమద్దాక్షారామ
భీమేశ్వర దేవ(రకు) కొండిపత్తిదారపరడ్డి
కొడుకు పోతిరడ్డి తల్లిదండ్రులకుం దనకు
ధ(ర్మార్థముగా) బోలు వలుపుర బూం
ట్టుగా యూందవునశేవున...

ద. శా. ౪. ౧౦౭౫.

పారం౧. ౨. ౧౧౫.

రణతూర్యము. సం. వి. అ. న. యుద్ధవాద్యము.

రణత్కారము. సం. వి. అ. పుం. ౧. రణ
రణధ్వని, గడగడధ్వని, గణగణమనుధ్వని,
గలగలలాడుధ్వని, ఘల్లుఘల్లుమనుధ్వని. ౨.
సామాన్యధ్వని. 3. ఝుంకారము, తుమ్మెదల
ధ్వని.

రణపెండ్లికొడుకులు. తె. వి. బ. భార్యలోకే
వము.

సీ ,... గార్యకుంకుమల్ రణపెండ్లికొడుకుల
పిచ్చుకగోళ్లు ప్రయాగలు గొజ్జఁగ్రాలు.

హంస. ౪. ౧౨౭.

వ...సీతాభోగాలు గారికుంకమలు వాగమల్లెలు
గొబ్బికాయలు రణపెండ్లికొడుకులు ఈశ్వర
ప్రియములు ..

ప్రబంధ. ౧౧౨.

రణప్రియము. సం. వి. అ. పుం. డేగజాతిలోఁ
జేరినపక్షి. (యుద్ధమందిష్టముగలది.) (విల్యమ్సు)

రణము. సం. వి. అ. పుం. న. ౧. యుద్ధము,
కయ్యము పుం. ౧. ధ్వని, చప్పుడు. ౨.
కణము. 3. గతి, గమనము.

రణరంగము. సం వి. అ. పుం. యుద్ధరంగము,
యుద్ధస్థలము.

రణరణకము. సం. వి. అ. పుం. న, ౧.
ఉత్కంఠ; ఉద్వేగము.

వ...అని యనేక ప్రకారంబులఁ దిలోచుచుండు
రణరణక వ్యథాకలిత హృదయుం డగుచు
నుండె నంత...

కు. సం. ౭. ౭౩.

౨. వియోగము (శ. ని.)

రణరణకుఁడు. సం. వి. అ. పుం. మన్మథుఁడు,
కామదేవుడు (శ. ని.)

రణసంకులము. సం. వి. అ. న. యుద్ధవ్యాకు
లత, దొమ్మియుద్ధము.

రణాంగణము. సం. వి. అ. న. యుద్ధరంగము.

రణితము. సం. వి. అ. న. మ్రోత.

విశే. మ్రోసినది. (శ. ర.)

**రతకీలము.** సం. వి. అ. పుం. కుక్కము, కుక్క. (విల్యమ్సు)

**రతకూజితము.** సం. వి. అ. న. మణితము.

**రతగురువు.** సం. వి. ఉ. పుం. మగఁడు, ప్రియుఁడు.

**రతజ్వరము.** సం. వి. అ. పుం. కాకి (త్రి. ని)

**రతతాలి.** సం వి. న్. పుం. కాముకుఁడు, భోగలోలుఁడు ఈ. స్త్రీ వేశ్య. లంజె.

**రతనపుగని.** వి. (రతనము+గని) రత్నాకరము, సముద్రము.

క. వినుమనుమఁడ మానుదువులు, వినుముసుపు దలిర్ప నీవు చేతోండు తలం,పునసుండిన నీ రతనపు, గనియిందిఁక నొరుఁడు దాఁటఁ గలఁడే చెపుమా.

అచ్చ. రా. కిష్కిం. ౮౫.

**రతనపువిల్లు.** వి. (రతనము + విల్లు) ఇంద్రధనుస్సు (శ. ర.)

**రతనము.** వి. (సం రత్నం) రత్నము, మణి.

చ. రతనపుఁగోటఁ గ్రమ్మినను రాలెడు కెంపులగ ద్దతోపలన్.

దశా. ౧. ౭౨.

క. మతిఁ దుమమఁ దగుచొ ముద్దుల, రతనమ్మన యీ యిదే దొరతనమ్ము నృపా.

సారంగ. 3. ౭౧.

ఉ. తెల్లని దీని తమ్మి చెలదేఁటి వలెన్ దగుకొక్క బాగరిన్, నల్లని వాని లచ్చిరతనంబును మచ్చరొందం దలిర్ప రం,జిల్లెడు వానిఁ బొట్టలంగుఁ జిందమునందినవానిఁ చెంపుసొం, పెల్లెడఁ గల్గు పాల్కడలి యిల్లట పల్లనిఁ గాంచి రయ్యెడన్.

రామా. 3. ౪౪.

(రతనము=కౌస్తుభము)

గీ. మానికము రతన మనంగ మణి చెలంగు.

ఆం. భా. ౨. ౨౪౭.

జ' రతనపు విల్లు, రతనాల కుప్పె.

**రతనారీచము.** సం. వి. అ. పుం. ౧. కుక్క. ౨. రతికూజితము, మణితము. (రతనారాచము.)

**రతనారీచుఁడు.** సం వి. అ. పుం. కామదేవుఁడు, మన్మథుఁడు. (రతనారాచుఁడు)

**రతనాలకుప్పె.** వి. (రతనాలు+కుప్పె) భూషణ విశేషము.

సీ. రతనాల కుప్పె సౌరపు జడకుచ్చులు శశి పూల చందురున్ సరిగలు చెప్పులును.

చెన్న ౨. ౨౦౪.

**రతనిధి.** సం. వి. ఇ. పుం. కాటుకపిట్ట.

**రతము.** సం విణ (అ. ఆ. అ.) ౧. అనురాగము గలది. ౨. ఇష్టముగలది. 3. తదేకాయత్తమైనది.

వి అ న. ౧. ఆనందము, సంతోషము. ౨. రతి, మైథునము. 3. గుహ్యావయవము.

**రతవ్రణము.** సం. వి. అ. పుం. కుక్కము, (త్రి. ని)

**రతహిండకుఁడు.** సం. వి. అ. పుం. ౧. స్త్రీని బలాత్కరించువాఁడు, స్త్రీనిఁ కొనిపోవువాఁడు.

**రతాంఘ్రి.** సం. వి. ఈ. స్త్రీ. కుచేలి, తూడమంచు (త్రి. ని.)

**రతి.** వి. రత్నముల తూనికయం దుపయోగించు పరిమాణ విశేషము, ఒకానొకయెత్తు.

సీ. అతివినోదముగాఁగ రతుల తూచ్చించు నీ పచ్చల కడియాల పద్మగంధి.

విజ. వి. ౧. ౧౨.

**రతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. ఆనందము, సంతోషము. ౨. ఉత్కంఠ, తత్పరత. ౩. పరమప్రీతి. ౪. వలపు, ప్రేమ; శృంగారరసస్థాయి భావము. ౫. రత్యానందము, రతిసుఖము. ౬. సురతము, మైథునము. ౭. మన్మథుని భార్య యగు రతీదేవి. ౮. యోని, ఆఁడుగుఱి. ౯. చంద్రుని పదియాఱు కళలలో నాఱవదియగు కళ.

రతికుఁబ్రాణసంపదన్ నిరాకరించుచేనవహో, రతి కుకామినీ మనశ్శరవ్యులింటియుల్లకా, రతిర్పురల్ కురల్, మనోజరాజసైంధవాళికిన్, రతిబోసంగు పెంచి యప్పురంధ్రి సెన్నకక్యమే.

చంద్రా. ౪, ౧౪౨.

వ. .పెం, దొగలేఁ దూఁడు రతిబు వారువపు బల్ తూపేసి వారించుచున్.

చంద్రా. ౬. ౭౬.

**రతికుహరము.** సం. వి. అన స్త్రీ గుహ్యము ఆఁడుగుఱి, యోని.

**రతిపతి.** సం వి. ఇ పుం కామదేవుఁడు, మన్మథుఁడు.

**రతిప్రియుఁడు.** సం వి. అ పుం. కామదేవుఁడు, మన్మథుఁడు.

ఇట్లే రతిరమణుఁడు మొ॥

**రతిబంధము.** సం. వి. అ. పుం సురతమందలి భంగిమ.

(నాగపాశము), లతావేష్టము మొ)

**రతిమందిరము.** సం. వి. అ. న. ౧. స్త్రీ గుహ్యవయవము, ఆఁడుగుఱి. ౨. మైథున గృహము ఇట్లె రతిగృహము మొ॥

**రతిమద.** సం. వి. ఆ. స్త్రీ. అప్సరస. ఇట్లె రతే చూడ. (వై. ని.)

**రతిలక్షము.** సం. వి. అ. న. మైథునము, సురతము.

**రతిసత్వర.** సం. వి. ఆ. స్త్రీ. ఒకానొక ఓషధి. (వా. చ.)

**రతిబు.** వి ఆహారము.

పంచచామరము, -

**రతువు.** సం. వి. ఉ. పుం. వార్తాహారుఁడు, దూత.

స్త్రీ. ౧. నది. ౨. బంధనము. ౩. మార్గము.

**రత్నకందళము.** సం. వి అ. పుం ప్రవాళము, పగడము.

**రత్నకంబళము.** సం. వి. అ. పుం ఒకదినుసు కంబళి.

వ ..రత్నకంబళములు దుద్దుగంబళులు జముకాళంబులు తివాసీలు పటుచాఁపలు.

ప్రబంధ. ౬౦౫.

**రత్నకంబళి.** (డి) మి. వి. రత్నకంబలము, ఒక విధమగు తివాసి.

సీ. రవలపావలు చామరంబులు రత్నకంబళ్లు నీరాజనభాజనములు, గీ. కుందలుగాఁగల వస్తుసముత్కరములు, కరములధరించి పడతిరి పరపికాతు, లు.

వరాహ. ౪. ౧౨౨.

చ. విరితొగచందువాతెగల చేదుకయాబడి యంగణంబులోఁ, బఱచిన రత్నకంబళిని బాగుగ నూరెపుటంపుగద్దియున్, పఱలు మెఱుంగు బంగరపువన్నె జగాబుర సాతి వాసిపై, ధరణిబలోవసించెఁ బతి తక్కాత లాదలఁ జేతులానుచున్.

ఉ. రా. ౬. ౧౨౭.

సీ. రత్నకంబళ్లు మూరత్తుఱత్తిని పట్టుదిండ్లు సేమంతి పూచెండ్లు గంధ, వొడులు.

సాసంద్. ౧. ౧౩౯.

రత్నకీలితములు. వి. బ. వస్త్రవిశేషము.

వ .. ద్రౌపదీ స్వయంవరంబులును ... వసంత విలాసంబులునురత్నకీలితంబులును.

ద్వా. 3. ౧౭౭.

రత్నకూటము. సం. వి. అ. పుం. ఒకానొక పర్వతము.

రత్నగర్భ. సం. వి. ఆ. స్త్రీ. వసుంధర, భూమి.

రత్నగర్భము. సం వి అ. పుం. సముద్రము.

రత్నగర్భుఁడు. సం. వి. అ. పుం. ౧. కుబేరుఁడు. ౨. సముద్రుఁడు.

రత్నద్వీపము. సం. వి. అ. పుం. స. సుధా సముద్రమందున్న ఒక ద్వీపము. (వాచ.)

రత్నధేనువు. సం. వి. ఉ. స్త్రీ. ఒకానొక మహాదానమునకై నిర్మింపఁబడు మణిమయమైన గోవు. (వాచ.)

రత్ననిధి. సం. వి. ఇ. పుం. ౧. సముద్రము ౨. విష్ణువు. 3. మేరువు. ४. కాటుకపిట్ట. (విల్యమ్సు)

రత్నము. సం. వి. అ. న. ౧. మణి, మాణిక్యము, వజ్రముత్యాదికము, ౨. అమూల్యవస్తువు, ప్రియపదార్థము. 3. (తజ్జాతియందు) శ్రేష్ఠమైన పదార్థము. ఉదా :- పుత్రరత్నము, స్త్రీరత్నము మొ॥ ४. అయస్కాంతము, సూదంటురాయి. ౫. వజ్రము. (రాజ. ని.) ౬. నీరు, సలిలము. (శే. ని.)

రత్నముఖ్యము. సం. వి. అ. న. వజ్రము.

రత్నవతి. సం. వి. ఈ. స్త్రీ. రత్నగర్భ, భూమి.

రత్నవరము. సం. వి. అ. న. బంగారము. (వై. ని.)

రత్నసరులు. మి. వి. బ. ధాన్యవిశేషము.

సీ. ఏలిక రాజనాలీశ్వరప్రియములు రావిపూరాజనాల్ రత్నసరులు.

హంస. ४. ౧౭౭.

ప రామబాణాలు కటకసరులు రత్నసరులు జీనిసరులు.

ప్రబంధ. ౧౧౭.

రత్నసానువు. సం. వి. ఉ. పుం. మేరు పర్వతము

రత్నసువు. సం. వి. ఊ. స్త్రీ. రత్నగర్భ, భూమి.

రత్నహస్తుఁడు. సం. వి. అ. పుం. కుబేరుఁడు. (వై. ని)

రత్నాకరము. సం వి. అ. పుం. ౧. మణుల గని. ౨ సముద్రము.

రత్నాచలము, సం. వి. అ. పుం. దానార్థము కల్పించిన మణిమయపర్వతము.

రత్నాభరణము. సం. వి. అ. న. రత్నభూషణము, రత్నములతో కెంపిన నగ.

రత్నావలి. సం. వి. ఈ. స్త్రీ. ౧. రత్నహారము, మణిసరము. ౨. రత్నసమూహము. 3. శ్రీ హర్షరచితమగు ఒక నాటిక.

రత్ని. సం. వి. ఇ. పుం. స్త్రీ. మూర, మోఁచేయి మొదలు పిడికిలివఱకుఁగల ప్రదేశము. పిడికిలితి మూర.

రత్యంగము. సం. వి. అ. న. స్త్రీగుహ్యము, ఆఁడుగుఱి.

రథకడ్య. సం. వి. ఆ. స్త్రీ. రథసమూహము.

రథకారుడు. సం. వి. అ. పుం. ౧. రథములు చేయువాఁడు, తేరుచేయువాఁడు. ౨. వడ్లవాఁడు. ౩. క్షత్రియునివలన సంకరజాతి స్త్రీయందుఁబుట్టినవాఁడు, సంకరజాతివాఁడు. (వై. వి.)

రథకుటుంబి. సం. వి. న్, పుం. సారథి, తేరు నడపువాఁడు.

రథగర్భకము, సం. వి. అ. పుం. పాలకి.

రథగుప్తి. సం. వి. ఇ. స్త్రీ. సంఘర్షణము. (తాఁకుడు) వలనఁ గాపాడుటకై రథముపై గఱ్ఱతోఁగాని యినుముతోఁగాని కట్టిన యావరణము. (శత్రువుల శస్త్రాదులలోపలఁ బడకుండఁగ కాపాడఁబడిన (ఆవరణకట్టఁబడిన) రథమధ్య భాగము.

రథచరణము. సం. అ. పుం. ౧. బండిచక్రము. ౨. చక్రవాకపక్షి. ఇట్లే రథపాదము. కెం.

రథచర్య. సం. వి. అ. స్త్రీ. రథోపయోగము; రథప్రయాణము.

రథద్రువు. సం. వి. ఉ, పుం. తినాసము. ?.

రథనీడము. సం. వి. అ. పుం. రథముయొక్క చివరిభాగము (వై. వి.)

రథము. సం. వి. అ. పుం. ౧. తేరు, బండి, శకటము. ౨. పాదము, అడుగు. ౩. అవయవము. ౪. శరీరము, దేహము. ౫. రెల్లు. ౬. తినిశము. ?. (వాచ.) ౭. చక్రవాకము (వై. వి.)

రథయాత్ర. సం. వి. అ. స్త్రీ. రథోత్సవము, రథముపై దేవతావిగ్రహముంచి యూరేగించుట.

రథసప్తమి. సం. వి. ఈ. స్త్రీ. మాఘశుక్ల సప్తమీతిథి.

రథాంగనామము సం. వి. న్. పుం. చక్రవాకపక్షి. ఇట్లే రథాంగాహ్వయము కెం.

రథాంగపాణి. సం. వి. ఇ. పుం. చక్రపాణి, విష్ణువు.

రథాంగము. సం. వి. అ. న. ౧. బండిచక్రము, ౨. విష్ణునియాయుధమైన చక్రము. ౩. కులాలచక్రము, కుమ్మరిసారె. పుం. చక్రవాకపక్షి.

రథాభ్రము. సం. వి. అ. పుం. రెల్లు. ? వేతసము, నీటిప్రబ్బలియని (వాచ.)

రథాంగాహ్వయము. సం. వి. అ. పుం. చక్రవాకము. (శ. ర.)

రథి. సం. విణ. (న్. నీ. న్.) ౧. రథముపైనెక్కి పోవువాఁడు. ౨. రథాధిపతి.
వి న్. పుం. ౧ రథికుఁడు, రథయజమానుఁడు, ౨. రథముమీఁదనుండి యుద్ధముచేయు యోధుఁడు.
ఈ. స్త్రీ. ఎద్దులుగట్టిన బండి, గంత్రి. (శే.వి.)

రథికుఁడు. సం. విణ. (అ. ఈ. అ.) ౧. రథము (బండి) మీఁద వెళ్లుచున్న వాఁడు, రథముపైఁ బోవుచున్న వాఁడు. ౨. రథయజమానుఁడు, రథముగలవాఁడు.

రథిని. సం. వి. ఈ స్త్రీ. రథసమూహము, బండ్ల పొంత్రము.

రథినుఁడు. సం. విణ. (అ. ఆ. అ.) రథి.

రథిరుఁడు. సం. వి. అ. పుం. = రథినుఁడు.

రథోపస్థము. సం. వి. అ. న. రథమధ్యము.

రథ్య. సం. వి. ఆ. స్త్రీ. ౧. రథములుపోవుమార్గము. పెద్దత్రోవ, రాజమార్గము ౨. పెక్కుత్రోవలు కలసికొనెడిచోటు, అవర్తి. ౩. రథసమూహము బండ్లసమూహము.

రథ్యము. సం. వి. అ. పుం. ౧. రథాశ్వము, తేరుగుఱ్ఱము, బండిగుఱ్ఱము. ౨. రథావయవము. రథముయొక్క యొక భాగము, చక్రము కెం॥

**రదచ్ఛదము.** సం. వి. అ. పుం. పెదవి, మోవి.

**రదనచ్ఛదము.** సం. వి. అ. పుం. పెదవి, పలు కప్పు. (శ. ర.)

**రదనము.** సం. వి. అ. పుం. రదము.

**రదము.** సం. వి. అ. పుం. ౧. పగులువాఱుట, బ్రద్దలగుట. ౨. గోకుట, గీఱుట ౩. దంతము. ౪. ముప్పదిరెండు సంఖ్యకు సంకేతపదము.

**రది.** సం. వి ఇ. పుం దంతములుగలది, దంతి, ఏనుఁగు.

క. రదిఁగొను మచ్చోటనుతే, పాదప్రాజాపత్య లోకమున ననవుడు . భార. అను. ౪.౪౨.

**రద్ది.** వి. ౧. అల్లరి, గోల.

క. ముద్దుల కొమరుని ప్రేతల, రద్దులకై తల్లితోల రజ్జఁగట్టన్, బద్దులకు మిన్నుముట్టిన, మద్దులవడిఁ గూల్చి జనసమాజము పొగడన్. భాగ. ౨. ౧౪౪.

సీ. . రద్దిచేసి యువ్వరికైనఁజెప్పికొందు, నంటి నామణి ఏనికంటె నిక్కడ నెక్కడగువాఁడు లేఁడు.. చెన్న. ౫. ౧౩౭.

౨. గొప్పధ్వని.

సీ. గళరవంబులు రద్దిగాఁజెలంగింపక పలుమాఱు మెల్లనె పలుకుచుండు. అని. ౩. ౧౭.

**రద్దు.** వి. ౧. అల్లరి.

ద్వి. పుట్టు గొడ్రాలివి పురవీథి నడుమఁ, బట్టి యీడ్చుచు రద్దు పద్దుచేయఁగను. ద్వి. క. సా. ౩. ౧౭౭. పం.

సీ. కొల్లసాఁకిన బొంతకుండలో విప్పించుఁ గొద్ది తొత్తులపొందు రద్దుకీడ్పు. కేయు. క. ౧౫. ౨. కొట్టికేత, తినికేత. (శ. ర.)

**రవకము.** సం. వి. అ. పుం. మంచూకము, కప్పు. (శ. వి.)

**రవకుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) విద్వాంసుఁడు (శ. వి.)

**రవణము.** వి ౧. గర్వము.

ద్వి. పోరపుంజంపుచాయలఁ గ్రిందుపఱిచి, కపు రంబు చవచవగా నాడిమంచు, రవణంబు విడియించు రమణఁజెన్నొందు, నహిరాజశ యనంబునందు. ద్విపరమ. ౪. ౩౦౪. పా. ౨. ఉత్సాహము.

మ. అపుడాకీర్తిముఖుండుఁ దత్సతియనత్యానంద సంధానతన్, నృపకాంతాజనముల్ మహీమ రపురంధ్రీ రత్నముల్ గొల్వఁగా, రవణం బుప్పతిలందదంత విభవారంభంబు గావిం చియుఁ జపలాక్షీమణికి న్వివాహమొనరిం చం గార్యమూహించుచున్. శుక. ౧. ౩౭౪.

విశే. గొప్పది. ఘనము.

సీ. రవణంపుబొమ్మ మాత్రపుఁ గంటసరితోడ మెండకప్పుకస్తూరి బెడఁగుతోడ. పాంచా. ౩. ౪౭.

**రవము.** వి. ౧. అధికారము.

క. కోపమేమియు లేకయుతన, రవమైతము బాధ పఱుప రాత్రనుమీఁదన్, గుపితాత్ముఁ దన మలు, కపియింపఁగఁజాలరైరి జలజాతమహీ మన్. సీతావి. ౧. ౨౫.

౨. చెల్లుబడి.

చ. . భువనబంధుఁడుశౌరి యరాజకంబుచేఁ, దన రవమై చరించె వసుధాస్థలి చీకటి పారెగాఁడొగిన్. అని. ౩. ౮.

సీ. చెల్లుబడికిఁ జేయచెలఁగుమ రవమున... అం. భా. ౩. ౩౨.

విశే. ౧. అధీనము.

చ. విరహాలఁజంపసాగితివి చేయన నేమిటికూరు ముక్కుఁడిక్, బరఁగునపోఁడుఁబోకలరవం

బయటపాటు నిజంబెటోళకి. హంస. ౫. ౨౦౧.

౨. ప్రచురము.

ఆ. ఇరులుంగొనుచు దిక్కులెల్లఁ దక్కపడఁ
దమ రపంబునంగ దట్టమగుచు, చేతికందినట్టు
చెన్నువింతగఁదోఁచె, నంబు గర్భమాతవాం
బుదములు.

శివలీలావిలాసము (కొమ్మన) ౧. ఆ.

వ. ... అవరాహంబు.

చ. ఎల్లెదం, దన రపమై చరించునతిదారుణ
లీలవనాంతరంబునన్. విక్ర. ౨. ౧౨౭.

క. అసురఁగలతికలు దరువులు, దమరపమై పసిమి
మిసిమి దగ్గకమిగులం, గొమరై ప్రొద్దో
చాయల, గుమురైయొలదోఁట యనలుఁగొన
లుంచాకెన్ విప్ర ౨. ౨౪.

రప్పు. వి. రాయివంటి గట్టివస్తువు (ఇదిరాయితోఁ
గూడి ప్రయోగింపఁబడును, గాని స్వతంత్ర
ప్రయోగము లేదు )

చ. పయిఁబయిఁ బండుకొల్పు వెరిపైఁడియు గట్టి
దినుసు రాయిర, ప్పయు మణిబంటుబాని
సలుఁబైరముఁ బెయ్యముఁ జేసుఁజెట్టులో,
వయిన సమస్తసంపదలు. కళా. ౬. ౧౬.

క. ఇదిరాయిరప్పుపల్లం, బిదిమిత్తిది మాకుమట్ట
యిదిపామిదిగా,మిదియని వివరింపఁగబెట్టి,
దయమై యొక్కొప్పనఁగునక్కటికి చీకటిలోన్.
వెం. పంచ. ౪. ౨౪౪.

రప్పించు. స. క్రి. (√ వచ్చు) ౧. రావించు,
రాఁజేయు.

క. నటునాహంకృతిఁదమలోఁ, జిటిపాటి జగ
దంబులూర్వశీ రంభలకుం, బోటమిన మేలేర్ప
డఁపఁగ, నిటనిమరప్పించె నిర్జరేశ్వరుఁడధిపా.
విక్ర. ౨. ౭౪

గీ. పతికలావతి యనుదానిఁ బద్మనయన, దమ
సహోదరి గారాపుదాదిమాఁకు, నంతికము
నతి రప్పించి యాదరించి, సర్వసాక్షి
గావించినగుచు పలికె. నైష. ౭. ౫౪.

క. క్రమమున ధరణీధరణ, తమమగుతద్ధర్మనీతి
చాతుర్యవిశేషము శేషమరసి యధిక, ప్రమ
దుఁడయి ప్రసంగవశత రప్పించితగన్.
రాఘవ. ౩. ౫.

౨. కలిగించు.

ఉ. ఉంచినయగ్రహారముల నున్నతవైఖరి విద్య
శాల్ల, రప్పించిన విప్రవర్త్రిముల, పెంచిన
వ్యవహార్కారంబులన్, నించిపబల్తటాకముల
నెమ్మిగనందగు వెంగళాంబ, యర్ధ్యంచిత
కీర్తిసౌధవిశదాక్షర నానమరాశి రాజమై.
వసు. ౧. ౬౪.

ద్వి. మానంబు దప్పించి మనమునొప్పించి, దీనత
రప్పించి దిగులు దెప్పించి.
ద్వి. హరిశ్చ పూ. ౧౬౧౩. పం.

రప్పా. హిం. వి. పోగుతీయుట. (శ. ర.)

రబాబు. వి. (హిం. రబాబ్) వాద్యవిశేషము.

గీ. గోటివాద్యంబు కిన్నరమీటుబడ్డి, వాద్యము
రబాబు వగలు సర్వంబు మెఱయ, దురము
గతిఁ జూపఁ బార్వతీతరుణి మెచ్చి, జారుసరి
గంచుపయ్యంటఁ జక్కఁజేర్చి.
కువల. ౪. ౧౧౨.

గీ. కేటుగజ్జెలు మద్దెల వీణ చెంగు, మురళిసారంగ
తిత్తి కిన్నెరరబాబు, శంఖతాళాది వాద్య
ముల్ సరసరీతి, పాటశ్రుతిఁగూడి వాదమే
ర్పాటుసేయ మల్లుపు. ౪. ౬౪.

వ. ... పికిలులు బచ్చికోళ్లు రుద్రవీణియలు
స్వరమండలంబులు తంబుఱలు కిన్నెరలు
రావణ హస్తంబులు బాబులు ...
ప్రబంధ. ౬౦౫.

రభసము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఉగ్రమై

వది, తీవ్రమైనది. ౨. తొందరగలది, అతిత్వర గలది. ౩. సంతోషము గలది, ఆనందముగలది. ౪. గొప్పది.

వి. అ. పుం. ౧. తొందర. ౨. ఆలోచింపక పనిచేయుట. ౩. కోపము, కోపావేశము. ౪. హర్షము, సంతసము. ౫. ఔత్సుక్యము, ఉత్కంఠ.

రభసుఁడు. సం. వి. అ. పుం. మ్లేచ్ఛుఁడు. (శే.వి.)

రభస్సు. సం. వి. స్. న. రభసము.

రభువు. సం. వి. ఉ. పుం. వార్తాహరుఁడు, దూత. (వై. వి.)

రమ. సం వి. ఆ. స్త్రీ. ౧. విష్ణుభార్యయగులక్ష్మి, ధనాధిష్ఠానదేవతయగు లక్ష్మి. ౨. సంపద. ౩. శోభ, కాంతి.

రమకుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) క్రీడాపరుఁడైనవాఁడు, ఆటలాడువాఁడు.

వి. అ. పుం. ప్రియుఁడు, ప్రేమపాత్రుఁడు

రమరధ్వని. సం. వి.ఇ. పుం. ఇంగువ, హింగువు.

రమరము. సం. వి. అ. న. హింగువు, ఇంగువ.

రమరుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) క్రీడనశీలుఁడు. (శే. వి.)

రమణ¹—రాణ. వి. (సం. రమ్యక్.) ౧. ఒప్పిదము.

క. ... రమణను వైశ్రవణు చైత్రరథమునకు సమానముగా దీనిని... భార. ఆది. ౪. ౧౫.

మ. శమవక్త్రాధరకేశయౌవనమహోద్దామ ప్రభావంబులన్, రమణం బొలుదుమన్న ..

కు. సం. ౫. ౭౩౩.

౨. ప్రేమము, ప్రీతి.

ఆ. అతులమగుచు దివ్యమైన యా హారమున్, గ్గంబు చూపవలయు రమణతోడ.

భాగ. ౫. ౧౬౨.

చ. రమణంబొప్పు సరోవరంబు నిజకాంతి రాజీవ రాజీవ, సత్పురుషాశ్రిత శీకరాళిక హంస క్రౌంచవాదంబులన్. భార. ఆది. ౬. ౧౬౨.

గీ. రాజనందనపాలికి రమణనరిగి.

దశకు. ౬. ౧౬౩.

గీ. రాముఁడాదిత్యకులభర్త రమణవచ్చి, కరుణ సేయునంతకుఁ దగుగట్టికాల్మి.

రాఘవ. ౩. ౩౫.

౩. ఆనందము, సంతోషము.

సీ. మందాకినియును గాళిందియు నిరుచక్కి రమణఁబై వింజామరంబువిడిరి. హర.౪.౭౨.

ఆ. రాజసుతులతోడ రమణఁ బాండవధృత, రాష్ట్రసుతులు వృద్ధరాజులొద్దఁ, దద్దయును ముదమునఁ దమతమ విద్యలు, మెఱసి యెల్ల జనులు మెచ్చి పొగడ. భార ఆది. ౬. ౧౧.

గీ. రమణవారామలక్ష్మి యారామవిభునిఁ, బూజ గావించు చందానఁ బొల్చెనపుడు.

ఉ. రా. ౬. ౨౫.

౪. ఆసక్తి.

ఆ. పొలుచు ద్రుపదరాజ పుత్రీస్వయంవర, రంగమునకుఁ జనిరి రమణతోడ.

భార. ఆది. ౩. ౧౬౫.

ఆ. ...హృదయహారి వివిధ, రత్నరాజి సుంద రంబైన మగధేశు, రథముతేరఁబనిచె రమణతోడ. భార. సభా. ౧ ౨౧౪.

౫. ప్రసిద్ధి.

సీ. బ్రహ్మభాగవతాది పదునెనిమిది పురాణములలో స్కాందంబు రమణఁగాంచు.

హరా. ౭.

౬. విధము.

సీ. కప్పురరేణువు కమలాప్త బింబంబు రాహు మండలమున రమణఁగప్పు.

భార. భీష్మ. ౧. ౨౪౨.

క. భూరిద్విశ్రుతులతో రాచిలోన నమ్మగలు కెల్ల-
కపోలర కంఠ కెంపు. హరి. ఉ. ౩. ౯౨.

రాచోలి. వి. (√రాచే). రాజకుమారుఁడు, రాజకుమారిక.

క. రాచూలికి నుచితంబగు, నాచారముగాద
రమునం దరుఁడు దగఁజూచుచుఁ. దిరుగని
నడవున, నీది యమురలోకమునకు నేఁగుట
తరుణి. భార. ద్రో. ౨. ౩౨౨.

గీ. అంతనచ్చట రాచూలినంత బేరయఁ,
దోడఁబుట్టువు గాఁడిన తూపుకెటికి, హైచి
ద్రోహ్వేఁడికక్నీర వరదవాఁడ, బలుదేఁడ
గుల నిట్లని పలుకరించె.
అచ్చ. రా యు. ౩౯౧.

గీ. అనుచు జోకొట్టుదురు జవరాంద్రఁగూడి,
జోలపాడుచు రాచూలి నోలిబాల, కిసలయ
గ్రాసముదితకోకిలకదంబ, కంఠకలనాద
సుమధురగాన ఫణితి పె. శకుం. ౩. ౧౫.

గీ. అనిన నుపొంగి రాచూలియయ్యయింక,
జాగు గావింపనేల యిచ్చటి కరోధ్య,
రయలు నొడయనిఁ బెండిలి కిపుడు పిలువఁ,
బనుపవలెనని సెయ్యపేర్పడఁగఁబలికె.
అచ్చ. రా. బాల. ౧౧౯.

రాజకదంబము. సం. వి. అ. పుం. కదంబభేదము. కడిమిలో నొకభేదము. ౖ.

రాజకము. సం. వి. అ. న. రాజసమూహము, రాజబృందము.

విణ. (అ. ఆ. అ.) దీప్తిమంతము ప్రకాశము కలది.

రాజకర్కటి. సం. వి. ఈ. స్త్రీ. చీనాకర్కటి, పెద్దదోస. ౖ.

రాజకశేరువు. సం. వి. ఉ. పుం. భద్రముస్త, నాగముస్తె. ౖ.

రాజకీయము. సం. విణ. (అ. ఆ. అ.) రాజ సంబంధమైనది. ప్రభుత్వసంబంధమైనది.

రాజకుఁడు. సం, వి. అ. పుం. చిన్నరాజు, సామంతరాజు

రాజకుష్మాండము. సం. వి. పుం వాకాకి, ములక. ౖ.

రాజకోశాతకి. సం వి. ఈ. స్త్రీ. పెద్దబీర. ౖ.

రాజక్షవకము. సం. వి. అ. పుం రాజసర్షపము ఒకదినుసు ఆవాలు

రాజఖర్జూరి. సం వి ఈ స్త్రీ శ్రేష్ఠ ఖర్జూరము ౖ

రాజగిరి. సం వి. ఇ పుం మగధదేశమందలి యొకపర్వతము

రాజగ్రీవము. సం వి అ పుం ఒకజాతి చేఁప (విల్సమ్సు)

రాజఘ్నుఁడు. సం విణ. (అ ఆ. అ.) తీక్ష్ణమైన వాఁడు, ఉగ్రుఁడైనవాఁడు

వి. అ పుం. రాజహత్యచేసినవాఁడు, రాజులను జంపినవాఁడు

రాజచిర్భిటము = రాజచిర్భిటము. సం వి అ. పుం కారవేల్లము, కాఁకర ౖ

రాజచిర్భిటి. సం. వి ఈ స్త్రీ. రాజచిర్భటము, కాఁకర. ౖ

రాజచిహ్నకము. సం. వి. అ. న. యోని, ఉపస్థ. (విల్సమ్సు.)

రాజజంబువు. సం. వి. ఊ. స్త్రీ. ౧. పిండ ఖర్జూరము. ౖ. ౨. పెద్దనేరేడు. ౖ.

రాజితము. సం. విణ. (అ. ఈ. అ.) వెండితోఁ జేసినది, రజతమయమైనది, వెండిది.

వి. అ. న. కెంపు.

**రాజతరువు.** సం. వి. ఉ. పుం. కర్ణికార వృక్షము. శ.

**రాజతాలము.** సం. వి. అ. పుం. పూగవృక్షము, పోఁకచెట్టు. శ.

**రాజతాలి.** సం. వి. ఈ. స్త్రీ. పూగవృక్షము, పోఁకచెట్టు. శ

**రాజతేనితము.** సం. వి. అ. పుం. ఫలలతా విశేషము, కర్బూజ. శ. (త్రి. వి.)

**రాజదండము.** సం. వి. అ పుం. ౧ రాజశాసనము. ౨ రాజాజ్ఞ. ౩ రాజుచే విధింపఁబడిన శిక్ష. ౪. రాజునకుఁ జెల్లింపవలసిన యపరాధ ద్రవ్యము-దండుగ.

**రాజదంతము.** సం. వి. అ. పుం. దంతరాజములలో నొకటి, ముందుపల్లు. (పైవరుసలో ముందుండెడి రెండు పండ్లలో నొకటి) (వాచ)

**రాజద్రుమదము.** సం. వి. త. స్త్రీ. తిరుగలి యొక్క యడుగున నుండెడి ఱాయి, తిరుగటి క్రిందిఱాయి. (విల్సన్స్).

**రాజదేశీయుఁడు.** సం. వి. అ. పుం. కొంచెము తక్కువగ రాజుతో సమానుఁ డైనవాఁడు, ఇంచుమించుగ రాజంతవాఁడు. (ఇక్షే, రాజకల్పుఁడు.)

**రాజధర్మము.** సం. వి. అ. పుం. ౧. రాజు యొక్క ధర్మము, రాజు చేయవలసిన పని. ౨. రాజులకు సంబంధించు ధర్మము, రాజులకు సంబంధించు శాసనము.

**రాజధానము.** సం. వి. అ. న. రాజధాని.

**రాజధాని.** సం. వి. ఈ. స్త్రీ. రాజనివాసము; ప్రధాన నగరము.

**రాజధాన్యము.** సం. వి. అ. న. శ్యామాకము, ధాన్యభేదము

**రాజధుత్తూరము.** సం. వి. అ. పుం. పెద్ద ఉమ్మెత్త. శ

**రాజన.** వి. శాకభేదము, ఒకానొక జాతి కూర దినుసు.

గీ. రాజనలతోడ శృంగబేరములతోడఁ, జిరుగడపుఁ బెండలములతోడఁ జేమతోడ.
భీమ. ౨. ౫౭.

**రాజనము.** వి. సస్యవిశేషము.

సీ. బలురాజనంపుఁ బొట్టలు పిటపాటెఁ బోముద్దియపిక్కల కుద్దిగాక.
అచ్చ. రా. అర. ౨౨.

చ. కమలగోన నయ్యెఁబండి యురగంబడియుండెడు రాజనంబు .
చంద్రా. ౧. ౩౯.

క. జలమత్కు ఫలరసంబులు, గలపంబుకు పాశోత్పలములు గరుడలు మత్స్యంబులు మీలుములు శంఖులు, వలిసస్యము చెఱకు రాజనపుఁ బోలమెల్లన్.
కు సం. ౨. ౯౨౫.

బ. ధాన్యవిశేషము.

ఉ. సోరిడిం జేర్చిన తీఁగమల్లియలు ఖర్జూరం బులుంబున్నపుం,జరులన్ మామిడిగుత్తులుం గుసుమముల్ సంపెంగలుం బచ్చగ,న్నెరు పూఁబోకలు గల్గి రాజనపుఁగాంతిం జాదు ముఖాన్నపిచ్చే,లరు దారస్నగు బుభ్యతోఁటల బలాశాని కదంభంబునన్. ఆము. ౧. ౬౫.

క. ... మి అ మి ల ని రాజనపుకుడుంగుటో గి రంబులు ... శుకి. ౩. ౧౨౫.

**రాజనయము.** సం. వి. అ. పుం. రాజనీతి.

రాజనీతి. సం. వి. ఇ. స్త్రీ. రాజు తెలిసికొన వలసిన సామాద్యుపాయ చతుష్టయము; అ విషయమును దెలుపు శాస్త్రము.

రాజనీలము. సం. వి. అ. న. పచ్చ, మరకతము. (ఆ. వి.)

రాజన్యకము. సం. వి. అ. న. రాజాధుల సమూహము, క్షత్రియుల సమూహము.

రాజన్యము. సం. వి. అ. పుం. ౧. అగ్ని. ౨. క్షీరికావృక్షము, పాలచెట్టు. †

రాజన్యుడు. సం. విణ. (అ. ఆ. అ.) రాజ సంబంధమైనవాఁడు.

వి. అ పుం ౧. క్షత్రియవంశజాఁడు, రాజ పుత్రుఁడు. ౨. అగ్ని.

రాజన్వంతము. సం. విణ. (త్. తీ. త్) మంచిరాజుగలది, మంచి (న్యాయముగల) రాజుచేఁ బరిపాలింపఁబడినది.

(దేశము). (రాజవంతము = రాజు గలది.)

రాజపటోలము. సం. వి. అ. పుం. పటోలము, పొట్ల. †

రాజపటోలి. సం. వి. ఈ. స్త్రీ. మధురపటోలి, తియ్యపొట్ల. †

రాజపట్టము. సం. వి. అ. పుం. విరాటదేశ మందుఁ బుట్టిన మణి విశేషము. ఒకజాతి రత్నము.

రాజపథము. సం. వి. అ. పుం. రాజమార్గము.

రాజపలాండువు. సం. వి. ఉ. పుం. రక్త పలాండువు, నీరుల్లి. †

రాజపీలువు. సం. వి. ఉ. పుం. మహాపీలువు, పెద్దగోలుగు. †

రాజపుత్రము. సం. వి. అ. పుం. మహారాజ చూతవృక్షము, ఒకజాతి మామిడిచెట్టు. †

రాజపుత్రి. సం. వి. ఈ. స్త్రీ. ౧. రాజు కూఁతురు. ౨. రాజపుత్రజాతి స్త్రీ. ౩. జాతి, మాలతి, కటుతుంబి మొదలగు వృక్షముల పేరు. ౪ రేణుకయనెడు సుగంధద్రవ్య విశేషము. ౫. గంధమూషకము, చుంచు. ౬. రాజనీతి.

రాజపుత్రుఁడు. సం. వి అ పుం. ౧. రాజు యొక్క కుమారుఁడు. ౨. క్షత్రియుఁడు. రాజాధులవంశమునఁ బుట్టిన మనుష్యుఁడు. ౩. బుధుఁడు. (గ్రహము) ౪. ఒక సంకరజాతి వాఁడు. ౫. రాజపుత్రవంశమని ప్రసిద్ధమగు వంశమునఁ బుట్టినవాఁడు.

రాజపుష్పము. సం. వి. అ. పుం. నాగకేసర వృక్షము. †

రాజఫణిజ్ఝకము. సం వి. అ. పుం నారంగ వృక్షము, నారింజచెట్టు. †

రాజఫల. సం. వి. ఆ స్త్రీ. జంబూవృక్షము, నేరేడు. †

రాజఫలము. సం. వి. అ. న. పటోలము, పొట్ల. †

రాజబదరము. సం. వి. అ. న. ౧. రక్తామలకము. †

౨. లవణము, ఉప్పు.

పుం. ఉత్తమకోలి. † (వాచ)

రాజబల. సం. వి. ఆ స్త్రీ. గొంతెమగోరు. † (శ. ర.)

రాజబీజి. సం. విణ. న్. ఈ. న్. రాజసంతతి వాఁడు. రాజవంశస్థుఁడు.

రాజభద్రకము. సం. వి. అ. పుం. ౧. పద్మము ౨. నింబము, వేము. శ్రీ. ౩. పారిభద్రకము. శ్రీ.

రాజభూయము. సం. వి. అ. న. రాజత్వము, రాజధర్మము.

రాజభృంగము. సం. వి. అ. పుం. తెలివిగల కూఁకటి మూఁగపక్షి. (వై. ని.)

రాజభోగ్యము. సం. వి. అ. న. జాజికాయ. పుం. ప్రియాళువు. శ్రీ.

రాజమార్గము. సం. వి. అ. పుం. పెద్దబాట, రాజవీథి, పెద్దవీథి. (ఇట్లే-రాజవర్త్మము, రాజపథము మొ॥)

రాజమాషము. సం. వి. అ. పుం. ఒకజాతి కాయధాన్యము, బొబ్బెర, అలసందె.

రాజముద్ర. సం. వి. ఆ. స్త్రీ. రాజసంబంధమైన ముద్దర.

రాజముద్గము. సం. వి. అ. పుం. ముద్గభేదము. మకుష్టకము, అడవిపెసర.

రాజయక్ష్మము. సం. వి. న్. పుం. క్షయరోగము.

రాజయోగము. సం. వి. అ. పుం. ౧. జాతకుఁడు రాజుగాఁ దగినట్లు సూచించెడి గ్రహములయొక్క యోగము. ౨. (యోగ.) రాజులభ్యసించుటకై యేర్పఱుపఁబడిన సులభమార్గము.

రాజరంగము. సం. వి. అ. న. రజతము, వెండి.

రాజరాజమూఁడ. వి. వి. ఒకానొక నాణెము.

వ. శ్రీకరణమాణిక్యము కొడుకు పడి యుణ్ణుమం గామాసాని కొడుకు గాపిరబ్బడి చేత విడువడి రాజరాజమాడలు వట్టి అలము వలయు చుట్టు ఇరువది పుట్లు నేల చతుస్సీమలతోఁగూడ ... ద. శా. ర. ౧౭౦౦.

రాజరాట్. సం. వి. ఆ. పుం. ౧. సార్వభౌముఁడు. చక్రవర్తి. ౨. కుబేరుఁడు. ౩. చంద్రుఁడు.

రాజర్షి. సం. వి. ఇ. పుం. ౧. రాజఋషి, తపస్సుచేయుటచే ఋషిగా నెంచఁబడిన క్షత్రియుఁడు. (జనక విశ్వామిత్రాది.) ౨. రాజశ్రేష్ఠుఁడు. (వాచ.)

రాజరీతి. సం. వి. ఇ. స్త్రీ. కాంస్యము-కంచు.

రాజవంతము. సం. విశే. (త్రి. ఈ త్రి.) రాజుగలది (దేశము. శ. ర.)

రాజవంశ్యుఁడు. సం. విశే. (అ. ఆ. అ.) ౧. రాజసంతతివాఁడు. రాజవంశస్థుఁడు. ౨. (మనుష్యులలో) ఒకానొకజాతి పురుషుఁడు. (వాచ.)

రాజవర్తము. సం. వి. అ. పుం. క్రొత్తబట్ట. (వై. ని.)

రాజవల్లభము. సం. వి. అ. పుం. ౧. ప్రియాలువు ౨. రాజబదరము, పెద్దరేఁగు. ౩. రక్తామ్రము.

రాజవల్లి. సం. వి. ఈ. స్త్రీ. ఒకానొకలత. "తోయవల్లి." (రం. ని.)

రాజవాహ్యము. సం. వి. అ. పుం. గజరాజము, పెద్ద యేనుఁగు.

రాజవృక్షము. సం. వి. అ. పుం. రేల. శ్రీ. (శ. ర.)

రాజవ్రణము. సం. వి. అ. న. (మా. రాచపుండు.) (శ. ర.)

రాజశాకము. సం. వి. అ. పుం. ఒకజాతి కూరాకు, వాస్తూకము, చక్రవర్తికూర.

రాజశాణము, సం. వి. అ. పుం. పట్టము, పట్టు నూలు.

రాజశృంగము. సం. వి. అ. న. రాజచిహ్నమైన బంగారుకామగల గొడుగు, శ్వేతచ్ఛత్రము.

రాజశేఖరుఁడు. సం. వి. అ. పుం. ౧. శివుఁడు, చంద్రశేఖరుఁడు. ౨. ఒకానొకకవి, అలంకారికుఁడు.

రాజసభ. సం. వి. ఆ. స్త్రీ. ౧. న్యాయసభ. ౨. నృపసమాజము.

రాజసము. సం. వి. అ. న. రజోగుణము వలనఁ గలిగినది. దుర్గర్వము.

ఆ. అనిలబాహ్లీకాదులగు కురువృద్ధుల, నాత్మ జనకుఁ గృష్ణు నాదరింప, కతఁడు రాజ సమున నప్పుడు దిగ్గన, లేచిపోయి సంచలించెఁ గొలువు. భార. ఉద్యో. ౩. ౩౮౩

క. తనజనకు నఱుతఁ బవసా, తనశవకముఁదగిల్చి రాజసమునఁ బరీక్షిజ్జనపాలు చనుట కృశుఁ డను, మునివలన నెఱింగి కోప మూర్ఛా న్వితుఁడై. భార. ఆది ౨. ౧౬౪.

గీ. , చేరి యాశీర్వదించినఁ జేయిమోగిచి, రమ్ము కూర్చుండుమనఁ డెంత రాజసంబొ. దశా. ౨. ౧౦౦.

విశే. (అ. ఈ. అ.) ౧. రజోగుణముకలది. ౨. రజోగుణము ప్రధానముగాఁ గలది.

రాజసర్పము. సం. వి. అ. పుం. సర్పభుక్కు, పెద్దపాము. (పాలా. వి.)

రాజసర్షపము. సం. వి. అ. పుం. ౧. నల్లావాలు. ౨. పరిమాణ విశేషము, ఆవగింజ యెత్తు.

రాజసారసము. సం. వి. అ. పుం. మయూరము, మగనెమిలి.

రాజసి. సం. వి. ఈ. స్త్రీ. తృణవిశేషము, దూర్వ. శ.

రాజసూయము. సం. వి. అ. పుం. న. ఒక రాజు తక్కిన రాజులజయించి సర్వాంగీకృత సామ్రాజ్యమునకు గుర్తుగా సామంతరాజుల సహాయముతోఁ బట్టాభిషేక సమయమునఁ జేసెడి పెద్దయజ్ఞము.

రాజస్కంధము. సం. వి. అ. పుం. అశ్వము, గుఱ్ఱము. (విల్యమ్సు)

రాజస్వము. సం. వి. అ. న. ౧. రాజసంబంధమైన సొమ్ము. ౨. పన్ను, సామంతరాజులు చెల్లించెడి కప్పము.

రాజస్వర్ణము. సం. వి. అ. పుం. దుత్తూర వృక్షము, ఉమ్మెత్తచెట్టు. శ.

రాజహంస. సం. వి. అ. పుం. ౧. ఎఱ్ఱనికాళ్లును ముక్కునుగల హంస, కలహంస. ౨. ధూమ్ర వర్ణములైన ముక్కు కాళ్లు ఱెక్కలుంగలహంస

రాజహర్షణము. సం. వి. అ. న. తగరపుష్పము. (వాచ.)

రాజహస్తి. సం. వి. ఇ. పుం. గజరాజము, పెద్దదియు నందమైనదియు నగు యేనుఁగు.

రాజాద(త)నము. సం. వి. అ. పుం. ప్రియాల వృక్షము, మోరటి. శ.

(దీని పండులోని గింజల పిండితో లడ్డుకలుచేసి రాజులు భుజింతురు.)

రాజాదని. సం. వి. ఈ. స్త్రీ. క్షీరిణి, పాల చెట్టు

రాజానకుఁడు. సం. వి. అ. పుం. ౧. సామాన్య రాజు. చిన్నరాజు. ౨. పండితులకును కవీశ్వరులకును పూర్వకాలమున నీయఁబడిన బిరుదము.

**రాజాన్నము.** సం. వి. అ. న. ౧. ఆంధ్రదేశమునఁ బండెడి ధాన్యవిశేషము, రాచ్చెనము. ౨. రాజులవలన లబ్ధమగు నాహారము, రాజాను గ్రహమున దొరకిన యాహారము. ౩. రాజార్హమగు భోజనము

**రాజాబహాదరు.** వి. ఒకానొక బిరుదు.

సీ. సంస్థానము నొసంగు సమయంబునందె వంశ క్రమంబుగన రాజాబహాదరు మొదలైన బిరుదులు రంగా ౧. ౧౧౭.

**రాజామ్రము.** సం. వి. అ. పుం. మామిడిజాతిలో శ్రేష్ఠమైన చెట్టు, ప్రశస్తమైన మామిడి. శ.

**రాజార్కము.** సం వి. అ. పుం. శాక్షిలము, రాచజిల్లేడు, (వెల్లి జిల్లేడు. శ. ర.)

**రాజార్హా.** సం. వి ఈ. స్త్రీ. జంబు, సేరేడు. శ

**రాజార్హము.** సం. వి. అ. న. అగరుచందనము, చందనవిశేషము.

విశే. (త్రి. ఆ. అ) రాజునకుఁదగినది

**రాజాలాబువు.** సం. వి. ఊ. స్త్రీ స్వాదుతుంబి మిష్టాలాబువు. శ

**రాజావర్తము.** సం. వి. అ పుం ౧ తక్కువ జాతి వజ్రము, ఉపరత్న భేదము. (గాజా మెం)

సీ. ఇంపు, పొసఁగు రాజావర్తపుంబాదువ ములకు బొంచు వైదూర్యంబు మించు గన్న. రావి. ౫. ౧౩.

౨. విరాటదేశమునుండి తెచ్చిన వజ్రము.

న చిత్రపటము, రంగురంగులబట్ట (వై. వి.)

**రాజాహి.** సం. వి. ఇ. పుం. రెండుతలల పెను బాము.

**రాజి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ ౧. రేఖ, గీటు ౨. పంక్తి. ౩. వల్లావలు. ౪. నూగ, కొండ నాలుక. ౫. రాజసర్పము, ఒకవిధమగు పాము.

**రాజిక.** సం. వి. అ. స్త్రీ. ౧. పంక్తి, శ్రేణి. ౨. మడి, చేను. ౩. వల్లావలు. ౪. (తూనికలో నుపయోగించెడి) యావలు.

**రాజికాఫలము.** సం వి. అ. పుం. తెల్లఆవ, గౌరసర్షపము. శ.

**రాజితము.** సం. విశే. (అ. ఆ. అ.) ప్రకాశితము. (శ. ర.)

**రాజిఫల.** సం. వి. అ స్త్రీ. చీనాకర్కటి, పెద్దదోస.

**రాజిమంతము.** సం వి. అ పుం రాజిలము. (వై. ని.)

**రాజిలము.** సం. వి అ. పుం రెండుతలలపాము, డుండుభము. (ఇది విషము లేనిది).

**రాజిల్లు(లు).** సం అ. క్రి ప్రకాశించు. (శ. ర.)

**రాజీనకము.** సం. వి. అ. పుం. ఒకానొకచేఁప, రాజీవము (వై. ని)

**రాజీఫలము.** సం వి. అ. పుం. పటోలము, పొట్ల. శ. (వై. ని.)

**రాజీలము.** సం = రాజిలము (వై. ని.)

**రాజీవంతిము.** సం. వి. అ. పుం. పటోలము, పొట్ల. శ

**రాజీవము.** సం. వి. అ. పుం ౧. మృగవిశేషము, హరిణభేదము, సారసపక్షి. ౩. ఏనుఁగు. ౪. మత్స్య భేదము, ఒకానొకచేఁప.

౫. తామర, పద్మము.

**రాజు.** సం. వి. న్. పుం. (ఇది తెలుగు తత్సమము సమాసాంతమున పుంలింగమున అకారాంతమును స్త్రీలింగమున ఈకారాంతమును నగును.

ఉదా : ఖగరాజకురంగః, రాజ్ఞీ. బహువ్రీహిని స్త్రీలింగమున నకారాంత, ఈకారాంత, ఆకారాంతములును నగును.

ఉదా. బహురాజానా, బహురాజ్ఞీ, బహురాజ్ఞ్యౌ. మఱియును స్వార్థము ప్రధానమగునపుడు తెనుఁగున నత్వదుజ్లోపము లగును ఉదా. విదురరాజు, రాజు, ఖగరాజు

స్వార్థమప్రధానమగునపుడుత్వదుజ్లులగును

ఉదా. పాతరాజుఁడు. ఈ "రాజు" అను పదము, తత్సమమేయని చిన్నయసూరి, తిమ్మకవి మొ॥ వారి సిద్ధాంతము. వైకృతముగూడ గలదని కొందఱు.)

౧. ఱేఁడు, నృపాలుఁడు.

ఆ. విదురరాజు పాండువిభునకుఁ జేయించె, సర్వలోకహితములైన విధులు.

భార. ఆ ౫ ౧౫౪

ఉ. రాజవిరోధియై నిరపరాధమహీసురవర్యుని నధూవ్యాజమునన్ వృధాకుపితుఁడై వధియింపఁగఁ బంచె. విక్ర. ౩. ౭౩.

గీ. రాజుగాఁడన్న కంబమురాయఁడితని, వేసమును మేలుభాగముచేసియుంట, నిపుడు గముఁగొంటిమి. యయా. ౧. ౧౨౦.

సీ. .. ఒడయఁడుదొర, రాయఁడురాఱేఁడు రాణిక మాఁడన నరపాలసంజ్ఞలై పరఁగుచుండు. అం. భా. ౨. ౧౭౨.

క. కాదనక వేగవేగక . రాజువలదినదే దేవుల సానియనఁగఁ దలిరుబోణి నిప్పుడు.

ల. వి. ౪. ౭౦.

౨. రాచవాఁడు, క్షత్రియుఁడు. ౩ యుధిష్ఠిరుఁడు, ధర్మరాజు. ౪. ఇంద్రుఁడు. ౫. చంద్రుఁడు. ౬. ప్రభువు, యజమానుఁడు.

౭. పృథుచక్రవర్తి ౮. యక్షుఁడు. ౯. సోమవల్లి. (శ. ని.)

౧౦. తనజాతియందు శ్రేష్ఠుఁడు, ప్రధానుఁడు.

(ఈ యర్థమున నిది సమాసమందే ప్రయుక్తము.)

రాజేంద్రుఁడు. సం. వి. పుం. రాజాధిరాజు.

శ్లో. చతుర్యోజనపర్యంత మధికారీ నృపోభవేత్, రాజా తచ్ఛతగుణస్స ఏవ మండలేశ్వరః, తస్మాద్దశగుణో రాజారాజేంద్రః . (వాచ.)

రాజ్ఞి. సం. వి ఈ. స్త్రీ. ౧. రాణి, రాజభార్య. ౨. సూర్యునిభార్య. ౩ కాంస్యము, కంచు.

రాజ్యము. సం వి. అ. న. ౧. ప్రభుత్వము చక్రవర్తిత్వము, దొరతనము. ౨. రాజాధికారమునకు లోఁబడినదేశము, రాష్ట్రము. ౩. రాజశాసనము, ఏలుబడి, దేశపాలనము ౪. లక్షగ్రామములపై అధికారము

శ్లో. లక్షాధిపత్యం రాజ్యంస్యా, త్సామ్రాజ్యం దశలక్షకే, శతలక్షే మహారాజ్యం, మహాసామ్రాజ్యముచ్యతే. (వాచ.)

రాజ్యలోభము. సం. వి. అ. పుం. రాజ్యాశ, రాజ్యమధికము చేయవలయుననెడి కోరిక.

రాజ్యాంగము. సం. వి. అ. న. రాజ్యపరిపాలనకుఁ గావలసినది (స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్రదుర్గ బలరూపమగు రాజ్యసాధనము.)

రాజ్యాభిషేకము. సం. వి. అ. పుం. రాజ్యమున రాజును స్థాపించుట, రాజుయొక్క పట్టాభిషేకము.

రాటనము = రాట్నము. (సం. రహాటః.)

౧. చెలికు గానుఁగ.

క. ఎగయుశిరంబులు సభమున, కొగిద్రగబ్బెడు రక్తజలము లొలుకుచు భువిపై, మగుడఁ

బడుఁజూడఁ గడురం్యగుగ జోలిన రాటన
ముఁన గుంద్రలపోలెజ.

కు. సం. ౧౧. ౮౩౮.

౨. నీరుచేఁదుయంత్రము.

ద్వి. కీలుకొందించి యాత్రియరాటనములు, వాలి
యాడించు నా వడ్రంగియుఁడు.

బస. ప్ర ౪. ౬౫. పం.

౩. గానుఁగ.

గీ. అప్రతిష్ఠాఖ్య నరకంబునందు దుష్ట, నరునిఁ
ద్రిప్పుదురొగి రాటనములఁగటి.

మార్క. ౨. ౬౮.

రాటము¹. వి. మల్లబంధ విశేషము.

ఉ. క్రేపిన లేదు బంతియని క్రేటున జంబడిఁ
దోచ్చి చిత్తబిజా, డాసి బెళావ లాగెను
కటాలున క్రేవి గుణంబు రాటమున్, సీసము
. మేల్ జెగ జెట్ల కైవడిన్.

ప్రబంధ. ౮౯౦.

రాటము². వి. (సం. రాష్ట్రిమ.) జనసమ్మర్దము.
(శ. ర.)

రాటవము. వి. మల్లబంధ విశేషము.

వ. ఖేచరులగ్గించి యుగ్గడింప నగ్గోపకుమారుండు
పాటవంబునను రాటవంబునకుం జనిపెన్నిక్క
నిక్కిన వక్కంపనథటుండు.

భాగ. ౧౦ పూ. ౧౩౪౫.

రాటి. సం. వి. ఇ. పుం. పఞ్. స్త్రీ - యుద్ధము.

రాటు. వి. (సం. రాష్ట్రిక) ఉపద్రవము,
శ్రమము. (చూ. రాట్పుడు).

జ రాట్పుడు

రాట్టు. సం. వి. ట్. పుం. రాజా, ప్రభువు.
విణ. స్వజాతి శ్రేష్ఠుఁడు; శ్రేష్ఠమైనది.

రాట్నము=రాటనము. వి. (సం. రహాటః.)

౧. చెఱకు గానుఁగ.

మ. ఇలకు న్స్వర్గముగాఁ బండి తీరవనపుండ్రేక్షు
చ్ఛటల్ దీర్ఘ లగ్నమై త్రావల నురుస్వాదంబు
లెసఁగంగాఁ ద్రిప్పురాట్నంపుగుం, ద్రులు వాఁ
దేహకోలంకులం బోరలిపొలన్వ్యాప్చు పంక్తి
రవాం, బులవాడెందులసంజఁ దేఁటివల
యంబుల్ తార ఝుంకారముల్.

ఆము. ౪. ౧౫౨.

ఉ ఓపిగయాలికాన నను మగ్రుసెఱుంగజె కోప
మె త్తినం, దోసమెఱుంగ మీటఁగల తోయ్య
లులెల్లను గుంపుగూడిసం, త్రాసముచెంద నీ
గళిము రాట్నమునంటిగియుంచి నెంతునో,
కోనుకతిందునా కుక. ౨ ౩౮౩.

౨. నూలువడుకుయంత్రము, ఏకులరాట్నము.

క. వడిదారము చెవులుం ద్రొక్కుడు పలకయు
దిండు కదురు గుంజలునుం ద్రొక్కుడుబొమ్మ
యును ద్రిప్పుడు,పుదకయును గలుగు
రాట్నములు గైకొనుచున్.

కుక. ౨. ౪౨౦.

సీ. అనయంబుఁ బుఱ్ఱు తిన్నని తోక్కపల్క
లాలింపని చెవులరాట్నంపుఁ జెవులు.

చంద్రా. ౧ ౫౩.

సీ. తంతు సంతతి సముత్పాదనయంత్రంబు
రాట్నమంచనఁగను రహికెక్కు.

ఆం. భా. ౨. ౨౯౪.

౩. ప్రత్తిరాట్నము, ప్రత్తిని దూదిచేయు
యంత్రము.

గీ. దూదిపాటలఁ దేనియల్ దుముకుచుండఁ,
జెఱుకోదల వంటఁగాఁ గోక నెఱికె ద్రొక్క,
తీరు నడంచుచుఁ గూర్పుండి రెడ్డిపడుచు,
తింగుతింగున రాట్నంబుఁ ద్రిప్పుచుండె.

ఉ. పారిశ్ర. ౪. ౨౪.

౪. జలయంత్ర విశేషము.

ఉ. ..కాలువల్, బాయలు గాండ్లు నూతులును బావులు రాట్నములన్ జలార్థమై, వేయఁగ నర్మ్యోగాళ మణి కేయని వాడవి కాను పుట్టునే. ద్వా. ౬. ౪౦.

రాట్ను(టుప)డు. అ. క్రి. (√రాటు.) శ్రమ నొందు.

ఉ. బంబఫలాధరోష్ఠి మణి భిత్తిపుటంబులయందు నాత్మబింబంబు గరావలంబన సమర్థముగా మదిఁగోరఁ గెల్చి, సౌధంబుపయిన్ సమున్నత వితంబపయోధర భారగర్భభా,రంబునఁ గోమలాంగకము రాట్నడఁ గెలివిహార వేళలన్. కాశీ. ౪. ౨౧౦

రాథ. సం. వి=రాధ. (శ. ని.)

రాడి. సం వి=రాటి.

రాడు. వి దే. (బ. రాడులు, రాళులు) గుంజ, స్తంభము.

సీ. ... గీ. .. బొలంబు, దుండుగలమల్లి యరాయలఁ దూలిరాడు, చిక్కుకేశాలపాదఱు - సీమఁజనుమ. ఆము. ౬. ౧౩

గీ ధరవిదాభువాశాహతి శెరియకుండ, వివిధ మాల మంటపము గావించె ననఁగ, నొప్పె నీలాభ్రపటల మచ్చప్పరమున, రాళులన శెల్ల చెన వానకాళులమరె.

కు. సం. ౬. ౪౫౪.

౨. రోపము.

రాధ. సం. వి. ఆ. స్త్రీ. ౧. వెలుఁగు, ప్రకాశము. ౨. గాధరాష్ట్రమునఁ బ్రధాన పట్టణము పేరు. ౩. అందము, శోభ,

రాధము. సం. వి. అ. పుం. పిచులము, ఒకానొక చెట్టు. శ.

రాణా=రమణ. వి. ౧. ఒప్పిదము.

రగడ. పోణిమిగ వకళ కుజపూగములఁ బూగ ములు, రాణ దనరారెను బరాగములు, . . రాఘవ. ౨. ౬.

౨. రక్తి, గానమాధుర్యము.

సీ. నీ విలాసమువర్ని కావి శేషముమీ సంగీత సాహిత్య సౌగరభంబు, నీకటాక్షశ్రీవిపాక భేదముచుమీ కేణుబీణాదుల రాణశెల్ల. ప్రభా. ౩. ౧౧౪.

శా. నీకాం కోసలసౌధవీథికలపై నింపొంది చిత్రంబుగా నీరెల్ కేలధరించి రాగల వాణీ విస్ఫూర్తి మైఁ జొక్కుచుఁ, జాణల్ సాధ్య కుమారులాగమవిధాన స్నిగ్ధగానంబులన్, రావల్ మీఱఁగ నాలపించెదరు చిత్రప్రీతిమై వింటివే. సుద. ౫. ౧౯.

౩. ప్రేమము, అనురాగము.

సీ. కానలోఁదారు మృగంబుల కై వడిఁ గై కొని యుసమూత్రకర్మకలనఁ, దనరు చొక్క పురాణ మునిదంపతులు దమకంబులు దేర శైయంబుమీఱ. రాఘవ. ౧. ౨౦.

(భారతార్థమున.)

ఉ. వీణెముట్టుటల్ మిగుల వింతలు పెంపుడు చిల్కబోదతో, రాణదలిర్పఁ బల్కుట గరంబపురూపము ... కళా. ౬. ౨౧౨.

౪. ఆసక్తి.

ఉ. . శ్రీరంగనివాసుఁ డెంతయును రాణ దలిర్పఁగ దేఁగపేటమై, వంగన బన్న చాటికి నాయారభుకాసలు మీఱవచ్చి .. పరమ. ౩. ౧౪౫.

౫. కేడుక, కుతూహలము.

సీ. ఆసవనతోణియందును సరసులగరిడి నిష్ట పు రాణపరిచితిఁ బ్రియకుందెదు ... రాఘవ. ౨. ౧౯.

(భారతార్థమున.)

౬. అతిశయము, ఆధిక్యము.

ఉ. ఆణిముత్తెములు చెఱుంగులు మ్రుగ్గు
లు రత్నదీపికా(శ్రేణులు ధూపవాసనలు
హృద్యనిరంతర వాద్యఘోషముల్, రాణఁ
బొసంగఁ బ్రోలు మిగులం గనువిందొనరించు
నిత్యకల్యాణముఁ బచ్చతోరణమునై జను
లందఱు సల్లసిల్లఁగన్. విజ. వి. ౧. ౧౯.

సీ. రాణనొప్పారు నిస్సాణకాహళంబులు కాహళ
రావముల్ గ్రందుకొనఁగ ...
భా. రా. బాల. ౬౭౩.

సీ. పచ్చని హురుముంజి పనివాగపక్కెర పాగవి
పల్లంబు పట్టమయము, రాణనొప్పారు పైతా
ణంబు పింగిణితళుకుల కోరుల తరితసంబు.
మనుచ. ౪. ౭౭

౭. విధము.

వ. చెలికానిచేడ్పున విడుదులంజాచుచుఁ
దూణంబురాణ వెనుదవిలిపోవుచుఁ పథిక
జనుందన వల్మీకవామలంజాచి మరలుచు
చంద్రా. ౬. ౯౩.

జ: రాణించు, రాణింపు, రాణింబు, రాణిల్లు.

రాణము. సం వి. అ. న. ౧. పత్రము, ఆకు.
౨. చెమిలితోఁక. (విల్యమ్సు.)
౩. నాదము, ధ్వని.
వ. మఱియు నిక్కులావల సంతానంబు
పాడువేల్పుగాణీల పాణిరిత మాణిక్యవీణా
మధురరాణామృతంబులఁ గరఁగి ...
వసు. ౨. ౧౧.

రాణి. వి. (సం. రాజ్ఞీ. (ప్రా. రాణీ.) ౧. రాజ
భార్య.
(చూ. రాణివాసము.)
౨. భార్య.
గీ. పుండరీకాసనమునఁ గూర్చుండి మరిక, నించు
కేడుక వీణావాయించుచెలువ, నలువరాణి
మదాత్మలో నెలయుఁగాక ... మనుచ. ౧. ౫.
సీ. తలవాఁకిటను రాణినిలిపి సమ్మతిఁ గెంటెఁ దన
రాయసమునకుఁ దప్పగాద .
ఇందు. ౧. ౧౪౫.

జ: రాణివాసము, రాణివాసి.

రాణిక. సం. వి. ఆ స్త్రీ. గుఱ్ఱపుఁ గళ్లెము.
(ఆ. వి.)

రాణించు. అ. క్రి. (√రాణ.) ౧. ఒప్పు,
శోభించు.
శా. ఆలాపంబులఁ బెక్కు సేమముల తాయం
బుల్ ప్రయోగంబులున్, దాళంబుల్ మెఱ
యంగ రాగముల నానాతాన మానంబులన్,
డాలుగా రక్తియు రేఖయున్ సరళియున్
రాణింపఁ దద్వ్యన్మవీ, లీలాచిహ్నితగీత
ముల్ మహాతిఁ బల్కించె విచిత్రంబు
గన్. వరాహ. ౧౧. ౩౫.
ఉ. ఎంచఁగ మేచకద్యుతివహించుట పోగల
నంగఁ దాము రా,ణించుట నెమ్మిపైఁ గడు
గణింపఁగఁ బొల్పుట దా విభూతిచే, మించుట
నాలతాంగి నునుమించు కురుల్ సరియై తన
ర్చియుఁగా, బింఛములై చరించె నటించె
ఘనాఘన చిద్విలాసతన్. విప్ర. ౨. ౪౫.
సీ. రమవాడ్కఁ గమలజురాణి రాణింపంగ
వాణివాడ్కని లక్ష్మి వలన మించు.
ఇందు. ౧. ౧౦౬.
౨. ఇష్టమగు.
క. ప్రాణేశ్వరుండు గడుని,ద్రాణత నున్నాఁడి
దేటు తన కన్నులకున్, రాణింపనో యిత
నికి మగ,పోణిమియే లేదొ యనుచుఁ
బొక్కుచు మదిలోన్. శుక. ౧. ౨౦౨.
౩. సంతసించు.

ద్వి. అవనిజ భువనశోకమంతయు మాన్ప, రవి
మానమునవెల్ల రాణింపఁజేయ, భవ్యునో
యనఁగ నవ్యవచశ్శ్వరుఁడు, అచ్చుగా
జాగిరి యల్లన డిగ్గి.
రం. రా. కిష్కిం ౯౯౯. పా. ౧౬. పం.

౪. అతిశయించు

గీ. మన్న గేస్తుఁడు నగ్గియు మిన్న నీరుఁ,బ్రొద్దు
పెలఁగాడ్పు లెవ్వాని రూపులయ్యె, నట్టి శెలి
గట్టు మన్కి పట్టైనదట, యురవు రాణింపఁ
గలలోన నొక్కనాఁడు
నీలా. ౧ ౧౨.

(ఇది కొన్ని యెడల వాక్యాలంకారముగాఁ
బ్రయోగింపఁబడును.)

క. రాణించి షడ్జమంజుల, వీణానిక్వణనములర
విలసిత వేణు, క్వాణనధురీణమగునర, గాణిక్య
మనోజ్ఞ మధురగానము వినియెన్.
భా. రా. కిష్కిం. ౪౩౫.

రాణింపు. వి. (√ రాణించు) ఒప్పిదము,
సొగసు.

ఉ. పెంపరయంగ నొక్కయెడఁ బిచ్చుల
మర్మ్యను కేసఘుర్మములే, కంపనలీల
నొక్కయెడఁగంటికికింబగు నవ్య కామినిన్.
సొంపుగనీకు నాయకుఁడు సొమ్ములఁ
బెట్టుచుఁ జూచి నంత క్రాణింపుగ లేమకో
యెచటనిల్చునో మానమెట్లుంగ జేమి
యున్.
కృం. రస. ౧. ౧౧. పా. ౨౦ ప.

రాణింబు=రాణింపు. వి. (√ రాణించు). ఒప్పి
దము, సొగసు.

సీ. బింబంబుడంబు రా ణిం బు రాణించు
కెమ్మోని వాఁ డెవలేని శివివాఁడు.
ఇందు. ౪. ౨౨.

రాణిల్లు=రాణించు. (√ రాణ.) ఒప్పు, శోభిల్లు.

వ. అట్టి సమయంబున నట స్వయంవరోత్సవంబు
నకు గామేధికత్సరద్యుతి సమ్మిళిత
కృపాణి పాణి రాణిల్ల భవదీయవిమల
రాజన్యమానసంబుల పెపుడు పెపుడు పెడఁ
బాయక యున్న దానవని .
చంద్రా. ౫. ౧౨౪.

రాణివాసము. వి. (రాణి + వాసము). ౧.
అంతఃపురము, అంతిపురము.

గీ నవ్యపల్యంకికారోహణము లొనర్చి, రాణి
వాసంపుసతులు పార్శ్వములఁ గొలువ,
భద్రగజ మెక్కి మారాజు ప్రౌఢమమర,
నర్మదాతీరవని కేఁగినాఁడు నేఁడు.
ఉ రా ౩. ౧౭౬.

గీ. . రత్న కాంతులు జెలయంగ రాణివాస*,
సతుల సేవలఁజొక్క శ్రీ పతినిఁగాంచి.
దశా. ౪. ౧౦౩.

(*ఇట "ము" లోపము చింత్యము.)

గీ. . నగరనఁగ రాజగృహ నాము, దేయజా
రాణివాస మంతిపురమునఁగ, నలరు శుద్ధాం
తము. అం. భా. ౨. ౧౩.

౨. అంతఃపురస్త్రీ, రాజుయొక్క భార్య.

వ. ప్రతోద్యాపన కనియును, వ్యాధి
మాన్పుకొనవనియును జెప్పిపంప నా రాణి
వాసంబు గుప్తాగుప్త ప్రకారంబులం బంప
ద్రవ్యంబు.. ఆము. ౪. ౫౩.

సీ. విదితంబుగ విచిత్రవీర్యుని రాణివాసములకు
నడిదచ్చి చనినవాని. విప్ర. ౪. ౪౪.

సీ బ్రహ్మకుఁ బట్టంపు రాణివాసంబయ్యె రాజ
సత్క్రీడాభిరతులఁ బోక. కాశీ. ౨. ౮.

గీ గౌరి యొక్కతె యాకాశగంగ యొకతె,
కాళియొక్కతె వక్షఃకాళి యొకతె,నలుగు

రను కంభునకు లోకనాయకునకు, రాణి
వాసంబులను రాగరసము పేర్మి.
భీమ. ౩ ౯౫

౩. భార్య. పెండ్లము

ఉ. చుక్కల రాణివాసముల సోయగపుం జను
దోయి త్రొక్కునం, జిక్కనదైన యక్కు
యదు శింపుఁడు బాణపరంపరాహతిన్,
బ్రక్కలుసేయ .. పారి ౫ ౧౦

౪. చెలఁగి కేపడిన కేకి రాణివాసంబుల అతి
విభ్రమతో నడుగులొత్త.
రామా ౬ ౧౪౪

**రాణివాసి.** వి (రాణివాసము + ఇ అని క ర)
అంతఃపుర స్త్రీ.

ఉ. ఓసరిపోరు నిర్వేదలకుండ నయో నను
రాణివాసిగాఁ, జేసితొ తొత్తులంబనులు
సేయఁగ నిచ్చినఁ బోలదంటిసే, వానికిఁ
బోరనమ్మఁ గడవంబిని పాటలుసేయు
వారశే,శి .. శేం. పంచ ౧ ౨౪౯.

**రాణువ.** వి. ౧. సేన.

ద్వి. రాచేకొం త్రము చొక్క రాణువ యుక్క,
గోచయంబుల దిందుకొమ్మల్ల పొందు
ద్వి తి సా. ౧ ౩ పా ౨ పం.

క. అంతటఁ జెలఁగరాణువ నాను,మంతుం డను
పేరఁ బరఁగు మాన్ఠిని ముదా,క్రాంతుని
గలిగెదవని నిజ,కాంతుఁడు చనఁదొడుగు
మూలెఁగద యుభుడనుచున్.

క. ఓపాపాత్మక లోనికి, పొమ్మని చన
నొసంగి రాణువయొల్లన్, నీ పార్శ్వంబుగఁ
జేకి మహా పరమాత్మునిగ నడపసాదట
నిమ్మన్. సారంగ. ౪ ౧౬౧.

౨. పరివారము.

క. మునుకొని తత్ప్రశ్నతంబును, దన క్షత్రియు
లోకాలధర్మము నృపమ,ర్తనమును రాణువ
సంచును, గని మాటాడంగఁ బలియఁగద సభ
లోవన్. శుక. ౧౯౬.

చ. సరసుఁడు మంచివాఁడు గుణశాలి వివేకి
పరోప కారి యం,దతికిని దైనవాఁడు సెలి
దాత మహాత్ముఁడు పేఁతగాఁడు శేఁన్వరి
యని రాతు రాణువలు బంధువులుగా గొని
యాడ చెప్పుదున్, పెంఁగుచు నుండఁ
జాదియును కొమిఁక శేకొ నుతింప
చేటికిన్. మల్లుపు. ౧. ౨౫.

**రాత.** సం. వి. అ. స్త్రీ. విహారిణి, తిరుగు నలు
వాటుగల స్త్రీ.

**రాతనము.** వి (రాయి + తనము.) శిలాత్వము,
రాతితనము

సీ సుమనోవతంపమౌచును బుణ్యజనుల కై దని
మిషేంద్రమణి రాతనము దంత.
దశా. ౧. ౬౨.

('రాజాతన'మని రెండవ యర్థము.)

సీ. భారతీనాథుండు ప్రణతచింతామణి రాతనం
బూనియు ర క్తిచెరవు, . . గీ. అతని భజి
యింప మనకోర్కులబ్బు టరుదె.
ఉ. రా. ౨. ౧౫౯.

(ఇట రెండవ యర్థమున 'రాజసత్వ' మని
భావము)

**రాతపము.** సం వి. అ, న. రాగపాదపము.
(శ . ని.)

**రాతబిసి.** వి. (రాచే + తబిసి). రాజర్షి, విశ్వా
మిత్రుఁడు.

క. అడుగుం దమ్ముల గూరిమిఁ,గడిగి తగం
గారవించి కరములరుదు ని,ప్పుడు నచ్చిన పని
యేమని, యడిగిన రాతబిసిఁ జూచి యాయన
తోడన్. యయా. ౩. ౪.

**రాతము.** (సం. విశే. అ. అ. అ.) ఇవ్వఁబడినది. వి. న. దానము.

**రాతి.** సం. వి. ఈ. స్త్రీ = రాత. (శ. వి.)

**రాతికోడుకు.** వి. (రాయి + కోడుకు). మందూకము, కప్ప.

గీ. విషమశరుఁడేయుతూపుల దెబ్బ సెప్ప, వాఁడు వాధూలముని శాపవర్గ కతుల, రాతికోడుకైన యుల్వాలా రాతిచట్టు, మనసు గరగించి మమ తలఁచెనఁగఁగావ పాండు. ౫. ౩౧౪.

విశే. నిశ్చలుఁడు.

గీ. గొంటువాపఁడు తా రాతికోడుకుఁబోలె, నట నలకు లోనుగాక యుండుటకుఁదోడు, నన్ను నదభదభణఁకించి నలఁపభలపి, భర్ష మిఁద యాఁదయును దానువచ్చెననుచు.

విప్ర. ౩. ౫౬.

**రాతిగొరక.** వి. (రాయి + గొరక.) మత్స్య విశేషము.

సీ. ... మినికల్లరుజాతేలు మీనుదొల్లిక రాతి గొరక మావురమును గుంటముక్కుగి కొర పక్కియదొండును ..హంస. ౪ ౧౯౩.

**రాతిపోటు.** వి. (రాయి + పోటు). త్రవ్వినపుడు భూమిలోపల రాయి తగులుట.

గీ. కల్లితలగాక క్రిఁకెదల్ వేరుపరువు, రాతి పోటునులేని భారాటితోట. విప్ర. ౨ ౧౭.

**రాతిబదనికె.** వి. (రాయి + బదనికె). పర్వతముల పైఁబుట్టు ఔషధి విశేషము.

సీ. ఛాఅపప్పు పికఖర్జూరముల్ ద్రాక్షలు తేకు కావట్ల రాతిబదనికెలు. ప్రబంధ. ౧౩౩.

**రాతియుప్పు.** వి. (రాయి + ఉప్పు.) సముద్ర - ములందు పుట్టెడి యుప్పు, అఱ్ఱుబము. (శ. ర.)

**రాతిరి.** వి. (సం. రాత్రిః.) రేయి, నిశి.

ఉ. రాతిరియామాష్టకంబు విరదంబోనరించి కరండ బద్ధమై, ధీతిలిచిక్కు-భూసచెడి పెద్దగుండన్నివ పాముపాక సం,పాతముఁజెంద దానిఁ దివి పాముదొలంగవిలంబు(తోఁకసే.

ధర్మ. ౧. ౭౩.

గీ. మొగులుమై చీకటుల పెక్కు-జగిమెఱుఁగులఁ, బగలు రాతిరి రాతిరి పగలుచేసె.

అమ. ౪. ౧౦౯.

సీ. రెయిరేయిరాతిరి రేతిరవంగను రజనిపొల్చును.

అం. భా. ౧. ౯౪.

**రాత్రకుఁడు.** సం. వి. అ. పుం. ఒక సంవత్సరము లంకెయింటఁ గాపురముండువాఁడు. (శ. వి.)

**రాత్రి.** సం వి ఇ ఈ స్త్రీ. ౧. రాతిరి, రేయి. ౨. పసుపు

**రాత్రించరి.** సం. వి. ఈ. స్త్రీ. రాక్షస స్త్రీ.

**రాత్రించరుఁడు.** సం. వి. అ. పుం. రాక్షసుఁడు.

**రాత్రిందివము.** సం. అవ్య. రేయుంబవలును, అవిచ్ఛిన్నముగా, విరామము లేకుండఁగా.

**రాత్రిక.** సం. వి అ. స్త్రీ. రాత్రి.

**రాత్రికరము.** సం. వి. అ. పుం. కర్పూరము.

**రాత్రికరుఁడు.** సం వి. అ. పుం. చంద్రుఁడు.

**రాత్రిచరి.** సం. వి ఈ. స్త్రీ. రాక్షస స్త్రీ.

**రాత్రిచరుఁడు.** సం. వి అ. పుం. (రాత్రులఁ దిరుగువాఁడు.) ౧. చోరుఁడు, దొంగ. ౨. రాత్రులయందుఁ గావలి తిరుగువాఁడు, రాత్రు లందుఁ బ్రహరి తిరుగువాఁడు. ౩. రాక్షసుఁడు, పిశాచము.

**రాత్రిజము.** సం. వి అ. న. నక్షత్రము. (త్రికాండ్య.)

**రాత్రిజలము.** సం. వి. అ. న. మంచు, హిమము. (అ. ని.)

**రాత్రిజాగరదము.** సం. వి. అ. పుం. (రాత్రుల నిద్రగానీయనిది) మశకము, దోమ

**రాత్రిజాగరము.** సం. వి. అ. పుం. ౧. కుక్కుటము, కోడి ౨. శునకము, కుక్క. (శే. ని.)

**రాత్రిపుష్పము.** సం. వి. అ. న. కలువ

**రాత్రిమతుఁడు.** సం. వి. అ. పుం. యమదూత యగు రాక్షసుఁడు. (త్రి. ని.)

**రాత్రిమణి.** సం. వి. ఇ. పుం. ౧. చంద్రుఁడు. ౨. కర్పూరము

**రాత్రివాసస్సు.** సం. వి. స్. న. ౧. రాత్రులఁ గట్టుకొనెడివస్త్రము. ౨. చీకటి, అంధకారము.

**రాత్రివిరామము.** సం. వి. అ. పుం. ఉషఃకాలము, అరుణోదయకాలము.

**రాత్రివిశ్లేషగామి.** సం. వి. న్. పుం. చక్రవాకపక్షి.

**రాత్రివేదము.** సం. వి. అ. పుం. కోడిపుంజు.

**రాత్రివేది.** సం. వి. న్. పుం. కోడిపుంజు.

**రాత్రిసత్రము.** సం. వి. అ. న. ఒకానొక యాగము. (వాచ.)

**రాత్రిహాసము.** సం. వి. అ. పుం. తెల్లకలువ, శ్వేతోత్పలము.

**రాత్ర్యంధుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) రేచీకటివాఁడు, నిశాంధుఁడు.

**రాధ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. గోలోకమందుండు పరమాత్మున అర్ధాంగియైన శక్తి. ౨. కృష్ణుని ప్రియురాలగు గోపిక. ౩. కర్ణుని పెంచిన తల్లి—అధిరథుని భార్య. ౪. విశాఖానక్షత్రము. ౫. వైశాఖ శుక్లపౌర్ణమాస్య.

**రాధంతరి.** సం. వి. ఇ. పుం. ఐరావతము. ఇంద్రుని ఏనుఁగు (వై. ని.)

**రాధన.** సం. వి. ఆ. స్త్రీ. పూజనము.

**రాధనము.** సం. వి. అ. న. ౧. సంతోషము, తృప్తి ౨. సంపాదించుట, పొందుట. ౩. సాధనము.

**రాధము.** సం. వి. అ. పుం. వైశాఖమాసము. విశే. (అ. ఆ. అ.) విశాఖానక్షత్రమందు జనించినది. (శే. ని.)

**రాధస్సు.** సం. వి. స్. న. ౧. అన్నము. ౨. ధనము (శే. ని.)

**రాధారమణుఁడు.** సం. వి. అ. పుం. కృష్ణుఁడు. (ఇట్లేః రాధాకాంతుఁడు మొ.)

**రాధి.** సం. వి. ఈ. స్త్రీ. వైశాఖ శుక్ల పౌర్ణమాసి.

**రాధిక.** సం. వి. ఆ. స్త్రీ. రాధ.

**రాధేయుఁడు.** సం. వి. అ. పుం. కర్ణుఁడు, రాధాపుత్రుఁడు.

**రాద్ధము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. వండఁబడినది, పక్వముచేయఁబడినది. ౨. సిద్ధము చేయఁబడినది.

**రాద్ధాంతము.** సం. వి. అ. పుం. సిద్ధాంతము, స్థిరపఱుపఁబడిన విషయము.

**రాద్ధాంతితము.** సం. విశే. (అ. ఆ. అ.) సిద్ధాంతము చేయఁబడినది, సప్రమాణముగా స్థిరపఱుపఁబడినది.

**రాచనిరాకారి.** వి. (రాచ + నిరాకారి) రాజర్షి విశ్వామిత్రుఁడు.

గీ ఎల్ల చెట్టులు నలర నల్లుల్లిదంపు, రాచనిరా
కారిసెల మున్కి గోన మెఱయు
అచ్చ రా. బాల. ౧౧౪

**రాపట్టి.** వి. (రాచే + పట్టి) రాజకుమారుఁడు.

క. కనుమూసినఁ గనువిచ్చినఁ, గనుపుల విలు
కాని వ్రాయఁ గలఁగిన చేవే,ల్పును దలఁ
చిన రాపట్టియు, కనుపట్టెడు చెట్టులోర్వఁ
గలఁ గలకంఠి. రా. వి ౪. ౨౨

**రాపడు[1].** అ క్రి (వ్రాయి + పడు) ౧. రాయి
యగు, కాయిక లెనగు.

మ. కమి మూర్ధమ్యనిరాణి రాపడినపై
జాడ్యంబు ముక్కంటి చాపమునం గల్గు
గురుత్వమూపురకరాపత్యంబు కప్పిప్పి వార్ధి
మహోద్య ద్విషదోషముగ్రదకక క్రిత్పచ్ఛి
కోభారమున్, కముకొందింపఁగ కజ్జరా
అయిన కాంతన్ భక్తి భావించెదన్.
చంద్రా. ౧. ౨.

చ. చొరని బిలంబులన్ కెడలఁ జాడని
క్రంతలుఁగాలు రాపడం, దిరుగని త్రోవలం
గలశ చేరిన యీసురకోటి కచ్యూతా ...
ఉ. హరి. ౧. ౧౩౧,

౨. దృఢపడు, గట్టిపడు.

ఉ. ... మాత్ర కెూజేషం, బట్టుచుఁ దెట్టి
తాల్ దరులు బల్పుగఁ జేర్చుచుఁ గట్ట
రాపడన్, పెట్టుచు రోజసార్ధకక
మాత్రము గట్టిరి వాఁడు కానరల్.
భా. రా. యు. ౨౪౨.

**రాపడు[2].** అ. క్రి. (రాపు + పడు.) రాపిడిపడు,
రాపుడుపడు.

శా. పగ్గంపున్ బలువిల్వ రాపడఁగమున్
బ్రాఁగెంపు జాచాయలన్, దిగ్గం బ్రావిక
వారుణాబ్జ గృహవాటీభాగ్రమూపంచల,
ద్భృంగాఢ స్తవకుంతమద్యుతులతో ...
ఉ. రా. ౪. ౨౫౩.

సీ బింకంపు పానులశంక రాపడి కెలశంకపైఁ
బూనిన వానిమాని వసు. ౧. ౪౭.

**రాపడు[3].** అ క్రి (రాడు + పడు.) ప్రాప్పడు,
సంభవించు

గీ రాపడిరెూ పానుమతి సాంద్రతాపమునఁ
గరంగ హేమాభిధాన నిర్ఝరలతాంగు,
లిట్లు దనుఁజూచి పిగ్గుపాటునయ వినయ,
వినతరైయున్న నగరాజతనయఁజేరి.
వసు. ౫ ౧౮.

**రాపాడు.** స. క్రి ($\sqrt{}$ రాయు) రాయు.

మ. నలిఁగేల్దమ్ముల చాయఁగెంపులబలెన్ రంజిల్లు
నమ్మౌక్తియం,బులు రాపాడుచు దోయిలిం
పుచును. .దలఁ ప్రాల్యోపె నెలంతరాచే
సెలమన్ దార్కొన్న కోర్కెం దగన్.
యయా. ౪. ౧౧౧.

అ. క్రి. ఒరయు

సీ, తలకొక్క తలపునఁ దగులు కూర్పులు
ముక్కను జెవుల్ రాపాడుకొనిన చోటు.
సారంగ. ౧. ౧౦౯.

ఉ. అన్న గంబుపొంతఁ బన్న గాభరణుని,విలయ
కెుప్పు వప్రవలయమెుప్పు, గోపురంబు
తోడ నేపున రాపాడు, గోపురంబుతోడఁ
గొమరు మిగిలి. విక్ర. ౫. ౪౧.

**రాపిడి.** వి. ($\sqrt{}$ రాచు) సంఘర్షణము, ఒరయిక.
(దీని యామ్రేడితరూపము 'రారాపిడి.')

సీ. మూలాశ్మ సంఘాతముల రాపిడిని జేసి
కముతంబు కుభయించి కన్నె కెూడ్పు ...
హర. ౩. ౩౦.

శా. రారాపిల్ల భుజాంగదంబుల మణుల్
రాలంగ విద్యాధరుల్, గారా మొప్పఁగ
నెత్తి కొం(డ్రు నను . . మనుచ. ౪. ౨౬.

రావు. వి (√రాచు) ౧. రాపిడి, సంఘర్ష
ణము.

(దీని యా(మ్రేడితరూపము. 'రారావు.')

గీ. రంభ రంభా(మ్రఫల సమ(గంబు గాఁగ,
నమృత దివ్యాన్న భిక్ష కామారి కొసఁగె,
రావుఁ జేస్నులవడుము రారాజపట్టి, పట్టి
రాయు త్తిన నఖరేఖ జయలుపడఁగ.
హర ౫. ౪౩.

చ. . . అ,శ్మకుఁ దమినించు (కొంక్కు వగ
కన్కులు ఒక్కలులేని పొహమూ,రక
కలహించి మించు పెనురావులు చూపులు
సేఁచ నెమ్మదిన్. శుక. ౨ ౩౪౭.

సీ. రతిదేవి నెవ్వగు రారావుఁ జన్నులు గడ
కన్నులకు నింపుగదలు కొలుప . . .
హైమ ౪. ౪౧.

మ. వా,సవికే యీడగు రాజుఁ జూచి మయి
హెచ్చున్ మట్టుగాకున్నవా, రవికే కాదిది
కోడదో యని సఖిన్ రారావుఁ జేసెం
గడున్. రా. వి. ౫. ౬౨.

క. రారావు శేల సేసెదు. రారానను జలువ
కలువ రారాకొడన్, రారాయని తలిరాకు
జి,రారాయని కేలి సేలరా రాకొమరా...
సారంగ. ౨. ౧౨౭.

౨. నింద, ఆక్షే.

ఆ. ఓ కుమార యిట్లు వో కుమా రాపులఁ.
దేకుమా రహస్యదేశికులకు, నీకు మారకు
లుని నెయ్యంబె తగునుగా, నీ కుమార
మాయల నెయ్యమేల.
శుక చరిత్రము. ౨. ౧౪౪.

జః రాపడు.

రావుడు. వి. (√రాచు.) రాచుట, (శ. ర.)

రావుడురాయి. వి. (√రావుడు.) గాడాలు, లోనగువని మనుపగుట్టై రాచెడు రాయి. (శ. ర.)

రావులుఁగు. వి. (రాచె + పులుఁగు.) కంకము, రాబందు.

గీ. కాకములు రావులుఁగులును (గద్దలునుమృ,కం
బులును మానసము వికలంబు సేయ.
భార. స్త్రీ. ౨. ౯.

ద్వి. కొక్కెర బెగ్గురుకొంగ రావులుఁగు . . .
ద్వి హరిశ్చ, పూ. ౬౨౭. పం.

రాపూవు. వి. (కాయి + పువ్వు.) అశ్మపుష్పము.

గీ. . . . రాపూవవంగ, నశ్మ పుష్పంబు నాల
యును . . అం. భా. ౨. ౬౧

రాపాడి. వి. (రాపు + పాడి.) అకురాయి పొంద
లగువానితో రాచిన బంగారు పొదలయిన
వాని పాడి.

గీ. . . నీరజాక్షు. సానఁబట్టిన రాపాడిచల్లి . . .
మనుచ. ౨. ౩౬.

సీ. . . . రాపాడి వా ఖ్యుప్తరజము దెలఁగు . . .
అం. భా. ౨. ౨౪౫.

రాబందు. వి. దాచపులుఁగు. (శ. ర )

రాబడి. వి. (√వచ్చు.) వచ్చుబడి, ఆయము. (శ. ర.)

రాభస్యము. సం. వి. అ. న. ౧. సంతోషము, ఉల్లాసము. ౨ సాహసము, ౩. బలాత్కారము, తీవ్రత.

రామ. సం. వి. అ. స్త్రీ. ౧. అందకత్తె, మనోహారిణియగు యువతి. ౨. గీతాది కళలలో నై పుణ్యముగల స్త్రీ. ౩. ఆఁడుది, స్త్రీ. ౪. ఇంగిలీకము. ౫. ఇంగువ. ౬. ఒక జిలుగు గోరోచనము. ౩. నైరికము, జేగురు. శా. వది,

ఏఱు. ౯. అశోకము. ‡. ౧౦ శ్వేతకంటకారి. ‡. ౧౧. గృహకన్య, కలబంద. ‡. ౧౨. శాల, చిఱుబొద్ది చెట్టు. ‡. (వాచ.)

రామందాడి వి. (రాముని + దాడి) అసంఖ్యము. (చి. ని., శ. ర.)

రామకర్పూరకము. సం. వి. అ. పుం. ౧. తృణవిశేషము, ఒక విధమగు తృణము.

రామకుఁడు. సం. వి. అ. పుం. ౧. బట్టలు కట్టుటచేతను రంగులు వేయుటచేతను జీవించువాఁడైన వైదేహకుఁడు. ౨. దాస్యముచే జీవించు మాగధుఁడు. (శ. ని)

రామక్రియ. వి. (సంగీ) ఒకానొక రాగము, ఇరువది నాలుగు నపుంసక రాగములలో నొకటి.

సీ. రామక్రియయును మేళరామక్రియ వసంత
సామంత శుద్ధవసంత మధ్యమాదులు .
ప్రబంధ. ౨౯.

సీ. ... రతి, గౌళ రామక్రియ మేళరామక్రియ
గౌళ నారాయణగౌళ .
హంస. ౫. ౧౨౪.

రామఖల్లి. వి (సంగీ.) ఒకానొక రాగము.

ఉ. .. ముఖారి దేవగాం,ధారి వరాళి కన్నడ
ధనాసరి ఘూర్జరి భూరివేగడా, యారభి
రామఖల్లి మొదలై తగురాగము లింపు
మీఱఁగ ... చెన్న. ౨. ౨౩౬.

రామగిరి. సం. వి. ఇ. పుం. ఒకానొక పర్వతము, చిత్రకూటపర్వతము. (వాచ.)

రామచంద్రుఁడు. సం. వి. అ. పుం. రఘురాముఁడు, దశరథుని జ్యేష్ఠపుత్రుఁడు.

రామచిలుక. మి. వి. (రామ + చిలుక) ఒక జాతి చిలుక.

కం. కంజాతరాగమణిగణ, సంజాతరుచిచ్ఛ
టావికంకటమగుచున్, రంజిలు పంజరమా
న్యప, కుంజరుఁడా రామచిలుకకుం దగ
నిచ్చెన్ ... రాజ. చ. ౧౭౯.

సీ. ధరరామచిలుకతో సరి యనఁ జిలుకలై నఁ
బదంతి పల్కులు సరి వైతమగుచు ...
చంద్రా. ౪. ౧౦౫.

రామఠము. సం. వి. అ. పుం. న. హింగువు, ఇంగువ, ౨. అంకోలము, ఊడుగు. ‡.

రామఠి. సం. వి. ఈ. స్త్రీ. నాడీహింగువు, ఒక విధమైన ఇంగువు.

రామణీయకము. సం. విశే. అ. ఈ. అ. అందమైనది, మనోహరమైనది.

వి. అ. న. మనోహరత, అందము.

రామతమ్మ. వి. శుకము, చిలుక.

ద్వి. చెంగటి ముద్దురాచిలుక లాలించి, తమ్మఁ
జెప్పెద రామతమ్మ నా ముద్దు, గుమ్మ మా
టాడరా .. ద్వి. పరమ. ౨. ౫౭. పా.

గీ. జీవపదమైన నమఃశాని పీమగాని, పీమఁ జరి
యింపఁ దగునటే రామతమ్మ ...
తపతీ. ౩. ౨౨.

రామతాడు. మి. వి. (రామ + తాడు). పెద్ద తాడు. ‡. (శ. ర.)

రామదాసు. వి. పక్షివిశేషము. (శ. ర.)

రామదూత. సం. వి. అ. పుం. ౧. హనుమంతుఁడు. వానరము.

రామదూతి. సం. వి. ఈ. స్త్రీ. తులసీభేదము, రామతులసి.

రామనవమి. సం. వి. ఈ. స్త్రీ. చైత్రశుద్ధనవమి శ్రీరామజన్మదినము.

**రామన్న.** వి. వి. (రామ+అన్న). శుక సంభోదనము నుపయోగించు మాట.

సీ. రామన్న యిట్టి విరాళికాళింగఁ జాల సొబగు చెల్లాలి ప్రేమఁ జూడవోయి, రామన్న చూచి తిరముగా శుభస్య శీఘ్రం బన్న వార్తలోఁ గాంచవోయి, రామన్న గాంచి ద్వారవతీ పురంబున కతివేగ శాలికై యరుగవోయి, . చమ. 3 ౨౧.

**రామన్నాట.** వి. బాలక్రీడా విశేషము.

సీ. . చెమట, తా యొత్తుగొడుగు బొంగరము రామన్నాట పాడుగుళ్లు
హంస. 3 ౪ౘ.

**రామపూగము.** సం. వి. అ. పుం. ఒకదినుసు పోఁక, నిడుపులోడిమగల పోఁక. ‡

**రామబాణము.** సం. వి. అ. పుం. ౧. మల్లబంధ విశేషము.

వ. విష్ణుచక్రంబును, రామబాణంబును, నాగ బంధంబును, తోలకరి మెఱుపును
మల్లపు. 3. ౭౯

౨. కొటాకు పుస్తకములను గొఱికివేయుక్రిమి విశేషము. 3 పుష్ప విశేషము. (శ. ర)

౪. ధాన్య విశేషము.

వ. గంగాజలములు కేసరులు చంద్రవంకలు పెన్నముద్దలు దాళువాళు నారళ్లు రామ బాణాలు కటకసరులు .
ప్రబంధ. ౧౧౨.

సీ. రామబాణాలు రెక్కాముల పెన్నముద్దలు జిల్మబుడములు దాళువాలు ...
హంస. ౪. ౧౨౭.

**రామభద్రుఁడు** సం. వి. అ. పుం. రఘు రాముఁడు. దశరథపుత్రుఁడు.

**రామము.** సం. విణ. అ. అ అ. ౧. అంద మైనది, సొగసైనది. ౨. నల్లనిది. 3. తెల్లనిది ౪. ప్రధానము, ముఖ్యము. (శే. వి.)

వి అ. పుం. ౧. పెద్దదుప్పి, మృగభేదము.

న ౧. కుష్ఠము. ౨. తమాలపత్రము. 3. వాస్తూ కము, ఒకానొక కూరాకుచెట్టు. ౪. రతి క్రీడ, ౫. ధ్వజము ౬. శల్యము. ౭. మాలి, శిఖ. ౮. లక్ష్మి, చిహ్నము. (శే. వి.)

**రామలక్ష్మణులు.** సం వి. అ. పుం. ౪. ధాన్య విశేషము.

చ జొన్నఁ బ్రాలు చిన్నచుక్కలు కలిఁ గలు వంగవరులు జగన్నాథప్రియములు రామలక్ష్మణులు కలియుగమహిములు కాక రలు ప్రబంధ. ౧౧౨.

**రామలవణము.** సం. వి. అ. న. శాంభరి లక్ష ణము. (వా. చ.)

**రాములు.** వి. ౪. మత్స్య విశేషము.
(చి. వి., బ్రౌ. శ. ర.)

**రామవల్లభము.** సం. వి అ. పుం. భూర్జపత్ర వృక్షము ‡.

**రామశరము.** సం వి. అ. పుం. శరవృక్ష భేదము ‡.

**రామసఖుఁడు.** సం. వి. అ. పుం. సుగ్రీవుఁడు.

**రామసాగరములు.** సం. వి. అ. పుం. ౪. ధాన్య విశేషము. (శ. ర.)

**రామసింగు.** మి. వి. తుపాకివంటి యుద్ధసాధ నము.

సీ రామసింగులు ధీరమునైన బ్రొంఁతల యుఱవడి యుఱుముల తెఱఁగు నింప ..
కళా. పూ. ౫౧౭.

**రామానుజుఁడు.** సం. వి. అ. పుం. వైష్ణవ మతగురువు. ఇతఁడు ప్రఖ్యాత సంస్కర్తయు, విశిష్టాద్వైత వేదాంత మతస్థాపకుఁడును, బహుగ్రంథరచయిత (కర్త)యు.

**రామాయణము.** సం. వి. అ. న. రామ చరిత్ర. (ఏడు కాండములుగా నిరువది నాలుగు వేల శ్లోకములు గలదియు, వాల్మీకి రచితమును, రామ చరిత్రాత్మకమునగు ప్రసిద్ధ కావ్యము.)

**రాముఁడు.** సం. వి. అ. పుం. ౧. జమదగ్ని పుత్రుఁడగు పరశురాముఁడు, భార్గవరాముఁడు. ౨. కౌసల్యా దశరథుల పుత్రుఁడును రామాయణ కథానాయకుఁడునగు శ్రీరాముఁడు, రామచంద్రుఁడు, రఘురాముఁడు. ౩. వసుదేవ పుత్రుఁడును శ్రీకృష్ణసోదరుఁడు నగు బలరాముఁడు.

**రాముని.** మి. వి. (రాచ + ముని.) రాజర్షి, విశ్వామిత్రుఁడు

క. నీ రాముని లక్ష్మణుతో, నీరాముని వెంటఁ
బనుపు మింక నితనిచే, నీరజనీచరయగు ధర,
నీరజహితవంశ చింత నీ కేమిటికిన్

చం రా. ౨. ౬౭.

**రామురాజు.** వి. నమస్కారవిశేషము.

రగడ. పార్థ స్థలమున భాగవసించు పుర
బ్రహ్మమునకు రామ రాములని .

హంస. ౪. ౨౧౪.

**రాముల్క.** వి. (రాచే + ముల్క.) పర్వాణీ. ౯.

సీ. . . వాఁడుడు నాఁ చిన్నముల్కనాఁగను
లెలముల్క యనఁగ, రాముల్క నాఁగ
పర్వాణి ప్రబల ...

ఆర. భా. ౨. ౫౯.

**రామేశ్వరము.** సం. వి. అ. పుర. దక్షిణదేశము నందుఁగల యొక పుణ్యక్షేత్రము.

(ఇచ్చటనె శ్రీరామ నిర్మితమగు సేతువుగలదు.)

**రాయ(ఁడు)** వి. ౧. ప్రభువు, రాజు.

క. ఓ రాయఁడ యీ యంగద, కోయన లేక
టకు వచ్చె నాళ్లన్నియు ...

నీలా. ౨. ౫౭.

సీ. కడిది రాయ కుమార గండపెండేరంపు రవళి
కంచుకలోక రవముగాఁగ

సారంగ. ౨. ౩౫.

సీ. చెలికత్తెయగు పంచుమలపట్టి పోరామి
గిలుకొల్పిన రాయగేస్తురాలు

ప్రబంధ ౨.

(రాయగేస్తురాలు = రాజపత్ని.)

ఉ. ఆరయలనాగవేణి మెఱుఁగారు కటారి
కిమానటిఁదగున్, బోయనవచ్చు నన్మి
ఱుఁగుఁ బోఁడిమిఁబొందు సమస్త భూమికిన్,
రాయ లనంగవచ్చు

విజ. వి. ౧. ౧౧౯.

ఉ కన్నడరాయ యక్కొడుకుఁగప్వ ప్రియా
పరిభుక్తభాక్కథన్ . ఆము. ౧. ౧౪

మ. . పద్మిని కరాంభోజంబునన్ మంద
మం,దపట ద్వాయుచలద్దళాంగుళులు గన్ప
ట్టంగ నవ్వెల్లు రా,యని రారాయని పిక్చా
నాఁడగ ద్విరేఫాద్యంతదీర్ఘధ్వనుల్.

విజ వి. ౧. ౧౩౯.

సీ. ఎకిమీఁడు పాదుసా యేలిక మన్నీడు
సాహేబు రాయఁడు సామి పటుపు, .
రాజులు . . కొడుకు వర్తిలు నృపు
పేళ్లు ... సాం. వి. హాస. ౧౧.

మ. ... సజ్జనానామయ్యా పాలుట్టాపాలుటింగడరెం
కెంతం జేరి కేశల రాయలు సాహో యని
హెచ్చరింప ... దశా. ౨. ౬౩.

(ఇట శ్లేషార్థకము.)

సీ. . కదలిరాయల లోఁకు గన్న గట్టి ...
మనుచ. ౫. ౪౩.

(ఇట శ్లేషార్థకము.)

సీ. దర్పకాకార దాతలరాయయని పెంటఁబడు
బట్టువారిఁ బాలుపైచి .
శుక. ౪. ౧౧౧.

(ఇట శ్లేషార్థకము.)

౨. కొన్ని రుుదల సంజ్ఞావాచకముల కుదిని ప్రయోగింపఁబడు బిరుదము.

మ. . ముఖం,బున దీర్ఘాయువు నిచ్చుఁగావుత
గుణాంభోరాశికిం గృష్ణరాయనికి స్వారణ
రాజవక్త్రుఁడు కృపాయత్తైక చిత్తాబ్జుఁడై ..
పారి. ౧. ౩.

చ. పాల్కడలి మద్దులపట్టి నృసింహ
కృష్ణరాయలఁ గరుణారసంబు నిను పారెడి
చూపులఁ జూచుఁ గావుత . .
పారి. ౧. ౬.

ఉ. కాంబరీ, ఖిల్లుఁడు కృష్ణరాయల
కథీవ శుభప్రతిపాది గావుత ...
మనుచ. ౧. ౨.

గీ. ఆ నృసింహప్రభుండు తిప్పాంబవలన,
నాగమాంబిక వలన నందనులఁ గాంచె,
వీరనరసింహరాయ భూవిభుని నచ్యుతాయ
తాంశజు శ్రీ కృష్ణరాయ నిమ్న.
ఆము. ౧. ౩౧.

రాయదొంగ = రాజానాజ్ఞ వలన దొంగతనము చేయువాడు.

ద్వి. అనుపమంబైన దొంగ కీరులను, రాయ
దొంగలఁ జార్యరసికశేఖరుల, వాయుదం
విల్చి రథాస్యంబునందుఁ, బన్ని యూ . . .
ప్రాసాదధింక, పెన్ని లాగులపైన నీదేర్పు
వలయు, . . ద్వి. పరమ. ౩. ౫౧౯.

జ. రాయబారము, రాయబారి, రాయమెచ్చులు,
రాయలతికము, రాయసము, రాయసరులు.

రాయంచ. వి. (రాచ+అంచ) (సం. రాజహంసః) కాళ్లును ముక్కును ఎఱ్ఱగనుండు తెల్ల జాతి హంస.

సీ. రాయంచయంచుఁ జేరకు జోకయగుఁగాక
పచ్చరయేనిక తోలుపచ్చడంబు, ..
హర. ౪. ౨౧.

క. రాయంచ మందగతిఁ జన, వాయసమతి
తీవ్రభంగివలను మెఱసి లీలాయితము లొప్ప
బహుగమ, వాయాసము నొంది పుడుచు
గ్గలిక మెయిన్ భార. కర్ణ. ౨. ౬౫.

ఉ. మించిన పేర్కొ వీనులకు మిక్కుటమై మధు
వృష్టి గ్రమ్మ రాయంచలు కూయఁ గ్రౌంచ
మును నావలఁ గూయఁగడంగు భంగిఁ
గ్రాంచిత శబ్దసారులు మహాకవు
లాద్యులు కావ్యకయ్యఁ గీలించిన కీర్తి
సంగముఖలీలకు చేసిన గాంచ్ఁ జేసితిన్.
నృసిం. పీఠి. ౧౩.

రాయంచగిండి. వి. (రాయంచ + గిండి) రాయంచవలె నుండు గిండి, జారీ.

సీ. పడమటి పస్నిటి మడిసీరు రాయంచగిండుబు
చెంగటఁ గీలుకొల్పి, ... దశా. ౩. ౨౩౯.

రాయడి=రాయిడి. వి. (√రాయు.) బాధ, ఉపద్రవము.

గీ. అన్నదాదులు చేయు రాయడి నుపద్వ,
లచ్యుతునితోడఁ దెలిపినారనియు భయముఁ,
జెందెదవు గాని . . ఉ. రా. ౨. ౧౯.

ఉ. పాయకుఁ డైన యన్నదమ్ములకు రాయకుఁ
దిండుఁ గల్గుటన్, రాయడిపుట్టు నన్న
విధురంబుగ బుద్ధి నిరామికల్గఁగన్ ...
రంగా. ౨. ౧౫౨.

**రాయణము.** సం. వి. అ. న. బాధ, కొట్టు. (విల్సను.)

**రాయబారము.** వి. √రాయ. (సం. రాజ భారః.) దౌత్యము, దూతకృత్యము.

ఉ. ఆ పరమోపకారనిధి యప్పుడు వేల్పుల
రాయబారమున్, మోపువహించి ..
నైష. ౩. ౪౨.

గీ. అది గణింపఁగనేమిఁక నమరనాథుఁ, డాది
దిక్పతు లాకరోకరసుప రాయబారముల
సంచరించు నావారదునను, దినముకొక
చోట నిల్వఁగాఁ దీఱదయ్యె .
ఉ. హరిశ్చ. ౨. ౮౦.

గీ. రాయబారంబు వచ్చితి రాక్షసేంద్ర,
యచలకన్యక పనుప వింధ్యమున నుండి
కాశీ. ౬. ౨౧౪.

సీ. రాయబారియనంగ రాజదూత యగుఁ దద్భా
వంబు తగు రాయబార మనఁగ, ...
ఆం. భా. ౨. ౧౮౯.

**రాయబారి.** వి. (రాయబారము + ఇ³).
రాయబారమునడుపువాఁడు, దూత.

గీ. రాజరాజాలు పంపిన రాయబారు, లొక్క
వంక విలాసిను లొక్కవంక, బలసి కొలు
వంగ నభూతనైభవముతోడ, దమకుఁ గొలు
వుండె బసవయరాఘవుండు ...
వి. పు. ౧. ౧౪.

సీ. గజపతి నరపతి క్ష్మాధర్తలంపిన రాయిడికంపు
రాయబారులొక్కవంక ... కపో. ౧. ౧౮.

ఆ. రాత్రి గాని కానరాదు లంకేశులకుఁ,
బగలు గాని కానఁబడదు మనకు, రాయ
బారి సంధి చేయుటకై పోవఁ గాఁజెల్లి
పొందుగాదు తలఁప ...
కా. పంచ. ౩. ౩౫.

సీ. రాయబారి యనంగ రాజదూతయగు ..
ఆం. భా. ౨ ౧౮౯.

**రాయమెచ్చులు.** వి. బ. (√రాయ). ధాన్య
విశేషము.

వ. మధురములు చామరాలు పెండెముడువులు
రాచవన్నెలు తులసీవనమాలికలు సింధు
కర్పూరాలు రాయమెచ్చులు రేబు
మల్లెలు . ప్రబంధ. ౧౧౨.

**రాయతికము.** వి. (రాయ + తికము.) ౧.
రాజత్వము, క్షత్రియత్వము. ౨. రాష్ట్రము,
ప్రభుత్వము.

సీ. రాచతికమ్మన రాయతికమ్మన రాజరాడ్భావ
కర్మములు వెలయు. ఆం. భా. ౨. ౧౮౨.

**రాయశృంగారములు.** వి. వి. బ. (√రాయ).
వస్త్రవిశేషము.

వ. .. వసంత విలాసంబులును రత్నకీలితంబు
లును రాయశృంగారంబులును తారామండ
లంబులును నాగజావళులును ... అను
పేళ్లుగల పుట్టంబులు ...
ద్వా. ౩. ౧౭౭.

**రాయసము¹.** వి. (√రాయ.) లిపి, రాచతివి.

గీ. చలుఁడ దప్పటిపవళి వాటి వెలయ రాయస
మున నెమరేఁగి .. దశా. ౧. ౯౭.

సీ. తలవాఁకిటను రాణి నిలిచి నమ్మతిఁ బెండెఁ
దన రాయసమునకుఁ దప్పు గాదె ...
ఇందు. ౧. ౧౮౫.

సీ. కాచ్చు చీరలఁ గమ్మనింపికేఁ బంపించి
పెనుకి వ స్త్రముఁ బాడు పెట లొసంగు ...

సీ. రాయసమ్ములు సదివెమ్మ వ్రాయఁదగదు,
విశ్వకర్మ కటంచున విభకి విరాయపడుకే యిలు
కట్టుదంచని బరువు చాటుఁ, బ్రాథమిక
కామినీభోగపరత వతఁడు

పార్వతీ. ౧. ౨౨.

రాయసము²=వ్రాయసము. వి. ౧. రాజ
లేఖ, జాబు.

క. జనకనృపు న త్తరంబని, జనపతికిం దెలిపి
రాయసము వ్రాయ నియోగిని బిలిచి
యొసఁగ నతఁడును, జనపతి కనుసన్ననదియు
సరభసఫణితిన్ దశా. ౪. ౨౨౪.

మ. . శ్రీరంగ రాయల చిత్తం చిగురింప
రాయసము వ్రాయం జాలితౌనా సుధీ,తిల
కుందక్కయమంత్రి వెంకటపతీ దీవ్యత్కళా
వాక్పతీ ల. వి. ౧. ౧౯.

చ. మారిదపథితుషారమణు లా తురగాళి నుదుల్లి
పట్టముల్, తరువుల రాయసంబుల విధం
బునఁ గెక్డొని శ్వేతమానవేశ్వరునకుఁ దెచ్చి
యిచ్చిన మవస్తుపరింపరి శిక్కఁగాడు
పెన్స్వైరముల రీతిఁ దత్సవనతిఖురాంకము
లుండు నుర్వరన్. వరాహ. ౯౨. ౭౦.

సీ. కమ్మ యునంగ లేఖయగు రాయసమున రాజ
శేఖదగు. ఆం. భా. ౨. ౧౨౭.

౨. కార్యదర్శి పని, వ్రాఁత.

సీ. కలితకార్య విచక్షణులు రాయసము వ్రాయ
సమలు వాఁకిటి దండఁగాడియుండ ...

ఘటికా. ౧. ౧౧.

విశే. రాయసకాఁడు, లేఖరి.

సీ. .. పెదిటి రాయసపైన పేవకుఁ దక్షైన
వారమగాఁదుండివాయనయిన .

కేయు. ౪. ౪౭.

సీ. ఒక చక్కరాయసాల్ ప్రకట వాగ్వైఖరిఁ
జదురిలై తివసర్పల్ చదువుచుండ, ...

భోజరా. ౧. ౧౦౪.

రాయసరులు (ర్లు). వి. బ. (√రాయ) ధాన్య
విశేషము.

సీ. సన్నమూదులు పచ్చగన్నేర్లు కోదండరామ
ముల్ కేసర్లు రాయసర్లు ...

హంస. ౪. ౧౨౭.

వ. దాళువాలు సారళ్లు రామబాణాలు కట
కసరులు రత్నసరులు జీనిసరులు రాయసరులు
పచ్చదివసరులు .. ప్రబంధ. ౧౧౨.

రాయి=తాయి. వి. దే. (బ. రాలు) ౧. శిల,
పాషాణము.

క. చేతఁగొని యుప్పు నములుట, రాతిపయిని
నుప్పు గొనుట రాత్రి దధి మధూ,కేతంబుగఁ
గుడుచుట ధ,ర్మేతరములు సేయ నక్త వెర్గు
నరేంద్రా. భార. అను. ౪. ౧౧౦.

ఉ. ఆ రవికాగ్రగణ్యుని సమంచిత రూపగుణ
ప్రసన్నగం,భీరతఁ గన్నఁ గామినుల చేరిటి
రాలయినం గరంగు ..

విక్ర. ౪. ౧౪౪.

ఉ. సాలములో యనందగు రసాలములం బరి
పాకలీలచే, రాలు మెఱుంగు ముత్తియపు
రాలు ఖగంబుల గుంపుఁ దోలఁగా ...

దశా. ౧. ౧౧౭.

౨. పర్వతము.

క. సామర్థ్యము గలిగినచీ, కోమలి ధైర్యమున
రాతికొఁడును సుమిత్రా ...

సుద. ౨. ౩౦.

రాతికసనటి గిలిగింతలు = వ్యర్థములు.

గీ. అతఁడు పరభాగ్యము కోరి యాసఁ
బొందఁ, దివాకలం దిశ్చభాగ్యాప్తి కింత

డింపఁగా, జలకముఁ దేర్చి రిద్దఱిలోపల
నీలకచాళి రోషమున్. రా. వి. ౫. ౫౪.

క. అంభోజముఖికి సముకుచ, కుంభంబులు రాయి
డింపఁ గోరిక లలరన్, బింభావ రకుల
నిపుఁ గడు, సంభావించెదము మాకుఁ జనవి
వలయున్. హరిశ్చం. ౨. ౧౨౩.

౨. కలహించు, వివాదపడు.

ద్వి. తోడరి వసిష్ఠునితో రాయిడించి, తదయక
తన ఘోరతపము పెంపునను, ఐదయు
దుర్లభమైన బ్రహ్మర్షిత్వ, మదరంగ ...
ద్వి. హరిశ్చం. ఉ. ౨౬౪౦. పం.

పంచచామరము. రమాకుమార సార సాంధ
రాజి మించనిట్లు భీ, రమా యమాధినాథు
తోడ రాయిడించి మించి స్వైరమాని
తార ... కృష్ణ. ౪. ౯౧.

ద్వి. వారల నిపుఁ గొనవచ్చినవార్తితో రాయి
డించి పోఁడోల నీపాల, మలకలుమాని
యీ మాలని చేలి, ..
ద్వి. హరిశ్చం. ఉ. ౧౪౫౮. పం.

సీ. పరభపాదిర్భవన్నరహరి స్తంభగర్భ స్ఫుటీ
కృత పటపటల తోడ, గీ. నమశ
రించి విదంబించి హుంకరించి, రాయిడించి
ధణంధణారవము రత్న, సానుగుహల ప్రతి
ధ్వనులీన విజయ, పటహపటలంబు చటి
పించి పటురయమున. (ఇట ఉపమాద్యోత
కము.) వరాహ. ౩. ౨౬.

సీ. కనకమాప్రర రణత్కారనిక్వాణంబున వల
మెట్టియలతో రాయిడింప. (ఇటఉపమా
ద్యోతకము). హర. ౫. ౪౪.

౩. అతిశయించు.

గీ. తొడఁగ వజ్రంపుఁ జామటుబొట్టుపెట్టి,
రతికి మెట్టెలబొంగరలు రాయిడింపఁ,
బంచసాయకు ఘంటావళులు మరఁగ,
నిండుబింబాస్య మెలఁగు నమ్మండిగమున ...
వి. పు. ౬. ౧౪.

స. క్రి. బాధించు.

గీ. ఆహాహాయని సింధుశకనిదేహళవశాయు,
లాదిగాఁగల నిఖిలదేశాధిపెల్ల, రాయి
డించుచౌ తిరుమలరాయ వేంకటావనీంద్ర
భుజప్రతాపాగ్ని కరణి . .
చంద్ర. ౧. ౧౯.

రాయిడికత్తె (త్తియ). వి. (రాయిడి+కత్తె)
ఉపద్రవముచేయు స్త్రీ.

ఉ. రాయిడికత్తెలైన పెనుఁద్రామిడి యత్తల
యిండ్లఁ గోత్రముల్, నేయు విలాసిమల్
మునుకు పెందఁగ వేశ్యలప్రక్క దాపులం
బాయని కాముకుల్ .. విక్ర. ౬. ౪౩.

ఉ. . విరాళిగాకయు, రంపెల గాటుగాక
బలు రాయిడికత్తియగాక యుప్పరున్,
సొంపాకయుంతరవిరుద జాదరికత్తియ
గాక యుంతయున్ ...
ధనాభి. ౨. ౬౦.

రాయు. అ. క్రి. ౧. ఒరయు, స్పృశించు.

సీ. రాజాల సందడి రాపిన తొడవులు మురిపి
రాలిన పాడి మ్రుగ్గుగాఁగ.
భార. విరా. ౩. ౪౪.

సీ. పరుసఁ దరతరంబ వనములు పత్పలరాచు
లయినభంబు రాయుచుండు ...
కు. సం. ౪. ౯౩౦.

మ. . కీర్తి ప్రవాహంబు వ్యారణగండ
స్థలకుంభకూలములతో రాయం దివారా
త్రముల్. సైన. ౨. ౫౨.

౨. ప్రతిఘటించు.

గీ. కెంజిగు పూవుదులోకంబుల కొలకిమ్రుగలు,
రాయ కేర్తుర యూదపరాపుతోడ.
ఉ. హరి. ౧. ౮.

క. తారకితగగన చక్రిముఖ్యతోరాజుననంగరేలు
తోగప్రవ్వల నో,ప్పార విభ్రులనిర్మల
కా,సారంబులు పొరస ప్రసవసేవ్యములై.
హరి. పూ. ౪. ౧౧౫.

సీ. తారకా మందార తారాచలంబులతో
రాయు కెవ్వాని చారుకీర్తి . క్రీడా. ౧౪.
(ఇట నాపమ్యార్థోక్తికము).

౩. కలహించు.

సీ. తమలోన రాజిభూధవులు చూలు గొన్నఁ
గఱుముళ్లను బోయి కెలవు వెదలి, .
హరి. ఉ ౯. ౫౭.

గీ. రజనితోడను దర్పతో క్రమణతోడ, విధ
వతో వాథుతో రాయు కెలఁదితోడ,
కెడిపెతోఁ బాలఁ బోరాను సేయఁజనదు
ప్రాణసంకటములను బుద్ధ్యాంగవలకు ...
కాశీ. ౨. ౪౪.

క. వైరులు రాయుట హితన,త్కారమువక
యనుపులిచ్చెఁ దస్కరుఁడు
పం. పంచ. ౩. ౨౧౪.

క. భారతవర్షమునకుఁగాఁ, గౌరవులును బాండ
వులును, గాంక్షం గదుఁచె,నై రాని రాయుం
డోరులతోఁ, బోరందగి రిట్టి బుద్ధిబుద్ధులు
గలరే . . భార. భీష్మ. ౧. ౭౮.

౪. రాల్పడు, (గొంతు) కంపించు.

ద్వి. రాపిన యెలుఁగును రథమార్గధూళి, ధూస
రంబగు మేనుఁ దూలిపైకొంగు, తుంగ స్త
నంబులఁబోఁగ నందంద, డొంగలి కొప్పులం
డొరఁగు కన్నీరు ...
రం. రా. ఉ. ౧౭౨. పొ. ౨౭. పం.

ఉ. గొంతులు రాయఁ గో యనుచుఁ గూఁకలు
పెట్టిరి గ్రామ్యభామినులె ...
పాంచా. ౨. ౫౨.

౫. చొచ్చు, ప్రవేశించు.

చ. అదిరెండవ నవదూటి నిరులంటదు కత్తురి
గీరపొట్టు పెట్టదు పువుఁదోఁట రాయదు
పటంబులు వ్రాయదు . కువల. ౩. ౪౮.

౬. ప్రకాశించు.

ఉ. చేరక్కు రాయుంత విక్కు బలగూదనుదిక్కున
రాయుచుండుటకా, జొక్కఁగ వేఁగదిప్పుడు
నిశాసమయం బిది . క్రీడా. ౫౧.

ఙః రాపాడు, రాయుడి, రాయింత, రాయిడి,
రాయిడించు, రాయిడికత్తె.

రాయుఁడు. సం. వి. అ. పుం. రాజు, ప్రభువు.
(విల్యమ్సు.)

రారాజు. వి. (సం. రాజరాజః) ౧. రాజులకు
రాజు, చక్రవర్తి, సార్వభౌముడు. (శ. ర.)
౨. కుబేరుడు.

గీ. రంభ రంభాప్రముఖలనమగ్రంబుగాఁగ,నమృత
దివ్యాన్నభిక్షు కామారి కొసఁగ,రాప్రఁ
జున్నులనడుము రారాజుపట్టి, పటిరాయుత్తిన
నఖరేఖ బయలుపడఁగ. హర. ౫. ౪౩.

౩. దుర్యోధనుఁడు.

గీ. ... రారాజునిల్లనిలజానకు, దుస్ససేను
మందిరము పార్థునకు నరుస,తోడ దుర్మర్ష
ణునియును దుర్ముఖునియు, నిండ్లు గవలకు
సంప్రీతి నిచ్చె నృపతి.
భార. శాం. ౧. ౩౯౭.

గీ. చెలఁగు దుశ్శాసనుఁడు దుస్ససేనుఁ దవఁగఁ,
బ్రబలు దుర్యోధనుండు రారాజు భవ ...
ఆం. భా. ౨. ౧౮౨.

శా. శాలోత్తీప్త గిరుల్ మురారిపురిపై వ్రాలన్ విశీర్ణంబులై, రాలె గోపురముల్ గ్రహంబులు రలెం బ్రాసాదముల్ సగ్గులై, కూలెన్ దశా. ౧. ౫౬౭.

3. నశించు.

శా. నీ బాణంబులు రాల నీ ధనువు ఖండీభూతమై పోవ నీ జోదిల్లిన్ ఫణియంట నీబలము లాశాపీథిపాలై చనన్, నీ బంట్రొతుతనంబు స్త్రీలయెడనే నిన్నెవ్వరు న్నవ్వరే, మాశాలానుణి నేఁచఁ బోకు మకటా మర్యాద గాదాత్మజా

ఇందు. ౪. ౫౮.

౪ అతిశయించు

సీ. గీ యోగిశైవడి మిగుల విరాగిరీతి, నడియె లోకంబుగానున్న యూపదంతి, నేప రాలెడు తమ్మిదుమ్మి పిరంగి, పీడమటు మాయు మాయింప నేరదయ్యె

సుదంతా. ౭ ౧౫౪.

ఔ: రాలఁగొట్టు, రాలించు, రాలుఁగాయ, రాలుఁగాయతనము, రాలుగొను, రాలుచు, రాలుపు, రాలువారు.

రాలుఁగాయ. విశే (√రాలు.) తుంటరి, దుష్టుఁడు

(చూ. రాలుఁగాయతనము)

రాలుఁగాయతనము. వి (రాలుఁగాయ + తనము.) దుండగము.

గీ. వాఁడు వానాఁటి కళివృద్ధి వఱలఁ బెరిగి, కాఁకలను దేఁటి గడిమాటి గట్టిపోరి, రాలుఁగాయతనాన చేరజపుడారి, నాటితేటియుఁ బలుగుంటమారి యయ్యె.

హంస. ౫. ౧౧౦

రాలుగొను. అ. క్రి. (రాలు + కొను స్వార్థము.) గళితమగు, క్రిందఁబడు.

చ. అడరు సవాంబుధారలు జటాటవిలోఁబడి విభ్రమించి వెల్వడి చనుదెంచి రాలుగొని పత్మములన్ జెదరిల్చి.

కా. సం. ౬. ౩౬౩.

రాలుచు(ల్చు). స. క్రి. (√రాలు) ౧ రాలునట్లు చేయు.

చ. పాదపంబుల నెస వేళ్లతోఁ బెఱికి పువ్వులు రాలిచి డొల్లఁ దాఁచి

భా. రా. సుం 333

సీ. వనదేవతాగాత్రమునను జైత్రుఁడు నించి కడఁగి రాలిచిన చిక్కు-స మనంగ

ఉ. రా. ౬. ౫.

శా. రక్షప్సైన్యములోఁ గబంధములు గృధ్రంబుల్ నటించెన్ ద్రిలో, కక్షోభంబుగ మేఘముల్గురిసె నిర్ఘాతాస్థిమాంసాస్రముల్, పత్మక్షేపములొప్పు నిప్పుకలు గూబల్ చూపులన్ రాల్చె ఉ. రా. ౭ ౩౭.

౨. విదలించు, దులుపు.

ద్వి తలిరుల రాల్చి పత్రంబుల డుల్చి.

ద్వి. మరిచ్చ ఫూ ౧.౭౧౧. పం.

గీ రాల్చి జాడించె ననఁగను రపిశిశిక్కు-, విదిలిచెనటన్న పల్కు-గా వేద వేద్య

ఆం. భా 3 ౧౩౭.

౩. చేల్లు.

మ. ద్విజావళుల్ శ్రుతిహితా వ్యాజాను లాపంబుతో, నలఘుశ్రీకరశాఖికాంచల నిర్యత్కే-సరార్ధాతిత్వతం,బులు రాల్చెన్నర దేవ రత్నమకుటీభూపాలి శేషంబుగన్

వను ౧. ౧౫౦.

రాలుప(ల్ప)డు. అ క్రి. (ఎలుఁగు) కంపించు.

ఆ. అక్కపాలిసాథుఁ డగ్నిలోఁ బడుటకు,
శోకవహ్నిఁ జిత్తమాతలమున, వెలుఁగు
రాలుపడఁగ నిట్లని పలవించె ...
భార. శాం. 3. 3౭౯.

గీ. . కంఠగద్గది కావ్య కైకాకు విక్రుతి, రాలు
పడఁ బండ్లిగుల్చుచు దీలుపాటుఁ, బ్రకట
దైన్యంబు దోఁప లోభంబు వచ్చె.
వైమ. ౪. ౫౭.

క. చరణములు వడఁకు భీతిం, బరవశమా
నొడలు రాలుపడు నెలుఁగాపా, మరణమున
కెటి చిహ్నము, లరయన్ యాచకుఁడు
దాల్చు నచ్చిహ్నములన్.
వేం. పంచ. ౨. ౧౪౨.

వ. కొండొకసేపునకు మూర్ఛదేఱి యన్నర
పాలుం డెలుంగు రాల్పడ నిట్లనియె
భార. సౌ. ౨. ౧౨.

ఉ. ఏసిన నింతినొచ్చి నెలుఁగింతయు రాల్పడఁ
గోప జృంభణం, జేసి ముఖాబ్జ మొప్పఁగ.
భోజరా. ౫ ౧౦౭.

ఙ. రాలుపాటు

రాలుపాటు. వి (√రాలుపడు.) గద్గదము,
కంపనము.

వ. పలిచిన కన్నునీరు జడివెచ్చని చేన్నుల
మీఁది కేఁడియన్, దొలకరి ఘర్మతోయ
ములతోఁ గలసె న్మెయి బ్రూనుపాటుతో,
నెలుఁగున రాలుపాటొదవె నెక్కు విప్పతి
తోన లోపలం, గిలగొనె నారటంపుఁ
బులకంబులతోఁ బొడఁసెఁ గంపమున్.
ఉ. హరి. ౫. ౧౧౨.

రాలుపు. వి. (√రాలు ) రాలుట.

సీ. ఆకురాలుపు గండ్ల నానెడు నాన వింతడు
గూఁడి బంకంటి యంగలార్చి
ఆము. ౫. ౧౧౪.

రాలువారు. అ. క్రి. (√రాలు) జాఱు, ప్రవ
హించు.

సీ. వర్ణన కెల్లతో వర్ణనకెక్కంగ రసములు
దలుకొత్తి రాలువార .
కు. సం. ౧. ౩౨.

రావడి=హావడి. వి. ఉపద్రవము. (శ. ర.)

రావణగంగ. సం. వి. అ. స్త్రీ. లంకాపురమునఁ
బ్రవహించునది.

రావణహస్తము. వి వాద్యవిశేషము.

వ. పిల్లలు బచ్చికోళ్లు రుద్రవీణియలు
స్వరమండలంబులు తంబురలు కిన్నెరలు
రావణహస్తంబులు రబాబులు .
ప్రబంధ. ౬౦౫.

వ. కాహళుల్ జోళ్లు శంఖములు రావణ
హస్తములు డిండిమంబులు
(బలరామచరిత్రము) (క్రా ని.)

రావణారి. సం. వి. ఇ పుం. శ్రీరాముఁడు,
రఘురాముఁడు.

రావణి. సం. వి ఇ. పుం. ఇంద్రజిత్తు, మేఘ
నాదుఁడు.

రావణుఁడు. సం. విణ (అ ఆ. అ.) అఱచు
వాఁడు, రోదనము చేయువాఁడు.

వి. అ. పుం. రాక్షసముఖ్యుఁడును, లంకాధి
పతియు నైన రాక్షసుఁడు.

రావము. సం. వి. అ. పుం. ౧. అఱపు, బొబ్బ
రింత, జంతువుల యఱపు. ౨. ధ్వని.

రావి=రాగి. వి. అశ్వత్థము. కీ.

ద్వి. రావులఁగొట్టి వారణములఁగటి, మావులఁ
బట్టి క్రొమ్మావులఁ గట్టి ...
ద్వి. హరిశ్చ. పూ. ౧౨౦౪.

క. ... చిత్తురఁ గెంపారు కొలక విప్పులతోఁ
గని, యా రావిస్వాదసాక్షికై వల
గొనుచున్ . . ఆము. ౪. ౫౩.

సీ. రావి మామిడి కొండరావి మేడియు బ్రహ్మ
మేడియు జిడిమామిడియుఁ జింత .
హంస. ౪. ౧౧

జ : రావిరేక.

**రావించు.** స. క్రి. (√వచ్చు) రప్పించు, వచ్చు నట్లుచేయు

క. రావించి తగవుమై సం, భావింపవకాక నాఁడు
పాండవు లలుకం, బోవిడువరె మిగులుదురే,
నీవచనంబులకుఁ బిలిచి నిలుపుము వారిన్
భార. ఉద్యో. ౨. ౨౦౬.

క. కావున శ్రీనగమునకేఁ, బోవఁగ నూహించి
మిమ్ము బోధించుటకై, రావించితి నా
వాక్యము, భావింపఁగవలయు నిపుడు పర
మార్థమునన్ విక్ర. ౧. ౨౦౨

క. . . చూతముగా, రావింపు మటన్న నాఁటి
రాత్రి చనంగాన్ ఆము. ౪ ౫౫.

**రావిపూరాజనాలు.** వి. బ. ధాన్యవిశేషము.

సీ. .. ఏలిక రాజవాలిక్వరప్రియములు రావి
పూరాజనాల్ రత్నపరులు,
హంస. ౪ ౧౨౭.

వ. .. వంగామబుడమలు ప్రయాగలు పసపు
గన్నేర్లు సత్తి బలుగుత్తులు రావిపూరాజ
నాలు పొన్న శ్రీరాజనాలు నివ్వరులు
ప్రబంధ ౧౧౨

**రావిరేక** = రారేక², రావ్రేక. వి.
(√రావి.) ౧. పిల్లలకు ముందుపిగయందుం
చెడు రావియాకువంటి ఆభరణవిశేషము.

సీ. ...రారేక నడుటిపై రత్నాల క్రొందళ్కు
రావిరేక వెడంగు రహిఁ కెలంగ
ఇందు. ౨. ౧౪౧.

ఉ. ముద్దులు గంటలు న్నొరయ ముంచటి
కూఁకటి రావిరేకతో, నవ్వనజాక్షుఁ
డాడు .. పారి. పూ. ౫. ౧౯౧.

౨. కర్ణభూషావిశేషము.

సీ. చెవులపువ్వు బాగడ బవిరె రారేక కంపెన
రావిరేక ముర్వ్వరఁ గర్ణభూషావిశేషము
ల్పాలుప్ప ఆం భా. ౨. ౧౪౫

**రావు.** వి. (సం. రాజన్) రాజు (ఇది కొన్ని
విశేష్యముల కడపటఁ బ్రయుక్తమయి శ్రేష్ఠార్థక
మగును )

సీ. సింగపుఁగొదమ తేజీరావు రవత్రొక్కఁ
బొగరెక్కి త్రిశిఖుండు దగిలి పెడలె, .
రామా. ౧. ౬౩.

**రావుతు(ఁడు)**=రావుత్తు. వి రౌతు, సాది.

లయగ్రాహి. రావుతుల తుండములు మావ
తుల నుగ్గుఁదర గావలికవంబులు గిజావమవ
రాళి,భావభయదస్థలులు ...
భార. స్త్రీ. ౨. ౫

ఉ. గిబ్బపటాణి రావుతుఁడు గెల్పొసఁగుం
గృతినేత కెప్పుడున్ ...
చం. రా. ౧. ౨.

ద్వి. హితులు భృత్యులు పురోహితులును రాజ,
సుతులు బందరులు రావుతులు లెంకలును...
పండితా. వాద. ౧౩౨. పా.

గీ. రవుతు రౌతు రావు తనంగ రాహుతుఁడగు
ఆం. భా. ౨. ౨౦౩.

**రావుత్తు(ఁడు)**=రావుతు, రాహుత్తు. వి. (క.
రావుత. త ఇరావుత్త. మ. రావుత్తు, మహా.
రాహూత.) రౌతు, అశ్వసాది.

గీ. లొలుకాడుకలఁక పులుఁగు మావు
రావుత్తు నిలిచె బ్రాహ్మణుని బ్రోల .
పాండు. ౪. ౫౧.

ఉ. నీనికవోముతా లైలంక నెక్కిన రావుకు
రాజా భీమ. ౧. ౭.

రావెడలు. అ. క్రి. (రా+వెడలు) పైకివచ్చు, పైకెడలు.

క. జలరాశిఁ దిమి తిమింగల,ములు వాఁడగు మీల సత్వములు వినరేదే, కులశైలనుతుఁడె జల చర,ములతో రావెడల సమియోఁ బుమకల తోడన్ దశా. ౧. ౧౪౩.

రాఁ[వేక=రావి రేక. వి. పిల్లలకు ముందునిగ యందుఁ బెట్టెడి రావియాకువంటి భూషణ విశేషము.

సీ. మెలక కూఁకటిఁగ్రాలు ముత్యాలరాఁ[వేక ధవళిలంపు బొట్టుతో బాదరింపఁ, బాలబుగ్గల కాంతిపల్లవంబులతోడఁ జిన్ని లేనగవులు చెలిమిసేయ కాశి 3 ౭౮౦.

రాశి సం. వి. ఇ పుం. ౧. ప్రోఁగు, సమూహము, గుంపు, మొత్తము ౭ (గణిత) లెక్కకై చేసిన యంకెలు, వ్యక్తావ్యక గణ భేదము. 3 గాశిచక్రము యొక్క ద్వాదశాంశము, మేషాది ౪ పరిమాణవిశేషము, అధికము. (కే. ని)

రాశిచక్రము. సం. వి. అ న. మేషాదిరాసుల చక్రము.

రాశిభోగము. సం వి. అ పుం. సూర్యాది గ్రహముల గమనము

రాష్ట్రము. సం వి. న ౧ దేశము, రాజ్యము ౭. మండలము, దేశ భాగము (సంద గ్రామముల పెనున్న ) 3 ఒక దేశపుజనము, ఏకదేశస్థులగుప్రజలు ౪ ఉపద్రవము. ౫ ప్రాణి, జీవి. (వై ని)

రాష్ట్రిక. సం. వి. అ స్త్రీ. వాఁకుడు. కీ. (శ. ర.)

రాష్ట్రియుఁడు. సం. విశ. (అ. ఆ. అ.) రాజ్యమునకు సంబంధించిన వాఁడు.

వి. అ. పుం. (నాట్య). రాజస్యాలకుఁడు. (రాణియొక్క సోదరుఁడు)

రాష్ట్రీయుఁడు. సం. వి అ. పుం. = రాష్ట్రియుఁడు

రాసకము. సం వి అ న. దృశ్యకావ్యభేదము, ఒకానొక ఉపరూపకము

రాసభము. సం. వి అ పుం. గాడిద, గార్ధభము

రాసభనందిని. సం. వి. ఈ స్త్రీ. మల్లిక, మల్లి. కీ.

రాసమండలము. సం వి అ న. రాసక్రీడ, గోపికలును శ్రీకృష్ణుఁడును మండలాకారముగఁ జేసిన నృత్యము, అట్టిప్రదేశము, మండపము

రాసము. సం వి అ పుం ౧ అఱపు, కోలాహలధ్వని ౭. (సామాన్య) ధ్వని 3 సల్లాపము, మాట. ౪ గోపికలును శ్రీకృష్ణుఁడును గలసి యాడిన యాట, రాసక్రీడ. ౫. పరిహాసము ౬. రసము. (శ. ర)

రాసయాత్ర. సం వి. అ స్త్రీ కార్తిక పూర్ణిమనాఁడు జరుగు భగవదుత్సవము. (వాచ)

రాసాని. వి. (రాచ+సాని) రాజభార్య.

ఉ. పైనపుదట్టి గట్టుకొని బద్దులపుట్టిక వెంట రాఁగ రాసాని పసాని నవ్వువెల జవ్వనిరాఁగని యొక్కసాని యోసాని మిటారి నీకు దొరసానికి నీనడ చెల్లదంచు భూజానిపటానిగాయనక జిక్కి వసం దిగి కొమ్మకొమ్మ పెజా. రా. వి. ౭. ౫౮.

రాస్తా. వి. (హిం. రాస్తా.) రాజమార్గము, బాట.
సీ కలువలదొర చల్లగాలి వజీరులు పూని
రాస్తాను చపాసు గొలువ . గీ. మదను
పాదుసహా దండు గదలెనపుడు.
అని 3 ౧౯.

రాసి. వి. (సం. రాశి) ౧ ప్రోఁగు, పుంజము.
శా. త, శ్నాశేచ్ఛన్ విలసానుశృంగములఁ
బూర్ణక్రోధుఁడై శాస్త్రముల్, రానుల్ గా
నిడి చిచ్చువెట్టఁబని చేశా రౌద్రంబులో
భృత్యులన్ భాగ ౧౦ పూ ౧౬౭౨.
(ఇట శ. స. ప్రాసము)
గీ కప్పయన రాసి యనఁగను గువ్వయనఁగ,
రాశియగు ఆం భా ౨ ౧౦౧
౨ మొత్తము
ద్వి రాసి సీకెవరు త్తరంబులు వల్క, నా
సహోజాతుండు నలుకు నే వెంత
ద్వి. హరిశ్చ ఉ. ౨౪౨౩ పం
3. మేషాదిరాశి. (శ. ర)
రాసికెక్కు = ప్రసిద్ధికెక్కు
ద్వి. ధరసెవ్వరేఁ బరతత్వ నిర్ణయముఁ, జేసి యీ
కల్కుఁబుఁ జేకొనుండనుచు, రాసికిసెక్కు
మర్యాదగావించి.
ద్వి. పరమ. ౫. 3౫౩. పా

రాసింగము. వి. (రాచె + సింగము) రాజ
సింహము, రాజశ్రేష్ఠుఁడు
దండకము. దుర్గ భారితమాసాథ మత్తే
భయూథంబులం జంచిచెండాడు రాసింగ
మున్ సింగభూపాలు భూపాల గోపాల
గోపాలికా కృష్ణగోపాలు
భోగినీదండకము.

రాసిరి. వి. (రాచె + సిరి). రాజలక్ష్మి.

క. సిరివంటి బడేబీబీ, విరిబోఁడికి వెన్నుఁడనఁగ
వెలయుచు మిగులన్, గరగరికలఁదనరెడు రా
సిరులందున మినుభాను చెలువములగమి ..
యయా ౨. ౧.
చ. గురుతరమైనలేమి సమకూరిచి యెవ్వరి
కందరాని రా, సిరిగలదండనాథు గృహసీమ
కుఁ బోవఁగఁబంచి యచ్చటన్ .
చెన్న. ౫. 3౮౪.

రాసీరసము. సం వి అ. పుం ౧ రాసక్రీడ.
౨ వినోదము, ఉత్సవము 3 జనసంఘము,
సమాజము. ౪. శృంగారరసము. ౫ ప్రసవా
నంతరమున నాఁవరాత్రి ౬ పరిహాసము,
వేళాకోళము చేయుట ౭ * రసవిద్ధి, రసాయన
శాస్త్రమునందలి నిపుణత * (వాచ)

రాసీవాసము. సం. వి అ. పుం. = రాసీరసము.

రాసేశ్వరి. సం వి. ఈ. స్త్రీ రాధ.

రాస్న. సం వి ఆ స్త్రీ ౧. ఓషధివిశేషము,
సన్నరాష్ట్రము శ. ౨ ఏలాపర్ణి, కారుఏలకి. శ.
3. నాకులి, సర్పాక్షి. శ. ౪ ధేనువు, ఆవు.
(శే. వి.)

రాహిత్యము. సం వి అ. వ రహితభావము.

రాహు(వు). సం. వి. ఉ. పుం. ౧. సైంహి
కేయుఁడు, విప్రచిత్తి సింహికల పుత్రుఁడగు
నొక రాక్షసుఁడు, తలగాము.
భార. శల్య. ౨. ౨౮౦. అము ౪ ౧౦3.
౨ గ్రహణము, సూర్యచంద్రులకు అడ్డముగా
వచ్చు ఛాయ. 3. త్యాగము, విడుదల. ౪.
విడుచువాఁడు, త్యాగకర్త. ౫ * కమన్ను.
* (వాచ.)

రాహుచ్ఛత్రము. సం. వి. అ ర్ద్రకము,
అల్లము. శ

రాహుతు(ండు). = రావుత్తు. వి. రవుతు.

ద్వి. ఉక్కులైన రాహుతు లేపుమీఱి, తక్కక చంపిరి తురుచరాధిపుల.

రం. రా. యు. ౪౦౷. పొ. ౹౹. పం

ఉ. చుట్టములైన రాహుతులు నూరులు వేరెల మిన్ జవోజ్జ్వలా, రట్టజవాహరోహణ విరాజితులై తనుఁ జేరి కొల్వఁగా

విక్ర. ౪. ౫౩.

ద్వి రాహుతులైన యారాతుసాధిపుల, సాహ సంబున నేలఁ జమిరిరి కడిమి

రం. రా యు. ౪౦౩ పొ. ౹పం.

రాహుత్తు(ండు) = రావుత్తు, వి. రౌతు, సాది.

సీ రంభఁగూడెఁ దెలుంగురాయరాహుత్తుండు కస్తూరికేరాజుఁ బ్రస్తుతింతు

శ్రీనాథుని చాటువు.

రాహుదర్శనము. సం వి అ న. సూర్య చంద్రుల గ్రహణము.

రాహురత్నము. సం. వి అ న గోమేధికము

రాహుసంస్పర్శము. సం. వి అ పుం. సూర్య చంద్రుల గ్రహణము.

రాహూచ్ఛిష్టము. సం. వి. అ న. లశునము, ఉల్లి.

రాహూత్సృష్టము. సం వి. అ. న. లశునము, ఉల్లి.

## రి

రి. సం. వి. అ. పుం ౧. స్రవము, కారుట. ౨. క్షయము, క్షీణించుట.

రింఖ. సం. వి. అ స్త్రీ. ౧. ప్రాఁకుట, పాఁకుట. ౨. నృత్యము చేయుట. ౩. అశ్వగతిభేదము. ౪. గుఱ్ఱపు డెక్క. ౫. దురదగొండి, దూలగొండి. ?

రింఖణము. సం. వి. అ. న. ౧. ప్రాఁకుట, నడుచుట. ౨. స్ఖలనము, జాఱుట.

రింగణము. సం. వి. = రింఖణము.

రింగు. వి (క. రింఖ.) ౧ బాణమును సంధించునపుడగు ధ్వనికనుకరణము

(దీని యామ్రేడిత రూపము రింగురింగు.)

ఉ. బంగరు దుప్పటంబు వలెవాటుగ నొప్ప వా సన్ముఖాబ్జుఁడై, రింగున నారిఁగోల సవరించి తటాలునఁ ద్రుంచె నా ధనుశ్శృంగుఁడు

చను 3 ౩౩.

౨ పై కెగురుట యందగు ధ్వనికనుకరణము.

సీ నింగికై రింగున నిగుడు తేరులనొగల్ గాఁడి విమానముల్ గదలఁబాఱ

చంద్రా. ౬. ౯౦.

3 బాణములు విసరునపుడగు ధ్వనికనుకరణము

వ. గుంటిప్రోవుల దబ్బుదబ్బులు తుపాకీల ఫెళ ఫెళలు బాణముల చరచరలు లకోరీల రింగు రింగులు ప్రబంధ. ౩౭౭.

౪. పిట్టరెక్కల ధ్వనికనుకరణము

సీ. రెక్క గాడ్పులు మింట రింగుమనఁగ.

చాటువు.

రింగులు. వి. బ (క. రింగణ) వస్త్రపుఁ గుచ్చెళ్లు.

సీ. పులితోలు విడిపించి జిలుఁగు దుప్పటపు రింగుల వల్లెవాటు మేకొలుపవచ్చు

రామా. ౭. ౧౧౦.

ఉ. రింగుల వల్లెవాటు సవరించి మెయిన్ మృగనాభి నించి సారంగ. ౨. ౭౧౭.

సీ. కలువగొంగడు లేని బలువ గంగను జేని వలువ రింగులుపైని గలుగువాని

ప్రబంధ. ౭౦౨.

సీ. గోణముపైని రింగులు వారఁగట్టిన వలెపె
దస్పటి కటిస్థలి రహింప ..

చం. రా. ౨. ౭౧.

**రింఛోళి.** సం. వి. ఈ. స్త్రీ. సమూహము.

**రింజె.** వి. మల్లబంధ విశేషము, కాలు పట్టుకొను టకుఁ జొచ్చినచో కాలు తప్పించి సందిటఁ బెడఁ బొదివిపట్టెడి పట్టు.

గీ. కళవరానకుఁ జొచ్చి డొక్కరము పొత్తి,
చడికిమైఁ బిడఁగొని పట్టసమునఁ దొడరి,
తోరహ స్తంబునను బొత్తమారి జృంభ,
ణమ్మునను రింజపట్టి విన్నాణ మెసఁగ .

ఉ. హరి. ౩. ౭౯.

(చి. ని, క. ౯. వీరేశ పా.)

**రింబ = రిమ్మ.** వి. ఉన్మాదము.

సీ. రిమ్మ యనంగను రింబ యనఁగ, వెఱ్ఱి
యనంగను పిచ్చ యనంగ నున్మాద మనంగ
నున్మాదసంజ్ఞ ఆం. భా. ౧. ౧౩౭.

**రికము = టికము.** అప. భావార్థము నందు వచ్చు ప్రత్యయము.

చ. అరయఁగఁ దల్లి కక్కసెలియండ్రకుఁ దక్కు
ను గల్గినట్టి చుట్టరికము వారికిన్ ..

ప్రభా. ౩. ౭౪.

**రికిరించె.** స. క్రి. నిక్కఁబెట్టు.

సీ. పనిపటి తోఁకలు విసరి కారుచేఁ జెవుల్
రికిరించుకొని దిశల్ రవి చూచి ..

రసిక. ౧. ౧౧౩.

**రికేబు.** వి. (హిం. రిఖాబ్.) సేవకుఁడు

గీ. రేయి నురకాణి జగమావరింపఁ దలఁచి,
పొలుచు నిరులను బలురికేబులను బనిచి,
కొలల నెత్తిన మన్నుంపుఁ గుండలనఁగఁ,
జాలఁ గనుపట్టెఁ దారకాసముదయంబు.

విప్ర. ౩. ౨౪.

సీ. ఇటు వల్లెత్రాటి మిక్కుటపు రెక్కరికేబు
వెడగొప్పు తిప్పు వీక్షించినాఁడ .

ప్రబంధ. ౧౪౯.

**రిక్క.** వి. (సం. ఋక్షమ్.) నక్షత్రము.

క. ఒక్కొకటి వేయికోటులు, మిక్కిలి ఫుంగ
ఫులు గలుగు మొనలవి మఱ్ఱో, డొక్కటఁ
గొలువఁ బోలుచునా, రిక్కలఁ దాఁకిన
పాదంపు దరీముఖుఁ దధిపా.

భా. రా యు. ౩౫౪.

సీ. రిక్కలోయి వికావుకె చామతుణుమపైఁ
జెరివిన మల్లె క్రొవ్విరులుగాని

సైమ. ౬. ౧౭౧.

జ. రిక్కదారి, రిక్కదొర, రిక్కరాయఁడు,
రిక్కతేఁడు.

**రిక్కదారి.** వి. (రిక్క + దారి) ఆకాశము.

ఆ. ...మిన్ను, నడుగు రిక్కదారి యన నభంబై
తగు . . ఆం. భా. ౧. ౭౯.

**రిక్క(ల)దొర.** వి. (రిక్క+దొర) చంద్రుఁడు.

వ. దంష్ట్రాంకురగదనర్గళలాలాజాలంబు రాహువు
ముక్కాలు గ్రాసంబుగా మెక్కనం జిక్కిన
రిక్కదొర ప్రక్కం దొరఁగు సుధా
ధారలం గెరడంబాడ ...

రా. వి. ౩. ౭౫.

సీ. సెలయేఁగి బలుకెట్టు నిగనిగల్ గడునవ్వె
రిక్కలదొర రంగు గ్రుక్కఁజేసి ...

రామ. ౩౭౧.

**రిక్కరాయఁడు.** వి. (రిక్క + రాయఁడు) చంద్రుఁడు.

సీ. చెక్కు ద్రొక్కు జెదయంచు దిక్కరిగ్రామణి
యక్కఁజేరదయంచు రిక్కరాయఁడు
వసు ౧. ౭౦

ఆ. చెక్కు దివియలున్న జక్కవ చెలియున్న,
రిక్కరాయఁడున్న జొక్కలున్నఁ, జిన్నబోడి
చూడ్కి చేడియ వెడఁబాయు, నప్పు డంధ
కారమయ్యె జగము భర్గ ౨. ౧౪.

**రిక్కరించు.** స క్రి నిగుడించు, రిక్కించు

వ నిక్కినిక్కి వెక్కిరింపుచుఁ జెవులు రిక్క
రింపుచుఁ బండ్లిగిలింపుచు పిక్కటిల్లు
మర్కటంబులును ప్రబంధ. ౧౯౭.

**రిక్కఱేఁడు.** వి. (రిక్క + ఱేఁడు) నక్షత్రే
శుఁడు, చంద్రుఁడు

క కావున నా విన్నప మో, దేవర నీయెదను
నిలిపి తేఁకువ మీఱం, గా వంచేయుఁడు
గొబ్బున, నావుడు రా రిక్కఱేఁడు నగుచుం
బలికెన్ అచ్చ రా కిష్కిం ౫౩.

గీ. చొక్కు మిక్కిలి రక్కసి రిక్కఱేండ్లు,
చక్కనయ్యకుఁ జిక్కి దశా ౨ ౩౦౪.

**రిక్కించు.** స. క్రి నిక్కఁజేయు.

సీ. రిక్కించి వీనుల దిక్కు లదరఁజేయు
ఘుర్ఘుర ధ్వని ప్రతి ఘోషచురుము .
ప్రబంధ. ౨౧౭

మ తన చూపంబుధిమీఁదఁ జూచి శ్రవణ
ద్వంబు రిక్కించి వం,చిన చంచద్భుజమూల్
సముత్కటకటీసీమంబులం బూన్చితోఁ,క
సఖోవీథికిఁ జెంచి యంఘ్రి విరియంగాఁ
బెట్టి బిట్టూది గ్రక్కున నక్కొండ
యడంగఁ ద్రొక్కి పయికిం గుప్పించి
లంఘించుచున్. రామా. ౬. ౯౩.

గీ. మించు రిక్కించె నవఁగ నిక్కించె నమట.
ఆం. భా. ౩. ౧౩౭.

**రిక్కు.** వి. త్రిప్పుట యందగు ధ్వన్యనుకరణము.

సీ. రిక్కురిక్కునఁ దోఁకఁద్రిప్పి జాడించుచు
ఖురపుటంబులఁ దలగోఁకు కొనుచు .
హరిశ్చ. ౨. ౪౯.

**రిక్త.** సం వి. ఆ. స్త్రీ. చాంద్రమానపక్షమున
చతుర్థి, నవమి, చతుర్దశి తిథులకుఁ పేరు.

**రిక్తత** సం వి. ఆ. స్త్రీ ౧ దారిద్ర్యము. ౨.
శూన్యత

చ. ఘనమగు నాఁడు రావితిలకం బతిరిక్తత నున్న
నొర్తులోఁ, గనికర మూని .
అము. ౫. ౧౩౫.

**రిక్తపాణి.** సం. విశే. (ఇ) రిక్తహస్తుఁడు.

**రిక్తము.** సం. విశే (అ. ఆ అ) ౧ శూన్య
మైనది, ఏమియులేనిది ౨. నిష్ప్రయోజనమైనది,
పనికిమాలినది.

వి. అ న ౧ శూన్యప్రదేశము, ఆకాశము.
౨ అరణ్యము, అడవి.

**రిక్తహస్తుఁడు.** సం విశే. (అ ఆ. అ.) ౧.
శూన్యహస్తుఁడైనవాఁడు (పువ్వులు పం. బహు
మానపు బదార్థములేనిచేతులు గలవాఁడు.)
౨. నిర్ధనుఁడు, దానములుచేసి దరిద్రుఁడైన
వాఁడు.

**రిక్థగ్రాహుఁడు.** సం విశే. (అ. ఆ. అ.) దాయము
తీసికొనెడివాఁడు

వి అ. పుం. దాయాదుఁడు, జ్ఞాతి, వారసు.

**రిక్థము.** సం. వి. అ. న. ౧. దాయము, విభా
గార్హమైన పిత్రాదులధనము. ౨. ధనము,
ఆస్తి

**రిక్థహారి.** సం. వి. న్. పుం ౧ దాయాదుఁడు,
జ్ఞాతి, వారసు ౨. మేనమామ, మాతులుఁడు.
౩. వటబీజము, మఱ్ఱి విత్తు.

రిక్థి. సం. విణ. (ఇ. ఈ. ఇ.) ౧. దాయభాగము పుచ్చుకొనెడివాఁడు, వారసైనవాఁడు.

వి. ఇ. పుం. దాయాదుఁడు, జ్ఞాతి.

రిక్షు. సం. వి. ఆ. స్త్రీ. లిక్ష, ఈరు, పేనుగ్రుడ్డు.

రిటి. సం. వి. ఇ. పుం. ౧. మంటలు చుఁయిచుఁయి మనుట. ౨. నల్లయుప్పు. ౩. సంగీతసాధన విశేషము. ౪. భృంగరిటి, శివపరిచారకులలో నొకని పేరు. (విల్యమ్సు)

రిట్టు. వి. ఒకానొక చెట్టు.

పి. శా. శ. ౧౦౨౪. Ep Ind 5

రితము. సం వి అ. న. ౧. గతి, గమనము.

విణ. (అ. ఆ. అ.) గతము, గతించినది.

రిక్త. వి. (సం. రిక్తమ్.) ౧. కల్ల, అబద్ధోక్తి.

క. నీయెదుర నాడినంతయుఁ, జేయుట కతఁడో పు రిక్త చెప్పెడువాఁడే

భార. ఉద్యో. ౨. ౧౯౩

క. రిక్తలు రజ్జెడువాఁడే, మత్తగజాయుత బలుండు మారుతిచూని ను ద్వృత్తుఁడగు దున్నసేనుని, నెత్తురురము వ్రచ్చి త్రావు నీవుం జూడన్

భార. ఉద్యో. ౪. ౨౦౪.

౨. వ్యర్థత.

ఉ. వంచన లేక యానసము వాంచిన యప్పుడు ఫాల మోర గ్రావించుదుఁ జెక్కుటద్దములు వ్రీడభరంబునఁ గీలెకింగి చుంబించి మనంబు తాలిమి గహిరత రిక్తపు నెత్తఁ బూనినన్, మించి ముఖాబ్జచుంబనము మేకొని నవ్వు విభుండు సేర్చునన్. వైష. ౪ ౧౯౩.

విణ. ౧. వ్యర్థము, నిరర్థకము.

చ. ... సెమ్మనంబునన్, విపులశయంబు గై కొనని పేరతపస్వి తపంబు నింద్రియా ద్యుపరతి సౌఖ్యముసన విరాగి వివేకము రిక్త యారయున్ .. సీతారా. ౩. ౧౩౪.

౨. పట్టిది, శూన్యము.

గీ. విత్తు సహకారిగాకున్న రిక్తసేల, వంధ్య మగుఁగాక తా ఫలవంతమగునె

భార. అను. ౧. ౧౩౭.

గీ. అత్తయును మామయునులేని రిక్తయింట, మనువు మనిసెడు నీయింతి మగనితోడ .

హర. ౩. ౨౯

చ. . దృక్కరళకాంతులు మత్తరమిచ్చు నంతరాం,తరముల నవ్వులు న్గలువ తండము మొల్లలు నంచు మిన్ను గ్రుచ్చి రహిని రిక్త మాలాసఁగి పిగ్గువహింతురు పువ్వులావికల్

ఆము. ౨. ౭౦.

౩. కల్ల.

వ. ఇట్లు నిర్భర్త్సింపఁబడి వైదర్భిం జూచి రిక్తయులుకఁ దెచ్చుకొని యుపదేశగురువునగు నాకు రతిరహస్య వార్త చెప్పవైతి, ధూర్తవై నీవు చెప్పకుందు గాకేమి ? .. ఇది మాడుమని. వైష. ౯. ౪౦.

౪. ఇతరమైనది.

గీ. . ఆలు,సెలల కొకవాఁడు భోజవాదు లకుఁ దెలియ,వాఁడు పీఁదజయ్యఁడు రిక్తనాఁడు దెలుప, బలిమిఁ దెలియునాఁడీ పని బలము దూలు.

భా. రా. యు. ౯౭.

క్రి. విణ. ౧. ఊరక, వ్యర్థముగా.

క. రిక్తదవు గాకుండఁగ, నిత్తరి నాచార్య తోడి యీనుడిగి పెనం, బోత్రము శకట వ్యూహము, చిత్తంబున నొందు దలపు సేర్పకుమింకన్. భార. ద్రో. ౩. ౭౯.

క. మాయుఁ బ్రకటించుచును పెద, మాయపు మంత్రములు రిక్త మంత్రించుచు భూ,నాయక

నందన గనుటగాను, మాయామదిరాక్షి నీ
మదాలసయగునే. మార్క. ౩. ౭౧.

సీ. ,గరసో క్తులకు సదు క్తరి మాయకుండుట
చూపు లేకయ రిక్త చూచుటయును
దశా. ౪. ౩౦.

వ. ప్రతిఫలిత తారకంబులు ద్రాక్షాఫలం
బులని రిక్త చప్పరించువారును .
వసు. ౪. ౨౩.

౩. నిష్కారణముగా, ఊరక.

క. కావున మనుజుఁడు సేయక, దేవుం డీయంగ
లేడు తెగి యేమియు నా,నా విధభాగ్యము
లుండిన, వానిరి వందలకయి రిక్తవంటక
మగునే కుచేల. ౧. ౭౧

క. తామును పెట్టనిది రిక్త దసకేలబ్బున్
విక్ర. ౨. ౧౭౨.

వ. రిక్త జంకించువారును
పారి. ౪. ౬౬.

జ. రిక్తకత్తె, రిక్తగాఁడు, రిక్తకురిక్త, రిక్త
పడు, రిక్తవాఁడు, రిక్తపుచ్చు, రిక్తవోపు.

రిక్తకత్తె. విణ. (√రిక్త) సంబంధములేని స్త్రీ,
తేరకత్తె (శ. ర)

రిక్త(కా)గాఁడు. విణ. (రిక్త + కాఁడు) తేర
కాఁడు, సంబంధములేనివాఁడు.

క. ఈన్నంత నీవు గలిగితి, బన్నంబులు దలఁక
నింకఁ బగఱ నొడుతు మీ, కిన్నరుఁడు రిక్త
గాఁడటు, గొన్న పురము మున్న మగుడఁ
గొనఁ గావలయున్ . నిర్వ. ౩ ౯౭.

రిక్తకురిక్త. క్రి. వి. (√రిక్త) ౧ కేవలముగా,
నిష్కారణముగా.

సీ. కడు నికారంబుగా కొడకల్ల విఱుచుచు
మలఁగి రిక్తకురిక్త పెలఁగి నవ్వ ..
భార. విరా. ౨. ౨౫౦.

ఉ. నిందకు నోర్చి దోషము గణింపక రిక్తక
రిక్త కాగదా,నందునిఁ జంపుమన్న విది
న్యాయము గాదని యెంత చెప్పినన్, మంద
మతిన్ వివందఱఁగు మానిన నన్ను నెంజంగి
కాది విక్ర. ౩. ౧౨౯.

౨. మిక్కిలి వ్యర్థముగా.

సీ. నముఁ జూచె నముఁజూచె నముచు, రిక్తకు
రిక్త జడలు పట్టక పోరఁడొడఁగువారు ’
కువల. ౨ ౪౯.

గీ. సింహాబలుండు గంధర్వులచేత నొక్క, సతికి
గానిట్లు ఘోరంపుఁ జావు సచ్చె, నకట
రిక్తకురిక్తమకాన్యవనీశు,లావు గోల్పోయి
మూతపులంబు వొలిసె .
భార. విరా. ౩. ౩౦.

౩. తేకగా, అనాయాసముగా.

ఉ. చేతులు మోడ్చి నిల్చి తనచిత్తము నైక్యము
చేసి మద్గురుం, డాతతసత్యశాలి యగుటా
రయ నిక్కము యయ్యోకేని స్వేరీతి నితండు
నన్మొరఁగి రిక్తకురిక్త గ్రహించె విద్య యీ,
రీతిన మోసపోయెడు ధరిత్రి నితండని పల్కె
నల్కతో ... భోజరా. ౨. ౧౭౨.

రిక్తపడు. అ. క్రి (రిక్త + పడు) శూన్యమగు.

ఆ. చెదరి పాఱు వళులు పొదమీఁదిపూవిల్లు,
రిక్తపడిన చివురుబత్తళికయుఁ, దెలుపు
కేఁగుబోక వలకేఁనియూరటు,నపవనానంత
రముల నొకటపేట . కళా. ౧. ౧౪౨.

రిక్తవాఁడు. విణ. (రిక్త + వాఁడు) రిక్తుఁడు,
ఏమియు లేనివాఁడు.

క దొరకినయను విడచుట క,బ్బురపడకుము
నీకుఁ దోడుపోయిన ధరణీ,సురుఁడొకఁడు
లబ్ధమనుకే,స్వరకన్యక విడిచి రిక్తవాఁడై
చనఁడే. కేం. పంచ. ౪. ౯౦.

రి త్తవు(వు)చ్చు. స. క్రి. వ్యర్థపుచ్చు.

మ. చతురంగంబులునొక్క పెట్ట వివిధాస్త్ర జ్వాలలం గప్పఁగా, వడివేగంబున బ్రింగెఁ గ్రోలె ఘనమాయన్ రూపడంగించెనా, నితఁ డన్నింటిని రి త్తవుచ్చుచు నదం బేపార నిమ్మై రణ,క్షితియం దీవఁగుపెంటఁజేసె సేనయం జట్టాడఁగా శక్యమే

భార. ద్రో. 3. ౧౬౪

చ. మానవా,ధముసరిఁజేసి పోరుదుసె దర్పముఁ బెంపును రి త్తవుత్తునే .

భా. రా. యు ౨౦౭౪.

రి త్త(పో)వోవు. అ. క్రి. (రి త్త + పోవు) వ్యర్థ మగు.

క. .. పృథివీపతి నీ,తల నతనకార్యఖడ్గం, బుల పోఁపెక్కించె రి త్తవోవునె నీవున్

భాగ విరా ౫. ౨౩.

ఉ. . వీఁ,డున్ని జనాశకాలను కడు న్నిక టంబగుడు న్నలంగఁజే,సె న్నిను నింత సత్పురుష చి త్తము నొచ్చిన రి త్తవోవునే.

ప్రభా. ౧. ౯౫.

రిధమము. సం. వి అ. పుం. ౧. వసంతము, ఆమని. ౨. కామము, వలపు. (విల్యమ్సు)

రిపుఘాతిని. సం వి ఈ. స్త్రీ. ఒకానొకలత. (వాచ.)

రిపువు. సం. వి ఉ పుం. ౧. శత్రువు, ఎదిరి వాఁడు. ౨. (జ్యోతి) లగ్నము మొదలు ఆఱవ రాశి, షష్ఠభావము. 3. ఒకానొక గంధ ద్రవ్యము, చోరము శ్రీ.

రిప్పు. వి. వెలితి, న్యూనము.

సీ. తమకొప్పులకు లాంగి తలఁగిపోరయి వనంగఁ గప్పు రిప్పుగ వాఁచుకడకుఁ బోవ.

యయా. 3. ౬౩.

(శ. ర. పా. కప్పురిప్పుగ. మ.ద్రి. పా.)

రిష్ఫము. సం. వి. అ. పుం. లగ్నముఖకు ద్వాదశ రాశి, వ్యయస్థానము.

రి(ప్రము. సం. వి. అ. న. ౧. పాపము. ౨. దుఃఖము. (శ. ని.)

రిమ్మ = రింబ. వి ద్రిక్క, ఉన్మాదము.

గీ దండహ త్తిమశోజుండు దండవెట్టి, నమ్మహీ దేవు నెమ్మది రిమ్మవొడమ.

శుక. ౨. ౪౫3.

సీ. తనరు వేళాకోళమనఁగఁ ద్రిక్కయనంగ రిమ్మయనంగను రింబయనఁగ, వెఱ్ఱియనంగను బిచ్చియనంగ నున్మాదమనంగ మన్మాద సంజ్ఞ ఆం భా. ౧. ౧3౬.

జ. రిమ్మగొను, రిమ్మపట్టు.

రిమ్మ(లు)గొను. అ క్రి. (√రిమ్మ) ఉన్మాదమునొందు.

వ. నెమ్మనంబునం గ్రమ్మిన యమ్మలికంబు పెంపున రిమ్మగొని సొమ్మవిలి ...

చిత్రభా. ౭. ౯౪.

వ. విమ్మల్లతా విలోకంబున రిమ్మలంగొని సొమ్మలువోవుచున్న తేఁగలు.

భాగ. ౧౦. పూ. ౯౦౪.

రిమ్మవట్టు. అ క్రి. (రిమ్మ + పట్టు) దిమ్మెక్కు.

ఆ. లొమ్ము ద్రొక్కి మోము రిమ్మవట్టఁగ మోఁది.

భాగ. ౫ ౨ ౧౫౪.

మ. . పార్థుఁడు స్తంబు బి,ట్టుగలం దాఁకిన రిమ్మ వట్టి వికలుండై వ్రాలె నమ్మేటియున్.

జై. భా ౫ ౪౬.

రిరంస. సం వి. ఆ. స్త్రీ ౧ రమింపనిచ్ఛ, ఆడ వలయునను నిచ్ఛ. ౨. రతి యందలి యిచ్ఛ, విషయసుఖములు పొంద నిచ్ఛ.

రిరంసువు. సం. విశే. (ఉ) రమింప నిచ్ఛగల వాఁడు. (శ. ర.)

రిరక్ష. సం. వి. అ. స్త్రీ. రక్షింప నిచ్ఛ.

రిరక్షువు. సం. విశే. (ఉ) రక్షింప నిచ్ఛ గల వాఁడు. (శ. ర.)

రిరి. సం. వి. ఈ. స్త్రీ. కాంస్యము, కంచు. (విల్యమ్సు.)

రివట. వి. ఉపశాఖ, రెమ్మ.

క. ఒక గృధ్ర మెండిపోయిన, యొకచర్మము గఱచికొనుచు నడుపథమునరా, నొకభంగిఁ బ్రిదిలిపడి యది, యొకయెండిన రివట మీఁద నుండఁగ నెలమిన్. భోజరా. ౪ ౫౩.

సీ. రెమ్మ రెబ్బ రివట రివ్వ రెలగ చివ్వ బలుగుగోల బరగు రెలయన నుపశాఖ చెలఁగును .. ఆం. భా. ౫. ౩౭.

రివరివ. వి. కుచ్చెళ్ళధ్వని కనుకరణము

సీ. గనుగను మైకదంబములు గుభాళింప రివరివ కుచ్చెల రవణ మెసఁగ ప్రబంధ ౧౦౭.

జ: రివరివమను

రివరివమను అ క్రి. (రివరివ + అను) కదలుట యందగు ధ్వని కనుకరణము

క. నవనవమను సొమ్ములు, రివరివమను మధ్యము లు ద్విరేఫశ్రేణుల్, జవజవమను వేణికి మది, రవరవమను మరుఁడు వారి రంగులు గనినన్ చమ. ౩ ౧౦౭.

రివ్వ[1]. వి పక్షి విశేషము

సీ. మానిపుల్కిటి గాఁడు కీసువ యెల్లంకి డాబ కీకువు పెన్న డాయ రివ్వ (పార్వ ౬. ౩౭.)

రివ్వ[2]. వి. రెమ్మ, ఉపశాఖ.

క. చెంతనఁబుచ్ఛక రివ్వలఁ, గఱచిన రసమూ వనిగతి . కు. సం. ౭. ౧౪౯.

సీ. రెమ్మ రెబ్బ రివట రివ్వ రెలగ చివ్వ ... బలుగుగోల బరగు రెలయన నుపశాఖ చెలఁగును . ఆం. భా. ౫. ౩౭.

రిశ్యము. సం. వి. అ. పుం. ఒకజాతిలేడి, మృగవిశేషము.

రిష్టము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. యాప్యము అధమము. (శే. వి.)

౨. దురదృష్టము గలది, అదృష్టములేనిది.

వి. అ. న. ౧. హాని, కీడు. ౨. దురదృష్టము, దౌర్భాగ్యము. 3. నాశము, నష్టము. ౪. పాపము. ౫ మంగళము, మంచి యదృష్టము.

పుం ౧. ఖడ్గము, కత్తి. ౨ కుంకుడు చెట్టు.

రిష్టి సం వి. ఇ స్త్రీ. అశుభము, అమంగళము. పుం. ౧. ఖడ్గము, కత్తి ౨. రంధ్రము, బెజ్జము.

## రీ

రీజ్య. సం వి ఆ స్త్రీ. ౧. నింద, దూషణము. ౨. లజ్జ, సిగ్గు 3 అణఁకువ (విల్యమ్సు)

రీఠ. సం. వి. ఆ. స్త్రీ. రీఠాకరంజము. శ.

రీఠాకరంజము. సం. వి. అ. పుం. రీఠ, ఒకానొక వృక్షము.

రీఢ. సం. వి ఆ. స్త్రీ. అమర్యాద, అగౌరవము.

రీఢకము. సం. వి అ. న. వెన్నెముక. (విల్యమ్సు.)

రీణము. సం. విశే. (అ. ఆ. అ) స్రవించునది, కాఱునది.

రీతి. సం. వి. ఇ. స్త్రీ. ౧. కాఱుట, ప్రవహించుట. ౨. గమనము, చలనము. 3 పది.

ప్రవృత్తి. ౪. తెర, హద్దు. ౫. పద్ధతి. ౬. వైఖరి, స్వభావము. ౭. వైదర్భ్యాదిశైలి, (వైదర్భి, గౌడి, పాంచాలి, లాటిక, యని నాలుగు విధములు) ౮. ఇత్తడి, పిత్తలము. ౯. ఇనుపదిట్టెము, లోహకిట్టము. ౧౦. పంక్తి, వరుస. (శే. ని.)

**రీతిక.** సం. వి. ఆ. స్త్రీ. = రీతికము.

**రీతికము.** సం. వి. అ. న. ౧. లోహపుష్పము, లోహకిట్టము ౨. పుష్పాంజనము.

**రీతిగౌళ.** సం వి. ఆ. స్త్రీ. ఒకానొక రాగము.

గీ రీతిగౌళియు నీలాంబరియును ఘనము, దన రహం వీరనాటయు నని నపుంసకములు ముప్పదిరెండు రాగములు
ప్రబంధ. ౬౭.

**రీతిపుష్పము.** సం. వి. అ. న. = రీతికము

# రు

**రు.** అప. ౧. వర్తమానాద్యర్థక ప్రథమ మధ్యమ పురుషముల బహువచన ప్రత్యయము.

('ఇ' కారము మీఁద నిది 'రి'గా మారును.)

ఉదా: వచ్చుచున్నారు, రాఁగలరు, వత్తురు, రారు, వచ్చిరి.

౨. ప్రార్థనార్థక మధ్యమపురుష బహువచన 'డు' వర్ణకమునకు ఎదాదులనుప్రయుక్తమగునప్పుడు ఆదేశముగా వచ్చు ప్రత్యయము.

చ. చిలుకలు మావికిం బగలు సేయకుకే లత కూనలార ... కళా. ౧. ౧౩౦.

ఉ. మల్లియలార మీ పొదల మాటున లేఁడుగ దమ్మ చెప్పరే ..
భాగ. ౧౦. పూ. ౧౦౧౧.

౩. అల్లుఁడు మున్నగు శబ్దముల ప్రథమా బహువచన ప్రత్యయము.

ఉదా: అల్లురు, బాలురు.

౪. 'కూఁతు' శబ్ద ప్రథమైకవచన ప్రత్యయము.

ఉదా. కూఁతురు.

**రుంజ.** వి. (త. ఉరుంజల్) చర్మవాద్య విశేషము, డంగురము.

సీ. డంగురమన రుంజ నా వీరాణ మనఁగను వీరణంబు . అం. భా. ౧. ౧౨౭.

జ. రుంజకాఁడు

**రుంజకాఁడు.** వి. (రుంజ + కాఁడు) రుంజ వాయించుచు కంసాలులను యాచించు నొక జాతివాఁడు.

సీ. వ్యాపారివిత్తంబు వారకాంతలపాలు కల్లు విత్తము రుంజకానిపాలు
రామలిం. ౨౩.

విణ. రుంజ వాద్యము వాయించువాఁడు.

**రుండము.** సం. వి. అ. పుం. న. కబంధము, మొండెము.

**రుండిక.** సం. వి ఆ. స్త్రీ. ౧. రణరంగము, యుద్ధరంగము. ౨. దూతి, కార్యకర్త్రి. ౩. ఇంటిగడప ౪. మనుష్యాతీతశక్తి.
(విల్యమ్సు.)

**రుంద్రము.** సం. విణ. (అ. ఆ. అ.) విరివియైనది.
(శ. ర.)

**రుకుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ఔదార్యము గలవాఁడు, దాత. (విల్యమ్సు.)

**రుక్కాముపుంజు.** వి. ఒక జాతి కోడిపుంజు.

వ. ... రుక్కాముపుంజులు కంచికాట్ల జొట్టులు గణచుక నాకెలు డుస్సిపాలు వరుస ..
ప్రబంధ. ౪౮౮.

రుక్కు. సం. వి. క్. స్త్రీ. ౧. బాధ, ఖేదన. ౨. రోగము, తెగులు. ౩. అడుగొట్టు. ౪. కుష్ఠము, కుష్ఠరోగము. (విల్యమ్సు)
చ్. స్త్రీ. ౧. సూర్యకిరణము. ౨. కాంతి. ౩. ఇచ్ఛ. (శ. ర)

రుక్ప్రతిక్రియ. సం. వి. ఆ. స్త్రీ. జబ్బుకుదురుట, మందు పుచ్చుకొనుట, రోగప్రతిక్రియ.

రుక్మకారకుఁడు. సం. వి. అ పుం. స్వర్ణకారుఁడు, కమసాలి

రుక్మము. సం. వి అ. న. ౧. బంగారము. ౨. ఇనుము ౩. నాగకేసరము. †. ౪. ఉమ్మెత్తచెట్టు.

రుక్మిణి. సం. వి ఈ స్త్రీ. విదర్భదేశాధిపతియైన భీష్మకమహారాజు కూఁతురు, శ్రీకృష్ణుని భార్య, ప్రద్యుమ్నుని తల్లి.

రుక్షము. సం. విణ (అ ఆ. అ) = రూక్షము

రుక్సద్మము. సం వి. న్ న పురీషము, మలము. (విల్యమ్సు)

రుగ్ణము. సం. విణ. (అ. ఆ. అ) ౧ విఘాతము చెందినది, భంగమైనది. ౨. వంగినది, వంకరయైనది. ౩. రోగముఁ జెందినది, రుజాయుతము.

రుగ్ణుఁడు. సం విణ. (అ. ఆ. అ) రోగముఁ జెందినవాఁడు, జబ్బుగా నున్నవాఁడు.

రుచ. సం. వి. ఆ. స్త్రీ = రుక్కు (చ్).

రుచకము. సం. విణ. (అ. ఆ అ.) ౧. మనోజ్ఞమైనది, ఇంపైనది. ౨ ఆఁకలి పుట్టించునది ౩. తీక్ష్ణమైనది, చుఱుకు మనునది.
వి. అ. పుం. ౧. మాదీఫలము. ౨. పావురము.
న. ౧. దంతము, పల్లు. ౨. కాసు, స్వర్ణముద్ర. ౩. అస్వాద్యమైన రసము. ౪. పుష్పమాల, పూలదండ. ౫. సౌవర్చలలవణము. ౬. గుఱ్ఱపు మెడ మీఁద నుండెడి ఆభరణ విశేషము. ౭. మాంగల్య ద్రవ్యము. ౮. సర్జికాక్షారము.

రుచి. సం వి. ఇ. ఈ. స్త్రీ ౧. వెలుఁగు, తళతళమను కాంతి ౨ సూర్యకిరణము. ౩. కాంతి, అందము. ౪. చవి, రోటికింపగుట ౫. బుభుక్షా, ఆఁకలి ౬. ఇచ్ఛ, అభిరుచి. ౭. అత్యాసక్తి, వ్యామోహము. ౮ ఒకజాతి గోరోచనము. ౯. సిరి, లక్ష్మి (కే. ని) ౧౦. రీతి, విధము.
(ఈ యర్థమున తెలుఁగునసే ప్రయోగము కన్పడుచున్నది)
శా. ఆ మండోద్భవబీజపుండరుచి నయ్యాటించుచున్ మక్షికా, స్తోమంబాతతపక్షగుచ్ఛమగుచున్ దోతేరఁగా శ్మశ్రులం,బై మిన్నొప్పత దంగసంగతి మధువ్యామోహముం జేయు దోడ్డో మర్త్యాళిఁ దద్విహారకలిత ద్రుస్కంధవీరుచ్ఛిఖల్.
పాండు. ౪. ౨౫౪.
౧౧. కమ్మన.
చ. అప్పుడు ద్రుపరాధి రాజునకు పాల్పుగ వండిన శాకమూలముల్, గడురుచి-నిష్ట భోజనముఖంబున దృప్తియొఁ గూర్చుచుండఁగన్. భార. అర ౧. ౪౪.
పుం. ౧ ప్రజాపతులలో నొకఁడు. ౨. అలింగన భేదము.

రుచి(యి)ంచు. సం. అ క్రి ౧ ఇష్టమగు.
గీ. అప్పార్థుకోర్కి, యంత సఫలతఁ బొందెడు నమ్యతుండు, నెట్లు దనకు రుచించెఁ దా నట్లుసేయు . .
భార. ద్రో. ౫. ౩౬౯.

క. కాంతిం బొంచుట నీకుం, గుంతీపుత్రులకు మేలగుట్ దానికతమే, నింతయు నాడెద నది నీ,కెంతయు రుచియింపకునికి యెఱిఁగి యెఱిఁగియున్. భార. ఉద్యో. ౩. ౩౮౦.

సీ. నీకఁటె బాలికుండు, కలఁడె యెవఁడు బట్టుఁ బోలియించె నా కృష్ణుఁ డొక్కటి తద్రాజ్యమెల్లఁ దాన,కొని రిత్తపట్టంబు నినుఁ బూన్ప వలని పెట్టెదు నన్నపిండంబు గుడిచెదకట. గీ. యిట్లుగాఁ బెద్దవాఁడ వై లేమి బ్రతుకు, పిగ్గతిన భోగమెట్లు రుచించె నీకు, హరికి బంటవుగాక నీవవని పతిచె, యిట్టి రాజధర్మ ధ్వంసి నేమ సైప హరి. ఉ. ౨. ౨౫.

౨. ప్రకాశించు.

వ. ఉదయార్కబింబ సుందర దేహుండగు తనకు వికీర్ణ కపిల జటావళులు ప్రత్యగ్ర మరీచులయి రుచియింప . హరి. ఉ. ౧. ౩౪.

౩. క్రి. భక్షించు.

క. ఇత్తెఱఁగున నా ప్రశ్నల, కుత్తర మిమ్మాక యూరకుండుదు వేనిన్, బ్రతుం బ్రేవులు పాదగు, నెతుటఁ జొత్తిల్ల దాఁచి నేఁడు రుచింతున్. దశకు. ౧౦. ౬౯.

రుచిగొను. మి. స. క్రి. (రుచి + కొను) ఆదరించు.

గీ. పరమముని యతివశతమ్మ్వరతి హేతు,వున మహాశాపహతిఁ జేసి తను విశ్రుతిగ,నున్న నేల యంతవచింప నొగి నరుదని, తక్కథల్ రుచిగొనుచు రాట్తనయులందు. రాఘ. ౨. ౩౫.

రుచిర. సం. వి. ఆ. స్త్రీ. ౧. ఒకవిధమైన గోరోచనము. ౨. ఛందోభేదము.

రుచిరము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. మనోహరమైనది, సుందరమైనది. ౨. మధురమైనది, తియ్యనిది.

వి. అ. న. ౧. కుంకుమపువ్వు. ౨. లవంగము. ౩. మూలకము, ముల్లంగి దుంప.

రుచిరాంజనము. సం. వి. అ. పుం. శోభాంజనము. చె.

రుచిష్యము. సం. విశే. (అ. ఆ. అ.) మనోహరమైనది, ఇంపైనది.

రుచ్యము. సం. విశే. (అ. ఆ. అ.) రుచిరము.

వి. అ. పుం. ౧. శాలి. ౨. కతకము, ఇండుగ చె.

న. సౌవర్చల లవణము.

రుచ్యుఁడు. సం. వి. అ. పుం. పతి, భర్త.

రుజ. సం. వి. ఆ. స్త్రీ. ౧. భంగము, ముక్క. ౨. జర, ముసలితనము. ౩. మృత్యువు, మరణము. ౪. రోగము, తెగులు. (శే. ని.)

రుజాకరము. సం. వి. అ. న. కర్మరంగము, తిరాలము. చె.

రుటము. విశే. (సం. రూఢమ్) రూఢము.

ఉ. అటు ముందట పటుశైత్యో,ద్భటమయి బిటమయి విగాఢదళిసంతతి వి,స్ఫుటమయి రుటమయి కదుసా,వటమయి బటువయిన దొక్క వటముం గనియెన్. ప్రబంధ. ౨౦౫.

సీ. పట్టివేరున కీవు పట్టివేరులు నేయ పట్టివేరుటము లింపైన చెలికి ... రా. వి. ౩. ౧౦౫.

౨. దృఢము, బలాఢ్యము.

ఉ. భానుకులీను దేవిఁ జెఱపట్ట దశాననుఁ డెంచ బ్రహ్మత, శ్రాణిణసమీరు పౌరపురయాత్ర

కనుర్చిన పైడి శోడు కొన్మ్మని రుటంభు
లేటి తలమిన్న పశాణి యనంగ . .
చం. రా. ౫. ౬౭.

ఉ. అంగమునం గురంగ మదమందముగాఁగ
నలంది మూళి సంఘంగివిరుల్విరుల్లన రుమాలు
ధరించి రుటంభుటంగిపై రంగు మెఱుంగు
బంగరు చెఱుంగుల కంఠెము వాల్గు
కొంగులుఁ(నింగులువారఁ గట్టి .
బహు. ౪. ౫.

౩. తీక్ష్ణము.

గీ. కఱకనంగను రుటమనఁ జాఱుకనంగఁ, దీండ్ర
మనఁ దీండ్రయనంగను దీక్ష్ణనామ,ధేయ
ములు ... ఆం. భా. ౧. ౮౪.

౫. ౧. రూఢి.

క. అచ్చేడియ తచ్చనలకు, నిచ్చ మహోత్సాహ
మంది యిచ్చెలువకు నే, మిచ్చిన బుఱుంబు
గాదని, బచ్చె రుటం బచ్చుపడఁగ భావించి
మదిన్. బహు ౫. ౧౭౪.

౬. దార్ఢ్యము.

గీ. ఒక్కమొత్తంబుగా నన్ని యుక్కుమీఱి,
నిగుడి తన మీఁదఁ గవియ నన్నిటికి నన్ని
రూపులు ధరించి వాటిపై రుట మడంచి,
పట్టి యొకత్రాట దేవకి పట్టి గట్టె ..
కుదంశా. ౪. ౭౦.

౩. ఒప్పిదము.

సీ. ముడుంగుఁ జామర క్రింద నడఁగు క్రొంబులు
పులో పకిసెల పట్టి మంచపు రుటంబు,
దగ్గఱ పేస్తకాండ్రకు విద్దజగపీట తకుకు
బంగరు తాపెఁ దగులు తిగులు .
బహు. ౫. ౧౭౯.

రుట్టు. సం. వి. ఉ. స్త్రీ. కోపము, కినుక.

రుణస్కరి. సం. వి. అ. స్త్రీ. పాడుగోవు, పొంచియావు, సులభముగాఁ బాలు పితికికొన నిచ్చెడియావు. (నిఘంటు.)

రుతము. సం. వి. అ. న. మృగపక్ష్యాదుల అఱపు, కూఁత, ధ్వని.

రుతి. సం. వి. ఇ. స్త్రీ. రుతము, ధ్వని.

రుత్త. వి. నాశము. వాని రూపు రుత్తాయెను పో. (శ. ర.)

విణ. రిత్త, వట్టిది.

పీ. రుత్త లాటారంబు రిత్త చీమ, పొల్లు
నారిక్తాఖ్య కోళిల్లుఁ
ఆం. భా. ౩. ౧౫.

రుత్తు. స. క్రి. కొట్టు, ప్రహరించు. (శ. ర, చి. ని.)

రుదనము. సం. వి. అ. న. ఏడ్పు, రోదనము.

రుదితము. సం. వి. అ. న ౧. రోదనము, ఏడ్పు. ౨. ధ్వని.

సీ. గిరిగరుత్కృంతన క్రీడాసమారంభ దంభోళియది
తమఁ ద్రస్తరించి
పి. కథం. ౩. ౯౩.

రుదురక్క = రుదురాక్ష. వి. రుద్రాక్షము.

గీ. పులికలాసముతకపాలబూదిపూఁత, జడలుఁ
జొత్తంబు రుదురక్కసరులు తావి,పుట్ట
ములు లాతమును కోగిపట్టియయును, దసర
నియ్యంతిఁ జేరి దీవన లిడుటయు ..
అచ్చ. రా. అర. ౫౩.

చ. తిరుపతి కొప్పులందముగఁ దీర్చిన బూడిద
బొట్లు మంచి పేర్పుఱచిన పెంచునట్టి రుదు
రక్కలపేరులుఁ గావికోకలున్ ...
కుక. ౩. ౯౧.

రుదురాక = రుమురక్క. వి. (సం. రుద్రాక్ష) రుద్రాక్షపు పూస.

గీ. .. రుదురాకలిడ్డసంది, నూతఘంపికల లితి కించి వ్రాలదొరగిరి ఆము. ౪. ౪౭.

సీ. గబ్బి నిబ్బెంపుచన్నవ పైన గలగల రుదురాక పేరులుజ్జూత లూగ .
పార్వ. ౪. ౨౧.

చ. . పాసి, పాదిసిన యటి రేకవెంగపున్ రుదురాకల దండ సందిటన్, వదనమునన్ వ్యుదస్మితమున రిలుకూగిని గాంచి భక్తి తోడన్ .. అహ. ౩. ౫.

రుద్దు. స. క్రి. (క. రుద్దు) ౧. మర్దించు, రాయు

శా. బ్రద్దల్వాఱి ధరిత్రి లీల దలిబాబాం బాచి వేటాడుచున్, రుద్దున పల్లున కొమ్ము కొల్లగట్టగా మూరాముసన్నల్యముస్ .
శరాం. ౨. ౨౪.

సీ. పడికేలచియుండినం బరంగ కేవంబొనంగ దైలంబుచేత రుద్దంగవలయు ...
కేం. కూ. ౪. ౨౮౭.

౨. తోము, నిర్మలముచేయు.

గీ. ప్రామెం దొలిచెను వెలచెను దోమె రుద్ది, ననగ నిర్మలమొనరించెనమట యొప్పు . .
ఆం. భా. ౩. ౧౨౪.

జ. రుద్దుడు.

రుద్దుడు. వి (√రుద్దు) తోమకము, తోముట.

సీ. తోముడు ప్రాముడు కుడుపు రుద్దుడు పులుముడన మార్జన సంజ్ఞ పొలుచుచుండు.
ఆం. భా. ౨. ౧౬౦.

రుద్రజట. సం. వి. ఆ. స్త్రీ. జటావల్లి, రుద్ర జడచెట్టు.

రుద్రజడ. మి. వి. రుద్రజట, సువాసనగల యొక కొక మొక్క. ౯. (వా.)

రుద్రజము. సం. వి. అ. న. పాదరసము.

రుద్రపత్ని. సం. వి. ఈ. స్త్రీ. ౧. దుర్గాదేవి. ౨. అతసి, నల్లనవిసెటు.

రుద్రప్రియ. సం. వి ఆ. స్త్రీ. పార్వతి, హరీతకి, కరకచెట్టు.

రుద్రభువి. సం. వి. ఊ. స్త్రీ. రుద్రభూమి, శ్మశానము.

రుద్రవింశతి. సం. వి. ఇ. స్త్రీ. ప్రభవాది షష్టి సంవత్సరములలో చివరి ఇరువది వత్సరములు.

(ప్లవంగ మొదలు క్షయ వఱకు గలవి.)

శ్లో. ఆద్యాతు వింశతిర్బ్రాహ్మీ ద్వితీయా వైష్ణవీస్మృతా, తృతీయా రుద్రదైవత్యా శ్రేష్ఠమధ్యాధమా భవేత్ . (వాచ)

రుద్రవీణ. సం. వి. ఆ. స్త్రీ. వీణాభేదము, ఒక విధమగు వీణ.

సీ. . మంచి, నీళ్ల గిండియు గాజా నిలువుటద్దము రుద్రవీణకిన్నెర వట్టివేళ్లసురటి.
సురా. ౧౦౭.

రుద్రవీణె(ణియ). మి. వి. ఒక విధమయిన వీణ.

సీ. జాళువా చందువ జ్జాలవల్లిక తమ్మపడిగము స్వతంత్రు బలకి, రుద్ర, గీ. వీణె వింజామరలు వట్టివేళ్లసురటి .. రసిక. ౪. ౪.

వ. పికిలులు, బచ్చుతోళ్లు, రుద్రవీణియలు, స్వరమండలంబులు . ప్రబంధ. ౬౦౫.

రుద్రాక్రీడము. సం. వి. అ. పుం. శ్మశానము.

రుద్రాక్షపిల్లి. వి. వి. మనోగతమగు భావమును కప్పిపుచ్చి పైకి సాధువుగాఁ గనఁబడు వంచకుఁడు, వంచకుఁడు. (గ్రా)

రుద్రాక్షము. సం. వి. అ. న. ౧. రుద్రాక్షవృక్షముయొక్క కాయ. (జపమాలలలో నుపయోగింపఁబడును.) ౨. రుద్రాక్షపూస.

గీ. చెవుల రుద్రాక్షపోఁగులు చవుకళింప.

మనుచ. ౧. ౫౯.

ద్వి వలుద రుద్రాక్షతావళములు నక్షు, వలయంబులును నిడువాలైన జడలు

నవ. ౩. ౨౩౧ పా.

రుద్రాక్షవన్నెలు. వి. వి. బ. వస్త్రవిశేషము.

వ. నిండువన్నెలును నుఱుకచాఱలవన్నెలును మురవన్నెలును పుష్పాడివన్నెలును గంటకివన్నెలును రుద్రాక్షవన్నెలును నాగబంధంబులును ద్వా. ౩. ౧౭౭

రుద్రాక్షి. సం. వి. ఈ. స్త్రీ. సందెమల్లియ. కీ. (శ. ర.)

రుద్రాణి సం. వి ఈ స్త్రీ రుద్రునిభార్య, పార్వతి.

రుద్రారి. సం. వి. ఇ పుం కామదేవుఁడు, మన్మథుఁడు.

రుద్రావాసము. సం. వి అ పుం రుద్రుని నివాసము. ౧. కైలాసపర్వతము. ౨. వారణాసీపురము, కాశి. ౩. శ్మశానము.

రుద్రుఁడు. సం వి. అ. పుం. ౧. శివమూర్తిభేదము (వీరు పదునొకొండుగురు.)

శ్లో. అజైకపా దహిర్బుధ్న్యో విరూపాక్ష స్సురేశ్వరః, జయంతో బహురూపశ్చ త్ర్యంబకో, ప్యపరాజితః, వైవస్వతశ్చ సావిత్రో రుద్రా ఇతిస్మృతాః. (వాచ.)

౨. శివుఁడు. ౩. అగ్ని ౪. ఏకాదశ సంఖ్యకు సంకేతము.

రుధిరము. సం విశే. (అ. ఆ. అ) ఎఱ్ఱనిది, ఎఱ్ఱరంగుగలది.

వి. అ. న. ౧. రక్తము, నెత్తురు. ౨. కుంకుమపువ్వు. ౩. మణిభేదము.

పుం. ౧. ఎఱ్ఱరంగు. ౨. అంగారక గ్రహము.

రుధిరోద్గారి. సం. వి. న్. పుం ఒకానొక సంవత్సరము పేరు దుందుభి తరువాతిది.

రుద్ధము. సం. విశే. (అ. ఆ. అ.) ౧. అడ్డగింపఁబడినది, ఆటంకపఱుపఁ బడినది. ౨. చుట్టఁబడినది, ముట్టడింపబడినది.

రుప్పు = రువ్వు[1]. స. క్రి. కాలు మొ విసరు. (గ్రా., వా)

రుబ్బాబుఱ్ఱాళ్లు వి. చెల్లాచెదరు.

శా. కాయంబెక్కడనుండ నేమి వనితా కందర్పుఁ బ్రాణేశ్వరున్, బాయంజాలవు ప్రాణముల్ మనసు రుబ్బాబుఱ్ఱాళ్లుగాఁ జేయుటన్, డాయ న్వచ్చుఁగదా పయోధరములంటం గౌఁగిటం జేర్చి యా, చాయంబైకొని చెక్కునొక్క రతిరాజ్యశ్రీలఁ దేలింపుదున్.

వేం. పంచ. ౩. ౨౭౪.

రుబ్బు. స. క్రి. (క. రుబ్బు.) నానిన పప్పు మొదలగు వానిని తొట్టిలో వేసి పాత్రముతో మెదుపు

(చూ. రుబ్బుటోలు)

జ. రుబ్బుగుండు, రుబ్బుటోలు.

రుబ్బుగుండు. వి. (√రుబ్బు) రుబ్బెడు పాత్రము. (వా.) ఇట్టి రుబ్బుపాత్రము. (వా.)

రుబ్బుటోలు. వి. (√రుబ్బు) నానిన పప్పు లోనగునవి రుబ్బుటకు రాతితోఁ జేసిన సాధనము.

గీ. ఇటుకఁ బ్రాము పెరంటిలోఁ జిక్కఁజాలి,
మునుఁగలుగు జోష్పు పెనువాఘి జనము
రుబ్బ్యతోలు పిడుకలకుచ్చెల దాలిగుంత
శుక. ౨. ౪౦౯.

రుమ. సం. వి. ఆ. స్త్రీ. ౧. సుగ్రీవునిభార్య.
౨. ఉప్పుళము, ఉప్పుపండుపాలము.

రుమాలు = రుమాలువు. వి. ఉష్ణీష విశే
షము, ఒకవిధమగు తలగుడ్డ
సీ. తనకెంజడలచిన్నె తళుకు చంద్రిక వన్నె
పూలసైకపు రుమాల్ పొలుపు గాఁగ .
ఇందు. ౧. ౬.
చ. చిటిలిన గంధముం దళుకు చెంపను బ్రేలు
రుమాలుజాఱు దృప్పటియును నిద్రదేఱు
ముఖపద్మము : శుక. ౧ ౫౧౫.
సీ. చెంద్రిక పూవన్నె జిలుగురుమాలుపై జాతి
మిన్నల తురా చౌకళింప
దశా. ౧. ౬౧.
జ. రుమాలుగుడ్డ.

రుమాలుగుడ్డ. వి (రుమాలు + గుడ్డ) చేరు
మాలు, చిన్న రుమాలు
సీ. అలకమల్ మాటి యొాదలఁ బాగఁజుట్టి పై
నడ్డకట్టు, రుమాలుగుడ్డ కట్టి
వైజ. ౨. ౪. ౬

రుమాలువు = రుమాలు. వి. ఉష్ణీషభేదము.
ఒకవిధమగు తలగుడ్డ.
సీ. సుందర ముడిగొని ముంగొంగు వెలివెట్టి
మాటుచెంగావి రుమాలువులును.
రా. వి. ౨. ౪౪.
చ మిసుకుఁ గడాని తాయెతు సమేళపుఁ
గ్రొవ్విరి దిండు దండ డాల్పని వలెవాటు
చల్వకలి పంపు రుమాలువు గట్టి ...
కువల. ౨. ౫౪.

గీ. మతియమాలువు గాదని మత్స్యకేత, చెంప
పిగఁ గెంపు తాయెతు చేరఁజేర్చి ...
పాంచా. ౧. ౭౯.

రుమీచూరకత్తి. వి. చిన్నకత్తి, చురిక.
మ. తల నిద్దాకగటీలు పేరణుల పైదట్లున్
రుమీచూరకత్తులు జోళ్లుం బదనించినట్టి కర
హేతుల్ తళుక్కుఁగుల్కంగ ర, క్తలుఠక్స్ఫెత్రక
రాళివక్త్రములన్ గ్రహించి గంభాణిశా,వళికందో
లి సలాముఁ జేతు యవన వ్రాతంబు భూభ
ర్తకున్. రా. వి ౨. ౫౨.

రుమ్మీపిరంగి. వి. గుంద్రని రొమకరకపు పిరంగి.
గీ. మేఁత గానివచ్చు తమ్మి రుమ్మీపిరంగి,
దొర తురంగీవిలాసంబు దొరయఁగొల్పు,
గంపవింటికిఁ దెచ్చు నా కాపుబిగువు, టొగ
వగల గుబ్బలాడి రొమ్ముకొక్కవేళ
శుక. ౨ ౪౧౦
(తమ్మిరుమ్మీపిరంగిదొర = మన్మథుఁడు.)
గీ రాగికైవడి మిగుల విరాగినీతి, వదిరు
లోకంబుగా మన్న నాపదంతి, నేప
రాలెడు తమ్మిరుమ్మీపిరంగి, వీరు మటు
మాయ మాయింప నేరదయ్యె.
సుదంతా. ౨. ౧౫౬

రురువు. సం. వి. ఉ. పుం. ౧. మృగభేదము,
ఒకజాతి లేడి ౨. ఒకానొక రాక్షసుఁడు.

రువాణము. విణ చక్కనిది, సుందరము.
(వి. కాంతి అని శ. ర.)
చ కలకల నవ్వు చక్కనిమొగంబు వెడంద,
యురంబు సింగముం, గలఁచు రువాణపుంగ
వును గల్గిన యాకురువీరపుంగవున్
విజ. ౨. ౨౧.
గీ పిడికిటమ్ములు వీఁపున నిడిన పొదియుఁ,
దలిరువాణపు వెదురు మొత్తియుపూఁ జేరుఁ,

గలిగి రేఱుంకు కాయంబుఁ దొక్కుండు
వచ్చి,పుడమిరాచెబ్బురాయని కడసునిల్పి ..
చంద్రా. ౨. ౪౦.

రువారము. విశే. ౧. సవిలాసము.

ఉ. వచ్చి పురంబు వాకిట రువారపుఁ గోడ
తనంబు తోడఁ గన్నిచ్చుక వచ్చు చేడియల
నెచ్చరికించుచు ధూర్తకోటితో, మచ్చరి
కించుచున్ . విక్ర. ౭. ౭.

౨. సుందరము, చక్కనిది.

చ తోఁచెఁబయిఁ గ్రొందొగి రప్పడు
నెమ్మితో నిశా,వనిత మఱుంగువట్టిన రువా
రపుఁ జెంద్రిక పావడోయనన్
చంద్ర ౪. ౩౨.

సీ. వాలు మెఱుంగు రువారంపుఁ గొనగోటఁ
జెక్కలి నొక్క నొచ్చెనని పేడు
మల్లుపు. ౪. ౯౨.

ఉ. వచ్చె వసంతకాలము రువారపుఁదేనె పసిండి
నీరునన్, బచ్చెన మాఁటితేఁటి నిను పౌజాలఁ
దీరుగ వ్రానియున్న యా, పచ్చనివిల్లువంచి
నుమబాణుఁడు పాంథుల ధైర్యవర్మముల్,
గ్రుచ్చి చనంగి మవ్వమగు క్రొవ్వునఁ
గ్రొవ్విరి తూఁపు లేయఁగన్
సుద. ౨. ౪౫.

౩. ఇంపు.

మ. గరుడాశోపా మెవర్పు మాధవు క్రీడన్
గాండావతంసంబు బంధురలీలాగతి నెక్కి
రానుతుఁడు దోడ్తో సైన్యముల్ గొల్వఁగా,
పాఁచిదిన్ సన్న రుమాలుపహోవ్ సరిగచుచ్చుల్
చెన్నునన్ జౌకళింప రువాఁబుగ వాద్య
వాదములు దిక్చక్రంబునన్ నిండఁగన్.
ఇందు ౨. ౫౫.

౪. విధుర్యారము, విలాసము.

ద్వి. ఆనగ వాలిగు వారువారంబు, లాసీటు
లాట్లాట లావిలాసంబు ...
రఘునా. ౩౨. బా. ౧౨. పం.

ఉ. వచ్చినఁ జూచి కీరము రువారము విగా
ముఖారుణద్యుతుల్, బచ్చిన పన్న నావృపతి
పాలికిఁ బోయెదవేమి పొమ్ము ...
శుక. ౨. ౯౪.

రువ్వ. వి దమ్మిడి. (శ. ర., గ్రా.)

రువ్వపులుఁగు. వి. కాటుకపిట్ట.

సీ. కాటుకపిట్ట రువ్వపులుఁ గనఁ దనరు ..
ఆం. భా. ౨. ౯౧.

రువ్వము. వి. (సం. రూపమ్) తడవ, ఆవృత్తి.

క. పది రువ్వంబులు భక్తిం, బదిలుండై వినఁగ
వలయు భారతము జగద్విదితగుణ వాని
కన్నిటి, కొదవు ఫలము తేర్పటెంతు కోలిన
నీకున్ హరి ఉ ౧౦. ౨౭౩.

సీ. తొలుత రువ్వము వినఁగలుగు నగ్నిష్టోమ
యాగంబు ఫలముఁగా మార్గవిద్ధు, లీ లోక
మునఁ గాంచి . . హరి ఉ. ౧౦. ౨౭౪.

రువ్వు[1]. అ. క్రి. విసరు, వీచు.

ద్వి. విడుపక రువ్వెడు విసరు వాయువున ..
ద్వి. హరిశ్చ. పూ. ౨౧౫౩. పం.

= రువ్వు. స క్రి. ౧. విసరివైచు.

మ. ధరఁబాంథుల్ వెగడొందఁ గ్రిమ్మరిరెు
భద్రశ్రీమహీభృన్మప్రా, పరసాలానవసక్య
శృంఖలితచంచన్మారుతేభంబు లే,పరసాలా
నవపత్రముల్ తులుపుచున్ జైత్రాహజాగ్ర
ద్విలా,ప రసాలా వవధప్రసూన రజముల్
పోరన్ బయిన్ రువ్వుచున్ ...
చంద్రి. ౪. ౩౨.

వ. విద్యాధర సందోహంబులు రువ్వినం జెందిన పువ్వంపుఁ జెందిరంబున ...
భీమ. ౫. ౧౭౦.

౨. చిమ్ము, చల్లు.

ఉ. అ, తంకవిధాయి తీవ్రసికతల్ వడ చల్లుచు సూర్యుగాడుపు తూ,లంకవ సప్త సాగరజలంబులు తువ్వరగాఁగ రువ్వుచున్.
వరాహ. ౪. ౪.

౩. గ్రుద్దు, పొడుచు.

వ. .. పాదంబుల జవురుచుఁ బిడికిళ్ళ రువ్వుచు నఖచేతులం బాముచు వీర. ౪. ౧౦౪.

౪. ఆక్షేపము, విసరుట.

క. అని జవ్వను లవ్వనిఁ గ్రొవ్వునఁ బువ్వులు గోసి కడుదవులు్వను నవ్వుల్, వనరువ్వులు కొండలు మెచ్చని చివ్వలు నివ్వటిల్లఁ జని యవ్వలనన్.
కువల. ౪. ౧౪౩.

క. ఎవ్వనికి వలచెనొకో యీ, జవ్వనియని రవ్వ మీఱు సరిసోకులు లే,నవ్వులు ముడిచిన పువ్వుల, రువ్వులఁ దనయందు సమధి రూఢము లగుటన్.
పాండు ౩. ౬౬.

రువ్వు². వి అవృత్తి, వల్లె.

ద్వి. ఆ తరువాతఁ దా పాతరువాయి, యేతరి యోజ రువ్వియుఁ బోసంత ..
ద్వి. పరమ. ౨. ౧౭౩. పొ.

సీ. వినుము రెండవరువ్వు విని యతిరాత్ర యజ్ఞము పుణ్యమైంది భోగముల నెలమి.
హరి. ఉ ౧౦. ౭౭౮.

సీ. పదవర్ణ సౌష్ఠవ ప్రకటనం బెంతయు వింపు మీఱంగ రువ్విచ్చి యిచ్చి ....
కళా. ౪. ౪౭.

రువ్వు³. వి. వేగముననడగు ధ్వని కనుకరణము.

క. తూరుపు తెలతెలవైరాఁ,గా రువ్వన విసరుసీడ గాడ్పులు వయ్యా పారమును ముట్టుకొనె ... హం. పంచ. ౧. ౪౭౩.

చ. విడివడి రువ్వునన్ గగనవీథికి గుఱ్ఱము చౌకళించినన్ . కువల. ౪. ౧౬౩.

రుశత్. (శత్రంతము) హాని చేయుచున్నది, అనిష్ట మగుచున్నది, అసంతుష్టి గలిగించుచున్నది. (మాట)

రుశతి. సం. వి. ఈ. స్త్రీ. అశుభకరమైన వాక్కు, అమంగళమైన మాట

రుష. సం. వి. ఆ. స్త్రీ. కోపము, కినుక.

రుషితుఁడు. సం. విణ అ ఆ అ. కోపగించిన వాడు.

రుష్టుఁడు. సం. విణ. (అ ఆ. అ.) రషితుఁడు.

రుసి. వి. (సం. ఋషిః) ఋషి.

సీ. కోపాగ్నిఁ గడుఁబరితాపంబు నొందెడు రుసులకు నభయంబు లొసఁగఁగా ...
భీమ. ౨. ౧౭.

రుహా. సం. వి. ఆ. స్త్రీ దూర్వాతృణము.

రుహము. సం. విణ (క్ర. అ. ఆ. అ.) (సమాసాంతమున) మొలిచినది, బయలు దేరినది ఉదా. మహీరుహము.

## రూ

రూ. సం. వి. ఊ. స్త్రీ. బంగారము.

విణ. కామరూపము కలది. (నానార్థరత్నమాల)

రూక. వి. (సం. రుక్మమ్.) ౧. ఒకానొక నాణెము.

సీ. కోసపోయితి దీని మంతవాటునకైనఁ జేకూ
రుచేసైతి రూకరుక్ల ...
విరం. ౨. ౧౨౩.

సీ. రూకంతగాని తే దేకైవడి సుమంబు వచ్చు
బంగారువై హెచ్చుడిగిక . .
సారంగ. ౨. ౪౪.

ద్వి. నాఱు మాదలకు మున్నుగ రూకపడ్డి
ద్వి. వల. ౧. ౨౨౧.

౨. ధనము. (శ. ర.)

**రూకపాక్యె.** వి. ఓషధీ విశేషము.

చ. గురుగాఱ బొద్ది చెంచలియుఁ గుచ్చలి చిత్తి
తగిర్సి తుమ్మి దు,స్సరి ఖలుగూటి బొద్ది సెలి
చిర్మిడి పల్లెరు రూకపాక్యె పె,ల్లరిగిపె
మున్గ వెల్గ హంస ౪. ౧౩౨.

**రూక్షగంధకము.** సం వి. అ. పుం. రూక్ష
గంధము.

**రూక్షగంధము.** సం. వి అ. పుం గుగ్గులువు

**రూక్షణము.** సం వి. అ న. ౧. ఎండించుట,
శుష్కముగాఁ జేయుట.

**రూక్షదర్భ.** సం వి. అ పుం. తృణవిశేషము,
హరిదర్భ. శ్రీ.

**రూక్షపత్రము.** సం. వి! అ. పుం. శాఖోట
వృక్షము.

**రూక్షప్రియము.** సం. వి. అ. పుం. ఓషధి
విశేషము, బుషభౌషధి. (వాచ.)

**రూక్షము.** సం. విశే. (అ. ఆ అ.) ౧. కఠిన
మైనది, కఱకైనది. ౨. ఒగరైనది. (రుచి)
౩. ఎండినది, శుష్కమైనది.

వి. అ. పుం. ౧. వృక్షము. ౨. దంతి, సేహా
శము. శ్రీ.

**రూఢి.** వి. (సం. రూఢిః) ౧. స్థైర్యము.

క. తేజుక నమ్మువి యుండటఁ, శాఢిత మూడి
తిను పెక్కు పరిహాసంబుల్, రూఢిగఁ బలి
కితి మెట్లుం, బాదఁడు మావలను నీరసుం
దన మండెన్. భార. ఆది. ౮. ౧౫౪.

గీ. పిడుతరములు వర్తించు రూఢిగాఁగ, నమ్మ
హానిధి . మార్క. ౫. ౧౧౪.

౨. నిశ్చయము.

ద్వి. రూఢిగా రాకుమారుని జంపెననెడి, యూఢి
క తలఁగూడ నభిమాన మెడలె.
ద్వి మరిళ్ళ ఈ. ౨౪౮౧. పం.

౩ ప్రసిద్ధి (చూ. రూఢికెక్కు )

౪ రూఢికెక్కు.

**రూఢికెక్కు.** అ. క్రి. (√ రూఢి) ప్రసిద్ధికెక్కు.

సీ నీతేజమట్టులు నీఱయిపోయినఁ బాండుని
కులము చెప్పంగఁ జూప, గీ. లేకపోద
యిబ్బంగిఁ బల్కితిమకుండు, తోడ నేను
మీ రెమ్మెయి రూఢికెక్కి, వెలుఁగ గోరుట
కతమునఁ దలఁచి దాని,ననిలసుతుఁ డెత్తిపెట్టె
నేమనఁగఁగలదు. భార. ఆశ్ర ౧. ౧౭౮.
దశా. ౧. ౧౧౯.

**రూఢము.** సం. విశే. (అ ఆ. అ) ౧. మొలిచి
నది, మొలక యెత్తినది. ౨. పుట్టినది, ఉద్భ
వించినది. ౩ ప్రసిద్ధమైనది, సర్వవిదితమైనది.
౪ నిశ్చితమైనది, రూఢియైనది. ౫ అవయవ
శక్తిని అపేక్షింపక క్రొత్తయర్థమందు ప్రసిద్ధ
మైనది.
(ఉదా. లావణ్యము మొదలగునది.)

**రూఢి.** సం. వి. ఇ. స్త్రీ. ౧. పుట్టుక, ఉత్పత్తి.
౨. ప్రఖ్యాతి, ప్రసిద్ధి.

సీ. శ్రీహిమాచల మనురూఢిగా కంచింత మహా
నీయరత్నసామగ్రి గలచ ...
కు. సం. ౩. ౨౪౭.

3. సంప్రదాయము, ఆచారము, వాడుక. ౪. వాడుకలోనున్న యర్థము, ప్రకృతి ప్రత్యయముల యపేక్షలేకుండఁగ బోధపడెడి యర్థము, యౌగికము కాని యర్థము.

**రూణించు.** స. క్రి. మల్లులాక విధముగా బంధించు. (చూ. రూణింపు)

జ రూణింపు.

**రూణింపు.** వి. (√రూణించు) మల్లబంధ విశేషము.

వ. పెట్లాగును రూణింపును పరిబిత్తరంబును నాదియగు ముప్పదిరెండు విన్నాణంబుల నాణెంబు పరీక్షించి

హంస. ౧. ౨౦౬.

వ. పెట్లాగును రూణింపును పరిబిత్తరంబును . ప్రబంధ. ౩౮.

సీ. రూణింపు బరిపోటు రొండిప్రేటు,

గీ. . మెరపట్టునాఁగఁ జెన్నులరుచుండు, ముప్పదియురెండు విన్నాణములఁ జేళ్లు.

ఆం. భా. ౨. ౨౦౯.

**రూపకతాలము.** సం. వి. అ. పుం. సంగీతతాల భేదము, నియమిత తాలభేదము.

**రూపకము.** సం. విణ. (అ. ఆ. అ.) మూర్తము, ఆకారము కలది.

వి. అ. న. ౧. ఆకారము, రూపు. ౨. దృశ్యకావ్యము (నాటకము మొ.) రూపకములు పది. ఉపరూపకములు పదునెనిమిది. 3. అర్థాలంకారములలో నొకటి (ఉపమానోపమానములకు నభేదముగా వర్ణించుట.) ౪. మూఁడు గురిజెందగింజల యెత్తు తూనిక (పరిమాణము)

**రూపగంధ.** సం. వి. ఆ. స్త్రీ. మూరకొండ. ?.

**రూపగు.** అ. క్రి. (రూపు + అగు.)

౧. ఏర్పడు, కలుగు.

మ. . నరుక్ భ్రాంతివహించు రేల పిశితాస్థుల్ గూడి రూపైనయో, వీని యేకార్యము కానరాని పురుషుండీక్షింపఁ గాంక్షింపగన్.

ప్రబోధ. ౪. ౧౨.

చ. విలయకృశానుకీలముల వేఁడిమిఁ బోడిమిమాలి వెల్మిడిం, గలిసిన భూతధాత్రి మతి క్రమ్మఱరూపయి నిల్చి .

మనుచ. ౨. ౧౦.

౨. ప్రసిద్ధి కెక్కు.

చ. విపుల ధరాధరాగ్రమున వేలుపుమూఁకల రచ్చరావి దివ్యపరిమళంబులోఁ గదవలం తలు పండుల విఱ్ఱవీఁగుచూ,కిపతిపయోధి ద్రచ్చు నెడఁ గేతువుపై మణిమాలచేర్పఁ జేరుపడియెఁ గేతుమాలమన రూపగు వర్షము దానిఁ జేరిటన్.

వరాహ. ౧౦. ౧౨౦.

3. సంపన్నుఁడగు.

౪. ఏమిట రూపగుఁబురుషుం, డేమియు రూపు నెడు నాకు నెఱిఁగింపుము తే,జోమహిత యనిన .

భార. శాం. ౫. 3.

**రూపడఁగు.** (రూపు + అడఁగు.) ౧. నశించు, నిర్మూలమగు.

క. కోపంబున భృగుపతి ప్రతికోపంబులు నృపుని కరధి రూపడఁగించెన్.

దశా. ౬. ౧౦౭.

౨. చచ్చు

మ. ... శెక్కెంపం బెక్కైనకా,ల్వర మొత్తంబులు రూపడంగ . .

భార. కర్ణ. ౨. ౨౦౦.

**రూపడఁచు.** స. క్రి. (√రూపడఁగు.) ౧. రూపుమాపు, చంపు.

చ. ఉడుగని బాష్పపూరముల నుష్ణము లయిన్బ్రభు
పాదపద్మముల్ దడుపుచు నర్ధరాత్రి శత
ధన్వుఁడు తంత్రి నకారణం బ రూపడచుట
యున్ కమంతక మహామణిరత్న మతిప్రయ
త్నమేర్పడఁగాని చన్నధార్థ్యము నపారదు
దుఃఖముతోడఁ జెప్పినన్

వి. పు ౬. ౨౮౨.

సీ. . . వార్ధిఁ గలంచి పాంచజన్యంబుచే
పటురూప, గీ. డంచెనా జరాసంధుఁ బాండ
వుల మనిచె            ఉ. హరి. ౨ ౬౪.

౨. నశింపఁజేయు.

చ. ఎరగలి చిమ్ము గాఁడిదవి రొల్లము బెల్లుగ
నొక్కపాయగా, దరికొని రూపడంచిన
విధంబున            భార. భీష్మ. ౨ ౫.

సీ. కోపంబు విజృంభగాఁ జాపంబుఁ జేపట్ట
కోపంబుచే దాని రూపడంచె

దశా. ౨. ౩౯౫.

రూపధేయము. సం. వి. అ. పుం. రూపము, ఆకారము.

శ. శ్రీసోంగ స్త్రీరోగ ప్రశాయితరోమాంచ
భూషణ నిరీక్షణ యామ్నాయమయభావణ
కృతాభ్యాయస్మృత రూపధేయ దత్తా
త్రేయా.            చంద్ర. ౫. ౧.

రూపనాశనము. సం. వి. అ. పుం. కాశికము, గుడ్లగూబ.            (విద్యమ్న.)

రూపము. సం. వి. అ. న. ౧. ఆకారము, రూపు. ౨. శుక్లాదివర్ణము. ౩. సొగసు, అందము. ౪. స్వభావము, గుణము. ౫. స్థితి, స్వరూపము.

గీ. .. ఉన్నరూప మేర్పడఁగఁ జెప్పుము ...

దశకు. ౬. ౯౩.

క. ఈతఁడు కడుమెఱయు తోడ వృత్తము
రూపముగోరువారు దాల్తురు దానిన్ ..

భార. ఉద్యో. ౨. ౪౦.

౬. సామ్యము, పోలిక.

(సమాసాంతమున. ఉదా. తపోరూపము.)

౭. విభక్తి ప్రత్యయముల యొక్కయు క్రియా
ప్రత్యయముల యొక్కయు చేరికచే మార్పు
చెందిన రూపము. ౮. ఒకటి, ఏక సంఖ్య.
౯ నాటకాది రూపకము. కంఠ పాఠము
చేయుట, వల్లెవేయుట. ౧౦. ఒక నాణెము,
రూప్యము. ౧౧. శబ్దము, పదము. ౧౨.
(గణిత) వ్యక్తరాశి. ౧౩. మృగము,
జంతువు. ౧౪. పద్యము, శ్లోకము. ౧౫.
పేరు, ఆఖ్య. ౧౬. అగ్ని గుణము

రూపరి. విణ. (రూపు + అరి) రూపవంతుఁడు, సౌందర్యవతి.

మ. స్ఫురణం బాసిన సజ్జనుండు ధన లుబ్ధుం
డైన రాజున్ విరక్తుఁడౌ రూపరి రచ్చలో
ఖలుఁడు .            మల్లభూ. నీతి. ౪౬.

రూపఱు. అ. క్రి. (రూపు + అఱు) ౧. చచ్చు, మృతిఁబొందు.

క. పెఱవారి నెల్లఁ దరమిడి, నణఁకుడుఁ బాండు
సుతకనందనులను రూపఱ జేయం జేయూ
దదు            భార ఉద్యో. ౪. ౧౫౦.

ఉ. ... కాలుచేత బల్లాణిక్కిలి నన్ను ను
ప్రభృతులున్ దదరూపఱకుండ నేర్చిరే ..

ఆము. ౨. ౪౮.

సీ. ఒక దైత్యుఁదొడరి యా భంగి రూపఱఁజేసి
రక్షించె కేశవరాపురంబు ...

భార. విరా. ౧. ౪౪.

౨. నశించు, చెడు.

సీ. సోమపాన క్రియ చొప్పులు రూపఱి కాంత
ములు కలవర్యొ పాలికపాలునకు ...
హరి. పూ. ౧. ౧౦౦.

క. కోపకుఁడగు దుర్వాసుని, శాపంబున దివిజ
రాజ్య సంపదశెల్లన్, రూపడిన చందమబ్జజుఁ,
డా పురుషోత్తముని తోడ నంతయుఁ
జెప్పెన్. వి. పు ౧. ౧౨౯.

సీ. మనుజేంద్ర సంకల్పమునఁ బుట్టుఁ గామంబు
రూపఱు దేహనిరూపణమునఁ
భార. శాం. ౩ ౪౨౧.

౩. రూపు చెడు, విఱుగు

చ. జనకుఁడు మెచ్చఁగా హరుని చాపము
రూపఱఁజేసెఁ బెంపులోఁ, దన భుజవీర్య
శుల్కము కతంబున సీత నయోనిజాత నే,
ర్పున వరియించి హైహయ పురోగమ
రాజకులాంబుదప్రభంజను జమదగ్నిసూను
భుజసత్వ మహాస్త్రముఁ జేసె ధీరతన్.
వి. పు ౫. ౩౭౦.

౪. విరూపమగు.

గీ. వృకోదరు పల్కు దప్పకుండఁ దద్గదా
దండప్రచండనిహతి, రెండు దొడలును విఱిగి
ధరిత్రిఁ జెలువఁ, గూలి రూపఱి రారాజు
ధూళిఁబ్రుంగె. శల్య. ౧. ౯.

**రూపవంతము.** సం. విణ. త్రి. కు. త్రి. ౧ ఆకారము గలది, తెల్ల రంగుగలది. ౨. శరీర సంబంధమైనది. ౩. మూర్తిమంతమైనది, శరీరము ధరించినది. ౪. సుందరమైనది, అందమైనది.

**రూపసి.** విణ. (√ రూపు.) సౌందర్యవంతుఁడు, సౌందర్యవతి.

క. ... అంచిత గుణుఁడు రూపసియునగు,
సుతుఁ గోరుదు నెపుడు నేను సురగణ
వంద్యా .. భార. ద్రో. ౨. ౧౯౦.

శా. ఈ రూపే కలలోపలం గలసె నన్నే రూపు
వంచెను న్నా, కీరూపింతటి మేటిరూపసికిఁ
దా నిల్లాలుగా నోము న్వగ్గారా మేలిరాం
గికిం గలుగు ... ఉ. హరి. ౫. ౧౫౫.

గీ. లోకకంతా విహీనుండు రూపసియును
హర. ౨. ౫౩.

క. రిక్కవిమగువలయందును, జక్కలచెలు
లందు వేల్పుచానలయందుం, బక్కదొర
కొలుపువవలా, లొక్కమునందైన నిటి
రూపసి గలదే. అచ్చ. రా అర. ౧౯.

గీ. తిథుల యందైన మతి యపత్నీకుఁ డనుచు,
బ్రాహ్మణార్థంబుఁ జెప్పరేపాటివారు,నొకతె
రూపసిగాకున్న నోసియన్న, నోయనెడు
మాత్రమునకైన నుందవలయు.
శుక. ౩. ౩౪౫.

ద్వి. బాపురే యమకొనఁ బనిలేదుగాక, రూపింప
నాకంటె రూపసి గలదె
ద్వి. హరిశ్చ. ఉ ౧౦౭౭. పం.

**రూపాజీవ.** సం. వి. ఆ. స్త్రీ. వేశ్య, లంజె.

**రూపాయ.** వి. ఒక వెండినాణెము. (శారదా వర్ణనము.)

సీ. కాలంబు పేరి చీకటిగొంగకు బణంకి
పాఱుంగఁ జల్లు రూపాయలనఁగ
సుదంతా ౨. ౧౫౦.

**రూపార్చు(ఱుచు).** స. క్రి. (√ రూపాఱు.) రూపుమాపు.

గీ. గబ్బిబెబ్బులి డాకాల ద్రొబ్బి విరియఁ,
బ్రామి రూపార్చకున్న నీ బంటఁగాను.

**రూపాఱు=రూపఱు.** అ. క్రి. (√ రూపు.) నశించు, చెడు. (చూ. రూపార్చు)

**రూపాస్త్రుఁడు.** సం. వి. అ. పుం. మన్మథుఁడు.

రూపించు. స. క్రి. (√రూపు.) నిర్ణయించు.

శా. వెంపేదం దమకిట్టి తక్కువలు రూపింపంగ నేలా ... భార. ఉద్యో 3. ౧౦3. భార. ఉద్యో. ౧. ౨౫.

౨. విమర్శించు.

ద్వి. బాపురే యింత నేర్పరియొకో వలఁదు, రూపింపఁ బెద్దయు రూఢికెక్కు, యరుగు దీర్చిన మాడ్కి నలవడఁ దీర్చి . (రం. రా యు ౩౧౬ పా. ౧౪. పం)

శా. గోపాలత్వ విరూపుఁడైన కరనం గ్రొవ్వ గ్గలంబై మదిన్, రూపింపం బోరకేమ విన్ను విట సంశోధించి బాధించితిన్ హరి. పూ ౩. ౧౯౯.

రూపిక. సం వి. అ స్త్రీ. శ్వేతార్కవృక్షము.

రూపు. వి. (సం రూపమ్) ౧ ఆకారము.

గీ. వినయమున గ్రోణరూపు మన్నున నమర్చి భార. ఆది ౫. ౨౩౨.

క. తన యింట నొండెడకు నెందును బోవక నెమిలిరూపులో నొప్పెడు కేతనము తన రాయుచోటికి జని యావీమఁడయి యా ప్త జనములు వొగడన్. హరి. ఉ. ౩. ౨౧.

౨ సౌందర్యము, చక్కదనము.

క. నీ రూపు చూచి వలచితిఁ, గారుణికా గణివి నన్ను నైకొనుము పరీహారంబునకుం గార ణ,మేరూపునలేదు . హరి ఉ.3 ౯౬.

గీ. ధరణిధరకన్య నిందించెఁ దనదు రూపుఁ, బరులు మెచ్చని చెలువు నిష్ఫలమ కాదె . . హరి. ౪. 3.

వ. .. సకల సీమంతినీ సీమంతముక్తామణియగు నాము క్తిమాల్యద రూపు నెలప్రాయంబు సౌభాగ్యంబుగాఁ జూచి తనలోన ... ఆము. ౨. ౧౦౪.

3. దేహము, శరీరము.

క. నరసురగంధర్వాదుల రిత్తో,త్కరములలో నతని శరముదాఁకని రూపుం, బరికించియుఁ గానం ద, త్పరిరత్వంబునకు మేలువర్ణన యేలా. భార. ద్రో. ౪. ౩౦.

గీ. మన్ను గోన్నుఁడు నగ్గియు మిన్ను నీరుఁ, బ్రొద్దు నెలగాడ్పు లెవ్వానిరూపు లయ్యె .. నీలా ౧. ౧౨.

చ. దొరఁకొని పూర్వజన్మమున దుర్జనశత్రు యొనర్పఁగాని నృసింహరమతి రాజ్యభోగము లు చేకొనఁగాఁ దటేలేమి నాళ్ళలో, మారి తలపోసి సౌఖ్యముల నందఁగఁ దిప్పురిఁ బెక్కురూపులై, సొరిది జనించె నాన్నపతి మానులు వొల్తురు శ్రీసమేతులై విక్ర ౧. ౩౧.

సీ. ధర్మభూమి ధరంబు పలురూపు లాయె నో యన మించు వన్మహర్మ్యములు గలుగ ఉ. రా. ౧. ౨౩౩.

౪. విధము

క. నారాయణాస్త్రము మిమ్మెయి, నైరిచమూ సంచయంబు వధియింపకపో, రారాజాను ద్రోణియుఁ దా, యేరూపున సంచరించి రాజేఁగింపు తగన్ భార. ద్రో. ౫. ౩౯౧.

క ఈ రూపునఁ బొలివోయిన, బీరముతో వృష్ణి భోజకుకు లతోరన్, ద్వారవతి కరిగి నిలిచితి ... ఉ. హరి. ౨. ౩౫.

క. మారుఁడు దుర్వారుఁడు సంసారమిది యుఖాదికంశసంరక్షణ మం,భోయమానదనల చేసిది, యేరూపున జాతిశుద్ధి యేర్పఱుప నగున్ ... నైష. ౩. ౩౩.

వ. తనదు సాకార నిరాకారతలు వారికిఁ
జూపు రూపున దీపించు వాని . .
ఆము. ౬. ౯౮.

౫. స్థితి.

చ. . . దానిది కలరూపెఱుంగ నవనీపతి
యుత్సుకుఁడయ్యె వార్తలోన్
భార. ఆది. ౮. ౩౦.

క. . కల రూపెఱుఁగఁగఁ జెప్పు క్రమ్మఱ
నాఘన్ . భార కర్ణ. ౧. ౧౨.

వ. . మాయంగుళీయకంబు నీకెట్లు కలిగె ?
ఉన్న రూపు చెప్పుము
కాశీ ౪. ౧౦౦.

౬. నిజము, సత్యము.

క. వారుగలరు వీరుగలరు, పోరికిని చెప్పె
దీవు పొంగారుచు నీ, వారిని మిమ్మును రేపుగ,
దా రూపేర్పడఁగఁ జూచె దంగితవనుతా.
భార ఉద్యో. ౪. ౨౦౬.

౭. కన్నెపిల్ల మెడలోఁ గట్టిన బంగారుసాతెము.

ఉ. .. శేఁ, శేరక పూపుదీవియలచెంత నె
నిల్చి లతాంగిరూపు క,న్నారఁగఁ జూచి
వచ్చితి నవాంబురుహాంబక నీకుఁ దెల్పఁగన్.
వసు. ౨. ౫౫.

జ. రూపగు, రూపడఁగు, రూపడఁచు, రూపరి,
రూపఱు, రూపసి, రూపార్చు, రూపాఱు,
రూపించు, రూపుమాపు, రూపువిలాపించు,
రూపుమాయు, రూపుసెడు.

రూపు(లు)మాపు. స. క్రి. (√రూపుమాయు.)
౧. నశింపఁజేయు.

ఉ. బుద్ధులు చెప్పఁజెల్ల నటుపోవిడు మెమ్మెయి
నైన సౌఖ్యసం,సిద్ధి యొనర్పు నాకు నెద
చేసినఁ దాపము రూపుమాపు .
భార. విరా. ౨. ౬౭.

మ. .. డెందములోన ధర్మపటిమంద ద్వీప
సీనాంగద్వర్పసముద్రేకము రూపుమాపఁ గలిత
ప్రారంభుఁడై రంతటన్.
రాఘవ. ౨. ౨౦.

౨. చంపు, మృతినొందించు.

మ. దుష్పుల్ సగ్గనూచంబులై, పొలియం
జేసి వరాహసంఘముల రూపుల్మాపి
పింగంభుగం,పుల పెల్లం దగటార్చి .
కుశ. ౧. ౧౯౬.

రూపుమాపించు. స. క్రి. (√రూపుమాయు.)
నాశము చేయించు, చెడఁగొట్టించు.

వ. పౌండ్ర భూపాలుండు స్వస్తిక
సర్వతోభద్రసంధ్యావర్తపిచ్ఛందకాదిహర్మ్య
ప్రాసాదసౌధంబులు రూపుమాపించియు .
ఉ హరి. ౩. ౩౬.

రూపుమాయు. అ. క్రి. (రూపు + మాయు)
నశించు, చచ్చు.

ఉ. మొగ్గోడు వాహనంబులును నోములు
వాడఁగ వాహనంబుల, నిగ్గి తలంగు సైనికుల
నేలకుఁ గప్పపుఁ బొప్పసొప్పడన్, ద్రగ్గ
సిదంబులుం గులముఁ దన్నుఁ దలంచి
యెదిర్చి యొంటిమై, మ్రగ్గెడువాఁడునై
కురుధరావర సైన్యము రూపుమాయఁగన్.
భార. కర్ణ. ౨. ౩౫౫.

రూపుసెడు. అ. క్రి. (రూపు+చెడు.) నశించు,
చెడు

ఆ. అంత నిలక యమ్మహాబలుని గృహీతుఁ,
జేసి శత్రుబల విజృంభణంబు, రూపుసెడ
హరింతు నేపున నావార,లెల్లఁ జూచి సంత
సిల్ల నను చు . రాఘ. ౪. ౧౯౪.

క. ఏపొంట రూపగుఁ బురుషుం, డేమిట రూపు
సెడు నాకు నెఱిఁగింపుము శ్రీజోమహిత

యనిన నతఁ డా, భూమిపతికి నిట్టులనిరు
భూపప్రవరా .. భార. శాం. ౫. ౩.

రూప్యము. సం విణ. అ. ఆ. అ. ౧. అంద
మైనది, మనోజ్ఞమైనది
వి. అ. న. ౧. వెండి. ౨. వెండినాణెము. ౩.
బంగారము.

రూప్యాధ్యక్షుఁడు. సం. వి. అ. పుం. టంక
శాలకు యజమానుఁడు, కోశాధిపతి.

రూషకము. సం వి. అ పుం. వాసకవృక్షము
విణ మిశ్రితము.

రూషితము. సం. విణ అ. ఆ. అ. ౧ ధూళి మొ.
వానిచేఁ (బూయఁబడినది,) కప్పఁబడినది ౨.
కఱకుగా చేయఁబడినది. ౩. రత్నఖచితమైనది.

## రె

రె. అవ్య. ఆశ్చర్యార్థకమును వాక్యాలంకారమును
నగు, నఁట, భాపు మొదలగువాని కవు
ప్రయుక్తము

సీ. మైకాఁకకు నుజల్పమందుఁ శరెబు దీనిచేఁ
గాఁకలు దీఱునఁటరె కళా. ౪. ౧౮.

చ. స్వరములయారె మేలుశ్రుతి బాగురెమూర్ఛన
కంపితంబు భాపురె ...
ఉ. రా. ౬. ౧౩౫.

రెంచే. వి. (వాదమునందు) రెండు. (శ. ర)

రెంజితుంజి. క్రి. విణ సంపూర్ణముగా,
పూర్తిగా

ద్వి. దేవహెచ్చరిక దైతేయారి యనుచు, కీవి
మై మున్న కట్టికవారు నడువ, నలరు శంఖ
ధ్వను లదరంగ దైత్యకులవధూగర్భార్భకుల
రెంజితుంజి, యచేయుచు నురువేగ నా వాద్య

గతులఁ, గుణుచల నిడఁదలఁ గూడి కాయింపఁ
సన్న రెంటెంగి యాసన్న కాళికలు, సన్నలో
నుగఁగూడి జమళిఁబూరింప
ఆ. మ. క. ౫. ౨. ౭౧. పా. ౧౭. పం.

రెంట. వి. (√ రెండు) ౧. రెండగుట.

క. కారట్లట్లుగఁ దమ్ముం, జేరిన ముత్తెంపు
సరులఁ జేడియచన్నుల్, లో రెంట లుడిపె.
ఆము. ౫. ౨౩.

ఉ. బంటుతనంబు పెంపెసఁగఁ బచ్చనికార్ముక
మెక్కువెట్టి యా, రెంటరియైనయట్టి శివ
రొౌగ సముద్రము కాదు కోలలన్, రెంటలం
చేసి శిక్షమున నిక్కముగాఁ జలికొండ
కూఁతుపు,ట్టింటికి వెంట గౌరి చన నీకునితోఁ
బలుకున్ సురాధిపా వీర. ౨. ౬౫.

౨. (నీతి) ద్వైధీభావము

గీ. . షడ్గుణములగుచుఁ, జేరకొనఁగాను
దగు సంధిపోరుపోక, యునికి రెంట
ననందన నుగ్రమూర్తి
ఆం. భా. ౨. ౧౯౯.

విణ రెండర్థములు గలది. (శాక్యా.)

గీ. భోగి సహవాస సంబంధములు భజింతు,
భువనభార హస్తంబునఁ బోయుమనుచు,
రెంటమాటల బలిఁ బ్రతారించినట్టి, దంభ
వామన మూమనస్తాప మడుపు.
సైమ. ౮. ౧౨౯.

రెంటఁద్రాగుడుమెకము. వి. (రెంటఁద్రా
గుడు + మెకము) ద్విపము, గజము.

గీ. గాలితేజిమెకంబులు క్రోలుపులుల, కోదమ
సింగములె రెంటఁద్రాగుడుమెకఁబు, అల
భరద్వాజమునిరాజనిలయమునకు, బలకరం
బున్న కోడెల పగిదిఁ జాలిచె.
రామా. ౫. ౫౧.

**రెంటఁద్రాగుడు.** (√రెంట.) వి. ద్విపము, గజము, ఏనుఁగు.

సీ. రెంటఁద్రాగుడు వట్టు రెంటెంపుఠాలుపు తల ప్రుప్వ తంద్రిలో నిలుచు చెయ్యి . ప్రబంధ. ౧౪౩.

**రెంటఁద్రాగుడుతిండి.** వి. (రెంటఁద్రాగుడు + తిండి) సింహము.

క. బలమున రంటెమ బ్రహ్మ,బల మెక్కుడు గాదె బుద్ధిబలమునఁ జేర,చ్చలమునఁ గైదువు వెలిగాఁ, దలఁద్రుంతుం జెండి రెంటఁద్రావుడు తిండిన్. కే. పంచ. ౧. ౩౪౯.

**రెంటవేట.** వి. (రెండు + వేటలు) జీమూలు. (చి. వి.)

**రెంటము.** వి. ౧. రంటెము, జమిలినాలిబట.

ఉ. కుమ్మలు వావ్యవాహములు గుత్తపు మగ్గడితంపుఁ దోఁపు రెం,టమ్ములు దట్టు ఫుస్త మృగనాభియుఁ జాఁదును తోడ . క్రీడా. ౪౬.

౨. పార్శ్వమందలి కట్టు బట్టమదత, రొండి.

సీ. మృతమర్త్య రెంటాన నిద్దఁజాలక నెఱు రంబెల్లు పెనుబొట్టిముంజివాని . . ఆము. ౬. ౧౯.

**రెంటాడు.** స. క్రి. (రెంట + ఆడు.) ద్వివిధ ముగాఁ బలుకు.

మ. భయముం దత్తరపాటు దైన్యమును దోఁపఁజ స్వామి శ్రీరామ మీ,దయకుం బాత్రుఁడఁ గాని రేమిటికి నిద్రాణీణ్యా చిత్తుండనై,తి యథార్థస్థితి రాతనుండనియొ భక్తిం గొల్వ లేదో పితృక్రియలం దేమతియుంటినో పలు కులన్ రెంటాడి తాసైతినో. శ్రీరం. మా. ౨. ౧౭౪

**రెంటెము.** వి. గంటెము, జంటకేతవస్త్రము.

సీ. పుటియల చాకిలి బొలుపైన తలపాలు పన్నగ వివరము బన్నసరము, ఒలుకుల బూది క్రొవ్వలపులజవ్వాది తెలిమి పెంకము పిసాళికుకము, చాటలరెంటెంబు సన్నంపు గంటెంబు భానుపందులచాలు పసిఁడిమాలు. వరాహ. ౯. ౧౦.

సీ. పులితోలు రెంటెంబు వెలిపట్టు గంటెంబుఁ గటిమండలంబున గరిమఁదనర . రుక్మా. ౧. ౭౯.

సీ. పులుగురాయని చట్టు పలవన్నె తోరవట్టు హుంబట్టు బెలుఁగు రెంటెంబుతోడ ఆము. ౧. ౧౭ యయా. ౪. ౩.

**రెండర.** వి. (రెండు + అర) రెండునర, సార్థ ద్వయము.

ఉ. అర్ధమరేయిఁ బోయిరి శివాయని పల్కుచు రెండరామడన్ కాశీ. ౪. ౫౪.

సీ. రెండల యేఁట నొక్కండదధిమాన మిల్లె క్కిన యన్నలతెల్లఁ గూర్చి,కొసఁ బదు మూఁడు పోయనములు దప్పక విన్నటి తోడన నిండె .. భార. విరా. ౪. ౨౩౨.

(వ్రాతప్రతి. పా. రెండేఁడులరకు నొక్కండధి మానము. అని భా. ల. వ్యా. పా. రెండవ యేఁట. ముద్రి. పా.)

**రెండాడు.** అ. క్రి. (రెండు + ఆడు) ౧. రెండు మాటలాడు, అసత్యమాడు.

క. కేలయు నదరము తేజము, గాలియు నాక సము పెఱుఁగఁ గాదితి శాశ్వై, తోలిద రెండాడఁగ నా, వాఙక మీ కులమువారి వాఙక లటవే? ద్వా. ౫. ౧౯౫.

౨. నిందించు (ఎదురుచెప్పు, ప్రతిఘటించు.)

క. రూఢిగ బిజ్జవదను రెం,డాడిన భూపతుల
శిరములనీసుఖమునఁ జెం,డాడుచుఁ గయ్యము
లియవది, యేడన్నలఁగఁ బొడిచె జయమహీ
వల్లభుఁడై.

(చూ. ఆ. సా. ప. ప. ౧) కొణిదన శాసనము.

రెండవసూతకము. వి. (√రెండు) మృతా
శౌచము, మైల.

సీ. ఎట్టి చుట్టంబేని యింటికేతేర రెండవ
సూతకముఁ దెల్పి యవలఁ బొనుపు.

పాండు. ౪. ౧౪౯.

రెండు. స. బొ. ద్విత్వార్థకము.

(దీనికి వృత్తియందు హల్లు పరమగునపుడు ఇరు
ఇను అనునవియు, అచ్చు పరమగునపుడు ఈరు
అనునదియు, వికల్పముగా నాదేశములగును
చూ. ఇరు, ఈరు సమాసమున వర్ణవికారము
వైకల్పికముగానగు. బ. రెండ్లు, రెండులు.)

౯ కొందని పేర్కొ,తోఁ బసిఁడికొండ ధనా
ర్థుల కెల్లఁ బంచి యీ,కుండుట దాన
ధారకుఁ బయోనిధులెల్ల వ్యయింపలేమి
యీ, రెండపకీర్తులం దలధరించినవాఁడు.

వైష. ౧. ౫౧.

మహాస్రగ్ధర. స్వనిలింపావాసదత్త్వాశనదళలమిథ
స్సారకమ్యంబు లీ రెం,డును దీసుల్గాంచు
నమ్మాడువులనె .. ఆము. ౧. ౫౧.

గీ. నాలుగింటను పెండియు నాలుగింట, రెంట
నైదింట మఱియును రెంట నేర్చి, యజ్ఞ శీలు
రారాధించు నట్టి విష్ణుఁ, డిష్టదాయి
ప్రసన్నుఁ డయ్యెడమ నాకు.

భార. శాం. ౪. ౨౨౨.

క.... పెల్చునరయే నన్నుల నా రెంటిని ద్రెళ్లఁగ
నేసెఁ గడుఁగఠి,న హృదయుండై ...

భార. అను. ౫. ౪౯.

క. రెన్నెల్లలోన నాకుం, జెన్నొంద నధీనగాఁగఁ
జేయుఁడు భా. రా. సుం. ౨౦౪.

క. కనబింబమధ్యమున జూ,చినఁ దలలేకున్న
వాఁడు చెల్లును రెన్నె,ల్లను . .

జై. భా. ౮. ౧౦౦.

గీ. ఇంక రెన్నాళ్లు నూచి నీ వంకఁ జూపు,
గలుగకుండినఁ బ్రజలూళ్లు దలఁచి పోవ ...

ఆము. 3. 3౯.

వి. భేదము.

ఛ. పతియెడ రెండులేక కులభామలు కారతఁ
జెట్టిదైన సమ్మతిఁ జరియించు టొప్పు .

భా. రా అయో. ౨౯౩.

రెండాఱుచేతులవాఁడు = కుమారస్వామి

మ. రెండాఱుచే,తులవాఁ డుండిన కొల్లు
టిల్లు గనుమా దోషాచరగ్రామణీ .

ఉ. రా 3. ౬౨.

రెంటికిఁ జెడిన రేవఁడు = ఉభయభ్రష్టుఁడు.

గీ. అనుదినము నిట్లు ప్రాతికూల్యము భజింపఁ,
జండికతమున ముని బ్రహ్మచర్యనియమ,ము
నకు గృహమేధి వర్తనమునకుఁ దొలఁగి,
రెంటికినిఁ జెడ్డ రేవని రీతి యయ్యె ..

జై. భా. ౪. ౧౩.

జ రెంట, రెంటఁద్రాగుడుమేళము, రెంట
ద్రాగుడు, రెంటద్రాగుడుతిండి, రెంట
పేట, రెంటాడు, రెండర, రెండాడు,
రెండవసూతకంబు, రెండుదలఁచు.

రెండుదలఁచు. అ. క్రి. (రెండు+తలఁచు.) కపట
ముగాఁ బ్రవర్తించు.

సీ. పటఘోషణాళివి పీట నున్న యతండుఁ దలి
దంష్ట్రులకు రెండుదలఁచు వశేఁడు .
వై. భా. ౧. ౯౭.

మ. తలయుం గోళయు పీఠఁగాఁ బఱచి సంతా
పంబునం గాళికానిలయుం బొక్కఁడ
చొచ్చి చచ్చిన నుతు స్వీకరించి శ్రీవిష్ణు
భక్తులకున్ రెండుదలంచు ద్రోహులకు
యము ద్భుత గొల్పునే యంచుఁ దద్బలిపీఠో
పలపాతభగ్నశిరుఁడై ప్రాణంబులం బాసి
వన్. వై. భా. ౨. ౧౧౭.

**రెంబ=రెమ్మ.** వి. ఉపశాఖ. (శ. ర.)

**రెక్క.** వి. ౧. పక్షము.

గీ. అతివ చన్నులు జక్కవలగుటకేమి, సంది
యంబింక దండలచాయ నిగుడి, రెక్కలై
యుండ సొంపునఁ దిక్కటిల్లి, వలిపపయ్యెద
యను చిన్నివలను దగుల (యయా. ౪ ౪౩.)

క. గ్రక్కునఁ జని వ్రాలుదునో, రెక్కలుగట్టు
కొని దివిజవిభు మేడలపై
ప్రభా. ౪. ౯౭.

ద్వి. రెండు హస్తము లెత్తి రెక్కలతోడి,
కొండ రివ్వున వచ్చు కొమరు దీపింప ...
రం. రా. బాల ౭౪. పా. దశా. ౧. ౧౪.

౨. పక్షతి, రెక్కమొదలు.

సీ. ... రెక్కనాఁ బక్షతియగు .
ఆం. భా. ౭. ౯౯.

జ. రెక్కచాఁపు, రెక్కతలుపు, రెక్కలతేజి,
రెక్కపాయ.

**రెక్కచాఁపు.** వి. (రెక్క+చాపు.) అంతటి
పొడ్తతీరుముల జత. (చి. ని.)

**రెక్కతలుపు.** వి. (రెక్క+తలుపు.) ద్వారమున
కిరుప్రక్కలనుండు రెండుపలకలతో చేర్పబడిన
తలుపు. (చి. ని., బ్రౌ, వా.)

**రెక్కలతేజి.** వి. (రెక్కలు + తేజి.) గరు
త్మంతుఁడు.

ద్వి. శ్రీసతివిభుఁడైన శ్రీరంగశాయి, మెచ్చి
రెక్కలతేజిమీఁద సొంపార, లచ్చితోఁ
గూడ నల్లను పల్లవింప, నారూఢుఁ
డగుచు ద్వి. పరమ. ౭ ౪౯౪. పా.

**రెక్కపాయ.** వి. (రెక్క+పాయ.) రివటపాయ.
(చి. ని.)

**రెక్కొను.** అ. క్రి. (రేకు+కొను.) ౧. వర్ధిల్లు.

సీ. దిక్కులముల మోచి రెక్కొందమని
నుమీ యలదరుల్ దాము గోరాడు
చుండు సారంగ. ౧. ౭౭.

మ. అలరుంగైదువు దారనీట జనితంబై పల్లవ
స్వాంతపుం, బులుచే రెక్కొని కొమ్మ యూర్పు
వలి గాడ్పుం బ్రోది సస్యాపి బోదలపై
నెక్కి తపంపుటిం ధనముఁ, గొంటమ్మ తప్పితా
పాగ్ని చంద్రా. ౩. ౬౧.

౨. తేఱుకొను. (శ. ర.)

(వ్యవ.) ఒకఁడు జబ్బుపడి యింతవు రెక్కొన
లేదు.

**రెక్కొలుపు.** స. క్రి. (√రెక్కొను.) వర్ధిల్లఁ
జేయు.

సీ. అరవి యాపగవారికైనఁ బ్రోవఁగఁ జాలి
కుజనులకైన రెక్కొలుపఁ జాలి ...
చంద్రా. ౪. ౭౦.

**రెక్కోలు.** వి. (√రెక్కొను.) రెక్కొనుట.
(శ. ర.)

**రెచ్చెరించు.** స. క్రి. (√రెచ్చు.) రెచ్చఁజేయు.

గీ. అదవిఁ దడవిల్లుఁ గైకొని యమ్ముఁ దొడిగి,
పొంచిపైఁ బంచి విను రెచ్చరించి మంచి,
మెకముఁ బడవేసి విచ్చలు మెచ్చఁజేయు,
నట్టి నాయకురాలిఁ బాయంగఁ దగునె
వాల్మీ. ౨. ౧౨౫.

రెచ్చించు. స. క్రి. (√రెచ్చు.) రెచ్చరించు. (చి. వి.)

రెచ్చిల్లు(లు). అ. క్రి. (√రెచ్చు.) విజృంభించు, చెలరేఁగు. (చి. వి.)

రెచ్చు. అ. క్రి. విజృంభించు.
గీ. మచ్చికలుచేసి డాయుచో రెచ్చిపాఱుఁ,
జెలఁగి యగ్గారడంపుఁ బసిండిజింక
అచ్చ. రా. అర. 43.
రగడ. మోడు మోదుగపువ్వు రెచ్చెను, మున్ను
మున్నరకైక మచ్చిరి
వాల్మీ. 3. ౧౧౪.
సీ. త్యాగియైనట్టి సంతానంబులకు రెచ్చి గతిలేమి
పెట్టిన గడుసుఁదనము. మ. చ. ౨ 3౭.
జ: రెచ్చరించు, రెచ్చించు, రెచ్చిల్లు.

రెచ్చెల. విశే. వేగడాలమారి (శ. ర.)

రెట్ట¹. వి. పక్షిమలము.
సీ. పెనుదవ్వు దగ డొట్టఁజని రెట్టఁ బడఁ
గొట్టె నుదుటిపై శేకుపక్ష నొక్కయుఱుజా.
మను. ౪. ౫౬.
గీ. పవనమున నిండి వానల పదనుగన్న, రజను
పై గూళ్లుపెట్టిన ద్విజగణంబు, రెటలో
విత్తుపడి యంకురింప శుక్రశిష్యశేఖరు చెవు
లలో చెట్లుమొలచె. దశా. ౪. ౭౮.

రెట్టఁబెట్టు = రెటవేయు. (పక్షి) మలవిసర్జనము చేయు.

ఆ. అచట రెట్టఁబెట్టె యతిక్రోధయమునాగఁ,
దడయ కరిగెనంత దానిరెట్ట, శిలలసంధిఁ
బొంద మొలచె నందొక వటవృక్షజఫలము
లోనిబీజముండి. కేయూర. 3. ౭౫.

రెట్ట². వి ౧. భుజము.
ద్వి మఱుఁగుఁ జొచ్చిన సుకుమారసుమారుఁ,
గుదికిలఁబడ రెట్ట గుదియించి తిగిచి
ద్వి. హరిశ్చ ఉ. ౯౧౧. పం.
క అని బెట్టిదంబులాడుచు, జనపతి చూడంగ
నురుచి నవతిగొడుకుఁ బయ్యాట రెట్టఁబట్టి
పామ్మని, వెనుకకుఁ బడఁద్రోసి వీఁపు క్రేసం
బెలుచన్ వి పు. ౭. ౧౫.
గీ. అలుకచేసుండ బుగ్గలు నులిమి తిట్టి, తొడలు
వడిపెట్టి కోదండమదరఁగట్టి, రెట్టలెగఁజెట్టఁ
బట్టించి కొపుమాఱుఁ, గొట్టుబెట్టుగ నజ్జన
కోలదెగను. హంస 3 ౧౪౧.
౨. పక్షిరెక్క. (చూ. రెటకట్టు)
జ: రెట్టకటు.

రెట్టకట్టు. వి. (√రెట్ట²) రెక్కల యాకృతి విశేషము, రెక్కలమార్పు
సీ. వెడదనన్నపుటత్తె క్రేళ్లుబ్బు చెక్కిళ్ల రెట్ట
కట్టెదుటి మిట్టబోర. ప్రబంధ. ౧౯౧.

రెట్టి. విశే. ద్విగుణము.
చ. పొరిఁబొరిఁ బ్రీతి రెటిగ నపూర్వవిలోకన
మాచరించు ... భార. విరా. ౧. ౭౦౯.
అ. . జాది, యద్భుతంబు రెట్టియై జనిరప.
హరి. పూ. ౮. ౧౯౨.
సీ. మైనిండు పాలేని మగ్గంపుఁ బక్షచకల్ బూది
పూతకు రెట్టిపుట్టసేసు ...
చంద్రా. 3. ౮౯.
ఉదా: రెండురెట్లు, మూఁడురెట్లు.
జ: రెట్టించు, రెట్టింపు, రెట్టిరాపుడు.

**రెట్టించు.** అ. క్రి. (√ రెట్టి.) ద్విగుణముగు, ఇనుమడించు.

క. విబుధామణాశపత్త్రధ్వజకంకటఖండ వేష్టితము
లైన మర్త్యప్రజాగాత్రకళేబరములు వారిజనాథ
కనుంగొనంగ రెట్టించె వగల్.
భార. స్త్రీ. ౨. ౫౩.

శా. శ్రీరమ్యాంఘ్రియుగంబు గింజారాముచుం
చెల్వంబు రెట్టింపఁగన్ .
హరి. పూ. ౫. ౧౪౦.

క. విట్టూర్పులు దళుచయ్యెను, గట్టులకొనకలికి
కలికి కన్నుల యందున్, రెట్టించె ధవళ
కాంతులు, పట్టుగఁ గనుఱెప్పలలస
భావముఁ జెందెన్. జాహ్నవి. ౧. ౯౧.

స. క్రి. ద్విగుణము చేయు, ఇనుమడించు.

సీ. తరువాత నదిమొదల్ దప్పక రెట్టించి .
అప్ప ౪. ౧౪౩.

వ. . ఉత్కృతియందుఁ బుట్టిన సమవృత్త
సంఖ్య రెట్టించి అప్ప. ౪. ౧౩౯ టీక.

**రెట్టింపు.** విశే. (√ రెట్టించు.) ద్విగుణితము.

సీ. రెంటద్రాగుడు చట్ట రెట్టింపుకోలుపు తల
పువ్వు తంత్రిలో నిలుచుటయ్యె.
ప్రబంధ. ౧౫౩.

**రెట్టిత్రావుడు.** వి. (√ రెట్టి ) ద్విపము, ఏనుఁగు

వ. ... పదయుగవఖాంచలంబులఁ జంచచ్చం
చూపుటంబుల రెట్టిత్రావుడు బొబ్బ మొకము
దద్భిన్నాశ్లి మొకంబుల నిరీక్షించి కళచుక
యుప్పరంబున కుప్పరం బెగసి మల
సిలయొల్లి పులినతలంబుల ఖజ్జాగా నజ్జాగఁ
జెందు గండభేరుండకాండంబులును.
ప్రబంధ. ౧౭౨.

సీ. ... చెలఁగి ఱంకెలువైచు కెలిగిబ్బ మావు
తోడావంత సోఁణబో మిటారితోడ, రెట్టి
త్రావుడుగాను చట్ట దువ్వాలుకతో ...

గీ. యతఁడవక్రోపాల పేరఁడు ప్రత్యక్షమయ్యె.
శ్రీరం. మా. ౪. ౭౦.

**రెట్టు.** వి. మడుంకబట్ట. (శ. ర.)

**రెడి.** వి. రెడ్డి .

క. చాలు బిసాళింపకుమని, యాలరి రెడిసాని
మగని వదలించి మతుం, డాలుము నీవును
నిచ్చోఁ, దాలిమి వసియింపుమని యతని
లాలించెన్— కేం. పంచ. ౪. ౪౨౩.

**రెడ్డన.** వి. (రెడ్డి + అన[1]) రెడ్డన్న, రెడ్డి

క. ఈ రీతినుండి యొకనాఁ, డా రెడ్డన పనికిఁ
దలఁగు లమరించుటకై, నారలు గావలెనని
పోరు, గూరికై పోయి మట్టియూదలు
జేరన్. శుక. ౨. ౩౩౭.

**రెడ్డి = రడ్డి.** వి. (ఏకవ్యముకు నిర్ధారక ప్రయో
గము కన్పడలేదు.) కాఁపులలో నొక తెగ
వాఁడు, గ్రామాధికారి.

గీ. దొడ్డయేశ్వర వినకోటరెడ్డి విభుల
కాశీ. ౧. ౨౪.

గీ. రెడ్డికొడుకైన యొకయొడ్డబోడ్డిగీఁడు, పొల
ము దోఁకరి కాళ్లుమబోతువంటి, వాఁడయొ
దాని మగఁడఁట వాణిమగని, కొంత
చెడిపోయెనో బుద్ధి యొట్లుగూర్చ.
ఉ. హరిశ్చ. ౪. ౧౨

మ. మేఁ, కొరవుం గుంపటి మంచమెక్కి రి
ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్ ;
ఆము. ౪. ౧౩౪.

గీ. అనిన నలఁతిగఁ గోల్పోక యతఁడు రెడ్డి,
రాజుఁ గనుసని ఆము. ౬. ౭౩.

జ. రెడ్డన, రెడ్డిపాలవంశాలు, రెడ్డివంశాలు, రెడ్డి
వారి వానప్రాలు.

**రెడ్డికము.** వి. కూర్చుండుటలోని భేదము. ముడుచుకొన్న యెడమకాలి తొడమీఁది పైఁగాలుమీఁదుగా ముడుచుకొన్న కుడికాలి పాదము జొనిపి, ఆ కాలిని వీఁపును వస్త్రముతో బిగించి కట్టుకొని కూర్చుండుట. ("రెడ్డిగము" అని శ. ర.)

వ. . నలువకు రాజధానియైన మనోవత్ నగరంబు దనకు మణికిరీటంబుగా మెఱయు నగరాజంబునకు రెడ్డికంబునం బోలె నొడ్డునం బదివేల యోజనంబులు పొడవున ముప్పదివేల యోజనంబులునై చుట్టి వచ్చి వియచ్చర ప్రవాహంబగు చక్రవాళంబున సూర్యాది గ్రహములు సంచరించు

కళాపూ. ౧౦ ౧౧౪.

**రెడ్డిపాలవంకెలు.** వి. బ. (√ రెడ్డి) ధాన్యవిశేషము.

సీ. పచ్చసరుల్ రెడ్డిపాలవంకెలు సుఖభోగులు పచ్చకర్పూరసరులు . హంస. ౪. ౧౨౭.

**రెడ్డివంకెలు.** వి. బ (√ రెడ్డి) ధాన్యవిశేషము.

వ. . పనప్రగన్నెర్లు గుత్తిబలుగుకుల్లు రావిపూరాజనాలు పొన్నశ్రీరాజనాలు నివ్వరులు నీరుకావులు రెడ్డివంకెలు చాటవరులు తీఁగెమల్లెలు సుఖభోగులు .

ప్రబంధ. ౧౧౨.

**రెడ్డివారినానఁబ్రాలు.** వి. (√ రెడ్డి.) ఒకానొక యోషధి. కై. (శ. ర., బ్రౌ., వా.)

**రెపరెప.** వి. ౧. నిప్పు మండుటయందగు ధ్వన్యనుకరణము. ౨. గాలి వీచుటయందగు ధ్వన్యనుకరణము. (శ. ర.)

**రెప్ప = ఱెప్ప.** వి. నేత్రపక్ష్మము. (శ. ర.)

ఉ. అప్పుడు భీష్ముఁ డేమి హృదయంబున నమ్మలికమ్ము గూరఁగా, రెప్పటి చంచముల్ విడిచి రేఁడెత్తుఁ డక్కున చూడ్కులొండొరు, ద్రెప్పలపాటునం బోలయ నీ నుతుపాలికి వచ్చు రాజులం, దిప్పు దశందు రావలనదే యని కర్ణుఁ దలంచి రందఱుణ్.

భార. ద్రో. ౧. ౧౪

ఉ. కోరిక ఱెప్పలెత్తుచును గొంకున నంతనె రెప్ప వ్రాల్చుచున్ దశా. ౨. ౨౬౭.

**రెప్పము.** విణ. పూర్ణము.

శా. ఆలోకించెదు శార్ఙ్గము త్రపటుబణౌఘంబుచే నీ మొనల్, కేలం గూలఁగ ఫాలపాలికలలో నిండారు రక్తంబులన్, గ్రోలంగెలిఁ బిశాచబాలికలు గైకొన్నన్ మణిశ్రేణితోఁ, గ్రాలంబట్టిన వెండికోరల గతిన్ గప్పంబు రెప్పంబుగాన్.

ఉ. హరి ౪. ౧౯౫.

(శ ర., వీరేశ. పా. వావిళ్ల పాఠము. కప్పంబు లొప్పంబుగాన్.)

**రెపరెపమను.** అ. క్రి. (జఠరాగ్ని.) మండు, ఆఁకలియగు.

వ్యవ. వానికిఁ గడుపులో రెపరెప మనుచున్నది.

**రెప్పాల.** వి. వన్యవృక్షవిశేషము.

(పొదిరివంటి యాకులు గలది. దీని యాకు కారముగ నుండును. ఈ ప్రాణి పలకదంతము వలె ధవళమై స్నిగ్ధమై యుండును. చి. వి.)

ద్వి. కోల కుంజములు నజోల కుంజములుఁ, బాల ప్రాఁకులును రెప్పాల ప్రాఁకులును.

ద్వి. పరమ. ౨. ౫౪. పా.

**రెబ్బ.** వి. రెమ్మ, ఉపశాఖ.

ఉదా. రెండు కణుపుల రెబ్బలు రెమ్మ.

సీ. రమ్మ రెబ్బ రివట రివ్వ రెలగ చివ్వ ..
ఆక మహశాఖ పెలగు ...
ఆం. భా. ౨. ౩౪.

రెబ్బు. స. క్రి. సంహరించు, చంపు.

క. ఉబ్బఁడు లిబ్బులు గలవని, రెబ్బఁడు రిపు
రాజుగాని రేఖలవలరా, యబ్బఁడు పర
భామినికై, యబ్బఁడు శ్రీపాదరేణి
యబ్బఁడు ధాత్రిన్. బహు. ౧. ౨౦.

సీ. పంచవన్నియడాలు పట్టించెనే రాజు పర
వీరభద్రేభ పటలి రెబ్బ .. బహు. ౧. ౫౫.

రెమ్మ = రెంబ. వి ౧ కొమ్మ, ఉపశాఖ.

సీ. సురభిళశ్వసనంబు సొరచె సింధుకవల్లి
గ్రుచ్చెఁ దావులు సోఁకఁ గ్రోవిరెమ్మ ...
వసు. ౧. ౧౫౬.

సీ. కామితఫలములు ఘటియింప కేలుపోడు
పెంచిన చెట్టురెమ్మ కొమ్మ
దశా. ౩. ౩౫.

ద్వి. కులుకుముద్దులగుమ్మ గొజ్జంగిరెమ్మ ..
నల. ౧. ౫౭౪. ఆం భా. ౨. ౩౪.

౨. పూరేకు, పుష్పదళము.

సీ. కేనియ బాష్పంబు నూనియ జిగిఁజిమ్మ
కమ్మిపూరెమ్మదోదుమ్మి కత్తి . .
ఘటికా. ౨. ౨౫.

మ. తలఁచు ల్వేయు నిఁకేల యా తెలుప యా
దానిమ్మపూరెమ్మ యా, సెటఁగ క్రంపుట
వంటి క్రొమ్మొల్లలు . .
అచ్చ. రా. బాల. ౧౩౯.

రెమ్మ. స. క్రి. దృఢముగాఁ బట్టుకొను, బడిసి
పట్టు.

ఉ. ఇగ్గడు చెక్కుకుం బయికి నీడ్చెఁ జైటఁ
· దొలఁగఁజేయఁ గ్రాలుగ్గడు రెమ్మి పోఁక

ముడి యూడ్చెఁ గ్రంగులి రెండుకొంగు
లున్, బిగ్గ నదంచుచున్ విడిచిపెట్టదు ....
విజ. వి. ౨. ౩౦.

ఉ. బల్లిదపుర్ వరాహములు భద్రగజంబుల
మీఁద దాడికోఁ, జెల్లఁగ జెక్కు వాని
కొసవెంట్రుక యొక్కటి రెమ్మి తీసినన్,
జిల్లన వెల్లిఁబో చమురు చిమ్మిన గ్రోవిని
జిమ్ము కైవడిన్ సారంగ. ౧. ౪౧.

గీ. రెమ్మచును బొంచములు గూర్చి రెండు
కడల, నిరికి గళకర్తరలు గట్టు పెటేఁగి
కూడ, తిరుగఁబడి కురుల తెగరల్ దీకొను
గతి, సురిది తలఁ దలఁ దాకించు నొకరి
కొకరు. ప్రబంధ. ౭౭.

సీ. కడవసంబుల రెమ్మి పెడమర్లుగాఁ బట్టి
గూనవో వడిపీఁపుఁ గొట్టి కొట్టి
వాల్మీకి. ౨. ౯౬.

సీ. కొదమసింగపుఁడొంక కొనవ్రేళ్లఁ బిగిబట్టి
వదలక పదరెమ్మువాలు మగలు .
సానందో. ౩. ౫౩.

రెల్ల. వి. ౧. ఎన్నులోనిభాగము, కణిశైకదేశము.

సీ. అవనిపంకము పొంకమణిదులదులనయ్యె
కొల్లు రెల్లలఁబువ్వ మొల్లమయ్యె ...
పద్మ. ౯. ౨౨౬.

సీ. కణిశైకదేశంబు గనుపట్టు రెల్ల నా ...
ఆం. భా. ౨. ౨౩౪.

౨. సిక్థకము, మైనము. (శ. ర.)

రెయి = రేయి. వి. రాత్రి.

చ. పూర్ణిమలఁ బికాళిఁ గట్టుమర
త్రిక్కుఁగ ధర్మపుదారవట్టు, రేమము రెయి
మల్లికాళిమతి చక్కఁగఁ జేయకయుండ
నిల్పు నాయమ మఱునాఁటిదాఁ గలంగ
నాంతగళచ్యుతి గుభికాత్రుపుల్.
అము. ౫. ౧౫౦.

ఉ. ఈ రేకోనిధి కర్ణమై, రాతిరిసక్రాంతిఁ
జెందరామి యనుచు ఖద్యోతు రెయి
నరచిఁ జేయ విధాత కరిం గదచి నీప్రకా
శము గాకే .. ప్రబంధ. ౧౮౫.

గీ. అవని మరభామయును బోలె నద్దమరెయి,
స్వప్నమున వచ్చి కరుణాప్రసాదమునను,
గవిత నాకు నొసంగు శ్రీకంఠసాధ్వి,
భ్రమర వినుతింతు వాక్పాధిపమును
మెఱయ. కుచేల. ౧. ౬.

క. రెయ్యీను బగలును సరకపుఁ, గ్రయ్యలఁ
బడి వెదలనీఁదఁగానక మేనింతయ్యా .
పద్మ. ౨. ౧౫౪.

(ఇట. రెయి + ఈను. అని పదచ్ఛేదము)
జ రెయివెల్గు.

రెయివెల్గు. వి. (రెయి+వెల్గు) చంద్రుఁడు.
చ నెల రెయివెల్గు చెంగలువనెచ్చెలి .
చంద్రుఁడగున్ మహేశ్వరా
ఆం. భా. ౧. ౪౪.

రెల్ల. వి. ౧. వరి మొ. వాని యెన్నులో నొక
భాగము ౨. మెరుకు. (శ. ర.)

## రే

రే1=రేయి. (సం. రాత్రిః) రాత్రి, నిశి

క. పలుకులఁ బనిలే దీ రే, తలపెట్టకపోరువా
రుదగ్రత నేమం, బలము మెఱయఁ బాంచా
లురఁ, బొలియింపక కత్తరింబుపుచ్చ
నరేంద్రా. భార. ద్రో. ౫. ౩౪.

క. నా విని నుబలకనూజుఁడు, దేవా నీయాన
యేమ దల్లంబుగ రే, యీ నెరవ నెమ్మ
నమ్మున, భావించితి వనిరయు ...
భార. అర. ౫. ౩౫౭.

చ. . బంగరువుమేడల నోరణగండ్ల నెంట
రే, ల్పనితొడు రిక్క మొత్తమును ...
నీలా. ౧. ౨౯.

ఉ. ... పంక్తికంబుఁ డాఖీలభుజాప్రతాప
మును బెంపును మీఱఁగఁ బోర వారితో,
రేలు బగళ్లు నా కనలి రేఁగి పెంగిం బది రెండు
మాసముల్. ఉ. రా. 3. ౩౪౫.

జ. రేకంటు, రేగాము, రేచీకు, రేచీఁకటి,
రేకోతి, రేదొర, రేద్రిమ్మరి, రేద్రిమ్మరీఁడు,
రేపులుగు, రేమగఁడు, రేయెుంద, రేయేలిక,
రేరా, రేరాచరిక, రేరాచతాయి, రేరాజు,
రేరాయఁడు, రేఱేఁడు, రేవగలు, రేవ
లుఁగు, రేవెలుఁగుతీవ, రేవెలుఁగుతాయి.

రే2=రె. అవ్య. ౧ ప్రశంసార్థకము.

(బలిమొదలగు ప్రశంసార్థకశబ్దముల కనుప్రయు
క్తమై యుండును. కొన్నిపట్ల నట్లుగాకయు
నుండును.)

క. . ఒక్కకటన, రెంటిం బొదువంగ
వలయురే వరవారస్ ...
భార. అను. ౧. ౨౨౩.

౨. సంతాపార్థకము.

క. సైరింపరాని శోకము, కారణముగ నాదు
తనయ కాంతారములో, మారుతసుఖు
పాల్పడియెుడు, జారే ..
దశకు. 3. ౪౭.

ఉ. కొమ్మను నేలకొమ్మ కడికుందనమీనును
మమ్మ రమ్మరే .. ప్రబంధ. ౪౦౦.

రేఁగు1. అ. క్రి. ౧. ఎగయు.

సీ. దూళ్లమక్కక్క మంగళ్ల తిప్పలు రేఁగు
వడుంపున గాలి జాడెడు సెలకలు ...
అము. ౬. ౧౪.

చ. గుణమున లస్తకంబునను గోటియుగంబునఁ
గేలఁ దార ధీ,మణముగ నుప్పతిల్లి రథసం
ఘమున రేఁగినమాడ్కిఁ దీవ్రమార్గణనికరంబు
లొక్కట నరాతిబలంబులఁ గప్పు ...
భార. విరా. ౫. ౩౦.

గీ. రాజసంబున హస్త్యశ్వరథపదాతి, పాద
ఘట్టన మేరువు మీఁదఁ బడిఁడి, బూడిదలు
రేఁగ నొకవాఁడు దాడిపెట్టి
వరాహ. ౬. ౧౭౯.

౨. విజృంభించు, చెలరేఁగు.

క. గాంధారేయులు పెన నొక్కపెట్టు
రేఁగి యతనిపైఁ, గోయని కవిసిన
భార. భీష్మ ౨. ౧౦౦.

గీ. రాత్రి వచ్చెను జీఁకట్ల రాణమీఱె, మన్మ
థుఁడు రేఁగ కోదూతి మఱుఁగు లేల, పూని
యున్నది నా బుద్ధి వానిమీఁదఁ, దగిన
పనిఁజేయు మా వేళఁ దాళలేను.
గంధ. ౧౪౩.

క. ఏ పెనఁగ రేఁగి యట్ల, ప్పాపాత్మకమగు
కిరాతబలము సమగ్రాటోపమునఁ గవిసి
వివిధ ధనాపహరణ మాచరింప నారం
భించె. భార. మౌ. ౧౦౮.

ఉ. రేఁగి చకోరదంపతులఁ ద్రేల్చిన కల్మష
పంక మిందులోఁ, దోఁగినఁగాని పాయదని
తోయజబాంధవుఁ డిట్లు చేసెనో, వాఁగఁ
గ్రాంతినొంది కిరణంబులు వేఁడిమి దక్క
శైత్యముల్, గాఁగ రథాంగముల్ బెదరఁగా
నపరాంబుధిఁ జొచ్చెఁ గెచ్చెరన్.
భోజరా. ౨. ౯౦.

౩. ఊఁబుకు, పైకివచ్చు.

చ. ... గోవుల పాదహతిన్ మహీతలం,
బనయముఁ గ్రుంగిపట్టబడి యప్పుడిచుట్టున
మాటఁ రేఁగి భోరన నట జాలుహాటి నడుశై
చన ... కు. సం. ౭. ౯౧౧.

౪. కోపించు, ఆగ్రహించు.

చ. అని నను నమ్మునీంద్రుఁ డదయన్ శపియించిన
రేఁగి మత్సఖుల్, చను నె శపింప నక్కట!
విచారవిహీనుఁడనై తివో తపంబున బొలి
యించి తించుకయు బుద్ధికమంబు భజింప
లేవ ... మార్కం. ౫. ౨౯.

ఉ. .. వాఁడు రేఁగి మతిపెట్టుడుఁ జెట్టు
ననంగ మిట్టఁగూ,పెట్టుచు .
ఆము. ౬. ౪౦.

చ. అనిమిషనాథుఁ డిట్టి పనికై నను బంపెఁ ద
దీయకార్య మే,యనువునసైనఁ జేసి హృద
యంబున సంతసమందఁగందునో, ముని
వరు మోసపుచ్చుటకు ముందఱనిల్వ నతఁడు
రేఁగి శాపమ్మునమునఁ గందునో చుట మానితి
చేని బలారి గందునో.
చిత్ర. భార. ౨. ౧౧.

౫. అతిశయించు, వృద్ధినొందు.

ఉ. మక్కువ రేఁగి పెయ్యప్పుఁ గుమారునిఁ
జెంపుట కంతరాయమై, యక్కటికంబు
పుట్టుటకు వల్లన వచ్చి భవాని . .
హర. ౨. ౧౪.

క. వాఁగటఁ దగిలిచి తగిలిచి, ద్రేఁగగు కోఁకలి
యమర్చి ద్రేయుచుఁ దోడ్తో, రేఁగడు
దర్పము బాసటగాఁ గూర్చెను బగులపెల్లఁ
గడుఁ జోద్యముగాన్.
— హరి. ఉ. ౬. ౧౨౪.

సీ. మరియు చేపట్టిన కూరత్వము రేఁగు నీచ
వర్తను పొందు నిందకొలుపు ...
నీతి. ౫౨.

ఉ. పర్వపుఁ గాలమూర్తి జలదప్రతతుల్ తోఁ
బవనంబు రేఁగి యం,తర్వలనంబు సేయ... హరి. పూ. ౫. ౪౪.

౬. (పుండు మొదలగునది) అఘాతాదులచే వృద్ధి
పిఠమగు.

వ్యవ. గోద తగిలి కురుపు రేఁగినది.

జ. రేఁచు, రేఁచుకొను, రేఁపు.

రేఁగు² = రేను. వి. బదరీవృక్షము.

క. సంగరకేళి నతం డీ,భంగిని విహరింప గాద
పతిసేనయుఁ దా,నుంగలగి పాతె రేఁగులు
దంగేట్లఁగఁ ద్రొక్కికొనుచుఁ దద్దయుభీతిన్. కళా. ౮. ౭౪.

వ . ఘూర్ణమానంబులగు పరిగ పక్కపలు
మేరు రేఁగు మేము మొదలగు పాద
లన్ .. మను చ. ౪. ౩౭.

రేఁగుడు. వి. లింగపాట్ల ౕ. (క. ర.)

రేఁచు = రేపు. స. క్రి. (√రేఁగు¹) ౧ ఎగ
యుఁజేయు, ఎగురఁగొట్టు

సీ. చలిగాలి బొండుమల్లెల పరాగము రేఁచి
నిబిడంబు సేయు వెన్నెలరసంబు . మను చ. ౬. ౨౯.

సీ మరగాలి దవదగ్ధతరుపర్ణతతి రేఁపఁ బావు
రాలని దేగ పడుపు దూతె . ఆము. ౨. ౪౬.

౨. చెదరఁగొట్టు.

చ. ప్రకటమహోరువాగ్రములు ప్రాఁకుచు జున్ను
లు రేఁచి తేనె గో,పకులకుఁ బోయుచున్ . హరి పూ. ౫. ౨౫౩.

ఆ. కానజున్ను రేఁచి తేనియసమకొన్నఁ,
గ్రోలుచున్నవాఁడు చేలఁగాఁడె .. భా. రా. యు. ౧౦౯.

చ. ... వనంబున జున్ను రేఁచి తి,య్యని మధు
పానమొల్లక రయంబున నొండుల పాలు
సేయుచే .. భోజరా. ౪ .౭౪.౨.

౩. పురికొల్పు, ప్రేరేఁచు.

చ. కనభుజసత్వ మెక్కడ మధుకృతదిక్కరి
విక్రమప్రభ,ర్తను ననుఁ దాఁకు టెక్కడ
విధాత కడుంజెడ రేఁచెనో సుమీ . కళా. ౬. ౨౧.

సీ. పాటఁ బాటిగఁబాడి పరభృతమ్ముల రేఁచి
కూఁతలు కేయించెఁ గొమ్మ యొకతె .. చంద్రా ౩. ౯౭.

చ. ఉపాయపుఁ బ్రేలరి మాటలాడి ధీయల
మదికైన నూరక వినోదమొనర్పుచునంతః
రాజులం, బెలుచన రేఁచి తెచ్చి తలపెట్టు
వినోదపుఁ దీఁటపోవఁగన్ హరి. పూ. ౫. ౯౨.

౪. కోపింపఁజేయు.

చ. వినుమరిఁ జంపనుం దెరప పేమట లెస్స
ప్రతాపభావణం,బున వెడనల్లి కట్టులను
బొంతుల వానిఁ గలంగఁజేసి రేఁచిన దన
పూఁపుదప్పు ... భార శాం ౩. ౭౦.

గీ. వారికంటె నీకేమిటివలనఁ దక్కు,వేల
చెప్పెడిమాటల నిట్లు నన్ను, రేఁచె దేనిచ్చు
వరము సంప్రీతిఁగొనుము, పుత్రు జగదేక
వీరుఁడౌ బొలఁతి గనుము. హరి. పూ. ౯. ౭౭.

౫. అతిశయింపఁజేయు, ఉద్రేకింపఁజేయు.

సీ. అల యంచఁబట్టి తెమ్మని కొర్కి రేఁచి నిబ్బ
రపుటీంతల నీటఁదిరుగనేర్పె ఉ. రా. ౬. ౯౪.

చ. ఒకపాలడిండి తొయ్యలికి నొయ్యనవ్వుల
నాస రేఁచి యొ,పిక నది యుచ్చరా నెదురు
వెట్టు చంద్రా ౧. ౨౬.

౬. పుట్టించు, కలిగించు.

చ. కుటిలకటాక్షవీక్షణము( గోమలమూర్ఛకపో లరాగమున్, బటులసమంచితభృకుటిసంకళ నంబున జూచుచేడుకన్, జటపాటరేఁచె రాజసరసీరుహాక్షి రశన సైమ. ౧. ౪౨.

రేఁచిపెట్టు = రేఁచు. ౧. ప్రేరించు.

క. కర్ణుండు రేఁచిపెట్టఁగ, దుర్ణయపరులైన శకుని దుశ్శాసను లీ,నిర్ణయమె మేలనఁగ నీ, కర్ణములకు నింపుసెట్టు కార్యవచనముల్.
భార. ఉద్యో. ౨. ౨౪౧.

(ఇట పురికొల్పు అని యర్థము.)

౨. అతిశయింపఁజేయు.

సీ. పది ప్రశ్న ములకైనఁ బ్రత్యుత్తరముఁ బొందఁ జూచు వీనులకింపు రేఁచి పెట్ట .
కవిక 3 ౨౨3.

రేఁచుకొను. స. క్రి (రేఁచు + కొను, స్వార్థమున) అతిశయింపఁజేయు

ఉ. కయ్యపువేడ్క రేఁచుకొని క్రమ్మఱు తమ్మి దిరించి యేమియున్, దయ్యక కొంతసేపు పెనుడాకను జేతులకాఁటినిల్పువాఁ, డయ్యె దఁబోటు బంటునకు నంతయుఁ గాతుక కారిగాఁడె నీ,వ య్యసురేంద్రులోడి యని కాన యొనర్పుట యుక్తమెన్నఁగన్.
ప్రభా. ౨. ౫౯.

రేఁటెము = రెంటెము. వి. జంటపోగులవలువ, జమిలినేఁతబట్ట.

మ. ... మంచిముత్యాలపేరులు మైభోగపురేఁ ఁటెముల్ పసిఁడిచేరుల్ పల్లకుల్ లోనుగా, సులభా చేసి యయాతిం దలఁపులో నుపాంగుదుం గూర్మితోన్.
యయా. ౫. ౭౫.

రేఁపు = రేఁచు. స. క్రి. (√ రేఁగు1.) ౧. రేఁగఁజేయు.

గీ. నృపులతలఁపు రేఁపె నప్రుడు మాధుపదపాంగ, సాన పెంపదేరిన యనంగశర మనంగ .
రా. వి. 3. ౧౨౯.

చ. గురుసతిఁ గూడు రట్టునకుఁ గొంకని కూడు విరోగి నీసము, తక్కరముల కీడుచూచుటకు దర్పకు రేఁపెడు కట్టు చేఁదుంతె, మ్మిరలకుఁ దోడు చిత్రజగతి మిన్నులఁబాకెడు మాయలాడు పెన్నిరులను పోడుకాలంకొని యేర్పు వెలుంగుల వీడు వీఁడునో.
వరాహ. ౪. ౨౪.

౨. పుండు మొదలగు వానిని అపూతాదుల వలన నుద్దీపితము గావించు.

వ్యవ. కుఱుపురేఁపకు

3. వి. ప్రేరణము.

ఉ. శేఁ, డీయెడ వానివచ్చునని యొంచక యూరక పిట్టరేఁపుచే, నీయన కన్నుగాన కిపు డిచ్చుటవచ్చునె . సారంగ. ౨. ౩౧.

రేక. వి. (సం. రేఖా.) ౧. గీఱ, గీఁత.

సీ. తిగరేక తెర్పడ దిద్దినవోసలి నుస్వాలిబూది బొట్టు రంగులు సెలంగ .. నీలా. ౧. ౩౦.

క. బలజంభరుధిరపఙ్కి, దోలఁచిన పెన్నిటి రేఁకతో నినివది యొం,తలరునో నిర్యత్కుం కుమ, లలాటరేఖావిభావి లలన లనగుచున్.
కకు. 3. 3౫.

సీ. నడిముక్కు మీఁద సన్నపునాభినాముంబు నడుమ మంజిడి కావినిడుదరేక ...
వైజ. ౨. ౫౪.

౨. (కత్తిమొదలగువాని) వాఁటు, తుతి.
(చూ. రేకపోచు.)

౩. నిరంతరపంక్తి, వరుస ఇదియు రేక యనఁబడు వృక్షలతాదుల వరుస.

సీ. పెట్టెంబు పట్టిన పెమ్మిదీపంబును దండ కావ రేక రొక్కంపు గుదియకుండ ...

హర. ౬. ౪౫.

గీ. రేకయనఁగను రేఖయై రీతిగాంచు ..

ఆం. భా. ౨. ౩౪.

౪. నాట్యగతిభేదము.

క. లయతోఁ దృష్టియును నఖి,నయముదమట దరమ్ము పొడి నయమున్నతి రేఖయును బ్రమాణము మారువున్, మెయిసిరి యవ ఘళిము మురువు మెలకువ యమరున్.

ప్రబంధ ౧౦౮.

౫. సౌందర్యము.

సీ. అలకోకములతోఁక నళికింపఁదగు రేక గబ్బి పిఱ్ఱుపుటుబ్బుగుబ్బ లలర

చంద్రా. ౨. ౧౧౪

గీ. త్రైలోక్యమోహకలిత శృంగారరస మునఁ గరువుగట్టి, మదన రాజీవగర్భుఁడీ సుదతిఁ జేసెఁ, గాక లేకున్నఁ గలదె యీ రేక చెలికి. ఘటికా. ౨. ౮౩.

ఉ. ఆకదళంబిమాపు టౌఁట పాయపరంజి మెఱుంగుచెక్కు లా,చైకురచంచరీకరుచి సంచితమేచకచాకచక్య మా,రాకసుధాంశు రాకదపరాకని రేక నిరాకరించు నౌ, మాకుచకుంభజృంభణ మయారె రయారకే దానికే తగున్. రా. వి. ౪. ౩.

౬. విలాసము.

ఉ. నాకవరాదు గాక మలినత్వముపోఁ గయి సేయఁ జోకలన్, రేకల నన్నుఁ బోలఁగలరే కలకంఠులు ... శుక. ౨. ౧౧౩.

౭. విధము, రీతి.

చ. ... పుట్ట యిసుళ్ల కరణిఁగాకులతోఁకఁ గాండ్రపూచ్చుల భాగున గాడ్పుచేఁ బోవు చౌకొక్కలల రేక ... ప్రబంధ. ౩౮౮.

ఉ. ... నల్లగల్వపూ,కొకుల నిగ్గులం జెనయు రేకను గ్రమ్మను జిమ్ముచీకటుల్ ..

ఉ. హరిశ్చ. ౩. ౧౦౪.

౮. జాలు, లేఖ.

వ్యవ. పెండ్లికై చుట్టములకు రేక లంపుట యాచారము.

జ. రేకచీరణము, రేకపోచు.

రేక[2]. వి. తాటాకుకొప్పు. (వా.)

రేకంటు. వి. (రే[1] + కంటు) మార్యాదుఁడు.

(శ. ర.)

రేకచీరణము. వి. (రేక[1] + చీరణము.) రేకలం తీర్చెడు చిన్నయులి. (శ. ర.)

రేకణము. సం. వి. న్ న. (రేకణన్.) రూ. రేక ణాస్సు, బంగారము.

రేకము. సం. వి. అ. పుం. ౧. సందేహము, సంశయము. ౨. విరేచనము, కల్మషము వోఁగొట్టుట. ౩. కప్పు.

రేకమోచు. అ. క్రి. (రేక[1] + మోచు.) (కత్తి మొదలగు వాని) నాట్లుతిను, దెబ్బతిను.

చ. . ఒక్కించుక రేకమోవని నాయురఃస్థలం బున నీకుచకుంభమరేఖ లంటించి మా వారికి మాడు దీర్చి ... విజ. వి. ౩. ౧౫౮.

గీ. ఔర! పెండ్లికి నేఁగినట్లనికి నేఁగె యతఁ డంత్రంబులివి యొటిలకుచుచుమ్ము రేక మోవక గెల్చుట నీకెచెల్లు, సమర విశ్వంక ఘనభూజాఢ్య సాహసాంక. (విజ. వి. పీఠి. ౪౦.)

రేకలా. వి. (హిం. రక్షా. మి. (గ్రా.) ఒక విధ మైన చిన్న బిరంగి.

సీ. ఒక రేకలా దెబ్బ యుద్ధకారాతిరాట్పుట కుటీరముల కంబములగర్చె .

రంగా. ౩. ౧౯౫.

రేకు ≈ రేకు. వి. ౧. పుష్పదళము.

సీ. అలి కలభములపైఁ దొలకించుకని రేకు లలకలఁ జిన్ని పుష్పై వెలుంగ .

కు. సం ౯. ౩౭౫

సీ. చదలం గేదఁగి తూర్పుకుదకొమ్మ నరవిరిరై కానుపించు పూరేకు లనఁగ

పారి. ౨. ౩౯.

సీ. నె త్తమ్మి రేకుల మెత్తఁదనము దచ్చి య చ్చునఁబెట్టి న ట్లందమొంది .

భార. విరా. ౨. ౫౭

సీ. రేకులన్నియు విచ్చి రేరెుంద జిగినిండి కర మొప్పు తెల్లదామరల కంటె .

భా. రా. అర. ౧. ౧౩౫.

సీ. రేరాచ గేదంగిరేకు క్రొవ్విదతోడ పట్టుకస్ తేగురుబొట్టుతోడ పాంచా ౩. ౪౬.

౨. దళము, ఆకు.

గీ. కరములచొప్పదళమ్ములఁ గడిగి వార్చి, తులసిరేకులు సేవించి కరుకుఁ బచ్చడాలు తిన్న వసించి .. ఘటికా. ౨. ౧౪.

౩. బంగారు మున్నగువాని తగడు.

౪. కాకున్నఁ గెంపు వెన్నెల, రేకులవలెఁ బలుచ గ్రుమ్మరించుచు తల్లీ, యీ కారుమంట లిటు లన్ నీకు న్నిదహిమఁ బాప నేఁబని వింటిన్.

రామా. ౪. ౫.

౫. దుష్పటిగాఁ గూర్పని వస్త్రము. ...



సీ. .. దుప్పటి తరాపు పాపానలి దువ్వల్వ వీణను దుప్పటమున .. గీ. వదిరెం కూర్పు విచో రేకులనఁగ వెలయు ..

ఆం. భా. ౨. ౧౫౬.

జ. రకొక్కాను, రకొక్కలబు, రకొక్కలు, రేకు మదగు, రేకుమణఁగించు, రేకుమణఁచు, రేకత్తు.

రేకుఁడు. సం. వి. అ. పుం. నిమ్నజాతివాఁడు, నీచజాతివాఁడు.

రేకుమడ(ణ)ఁగు = (రేకు + మణఁగు) అ. క్రి. అణఁగు.

సీ. అడిదంబుచే రేకుమడఁగఁ గొట్టిన విశా సము దక్కి కదుప్రుక్కి జరిగెఁ గుము దుఁడు దశా. ౪. ౧౦౧

రేకుమణఁగించు. స. క్రి. (√ రేకుమణఁగు.) మణఁగఁజేయు, మణఁగించు.

సీ. గురుకరంబుల భవత్కువలయంబును రేకు మణఁగించు ప్రభుపగల్ మాన్పికొనుటొ .

రావి. ౪. ౪౯.

ద్వి. మలయు సంపఁగిరేకు మణఁగించి సొంపు, గిలుబాడి తిలకంబు క్రియఁ బొల్చు నాస

అ మ. క. ౨. ౧౦౯. పా. ౧౫. పం.

రేకుమణ(డ)ఁచు. స. క్రి (√ రేకుమణఁగు) ౧ అణఁగఁద్రొక్కు, మణఁగించు.

సీ. భ్రమరపంక్తులవేఁటఁ బరిమారింపకయున్న ప్రూవిసంపఁగిరేకుమణఁచఁ దగదె .

భామ. ౩. ౬౧.

ఉ. లంచముఁబట్టు సంచలబలంగమచే నద లంగ బంగరుం, గొంచెముగాని మేదిరకు కుల్ చెలంకుల్ బచరించుఁ జాపులన్, మించులఁ గుంచుకొంము రఖనీవిటు గుర్వుడఁ

దర్పోఁ జెంద్రుమున్, సంచరు రేకుమడఁచంగను
సంగర నక్కఁ జెక్కులన్.

రా. వి. ౪. ౯.

౨. చంపు, సంహరించు.

సీ. తనుఁ బిల్చినప్పుడ, వినిలోనుపడెనంచు మక
రంబు కరిరేకు మడచునొక్కొ, విధుఁడ
కల్గిన పెంజివినఁడ లేఁడని దంతిజడిసి
ప్రాణముఁ రేడ విడుచునొక్కొ ...

వాల్మీ. ౧. ౧౦౦.

ఉ. యాదవవార్ధి వెల్లివిరియన్ మఱియాఁగడు
పాటి వీరుఁ డి,మ్మదిని నెవ్వఁ డిందులకు
మారలు గావలె నేమె చాలమే, పోదుమె
కట్టికెత్తుమె బుభుప్రభునందనుఁ డెంత
వాని తం,డ్రే దురమం దదిప్పినను రేకు
మడంతుము మాటలేఁటికిన్.

విజ. వి. 3. ౧౭౫.

రేకెత్తు = తేకెత్తు. అ. క్రి (రేకు + ఎత్తు) వర్ధిల్లు.

గీ పెంపు పెందెను దామరతంపరయ్యెఁ,
బ్రబలె నెగడెను గొనసాగె బలిసెఁ బెరిగె,
నవఁగ రేకెత్తె నవఁగఁ వెల్లియ్యె వృద్ధిఁ,
బొందె ననుటకు    ఆం శ. ౫.

రేఖ. సం. వి ఆ. స్త్రీ. ౧. గీఁటు, గీత. ౨. పాణి పాదతలముల యందలి గీఁత. 3. కొద్ది భాగము, గీఁతంతమేర. ౪. వరుస. ౫. లంకా పురమునుండి యుజ్జయినిమార్గమున మేరువు నకు జ్యోతిశ్శాస్త్రవేత్తలు గీసిన మొదటి రేక ముఖ్యమైన రేఖ. ౬. మోసము, వంచన. ౭. ఆభోగము, వైశాల్యము. ౮. మార్గము, త్రోవ. ౯. రీతి, విధము.

(ఈ యర్థమున తెనుఁగునసే ప్రయోగము కన్పడు చున్నది.)

మ. జననీ దుర్భర గర్భగోళములనే సర్వ
జ్ఞాఁడై ప్రజ్ఞచే ఘనతం బొల్చును దత్పరా
కరుని రేఖన్ భూరివైరాగ్యలో,ధనిరూఢిన్
శుకయోగిచందమున నందంబందెఁ దా
నెన్నఁడే, జననంబొందె నతం డదేమొద
లుగా సర్వంసహామండలిన్.

విప్ర. ౧. ౭౭.

మ. . మనుజాం డొక్కఁడఁ బాటులంబడుట
సామ్రాజ్యంబు గైకొంటనుం, గనుఁ
దా నేర్పరిచేతి కందుకము రేఖన్ బెక్కు
చందంబులన్ .    నా. పంచ. ౨. ౧౫౭.

సీ. భరతుని లాగునఁ బరశురామునిభాతి రంతి
దేవునిభంగి రాముగరిమ,నంగునిరేఖ య
యాతి భావంబునఁ బృథువిధంబున భగీరథుని
మాడ్కి . విప్ర. ౨. ౬౯. పను ౭. ౬.

రేఖగొను. వి. అ. క్రి. (రేఖ+కొను.) గీఁతల చేత గుఱుతులు పెట్టుకొను.

ఉ. అ త్తనుమధ్యరూపు కడు నందముగాఁ
గుసుమాయుధుండు నా,చి త్తమునందు రేఖ
గొని చిత్రము వ్రాసెనో .

కు. సం. ౭. ౧౨౫.

రేఖాగణితము. సం వి. అ. న క్షేత్రగణితము.

రేఖానులు. వి. బ (హిం. రేఖాన = మెట్ట భూమి.) ఒకదినుసు మెట్టధాన్యము.

వ. . కటకసరులు రత్నసరులు జీనిసరులు
రాయసరులు పచ్చదినసరులు గంధసరులును
మద్దిగంద్రలు రేఖానులు కాంభోదులు మదన
సరులు ...    ప్రబంధ. ౧౧౭.

రేగడ = రేవడ. వి. రేగడి, బంకమన్ను.

(శ. ర.)

రేగడి = రేవడి. వి. దే. బంకమన్ను.

గీ. పంకముఁగొంజ దిగఁబడఁ బొఁదశేవు, మన్ను లిప్పేళ రేగటిమన్నులందు .

మనుచ. ౪. ౨౦.

జ. రేగడిదూల.

**రేగడిదూల.** వి. (√ రేగడి.) ఒకానొకవృక్షము, కచ్ఛుర శ్రీ. (శ. ర)

**రేగాము.** వి (రే1+గాము) రాక్షసుఁడు, నిశాచరుఁడు.

సీ. పవనాగ్నిశిఖలతో దివిఁ బ్రాఁకె రేగాము కఱకు జాంజాటువెంద్రుకల బెడంగు

ఉ. రా. ౧. ౭౩.

**రేచకము.** సం. విణ. (అ. ఆ. అ) ౧. కల్మషము పోఁగొట్టునది. ౨ భేదిచేయునది, విరేచనకారియైనది.

వి. అ పుం. ౧ ఊపిరి విడుచుట, ఒక ముక్కు రంధ్రము ద్వారా యూపిరి విడుచుట (పూరకము, కుంభకము, రేచకము.) ౨ చిమ్మనగొట్టము, పిచికారు. ౩ సురేకారము, పెట్లుప్పు ౪. జయపాలవృక్షము. ౫. తిలకము. శ్రీ.

న. ౧ భేదిమందు, విరేచనౌషధము. ౨. కంగుష్ఠము.

**రేచకి.** సం. వి. ఈ. స్త్రీ. కరకచెట్టు.

సీ. కొత్తిఁ దంగేడాకు మెత్తి రేచకి నిమ్మపంటి ఫులుసున నూటి పట్టువెట్టి .

కాశి. ౩. ౧౧౦.

**రేచన.** సం. వి. ఆ. స్త్రీ. ౧. ఊపిరి విడుచుట. ౨. భేదియగుట, విరేచనములగుట. ౩. విసర్జించుట, నిస్సారణము.

**రేచనక.** సం. వి. ఆ స్త్రీ. ౧. శ్వేతత్రివృత్తు. శ్రీ. ౨. కాంపిల్లము. శ్రీ. (వాచ.)

**రేచనకము.** సం. వి. అ. పుం. ౧. కాంపిల్యము, రోచని. శ్రీ. ౨. దంతివృక్షము, సేపాళము. శ్రీ. ౩. కాలాంజనము. శ్రీ. (వాచ.)

**రేచనము.** సం వి. అ. న. రేచన.

**రేచి.** సం. వి. ఈ. స్త్రీ ౧. కాంపిల్యము, రోచని. శ్రీ. ౨ అంకోటము, ఊడుగు. శ్రీ.

**రేచించు.** సం అ క్రి ఊపిరివిడుచు.

క పురుషమిళిందధ్వనివలె, నటిముఱిఁ బూరించి భృంగి యానందముతో, నరుదుగఁజేసిన వాదము,కరణిని రేచింపవలయుఁ గ్రమముగ నెపుడున్. వేం. మా. ౩. ౧౧౯.

స. క్రి పాఱఁదోలు.

మ. వెలిలోఁ గప్పడు నామరూపవితతిన్ వేమాఱు రేచించి యిమ్మల సచ్చిత్సుఖరూపతత్త్వము మదిం బూరించి యామీఁద నిశ్చలమై తన్మయమై తగన్మనము నశ్రాంతంబు గుంభించినన్, నలువొప్పున్ బుధసేవ్యమై తనరు ప్రాణాయామ యామ యోగంబగున్. సీతారా. ౩. ౧౭౩.

**రేచితము.** సం. వి. అ. న. వంకరలేక వేగముగాఁ బోయెడి యశ్వధారావిశేషము, గుఱ్ఱపుదాడు.

**రేచీకు1.** విణ. (రే1 +చీకు.) రాత్రి కన్నులు కనుపడనిది.

సీ. పడఁతి చూడ్కులతోడఁ బాటనవచ్చునే రేచీకులైన నీరేయుహాములు ..

తపతి. ౨. ౧౪.

**రేచీకు2.** వి. (రేపు+చీకు.) కేవలాంధుఁడు.

ద్వి రెండుగన్నులులేని రేచీకుచేత, నుందు దర్పణమట్టు లుపదేశహీను, శివపూజనంబులు చింతింప ..

ప్రభులిం. ౨. ౪౩. పా. ౫. పం.

రేచీకటి. వి. (రే1+చీకటి.) రాత్రి కన్నులు కన్పడని నేత్రరోగవిశేషము, నిశాంధ్యము.

క. కమ్మూకు రెండుపట్టులు, కమ్మి యజాక్షీరము లను గూర్చి వడిచి చూ, రొమ్ముగ ద్రిదినం బులుగొనఁ, బమ్మిన రేచీకటెల్లఁ బాయును క్రేగన్. చికి. (చి. ని)

రేజ్యోతి. వి. (రే1 + జ్యోతి) చంద్రుఁడు

సీ. బాడిమగటాచందు కాడిగ నంటినజాతి రేజోతి బాగోడ జాజాటాకు ఘటికా. ౨. ౨౨.

సీ. కెలన రేజోతిరాచలుపతిన్నియపొంతఁ బరు వంపు పూలచప్పరము పన్ని ప్రబంధ ౨౪౧.

రేటి. సం. వి. ఇ స్త్రీ. ౧. వహ్నిరటితము, అగ్ని వలన గలుగు ధ్వని. ౨. సంయతోక్కట మగు వాక్కు. 3. తింత్రిణీకము. ౯ ౪ స్పృహ ౫ కాంతి. ౬. జ్వాల. (శే ని)

రేణము. వి. మిక్కిలి చిన్నదూదపేడ.

వ. . మొదవుల కోరి నురవులుం జెయ్యల రేణంబులుం బాలకుండల మసలు నున్ హరి. పూ. ౫. ౧౪౨.

ఉ. దోసెదుకొంపలోఁ బసుల త్రొక్కుడి మంచము దూదరేణముస్, బాసిన వంట కంబు ... శ్రీనాథుని చాటువు.

రేణి1. వి. ఉపయోగము. (రేణికివచ్చు = ఉప యోగపడు, పనికివచ్చు)

శా. దాన స్నేణికిరాక తండుకెల నంద త్రా ద్వగీతత్రిక్లేలా పేకాకుగతుక్కచాకచిసముద్య త్పాల కల్యాణి, శ్రీనే తోరణమెప్పుఁ దూఱి విజయశ్రీఁ బెండ్లియై వత్తుఁగా, నేవంచుం జొరఁగా హరుం డెణేఁగిపోయెం గోయనం గ్రక్కవన్. కకు. ౫. ౯3.

రేణి2. వి. ఒకానొక చెట్టు.

సీ. వేరపనన గుత్తిపెట్టి జారున రేలపనన కరక కొమ్మి పలుకరేణి ... హంస. ౪. ౧౧.

రేణుక. సం వి. ఆ. స్త్రీ. ౧. జమదగ్నియొక్క భార్య, పరశురాముని తల్లి. ౨. ఒక దివసం మందుపదార్థము, గంధద్రవ్యవిశేషము.

రేణురూషితము. సం. విణ. (అ. ఆ. అ.) దుమ్ము చే మలినమైనది, దమ్ముపడినది.

వి. అ. పుం. గార్దభము, గాడిద.

రేణువాసము. సం. వి. అ. పుం. భ్రమరము, తుమ్మెద (విల్యమ్సు.)

రేణువు. సం. వి. ఉ. పుం. ౧. దుమ్ము, ఇసుక మొదలగువాని యణువు ౨. పుప్పొడి, పుష్ప పరాగము. 3. స్త్రీ గంధద్రవ్య విశేషము, రేణుక. ౯

రేణుసారకము. సం. వి. అ. పుం కర్పూరము.

రేణుసారము. సం. వి. అ. పుం కర్పూరము.

రేతజ. సం. వి. ఆ. స్త్రీ. ఇసుక.

రేతము. సం వి. అ. న. రేతస్సు.

రేతస్సు. సం. వి. స్. న ౧. ఇంద్రియము, పురుషవీర్యము. ౨. జలము, నీరు. (శే. ని.) 3 పాదరసము.

రేతిరి = రాతిరి. వి. (సం. రాత్రి) రాత్రి, నిశి.

ఉ. ... దూతి యూ, రేతిరిఁ బోయి చీర పగరే ప్రతి రథ్యముసుంగొనర్చి సం, ఘాతకుతూహలం బగుచు జారుఁడు దక్షదనంబుఁ జేరఁగన్. హం. పంచ. 3. ౨౪౧.

క. ప్రాతఃకాలమునం దర, రేతిరి యేతెంచి పేద రేదనక కడున్, ప్రీతి కలంత యొసఁగితిఁ,

చేతుల దులుపుకొనియుంట శివుఁడే రొయిఁ
గుస్. శేష. ౩, ౨౫౬.

(అరరేతిరి = అర్ధరాత్రము.)

సీ. రెయి రేయి రాతిరి రేతిరనంగను రజని
పొల్పును .. ఆం. భా. ౧. ౯౪.

**రేత్యము.** సం. వి. అ. న కంచు. (విల్యమ్స్.)

**రేత్రము.** సం. వి. అ. న. ౧. ఇంద్రియము, శుక్రము. ౨. పాదరసము. ౩. అమృతము. ౪. పరిమళముగలపొడి ౫. నూతకము, జాతాశౌచము.

**రేదొర.** వి (రే¹ + దొర.) నిశాపతి, చంద్రుఁడు.

క. రేదొర వెంగమున కెన చిగు,రేదొరపల్వల్వ
తోడ నిలిగుబ్బ లయా, రే దొరయున్ జక్క-
వకవఁ, బైదలినలు వెన్న నలువపడఁతికిఁ
దరమే. అచ్చరా. బాల. ౧౩౫.

సీ. తొలికేలదాల్చు రేదొర విడియింప నిర్మించిన
మగతాలమేడ యనఁగ
ఉ. రా. ౪. ౧౭౦.

సీ. విందురేదొరఁగేరు వెమ్మోము స్ఫురియించి.
సమీర. ౨. ౭.

**రేద్రిమ్మరి.** వి. (రే¹ + ద్రిమ్మరి.) రాత్రించరుఁడు, రాక్షసుఁడు.

ఉ. కొమ్ములఁ దోఁక లేక జతగూడను నీకు
వృషాఖ్య యింద్ర రే,ద్రిమ్మరి దొమ్మి కయ్య
మున దిట్టతనం బణి పూరిమేసితో .
దశా. ౨. ౪౧౩.

(అగ స్త్యవర్ణనము.)

సీ. వెడమాయ లదరించు గడుసురేద్రిమ్మరిబొంది
రొమ్వాపికి భోజనంబు .
సమీర. ౧. ౭౧. నీలా. ౧. ౧౯.

**రేద్రిమ్మరీఁడు.** వి. (రేద్రిమ్మరి + ఈఁడు, స్వార్థమున.) ౧. నిశాచరుఁడు, రాక్షసుఁడు.
(శ. ర.)

౨. నిరృతి

ఆ. మాలకోఁడు పొలుమాఁకలకోఁడు రే,
ద్రిమ్మరీఁడు అనఁగను, నిరృతిపేళ్లు
చెల్లు . . ఆ. సం. దేవ. ౭౦.

**రేనాఁడు.** వి. దేశవిశేషము.

క. వెలనాఁడు వేఁగినాఁడును, బులు,గులనాఁ
డ్పాకనాఁడు పొత్తపినాఁడున్, గలమురి
నాఁడు రేనాఁ,డలయుక గనుఁగొంటి నచటి
యబలలఁ గంటిన్. హంస. ౧. ౫౩.

**రేను = రేఁగు².** వి. (దీని 'ను' వర్ణమునకు ఏకత్వమున వికల్పముగాను, బహుత్వమున నిత్యముగాను బిందుపూర్వక 'గు' వర్ణము ఆదేశమగును.) వృక్షవిశేషము, బదరీవృక్షము.

సీ. పొన్నబొట్టుగు పోఁక పొగడ దాడిమ విప్ప
గుమ్మడిందు గురువింద గోను రేను ...
వెం. పంచ. ౪. ౫౨౨.

**రేపకడ.** వి. (రేపు + కడ.) ప్రాతఃకాలము, (వృత్తిని) వర్ణవికారము.

గీ. రేపకడయును బగలును మాపు వరుస, నర్థ
ధర్మ కామంబుల నాచరింపవలయు .
భార. అను. ౨. ౪౭.

క. రేపకడ గోవుపంచిత, మేపురుషుం డెవ్వఁ
డైన చెప్పుడు నియమం,బొపి తలఁజల్లు
కొనినం, బాపము చెడుఁ బుణ్యలోకఫలము
ల్గలుగున్. విష్ణు. ప్రా. ౫౯.

సీ. ... అరేయి గడిపి, అ. రేపకడనతడి
పాపవినాశన,తీర్థమునకు చేగి పార్థివుండు...
హ్యా. ౭. ౧౩౧.

**రేపము.** సం. విశే. (అ. ఆ. అ.) ౧. నింద్య మైనది, నీచమైనది. ౨. కఠినమైనది, క్రూర మైనది. ౩. కృపణమైనది.

**రేపస్సు.** సం. విశే (స.) ౧. నీచమైనది. ౨. దుష్టమైనది, చెడ్డది ౩. కృపణమైనది. ౪. క్రూరమైనది, అరణ్యకమైనది

**రేపాడి.** వి (రేపు + అడి, స్వార్థమున) ప్రభా తము, ప్రాతఃకాలము.

క. రేపాడి లేచి నియమము, దీపింపఁగ స్నాన విధులు దీర్చి రమేశున్, గోపాలుని జాగ రణము, చూపట్టఁగఁ బూజసేయ సంగతి లభించున్. శేవ. ౪ ౯.

సీ. జీమూత డంబరం బేచె మధ్యందినంబుల రేపాడి చినిశి దుపారంబు దినదినంబు కాశీ. ౩. ౧౪౯.

**రేపు.** వి ఔ అవ్య. ౧. ఎల్లి, మఱునటి దినము, నేఁటితరువాతిదినము.

మ. వరుసం జెల్లమురాఁగ నీవడుగుమే వత్తున్ సపైన్యుండనై, పురసంశోధ మొనర్పు రేప కడఁకం బూరింపు మత్సాహతిన్ హరి. ఉ. ౧. ౧౩.

మ. తలపే బ్రహ్మకునైన నీనగమహత్త్వం బెన్న శేవియ్యెదం,గల చోద్యంబులు రేపు గన్గొనియెదన్ .. మను చ ౨. ౧౨.

చ. అని కొనియాడి విశ్వభువనైకదురంధర నేఁడు రేపు నీ,వనితయు నీవు నిచ్చట నవశ్యము మజ్జనభోజనాది పూ,జనములు గైకొనవ్వలయు . పారి. ౩. ౩౯

౨. అచిరభావికాలము, భావికాలము, ముందు.

మ. ఇదిగో రేపె తపఃప్రభావమున వాణీశాను మెప్పించి వ్యాపదముల్ గైకొన నున్న వాఁడు విబుధప్రత్యర్థి సామాన్యుఁడే . దశా. ౪. ౫౪.

శా. నీపుత్త్రుం డితఁడంచు దుఃఖపడెదం తే దేహ మో జీవుఁడో, నీపుత్త్రుండిట దేహమాత్రమని యంటేఁగాదు జీవుండనన్, నీపుత్త్రుండెవ్వ డైనఁగర్మగతినాం జేఁబూర్వముం బుట్టఁడో, రేపుంబుట్టఁడొ యింక నెవ్వరికిఁ బుత్త్రీభావ మాద్యంబగున్. దశా. ౪. ౧౦.

౩ పగలు, దివాభాగము

గీ. కలుగు నూళ్లండ్లలో నర్థకాల మపహ,రించు నిద్రయె యానిద్ర రేపు మాపు, మాని యుండిన జాడ్యంబు మేనఁబొదము దశా. ౨. ౧౩౭.

ఉ. ఆపుటభేదనేంద్రదదృపదావళి కల్పితగోపు రాళిపై, నేపున మాపు రేపుఁ జను నిందుదినేం ద్రులఁ బర్వఁ దద్దృతుల్, బాపుర వీనికిన్ గ్రహణబాధ యపర్వములందు నేక్రియం, బ్రాపితమయ్యె నంచు మది భ్రాంతివహింతురు తాంత్రికోత్తముల్. హంస. ౧. ౧౬౩.

ఉ. ఈపృథివీధరంబున నిభేంద్రకటోదితదానధార లై, ద్వీపవతీతరంగకట విస్ఫుటశైవల కంద ళంబులై, తాపసబాలికాశ్రవణదత్తయవాం కురభూషణంబులై, రేపు దమంబుసేయు శబరీ శబరీ నిబిరీస నీలిమల్. ׀ పాండు. ౨. ౧౪౭.

౪. ప్రాతఃకాలము.

చ. అమల నివాతసౌధములయందు మనోజ్ఞ మరాళతూలతల్పముల శయించి రేపులు శుభస్థితి మాగధనూత గీతవాద్యములఁ బ్రబోధమొందిన భూరయు ధర్మసుతుండు శకోర

భూమిభాగమున శయించి మేల్కాంచు
సృగాలనినాదవికీర్ణకర్ణుఁడై.
భార. ఆర. ౫. ౩౨౯.

ఉ. .. గోకుల మిల్లిలు దప్పకుండ లక్ష్మీపతి
క్రమ్మరున్ గడియసేపున రేపున నిచ్చనిచ్చ
లున్ . హరి. పూ. ౫. ౨౦౦.

సీ. అరుణోదయమున కాచాదు లన్నియుఁ దీర్చి
వరుస రేపటి సంధ్య వార్చవలయు ..
విజ్ఞా. ఆచా. ౬౩.

గీ ఎల్లి సేయుపనులు నేఁడ యింతి మాపొనర్చ
పని రేప చేయుట నా మతంబు .
భార. అను ౫. ౨౩౮.

జ. రేచీకటి2, రేపకడ, రేపాడి, రేయెండ2.

**రేపులుఁగు.** వి. (రే1 + పులుఁగు.) చకోరము, వెన్నెల పులుఁగు.

వ. . తమతమ మదకులఁ గవఁగూడి యెదు
ర్కొను రేపులుఁగు కోలము లెదురెక్కు
సమానవతీకమైన వితానంబులును .
చంద్రికా. ౪. ౧౦౩

**రేఫము.** సం. విణ (అ. ఆ. అ.) నీచమైనది, నింద్యమైనది.

వి. అ. పుం. 'ర' యనెడి అక్షరము.

**రేఫస్సు.** సం. విణ. = రేపస్సు.

**రేమగఁడు.** వి. (రే1 + మగఁడు.) నిశాపతి, చంద్రుఁడు.

చ. చలువవెలుంగు రేమగఁడు జక్కవ నొచ్చలి
జోడుకోడ . చందమామ కడునింగిఁ
దెలంగి వెలింగె నెంతయున్.
రామా. ౭. ౯౫.

ఉ. చలువలాసంగి వేడుక బోసంగ మెఱుంగు
పరంగిపీట వన్నెలఁ దలు రాచరేమగని
నిల్పి మరల్ తడియార్చి గోళులం, గలయఁగ
దువ్వుచున్ వకోయలు గాచిగ నైచి
మెఱుంగు ముత్యమున్, గులికెడు కాసికంబు
దగఁ గుట్టి రుమాలువు గట్టి రంతటన్.
కువల. ౫. ౯౧.

(రాచరేమగఁడు = రాజశ్రేష్ఠుఁడు. అని భావము.)

**రేమిడి.** వి. ఒకజాతివృక్షము.

ద్వి. ... పనసపండ్లును మొదలైనపండ్లను
వెలఁగకాయలు రేమిడికాయలు గలిగి,
కాయలు
పండితా. పర్వ. ౩౪౮. పా.

**రేయి** = రే1. వి. దే. (బ. రేలు.) రాత్రి, నిశి.

చ. ఎడపక రేయియుం బగలు నెమ్మెల
నమ్మలతాల్పుఁ గూడి పూపడిదపుఁదోదు
నిబ్బరపుటాలమునం దమి మెచ్చ
నీలా. ౧. ౧౦౮.

క. రేయిట మండియుఁ గృష్ణునిఁ, బాయు
టకుం దలరు గోపభామినులు నిజంబై
యప్పుడు హరివిరహవ్యాయతదుఃఖంబు
దమ్మ నటు పొడువుటయున్.
హరి. పూ. ౮. ౧౩౪.

ఉ. . చల్లని రేయిటి కట్టు పున్గలిప్ విందుల
దేల్చ ... ఆము. ౫. ౯౦.

గీ. రెండు వీళ్ల జనంబులు రేలు వివిధవాద్య
సంగీతములను .. ప్రొద్దుపుత్తురు భరత
ముఖ్య ... భార. భీష్మ. ౨. ౩౪౩.

జ. రేయిద్రిమ్మరి, రేయినడకరి, రేరేయి.

**రేయింద్రిమ్మరి.** వి. (రేయి+ద్రిమ్మరి.) రాక్షసుఁడు.

క. కెంపుల కడుపులలో నేస్తోల చెరగడి
ప్రోడ రేయిద్రిమ్మరి దొరపైఁ, గొంకోలు

మూర్పులు నిగుడుచు, తెలుఁగున గాటంపు
టూర్పు తెమ్మెర లడరన్.

అచ్చ. రా. బాల. ౧౨.

**రేయినడకరి.** వి. (రేయి+నడకరి.) నిశాచరుఁడు, నిర్ఋతి.

గీ. తూర్పుదొర వేడివేలుపు దుంతరాతు, రేయి
నడకరి సంద్రంపుఱేఁడు గాడ్పు

భోజనుతా ౧. ౨౫

**రేయు=జేయు.** అ. క్రి. ౧ విజృంభించు, చెల రేఁగు.

గీ. గంధదంతావళిము రేవి కతిన దంత,కాం
డమునఁ బొడ్చి యెత్తినఁ గానఁబడియె,
సమదళాత్రవమణిమయస్యందనంబు, కపట
కిటికొమ్ము మొన రత్నగర్భ వోలె.

వరాహ. ౫. ౩౫.

వ. మేటి రక్కసులొక్కట రేవి క్రొమ్మె
ఱుఁగు లెగయఁ గైదువు లంకించుచు .

భా. రా. యు. ౭౩.

౨. అతిశయించు.

చ. సురవరు లేయు బాణములు సూడ్కికగోచ
రమై వక్షస్థలం, బతిముతేఁ గప్పి రేవి దివ
సాంతముఁ జేసిన లీల ...

భాగ. ౬ ౩౭౭.

ద్వి. రేవి చూడఁగరాని రేవు చీఁకటికి, డాసిన
పొదలలో డాఁగి రేయెండ .

రం. రా. అయో. ౧౭౩. పా. ౩. పం.

౩. అదరు, పూను.

ద్వి. చప్పట్లు చఱచుచు సద్దు సేయుచును,
తెప్పలు క్రేయక రేవి చూచుచును ...

ద్వి. తి. పా. ౧౪. పా. ౨౦. పం.

సీ. పసిపట్టి తోఁకలు విసరి తాయచుఁ దెవుల్
రేరించుకొని దిశల్ రేవి చూచి ..

రసిక. ౧. ౧౧౩.

స. క్రి. ఖండించు.

ఉ. అంతట రాముతమ్ముఁడు దిగంతసమీపగుఁ
డైన యట్టి భ్రాస్వంతు తెలుఁగుఁ గాంచి
తనశత్రుని కాయము సొంపు మీఱ
నత్యంతము నేవి యేవి తదుదగ్రశరంబుల
రేవి రేవి యుత్క్రాంతతఁబోరు జిష్ణురిపు
సత్త్వము వారయుచున్మనంబునన్

రాఘవ. ౪. ౧౭౧.

**రేయెండ1.** వి. (రే+ఎండ) వెన్నెల.

క. ఒక్కతెవు నిటకు వత్తురె, యక్కట రే
యెండలోన నడుగుందమ్ముల్, పొక్కఁగ
జేయుతరె నిన్నుం, జెక్కిలి గొట్టంగ నేమి
సేయుదు దల్లీ.

యయా. ౫. ౧౩౭ మార్క. ౧. ౫౦.

గీ. పండురేయెండ కన్నులపండువగుచుఁ, బిండి
చల్లిన తెలుఁగున మెండుమీఱి, యెండుకడ
నైన నెడలేకయుండి యప్పుడంత గొనక
జగంబెల్ల నిండుటయును

అచ్చ. రా. అయో. ౨౦.

**రేయెండ2.** వి. (రేవు+ఎండ) బాలాతపము, లేఁతయెండ.

సీ. రేపులన్నియు విచ్చి రేయెండ జిగినిండి కర
మొప్ప తెల్లదామరల కంటె,... ఆ. ఇతని
కన్నులొప్పు .

భా. రా. అర. ౧. ౧౩౫.

సీ. క్రొవ్విరితోఁపఁగంటెఁ గోమలంబగు నైన
రేయెండ ముట్టిన సోయఁదక్క ...

కు. షం. ౩. ౬౭౦.

సీ. కేయి వెన్నెలలాని కేయెంద యుదయింప
బెదరు చకోరంపుఁబిల్ల లనఁగ .
పి. శకుం. ౨. ౫౫.

**కేయేలిక.** వి. (కే1 + ఏలిక.) చంద్రుఁడు.
ఉ. పూని కేయేలిక జింకనైన శోకరేటున
సేపక సేయనేర్తు రుద్వేలచమత్క్రియా
కలన హెచ్చఁజేరించు ఁపులిందసుందరుల్.
చమ 3 ౧౦౪.

**కేరా.** (వి. కే1+రా2 ) చంద్రుఁడు.
క. కేరాపాడుపుననఁగన్ని, కేఠాయను మాతసే
తుకేరా మారా ల. వి. ౪. ౩౨.

**కేరాచేరేక.** వి. (కే1 + రాచే + రేక.) చంద్ర
రేఖ.
సీ. చినుకు వెల్తురు మబ్బుచే నడ్డపాటింతవో
కార్పు కేరాచరేకయనఁగ
రా వి ౪. ౧౧౯

**కేరాచేతాయి.** (కే1 + రాచే + తాయి.)
వి. చంద్రకాంతమణి.
సీ. కేరాచేతాల గూర్చిన రచ్చపట్టులో రహిఁ
బాడు, పాటల రవళి యరసి
యయా. ౪. ౩౪.

**కేరాజా.** వి. (కే1 + రాజా.) చంద్రుఁడు.
గీ. కువలయాధీశ్వరుఁడు బుధగురుత సొనఁగు,
రఘుమహారాజా జగతికేరాజా కరణి
ఇందు. ౧. ౧౫౭.
సీ. కేరాజా రాకకు కేచాన మునుమున్న సవ
రించు నవితవసన మనంగ .
భాను. 3. ౩.
సీ. మదనబాణకటాక్షవదనసుంచుంజామా తమ్మికి
కేరాజా డాయయునట ...
రా. వి. ౪. ౭౨.

**కేరాయఁడు.** వి. (కే1 + రాయఁడు.) నిశా
పతి, చంద్రుఁడు.
సీ. కేరాయనికిఁబొక్కు తారావధూమణి కతి
చాయ ననుబట్టుగా ధరింప ...
భోజనుతా. ౫. ౧౯.
మ. అలివేణీ పదిలోపలం బదునోకండై యుండె
నోలదా జ్యక్కుల కేరాయలపట్టి యంత
టని నీకు న్వాఁడు నిక్కంబుగాఁ, జెలు
వుండే కద . ఉ రా. ౪. ౨౧౫.
(ఇట శ్లేషార్థకము )
క. ... కేరాయఁడు తోలిసంద్రమునఁ దిర
మ్ముగ వెడలెన్ ...
అచ్చ. భా. 3 ౪౩. పా.

**కేరిపాణుఁడు.** సం. వి. అ. పుం. ౧. శివుఁడు.
౨ దొంగ. 3. పిశాచము లేక రాక్షసుఁడు
(విల్యమ్సు.)

**కేతేఁడు.** వి. (కే1 + తేఁడు.) నిశానాథుఁడు,
చంద్రుఁడు.
సీ. కబరికాభరముపైఁ గన్నె గేదఁగిపువ్వు కేకు
తోఁ గూడ కేతేనిఁ బొదివి . .
సైమ. ౭. ౨౨.
వ. . వీఁడె మనమేడమీఁద కేతేఁ
డున్నాఁడు. వీనిం బట్టు కొందమని పోవాన
నితావమార్గంబునఁ జనఁ దివురు చివురుఁ
బోఁడి మూర్ధ్ని పాషాణంబుల కరుదంది ..
మృ. వి. ౨. ౭౪.

**కేల = జేల.** వి. ఆరగ్వధము, ఒకానొకచెట్టు.
వ. ... ప్రోగు వారించి రావుల హెవుల
జువ్వల వెంపువ్వల రేఁగుల గోఁగుల కేలల
జాలల నొద్దుల మద్దుల వియుగుల నిఱుగుల
వెమ్ముల జమ్ముల . పి. శకుం. ౨. ౧౪.

రగడఁ బూరేఘు పండితై బుగుబకడం గోరేల,
చేరరాలగాద యిప్పచెంత భడిగో రేల .
ఉ. రా. ౬. ౬౧. ఆం. భా. ౨. ౪౨.

**రేరేయి.** (రేయి + రేయి) వి. అర్ధరాత్రము, సగమురాతిరి. (చి వి.)

**రేవ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నర్మదానది. ౨. నీలి చెట్టు. ౩. కామపత్ని, రతీదేవి. ౪. దుర్గ, పార్వతి.

**రేవంతుఁడు.** సం వి. అ. పుం. అశ్వశిక్షకుఁడు.

**రేవఁడు.** విణ అవివేకి. (రేవు1 + అఁడు. చాకలి వాఁడు. అని శ ర)

ఆ ఋణవినాశనాదుగద నీవు మఱి నీకు, నిట్టి
వ్రతములెల్లఁ బట్టనేల, రెండిటికిని జెడిన
రేవఁడపై వృథా, బోదవైతి వెందుఁ గూడ
వైతి. ప్రబోధ ౩ ౨౪.

ద్వి కుక్కకూఁతుర మెడఁగోసి పోఁగలవు,
రెండుపోనాడిన రేవనిరీతి, నుండ
ద్వి హరిశ్చ. ఉ. ౭౭౩

ఉ. ఇహపరంబులకూరక దూరమై వసు,శ్రీ
చన రెంటికిం జెడిన రేవఁడ నాదునె నీర
జేక్షణా. మనుచ. ౩. ౧౦౫.

**రేవగలు.** వి. ఔ. (రే1+పగలు.) రాత్రియుఁ బగలును (బ. రేవగళ్లు, రేవగలులు)

ఉ. పేఁడును మున్ను రేవగటివేళకు మానివి
యాట . ఆము. ౬. ౨౧.

చ. . రహింపుల బండికండ్ల చప్పుడు గతి
మ్రోపె రేవగలు భూరిభయంకరగర్జ లత్తి
తిక్ ... ఆము. ౪. ౭౫.

ఉ. ఆ బ్బులకేసరిన్ ఘనగుహాంతరసీమల రేవ
గళ్లమైఁ, బ్రాబ్బెదు మబ్బు .
వాల్మీకి. ౨. ౪౩.

**రేవగుప్తి.** వి. ఒకానొకరాగము.

గీ. దేవమలహారి సాహారి రేవగుప్తి .
ప్రబంధ. ౯౪.

**రేవటము.** సం. వి. అ పుం. ౧ ఆడవిపంది. ౨. వెదురుగడ. ౩. సుడిగాలి. ౪. ఒకజాతిశంఖము. (విల్యమ్సు.)

**రేవడ = రేగడ.** వి. బంకమన్ను.

చ. ఇచట నల్లరేవడయ దూరమ వోయినఁ
బాండు మృత్తికా,కరములు గానము . .
పరమ ౨. ౧౨.

ఆ కృష్ణభూమి వెలయు రేగడ రేవడ, యనఁగ
విమలకీర్తి సాంబమూర్తి.
ఆం. భా. ౨. ౩.

**రేవడి=రేగడి.** వి. బంకమన్ను. (శ. ర)

**రేవతము.** సం వి. అ పుం ౧. దబ్బచెట్టు. ౨. ఆరగ్వధము, రేల [illegible]

**రేవతి.** సం వి. ఈ స్త్రీ ౧. ఇరువదియేడవ నక్షత్రము. ౨ బలరామునిభార్య ౩. గోవు, ఆవు. ౪. ఒకానొకదేవత, మాతృకాభేదము. ౫. దుర్గ, పార్వతి. ౬. ఒకానొకనది.

**రేవతీరమణుఁడు.** సం. వి. అ. పుం. బలరాముఁడు, కామపాలుఁడు.

**రేవలచిన్ని.** వి. ఓషధీవిశేషము. (శ. ర.)

**రేవు1.** వి. ౧. నద్యాదులందు మనుష్యులు దిగుట కనువుగా నేర్పఱచిన దారి, జలావతారము.

మ. తలఁ బక్షచ్ఛటఁ గ్రుక్కి సాళువులు కేదా
రంపుఁ గుల్యాంతర,స్థలి నిద్రింపఁగఁ జూచి
యారెకు బలసాన్న కప్రయాతద్విజా,వలి
పిండీకృతకాటులన్నవిఁదదావాసంబుఁజేర్పంగ

రేవుల జిగ్గ వ్వెసఁబాఱువానిఁ గని నవ్వుస్
గాలిగోప్యోఘుమల్. ఆము. ౧. ౬౫.

సీ. వేణ్యాభిధానయై వెలసిన యమ్మహాతటిని
నీరేవున దాఁటిపోయి, క్రూరకర్ములు మహా
చోరు లుండెడు చక్రగిరి చూచి యొక
విభావరి ప్రియమున
హరి ఉ. ౧. ౪౩.

ద్వి. రేవి చూడఁగరాని రేవుచక్కటికి, డాసిన
పొదలలో డాఁగి యేనుఁడ
రం. రా. అయో. ౧౫౩ పా. 3 పం.

౨. సముద్రతీరమందు సముద్రవ్యాపారము
చేయుట కుపయోగించు పట్టణము.

శా. రేవు ల్మొవు మతంగజంబులు మణిశ్రీఖండ
ముక్తాదియున్, రావాణిజ్యము పెంచి యే
లఁగ నగున్వర్గంపు సెవ్వున్ రుజన్, హాళిల్లం
దగు సన్యభూప్రజల రాజాయాయిజాత్యొ
చితిన్, బ్రోవంగాఁదగుఁ దోఁటగను లాభ్రు
ల్పాదఁబంపం దగున్ (ఆము. ౪. ౨౪౫)

3. సముద్రమునందు సరకులు ఎగుమతి దిగుమతి
యగుచోటు.

గీ. వనధిసర్వాంకవంబయ్యు వలయుపనికి, రేవు
లనకాని చొరరాని రీతి నధిప, విశ్వరూపకుఁ
డయ్యు శ్రీవిభుఁడు మ_క్త, రూపములనేవ్యుఁ
డగు నారురుక్షువులకు. కవిక. ౫. ౩౩

౪. చాకివాఁడు దుదుకుటకై బట్టలు తీసికొనిపోవు
తడవ.

క. వెల యినిమిదియగుపాలుమ, వెలవాల్గవపాలు
శోలి విడువఁగవలయున్, తొలురేవున మలు
రేవునఁ, జెలువే దఁగఁ జాకిచీర చెంచిన
చోటన్. విజ్ఞా. ప్రా. కాం. ౬౨.

విశేషార్థము. రేవుపెట్టు = పెండలుపెట్టు.
“ వారినందఱను బంపఁడులఁచి రొక్కొక్క
నిచే రేవుపెట్టినాఁడు.”

జః రావఁడు, రేవులువాఱు, రేవుగుజ్జము, రేవు
పడవ, రేవుబోయ.

రేవు[2] = రేఁగు[1]. అ. క్రి. విజృంభించు, చెల
రేఁగు.

ఆ. . త్రిభువనముల, రేవుచున్న వాఁడు
మూవి వీఁ డురుకార్య,భానురుండు తారకా
సురుండు. కు. సం. ౧౧. ౬౩౨

రేవులువాఱు. (రేవులు + పాఱు.) అ. క్రి
కోమవీథులేర్పడు.

క. నీవఱచిన యఱపులు మఱి, నీవే యెఱుఁగు
దువు తెలుప నీలోఁదునుమీ, బావాయని తల
గడ్డము, రేవులువాఱంగ వడి గొరిగి కడి
పించెన్ భోజరా. ౪ ౧౩౯.

వ. వానింబట్టి బంధించి గడ్డంబును మీసం
బును తలయును రేవులువాఱ గొరిగి విరూ
పించేసె . భాగ. ౧౦. పూ ౧౪౬౬.

రేవుగు(జ)జ్జము. వి. (రేవు + గుజ్జము)
గాడిద

సీ. రేవుగుజ్జము గాలిగాఁడు. గాడిద
యనఁగను ఖరము రాజిలుచుండు .
వేంక. తిర్య. ౯౪.

ఉ. మైలలమోపు వీఁపున నమర్చిన రేవుగుజ్జాని
నెక్కి వ,య్యాళిగఁబోవువాఁడు విమలా
పతటాకసమీపభూమికిన్.(శుక. 3. ౧౦3.)

రేవుపడవ. వి. (రేవు[1] + పడవ) నద్యాదుల
యిద్దరినుండి యద్దరికి మనుష్యాదులదాఁటించు
పడవ. (వా.)

రేవుబోయ. వి. (రేవు[1] + బోయ.) రేవు పడవ
నడుపువాఁడు.

ఉ. అర్ధ్యెడ రేవుబోయలఁ బ్రియంబు మెయిం
బిలిపించి దెలిసిం, జయ్యన కోడపెట్టు
మని ... విర్యా. ౯. ౫.

**రేవెలుఁగు.** వి. (రే + వెలుఁగు.) చంద్రుఁడు.

గీ. రేవెలుంగులదొరతోడు రేవెలుంగు ...

మనుచ ౧. ౧౭.

ఆ. రేవెలుంగుచేత రెమ్మెవఁ జదలల్లి, నల్లమబ్బు తోలు పెల్లఁజీర, కేఁచి తేపికంటి రుుత్తిన యేనిక, తోలుతోడి సాటిదోఁప వెలిఁగె.

అచ్చ. భా. 3. ౪౪.

**రేవెలుఁగుతీవ.** వి. (రేవెలుఁగు + తీవ.) సోమలత.

వ. గాములకెంగంటిసాముల నెల్లకసల వెలిం గించు రేవెలుంగుతీవ యగ్గిప్రోవులమాటి

అచ్చ. భా. ౨. ౭౬. పొ.

**రేవెలుఁగుఱాయి.** వి. (రే + వెలుఁగు + ఱాయి.) చంద్రకాంతమణి.

గీ. మరకతనిబద్ధభూముల మలయు రేవె,లుంగు ఱాతిన్నియల చెన్నునంగు పాగడ,ప్రాని నీడలఁదగు నొక్కటికోనలోన, పుష్పక విమాన మటు సాగిపోక నిలిచె.

ఉ. రా. 3. ౬౬.

**రేష.** సం. వి. ఆ. స్త్రీ అఱపు, బొబ్బరింత, గుఱ్ఱపుసకిలింత.

**రేషణము.** సం వి. అ. న. అఱపు, బొబ్బరింత, గుఱ్ఱపుసకిలింత

**రేసు.** వి. ఈర్ష్య, ఈసు. (చులకన. అని, శ. ర)

ద్వి. సవతి రేసునఁబట్టి జంపింపఁ దలఁచి, సవ రగా నసృతభావము దొంతిచేసి .

నవ. ౨ ౭3. పొ. ౯. పం. ప్రాఁతప్రతి.

క. నీ సఖ్యమునఁ జరించిన, దోసము మోసము న నేఁడె తోఁదన కలిగెం, బోసరమె కోటి క్రావ్వో, రేసో యిట్లాడ నెవ్వరికి నీడేయన్.

వేం. పంచ. ౧. ౪౧3.

విశే. చులకనిది. (శ. ర.)

**రేసుగుడ్డ.** వి. చేతిగుడ్డ. (శ. ర.)

# రై

**రై = రో.** సం వి. ఐ పుం. ౧. ధనము, సొమ్ము. ౨. బంగారము. 3 ధ్వని.

**రైక = రయిక, ఱైక.** వి. అవిక, కంచుకము. (శ. ర.)

క. పొకముడి వీడఁ బులకలు, మూఁకలిడం జెమటగ్రమ్మ మోవిచలింపన్, రైక పెరిల్లని పెట్లఁగ, రాకేందునిభాస్యఁ గొనెఁ బురాం తకుఁ డంతన్. పార్వ. 3. ౫3.

సీ. జేంట ముత్తెపుఁగుట్టుజేంటరైకలనంటి బిగి గుబ్బచన్నులు పిక్కటిల్ల .

ఉ. రా. ౬. ౧3౧.

**రైతు = రయితు.** వి. (క రైతు) సేద్యగాఁడు, కర్షకుఁడు, పంటకాఁపు.

(వ్యవ) ఇప్పుడు రైతుల స్థితి చాల బాగుపడినది.

**రైత్వము.** సం. విశే. (అ ఆ. అ.) ఇత్తడితోఁ చేయఁబడినది.

**రైవతకము.** సం. వి. అ. పుం. ౧. ద్వారకా పట్టణమునకు సమీపమున నున్న యొకానొక కొండ. ౨. పారేవతము, ఈడ. కీ.

**రైవతము.** సం. వి. అ. పుం. ౧. ఒకానొక పర్వతము, స్వర్ణాలు వృక్షము, ఈదచెట్టు.

# రొ

**రో = రో.** అవ్య. ౧. సంబుద్ధియందు స్త్రీవాచక శబ్దంబుల కమప్రయుక్తం బగునది.

ఉ. బాలరో పుష్పమంజరులపై భ్రమరంబులు ప్రాలె . దశ. ౧. ౧౧. ౪.

౨. ప్రశంసాశ్చర్యార్థములందు స్త్రీవాచకముల కనుప్రయుక్తమగు.

ఉ. అమ్మరో ధర్మరాజుఁ గానియాడఁగఁ జెల్లద యొల్లదేశముల్ . పాంచా. ౫. ౪౭.

(కొందఱాధునికకవులు పుంవాచకములకు నను ప్రయుక్తముఁ గావించిరి.)

ఉ. తప్పక చూచు నగ్గనుచు దాదులు పల్కఁ గేరి నవ్వు మా యప్పరో నిద్రపొమ్మనిన నల్లన బారలుచాఁచు (చంద్రహాస విలాసము - పూర్వభాగము.)

(ఆంధ్రకవుల చరిత్రము - ద్వితీయభాగము. 333. పా.)

రొంపెడు = రోఁజెఁడు. వి. ప్రలాపము.

సీ రోజెడు రొంజెడు . నాఁగఁ జెల్లఁగనాఁ, బ్రలాపాభిధ అం. భా. ౧. ౧౧౬.

రొండి. వి. ౧. నడుము యొక్క పార్శ్వ భాగము, కటిప్రోథము.

సీ. అడ్డంబు దిరిగి తలాపాతిఁ బడి రొండి హస్తంబులిడి యంగలార్చు కవుల ... ఆము ౭. ౧౯.

ద్వి. కరతలంబులు రొండ్లఁ గదియించు కొనుచు, బిగిసి పెందొడలు పొంపిరి రాయకుంద పండితా. పర్వత. ౩౮౩. పా.

సీ. రొండి యనం గటిప్రోథ సంజ్ఞ అం. భా. ౨. ౧౩౭.

౨. నడుము యొక్క పార్శ్వభాగమున నుండు బట్టమడత.

సీ. .. గీ. చిక్కుఁ జిలువాన మొకయుంటఁ జేర్చి కలుపు, చిలుకు ముద్రించి బిగము చేయి రొండిఁ జెక్కికొను . శుక. ౩. ౩౮౫.

జ : రొండికేటు.

రొండిపేటు. వి. (√రొండి.) మల్లబంధవిశేషము.

క. రొండికేటును ఘణంబును గశ్యాతను భారంబు .. నృసింహాంబును శ్లాదిచగు ముప్పదిరెండు విజ్ఞాణంబుల నాణెంబు పరికించి . . హంస. ౧. ౨౦౭.

వ. . . కిల్లియు కుట్టును బరిపోటును రొండి పేటును పణంబును కరాతును . . మల్లు. ఫు. ౩. ౬౪. ప్రబంధ. ౪౯.

సీ. రూణింపు బరిపోటు రొండిపేటు ... అం. భా. ౨. ౨౦౯.

రొండు. వి. శ్వాసరోగము, రోఁజు.

సీ. రొండు రోఁజు వగర్పు రొప్పన శ్వాసమూ. అం. భా. ౨. ౧౨౪.

రొండుడు. వి. రోఁజాడు, ప్రలాపము.

సీ. రోఁజాడు రొంజాడు రొద్దుడు రొండుడు .. నాఁగఁ జెలఁగ నాఁ బ్రలాపాభిధ అం. భా. ౧. ౧౧౭.

రొంప. వి. ౧. పీనసరోగము. (శ. ర.) ౨. పడిసెము. (చి. ని, శ. ర, వా)

రొంపి. వి. బురద, పంకము.

క. రొంపములు గానిరొ వనములు, రొంపు లిగిర మెయిలిగముల రొదలుడిగ నదుల్, పెంపులకుఁ బాసె మఱుముల, కంపల సంపదలు మాసె శారదవేళన్. భాగ. ౧౦. పూ. ౪౭౮.

సీ. ఏడుసాగరములు నిక్క దక్కడఁ బెట్టి పలుచని రొంపి పై నలఁది కొనఁగ .. భార. విరా. ౨. ౧౩౮.

క. ముంపుఁగొని విరుల వానల, రొంపంబులు గరిచియ నురలు నుమతోపధువుల్, కుంపట లెగయఁ బరాగపు, రొంపుల భూభాగమతి నిరూక్షిత మయ్యెన్. భాగ. ౯. ౫౧౦.

**లఘుక్రముఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) వడిగల కాలుకలవాఁడు, వేగముగా బోవువాఁడు.

**లఘుగోధూమము.** సం. వి. అ పుం. చిటి గోధుమలు, గోధుమలలోఁ జిన్నజాతివి.

**లఘుచిత్తుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. తేలికయైన మనసుగలవాఁడు, నీచహృదయముగల వాఁడు. ౨. అప్రయోజకుఁడు. ౩. చంచలుఁడైనవాఁడు, స్థిరబుద్ధి లేనివాఁడు, చంచలచిత్తుఁడు.

**లఘుచిర్భిట.** సం. వి. ఆ స్త్రీ కర్కటీభేదము, ఒక విధమైన దోస. ‡. (వాచ) ఏటిపుచ్చ, కెత్తిపుచ్చ ‡.

**లఘుచేతసుఁడు.** సం. విణ. స. లఘుచిత్తుఁడు.

**లఘుచేతస్కుఁడు.** సం. విణ (అ. ఆ అ) లఘుచేతసుఁడు.

**లఘుజాంగలము.** సం. వి. అ పుం. లావకము, ఒకజాతి పూరేడుపిట్ట.

**లఘుత.** సం. వి. ఆ. స్త్రీ. లాఘవము.

**లఘుద్రాక్ష.** సం. వి. ఆ స్త్రీ. కాకలీద్రాక్ష, గింజలేని చిన్నద్రాక్ష

**లఘుద్రావి.** సం విణ (స. టి. స.) సులభముగాఁ గరఁగునది

**లఘునామము.** సం వి స న అగురుచందనము, (లఘువర్ణయుక్తనామము గలది) (అగురు)

**లఘుపత్త్రిక.** సం వి. ఆ స్త్రీ రోచనయనెడి లత.

**లఘుపర్ణి.** సం. వి ఈ స్త్రీ. మోరవేలయనెడి లతావిశేషము.

**లఘుపాకము.** సం. విణ. (అ. ఆ. అ.) సులభముగా జీర్ణమగునది.

**లఘుపాకి.** సం. విణ. (స. టి. స.) సులభముగా జీర్ణమగునది.

**లఘుపుష్పము.** సం. వి. అ. పుం. భూమికదంబము, కొండకడిమి ‡.

**లఘుప్రయత్నము.** సం విణ. (అ ఆ. అ.) సులభమైన యుచ్చారణ గలది. (అక్షరము.)

**లఘుప్రయత్నుఁడు.** సం విణ. (అ. ఆ. అ.) అలసుఁడు, సోమరియైనవాఁడు.

**లఘుబదరము.** సం వి అ. పుం. ఒకజాతిరేఁగు, చిన్నరేఁగు. ‡.

**లఘుబదరి.** సం. వి. ఈ స్త్రీ ఒకజాతిరేఁగు, చిన్నరేఁగు. ‡.

**లఘుభవము.** సం వి. అ పుం నీచజన్మము, హీనజన్మము, స్వల్పకారణము, అల్పహేతువు.

**లఘుమాంసము.** సం వి. అ పుం ౧. ఒకజాతి కాఁజు. ౨. తీతువుపిట్ట.

**లఘుమూలకము.** సం. వి. అ న. ముల్లంగి. ‡

**లఘుమూలము.** సం. వి అ. న. సమాసకరణమునఁ దక్కువమూలము.

**లఘురాశి.** సం. విణ. (ఇ) తక్కువరాసులు గలది.

**లఘులయము.** సం. వి. అ. న. వీరణమూలము, అవురుగడ్డి, సువాసనగల మూలముగలది, వట్టివేరు. ‡

**లఘువాససుఁడు.** సం విణ. (స) చులకని బట్ట కట్టుకొనినవాఁడు, పరిశుద్ధమైనబట్ట కట్టుకొనినవాఁడు

**లఘువిక్రముఁడు.** సం = లఘుక్రముఁడు.

**లఘువు.** సం. వి. ఉ. స్త్రీ పిక్క. ‡. న. నల్లగలు, కృష్ణాగరువు (క్రి విణ శీఘ్రము. విణ. ౧. వడిగలది. ౨. చులకనిది. ౩. చేతలేనిది. ౪, ఒప్పిదమైనది.

**లఘువృత్తి.** సం. విణ. (ఇ.) ౧. చెడునడతగలవాఁడు, నీచుఁడు. ౨. అల్పుఁడు, తేలికబుద్ధి గలవాఁడు, తుచ్ఛుఁడు. ౩. పాడుచేయఁబడినది, అనుకూలముగాఁ జేయఁబడనిది.

**లఘువేధి.** సం. విణ (క. నీ. క) నిపుణతతో గురిపైఁ గొట్టినవాఁడు.

**లఘుసముత్థానుఁడు.** సం. విణ (అ. అ. అ.) చుఱుకుగాఁ బనిచేయువాఁడు.

**లఘుహస్తుఁడు.** సం. విణ (అ. అ. అ) ౧ చేయుఱుకైన చేయిగలవాఁడు, పనివానితనము గలవాఁడు, ప్రవీణుఁడైనవాఁడు. ౨. చుఱుకు గలవాఁడు వి. అ. పుం నిపుణతగల విలుకాఁడు, నేర్పుగల విలుకాఁడు.

**లఘుహృదయుఁడు.** సం. విణ (అ. అ. అ) లఘుచిత్తుఁడు.

**లఘూకరించు.** సం. స. క్రి చులకనచేయు, అగౌరవించు.

చ. మతిగల మాల్యవంతుఁ డను మంత్రి హితంబుగ నీత నన్నచో, నతిఁడు పితామహుండొనల దశాస్యుఁడు వాని లఘూకరించి .
చం. రా. ౬. ౫౩

**లఘూకృతము.** సం విణ. (అ. అ. అ) ౧ నీచముగా నెంచఁబడినది, తృణీకరింపఁబడినది, నిందింపఁబడినది ౨ సంక్షేపముగాఁ జేయఁబడినది, తగ్గించఁబడినది. ౩ పరిమాణములోఁ దగ్గింపఁబడినది

**లఘూక్తి.** సం వి ఇ. స్త్రీ సంగ్రహముగాఁ జెప్పుట, సంక్షేపముగాఁ జెప్పుట.

**లఘూత్థానుఁడు.** సం విణ (అ. అ. అ) లఘుసముత్థానుఁడు.

**లఘ్యము.** సం. విణ. (అ. అ. అ.) లంఘనీయము.

**లఘ్వాశి.** సం. విణ. (క. నీ. క) కొంచెము తినెడివాఁడు, మితభోజి.

**లఘ్వాహారుఁడు.** సం. విణ. అ. అ. అ. కొంచెము తినెడివాఁడు, మితభోజి.

**లఘ్వి.** సం. వి. ఈ. స్త్రీ. ౧. సుకుమారురాలు. ౨. చిన్నబండి.

**లచ్చన = లచ్చనము.** వి. గుఱుతు.

ద్వి. . అఖిలంబునకుఁ గర్తయగు పెద్దతియ్య, చనుదెంచి లచ్చనల్ సరవిపైఁ జూడ ..
ద్వి పరమ ౪. ౩౧౯ పా. ౯. పం.

**లచ్చనము = లక్కనము. లచ్చన** వి. (సం. లక్షణమ్) ౧ వ్యాకరణాదిశాస్త్రము.

క. లచ్చన మెఱుఁగని కవులను, జెచ్చి యని సుకవివరులు చేపట్టరుగా, మెచ్చరు వివేకి నృపతులు, మెచ్చినయవివేకి నృపులు మిడుకరె కేచా కవిజనా. అవతారిక ౪.

౨ చిహ్నము, శుభచిహ్నము

చ. సంచుల మించుబోండ్లు వచ్చినఁ జేయిఁ జాపి లచ్చనముఁ జెప్పుమనుచు సతి పుత్రకాంతచే సుదంతా ౧ ౭౪.

ఉ. లచ్చికి నాటపట్టయిన లచ్చనముల్ పరికించి చూచుచో, నొచ్చెములేని యచ్చెరువు నొందఁగఁజేసెఁ బురంబువారికిన్ .
ధర్మాత్మజా. ౪. ౯.

**లచ్చి.** వి. (సం. లక్ష్మీః. క. లచ్చి.) ౧. లక్ష్మి, విష్ణుపత్ని

చ. ఏమహార్తవేళను జనియించితో యకట లచ్చికి నమ్మధుకైటభారికిన్
సైష. ౨ ౧౩౫.

చ. నా,కదియును దేవకార్యమున కర్యోదు నంచు వహించి క్రోచులా,గద వటువయ్యు లచ్చిమది కన్నఁడుఁ బాయనివాలి నింపఁడే.
ఆము ౫ ౪౬.

౨. సంపద

ఉ. లచ్చిరి పాదచారులయి వారు జనార్థనుఁ డేఁగుదేరఁగా, లచ్చితనూవిలాసమున లావు ధనుశ్శరధారణంబుచేనచ్చుపడంగఁ గాశ్యప మహాముని యజ్ఞసమీపభూమికిన్.
ఉ. హరి. ౪. ౩౫.

క. కడులచ్చి గర్గానేనియుఁ, గుడుకుడు కట్టు దురితగాక ... భాగ. ౧౦. పూ. ౩౭౮.

3. శోభ

ఉ. వచ్చినఁ గాంచి హంసకులవల్లభుఁ డా తలి
రాకుఁబోఁడిరైు, లచ్చికి నిచ్చగించి యసు
లాపకలాపకళారసజ్ఞతన్, మెచ్చినృపాలు
పాలికిని మేకొనిపోయెదవేమొ పొమ్ము

హంస. ౨ ౨౨౧

జ లచ్చికోడలు, లచ్చిమగఁడు.

**లచ్చికోడలు.** వి ౧. రతీదేవి, మన్మథునిభార్య.

సీ. లచ్చికోడలి కన్నులకు దీటువచ్చునీ,లోత్పల
శరపంక్తు లానరఁ దాల్చి .

ఉ రా ౪ ౧౫౭.

౨. సరస్వతీదేవి

క. పలుకుఁజెలి లచ్చికోడలు, కలనితవిసితల్లి
తూఁటిగాసపుఁదేశి, గల బోటి యనఁగ
భాషా,జలజాక్షికిఁ బేరుతా నిశాకరభూషా.

అం భా. ౧. ౪౨.

**లచ్చిమగఁడు.** వి. (లచ్చి + మగఁడు) లక్ష్మిపతి,
విష్ణువు.

క. జడదారిరాయ లచ్చిమగనికత యొక్కటి
యేర్పడఁ దెల్పుమనుచు ..

నీలా. ౧. ౨౫.

ద్వి. ఆ లచ్చిమగని కథామృతాంభోది, నోల
లాడింపవే యోతంద్రి యనిన

అ. మ. క ౧. ౧౦. పొ. ౧౩. పం

**లచ్చివారము.** వి. వి. (లచ్చి + వారము) గురు
వారము. (శ. ర.)

**లజ్జ.** వి. (సం. లజ్జా క లజ్జ) సిగ్గు, మందాక్షము.

గీ సిగ్గు వా లజ్జ యనఁగను సిబ్బితి యన, నాన
యనఁ బుచ్చుడీ కనఁగాను లజ్జ, బొలుచు

అం భా. ౧. ౧౩౨

జ ' లజ్జిలు, లజ్జించు.

**లజ్జ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. సిగ్గు, తప్పుచేయుట
యెుllవానిచేఁ గలిగిన మనస్సంకోచము. (మనో
భావవిశేషము.) ౨. సిగ్గు, బిడియము, శృంగా
రాదులయందుఁ గలుగు మనోభావము. (శృంగార
లజ్జ) మనస్సంకోచము. 3. సోకుఁడుముడుఁగు
చెట్టు, అత్తప్రత్తిచెట్టు.

**లజ్జిక.** సం. వి ఆ స్త్రీ. అడవిప్రత్తిచెట్టు.

**లజ్జిరి.** సం. వి ఈ స్త్రీ. తెల్ల సోకుఁడుముడుఁగు
చెట్టు, తెల్ల యత్తప్రత్తిచెట్టు.

**లజ్జిలు.** అ క్రి. (లజ్జ + ఇలు) సిగ్గుచెడు.

ఉ సజ్జనదర్శనంబును బ్రసాదముగల్గఁ బరీభవ
వ్యథన్, లజ్జితి యగ్నిలోఁ బడఁదలంచిన
చక్కని రాజపుత్రునిన్, బుజ్జన మేర్పడన్
గరుణఁ బ్రోవఁగఁ జేకుతెవంచుఁ బ్రీతుఁడై,
యుజ్జయినీజనాధిపతి యొయ్యనవచ్చె నవంతి
భూమికిన్. ద్వా. ౮. ౧౨౪

**లజ్జాకరము.** సం విణ. (అ ఆ అ) సిగ్గును
గలిగించునది, సిగ్గు పుట్టించునది, అమర్యాద
గలిగించునది, అవమానకరమైనది.

**లజ్జాలువు.** సం విణ (ఉ) సిగ్గరి, సిగ్గుగలవాఁడు
వి. ఉ పుం. సోకుఁడుముడుఁగుచెట్టు

**లజ్జావంతుఁడు.** సం. విణ. (క.తి.క.) ౧. సిగ్గరి,
సిగ్గుగలవాఁడు. ౨. కలవరముగలవాఁడు, సంభ్ర
మము చెందినవాఁడు.

**లజ్జావహము.** సం. విణ. (అ. ఆ. అ.) సిగ్గును
గలిగించునది, సిగ్గుపుట్టించునది, అమర్యాదాక
రము, అవమానకరమైనది.

**లజ్జాశీలుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) సిగ్గరి,
లజ్జగల స్వభావముగలవాఁడు.

**లజ్జించు.** సం అ. క్రి. సిగ్గుపడు.

గీ. చన్నుగుబ్బల పోరాటఁ జక్కఁబెట్టఁ,
బోయి మధ్యస్థభావంబు పొందలేని, కతన
లజ్జించె ననఁగ నూఁగారు వల్లఁ,బాలు గురు
వింధ్యపూసల పేరు దైచు.

వరాహ. ౨. ౧౧౫.

**లజ్జితుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. సిగ్గుపడిన
వాఁడు, శృంగారాదులయందు మనస్సంకో
చము గలవాఁడు.

**లజ్జాలి.** సం. వి. ఈ. స్త్రీ. సిగ్గుపడుముడుఁగు చెట్టు.

**లజ్జా.** సం. వి. ఆ. స్త్రీ. లజ్జ.

**లటకుఁడు.** సం. వి. అ. పుం మోసగాఁడు, పోకిరి, దుర్మార్గుఁడు.

**లటక్కు.** వి. మ్రింగుట లోనగువానియందు అగు ధ్వని కనుకరణము (శ ర.)

**లటపటము.** వి. జగడము.

ద్వి. అల్లుని విని నవ్వి యాసామమాయ, కల్ల సత్యంబులు కపటకృత్యములు, లటపటం బులును లాలాతూలములును .

ప్రభు. (లిం.) ౨. ౫౦. పా. ౯. పం.

**లటపర్ణము.** సం వి అ న. పెద్దదాల్చిన, పెద్ద లవంగపట్ట

**లటభము.** సం. విశే. (అ. ఆ అ) మనోహర మైనది, అందమైనది, ఇంపైనది.

**లటము.** సం. వి అ. పుం తప్పు, లోపము

**లటవటలు.** వి బ. డంబములు, బడాయిలు.

క. నావుడు పరిభావించెద, వీవుండుటయొకఁగి కాదె యిది కేటుగ నేఁ, గావించితిఁ జేరికఁ దగ, లావించుక గలిగెనేని లటపటలేలా!

ద్వా. ౪. ౨౯

**లటుఁడు.** సం. వి. అ. పుం. ౧. మూర్ఖుఁడు, తెలివి లేనివాఁడు, అవివేకి. ౨. దొంగ, దోఁపుడు కాఁడు.

**లట్టుము.** సం. వి. అ. పుం. ౧. కర్పూర, కపాలము. (శ. ర.) ౨. భిక్షాపాత్రము.

**లట్టు.** వి. ౧. పడియ, నీళ్లునిలుచు చిన్నపల్లము. (శ. ర.) ౨. గాడి. (శ. ర.) ౩. పుండు (చి ని.)

**లట్టుఁడు.** సం. వి. అ. పుం. దుర్మార్గుఁడు, దుర్జ నుఁడు.

**లట్టువ.** (సం. లట్వా.) చిటికాకము.

చ. కరమున త్రాసనిలట్టువయు కంబళమంచము నందుఁ జంకిటన్, [illegible] గాని

తడియనివానుమ నిర్గమించె . .

హైజ. ౩. ౧౦౯. (శ ర., బ్రా. పా.)

**లట్వా.** సం. వి ఆ. స్త్రీ. ౧. ఒకజాతిపక్షి. ౨. నొసటిపై గీఁటు, లలాటరేఖ. ౩. పిచ్చుక. ౪. సంగీతసాధనవిశేషము. ౫. క్రీడ, ఆట. ౬. కుంకుమపువ్వు ౭. కులట, వ్యభిచారిణి.

**లట్వము.** సం. వి. అ పుం. ౧. గుఱ్ఱము. ౨. సంగీతమున నొకానొక రాగము. ౩. ఒకజాతి.

**లట్వుఁడు.** సం. వి అ. పుం. నృత్యముచేయు పిల్లవాఁడు.

**లడాయీ.** వి. (హిం. లడాఈ.) పోరు,యుద్ధము.

శా. లాడూఖానుని నిర్వ్యథన్ సమరలీలాకేళి కిన్ ముఖ్యుఁగా, నీదంఁబోవక మూల కొల్పుచు లడాయీకిన్ వడిన్ యొగ్గరం,వై డాయన్ సమకట్టి . రంగా. ౩. ౨౧.

**లడారి.** వి ఒకానొక తిట్టు

సీ. బొజాఁగులాఁడి లడారి బొల్లి పల్గాకి జాదరి రమెర్వెరాసిగా తలకొటూరు .

చెన్న. ౨. ౨౪.

**లడీ.** వి. నిడుపుగా చుట్టిన సరిగ లోనగువాని చుట్టు. (శ. ర., వా.)

**లడ్డిగ.** వి. (సం. లట్టః) నెయ్యి మున్నగువానిని పోసికొనెడి సన్నని మూతిగల పాత్రవిశేషము

సీ. పెల్లులోహిందికావళ్ల కొమ్ములఁబ్రేలు గిడ్డి కొత్తమ తెలిలడ్డిగములు ...

ఆము. ౨. ౯౪.

సీ. తేనెలడ్డిగ కొత్త మూని యొల్లుబిసు నెత్తిన పగడంపు మంతెనలగుములు .

చంద్రా. ౨. ౪౧.

సీ. సరుకులుంచినమాత్ర సంచిలో నంటలగట్టిన యట్టి తెలిలడ్డిగ దనర్పు.. శుక. ౩. ౪౫౩.

**లడ్డు**=లడ్డువము, లడ్వము. వి. (సం. లడ్డుకః.) చక్కెరపాకముతోఁ జేయు భక్ష్యవిశేషము. (శ. ర., చి. ని.)

**లడ్డుఁడు.** సం. వి. అ పుం. లటుకుఁడు.

**లడ్డుకము.** సం. వి. అ పుం (పంచదార, గోధుమ పిండి లేక వరిపిండి, నెయ్యి కొన్ని పరిమళ ద్రవ్యములును గలిపి చేసెడి భక్ష్యవిశేషము.) ఒకవిధమగు మధురభక్ష్యము

**లడ్డువము** = లడ్డు, లడ్వము. (సం లడ్డుకః. హిం లడ్డూ) ఒకరీతి పిండివంట, చక్కెర పాకము సెనగపిండి మున్నగువానితోఁ జేయు భక్ష్యవిశేషము

సీ. లడ్డువంబులు చక్కిలాలు సారుండలు ఖండంబు చలిమిడి మండపప్పు, గీ. లాదిగా భక్ష్య చోష్య లేహ్యాదులయిన, బహుపదార్థంబు లర్పించి ప్రణతులయిరి, వేలుపులు రాక్షసులును నవ్విష్ణుపతికి
హర ౬ ౫౫

సీ. పరమాన్నముల్ దోసె ఫలరసప్రకరంబు లిడ్డెనల్ పులగంబు లడ్డువములు.
బ్రహ్మో ౩ ౩౩౦

క. జిడ్డుగడలిదోరయల్లుం, డొడ్డుకొనం దొడంగెఁ గేలి యొడ్డుం డన్నవలా, లిడ్డ తెలినిగ్గుటెడ్డెన, వడ్డనకుం దొడ్డలడ్డువాల్ వంచుటకున్.
బహు. ౪ ౩౧

క. చలివాలు నవ్య లడ్డువములు చన్నులు పనస తొనలు మావులు . హైష. ౬. ౧౩౪

**లడ్డువు.** సం. వి. ఉ. పుం. = లడ్డుకము

**లడ్వము** = లడ్డు, లడ్డువము. వి భక్ష్యవిశేషము.

సీ. మిరియంబుతోఁ గూడ మేళవించిన లేసెఁ దోరంపులడ్వాలు దోఁచితోఁచి .
హైష ౬. ౧౨౦.

మ. ఇదిరమ్మాని కపాయనంబులు మనోభీష్టంబుగా బూరియల్, వడలుం జక్కెరకజ్జ కాయలును లడ్వా లుక్కెరల్...
రామా. ౨. ౧౧౫.

ద్వి. మునివర మాధవంబునఁ దెచ్చిసార, మను వనుఫలరాజ మనుచు లడ్వములు . .
రం. రా. బాల. ౧౩. పా. ౫. పం.

**లత.** సం. వి. ఆ స్త్రీ ౧. తీఁగ, ఎక్కుడుఁదీఁగ. (భుజలత, బాహులత, భ్రూలత, విద్యుల్లత, ఖడ్గలత, అలకలత, మొదలగుచోట్ల, అందము, మృదుత్వము, మొదలగు గుణములఁ దెలుప నుపయుక్తమగు పదము ) ౨ శాఖ, కొమ్మ. ౩. ప్రియాలులత. ౪ మాధవీలత. ౫. లతాకస్తూరిక, ఒకానొక తీఁగె. ౬. కొరడాచేబుకు, లేక కొరడా త్రాడు ౭ ముత్తెపుసరము, ముత్యాలపేరపుపేట ౮. సన్నాంగి, ఎక్కు పలుచని యాఁడుది. ౯ ఆఁడుది. ౧౦ దూర్వాతృణము †

**లతకూన.** కు వి లేఁతతీఁగవంటి యాఁడుది, లేఁతతీఁగె.

క. లతకూనల కానులసంగతిగ్గైకొని రోమరాజి ఖడ్గలతల్ పొంగతతి గెలువ మీనాంకుని, కత యప్పురి నప్రయోజకతఁ జూపక్షెన్.
రామా. ౧ ౧౨౯.

క. రతిశృంగారించి సతిన్, బతికడకుం బిలువఁ బిలువఁ బవనాచలనా, పతదేలాలతనాలో, లతనాలతకూన యొడ్గిలంబడ నగుచున్.
చంద్రా ౬. ౧౩౪.

సీ. తతవరామాదిభవ కీలతకూన కాసన్న పున్నాగ విహారి గొబ్బునను యబ్బ. వసు. ౨. ౫౯.

సీ. కొమ్మ యాలతకూన కిమ్మైన మెల రొంత కొమ్మన్నచో లతకూన యంత .
ఇందు. ౧. ౧౫౬.

సీ. లతకూనల నిలలోలప్రవాళములచే హైదేశి కులకు వీవనలు విసర. చంద్రా ౨. ౧౨౬.

సీ. లతకూనయని తగు లెమ్మతిఁ దలంపఁడుగదా చేడికాపులఁ బల్లి చేయుగాని.
సారంగ. ౨. ౧౨౬.

**లతాంగులి.** సం. వి. ఇ. స్త్రీ. వ్రేలువలె నుప యోగించు కొమ్మ.

లతాంతము. సం. వి. అ. న. పుష్పము, పువ్వు.

లతాంబుజము. సం. వి. అ. న. ఒకజాతిదోస, పందిరిదోస

లతాకరము. సం వి. అ. పుం. లతాహస్తము, హస్తాభినయవిశేషము.

లతాకస్తూరి. సం వి. ఈ. స్త్రీ. (కస్తూరివాసన గల యాకులుగల) యొకానొక తీఁగె.

లతాగృహము. సం. వి. అ. పుం, న పొదరిల్లు

లతాజిహ్వము. సం. వి అ పుం. సర్పము, పాము

లతాతరువు. సం. వి. ఉ. పుం. ౧ సాల వృక్షము ౨. తాలవృక్షము, తాటిచెట్టు. ౩ నారంగవృక్షము, నారింజ. ?

లతాననము. సం వి అ పుం నృత్యమునందలి యొకవిధమైన హస్తసన్నివేశము, హస్తాభినయ విశేషము

లతాపనసము. సం. వి అ. పుం. కర్బూజలత. (పనసకాయలవంటి కాయలుగలతీఁగె.)

లతాపర్ణుఁడు. సం. వి. అ. పుం. విష్ణువు.

లతాప్రతానని. సం వి. ఈ స్త్రీ ఒకటితో నొకటి పెనఁగొన్న తీఁగె లోనగునది. (శ. ర.)

లతాప్రతానము. సం వి అ పుం లతా సమూహము, కొన్ని తీఁగెలకుండు వక్రతంతువులు.
శ్లో. లతాప్రతానోద్గ్రథితైః స్వకేశై రధిజ్య ధన్వా విచచార దావమ్. రఘు ౨ ౮

లతాభవనము. సం. వి. అ వ. పొదరిల్లు

లతామండపము. సం. వి. అ. పుం. పొదరిల్లు

లతామణి. సం. వి. ఇ. పుం. ప్రవాళము, పగడము.

లతామృగము. సం. వి. అ. పుం. వానరము, కోఁతి.

లతాయష్టి. సం వి. ఇ. స్త్రీ. మంజిష్ఠ, వంగ దేశమందున్న చిఱువేరువంటి యొకచాయతీఁగె.

లతాయావకము. సం. వి. అ. న. చిగురు, అంకురము.

లతారసనము. సం. వి. అ. పుం. సర్పము, పాము.

లతార్కము. సం. వి. అ. పుం. హరితపలాండువు, పచ్చనీరుల్లి.

లతాలకము. సం. వి. అ. పుం. ఏనుఁగు.

లతావలయము. సం. వి అ పుం, న. పొదరిల్లు.

లతావృక్షము. సం. వి అ. పుం. కొబ్బరిచెట్టు.

లతావేష్టనము. సం. వి. అ. న ఆలింగన భేదము, ఒకరకమైన కౌఁగిలింత.

లతావేష్టము. సం. వి. అ. పుం. రతిబంధ విశేషము.

లతావేష్టితకము. సం. వి. అ. న ఆలింగన భేదము, ఒకవిధమైన కౌఁగిలింత.

లతిక. సం. వి. అ. స్త్రీ. ౧. చిన్నతీఁగె. ౨. ముత్తెములహారము.

లతోద్గమము. సం. వి అ. పుం. తీఁగెయొక్క యొగప్రాఁకుడు, తీఁగె పైకిప్రాకుట.

లత్తే. వి (క లత్తే) ౧.అపద. ౨ దెబ్బ. (శ.ర.)

లత్తిక. వి. బలుపును చప్పుడును గల యొకజాతి గచ్చకాయ (శ. ర.)

లత్తిక. సం వి ఆ స్త్రీ. ఒకజాతి బల్లి లేక ఊసరవెల్లి

లత్తిచేప. వి మత్స్యవిశేషము. (శ ర., ప్రా)

లత్తుక. వి (సం. అలక్తః) లాక్షారసము
సీ. లత్తుకరసమునఁ జొత్తిల్లఁ బదతలముల వర చేతుల ... హ. పం. ౪. ౪౫౧.
ద్వి. ముందుభిత్తిపటము లత్తుకచాయ ..., మందరమేరుసమానగాత్రంబు ...
రం. రా. యు. ౩౫౧. పొ. ౨౩. పం.
క. తోరపు లత్తుకచాయల, వారువములఁ గట్టి మహిపవరకేతువు లెల్లార సముదిత్తకేరా,

భారతి గానికేర కెక్కి సంరంభమువన్.
ఉ. రా. ౩. ౩౪౪.

సీ. .. సురుటి లత్తుకకివి, తెదరిన కాకార్మవి
జాతిన చెంగావిచీర నీవి దశా. ౮. ౩౩

జ లత్తుకబొమ్మలు = లక్కబొమ్మలు

**లత్తుకబొత్తులు.** వి. బ (లత్తుక + బొత్తులు) ధాన్యవిశేషము.

సీ. లత్తుకబొత్తులు లక్ష్మీమునోహరాల్ భారతి
పేసలు శాకాంబురులు. హంస ౪. ౧౨౮.

**లద్ది.** (క. లది. త. ఇలత్తి) గుజ్జము లోనగువాని మలము. (శ. ర.)

జ ' లద్దిపిప్పి, లద్దిపురుగు.

**లద్దిపిప్పి.** వి. (లద్ది + పిప్పి) ఒకవిధమగు చీడపురుగు. (శ. ర.)

**లద్దిపురుగు.** వి. (లద్ది + పురుగు) చివికిన కఱ్ఱలలో నుండెడి తెల్లనిక్రిమి. (శ. ర., బ్రౌ)

**లద్దె.** వి (చేయువాడు వస్త్రపుజిబరను విడిచెడి) కచ్చు. (కొందటిరూపము లద్దియ.(శ ర.)

**లపక.** వి ధనము (చి. ని, శ ర)

**లపనము.** సం. వి. అ న. ౧ మాటలాడుట. ౨. నోరు, వదనము.

**లపితము.** సం. విణ (అ అ అ.) పలుకఁబడినది, చెప్పఁబడినది, వదరఁబడినది, కొ॥
వి. అ న. మాట, వాక్కు.

**లప్ప = లప్పము.** వి ౧. రాశి, ముద్ద.

గీ ఉప్పమైనట్టి చక్కెర లప్ప లీడె, చేదు వగ
గల యమృతంపుఁజెలమ కొనరకొ .
భవిత గడుఁ దియ్యనౌ నీదు కాతెలకుసు.
శారంగ. ౨౦౮.

సీ. పచ్చకప్పురపు గుప్పలు నింగి యుంగడినిండు
మర్యాద రాయుంచనెల్ల, గుంపుగూడిన గతి
గొప్ప గందంపులప్పలు విప్పగా మంచు
పగిది. ఘటికా. ౨. ౧౪౫.

ఉ. అప్పాలపుఁబోండ్లు కెండియుఁ బ్రయత్న
ముతోఁ బలుమాఱుఁబీసులం, గప్పుర మూలది
పూనిసనక్షులఁ గొజ్జఁగనీట మాటికిన్,
దొప్పలఁగదోఁచి పీచుచుఁ జనుంగవపై వర
కాళ్లఁబోణులన్, లప్పలుగాఁగఁ జందనము
లందుచుఁ గొందలమంది రందఱున్.
కళా. ౬. ౨౫౨.

౨ పాత్రవిశేషము.

ఉ కప్పురభోగివంటకము కమ్మని గోధుమ
పిండివంటలున్, గుప్పెడు పంచదారయును
లప్పలతోడఁ గ్రాంచెరుఁగు లత్కృతి
పర్షుల యింట రూకకున్. క్రీడా. ౧౬౭.

**లప్పము = లప్ప.** (సం లేప్యమ్ క లెప్పవు) ౧ ధ్రమానిపెట్టె లోనగువాని సందుగొందులను మెత్తెడు ఒకదినుసు సున్నపుముద్ద. (శ. ర.) ౨. రాశి, ప్రోవు

చ. చక్కెరలప్పముల్ మధురసంబును జాన్న
రసాయనంబులున్, జక్కని మీఁగడల్
ఫలవిశేషములున్ మునుము న్నెమోకుఁ దా,
నెక్కడ ప్రేమతోడ భుజియింపఁగఁ బెట్టక
పుక్కిలింపదు చమ. ౨. ౩౬.

**లప్సిక.** సం. వి. అ. స్త్రీ. కృతాన్నము, ఒకవిధమైన సిద్ధాన్నము.

**లబిసీ.** వి. ఒకానొక జాతి.

**లబ్ధ.** సం వి. అ. స్త్రీ నాయికాభేదము, నాయకునిచే వంచనచేయఁబడిన స్త్రీ (ఇది విప్రలబ్ధయనుగా నుపయోగింపఁబడియుండును.)

**లబ్ధకాముఁడు.** సం విణ (అ అ అ) ౧ పొందఁబడిన కోరికగలవాఁడు, కోరిన వస్తువు సంపాదించినవాఁడు.

**లబ్ధకీర్తి.** సం. విణ. (ఇ.) పొందఁబడిన కీర్తిగలవాఁడు, కీర్తిగలవాఁడు, ప్రఖ్యాతిగలవాఁడు.

**లబ్ధచేతు(తసు)డు.** సం. విణ. స. పొందఁబడిన చైతన్యముగలవాఁడు,(స్మృతి తప్పినతర్వాత) మరలస్మృతి వచ్చినవాఁడు.

**లబ్ధజన్ముఁడు.** సం. విణ. (న్.) ౧. పొందఁబడిన వాఁడు, పుట్టినవాఁడు, ఉద్భవించినవాఁడు.

**లబ్ధనాముఁడు.** సం. విణ. (న్.) పేరు పొందిన వాఁడు, కీర్తిగలవాఁడు, ప్రఖ్యాతి పొందిన వాఁడు.

**లబ్ధనాశనము.** సం వి. అ. పుం సంపాదించినది పోవుట.

**లబ్ధప్రశమనము.** సం. వి. అ న ౧. సంపా దించినదానిని భద్రపఱచుట.

**లబ్ధము.** సం విణ (అ ఆ. అ ) ౧. పొందఁబడి నది, సంపాదింపఁబడినది ౨ పుచ్చుకొనఁబడి నది, స్వీకరింపఁబడినది. ౩ గ్రహింపఁబడినది, తెలిసికొనఁబడినది ౪. భాగహారముచేయఁగా చేర్పడినది (సంఖ్య) వి అ. న సంపాదిత పదార్థము, లేక పొందఁబడిన పదార్థము.

**లబ్ధలక్షుఁడు.** సం విణ (అ ఆ అ.) పొందఁ బడిన లక్ష్యము గలవాఁడు. ౧. లక్ష్యము (గుఱిని) కొట్టినవాఁడు. ౨. అస్త్రప్రయోగము నందు నేర్పుగలవాఁడు

**లబ్ధలక్ష్యుఁడు.** సం విణ. (అ. ఆ. అ.) లబ్ధ లక్షుఁడు

**లబ్ధవర్ణభాక్కు-(జుఁడు).** సం. విణ. (జ్ ) విద్యా వంతులను గౌరవించెడివాఁడు.

**లబ్ధవర్ణుఁడు.** సం విణ (అ ఆ అ.) ౧ విద్యావంతుఁ డైనవాఁడు, చదువుకొనినవాఁడు ౨. ప్రఖ్యాతి పొందినవాఁడు, ప్రసిద్ధుఁడు

**లబ్ధశబ్దుఁడు.** సం. విణ (అ ఆ అ ) పేరు పొందినవాఁడు, ప్రఖ్యాతి సంపాదించినవాఁడు.

**లబ్ధసంజ్ఞుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) పొందఁ బడిన చైతన్యము గలవాఁడు, తెలివి వచ్చిన వాఁడు.

**లబ్ధసిద్ధి.** సం. విణ. (ఇ.) ౧. పరిపూర్ణతను సంపా దించినవాఁడు. ౨ కామితార్థమును సంపా దించినవాఁడు, కోరిక నెఱవేర్చుకొనినవాఁడు

**లబ్ధాంతరుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) సమ యము దొరికినవాఁడు, తరుణము కనిపెట్టిన వాఁడు. ౨. పొందఁబడిన ప్రవేశముగలవాఁడు, ప్రవేశమును సంపాదించినవాఁడు.

**లబ్ధావకాశుఁడు.** సం. విణ (అ ఆ. అ.) ౧. (పొందఁబడిన యవకాశము గలవాఁడు.) సమ యము లేక తరుణము కనిపెట్టినవాఁడు. ౨ తెఱపి(విరామము) గలవాఁడు, పొందఁబడిన విరామము గలవాఁడు

**లబ్ధి.** సం వి ఇ స్త్రీ ౧ పొందుట, ప్రాప్తి, సంపాదన. ౨ లాభము, ఆదాయము. ౩. భాగ హారలబ్ధము, భాగింపఁగా వచ్చిన సంఖ్య.

**లబ్ధ్రిమము.** సం విణ (అ ఆ. అ.) పొందఁ బడినది, సంపాదింపఁబడినది, స్వీకరింపఁబడినది.

**లబ్ధోదయము.** సం విణ (అ ఆ అ) ౧. పుట్టి నది, ఉద్భవించినది, బయలుదేఱినది. ౨. సంపత్తు పొందినది, అభివృద్ధి పొందినది.

**లబ్బే.** వి (హిం. లబ్బె) మహమ్మదీయులలో నొక తెగవారు. (శ ర , బ్రౌ , వా )

**లభనము.** సం. వి అ న ౧. పొందుట, సంపా దించుట మొ॥ది ౨ తలఁచుట, భావించుట.

**లభసము.** సం వి అ. పుం ౧ ధనము, ఐశ్వ ర్యము, సంపద పుం., న అశ్వబంధనము, గుఱ్ఱ మును గట్టెడి త్రాఁడు

**లభసుఁడు.** సం వి అ పుం ప్రార్థించువాఁడు ప్రార్థయిత

**లభి(యిం)చు.** సం అ. క్రి కలుగు, ప్రాప్తించు.

మ. అయ్యస్త్రరాజము సాకుఁ లభి
యించె .. భా. రా. ౩. ౧౦.

భా. కామితదాయినైన నినుఁ గన్గొనినంత నినంత
లోకలో,కామిత చింతితార్థము లయారె
లభించె యటంచు చేడికన్ ...

భా. రా. ౧౨. ౨౩.

**లభ్యము.** సం. విణ. (అ ఆ అ.) ౧. సంపాదింప శక్యమైనది, లేక పొందశక్యమైనది, పొందఁ

దగినది, అంటుకొనశక్యమైనది, అందుకొనఁదగినది. ౨. గ్రహింపఁదగినది, తెలిసికొనఁదగినది 3. అర్హమైనది, తగినది, యుక్తమైనది ౪ స్పష్టమైనది, చేక్కగఁ దెలియునది. ౫. అమర్పఁదగినది, సిద్ధపఱుపఁదగినది

**లమకుండు.** సం వి అ పుం. ప్రియుఁడు, విటుఁడు, జారుఁడు.

**లయ.** వి. హాసము. (చూ. లయకారి ) (శ ర, ప్రా )

జ లయకాఁడు, లయకారి

**లయకాఁడు.** విణ (లయ + కాఁడు) హాసకాఁడు (ప్రా )

**లయకారి.** విణ (లయ + కారి) హాసకాఁడు

గీ రంగఁ డని పేరుపైత మెఱుఁగఁ జెప్పె, న
వ్వడుగు శిష్యుఁడే లేఁడటంచు నతని, గప్పి
పెట్టెడి నీ లయకారి దొంగ, ఏది గుఱి
కళ్లతో నిజ మెట్టు లోపు

హైజ ౪. ౯౨. (ప్రా., శ ర పా )

**లయకాలము.** సం. వి అ పుం. (ప్రపంచము యొక్క) నాశనకాలము, ప్రళయవేళ.

**లయగతము.** సం విణ (అ ఆ. అ.) కరఁగినది, ద్రవముగా నయినది

**లయనము.** సం వి అ న. ౧ అంటుకొనుట, తగిలియుండుట ౨ విరామము, తెఱపి, విశ్రాంతి 3 ఇల్లు, విశ్రాంతిస్థానము

**లయపుత్రి.** సం వి ఈ స్త్రీ. నటి, వేషకత్తె, (నృత్యముచేయు స్త్రీ) నర్తకి

**లయము.** సం వి అ. పుం. ౧. తగులుకొనియుండుట, కలిసియుండుట లేక కూడియుండుట, అంటుకొనియుండుట. ౨. నక్కుట, దాఁగియుండుట. 3. కరఁగించుట, ద్రవరూపముగాఁ జేయుట. ౪. అగోచరమగుట, కనుపడకుండుట, నశించుట, స్వరూపములేమి. ౫ మనస్సు విశ్వమెందుట, తదేకధ్యానము, తదేకాగ్రత. ౬. సంగీతమున ద్రుతము, మధ్యము, విలంబితము అని మూఁడువిధములుగల కాలము. ౭ సంగీతమున విరామము, నిలుపు. ౮. విరామము, విశ్రాంతి, తెఱపి ౯. విశ్రాంతి తీసికొనెడిచోటు, నివాసము ౧౦. బుద్ధిమాంద్యము, మానసికమాంద్యము ౧౧. ఆలింగనము, కౌఁగిలి. ౧౨ ఆత్మ, బ్రహ్మము. ౧౩. నృత్యగీత వాద్యములయొక్క యేకతానతా రూపమగు సామ్యము, తౌర్యత్రిక సామ్యము (ఈయర్థమున లయ యనియే రూపము.)

సీ. లయదప్పకుండ మెల్లనె సొగపురివిచ్చినమ్మి
బోదలు పేరణములు ద్రొక్క .

చంద్రా ౬. ౧3౧

వ. నీటికట్టెవేరు. (శ. ర.)

వృషభగతిరగడ లతిక లతికమనీయ కర కిస
లయము లయమున నాడె నిత్యతి

వసు. 3. ౧౪౯.

**లయార(ల)ంభుఁడు.** సం వి. అ. పుం. ౧ నటుఁడు, వేషకాఁడు. ౨. నృత్యము చేయువాఁడు

**లయార్కుఁడు.** సం. వి. అ. పుం. ప్రళయకాల మందలి సూర్యుఁడు

**లయించు.** సం అ క్రి ౧ నశించు.

సీ అఖిలభూతములు నాయం దుద్భవించు
వర్తించు లయించు వర్తింప నేను, వానివలెం
బున భార అను ౧. 3౭౭.

౨ సకర్మకు

వ జీవుండయిన తన్ను నవ్యయంబయిన బ్రహ్మ
మందును లయింపంజేసి

భాగ. ౧. 3౨౫.

సీ. ... కమలనాభు .. ఆ నందు మును
లయించి నట్టిగుణంబులు మూఁటఁ దొలఁత
సత్త్వమునకుఁ దోఁచుఁ, గలిమి దాన నుండెఁ
గమలోద్భవుఁడు రజ, స్తమును లనురలమ్మొ
ధరణినాథ. భార శాం. ౬. ౪౬౯.

ద్వి ... మనసు తత్త్వంబున మరపి లయించి,
చనకేర్పు నకేఁడె సుజ్ఞాని యుక్తముఁడు

ప్రభులిం. ౫. ౧౫౭ పా ౫. పం

**లయ్యా.** వి (సం. లంజా) వేశ్య. (ఇది లక్షణ గ్రంథములయందు వ్రాయఁబడియున్నది గాని దీనికిఁ బ్రయోగము మృగ్యము (శ ర)

**లలంతిక.** సం వి ఆ స్త్రీ. ౧. పొడవైన కంఠహారము ౨. బల్లి, ఊసరవల్లి.

**లలజిహ్వము.** సం విణ. (అ అ. అ.) వ్రేలాడు నాలుకగలది వి అ పుం ౧ కుక్క. ౨ ఉష్ట్రము, ఒంటె

**లలజ్జిహ్వము.** సం విణ (అ అ అ) ౧ నాలుక వ్రేలాడ్చునది ౨ క్రూరమైనది, భయంకరమైనది వి అ. పుం. ౧ కుక్క. ౨ ఒంటె

**లలతి.** సం క్రి ౧. ఆడుచున్నది, ఆటలాడుచున్నది ౨. కదులుచున్నది, ప్రకాశించుచున్నది, తళతళమనుచున్నది, ఇటునటుఁగదులుచున్నది 3 (నాలుక) వ్రేలాడుచున్నది.

**లలన.** సం వి ఆ స్త్రీ. ౧. ఆఁడుది, స్త్రీ. ౨ స్వైరిణి, వ్యభిచారిణి యగు స్త్రీ 3 నాలుక.

**లలనము.** సం. వి. అ. న. ౧. ఆట, క్రీడ, చెలగాట ౨. నాలుక వ్రేలాడించుట. 3 సాల వృక్షము ౪ ప్రియాలవృక్షము.

**లలనాప్రియము.** సం వి అ పుం కదంబ వృక్షము, కడిమిచెట్టు.

**లలనిక.** సం వి. ఆ స్త్రీ. ౧. చిన్నదియగు స్త్రీ. ౨. దీనురాలు, దుఃఖస్థితిలో నున్న స్త్రీ.

**లలనుఁడు.** సం. వి. అ. పుం. బాలుఁడు, పిల్లవాఁడు.

**లలము.** సం. విణ (అ. అ. అ) ౧ క్రీడాశీలమైనది, ఆటలాడునది. ౨. (నాలుక) వ్రేలాడ్చ కొనియుండునది. 3. కోరునది, కోరికగలది.

**లలాకము.** సం. వి. అ. పుం. శిశ్నము, మేఢ్రము.

**లలాటంతపము.** సం. విణ. (అ. అ. అ.) ౧. నుదుటిని మాడ్చునది, లేక నుదురు కందఁజేయునది. ౨. మిక్కిలి బాధపెట్టునది, చాల బాధ గలిగించునది.

**లలాటంతపుఁడు.** సం వి. అ. పుం. సూర్యుఁడు.

**లలాటతటము.** సం. వి. అ. న. నొసలు, నిటల తటము, లలాటప్రదేశము

**లలాటపట్టము.** సం. వి అ. పుం. ౧. ప్రశస్త లలాటము. (వాచ) ౨ నొసటి చేదునైన చోటు, చేదునైన లలాటప్రదేశము. 3. ఒకవిధమైన కిరీటము, తలకెంద్రుకలు ఎత్తికట్టునాడా?

**లలాటపట్టిక.** సం వి ఆ స్త్రీ. లలాటపట్టము.

**లలాట(క)ము.** సం.వి అ న ౧. నుదురు, నొసలు. ౨. అందమైన నుదురు, ప్రశస్త లలాటము.

**లలాటరేఖ.** సం వి ఆ స్త్రీ. ౧ నొసటిపై వ్రాయఁబడిన పంక్తి, నొసటిగీటు ౨ ముడుతలుగల నొసలు 3 ముఖముపైఁబెట్టికొనెడి మతసంబంధమైన రంగుబొట్టు, తిలకము బొట్టు.

**లలాటలేఖ.** సం వి. ఆ. స్త్రీ. లలాటరేఖ, నొసటిపై గీటు లేక పంక్తి.

**లలాటాక్షుఁడు.** సం వి. అ. పుం. నిటల నేత్రుఁడు, శివుఁడు.

**లలాటిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧. నుదుటిపైఁబెట్టికొనెడి నగ. ౨ నుదుటిపై మంచిగంధముతోఁ గాని యితరమైన పరిమళముగల చూర్ణములతోఁ గాని ధరించెడి చిహ్నము.

**లలాటూలుఁడు.** సం విణ. (అ. అ. అ.) ఎత్తైన లేక అందమైన లలాటము గలవాఁడు.

**లలామకము.** సం. వి. అ న. నుదుటిపై నుంచుకొనెడి పూలదండ

**లలామము.** వి. అన్. న ౧ నుదుటి యలంకారము. ౨. నగ, అలంకారము. 3 (ఉత్తర పదమైనపుడు స్వజాతిలో శ్రేష్ఠవస్తువు (ఈయర్థమున నిది చరిత్రాదులలోనిది ఉదా: సాక్షీ లలామము, అబలాలలామము )

ఉ. ఈ యబలాలలామ కెన రేయుఁగముందును గాన ... కళాం. ౨. ౯౨.

౪. కొసకట్టైన సుంచుకొంచిడి బొట్టు. ౫. గుటుకు, సంజ్ఞ. ౬. కొక్కెము, జండా. ౭. శ్రేణి, పంక్తి ౮ తోఁక ౯. (గుబ్బము, సింహాము మొ॥ వాని, జూలు. ౧౦ ఘనత, గొప్పతనము ౧౧. అందము. ౧౨. కొమ్మ అ పుం గుబ్బము (అ ని)

**లలి.** వి ౧ ప్రేమ, అనురాగము

క. పలుమఱుఁ దలయంటితగ, న్నలుగిడిదోయిళ్ల జలమునన్ బోర్లాడించి లలిం జన్నిచ్చుచు ను,య్యాల నూఁపుచుఁ జెనుపఁదొడఁగా వాపరశిశువున్. కళా. ౭. ౧౯౩

మ. . తెల్పుంజకోరత్తుణల్, లలి భీమేశ్వరు రాజశేఖరునిఁగొల్వన్ వచ్చి రొక్కుమ్మడిన్ భీమ. ౫. ౧౦౭.

౨. విశ్వాసము

గీ. మగువ తాటంకయుగ్మంబు మన్మథునకు, అత్న్యయుగ్మంబు గాఁబోలు లలిఁ దలంపఁ, గడఁగి సవ్యాపసవ్యమార్గణము చేయ, నైన రంధ్రంబు గాదె తదంతరంబు
నైష. ౫. ౧౩.

ద్వి. ఇనవంశచంద్రుచే నింద్రారిహోమము, వని తంబు నిటు వాడు ననినచందమున, దశముల బిగుతెల్లఁ దప్పి యందంద, లలిదక్కుచును గములంబులు మ్రొగిడె
రం. రా యు ౨౭౫ పొ. ౭. పం.

౩. ఉత్సాహము

ఉ. పాలికులెన్నఁడుం దగని యారులచేలును కొకుమల్లునుం,గా లలిచే నేలసాగి రిలఁ గల్గు పసింగొని పేద మున్న గాన్.
ఆము ౪ ౧౨౪.

మ. . . త్రేపల్లెకుఁ లలిమై నేఁగినఁ దన్ని వాసులు మహోల్లాసాత్ములై యమ్మహా,బలు నంతంత నెదుర్కొనంగ నతఁడుఁ బంధుత్వ దారేయతన్ హరి ఉ. ౨. ౭౧.

౪. క్రమము.

మ. లలిఁ జకోరంబుల తలఁపులు గంపింపఁ జక్ర వాకంబులు సంతసింప విక్ర. ౨. ౧౦౭.

క లలి నలరుఁ గొమ్మ లనువ, త్రిలిసద్ద్విజరాజ సంగతిఁ దగి సువర్ణో,జ్జ్వలమై సుమనోభి నుతిన్, దలరి పురము కోట తోఁట తనరు ఘనశ్రీన్. కవిజ ౧ ౪౨

క లలిఁ జాలింతతనంబులఁ, దలరెడు నమ్మద్దు నేలదాలుపునవలా, తలమానికముల కటు ల, న్నెల తేర్పడఁ బొమ్మిదియును నిండారు టయున్ అచ్చ రా. బాల. ౭౩.

౫ విలాసము

సీ పలు తేఁడులకు నూడు బలియించి పొలి యించి లలిఁ గెరు పంటవలంతి సరిరొు.

గీ యిత్వెలందుక కని తనయీడుచేడె, లంద ఱును డెందముల నుబ్బియాడుకొనంగ.
నీలా ౧ ౫౨

సీ విలాస మొప్పచుండు, నవ్యయమై రమేతదర్థంబునందును లలి యన నొకశబ్ద మలరుచుండు ఆం భా ౧౩౯.

౬ వాక్యాలంకారము

సీ పద్మరాగవిభూషణ ప్రతతి మాఱు, లలి నశోకలతాప్రవాళములు దాల్చి .
హర. ౩ ౭౭

క లలిగంగాస్నానంబునఁ, దొలఁగంగలపాత కము చతుర్దశభువనం,బులు గూడిచేయఁ జాలవు కొలఁదిరొు గంగాతిశయము గుణ రత్ననిధీ జాహ్నవి ౩. ౭౨

సీ లలిఁ దొక్కఁబల్కులు పలుకనేర్చినవాఁడె పరికించి సత్యంబు పలుకనేర్చె.

౭ అశ్వశిక్షాభేదము

సీ లలి గూర్చి లలి దేర్చి లాఁగించి ...
పి. శకుం. ౧౧౨.

**లలిత.** సం వి. అ. త్రి. ౧. ఆఁడుది, త్రి. ౨. కాముకురాలు, కామాతురత గల త్రి. ౩. కస్తూరి. ౪. దుర్గావతారభేదము. ౫. ఛందోభేదము ౬. (సంగీ) ఒకానొక రాగము.

**లలితపదబంధనము.** సం. వి. అ. న. ౧. సొగసైన పదములు కూర్చుట. ౨. మనోహరమైన పదములుగల కావ్యము.

**లలితపదము.** సం విశ (అ. ఆ అ) సొగసైన పదములు గలది ౧ సొగసుగా రచింపఁబడినది ౨ శృంగారరస సంబంధమైన పదములుగలది

**లలితప్రహారము.** సం వి అ పుం మెల్లమెల్లగా కొట్టుట

**లలితము.** సం విశ (అ ఆ అ.) ౧ క్రీడాశీలము, ఆటలాడునది, సయ్యాటలాడునది ౨. మనోహరమైనది,అందమైనది,సొగసైనది ౩ ఉల్లాసకరమైనది,సంతోషకరమైనది ౪ మంచిది ౫ కోరఁబడినది, ఈప్సితమైనది ౬ మృదువైనది, సుకుమారమైనది ౭ వణఁకెడునది, కంపముగలది వి అ పుం సంగీతమున సర్వభేదము న ౧ ఆట, సయ్యాట, కేళి ౨ శృంగారవినోదము, గమనముయొక్క సొగసు, సుకుమారతచేత నగు నంగవిన్యాసరూపమైన స్త్రీయొక్క శృంగారచేష్ట ౩ అందము, సొగసు, మనోహరత ౪ స్వాభావిక కృత్యము ౫ నిష్కాపట్యము, అమాయికత్వము.

**లలితలలితము.** సం. విశ (అ. ఆ అ.) మిక్కిలి యందమైనది, అత్యంతసుందరమైనది

**లలితలులితము.** సం విశ (అ ఆ అ) దుర్బలమైనదియైనను మనోహరమైనది.

**లలితాపంచమి.** సం వి ఈ స్త్రీ. ఆశ్వినశుక్లపంచమి

**లలితాభినయము.** సం విశ. (అ. ఆ. అ) సొగసైన యభినయము గలది

**లలితార్థము.** సం. విశ (అ. అ. అ) అందమైనదేని శృంగారరససంబంధమైన యర్థము గలది.

**లలితాసప్తమి.** సం వి ఈ. స్త్రీ భాద్రపదశుక్లసప్తమి

**లలితుఁడు.** సం. విశ. (అ. ఆ అ) కామాతురత గలవాఁడు, విషయాసక్తుఁడైనవాఁడు భోగములయందాసక్తి గలవాఁడు.

**లవంగకము.** సం వి. అ న లవంగము.

**లవంగకలిక.** సం వి ఆ. స్త్రీ లవంగపుమొగ్గ.

**లవంగము.** సం. వి అ పుం లవంగలత. న లవంగములు

**లవణ.** సం వి ఆ స్త్రీ లావణ్యము, అందము, సౌందర్యము

**లవణక్షారము.** సం వి అ న. ఒకదినుసు ఉప్పు

**లవణజము.** సం వి అ న. సముద్రపు టుప్పు

**లవణజలము.** సం వి అ పుం సముద్రము.

**లవణజలోద్భవము.** సం వి అ పుం పురుగులపై చిప్ప, గుల్ల

**లవణము.** సం విశ (అ ఆ అ) ౧ ఉప్పుగానున్నది ౨ మనోహరమైనది, అందమైనది. వి అ పుం ౧ ఉప్పన, (లవణరసము) ౨ ఉప్పునీటిసముద్రము ౩ ఒకనరకము న. ౧. ఉప్పు, సముద్రలవణము ౨ కృత్రిమముగాఁ జేయఁబడిన యుప్పు, చేయఁబడిన యుప్పు.

**లవణమేహము.** సం వి అ పుం మూత్రరోగభేదము

**లవణసముద్రము.** సం వి అ పుం ఉప్పునీటి సముద్రము, సముద్రము

**లవణాంతకుఁడు.** సం వి అ పుం శత్రుఘ్నుఁడు.

**లవణాంభస్సు.** సం. వి స్. పుం (ఉప్పునీరు గలది) సముద్రము, న ఉప్పునీరు

**లవణాకరము.** సం. వి అ. పుం. ౧ ఉప్పుగని. ౨. ఉప్పునీటిస్థానము, సముద్రము. ౩. సౌందర్యనిధి.

**లవణాలయము.** సం. వి అ. పుం సముద్రము.

**లవణి.** వి ౧. పాకము, క్రొంగు

వ. లోకమాతచేతి లవణి పెట్టచేతం జెల్లాచెదరగు పసిఁడిచిప్పల జోళ్లతోన సుభగులైన శరీరంబులతోడ . .

వరాహ. ౧౧. ౧౦౫.

— విగువు.

సీ. విశేయమైన యొడ్డాణంబు లవణిచే నక్కళించిన పొట్ట మక్కళించి

మనుచ ౧ ౫౯

**లవణిమ.** సం. వి. న్. పుం. ౧ ఉప్పని, ఉప్పతనము — సౌందర్యము, అందము, సొగసు

**లవణుఁడు.** సం. వి. అ. పుం. మధువను రాక్షసుని కుమారుఁడగు నొకానొక రాక్షసుఁడు ఇతఁడు శత్రుఘ్నునిచే జంపఁబడినవాఁడు

**లవణోత్తమము.** సం. వి. అ. పుం. ౧ జాతియుప్పు, గనియుప్పు — పెట్లుప్పు, సురేకారము

**లవణోదము.** సం. వి. అ. పుం. ౧ సముద్రము — ఉప్పునీటి సముద్రము

**లవనము.** సం. వి. అ. న. ౧ ... కొడవలితోఁ గోయుట — కొడవలి, కొడవలి వంటి కోఁతకత్తి

**లవము.** సం. వి. అ. పుం. ౧ కోఁత కొడవలితోఁ గోయుట — (వరి) కోయుట

**లవలవ[1].** విశ. భేదిల్లినది, బ్రద్దలయినది

ద్వి. పటువజ్ర నిష్ఠుర పాదఘట్టనల, లవలవయై కులలంబు గ్రక్కదల

ద్వి. హరిశ్చ. పూ. ౨౦౬౭

**లవలవ[2].** వి. కదలుటయందలి ధ్వనికనుకరణము

చ. లవలవఁ జన్నుఁ దోయి గదలన్ దొలఁకారు మెఱుంగుఁదీఁగెలం, గవగవ నవ్వుడాలు తెలికన్నులమించులు చౌకళింపఁగా, నవ నవ యౌవనంబు గల నాటి ధవత్పురపాయి తోడ్తఁతుల్, శివశివ యెన్ని భంగులను జిత్తములో మఱువంగవచ్చునే

క్రీడా. ౧ ౨౧౪

**లవలి.** సం. వి. ఈ. స్త్రీ. ఒకానొక తీఁగె.

**లవలేశము.** సం. వి. అ. పుం. అత్యంతాల్పాంశము.

వ. అవశంనీకృత కాతమన్యవజయుండై దుర్జయ త్మ్మవధూధవుఁ డర్పించినధూర్తకీర్తిసుషమాధావళ్యముల్ ముట్టుకొన్న విహారంబులు మాపఁగా బెణచిలీనాశైవ చందంబునఁజ్, లవలేశంబును లేకపోయె మహీయెల్లన్ వంచుసంచారముల్

వరాహ ౩ ౩౦

**లవాకము.** సం. వి. అ. పుం. ౧. కొడవలి, కోఁత పనిముట్టు — కోఁత, కొడవలితోఁ గోయుట.

**లవాజిమా.** గ్రామసేవకుల జీతములకై తీసికొనఁబడు కొద్దిపన్ను (శ. ర.)

**లవాణకము.** సం. వి. అ. పుం. కొడవలి, కొడవలివంటి కోఁతపనిముట్టు

**లవి.** సం. విశ. (ఇ) వాఁడిగలది వి. ఇ. పుం. లవిత్రము, కొడవలి (అ. ని.)

**లవించు.** సం. స. క్రి. కోయు

**లవిటి[1]**(టీ). వి. ౧ పక్షిపుచ్ఛము

సీ. లావు లవిటి నా నలరుఁ బక్షిపుచ్ఛాఖ్య

ఆ. భా. ౨ ౯౯.

వ. కిలకొట్టుచు కెక్కలార్చుచు లవిటీలఁ ద్రిప్పుచు బింభములుసేయుచుఁ దలలాడింపుచుఁ గిటుకుకటుక్కనఁ బల్లుసోఁక బిరబిరం జుట్టుకొని

ప్రబంధ ౪ ౭౭.

సీ. బూరుగకాయబోల్ బోరలు లవిటీల కొన కత్తెరలకట్లు కొంకిగోళ్లు

ప్రబంధ ౧. ౩౦

— గుజ్జుపులోఁక

సీ. కంద మనంగను స్కంధంబు దగుఁ దోఁక లవిటి నాఁగను బుచ్ఛము విలసిల్లు

ఆం. భా. ౨ ౧౯౪.

**లవిటి.[2]** విశ. బధిరుఁడు చెవిటివాఁడు.

సీ. లవిటి, గీ చెవిటి యనఁగను బధిరుండు చెలఁగు

ఆం. భా. ౨ ౧౨౦

**లవిత్రము.** సం. వి. అ. న. కోఁతపనిముట్టు, కొడవలి.

**లవుడి = లవుణి.** వి. ఆయుధవిశేషము.

క ఆచక్రము పాలితమైన నిలాచక్రముమీఁది
కుతికి లవుఁడు లవుడి బాహాచటులవిభ్రమ
భ్రమరీచండిమరేఖ సంతరించుచు విసరన్
కై భా. ఉ. ౧౪౩.

**లవుణి = లవుడి.** వి ఆయుధవిశేషము
ద్వి తోమరంబులువేసి ద్రుంచు మావుతులు,
లవుణి సారించి పల్లమును గుజ్జమును, రవు
తును జదియ బోరన మోదువారు
ద్వి భాగ ౪ ౭౧

**లశునపటలము.** సం వి అ పుం రత్నదోషము
సీ పాలు పైఁబూసిన లీలనుండెడు డాలు లశున
పటల మది లక్ష్మి జెఱచు రత్నపరీక్ష ౧౫

**లశునము.** సం వి అ పుం న వెల్లుల్లి ‡

**లషితము.** సం విణ (అ ఆ అ) ఈప్సితమయి
నది, కోరఁబడినది

**లష్వుఁడు.** సం. వి అ పుం నటుఁడు, నర్త
కుఁడు, నృత్యము చేయువాఁడు

**లస.** సం వి ఆ స్త్రీ ౧ కుంకుమపువ్వు, ౨
పసుపు

**లసకము.** సం. వి. అ పుం ౧. నృత్యము. ౨
నెమలి ౩ కౌఁగలించుకొనుట న మేడమీఁది
గది విణ ౧ లాస్యముచేయునది, ఆటాడు
నది ౨ ఇటునటు కదలునది

**లసిక.** సం వి ఆ స్త్రీ ఉమ్మి, నోటలో
నుండెడి యుమ్మినీరు

**లసితము.** సం విణ (అ ఆ అ) ౧ ఆటలాడి
నది, క్రీడాశీలమైనది. ౨ కనుపడినది, రూపము
దాల్చినది. ౩. అవతరించినది, దుమికినది, దిగినది

**లసీక.** సం వి. ఆ స్త్రీ. ౧ చొంగ, ఉమ్మినీరు,
లాల. ౨. రసి, చీము. ౩. చెఱకురసము,
చెఱకునీరు. ౪ చెమట.

**లసుకు.** స. క్రి వశింపఁజేయు
చ. లసికిరిజోదు లగ్గలిక లగ్గలకెక్కినఁ గుంత
పంక్తులన్, వసుమతిఁ గూల్చియున్ గదల
వైచియుఁ గత్తుల వ్రక్కలించియున్, వసుల
వధించియున్ ముసలవర్గములంబడ మోది
నాలుకల్, మసలక వేసి వంచియును మందుల
తిత్తులు గాల్చివైచియున్. రా వి ౫. ౩౧.

**లస్తకము.** సం వి అ పుం. ధనుర్మధ్యము,
పిడికట్టు, విల్లుపట్టుకొనెడిచోటు

**లస్తకి.** సం వి న్ పుం విల్లు, ధనుస్సు

**లస్తము.** సం విణ (అ ఆ అ) ౧. కౌఁగిలింపఁ
బడినది ౨ ప్రవీణతగలది, నేర్పుగలది

**లస్తరీ.** వి వస్త్రవిశేషము
సీ బందరుచీటి లస్తరీలు హంస ౫ ౩౫౦.

**లహరి.** సం వి ఇ ఈ స్త్రీ అల, తరంగము,
పెద్దయల ఉదా ఆనందలహరి, కరుణాలహరి,
సుధాలహరి మొ॥

# లా

**లా.** సం వి ఆ స్త్రీ ౧ పుచ్చుకొనుట, ఆదా
నము ౨ ఇచ్చుట, దానము

**లాంగడము.** విణ వికాలము
వ పంజగమ్మున రంజిల్లు క్రొంజిలుకల జిలి
బిలి పలుకులఁ బోలుపగు లాంగడపు జంట
జవంతి ఇందు ౧. ౧౪

**లాంగలగ్రహుఁడు.** సం వి అ పుం కర్షకుఁడు,
మన్నెదువాఁడు, సేద్యగాఁడు

**లాంగలదండము.** సం వి అ పుం నాఁగలి
కఱ్ఱ ఏఁడికోల

**లాంగలధ్వజుఁడు.** సం. వి అ. పుం నాఁగలి
చిహ్నము టెక్కమునఁగలవాఁడు, బలరాముఁడు.

**లాంగలపద్ధతి.** సం. వి. ఇ. స్త్రీ. నాఁగటి
చాలు.

**లాంగలఫాలము.** సం. వి అ. పుం. నాఁగేటి
కఱ్ఱు, నాఁగటిదుంపయం దమర్చెడి యినుప
పాళము.

**లాంగలము.** సం. వి అ న ౧ నాఁగలి ౨ నాఁగలివలె చేర్పఱిచిన దూలము, ౩. తాటిచెట్టు ౪. లింగము, మగగుఱి ౫ ఒకజాతి పుష్పము, (శ ని ) ౬. చంద్రునియొక్క యొక విధమగు రూపము ౭ ఇంటిదూలము, గృహదారు విశేషము. (వై ని )

**లాంగలి.** సం వి స్ పుం ౧ బలరాముఁడు. ౨ కొబ్బరిచెట్టు ౩. పాము వి. ఈ. స్త్రీ ౧ కొబ్బరిచెట్టు ౨ ఎరిగొట్టుచెట్టు ౩ నీరుపిప్పలి

**లాంగలికము.** సం విణ (అ ఈ అ ) లాంగల సంబంధి, నాఁగలికి సంబంధించినది
వి అ పుం ఒకవిధమగు విషము

**లాంగలికి.** సం వి ఈ స్త్రీ విషలాంగల, ఒక జాతిచెట్టు

**లాంగలీష.** సం. వి అ స్త్రీ నాఁగేటికఱ్ఱ, ఏఁడికోల

**లాంగులము.** సం వి అ న ౧ తోఁక ౨ లింగము, మగగుఱి

**లాంగూలము.** సం వి అ న ౧. తోఁక ౨ లింగము, మగగుఱి (వై. ని ) ౩ ధాన్యపుఁగొట్టు పుం అభినయహస్తవిశేషము (ఉంగరముఁ వ్రేలిని వంచి, చిటికెనవ్రేలిని పైకెత్తి కడమ మూఁడువ్రేళ్లను ఊర్ధ్వాకారముగా త్రేతాగ్నులవలె పట్టునది) (శ ర )

**లాంగూలి.** సం వి స్ పుం క్రోఁతి, వానరము.

**లాంగూలిక.** సం. వి అ స్త్రీ పృశ్నిపర్ణి, కోలపొన్న. క్రి. (రా. ని )

**లాంఛనము.** సం. వి. అ. న. ౧. గుఱుతు, నైసర్గికచిహ్నము. ౨. కళంకము, మచ్చ, అప్రతిష్ఠాచిహ్నము. ౩. చంద్రునికళంకము. ౪. పేరు, సంజ్ఞ ౫. హద్దుఱాయి, పొలిమేరఱాయి.

**లాంఛితము.** సం. విణ (అ. ఆ అ.) గుర్తుపెట్టఁబడినది, భిన్నముగాఁ జెప్పఁబడినది, గుణవిశేషములతో జెప్పఁబడినది ౨. పేర్కొనఁబడినది, పేరుపెట్టఁబడినది, పిలువఁబడినది ౩ అలంకరింపఁబడినది ౪ అమర్పఁబడినది, సిద్ధపఱుపఁబడినది

**లాంఠిని.** సం వి ఈ స్త్రీ కులట, వ్యభిచారిణియగు స్త్రీ

**లాంపట్యము.** సం. వి అ. న లంపటత్వము ౧ అత్యాసక్తత ౨ కాముకత్వము

**లాఁక.** వి పక్షియాఁక (శ ర )
జ లాఁకకట్టు

**లాఁకకట్టు.** వి (లాఁక + కట్టు) విఱిచికట్టిన పెడచేతులకట్టు (శ ర )

**లాఁగ.** వి ౧ గుహ

సీ నిడుదలైన, లాంగూలముల సొప్పి
లాఁగలువెలువడ్డ కంఠీరవంబుల కరణి వెలిఁగి.
భా రా యు ౩౫౦.

౨. రంధ్రము, తొఱ్ఱ, కన్నము

క లాఁగలు పెక్కులు లోపల, బాగై తను ముట్టినపుడ పట్టువడక లో, డాఁగి చని వెలికి వెలువడి, పోఁగను మలుఁగలుఁగునట్టి బొక్కయెదిరికిన్ కేయూర ౪ ౧౧౫

సీ లాఁగలఁ బుట్టల లోఁగిన శిఖల భుజంగమకులములఁ బ్రమింగికొనుచు, వెగడొందఁ యఱచుచు పెగయు బల్పులఁగులఁ బొగ నూర్ధ్వకీలలఁ బొదివికొనుచు అశ్ర ౨. ౧౫౧

సీ కడసిన గరిపెల క్రింద లాఁగలఁ గ్రుస్సియదువ కాఁపురముండు నాఖుతతుల
ఆము. ౬. ౧౩.

జ: లాఁగడాఁగుడు. లాఁగరి.

**లాఁగడాఁగుడు.** వి. (లాఁగ + డాఁగుడు.) విశేశయము. పాము.

క. లాఁగడాఁగుడు డాఁగ ప్రోఁగు లిడెడు ప్రౌఢ కోలలు దోసంగులు దొలఁచుచోటి
అచ్చ. రా. బాల. ౯.

**లాఁగరి.** వి. (లాఁగ + అరి) క్రోత్రమ్ము - షివి. (శ. ర., క్రా.)

**లాఁగించు.** అ. క్రి. (√లాఁగు) ౧. లంఘించు. ఉత్పతనము.

ద్వి. మందిని చలియింప పెట్టిన ధూళి, మందురగతి నెక్కి మిన్నందుకొనఁగ, లాఘవ మెసఁగఁగ లాఁగించుగతుల, ముఖముల్ చెదరఁగ మేటి యగ్గలిక, దిగ్గజంబులు క్రుంగ
రం. రా. ఉ. ౪౭. పా. ౧౨ పం.

సీ. సుడిగాలి తిరిగెడు వడువున వడిఁజొట్టుకొంచు మైకొన లాఁగించి త్రేయు ప్రబంధ ౭౭.

౨. అశ్వశిక్ష చేయు

సీ. లలి గూర్చి లలి దేర్చి లాఁగించి కుండాలముల నోజ వట్టించి ఖలుఖ చెచ్చి
ఓ. శకుం ౧. ౧౧౨.

౩. క్రి. అతిక్రమించు.

ఉ. ప్రాఁగెంపురాల సంపద, లాఁగించు మిటారి గమల లలితాధరముల్ సమీర. ౧ ౯౪

**లాఁగు.** వి. (సం. లంఘః) ౧ లంఘనము

గీ. కెట్టుకండంబుతోడఁ జేపట్టి హాంత,కారి విఱిచిన యట్టు లగ్గలిక విఱుతు, లాఁగు వేగంబు మెఱగి బలంబు సెఱపి, మల్లతనమున మెప్పింతు మనుజవిభుని
భార. విరా. ౧ ౭౧.

౨. నాట్యవిశేషము.

ఉ. దేశివిధంబు రట్టణము దివ్యకళాసియు గోల చారి కైలాసకి పేరణివిధము లాఁగులు జక్కిణి చిందు కోల్యాటముల్, బాసలుకొఁపుఁ జాపుడుచు శ్రీరంగమా. ౪. ౧౬౨

సీ. లాఁగు మైసిరియుఁ బల్లటియు కత్తియు తెక్కు విలసిల్లు జక్కిణివిధ మొకర్త .
ఉ. రా ౭. ౧౩౯.

౩. మొగ్గ.

సీ. గొప్పులై మిన్నందు చప్పరాలెక్కు లాఁగులు మైచూపఁ జంద్రకళలనంగ.. .అలరు

బోండ్లు, విపుల తరతర కాశాస్త్రనిర్భరులైన, విరుదు పాత్రలు గలరు తత్పురమునందు.
విజ. వి. ౧. ౧౫.

౪. మల్లబంధవిశేషము.

వ. కిల్లియు బలిజెడుటయు రొండికేటును పణంబును కర్ణాటకును భారంబును బొంగణయు పెట్లాగును రూణింపును సరివిత్తరంబును లాఁగును వింటాలంబును
ప్రబంధ. ౪౭.

వ. కక్కు కొక్కుస సరివిత్తరంబును లాఁగును నృసింహంబును నాదియగు ముప్పదిరెండు విన్నాణంబుల నాణెంబు పరీక్షించి హంస ౧ ౨౦౭.

వ. సరివిత్తరంబును లాఁగును వింటాణంబును అను విన్నాణంబులు విశదపఱచి,
మల్లపు. ౩. ౭౯

౫. చల్లడము, సగముతొడవఱకుఁ దొడిగికొనెడు గుడిగి.

౬. వలిపపుపాలు వింతవలెవాటులు లాఁగులు రావిరేకులుం, గలిగిన గుజ్జురూపములు
సారంగ ౧ ౧౧౭.

౭. లాఁగించు, లాఁగుపడు

**లాఁచు.** అ. క్రి. ౧ పొంచు,

సీ. లాఁచి పొంచులమీఁద లావణికేసిన యలరు విల్తుని సంకుటరిగా యనఁగ. తపతీ. ౩. ౪౪.

ఉ. చూచినయంతలోఁ దనకుఁ జొప్పడుదాఁక నధివ్యథస్వ్యాఁకై, లాఁచిన మన్మథుండు శర లాఘవ మొప్పని కాతవున్న నా,రాచపరంపరల్ పఱపి ప్రయ్యలుచేసెఁ దదీయ శీలముక్, .. వైజ. ౩. ౩౭.

ద్వి. రాచేకూఁకుము గాని రవ్వగాకుండ, దాఁచిన వీరామణలధనము బెల్లఁ బెట్టి, గోఁచికాఁడై దానిఁగొనుచు శోధించి, లాఁచియున్నాఁడు నీలాఁగొత్తి చూడ.
ద్విప. హరిశ్చ. ఉ. ౧౯౮.-౨. పం.

౨. కవియు.

సీ. తనబిడ్డఁ జెఱనిడ్డ దనుజు ద్రుంగఁగ నుర్వి
లాఁచెనోయని తోఁచె లంకమీఁద గీ.
నవపతాకాలతా కాననస్ఫురత్వ, రాగముని
జాంగరాగఁబు రథగామూస,ముద్రశైవాల
మును రామభద్ర నికట, ధూపధూమంబు
లైనట్టు దుమ్ము రేఁగి. రామా. ౩. ౨౩౨
గీ గబ్బిబెబ్బులి డాకాల ద్రొబ్బి విరియఁ,
బ్రామి రూపార్పకున్న నీఁటంటఁగాను,లాఁచి
గవిఁజొచ్చి యచ్ఛభల్లములగముల, బడలు
వాపకయున్న నీఁటంటఁగాను
వేం. పంచ. ౨ ౧౯౪.
(పందివేఁట). సీ. లాఁచితప్పిన పోగిలను గొట్టు
గొట్టువఁ గూడిన పిడిఁగూల్చెఁ గొమ్ము
లాఁడు. కకు ౪. ౭౭.
౩ పెనఁగులాడు
గీ కాంత పద కొండియాట యూరు గ్రమ్మి
కాంచి, సీను సెనవి పయోధరశిఖరిదుర్గ,
సంగతికి లాఁచు నృపదృష్టి చక్రకాస
నొన్న తస్థాన మపుడుగా రొందవుఁ దనకు
వసు ౨ ౬౫
౪ క్రియపడు
గీ తెలివ లిటు నీవువోయు పందిరియ చేరి,
యువలఁ గ ఆగాక పచ్చుగుఁలై యునఁగుఁ,
పెనుపు. నఁజొచ్చెఁ గిల్లగుట్టమః వారి,
కధ్యగులు లాఁచి యిడు విడియముల పేర
ఆము ౨. ౫౯
౬ లాఁచుకొను, లాఁపరా, లాఁపు,

లాఁచుకొను. అ. క్రి (లాఁచు + కొను)(స్వార్థమున) పొంచు
క మఱియుం బ్రమత్తులై యతీవులగు నరుల
యందు వృకంబుచందంబున నొదిగి లాఁచు
కొనియుండి చేష్టించుంగాని ధీరులైనవారికిం
గలిపలన భయంబులేదు. భాగ. ౧. ౪౪౫
లాఁత. వి (√లాయు) ఉద్రేకము.(చూ. లాఁత సేయు)

లాఁతసేయు. అ క్రి.(లాఁత + చేయు) లాయు, ఉద్రేకించు.
క. . కరాళింపక లాఁతసేయక .. గంగా
తరంగంబుల తెఱంగు దాల్చు వాయువంబు
లును ఉ. హరి. ౪. ౨౧౩.

లాఁతి. స. అన్యము, అన్యుఁడు, పెఱ.
క. అది లాఁతియుల్లై నినుఁదను, హృదయంబుల
సెవ్వరేని రొఱుఁగరె
భార. విరా ౨. ౯౯
విణ. అన్యుఁడు.
సీ జ్ఞాతిఁ బ్రోవనివాఁడు లాఁతిఁ బోషించునే
యిలుగన్న దొర మాన్య మిచ్చువాఁడె.
రామలిం. ౧౦౧.
వి. అన్యుఁడు, ఇతరుఁడు.
ఉ ఒండొరులపోఁతలు లేఁతలు మమ్ము
నిమ్మోయి౯, లాఁతులఁగాఁ దలంపకు నలం
పకు చాల నలఁగియుండగన్
ఉ. హరి. ౪ ౯౩.
చ. అదితి మొఱంగి కుండలము లానరకుండు
హరించె వాని జేఁ, గదనములోనఁ ద్రుంచి
యవి గైకొని దాఁచితి నాఁటనుండియుం,
ఒదిలముగాఁగ నన్నడుగఁ ఒంపవి కారణ
మేమి లాఁతినే, యిదె చనుచెంచి యిత్తు
ననుమీ కతమన్యునితోడ సంయమీ.
పారి. ౨ ౨౫.
౭ లాఁతివాఁడు.

లాఁతివాఁడు. స. (లాఁతి + వాఁడు) అన్యుఁడు.
ఉ స్వైరవిహారధీరలగు సారసలోచన లున్న
కోటికిన్, చోరున లాఁతివారు చొరఁ
బోయినచో రసభంగము . వసు. ౨. ౫౫.

లాఁతు. విణ. మిక్కిలి, అధికము.
చ. కొడుకులు కూఁతులుం గలిగి కూడును
బాఁడియుఁ ద్రవ్య తండమై, విడిముడి
లాఁతుగాఁగలిగి కొండియుఁ జైఁడియు విండ్ల
లోపల౯, దడఁబడ,,, క్రీడా. ౨౫౬.

**లాంపరా(యి).** వి. (లాంపు + రాయి) ఆలయద్వార ముఖమునఁ దృఢాదికము చొరకుండ సమర్చియుండెడు గచ్చురాయి.

ఉ  గుడి లాంపరా రూపరాణికడ నిలిచి
ఆము. ౬. ౧౦.

సీ. రూపరాణపుటమ్మ రూపొంప్పురము జల ధారియుం జనఁగను దనరును జల, గీ. నిర్గమము తమ్ముఖంబున నీటితోడ, వచ్చుత్పణములఁ జొరనీని పలక పేరు, లాంపరా యుంచుజనులు పల్కఁగను తెలియు.
అం. భా. ౧. ౧౫౪.

**లాంపు.** వి. (√లాంచు) లాంచుట.

**లాక.** వి. ౧ అంకురము.

ద్వి అకంజతోణు మోహనపుష్పశాఖ,లాకరో హేమశలాకరో యనఁగ,
ఆ. మ క. ౪ ౧౮౩ పా ౨౪ పం.

ద్వి. మత్తచకోరాక్షి మరువంపులాక, క్రొత్త ముత్యపుబొమ్మ . .
నవ. ౨. ౫౭. పా ౨౨. పం.

ద్వి. ఒక్కమైబడిలాక లొత్తితలిర్చి,పక్కమ్మలిడి పొరపడి చెట్టుగట్టి,
ద్వి పరమ. ౪ ౨౬౬. పా ౩. పం

౨. పేతుగునం దక్కడక్కడ చొప్పించెడు తెదురుబద్ద.

సీ. కారంపుఁబదుగులుఁ గందెలకప్పెర గోలము లాకలు నీలికరవ, .. హంస ౨. ౧౨

౩. పక్షియీఁక (శ. ర., బ్రౌ.)

౪. రెక్క, భుజము. (చూ. లాకకట్టు.)

జ: లాకకట్టు, లాకలొత్తు.

**లాకకట్టు.** వి. (లాక + కట్టు) వెనుకకు చేతులు విరిచికట్టుట.

గీ. వెనుక మోచేతులను గట్టిపెట్టు టొప్పు లాకకట్టు లనంగఁ గ్రాలాగవాకి
అం. భా. ౩. ౯౮.

**లాకలొత్తు.** అ. క్రి. (లాకలు + ఒత్తు) దట్టముగాఁ గలుగు, దట్టముగా నంకురించు.

సీ. ఒత్తెం జరణము లటు దశ,కొత్తెం దమమునికి లాకలొత్తెం బులకల్, చిత్తజాఁడు వింటఁ దూపుల్, జత్తాయతపటిచి చిత్తజల్లుగ జేసెన్  విప్ర ౩. ౭౬.

**లాకీ.** వి ఎఱుపురంగుగల వస్త్రవిశేషము. (లాఖ = ఎఱుపురంగు. మి బ్రౌ)

రగడ సరిపేయురాని హంసాళములఁ లాకీలు, మాదళంబులు వెన్నమణుగులు ముసల్లీలు.
హంస. ౫. ౩౫౬.

**లాకుటికుఁడు.** సం విణ. (అ. ఈ అ ) దుడ్డుకఱ్ఱ యాయుధముగాఁ గలవాఁడు.

వి ఱ. పుం కావలివాఁడు

**లాక్షా.** సం వి ఆ స్త్రీ. ౧ ఒకవిధమైన యెఱుపురంగు వస్తువు, లత్తుక, అలత్తము. ౨ ఎఱ్ఱరంగునిచ్చెడు పురుగు, అరుద్రపురుగు ఇంద్రగోపము (అ. ని)

**లాక్షికీ.** సం. వి. ఈ స్త్రీ సీత. (విశ్వము)

**లాక్షణికము.** సం. విణ. (అ ఈ అ.) ౧. నైసర్గికమైనది, స్వాభావికమైనది ౨ లక్షణార్థముఁ గలది, (వాచకవ్యంజకభిన్నమగు పదము) ౩. సూటిగా నర్థము దెలుపక అలంకారరూపముగాఁదెలుపునది. ౪ అముఖ్యము,అప్రధానము. ౫. పారిభాషికము, పరిభాషగా నేర్పఱుపఁబడినది. వి. అ. పుం. పారిభాషిక శబ్దము.

**లాక్షణికుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) లక్షణజ్ఞుఁడు, సంజ్ఞలను సాముద్రికచిహ్నములను ఎఱింగినవాఁడు.

**లాక్షణ్యము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. శుభాశుభసూచకములైన లక్షణములు కలది. ౨. శుభాశుభములను సూచనచేయునది.

**లాక్షణ్యుఁడు.** సం. విణ. (అ ఆ. అ.) లక్షణములు (శుభాశుభసూచక లక్షణములు) తెలిసిన వాఁడు.

**లాక్షాతరువు.** సం. వి. ఉ. పుం. వృక్షవిశేషము. లక్క నుత్పత్తి చేయుచెట్టు. రంజనద్రవ్యము నిచ్చెడు చెట్టు. శ

**లాక్షాప్రసాదము.** సం. వి. అ. పుం. రక్తలోధ్రవృక్షము. ఎఱ్ఱలొద్దుగుచెట్టు శ.

**లాక్షాప్రసాధనము.** సం. వి. అ. పుం రక్తలోధ్రవృక్షము, ఎఱ్ఱలొద్దుగు చెట్టు

**లాక్షారక్తము.** సం. విశే. (అ.ఆ.అ) లక్కతో రంగువేయఁబడినది.

**లాక్షారసము.** సం. వి. అ. పుం లక్కకు అలక్తక ద్రవము.

**లాక్షికము.** సం విశే. (అ. ఈ. అ.) ౧ లక్కకు సంబంధమైనది. ౨. లక్కతోఁ జేసినది ౩ లక్కతో రంగు వేయఁబడినది ౪ లక్షను వ్యాకుస్ సంబంధించినది.

**లాగన్నృత్తము.** సం వి అ. న ఒక విధమగు నాట్యము (విల్యమ్సు)

**లాగము.** వి. (సం. లాఘవమ్.) ౧. లాఘవము, తేలిక

ద్వి గగనయాంత్రికుఁడు లాగవుబంతి దాఁచు, పగిది భానుఁడు గ్రుంకెఁ బశ్చిమాంబుధిని.

ద్వి. పరమ. ౪. ౨౯౦ పా.

౨ లాగి

౨ నేర్పు, సులువుగఁ బనిసేయు తెలివి.

క. కేసరిఁ గోరాడిన మద,నాగంబులరీతి మార్గణవ్రణజాసృగ్రాగములఁ దొప్పదోఁగియు, లాగమునకుఁ జొచ్చి యుద్వేలంబునఁ జెనఁగెన్.

జై భా. ౩. ౧౫౩.

**లాగి.** విశే. (లాగము + ఇ³) ౧. చులుకనిది, లఘువు.

సీ. శిగురు నందక నక్క జేరాడుచుమరుతో ల లాగియౌ వట్టితుళ్ళాయి దనర.

శశా. ౩. (౧) ౨౩.

సీ. మణికిరీటముదంబు మలసించు కొకకంత లాగియౌ లోని తుళ్ళాయి పట్టి.

వాల్మీకి. ౧. ౧౯.

౨. సులభము.

చ. సరసవయానుభావమునఁ జక్కని చక్కర బొమ్మలాగిగా, దొరకెనటంచు నమ్మితిని.

శశాం. ౪. ౫౭.

**లాగించు.** స క్రి (√లాగు¹). ౧. లాగికొని పోవు, కొంపోవు

వంచకము. .పతంగేంద్రుఁ డుత్తుంగకోష్ఠంబు వాఁగెఁ భుజంగంబు లాగించుభంగిన్

దశ. ౪. ౨౩౨

౨ అపహరించు, దొంగిలించు

క తానికొనాఁ,డును బెట్టుకొని పొలంగని, యనుపైన సుమంతుపాళ అది లాగించెన్

సారం౫. ౩ ౧౩౫

ద్వి ఓరి! సజ్జనుమాడ్కి నున్నాఁడ విప్ప, జేరితి లాగించి తీ మైఁడిగిన్నె ,గడుస నీ వంటి కనుమాయగలదొ .

ద్వి. పరమ. ౪. ౩౨౯. పా. ౧౧ పం.

౩. పెఱుకఁజేయు, ఆకర్షింపఁజేయు.

వ తరంగిణీ సంగతంబైన రోహణాచల శృంగంబు బాగు లాగించుచు ...

భాగ. ౧౦ పూ. ౧౦౭౨.

వ. .ప్రచండంబగు వాని పిచండంబు లాగించి.

భాగ. ౧౦. పూ. ౧౩౪౪.

**లాగు¹.** స. క్రి. ఆకర్షించు, హరించు

గీ. సాహసపు మల్లుఁ దడరి యుత్సాహాలీల, సతతము లాగు ఖురళి కాస్తంభ మనఁగ

చంద్రా. ౧. ౧౦.

క ఆదింటికోన యూతని, లావును పెంపకము కేషు లాగుకొని కడున్, జేవదలిర్పఁగ పెక్కడి, వేవేగ లకోరి బూని క్రేయఁ బొవలగివకే. అచ్చ. రా. బాల. ౨౦౭.

విశే. ౧. సమ్మతము, ఇష్టము. (వి. సమ్మతి. శ. ర.)

**లాజము.** సం. వి. అ. పుం, ఆర్ద్రితండులము నానబియ్యము. న. ఉశీరము, వట్టివేరు.

**లాజలు.** సం. వి. అ పుం. అ స్త్రీ బ. భృష్టధాన్యము, పేలాలు. (కే. వి.)

గీ తోయజాక్షిపాద లాజలు దోయిలించి, ప్రమదమున వేల్వ వోక కొన్ని చెమట వంట, ప్రేల్లగనుపట్టఁగాంజాయ వీతిహోత్రు, నాలుకలు సాటిరాకున్న నవ్వెననఁగ మను. ౫.౯౧.

**లాటకము.** సం. విణ. (అ. టీకా. అ.) లాటదేశస్థులకు సంబంధించినది.

**లాటము.** సం వి. అ. పుం ౧ ప్రాఁతగుడ్డ, చింకిగుడ్డ, జీర్ణాలంకారము మొ॥ ౨ వస్త్రము, ఒట్టు ౩. బాలభాష, చిన్నపిల్లలు మాటలాడెడు భాష ౪ ఒకానొక దేశము

**లాటానుప్రాసము.** సం. వి. అ పుం. అనుప్రాసాలంకారములో నొక భేదము ఒక పదము గాని కొన్ని పదములుగాని తాత్పర్యభేదము గలిగి యేకార్థమునఁ బునరుక్తిని పొందిన లాటానుప్రాస మగును. ఉదా సీ కమలాక్షు నర్చించు కరములు కరములు శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ.

**లాటి.** సం. వి. ఈ. స్త్రీ. ౧ కవితారచనా విశేషము. ౨ ప్రాకృతభాష

**లాటిక.** సం వి అ. స్త్రీ. = లాటి

**లాటు.** వి గుంపు, మొత్తము.

సీ. దీనితో గాడ వేల పోనిమ్ము రమ్మని లాటుఁ గోడ్కొనిపోయె భోటనృపతి (ఇట తన యనుచరసంఘమునని భావము.

పాంచా. ౨. ౪౫

**లాటుఁడు.** సం. వి. అ. పుం. ౧. లాటదేశాధిపతి. ౨. విద్యాంసుఁడు, ప్రవీణుఁడు, విదగ్ధపురుషుడు ౩. లాటదేశ నివాసులు.

**లాడము.** వి గుజ్జుపు గోరిజలకు కొట్టెడి యినుప తగటిబిళ్ల. (శ. ర.)

**లాడా.** విణ. నిడుపైనది.

సీ. రకపు సొంత్రాణి నాల్గాడా చలాదంబు చిలుంతమీసపు కేఁక చిలుతదట్టి, గీ. అలరఁగలుకు నా సెలుకునాయకుం డొకఁడు.

చంద్రా. ౨. ౩౭.

(ప్రయోగాంతరము కన్పడలేదు.)

**లాడి.** వి. ౧ బలి.

గీ నాకు మొగవాడి యోఁగా దవరు తనకు, శేల యీ మైల పూయక దూల దీని, వఠ్య యుతముగ నీవనీవాటమనకు, లాడిగావింతు నంత దొలంగు దూలు. పాండు. ౫. ౨౪౩.

౨. ఋణము, పెద్ద ఫుండు.

ఉ లాడికి మూఁగు కాకులఁ బలాయన మొందఁగఁ జేయ వీఁపుపైఁ, బ్రాఁకును బ్రేలు నీఁగగుదికాపినదేహము చేడి కాళ్లకున్, రోడి నశించు తోఁక బలురోమము లంటిన కోలు టీఁగలున్, గూడిన బంధముఁ గలిగి కూర్మకచునం డొక బక్కగుఱ్ఱమున్.

హంస. ౫. ౩౦,

**లాడి(డీ)కుఁడు.** సం. వి అ. పుం. సేవకుఁడు బానిసవాఁడు (విల్యమ్సు.)

**లాను.** విణ పెద్ద?

సీ. ఒలుపగఁ దిరుపట్టు కుచుచ తెత్తఁగఁ బొంచములు లాను డింకులుఁ బోరల కొండల . గీ బలిమి గని పట్టి . . ప్రబంధ. ౭౨.

**లాడె.** వి లాటదేశము.

సీ సేవ్యమై సగము దీసిన బూజపండుతోఁ గూడిన బంగారు లాడెసింగి, గీ... విడెము మీఁద, వీడియము గల్లుదొర పాశ లాడె దోఁగి, విలిచికోనివద్దిపాడ గనిపించుచుయును. కుకల. ౨. ౭౭.

**లాళము = లాళాము.** వి. సన్న్యాసులు చేతఁ బట్టెడు దండము.

శా ఈ లాళంబున ప్రాయఁ ఒట్టణము లో నీ పాదుకల్ పెట్టఁగా, నేలోకంబునకైన నేఁగ సుఖంబౌ ... విప్ర. ౨. ౪.

సీ. బూది బొక్కెన లాతమును గకుండలుభ్రను బులితోలాసము గరంబున వహించి
హర. ౨. ౭౪

సీ. . లాతాలఁ గొని మోఁది లజ్జగొంద్రు
హర. ౫. ౧౦

గీ. కని విబుధులార యిగ్గిరి గగనధరణి,మండ లంబులు నీలాల మట్లు గాఁగ, నున్న దిగదా సదాశివయోగివరుఁడు, చేతనూదిన పటికంపు లాత మనఁగ
వరాహ ౬. ౭౩.

సీ. . యోగివేత్రాఖ్య యొప్పు లాత, మనఁగ
ఆం. భా. ౨ ౧౪౪

**లాతము.** సం. విశ. (అ ఆ అ) పుచ్చుకొనఁబడినది, తీసికొనఁబడినది.

**లాతాము = లాతము.** వి సన్న్యాసులు ధరించెడు కఱ్ఱ

సీ. కకపాల కేదార కటక ముద్రిత పాణిఁ గుఱుచ లాతాముతోఁ గూర్చిపట్టి,
మనుచ ౧ ౫౯.

**లాతి.** సం. వి ఇ. స్త్రీ. తీసికొనుట, పుచ్చుకొనుట

**లాపము.** సం వి అ. పుం. ౧ సంభాషించుట, మాటలాడుట. ౨ వదరుట, ప్రేలుట

**లాపిక.** సం. వి. అ. స్త్రీ. ప్రశ్నోత్తరములు గూఢముగా లోపలనుండునట్లుగావి, ఉత్తరము వేఱు మాటలఁ నుండునట్లుగాని, , అడుగు గూఢ ప్రశ్న.

**లాబ(క)ము.** సం వి. అ పుం ఒకజాతి పూరేడుపిట్ట

**లాబగాఁడు.** విశ. (లాబము + కాఁడు.) లాభము నొందువాఁడు.

(దుర్వ్యాపుఁడు) సీ. ధనకోసవాణిజ్యమునఁ దబోవిత్తములముఁ గూడఁబెట్టెడు లాబగాఁడు.
వరాహ. ౨. ౧౭౦

**లాబము.** వి. (సం. లాభః) లాభము.
(మా. లాబగాఁడు.)
జ లాబగాఁడు.

**లాబుకి.** సం వి. ఈ. స్త్రీ. ఒకవిధమైన వీణ

**లాబువు.** సం. వి. ఉ. (ఊ). స్త్రీ. అలాబువు, ఉ. స. సొఱకాయ, అనుగపుకాయ

**లాభకరము.** సం. విశ. (అ. ఈ. అ) లాభము గలుగఁజేయునది.

**లాభకృత్తు.** సం విశ. త్ = లాభకరము, లాభము కలిగించునది

**లాభకము.** సం. వి. అ. పుం ౧ లబ్ధి, ప్రాప్తి, పొందుట ౨. ఆదాయము. ౩ అనుభవము, ౪. జయము, గెలుపు. ౫. గ్రహించుట, జ్ఞానము, తెలివి ౬. (జ్యోతి) లగ్నమునకు పదునొకండవ స్థానము

**లామజ్జకము.** సం. వి. అ. న. వీరణమూలము, వట్టివేరు (నీటివట్టివేరు. అని కొందరు)

**లాయము.** వి. (క. లాయ) అశ్వశాల, వాహనము లుండు కొట్టు

గీ మనివరేణ్యుని సమ్ముఖంబునకు సవన, హయము దెప్పించె విభుఁడు లాయమున వెడలి
జై. భా ౬ ౧౦౪

ఉ ... వున నార్చుచుం గలుఁగు లాయపు తేజివజీరుఁ డెంకకం, బావనజారిపైఁ బఱప నాతఁడు దానని యయ్యుత్థానమున్, కేవడిఁ గుంభమధ్యమునఁ జీరిన మౌక్తికపాళి రాలె
శశాం ౫ ౯౦.

సీ. లాయంబులోఁ బనుల్ గావింప రమ్మంచు మారిణితోఁ గడు జెగ్గులాడి రనుచు
కువల. ౧. ౪౧.

సీ లాయ మంచన మందురాఖ్యా వెలయు
ఆం. భా. ౨. ౧౫.

**లాయు.** అ. క్రి. ఉద్రేకించు, విజృంభించు.

ము. లయకాలోత్థ పతంగ బింబము క్రియన్ లాయుచు యడీరోగ్ర విద్ధయనిర్మ.

సీ. ఉయ్యాల యనఁగను నుయ్యాల యనఁ బొట్ల
యన లాలి యన డోల దనరుచుండు.
ఆం. భా. ౨. ౨౦౧.

౨. ఉయ్యాలలో బిడ్డలను నిద్రపుచ్చునపుడు పాడెడుపదము.

సీ. లాలిలాలియటంచు లీలావతులు పాడ .
చారుచంద్రోదయము. ౹౫.

**లాలి.** సం. వి క పుం దుర్బోధచేయువాఁడు, పాడుత్రోవకుఁ ద్రిప్పువాఁడు.

విణ (క.సీ.క.)లాలనచేయువాఁడు, బుజ్జగించువాఁడు, బుజ్జగించునది, లాలనచేయునది

**లాలించు.** సం స.క్రి. లాలనముచేయు,బుజ్జగించు.

క అమ్మ్రదిత రత్నకటక చ,యమ్మ్రదిత నినాద మయ్యె నయ్యెడఁ జలమే,లమ్మ్రని పతితో దగుమే,లమ్మ్రని సహజానురక్తి లాలించు క్రియన్ వసు ౬ ౮౦

(ఈ క్రిందిపద్యమునఁ దద్భవముగాఁ గనఁబడుచున్నది)

రగడ తలిరాకుఁ దగ మెట్ట దమ్మ్రలఁ గీలించి పలుమాఱు మూఁగి పైదలిని లాలించి.
యయా ౫. ౭౭.

**లాలిక.** సం వి. ఆ. స్త్రీ. పరిహాసపు ప్రతివచనము, వెళాకోళపు సమాధానము.

**లాలికము.** సం. వి. అ. పుం. మహిషము, దున్నపోతు.

**లాలితకము.** సం వి. అ. పుం. ముచ్చటైన వస్తువు, ప్రియమైన వస్తువు.

**లాలితము.** సం. విణ. (అ ఆ అ) ౧. లాలనచేయఁబడినది, బుజ్జగింపఁబడినది, ముద్దుచేయఁబడినది. ౨. చెడుత్రోవకుఁ ద్రిప్పఁబడినది, చెఱుపఁబడినది. ౩. ప్రేమింపఁబడినది. వి. అ న. ౧ సంతోషము. ౨. ప్రేమ.

**లాలిత్యము.** సం వి. అ. న. ౧ మనోజ్ఞత, మనోహరత. ౨. చక్కఁదనము, సొగసు ౩. (పదముల) మార్దవము. (పదలాలిత్యము.)



శ. శృంగారాభినయము.

**లాలిని.** సం వి. ఈ. స్త్రీ. కామాతురత గల స్త్రీ.

**లాలు.** విణ. (హిం. లాల్.) ఎఱుపురంగు గలది, రక్తము.

వ కోదమత్తటువగుంపు కాలికొలందికి ద్రేలు లాలు కుంచెలు గీలించిన గవ్వదండల గంటల నలంకరించి .. అము. ౪. ౩౫.

సీ. మధుభూపసైనికమండలి లాలుకెంచా లనఁ దలిరాకుఁడాలు నిగిడె. కవిజ. ౨. ౮.

**లాలుక.** సం. వి. అ స్త్రీ. ఒక విధమైన కంఠహారము

**లాళము = లాడము.** వి గుఱ్ఱము మొ॥ వాని గొరిజలకు కొట్టెడి యినుప తగటుబిళ్ల.

సీ అడుగంటఁ ద్రొక్కిన యహితప్రతాప కీలములు నాఁ బనీఁడి లాళములు మెఱయ
చంద్ర ౨. ౧౬.

**లావకము.** సం. విణ (అ. ఈ అ.) ౧ ఖండించునది, ముక్కలుచేయునది. ౨. విభజించునది. ౩ చీల్చునది వి అ పుం. పూరేడుపిట్ట

**లావణము.** వి. (క.లావణ) కొలువునకు క్రొత్తగా వచ్చిన కొలువుడు కానిని పట్టికయందు వ్రాసికొనుట

సీ. కొలువని వ్రాయుట లావణము. . . సావళులు . ఆం. భా. ౨. ౨౨౮.

**లావణము.** సం. విణ (అ. ఈ అ.) ౧. ఉప్పనిది. ౨. ఉప్పువేసి వండఁబడినది, ఉప్పువేయఁబడినది వి. అ న. ఉప్పుతో భావనచేసిన యౌషధము.

**లావణి[1].** వి పుల్లరి. పసులు మేసెడు బీటుకేలకై ముందుగా ఇచ్చెడి పన్ను. (శ ర)

**లావణి[2]** వి. దండయాత్ర.

సీ లాది పొంథులమీఁద లావణి వేసిన యుఱుకు విల్తుని సంకుటరిగా యనఁగ. తపతీ. ౩. ౭౭.
(లావణివేసిన = దండయాత్ర చేసిన అని భావము.)

**లావణికము.** సం. విశే. (అ. ఈ. ఆ.) ౧. ఉప్పు వేయఁబడినది, ఉప్పు వేసి వండఁబడినది. ౨. అందమైనది, చక్కనిది. వి. అ. న. ౧. ఉప్పు పాత్ర, ఉప్పుబుట్ట. ౨. ఉప్పుతో భావన చేసిన యౌషధము.

**లావణికుఁడు.** సం. వి. అ. పుం. ఉప్పువ్యాపారమున జీవించు వర్తకుఁడు.

**లావణ్యము.** సం. వి. అ. న. ౧. ఉప్పన. ౨. చక్కఁదనము, సౌందర్యము, ముత్తెములయందు వలె నవయవములయందు నీడ ప్రతిఫలించునట్టి కాంతివిశేషము.

**లావణ్యార్జితము.** సం. వి. అ. న. పెండ్లికాలమునఁ బెండ్లికూఁతున కత్తమామ లిచ్చిన ద్రవ్యము. విశే. (అ. ఆ. అ.) చక్కఁదనముచే సంపాదింపఁబడినది.

**లావము.** సం. విశే. (అ. ఈ. అ.) ౧. ఖండించినది, ముక్కలుచేయునది. ౨. చీల్చునది, కోయునది. ౩. చంపునది, నశింపఁజేయునది. వి. అ. పుం. ౧. ఖండించుట, కోయుట. ౨. పూరేడుపిట్ట.

**లావరి.** విశే. (లావు[1] + అరి[3]) బలముగలది, బలము గలవాఁడు.

క. నీ వేల వచ్చితిచటికి, నేవాఁడవు పోపుటికి సేపాలదు నీ, లావరి పులు గెక్కడియది, యీవారిజనయన యెవ్వ రేర్పడఁ జెపుమా.
హరి. ఉ. ౪. ౧౪౦.

క. నావుడుఁ గల్పాంతఫణి,గ్రీవేయక జాగ్రదుగ్రగతిఁ గదిసి దశగ్రీవుఁ డపిఁ గవిమసంగిన, లావరియగు పులుఁగు ఱేఁడు లావణిపడి యెంచ్.
రామా. ౫. ౨౦౩.

మ. పరుతోఁ బోరఁగఁబొంచి వాలిభునిఁ జంపం బాడిరే నీకు లావరి తైవంబొడమూపి కయ్యమున నిల్వంబూచి దోశ్శక్తిమైఁ, బరగం జంపఁగరాదె
భా. రా. కిష్కిం. ౨౯౭.

**లావాణకము.** సం. వి. అ. పుం. మగధదేశ సమీపమునందున్న యొకమండలము.

**లావికము.** సం. = లాలికము.

**లావిలము.** వి. పక్షివిశేషము.

సీ. బెళకు గువ్వ బాతు లావిల మూసకప్పెరగాఁడు కెమలి పాలకాకి చిలుక.
యయా. ౨. ౨౪.

**లావు[1] = లాగు[2].** వి. ౧. బలము, శక్తి.

క. నీవిజయోత్సాహమునకు, లావునకు జవంబునకు నకౌల్యమునకు సద్భావమునకు మెచ్చి వరం, బీవచ్చితి.
భార. ఆది. ౨. ౧౦౫.

క. లావులు పెరవులుఁ బాల్మలుఁ, జేవలు నప్పలితములుగఁ జెల్లపనులు నానావిధములఁ జేర్కొనుచుఁ, బావనినరుఁ గవలఁ బొగడు ...రవ పెంగెన్.
భార. శాం. ౧. ౧౩౯.

క. అవిరటలోన యాతిని, లావును నెఱతనము తేపి లాగుకొని కడుఁ, జేవ దలిర్పఁగ నెక్కిడి, వేవేగ లకోరిఁ బూని త్రేయఁ దొడంగిన...
... చ్చె. రా. బాల. ౨౧౮.

౨. సామర్థ్యము.

ఆ. శివశక్తిభేదంబు, తెలుఁగ నీకు జడున కెంత లావు.
కు. సం. ౭. ౭౭౪.

ఉ. మహర్షుల శాపముచే స్వకీయమౌ, లావెఱుఁగండు మత్తకరిలాగున నుండు నితండు రాఘవా.
ఉ. రా. ౫. ౭౩.

ఆ. మత్ప్రసాదదివ్యమహిమచే నెంతైనఁ, గవిత చెప్ప లావు గలదు నీకు.
వీర. ౧. ౨౦.

౩. ధైర్యము.

సీ. లావుచాలించి చెల్లాచెదరైరి సారణులు గుహ్యకులు తురంగముఖులు.
వరాహ. ౩. ౫౯.

సీ. పెలపెలఁబాఱి పోములు లావులు చలింపఁ గదలె దిక్కులకునై గరుడకులము (ఇట నెక్కలని యర్థాంతరము.
దశా. ౨. ౬౧.

౪. సాహసము.

సీ. ... పరమపురుషుఁ, డాదరంబునఁ జూచి
యస్మత్పరోక్షంబునందు మీచేసినయట్టి
లావు, సామాన్యమే రిపుజయము మీచేతికి
వచ్చినయది. హరి. ఉ. ౬. ౧౯౬.

౫. బరువు, గురుత్వము.

శా. దృగ్విస్ఫులింపతఁ జూచు నన్నుఁగని తద్ది
వ్యక్షి యేతజ్జలోన్మగ్నద్రోణిక యొక్క-
వేగిరమె తానంబాడి రమ్మన్న నే, లగ్నా
ఖర్వ్యమతోడ నెక్కుము నిఁగెన్ లావూఁది
నేఁ ద్రొక్క వరాహ ౯ ౧౪౨

౬. ఉపకారము.

క. సేవకులకు మును చేసిన, జీవితములు చెఱుప
లావుచేసినవారికి, దేవచెడెవాడ విధి నా,
కీవిధిఁ బ్రతికూలుఁ డగుట కియ్యదిగతమా
భోజరా ౩. ౧౩౯

క. ఈ సకలయాధనాథులు, చేసిన లావునకు
సంతసించితి వారుం, వాని చనుఁడు మము
నిటుగాఁ, జేసిన దైవంబు గడవఁ జెల్లునె
నాకున్ (భా రా యు ౬౦౧)

౭ ౧ అధికము, హెచ్చు.

సీ. గర్వంబు లావైనఁ గల్గుఁ బరాజయం బాశ
హెచ్చైన సౌఖ్యము నశించు
రామలిం ౫౦.

ఉ. లావగునట్టి దుర్దశ యలంత సహింపఁగలేక
యశ్రుధారావళి గాఱ
సారంగ ౩ ౧౧౫.

వ. లావుగాఁ గావు గప్పి (మనుచ. ౪. ౭౦.)

౨ ఘనము, పెద్ద.

గీ. ఈశురరముచేత నెవ్వఁడే నిప్పాట, తూరుఁ
డైన దుష్పుఁ జూచి నక్క, రొయిఁడలు గాల్చి
కొన్న వడువున మీరింత, లావుమాటలాడ
లజ్జగాదె ౯ హరి. ౪ ౧౭౫.

౩. బలిష్ఠము, బలముగలది.

సీ. కైలాస మెత్తిన నీలావుకరములఁ గరములఁ
గల కెంపు గావిగాఁగ
భా. రా. అర. ౧. ౨౭౩.

౪. బలకరము.

క. సంకె వీడకెంచె నిచ మిఁదం బాకటి లావు
యాతుధానుల కనుచుఁ
భా. రా యు. ౫౩౦

౫. శక్యము, అలవి.

ఉ. వారలన్, లావె రణంబులో మన
కలంఘ్యబలాఢ్యుల నింక నోర్వఁగాక.
భార. సభా ౨ ౨౬౩.

తరువోజ ఇమ్మోయిఁజేయఁ, గానున్న విధి
యేల కడవంగనిచ్చుఁ గర్మవిపాకంబు
గడవంగ లావె భార అది ౬ ౨౪౬

సీ. విప్రునకు కయ్యు విధికృతంబు,
ఆ. గ్రమ్మరింప లావె కావున దక్షిణ,జలధి
తీరమునఁ బ్రశస్తపంచ,తీర్థములకు వేగి
భార. అది ౮ ౧౬౧.

క. అరాజకమయిన ధారుణిప్రజ, కొక
నిమిషంబయినఁ బ్రకృతి నుండఁగ లావే.
భార. అది. ౪. ౨౪౮

౬. స్థూలము. (శ. ర., వా.)

జ. లావరి, లావుకొను, లావుచేయు, లావె
క్కించు, లావెక్కు.

లావు². వి. ౧ రెక్క, పక్షము, రెక్కయీక

చ. చిడిముడిపాటుతోఁ జెంకుచిఁగిణిఁ బూని
మధుప్రియత్వమేర్పడుగతి లావులున్న వారి
పైన జివుక్కున రెక్కయుక్కునన్, ...
తెడుచందుఁ జూచి తిమి చేఁ డిదిగో వస
మాచరించుఁ బెంపడరిల తాంగిపచ్చితురకాఁ
గద యమ్మదనుండు చూడఁగన్.
విజ. వి. ౩. ౬౬.

క. వలపిన మేపులు గొని కాళ్లు లావులును నిక్క
లించి, బులుఁగులు చట్టుపలార్చుచుఁ,
గొలకొలమని కూఁతలిడుచు గూఁడుల
నేరెన్. ప్రబంధ. ౭౧

సీ. ఉరిలేక జిగురులే కాగిఁ బుల్లురాయని లావు
లతోఁ దెచ్చు లావుకొలఁది.
రా. వి. ౩. ౪౭.

ఉ. దేగవడిం జేని గిట్టిపట్టి సే, పింఛినఁ
గాలిమాలుగయుఁ జెక్కుముఁ జక్కర
నద్ది యిచ్చి దయ, తెంచె నొకండు దాలవిటి
దీటుచు లావులు గూడదువ్వచుఁ
చంద్రా. ౨ ౧౦౫.

౨ పక్షతి, ఱెక్కమొదలు.

౩ ఱెక్కలు విదిల్చి లావులు, ముక్కునందం
దువ్వి వాదమునఁ గంధరముల్, దిక్కులి
దిక్కు గను గొన శుక ౧. ౧౪౫

౩ పక్షిపుచ్ఛము, పింఛము

సీ లావు లవిటి నా నలరుఁ ఒక్షిపుచ్ఛాఖ్య
యొనుపు నాఁగను విహంగగతి దనరు
ఆం భా ౨. ౯౯

వ ఓడుగులు పడుగులు గడిసిన చందంబున
ముఖపాళిఁబూని వారలపై ధాణుధారలం
జూప నప్పట్టున జాట్టుపట్టలావు నెట్టంపు
దాలుపు బలగంబు స్వస్తికంబున నొడ్డు
కొని .. ప్రబంధ. ౭౦౮.

**లావుక(ము).** వి (సం లావక) ఒకానొక జాతి
పక్షి.

సీ కాఁకులు పూరేళ్లు కన్నెలేళ్ళ చెమళ్ళు
లావుక ల్గోరువా ల్గకుముకులును
రసిక ౧ ౬౩

సీ లావుక పసిరిక లకుముకి గిజిగాఁడు పూరేడు
జీనువు కాయకోడి ప్రబంధ ౨౩౪

సీ లావు కన లావక మొప్పను
ఆం భా ౨ ౯౩

సీ కొక్కర పూరేడు గొరవంక లావుక
పాన్నంగి కోజల కన్నెలేడి
యయా. ౨ ౨౪.

**లావుకొను.** అ. క్రి (లావు[1] + కొను) అధిక
యించు.

ఉ రాఘవుఁడు జంభవిరోధి సహాప్రశక్తి
లక్ష్మణయోయి కనుంగొనలగ సౌసుజాంఘ్రి
మునిరాజసన్ను తుల్, లావుకొనంగఁ జొచ్చి
మిథిలాపురిఁ గౌశికువెంట నర్మిలిన్
చంద్రా. ౧. ౨౨

**లావుసేయు.** అ క్రి. (లావు[1] + చేయు) బలము
చూపు

క. మన మెంత లావుసేసినఁ, బనిదీఱదు నేకు
ఱందు పగతుఁడు లోకం,బున దూఱురాదె
యితరుల ననిఁ జంపినఁగానవలవ దాహవ
మింతన్. హరి ఉ. ౬. ౧౩౬.

**లావెక్కించు.** స క్రి (లావు[1] + ఎక్కించు)
పురికొల్పు, ప్రోత్సాహపెట్టు

శా పౌండ్రకవిభుం డాత్మీయులం జూచి
చేపీచెం ద్రోయుఁడు కోట మేడ పడన్
ద్రేయుండుడాయుండు రెం,డేచూ ఱెవ్వఁ
డుగొన్న నిత్తునని లావెక్కించె సంరంభియై.
ఉ ౭౮ ౩ ౩౨

**లావెక్కు.** అ. క్రి. (లావు[1] + ఎక్కు) అధికమగు.

వ అపహ్నా విషజిహ్వాల కలాపంబులు
బ్రహ్మాండకర్పరంబు నప్పళింప నిప్పులు
చెదరి చేదలు దరికొల్పు మల్కాపాతం
బులుంబోలె దిక్కులం జారటారి ప్రుక్కి
లావెక్క సప్తపాతాళభువనచక్రవాళంబు
పురపురంబొక్క వెక్కసంబయి కోలా
హలం బుద్భవించిన భీమ. ౪ ౭౦

**లాషుకము.** సం విణ (అ కా కీ అ) లోభ
గుణముకలది, అత్యాశకలది.

**లాసకము.** సం విణ (అ సికా అ) ౧ ఆడు
నది, కుప్పిగంతులు వేయునది ౨. ఇటునటు
గదలునది వి అ పుం ౧. నృత్యము,
నాట్యము. ౨ నెమిలి ౩ అలింగనము,
కౌఁగిలింత న. మేడమీఁది గది. పుం., న.
ఒక విధమైన ఆయుధము. (విల్సమ్సు.)

**లాసకి.** సం. వి ఈ. స్త్రీ నర్తకి, నృత్యము
చేయు స్త్రీ.

లాసకుఁడు. సం. వి. అ. పుం. ౧. నర్తకుఁడు, నృత్యముచేయు పురుషుఁడు. ౨. శివుఁడు

లాసము. సం. వి. అ. పుం. ౧. దుముకుట, ఆడుట, నృత్యముచేయుట ౨. చెలగాట, సయ్యాట, శృంగారక్రీడ ౩. స్త్రీ లభ్యసించు నృత్యము. ౪. పులుసు.

లాసవతి. సం. వి. ఈ. స్త్రీ. నాట్యముచేయుస్త్రీ, వేశ్య.

చ. అని కొనియాడ లాసవతు లాడఁ బురంధ్రులు పాడ బంధువుల్, మ నుకొని డాయ
చంద్రా ౬. ౧౩౦

లాసిక. సం వి. అ స్త్రీ. ౧. నర్తకి, నృత్యముచేయు స్త్రీ. ౨. వేశ్య. ౩. కామాతురతగల స్త్రీ, లంజె. ౪. నాటకప్రదర్శనవిశేషము.

లాసికతనము. మి వి (లాసిక + తనము) ఆట కత్తెతనము

క. అని కొలిచి రయ్ బృహన్నల, యను నామము తోడఁ గన్యకాంతఃపురవ, ర్తన మొనరించుచు లాసికతనమున నిపుణుండవై యతని మెచ్చింతున్ భార విరా ౧ ౦౯

లాస్ఫోటని. సం వి ఈ. స్త్రీ. కజ్జలకు బెజ్జము చేసెడి 'ఒరమా' యను సాధనము.

లాస్య. సం వి. అ. స్త్రీ. వేశ్య, కలయాలు

లాస్యము. సం. వి అ. న. ౧ నృత్యము ౨ నృత్యము చేయుట ౩ గీతవాద్యములతోఁ గూడిన నృత్యము ౪. అభినయముచేతను, ముఖవైఖరిచేతను కామవికారములను తెలిపెడు నృత్యము

లాస్యుఁడు. సం. వి. అ. పుం. నర్తకుఁడు, నటుఁడు.

లాహిరి(రీ). వి. ౧ మైకము, మత్తు.

క. తనగంధాఘ్రాణముచేత, త నె లాహిరిఁగొనఁగ దేవదానవు లబ్ధిం, జనియించె మదిర
దశా. ౨, ౨౫

గీ. జార యున్మ ద్దధిరత లమృతలహరి, చెనక లాహిరిఁగొలుప నాలిహ్వ ప్రహ్వయైనది..
చం రా ౬. ౧౫

ఉ. బిచ్చము లెత్తి యూపయిన కేగులవారయి రూకపోతకల్, హెచ్చినవాని మంత్రు లతిఁ డెట్లన నట్లనె పల్కి యొడ్డులన్, ఒచ్చిక వేయకే వ నిచి పాలను బిందుకకందుటన్న వా, తెచ్చెదమంద్రు వార లది తేనిది బీనిక లేదు లాహిరిన్. పార్వ ౨ ౧౦౦.

గీ. మదసంజ్ఞ యుల్లసిల్లు, మబ్బు లాహిరి యనఁ గను మాతృభూత. ఆం భా ౨ ౩౦౩

చ. రాజ్యసౌఖ్యముల్, గడుకొను లాహిరీ మనఁగఁ గ్రమ్మిన మత్తులుగారె భూపతుల్
రాజ వి. ౩. ౨౬

౨. మైకము గలుగఁజేయు ద్రవ్యము.

చ కనుకని కెల్లవాఱుచనుక ౯ రతిఁగోరెడు పల్లవాలి కేం,ల్లనుఁగొని వీడెముం గలప లాహిరిమేపుల నిద్రపుచ్చి చెం,దిన చిఱునవ్వుతో నవుడె నిద్దురలాయని వింత మైఁడి పట్టిన కాలముద్దుగుమ్మలు వడి౯ కయనించిరి చప్పరింబులన్ కువల ౨ ౧౧౨

సీ బుగ్గ లాహిరియాటఁ బొడము వాసనతోడి కంఠునోటను జొఁగ యుంకులింప, గీ వేగఁ దనయిల్లు వెడలె నావృద్ధవేశ్య. శుక ౩ ౩౦

లాహిరిపట్టు = మత్తెక్కు

న విషంబెక్కినలీల బ్రమాఁగన్ను కట్టిన లాగున లాహిరిపట్టినభాతి మదంబెక్కిన మాడ్కి నంగిడిగొన్నభంగి నొసరిల్లుచు నుమ్మలించుచు నవ్వానుచు నూర్వశినందనుం డూర్ధ్వబాహుండై యుచ్చైస్స్వరంబున
కాశీ. ౨. ౧౩౫.

౩. లాహిరి కాఁడు.

లాహిరికాఁడు. వి. (లాహిరి + కాఁడు)మత్తుఁడు.

చ లొలఁకెడు తావిగందవొడి తూరుపు వాఱఁగఁ ఒట్టి మద్దెపూ,తలపులు కొల్లలాడి

హిమవారిఁ గలంచి కొలఁకులఁగోళ్ల గుఱ్ఱల
పయిఁచల్లి దకావిజిగి పర్యాదకొంగు జెడల్చి
యొందుకై, జలియక తూలుకొఁచు వలి
జెమ్మెర లాహిరికాఁడు త్రిమ్మరుఁడా
కవల. ౧ ౨౨

సీ. ఏఱు త్రయ్యు లానర్చి యూరు డియ్యగఁజేసి
మలయు లాహిరికాని మహిమ యొంత (ఇట
బలరాముఁడని భావము ఉ. రా. ౧ ౬౬.



**లి.** సం. వి. ఇ. పుం. ౧ మార్గాయాసము ౨ నాశము. ౩ ధ్వంసము ౪ సామ్యము. ౫ కరకణము, కడియము.

**లింగఁడు.** వి. (సం. లింగః) జంగమయ్య
క. శాలునిఁ బాలకుఁ బిలుచుచు, లీలం గరయుగ
ముసాఁచి శేమయొక తే యిట్టాలింగనిఁ గని
తేగం, బాలింగన మొసఁగవచ్చునటు లరు
దెంచెన్. రాజ. లి. ౨ ౧౨౪

**లింగకట్టుమాత్ర.** వి. వి. (లింగము + కట్టు + మాత్ర) లింగాకారముగాఁ జేసిన రసవస్తువుల గుళిక (శ. ర.)

**లింగకము.** సం. వి. అ. పుం. కపిత్థము, వెలఁగ చెట్టు.

**లింగకాయ.** వి. వి. (లింగము + కాయ) లింగధారులు లింగమునుంచి కట్టుకొనెడు వెండి బంగారములతోఁ జేసిన సజ్జకాయ (శ. ర., బ్రౌ.)

**లింగదేహము.** సం. వి. అ. న. పంచతన్మాత్రములు, పంచజ్ఞానేంద్రియములు, పంచప్రాణములు, మనోబుద్ధిచిత్తాహంకారములు అనుతత్త్వములు కలిగి లోకాంతరమున సుఖదుఃఖముల ననుభవించు సూక్ష్మశరీరము.

**లింగదొండ.** వి. వి. (లింగము + దొండ) లింగాకారముగ నుండు కాయలుగల యొకదినుసు దొండ. (శ. ర., బ్రౌ., చి. ని.)

**లింగధారి.** సం. విణ. (వి. శి. వి.) (శైవుని) చిహ్నము ధరించినవాఁడు.

**లింగనము.** సం. వి. అ. న. ఆలింగనము, కౌఁగిలింత.

**లింగనాశము.** సం. వి. అ. పుం. నేత్రరోగవిశేషము.

**లింగపరామర్శము.** సం. వి. అ. పుం. (తర్క.) లింగము = (వ్యాప్యాదిశధర్మము) యొక్క యాలోచనము (వహ్ని వ్యాప్యమైన ధూమము గలది యీపర్వతము, అనునది లింగపరామర్శము, వ్యాప్యము పక్షమందుఁ గలదని కనిపట్టుట)

**లింగపురాణము.** సం. వి. అ. న. పదునెనిమిది పురాణములలో నొకటి.

**లింగపొట్ల.** వి. వి. (లింగము + పొట్ల) లింగాకారపు విత్తులుగల ఒకజాతిపొట్ల, లింగబీజ. (శ. ర., చి. ని.)

**లింగప్రతిష్ఠ.** సం. వి. ఆ. స్త్రీ. లింగమును స్థాపించుట.

**లింగబలిజె.** వి. వి. లింగధారియగు శూద్రుఁడు.
సీ. అలు కోమటిజాతి వక్క జంగమురాలు,
బావగారిదిలింగబలిజెకులము. వేమ. శ. ౬౭

**లింగబీజ.** సం. వి. ఆ. స్త్రీ. లింగపొట్ల. (శ. ర.)

**లింగము.** సం. వి. అ. న. ౧ చిహ్నము, గుఱుతు. ౨ కపటవేషము. ౩ ధ్రువపఱుచుటకు సాధనము. ౪. (తర్క.) అనుమానమునకు సాధనమయిన హేతువు ౫ (వ్యాక.) పదసాధుతాప్రయోజకమయి స్త్రీత్వపుంస్త్వాదులను దెలుపు చిహ్నము (ఉదా. స్త్రీలింగము, పుంలింగము) ౬. మగగుఱి ౭ దేవతాప్రతిమ, విగ్రహము ౮ పానపట్టముమీఁది శివమూర్తి ౯. లింగదేహము. ౧౦ ప్రాతిపదికము. ౧౧ (సాంఖ్య) ప్రధానము. ౧౨ వక్తయొక్క తాత్పర్యమును నిర్ణయించుటకు హేతువగు పదాంతరసన్నిధి యుండుటకునది. ౧౩. మచ్చ, కళంకము.

**లింగరాజ్ఞి.** వి వి కూరగాయలగుచెట్టు, శృంగము, శృంగరాజ్ఞిచెట్టు.
గీ. శృంగాహ్వ మెలయు లింగరాజనగ. ఆం. భా. ౨. ౯౩.

**లింగవర్ధనము.** సం. విణ. (అ. సీ. అ.) లింగోత్థాపనము గలిగించునది

**లింగవర్ధిని.** సం. వి. ఈ. స్త్రీ అపామార్గము ఉత్తరేను. ౯

**లింగవిపర్యయము.** సం వి. అ. పుం పుంలింగాదుల మార్పు

**లింగవృత్తి.** సం విణ (ఇ) వంచనచేయువాడు, మోసగాడు వి ఇ పుం కపటసన్న్యాసి, జీవనార్థమై యతివేషము ను ధరించినవాడు

**లింగవృత్తుడు.** సం విణ (అ ఆ అ.) ధర్మధ్వజి, పొట్టపోసికొనుటకై లింగజటారుద్రాక్షాదులు ధరించువాడు

**లింగవేది.** సం వి. ఈ స్త్రీ లింగాధారస్థానము, పానవట్టము

**లింగశరీరము.** సం. వి. అ. న. లింగదేహము

**లింగసదర్థుడు.** సం విణ. (అ ఆ అ) శివుని విషయమున మంచి కార్యములు చేయువాడు
ద్వి. గణుతింప నింత లింగసదర్థుం డయ్యుం, బట్టిన నియమంబుం బాయక కన్న, పెట్టు నర్థ మెక్కాని మట్టుడు నేత
బస పు ౫ ౩౨౯. పం.

**లింగస్థుడు.** సం. వి. అ పుం మతగ్రంథము లభ్యసించు విద్యార్థి.

**లింగానుశాసనము.** సం వి. అ. న వ్యాకరణమందు లింగము నిరూపించు సూత్రసముదాయము.

**లింగి.** సం. విణ. (ఈ. నీ. ఈ.) ౧. చిహ్నముగలది, గుఱుతుగలది. ౨ కపటవేషముకు ధరించినది. ౩. మంచి లక్షణములు కలది. ౪. శివలింగమును ధరించినది, లింగధారి. వి. పుం. ౧. మంచి లక్షణము గల ఏనుగు ౨. మతగ్రంథములను పఠించు విద్యార్థి, సన్న్యాసి. ౩. (తర్క) లింగజ్ఞానముచేత తెలియబడు సాధ్యము ౪. (తర్క) పక్షము, సందిగ్ధసాధ్యము గలది. ౫. పరమేశ్వరుడు. ౬. మూలకారణము ౭. శైవుడు.

**లింగిని.** సం వి ఈ స్త్రీ ౧. సన్న్యాసిని. ౨. ఒకజాతి తీగ.

**లింపటుడు.** సం విణ (అ ఆ అ) భోగాసక్తుడు, కామాతురుడు వి అ. పుం. విటుడు

**లింపము.** సం వి అ పుం ౧ రాచుట, పూయుట ౨ కప్పుట.

**లింపాకము.** సం వి అ పుం ౧. దబ్బచెట్టు, నిమ్మచెట్టు ౨ గాడిద, గర్దభము ౩ దబ్బపండు, నిమ్మపండు.

**లింపి = లిపి.** సం వి ఇ స్త్రీ

**లికుచము.** సం వి అ పుం లకుచము, గజనిమ్మ ౯

**లిక్క.** సం వి అ స్త్రీ. లీఖ, ఈరు, పేనుగుడ్డు

**లిక్కి.** వి గడ్డి లోనగువాని గోసెడు చిన్న కొడవలి, అల్పలవిత్రము
ద్వి చిక్కముల్ కాసుల చిక్కముల్ చలిది, చిక్కముల్ లిక్కులు జిక్కులుం దాల్చి, యలమిమీజీనయట్టి యుమున చెంగటను,
ఆ మ. క ౧ ౪౯ పా. ౨౦ పం.
సీ అల్పలవిత్రాఖ్య యలరు లిక్కి యనంగ
ఆం. భా. ౨ ౨౩౧.

**లిక్ష.** సం వి ఆ. స్త్రీ. ౧ ఈరు, పేనుగుడ్డు. ౨. నాలుగు, రేణు, యెనిమిది త్రసరేణువుల పరిమాణము, అతిసూక్ష్మపరిమాణము.
శ్లో. 'జాలాంతరగతే భానౌ యచ్ఛాణుర్దృశ్యతే రజః, తైశ్చతుర్భి ర్భవే ల్లిక్షా'.
'త్రసరేణవోష్టౌ విజ్ఞేయా, లిక్షైకాపరిమాణతః' మనుస్మృతి.

**లిక్షికా.** సం. వి. ఆ. స్త్రీ. ఈరు, పేనుగుడ్డు.

**లిఖనము.** సం. వి. అ. న. ౧. వ్రాయుట. ౨. చిత్రరువు వ్రాయుట, బొమ్మలువేయుట ౩. గీయుట, గోఁకుట. ౪. వ్రాసినపత్రము, చేతి వ్రాత

**లిఖ(యి)ంచు.** సం. స. క్రి. వ్రాయు

గీ అష్టదళమైన నవనాభమైన షోడ,శారమైన లిఖించి తదంతరమున, విష్ణుదేవుని శాస్త్రోక్త విధి యజించి వరాహ. ౧౨. ౪౬.

వ. సూక్ష్మాక్షరంబుల నేను లిఖయించి యుడిన కనకమయశాసనపట్టిక పుచ్చుకొని చదువుకొనునది మార్కం. ౪ ౨౩౩.

**లిఖితము.** సం విశ (అ ఆ అ) ౧ వ్రాయఁబడినది ౨ చిత్తరువు వ్రాయఁబడినది ౩ గీయఁబడినది, గోఁకఁబడినది వి అ న. ౧ వ్రాఁత, వ్రాసినపత్రము (కాగితము) ౨. కృతి,గ్రంథము

**లిఖితవ్యము.** సం. విశ (అ ఆ అ) వ్రాయఁదగినది, లేఖ్యము (శ ర)

**లిఖితుఁడు.** సం వి అ. పుం ధర్మశాస్త్రగ్రంథకర్త

**లిఖ్య=లిక్ష.** సం. వి. ఆ స్త్రీ

**లిఖ్యము.** సం వి అ. పుం ఈఱు, పేనుగ్రుడ్డు

**లిగువు.** సం వి ఉ పుం ౧ మృగభేదము, ఒకజాతి జింక ౨ మూర్ఖుఁడు, అవివేకి న ౧ వ్యాపారము, ఎద ౨ మనస్సు

**లిద్ది.** వి. ౧ వంచుటచే మిక్కిలి లోఁతుపడిన ప్రాణిజోటికి కొట్టెడు గూటము

ద్వి పెద్దగాఁ దనమేను పెంచిన నిండ, లిద్ది గొట్టిన యట్టి లీలదైు. ద్వి. భాగ. ౧౦. (శ. ర.)

౨. పడిసెముచే ఊపిరిరాక ముక్కు అడఁచుకొనుట (శ. ర.)

**లిపము.** సం. వి అ. పుం పూఁతపూయుట.

**లిపి.** సం వి. ఇ, ఈ. స్త్రీ. ౧ పూఁతపూయుట ౨. వ్రాఁత, అక్షరవిన్యాసము. ౩. అక్షరములు, వ్రాఁతయక్కరములు, వర్ణములు. ౪. వ్రాయుటయందు కళ. ౫. ఉత్తరము, పత్రము మొదలగునవి వ్రాయుట. ౬. చిత్తరువు వ్రాయుట, బొమ్మలువేయుట.

**లిపి(ం)కరుఁడు.** సం. వి. అ. పుం. ౧. సున్నము పూయువాఁడు, తాపీపనివాఁడు. ౨. లేఖకుఁడు, వ్రాయసకాఁడు. ౩. చిత్తరువులువ్రాయువాఁడు.

**లిపికారుఁడు.** సం. వి. అ. పుం. లేఖకుఁడు, వ్రాఁతగాఁడు, వ్రాయసకాఁడు.

**లిపికుఁడు.** సం. వి. అ. పుం వ్రాయసకాఁడు, లేఖరి

**లిపిజ్ఞానము.** సం వి అ. న పలువిధములగు లిపులను తెలియుటయను కళ

**లిపిజ్ఞుఁడు.** సం విశ (అ. ఆ అ) లిపి తెలిసినవాఁడు, వ్రాఁత నేర్చినవాఁడు

**లిపిన్యాసము.** సం. వి. అ. పుం. ఎత్తివ్రాయుట, మఱియొకప్రతి వ్రాయుట

**లిపిఫలకము.** సం. వి. అ న ౧. వ్రాఁతబల్ల. ౨ వ్రాసెడు కాగితము, తాటియాకు మొ॥

**లిపిశాల.** సం వి. ఆ. స్త్రీ వ్రాఁతబడి, అక్షరములునేర్పు బడి.

**లిపిసజ్జ.** సం. వి. ఆ. స్త్రీ. వ్రాఁతపనిముట్టు, లేఖనసాధనము.

**లిపీకరుఁడు.** సం వి. అ పుం.=లిపికరుఁడు.

**లిప్త.** సం. వి ఆ. స్త్రీ విగడియలో నఱువదియవభాగము.

**లిప్తకము.** సం. విశ. (అ. ఇ ఆ. అ) విషము పూసినది. వి. అ. పుం. విషముపూసిన బాణము.

**లిప్తము.** సం విశ. (అ. ఆ. అ.) ౧. పూయఁబడినది, కప్పఁబడినది. ౨. మలినముగాఁజేయఁబడినది, కళంకితము. ౩. పాడుచేయఁబడినది ౪. విషముతోఁ గూడఁబడినది. (బాణము) మొ.

౫. తినఁబడినది, భుజింపఁబడినది. ౬. కలిసినది, పూసుకొన్నది.

**లిప్స.** సం. వి. అ. స్త్రీ. ౧. పొందనిచ్ఛ, సంపాదనమందలి కోరిక. ౨. కోరిక, ఇచ్ఛ, మనోరథము.

**లిప్సువు.** సం. విణ. ఉ. ౧. పొందనిచ్ఛయించువాఁడు. ౨. లాభముఁబొందఁ గోరువాఁడు ౩. ఆకాంక్షకలవాఁడు.

**లిబి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. లిపి.

**లిబి(ం)కరుఁడు.** సం. వి అ. పుం. వ్రాఁతగాఁడు, వ్రాయసకాఁడు, లేఖకుఁడు, ఒకదానికిఁ బ్రతి వ్రాయువాఁడు.

**లిబ్బి.** వి. ౧. నిధి.

గీ. ధరణిఁ దొమ్మిది లిబ్బులు దాఁచుకొన్న, వానికైనను ధనకాంక్ష పోనియట్లు
ఘటికా. ౧. ౧౯.

గీ. తనరు లిబ్బి యనంగ నిధానసంజ్ఞ.
ఆం. భా ౧. ౬౪.

౨. ధనము.

గీ. కన్నులకుఁ దోచుచున్నది గాని చేతి, కబ్బ దద్దంబులోఁ దోచు లిబ్బి పగిది. . .
కళాం ౪ ౩౧

క. ఉబ్బుఁడు లిబ్బులు గలవని, రొబ్బుఁడు రిపు రాజుఁగాని రేఖలవలరా, యబ్బుఁడు పర భామినికై, యబ్బుఁడు శ్రీపాదకొని యబ్బుఁడు ధాత్రిన్. బహు. ౧ ౭౦.

సీ. లిబ్బి నిబ్బర పుబ్బు గబ్బిగుబ్బెతమిన్న కలఁగి గొబ్బునఁ బాథుఁ గౌఁగిలించె.
కళా. ౨. ౫౫.

౩. కాకి, జక్కి.

సీ. గుబ్బలా యనుకరణి లిబ్బులా దరిమించు మిబ్బులా యని పొంతధీర తెక్కు.
కాంగు. ౩. ౭౧.

లిబ్బిగుబ్బెత = లక్ష్మీదేవి.

సీ. పొడఁగాంపు జాకారి నిడుకొని చనుచూలి లిబ్బిగుబ్బెతఁ బ్రబ్బి యుబ్బు పెల్ల.
ఉ. రా. ౫. ౭౦౯.

సీ. గిబ్బదాల్ దొరగుండుకబ్బంబు ప్రోయాలు లిబ్బిగుబ్బెతయబ్బ జొబ్బుపెక్కము.
(లిబ్బిగుబ్బెతయబ్బ = పాలసంద్రము)
అచ్చ. రా యు. ౫౯౨

లిబ్బిదొర = కుబేరుఁడు.

సీ వంకి లిబ్బిదొర లాఁతంకిలి బొందించి కొంగ వాలున గట్టగొంగ గెలిచి
అచ్చ. రా. యు. ౪౩౪.

ఇట్లే – లిబ్బులదొర, లిబ్బులరేఁడు

క. లిబ్బులదొరచెలికానికి, గుబ్బలి దుహితమాని యనుఁగుఁగూఁతుమగనికిన్ నీలా. ౧. ౧౭.

గీ. జేమునికంటెను కేలేలసామికంటె, కంట జూముల వేలుపుకంటె నీళ్ల, టేనికంటెను లిబ్బులఱేనికంటె, మేటిరయే రాగవుఁడు నిన్ను మీఱి పోర అచ్చ. రా. యు ౧౨.

లిబ్బులచాన = లక్ష్మీదేవి.

గీ పొందలి పెన్నుఁడు పంటలముగుదగాడవు, లుడుపు కొలు కిర్లగొంగవంగడమునందు, రాముఁడై పుట్టె లిబ్బులచాన సీతయై పొడమె వేలుపులు గోఁతులైరి సుమ్ము.
అచ్చ రా. యు. ౧౯.

లిబ్బులజవరాలు = లక్ష్మి.

సీ లిబ్బులజవరాలియబ్బ నల్లునిఁజేసి తనరెడు నడుగుఁగొందమ్మివాఁడు. రా. వి ౧. ౩౧.

జ లిబ్బిపడఁతి, లిబ్బిరాయఁడు.

**లిబ్బిపడఁతి.** వి (లిబ్బి + పడఁతి), లక్ష్మి. (శ. ర.)

**లిబ్బిరాయఁడు.** వి. (లిబ్బి + రాయఁడు) కుబేరుఁడు, ధనాధిపతి. (శ. ర.)

**లిభి.** సం. వి. ఇ. ఈ. స్త్రీ. 'లిపి' యొక్క రూపాంతరము.

**లిమ్మ.** వి. మూఁపుమీఁద ముసురుకొను కండలను దోచెడు లెమ్మ.

చ. కనుగొని వేగవచ్చి గణకాండము గద్గొని ప్యామలార వే, బని విని కాంచివచ్చి కల వాఁడొక యంగడి పోయు పెంచక, మ్మును మున నొక్క మీన మిడి మూగిన యీఁగలఁ జేత లియ్మఁ బో,జనుచు దీని గొండు పల సొమ్మని యమ్ముచున్న వాఁ డవన్
చెన్న ౪ ౩౩౭.

(శ. ర, బ్రౌ పా రెమ్మ. ముద్రి పా)

**లియ్యము=లీయము.** విణ (సం. లీనః) మిక్కిలి కలసినది, లీనము

శా చేపెంగావలయున్ విరించి నిఖల స్త్రీపుంస సంయోజనా,భ్యాసప్రౌఢిప్రకాశ పొందఁ గడు లియ్యంబైన సంసర్గ మి,ట్లు
వైష ౬ ౭౫.

క. అటుగనుక నీవు చెప్పిన, యటువలె నియ్యకొని లియ్యమై యుండంగా, నటుమీఁద దైవగతియని, యటునిటు నడయాడుచుండి రా చెలు లంతన్ సారంగ ౨ ౪౯

వి. ఐక్యము, మిక్కిలి కలియుట.

ఉ. పువ్విలుకానితోడ సరిపోలెడు చక్కని వాఁడు భూమిలో, నెవ్వఁడు చెప్పఁడా యనుచు నిష్టవయస్యలఁగూర్చి యాత్మలో, నువ్విళులూరుచుం బలుకు నొప్పులకుప్ప నలుండుగాక యొం,డెవ్వఁ డనంగ మెచ్చుఁ దరళేక్షణ సెయ్యము లియ్య మెట్టిదో
వైష ౧ ౭౫

క. ఇయ్యకొని యయ్యమాత్యుల, కెయ్యారుడు గర లాసంగి పెస విభుఁ డనుపన్, వియ్యము గతి మాళవపతి, లియ్యంబున విని వినిర్మలిత హృదయుండై. రా. వి. ౫. ౪౩.

**లివ.** వి. ౧. లాఘవము.

ఉ. ... యూఁబూ,కులకాశంద్రు మునీంద్రుఁ వందుఁ బొగడొక్క తొక్కసాంద్రహారి దం,టలివన్నాఁటుచుఁ దన్మనోధనముదండన్ దండ చేకేరఁగన్. చంద్రా. ౩. ౯౭.

సీ. లివ హత్తివిరిగాఁగిలింతలఁజనివాళ్లఁ గనుపట్టు నామ్మెన గప్పి కప్పి. ఉ. హరిశ్చ. ౪.౪౯.

సీ. బావిదాఁకెడ వంచుఁ బరతెంచి లివదట్టి జడిసి హైతరుశాఖ కొడిపె నొకతె.
బహు. ౨. ౨౯.

౨. మల్లబంధ విశేషము

వ. లివ రాకడ ఏకసరము హైసరము ఝుంపపిక్కు కరలాఘవంబు మొదలగు విశమ్ము లును .. మల్లపు. ౩ ౬౯.

వ. లివ రాకడ రేకసర హైసర ఝుంపపిక్కు కరలాఘవంబు మొదలగు విశమ్ములెఱింగి.
ప్రబంధ ౭౭.

౩. అతిశయము

వ. .. తవ్వెందలసందడియు, గంటెకొట్టి కటుచును, గసగస లివయు ధీమ. ౩. ౫౩

**లివలివ.** వి ౧ కదలుటయందగు ధ్వనికనుకరణము

సీ శేమగుంపుల లివలివలాడు లేఁగొనుచంటి చోటికి కెలవరియటంచు. కువల. ౧. ౨౦

ద్వి గుబ్బలప్రేకంబుతోడ, లేఁగొనుదీవియ లివలివలాడ ద్వి. పరమ. ౨. ౫౬. పా.

వ. కొండియు జరాప్రాదుర్భావంబున శిథిలంబులై కుమురుపక్కైడ లివలివం గదలురదన పంక్తులును కవిక ౫ ౧౧౦.

౨ అడుగిడుటయందగు ధ్వనినుకరణము.

క తవిడాడనేర్చెఁ జెవులకుఁ, జవులుగఁ బలుకంగనేర్చెఁ జరణాభరణా,రవములు ఘులుఘులుఘుల్లన, లివలివ నడుగిడఁగనేర్చె లీలాగతులన్ సుద. ౨. ౧౨౪.

**లిష్టము.** సం. విణ. (అ ఇ అ) క్షీణించినది. తగ్గినది, వ్యర్థపఱుపఁబడినది.

# లీ

**లీ.** సం. వి. ఈ. స్త్రీ. ౧. అంటియుండుట, విడువకుండుట. ౨. కౌఁగిలించుకొనుట. ౩. కరఁగుట

**లీల.** సం. వి. ఆ. స్త్రీ. ఉరు పేరు. (బ్రా. వి)

**లీగు.** వి. నడుము.

సీ. .. కెలయు మధ్యభాగము నడు మన లీగు
నాఁగను గాను నా ..
ఆం. భా. ౨ ౧౩౮.

**లీడలిగోరిక.** వి. తృణవిశేషము.

గీ. కనుము లీడలిగోరిక కాకికెదురు.
హంస. ౫. ౪౪

**లీఢము.** సం. విణ (అ. ఆ. అ) ౧ ఆస్వాదింపఁబడినది, రుచిచూడఁబడినది, తినఁబడినది, భుజింపఁబడినది. ౨. స్పృశింపఁబడినది, తాఁకఁబడినది

**లీనము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. అంటుకొనియున్నది, తగిలియున్నది ౨. దాఁగియుండినది, పొందియున్నది. ౩ ఆశ్రయించియున్నది, ఆధారపడినది, అనుకొనునది. ౪ కరఁగినది ౫. కలసిపోయినది, ఐక్యమొందినది ౬. తదేకాయత్తమైనది ౭. అంతర్ధానమైనది, కనృడనిది, అగోచరమైనది. వి. న ౧. అంతర్ధానము ౨. కరఁగుట ౩. అంటుకొనియుండుట.

**లీయము = లియ్యము.** విణ. కలసినది, సక్తము.

ద్వి. ... పొరభానీకంబుతోడ, లీయమై పద్మ
కేలిమి చూపువోలెఁ, దీయమై రైరమ్మదీ
యతో నాఁగఁ, దళుకొత్తు సరవి
ద్వి పరమ. ౧ ౧౧. పా.

**లీల.** సం. వి. అ. స్త్రీ. ౧. క్రీడ, ఆట ౨. వినోదము. ౩. వేషభాషాదులయందుఁ బ్రియు ననుకరించునట్టి స్త్రీల శృంగార చేష్టావిశేషము. ౪. సౌలభ్యము, అనాయాసము, చులకన ౫. కనఁబడు తీరు, ఆకారము, పోలిక. ౬. చక్కఁదనము, సొగసు. ౭ నటన, మాఱువేషము. ౮. విలాసము. ౯. రీతి, విధము.

గీ. అనుచు నాగంధవహుని ధార్ష్ట్యములు
దెలుపు, లీల విరిసినవిరులు రాలిన రజంబు,
తొలికిన రసంబు లురిలినఫలము లధిపు,
బ్రోలనిడి పల్కి రుద్యానపాలు రపుడు.
[illegible]

క. తల్లి సాధ్వీవంశము, తల్లి నది తల్లడిల్లి దరలఁగ
పరదారా, పిల్లలు దీనిఁ బ్రఱచు మనల్లో
విరోధిఘటికరుకృ లీలన్. రామా. ౫. ౧౯౩.

శా. ఈలీలన్ సురలెల్లరున్ గొలువ వాణీశుండు
శీఘ్రంబుగా, ... దశా. ౨. ౭౮.

**లీలాంగుఁడు.** సం. విణ. (అ. ఈ. అ.) అందమైన యవయవములు గలవాఁడు, చక్కనివాఁడు.

**లీలాంచితము.** సం. విణ. (అ. ఆ. అ.) లీలచే నొప్పునది

**లీలాంబుజము.** సం. వి. అ. న విలాసార్థము పట్టుకొనిన పద్మము.

**లీలాకలహము.** సం. వి. అ. పుం. ప్రణయకలహము, కపటయుద్ధము, విలాసముగాఁ దెచ్చిపెట్టుకొనిన కలహము.

**లీలాగారము.** సం. వి. అ. పుం., న. విలాసగృహము, క్రీడామందిరము.

**లీలాగృహము.** సం వి అ న. క్రీడామందిరము, విలాసభవనము.

**లీలాచతురుఁడు.** సం. విణ (అ. ఆ. అ.) ఆటలలోఁ బ్రవీణుఁడు.

**లీలాతాండవము.** సం. వి. అ న. విలాసార్థమైన నృత్యము.

**లీలానటనము.** సం వి. అ. న. విలాసార్థమైన నాట్యము

**లీలామనుష్యుఁడు.** సం. వి. అ పుం. కృత్రిమ మానవుఁడు, మనుష్యరూపమున నిల్పిన కొయ్యబొమ్మ మొ.

**లీలామాత్రము.** సం. వి. అ. న. విలాసమాత్రము, పిల్లలాట, కొంచెమైనను ప్రాణిశలేమి.

**లీలాయితము.** సం. వి. అ న. క్రీడ, వినోదము.

**లీలారవిందము.** సం వి అ. న. విలాసార్థము పట్టుకొనిన పద్మము.

**లీలారతి.** సం. వి. ఇ. స్త్రీ. వినోదము, ఆట, క్రీడ.

**లీలావంతుఁడు.** సం విణ. (త్. ౘ త్.) ౧. ఆట లాడు స్వభావముగలవాఁడు, ఆటకాఁడు. ౨. సుందరపురుషుఁడు, అందగాఁడు.

**లీలావజ్రము.** సం వి అ న వజ్రాయుధమువంటి పనిముట్టు

**లీలావతారము.** సం. వి అ పుం. (విష్ణుదేవుని యొక్క) విలాసార్థమైన యవతారము, వేడుకకై భూమిపై నవతరించుట

**లీలావతి.** సం. వి ఈ స్త్రీ ౧ చెక్కుఁదనము గల స్త్రీ. ౨ కామాతురత గల స్త్రీ, కాముకురాలు. 3 దుర్గాదేవి ౪ భాస్కరాచార్య విరచితమగు గణితశాస్త్రగ్రంథము ౫ మయూరుని భార్య ౬ (ఛంద) ఒకానొకవృత్తము (విల్యము)

**లీలావాపి.** సం వి ఈ స్త్రీ విలాసార్థమైన దిగుడుబావి

**లీలావేశ్మము.** సం వి న్ న విలాసగృహము, ఆనందమందిరము.

**లీలాశుకము.** సం వి అ పుం విలాసార్థము, పెంచెడు చిలుక, పెంపుడు చిలుక.

**లీలోద్యానము.** సం వి అ న. ౧. ఆనందకరమైన యుపవనము, ధనికులు విహారార్థము చెట్లు నాఁటి పెంచిన యుద్యానవనము. ౨. నందనవనము, ఇంద్రుని యుద్యానవనము

# లు

**లు.** ప్ర. ప్రథమాబహువచన ప్రత్యయము.
ఉదా. గోవులు, వనములు మొ
సీ.. శైశవక్రీడ లాడి రఘుడు, రామకృష్ణులు గోపదారకులఁ గూడి. వి. పు. ౩ ౨౦౨
ఉ. ... పరస్పరాత్మలం, దాకలితంబులైన. . ఆము. ౧. ౧,

**లుంగ.** వి. ఎక్కువ (వస్త్రాదుల) భారము.
సీ. బరిగొన్న సమకట్టు బన్నిదంబుల లుంగ యుంటువాయుంగఁ దా వఱుతనైచి. క్రీడా. ౪౩.
సీ. వస్త్రభారము పేరు వఱలు లుంగ యనంగ. . ఆం భా. ౨. ౧౫౬.

**లుంగము.** సం. వి అ. పుం పుల్లమాదిఫలము. (శ. ర.)

**లుంగి.** వి. యోపాంతరీయము, స్త్రీల కట్టుబట్ట.
సీ లుంగి, యన నంగదట్టమం చనఁ బావడ యనంగ యోపాంతరీయమై యొప్పుచుండు. ఆం. భా. ౨. ౧౫౮.
(కుల్లాయకుప్పసములు చేర్చి కుట్టిన పావడ, అని శ ర. కురకలుకట్టు సెల్లవస్త్రము, అని చి. వి.)

**లుంచనము.** సం. వి అ న ౧ తోలు (పై తొక్క) ఒలుచుట ౨. త్రుంచుట, తెంచుట.

**లుంచము.** సం వి. అ. పుం ౧. తోలు (పై తొక్క) ఒలుచుట ౨. త్రుంచుట, త్రెంచుట.

**లుంచితము.** సం. విణ (అ. ఆ. అ.) ౧. తోలు (పైతొక్క) ఒలువఁబడినది. ౨. త్రుంపఁబడినది, త్రెంపఁబడినది

**లుంట.** సం. వి. ఆ. స్త్రీ. ౧. దోఁచుకొనుట. ౨. దొర్లుట

**లుంటకము.** సం. వి. అ పుం. ఒక విధమగు మూరాకు మొక్క కీ.

**లుంటాకము.** సం. విణ (అ. ఈ. అ.) దొంగిలించునది, దోఁచుకొనునది.
వి. అ. పుం. కాకము, కాకి

**లుంటాకుఁడు.** సం. వి. అ. పుం. దొంగ, చోరుఁడు.

**లుంఠ.** సం. వి. ఆ. స్త్రీ. ౧. దోఁచుకొనుట; దొంగిలించుట. ౨ దొర్లుట, పొరలుకొనుట.

**లుంఠకుఁడు.** సం. వి. అ. పుం. దోఁచుకొనెడు వాఁడు, దొంగ, చోరుఁడు.

**లుంఠనము.** సం. వి. అ. న. దొంగిలించుట, దోఁచుకొనుట.

**లుంఠాకము.** సం. వి. అ. పుం. కాయసము, కాకి.

**లుంఠాకుఁడు.** సం. వి. అ పుం. చోరుఁడు, దొంగ.

**లుంఠి.** సం. వి ఇ., ఈ. స్త్రీ. దోఁచుకొనుట, కొల్లపెట్టుట.

**లుంఠించు.** సం. స. క్రి. సంధించు, కూర్చు

క. కంటకశాలునిచేతం, గుంఠితుఁడగు పెట్టు మరుఁడు కుసుమాస్త్రంబుల్, లుంఠించి గుణనినాదము, కంతమ్మున చాలఁజేసె కఠోర గదురక్. భాగ ౯ ౬౧౫

**లుండి.** సం. వి ఈ. స్త్రీ. తగిన నడవడి, అర్హ ప్రవర్తనము

**లుండిక.** సం వి అ స్త్రీ ౧ మన్ను, పేడ, మొ॥ వాని గుండ్రనిముద్ద ౨ సరియైన నడత, యుక్తప్రవర్తనము

**లుంబిక.** సం వి. అ. స్త్రీ. ఒకవిధమైన వాద్యము

**లుకలుక.** వి ౧ పరుగెత్తుటయందలి ధ్వని కనుకరణము.

క ఒక పొంగముగాక దివిజాలు, తికమకగొని పైరుతెల్ల దీకొనఁ దమ్మం, బికపికలై నకనకలై, లుకలుకఁ బరువెత్తి కోడి లోఁగొనుభీతిక్. భాగ ౬. ౨౩౫

౨. పురుగులు దొలుచుటయందగు ధ్వని కనుకరణము.

చ లుకలుక మస్తకంబుఁ జెవులం గ్రిమి దొల్వఁగ ... భల్లా. ౨ (శ. ర.)

3. తడఁబాటు.

ద్వి. . మగకోకిలములు, ముక్కుల రెక్కలు మురువుగాఁ దీర్చి, చొక్కంపు తేమారి మదకొమ్మ లెక్కి, పెలుకి తేఁగొనలెత్తి పెల పులఁ ద్రుంచి, కలగొన లుకలుకగా నప్పళించి, రసము పిచ్చిలఁ గూర్చి రమణుల కిచ్చి, పద. ౧. ౧౨ పా. ౪. పం.

జః లుకలుకలాడు.

**లుకలుకలాడు.** అ. క్రి. (√ లుకలుక) తడఁబడు. (శ. ర.)

**లుక్కు.** వి. అశ్వనీచగతి

సీ. జంగనడపు వాఁగ జంఘాలగతి దాటుప్పాఁ జనుగు లుక్కనఁగ నీచగతిపేరు అం భా. ౨. ౧౯౮.

ఉ. ఉక్కడమైన మంచి మను వొప్పెడు సాహాయరత్న మెక్కినన్, గక్కునమేమి లేక రవగాలును జోడన యడ్డపెడెముల్, లుక్కుడువాలి జంగనడలం గనుపించుచు బోయి పోయి. సారంగ. ౧. ౮౨.

**లుగ.** వి బాగు. (చూ లుగచెడు )

జః లుగచెడు

**లుగచెడు.** అ క్రి. (లుగ + చెడు ) బాగు తప్పు. (శ ర.)

**లుఠనము.** సం వి అ న (నేలపై) దొర్లుట, (పొర్లుట.)

**లుఠితము.** సం. విణ (అ ఆ. అ) దొర్లినది, నేలపైఁబొర్లినది.

**లుడికీ.** వి. (హిం. లుడ్కా.) కర్ణాభరణము.

సీ యాగపాత్రలు దెచ్చి హోముగావడి లుడికీ చిప్పలుగఁ జేసి శేయువారు. సిం. నార. ౨౦.

(లుడికీచిప్పలు = కర్ణాభరణముగా ఉపయోగించు చిప్పలు.)

**లుడుగు.** వి. ఎద్దుమెడను గట్టు ఒకవిధమగు గంట. (శ. ర.)

**లుప్తపదము.** సం. విణ. (అ. ఆ. అ ) లోపించిన పదములు గలది, కొన్ని పదములు లేనిది.

**లుప్తపిండోదకక్రియుఁడు.** సం. విణ. (అ.ఆ.అ.) లోపించిన శ్రాద్ధకర్మ గలవాఁడు, ఉత్తరక్రియలు లేనివాఁడు.

**లుప్తప్రతిజ్ఞుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) లోపించిన ప్రతిజ్ఞ కలవాఁడు, భ్రష్టప్రతిజ్ఞుఁడు; అడిన మాట తప్పినవాఁడు.

**లుప్తప్రతిభుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) లోపించిన ప్రతిభగలవాఁడు; సమయోచితమైన బుద్ధిలేనివాఁడు.

**లుప్తము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. పగులఁగొట్టఁబడినది ౨. అతిక్రమింపఁబడినది, ఉల్లంఘింపఁబడినది ౩. నశింపఁజేయఁబడినది ౪. పోయినది, అగోచరమైనది ౫. దోఁచుకొనఁబడినది, కొల్లపెట్టఁబడినది ౬. (వ్యాక) లోపింపఁజేయఁబడినది ౭. తీసివేయఁబడినది, అశ్రద్ధచేయఁబడినది ౮. ఉపయోగములో లేనిది, వాడుకలో లేనిది

వి. అ. న. దోఁచుకొనఁబడిన సొమ్ము

**లుప్తోపమ.** సం. వి. ఆ. స్త్రీ. ఉపమానోపమేయసమానధర్మవాచకములను నాలుగింటిలోఁ గొన్ని లోపించిన యుపమాలంకారము.

వ్యతి. పూర్ణోపమ (చూ. ఉపమ)

**లుప్పరము.** వి. చెప్పలు పలికెడు హెచ్చరిక పదము

**లుబ్ధకము.** సం. వి. అ. పుం. ౧. ఒక నక్షత్రము ౨. వెనుక భాగము

**లుబ్ధకుఁడు.** సం. వి. అ. పుం. ౧. బోయవాఁడు, వేఁటకాఁడు ౨. లోభియైన మనుష్యుఁడు అత్యాశగలవాఁడు ౩. కాముకుఁడు, విటుఁడు

**లుబ్ధత్వము.** సం. వి. అ. న. లోభిత్వము, పిసినిగొట్టుతనము.

**లుబ్ధుఁడు.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. లోభి, అత్యాశగలవాఁడు ౨. కోరుకొనువాఁడు, అత్యాసక్తిగలవాఁడు. (ధనలుబ్ధుఁడు మాంసలుబ్ధుఁడు గుణలుబ్ధుఁడు. మొ॥)

వి. అ. పుం. ౧. వేఁటకాఁడు. ౨. విటుఁడు, చెడునడతగల మనుష్యుఁడు.

**లులితము.** సం. విణ. (అ. ఆ. అ.) కలవరపడినది, క్షోభపడినది.

**లులాపము.** సం. వి. అ. పుం. లులాయము, మహిషము, దున్నపోతు.

**లులాయము.** సం. వి. అ. పుం. మహిషము, దున్నపోతు

**లులి.** వి. లోటు, తక్కువ

సీ. తనకు లాగయినకొత్తంబు గైకొనిపన్ని పావిక దాలించి పాకొఱంగి, లోపాటంబులు మాని లులిఁ గన్నఁ బడకున్నఁ బరదాళమని పొల్పఁ బలక యిచ్చి ఉ. హరి. ౩. ౧౨౦.

ద్వి. అలియును లులియును లాగును బాగు, నలవును మెలపుఁ బ్రఖ్యాతి విఖ్యాతి

పండితా. దీక్షా. ౩౦. పా

జ. లులిపడు, లుల్లిగాఁడు, లుల్లుఱుకు.

**లులితము.** సం. విణ. (అ. ఆ. అ.) ౧. కదలినది ఇటు నటు జరిగినది. (చలించినది.) ౨. కంపమునొందినది, తరంగములు గలదిగాఁ జేయఁబడినది ౩. కలఁతపెట్టఁబడినది, నశింపఁజేయఁబడినది ౪. చెదరఁగొట్టఁబడినది, రేఁపఁబడినది (జుట్టు) ౫. ఒత్తుడు గలిగింపఁబడినది, హాని కలిగింపఁబడినది. ౬. నొక్కినది, అదుముచుండునది. ౭. మార్గాయాసముగలది, బడలినది. ౮. సొగసైనది, అందమైనది

వి. న. కదలిక, చలనము

**లులిపడు.** అ. క్రి. (లులి + పడు) అధమమగు, హీనమగు

రగడ. పొలఁతి సైఁపవు మాకు నీకయపోలుఁబో లులివడిన కల్లలు పారి. ౪. ౧౬.

**లుల్లిగాఁడు.** విణ. (√లులి) కీడ్వడినవాఁడు, అధముఁడు. (శ. ర.)

**లుల్లుఱుకు.** వి. (లులి + ఉఱుకు) అల్పలంఘనము, చిన్న దుముకు

చ. కఱకరికల్లడంబు కడుఁగట్టేఁడి దెమ్మెరలోల మాసగ్ర,చ్చుఱయిసలారు లుల్లుఱుకులాడెడి పీతిడి రజ్జులాఁడు క్రి,క్కిఱియుటకాఁ దెమఁగునకు నీయుభయంబు వలిప్రకారమై, మెఱయఁగ విప్రయోగమున నేలమెఱింగి రచింప నేర్చినన్. కాళహ, ౩. ౯౯.

**లుమఃభవము.** సం. వి. అ. పుం. మదపుటేనుఁగు.

# లూ

**లూటి = లూటీ.** వి (హిం. లూటి) ౧ దోఁపిడి.

ఉ. అంచుఁ బురస్కరించుకొని యందఱు నాయనతోడఁగూడ శే, తెంచిరి భానువంద నుని తేనియతోఁటకు లూటిచేసి ద,క్కించు కొనంగ వేళయని కేరుచు దూఱుచుఁ దిట్టి కొట్టి దం,డించిరి మించి కన్మధువనీపరిపాలకు లడ్డగించినన్ రామా ౩ ౯

కి పుట్టతేనియఁ గ్రోలఁ బోదవు చీమల మెక్కి లూటిగై కొనదు భల్లూకగణము చంద్రా ౩ ౭౨.

ఉ. అవనకేతనల్ జలవిహార మొనర్చుచు దర్పమొంది యిం,దీవరపత్రభంగములు దీర్ణతఁ జేయఁగ లూటిరేుల యిం,దీవరపత్రభంగ ములసేఁ గొనసేరసె యంచు దత్సర,శ్ఫ్యే విరతిఁ బఠించి యలచేఁ గొనె వారల పత్ర భంగముల్ ఉ రా ౬ ౮౬.

౨. ఉపద్రవము

సీ. చెఱయుఁ గొల్లయు లూటి పీడలో లేకుండ దండెత్తవలయు శాత్రవులమీఁద నీతి. ౩౦

౩. దవుడపుండు

సీ. లూటి నా దవుడపుండును దండువయుఁ దోఁచు (వావిళ్ల ప్రతి పా 'దుడుకును దోఁచు' ప్రాఁతప్రతి, తాళపత్రప్రతి పా. ప్రానులో రెండు పాఠములు గలవు) ఆం. భా. ౩. ౪౮.

౪. దండువు

వ్యవ వానికి లూటి వచ్చినది.

౫. ఔద్ధత్యము.

సీ. ..దుడుకు లూటి జాలును దుండ,

గీ. గమ్మనఁగను సుద్ధతాఖ్యతో ...
సాం. ని. మాన. ౪౩.

౬. ప్రబలంబ్రము (శ. ర.)

జ: లూటిసేయు.

**లూటిసేయు.** స. క్రి. (లూటి+చేయు) బాధించు.

రగడ. చామన్కృతవాటిఁ దిరుగఁజాలఁ జాల పాలప్రభూని, రాజు మమ్ము లూటిసేయ రాజు రాజుమూరిపసుదు. వరాహ. ౩. ౯౨.

**లూటీ = లూటి.** (శ. ర.)

**లూడుపులు.** వి. బ. చెప్పులు, పాదరక్షలు. (శ. ర.)

**లూత.** సం. వి. అ. స్త్రీ. ౧. సాలెపురుగు. ౨. చీమ

**లూతాతంతువు.** సం. వి ఉ పుం. సాలెపురుగు పట్టు, సాలెగూడు

**లూతామర్కటము.** సం వి. అ పుం. ౧. వాలిడికోఁతి ౨. ఒకజాతి మల్లెతీఁగ

**లూతిక.** సం వి. అ. స్త్రీ సాలెపురుగు.

**లూనకము.** సం విణ (అ ఆ. అ) ఖండింపఁ బడినది, విడఁదీయఁబడినది వి అ. న ౧ ఛేదనము, విభజనము. ౨ గాయము. ౩ రకము, విధము, జాతి. ౪ జంతువు.

**లూనము.** సం. విణ (అ ఆ అ.) ౧. ఖండింపఁ బడినది, తెగఁగొట్టఁబడినది, ఛేదింపఁబడినది. ౨. కోయఁబడినది (పుష్పాది). ౩ నశింపఁ జేయఁబడినది ౪ కొఱుకఁబడినది, కొఱికి తినఁ బడినది ౫ గాయపఱుపఁబడినది వి అ. న. తోఁక

**లూమము.** సం వి అ న తోఁక.

**లూమవిషము.** సం వి. అ పుం. (తోఁకను విషముగలది) వృశ్చికము, తేలు.

**లూలామాలము.** వి ౧. వంచన, మోసము

క అలాగునఁ గొనిపోయిన్న,పాలప్రియుపాన్పు క్రిందఁ బాదుకొలిపి యూ, లూలామాలపు వాలి గ,యాళి తనుంగానివానియటువలె నుండెన్. పారిజా. ౩. ౧౩౬.

క. లూలామాలపుమాటలు, చాలునని నలిగి తననిజంబుసురూపం, బాలోనఁ దెలుపవలె నని, నీలగ్రీవుండు నిటలనేత్రముఁ జూపెన్. శాశి. ౩. ౧౪౦.

౨. చేష్టాభేదము.

ద్వి. అల్లము విని నవ్వి యోగాసను మూయు, కల్ల
సత్యంబులు కపటకృత్యంబు, లటపటంబు
లును బాలామాలములును, కుటిల కల్పిత
ములు కూచిమారములు, మటుమాయలన
ములు మందు ప్రమాకలును, నటమటంబులును
ముసైన్న నచ్చెదములు
ప్రభులిం. ౨. ౫౦ పా. ౭ పం.

# లె

**లెంక=లేక.** వి ౧ యోధుఁడు.

సీ ... గీ . భటుఁడు పరఁగు జోదన లెంకన
బంటనంగ   ఆం భా ౨. ౧౭౮.

సీ. సీటార కెదిరిన నేలకేళేదంట కేళెల్ల నడఁచిన
దిట్ట లెంక   అచ్చ, రా. ఆరా ౯౩.

రగడ  అలఘు బలసంపన్నులగు లెంక
వాయకులు   పి కకుం. ౩. ౨౨౫.

క.  అపరిదు లెంకలకు మున్న యతిరయము
వసి ..   దశకు. ౧౨. ౩౭.

౨. (క. లెంక) పరిచారకుఁడు

గీ. నాకు మరొయ్యెదంతరముల నాటనుండి, లెంక
మీకన బొద్దుఁ దహాంకరించి
ప్రబోధ. ౩. ౨౪

ఉ. లెంకఁగ నేలుకోఁగలదుకే మగనిం దరి
తీపు నేసి   విజ. వి. ౩. ౩౮.

జ' లెంక కాఁడు.

**లెంకకాఁడు.** వి. (లెంక + కాఁడు.-స్వార్థమున)
సేవకుఁడు, పరిచారకుఁడు.

ద్వి. కల్లినాథుని లెంకకాఁ డితఁ డనంగ.
పండితా. దీక్షా. ౭౮. పా.

**లెంగి.** వి సేవకుఁడు, దాసుఁడు (దీనికి శైవ
గ్రంథములందే ప్రయోగము కన్పడుచున్నది.)

ద్వి. బసవన్న లెంక నే బసవన్న లెంగి.
పండితా. దీక్షా. ౮. పా.

ద్వి. జంగమలింగంబు చనఁజూచి చూచి,
జెంగలి కూడునే లెంగిగాఁ దలఁచు.
పండితా. పురా ౯౫. పా.

విశే. క్షుద్రుఁడు, నీచుఁడు.

ద్వి. సంగతి లింగప్రసాదైకసుఖులు, లెంగి
మనుష్యుల రొంగిళ్ల దింద్రె.
పండితా. మహిమ. ౨౯౭. పా.

ద్వి. లింగవంతులుగాని లెంగుల కరని, యంగ
నాంతరమున కరుగరా దనుచు.
బస. పు. ౨. ౩౯౩. పం.

ద్వి. లింగవంతులుగాని లెంగుల కివ్వ,రాంగ
నమ్మున కట్టు లరుదేరవచ్చు.
బస. పు. ౨. ౩౯౬. పం.

**లెంగిలి.** విశే. ప్రియమైనవాఁడు, ఇష్టుఁడు.

ద్వి. సుఖులీలఁ జనివట్టి యలియ, దంగలి
మారయ్య లెంగిలి బంటు
బస పు. ౮. ౯౪౨. పం.

**లెంటు.** వి. పట్టికము, ఒకదినుసు తెల్లకాయి.
(క ర.)

**లెంప.** వి. ౧. చెంప  (క. ర.)
(వ్యవ) కాఱులు ప్రేలిన లెంపలు వాయింతురు.
౨. ప్రక్క.  (క. ర., గ్రా )
జ. లెంపకాయ.

**లెంపకాయ.** వి (√లెంప) చెంపదెబ్బ.
(క. ర., వా.)

**లెంబి=లంబి.** వి. కుటుంబము. (క. ర.)

**లెక్క.** వి. (సం లేఖా క లెక్క) ౧ సంఖ్య.

ఆ. లెక్కకెక్కుడైన మిక్కిలివిరి గల్గ, కొన్ని
కోట్లపడగ లెత్తరామి, నపరిమిత ధనంబులను
ప్రాలి పడగలు, గట్టు వైశ్యజనము పట్టణమున.
విక్ర. ౧. ౪౫.

ఆ. లెక్కకెక్కుడైన రొక్కంబుఁ దఱుగని
కొలుచుగలదు ప్రోలికోమటులకు,
శివా. ౧. ౩౪.

గీ. దీలు కామరభూలు క్రొమ్ముయలచుదాలు,
తరుణియ్యగి నేలు తరుణి నేత్రముల చాలు,
కొమ్మిదవలెక్క ప్రాలు పెద్దోయి నేలు,
పలుకుల వహోరంగు కపురంపుఁ బలుకసంగు.
కృష్ణ. ౮. ౫౯.

౨. అంకె.

గీ. పదియును తొమ్మిది విద్యలే పద్మనయన, శ్రవణములు రెంట సర్థమర్థము గ్రహించె, నంత దుక్కిర్థగంభీరవహదరేఖ, యదిగదా మీకులందుఁ దొమ్మిదవలెక్క.

నైష ౩. ౧౭౪.

చ. జలరుహగంధి మీమల పసల్ నవసంఖ్య నకేమి లెక్కనున్. విజ. వి. ౧ ౪౩

౩. గణితము.

సీ .. గణితంబు లెక్క నాఁగన దనర్చు

అం భా ౨. ౧౭౭.

(వ్యవ) ఈతఁడు లెక్కలలో గొప్పవాఁడు. లెక్కల శాస్త్రము.

౪ చొప్పు, వంతు.

క. విడుచక కంసుని యొగ్గులఁ,బడి దేవకి నిఖిలదేవభావము దనకే,ర్పడ నేఁట నొకని లెక్కను, గొడుకుల నెనమండ్ర నొక్క కూతుం గనియెన్. భాగ. ౧౦. పూ. ౪౪

గీ. ఇంక మూఁడేండ్లకున్నగాని యోజనింప, నన్ని దినములు దిన మొక్కయావులెక్క, ధరణిదేవోత్తములకును దానమొసఁగు, మట్లయైనను నా కుదయంబు గలుగు.

వి. పు. ౬. ౩౨౦

౫. ధనము, సొమ్ము.

ద్వి. కాటిపాపనికేల కరుణ నీమీఁద, లేకున్న నాకిచ్చు లెక్కకుఁ జెల్లుఁ,గైకొందు నిమ్ము నీకట్టినమినుకు.

ద్వి. హరిశ్చ. ఉ. ౨౧౭౬. పం.

మ. సదలెక్కాభానుఁడు పశ్చిమంబునకు జైక్యాభ్యూఁటకూటింటికిన్, గుడుకంబోద మెలెక్కయిచ్చి కడు గాఁకొన్నార మిప్పట్టునన్.

క్రీడా. ౧౫౫.

గీ. ఒకటె ప్రోలియు మైకేయు మొల్ల లెక్క, పరల నిమ్మని దాని జేమరుకు గనలె.

శుక. ౧. ౧౨౦.

౬. పద్దు, ఆయవ్యయపట్టిక.

ఉ. ఇట్టానఁటూర్చి జైక్యునకు నిచ్చి చన న్మతి పుచ్చి చాకముల్ పెట్టుదు . . పక్షిలెక్క అటు పెట్టుదు ... ఆము. ౬. ౪౦.

సీ. కొలుచువారల నోరు గొట్టి లెక్కలువ్రాసి హరువుమీఁదఁగ మణియములు చేసి.

శుక. ౩. ౩౪౫.

సీ లెక్కలు లిఖియింప లేఖకాధీశుండు పాకంబు గావింపఁ బాకుండు

దశా. ౨. ౧౨౭.

౪. లక్ష్యము.

గీ ఇతరదుర్బలమ్మృగపంక్తు లేమిలెక్క.

మనుచ ౪. ౩౪.

సీ. . అస్త్రములకుఁ, గీ ప్రాణములు తెచ్చి పెట్టక బ్రతికిపోవ,లేఁ దకట నాకు నరుఁ డేమి లెక్కయనుచు. రాఘవ. ౪. ౨౨౭.

జ లెక్కకాఁడు, లెక్కకుమిగులు, లెక్కగొను, లెక్కసేయు, లెక్కించు, లెక్కిడు.

లెక్కకాఁడు. విశే (లెక్క + కాఁడు) గణకుఁడు, లెక్కలు వ్రాయువాఁడు.

సీ పైలెక్కకాండ్రను జైకొల్పి తొరపించు లెంక విశ్వాసంబు బొంకుదేవి

ద్వా. ౧౧. ౯౩.

లెక్కకుమిగులు. అ. క్రి (లెక్కకున్ + మిగులు) లెక్కకు మిక్కిలియగు, అసంఖ్యమగు.

చ ముగురును నాకుఁ జూడఁగఁ ద్రిమూర్తులు తప్పదు లేకవాహమున్, బొగరున నొక్కఁ డెత్తుక నభోగతి నేఁగుట యొట్లులెక్కకున్ మిగిలినచీన నొక్కఁ దహమించి వధించుట యొట్లు జై భా ౨.౪౩,

లెక్కగొను. స క్రి. (లెక్క + కొను) లక్ష్యపెట్టు.

క. చక్రధరు లెక్కగొనఁడు వ,రాక్రమవిధియుద్ధమునకు రాధేయభుజా,విక్రమ మెందుకుఁ గాని ... భార. ఉద్యో. ౧. ౩౧౯.

క. లెక్కగొనక నరుఁ గృష్ణుని, మక్కువఁగ విరించి పూర్ఛనొందించ ధరన్, గ్రక్కదల జైచి హయము స్నొక్కనఁ గొనిపోయి జనకునింగని ప్రొక్కెన్. జై. భా. ౪. ౧౯౦.

గీ. కాఁక వెడిదంపు ములుకులు దఱచునింప, వక్కడించితోఁ దుదావని లెక్కగొనక, వాని కేరుకు మావుల ఖోనడంచి, యడరుటయు వాఁడు చంగునఁ బుడమి కుఱికె.

అచ్చ రా యు. ౩౭౭.

**లెక్క(లు)వెట్టు.** స. క్రి. (లెక్క + పెట్టు) ౧. ఎంచు, గణించు.

గీ. మృడునిచే నిట్లు కోపానఁబడి కలంగి, గంగ దరినుండి నిజశిష్యగణముతోడ, శుద్ధురు స్వామి సకలధర్మజ్ఞుఁ డపుడు, పృథివిఁగల తీర్థముల లెక్కవెట్టిచూచి భీమ. ౨. ౩
(ఇట వరుసగా అని భావము)

సీ. కాలంబుకొలఁది లెక్కలు పెట్టచేరక చిత్రగుప్తాదులు చిక్కువడిరి. కాశీ. ౧ ౧౩౪

శా. శ్రీశైలంబున సేతుబంధమునఁ గాంచిం గుంభకోణంబునన్, గాశిన్ మందరఁ గాళహస్తి నిఁక లెక్కల్వెట్టఁగాఁ జాల నానా శైవస్థలులన్ వసించితిమి కాంతా నిమ్నఁ బోలంగ రా, కాశీతాంశునిభాస్యలంగవము లోకఖ్యాతశైలంబునన్. వరాహ ౭ ౧౮

౨. లక్ష్యముచేయు.

శా. నావారందఱు గూడి యొక్కమొగమై నానాస్త్రసంతానముల్, శైవన్ వారల లెక్కఁబెట్టక ప్రభావస్ఫూర్తి శోభిల్లఁగా, వేవేగంబున శంఖమొత్తిన భయావిద్ధాత్ములై పాఱ చిత్రభా ౫ ౯౯

**లెక్కసేయు.** స క్రి (లెక్క + చేయు.) ౧ లెక్కపెట్టు, గణించు.

క. ఎందఱు రాజ్యేలినవని కెలివవారిఁక నేల సున్నవా, రెందఱు లెక్కసేయఁ దరమె పరమేష్ఠికైన ... కవిరా. ౧ ౧౩౧.

౨. లక్ష్యపెట్టు.

చ. సకలుఁడు కాలకూటసహజన్ముఁ సుధాకరుఁ డంద్రు నిక్కమా, నొక యిదియంచు నోసితమయూఖ నినుం దలియింగఁగోరి యయా, రక యటు చేరినంతఁ దలప్రాణము తోఁకకుఁబచ్చ లెక్కసేయక వెగ్రమింగఁగోని యతటా యలరాహువు చుట్టు నాంచుకే.

సారంగ. ౨. ౧౪౪.

చ. నరుఁడని లెక్కసేయఁడు మనంబున శాస్త్రవు నమ్మహాత్ముచే, యరణముఁ లెక్కచొట్లఁ గనియుఁ మననాయకుఁ డేమిచెప్ప

రాఘవ. ౪. ౧౯౨

**లెక్కించు.** స. క్రి. (√ లెక్క) ౧ ఎంచు లెక్కపెట్టు.

సీ. కూడి జలక్రీడ లాడుచోఁ గడఁగి యా ధృతరాష్ట్రతనయుల నతులశక్తి, లెక్కించియుఁ బదుండ్ర నొక్కొక్కభుజమున . .

భార ఆది ౫. ౧౭౭.

గీ. క్రిందగలిచిన ప్రాలు లెక్కింపు మనక, తప్పనాడక తొల్లింటి దారచెడక.

ఉ. హరి. ౩. ౧౨౪.

౨. ఎంచిచూచు, విమర్శించు.

ద్వి. కావున రాఘవమ్మోపాలమణికి, లేవసాధ్యంబులు లెక్కింప నెందు.
రం. రా కిష్కిం. ౨౦౦. పా. ౨౦. పం.

ద్వి లెక్కింప నపకీర్తిలేనిజీవనము, నిక్కంబుగా నొక్క నిముసంబు చాలు.

ద్వి హరిశ్చ ఉ ౨౨౪ పం

౩. లక్ష్యపెట్టు.

క ఎక్కడిమగఁ డెక్కడి సఖు, లెక్కడి నీయుత్తమాంగ లెక్కడి చుట్టా, లిక్కొలఁది దొడ్డ కొంచెము, లెక్కింపకు మరునిపోవలింబడు వేళన్ హంస ౧ ౧౦౧.

౪ ఆలోచించు.

గీ. పొత్తుగా నాడి యాటమి పొత్తువారి, మీఁద లెక్కించి కందన మొలయువారు.

దశకు. ౫. ౭౫.

**లెక్కిడు.** స. క్రి. (లెక్క + ఇడు) లెక్కపెట్టు, గణించు

క మనుకొని లెక్కిడని జపము ముఖ్యంబగునే. విక్ర. ౫. ౮౩.

లెప్ప=లెప్పము[1]. వి. (క. లెప్ప) లత్యము, గుఱి. (ఆ. వి., శ. ర.)

సీ. లెప్ప యనంగ గుఱి యనఁగఁ బరఁగ లక్ష్యాభిధానంబు . అం. భా. ౨ ౨౧౨

లెప్పము[1]= లెప్ప. వి లక్ష్యము, గుఱి

క. మీ పువ్వుగంధి సెయ్యపుఁ, జాపులకును లెప్పమైన సుకుమారవపుశ్శ్రీ పెంపునఁ దనరిన వసు,ధాపతిసుతుసఖుఁడ నింద్ర దత్తాహ్వయుఁడన్. భోజరా. ౩ ౨౪౦

క. అప్పుడు నరపతి యిప్పటి, యప్పడఁతుక యొండుఁ బోయి సాక్ష్యర్యం బీ,చొప్ప కలయొ నిజమొ యనుచు, లెప్పంబయ్యెను మదనశిలీముఖములకున్.

కేయూర. ౪ ౨౪.

ద్వి అభిముఖుండై హృదయాబ్జ త్రికను, లెప్ప తా దన ప్రాణలింగంబు పెట్ట, నుప్పరిం చుడు తదీయార్యారులింగంబు

పండితా. దీక్షా. ౫౯. పా.

లెప్పము[2]. వి. (సం. లేపః) సున్నము మొదలగు వాని పూఁత.

సీ. అయతీశ్వరుఁ డంత నతిరమ్యమైన యా లెప్పంపుఁ బూఁబోఁడి రూపు చూచి.

కళా. ౮. ౧౬౯

లెమ్ము=లే. అవ్య. ౧. తర్జించుట (ఇది మొదలు లేచు ధాతు ప్రార్థనాద్యర్థక రూపమయ్యెను (క్రమముగా అవ్యయముగా మారినది)

మానినీవృత్తము. అంతమదింపకు లేయని పల్కిన నంతమదింపకులే యనుచున్, గంతు లడం చెద లెమ్మని పల్కిన గంతు లడంచెద లెమ్మనుచున్. కళా. ౩. ౧౯౫.

౨. కానిమ్ము, కానీ. (పక్షాంతరాంగీకారమును దెలుపును.)

మ. ఇది భోజాత్మజ శిబ్బిరం గిసుకతో నేమించు మాహించుమో, ఇది సాత్రాజితి జాబిలి నిబ్బుపు ట్రేమరం బందినన్ దీని సెల్లి

దమింకేనివజాడ దోషమొకో యా లెమ్మిందు చేసుద్ద్యేఁ జెల్లదువో యోరికిఁ బంపఁగా వనుచు లీలన్ రుక్మిణీ కాంతకున్.

పారి. ౧. ౫౪.

లెయ్యంబు. వి. (సం స్నేహః) నెయ్యము, స్నేహము

గీ పాలు నేయును గూడినభంగివో లె, నొనరి లెయ్యంబుతోఁ గూడియున్న భటుఁడు

కు. సం. ౧౧ ౬౨౩.

లెస్స. వి ౧ క్షేమము, కుశలము

మ చెలువంబే విను నీటి నీటరులకున్ జేజేల కున్ లెస్సరయే చం. రా ౨ ౨౦.

ద్వి నీ లెస్స నా లెస్స నీకైనదేమి, నాకేమి గాన నానావిధంబులను

రం రా. అయో ౫౯. పా. ౧౬. పం

గీ అమ్మ కుశలంబె పాద్వియవామయంబె దేవి భద్రంబె లెస్సలా వూవుఁబోఁడి. ...

కాశీ. ౨. ౩౧.

గీ క్షేమ మగు లగ్గ లెస్స మేల్ సేమ మనఁగ.

అం. భా. ౧. ౯౭.

౨. మేలు.

గీ. పసిఁడిమృగము నిక్కంబైనఁ బట్టితెచ్చి, జనకసుతకోర్కె దీర్చెద సమ్మదమున, లేక మాయామృగంబైన లీలఁ ద్రుంచి, హితు మొనర్చెద మునులకు నెట్లు లెస్స.

భా రా అర ౨ ౪౪

గీ. ఎతిఁగినవి వాల్గు నొడువ నేమయిన లెస్స.

అము ౪. ౬౭.

౩. మంచిపని, యుక్తకార్యము.

క అలోకదాన మన భూ,పాల పరగు దీప మొగి భావము సద్ధ,ర్మాలోకవశీలంబుగ, నా లెస్స యొనర్చినట్టి యతనికి నధిపా.

భార. అను. ౪౯ ౧౯.

విశే. ౧. క్షేమయుక్తము.

సీ. వేదసంచోదిత విప్రకర్మంబులు లెస్స లయ్యెడు నవి లేకయున్నఁ జెడిపోవు

తెప్ప్పనఁ జెడినను రాజున కగుఁ బుణ్య
పాపంబు లగ్గలములు.
భార. శాం. ౧. ౨౪౫.

గీ. ...తెస్సయుండుచో గృహకర్తలేని బ్రతుకు
మనుచ ౩. ౧౨౯.

సీ. ఎంత తెస్సగనున్న నంతవేడుకకాని ప్రజల
కల్మి కనూయపడుటలేదు.
విజ వి. ౧ ౨౨.

౨. యుక్తము, మంచిది.

ఉ .తల్లి వినవమ్మ యీ జగము లెల్ల సృజింప
ధరింపనొంపఁజా, ల్దేవత లెట్లుదర్తిలిన తెస్స
వృగా కివి చెల్ల జేరికిన్.
సారంగ. ౨ ౧౨౦.

చ.. విభేదవృత్తి నామనమున లేదు పాండవ
సమాజము మీరును కొక్కరూప కావున
నిది తెస్సమాట దగవుం దలపోయఁగ .
భార. ఉద్యో ౧ ౯౩.

౩. రుచ్యము, రుచిగలది

సీ. తెస్సాయెఁగా కదళీశాకపాకముల్ మతి
హరించెనొకదా మనసు గినసు.
రా. వి. ౨. ౧౦౫.

క. చక్కర గలుపుక తింటే, ముక్కవతల్రైన
తెస్స మోహాముగలచో, జిక్కరుకానిస
ద్రైనన్, మక్కువతో దివ్యభామ మహిలో
చేమా చేమ. ౨. ౭౫

౪. శ్రేష్ఠము, ఉత్తమము

చ. ప్రియమెసఁగం దగం బిలిచి పెట్టెదుకూడది
తెస్సకూడు . భార ఉద్యో ౩. ౨౨౨

క అనుటయు వైశంపాయనుఁ, డనఘా తెస్స
కథ యడిగి తచ్యుతశుభలాం,ఛనసాముభామ
మార్మంc, గొనియాడి
హరి. ఉ. ౫. ౧౦౩

ఆ. దేశభాషలందుఁ దెలుఁగు తెస్స
• ఆము. ౧. ౧౫.

౫. సులభము, సుఖప్రాప్యము.

క. జ్ఞానము లుంధనమునఁగ విజ్ఞానాగ్నిం బ్రబలఁ
జేయ జరయు మరణమున్, నానావిధదుఃఖం
బులు,లేని యమృత మక్షరంబు తెప్ప్ప
తోఁచున్ భార శాం. ౪. ౩౧౪.

౬. అనుకూలము.

గీ. మనువు తెస్సయియుండెఁబో మానవతికి.
హర. ౪. ౨౮.

క్రి వి చక్కఁగా.

ఉ శావక రాజచిత్తము వశావశ్రై తెగఁ
జూచునట్టులా,వా విపరీతమైన పలుకాడెద
నంటివి ము న్వినాశకా,లే విపరీతబుద్ధి
యని తెస్స బయల్పడఁ జెప్పినారెకానీ
విధి యూడుమీ యనఁగ నీవిధి నాడెదు
సుమ్ము భామినీ సారంగ. ౨. ౧౪౨.

ఉ. అంచు వతండు పల్క దరహాసతఁ జెక్కిలి
గొట్టి తెస్స పం,డించితివోయి దాసరి
అము. ౬. ౪౦

క అనిన న్మతియుం జదివిం,చినయట్లనె
చదుక తెస్స శిక్షింపక చె,ప్పినరీతిఁ జదుకఁ
డని దశ. ౪. ౧౪౭.

అత్య ప్రశంసార్థకము

చ. అంచమిచ్చి తే, పిలిచి తలార్లచేత నని
పించిన దిట్టుల నీకు వాకముల్, దెలియక
జెత్తిరాజ యిది తెస్సనిజంబని నమ్మి
నాఁడతే. సారంగ. ౩. ౨౦౪.

(ఇట వ్యతిరేకలక్షణచే నిందార్థకము)

చ. వికవికనవ్వి యక్కటట విప్రకుమారుఁడు
కేలు తెస్స వా,నికి నయి రాగబంధమును
నిల్పె మదిం దరళాయతాక్షి ...
హర. ౪ ౨౪.

సీ. .ఒగి తెస్స యనఁగ సాధూక్తి దనరు.
ఆం. భా ౩. ౬౩.

జ: తెస్సఁదనము, తెస్సవాఁడు.

తెస్సఁదనము. వి. (తెస్స + తనము) మంచి
తనము, సౌభాగ్యత.

క. బాలసఖుండవు నాకును, నీ తెస్సఁదనంబు
చేము నీతివితిచి దు,శ్శీలురమగుటయు నైకత,
లీల నొందలుగాఁగ మును దెలియక చేసితిన్.
భార. ఉద్యో. ౧. ౫౮౭.

లెస్సవాఁడు. విణ.(లెస్స+వాఁడు)యోగ్యుఁడు.
క. నిను లెస్సవానిగాఁగన్, వినిపాఁడంగాన బాణునిభవము సర్వం,బును నీకిచ్చితిఁ జర జీవనసౌఖ్యము నొందు మమరవర యని నెమ్మిన్ హరి. ఉ. ౮. ౨౪౦.

# లే

లే[1]. అ. క్రి. కలుగుధాతువునకు వ్యతిరేకమున ప్రాయికముగా వచ్చు ఆదేశము.
ఉదా లేఁడు, లేరు, లేదు, లేక, లేవడి (లేనిదియగు, లేనివాఁడగు)
గీ. నీవును మున్ను వో లె, నిలుపరింపంగఁ దగిరొండు నిలుపు లేవ
భార. ద్రో. ౫ ౩౨౬.
మ లలనా రేంటికి వల నేఁడుం గృపలేఁడు కిరములు దుర్వారంబు లెట్లో కదే.
భాగ. ౧౦. పూ. ౧౧౨౯.
ఉ. ఎవ్వరి నీవు భీతహరిణేక్షణ యొంటిఁ జరించె దోటలే, కివ్వనభూమి భూసురుఁడ నేఁ బ్రచరాఖ్యుఁడఁ ద్రోవ తప్పితిన్, గ్రొవ్వున నిన్న గ్రామమునకున్ జనుదెంచి పురంబుచేర నిం,కెవ్విధిగాంతుఁ దెల్పఁ గదవే తెరువెద్ది శుభంబు నీకగున్
మనుచే. ౨. ౩౯.
(ఉండదు, ఉండఁడు)
క. కలవారెల్లను మడిసిరి, కలిగియు లేఁడయ్యెఁ గుంభకర్ణుఁడు వినిం, దెలుపుదు నీ
భార. అర. ౭ ౯౩.
చ....పం,గరమున లేరు హంసడిభకప్రతివీరు లనంగఁ బొంగుచున్.
ఉ. హరి. ౪. ౧౭
ఉ. స్వామిహితంబునన్ సమదశాత్రవభంజన శక్తి బంధురక్షామమహానియసంపద వసంత సమాగమ ఫుల్లమల్లికా, స్తోమ మపార సౌరభ యశోగరిమంబున ధర్మశీలతన్, భూమిఁ దమంత్రిఁ బోలు మతి మంత్రులు లేరు సమంధరాస్థలిన్.
వైష. ౧. ౨౪.

క. ప్రేమానుబంధ మిరువుర, కేమాత్రము కొదువ లేదుఁడీ యనినట్లూ, భూమీసురు లవ్వరు నకు, వామాక్షికిఁ గొంగుముడులు వైచిరి వేడ్కన్. (లేదు + చుఁడీ. ఈ. ఇట చు లోపము.) ఇంద. ౬. ౭౫.
సీ గుణము వికారంబుఁ గోరికయును లేని నీవలన జగంబు సెజెజనించుఁ, బ్రబ్బు లేదగునంచుఁ బలుకుట దప్పుగాదు
భాగ. ౧౦. పూ. ౧౨౩.
సీ. వింధాభిమతులు, హింసయు వార్మ ప్రశంసయు లేవు భూతంబులయందెల్ల దయ పుట్టెల్లు. భార. శాం. ౫. ౨౨౫.
చ.. ఈ,మ్మలికయు నుబ్బు నాదుమది మందున కైనను లేదు వాసవా
భార శాం. ౪ ౩౯౪.
క. తమ్ముఁ దవతమ్ములను నా,కన్న కొడుకులట్ల తలఁతుఁగాని విభేదం, బెన్నఁడు నామది లేమికి నెన్నుఁడ దైవంబుసాక్షి వినుము పలి కెదన్. భార ఉద్యో. ౩. ౧౯౩.
(నఞ్యంతిక్రియ కనుప్రయుక్తమయి చాలదు, ఓపదు, చాలఁడు, ఓపఁడు అను నర్థము నిచ్చును )
క పాపంబుఁ బుణ్యమును ద్వి,స్థాపరులకు దుఃఖసౌఖ్యసంపాదు లగున్, భూపాల విత్పష్టులు ని,శ్లపు లగుట వారిఁ బొందలేవా ఫలముల్ భార. అను. ౧ ౧౪౭.
చ. అలయక ధీతిబోధములు నాచరణంబు ప్రచారణంబుగాఁ, గలుగు నుపాధి భేదముల గాఢ మతి న్నిగమాదులైన విద్యలు పదునాలు గింటికి నతం డొనరించెఁ బకుర్ద శత్వముం, దెలియగ లేము కారణము దీనికి నెమ్మెయిఁ జర్చ చేసినన్. వైష. ౧. ౪౫,
గీ నెలతకుచకుంభయుగళముండియు విరోగ, బుధి యావింపలేదయ్యె సఖులుబంచు,చుట్టు పన్నిటి జల్లిలోఁగొన్న కతన, ముంతక విలొఖ్య కమునఁ దేలింపఁగ నెచె. ఆము. ౫. ౧౫౧.

స. క్రి పొందకుండు.

ఆ. కర్మఫలములేదు కర్మఫలాప్తిఁ, గారణంబు విధియుఁ గాదనంగ, నంతయొటుకలేని యార్తాని విధిచెద్ది, కలిసిపలికితిం క్రియంబు దప్పి. భార ఆర ౧. ౨౩౧.

ఎంతకులేఁడు = ఎంతకు సమర్థుఁడు కాఁడు

ఉ ఎంతకులేఁడు నారదమునీంద్రుఁడు కొరి వినంగ రుక్మిణీ,కాంత వినంగ నేను వినఁగాఁబలికెన్ బతిఁగూర్చుదాన నా, యంతటివారు లేరని . పారి ౧. ౭౦

పొట్టకులేక = తిండిలేక.

ఉ ఎట్టిపురాణముల్ పదియునెన్మిది చెప్పతి చెట్టు పొట్టకులేక తిక్కెదవు పుణ్యగుణం బులరాశిఁ గాంచెన్ కాశీ ౪ ౧౯౨

లేనివాఁడు = దరిద్రుఁడు

ఆ కింబుకంతి నీవు కలవాఁడు గలవాఁడు, లేని వాఁడు నీవు లేనివాఁడు కాశీ ౩ ౪౪

సా కలవాఁడు గాద తీయునప్పటికి లేనివాని ప్రాణము పోయినది

జ లేవడి.

లే. విశ లేఁతశబ్దముయొక్క లుప్తశేషరూపము· ఉదా లేఁగొమ్మ, లేఁబచ్చిక, లేమావి, వెంకి (చూ లేఁత)

క్రి విశ. అల్పముగా.

ద్వి లీలఁ ఒయ్యెదకొంగు లేజాఱుచైచి ద్వి పరమ ౪ ౨౯౪

లే = లెమ్ము. ౧ నిశ్చయమును దెలుపును.

రగడ లేమ జాదిపువ్వువెుగ్గ లేదులే దురాశ గాని, చామవృత్తువాటిఁ దిరుగఁజాలఁజాల సొలపుమాని. వరాహ. ౩. ౯౨.

ఉ. లెంకఁగ నేలుకొంగలదులే మునిం దరితీపు చేసి . విజ. వి. ౩. ౩౪.

౨. పరిహాసమును దెలుపును.

సీ. చెలి పెండ్లికతఁ జెప్పఁ జెవియొగ్గి వినవేమి కలదులే యని గేలిసలిపె భద్ర.

విజ. వి. ౩. ౨౭.

౩. అనాదరమును దెలుపును.

మ. శివలింగార్చన మెందుఁబోయెడుఁ దపస్వి త్వమ్ము రెండే సుసద్రవముం బొందదు లే. . హర. ౪. ౬౫.

దండకము . . జీవింప,బోరామిఁ గావింపఁగా రాదులే కాదులే వాదులేలా

భోగినీదండకము.

ఆ. ఈసుబుద్ధిమాట లెంతలేయని పోరు, దీను బుద్ధి నిడుఁజామీ లకొంగి

సారంగ ౨ ౨౪

లేండము. సం వి అ న. మూత్రము, పురీషము, మలము

లేఁక = లెంక. వి ౧ సేవకుఁడు

గీ లేకయుండిన విసివి యా లేఁకలు

అచ్చు రా. యు ౨౨౪. (శ. ర పా)

గీ సేవకుండిన విసివి యా లెంక లవుడు

ముద్రి పా

లేఁగ. వి (లేఁత + కానుపు) క్రొత్తగాఁగలిగిన దూడ, తర్ణకము, దూడ, వత్సము.

(ఇది కొన్నిపట్ల వృత్తియందు ఔపవిభక్తిక ముగా కన్పడుచున్నది. చూ లేఁగటిపడ్డ.)

గీ. తనరు లేఁగ యనంగఁ దర్ణకంబు.

అం. భా. ౨ ౨౬౨.

క. ఒకనాఁడు గో వొకటి లేఁగకుఁ జన్నిచ్చుచును దానిఁ గనుఁగొని .

భార అను ౩ ౭౫

ద్వి లేఁగలఁ బడుకుచు లీలఁ గేతయ్య, మూఁగి యుర్చుచు మేఁత ముట్టకుండుటయు .

బస. పు. ౬. ౭౨౫

చ. ఇది యొకమందిలేఁగ వినుఁ డెంతయు కొప్పెడు నంచు దాన తప్పదములు దోఁకయుం బిగియఁబట్టి చెల్లంగి నెలంగ వ్రమానితో, జడియఁగ కొక్కుపెట్టుగాని చంపెఁ గుమారుఁడు లేఁగరక్కసుం, గుడులకొనంగ బాలకులు కోయని యార్వ వకుర్వలీలతో. భాగ. ౧౦. పూ. ౪౩౫.

**లేఁగంపు.** వి. (లేఁత+కంపు.) కొంచెము పరిమళము.
ద్వి. తుమ్మెదల్ చెమ్మ వాతులు చొల్చితోల్చి
కమ్మని లేఁగంపు గవియుచో చనుచు
పండితా. పురా. ౯౦ పా.

**లేఁగటా(టియా)వు.** వి (√లేఁగ) లేఁతదూడ గల యావు, ధేనువు
గీ. పేరుకొని లేఁగటావులఁ బిలిచిపిలిచి, పిచ్చ
లించుచు, గ్రేపుల విడుచువాని.
వి పు. ౭. ౩౩౭
చ పసుపడు లేఁగటాలసిరిఁ బాయని యిండుల
దొడ్డి మందలం దనియఁగ జూపెదన్
చెన్న ౩ ౭౩

**లేఁగటిపడ్డ.** వి (లేఁగ+పడ్డ) క్రొత్తగా యీనిన అవుపెయ్య
ద్వి పిదుక, గొడ్డును లేఁగటిపడ్డలై యపుడ,
గడ్డుగ నిండారఁగాఁ బాలు గురిసె.
పండితా. పురా ౧౩౮ పా.

**లేఁగవును = లేఁగాను.** వి. (లేఁత+కవును) సన్నని నడుము.
చ. చెదరిన ముంగురుల్ తఱుచు చెమ్మటఁ
దోఁగిన తళ్కుఁజెక్కులున్, వదలినకప్పుఁ
గొప్పు వసివాడిన మేనొకయింతజాఱుప,
ద్యొయ్యద యసియాడు లేగవును విట్టటుఁ
దొట్రిలు పద్మయంబుఁ బెల్లాదపడి
యార్పులుం గల తలోదరిఁ గన్గొని
రాముఁ డిట్లనున్ ఉ రా ౬ ౬౫.

**లేఁగసవు.** వి (లేఁత+కసవు) బాలతృణము ‡
(శ. ర.)

**లేఁగారము.** వి.(లేఁత+కారము) కొలఁది కారము, అల్పమైన కారము.
సీ. కమ్మవిడెంపు లేఁగారంబుగల పానకండ
చక్కెరపానకంబు లిచ్చి వాల్మీ ౨. ౭౯.

**లేఁగాను = లేఁగవును.** వి (లేఁత+కాను) సన్నని నడుము.

క లేఁగౌఁదిఁగ నితంబము, గ్రేఁగుఁచఁ గ్రొవ్వు
టయుఁ గని విరించి విగింపన్
ఆము. ౫. ౨౯.
సీ కృశదైత్యజాతి వర్ధిలు నిటులనురీతిఁ గల
కంఠి లేఁగౌను బలితమయ్యె.
ఉ. రా. ౨. ౧౩౭.

**లేఁజిగు(వు)రు.** (లేఁత+చిగురు) మృదుపల్లవము.
సీ కొమ్మ లేఁజిగురాకుఁ గొమ్మని చవిగొని
యమృతంబు నీరసమని తలంతు.
విక్ర. ౩. ౪౯.

**లేఁజూపు.** వి (లేఁత+చూపు) మృదువైన చూపు.
గీ దమ్మికేలుండఁ బెర కేల దండయిచ్చు, లేము
లుడిపెడు లేఁజూపు లేమతోడ
ఆము ౧. ౧౨.

**లేఁజెక్కులు.** వి (లేఁత + చెక్కులు) కోమలము లగు కపోలములు
సీ తొలిచూలి జవరాలి తళుకులేఁజెక్కుటద్ద
ములతోఁ దులఁదూఁగు దంతరుచులు.
దశా. ౨ ౨౨౯.

**లేఁజెమరు.** వి (లేఁత + చెమరు) చిఱుచెమట
చ అలికులవేణియొక్కతె రతాంతమునం దన
యంగవల్లికన్, బులకలు చొక్కు లేఁజెమరు
పుట్టఁగ నేఁగి నరేంద్రుఁజూడ నా, పులకలు
చొక్కు లేఁజెమరుఁ బోవక యట్టులనుండె.
మనుచ. ౫. ౬౬.

**లేఁజెఱకు.** వి (లేఁత + చెఱకు) కోమలమగు చెఱకు, ఏపుగల చెఱకు
క. చిలుకల తేరును గోకిల, బలములు లేఁజెఱకు
విల్లుఁ బ్రసవాస్త్రములున్, తొలఁగించిన
మరుఁడో యన, విలసితగతి నీవు రాజవీథిఁ
జరింపన్. విక్ర. ౧. ౧౨౧.

**లేఁత.** వి౹ ౧. పసి, తరుణము. (దీనికి తరుణమైన అనిచో యర్థమైనను వృత్తియందు కొంచెము, చిన్న, తిన్న, లేలిక, పలుచ, కొత్త, సన్న

మున్నగు నానార్థములు వచ్చును. వృత్తియందు దీని కొందటివర్ణముమాత్రము శేషించును. అవు డుత్తరపదము పరుషాదియగునేని దీనికి నుగా గమంబగును.

ఉదా. లేఁత + కొమ్మ = లేఁగొమ్మ, లేఁత + కప్పు = లేఁగప్పు మొ॥

సీ. బలుపాఁపతలచుట్ట లలవరించినవారు లేఁత చందురులఁ జాలించినవారు.
పాండు ౧. ౧౬౫.

(శ్రీకృష్ణుఁడు) గీ. జాంబవతియను దేవికి సాంబుఁ గనిరొ, నక్కుమారుండు లేఁతప్రాయంబునందు, వీథి నొకనాఁడు సఖులతో విహృతి సలుప కాశీ. ౬. ౩

చ. ఒదవెడు జవ్వనంబు వెలికొత్తఁగఁ బయ్యెద వీగ్గుఁగూడి బిట్టదుమగ లేఁతలొట దిగ నాఁకకు మీఱినులేక వత్తుపుం, జదువునఁ బ్రక్కల క్రమ్మఱని చప్పటలై మఱి లావు గూడఁ జైఁ, బొదలె ననంగఁ బిక్కటిలెఁ బొల్తుక చన్నులు నాఁడునాఁటికిన్
అము. ౫. ౨౧.

౨. సుకుమారము, కోమలము

సీ. కేవురించిన లేఁత చెక్కుటద్దంబులఁ దాటంక యుగళంబు తన్నియాడ హర ౩ ౯౨

౩. మృదువు, మెత్తనిది

సీ. కనకకుంభస్తని కత్తుద్వయము గబ్బు మాత్రంబు గలిగుండు మనసు లేఁత.
కళాశాస్త్రము ౧. ౨౦

సీ. చిన్నిబుగ్గల లేఁత చిఱునవ్వు వెలర్ప వీరి యాళుఁడు వెంగిడ్చఁ జేయిదోయి
హర ౨. ౧౧౫.

౪. అల్పుఁడు, అల్పము

చ. తమతమ కోటులెత్తి బహుధర్మవినిర్మితిఁ జేర్మిఁ గాంచినన్, వసుఁ గనలేని లేఁతలకు వాలియ భోగ్యము భాగ్యమీన ప్రౌఢ్యవనముం దొవర్చితి నొకానొకయర్భన నన్ను లాఁడి దా,నన సుమాకాలెఁ జామ్మ సుజనప్రజమందిర చర్య నీడనన్. పాండు ౪ ౧౯౧.

ఉ. ప్రాఁతల మేము నీకుఁ బలుమాఱుఁ బొందకయున్నవాఁటి నీ, లేఁతలు గంటి మందఱకు చిత్తముల గ్యాలిఁడోఁచు మాఁతలుం, బూఁతలు నీవ యుండు దల పోఁతలు లేఁతలు మమ్ము నెమ్మెయిన్, లాఁతులఁగాఁ దలంపకు వలంపకు చాల వలంగియుండగన్ ఉ. హరి. ౪. ౯౩.

వి. ౧. లాఘవము, చులుకన

చ. మదిరచకుర్య వల్లభుని ప్రాలఁ దవర్పుటు చూచి నెచ్చెలుల్, మదనుని చేతికుం దరుణి మానము లేఁతకు నొచ్చి రిచ్చలన్.
కావ్యా. ౩. ౪౮.

ఉ. పూఁతపసిండివంటి వలపుంబచరించు కులంబు నీతికిన్, లేఁతగదమ్మ యుత్తెంగు.
మను చ. ౩. ౩౩.

౨. ఆందోళికాదండముయొక్క దోషవిశేషము.

వ. లేఁత ముదురు సన్నము గమకము నీలధవళ రక్త హారిద్వర్ణంబులు కొందలుగాఁగల దుర్గ ణంబులులేక ... ప్రబంధ. ౬౦౫.

జ. లేఁగ, లేఁగంపు, లేఁగటావు, లేఁగటిపడ్డ, లేఁగవును, లేఁగసవు, లేఁగారము, లేఁగొను, లేఁజిగురు, లేఁజూపు, లేచెక్కులు, లేఁజె మరు, లేఁటెంకు, లేఁతనగవు, లేఁతనవ్వు, లేఁతనెల, లేఁతమాట, లేఁదలిరు, లేఁదీఁగ, లేఁదమ్మిర, లేఁదోడ, లేఁబగలు, లేఁబచ్చిక, లేఁబట్టి, లేఁబరువు, లేఁబల్కు, లేఁబురులు, లేఁబెయ్య, లేఁబైరు, లేఁబోఁటి, లేఁబోల, లేఁబోఁక, లేఁబ్రాయము, లేగాడ్పు, లేజవ్వ నము, లేజాఱు, లేనగవు, లేనడ, లేనవ్వు, లేమరువు, లేమెప్పడ, లేమెల, లేమొండుముక్కు, లేముదులు, లేమావు, లేమావి, లేమొండె, లేవంక.

లేఁతనగవు = లేఁతనవ్వు. వి. (లేఁత + నగవు) మందహాసము, చిఱునవ్వు.

ఉ. అవితలఁచి లేఁతనగ వా,ననమునఁ దగ శంభుఁ
డాసనము డిగ్గి కుక్, దన వామపదాంగు
ష్ఠం,బున నదిమె దశాస్యుహస్తములు క్రిందు
వడన్ — ఉ. రా. ౩. ౮౩

**లేఁతనవ్వు** = లేఁతనగవు, లేనగవు. వి (లేఁత+నవ్వు) చిఱునవ్వు, మందహాసము
ఉ అల్లన మేలమాడు నచలాత్మజమాటకు లేఁత
నవ్వు స౦,ధిల్లి — మను౨ ౧ ౨

**లేఁతనెల.** వి. (లేఁత+నెల) బాలచంద్రుఁడు
చ అవ్విరిం, దననెతిగొప్పునం జెరివి న
వ్వలిగుబ్బలిముద్దుపట్టి లేఁ,తనెల ధరించిన
ట్లమరెఁ దద్దయు మోహన కాంతి సంపదన్.
— పారి ౧ ౫౫

**లేఁతమాట.** వి (లేఁత+మాట) నికృష్టవచనము
ఉ. బొందులు వేఱుగాని తలపోయఁగఁ
బ్రాణము లేకమం డ్రిలం, గొందఱు లేఁత
మాట లవి తూరిమిపట్టుననంచుఁ బ్రాణ
ముల్, బొందులు నేకమైరనఁగఁ బొల్పగు
శంకరుని న్భవాని న,స్పందితభక్తిపైఁ గదిసి
బ్రాహ్మణపుంగవుఁ డానతాంగుఁడై
— భోజరా ౭. ౨౨౦

**లేఁదలిరు.** వి (లేఁత+తలిరు) లేఁజిగురు
మ శీతక్రియల్, పొనరింపన్ సమకట్టు
లేఁదలిరులన్ బుష్పంబులన్ బూఁతలన్
— దశకు ౩ ౧౨౩

**లేఁదీఁగ.** వి. (లేఁత+తీఁగ) లేఁతలత
సీ జంజామెంద్రుకరెత్తి చుట్టున లేఁదీఁగ పన్న
గాధీశ్వరుపగిది మెఱయ. — విక్ర ౨ ౧౨౩

**లేఁదెమ్మెర.** వి (లేఁత+తెమ్మెర) పిల్లవాయువు.
సీ. ఒలసిన లేఁదెమ్మెరల ఝుమ్మ గను తమ్మ
బంగరుపూఁదోఁటపజ్జన్ ...
— ఉ. రా. ౪. ౭౭

**లేఁదోఁడ.** వి. (లేఁత + తోఁడ) సుకుమారమైనతోఁడ.
ద్వి. వన్నె గాళియాలసుంపదముట్టుకోలు, గొన్న
నిగ్గులపోనఁ గురియు లేఁదోఁడలు.
— ద్వి. పరమ ౧ ౧౫. పా

**లేఁబగలు.** వి. (లేఁత + పగలు) సూర్యోదయము మొదలుకొని పదిగడియల ప్రొద్దెక్కువఱకు నుండు కాలము.
గీ సమిధలుగొని మహాప్రాజ్ఞుఁ డతఁడు,
వచ్చు లేఁబగటికి నిజావాసమునకు .
— పాండు. ౨. ౧౪.

**లేఁబచ్చిక.** వి (లేఁత + పచ్చిక) లేఁతదైన పల్ల గఱిక.
శా ప్రాతర్వేళల మంచుచిన్కగమి శోంపం
బైన లేఁబచ్చికల్ — ఉ. రా ౫ ౨౮౬.

**లేఁబట్టి.** వి (లేఁత + పట్టి) పసివాఁడగు కొడుకు, అట్టికూఁతురు
సీ ముక్కంటితలపువ్వు ముస్నిటిలేఁబట్టి కైట
భారాతిడాకన్నుదమ్మి — హైమ ౮. ౨౦౧.
శా ముఖలక్ష్మికిన్ముకురపై రంజిల్ల లేఁబట్టి
కిన్, మాణిక్యాయతనం బొనర్చు గిరి
యాత్మశ్రీప్రభావంబునన్ — వసు. ౩ ౩౪.

**లేఁబరువు.** విణ (లేఁత + పరువు) నూతనము.
చ అరవిరి తెండిచెంబుల నయంబునఁ దేనియ
పానకంబు లేఁ,బరువగు గుజ్జుమావి చలి
పందిరులన్ లతకూన లియ్యఁగా, నరుదుగఁ
గ్రోలియున్ సరసిజాస్త్రగుణస్థితిఁ గండుఁ
దేఁటి ని,ఝ్ఝరమగు బాళిపై సగరపల్లవ
మంటులుఁ గంటివే చెలీ. కువల. ౩. ౧౨౨.

**లేఁబల్కు(లుకు).** వి (లేఁత + పలుకు) లేఁత మాట, మృదువాక్కు.
సీ ఘనపురాతనభక్త కథలు విన్వేసుల మెలఁది
లేఁబల్కులు వినఁగఁగోరు
— చెన్న. ౨. ౨౪౨.

**లేఁబురులు.** వి. (లేఁత + పురులు) బాల్యము
ద్వి బుద్ధి తెఱంగ లేఁబురులు ప్రాయము౯,
సిద్ధంబు భక్తుల శివునిగాఁ దలఁచు.
— బస. పు. ౧. ౪౨౪. పం.

**లేఁబెయ్య.** వి (లేఁత + పెయ్య) చిన్నదూడ, లేఁగదూడలే.

గీ. కొసర కాఁబోతు వాఁబోతు గ్రుమ్ములాడ,
నడిమి లేఁజెయ్యగతి వచ్చి నాకు నిపుడు.
కాశీ. ౨. ౧౦౪.

**లేఁజైరు.** వి. (లేఁత + పైరు) తరుణమైన సస్యము, లేఁతచేను.

గీ. పలుకుల పెలంది తలుకుఁజెక్కుల విచిత్ర,
పత్రముల వ్రాయనేర్చినపాణి నవిల,సుకుని
కెమ్మోసు నిమిరిన కోషదీతి వాఁడు లేఁజైరు
వానచేతలెఁ జెలంగి. ఉ. రా. ౫. ౧౨౩

**లేఁబోటి.** వి. పల్లవము, చిగురు.

క. మెఱుఁగులకు చిరతళుకుం, గఱియును మణి
కనకములకుఁ గాఠిన్యము లేఁబోటికుం
గాఠ్యము దక్కఁగ, మెఱుఁగోల్లను వచ్చి
గిరిజ మేనన విల్చెన్. కు సం ౩. ౩౧౭

సీ. పూవుపెట్టెలను లేఁబోటుల పిన్నోపులు పెరవు
పాటించి గావించువారు. దశకు. ౩. ౧౨౪

క. లేఁబోటుల పోఁడుగంబును, లేఁబోకల విచ్చు
తమ్మివిరిచెలువంబున్, లోఁబడఁగొని పేసిన
క్రియ, బూఁబోఁడికిఁ బోలుఁ జరణములు
మృదులములై.
సూరవరయుదయనోదయము. ౪. ౬౫౪

**లేఁబోలు.** వి. (లేఁత + పాల) లేఁతదగు చేప
పొట్టు

సీ. మలివాడు నాఁచుమల్లుల గొంతోగట్టి లేఁ
బోల వల్చి గాలి వే పోక సెతేఁగి
ఆము ౨ ౫౩

**లేఁబోక.** వి. (లేఁత+పోక) మందగమనము, చిఱునడక.

క. పూఁబోఁణులకును విటులకు, లేఁబోకలఁ
దఱచు సొంపుమీఱ్కొలుపుఁ బురిన్ లేఁబోకఁ
బోఁకతోఁటల, పూఁకొకల కమ్మతావిఁ
బొదలిక గాఢ్పుల్. భీమ. ౧. ౭౫.

**లేఁప్రాయము.** వి. (లేఁత+ప్రాయము) తరుణ వయస్సు.

శా. కీలంబున్ గులమున్ శమంబు దమముం
జెల్వంబు లేఁప్రాయమున్. మనుచ. ౧ ౫౫.

**లేఁప్రొద్దు.** వి. (లేఁత+ప్రొద్దు) అపరాహ్ణము.
(శ. ర.)

**లేక¹.** అవ్య. (ఇది కలుగు ధాతువునకు వ్యతిరేక క్త్వార్థకరూపము.) ౧ ఉండక.

క అధారము లేకను సంతానోచ్ఛేదం,బున
వేరెద మధమలోకమున కేరవుసనక్.
భార. ఆది. ౨. ౧౪౨.

శా శైలేయాంతక యొక్కచోట నిలువం
జాల్పర్య మిబ్బంగినా, కీర్తోయంబున లేక
పోయెను సమిద్వీపాఖిలాషంబునన్.
నైష. ౨. ౩౧.

గీ దివ్యమణిలేక యప్సరస్త్రీలు లేక, యమృత
కుంభాదులగు పదార్థములులేక, యుక్కి
పడియుండె బహుకాల మెప్పుడతీగి,
విగతలక్ష్మివిలాసుఁడై పేల్పుఁ టేఁడు.
హర. ౬. ౩౦

౨. చాలక, ఓపక.

ఆ అలిగి యాడుగంచి యాఁకటి పిలుచన,
నిలుపలేక యసుర నింగిదాఁక.
భార ఆది. ౬. ౨౯౧.

గీ. పశువుచేతఁ బురస్కృతిఁ బడయలేక,
చాపలంబున వర్తించు చామరములు.
నైష. ౨. ౧౦

౩ పుట్టక.

(వ్యవ) వానికి లేక లేక యొక పుత్రుఁడు పుట్టి
నాఁడు

౪. లేనిచొ్దల, కానిచొడల, కాక.

గీ. స్వర్గమర్త్యపదమూలుల చక్కఁదనము, తుచ్ఛ
ముని నాగకన్యలతోడి కలకా,మునకు
గాల్చిక్వదవా లేక బాటనప్రేలఁ, బుదమి
ప్రాకెద వదియేల పుష్పవేణి.
దశా. ౨. ౪౨౪.

ఉ. కంతుఁడో కాక యా రజనికాంతుఁడో
లేక జయంతుఁడో యితం, డెంతవిలాసము...
సారంగ. ౨. ౩౪.

గీ దిగ్గజంబులు ద్రెంగ్గ ధాత్రీధరేంద్ర, మడఁగఁ
ద్రొక్కుచునో లేక యంబరమున, శగుర
జైకునో దశా ౨. ౧౫౪

క. ఊతరణిఁ దలంచుచు నా,లేక నిశానన నెదవ్
నిలిపి రేగడపెన్, లేకటుల నిద్రవచ్చున్,
లేకగు వయ్యుబిద నెదను నిల్పినదాఁకన్.
విజ. వి. ౧ ౧౫౧

లేక². వి. (సం. లేఖ)౯ ౧ జాబు.

క. నీపతి నీకై వందుచు, నా పేరను లేక యనిపి
నాఁడని యిది నే, నాపులుఁగువలనఁ దెలిసి
ము,దాపూర్ణత నుబ్బి విడిచి యనిపితి దానిన్.
ప్రభా ౪ ౪౩. (శ.ర. పా లేఖ.ముద్రి పా.)
౨. ఎడములేక మిక్కిలి చేరికయగు వృక్ష
ముల వరుస. (శ. ర.)
జ . లేకరి

లేకరి. విశే. (లేక+అరి³) లేఖకుఁడు, వ్రాయస
కాఁడు. (శ ర.)

లేకి. వి. రాలిన ధాన్యపుగింజ.

ఉ. లేకినిధివ్రజంబు లవలేశము కాంచనభూధ
రంబు ర,త్నాకరరత్నరాసు లడుగంట్లు
మరువణి కామధుక్సురా, నోక హ ముల్
క్రయాచిత విసూతనవస్తువు లిట్టివట్టి వ,స్వా
కుల కందరాని పురశైశ్యుల సంపద లెన్ని
చూపుచోన్ కవిక. ౧ ౧౧

విశే. అప్రయోజకుఁడు. (శ ర.)

జ : లేకిబ్రతుకు, లేకివాఁడు

లేకిబ్రతుకు. వి. (లేకిఁ+బ్రతుకు) ఉంఛవృత్తి,
లేకిగింజలేరికొని బ్రతికెడు బ్రతుకు. (శ ర)

లేకివాఁడు. విశే. (√లేకి.) ౧. లేకిగింజలేరికొని
బ్రతుకువాఁడు.

ద్వి. చక్కసేయని లేకివాఁడవు నీవు
ద్వి. హరిశ్చ ఉ. ౧౪౧౭ పం
౨. అప్రయోజకుఁడు. (శ. ర.)

లేఖ. సం. వి. ఆ. స్త్రీ. ౧ రేఖ, చాలు (విద్యు
ల్లేఖ, సువలేఖ మొ॥) ౨. గీత, నాఁగేటిచాలు;
౩. పంక్తి. ౪. గీతలు గీయుట. ౫. చంద్రకళ.
౬. ఆకృతి, రూపము. ౭. గుర్తు, ఆనవాలు.
౮. పోలిక, సాదృశ్యము. ౯. ముడిచికట్టిన
యంచు, అంచు. ౧౦. శిఖ, కొప్పు.

లేఖకదోషము. సం. వి. అ. పుం. వ్రాయసగాని
తప్పు, వ్రాఁత తప్పు.

లేఖకప్రమాదము. సం. వి. అ. పుం. వ్రాయస
గాని పొరపాటు, వ్రాఁతపొరపాటు, వ్రాఁత
తప్పు.

లేఖకము. సం. వి. అ. న. ౧. వ్రాయుట, ఒక
దానికి ప్రతివ్రాయుట. ౨. జాబు. (విల్యమ్సు)

లేఖకుఁడు. సం. వి. అ. పుం ౧. వ్రాఁతగాఁడు,
వ్రాయసగాఁడు,ఒకదానికి ప్రతివ్రాయువాఁడు.
౨ శిల్పి, చిత్తరువు వ్రాయువాఁడు.

లేఖనము. సం విశే (అ. ఈ. అ.) ౧. వ్రాయు
నది, చిత్తరువు వ్రాయునది, బొమ్మలను చేయు
నది. ౨. గోకునది. గీరునది. మొ॥ వి. అ. పుం.
కలమునకై యుపయోగపడెడి యొక జాతి
రెల్లు. న. ౧ వ్రాఁత, చూచివ్రాయుట, ప్రతి
వ్రాయుట ౨ గోకుట, గీఱుట. ౩. కొట్టుట,
తగులుట ౪. సన్నముగాఁ జేయుట. ౫. శస్త్ర
వైద్యమున కోయుట, గంటులు వేయుట.
౬. వేదము, శ్రుతి ౭ గోకుకొనెడి పనిముట్టు.
౮. వృక్షవిశేషము, భుజపత్రవృక్షము. ౯.
(వ్రాయుట కుపయోగించెడి) తాళపత్రము,
తాటియాకు బూర్జపత్రపు పట్ట మొ॥

లేఖనికుఁడు. సం వి. అ పుం ౧ జాబులు
తీసికొనిపోవువాఁడు. ౨. వ్రాయనేరక వ్రాఁతకు
బదులుగా నొక గుర్తు వేర్పఱచుకొనెడివాఁడు.
౩ వ్రాయసగాఁడు, లేకరి

లేఖము. సం వి అ పుం. ౧ వ్రాఁతమూలము,
ఇచ్చిపుచ్చుకోలు పత్రము ౨. జాబు.

లేఖర్షభుఁడు. సం. వి. అ పుం. వేల్పుఱేఁడు,
ఇంద్రుఁడు.

**లేఖాక్షరము.** సం వి. అ. న వ్రాఁత

**లేఖాధికారి.** సం వి న్ పుం. (రాజునొద్ద) ఉత్తరప్రత్యుత్తరాదులు వ్రాయు నధికారి

**లేఖార్హము.** సం వి. అ పుం. శ్రీతాళము ఒకజాతి తాటిచెట్టు

**లేఖాహారి.** సం వి న్. పుం జాబులు తీసికొని పోవువాఁడు

**లేఖాహారుఁడు.** సం. వి. అ. పుం. = లేఖాహారి

**లేఖిని.** సం వి ఈ స్త్రీ ౧ కలము, పేనా ౨ గరిటె, దర్వి

**లేఖుఁడు.** సం వి అ. పుం వేలుపు, దేవత.

**లేఖ్యకృతము.** సం. విణ (అ ఆ అ) వ్రాఁత యందుంచఁబడినది, వ్రాఁతమూలముగ చేయఁబడినది

**లేఖ్యగతము.** సం. విణ (అ ఆ అ) చిత్తరువుగా వ్రాయఁబడినది, చిత్రీకృతము

**లేఖ్యచూర్ణిక.** సం. వి. ఆ. స్త్రీ. ౧ బొమ్మలు చేయు కుంచె ౨. లేఖని, వ్రాఁతపుడక, కలము, పేనా.

**లేఖ్యపత్రము.** సం వి. అ. న ౧ జాబు. ౨. వ్యవహారసంబంధమైన (ఇచ్చిపుచ్చుకోలు) పత్రము ౨. తాళపత్రము, తాటియాకు పుం. తాటిచెట్టు.

**లేఖ్యము.** సం విణ (అ అ అ) ౧ వ్రాయఁదగినది, గీయఁదగినది, చిత్తరువు వ్రాయఁదగినది ౨ గీఁకఁదగినది, గోఁకఁదగినది ౩ వేల్పులకుఁ బ్రియమైనది వి అ న. ౧ వ్రాఁతయను కళ ౨. ప్రతివ్రాయుట ౩ వ్రాసినది, జాబు, పత్రము, ఇచ్చిపుచ్చుకోలు పత్రము ౪ వ్రాసిన పుస్తకము. ౫. శాసనము, శిలాదులపైఁ జెక్కిన వ్రాఁత, ౬ చిత్తరువు వ్రాయుట ౭ చిత్రప్రతిమ, చిత్తరువు బొమ్మ.

**లేఖ్యస్థానము.** సం వి. అ న వ్రాసెడి చోటు. కచ్చేరి.

**లేఖ్యారూఢము.** సం. విణ. (అ. ఆ అ) వ్రాఁత యందుంచఁబడినది.

**లేగాడ్పు.** వి (లేఁత+గాడ్పు) మందమారుతము

మ మలయంపుం గమ్మలేగాడ్పు తేరున
నేతెంచు లతాంతబాణునకు

ఆము ౫ ౧౦౧.

**లేచు.** అ క్రి ౧. ఉత్థితమగు, నిలువఁబడు

సీ శ్రీకార్యపరులఁ గాంచిన లేచి మ్రొక్కు
నంజలికి నింద్రుండు నక్కాలువుఁ గోర

ఆము. ౧ ౫౯.

గీ నను గనుంగొనినప్పుడె వినయమునను,
లేచి కూర్చుండు మగెడి నిలింపభర్త

దశా ౨ ౧౦౦

౨ మీఁదికెగయు.

మ మహిమీఁది లోహరజముల్ పైఁబర్వె
నా లేచె వా,త్యలఁ బ్రొద్దావమషు ల్మ్రొగ్గి
ల్మ్రొదల గ్రద్దంతై దివిన్ లేచినట్

ఆము ౪ ౭౦.

మ.. లకుముకుల్ క్రందై పదున్ లేచు.

ఆము. ౧. ౫౪.

సీ. వడి మూర్ధ్వగతిని లేచకయుండఁ దవ వాగ
వెళ్తాన మూర్ధంబు మొత్తిమొత్తి

కళా. ౩ ౭౯

శా బాహాసంభృతకాలదండజనితస్ఫారస్ఫులిం
గాళికిన్, సాహాయ్యంబు ఘటించి కోప
రసఘూర్ణన్నేత్రదీప్తుల్ పరాహ,తాహాంతర్గత
వైద్యుతప్రభల లేచం కోప వాహద్విషు,
ద్వ్యాహోత్తంసము నెక్కి పోరి కడరన్
వైవస్వతుం దుద్ధతిన్. పారి ౪. ౬౯.

౩ మేలుకొను.

చ నలుఁగిడి చల్వఁదాల్చి పయునంపుటలంతల
నిద్రఁజెందు కో,మలఁదుల లేప గొంకిపతి
వింతగుడారపు పారివారి గం,టులరొద
కుల్కి లేచఁ జిలువవ్వులతోఁ దమవారిఁ
గూడి యిం,పులతమి దీపనన్ నిదురవోయిరి
మన్ననాడాంగు ఉత్తతిన్. హరి. ౨.౯౧౧.

సీ. ప్రత్యూష పవనాంకురములు పైకొను వేళ
వామనస్తుతి పర్వతమున లేచి
మనుచ. ౧. ౫౪.

౪ పూను ఉద్యమించు

క. లేలెమ్మ బిరుదశైర, మ్మ్రాలముసకు.
భార. శల్య ౨. ౩౯

ఉ ఇంచినవేడ్క నాత్మహృదయేశ్వరిఁ గన్గొని
కౌరి మందహా,సాంచితనేత్రుఁడై జలక
మాడఁగ లెమ్మని పైఁడిచేలకొంగించుక
జాఱి పారి ౨. ౭.

౫ వ్యాపించు

క. లాలన నారత్నులగని, సేలి తెలిసి ప్రుచ్చు
నాష్ట యిడి కతఁడు చెలం, బోలాఁటి
నిడ నయశమెం, తేలేచద కూలపృథ్వణి
ద్నా్యయమునన్ ఆము ౪ ౨౯౩

**లేజవ్వనము.** వి. (లేఁత+జవ్వనము) నవయౌవ
నము, లేఁత యౌవనము

మ దనుజాధీశ కుశధ్వజుం డను తపోధన్యుండు
మున్నొప్ప నా,యన వేదంబు పఠించువేళ
నుదయంబై సేను వాపోవఁగా, నను,
ప్రేమంబునఁ జూచి వేదవతియన్నామంబు
గావించి పెం,చిన లేజవ్వన ముప్పతిల్లుటయు
కేకేలున్ మునుల్ రాజులున్
ఉ రా ౩. ౧౦౯

**లేజాఱు.** అ. క్రి. (√లేఁత) ఇంచుక జాఱు.

ద్వి పాలిండు లఱఁగాను పడ నొకవింత, లీలఁ
బయ్యెదకొంగు లేజాఱుచైచి.
ద్వి. పరమ. ౪. ౨౯౪. పా

**లేటు.** వి చెట్టుకొమ్మ, శాఖ.

సీ. మానికమ్ములమూట మరుని గల్పులకోట
పండుకొన్నెల లేట పసిఁడిలేట.
అచ్చ. రా. బాల. ౧౩౭. (శ. ర. పా).

**లేటమొగము.** వి. విముఖత్వము, పెడమొగము
(చూ. లేటమొగముపడు.)

వ.. .తెలుగుపడి బాణుఁడు లేటమొగంబుతోఁ
జేయునదిలేక విన్ననయి యున్నయెడ ..
భాగ. ౧౦. ఉ. ౪౨౩. (చి. ని. పా. లేట
మొగంబుపడి ముద్రి. పా.)

జ లేటమొగముపడు.

**లేటమొగముపడు.** అ క్రి. (లేటమొగము+
పడు) పెడమొగము పెట్టు.

సీ దేవదత్తాభీలరావంబు వెసఁ గర్ణముల
దీటుకొన లేటమొగముపడుచు.
భార విరా ౪ ౨౪౩.

క ఏటున వాటున ప్రేటునఁ, బోటున దశ
ముఖుఁడు రౌద్రముగ నఱుముటయున్,
లేటమొగముపడి యక్షులు, కోటసారంబాఁతి
రసురకోటి రొమగవఁగ నిర్వ. ౪ ౪౭

**లేటి = లేడి.** వి. కృష్ణసారాదిమృగము

గీ ఇట్లు తెన్నాడి యలసి కాదిది మృగంబు,
మాయరూ రేయెం దైన నేమారు
ననుచుఁ, గనలి కనకమయోగ్రాశుగంబు
వఱుపఁ, లేటిరాకొమ్మ నడుచక్కి నాఁటు
కొనిన రామా ౫. ౧౭౪.

ఉ ముకుంద వేణుకల నాదపుటీలకు లేటి
మొత్తమై ఆము. ౫ ౭౭.

౨. మృగి, ఆఁడులేడి

సీ పాలయించి నీచూచు నలతికి పెడయెత్తి
కొని చూచు రా లేటికొదమ లివియు
కు సం ౭. ౭౭౪

౩ మగజింక

క. లేటిం దాచుకొనవో మున్నీట వ్నదయాడ
లేదో నిను ద్విజరాజం, చేఁటికిఁ బలుకం
గోకా, ఖేటక పాటవకిరాతకేసరివి శశి
పాంచా. ౩ ౭౭

సీ. ముని పట్టుఁబుట్టముల్ చినుఁగునంచు విశంగి
లేటిపైఁ దనగోట మీఁట నకుకు
చంద్రా ౩. ౪౧.

జ లేటివల.

**లేటివల.** వి (లేటి + వల) మృగములను బట్టు
కొనెడు వల.

వ. తెరచీరకట్టులు ప్రోఁగుచుట్టులు డొడ్డివల లేటి
వల కంచెటివల మొదలుగావలయు వలలును.
కాశి. ౩. ౪౭.

గీ. లేటిపలలును మఱియుఁ గుందేటిపలలు, సెలుక
పలలును సవదండపలలు దొడ్డిపలలుఁ బందిటి
పలలును యయా. ౧. ౧౧౦.

**లేడి=లేటి.** వి. (బ. లేడులు, లేళ్లు). ౧. మృగము.

చ. పులిఁ గనుగొన్న లేడులును బోలె విభూతిఁ
గలంగఁ బాఱ . . భార. విరా. ౩. ౩౪.

చ. పులిఁ బొడగన్న లేళ్లగమిపోలె సురాధను
నగ్రమునికుల్, దలఁకి కలంగి . .
భార. భీష్మ. ౨. ౧౫౪.

చ ప్రకటబలాఢ్యు లొక్కటఁ దిరంబయి
పల్వురు వీఁక భూమిపాలకునకు నడ్డమైనఁ
దవులంబడి పొలుమ్రని వోలె కండ నాఁచి
కొనిన ప్రాఁగు బెబ్బులివిశేషము దోఁపఁగఁ
బార్థుపట్టిపాయకముల నొంచినం దరలి
రందఱు లేళుల పిండుసాకృతిన్.
భార ద్రో ౨ ౨౫

సీ. బెళుకుఁజూపుల లేడి గలిచిక్కెకొనియునొ
నాఁ గ్రిందఁ గృష్ణాజినంబు వెలయ.
ఉ. రా. ౩ ౧౦౩

౨. మృగి.

క. మునిజరాగంబునఁ బెనఁగినయిత్తిని లేడిఁ
జూచి కృతహస్తుఁడు పెల్చన యేనమ్ముల
నారెంటిని ద్రెళ్లఁగ నేసెఁ గడుఁ కినవ్యాద
యుండై. భార. ఆది. ౫. ౨౯.

చూ: లేడికంటి.

**లేడికంటి.** వి. (లేడి+కన్ను) లేడికన్నులవంటి
కన్నులు గల స్త్రీ, మృగాక్షి (శ. ర)

**లేతము.** సం వి అ పుం., న కన్నీరు, బాష్పము.

**లేదా.** అవ్య. (లేదు+ఆ) లేనిచో, లేని
పక్షమున

(ఆంజనేయుడు) ఉ. చూచుటలే దశోకవనిఁ
జొచ్చి యటుం జని చూడఁగాఁగదా, యా
చపలాక్షి మజ్జవని యచ్చటనుండినయేని
లెస్స లే,దా చతురాననుండు పొందరైన
పుపర్వ లెఱుంగఁ జిచ్చులో,నై పెదఁగాక
యా రొండలు బావరపేరుల ద్రోల నైకునే.
రామా. ౬. ౧౨౦.

శా వీరుండై జనియించినప్పుడ రణోర్విన్ శైర
లన్ దోర్బలో,దారత్వంబునఁ గెల్వఁగా
వలయు లేదా తొమ్మ్న గాయమ్ములన్, వీర
స్వర్గము గాంచఁగావలయు దశా. ౪. ౯

**లేదుబంతి.** విశే. లేనిది. (వి. బొంకు అని శ ర.)

చ. తెలియఁగఁజూచినట్లు సె మదిన్ బుధు లారశి
తప్పు నీపయిన్, గలదని పల్కుచోఁ గుచ
యుగం బటు బట్టబయల్గఁజేసి యా,యలికచ
లేదుబంతి యన నందఱు డెందము నిళ్ళయంబు
పెం,పొలయఁగఁ గల్లతోడ నిజ పెంపు
దుగాఁ దలపోసిచూచినన్

సారంగ. ౩. ౨౧౯. (అసత్యము అని భావము)

సీ. ఎంతమాత్రం బిది యీక్షణంబున లేదుబంతి
గావించెదఁ బ్రజ్ఞ మీఱ నిరం. ౪ ౬౧

(లేదుబంతిగావించు = పోగొట్టుకొను అని
భావము)

ఉ. అన్యపతిపాలికిఁ బోయెద వేమి పొమ్ము
నీ,యిచ్చకువచ్చినట్లు రమియింపు పెంకా
నొక మాట పుట్టినన్, సెచ్చెలి లేదుబంతియను
పేర్పున దిద్దుకొనంగజాలినన్. శుక ౨. ౯౪

(లేదుబంతియను = పోగొట్టుకొను.)

వ. . తురంగంబు నంటుండోలి గంటియిడి
పెంటంబడుటయు గెంటించి లేదుబంతి
యన్నట్లల్లంతనుండి . . మనుచ. ౪. ౧౧౫.

చ. జలరుహగంధివీనులపసల్ నవసంఖ్య నడేమి
లెక్కనున్, తెలియ నఖాంకురాళి సెల
చేడియ నైకముఁ దాను జొక్కనున్, బొలఁ
తుక గబ్బిచన్నుఁగవ పువ్వులచెండ్లను లేదు
బంతినున్, కలికిముఖారవిందముల కల్వల
రాయనిఁ దోసిరాజనున్. విజ వి ౧. ౩౪.

(ఇట ఔపమ్యవాచకము పోలు అని భావము.)

**లేనగవు = లేఁతనవ్వు, లేనవ్వు.** వి. (లేఁత+
నగవు) చిఱునవ్వు, మందహాసము.

సీ. పలుకంగ నేర్తురు పాటలాధరముల పెంల్క-
లేనగవులు ముద్దుగురియ. భీమ. ౧. ౯౪.

ఉ. ... అ,యన్నుల కుల్కు లేనగవు లచ్చుపు
తాన్నుల లంచు ... సీలా. ౧. ౨౮.

**లేనడ.** వి. (లేఁత + నడ) మందగమనము.

చ. కనిమ్మా దయంబు ఝల్లుమన ఘల్లుమనంగఁ
బదాంగదంబు దిగ్గన జెస లేచి లేనడ
యొయ్యారముతోఁ దరచాటుఁజేరెఁ గా,మిని
చెలిక త్తె క త్తరము మెక్కొన గద్దియఁ దెచ్చి
యుంచమిం,చినతమి నందుమీఁద నివసించె
ధరాధరుఁ డాదరాత్ముఁడై కువల. 3. ౫౨.

**లేనవ్వు = లేనగవు.** వి. (లేఁత + నవ్వు) మంద
హాసము.

మ మమ్మాపన్నులం(బ్రోవ నా,యమరుల్ నీ
కెదురే జయింపగదవయ్యా యన్న లేనవ్వు
దా,య మరల్ గొల్పుచు వారి వీడ్కొలిపి
దైత్యచ్ఛేదనోద్యోగియై ఉ రా. ౧. ౪౭

**లేని.** (కలుగు ధాతువునకు వ్యతిరేకార్థక విశేషణ
రూపము ) విణ ౧ ఉండనిది

చ బలమును నొవ్వు బుద్ధియును (బౌఢతయుం
గలవారు నిచ్చా,ర లవక బేరొుక్కుభంగి .
భార శాం ४. 3౯౫.

సీ సకలదైవతబుధసమ్మూర్తి కివ్వానిపుట్టు
కామనిలేని మెట్టపంట అము. ౧ ౧౯.

౨ చాలనిది, ఓపనిది.

గీ. శాస్త్రతత్వ మెఱుంగక సంశయాత్మఁ,
డగుచుఁ బరమార్థ మిట్టిది యనంగ లేని,యట్టి
వాఁడు భార శాం. ౫. ౪౪౮.

3 (పాప్తింపనిది, దొరకనిది

గీ. దర్పపోటులఁ దిని లేనితఱులమైత్రి, నంటి
శిత్ప్యశేషము ఛుజించి... అము. ౬. ౬౯.

४. సంభవింపనిది, జరుగనిది.

శీ. ఇది లోకమునలేనియది యేమి సేయంగనగు
నని చింతాకులాత్ముడైన.
భార. ఆది. ౭ ౨౦౯.

**లేనివాఁడు = దరిద్రుఁడు.**

క. కలవాఁడు లేనివాఁడు సబలుఁ డబలుఁడు
మూఢబుద్ధి (బౌఢుం డనఁగా.
భార శాం ౫. ౨౭౭.

ఆ. కంబుకంఠి నీవు కలవాఁడు కలవాఁడు లేని
వాఁడు నీవు లేనివాఁడు శాకి. 3. ४౭.

జ • లేనిది

**లేనిది.** వి. (లేని+అది) అసత్యము. (ఇది'కలుగు'
ధాతువునకు వ్యతిరేకవిశేషణమైనను క్రమముగా
నీయర్థము కలిగి విశేష్యమైనది )

గీ అనుడు ధరణీశుఁ డాతపోధనునిఁ జూచి,
వింటివా యీయి యీమనుచ్చోకంటి యేచి,
నట్టిమాటలు తెలియ నేమైన నిందుఁ, గలది
లేనిది గలిగినఁ దెలుపఁవలయు విప్ర. ౫ ४౯.

**లేనురువు.** వి. (లేఁత + నురువు) అల్పడిండీరము.

ద్వి ఒలయు లేనురువు చిట్టుములు బిట్టెర్మొ...
ద్వి. పరమ ౧. 3౭. పొ.

**లేనెత్తు = లేవనెత్తు.**

ద్వి పడియున్న నతిదయాభావామృతంబు,
కడకంటఁ గడకూడఁ గొడుకు లేనెత్తి.
బస. పు ౧. ౫౭౯ పం.

వాడుకలోని ప్రయోగములు పొగ యింటి
కొప్పునుండి లేచినది.

తోఁక(దొక్కిన తాఁచువలె లేచినాఁడు.

జ లేపు[1]

**లేనెన్నడ.** వి (లేఁత+నెన్నడ) మందగమనము.

సీ నెఱనీటు గులుకు లేనెన్నడల్ పరికించి
కడు మందగతిఁ గాంచె గంధకరిణి.
దశా. ౨. ౩౦౨.

**లేనెల.** వి. (లేఁత+నెల) బాలచంద్రుఁడు.

ఉ... మందుఁగొండరా,యాలినిగూడి జేడుకలఁ
జొక్కుడు లేనెలతాల్పుఁ గొల్చెదన్.
సీలా. ౧. ౧.

గీ. శ్రీ కెలంత లలాటంబు లేసెలంత
విజ. వి. ౧. ౧౩౦.

**లేపకరుఁడు.** సం. వి అ. పుం. తాపీపనివాఁడు, సున్న పుఁబనివాఁడు, సున్న ముపూయువాఁడు

**లేపకుఁడు.** సం వి అ పుం ౧ తాపీపనివాఁడు, సున్న పుఁబనివాఁడు. ౨. పాత్రములు మొద లగువాని యచ్చుపోయువాఁడు.

**లేపనము.** సం వి అ పుం. ధూపద్రవ్యము, సీమ సాంబ్రాణి న. ౧ రాచుట, పూయుట ౨. లేపనపదార్థము, పూయుట కుపయోగించెడి వస్తువు ౩ సున్న పుగచ్చు, శెల్ల. ౪ మాంసము

**లేపభాగి.** సం వి న్ పుం ప్రపితామహుని తండ్రి, తాత, ముత్తాత, తండ్రి మొదలుగా నాలుగ్గు దాటుతరములవాఁడు, పిండభాక్కు

**లేపభుక్కు.** సం వి జ్ పుం లేపభాగి

**లేపము.** సం వి అ. పుం ౧. పూయుట, రాచుట. ౨. గాయము మొ॥ వానికి రాచెడి తైలము ౩ సున్నము మొ॥ పూయుట. ౪. పితృపితామహప్రపితామహులకంటె పూర్వు లగు మూఁడుతరములవారికి నొసఁగఁబడు పిండ శేషాన్నము ౫ మచ్చ, కళంకము ౬ పాపము ౭ ఆహారము

**లేపి.** సం విశ (న్ సీ. న్.) పూయునది, రాచు నది, కప్పునది వి పుం తాపీపనివాఁడు

**లేపించు.** సం స క్రి లేపనముచేయు, పూయు.
సీ. నల్లనికటికిక గంధము తేనె దగ నూతి లేంచికూడిన లేమ వలచు హంస ౫ ౧౩౧

**లేపు**1. స క్రి (√లేచు) లేచునట్లుచేయు, మేలు కొలుపు.
చ. నలుఁగిడి చల్వ కాల్చి పయనంపుటలంతల నిద్రఁజెందు కోకిలఁదుల లేపఁ గొంకి ...
కువల. ౨. ౧౧౦.

**లేపు**2. వి. ౧. పాన్పుపై పఱచు దుప్పటి.
గీ. . శయ్యాఖ్య చెల్లు పెట్టె, పఱపు తలిపము దడిబయు పాన్పు మెత్త, యనఁ దధాద్యాది యొసఁగు లేపనఁగ శయ్య.
ఆం భా. ౨. ౧౬౩.
౨ పడకమీఁద పఱచెడు పఱపు
చ సకినల పట్టెమంచమునఁ జాయనతాను తివాసిపైఁ దురంగిక మెత్తమాలు లేపున నొగిన్ శయనించి మనోభవవ్యథన్
హంస ౧ ౬౯
చ .జాఫరా జినుఁగు లేపునఁ జెందుపలంగు పోషుత,క్కిశగల జాశువా గొలుసు గిల్కొను మంచముపై మహోన్నతిన్.
హంస ౧. ౨౪౦
౩ ఏనుఁగుమీఁద పఱచెడి చిత్రకంబళము, జూలు.
సీ కుథముజూల్ లేపనఁ గొఱలుచుండు...
ఆం. భా ౨. ౧౯౫.

**లేప్యమయి.** సం. వి ఈ స్త్రీ మట్టితోఁ జేసి సున్నము పూసిన (బిడ్డలాడుకొను) బొమ్మ.

**లేప్యము.** సం విశ. (అ ఆ అ) ౧ గచ్చు చేయఁదగినది, పూయఁదగినది ౨ పోఁత పోయఁబడినది వి అ న ౧ పూఁత

**లేబరము.** విశ ౧ వ్యర్థము
గీ లేబరము కాదె బిడ్డలులేని బ్రతుకు
ఉ హరి ౨ ౧౬
సీ పరగు లీసరము లేబరమన వ్యర్థంబు
ఆం భా. ౩. ౨౪.
౨ శూన్యము
సీ ప్రావితో వర్షంబు సమకూరకుండుటఁ బంట లేబరమయ్యెఁ బాఁడితోడ
కాశీ. ౧. ౧౩౭.
సీ. అట్టితీవ్రాధచే హాహాస్వనంబుతో భువన సంక్షోభంబు పుట్టె మిగుల, గీ. బంటలును బాఁడితోడ లేబరములయ్యె. శశి. ౫. ౬౬.
౩. దీనము.
గీ లేదు పెట్టలేయనిమొదు లేబరంపు, బలుకు దన ప్రజలో వినఁబడియొనేని, నింతకంటె

మిక్కిలి ధరణీశ్వరులకు, పెద్ది యజమాన
మది మాన్పు మిపుడు నీవు.
హరి. ఉ ౨ ౧౬౯

౪. దారిద్ర్యము.

చ. పరపర రొల్లధర్మములు నష్టము లయ్యెను
దానఁజేసి లే,ఒరములు సర్వదేశములఁ
బాటిలె . వి పు ౨ ౧౫౪

**లేబొండుమల్లె.** వి. (లేఁత + బొండుమల్లె) లేఁత బొండుమల్లె. ?

గీ. మెండుమీఱిన పగటి బీఱెండదాఁకి, యొల్లఁ
బోయిన లేబొండుమల్లెపొదల, కుదలఁ
జప్పటల్లె కడుదొడ్డలగుచుఁ, బొడమె మొగ్గ
లగము లగ్గిబొబ్బలట్లు. ఆము. ౨ ౫౬.

**లేమ.** వి. (సం. రామా) స్త్రీ.

సీ. లీల నామందట నాలేమపొలసినఁ జూడ్కి కిఁ
బొబ్బన చూఱగాదె. భార విరా. ౨ ౭౬

ఉ. లేమ యొకర్తు వేడుక నలీకనలీకరణంబు
బాతిగా నైష. ౩ ౯౭

ఉ. పూఁతపసిండిఁవంటి వలపున్ బచరించు
కులంబునీతికిన్, లేఁతగదమ్మ యుత్తిలఁగు
లేమ కురాంగనల్లెల్ల నిట్టి నీ, చేఁతకు మెత్తు
రమ్మ మనుచ ౩. ౩౩

సీ. నవలా మగువ నాతి నాతుక యాఁడుది లేమ
గోల యువిద చామ చాన.
ఆం. భా. ౨. ౧౦౪.

విణ. లేఁత (శ. ర.)

**లేమరులు.** వి. (లేఁత + మరులు) ప్రథమాను
రాగము.

శా. లేమాలేమరులే మరల్పక విరాలిం దూలి
సోమాన్వయో,ద్దాముఁడ్ గోమున నాము
కొంటినఁటవే తాన్తై హితాలాపముల్,
ప్రేమం గోమల కోమలాక్షరముగాఁ బెక్కాడి
సోకిక్కింప న,క్కామిం గామిని కామినీ
కునచిబాణ గ్రాకొంటి నాకాఁగిటన్.
కృ. శకుం. ౩. ౯౨.

**లేమాపు.** వి. (లేఁత + మాపు) సాయంసంధ్యా
కాలము.

క. ఈమాడ్కిని నహోన్యస్యం, లేమాత్రము
తెలియకుండ నిచ్ఛాన్వృత్తిం, గామించుచు
నొకదినమున, లేమాపునఁ గోడ లింట
లేకుండు టెఱిఁగి హంస. ౫. ౧౩౯.

**లేమావి.** వి (లేఁత + మావి[1]) బాలరసాలము. ?

చ. గుజ్జు లేమావులపజ్జల నుజ్జ్వలించు గొజ్జంగి
యీరంబుల ఉ. రా ౬. ౨౪.

**లేమి.** వి. (కలుగు ధాతువుయొక్క వ్యతిరేక భావార్థకరూపము ) ౧ అభావము, లేక పోవుట

ఉ మహా,లింగని వాసమేమియును లేమికిఁ
జొక్కి నమశ్శివాయ పే,యంగలకార్య
మెద్దియొకో యంచు విచారముచేసి
యాత్మలోన్. కాశి. ౧. ౫౯

చ కుసుమము లెల్లఁ గామినుల కొప్పుల నుండె
నటుండ లేమి పి,గ్గసఁగఁగ వంగినట్లు జని
యించెనవల్.. కింశుకిన్. ఆము. ౫.౧౧౩.

చ సుస్థిరమతి రాజ్యభోగములు చేకొనఁగాఁ
దజీ లేమి నాత్మలో, హరి తలపోసి సౌఖ్య
ముల నందఁగఁ దక్కురిఁ జెక్కురూపులై,
సౌరిది జనించె నా నృపతిసూనులు కెల్లరు
శ్రీసమేతులై. విక్ర. ౧. ౩౧.

౨. దారిద్ర్యము, పేదఱికము.

వ కొందఱు దుష్టమతులు లేమిఁగుందు
వడిన భర్త నధిక కార్పణ్యంబు పచరించి
సర్వివర్ణణ తెలతండులాదులకై నిర్భర్త్సిత లు
కురు కాశీ. ౨. ౩౯.

గీ అధికదాహ్యాదసంపద నా సరోజ,గంధి
నడిమికిఁ బేదరికంబు మానెఁ దలఁపఁబట్టిద
యెట్టివారలకునైన, లేమిగాఁపురమండునే
భూమిలోన వరాహ. ౩. ౭.

జ లేమిడి, లేమిపడు.

**లేమిడి.** వి. (√లేమి) దారిద్ర్యము, పేదఱికము.

ఉ . సూర్యవంశజాల్, లేమిడిఁజెందియుండి
యును లేదనువాక్యముఁ బల్క రెన్నఁడున్.
ఇందు. ౧. ౧౭౧.

చ. బుడుపులు గల్గు ధుర్ధురము బూనిన
ప్రాణము లుత్తరించు లే,మిడి నొదవించు
వేదనలు మీఱఁగ రత్నపరీక్ష. ౪౪ ప

**లేమిపడు.** అ క్రి (లేమి + పడు) పేదపడు,
పేదతికమునొందు

సీ పల్లవుల్ తుది లేమిపడి యింటిచాయరా
మెంగి లంజతల్లులు మాల్గినట్లు
కవిరా. ౨. ౨౪.

**లేయము.** సం. వి అ పుం సింహరాశి.

**లేయెండ.** వి (లేఁత + ఎండ) లేఁతయెండ
ప్రొద్దుటియెండ, బాలాతపము

క. లేయెండ వేఁడియయ్యెను, దోయజషండ
మున కింపు తొలఁగించుక్రియన్, నీ యలుక
పరుసవయ్యెను, నా యెడఁదకు వేడ్క
సేయు నళినదళాక్షీ సైప ౨ ౪౬.

క. పదపదఁ డంచు దిశలు గ్రక్కదలఁగ
లేయెండచాయఁ గడుమ్రగమ్మై, యెదురం
గొందఱు గలరని, మదినించుక సరకుగానక
మదమున నడచెన్. నిర్వ. ౬. ౯౩

**లేలిహా.** సం. వి. అ స్త్రీ. అంగుళీసన్ని వేశవిశే
షము, అభినయభేదము, అభినయవిశేషము,
ఒక విధమగు ముద్ర.

**లేలిహము.** సం వి. అ. పుం సర్పము, పాము.

**లేలిహానము.** సం. వి అ పుం సర్పము, పాము
విణ (అ ఆ అ) మరలమరల నాలుకను
జాఁచునది, లేక నాకునది.

**లేలిహానుఁడు.** సం. వి అ. పుం శివుఁడు.

**లేవ.** వి గుఱ్ఱపు తలాటము.

సీ బలితంపుఁ బులుదిండిమలదాయకొచెక్క
డపు గోవపని చొక్కటంపు లేవ.
చంద్రా. ౨. ౬౯.

గీ. జిగిదొలఁకు లేవ పాలావి మెంగసరియును,
బూని పాహిణి యొక కత్తలానిఁ దెచ్చె.
చంద్ర. ౨. ౧౬.

**లేవంకి.** వి. (లేఁత + వంకి) చిన్నకత్తి.

సీ నిలుచులేవంకితో నిజసంగరాగామి పరన్నప
క్షితి లేటపటుంతు ననియె. కకు. ౪. ౪౧

**లేవడి.** వి (లే¹ + వడి) ౧ అభావము, కార్శ్యము.

సీ నిదురలేవడిఁ గెంపుసెలయు కన్గవతోడఁ
బాడిపాడియైన మైపూఁతతోడ.
రసిక. ౫ ౨౦

గీ. వేలుపుల లేవడులు కడుమేకఁ దొలఁగఁ,
బడఁతుకల సన్నడుముల లేవడులు దొలఁగ
అచ్చ రా బాల ౪౪

౨ దారిద్ర్యము

సీ తెనుక ముందఱ లేరు సెనరైన చుట్టాలు
లేవడి యెంతేని జీవనంబు. సైప ౧. ౧౦౩.

క పేదలు దానముసేయఁగ, లేదుగదా సొమ్మ్మ
వారు లేవడిచే దిక్కెక్కుడినస్వర్గసుఖంబున,
కేదేనియుఁ ద్రోవగలదొ యెఱిగింపు వారీ
శేషధ. ౧. ౧౫౧

ఉ. లేవడిమీఁద బానిసలు లేనికతంబున నూర
కుండినన్, బోవమి నప్పుసప్పులకుఁ బోవుట
వేఱుగఁ దోఁచె పెంకితో ...
శుక. ౨. ౩౪౫

౩. కష్టము

గీ. వేలుపుల లేవడులు కడుమేకఁ దొలఁగఁ,
బడఁతుకల సన్నడుముల లేవడులు దొలఁగ
అచ్చ రా బాల. ౪౪

విణ. అల్పము, కృశము.

రగడ పొగడ ప్రాంతియే పోనే లేవడి, నిగురు
బోఁడికా సెంతయు లేవడి.
రాజ. చ. ౨. ౧౪౯.

ద్వి. మెఱుఁగు లేవడియైన మించు సడలినను,
సెజిచందనమునకుఁ గొఱఁత దోఁచినను.
బస. పు. ౪. ౨౩౨. పం.

**లేశము.** సం. వి. అ. పుం. ౧. లవము, అత్యల్ప
భాగము. ౨. అల్పత్వము, కొంచెపుదనము.
౩. అణువు. ౪. రెండు కళల పరిమితిగల కాలము,

అత్యల్పకాలము. ౫. ఒకవిధమగు పాట. (విల్యమ్సు.) ౬. (అలం) ఒకానొకయలంకారము
శ్లో. లేశస్స్యాద్దోష గుణయో ర్గుణదోషత్వ కల్పనం (చంద్రాలోకము)

లేశోక్తము. సం. విణ. (అ. ఆ. అ.) సూచింపఁబడినది, కొంచెము చూపఁబడినది.

లేశ్యా. సం. వి. ఆ. స్త్రీ. ప్రకాశము. (సూర్య) కాంతి. (విల్యమ్సు)

లేశ్యము. సం వి అ. పుం, న ప్రకాశము, (సూర్య) కాంతి. (విల్యమ్సు)

లేష్టుభేదనము. సం వి. అ. పుం. మంటిగడ్డలు పగులఁగొట్టెడి పనిముట్టు.

లేష్టువు. సం. వి. ఉ. పుం. మంటిగడ్డ.

లేసికుఁడు. సం. వి. అ పుం. ఏనుఁగుపై స్వారి చేయువాఁడు.

లేసు. వి. (సం. లేశః) ౧. చులుకన ౨. సులభము. (శ ర.)

లేహనము. సం. వి. అ న ౧ నాలుకతో నాకుట. ౨. పెదవులతోఁ బీల్చుట

లేహము. సం. వి అ పుం ౧ పెదవులతోఁ బీల్చుట, కొంచెము కొంచెముగాఁ ద్రాగుట ౨ రుచిచూచుట. ౩ నాలుకతో నాకెడు మందు, లేహ్యము. ౪ ఆహారము ౫ సూర్య చంద్రగ్రహణములు సంభవించు పదిమార్గము లలో నొకటి (విల్యమ్సు)

లేహి. సం. వి. ఈ స్త్రీ. చెవులకొనలయందుఁ బుట్టెడి రోగవిశేషము

లేహినము. సం. వి. అ. పుం వెలిగారము

లేహ్యము. సం. విణ (అ. ఆ. అ) పెదవులతోఁ బీల్చఁదగినది, నాలుకతో నాకఁదగినది
వి. అ. న. ౧. నాకి యనుభవింపఁదగిన యాహార పదార్థము. ౨. ఆహారము. ౩. అమృతము.

## లై

లైంగము. సం. వి. అ. న. పదునెనిమిది మహా పురాణములలో నొకటి.

లైంగికము. సం. విణ. (అ. ఈ. అ.) ౧. లింగము (గుఱుతు = అనుమాపకచిహ్నము) పై నాధార పడునది. ౨ లింగసంబంధమైనది. ౩. అను మితము, ఊహింపఁబడినది.

లైంగికుఁడు. సం వి అ. పుం విగ్రహములు చెక్కువాఁడు.

లైంగుఁడు. సం. వి అ. పుం. శివలింగమువలన జనించినవాఁడు.

ద్వి లింగమధ్యములోని లైంగులు సరిరెు.
బస. పు ౬. ౧౪. పం.

## లొ

లొంక = లోఁక. వి. గుహ, గుహాంతర్భాగము.

ఆ. ధరణిపాలుఁ డంతఁ దురగంబు వచ్చెటఁ, గట్టి వాలుఁ గేలఁ బట్టికొనుచు, లొంకఁ జొచ్చి నాల్గుఁ గొంకక కాలుండు, గదిసి దివియవట్టి పెదకుమాడ్కి. ద్వా. ౧. ౪౪.

లొంగ. వి. వస్త్రాదిభారము, మూట.

సీ భయంబు లేక, కాలఁగట్టుక చనఁగా బిట్టు నే తెంచు కూకల నొకలొంగ గొనక మాన ప్రభు. ౧. ౯౩.

లొంగు = లోఁగు. అ క్రి లోకువగు, వశపడు.

క సుమ,చాపునకుఁ లొంగి మానసంబునఁ బొగడెన్ దశా ౨ ౨౬౬.

ద్వి. తనులత వడఁకఁ జెంతను లొంగియున్న, కలవాణి సతి జూచి కిలకిలనవ్వి
మృ వి ౨ ౭౩.

లొండు. వి జలాశయవిశేషము, ఒకవిధమగు నీటిపట్టు

క. తిరుకొళము నూయి లోటయుఁ, జెఱువు మడువు లొండు కుంట చెలమ వడియ కో,నెఱు బుగ్గ వాఁగు దొనకల,వరి గుండము కాల్వ డిగియబావి దొరువులన్.
హంస. ౪. ౨౧౦.

లొంప. వి. అల్పగృహము, కొంప.

సీ.. అల్పగృహము కొంప లొంపనఁ దగు..
అం. భా. ౨. ౧౪.

**లొంపి = రొంపి.** వి. బురద, పంకము.

సీ. క్రొవిగుంటలు దక్క లుల్లలు చిక్కంగ నివిరినఁ గొంగ రాయిడికి మిడికి, కొరదయుఁ గడిచె పాపర మల్లు ముచ్చంగి కొంచె ముక్కను లొంపి గ్రుచ్చుకొనియె
వేం. పంచ ౧. ౨౯౪.

**లొంపు.** వి ఒకతెగ. (శ. ర)

**లొగ్గడి.** వి కలగుండు, క్షోభము (శ.ర)(సంకీర్ణము, కలిసిపోయినది వా.)

జ. లొగ్గడిల్లు

**లొగ్గడిల్లు.** అ.క్రి (√లొగ్గడి) కలగుండువడు, క్షోభపడు (శ ర)

**లొగ్గు = లొంగు, లోఁగు.** అ క్రి. వశమగు

ఆ సకలమైనరాజసంఘంబులకు లొగ్గి,యాత్మఁ జోరజనుల కలికి యలికి, యలమటించునట్టి యైశ్వర్యములకంటె, నాకుఁ జూడ లేమి నయము కృష్ణ.
కుచేల ౩. ౪౭

చ అదివజుకెల్లఁ దత్పురి సుయజ్ఞుని యాజ్ఞకు లొగ్గి భీతులై, యొదుగుచుఁ దల్లికేనిప్రజలో యనసుండిరి గాని నాగరుల్, మది నటకేళ రాజునకు మాటికి వందనముల్ ఘటింపుచుణ్, వదనముఁ జూచి చేరి యనివారితులై తగఁ బల్క రందఱున్.
ఉ హరిశ్చ ౧. ౩౭.

**లొచ్చు = లొజ్జ.** విశ కొఱఁతయైనది, తక్కువయైనది.

శా. కీర్తనీయసుగుణస్తోమంబులం దేమియున్, రాముస్వామికి లొచ్చుగాక సరియైరాజల్లె.
హరి. పూ. ౧. ౩౦.

గీ. తక్కువ కొంత బొప్పెను తగ్గు ఘందు, కొదవ లొచ్చు కొదుక యనఁ బొదలు
న్యూనము .. అం భా ౩ ౨౪.

చ హారముకుటావతంసమగు నర్థసుధాకరుఁ దన్నమీనికాస్వరుఁ డెదిరించి లొచ్చుగుట గావఁబడంగ నపాంగమాలికాపరిచితకాశిమన్ నిటలపాళిక నైనిడి కాయఁ బోలు నీ, సరణి వనజ బొమల్ మెఱయు జవ్వనికి జెలువంక బాగునన్. చంపూరా. ౩. ౩౭.

**లొజ్జ = లొచ్చు.** విశ. తక్కువ.

మ . ఇ,చ్చలు తెల్లజ మనలతు నాసతికి లొజ్జ సుమ్ము రమ్యాకృతిన్. చను. ౨. ౯.
(ముద్రి పా లొచ్చు శ ర. పా)

చ . లొజ్జగాని బల్,దొనలును దొడ్డసింగిణులు దూఱొని పెన్కకురాని ధీరమున్, బొనరఁగ పెల్చుగొంగ తొలిబొట్టియ యింద్రజితుండు అంపిలున్. అచ్చ. రా యు. ౩౦.

క నానయు జెఱఁగును వేడ్కయు, లోసరయఁగ నతని మెచ్చి లొజ్జంచుకయుం, బూనని సెయ్యంబున న,క్కానచిడారంపు సామిఁ గన్గొని పలికెన్.
అచ్చ. రా. బాల. ౧౩౭.

**లోట = లోట్ట.** విశ అణఁగినది.

ద్వి. కొడుకు వేడకొ దాఁగ గుఱుతుగా నంపి, కడు నుగ్రభుజగంబు గఱచినదనుచు, జెడ యొడ్డు తెడ్డుచు జెదకుచు సందు, జెడలి పోఁజూచెదో వెసాలువన్ని, లోకంబులో లేని లోట తాఁటకత్తె.
ద్వి హరిశ్చ. ఉ ౧౯౦౩. పం.

(లోటతాఁటకత్తె = బయటికి మంచిదానివలె అణఁకువ కలిగియుండునది, అని భావము.)

**లోటకజిట్ట.** వి. లొట్టకన్ను జిట్ట, పక్షివిశేషము. (శ. ర.)

**లోటలోట.** వి. ౧. శీఘ్రముగాఁ బొరలుటయం దగు నమకరణము.

క. ఇటునటుఁ గనుఁగొని లోనికి, లోటలోటఁ జని మంచమెక్కి లోలత నది తేత్రముఁ గూర్చుండిన నక్కటిలాత్ముఁడు కౌఁగిలించుకొని యుల్లనియెన్
చంద్ర. వి. ౩. ౧౪

౨. వదరుటయందగు ధ్వని కనుకరణము.
క. లొటలొట పుర్వులు దొరఁగఁగ, లొట
లొటమనుకొంచు వింధ్లలోనికిఁ జన . .
భల్లా ౨. (శ. ర.)

జ లొటలొటకాఁడు.

**లొటలొటకాఁడు.** వి (√ లొటలొట) లొట
లొటయను ధ్వని చేయువాఁడు, వదరుఁబోతు.
క. కుటిలుఁ డపకారి జాదరి, లొటలొటకాఁ
డాగడీఁడు లోభి ఖలుఁడు దుర్విటుఁడు
ఖలుకోగి తక్కరి, తొటుగిడి బాపనగరాను
ముట్టకు మబలా. ప్రబంధ. ౨౮౪

**లొటలొటమను.** అ క్రి. (లొటలొట + అను)
లొటలొట యని ధ్వనించు (శ. ర)

**లొటారము.** వి సారాభావము, సారములేమి.
చ. పతి యతికార్శ్య మొంది యుపభ ర్తరతా క్తికిం
జేరకున్న, నచ్యుతముగ దైర్య మిచ్చుచు
నరయా మగవాఁడవటంచు నెట్లు ప్రవృత్తి
వింత లేమి తద్భుజపటిష్ఠత లోన లొటార
మింతె నీ, వతనికిఁ గొంకకేలని భయస్థితి
మాంచి రమించుఁ దద్రతిన్.
శుక. 3 ౧౭౧.

సా లోన లొటారము, పైన పటారము.
ఉ.. లోన లొటార మాట మది లోకు
లెఱుంగరె వేయునేఁటికిన్. తపతి. ౨ ౨౩.
౨. బొక్క, సుషిరము.
సీ. లొట్ట లొటారము లొ త్తయుం చవఁగను
లోభిల్లుచుండును సుషిరసంజ్ఞ.
ఆం. భా. ౧ ౧౪౬.

వివ రిక్త, పట్టెడి
సీ ..రక్త లొటారంబు రిక్త బీడు, సొల్లు
నా రిక్తాఖ్య లోభిల్లు . ఆం. భా. 3, ౧౫

**లొటిపిట(ట్ట).** వి. ఉష్ట్రము, ఒంటె
సీ....ఒంటె యనఁగను లొట్టియ యనఁగను
లొట్టె నాఁగ, లొటిపిట యనఁగను లొటి
పిట్ట యనఁగను లొట్టిపిట్ట యనఁ గన్పట్టు
నుష్ట్రము... ఆం. భా. ౨. ౨౬౫.

**లొటుక్కు.** వి. కలఁగుటయందగు ననుకరణము.
క. పిలిచిన గుండె లొటుక్కనఁ, గలఁగుచు
వ్యాపారి వడఁకఁగా నెటులనుచున్, దలఁ
చినచో నెఱుకఁగుమని, విలిచిన దార్ఢ్యమున
మానినీమణి వేద్కన్. హంస. ౨. ౬౦.

**లొట్ట=లొత్త.** వి. ౧. మగగుంతి. (శ. ర)
౨. రుచ్యములగు పదార్థములను దినునప్పుడు
నాలుక నంగిటఁ జేర్చి కలిగించెడి ధ్వని.
(శ ర., వా.) 3. పల్లము (శ.ర.) ౪. రంధ్రము,
కన్నము.
గీ. వామనుఁడు దర్భగిండిలో వారిధార, కడ్డ
మై యున్న శుక్రుని యక్షిఁ బొడువ, మిట్టి
పడి కన్ను పోయిన లొట్టపోయె, నపుడు
నగుచును జే సాఁచి యడుగుటయును.
దశా. ౫. ౧౦౭.

(లొట్టపోయెను = కన్ను పేర్పడె నని భావము.)
విశ. ౧. అణఁగినది
ద్వి. బుజ్జముక్కును లొట్టపోయినకన్ను.
ద్వి. హరిశ్చ. ఉ ౧౦౭. 3. పం.
౨ నిస్సారము.
ఉ లొట్ట యిడేటిమాట చాటువు.
జ లొట్టకంటివాఁడు, లొట్టకన్ను జెట్ట, లొట్ట
కాయ, లొట్టవేయు.

**లొట్టకంటివాఁడు.** వి. (√ లొట్ట) క్లిన్నాక్షుఁడు.
గీ. లొట్టకంటివాఁ డనఁ గ్లిన్న దృక్కనె ను
మధవ. ఆం. భా. ౨ ౧౨౦.

**లొట్టకన్నుజెట్ట = లొటకజెట్ట.** వి. (√ లొట్ట)
పక్షివిశేషము. (శ. ర)

**లొట్టకాయ.** వి (లొట్ట + కాయ) మగగుంతి.
(శ ర., గ్రా., శా.)

**లొట్టపోవు.** అ. క్రి. అణఁగు.
(వ్యవ.) వానికి కన్ను లొట్టపోయినది.

**లొట్టవేయు.** అ. క్రి. (√ లొట్ట) రుచ్యములగు
పదార్థములను భుజించునప్పుడు నాలుక నంగిటం
జేర్చి ధ్వనిపుట్టించు (శ. ర.)

**లొట్టి.** వి కల్లుతీసెడు ముంత

మ మొలచుట్టు న్వడదోలు దాన నగు బల్లోమ్ర
కాప యింగీఁతక,త్తులు నూఱుఁ ముసలంబు
వామభుజమందుఁ దానికిర్వంకలఁ, గలు
లొట్టొండెడఁగట్ల నిచ్చిన పిరుంద౦ గొమ్ము
కాల్పఁదముఁ, దల కోరామడిగుడ్డయున్
దనగఁ బ్రాతఃకాలమం దెప్పుడున్
చెన్న ౫. ౨౫౨

సీ కల్లు లొట్టెఁడు ద్రాగి కైపెక్కి తెలియక
వదరినంతనె శాస్త్రవాదిగాఁడు వేము ౯ ౪

జ లొట్టిముచ్చు

**లొట్టిపిట్ట(ట).** వి. (లొట్టియ + పిట్ట) ఒంటె, ఉష్ట్రము

క వినుమిఁక మొద్దును గాడిద, తెనుపోతును
లొట్టిపిట్ట పెక్కిన నన్నం,బును బిండియు
నువ్వులు గలఁ దినఁ గవనగుఁ గీడు వసుమతీ
వరతిలకా ద్వా. ౯ ౪౪.

**లొట్టిముచ్చు.** వి (√లొట్టి) త్రాగుఁబోతు (శ ర, బ్రా)

**లొట్టియ = లొట్టె.** వి ఒంటె

ఆ బలిమిఁగొనిన ధనము పదివేల లొట్టియల్,
పెతికి రాఁగ నైరభీకరుండు, వచ్చి నకులుఁ
డధికవాహినీపదవాతిఁ, దల్లడిల్లుచుండ ధరణి
తలము భార సభా ౧ ౨౬౪

చ మతిమతి యాముకోనుఁగుల మావుల లొట్టి
యలం గడిందిగా, నుఱుమొనరించి హెచ్చ
రిక నూల్కొనఁ దేరులు ఓండిపేయుచుఁ
అచ్చ రా. యు ౧౩౧.

సీ. . లొట్టియ వాఁగను లొట్టె వాఁగ
కన్పట్టు నుష్ట్రము... ఆం భా. ౨.౨౬౫.

జ: లొట్టిపిట్ట

**లొట్టె = లొట్టియ.**

జ లొట్టెనుఁగు

**లొట్టెనుఁగు.** వి. (లొట్టె + ఏనుఁగు) ఒంటె.

సీ. అర్థించినది రేమి యనిన నా లొట్టెనుఁ
గొప్ప నాపెండ శతరాజనప్రమాణం
బగుట కోర్కి వాణిశ నావుడు
భార శాం. ౩. ౭౩.

క లొట్టెనుఁగంతపొడవున, దట్టముగా నెలుగు
పెట్టఁ దగు నూరులకుం, జొట్టును దిరుగఁగఁ
తేలకు, నట్టిపాలము మేపెసేని నగు బంటె
గొనన్ విజ్ఞా ౨ ౫.

సీ అలరును లొట్టెనుఁ గన మహోష్ట్రాభిధ .
ఆం భా ౨. ౨౬౫.

**లొడపెట్టు.** స క్రి ద్రవద్రవ్యమును చేతఁ గల పెట్టు. (శ ర., బ్రా.)

**లొడలొడ.** వి ౧ కాఱుటయందగు ధ్వని కనుకరణము. (శ. ర , బ్రా)

(వ్యవ) కత్తి తాఁకి నెత్తురు లొడలొడ కాఱు చున్నది.

౨ వదరుట మున్నగువానియందగు ధ్వని కనుకరణము.

(వ్యవ ) వాఁడు లొడలొడ మాటాడు చున్నాఁడు.

విశ వదులు, బిగువుకానిది (శ ర , బ్రా )

**లొడితె.** వి లొడితిలి, ప్రాదేశము

గీ వాసిదయ్యము నీవె ఐదుర్యోనిద్రైన, తలలుఁ
జేతులుఁ గన్ను లజ్జులును గలిగి, యలర
లొడితెఁడు మగవాఁడ వగుచు నేల, రొల్ల
నాఁగుదువని మిన్కు తెన్నుఁగదవె
అచ్చ రా. యు ౧౫౯.

సీ లొడిత యంచనఁగను లొడితిలి యంచన
జొట్టి యంచనఁగను జాత్త యనఁగఁ బ్రాదేశ
నాముశైు పరగు ... ఆం. భా. ౨. ౧౪౦.

**లొడితిలి.** వి. లొడిత, పరిమాణవిశేషము.

**లొడుగు.** వి. అడుమెడను కట్టెడు ఘంటా విశేషము. (శ. ర.) విశ. దీనము. (బ్రా.)

**లొడ్డ.** వి. రొడ్డ. (శ. ర.)

లొడ్డు. విణ. ఒడ్డు. (శ. ర)

లొత్త=లొట్ట. వి. సుషిరము, రంధ్రము.

సీ. లొట్ట లొటారము లొత్తయంచనఁగను
తోఁథిల్లుమండును సుషిరసంజ్ఞ
ఆం. భా ౧ ౧౪౬.

(పల్లము శ. ర.)

లొద్ద. వి. ప్రోవు రాశి.

ద్వి. అమృతంపు ముద్ద తియ్యంబుల లొద్ద, విర
హుల బలుమంట విబుధుల పంట
నవ ౨ ౧౧౩ పా ౧. పం

సీ. గుబురు గుమురు గుంపు గుమి గమి పిండు
మొత్తము తెట్టె పైకము దాఁటె లొద్ద,
కుటుము మొల్లము మొల్లమి కుట్టె వర్గ
వనఁగ వర్గము తగు ఆం. భా. ౨ ౧౦౦

లొద్ది. వి. లోయ.

గీ లోయ యన లొద్ది యనఁగఁ బొల్పొందు
చుండు, నచలమధ్యధరాఖ్య
ఆం భా ౨ ౩౧.

లొద్దుగు. వి (సం లోధ్రః) గాలవము, ఒక
జాతి చెట్టు. (దీనిభేదములు ఎఱ్ఱలొద్దుగు తెల్ల
లొద్దుగు )

సీ. గోఁగులు రేఁగులు క్రోవులు మోవులు
ముష్టులు నిమ్మలు లొద్దుగులును
అచ్చ రా. సుం ౨౫

సీ. కడపకొడిశ పాలకొడి తెల్లలొద్దుగు చిరి
చేఁకు లొద్దుగు జిడిపాల. హంస ౪ ౧౧

లొఖ్బెస. వి. లలంతికావిశేషము, హారవిశేషము
(శ. ర.)

లొల్ల. వి. దున్నినచేల మిట్టపల్లములు లేకుండఁగ
సరిచునట్టి బల్ల, (శ. ర., బ్రా.)

జ: లొల్లకాఁడు.

లొల్లకాఁ(గా)డు. విణ. (√లొల్ల) దరిద్రుఁడు.

సీ. చల్లఁగాఁ జేతికాసెల్ల దుల్లి లొల్లకాడవై
యుఁకనైన నీకాఁపురంబు, బ్రదుకు పని
విచారింప కీపనికిఁ జొరఁగఁబడిన వానికి
సెక్కుడి భారబుద్ధి నిరం. ౨. ౧౨౫.

గీ. తండ్రి గడియించినట్టి విత్తంబు వోవ,
లొల్లఁగాడయ్యె నవ్విప్రవల్లభుండు.
శుక. ౪. ౧౧౧

లొల్లి. విణ. రణము, ఘనము.

క లొల్లియగు వగల త్రొక్కున, నిల్లుగ్గలు
గానవచ్చు హృదయములోనఁజ, మల్లాడుడి
యగు మదనుఁడు, మెల్లనఁ గూర్చుండెఁ
డాల్మి మినుమిను కనఁగఁ.

ఈ హరి. ౫ ౧౬౬. (శ. ర. వీరేశ. పా.
వెల్లియగు వావిళ్ల పా )

లో

లో¹=లోపల. ప్ర ద్రు షష్ఠీవిభక్తిప్రత్యయము.

౧ నిర్ధారణార్థకము

క. వారిలో విప్రశుతకీర్తి వహించెఁ దుర్వ
సుఁడు గుణనిధియై ఆము ౧ ౨౨

చ దీనిఁ దాల్చి యిప్పడతులలోఁ గనం
గొను మహారమహామహిమాను భావముల్.
పారి ౧. ౬౧.

౨. అధికరణార్థకము

చ. అడిగినయంతలోన సరసాన్నములన్ సమ
కూర్చు పారి. ౧. ౬౧

సీ. ధ్రువ వసిష్ఠారుంధతులుఁ దనుచ్ఛాయయుఁ
గానవిరాఁ డేఁటిలోనఁ గడచు.
జై. భా. ౮. ౯౮

౩. అపాదానార్థకము.

చ. మాతిలో, తెలువడఁ గోమలిం దిగిచె
విశ్రుతకీర్తి యయాతి
భార. ఆది. ౩. ౧౪౪.

లో². వి. లోను, లోపల శబ్దములయొక్క లుప్త
రూపము. (అంతఃకరణము.)

ఉ.. అపు లెమ్మని యయారడిలెఁ మదంత లో,
గుందుట మాకు జాంబవతి గోప మడంచెను
మిత్రవిందయున్. పారి. ౧. ౬౮

చ... ఏఁగ లో, నొగులుచు నొక్కజక్కవ
యుసుంతు నునన్ . . వసు. ౪ ౯.
(అంతర్భాగము.)
మ. దలప్రై లో తెలిఁ దాచె యున్కిఁ దెలిచె
స్వారాయణుండు ... ఆము. ౩ ౧౧.
క. కరయుఁ బాటిత్రై లో,హారసములోఁ
గాలునట్టు లంగజ కోకోద్ధరకిఖ రతి తను
విమ్మగఁ, గరఁగియుఁ బొడమెంత లోనఁ
గాలుచుమండెన్. కు. సం. ౫. ౫౭౮

లోతి = లోనికి.
గీ. దీనిఁ దగిలించుకొనువెఁ దియ్యవిలుకు,
దురము లోకి చేరం ముద్దుగ నటంచుఁ,
దలఁచునంతటిలో జాణతనములాడి, లోఁ
బిలిచి వానిఁ దోడ్తెచ్చి లోలనయన
హంస. ౪. ౪౭

**లోఁతు.** వి. లోపలిప్రదేశము.
క. . . బ్రమాయులకుఁ జేరి రేఁటుల, లోఁతులకుం
జనిరి దీవిలోపలఁ గలయన్.
దశకు. ౧౦ ౬౫

**లోఁకువ.** విశే ౧. అధీనము, వశము
ఆ. చెట్టబట్టుదమకేఁ జేలోఁకువై యుండు,
రంతఁ దాఁడుగట్టు నగడుగంద్రు.
వేమ. ౨. ౩౬౪.
౨. తక్కువ. (శ. ర.)

**లోఁగడ.** వి. (లోను + కడ.) ౧. అంతరాళము,
దేశములయు కాలములయు నడిమిభాగము.
క. చెవనిలిగియుడలిఁ బడి యొడ,సెడ గట్టుల
కుదలఁగోటి యిడి లోఁగడమున్, దడుకు
వొడిపించి రాకుల,గుడిసెల వసియించె
మంత్రి గురుభటయుతుఁడై. ఆము. ౩. ౧౪.
౨. గతకాలము (శ. ర., బ్రౌ, వా.)

**లోఁగన్ను.** వి. దే. (లోను + కన్ను) అంత
ర్దృష్టి, జ్ఞాననేత్రము.
ఉ. . . మొక్కలంటి లోఁగంటం గనుంగొనుచు
నిర్మలధ్యాననిరోగానుసంధానంబున వరాధు
ర్యంబు ఘటించెను ... శాకు. ౨. ౪౪.

**లోఁగలి = లోఁగిలి.** వి దే. (లోను + కలను)
౧. గృహము. (శ. ర.) ౨. గృహాంతర్భాగము.
చ. సటవిటకాంద్రపాలిటను జారులచెంతను
చేశ్య లిండ్ల లోఁ,గటను మిటారి లోత్తుల
తెగన్ నసూయులు విడుపట్టులన్, బటు
నగు జాదగాంద్రకడఁ బ్రబ్లదకాంద్రెడ
గండుమీఱి వి,స్ఫుటముగఁ జేసి కాకు లవి
పోకడపెట్టుకొనెన్ మదంబునన్.
ఫల్గా. ౩. (శ. ర.)

**లోఁగించు.** స. క్రి. (√లోఁగు) లోఁగఁజేయు,
లోఁగఁజేయు
ద్వి. దీకొని హరి వానిఁ దిటగించిస్రుఁచి, హైకొని
జఠరంబుఁ బట్టి లోఁగించి
అ. ను. ౪ ౩ ౧౫౧ పా. ౨౭ పం.

**లోఁగియాడు.** అ. క్రి. (లోఁగి + ఆడు స్వార్థ
మున అడు.) లోఁగు
చ. మగఁ దపరాధిదై కుచము మక్కవనంటు
గటాక్షమాలికల్, చిగురుకొనంగఁ జూచె
నటు చిట్టునఁ గోపముతోడఁ బ్రోడ
యుం,గ్రుగ నగలొందు పొలయిన ముచ్చట
నల్కయు నంత వింతగా, మగువయుఁ
బ్రీతిఁ బూచె నవమన్మథకేళి లోఁగి
యాడుచున్. గంధ. ౧. ౧౬౦.

**లోఁగిలి = లోఁగలి.** వి. దే. (√లోను.)
౧. గృహము, ఇల్లు.
సీ. అంతఁ బోవక యవియా గోపముఖ్యులోఁగిటి
లోని కుటిక యుక్లేశలీల
హరి. పూ. ౬. ౧౩౭.
ఉ. కాఁగిటి కాసచేసి కొడికారితనంబున
విన్నుఁ దేర్చి రా, రాఁగొలగానివాఁడవయి
రాకులలో నగుఁబాటు చేసి నీ,కేఁగలుగంగ
సంపదల కేల విచారము పద్మగంధి నీ,
లోఁగిటఁ జేర్పనే యుభయలోకసుఖంబులు
నన్నుఁ గొంటవే. ఉ. హరి. ౧. ౬౪.

పుచ్చులు, లోకములో గాచె నిల్లుఁలోబడె జనములే. శరాహ. ౧౦. ౩౦.

**లోఁబఱచు.** స. క్రి. (√లోఁబడు) వశముఁ జేయు

వ. . . అమృతాకరవైరుల లోఁబఱచి యుంచుము. . ౬ రా. ౨. ౬౧.

**లోకంపృణము.** సం. విశే. (అ.ఆ.అ) లోకమును నిండించునది, లోకమంతటను వ్యాపించునది.

**లోకకంటకుఁడు.** సం. వి. అ పుం. లోకమునకు బాధ కలిగించువాఁడు, దుర్మార్గుఁడు.

**లోకకథ.** సం వి. ఆ స్త్రీ. సర్వసాధారణమైన పురాణకథ, నీతికథ, జనులందఱు నెఱిఁగిన పురాణగాథ

**లోకకర్త.** సం. వి. ఋ. పుం. లోకమును సృజించువాఁడు, భగవంతుఁడు

**లోకకల్పము.** సం విశే. (అ ఆ. అ.) ౧ కొంచెము తక్కువగా ప్రపంచమువలె నున్నది. ౨. లోకముచే గారవింపఁబడినది. వి. అ. పుం. ప్రపంచము నిలిచియుండు కాలవిశేషము.

**లోకకాంతుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) లోకమున కిష్టుఁడైనవాఁడు, సర్వజనసమ్మతుఁడు. వి. ఆ. స్త్రీ. ఓషధివిశేషము. (శా. వి.)

**లోకగతి.** సం. వి. ఇ. స్త్రీ. జనుల నడవడి, లోకుల ప్రవర్తనము.

**లోకగాథ.** సం. వి. ఆ స్త్రీ. జనులందఱు పాడెడి పాట.

**లోకచక్షువు(స్సు).** సం. వి. స్. న. జగముకన్ను, సూర్యుఁడు.

**లోకచారిత్రము.** సం. వి. అ. న. ప్రపంచపు నడవడి.

**లోకజనని.** సం. వి. ఈ. స్త్రీ. లక్ష్మి.

**లోకజిత్తు.** సం. వి. త్. పుం. ౧. బుద్ధుఁడు. ౨. లోకమును జయించిన పురుషుఁడు. ౩. సన్న్యాసి.

**లోకజ్ఞుఁడు.** సం. విశే. (అ. ఆ. అ.) లోకస్వభావ మెఱిఁగినవాఁడు, లోకజ్ఞానము గలవాఁడు.

**లోకడుపు.** వి (లోపల + కడుపు) కడుపు లోపలిభాగము.

క. లోకంబుల సృజియింపను, బాకలితము గాఁగఁ ద్రోచి యన్నియు విడవన్, లోకడుపున నడఁగింప మ,హాకర్మఠుఁ డితఁ డచింతితాత్ముఁడు మహిమన్.

హరి. ౬ ౫. ౨౨౩.

**లోకతంత్రము.** సం. వి అ. న. ప్రపంచపద్ధతి.

**లోకతత్త్వము.** సం వి. అ. న. ప్రపంచనిజస్థితి, ప్రపంచజ్ఞానము.

**లోకతుషారము.** సం వి అ పుం కర్పూరము.

**లోకత్రయము.** సం వి. అ. న. ముల్లోకములు, స్వర్గ మర్త్య పాతాళ లోకములు.

**లోకత్రయి=లోకత్రయము.** సం. వి. ఈ. స్త్రీ.

**లోకద్వారము.** సం. వి. అ. న. స్వర్గద్వారము, స్వర్గలోకపు వాకిలి.

**లోకనము.** సం. వి. అ. న. చూచుట.

**లోకనాథుఁడు.** సం వి. అ. పుం. ౧. బ్రహ్మ. ౨. విష్ణువు. ౩. శివుఁడు. ౪. రాజు, చక్రవర్తి. ౫. బుద్ధుఁడు ౬. వేలుపు, దేవత. ౭. సూర్యుఁడు.

**లోకపథము=లోకపద్ధతి.** సం. వి. అ. పుం.

**లోకపద్ధతి.** సం. వి. ఇ. స్త్రీ. లోకమార్గము, పదుగురు నాచరించు రీతి

**లోకపాలుఁడు.** సం. వి. అ. పుం. ౧. లోకము నందలి దిక్కుల నేలు దిక్పాలుఁడు. ౨. చక్రవర్తి, సార్వభౌముఁడు.

**లోకపితామహుఁడు.** సం. వి. అ. పుం. బ్రహ్మ.

**లోకప్రకాశనుఁడు.** సం. వి. అ. పుం. సూర్యుఁడు.

**లోకప్రవాదము.** సం. వి. అ. పుం. జనశ్రుతి, కింవదంతి, అందఱును చెప్పుకొనెడి మాట.

**లోకప్రసిద్ధము.** సం విణ. (అ. ఆ అ.) అందఱికిని తెలిసినది, లోకమునఁ బ్రసిద్ధికెక్కినది

**లోకబంధువు.** సం వి ఉ. పుం లోకబాంధవుఁడు

**లోకబాంధవుఁడు.** సం. వి అ. పుం. ౧. సూర్యుఁడు ౨. శివుఁడు. ౩. విష్ణువు.

**లోకబాహ్యుఁడు.** సం విణ (అ. ఆ. అ.) ౧ వెలివేయఁబడినవాఁడు, జాతినుండి బహిష్కరింపఁబడినవాఁడు ౨ లోకముతో భేదించినవాఁడు, లోకవిరుద్ధుఁడు

**లోకభావనుఁడు.** సం విణ (అ ఆ అ) లోకక్షేమమును దలంచువాఁడు, లోకక్షేమమును వృద్ధిపొందించువాఁడు

**లోకమర్యాద.** సం వి అ స్త్రీ. లోకాచారము, వాడుక.

**లోకమాత.** సం. వి ఋ స్త్రీ లక్ష్మి.

**లోకము.** సం వి అ పుం ౧ స్వర్గాదిభువనము. (స్వర్గము, మర్త్యము, పాతాళము) (ఊర్ధ్వలోకము లేడు: భూలోకము, భువర్లోకము, సువర్లోకము, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము. అథోలోకము లేడు: అతలము, వితలము, సుతలము, రసాతలము, తలాతలము, మహాతలము, పాతాళము.) ౨. భూలోకము. ౩. జనము. ౪. ప్రజ, పాలితవర్గము. ౫. సమూహము ౬. రాష్ట్రము, భూభాగము (ఉదా: ఆంధ్రలోకము.) ౭. లోకవ్యవహారము. (వ్యతి.) వైదికవ్యవహారము. ౮. సామాన్యమానవజీవితము. ౯. సప్తసంఖ్య, ఏడు.

**లోకములకన్ను.** మి. వి (లోకముల + కన్ను) జగచ్చక్షువు, సూర్యుఁడు.

సీ. కవులమంగొంగు వాన్ను లోకములకన్ను, పచ్చగుజ్జులనుఖ్ జేడు పగటిఱేఁడు.

ఇందు. ౪. ౩౧.

**లోకయాత్ర.** సం. వి. అ. స్త్రీ. ౧. లోకవ్యవహారము, ప్రపంచ జీవనమార్గము. ౨. సర్వజనసామాన్యపద్ధతి, పదుగురు నడచుకొను రీతి. ౩. లోకస్థితి, జీవయాత్ర ౪. జీవిక, జీవసాధారము, బ్రతుకుతెరువు.

**లోకరంజనము.** సం వి అ న ప్రపంచకమును సంతోషపఱుచుట,ఎల్లవారిని సంతోషపెట్టుట.

**లోకలేఖము.** సం వి అ. పుం సర్వజనవిదితమైన వ్యావహారికపత్రము.

**లోకవాదము = లోకప్రవాదము.** సం వి. అ పుం కింవదంతి.

**లోకవార్త.** సం వి అ స్త్రీ. జనప్రవాదము, కింవదంతి

**లోకవిద్విష్టుఁడు.** సం విణ. (అ. ఆ అ.) లోకముచే ద్వేషింపఁబడినవాఁడు, జనులసహ్యించుకొనువాఁడు

**లోకవిశ్రుతి.** సం. వి ఇ స్త్రీ. ౧. ప్రపంచకమంతటను వ్యాపించినకీర్తి. ౨. నిరాధారమగు వార్త, కల్లవార్త, అసత్యప్రవాదము.

**లోకవృత్తము.** సం. వి. అ. న. ౧. లోకమునఁ బదుగురు నడచుకొను రీతి, లోకాచారము. ౨. పనికేనిమాటలు, వ్యర్థసంభాషణము.

**లోకవ్యవహారము.** సం. వి. అ. పుం. ౧. ప్రపంచపద్ధతి, లోకాచారము. ౨. ప్రపంచపుకార్యపద్ధతి. విణ. (అ. ఆ. అ.) వాడుకలో నున్నది. సర్వజనోపయోగమువం దున్నది.

**లోకశ్రుతి.** సం. వి. ఇ. స్త్రీ. ౧ జనశ్రుతి, కింవదంతి. ౨. ప్రపంచమంతట నిండిన కీర్తి.

**లోకసంగ్రహము.** సం. వి అ. పుం. ౧. లోకములకు హితము ౨. లోకక్షేమము. ౩. లోకానుభవము ౪. ప్రజలనందఱను బ్రసన్నులను గావించుకొనుట.

**లోకసంస్కృతి.** సం. వి. ఇ. స్త్రీ. విధి, భవితవ్యత. (అ. ని.)

**లోకసాక్షి.** సం. వి. ఇ. పుం. ౧. బ్రహ్మ. ౨. అగ్ని. ౩. సూర్యుఁడు.

**లోకసాక్షికము.** సం. విశే. (అ.అ.అ.) లోకము సాక్షిగాఁ గలది, ఎల్లవారు ననుమతించినది

**లోకసిద్ధము.** సం. విశే. (అ. అ. అ) ౧ జనుల వాడుకలో నున్నది, మామూలుగా నున్నది. ౨. అందఱిచేత నంగీకరింపఁబడినది

**లోకహితము.** సం విశే. (అ. అ. అ) ౧ జనోపకారకమైనది, అందఱకును మేలు కలిగించునది. వి. అ. న. సర్వజనక్షేమము

**లోకాంతరము.** సం. వి. అ న అన్యలోకము, భవిష్యజ్జన్మము.

**లోకాచారము.** సం. వి. అ. పుం. లోకము నందలివాడుక, పదుగురు చేయుపని, ప్రపంచ పద్ధతి.

**లోకాతిగము.** సం. విశే. అ అ అ) ప్రపంచమును మించినది, అసాధారణమైనది

**లోకాత్మ.** సం. వి. న. పుం సమష్టిజీవుఁడు. కూటస్థుఁడు.

**లోకాధికము.** సం. విశే. (అ అ. అ.) ప్రపంచమునకంటె నధికమైనది, అసాధారణమైనది

**లోకానురాగము.** సం. వి అ పుం ౧ మానవకోటియందు గల సమానప్రేమ, సర్వజనహితాభిలాషము. ౨. సర్వజనులయొక్క ప్రేమ

**లోకాపవాదము.** సం వి అ పుం లోకనింద, పదుగురు నిందించుట.

**లోకాభిభావి.** సం. విశే. న (వి న.) ౧. లోకమును మించువాఁడు ౨. లోకమంతయు వ్యాపించునది. (తెలుఁగు తెలి॥)

**లోకాభ్యుదయము.** సం. వి. అ. పుం. ప్రపంచక్షేమము.

**లోకాయతము.** సం. వి. అ. న. అనాత్మవాదము, నాస్తికమతము, చార్వాకమతము.

**లోకాయతికుఁడు.** సం. వి. అ. పుం. చార్వాకమతస్థుఁడు, నాస్తికుఁడు, అనాత్మవాది.

**లోకాయతుఁడు.** సం. విశే. (అ. అ. అ) నాస్తికవాదము చేయువాఁడు, ఆత్మ లేదనువాఁడు. వి. అ. పుం నాస్తికుఁడు.

**లోకాలోకము.** సం. వి. అ. పుం. (ఒకపార్శ్వమున సూర్యకిరణసంపర్కము గలదియు ఒక పార్శ్వమున సూర్యకిరణస్పర్శము లేనిదియు నగు పర్వతము) చక్రవాళపర్వతము.

**లోకేశము.** సం వి అ పుం. పాదరసము.

**లోకేశుఁడు.** సం. వి. అ. పుం. ౧. బ్రహ్మ. ౨ ప్రపంచాధిపతి, రాజు.

**లోకోత్తరుఁడు.** సం. విశే. (అ. అ. అ.) ప్రపంచమును మించినవాఁడు, అసాధారణుఁడు. వి అ పుం రాజు.

**లోకైషణ.** సం వి ఆ స్త్రీ స్వర్గాభిలాష, స్వర్గకామము

**లోకోక్తి.** సం. వి. ఇ. స్త్రీ. ౧ సామెత. ౨. సామాన్యవచనము, పదుగురాడుమాట.

**లోక్యము.** సం విశే (అ అ అ.) ౧. లోకమున వ్యాపించినది. ౨. ఆచారప్రాప్తమైనది, మామూలైనది ౩ సరియైనది, యథార్థము, ఉత్తమలోకమును సంపాదించుట కనుకూలమైనది ౪ స్వర్గసంబంధమైనది ౫. స్వాతంత్ర్యమున కవకాశము నిచ్చునది

**లోగము.** సం వి అ పుం మంటిగడ్డ, మంటిబెడ్డ.

**లోగుట్టు.** వి (లోను + గుట్టు) గుప్తమంత్రము, రహస్యమైన యాలోచనము.

ఉ. బలము తెనుఁగ దైవబలమును గలిగి లోగుట్టు చేటులేనియట్టి నృపతులవ మత్సరంబు వలదు భార అశ్వ. ౧. ౩౧.

**లోగృహము.** మి. వి (లోపలి + గృహము) లోపలియిల్లు, అంతర్గృహము.

**లోకనము.** సం. వి. అ. పుం. చెలరేఁగుట, పొర్లుట, పొర్లుట.

**లోకనము.** సం. వి. అ. వి. క్షోభపడుట, సంభ వించుట.

**లోడి = లోడీ.** వి. (సం. లగుడః) మల్లవిద్యా సాధనము.

చ. కరికలభంబు కొమ్మ పుడు నైకొని బిట్టునఁ ద్రిప్పు లోడి నై,ఖరి గిరిరొత్తు సంగడము నైబడి నవ్వులయాద్రిఁ బట్టు గోఁ,టరహీని మత్తభద్గిని బడల్చి రజంబుగఁ గొట్టు
రా. వి. ౨. ౨౪.

సీ. సంగడాల్ బూన బుజాలపురాయింపు బరి లోడి ద్రిప్ప కేల్ బరుల యుబ్బు.
ప్రబంధ. ౭౨

మ. సమీరమల్లుఁ డనుపొంద న్నావిపూ లోడిఁ ద్రి,ప్ప మెయిఁ గోకిలకాలుఁ డెందికొను సొంపుల్ గుల్కు నాదంబులన్.
శకాం. ౨. ౧౧౪.

సీ. మనుమ కెట్టి యనంగ మల్లాభిధానంబు తత్సాధనంబులై తగు గంబము కొణక కట్టిక లోడి సంగడము కాల. గీ. సంగడము నీల గోకా మనంగ. ఆం. భా ౨ ౨౦౩.

**లోడీ¹.** వి. వస్త్రవిశేషము.

రగడ. పట్టంబట్టు లోడీలు పటావలా దుకూలాలు, కబ్బాయికలుడాలు గల్లు జరబాబీలు.
హంస. ౫. ౩౪౬.

**లోడీ² = లోడి.** వి. మల్లవిద్యాసాధనము (శ. ర)

**లోడు.** వి. (క. లోడు.) ఉపధానము, ఒఱగు దిండు. (శ. ర.)

**లోణారము.** సం. వి. అ. పుం. లవణభేదము, ఒక విధమైన ఉప్పు; ఉప్పుమంచి పుట్టెడి యొక విధమగు క్షారము. (శా. వి.)

**లోతక్కువ.** విణ. (లోపల + తక్కువ) శేషము, మిగిలినది. (శ. ర.)

**లోతమి.** వి. (లోపల + తమి) లోపలితమి, అంత రంగిక కుతూహలము.

(శాకుంతలము) వ... జాహ్నవి నిర్వృతించి గౌతమి లోతమి యుడంచి పారవంబు గౌర వంబుజేచి యన్యపరిన్నవహంబు నపహ రించి . . శ్రీరం. ౧. ౧౩౨.

**లోతము.** సం వి అ. పుం. ౧. కన్నీరు, బాష్పము. ౨. గుఱుతు, ఆనవాలు, చిహ్నము.

న. ౧ కొల్లగొట్టిన సొమ్ము, దోఁచుకొన్న సొమ్ము. ౨ ఉప్పు

**లోత్రము.** సం. వి. అ. న. ౧. కొల్లగొట్టిన సొమ్ము, దోఁచుకొన్న ధనము. ౨ కన్నీరు.

**లోదొడ.** వి. (లోపల + తొడ) తొడయు లోపలి భాగము.

చ గిలికొను గాలి వల్వ కొరఁగింపఁగ కెలుపుటించి లోదొడల్, నెతికమువోలెఁ గంపుగమి నిద్దపుఁ గ్రొమ్ముల్మలనూలి డాల్ గనెఁ. అచ్చ భా. ౩. ౩౪. ౬.

**లోధము.** సం. = లోధ్రము.

**లోధ్రము.** సం. వి. అ. పుం ఎఱ్ఱనిపువ్వులుగాని తెల్లని పువ్వులుగాని గల యొకజాతి వృక్షము, లొద్దుగచెట్టు

**లోనిచూపు.** వి (లోను + చూపు) అంతర్దృష్టి

క. హృన్మణి మాత్రాకృతియగు, చిన్మూర్తి బురాణపురుషు శేషావాసుం, గన్మొగిచి లోనిచూపున, సన్మౌన్యుఁ డతండు చూచు సమయమునందున్. పాండు ౪. ౪౬.

**లోనిచ్చు.** అ క్రి (లోను + ఇచ్చు) గుట్టుచెప్పు.

సీ. రిపులకు లోనిచ్చు నపరాధియైయుండ్యఁ వీఁడని యమాత్యుల తప్పు లరసి యుండదు. గీ. భువన మరుదంద నాకకొల్పుఁ దపుడు.
కకా. ౭. ౨౦౦.

**లోను.** వి. దే. అవ్య. ౧. లోపల, అంతర్భా గము, మధ్యము.

లోపనము. సం. వి. అ. న. ౧. అతిక్రమించుటా ఉల్లంఘించుట ౨. లోపింపఁజేయుట, తొలఁగించుట.

లోపము. సం. వి. అ. పుం. ౧. అపహరణము, కొల్లగొట్టుట ౨. నాశము. ౩. భేదనము, తెగఁగొట్టుట ౪. రద్దుపఱుచుట, తొలఁగించుట. ౫. అతిక్రమించుట, మీఱుట ౬. అభావము. ౭. పరిత్యాగము, విడిచిపెట్టుట. ౮. (వ్యాక) ప్రసక్తమయిన వర్ణముగాని పదముగాని కనఁబడకుండుట. (అదర్శనంలోపః) ౯. కలవరపాటు.

లోపల. వి. దే. ౧. అంతర్భాగము.

సీ. వెలుపలను లోపలను నుండుఁ దలిరుఁబోఁడి. కాశీ. ౧. ౧౧౬

మ. . వియద్గంగాప్రవాహంబు లోపలికిం బోయిమరిష్యమాణుఁ డగుచుం బ్రాయోప వేశంబునన్. భాగ. ౧. ౪౯౮

మ. బలిదైత్యేయ భయాంగ కారధరిత బ్రహ్మాండ గేహంబు లోపలఁ దైవుండెడు తత్ప్రతాప మయదీప జ్వాల డిందన్. ఆము. ౪ ౨౪.

౨. అంతఃపురము, అవరోధము

సీ. బయలు దేరిన సుతుఁడు లోపలనుసతియుఁ, గాని యన్యులు లేక ఖేచరపతికి దశా. ౨ ౫౧

౩. మనస్సు, అంతఃకరణము

క. వారియుప్రరుఁ దమలోపల, కేరముగాని .. ఆము. ౩. ౧౫.

ప్రయ. అవ ౧. నిర్ధారణషష్ఠియందు బహువచన ప్రత్యయము

ఉ. పూజనీయులైన పురుషులలోపల, నెవ్వఁ డత్యూగ్ర కృష్ణుఁడు. భార. సభా. ౨. ౧౧.

చ....కర్మసంజనితవిశేషతం గలుగు ఛాయల లోపల నెద్ది యవ్యయం, గనుటకు నర్హము... భార. శాం. ౫. ౪౦౬.

౪. అధికరణార్థకము, అందు.

క. చని పట్టి పాలపట్టికఁ, గనుపట్టెడు కనక పత్త్రి) కావలిఖిత నూతనవిరుదాక్షరములు పేర్కొని లోలోపలను చదువుకొని విభవముగన్. వై. భా. ౪. ౬.

లోలోపలన్ = మనస్సునందు.)

అంతలోపలన్ = ఆసమయములోన.

ఉ వారయని మోహినీమహిళ యద్భుతరోష కషాయితాక్షిరై, వా యను నంతలోపల సహస్ర సహస్ర సహస్ర దీధితి,చ్ఛాయ సహస్రధారమగు చక్రము ప్రాలెఁ గరాంబుజంబునన్. దశా. ౨. ౩౬౭,

జ: లోకడుపు, లోచూపు, లోజతనము. లోతక్కువ, లోతమి, లోదొడ, లోపగతుఁడు, లోపాద, లోవిత్తరి, లోకొన, లోవాఁడి

లోపాకము. సం వి అ. పుం. సృగాలము, గుంటనక్క.

లోపాపకము=లోపాకము. సం.

లోపాముద్ర. సం. వి. అ. స్త్రీ. అగస్త్యముని భార్య, విదర్భరాజు కూఁతురు.

లోపాయకారి. విశే. రహస్యముగా నొకరి పక్షమున నున్నది. (శ. ర.)

లోపాశకము=లోపాశము. సం.

లోపాశము. సం. వి. అ. పుం. గుంటనక్క, సృగాలము.

లోపి. సం. విశే. (పు. స్త్రీ. న) ౧. హానిచేయునది, ౨. లోపముగలది.

లోపించు. సం. అ. క్రి. ౧. [illegible]

శా. లోకశ్రేణి జనించుచున్న. [illegible] లోపించు నాదేవు సుశ్రీ [illegible] హరి [illegible] యాగములుచేసి [illegible] డిమ్ముల్. భాగ. ౯. ౫[illegible]

౨. [illegible] (శ. ర.)

సీ. లోవిలోవి, శిష్టశాశాస్త్రులకును ప్రాశించి...
భాగ. ౧. ౩౬౮.

ద్వి. మాలపన్నారులు రూలోవిలోన, లోకే
యిన్న వి పంపు పోయి తెచ్చెదను.
బస. పు. ౩ ౮_౭౪ పం.

లోవిడి. విశే. పూర్వపుది. మునుపటిది. (బ్రౌ ని)

లోవు = లోఁగు. అ. క్రి. దాసుదివియు

ద్వి. లోవలు వెడలక లోఁగినవాని, లోవెక
చొచ్చి లోలోనఁ గ్రుమ్మిరియును
ద్వి. హరిశ్చ, పూ. ౯_౨౦ పం

లోవై (వయి)నము. విశే. కడచినది (శ ర)

లోష్టకము. సం వి. అ. పుం. మంటిగడ్డ,
మట్టిబెడ్డ పుం, న. ౧ మచ్చె, మణిక ౨
గుర్తుగా నుపయోగపడెడి రాయి కానోకపదా
ర్థము. ౩ ఇనుపత్రుప్పు అయసకిట్టము

లోష్టఘ్నము. సం వి అ. పుం లోష్టభేదనము,

లోష్టభేదనము. సం. వి. అ. పుం., న మంటి
గడ్డలు వలఁగఁ గొట్టెడి సాధనవిశేషము,
సాపటము

లోష్టము. సం. వి అ. పుం., న మంటిగడ్డ
న అయసకిట్టము, ఇనుపత్రుప్పు.

లోష్టువు. సం వి ఉ. పుం లోష్టము మంటిగడ్డ

లోసబురు. వి ఒడ్డునకు దూరమున సముద్ర
యానము చేయుట. (వ్యతి. దరిసబురు)
(చి ని శ ర.)

లోహండి. వి వంటచేయుపాత్రము, స్థాలి, లోవి
క అయస్థిపేటికయు లోహండియుఁ దండు
లంబులుఁ గంబళంబులుం దగిన సంబడం
బును వహించి యెక్కుడుండును దరువు
లోడునం దెక్కుడేంబులు గడచి ...
కాశీ. ౫. ౬౨.

సీ. పెల్లులోహండి కావళ్లకొమ్ములబ్రేలు గిద్దె
కొలతము కొలిచ్చెదగలుసు. అను ౨. ౯౪.

సీ. రాగిలోహండివర్ర బ్రాయికుండంగ కండి
బింధిక యుత్తర్వంటకంబు. కాశీ. ౩. ౧_౨౧.

లోహకంటకము. సం. వి. అ. పుం. వృక్షవిశే
షము, ముంగచెట్టు. పుం. న. ఇనుపముల్లు, ఇను
ముతోఁజేసిన ముల్లువంటి సన్నని వాఁడిగల
వస్తువు.

లోహకాంతము. సం. వి. అ. పుం. సూదంటు
రాయి.

లోహకారుఁడు. సం వి. అ పుం. కమ్మరి =
ఇనుపపనిచేయువాఁడు.

లోహకిట్టము. సం. వి అ న ఇనుపత్రుప్పు.

లోహఘాతకుఁడు. సం వి అ. పుం. కమ్మరి

లోహచూర్ణము. సం వి అ పుం. ౧ ఇనుప
రాపొడి ౨ లోహకిట్టము, ఇనుపత్రుప్పు
(రా. ని)

లోహజము. సం. వి అ న ౧. కంచు. ౨.
లోహకిట్టము

లోహజాలము. సం వి. అ. న. ఇనుపచొక్కము,
కవచము.

లోహజిత్తు. సం. వి. త్ పుం. వజ్రము, రత్న
భేదము

లోహటము. వి (లోను + హటము) మనస్సు
నందలి పట్టుదల

సీ. లోహటంబులుమాని లులిఁగన్నఁ బడకున్నఁ
బరదార మని పోవుఁ బలక యిచ్చి
ఉ. హరి. ౩. ౧_౨౦.

లోహద్రావి. సం. వి. న్. పుం. వెలిగారము.

లోహపృష్ఠము. సం. వి. అ. పుం కంకము,
రాపులుఁగు.

లోహప్రతిమ. సం. వి. అ. స్త్రీ. ౧. పట్టెడ,
కంసాలిదాగలి. ౨. ఇనుపవిగ్రహము.

లోహబద్ధము. సం. విశే. (అ. అ. అ.) ఇను
ముతో నతుకఁబడినది.

లోహమారకము. సం. విశే. (అ. రికా. అ.)
లోహమును భస్మముగాఁ జేయునది.
వి. అ. పుం. ఒకజాతి పూరాకుచెట్టు.

లోహము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఎఱ్ఱనిది. ౨. రాగిది, రాగితోఁ జేయఁబడినది ౩. ఇనుపది, ఇనుముతోఁ జేయఁబడినది వి. అ. పుం., న. ౧. తామ్రము, రాగి ౨. ఇనుము ౩. ఉక్కు ౪. బంగారము ౫. లోహసామాన్యము ౬. కొత్తురు ౭. ఆయుధము ౮. చేఁపలను బట్టు గాలము. పుం. ఎఱ్ఱమేఁక. న. ౧. మురాంబరము. ౨. అగురు

లోహరాజకము. సం. వి. అ. న. రజతము, వెండి

లోహాలము. సం. విణ. (అ. ఆ. అ.) ౧. ఇనుముతోఁ జేయఁబడినది, అయోమయము ౨. లోహము నాకర్షించునది, లోహగ్రాహకము ౩. అస్పష్టముగ మాటలాడునది

లోహలింగము. సం. వి. అ. న. రక్తముతో నిండిన కుఱుపు, రక్తపూరితమైన వ్రణము

లోహవరము. సం. వి. అ. న. బంగారము

లోహశ్లేషణము. సం. వి. అ. పుం. వెలిగారము

లోహసంకరము. సం. వి. అ. న. ఇత్తడి మున్నగు మిశ్రలోహము

లోహాభిసారము. సం. వి. అ. పుం. రాజులు యుద్ధయాత్రకుఁబోవునపుడు చేసెడి శస్త్రనీరాజనము

లోహాభిహారము = లోహాభిసారము. సం

లోహిక. సం. వి. ఆ. స్త్రీ. అయస్పాత్రము, ఇనుపమూఁకుడు

లోహితకము. సం. విణ. (అ. తికా. అ.) ఎఱ్ఱనిది వి. అ. పుం. ౧. పద్మరాగము, కెంపు ౨. అంగారకగ్రహము ౩. ఒకజాతివియ్యము. న. ౧. కంచు ౨. ఇత్తడి (రా. ని.) ఇత్తడి భస్మము.

లోహితకల్మాషము. సం. విణ. (అ. ఆ. అ.) ఎఱ్ఱని మచ్చలు గలది.

లోహితగ్రీవుఁడు. సం. వి. అ. పుం. అగ్ని.

లోహితచందనము. సం. వి. అ. న. ౧. కుంకుమపువ్వు ౨. రక్తచందనము

లోహితపుష్పకము. సం. వి. అ. పుం. దాడిమవృక్షము, దానిమ్మచెట్టు

లోహితము. సం. విణ. (అ. తా. హినీ. అ.) ౧. ఎఱ్ఱనిది, ఎఱుపురంగుగలది ౨. రాగిది, రాగితోఁజేయఁబడినది వి. అ. పుం. ౧. ఎఱుపురంగు ౨. అంగారకగ్రహము ౩. సర్పము, పాము ౪. మృగభేదము, ఒకజాతి జింక. ౫. బ్రహ్మపుత్ర యనెడి నది ౬. మత్స్యభేదము, ఒకజాతి చేప ౭. ఒకవిధమైన వియ్యము ౮. కనుఱెప్పలలోఁ బుట్టు రోగభేదము ౯. పద్మరాగము న. ౧. రాగి ౨. కొత్తురు ౩. కుంకుమపువ్వు, ౪. యుద్ధము ౫. రక్తచందనము ౬. ఎఱ్ఱగంధము ౭. హరిచందనము ౮. ఇంద్రధనుస్సుయొక్క యసంపూర్ణాకారము (విల్యమ్సు) ౯. అగరుగంధపుచెక్క ౧౦. మర్ధనము, నూరుట

లోహితమృత్తిక. సం. వి. ఆ. స్త్రీ. ధాతువిశేషము, గైరికము, జేగురుమన్ను

లోహితాంగము. సం. వి. అ. పుం. ౧. కాంపిల్లవృక్షము, ఒకజాతిచెట్టు ౨. అంగారకగ్రహము

లోహితాక్షము. సం. వి. అ. పుం. ౧. ఎఱుపురంగు ౨. ఒకజాతి పాము. ౩. కోకిల న. ౧. చంక. ౨. కుంటి. (విల్యమ్సు)

లోహితాక్షుఁడు. సం. వి. అ. పు. విష్ణువు.

లోహితాననము. సం. వి. అ. పుం. ముంగి, ముంగిస (రా. ని.)

లోహితాయసము. సం. వి. స. న. తామ్రము, రాగి

లోహితాశ్వుఁడు. సం. వి. అ. పుం. అగ్నిదేవుఁడు.

లోహితిమ. సం. వి. న. పుం. ఎఱుపురంగు, రక్తిమ.

**లోహితుఁడు.** సం. వి. అ. పుం. అంగారకుఁడు. (శ. ర) ఇక్ష్వాకు లోహితాంగుఁడు.

**లోహితోదము.** సం. విశే. (అ. ఆ. అ) ఎఱ్ఱని నీరు గలది.

**లోహిత్యము.** సం వి అ పుం. ఒకవిధమగు బియ్యము. ౨. బ్రహ్మపుత్ర యనెడి నది

**లోహిని.** సం. వి ఈ స్త్రీ. ఎఱ్ఱని చర్మముగల స్త్రీ, ఎఱ్ఱనియాఁడుది.

**లోహోత్తమము.** సం వి. అ. న బంగారము.

## లౌ

**లౌకాయతికుఁడు.** సం వి అ పుం లోకాయతమతము ననుసరించువాఁడు, చార్వాకమతానుసారి, నాస్తికుఁడు

**లౌకికజ్ఞుఁడు.** సం విశే (అ. ఆ. అ) లోకాచార మెఱిఁగినవాఁడు, లోకవ్యవహారములు తెలిసినవాఁడు

**లౌకికము.** సం విశే (అ ఈ అ) ౧ లోకసంబంధమైనది, భూలోకసంబంధమైనది ౨ సర్వసామాన్యమైనది, వాడుక లోనున్నది ౩ ప్రతిదినము జరుగునది, ఆచారముగా నున్నది ౪ లోకములోనిది, శాస్త్రీయము కానిది ౫ వైదికము కానిది, (వాక్యము మొ) ౬ లోకవిదితము, పలువురకుఁ దెలిసినది ౭ లోకహితము, లోకమునకు మేలుచేయునది ౮ న లోకాచారము, జనుల వాడుక

**లౌకికుఁడు.** సం. విశే. (అ ఈ. అ) ౧. లోకవిదితుఁడు, అందఱకుఁ దెలిసినవాఁడు ౨ లోకహితుఁడు, లోకమునకు మేలుచేయువాఁడు

**లౌకికులు.** బ. వ లోకమందలివారు, సామాన్యజనులు.

**లౌక్యము.** సం. విశే (అ. ఆ. అ.) ౧ ప్రపంచసంబంధమైనది, [illegible]సంబంధమైనది. ౨. [illegible], వాడుకలో [illegible]

**లౌడి=లవుడి.** వి. పరిఘము, ఒకానొక ఆయుధము.

క కేడెము కత్తి కుహాళి, లౌడియు విండ్లమ్ములీఁటెలుం గాని తోలుకన్, కోడులు దాలిచి మేనులు, కోడులు తమకన్న లేదు నూసవికినుకన్ ప్రబంధ. ౭౫-౨

చ . లౌడి వంకిణి సబళ యీఁటె పెలకత్తి నీళ్లను ద్వాత్రింశదాయుధంబులు ప్రబంధ ౭౫.

**లౌణి=లౌడి.** వి పరిఘము

ద్వి. వాలముల్ జళిపించి వడి లౌణు లెత్తి రం రా యు ౨౫౫ పా ౧౨ పం. (క ర. పా లౌడు లెత్తి ముద్రి పా.)

**లౌల్యము.** సం వి అ న. ౧. చంచలత, చపలత, స్థైర్యములేమి ౨ ఉత్కటమైన కోరిక, లుబ్ధత, భోగేచ్ఛ, విషయాసక్తి

**లౌహ.** సం వి ఆ స్త్రీ కాఁగు, నీరు కాఁచుపాత్ర

**లౌహకారుఁడు.** సం. వి అ పుం, కమ్మరి

**లౌహజము.** సం వి అ న లోహకిట్టము మండూరము

**లౌహబంధము.** సం వి అ పుం, న. ఇనుపగొలుసు, ఇనుపసంకెల.

**లౌహభువు.** సం వి ఊ పుం కాఁగు, నీరు కాఁచుపాత్ర

**లౌహము.** సం విశే (అ ఈ అ) ౧ లోహమయమైనది, ఇనుపది ౨ రాగిది, రాగితోఁ జేయఁబడినది. ౩ లోహముతోఁ జేయఁబడినది ౪ రాగియొక్క రంగుగలది, ఎఱ్ఱనిది వి అ న ఇనుము

**లౌహాత్మము.** సం వి న్ పుం. కాఁగు, నీరు కాఁచుపాత్ర

**లౌహితికము.** సం విశే (అ ఆ. అ) ఎఱ్ఱనిది

**లౌహితము.** సం. వి అ పుం. శివుని త్రిశూలము

**లౌహిత్యము.** సం. వి. అ. పుం. ౧. బ్రహ్మపుత్ర యనెడినది. ౨. ఎఱ్ఱదనము